శ్రీ మల్లికార్జున

# పండితారాధ్యచరిత్ర





పాల్కురికి సోమనాథకవి

ఆంధ్రగ్రంథమాల — ౩౦

# శ్రీ పండితారాధ్య చరిత్ర

పాల్కురికి సోమనాథకవి ప్రణీతము



పరిష్కర్త:

డాక్టరు చిలుకూరి నారాయణరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి

శ్రీ రామా బుక్ డిపో,
బుక్ సెల్లర్స్ * స్టేషనర్సు,
4000, మార్కెట్టు వీధి,
సికింద్రాబాద్ (దక్కన్.)



[వెల రు 5



కీ. శే. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

# ప్రకాశకుల విజ్ఞప్తి

దాదాపు నాలుగైదేండ్ల పరిశ్రమ ఫలమును నేటికి బయట పెట్టగలుగుచున్నాము. ఈ ఆలస్యము నకు కారణమును సహృదయులైన పండితమహాశయులు ఊహించలేకపోరు.

అనాడు మేము దీని ప్రకటనకు ప్రారంభించినప్పుడు మా కాధారభూతమైనది దీని వ్రాత ముద్రిత ప్రతి ఒకటిమాత్రమే. అగుట కేమో ఇది అదివరకే ముద్రిత మైయుండెను కాని అది అడుగడుగునకును సంస్కారాపేక్షముగానేయుండెను. ఇటువంటి ఉత్తమగ్రంథము అటువంటి అసంస్కృత రూపములో ఉండుటను చూచి సహింపలేకయే మేము దీని పునర్ముద్రణమునకు పూను కొంటిమి. అందుచేత ఆ లభించిన ఒక గుజిలీప్రతిని ఆధారముగా పెట్టుకొని, వివిధ భాండాగారములందు లభించిన భిన్నభిన్నము లయిన వ్రాత ప్రతులతో దీనిని సరిచూచి, అనేక పాఠాంతరములను సేకరించి, యుక్తము లయిన పాఠములను గ్రహించి, అసలు గ్రంథమునకు దీటురాగల అమూల్యమైన పీఠికతో ఈ గ్రంథమును ఆంధ్రలోకమునకు సమర్పించవలయునని పూనుకొన్న మహోద్యమములో అనివార్యముగా ఈ ఆలస్యము సంభవించక తప్పినది కాదు. మా పరిశ్రమఫలితమును

పండితసోదరులు ఈగ్రంథములో ప్రత్యక్షముగా గ్రహింపగల రని మా దృఢవిశ్వాసము.

అడిగినదే తడవుగా మా ప్రార్థనమును మన్నించి, అనేక ప్రయాసల కోర్చి, సొంతపనులను కూడ మాను కొని ఈగ్రంథమును శుద్ధముగా సంస్కరించి, పరిస్థితమైన పీఠికను రచించి మా యుద్యమమునకు సర్వవిధములుగా సహాయపడిన డా. చిలుకూరు నారాయణ రావు యం. ఏ., పి హెచ్. డి. గారికి ఈ సందర్భములో మా హృదయపూర్వకమైన కృతజ్ఞతావందనములను సమర్పించుచున్నాము.

ఈ గ్రంథ ప్రాశస్త్యమును గురించియు, దీని విశిష్టగుణములను గురించియు మేము ప్రత్యేకముగా పేర్కొవలసిన అవసరము కానరాదు. శ్రీ నారాయణ రావుగారే ఆవిషయముల నన్నిటిని సమగ్రముగాను, విపులముగాను తమ పీఠికలో ప్రశంసించియున్నారు.

ఆంధ్రమహాజనులు మా గ్రంథమాలయందు యథాపూర్వమైన ఆదరాభిమానముల నుంచి, 30 వ కుసుమముగా ప్రకటితమైన ఈఅపూర్వగ్రంథరాజమునకుకూడ యథోచితముగా ప్రోత్సాహ మిచ్చినయెడల మా యుద్యమము చరితార్థము కాగల దని విన్నవించుచున్నాము.

చెన్నపురి :
4-12-39.

ప్రకాశకులు.

ప్పటికి చేసిన కృషికి ఫలితముగా తేలిన సమస్తసామ
గ్రిని, తమవద్దనుండిన వ్రాతప్రతులను నా కిచ్చివేసిరి.
వారి ఆజ్ఞప్రకారము నే నించుమించు మూడేండ్లు పని
చేసి, ఎట్లో అచ్చుకు ప్రతిని సిద్ధముచేసి, శ్రీనాగేశ్వర
రావుగారికి పంపినాను. వారు వెంటనే ముద్రణమున
కారంభించినారు. నేను సరిచేసిన మహిమ, పర్వతప్రకర
ణములను ఈలోగా శ్రీరామమూర్తి పంతులుగారు
చూస్తే బాగుంటుందని వారికి పంపినాను.

నాగేశ్వరరావుపంతులుగారు శివైక్యము పొంద
డానికి పదిదినములకు ముందు వారిని దర్శించినాను.
పండితారాధ్యచరిత్రము సంపూర్ణముగా అచ్చుపడ
డము చూడవలె నని ఉన్నదన్నారు. అప్పటికి అయిదు
ఫారములుమాత్ర మచ్చు మిగిలినది. ఎంత తొందర
పడినా వారికోరిక నెరవేర లేదు. వారి నిర్యాణానంతర
మీ గ్రంథప్రకటనమును గురించిన ప్రస్తావన మరి
రాలేదు. మొన్న ఏప్రిలు మాసాంతమున శ్రీవారి
అల్లు ళ్లయిన చిరంజీవి శివలెంక శంభుప్రసాదుగారు
ప్రస్తావవశముగా గ్రంథమునకు శీఘ్రముగా పీఠిక వ్రాసి
పంపవలసిన దని కోరినారు. వారి కోరిక ప్రకారము
పీఠికను వ్రాయడాని కారంభించినాను. కాని, ఆపని
సులభముగా కనబడలేదు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు
బసవపురాణమునకు చక్కని పీఠికను వ్రాసినారు.
కాని, వారి అభిప్రాయములను విమర్శిస్తూ అనేకు

లనేకవ్యాసములను వ్రాస్తూవచ్చినారు. మతవిషయము లలో ఉన్నదున్నట్లు నిరూపించవలసిన బాధ్యత నా కెక్కువగా తోచినది. భాషావిషయములో వారి అభి ప్రాయములతో ఏకీభవించలేని కొన్నిపట్టులు కనబడినవి. పాల్కురికి గ్రామ మెక్కడ ఉన్నది? సోమనాథుని కాల మేమి? అతని కులగోత్రము లేమి? బసవేశ్వరుడు చారిత్రకపురుషుడా, కాడా? బసవేశ్వరునికి పూర్వపు శైవమతస్వరూప మెట్టిది? సిద్ధాంతవిషయములో వీరశైవ సిద్ధాంతమునకున్న తక్కినవాటికిన్ని భేద మేమి? ఇటువంటి ఎన్నో సమస్యలకు సరియైన సమా ధానములకోసము అనేక గ్రంథములను చూడవలసి వచ్చినది. నే నీ పీఠికలో తత్త్వైకదృష్టితో విలిఖించిన విషయములు కొన్ని కొందరికి సరిపడకపోవచ్చును. దానికి నే నేమిన్ని చేయలేను. నాకు తోచిన అభిప్రాయ ములను తెలిపినాను. నేను చేయవలసిన పని అంతే.

శ్రీ శంభుప్రసాదుగారు పీఠికను సాధ్యమయి నంత సంగ్రహముగా వ్రాయవలసిన దని సెలవిచ్చినందు వల్ల నేను చెప్పదలచిన విషయముల నన్నిటిని విపుల ముగా, వివరముగా తెలుపడానికి వీలయినది కాదు. ముందుముందా విషయములను గురించి ప్రత్యేక వ్యాసములలో తెలుపుకొంటాను. పాఠకు లిప్పటికీ చిన్న పీఠికతో తృప్తి పడవలసి ఉన్నది.

ఎంత కంటిలో కన్నుపెట్టి ప్రూఫులను దిద్దినా, కొన్ని తప్పు లట్లే నిలిచిపోయినవి. గ్రంథపరిష్కర్త ప్రూఫులు దిద్దడములోగల లోపమే ఇది. పొరపాటున గ్రంథములో మిగిలిన తప్పులను పాఠకులు సవరించుకో వలసిన దని ప్రార్థిస్తున్నాను. ముఖ్యములైన పొరపాట్లను తప్పొప్పులపట్టికలో చేర్చినాను.

ఈ మహాగ్రంథమును పరిష్కరించే భాగ్యము నాకు కలిగినది గదా అని సంతోషిస్తున్నాను. దీని నచ్చొ త్తింప సంకల్పించి ఆంధ్రభాషకు మహోపకారము చేసిన శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారిని భక్తితో స్మరిస్తూ నా మీది శిష్యవాత్సల్యముతో ఈపనిని నాకు వదలిపెట్టిన మాగురువుగారికి నాకృతజ్ఞ తాపూర్వకవందనముల నర్పిస్తున్నాను. తమమామ గారి సంకల్పమును సఫలము చేసిన శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు శ్రీ నాగేశ్వరరావుగారి వలె అజ రామర యశస్కులై వాఙ్మయ సేవామూలమున దేశసేవా ధురంధరులై వర్ధిల్లునట్లు పరమేశ్వరు డను గ్రహించునుగాక అని కోరుతున్నాను.

అనంతపురము,
ఆత్రేయాశ్రమము.
౨౯-౬-౧౯౩౯.

చిలుకూరి నారాయణరావు.

# శ్రీ పండితారాధ్యచరిత్ర

## ఉపోద్ఘాతమునకు విషయసూచిక

# ఉపోద్ఘాతము

---

## ౧

### సోమనాథుని నివాసస్థానము

సోమనాథుడు గోదావరిజిల్లాలోని పాల్కురికి గ్రామములో పుట్టినాఁ డని కీ. శే. ఆర్. నరసింహాచార్యులు గారు తమ కర్ణాటకకవిచరితెలో వ్రాసినారు. వీరేశలింగము పంతులుగారు సోమనాథుని జన్మస్థానవిషయమును కాని, పాల్కురికి గ్రామ ప్రశంసనుగాని ఎత్తుకొనక 'ఈ కవి ప్రతాపరుద్రుని కాలమునం దుండెను' అని చెప్పి విడిచినారు. కాని వారి వ్రాతధోరణినిబట్టి అతఁ డోరుగంటి ప్రాంతపువాఁ డయినట్లు ధ్వనిస్తున్నది. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు బసవపురాణమునకు వ్రాసిన పీఠికలో "అన్యవాదకోలాహల మని సోమనాథుని పేరనే 'సోమనాథలింగ' యను సంబోధనముతో సీసశతకమును రచియించిన శైవుఁ డొకఁ డీతఁడు పాల్కురికి గ్రామ వాస్తవ్యుఁ డని చెప్పెను. పాల్కురికి గ్రామము నేఁటి నైజాము రాష్ట్రమున నోరుగల్లుమండలమునఁ గలదఁట! పాల్కురికి గ్రామమున జనించుటచే సోమనాథుని కాయారి లింగమూర్తి పేరే తలిదండ్రులు పెట్టియుండవచ్చును," అని వ్రాసినారు. ఇట్లుండగా శ్రీ బండారు తమ్మయ్యగారు సోమనాథుడు, "కాకతీయ రాజధాని యగు నేకశిలానగరమునకు సమీపమం దున్న పాలకురికి గ్రామ వాస్తవ్యుఁ డయినట్లు తెలియనగును" అని కాకతీయ సంచిక (పుట. ౨౦౮)లో వ్రాసినారు.

పాల్కుఱికె దక్షిణమహారాష్ట్ర దేశములోని ఒకగ్రామమని కిట్టెలు వ్రాసినాడు.

'కుటికి,' 'గుటికి' అనేవి కన్నడములో గ్రామశబ్దమునకు పర్యాయపదములు. ఇవి తెనుఁగులోని 'కుఱ్ఱు, కుచ్చి,' తమిళము లోని 'కురిచ్చి'అనే గ్రామవాచక పదములతో సంబంధించినవి.'కుఱ్ఱు' గోత్రశబ్ద భవము. 'కుటికి' కూడా అదే అర్థము గలది. కుటికి, గుటికి అంతమందు గల గ్రామనామములు సాధారణముగా కన్నడ దేశములో కనబడుతున్నవి. అట్టివి తెనుగుదేశములో ఉన్నట్లు కాన రాదు. గోదావరిజిల్లాలో లేవు; పాల్కుఱికి అసలే లేదు. కాబట్టి శ్రీ నరసింహాచార్యులవారి వ్రాత కాధారము లేదు.

శ్రీ ప్రభాకరశాస్త్రులవారు చెప్పినట్లు పాల్కుఱికి ఓరుగంటి ప్రాంతములో ఉన్నదనడమునకుకూడా ఆధారమున్నట్లు కనబడదు. ఓరుగంటిప్రాంతములో గాని, వరంగల్లుజిల్లాలో గాని పాల్కుఱికి అనేగ్రామ మున్నట్లు తోచదు. నిజామురాష్ట్రపుగ్రామముల పట్టికలలో వరంగల్లుజిల్లాలోమాత్ర మట్టిగ్రామము లేదని నిశ్చయ ముగా చెప్పవచ్చును. వరంగల్లుకు ౩౦ మైళ్లదూరములో పాలకుర్తి ఉన్నదట. పాలకుర్తి పాలకురికి కాజాలదు.

కిట్టెలు చెప్పినట్లు దక్షిణమహారాష్ట్రములో పాల్కుఱికి ఉన్నదేమో తెలియదు. పాల్కుఱికిని గురించిన ప్రశంస కన్నడ ములో నీలకంఠుడు రచించిన 'వీరమాహేశ్వరసంగ్రహము' (v. ౧౦), గుబ్బి మల్లణార్యుడు రచించిన 'భావచింతారత్న' (v. ౯), భీమకవి రచితమైన 'బసవపురాణము'లలో (i, ౧౪; ౪, ౩౬; ౬౧, ౯౪) ఉన్నదిగాని, దానినిబట్టి ఆ గ్రామపు స్థలనిర్దేశము చేయడానికి వీలు లేకున్నది.

'కుటికి' అంతమయిన పాలకుటికి గ్రామము కర్ణాటదేశము లోనో, కర్ణాటప్రాంతదేశములోనో ఉండవలెను. శ్రీశైలయాత్రా వర్ణనసందర్భములో సోమనాథుడు కన్నడపరుస, ఆరెపరుసల నడకలను వర్ణిస్తూ, ఆ భాషలలో కొన్ని ద్విపదలను రచించినాడు. కాబట్టి ఆతని దేశము తెలుగు, కన్నడముల కూడలిలో ఉండవలెను. అరవపరుసను వర్ణించి అరవభాషలోకూడా కొన్నిద్విపదలను సోమ నాథుడు రచించడము నిజమే; కాని, ఆతని కరవదేశముతో ఎట్టి సంబంధమున్ను లేదు; అరవవాఙ్మయములో అతని ప్రసక్తి ఎక్కడను లేదు. వీరశైవ మతవదేశములోనికి నవీనముగా వ్యాపించినట్లు కనబడుతుంది. సోమనాథు డరవమును నేర్చుకొనడానికిమాత్రము ప్రమేయము లేకపోలేదు—వీరశైవము చాలావరకు దక్షిణదేశపు ఆగమిక శైవసిద్ధాంతముమీద ఆధారపడి ఉన్నది. దక్షిణదేశపు శైవభక్తులలో అనేకులు వీరశైవమతములోను అఱువత్తు మూవురు మొదలయిన పేళ్లతో వెలసినారు. కాబట్టి సోమనాథు డరవము నభ్యసింపవలసిన ఆవశ్యకత ఉన్నది. అంతమాత్రముచేత అతడు అరవదేశపువాడు కాజాలడు. పాల్కురికి అనే పేరు అరవ దేశములో ఉండడానికసలే అవకాశము లేదు.

సోమనాథుడు తెనుగులో మహాకవి, కన్నడములో కూడా అంత ప్రశస్తమైనకవి కాకపోయినా, కొన్నిగ్రంథములను రచించి నాడు. బసవడు కన్నడమువాడు. కాబట్టి కన్నడములో ఆతడు కొంత ప్రజ్ఞను సంపాదించుకొన్నాడు. ఆంధ్రకర్ణాటకు లిద్దరున్ను అతనిని గొప్ప కవిగాను, మతాచార్యునిగాను గౌరవిస్తున్నారు. పాలకుటికి అనే గ్రామమొకటి ఆంధ్రకర్ణాటకదేశముల కూడలిలో, అనంతపురముజిల్లాలోని మడకసిరా గ్రామమునకు ౨౦ మైళ్లదూరములో మైసూరురాష్ట్రములోని తుమ్కూరుతాలూకాలో ఉన్నది. దీని

నిప్పుడు పాల్కురికి అంటున్నారు. ఇదే సోమనాథుని జన్మస్థాన మని నా అభిప్రాయము. పిడుపర్తి సోమన ఈతడు ప్రతాపరుద్రుని కాలమువా డని చెప్పినాడు.

"సీ. ఒకనాఁడు శివభక్తు లోరుగంటను స్వయం
భూదేవుమంటపమున వసించి
బసవపురాణంబు పాటించి వినువేళ
హరునిఁగొల్వ ప్రతాపుఁ డచటికేఁగి
యాసంభ్రమం బేమి యనుడు భక్తులు బస
వనిపురాణం బర్థి వినెద రనిన,
విని యాపురాణంబువిధ మెట్లకో యన్న
ధూర్తవిప్రుఁ డొకండు భర్తఁ జేరి
పాలకురికి సోమపతితుఁ డీనడుమను
పెనచె మధ్యవల్లు పెట్టి ద్విపద,
యప్రమాణ మిది యనాద్యంబు పద మన్న
నరిగె రాజు; భక్తు లది యెఱింగి,"—

పాల్కురికి సోమనాథుని కరిగింపగా, ఆతడు శిష్యులతో ఓరుగంటికి బయలుదేరి వస్తూ ఉండగా, ఆధూర్తవిప్రులు కొంతమంది అల్లరిగాండ్లకు శైవవేషము లు వేసి అతని కెదురుగా పంపినారనిన్ని, సోమనాథుని మహిమచేత వారందరున్ను వీరశైవభక్తు లయినా రనిన్ని పిడుపర్తి సోమనరచించిన బసవపురాణములో ఉన్నది. ఈ విషయమే కొండవీటిచరిత్రములో కూడా చెప్పబడినది. కొండవీటి చరిత్రము చాలా నవీనమయినది. పిడుపర్తి

సోమన్న కొంత పూర్వుడయినా, సోమనాథుని తరువాత మున్నూరేండ్లు వున్నవాడు—అతడు తెలిపినవిషయములు కేవలము వినికిడివల్ల తెలుసుకొన్నవి– అయినా, పాల్కురికి సోమనాథుడు ప్రతాపరుద్రునికాలములో ఉన్నవాడని పిడుపర్తి సోమన్న చెప్పిన దానిని మనము త్రోసిపుచ్చనక్కరలేదు. కాని, అతడు ప్రతాపరుద్రునికాలమువాడనడానికి పాల్కుఱికి ఓరుగంటికి సమీపములోనే ఉండనక్కరలేదు.

సోమనాథుడు బసవపురాణమును రచించేసందర్భము నీక్రింది విధముగా చెప్పినాడు:

"సకలతీర్థములకు జనయిత్రి యగుచుఁ
బ్రకటింప నొప్పు శ్రీపర్వతేంద్రంబు;
ఉర్విఁ దత్పర్వతసార్వభౌమునకుఁ
బూర్వ వక్త్రాంకవిస్ఫురణ దులకాడ
నొలసి కుమారశైలోత్తంసలీలఁ
దిలకించి పెంపారుఁ ద్రిపురాంతకంబు"

(బస. పు. పుట. ౨.)

ఆ త్రిపురాంతకములో కరస్థలి సోమనాథయ్యగారు, నియమముల మల్లినాథుడు, రెంటాల మల్లినాథుడు, దోచమాంబ, గోడగి త్రిపురారి మొదలయిన అసంఖ్యాతమాహేశ్వరులు కూర్చుండి ఉండగా, సోమనాథకవి తనకు బసవపురాణమును రచించవలెనని ఉన్నదనిన్ని, బసవని 'వరకథాసూత్రంబు వెరవెఱిగించి, చరితార్థుని చేయవలసినదనిన్ని ప్రార్థించిన ట్లున్నది.

పండితారాధ్యచరిత్ర రచనాసందర్భ మీరీతిగా చెప్పబడినది:

"కర మొప్పదక్షిణకైలాస మనఁగఁ
జను సర్వపర్వత సార్వభౌమాఢ్య-
తను బేర్చు శ్రీగిరీంద్రంబు దానదియు ;
.........................
............ఆ శ్రీశైలశిఖర
కలితత్రిలోకవిఖ్యాతయశః ప్ర-
పూర్తియా శ్రీస్వయంభూలింగచక్ర-
వర్తి............శ్రీమల్లికార్జునలింగ-
మూర్తి యొప్పారు సమున్నతమహిమ.
.....................
"మానితాసంఖ్యాతమాహేశ్వరులు, శి-
వానందనిలయు లై యం దొక్కనాఁడు,
అరుదుగ శ్రీమల్లికార్జున దేవు
నురుమంటపస్థలి నోడ్డోలగమున
శివభక్తితత్త్వగోష్ఠీప్రసంగమునఁ
దవిలి నూతనపురాతనభక్త మహిమ
లంకించుచును నిజాపాంగ హర్షాశ్రు
కంకణంబులు రాలఁ గరుణ నన్జూచి
... ... ... ... ...మున్ను
'బసవపురాణ' మొప్పఁగ రచించితివి

వరవీరభక్తి సవైదికంబుగను
విరచించితివి 'సతుర్వేదసారము'న
... ... ... ... వీను
లారంగ గురుమల్లికార్జున 'పండి-
తారాధ్యులచరిత్ర' మర్థివర్ణింపు," అని.

పైదానినిబట్టి సోమనాథుడు తన బసవపురాణ పండితారాధ్య చరిత్రముల రెండింటిని శ్రీశైలప్రాంతమం దున్నప్పుడే రచించినాడని తెలుస్తున్నది.

పైదానినిబట్టి సోమనాథుడు నేటి మైసూరురాజ్యములోని తుమ్కూరుజిల్లాలో తెనుగు కన్నడదేశములకు కూడలిలో ఉన్న పాలకురికి గ్రామములో జన్మించినా డనిన్ని, చిన్నతనములోనే శ్రీశైలప్రాంతమునకు వచ్చి చేరుకొన్నా డనిన్ని, పాల్కురికిలో జన్మించుటచేత ఆ గ్రామము పేరే అతని కింటిపే రయినదనిన్ని, వృద్ధాప్యమువరకున్ను శ్రీశైల ప్రాంతములోనే ఉండి, సిద్ధిపొందే కాలానికి స్వదేశము పోయి కల్కెమనే గ్రామములో చేరి, అక్కడనే సమాధిని పొందినా డనిన్ని నిర్ణయింపవచ్చును.

---

౨

# సోమనాథుని కాలము

సోమనాథుని నివాసస్థాననిర్ణయముకంటె ఆతని కాలనిర్ణయము మరింత కష్టముగా ఉన్నది. అట్టినిర్ణయము చేయడాని కింతవరకున్న పరిశోధకులు (౧) కర్ణాటక శివకవులు సోముని గురించి చేసిన ప్రస్తావన (౨) పిడుపర్తి సోమన్న బసవపురాణములోను, కొండవీటిచరిత్రములలో సోమనాథుని గురించి చెప్పబడిన విషయములు, (౩) సోమనాథుడు తన గ్రంథములలో తెలిపిన విషయములు, అనే వాటిని ముఖ్యాధారములుగా తీసుకొన్నారు. కాని ఈ విషయములన్నీ సందేహములతో కూడుకొని ఉన్నవి.

కర్ణాటకకవి అయిన సోమరాజు తన 'ఉద్భట కావ్యము'లో—

"ప్రమథానీకకథార్ణవేందుహరిదే
వాచార్యనం ధైర్యనం,
వాసముదంచద్వృషభస్తవామరమహీ
జారామనం సోమనం,
విమలజ్ఞానసుదీపికాస్ఫురితచే
తస్సద్మనం పద్మనం,
క్రమదిందంబలగొండు పేళ్వెనొసెదా
నీకావ్యమం సేవ్యమం"

అని వ్రాసినాడు.

పై పద్యములో వ్యస్తముగా 'ధైర్యనం' = ధైర్యాని'; ఒసెదానీ కావ్యమం = ఒసెదు + ఆన్ + ఈ కావ్యమం (దీనిలో 'అన్', కు అర్థము లేదు) అనే ప్రయోగములమాట నటుంచగా హరిదేవాచార్య, సోమ, పద్మ, అనేవారి పేళ్లు కనబడుతున్నవి. గిరిజాకల్యాణాది కావ్యములను వ్రాసిన హరీశ్వరునికి హరిదేవ అని కూడా నామాంతర మున్నదట. పద్మ డనగా దీక్షాబోధను వ్రాసిన కెరెయపద్మరసట. హరీశ్వరుని గురించిన వృత్తాంతము కన్నడ చెన్నబసవపురాణ, పద్మరాజ పురాణములలో ఉన్నది. అది అద్భుతవిషయములతో నిండి ఉన్నది. పద్మరాజ పురాణమును రచించిన పద్మణాంకుడు ౧౪౦౦ సం॥ర ప్రాంతమువాడు; చెన్నబసవపురాణ కర్త అయిన విరూపాక్షుడు ౧౫౮౫ ప్రాంతమువాడు. వీరిద్దరును హరీశ్వర పద్మరసులు నరసింహ బల్లాళునికాలమువా రనిన్ని, పద్మరసు బల్లాళునికి మంత్రి అనిన్ని, హరీశ్వరుడు 'కరణికరకులతిలక' మనిన్ని, హరీశ్వరునికి పద్మరసు మేనల్లు డనిన్ని చెప్పినారు. ఈ విషయములను గురించి హరీశ్వరపద్మరసులుతా మేమిన్ని చెప్పకొనలేదు. తెనుగుబసవపురాణమును కన్నడించినభీమకవి, ౧౩౬౯ సం॥ర ప్రాంతమువాడు పద్మరసును స్తుతించడముచేత వీరు ౧౩౬౯ సం॥మునకు పూర్వు లని మాత్రము స్థిరపడుతున్నది. హరీశ్వర పద్మరసులకున్ను నరసింహ బల్లాళునికిన్ని గల సంబంధమును గురించి చారిత్రకాధారము లేవిన్ని లేవు.

ఇక సోమరాజు స్తుతించిన సోము డెవరు? పాల్కురికి సోముడే అని అందరున్ను అన్నారు. సోమరాజు తన గ్రంథమున

"జననాథోత్తమసోమరాజనుసిర్ది
కావ్యంపలంశాలివా-
హనశాకాబ్దమదెర్దొ సాసిరదనూఱిం సంద
నాల్వత్తునా

ల్కనే యారంజితచిత్రభానుప పరాశ్వియుజోత్సి
తైకాదశీ
వనజాచాతితనూజవాసరదొళాదత్తల్లమంగర్పితం"

అనే పద్యమువల్ల శక సం॥ ౧౧౮౪, చిత్రభాను సం॥ర, ఆశ్వయుజ శుక్లైకాదశి బుధవారమునాడు ముగింపబడినదని తెలుస్తున్నది.

సోమరాజు స్తుతించిన సోముడు పాల్కురికి సోమనాథుడే అని శ్రీప్రభాకరశాస్త్రిగారన్నారు. వృషభస్తుతి చేసిన సోముడు మరొకడు లేడనే కారణముచేత వీరిట్లన్నారు. కాని, బసవేశ్వరునికి పూర్వము వృషభేశ్వరమహిమను గురించిన స్తుతులు లేకపోతేనే పైవాదము నిలుస్తుంది. బసవనికి పూర్వము నందికేశ్వరారాధనము లేకపోలేదు.

అది అట్లా ఉండనివ్వండి. పైపద్యములోని 'సాసిరదనూఱెం' అనేదానికి బదులుగా తాముచూచిన అన్ని వ్రాతప్రతులలోను 'సాసిరదనానూర్' అని కనబడుచున్నది గాని నరసింహాచార్యులుగారుదాహరించిన 'సాసిరదనూఱెం' అనేపాఠము లేదనిన్ని, కాబట్టి సోమరాజుకాలము శక. ౧౪౪౪ సం॥రము, అనగా క్రీ. శ. ౧౫౨౨ సం॥ర మవుతుందనిన్ని డాక్టరు ఎ. వెంకటసుబ్బయ్య, ఎమ్.ఏ. పి. హెచ్.డి.గారు వ్రాసినారు. నేనుచూచిన ఉద్భటకావ్య ప్రతులలోను వెంకటసుబ్బయ్యగారు తెలిపినపాఠమే ఉన్నది. కాబట్టి సోమరాజు క్రీ.శ. ౧౫౨౨ ప్రాంతమువాడనియే నేను నమ్ముతున్నాను. 'సానాల్' అనే ప్రయోగము వ్యాకరణవిరుద్ధము కాబట్టి ఆపాఠము తప్పని నరసింహాచార్యులుగారు దానిని త్రోసివేసినారు. 'నూఱెం' అనేపాఠమే ప్రతిలో ఉన్నదో తెలుపుమంటే తెలుపలేదు.

'గ్రాసూత్' అనేది శబ్దమని దర్పణము ప్రకారము తప్పయినా, అట్టి ప్రయోగములను కర్ణాటక కవులు చేయకపోలేదు. అందుచేత సోమరాజు పాల్కురికి సోమునే తన పద్యములో స్మరించి ఉంటే సోమనాథుడు క్రీ. శ. ౧౫౭౨ సం॥రమునకు పూర్వుడని మాత్రము తేలుతుంది.

ఇక పిడుపర్తి సోమన్న సోమనాథుని గురించి చెప్పిన విషయముల నాలోచింతము. పిడుపర్తి సోమనాథుడు ౧౪౭౦ సం॥రమునకు తరువాతివాడు. ఎంతతరువాతివాడో తెలియదు. ఇతడు తాను పాల్కురికి సోమనాథుని శిష్యుడయిన శివరాత్రి కొప్పయ్యగారో తరమువాడ నని చెప్పకొన్నాడు. అయితే సోమనాథుని కాలము నిర్ణయ మయితేనేకాని, ఇతనికాలము నిర్ణయము కాదు. ఇతని కాలము నిర్ణయ మయితేనే కాని పాల్కురికి సోమనాథునికాలము నిర్ణయము కాదు. ఆ నిర్ణయము నతడు సోమనాథుని గురించి తెలిపిన కథనుబట్టి తేలవలసి ఉన్నది. ఓరుగంటిలో బసవపురాణమును కొందరు చదువుతూ ఉండగా ప్రతాపు డా దారినెంట పోతూ వారేమి చదువుతున్నా రని అడుగగా "పాల్కురికి సోమపతితుండు' రచించిన ద్విపద బసవపురాణము చదువుతున్నా" రని చెప్పినారట. పిడుపర్తి సోమనకాలమునకు కాకతీయ సామ్రాజ్య మంతరించి ఇన్నూ రేండ్లయినది. కాకతీయరాజుల పేళ్లు జనుల స్మరణలో మాత్రమున్నవి. వారిలో ప్రతాపరుద్రదేవుడు ముఖ్యుడు.

రెండో ప్రతాపరుద్రుడు క్రీ. శ. ౧౨౯౧ నుంచి ౧౩౩౦ వరకు ఉన్నట్లు శాసనములు తెలుపుతున్నవి. ఇతడుకాక ప్రతాపరుద్రదేవుడనే పేర రుద్రాంబ (౧౨౬౦–౧౨౯౧) రాజ్యముచేసినది. మొదటి ప్రతాపరుద్రుడని పిలువబడేవాడు మరొకడున్నాడు. ఇతడు ప్రోలరాజుకొడుకు. ఇతనికి క్రీ. శ. ౧౧౬౩ సంవత్సరము జనేవరి ౹౧ దిన [illegible] పట్టాభిషేకము జరిగినది.

(ఇండియన్ ఆంటిక్వేరి ౧౮౮౨, పు. ౯; ఎపిగ్రాఫియా ఇండికా IX. పు. ౨౫౬); కాని, క్రీ. శ. ౧౧౬౩ ప్రాంతములోనే బసవేశ్వరు డున్నాడని పరిశోధకులు చెప్పుతున్నారు కాబట్టి పిడుపర్తి సోమన్న చెప్పిన ప్రతాపు డీతడు కాడు. ఇతడు క్రీ. శ. ౧౧౯౯ దాకా రాజ్యము చేసినాడు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు క్రీ. శ. ౧౧౩౨ నుండి ౧౧౯౮ దాక రాజ్యమేలినవాడు కాకతీయ రుద్రదేవుడు వేరొక డున్నా డనిన్ని, ఆతడు ప్రతాపరుద్రదేవుని అమ్మమ్మ తండ్రి అయిన గణపతిదేవునికి పెద్దతండ్రి అనిన్ని చెప్పినారు. ఈతనికి రుద్రదేవుడు అనేపేరేకాని, ప్రతాపరుద్రనామము లేదని వారే చెప్పినారు. గణపతిదేవుని పెద్దతండ్రి పైని వివరించిన క్రీ. శ. ౧౧౬౩ లో పట్టాభిషిక్తు డయిన ప్రతాపరుద్రదేవుడే; ౧౧౩౨ లో ప్రతాపరుద్రు లెవ్వరున్న పట్టాభిషిక్తులు కాలేదు. ౧౧౩౨ లో రెండో ప్రోలరాజు రాజ్యము చేస్తున్నాడు.

పై దానినిబట్టి పిడుపర్తి సోమన్న చెప్పిన ప్రతాపుడు రుద్రాంబ మనుమ డయిన రెండో ప్రతాపరుద్రుడే అని నిర్ణయించవలెను. 'కొంచెము కాలములో రాజ్యమును తురుష్కు లాక్రమిస్తా' రని సోమనాథు డన్నట్లుగా పిడుపర్తి సోమన్న చెప్పినమాటకీ నిర్ణయము సరిపోతుంది. కాని, పిడుపర్తి సోమన్న ఓరుగంటిని గురించిన్ని ప్రతాపుని గురించిన్ని చెప్పినమాటలు తనకు ఏడుతరములకు పూర్వపునాటివని మరచిపోగూడదు.

ఇంతవరకు చెప్పినది బహిస్సాక్ష్యము; ఇక అంతస్సాక్ష్యము నెత్తుకొందాము:

(౧) సోమనాథుడు బసవపురాణాదిలో పండితారాధ్య కృపాసముద్గతుడయిన కరస్థలి సోమనాథయ్యగారు, నియమముల మల్లినాథుడు, కుమారాద్రికి తూర్పు దెసను సోపానములు

కట్టించిన రెంటాల మల్లినాథుడు, దోచమాంబ, మున్నయ దేవయోగీశు కూరిమి శిష్యుండు నాఁయయాంకునకుఁ బుత్త్రుం డు నీలకంఠాగ్రజుండును అయిన గోడగిత్రిపురారి, కర్ణాటభూమికిని గోటీరమై యొప్పు గొబ్బూరికి విభుడయిన సంగనామాత్యుడును తన కాలమువారుగా చెప్పినాడు. ఇదిగాక తాను "విష్ణురామిదేవుడును శ్రియాదేవియమ్మయుఁను గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ" ననిన్ని, "వడగాము రామేశు వరశిష్యుఁ డనఁగఁబడు చెన్నరాముని ప్రాణస ఖుండ"ననిన్ని, 'కలకట్టకూరి పోతిదేవర పదాంబుజమట్పదుండ' ననిన్ని, 'కరస్థలివిశ్వనాథు ప్రకటవరప్రసాదకవిత్వయుతుఁడ'ననిన్ని కూడా చెప్పుకొన్నాడు.

(౨) పండితారాధ్యచరిత్రములో "పేరెక్కఁడగిన శ్రీ బెలిదేవి వేమనారాధ్యులను పరమారాధ్యదేవు మనుమ శిష్యుండ"ననిన్ని, "సూరనామాత్య వినమితామాత్య, వీరపోచేశ్వర విప్రతాచార్య కారుణ్యహస్తాబ్జ గర్భసంభవుఁడైన సచివాగ్రణ్యుఁడు సూరార్యుఁడు" తనకు 'అనుసలంబు,' 'ముద్దుమఱఁది', 'నెచ్చెలికాఁడు' అనిన్ని చెప్పినాడు.

(3) "అంతలోనన పండితారాధ్యునాత్మ-
సంతతియును గులసతిసమేతముగ
లింగోదరమునంద లీనమై రట్లు
సంగతంబగు శివాజ్ఞాపత్రసరణి
శివగణప్రార్థనఁ జిక్కిన సకల-
భువనపావనుని యపూర్వతనూజుఁ
దరితసంసారుఁ గేదారయ్యఁ బుణ్యా-
భరితు లోకారాధ్య పట్టంబుఁగట్టి

ప్రస్తుతశంభుఁడౌ పండితారాధ్య-
హస్తాగ్రజుండు దోనయ్యయు భక్త-
వర్గంబు గొనియాడ వసుధఁ దద్గురుఁ డ-
నర్గళభక్తి రాజ్యము సేయుచుండె,
నంతఁ గేదారయ్యయాత్మసంతాన-
సంతతియును శైవసంతానసంత
తియు భువనారాధ్యతేజోవిభాతిఁ
గ్రియగొని యతులభాగీరథీ తీర్థ-
భావన లోకముల్ వరమపావనము
గావింప మఱి యట్లు గాక తదియ్య-
కేదారదేశికు గీతచరిత్రు
గాదిలి సుతచతుష్కముఁ జెప్ప నొప్ప
మనుమపండితుఁడు భీమనపండితయ్య
యును మహాదేవయ్యయునుఁ జెన్నవిభుఁడు
ననఁగ గురుచతుష్కమాత్మ సంతాన
తనయపరంపరోత్తరపరంపరలఁ
బరిచితగురుపరంపర దేజరిల్లు
ధర వృషభేంద్రుపాదచతుష్కసరణి
...   ...   ...   ...   ...
సముదితమహిమఁ దచ్ఛైవసంతాన-
విమలాంబునిధిమధ్య విభ్రమానర్ఘ్య-
నాయకరత్నంబు నాలోకగురుఁ డ-
మాయతప్రీతి నొప్పారి వటూరి

సోమనాథయ్య విశ్రుతవీరభక్తి
భూమాభిరామ విస్ఫురణవెలుంగ
వారిపుత్త్రులు భక్తివర్ధనపరులు
సూరీశ్వరుండు లోకారాధ్యపద వి-
హారుండు విశ్వనాథప్పయ్యగారు
కారుణ్యానిధులు సింగణమంచిగారు
ననఁగ గురుత్రితయాన్వయ తనయ-
తనయపరంపరోత్తరపరంపరలుఁ
బ్రభుతరగురుపరంపర దేజరిల్లె"—అని.

అని పండిరాధ్య చరిత్రమును ముగిస్తూ సోమనాథుడు చెప్పినాడు.

పైని వివరించినవారిలో బెలిదేవి వేమనారాధ్యు డొకడు. మల్లికార్జునపండితారాధ్యులకు సమకాలికు డని సోమనాథుడు వర్ణించిన వేమనారాధ్యులును ఇతడును ఒకరు కానట్లు తోస్తుంది. ఒక్కరే అయితే, అతనికి సోమనాథుడు మనుమని శిష్యుడు కాబట్టి వారిద్దరికిని డబ్బైయేండ్లకంటె ఎక్కువ ఎడముండదు. అందుచేత బసవనిగురించిన్ని, అతనికి సమకాలికులయిన మల్లికార్జున పండితారాధ్య, బెలిదేవి వేమనారాధ్యుల గురించిన్ని సోమునికి కొంత కాకపోతే కొంత అయినా బాగుగా తెలిసి ఉండవలెను. బసవపురాణపండితారాధ్యచరిత్రలనుబట్టి సూక్ష్మముగా విచారిస్తే సోమునికి వారిని గురించిన విషయములు పెద్దలవలన విన్నవిన్ని, అత్యద్భుతములయినవిన్ని తప్ప ఇతరములు తెలియనట్లే తేలుతుంది. సోమునికి బసవనగురించి బొత్తిగా స్వయముగా తెలియు దన్నమాట స్పష్టము.

"అసదృశంబై యొప్పు బసవపురాణ
మెసకంబుతోఁ జెప్ప నిష్ట యయ్యెడిని
వరకథాసూత్రంబు వేర వెఱఁగించి
చరితార్థుఁ జేయరే కరుణతో" ననుచు

పెద్దలకు విన్నవింపగా వారు సోమనకు చెప్పిన బసవని కథలనుబట్టి అతడు బసవపురాణమును రచించినట్లు చెప్పుకొన్నాడు. అట్లే పండితారాధ్యచరిత్రలోని విషయములుకూడా అతడు పెద్దల వల్ల తెలుసుకొన్నవే. పండితారాధ్య చరిత్రోపసంహారసందర్భమును పురస్కరించుకొని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రిట్లు వ్రాసినారు:

"మఱియుఁ బణ్డితారాధ్యులవారు లింగైక్య మందిన పిదప వారి శిష్యుఁ డయిన దోనమయ్యా, వారి ప్రథమపుత్త్రుఁ డయిన కేదారయ్యకు లోకారాధ్య పట్టమును గట్టి తా ననర్గళముగా భక్తిరాజ్య మేలుచున్నట్లును గేదారయ్యయు నలుసురు పుత్త్రులఁ గాంచి వంశాభివృద్ధితో నున్నట్లును బండితారాధ్య చరిత్ర మునఁ గలదు. పాల్కురికి సోమనారాధ్యుని పండితారాధ్య చరిత్ర రచనాకాలమునకుఁ బండితారాధ్యులవారి శిష్యుఁడును బుత్త్రుఁడును సజీవులైయున్నారని, మనుమలు పేర్వెలయుచున్నారని దీని వలన నేర్పడు చున్నది" అని (చూ. బ.పు. పీఠిక ౬) శ్రీ బండారు తమ్మయ్యగారు కూడా ఇట్టి అభిప్రాయమునే వెలిబుచ్చినారు. (చూ. కాకతీయ సంచిక, పుట ౨౧౨) ఇట్లు చెప్పడము సమంజసము కాదని తోస్తుంది. పండితారాధ్య చరిత్రోపసంహారవాక్యము లలో కేదారయ్య పుత్త్రులు నలుసురి 'ఆత్మసంతాన తనయ పరంప రోత్తర పరంపరలుఁ బరిచిత గురుపరంపర దేజరిల్లు" అని చెప్పబడి ఉన్నది. అంటే, వారి తెరువాత అనేకతరములు గడచిన వని

అర్థము వస్తుంది గాని, సోముని కాలములో వా రున్నారని చెప్ప వీలు లేదు. అట్టి "శైవసంతాన విమలాంబునిధి మన్య విభ్రమానర్ఘ శ్రీ నాయకరత్న" మై ఒప్పారు ఇవటూరి సోమనాథయ్యగారి ముగ్గురు పుత్త్రు లయిన సూరీశ్వరుడు, విశ్వనాథప్పయ్యగారు, సింగణమంచి గారు గురుత్రితయముగా పేరు పొందినారు. ఆ "గురు త్రితయాన్వయ తనయతనయ పరంపరోత్తర పరంపరలం బ్రభూతర గురుపరంపర దేజరిల్లె" అంటే సోమనాథునికిన్ని పండితారాధ్యునికిన్ని మధ్య చాలాచాలా తరముల అంతర మున్నదని సుస్పష్ట మవుతున్నది. కాబట్టి సోమనాథుని గురువు తాత అయిన బెలిదేవి వేమనారాధ్యులు పండితారాధ్యునికి సమకాలికు డయినవాడు కాడు. అల్లే, బసవపురాణరచనాసందర్భమున ఉండిన కరస్థలి సోమనాథయ్య "పండితారాధ్య కృపాసముద్గతు" డని చెప్పినప్పుడు "పండితారాధ్యుడు మల్లికార్జున పండితారాధ్యుడే" అని సందేహము లేకుండా చెప్పడమునకు కూడా వీలులేదు. అల్లే "కరస్థలి" శబ్దము నాధారముగా చేసుకొని సోమనాథుని కవితాగురు వయిన కరస్థలి 'విశ్వనాథయ్య, సోమనకు బసవపురాణకథను చెప్పినవారిలో ఒకడయిన కరస్థలి సోమనాథయ్యకు సోదరు డని చెప్పడముకూడా తగదు.

సోమనాథుడు తనకు సమకాలికులుగా ఉదాహరించిన యితరులు చరిత్ర ప్రసిద్ధి కలవారు కారు. తమ కాలములో వారు వీరశైవ దీక్షాపరులుగా ప్రఖ్యాతిని పొంది ఉంటారు; కాని, వారిని గూర్చిన శాసనాధారము లేవిన్ని లభ్యములు కాలేదు. అయినా ఈ క్రింది విషయములను గురించి పరిశోధకు లాలోచింతురుగాక అని కోరుతున్నాను. కల్నూలుజిల్లా మార్కాపురముతాలూకాలోని త్రిపురాంతకము శ్రీశైలమునకు తూర్పుగవని అని ప్రసిద్ధి కెక్కినది.

ఈ త్రిపురాంతకములోనే సోమనాథుడు బసవపురాణమును రచించి నది. అక్కడి శాసనములు రెండింటిలో కాకతీయ గణపతిదేవుని కాలములో క్రీ. శ. (౧౧౯౯-౧౨౬౦) రాజాజ్ఞ ననుసరించి "విశ్వేశాచార్యుని" కొడుకయిన "శాంతిశంభుడు" దేవాలయగర్భ గృహమును రాతితో శక ౧౧౭౭ సంవత్సరము అనగా క్రీ. శ. ౧౨౫౫ లో కట్టించినట్లున్నది. (ఎపి. రిపోర్టు ౧౯౦౫ సం. ౧౬౯, ౧౭౧) ఉత్తరార్కాటుజిల్లా, ఆరణి తాలూకా, దేవికాపుర గ్రామములోని బృహదంబాలయములో ఈ విశ్వేశ్వరాచార్యుని నుతించిన ఒక శాసన మున్నది. అతడు శ్రీ గిరీశ్వరము వాడనిన్ని శైవభక్తాగ్రేసరు డనిన్ని దానిలో ఉన్నది. (ఎపి. రిపోర్టు ౧౯౧౨ సం॥రము, నం. ౩౯౩) త్రిపురాంత కేశ్వరాలయములోనే మరొక శాసనములో గణపతిదేవుని రాజ్యకాలములోనే శక ౧౧౭౪ సంవత్సరము (క్రీ. శ. ౧౨౫౨) పరీధావిలో గోళగిమఠాధ్యక్షు డయిన ధర్మశివాచార్యుని శిష్యుడయిన విశ్వేశ్వరశివదేశికుడు కొంత సువర్ణము సమర్పించిన ట్లున్నది. (ఎపి. రిపోర్టు ౧౯౦౫, నం. ౨౨౩.) మరొకశాసనములో పై ధర్మశివాచార్యుడు గోళగిమఠాధ్యక్షుడయిన భీమశివాచార్యుని శిష్యుడనిన్ని, గోళగిమఠము 'నవలక్షదాహళత్రిపురి'లో ఉన్నదనిన్ని, ధర్మశివాచార్యుడు ఈశ్వరుని భండారమునకుగాను ఒకమఠమును కట్టించినా డనిన్ని ఉన్నది. ఈ శాసనము శకసం. ౧౧౬౯, ప్లవంగలో (క్రీ. శ. ౧౨౪౭) చెక్కబడినది. అట్లే ఆ ఆలయములోనే సోమాచార్యుని శిష్యుడయిన సిద్ధమరాజుకొడుకు నారప శక సం. ౧౧౮౯ రము, ప్రభవ (క్రీ. శ. ౧౨౬౭) లో దీపములకుగాను ఆవులను దానము చేసిన ట్లొకశాసన మున్నది. (ఎపి. రిపోర్టు. ౧౯౦౫, నం. ౨౭౭.) ఆ ఆలయములోనే కాకతీయ గణపతిదేవమహారాజు వేయించిన ఒక అసంపూర్ణశాసనములో (శక సం. ౧౧౭౪ రము, పరీధావి,

(క్రీ. శ. ౧౨౫౨) గోళగిమఠాధ్యక్షు డయిన ఒకశైవగురుని ప్రస్తావన ఉన్నది. గోళగిమఠమునకు నూడులక్షల గ్రామముల మీాద అధికార మున్నదట. (ఎపి. రిపోర్టు. ౧౯౦౫, నం. ౧౯౫-) పైని వివరించిన శాసనములోని 'విశ్వేశాచార్య' 'విశ్వేశ్వరాచార్య అనే పేరు గలవా రొక్కరే అనిన్ని, కరస్థలి విశ్వనాథయ్యగారి పేర్లే అవి అనిన్ని నే ననుకొంటున్నాను. సోమాచార్యుడే కరస్థలి సోమనాథయ్య అని నా అభిప్రాయము. గణపతిదేవుని శక సం॥ ౧౧౭౪ రపు శాసనములోని గోళగిమఠాధ్యక్షు డయిన శైవాచార్యుడు గోడగి త్రిపురారి అని చెప్పవచ్చు నేమో! నా అభిప్రాయము సరియైతే. పైవారికి సమకాలికు డయిన పాల్కురికి సోమనాథుడు మొదటి ప్రతాపరుద్రుని కాలమువాడు కాని, రెండో ప్రతాప రుద్రునికాలమువాడు కాని కాక కాకతీయగణపతిదేవ మహారాజు కాలమునా డనిన్ని, క్రీ. శ. ౧౨౨౭-౬౦ సంవత్సరములకు మధ్య కాలమున ప్రసిద్ధి కెక్కినవా డనిన్ని తేలుతుంది. క్రీ. శ. ౧౨౮౭ కరస్థలి సోమనాథయ్యగారి కాలము గనుకను, అతడు పెద్దవాడై ఉండగా, అతని అనుమతిచొప్పనను, ఇతరులైన పెద్దల అనుమతి చొప్పనను బసవపురాణమును సోమనాథుడు రచించడముచేత బసవపురాణరచనాకాలము క్రీ. శ. ౧౨౮౭ అని యిప్పటికి నిర్ణయించ వచ్చును. అప్పటికి సోమనాథుడు చిన్నవాడై ౨౫-౩౦ సంవత్సర ములకు మధ్యవయస్సువాడై ఉంటాడు. బసవపురాణమును రచించిన తరువాత 'చతుర్వేదసారము,' 'గద్యపద్యాదికృతులు', 'బసవవర్ణనలు,' మొదలయిన అనేక గ్రంథములు రచింపబడినవి. బసవపురాణ రచనా కాలమున సోమనాథుడు వీరశైవసంప్రదాయానుసారముగా 'గురులింగవరకగోదరజనితుండను' ('గురులింగ' ఈశ్వరకులజుడను' అనేది ఒక వ్యక్తి పేరు కాదు. వ్యక్తిపేరని పండితారాధ్యచరిత్రను సంస్కృతీకరించిన గురురాజకవితోబాటు వీరేశలింగముపంతులుగా

రున్నూ, ప్రభాకర శాస్త్రులుగారున్నూ పొగపాటు పడ్డారు.) 'భక్తి గోత్రుఁడను' అని చెప్పుకొన్నా, అతనికి తన కన్న తలిదండ్రులమీద మక్కువ పోలేదు. "భ్రాజిష్ణుఁడగు విష్ణురామిదేవుండు, జేజిష్ణు వసు శ్రీయాదేవి యమ్మయును, గారవింపఁగనొప్పు గాదిలిసుతుఁడ' నని వారిని గురించి గౌరవముగా చెప్పుకొన్నాడు. తన విద్యాగురువైన ఘాతిదేవరను స్మరించినాడు. కవితాగురువైన విశ్వనాథయ్యను పేర్కొన్నాడు. తన ప్రాణసఖుడైన చెన్నరామని పేర్కొన్నాడు. అంటే ఐహికసంబంధముల నప్పటి కింకా సంపూర్ణముగా త్రెంపివేసుకోలేదన్నమాట. "భవిజన సమాదరణ సంభావణాది సంసర్గదూరగుఁడ" నని చప్పచప్పగా చెప్పినాడే కాని, ఇంకా అప్పటికి వీరశైవ మాతనికి ముదురలేదు. అప్పటి కింకా అతడు 'చతుర్వేదపారగుఁడు' కాడు. పండితారాధ్యచరిత రచనాకాలమున కాతనికి వీరశైవావేశము నిండుకొన్నది. ఆ గ్రంథములో తన గురువు పేరినికూడా స్మరించలేదు. ఆ గురువు తాతపేరిని మాత్రము స్మరించినాడు. బసవేశ్వరుని పేరెత్తితే అతని కిప్పుడావేశము వస్తుంది.

"మును బసవపురాణమున నెన్నఁదగిన
పెనుపారు జనులకుఁ బెంపుడుఁగొడుక;
బసవపురాణప్రబంధ వక్త పేరి
బసవగోత్రుండను బసవని కరుణ
బసవేశు శ్రీపాదపద్మ సేవకుఁడ;
బసవన్నఁ బొగడఁ బాల్పడుకవీంద్రుఁడను;
బసవన్నఁ బొగడఁ బాల్పడుపాఠకుండ;
బసవన్నదూత, నే బసవన్న బంట

బసవన్న లెంక, నే బసవన్న లెంగి,
బసవన్న యిలువుట్టుబానిసకొడుక,
బసవన్న పన్నలపన్న; గావునను
బసవేశుపేరిడఁ బ్రాప్తవ్య మగుట
మసలక మా చెన్నమల్లికార్జునుని
బసవనామం బిడి భక్తిపెక్కువను
బసవలింగం బని ప్రణుతించువాఁడ;"

అని చెప్పినాడు. ఇక భవులంటే అతనికి సరిపడదు. పూర్వము వలె వారినుంచి దూరదూరముగామాత్రము తిరుగడముతో సరిపోలేదు:

"భవికృతారంభసంభవధాన్యనిచయ,
భవినిరీక్షణరసపాకవితాన,
భవిహస్తగతఫలపత్రశాకాది
భవిగృహక్షేత్రాంఘ్రిప ధపవర్జితుఁడ;
భవిజనదర్శనస్పర్శనాలాప
వివిధదానాదానవిషయదూరగుఁడ"—

భవులు పండించిన ధాన్యమును తా నుపయోగించడు; తన ఆహారము భవులకంటబడితే మరి తినడు; ఫలములు, పత్రములు, కూరగాయలు భవులు ముట్టుకొన్నారని తెలుస్తే వాటిని సేవించడు; తుదకు భవుల యింటిచెట్లను పండినవని తెలుస్తే చాలు కాయలు పండ్లు తినడు. భవులు కంటబడితే కళ్లు మూసుకొంటాడు. భవులు తన్ను తాకుతే మైల పోయినదాకా తోముకొంటాడు. వారిమాట వినబడుతుందేమో అని చెవిలో వ్రేలు పెట్టుకొంటాడు. భవులకు

తా నేమీ ఇవ్వడు, వా రిస్తే పుచ్చుకోడు. ఇప్పటికి 'సద్భక్తిస్థల శ్రుతిమతాచార, సిద్ధ వీరవ్రతశీలాన్వితుఁ' డయినాడు. చతుర్వేద పారగు డయినాడు. ఒక శ్రుతులా, ఒక స్మృతులా, ఒక ఉపనిషత్తులా, ఒక దర్శనములా, ఒక ఆగమములా, పురాణములా, శాస్త్రములా, ఇవీ అవీ ఏమిటి, అన్నిటిలోను అసమాన ప్రజ్ఞను సంపాదించినాడు. అపారమయినపాండిత్యము, హిమాలయమునుంచి దుముకుతూ, ఉరుకుతూ వచ్చే గంగాఝురీసదృశమైన కవితా ప్రవాహము, సమస్త లోకమును తిరస్కరించే ఔద్ధత్యము, అతనికి కుదిరినవి. అతడు భక్తిసామ్రాజ్య పట్టభద్రుడై వీరశైవలోకమునకు శాసకు డయినాడు. శ్రీనాథునకు కాశీఖండరచనాకాలమున నుండినవయ స్సిప్పుడు సోమనాథుని కుంటుంది. ప్రౌఢనిర్భర వయఃపరిపాకావస్థ దాటినది. "ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ గాశికా ఖండమును" శ్రీనాథుడు రచించినట్లే, అదేవయస్సులో శ్రీనాథునికంటె ఎక్కువ ప్రతిభతో పండితారాధ్యచరిత్రరచనమును సాగించినాడు. కాబట్టి అతడు పండితారాధ్యచరిత్రమును క్రీ. శ. ౧౩౦౦ సం॥ర ప్రాంతమున రచించి ఉంటా డని నిశ్చయించ వచ్చును. అందుచేత సోమనాథుడు కాకతీయ గణపతిదేవుని కాలములోను, రుద్రాంబ కాలములోను, రెండో ప్రతాపరుద్రుని కాలములోను కూడా ఉన్నవా డవుతాడు. పిడుపర్తి సోమన బసవపురాణములో చెప్పిన ప్రతాపుని కాలమున కాతడు వృద్ధాప్యమును సమీపిస్తూ, శిష్యులతో దేశ సంచారము చేస్తూ ఉండేవా డన్న విషయము యథార్థ మవుతుంది.

పాల్కురికి సోమనాథుని కాలము నిర్ణయించడాని కితరాధారములను పరిశీలింతాము. సోమనాథుడు పండితత్రయ మనబడే వారిలో ఒక డయిన శ్రీపతిపండితుని గురించి బసవపురాణ పండితారాధ్యచరిత్రముల రెండింటిలోను ప్రస్తావించినాడు.

## బసవపురాణము

సంగమేశ్వరుడు బసవని మహిమను పరీక్షించడానికి జంగమ రూపముతో రాగా, బసవ డాతని గుర్తించి అతనియెదుట అద్దము చూపగా అందులో శివుని మూడో కన్ను కనబడినది. దానికి శివుడు లజ్జించి నిరాకారుడు కాగా, బసవన్న ఈశ్వరుని నిలువరిస్తూ, పూర్వభక్తుల పేళ్లను, వర్తమానభక్తుల పేళ్లను వివరించినాడు.

"హార మీనగరి మాలకరి పుష్పదంతుఁ
డరిదిపూజారి కన్నప్ప దేవయ్య
... ... ... ... ... ... ... ...
నెట్టణ దీవించి నీకు విభూతిఁ
బెట్టెడువాఁడు మా పిళ్లనైనారు.

... ... ... ... ... ... ...
వరకీర్తి మీఁగంటవాఁ డోహిళయ్య
... ... ... ... ... ... ...
శ్రీపతిపండితుల్ శివుఁడ! మీకవులు;
నాపండితయ్యగా రనుఁగుఁబండితులు.

(బస. పు. ౭౫-౬)

శివనాగుమయ్య అనే అంత్యజభక్తుని బసవన్న పూజించడము చూచి బ్రాహ్మణులు. రాజువద్దకు పోయి 'కల్యాణకటకమంతా మాలలపా లైనా' దని చెప్పగా రాజు బసవని మందలించినప్పుడు, డాత డన్నమాటల్లలోనివి :

"శివనాగుమయ్యతోఁ జెనటి యీద్విజులు
నవనీశ! సరియుగా రది యెట్టు లనిన,
భక్తుండు శ్రీపతిపండితుం 'డీశు
భక్తుని కిలఁ గోటి బ్రాహ్మణు లైన
నెన యన్న నాలుక నేఁ గోసివైతు'
ననుచు ననంతపాలుని సభాస్థలిని
నెక్కొనఁగాఁ జంద్రనిష్ఠాలు గాదె
చక్కన పొత్తిపచ్చడమున ముడిచెఁ
దా నేమిచెప్ప భక్తానీకమిండ్ల
శ్వానంబులకు ద్విజుల్ సరిరామి వినవె?"

(బస. పు. ౨౧౦)

పండితారాధ్యచరిత్రము

ఈ క్రిందిది సోమనాథుడు చెప్పిన పీఠికలోనిది:

కడు నర్థి నుత్పత్తికర్తనా బ్రహ్మ
వడి బ్రహ్మను బ్రహ్మవాదులఁ ద్రుంచి
హరభక్తియుత్పత్తి కధిపతినాఁగఁ
బరిగెఁ దాఁ దొల్లి శ్రీపతిపండితయ్య

(పండి. చ. I. ౭)

ఈ క్రిందిది ఓహిళునకు సమకాలికు డయిన కుమారపాల ఘూర్జరుడు తనభార్యతో చెప్పినది:

వెండియు శ్రీపతిపండితుల్ భువి న-
ఖండితైశ్వర్యవికస్వరలీల

వర్తింపుచును బరవాదుల కెల్లఁ
గర్తలు భర్తలుఁగాఁ బ్రతిష్ఠించి
తొడఁగి పైపొత్తిపచ్చడమున నిప్ప
లవరంగ ముడిచిన నది యేమిసేసె?

(పండి. చ. I. ౪౦౭.)

మల్లికార్జునపండితారాధ్యుడు నవ్యగణసహస్రనామస్తవము చేస్తున్నాడు :

శ్రీపతిపండితుల్ సింధుబల్లహుఁడు
........................
మడివాలుమాచయ్య మాదిరాజయ్య
........................
మహాదేవి, శివనాగుమయ్య, బెద్దేవి-
వేమనారాధ్యులు... ... ...
........................
శివలెంక మంచయ్య సివురు చందయ్య
... ... ... ... ... ... ... ...

(పండి. చ. II. ౫౬, ౯౩.)

ఈ క్రిందివి ఆంధ్రదేశముపరుసమాటలు :

పండితారాధ్య శ్రీపతిపండితయ్య
బండారుబసవయ్యఁ బాయక కొలుతు;

శంకరదాసయ్య, లెంకమంచయ్య,
బంకయ్య, శివరాత్రి సంకయ్య శరణు.

(పండి. చ. II. ౩౭౫.)

పండితారాధ్యుడు తన శివతత్త్వసారములో :

"ఒక్కఁడె దైవము శివుఁడని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు చీరన్
స్రుక్కక శ్రీపతిపండితుఁ
డక్కజముగ విజయవాడ నలజమ్మి శివా"

అని వ్రాసినాడు.

ఈ క్రిందిది బెజవాడ మల్లికేశ్వరాలయములోని ఒక శిలాశాసనమునుంచి ఉద్ధృతము. చాలుక్యనంకకాడు మహామండలేశ్వర పల్లకేతుని శాసన మిది. పల్లకేతుడు కాడుసెట్టి రాజవంశమువాడని దీనిలో ఉన్నది.

ఇతస్తి విస్తృతేనాపి సర్వైర్వ్యస్తులిత తేజసా
పీతాశేషాబ్ధితోయేన కుంభజేనాప్యగస్తినా;
పూర్వం కృతం జయేశానానామాపి తదనంతరం
ఆరాధ్య మల్లయుద్ధేన ఘల్లునేన కృతాభిధః;
మల్లేశ్వర ఇతి ఖ్యాతః సన్నిధత్తే మహేశ్వరః
శ్రీమద్విజయవాటాఖ్యపురే కృష్ణావిభూషణే;
కలౌ శ్రీమచ్ఛకాబ్దేఽబ్ధి శశిసాయకసమ్మితే
రాజా మాధవవర్మాఽభూద్విఖ్యాతో ధరణీతలే;

తతః స్వపుత్రేణ హతే తింత్రిణీజీవినీసుతే
ధర్మసంరక్షణార్థాయ స్వపుత్రమవధీత్ సరాట్;
తతో మల్లేశ్వరః ప్రీతః స్వర్ణవృష్టిం వవర్షచ
శిశుపుత్రకయోః ప్రాణం దత్తవాంస్తస్యకీర్తయే;
తతః శ్రీపండితారాధ్యనామ్నా భక్తోత్తమేనచ,
శివభక్త ఏవ నూనం దేవర్షిభ్యోఽధిక ఇతి;
చీనాంబరేఽగ్నిం సంస్థాప్యశమీకోమలశాఖయా
బద్ధే మల్లేశ్వరః ప్రీతః ప్రత్యక్షః సమజాయత;
ఈదృగ్విధం మహాదేవం భక్తవత్సల మవ్యయం
మల్లేశ్వరం సమారాధ్య రేజిరే పృథివీభుజః.

పై నుదాహరించినవాటిప్రకారము (౧) బసవన్న శ్రీపతి పండితుని పుష్పదంతుడు, కన్నప్ప, పిళ్ళనైనారు, ఓహిళయ్యా, మొదలగు పూర్వభక్తులతో కలిపి చెప్పడముచేత ఆతడు బసవన్న కంటె పూర్వు డని తేలుతున్నది. (౨) అట్లే శివనాగమయ్యా కథలో బసవన్న శ్రీపతిపండితు "ననంతపాలుని సభాస్థలి"లో తనకు పూర్వమం దుండినవాడుగా పేర్కొన్నాడు. అనంతపాలుని గురించి ఈక్రింద (౬) లో ప్రస్తావిస్తాను.

(3) సోమనాథుడు పండితారాధ్య చరిత్ర పీఠికలో శ్రీపతి పండితుని గురించి 'తొల్లి' ఉన్నవాడుగా చెప్పినాడు. 'తొల్లి' అనే పదమువల్ల శ్రీపతిపండితుడు సోమనాథునికి చాలాపూర్వుడని ధ్వనిస్తున్నది.

(౪) కుమారపాల ఘూర్జరుడు శ్రీపతిపండితుడు తనకు పూర్వుడుగా చెప్పినట్లు సోమనాథుడు వ్రాయడమువల్ల సోమనాథుని అభిప్రాయములో శ్రీపతిపండితుడు కుమారపాలునికి పూర్వపువాడు.

(౫) ఆంధ్రదేశపు పరుసమాటలలో 'పండితారాధ్యా, శ్రీపతి పండితయ్యా, బండారు బసవయ్యా' అని మూడు పేర్లను కలిపి చెప్పడమువల్ల ఈ ముగ్గురున్నూ సమకాలీనులేమో అని స్ఫురిస్తుంది. కాని, ఇక్కడ చెప్పబడిన పండితారాధ్యుడు మల్లికార్జున పండితారాధ్యుడు కాజాలడు. మల్లికార్జునపండితారాధ్యుడా పరుస నెనుకంట నే ఉన్నాడు. (౩) లో చెప్పినప్రకారము సోమనాథుడు శ్రీపతి పండితుని 'తొల్లింటి'వానినిగా చెప్పి, ఆతరువాతివానినిగా మల్లికార్జునపండితారాధ్యుని పేర్కొని, ఇప్పుడు శ్రీపతి పండితుని మల్లికార్జున పండితారాధ్యునికి తరువాతి వానినిగా చేసి ఉంచెను. ఆంధ్ర దేశపుపరుస యిచ్చట పురాతన భక్తులను సంస్మరిస్తున్నది.

(౬) మల్లికార్జునపండితారాధ్యుడు తన శివతత్త్వసారములో తెలిపిన శ్రీపతిపండితు డాతనికి పూర్వు డని చెప్పుతున్నది. 'అలజమ్మి' అనడముచేత శ్రీపతిపండితుడు పట్టుపచ్చడములో చంద్రనిప్పులను గట్టినకథ మల్లికార్జున పండితారాధ్యుని కాలమునకు సుప్రసిద్ధముగా ఉన్నదని మాత్రము తెలుపుతున్నది. ఆవృత్తాంతము జరిగి చాలాకాలము కాలేదనిమాత్రము అందువల్ల తెలుస్తుంది.

(౭) బెజవాడ మల్లికేశ్వరాలయశాసనములో తెలుపబడిన పల్లకేత డెవడో, ఏకాలపువాడో ఆశాసనమువల్ల స్పష్టము కాదు. 'పల్లకేత' అనే పదములో 'పల్ల' అని ఉండడము చేత ఆతడు పల్లవరాజని రంగాచారిగారు చెన్నరాజధాని శాసన సంపుటములలో సూచించడము తప్పు. ఆతడు పశ్చిమచాళుక్యులకు సామంతుడనిన్ని, పశ్చిమచాళుక్యుల శాసనములు పండ్రెండో శతాబ్దము తరువాత

కానరాదు కాబట్టిన్ని, బెజవాడ శాసనములు సాధారణముగా పండ్రెండవ శతాబ్దములోనివే కాబట్టిన్ని, పల్లకేతడు పండ్రెండవ శతాబ్దపువాడే అయివుంటాడనిన్ని, అత డుదాహరించిన శ్రీపతి పండితు డతనికి పూర్వుడై పదకొండవ శతాబ్దమువాడై ఉంటాడనిన్ని, శ్రీపతి రచిత మని చెప్పబడే శ్రీకరభాష్యమునకు పీఠికను వ్రాసిన శ్రీహయవదనరావుగారి అభిప్రాయములను ఖండిస్తూ నాగనూరు బృహన్మఠాధ్యక్షులయిన పండిత శ్రీకాశీనాథశాస్త్రిగారు వ్రాసినారు. పశ్చిమ చాళుక్యులు వేంగీదేశమును పాలించలేదు. దానిని పాలించినవారు పూర్వచాళుక్యులే. పూర్వచాళుక్యుల అనంతరము చోళులున్ను, తరువాత కాకతీయులున్ను, తరువాత గజపతులున్ను, తరువాత రెడ్డిరాజులున్ను వేంగీదేశమును పాలించినారు. ద్రాక్షారామములో పశ్చిమచాళుక్యరాజయిన ఆరో విక్రమాదిత్యుని శాసనములు కొన్ని కలవు. ఇవి ౧౧౨౦—౧౧౨౫ సం॥రములకు మధ్య కాలపువి. వీటిని బట్టి విక్రమచోళుడు దక్షిణ దేశమునకు పోగా వేంగీదేశము నాలుగు సంవత్సరములు విక్రమాదిత్యుని ఏలుబడిలో ఉండిన దని కొంద రంటున్నారు కాని, విక్రమాదిత్యు డీరాజ్యము నెప్పు డెట్లు జయించినాడో తెలియదు.

ఈరీతిగా పల్లికేతని కాలము నిర్ణయము కానప్పుడు తత్పూర్వుడయి యెప్పుడో ఉండిన అతని శాసనములో ఉదాహృతుడయిన శ్రీపతి పండితుని కాలమునుకూడా నిర్ణయింప వీలులేదు గదా. ఇట్లుండగా ఈమధ్య శ్రీపతి పండిరాధ్య విరచిత మని చెప్పబడే శ్రీకరభాష్యమును బెంగుళూరు వాస్తవ్యులయిన సి. హయవదనరావుగారు దేవాంగసంఘము పక్షమున ప్రకటిస్తూ, ఆ గ్రంథమంత పెద్దదయిన ఒక సంపుటము నింగ్లీషుభాషలో పీఠికగా వ్రాసి ప్రచురించినారు. దానిలో శ్రీపతిపండితుడు క్రీ. శ. ౧౮౦౦

స౦॥ర ప్రాంతమువాడని నిశ్చయించినారు. కాని, తొలుత ఈ నిశ్చయమును ముందుగా మనస్సులో చేసుకొని, తరువాత దానికి ప్రమాణములకోసము వారు తంటాలు పడినట్లు వారి వ్రాతధోరణివలన కనుగొనవచ్చును. ఇది శాస్త్రీయమైన పరిశోధనపద్ధతి కాదు. తమ నిశ్చయమును సమర్థించుకొనడానికి ఏవేవో పొలుపొందులులేని శాసనముల నుదాహరించి, నాటికి అర్థములు కుదురనప్పుడు మాటలను తారుమారుచేసి ఏవేవో అవస్థలు పడినారు. వారు చూపిన ముఖ్యమైన ప్రమాణ మొక్కటి కనబడుతున్నది. శ్రీకరభాష్యములో మధ్వాచార్యోపదిష్టమయిన ద్వైతమత ఖండన మున్నది కాబట్టి, శ్రీపతి పండితుడు ఆనందతీర్థులవారికి తరువాతి వాడు కావలసి ఉంటాడు ఆనందతీర్థులకాలము పదమూడో శతాబ్దము కాబట్టి, శ్రీపతిపండితుడు పద్నాలుగోశతాబ్దాంతము వాడు కావలె నని వీరి వాదము. హయవదనరావుగారచ్చు వేయించిన శ్రీకరభాష్యములో "మధ్వద్వైత క్షపణక తార్కికాదయో జీవానాం విభుత్వాంగీకారాత్", అని ఒకచోటను, "భాగవత పాంచరాత్ర మధ్వాది వైష్ణవానాం జగత్కారణేశ్వరస్య శరీరత్వ పరిగ్రహాత్" అని ఒకచోటను రెండువాక్యము లున్నవి. మొదటివాక్యములో 'మధ్వద్వైత' మంటే ఏమిటో దుర్గ్రాహ్యముగా ఉన్నది. మధ్వోపదిష్ట ద్వైతము ప్రత్యేకముగా తత్పూర్వ ద్వైతమునకు భిన్నమైన దున్నదా? ఆవాక్యములో 'మధ్వ' శబ్దము లేకుండానే సరిపోతుందే! రెండో వాక్యములో భాగవత పాంచరాత్రము లనే మతవాచక శబ్దములతో మధ్వాచార్యు డనే వ్యక్తిపేరును శ్రీపతిపండితుడు చేర్చి ఉండడు. 'మధ్వ' అనేది భాగవత పాంచరాత్రములవలె ఒక మతము కాదు. ఆవాక్యములలో 'మధ్వ' శబ్ద మప్రస్తుతము, అసంబద్ధమునని తలచి, హయవదనరావుగా రచ్చువేయడమునకు మూల ప్రతి నిచ్చిన దేవిడీ జమీందారుగారికి జాబు వ్రాయగా వారు

మూలమును చూచి అందులో ఆస్థలములలో 'మధ్వ' శబ్దము లేదని నాకు వ్రాసినారు. కాబట్టి శ్రీపతిపండితుని కాలము క్రీ. శ. 1080 అని నిర్ణయించడానికి సాధకముగా ఉంటుందని కాబోలు తత్పరిష్కర్త లాపదమును చేర్చిఉంటారని నిశ్చయించుకొన్నాను. శ్రీకర భాష్యములో ద్వైతమతఖండనము లేకపోలేదు. ద్వైతము ఆనందతీర్థోపజ్ఞము కాదు. ఆనందతీర్థుడు ద్వైతమత పునః ప్రతిష్ఠాపకుడుమాత్రము.

"శ్రీకరభాష్యము శ్రీపతిపండిత విరచితము కాదనియే నా నమ్మకము" అని ప్రభాకరశాస్త్రులవారు వ్రాసి, తమ నమ్మకమునకు కారణముగా, "శంకరాద్వైతము ప్రబలిన పిదప నాగమతంత్రములవారుగూడఁ దమ మతములు బ్రహ్మసూత్రాభిప్రేతములే యని నిరూపించుటకు యత్నించిరి. స్వసిద్ధాంతానుసారముగా బ్రహ్మసూత్రములకు భాష్యములు రచించిరి. ఈ పూన్కి శంకరులకుఁ బూర్వకాలమున నున్నట్లు గానరాదు" అని తెలిపినారు. ఈ కారణము సరిగా లేదు. రామానుజానందతీర్థులు స్వసిద్ధాంతానుసారముగా భాష్యములు వ్రాయుటకు లేని అభ్యంతరము శ్రీపతిపండితుని కేల ఉండవలెనో తెలియదు. వీరశైవము వైదికమతము కాదనే అభిప్రాయము కలవారు కాబట్టి ప్రభాకరశాస్త్రులవా రట్లు వ్రాసి ఉంటారు. వీరశైవము వైదికమతమా, కాదా అనే విషయము గురించి ముస్ముందు చర్చిస్తాను.

శ్రీకరభాష్యమును శ్రీపతిపండితుడే రచించిఉంటాడని నా నమ్మకము. అతడు రామానుజునికి పూర్వుడని నే ననుకొంటున్నాను; పండ్రెండో శతాబ్దమువాడుమాత్రము కాడని నా నమ్మకము. శ్రీకరభాష్యములో అద్వైతసిద్ధాంతవిమర్శయే ఎక్కువగా ఉన్నది.

ఇతరసిద్ధాంతముల విమర్శకూడా ఉన్నా, ఆ సిద్ధాంతములు రామానుజానందతీర్థులు ప్రతిపాదించినవే అని చెప్పడానికి వీలు లేదు.

అది అట్లా ఉండనివ్వండి. కాశీనాథుని వీరారాధ్య రచితమయిన 'ధర్మ గుప్తాభ్యుదయము'లో శ్రీపతిపండితుని గూర్చిన నిప్పును పట్టుపచ్చడములో కట్టిన మహిమవర్ణన మున్నది. ఆ కావ్యము నవీనమయినది. దానివల్ల ప్రత్యేకముగా శ్రీపతిపండితుని కాలమును సాధించడమునకు సాధనములు కానరావు.

ఇక శ్రీపతిపండితుడు తన మహిమను అనంతపాలుని సభలో చూపినాడన్న ఐతిహ్య మున్నది గనుక దానివిషయమై ఆలోచింతాము. అనంతపాలదండనాయకుడు త్రిభువనమల్లుని కొలువులో ఉన్నవాడు. ఇతడు ద్రాక్షారామములోను, చేబ్రోలులోను, నాదెండ్లలోను శాసనములు వేయించినాడు. త్రిపురాంతకములోని ఒక శాసనములోకూడా ఇతనిపే రున్నది. ఇతడు క్రీ. శ. ౧౧౨౬-౨౭ ప్రాంతమువాడు. కాని, ఈతని శాసనములో శ్రీపతిపండితుని గురించిన ప్రస్తావన లేదు. శ్రీపతిపండితుడు తన మహిమను చూపినదీ అనంతపాలుని ఆస్థానములోనే అయితే, శ్రీపతిపండితుని కాలముకూడా క్రీ. శ. ౧౧౨౬-౨౭ ప్రాంత మని నిర్ణయించవచ్చును. కాని, పాల్కురికి సోమనాథు డనంతపాలునిగురించి తెలిసి వ్రాయలేదని నా విశ్వాసము. కుమారపాల ఘూర్జరుని వృత్తాంతమువంటిదే అనంతపాలునివృత్తాంతము కూడాను. గుజరాతు నేలిన కుమారపాలుడు పండ్రెండో శతాబ్దమువాడు. చాలా సుప్రసిద్ధు డయిన చారిత్రకపురుషుడు. అతనిని సోమనాథుడు పరమ వీరశైవునిగా, ఓహిళునికంటె గొప్ప భక్తునిగా వర్ణించినాడు. ఓహిళుడు తానొక్కడే గంటవాయించుకొంటూ కైలాసానికి పోతూఉంటే, అతని ఒంటెత్తుతనము నాక్షేపించి తనఊరిలోని ప్రజలనందరిని పిలిపించు

కొని వారి అందరితోను కైలాసమునకు పోయిన భక్తాగ్రేసరునిగా సోమనాథు డాతనిని వర్ణించినాడు. కాని, చారిత్రక పురుషు డయిన కుమారపాలఘూర్జరుడు శైవుడు కాడు; పరమజైనుడు. జైనమతప్రధానధర్మ మైన అహింసాతత్త్వమును తనరాజ్యములో శాసనమూలముగా వ్యాపింపజేసినవాడు అహింసాధర్మము నతిక్ర మించినవారి నాతడు ఘోర గా దండిస్తూ వచ్చినాడు. ఒక నా డొక సెట్టి తలలోని పేనును గోళ్లతో నొక్కి చంపినాడట. అందు కాతనిని ప్రత్యేకధర్మసభకు పిలిపించి, అతని ధనమునంతటిని లాగు కొని, దానితో ఒక జినాలయమును కట్టించినాడట. మరొకడు పచ్చి మాంసమును పట్టణములోనికి తేగా, వానితల దీయించినాడట. ఇట్టి జినభక్తుని వీరశైవునిగా వర్ణించడము బుద్ధిపూర్వకముగా కాదు. లోకములో కథల గతి అంతా ఇట్లే ఉంటుంది. కథలు జనులలో వ్యాపించినకొద్దీ వాటిలో ఎన్నో తబ్బిబ్బులు కలుగుతూఉంటవి. వాటికి చారిత్రకసత్యముతో సంబంధము లేదు. ఇందువల్ల కుమార పాలఘూర్జరుడు పాల్కు రికి సోమనాథునికి చాలా పూర్వుడనిన్ని, కుమారపాలునికి పూర్వుడయిన శ్రీపతిపండితు డింకా పూర్వు డనిన్ని, తేలుతున్నది.

కాని, శ్రీపతిపండితుని కాలమునుగురించినచర్చనుబట్టి పాల్కు రికి సోమనాథునికాలమును నిర్ణయించడాని కేమిన్ని వీలులేకున్నది. సోమనాథుడు పేర్కొన్న మరికొంతమంది చారిత్రకపురుషులనుబట్టి యేమయినా నిర్ణయింపవచ్చునేమో ఆలోచింతాము:

౧. కుమారపాలఘూర్జరుడు భార్యతో చెప్పుతున్నాడు:

"ధరణీశు లన మున్న గరికాలచోడుఁ,

గరయూరిచోడు విక్రమచోడు వీర

చోడు నయ్యుత్తుంగచోడు, నరేంద్ర
చోడు, నారాజేంద్రచోడు, నీశ్వరుఁడు
దవులక నిర్ధనతనువంచకులను
దవిలెనే ? భక్తికి ధరణిపుల్ వెలియె ?" అని

(పండి. చ. I. ౪౧౨)

౨. పండితారాధ్యుడు చెప్పుతున్నాడు:
"స్తుతియింప నుత్తుంగచోడనిపగిది
భూసురుల కగునె భూతయజ్ఞంబు ?"

(పండి. చ. I. ౧౪౨.)

శివద్విజుడు నంబెన్న భార్యతో నంబితరుణి పరమనాచి ఉత్తుంగచోడనిచేత పిండమును రుద్రపాదముపై పెట్టించి పితాళ్లను రప్పించిన కథను పండితారాధ్యుడు చెప్పినాడు.

(పండి. చ. II. ౧౪౦—౧౫౪.)

ఉత్తుంగదేవుడు శివైక్యమును బొందిన విషయమును పండితారాధ్యుడు స్మరించినాడు. (పండి. చ. II. ౨౧౬.)

3. గురుభక్తాండారి వేశ్యతో అన్నమాట:
"వీరచోడనిభంగి మారారిపురికిఁ
బోయెదే ?"............

(పండి. చ. I. 33౮.)

వీరచోడడు పండితారాధ్యునిచేత యోగాచార్యగణములో కీర్తింపబడ్డాడు. (పండి. చ. II. ౮3.)

శ్రీశైలయాత్రలో పిచ్చుకగుంట్లు వీరచోడని స్మరించినారు.
(పండి. చ. II. 384.)

4. పండితారాధ్యుడు కల్యాణకటకమునకు పోతూ, పాను గంటిలో విడిసి ఉన్నప్పుడు గోవిందప్రెగడ అతనికి సకలోప చారములున్ను చేస్తున్నాడు. రాజు పేరుదయావనీసుడు. అతనిలెంక ధవళేసునామయ్య. నామయ్య శైవభక్తిని పరిపాలిస్తూఉంటే తోడి లెంకలు రాజుతో చెప్పినారు. రాజు తనతమ్మ తిను మరి ఇచ్చినాడు. అతడు నిరాకరించినాడు. రా జంటున్నాడు:

"పానలొండేల మీబసవరాజాది
గా నడవరె సేవకప్రకారమున ?"

అని ఇట్లు బసవనిదూషిస్తే "మృడుఁడక్షణంబ, కంటకాసురుఁ డనఁగా నొక్కదివిజకంటకుఁ బ్రతిపక్షుగాఁ బంప నసుఁ పృథివిపై జనియించి బిజ్జలుఁ డనఁగఁ బ్రథితబల్లహపట్టభద్రుఁడై ... కప్పడి సంగమేశ్వరం బేఁగి, బసవయ్యఁ దోడ్తెచ్చి బండరు విచ్చి, యసమసకల నియోగాధ్యక్షుఁ" జేయగా అతడు బండరువును మిండజంగములకు చూరవిడువడము చూచి బిజ్జలుడు బసవని దండింపబంపుతే, బసవన్న 'చాళుక్యులను పేరు హారుఁకవిలియఁదుడిపించి', కల్యాణకటకము పాడుగా శపించినాడు. జగదేవ, మొల్లెబ్రహ్మయలు బిజ్జలుని పొరి గొన్నారు. (పండి. చ. II. 127—30.)

నామయ్య ఉదయావనీశుని దూషణను సహింపక తనతల కోసుకొన్నాడు. పండితారాధ్యుడు రాజును శపిస్తే, రాజు తన వంశముతో కూడా నాశన మైనాడు. (పండి. చ. II. 134.)

పైని చెప్పినరాజులు చారిత్రకపురుషులు. వీరుకాక కరికాల చోడ, కరయూరిచోడుల పేళ్లుకూడా బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో స్మరింపబడినవి. వీరిలో కరికాలచోడుడు క్రీ. శ. ౧౫౦ నుంచి ౧౭౦ సం॥ రము వరకున్ను రాజ్యముచేసినాడని తమిళ చరిత్రకారు లంటున్నారు గాని తగినసాక్ష్యము చూపలేదు. కర యూరిచోడ డెవరో తెలియదు. త్రిభువనచక్రవర్తి కోనేరిన్మై కొండాన్ అనే మూడో కులోత్తుంగచోడుడే (౧౧౭౮–౧౨౧౬) కరయూరిచోడు డని కొంద రంటున్నారు. రాజేంద్రచోళులలో ఒకడు ౧౦౧౨-౧౦౪౩; రెండోవాడు ౧౦౫౨-౬౩; (అధి-రాజేం ద్రుడు ౧౦౭౦లో చంపబడ్డాడు); మూడోవాడు (౧౨౪౬-౬౭) వరకు రాజ్యముచేసినారు. సోమనాథుడు పేర్కొన్న రాజేంద్ర చోళుడు మొదటి యిద్దరిలో ఒకడై ఉంటాడు. కులోత్తుంగచోళులు కూడా ముగ్గురున్నారు. వీరిలో మొదటివాడు ౧౦౭౦-౧౧౧౮ ల మధ్యను, రెండోవాడు ౧౧౩౩ నుంచి ౧౧౪౬ వరకును, మూడో వాడు ౧౧౭౮ నుంచి ౧౨౧౬ వరకును రాజ్యముచేసినారు. సోమ నాథుడు తెలిపిన ఉత్తుంగచోళు డీముగ్గురిలో ఎవడైనా కావచ్చును. వీరచోడుడు మొదటి కులోత్తుంగుని కొడుకు. ఇతడు ౧౦౭౮ నుంచి ౧౦౮౪ వరకున్ను, ౧౦౮౮-౯ నుంచి ౧౦౯౨-౩ వర కున్ను రెండుసార్లు వేంగీదేశములో తండ్రిపరిపాలనకాలములో మహామండలేశ్వరుడుగా ఉన్నాడు. విక్రమచోడుడు కూడా మొదటి కులోత్తుంగునికొడుకే.

ఇతడు తండ్రికాలములో ౧౦౯౨-౩ నుంచి ౧౧౧౮ వరకు వేంగీదేశమును మహామండలేశ్వరుడుగా పరిపాలించి, తండ్రితరువాత సింహాసనమునకు వచ్చినాడు. ఇతనికి 'అకలంక', 'త్యాగసముద్ర' అనే బిరుదము లుండేవి. ఇతనికొడుకే రెండో కులోత్తుంగుడు.

నరేంద్రచోడు డెవరో తెలియదు. తూర్పు చాళుక్యుల వంశములోని ఒక శాఖవారు పిఠాపురము రాజధానిగా పరిపాలనము చేసినారు. వారిలో మూడో విజయాదిత్యునికొడుకు నరేంద్రు డనేవాడు ౧౧౪౬ లో ఒకదానముచేసిన శ్లోకశాసన మున్నది. శత్రుమల్లబిరుదాంకితు డయిన పల్లవరాజు ఒకనరేంద్రు డున్నాడు. ఇతడే మొదటి మహేంద్రవర్మ అని పరిశోధకులంటారు. ఇతడు ౬౦౦ నుండి ౬౩౦ వరకు రాజ్యము చేసినాడు; శత్రుమల్లేశ్వరాలయము మొదలయిన అనేకశైవసహాలయములను నిర్మించినాడు. ఇతడు చోళులనుజయించినట్లు తెలియవస్తుంది కాబట్టి సోమనాథుడు స్మరించిన నరేంద్రచోడుడు పిఠాపురపు తూర్పుచాలుక్యరాజు కాక ఇతడే అయి ఉంటాడేమో! ఇక ఉదయావనీశుడనేవాడు ఉదయాదిత్యుడై ఉంటాడా? అయితే, హొయ్సళవంశములో ఒక ఉదయాదిత్యు డున్నాడు. ఇతడు మొదటి బల్లాళునకు (?౧౧౦౦-౧౧౦౬) సోదరుడు. రాజ్యము చేయలేదు. ౧౧౨౨ లో చనిపోయినాడు. పశ్చిమచాళుక్యులకు సామంతులై బళ్లారి కడపమండలములో రాజ్యము చేసిన నొళంబపల్లవులలో 'జగదేకమల్లనొళంబ' బిరుదాంకితుడయిన ఉదయాదిత్యు డొకడున్నాడు. ఇతడు పదకొండోశతాబ్దము మధ్యకాలమువాడు. ఇతని శక ౯౪౦ సం॥ రమునాటి (క్రీ. శ. ౧౦౧౮) శాసన మొకటి బళ్లారిజిల్లా హరపనహళ్లి తాలూకా బాగలిగ్రామములో ఉన్నది. ఇదిగాక సోమిదేవునికిని, కాం చెలాదేవికిని కొడుకయిన ఒక ఉదయాదిత్యుని శాసనము శక. ౧౧౨౦ సం॥రమునాటిది అనంతపురముజిల్లా తాడిపత్రితాలూకా, తాడిపత్రిగ్రామములోని రామేశ్వరాలయములో ఉన్నది. ఈ ఉదయాదిత్యుడు జైనుడు. ధవళేశునామయ్యను బాధపెట్టినవాడు కాబట్టి ఉదయావనీశు డితడయిఉంటాడేమో. ఈతనిశాసనపురాతి నెక్కడినుంచియో తెచ్చి తాడిపత్రి ఆలయములో చేర్చి ఉంటారని ఫ్లీట్ పండితు

డన్నాడు. ఉదయావనీశుడు పానుగంటిప్రభు వని పండితారాధ్య చరిత్రము చెప్పుతున్నది. పానుగల్లుల ఒకటి చిత్తూరుజిల్లాలో ఉన్నది. ఒకటి ధార్వారుజిల్లాలో కర్ణాటకదేశములో ఉన్నది. ఇది చాలా ప్రసిద్ధమైన స్థలము. హొయ్సళరాజులలో అనేకు లిక్కడికోటను పట్టుకొన్నవారుగా వర్ణించుకొన్నారు. పండితారాధ్యచరిత్రములోని పానుగల్లు అమరారామమునుంచి పండితరాధ్యుడు బయలుదేరిఇ(ని?)రుగుడుముల గ్రామములోవిడిసి,అక్కడనుంచి కల్యాణకటకమునకు పోతూ ఉన్నదారిలో ఉన్నది. కాబట్టి సోమనాథుడు చెప్పిన పానుగల్లిదే అయిఉంటుంది. పానుగంటి నేలినవారిలో ఉదయచోడుడు లేక చోడోదయుడు అనేరాజు శక. ౧౦౮౪ (క్రీ. శ. ౧౧౬౨) ప్రాంతపువా డుండినట్లు కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు జడచర్లశాసనము అనుమకొండశాసనము తమ శివతత్త్వసారపీఠికలో ఉదాహరించినారు.

ఇక చరిత్రపురుషులయి ఉంటారేమో అని సందేహము పుట్టించే చాలా పేర్లు బసవపురాణపండితారాధ్యచరిత్రములలో కనబడుతున్నవి.

(౧) అజగన్న (ప. (౨)౫౧౬); అజగవు (ప. (౧) ౧౪౩); అజగమదేవయ్య (ప. (౨) ౩౭౬);

బనవాసినేలిన కదంబవంశపురాజులలో అజవర్మ ఒకడున్నాడు. ఇతడు ౫౫౦-౬౫ సంవత్సరములమధ్య రాజుగా ఉన్న కృష్ణవర్మ కొడుకు.

(౨) ఆజ్జదాసయ్య (ప (౨) ౨౧౪); ఆజ్జిదాసయ్య (ప(౨)౯౨)
నిజామురాష్ట్రములోని ఎరంబరిగె (నేటియెల్బర్గా)లో రాజ్యము చేసిన సిందరాజులలో 'దాస'నాము డొక డున్నాడు. ఇతడు ౧౧౦౦ ప్రాంతమున రాజ్యపాలనము చేసిన, పశ్చిమచాలుక్యుల సామంతు డయిన మొదటి అచుగికి తమ్ముడు.

(3) అక్కవ్వ (బ. ౨3౩; ప. (౨) 3౭౮):

మైసూరురాష్ట్రములోని శివమొగ్గజిల్లాలోని పత్తిపొంబుచ్ఛ (నేటి హుమ్చ)లో రాజ్యముచేసిన సాంతరరాజులలో 'రాయ' అనే రాజు (౯౫౦ సం.) భార్య 'అక్క'.

(౪) అంగరాయడు: ప. (౨) ౯౦:

బొంబాయిరాజధానిలోని సౌందత్తి రాజధానిగా పాలనము చేసిన రట్టరాజులలో 'అంకరాజు' ౧౦౪౮ సం॥రమువాడున్నాడు.

(౫) అడిభర్త: బ. ౧3౬; ప. (౨) ౮౪:

ఇత డధిరాజేంద్రదేవుడై ఉంటాడు. ఇతడు వీరరాజేంద్ర చోళుని కొడుకు. పశ్చిమచాలుక్యరాజయిన ఆరోవిక్రమాదిత్యునికి బావ.

(౬) అణువమూర్తి: బ. ౪౫; ప. (౧) ౧3౮, ౪౦౦; ఎణుమూర్తి బ. ౧3౪:

పశ్చిమచాలుక్యరాజయిన రెండోజగదేకమల్లుని (౧౧3౮-౫౦) కాలములో వీరపాండ్యదేవుని సేనానాయకుడయిన వీరపాండ్య-అణుక-పల్లవరాయ డొక డున్నాడు.

(౭) అన్నబెరసి: ప. (౨) ౮౫:

అనంతపురముజిల్లాలో ౯3౬ సంవత్సరప్రాంతమున అన్నయ్య అనే ఒకనొళంబరాజు రాజ్యముచేసినాడు. ఇతడు రాష్ట్రకూటరాజయిన మూడోకృష్ణునితో పోరి ౯౪౦ సం॥రములో ఓడిపోయినాడు.

(౮) అమరనీతి: ప (౨) ౮3:

చెంగల్పట్టుజిల్లా, సైదాపేటతాలూకా, తిరువొట్రియూరి లోని ఆదిపురీశ్వరాలయములోని ఒకశాసనములో గంగపల్లవవంశజు

డయిన కో-విజయకంప విక్రమవర్మకాలములో పల్లవదియరై యర్ అనే అపరనామముగల కంజరన్ - అమరనీది అనే శివయోగి దీక్షములకనుగాను బంగారము దానముచేసినట్లున్నది. ఇతడు తమిళ పెరియపురాణములో చెప్పబడిన అమరనీది అనే శివభక్తుడై ఉంటాడు.

(౯) అమరసింహుడు: ప (1) ౬౧౫:

సుప్రసిద్ధ నిఘంటుకారుడు. కాళిదాసుని సమకాలికు డంటారు గాని, ఇతడు పదకొండో శతాబ్దమువా డని విమర్శకు లభిప్రాయపడుతున్నారు.

(౧౦) అముగిదేవుడు; చిక్కలముగిదేవుడు: ప. (౨) ౮౭:

కాలచూరివంశమువాడు. మొదటి బిజ్జలుని తమ్ముడయిన 'రాజ' లేక 'రాజులు'ని తమ్మునికొడుకు. ౧౧౦౦ సం॥రము ప్రాంతమువాడు.

(౧౧) అరియమ: ప (౨) ౫౬; అరియమరాజయ్య: ప (౨) ౯౧; అరియమరాజు. బ. ౧౨౭, ౧౯౬, ౧౯౭; ప. (౧) ౫౪౩, ప (౨) ౧౪౬, ౩౪౭:

ఇతడు 'ఎరెయంగ' అయియుండవచ్చును. ఇతడు హొయ్సళ రాజయిన మొదటి బల్లాళుని(౧౧౦౦-౬?) తండ్రి. రాజ్యము చేయలేదు.

(౧౨) అల్లడదేవి ప (౨) ౩౭౮:

సాంతరరాజయిన కామదేవుని కూతురు. గంగవంశరాజయిన హొన్నయ్యను పెండ్లాడినది. ఈమె పేరు అళియాదేవి.

(౧౩) అహుతిమల్లిదేవయ్య: ప (౨) ౨౨౬:

ఇత డాహవమల్లుడై (౧౦౪౨-౧౦౬౮) ఉంటాడు. ఇతడు దీర్ఘజ్వరముతో బాధపడి, గొప్పశైవభక్తుడై తుంగభద్రలో పడి ప్రాణత్యాగముచేసినాడు.

(౧౪) ఇచ్ఛవంట సోయేద్దేవుడు: ప (౧) ౨౩౩:

బనవాసి ౧౨౦౦౦ లకు రాజయి 'హంగల్' లేక పానుగల్లు రాజధానిగాగల కదంబరాజు సోయిదేవుడు కాలచూరి బిజ్జలునికి సామంతుడు. ఇతని శాసనములు ౧౧౯౦ ప్రాంతములో ఉన్నవి.

కాలచూరి రాజయిన సోమేశ్వరునికి సోయిదేవుడని కూడా పేరు. ఇతనిశాసనములు ౧౧౭౨ ప్రాంతములో ఉన్నవి.

సోమేశ్వరు డనే పేరుగల రాజులు పశ్చిమచాళుక్యలలోను, హొయ్సళులలోనుకూడా ఉన్నారు.

(౧౫) ఇడువూరదేవడు ప (౧) ౮౯; ఇడుమారడను చోడనృపతి: ప (౧) ౫౯౮:

'ఇడుమార' అనేమాట 'ఇరుమడి' అనేదానికి తెనుగులో కలిగిన రూపమై ఉంటుంది. రాజేంద్రచోళదేవుడు (౧౦౫౫) తన పినతండ్రి అయిన గంగైకొండ చోళునికి ఇరుమడిచోడ బిరుదము నిచ్చినాడు.

ఇట్లే తనతమ్ముఁయిన ముమ్మడిచోళునికి చోళకొండ డని, ఉరైయూరు లేక కొళిరా జయిన వీరచోళునికి కరికాళచోళు డని, మదురాంతకునికి చోళగంగు డని బిరుదముల నిచ్చినాడు.

(౧౬) ఉడుతడి మహాదేవి: ప (౨) ౮౮:

ఈమె పిరుదిమహాదేవియర్ అనే నామాంతరము గల 'ఉదుత్తిరణ-అరుమొళి' అయి ఉంటుంది. ఈమె మొదటి రాజరాజదేవుని రాణి. (౯౮౫-౧౦౧౩.)

(౧౭) ఉద్భటుడు: ప (౨) ౮౮, ౨౧౬;

ఇంచుమించు తొమ్మిదో శతాబ్దములో అలంకార గ్రంథములను,

కుమారసంభవమును సంస్కృతమున రచించిన ఉద్భటు డొక డున్నాడు.

(౧౭) ఉరగరాయుడు : ప (౨) ౯౧:

ఇతడు ఉరైయూర్-చోళుడై ఉంటాడు. ఇతనికి కూరాళ్వార్ కట్టిదేవర్ అని మరి ఒక పేరు. ఇతని కూతురున్ను, రాజరాజ పట్టై సిద్ధరసు భార్యయున్ను అయిన ఇరుమడి శ్రియాదేవి కూడ్లో కుళోత్తుంగుని రాజ్యపు ముప్పైఆరో సం॥ రములో ఇచ్చిన దానపు శాసనము నెల్లూరుజిల్లా, గూడూరు తాలూకా, రెడ్డిపాలెము-ప్రాంగములో ఉన్నవి.

(౧౯) ఏకాంతరామయ్య : ప (౧) ౨౩౧, ౫౯౧; ప (౨) ౫౬, ౯౨, ౨౧౫,—

బొంబాయిరాజధాని, ధార్వారుజిల్లా, అబ్బలూరు గ్రామము లోని ౧౨౦౦ సం॥ ర ప్రాంతమునాటి శాసనములో ఏకాంత రామయ్యకును జైనులకును గలిగిన సంఘర్షణమును, దానిలో రామయ్య తన తలను కోసుకొని ఏడోనాడు తిరిగీ తలతో సజీవుడయి తన ప్రతిజ్ఞను నిర్వహించుకొన్న విషయమును చెప్పబడినది.

(౨౦) ఏణాదినాథుడు : ప (౧) ౧౮౩, ౮౦౯; ప (౨) ౭౩, ౩౮౪; బ. ౮౬, ౧౨౨, ౧౩౪ :

'ఏణాది మేఱ్కుడైయన్ పెరియనాయన్' లేక 'పొత్తపి రాయన్' అనేవాడు సుందరపాండ్యదేవుని పుణ్యముకోసము చేసిన దానము చెంగల్పట్టుజిల్లా, సైదాపేటతాలూకా, తిరువొట్రియూరిలో ఉన్నది.

(౨౧) కన్నబరసి : ప (౨) ౭౬ :

మొదటి బిజ్జలుని తమ్ముడయిన రాజలుని కొడుకు 'కన్నర'.

(౨౨) కాళిసెట్టి: ప (౨) ౧౧౪-౫:

నొళంబాధిరాజు క్రిందసామంతుడు. తలకాడును జయించినాడు. ఇతనికిని రాష్ట్రకూట రాజయిన బల్లహ నామముగల మూడో గోవిందునికిని యుద్ధము జరిగినది.

(౨౩) కాచిరాజయ్య: ప (౨) ౮౬.

ఇతడు పాండ్యరాజు (౬౭౫ సం||రము) అరికేసరి-పరాంకుశ-మారవర్మకు తండ్రి అయిన కోచ్చెడైయన్ అయిఉంటాడు.

(౨౪) కాళవ: ప (౨) ౮౪; కాళవ్వ. ప (౧) ౨౧౧, ౨౧౫; ప (౨) ౮౩, ౧౯౩; కుడుబెకాళవ్వ. ప (౧) ౨౧౩, ౨౩౨; సురజకాళవ్వ. బ. ౫౨, ౨౨౪, ౨౩౩.

హొయ్సళరాజయిన వినయాదిత్యుని (౧౦౪౦-౧౧౦౦) భార్య 'కలయబ్బె' ఒకతె ఉన్నది.

(౨౫) కూనపాండ్యుడు: ప (౧) ౫౯౪.

ఇతడు చారిత్రకపురుషుడు కాడని కొంతమంది అంటారు. కాని, ఇతని పేరుగల ఒకనాణెము దొరకినది. అరికేసరి-పరాంకుశ-మారవర్మయే (సుమారు ౭౦౦ సం||రము) ఇతడని నీలకంఠశాస్త్రిగారన్నారు. ఇతడు తిరుజ్ఞానసంబందర్, తిరుత్తొండర్ అనే శైవభక్తులకు సమకాలికుడు.

(౨౬) కొండగుడి కేశిరాజు:

ప (౧) ౨౩౩, ౨౫౫; ప (౨) ౧౦; ఇతడొక కన్నడకవి, శైవభక్తుడు. పడతురకంద, కొండగూళికేశిరాజయ్య వచనగళు అనే కన్నడగ్రంథములను వ్రాసినాడనిన్ని, ౧౧౬౦ ప్రాంతమునాడనిన్ని కర్ణాటకకవిచరిత్రకారులు చెప్పుతున్నారు. మైసూరురాజ్యములోని

శికారపురజిల్లా ౧౯౯,౧౩౩ శాసనముల ప్రకారము మీతడు బిజ్జలుని వద్ద దండనాయకుడై ప్రసిద్ధిపొందినట్లు తెలియవస్తున్నది. కాని, ఈవిషయ మాశాసనములో జనశ్రుతిగామాత్రము వివరింపబడి ఉన్నది.

(౨౬) గుగ్గులు కళియూరు: ప (౧) ౩౯౯; దీపదకళియూరు ప (౧) ౪౦౦; హావినహల్లి కల్లిదేవయ్య: ప (౨) ౧౪౨; చెంగల్పట్టు జిల్లా, సైదాపేటతాలూకా, తిరువొత్రియూరిలోని ఒకశాసనములో చోళరాజయిన త్రిభువనచక్రవర్తిరాజాధిరాజదేవుని కాలములో కళియన్-తండై-తిరునట్టపెరుమాళ్ (విక్కిరమ-శోళ-పడువూరాన్డాళ్వాన్) అనేవాడు ఆదిపురీశ్వరాలయమునకు కావలివాడుగా ఉండి, ఆలయమున కొకదానము చేసినట్లున్నది.

(౨౭) గొగ్గయ్య: బ. ౨౨౬; ప (౨) ౩౬౫.

మైసూరులోని పత్తిపొంబుచ్చ (నేటిహుమ్చ) రాజధానిగా రాజ్యముచేసిన సాంతరరాజులలో గొగ్గిగ లేక గొగ్గియ అనేవాడున్నాడు. ఇతడు రెండోతైలపుని (౧౦౬౬) తమ్ముడు.

(౨౮) గుండచక్రవర్తి: ప (౨) ౯౦; గుండయ్య. ప (౧) ౨౭౦; కుమ్మరగుండయ్య: బ. ౪౫-౬, ౬౭, ౧౨౦, ౧౩౯, ౨౦౫,౨౨౫; గుండయ్యప్రభువు: ప (౨) ౧౦; గుడ్డయ్య: ప(౨) ౯౩:

సాళువవంశములో ముగ్గురు గుండరాజు లున్నారు. కాని, వారికిని పైపురుషులుకున్ను సంబంధము లేదు. తూర్పు గాంగులలో ఇద్దరు గుండమరాజు లున్నారు. వీరిలో మొదటివాడు ౯౫౧ నుంచి ౯౫౭ వరకున్నూ, రెండోవాడు, ౧౧౦౧ నుంచి ౧౦౯౯ వరకున్ను రాజ్యము చేసినారు. కాని, వీ రిద్దరున్ను అంత ప్రసిద్ధులు

కారు. ఒకవేళ పండితారాధ్యచరిత్రములో పేర్కొనబడ్డగుండ చక్రవర్తి పై రెండోగుండనరాజై ఉంటే ఉండ వచ్చును. ఇతని తమ్ముడయిన ఆగోమధుకామార్ణవుడు వైదుంబవంశపు రాజకుమారి అయిన వినయమహాదేవిని పెండ్లాడినాడు.

౭౭౭ నుంచి ౯౧౭ వరకు గలకాలములో రాష్ట్రకూటుల దండనాయకు డయిన గుండయ్య ఒక డున్నాడు. ఇతనిని చాళుక్య భీముడు యుద్ధములో చంపినాడు.

(౩౦) గుడ్డలదేవి: బ. ౨౨౩; గుడ్డవ: ప (౨) ౫౬, ౭౬, ౩౪౪, గుడ్డవ్వ: ప (౧) ౧౮౯, ౧౫౦; ప (౨) ౨౮౬; బ. ౬౨, ౧౯౮, ౨౨౩-౮:

గుండాంబిక వెలనాటి చోడవంశమువాడయి, తూర్పు చాళుక్య రాజయిన మొదటి రాజరాజుకు దండనాయకుడుగా ఉండిన నన్ని భార్య ఒకతె ఉన్నది. మొదటి రాజేంద్రచోడుని (౧౦౧౫-౩౦) భార్య పేరు కూడా గుండాంబిక. గుడ్డవ్వ ఈమెయే అయిఉంటుంది.

(౩౧)గోయిదేవయ్య: ప (౨) ౯౩; (బండరువు) గోవింద ప్రెగడ: ప (౨) ౧౪౯, ౧౭౦, ౧౭౨, గోవిందభట్టారకుడు: జ. ౧౪౧; ప (౧) ౨౩౮, ప (౨) ౭౪, ౨౧౪:

రాయసాంతర బిరుదము గల గోయిందు (౧౦౯౬) మూడో తైలపుని తమ్ము డున్నాడు.

రాష్ట్రకూటరాజయిన మూడో గోవిందుడు సుప్రసిద్ధుడు.

(౩౨) చట్టయ్యగారు: ప (౨) ౯౧:

బళ్లారిజిల్లా హడగల్లితాలూకాలోని హూలలు అనేగ్రామము లోని ఒకశాసనములో చాలుక్యవిక్రమసం॥ ౨ రములో చట్టియయ్య అనేవాడు దేవాలయమునకు దానము చేసినట్లున్నది.

అదేతాలూకా మోరిగెరిగ్రామములో శక సం. ౯౬౭ (క్రీ. శ. ౧౦౪౫) నాటి పశ్చిమ చాలుక్యరాజు మొదటి సోమేశ్వరుని శాసనములో సామంతగరుడుని సామంతరాజయిన చట్టరసులేక ఘట్టియరసు అనేవాడు దేవాలయమునకు దానములు చేసినట్లున్నది.

(౩౩) చాదలదేవి: బ. ౨౩౩; ప (౨) ౪౯,౪౭౧:

మొదటి బళ్లాళుని (౧౧౦౦-౬) భార్య 'చవలాదేవి' అనే పేరికిది తెనుగురూపమేమో!

(౩౪) చావయ్య: బ. ౨౨౭; ప (౧) ౨౫౫, ౪౫౯, ౫౧౬.

నైజాము రాజ్యములోని ఎరంబరిగె (నేటియెల్బర్గా) రాజధానిగ ఏలిన సిందరాజవంశములోనివాడు. ఆచుగి తమ్ముడు. ౧౧౦౦ ప్రాంతమువాడు. 'చావ' అని యితని పేరు.

(౩౫) చాళుక్య భీమయ్య: ప (౨) ౯౧:

పశ్చిమచాళుక్యరాజులలో ౭౫౦ సం॥ర ప్రాంతములవాడు రెండో భీము డున్నాడు. తూర్పుచాలుక్యులలో ముగ్గురు భీము లున్నారు. మొదటితూర్పు చాలుక్యభీములలో ఒకడు ౭౭౭ నుంచి ౭౧౭ వరకు రాజ్యముచేసినాడు. ఇతనికి 'ద్రోహార్జున' అనేది బిరుదము. ఇతనినే రెండో భీము డంటారు. మరొక్క భీముడు మొదటి అమ్మరాజుకొడుకు, ౯౨౬-౭ సం॥ రములో ఎనిమిదినెలలుమాత్రము రాజ్యముచేసినాడు. సోమనాథుడు పేర్కొన్న చాళుక్య భీమయ్య ఇతడే అయిఉంటాడు.

దేవరసు: ప (౨) ౭౫, ౯౨:

(౩౬) నైజాముర్యాజములోని ఎరంబరగె (నేటి యెల్బర్గా)లో రాజ్యముచేసిన సిందవంశమువాడయిన 'దామ' లేక 'దావ' అనే పేరుగలవా డితడే అయిఉంటాడు.. ఇతడు సుమారు ౧౧౨౦ ప్రాంతమువాడు.

(౩౭) సాకయ్య: ప (౨) ౮౮—

ఎరంబరగెలో రాజ్యముచేసిన సిందవంశమువాడు. ఇతని పేరు 'సాక'; ౧౧౨౦ ప్రాంతమువాడు.

(౩౮) నిమ్మవ్వ: ప (౧) ౧౩౯, ౨౮౬, ౪౫౯, ౪౭౩; ప (౨) ౯౮, ౩౭౮.

విరాటదేశములోని తలైగ్రామవాసి అయిన ఇండళదేవుని భార్య నింబలాదేవి పరకేసరివర్మ మొదటి రాజేంద్రచోళదేవుని రాజ్యకాలములో (౧౩ సంవత్సరము) చెంగల్పట్టుజిల్లా, సైదాపేట తాలూకా, తిరువొట్రియూరిలోని ఆదిపురీశ్వరాలయములో ఒక దానశాసనము వేయించినది. తలైగ్రామ మనగా ధార్వాడుజిల్లాలోని హాంగల్లు లేక పానుగల్లు. నిమ్మవ్వ ఈమెయే అయిఉంటుంది.

(౩౯) మైలి(నేమది): ప (౨) ౨౧౬—

కాకతీయగణపతిదేవుని చెల్లెలు మైలాళమహాదేవి. ఈమెకు మేలాంబిక అని కూడా పేరున్నది. ఈమెయే సోమనాథుడు చెప్పిన మైలి అయితే అతనికాలమును రెండో ప్రతాపరుద్రునికాలము లోనికే తీసుకొని రావలసి ఉంటుందేమో!

(౪౦) పాండ్యనాయకుడు: ప (౨) ౮౪—

ఉచ్చంగి రాజధానిగా నొళంబవాడిని పరిపాలించిన పాండ్య రాజులలోని వీరపాండ్యుడో (౧౧౬౨), విజయపాండ్యుడో (౧౧౬౩–౮౩) అయిఉంటాడు.

(౪౧) బంకిదేవయ్య: ప (౨) ౧౩.

మైసూరురాజ్యము, నగరతాలూకాలో పట్టిపొంబుచ్చ లేక హుమ్చపట్టణములో రాజ్యముచేసిన ఆళుప (అళ్వ, అళువ) రాజు

లలో బంకిదేవు డొకడు ౧౩౦౩ సంవత్సరమునాటివా డున్నాడు. సోమనాథు డితనికి తాత తాత అయిఉంటాడు.

(౪౨) బల్లవరాయడు ప (౨) ౯౦; బల్లహుడు: బ ౪౬, ౫౧, ౧౦౧, ౧౨౩, ౧౮౧-౨, ౧౮౬, ౧౯౯; ప (౧) ౧౩౪, ౧౪౨; ప (౨) ౫౪, ౧౯౯, ౪౪౨, ౪౪౩, ౫౩౧.—

మూడో రాజేంద్రచోళునికి 'బల్లహ' అని బిరుద మున్నది.

(౪౩) బాచలదేవి: ప (౨) ౭౫, ౩౪౯; బైచలమాయి, ప (౨)౯౨:

బళ్లారిజిల్లా, హడగల్లితాలూకా, హిరేహడగళి గ్రామములోని ఒకశాసనములో విక్రమపాండ్యుడు తనభార్య బాచలదేవికిన్ని, కుమార్తె మహాదేవియరసికిన్ని పుణ్యముగా చేసిన దానమును గురించి ఉన్నది. శాసనకాలము శకసం. ౧౦౭౧ (క్రీ. శ. ౧౧౫౮.)

రెండో బల్లాళునిభార్య బైచలాదేవి మరి ఒకతె ఉన్నది. ఈమె క్రీ. శ. ౧౨౧౮ సంవత్సరమునాటిది. సోమనాథుడు చెప్పిన బాచలదేవి ఈమె అయిఉండదు.

(౪౪) బెజ్జమహాదేవి ప (౨) ౭౮;

నెల్లూరుజిల్లా, వెంకటగిరితాలూకా, చాపలపల్లిగ్రామములో శకసం. ౧౧౫౨ రమునాటి రెండు శాసనములలో యాదవరాయ భుజబలసిద్ధరసుభార్య బెజ్జదేవి దానము చేసినట్లున్నది.

(౪౫) బొంతాదేవి: ప (౨) ౯౩.—

పశ్చిమచాలుక్యరాజు నాలుగో విక్రమాదిత్యునిభార్య బొంతాదేవి. ఈమె చేదిరాజయిన లక్ష్మణుని కూతురు.

(౪౬) బొప్పలదేవి: ప (౨) ౭౫; బొప్పవ్వ: ప (౨) ౩౪౮:

మొదటి బల్లాళుని భార్యలలో ఒకతె అయిన బొప్పాదేవి ఈమెయే అయిఉంటుంది.

(౪౭) బొప్పయ్య: ప (౨) ౯౦, ౩౭౫.—

బళ్లారిజిల్లా, హడగల్లి తాలూకాలోని సోగి గ్రామములోని కల్లేశ్వరాలయములో ధవళచ్ఛత్రాధికారి అయిన బొప్పయదణ్ణాయకుని అనుమతిని కొన్ని దానములు చేయబడినవి. కాలము క్రీ. శ. ౧౧౬౬ సంవత్సరము.

కర్ణాటకశాసనసంపుటము VIII. Sb. ౩౪౬ లో సోయిదేవుని పూర్వులలో బొమ్మరాజు, అతనికొడుకు బొప్పరాజు ఉన్నారు. సోయిదేవుని కూతురు లచహలాదేవి ఒక బొప్పదేవుని పెండ్లాడినది. సోయిదేవుని శాసనములు ౧౧౬౦ సంవత్సరప్రాంతములలో కనబడుతున్నవి.

(౪౮) బ్రహ్మదేవయ్య (కన్నద): ప (౧) ౨౩౨; బ్రహ్మదేవయ్య (కిన్నర) ప (౧) ౨౩౦.—

మైసూరురాజ్యము, పత్తిపొంబుచ్చలో రాజ్యముచేసిన సాంతరప్రభువులలో ఇద్దరు బర్మ (బమ్మ) దేవు లున్నారు. రెండో బమ్మదేవుడు మొదటివాని అన్న అయిన రెండోవీరుని (బీరుగ) కొడుకు. ఇత డించుమించు ౧౧౦౦ సంవత్సరప్రాంతములో ఉండేవాడు.

(౪౯) భల్లట : ప (౩) ౧౦౪.

ఇతడు కాశ్మీరరాజయిన శంకరవర్మ (క్రీ. శ. ౮౮౪-౯౦౭) ఆస్థానములోనివాడు. ఇతనిపేరు మల్లభట్టనిన్ని భట్టమల్ల అనిన్ని కూడా ఉన్నట్లు తెలుస్తున్నది:

(౫౦) మల్హణ : ప (౧) ౩౫౮; (౨) ౪౩౨ —

ఇత డేకాలపువాడో తెలియదు. కల్హణ బిల్హణ జల్హణులవలె కాశ్మీరమువాడై ఉంటాడు. ఇతడున్ను క్రీ. శ. పదోశతాబ్దమునకు పూర్వుడే అయి ఉంటాడు.

(౫౧) మల్లిదేవుడు : ప (౨) ౯౯.

సిందవాడివంశమువాడు. చత్తరసుకొడుకు. ౧౧౫౦ సం॥ ర ప్రాంతమువాడు. అదేవంశమువా డొక మల్లిదేవు డున్నాడు. అతని శాసనములు ౧౧౭౮, ౧౧౯౫, ౧౨౦౦టి సం॥రముల నాటివి కనబడుతున్నవి.

(౫౨) మల్లిబొమ్మ, మొల్లెబ్రహ్మయ : ప (౨) ౧౨, ౧౯౦ ౧౯౯ :

మైసూరురాజ్యములో ఉత్తరమున నిడుగల్లు రాజధానిగా ఏలిన 'చోళమహారాజు' లున్నారు. వీరు కరికాలచోడుని వంశమువార మని చెప్పుకొన్నారు. వీరి కొరయూరిపురవరాధీశ్వర అని బిరుద మున్నది. పశ్చిమచాలుక్యరాజ్యమును కాలచూరిబిజ్జలుడు నాశనము చేసినప్పు డీ రాజులు స్వతంత్రు లయినారు. వీరిలో మల్లిదేవుడ నే రాజు శాసనములు ౧౧౬౮, ౧౧౬౯, ౧౧౮౬ సం॥రములనాటివి కనుబడుతున్నవి. ఇతనికొడుకు బ్రహ్మనృపాలుడు లేక బమ్మిదేవుడు. ఇతడే బిజ్జలుని చంపినవాడయి ఉంటాడు.

(౫౩) మాచిదేవ: ప (౧) ౨౪౪, ౨౪౯—

సిందవాడిరాజు. సిందవంశజుడు. రెండో చిత్తరసుకొడుకు ౧౧౩౦ సం॥ర ప్రాంతమువాడు-రాష్ట్రకూటరాజయిన మూడోకృష్ణునికి లోబడి బనవాసినేలిన ఒక మాచియరసున్నాడు. (౯-౩౭.)

(౫౪) మహాదేవి: ప (౧) ౪౬౩; మహాదేవియక్క : ప (౧) ౩౩౭;

" మాదేవి: ప (౧) ౪౫౯—

బళ్లారిజిల్లా, హడగల్లితాలూకా, హిరేహడగల్లి గ్రామములోని

భీమేశ్వర - దేవేశ్వరాలయములోని శాసనము, శక ౧౦౭౧ సం॥రము (క్రీ. శ. ౧౧౪౯)లో వీరపాండ్యదేవుని పినతండ్రి విక్రమపాండ్యుని కూతురు మహాదేవియరసి పేర్కొనబడినది.

చిత్తూరుజిల్లా, కాళహస్తితాలూకా, గుడిమల్లంగ్రామములోని పరశురామేశ్వరాలయములోని శాసనము, శక. ౭౨౦ సం॥రము (క్రీ. శ. ౭౯౮) లో బాణరాజయిన విజయాదిత్యమహాబలి బాణరాయని తల్లి మహాదేవి అడిగాళ్ పేర్కొనబడినది.

సిందవంశస్థుడు రెండో ఆచుగిభార్య మాదేవి (౧౧౨౨) ఒకతె ఉన్నది.

మైసూరురాజ్యములో నొళంబవాడినేలిన ఉచ్చంగి - పాండ్య రాజులలో ఇరుక్కపాలుని (క్రీ. శ. ౧౦౯౭) కూతురు మహాదేవి హొయ్సలరాజయిన ఎఱెయంగను వివాహమాడినది.

(౫౫) మాదవ్వ: ప (౨) ౩౪౮; మాదాంబ. ప (౧) ౨౦౭.

గుంటూరుజిల్లా, ఒంగోలుతాలూకా, కొప్పోలు గ్రామము లోని భీమేశ్వరాలయములో ఒకరాజు శక ౧౧౪౬ లో తనతల్లి మాదాంబకు పుణ్యముగా దానముచేసిన ట్లున్నది.

(౫౬) మారయ్య:

పశ్చిమగంగరాజు మూడో మారసింహుడు (౯౬౧-౯౭౪) ఇతడు జైనుడు. ౯౭౪ సంవత్సరములో ఇతడు సల్లేఖనముచేసి అర్హ తులలో చేరినాడు.

(౫౭) మైళిగ: ప (౨) ౭౫

కాలచురివంశస్థుడు, రెండో బల్లాళుని తమ్ముడయిన మైలుగియే ఇతడై ఉంటాడు.

(౫౮) రాచమల్లు: ప (౨) ౯౩—

ఇతడు సిందవాడినేలిన సిందరాజులలోని రెండో రాచమల్లుడై ౧౧౪౩, ౧౧౮౧ ఉంటాడు.

౮౪౪-౪౮ ప్రాంతమువాడు గంగరాజు రాచమల్లుడు, ౯౦౮ లో రేమియవద్ద యుద్ధముచేసిన గంగరాజు మరొక రాచమల్లుడున్నాడు.

౧౧౩౮ ప్రాంతములో సిందరాజయిన ఒకరాచమల్లుడు ఉన్నాడు. పశ్చిమచాళుక్యరాజులలో నలుగురు రాచమల్లులు ఉన్నారు. వీరిలో నాలుగోరాచమల్లుడు ౯౪౮ నుంచి ౧౦౦౮ వరకు రాజ్యముచేసినాడు. ఇతనిమంత్రి చాముండుడు శ్రవణబెళ్గొళలోని గొప్ప జినవిగ్రహమును ప్రతిష్ఠించినాడు.

(౫౯) వెలనాటిచోళ: ప (౧) ౫౦౮; ప (౨) ౧౮, ౫౪.—

ఇతడు రెండో రాజరాజచోళునికి లోబడి వెలనాటినేలిన రెండో రాజేంద్రచోళుడై ఉంటాడు. ౧౧౬౩ నుంచి ౧౧౮౦ వరకు ఇతని శాసనములు కనబడుతున్నవి. ఇతనితరువాత వెలనాటివంశము క్షీణించిపోయినది.

(౬౦) శాంతిదేవయ్య: ప (౨) ౩౪౪.—

ఇతడు సాంతరిరాజయిన సాంతెయదేవు (౧౧౮౯) డై ఉంటాడు.

(౬౧) శివకుమారయ్య: ప (౩) ౯౦, ౨౧౬.—

ఇతడు పశ్చిమచాళుక్యరాజయిన రెండో శివమారు (౮౦౫-౧౦) డై ఉంటాడు.

(౬౨) సంకయ్య: ప (౨) ౩౪౫—

కాలచూరివంశపు మొదటి బిజ్జలుని తమ్మునికొడుకు సొకసంకమడున్ను, రెండో బిజ్జలుని (౧౧౫౬—౬౭) కొడుకు సొకసంకము

డున్న ఉన్నారు. సోమనాథుడు పేర్కొన్న సంకయ్య పైవారిలో రెండోవాడయి ఉండవచ్చును—

(63) సాంతవ్వ: ప (2) 347—

హొయ్సళ రాజయిన మొదటి బల్లాళునితమ్ముడు విష్ణువర్ధనుని (1106–1141) భార్య సాంతలాదేవియే ఈమెయై ఉండవచ్చును—

((64) సింగణమంచి: ప (2) 532—

రెండో బిజ్జలుని కొడుకు సింగణ శాసనములు 1173, 1174 సం॥రములనాటి వున్నవి—

(65) సిరియక: ప (1) 27, సిరిదేవి: ప (2) 349-

రెండో బిజ్జలుని కూతురు సిరియాదేవి ఎరంబరగెరాజయిన యాదవవంశస్థుడు చాముండుని పెండ్లాడినది—

హుమ్చలో రాజ్యమేలిన సాంతరరాజవంశస్థుడు నన్నిరాజు (925) భార్య సిరియాదేవి ఒకతె ఉన్నది.

పొత్తపి రాజధానిగా నేలిన కొట్యదొన శాఖవారైన తెనుగు చోళులలోని కామునిభార్య శ్రీయాదేవి శాసనము 1134 నాటి దున్నది. ఈమె శాసనములు 1164 వరకు ఉన్నవి.

(66) సోయ్దేవుడు: ప (1) 233—

రెండోబిజ్జలునికొడుకు సోమేశ్వరుడు. ఇతనికి సోయిదేవ, సోయి, రాయమురారి, అనికూడా పేళ్లున్నవి. (1164–45) సోమనాథుడు పేర్కొన్నవా డితడై ఉండడు.

రెండో బిజ్జలునికి సామంతుడైన సాంతనృపుని కొడుకు సోయిదేవుడు (1161) హాంగలు (పానుగల్లు) రాజధానిగా రాజ్యము చేసినాడు.

(౬౭) సోమవ్వ : ప (౨) ౩౭౮—

పశ్చిమచాలుక్య రాజయిన రెండో బూతుగుని కూతురు సోమి దేవి (౯౬౧ ప్రాంతము) ఒకతె ఉన్నది.

పశ్చిమచాలుక్య రాజు మూడో జగదీశమల్లునికి లోబడి నొళంబవాడి నేలిన విజయపాండ్యుని (౧౧౬౩) తల్లి సోవలాదేవి ఒకతె ఉన్నది.

సిందరాజయిన మొదటి రాచమల్లునిభార్య సోవలాదేవి ఒకతె ఉన్నది. (౧౧౪౭.)

(౬౮) హలాయుధుడు : ప (౧) ౬౧౫.—

నిఘంటుకారుడు-రాష్ట్రకూట రాజయిన మూడో కృష్ణుని కాలమువాడు. (౯౪౦-౯౫౬.) ఇత డభిధానరత్నమాలను రచించి నాడు-కవిరహస్యమును రచించిన హలాయుధు డితడే అని కొంద రును, కాడని కొందరును అంటారు. అభిధానరత్నమాలాకారుడు పద కొండో శతాబ్దాంతమువా డని వీబరు అభిప్రాయము.

(౬౯) హేచవ్వ : ప (౨) ౩౭౮.—

హొయ్సలరాజు జగదేకమల్లబిరుదాంకితు డయిన మొదటి నరసింహుని (౧౧౪౧-౭౩) భార్య ఏచలాదేవి ఒకతె ఉన్నది.

సిందరాజయిన మొదటి రాచమల్లునికి సోమలాదేవివల్ల పుట్టిన ఇరుంగోలుని భార్య ఏచలాదేవి ఒకతె ఉన్నది. (౧౧౬౫ ప్రాం తము.)

(౭౦) హొన్నయ్య : ప (౧) ౩౯౨; ప (౨) ౮౬.—

సాంతరరాజయిన మూడో తైలపుని మనుమరాలు, కామ దేవుని కూతురు అళియాదేవి గంగవంశపు ప్రభువయిన హొన్నయను పెండ్లాడినది. (౧౧౬౧ ప్రాంతము.)

పైని చెప్పినవారున్ను చారిత్రకపురుషు లయి ఉంటా రనియే నా అభిప్రాయము. వీరందరున్ను చాలావరకు సుమారు ౧౧౦౦ నుంచి ౧౧౩౦ వరకు ఉన్నవారుగా కనబడుతున్నారు. తొమ్మిదో. శతాబ్దమునకు పూర్వమందున్న ఒక్క పేరున్ను పైవాటిలో కానరాదు. సోమనాథుడు తనకు సుమారు నూరు నూటయాభై సంవత్సరముల క్రిందట జరిగిన సంగతులను గురించి తెలుపుతున్నాడని ఇందువల్ల స్పష్ట మవుతున్నది. కాని, జనుల వ్యవహారములో ఆ యా పేళ్ల స్వరూపము కొంతవరకు మారినది. చారిత్రకముగ పౌర్వాపౌర్వ్యము లేక అన్ని పేళ్లును గుదిగ్రుచ్చబడినవి. అంతమాత్రముచేత అవి చారిత్రకవిషయములు కా వని కొట్టివేయరాదు. సోమనాథుడు శాస్త్రీయమయిన చరిత్రమును వ్రాయ సంకల్పించలేదు. అతడు వ్రాసినది కావ్యము. ఆకావ్యము వీరశైవ వ్యాప్తి కుపకరించవలె నని ఆతని ఉద్దేశము. అతని కాలమునాటికి సహజముగా ఆయావిషయములగూర్చిన జ్ఞానము విస్తరింపబడుతూ ఉన్నది. మతావేశమూలమున ఆయావ్యక్తుల కతిమానుషములు, అద్భుతములు నయిన చర్య లంటగట్టబడినవి. అట్టి అద్భుతములు జరిగి ఉండునా అని నేటి భౌతికచక్షువులతో మనము సందేహించడములో ఆశ్చర్యములేదు. కాని, యిప్పుడుకూడా ఈదేశములో వ్యక్తులను గూర్చిన అద్భుతవృత్తాంతము లెంతశీఘ్రముగా వ్యాపిస్తున్నవో ఆలోచిస్తే, ఆకాలములో జను లాయా అద్భుతకార్యములను సంపూర్ణముగా విశ్వసించి ఉండడములో అబ్బుర మేమిన్ని లేదు.

కాని, ఇంతమంది చారిత్రకవ్యక్తుల పేళ్లు మనకు కనబడుతూ ఉండగా, ఆ వ్యక్తుల కందరికిన్ని కేంద్రమం దుండెనని చెప్పబడిన ప్రధానపురుషుడైన బసవేశ్వరుడు నిరాకారుడై మనకుచిక్కకుండడమే అద్భుతములలో అద్భుతము. బసవేశ్వరునిపే రుదాహరింపబడిన ఒక్క

శాసనమున్ను కానరాదు. బలదేవదండనాయకుని శాసనము కానరాదు. చెన్నబసవనిగురించి ఏమిన్ని తెలియదు. పండితారాధ్యుఁడు, బెడ్దేవి వేమనారాధ్యులు మొదలయిన అనేకశైవభక్తులచరిత్ర తెలియరాదు. వారినిగురించి తెలుసుకొనడానికి తరువాత చాలాకాలమునకు రచింపబడిన వీరశైవగ్రంథములే ప్రమాణములుగా నున్నవి. ఈగ్రంథములు రచింపబడేసరి కాయా పురుషులు పురాణపురుషులై, అనేకమాహాత్మ్యములతో కూడిన కథలలో చేరిపోయినారు. తుద కాపురుషులు నిజమైనవారేనా, ఎప్పుడైనా జీవించిఉన్నారా అన్న సంశయావస్థకు వచ్చినారు. ఒకబసవణదండనాయకుని పేరుగల శాసనము బళ్లారిజిల్లా బళ్లారితాలూకా, ఒరువాయి(వోరవాయి)గ్రామములోఉన్నది. (ఎపి. రిపోర్టు ౧౯౦౪ సం. ౭౮ రు) అది లిఖింపబడినశిల ఆఊరిలోని జెణకప్పఆలయము గర్భగుడిద్వారమునకు కుడిప్రక్క నిలువబెట్టబడి ఉన్నది. దాని కొకప్రక్క కురుగోడులో రాజ్యముచేస్తూఉన్న సిందవంశస్థుడయిన ఇమ్మడి రాచమల్లుని కాలములో ఆనందసంవత్సరములో ఆ విఘ్నేశ్వరాలయము కట్టబడినట్లు తెలిపే ఒకశిలాశాసనమున్నది. శిలకు వెనుకభాగమున హొయ్సళవీరబల్లాళుని దండనాయకుడయిన బసవణ ఈశ్వరసంవత్సరములో ఒకదానముచేసిన వృత్తాంతము చెప్పబడినది. కురుగోడులో రాజ్యముచేసిన సిందవంశమువారిలో ఇద్దరు రాచమల్లు లున్నారు. ఒకడు 'పిరియ' రాచమల్లుడు. ఇతనిశాసనములు ౧౧౪౧, ౧౧౪౭ సంవత్సరములలోనివి దొరకినవి. రెండోరాచమల్లు డీతని మనుమడు, ఇరుంగోళుని కొడుకు; ఇతని శాసనములు ౧౧౭౩, ౧౧౮౧ సం॥రములనాటి వున్నవి. శిలవెనుకనున్న శాసనములోని వీరబల్లాళు డెవడై ఉంటాడు? హొయ్సళవంశస్థులు ముగ్గురుబల్లాళు లున్నారు. వీరిలో మూడోవాడు ౧౨౯౧ సం॥రములో పట్టాభిషిక్తుడై ౧౩౪౨ సం॥రములో మర

ణించినాడు. శాసనములోని వీరబల్లాళుడితడయితే శాసనములోని బసవణదండనాయకుడు బసవేశ్వరుడు కాజాలడు. మొదటి బల్లాళుడు ౧౧౦౦-౧౧౦౬ సం||రములమధ్య రాజ్యముచేసినాడు. ఇతడు దోర సముద్రమనేపేరుగల హళేబీడు రాజధానిగా ఏలిన మైసూరురాజ్యమును విడిచి బళ్లారివరకు జయించినట్లు కానరాదు. ఇక రెండో బల్లాళుడు ౧౧౭౩ సం||రములో పట్టాభిషిక్తుడయినాడు, ౧౨౨౦ సం||ర ప్రాంతములలో చనిపోయినాడు. ౧౧౮౩ సం||రములో కాలచురి రాజ్యములోని కొన్ని ప్రదేశములను జయించినాడు. శాసనములోని బల్లాళుడు మొదటి బల్లాళుడయితే రెండో బిజ్జలుని దండనాయకుడని చెప్పబడే బసవేశ్వరుని కాలమునాడు కాడు. రెండో బల్లాళుడయితే బళ్లారిమండలమూ కాలములో బిజ్జలుని రాజ్యములో ఉండేదా అనే ప్రశ్న కలుగుతుంది. బళ్లారి గెజటీరును వ్రాసినవారు బళ్లారిలోని కోటను కాలచురి బిజ్జలుడు కట్టించినాడని వ్రాసినారు. కాలచురిరాజయిన శంఖవర్మ కాలములో శక ౧౦౯౯ (క్రీ. శ. ౧౧౭౭) హేమలంబసంవత్సరములో సింహవంశస్థుడయిన రాచమల్లుడు చేసిన దానశాసన మొకటి బళ్లారితాలూకా కురుగోడుగ్రామములో ఉన్నది. రెండో బిజ్జలుని కొడుకయిన సంకమరాజునకు 'శంఖవర్ణ' అనికూడా పేరున్నదికాని 'శంఖవర్మ' అని పేరులేదు– అది శాసనలేఖకుని తప్పయి ఉంటుంది- రాచమల్లుడు సంకముని అన్న అయిన సోయిదేవునకు సోయి, రాయమురారి, అనే పేర్లు గల సోమేశ్వరుని (౧౧౬౭-౭౫) కి సామంతరాజుగా ఉండేవాడని తెలుస్తున్నది. అతడు సంకముని (౧౧౭౫-౧౧౮౦) క్రిందకూడా సామంతుడై ఉన్నాడని పైశాసనము తెలుపుతున్నది. రాచమల్లుని శాసనము ౧౧౮౧ లోనిది ఉన్నదికాబట్టి ౧౧౯౧లో రాజ్యమునకువచ్చిన రెండో వీరబల్లాళుడు రాచమల్లుని జయించి బళ్లారి మండలములో

హొయ్సళరాజ్యమును స్థాపించి ఉంటాడని అనుకోవలెను. అయితే, బసవేశ్వరుడు బిజ్జలునివద్ద కనతికాలములోనే లింగైక్యము పొందినాడు కాబట్టిన్ని, బిజ్జలుడు ౧౧౬౭లో చనిపోయినాడు కాబట్టిన్ని, బసవేశ్వరుడు ౧౧౬౮ లో లింగైక్యము పొంది ఉంటాడని చరిత్రకారు లంటున్నారు. పై ఒరువాయిశాసనములోని బసవణదండనాయకుడు బసవేశ్వరుడే అని మనమనుకొంటే బసవేశ్వరుడు ౧౧౬౮ లో లింగైక్యమును పొందలేదనిన్ని, హొయ్సళరాజులవద్ద చేరి కాలచురివంశనాశనమునకు తోడ్పడినాడనిన్ని నిశ్చయించ వచ్చును. బసవేశ్వరుడు లింగైక్యము నొందిన కాలము ౧౨౧౭ నకు తరువాతనయి ఉంటుంది. బసవేశ్వరుడు బిజ్జలుని కొడుకయిన సోమేశ్వరునికి భయపడి పారిపోయి కొంతకాలమువరకు ప్రచ్ఛన్నముగా ఉండడముచేత ఆతడు చనిపోయినాడన్న వదంతి కాలచురిరాజ్యములో ప్రబలిఉంటుంది. కాని, బసవేశ్వరుడు కాలచురిరాజ్యము సంపూర్ణముగా నశించినతరువాత మరి 33 ఏండ్లు బ్రతికిఉన్నాడని చెప్పవచ్చును. కాలచురిరాజులలో కడపటివాడు సింగణుడు. ఇతని తుదిశాసనము ౧౧౮౪ సంవత్సరములోనిదున్నది. ఆ తరువాత బిజ్జలుని వంశము పేరు వినబడదు.

బసవేశ్వరుడు బిజ్జలుని కొలువున చేరేసరికి ౨౫-౩౦ సంవత్సరముల వయసువాడయితే ఆతడు లింగైక్య మందేసరికి ౮౫ సంవత్సరముల వృద్ధయి ఉంటాడు. బసవడు బిజ్జలుని మంత్రిగా ఉన్నప్పుడు పిన్నవయసువాడే అని చెప్పడానికి బసవపురాణములోని (పుట. ౧౫౫.)

"శివభక్తుఁ డని విశ్వసించుట య్మెల్ల
వఱితిపాలుగఁ జేసెఁ, జిఱుతవాఁ డనక
యఱలేక మన్నించు టంతయుఁ గంటి"

అని బిజ్జలు డన్న మాటలవల్ల స్పష్టమవుతుంది.

బిజ్జలునికిని బసవేశ్వరునికిని గల సంబంధము బిజ్జలుని శాసనము లలో కనబడదు. అంతమాత్రముచేత బిజ్జలుని కొలువులో బసవేశ్వరు డుండడెనా అని సందేహింప వీలులేదు. పైశాసనముప్రకారము బసవణదండనాయకుడు బిజ్జలునికాలమువా డని స్థిర మవుతున్నది. బసవేశ్వరునికి కల్యాణకటకములో సమకాలికులని వీరశైవగ్రంథము లన్నీ ఏకకంఠముతో చెప్పుతూఉన్న వ్యక్తులలో అనేకులు చారిత్రక పురుషులే అయిఉంటారని పైని చూపినాను. అయితే, బిజ్జలుని కాలములో బసవనిపేరు ప్రసిద్ధముగా శాసనములలో కనబడకపోవడ మునకు కారణ మేమై ఉంటుంది? దానిని తెలుసుకొనడానికి బిజ్జలుని కాలమునాటి చారిత్రక పరిస్థితులను స్మరింపవలెను.

బిజ్జలుని తండ్రి పేర్మాడి పశ్చిమచాళుక్యుడయిన మూడో సోమేశ్వర భూలోకమల్లుని క్రింద బీజపూరు చుట్టుపట్లప్రదేశమయిన తార్దవాడిసహస్రమునకు మహామండలేశ్వరుడుగా ఉండేవాడు. బిజ్జలుడు తండ్రి అనంతరము మహామండలేశ్వరుడై రెండో జగదేక మల్లునికి (౧౧౩౮-౫౯) లోబడి ప్రఖ్యాతికి వచ్చినాడు. ఆకాల ములో హొయ్సళులు గంగవాడి నాక్రమించుకొన్నారు. వారు బనవాసిని నొళంబవాడిని ఆక్రమించుకోజూచినారు. వారి ప్రయత్న ములు సాగకుండా ఒకప్రక్క పశ్చిమచాళుక్య చక్రవర్తియున్నూ, ఒకప్రక్క అతని మహామండలేశ్వరులున్నూ కాచుకోవలసివచ్చినది.

కాని, వీరి అందరికిన్ని చోళుల ఒత్తిడి ఎక్కువ అయినది. ఇట్లుండగా బిజ్జలునికిలోబడి నొళంబవాడి నేలుతూఉన్న పాండ్య రాజులు ప్రబలుతూ వచ్చినారు. ఇట్లాయూ వంశములవా రధికా రముకోసము పెనగులాడుతూఉండిన సమయములో బిజ్జలుడు పశ్చిమ

చాళుక్యచక్రవర్తికి బాసటదై నిలిచి, తన శక్తిసామర్థ్యములను చూపి, చాళుక్యసామ్రాజ్యమునకు భంగము కలుగకుండా దక్షిణదేశమును సామ్రాజ్యములో నిలిపినాడు. ఇంతలోగా ఉత్తరమున కాకతీయులు ప్రబలుతాతూ వచ్చినారు. ప్రోలరాజు ౧౧౫౮ లో పశ్చిమచాళుక్యుల నోడించినాడు. వారినుండి ఉపద్రవము కలుగకుండా చేయడానికి బిజ్జలుడు చక్రవర్తికి సహాయపడినాడు. కాని, సామ్రాజ్యములో అంతఃకలహము లారంభ మయినవి. దేశములోని పరిస్థితులను గమనించి మహామండలేశ్వరులు స్వతంత్రులు కావడమునకు ప్రయత్నిస్తున్నారు. ఇంతలో విక్రమాదిత్యుడు మృతి పొందినాడు. ఇట్టిపరిస్థితులలో దక్షిణమునుంచి హొయ్సళులఒత్తిడిని ఉత్తరమునుంచి కాకతీయుల ఒత్తిడిని అరికట్టి సామ్రాజ్యమును సంరక్షించడానికి బిజ్జలుడు తాను చేసిన ప్రయత్నములవల్ల గొప్పప్రసిద్ధిని పొందినాడు. అతని శక్తిసామర్థ్యములను గుర్తించి తక్కిన మహామండలేశ్వరు లతనికి లోబడినారు. సామ్రాజ్యమును సరిగా పాలించడమునకు తగినవాడు లేకపోవడముచేత బిజ్జలుడే చక్రవర్తి పదవి నాక్రమించినాడు. ఇది అన్యాయాక్రమణ మని చరిత్రకారు లంటారు కాని, అప్పటి పరిస్థితులలో దేశము ఛిన్నాభిన్నము కాకుండా ఉండడానికి మరొకమార్గము లేకుండాపోయినది. బిజ్జలుడు కాలచురివంశమువా డయినా, చాలుక్యవంశమువాడుగనే బసవపురాణములో చెప్పబడి ఉండడమునుబట్టి చూస్తే అతడు చాలుక్య సామ్రాజ్యము నిలుపవలె ననే ఉద్దేశముతోనే సామ్రాజ్యమునకు పట్టము కట్టుకొన్నాడని తెలుసుకొనవచ్చును.

బిజ్జలుడు చక్రవర్తి కాగానే సామ్రాజ్యకోశము నభివృద్ధి చేయడానికి పూనుకొన్నాడు. ఆకార్యమునకు కళ్యపు డసేవానిని మంత్రిగాను కోశాధ్యక్షునిగాను నియమించినాడు. అతని అనుజ్ఞకు

లోబడి బమ్మరసు బనవాసెనాటిలో మహామండలేశ్వరుడుగా ఉండే వాడు.

కళ్యపు డైదుగురు కరణములను నియమించినాడు. శ్రీధర నాయకుడు, అచణనాయకుడు, చట్టిమయ్యనాయకుడు, మల్లియణ నాయకుడు, తిక్కమయ్యనాయకుడు అని వారి పేళ్లు. "వీ రైదు గురున్ను బిజ్జలునికి పంచేంద్రియములవలె ఉండేవారు. వీరు దయా మయులు, సముద్రగంభీరులు, అసదృశామాత్యకార్యధురీణులు, సింహధైర్యులు, మోసములను కనుగొనడములో అసమానులు, అజాత శత్రులు. తూర్యముల మ్రోతవలె వారికీర్తి దిగంతములకు వ్యాపించి నది. వీరందరున్ను అగణ్యపుణ్యశీలులై, నిరుపమాన శివభక్తులై ఉండేవారు," అని ఒక శాసనములో వ్రాయబడి ఉన్నది. (ఎపిగ్రా ఫియా కర్నాటికా, ఏడో సంపుటము, షికార్‌పూరు శాసనము నం ౭ ౮) బిజ్జలుడు బళ్గాంవెలో విడిసిఉండగా కళ్యపనాయకుని కోరికపైని గౌతమాచార్యుని శిష్యుడయిన వామశక్తిమునీశ్వరాచార్యు డధ్యక్షుడుగా ఉన్న దక్షిణకేదారేశ్వరాలయమునకు చేరిన మఠము నకు చాలా దానములు చేసినట్లు ఆశాసనమే చెప్పుతున్నది.

బిజ్జలుని కోశాధ్యక్షుడు బండారు బసవన్న అని వీరశైవగ్రంథ ములు చెప్పుతున్నవి. బసవన్న శైవభక్తుల కెంతధనము పంచిపెట్టినా కోశాగారము నిండుగా ఉండేదనిన్ని, తనమీద ఎంద రెంత చెప్పినా, తన మహిమచేత కోశమున కట్టిలోపమును కలుగకుండా రాజుకు బసవన్న చూపుతూఉండేవా డనిన్ని గ్రంథము లన్నీ చెప్పుతున్నవి. కళ్యపుడే బసవేశ్వరుడై ఉంటాడా అని సందేహము కలుగుతున్నది. అయితే అయిఉండవచ్చును.

ఎపిగ్రాఫియా ఇండికా, అయిదో సంపుటము (౧౮౯౮-౯౯) లో బొంబాయిరాజధాని, బిజాపూరు జిల్లాలో బసవనిజన్మస్థల మని

శైవగ్రంథములు చెప్పే బాగేవాడికి వాయవ్యముగా పదకొండు మైళ్లదూరములో ఉన్న మనగోలిఅనే గ్రామములోని ఒకగోడలో చేర్చబడిన శాసనము గల ఒక శిల ఉన్నది. అది బిజ్జలుని రాజ్యకాలములో ఆరోసంవత్సరము క్రీ. శ. ౧౧౬౧ సం॥రమునాటిది. దానిలో బసవడు లేక బసవయ్య అనేవాడా దేవాలయమును కట్టించినవాడని ఉన్నది. దానిలోనే మాదిరాజనేవాడా గ్రామమునకు మహాప్రభువని కూడా చెప్పబడిఉన్నది. దానిలో ఆలయనిర్మాత అయిన బసవని గురించి ఉన్న వృత్తాంత మిది:—మనిగవల్లి ఏనూరిలో కశ్యపగోత్రాబ్ధి చంద్రుడయిన గోవర్ధను డుండేవాడు. అతని కొడుకు రేవదాసు. రేవదాసుకు నలుగురు కొడుకులు. వారిలో కడపటివాడు మహాప్రఖ్యాతి వహించిన చంద్రమసుడు. అతని కొడుకు బసవడు. అతడు సాటిలేని మహేశ్వరభక్తుడు. ఆ బసవభాస్కరునివల్ల మనిగవల్లిలోని ఏనూరు బ్రాహ్మణుల హృదయాబ్జములును వికసించినవి. ప్రపంచ మంతా అతనికి 'తండ్రీ' అని ఫాలములమీద దోసిలొగ్గి నమస్కరించడముచేత అతడు లోకపిత అయినాడు. "మూడు వేదముల సార మితడే; ఆద్యంతరహితు డితడే; జ్యోతిర్లింగస్వరూపు డితడే" అని అందరున్ను జయపెట్టుతూ ఉండగా అతడు మనిగవల్లికి కీర్తిప్రతిష్ఠలను తెచ్చినాడు;—అని.

ఇక ఆ శాసనములోనే మాదిరాజునుగురించిన వృత్తాంత మిది:-చాలుక్యరాజయిన తైలుని (రెండో తైలపుడు) వంశములో మాధవుడు పుట్టినాడు. అతడు మనిగవల్లి గ్రామమునకు మహాప్రభువు, ప్రఖ్యాత హారితగోత్రమునకు విష్ణువువంటివాడు,—అని. ఈ మాధవుడే శాసనములో మాదిరాజనికూడా పేర్కొనబడినాడు.

ఈ శాసనము బసవనికాలమునాటిది కాబట్టి విశ్వాసపాత్రమని చెప్పవలెను. కాని, బసవనిది కాశ్యపగోత్రమనిన్ని, అతని

తండ్రి మాదిరాజుది హారీతగోత్ర మనిన్ని ఉన్నది. బసవడు మాది రాజుకొడుకు కాడు; చంద్రమసుని కొడుకు. మరొక్కచిక్కు- బసవడు బ్రాహ్మణమతమును ధిక్కరించినా డని వీరశైవపురాణములు చెప్పతూఉంటే ఈశాసనము మనిగవల్లిలోని ఏనూర్గురు బ్రాహ్మణుల హృదయాబ్జములకున్ను అతడు సూర్యునివలె ఉన్నాడని చెప్పు తున్నది.

పైశాసనములోని విషయములే సత్యములు కావచ్చును. రాను రాను జనశ్రుతిలో తార్మారులు కలిగిఉండవచ్చును. మనిగోలి శాసనము లోని కాశ్యపగోత్రజుడైన బసవడు షికార్ పూరు శాసనములో కశ్యపు డని వ్యవహరింపబడ్డాడని నా అభిప్రాయము. జనశ్రుతిలో మనిగవల్లి మహాప్రభువైన మాదిరాజు బసవనికి తండ్రి అయినాడు. షికారు పూరుశాసనములోని 'బెళగాంవె' గ్రామమే 'బెలిదేవి' గాను, వీర శైవగాథలలో మారి ఉండవచ్చు నని అనుకొనడానికి అవకాశ మున్నది. కశ్యపుడు (బసవేశ్వరుడు) నియమించిన అయిదుగురు కరణములలోను ఇద్దరి పేళ్లుకూడా బసవని సమకాలికులుగా వీరశైవ గ్రంథములలో చెప్పబడ్డ ఇద్దరు శైవభక్తులవిగా ఉన్నవి. చట్టి మయ్యనాయకుడు చట్టయ్యగారు [ప (2) 91] గాను, మల్లియణ నాయకుడే అమాత్య మల్లయ్య [ప (2) 91] గాను పరిణమించి ఉంటారు.

పైదానినిబట్టి బండారు బసవన్న బిజ్జలుని కోశాధ్యక్షుడుగా ఉన్నా డన్న విషయ మంత సులభముగా తోసివేయదగినది కాదని చెప్పవచ్చునుఅతడు.పరమశైవుడు. శివభక్తులు, శివాలయములు అంటే అతనికభిమాన మెక్కువ. అందుచేతనే పరమశైవులనే కరణములుగా ఏర్పాటు చేసినాడు. వారు రాజుకోశాగారము నెప్పటికప్పుడు నింపుతూ ఉండేవారు. మొదట గుప్తముగా శివభక్తులకు చేస్తూ

ఉండినదానములు నానాటికిన్ని బహిరంగము లయినవి. దానముల కోసము కల్యాణకటకమునకు వచ్చే జంగములసంఖ్య అమిత మయి పోయినది. తక్కిన మతములవారికి బసవన్న ప్రవర్తనము సహింప రానిదైనది. బిజ్జలుడు శైవమతద్వేషి కాడు. బిజ్జలరాయచరిత్రము మొదలైన వీరశైవగ్రంథములలో చెప్పబడిన ట్లతడు జైనుడును కాడు. అత డన్ని మతములయెడలను సమబుద్ధి కలిగి, అన్నిమతముల వారి దేవాలయములకును సమానముగా దానములు చేసినా డని అతని శాసనములు ఘంటాఘోషముగా చాటుతున్నవి. ప్రజ లేమతమువా రయినా వారి నందరి నొకటేవిధముగా ఆదరిస్తేనే కాని, రాజ్య మునకు క్షేమముకాదని అతని అభిప్రాయము. కాని, బసవన్న కేవలము శైవమత పక్షపాతియై, ధనమును శైవభక్తులకే ఎట్టి ఆటం కమును లేక పంచిపెట్టుతూ, ఇతరమతస్థులను సరిగా చూడకపోవ డము బిజ్జలుని కసహ్యమయి బసవేశ్వరుని నిరోధించి ఉంటాడు. ఇదే రాజుకున్ను మంత్రికిన్ని గలిగిన వైరమునకు ముఖ్యకారణము. ఇట్లు కనకవిషయములోనే కాక కాంతావిషయములోను వీరిద్దరికిన్ని మనస్సర్ధ లేర్పడిఉంటవి. బసవని చెల్లెలిని బిజ్జలుడు పెండ్లాడినా డని జైనగ్రంథములు, బిజ్జలునిచెల్లెలు గుర్రాలకాపరితో వ్యభిచరిం చిన దని వీరశైవగ్రంథములు చెప్పిన విషయములను బట్టి బిజ్జలుని మృతికి స్త్రీవాంఛకు సంబంధించిన దేదోకారణమై ఉంటుం దని ఊహించవచ్చును.

బసవని గురించి ఇక చాలును. బసవని మహిమలు దేశములో వ్యాపింపసాగినవి. బసవనిపేర ఊళ్లు లేచినవి. పిల్లలకు బసవని పేళ్లు పెట్టుకోజొచ్చినారు. మరికొంతకాలానకు బసవేశ్వరాలయ ములు కూడా లేచినవి. బసవని గురించి గీతములు, బసవవర్ణనలు, బసవరగడలు, బసవసూక్తములు రచింపబడినవి; జనుల నాలుకల

మీద తాండవింప నారంభించినవి. పాల్కురికి సోమనాథునికాల మునకే, అనగా, బసవేశ్వరుడు లింగైక్యము పొందిన ఏభై ఏండ్ల లోపుగానే ఇది అంతా జరిగినది. బసవనికి సమకాలికుడుగా పాల్కురికి సోమనాథుడు వర్ణించిన పండితారాధ్యుడే బసవని మహిమను గురించి తన శివతత్త్వసారములో ఉగ్గడించినాడు.

బసవేశ్వరుడు కన్నడములో షట్‌స్థలవచన, కాలజ్ఞానవచన, మంత్రగోప్య, అనే గ్రంథములను రచించినాడట. ఈ రెండున్ను వచనరూపమున ఉన్నవి. ఈతని వచనరచనాస్వరూపమును తెలుపడానికి రెండు మా ఉదాహరణములు:—

## షట్‌స్థలవచన

"నరె కెన్నెగె, తెర గల్లకె శరీరగూడ వగదమున్న;
హల్లు హోగి, బెన్ను బాగి, అన్యరిగె హంగాగదమున్న;
కాలు మేలె కయ్యా నూరి కోల హిడియదమున్న;
ముప్పిం దొప్ప వళియదమున్న; మృత్యు ముట్టదమున్న;
పూజిసు నమ్మ కూడలి సంగమదేవరా."

నర చెంపకు, తరి గల్లమునకు, శరీరము గూడుకాకమున్న; పల్లు త్రుంగి, వెన్ను వంగి, యన్యులకు హంగు కాకమున్న; కాలి మీఁద చేతిమీఁది కోల పిడికిలింపకమున్న; ముప్పుచే నొప్పుడఁగకమున్న; మృత్యువు ముట్టకమున్న; పూజించు మన కూడలి సంగమ దేవరను.

"ఉళ్లవరు శివాలయ మాడిసీయరు; నా నేమాడవె బడవనయ్యా; ఎన్న కాలే కంభ, దేహవే దేగుల, శిర హొన్నకళస, నోడయ్యా; కూడలి సంగమదేవయ్యా, కేళయ్యా, స్థావర క్కాడి వుంటు జంగమ క్కాడివుంటె?"

కలవారు శివాలయమును కట్టింతురు; నే నేమి కట్టింపఁగలను, బడవఁడను? నా కాలే కంబము, దేహమే దేవళము, శిరము పొం

గలళము, చూడవయ్యా; కూడల సంగమదేవయ్యా, వినవయ్యా, స్థావర మున కడఁగుట యుండు, జంగమమున కడఁగుట యుండునే?

"జాతివిడిదు సూతకవ నరసువరె? జ్యోతివిడిదు కత్తలెయ నరసువరె? ఇదేతకొ మరుళు, మానవా? జాతియల్లి అధికవెంబె విప్రశతకోటియొళిద్దల్లి ఫలవేను, భక్తశిఖామణి యెందుదు వచన నమ్మ కూడల సంగన శరణర పరుషవ నంబు, కెడబేడ మనుజ!"

జాతి విడిచి సూతకము నరయుదురె? జ్యోతి విడిచి చీకటి నరయుదురె? ఇదేటికో మరులు, మానవా! జాతిలో అధికమంటే, విప్రశతకోటిలోనుండి ఫలమేమి? భక్తశిఖామణి యనియెడి వచనమును మన కూడల సంగని శరణుల పరుసను నమ్ము, చెడిపోకు మనుజా!

కాలజ్ఞానవచన

"సృష్టియొళిరుతిహా భ్రష్టమనుషరు ఎల్ల; కెట్ట పాపవు హారివుదకె హొట్టి హోటిసి, ఘట్టి యుడిసువ దక్కె శివబిట్టు కళహువను మారియను; మళెయిల్ల, కెఱెయిల్ల, నెలవిల్ల, ఉదక మున్నిల్ల, మొళెయిల్ల, సూర్యనకళెయిల్ల, గెలవిల్ల, ఉడివిల్ల ఆపాపిగళిగె."

సృష్టిలో నున్నవారెల్ల భ్రష్ట మనుష్యులు; చెడ్డ పాపము తొలఁగ పొట్టు నెగురగొట్టి; గట్టిపోకుండుటకు శివుడు విడిచిపంపును మారిని; వాన లేదు, పంటలేదు, చెఱువు లేదు, నీడలేదు, నీరు మున్నే లేదు, మొలకలేదు, సూర్యుని కళ లేదు, గెలుపులేదు, రక్షణ లేదు, ఆ పాపులకు.

బసవనికి సమకాలికు లని వీరశైవ గ్రంథములలో పేర్కొనబడ్డ అనేకుల విషయమును గురించి యింతకుముందు తెలిపినాను. ఇంకా కొంతమందిని గురించి శాసనాధారములు లేకపోయినా,

వారు కన్నడ వాఙ్మయకర్తలుగా ఉన్నారు. వారిలో చెన్నబసవ, మడివాళ మాచయ్య, సిద్ధరామ, షడ్డళబాచరస, కాళవ్వె, ఐదుక్కి మారయ్య, నింబాళద గణేశ్వర, శివయోగిదేవ, అనేవారు ముఖ్యులు. కాని, వీరు రచించిన గ్రంథములు, వచనములు, కాలజ్ఞానములు, మొదలయినవే కాని, పెద్ద వేవిన్ని లేవు.

ఇక, పండితత్రయమని చెప్పబడే శ్రీపతిపండితుడు, పండితారాధ్యుడు, శివలెంక మంచన్న, అనేవారు బసవనికి సమకాలికు లని చరిత్రకారు లందరున్ను అంటున్నారు. వారిలో శ్రీపతిపండితుడు పండితారాధ్యునికంటె చాల పూర్వుడని యింతకుముందు సూచించినాను. శివలెంక మంచన్నను గురించి సోమనాథుడు బసవపురాణములో స్మరించనేలేదు. విమపువిందులో పాల్గొన్నవారిలో లెంక మంచయ్యాపే రున్నది గాని, అతడు శివలెంక మంచణపండితు డయి ఉండడు. పండితారాధ్యచరిత్రలో ఆతని ప్రశంస ఉన్నది. పండితారాధ్యుడు రచించినాడని చెప్పబడే శివతత్త్వసారములో శ్రీపతిపండితుని గురించి తెలుపబడినది గాని, మంచన్నను గురించి తెలుపబడలేదు. మంచన్న పండితారాధ్యునికి తరువాతివాడున్ను, పాల్కురికి సోమనాథునికి పూర్వుడున్ను అయిఉంటాడు. కాబట్టి పండితత్రయమనేవారు సమకాలికులు కారని తోస్తుంది. కాని సోమనాథుడు మంచణ్ణను గణసహస్రములో చేర్చి కీర్తించినాడు.

పండితారాధ్య చరిత్రమును, బసవపురాణమును ప్రకటించి ప్రచారములోనికి తేసంకల్పించిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు శ్రీపతిపండితుని వంశమువారు. పండితారాధ్య చరిత్ర ప్రకటనమునకు శ్రీ నాగేశ్వరరావుగారు చేసిన సంకల్పమును వారి అనంతరము నెరవేర్చిన శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు, శ్రీ నాగేశ్వరరావుగారి అల్లుళ్లు ధన్యులు. చిరకాలమునుంచిన్ని ఇట్టి శివసంబంధము గలిగిన ఈ రెండు పండితవంశముల సంకల్ప సమ్మేళన మీ గ్రంథప్రకటనమువల్ల ధన్యత పొందినదని వేరే చెప్పనక్కరలేదు. శ్రీపతి మంచణ పండితుల వంశవృక్షముల నీక్రింద పొందుపరుస్తున్నాను.

## శ్రీపతిపండితవంశవృక్షము

గోకర్ణుడు (పంచముని ద్విజునిగా చేసినవాడు)

మల్లికార్జునుడు (శిష్యునికోసము కృష్ణాజలము నింకించినవాడు)

చిన మల్లికార్జునుడు
(ఎనభైయేళ్ల వృద్ధపుణ్యస్త్రీకి సంతానము కలిగించినాడు)

పండితుడు

గోకర్ణుడు

మల్లికార్జునుడు (ఇతని పరంపరలో)

లింగన

అనంతన

కాశీనాథుడు

పెదసోమేశ, పినసోమేశ, లింగయ్య, బసవన్న, కోటిపల్లీశ్వరుడు

పెదసోమేశ: కాశీనాథ, తిమ్మన, పండితుడు

కాశీనాథ: అనంతుడు, పండితుడు

అనంతుడు: మల్లికార్జునుడు

లింగన

కాశీనాథుడు

అనంతుడు, గౌతముడు

- గౌతముడు
  - గౌతముడు
    - అనంతుడు
    - చంద్రశేఖరుడు
      - అఘోరమూర్తి
        - శరభ
          - వీరమల్లు
    - వీరభద్రుడు
      - వీరేశ
      - గౌతమ
      - చంద్రశేఖర
        - నాగయ్య
        - సాళ్వపతి
          - బ్రహ్మయ్య
          - బాపయ్య
          - మల్లయ్య
            - బుచ్చయ్య
              - నాగలింగం
              - **నాగేశ్వరరావు**
                - (అల్లుడు) **శంభుప్రసాదు**
              - సాంబశివరావు
            - వియ్యన్న
    - గౌతముడు

- శరభ
  - నాగ
    - శరభ
      - కాశీనాథ
      - అయ్యన్న
        - వీరభద్ర
          - నాగేశ
          - అయ్య
          - సదాశివ
          - చంద్రశేఖర
          - బుచ్చన
- అయ్యన

## శివలెంక మంచణపండితుని వంశవృక్షము



మధుకేశ్వరుడు

నీలకంఠాచార్యుడు

విశ్వనాథ దేశికుడు

నీలకంఠాచార్యుడు
(క్రీ. శ. 1485)





శివరాత్రిలింగము

శంభులింగము

మల్లికార్జునరావు

**శంభుప్రసాదు**

రాధాకృష్ణ

మల్లికార్జునరావు సాంబశివరావు సదాశివరావు

చంద్రమౌళీశ్వర ప్రసాదు శివలీలాప్రసాదు వీరభద్ర శాస్త్రి

బుచ్చయ్య శివరాత్రి లింగము మల్లయ్య దుర్గా ప్రసాద్ ఉమా మహేశ్వరం విద్యా సాగరం

కాశినమశ్శివాయ సాంబమూర్తి

బుచ్చయ్య దక్షిణామూర్తి మృత్యుంజయులు వీరభద్రయ్య

భావయ్య కోటయ్య భైరవానందం లింగయ్య శంభులింగం

కూతురు

పున్నయ్యశాస్త్రి కూతుళ్లిద్దరు

ప్రసాదు ఒక కుమారుడు

బుచ్చయ్య ఒక కుమారుడు

బ్రహ్మయ్యలింగం

కూతురు

మల్లేశ్వరం

కన్నడ గ్రంథములలో శివలెంక మంచణను గురించిన యీ క్రింది విషయములు తెలియవస్తున్నవి. ఈతని తాత సోమశంభు దేశికుడు. తండ్రి "కామితాద్యఖిల శివకథిత తంత్రావళికి ప్రేమతో వృత్తిదీపికలను త్తరించి సోమధరసమయమును ధరణిలో నిలిపిన సకలాగమాచార్యుడు." ఇతడు కాశీక్షేత్రములో శివుడే సర్వదేవతలకంటె పూజ్యుడని స్థాపించి, బిందుమాధవుని విశ్వేశ్వరుని సన్నిధానమునకు రప్పించి, శత్రుపక్షమును విచ్ఛేదము చేసినాడనిన్ని, కల్యాణమునకువచ్చి బసవని చూచెననిన్ని ఆగ్రంథములో చెప్పబడినది. ఇతడు తన పదివ్రేళ్లను విశ్వనాథునికి సమర్పించి, మళ్లీ పొందినాడట. ఇతడు కన్నడ గ్రంథములనుగాని, తెనుగు గ్రంథములనుగాని వ్రాసినట్లు కాన్పించదు. కాని, కన్నడములో 'మంచణ్ణగళ వచన' అనే ఒక గ్రంథ మున్నది. దీనిని మంచణ్ణ కాక మరి యెవరో తరువాతివారు రచించి ఉంటారు.

ఇక పండితారాధ్యుని గురించి వ్రాసినవారిలో పాల్కురికి సోమనాథుడే మొదటివాడు. పండితారాధ్య చరిత్రమును సోమనాథుడు చెప్పినదానినీక్రింద సంగ్రహముగా తెలుపుతున్నాను.

భూలోకములో సద్భక్తివర్ధనార్థము శివుడు వృషాధినాయకుని పంపుతూ, తనపాదభక్తి, నందికేశుని సర్వజ్ఞత, భృంగి సహజనిష్ఠ, దుర్వాసాదుల శాపశక్తి, అక్షపాదాదుల వాగ్విచక్షత, ఉపమన్యు సద్గురుత్వము, రుద్రప్రమథగణాధిపుల సహజ స్వకీయప్రసాదైకరతి, ప్రాక్తన నూతన భక్తుల వ్యక్తదృష్ట ప్రత్యయాయాథ మహిమ, వీరభద్రుని శౌర్యము, అనే గుణము లన్నీ ఒక్కమూర్తిలో ఉండేటట్లు భావింపగా, ఆభావన ఒకమూర్తి అయి, శివునికి మ్రొక్కినది. శివుడు సంతోషించి, అతనికి నానాపురాణ విజ్ఞానము నిచ్చి, "ప్రమథగణములతో బసవని భూలోకమునకు పంపుతున్నాను. నీవున్నూ పోయి బసవకుమారుని పజ్జ నుండు. నేనున్నూ కరచరణాద్యంగకము

లతో భూమిమీదికి వస్తాను. నిన్ను శిష్యునిగా స్వీకరించి, నిన్ను సమస్తవిసనులా మహిమాన్వితునిగా చేస్తాను. వేంగీదేశములోని దక్షారామములో భీమేశ్వరలింగముసన్నిధిని పురోహితుడు, వానస వంశమువాడు, భీమనపండితుం డున్నాడు. అతడు పుత్త్రార్థియై పంచాక్షరీ మంత్రమును బహుపురశ్చరణలు చేసినాడు. ఇప్పుడు శ్రీశైల మల్లికార్జునలింగసన్నిధిలో పురశ్చరణ చేస్తున్నాడు. అతనికి కొడుకవుగాపుట్టు" అని చెప్పినాడు. ఆమాటప్రకారము ఆమూర్తి భీమనపండితుని భార్య అయిన గౌరాంబ గర్భములో పుట్టినాడు. అతనికి పండిత మల్లికార్జును డని పేరు కలిగినది. అతడు దక్షారామమునకు పోయి కోటిపల్లి ఆరాధ్యదేవునివల్ల వీరభక్తి దీక్షనుగ్రహించి, వీర వ్రతమును పాలిస్తూఉండగా, అచటి భూసురు లతనిని చూచి, "పండితయ్యా, నీవు విద్వాంసుడవు; పురాణములు చదివినావు, వేదములు చదివినావు. ఈ రుద్రాక్షలు ధరించడ మేమిటి? విభూతి పూసుకొనడ మేమిటి? లింగము కట్టుకొనడ మేమిటి? పాదోదకము త్రాగడ మేమిటి?" అని ఆక్షేపించినారు. దాని కాతడు చిరునవ్వు నవ్వి సమస్త శ్రుతిస్మృతి పురాణేతిహాసాది ప్రమాణములతో విభూతిమహిమ, రుద్రాక్షమహిమ, పాదోదకమహిమ, లింగార్చనమహిమ, లింగధారణమహిమ, ప్రసాదస్వీకార మహిమలను వివరించి, ఇష్టలింగ నిర్మాల్య పుష్పానుగత మకరందము నాకర్షించిన సూర్యుని ఘంటాకర్ణుడు కుష్ఠురోగి వగు మని శపించిన కథను, భీతుడు, దుర్వాసుడు, సుకేశి, సూరసాని, సామవేది, తిరునాళ్లపోవ మొదలయిన భక్తుల కథలను తెలిపి, బ్రాహ్మణుల కందరికిన్ని శివభక్త్యుద్రేకమును కల్పించి, భక్తులు తనకు బసవని చరితము చెప్పి యతనికంటె ఎక్కువ భక్తు డని తన్ను కీర్తించేటట్లు లింగార్చనలు సాగించినాడు.

ఒకనాడు మల్లికార్జునపండితారాధ్యుడు లింగార్చనకోసము పుష్పములు కోయబోయినాడు. అప్పుడు వెల్లగొండ మహాదేవయ్యా అనే మహాభక్తుడు పుష్పములు కోసి శివార్చనకు ప్రొద్దు పోతుం దని తొందరగా పోతూఉండగా అతనిపాదములు శివార్చోపకరణములను తాకినవి. అత డా అపరాధమునకుగాను తన పాదములు రెండింటిని నరకుకొని పడిఉన్నాడు. పండితారాధ్యు డతనిని చూచి, అతని భక్తి పెంపున కాశ్చర్యపడి, లింగమువద్ద వెలుగుతూఉన్న దీవపు ప్రమిదలోని నూనెను తీసి మహాదేవయ్యాపాదములకు మర్దింపగా అతనిపాదములు మళ్లీ శరీరముతో కలుసుకొన్నవి. పండితారాధ్యుని ఈ మహిమ శివభక్తుల కనేకుల కున్నదే అనడానికి కళియంబ, పిళ్ల నయనారు, వెలమడు, వాగీశనైనారు, దసరయ్యా, గురుభక్తయ్యా, శ్వేతుడు, మలహణుడు, కుమారపాల ఘూర్జరుడు, ఓహిళుడు, బెలి దేవి వేమనారాధ్యుడు, సకలేశ్వర మాదిరాజయ్యా, కదిరెరేమయ్యా, చేటలవేమయ్యా అనే పురాతన భక్తుల చరిత్రములు తార్కాణములు.

పండితారాధ్యుడు సనదవోలులో ఉండి తన మహిమను చూపిస్తూఉండగా వెలనాటిచోడునికి గురువైన బౌద్ధు డొకడు రాజుతో తాను వాదములో పండితారాధ్యు నోడించి బౌద్ధమే ఉత్కృష్ట మైనదని స్థిరపరుస్తా నని చెప్పగా రాజున్ను సభచేయించి, అన్ని మతములవారిని పిలిపించినాడు. పండితారాధ్యుడు శివభక్తులతో కూడి సభను ప్రవేశించి 'గరిడికెక్కిన యంకకాడును బోలె' వేదవాదము, కర్మవాదము, కాలవాదము, వేదాంతమతము, సాంఖ్యవాదము, యోగవాదము, చార్వాకవాదము, పాంచరాత్రవాదము, బౌద్ధవాదము, జైనవాదము అనే వివిధవాదములను శ్రుతి, స్మృతి, పురాణేతిహాసోదాహరణ పూర్వకముగా ఖండించినాడు. బౌద్ధు డోర్వలేక శివుని ఇందుధారణము, బ్రహ్మముఖానిర్వాపము, కపాలాస్థిమాలా

చర్మధారణము, ఉమాపతిత్వము, భిక్షాటనము, గంగాధారణము, త్రివిక్రమ ఖండనము, హరిహరాభేదము, గరళధారణము, నగ్నత్వము, దక్షాధ్వరధ్వంసములు శివుని సర్వాధిక్యమును స్థాపింపజాలవని నిందింపగా, ఆయావిషయములు శివుని ఆధిక్యము నెట్లు స్థాపిస్తున్నవో నిరూపించి, హరుని పంచవింశతి లీలాపరిగణనము చేసి, రుద్రాధికత్వమును, హరిహర తారతమ్యమును నిరూపించి, శివుని ప్రలయలీలను, మహాతాండవలీలను వర్ణించి, సభలోనివా రంతా నివ్వెరగు పొందే టట్లు చేయగా, అందరున్ను పండితారాధ్యుని కీర్తింప మొదలు పెట్టినారు.

దానిని చూచి సహించలేక, మారుమాట పలుకలేక, బౌద్ధుడు కోపోద్రిక్తుడై, పండితుని ధిక్కరించి సభాస్థలిని విడిచి పోయినాడు. అక్కడ చేరినవారి కందరికిన్ని బౌద్ధునిమీద కోపమును ఏవయు కలిగినవి. వారిలో రేమయ, దేవయ లనేవారు బౌద్ధుని చంపుతా మని కంకణము కట్టి, అతడు సముద్రములోని ఒక లంకలో బుద్ధవిగ్రహమును పూజించడానికి పోతాడని తెలిసి, వాడు రాకముందే బుద్ధవిగ్రహము వెనుక దాగొనిఉండి, వాడున్ను రాగానే వానిపైబడి వధించినారు. ఇంత టంతటికిన్ని తమ గురువు మరలి రాకుండడము చూచి, బౌద్ధుని శిష్యులు పోయి, వాని శవమును చూచి, ఏడ్చుకొంటూ రాజుతో మొరపెట్టుకోగా, రాజు పండితారాధ్యుని పిలిపించి, 'నీవేనా ఈ పనిని చేయించినది' అని అడిగినాడు. 'అవును, నేనే చంపించినాను. బుద్ధుడే పరదైవమో, శివుడే పరదైవమో నీవు చూచినావు కదా! నీవు నన్ను దండించ నెంచుతున్నావు. నీవు నన్ను దండించే దేమిటి? నన్ను నేనే దండించుకొంటాను, చూడు. మూడుసార్లు తల కోసుకొంటే, మూడుసార్లున్ను తల మొలవవలెను. మూడుసార్లు కళ్లను పెరుకుకొంటే, మూడుసార్లు మళ్లీ అవి రావలెను. దేశదేశముల

లోను చాటించి అందరినీ రప్పించు. వారందరున్ను చూస్తారు' అని పలుకగా రాజల్లే అందరినీ రప్పించినాడు. అందరున్ను చూస్తూ ఉండగా పండితుడు ఇనుమారు కన్నులు గోరుగొంటితో పెకలించి తీసినాడు. రెండు సార్లతనికి కళ్లు వచ్చినవి. చోడనికి క్రోధము హెచ్చినది. ఇకమూడోసారి తానే కింకరులచేత పండితుని కన్నులను పెరికించి, 'జీల్ల పాల్ తెప్పించి, నిండఁ బోయించి' చోడుడు పోయి నాడు. అప్పుడు పండితుడు, "అసంఖ్యాత మాహేశ్వరోత్థిత సమాయత క్రోధోత్కటానలపటల విరచితజ్వాలల వెలనాఁటిచోడ ధరణీతలేశ్వ రాధమపతంగంబు భస్మ మయ్యెడమ! తద్బంధులు సుతులు విస్మయం బుగ నిప్డ భస్మమైపోదురు!" అని శాపమిచ్చినాడు. వెలనాటిచోడని వంశమాశాపము ప్రకారము నాశనము పొందినది.

పండితుడు బౌద్ధునితో సంభాషించడము, వాడు శివనింద చేయగా వినడము మొదలయిన పాపములను తొలగించుకొనడానికి మహాప్రమథగణ సంకీర్తనము, రుద్రగణసంకీర్తనము, యోగాచార్య గణ సంకీర్తనము, షోడశగణ సంకీర్తనము, దశగణసంకీర్తనము, త్రయో దశగణ సంకీర్తనము చేసి,గణసహస్రనామములు పఠించి, అమరారామ మునకు పోయి, అమరేశ్వరుని అమరేశ్వరాష్టకముతో కీర్తించి, తన కన్నుల నెప్పటివలె పొందినాడు. పూర్వకాలములోను విష్ణ్వాదు లెందరో ఈ రీతిగానే కన్నులను పొందినారు. ఇరిత్తాండి, నంబెన్న మొదలయినవారి చరిత్రము లిట్టివే.

పండితు డాతరువాత బసవేశ్వరుని చూడవలె నని కల్యాణ కటకమునకు బయలుదేరి, త్రోవలో ఊరూర శివభక్తులు తన కెదురు వచ్చి పూజిస్తూఉండగా ఇరు (నిడు) గుడుముల అనే గ్రామము చేరి, అచ్చట వీరచాకిదేవయ్యచేత ప్రణిపత్తి చేయించుకొని, అక్కడ ఉండగా బసవేశ్వరు డతనికి విభూతి పంపినాడు. దానివల్ల అతనికి

కర్ణాట భాషవచ్చినది. ఆభాషలో పండితుడు బసవయ్యను కీర్తించినాడు. ఇరు(నిడు)గుడుగుములనుండి, పానుగంటికి రాగా, అచ్చట బండరువు గోవిందప్రెగడ అతనిని మహావైభవముతో పూజించినాడు. పానుగంటికి ఉదయావనీశు డనేవాడు రాజు. ధవళేశు నామయ్య అతనిలెంక. నామయ్య శివభక్తి పెంపుతో సంచరిస్తున్నాడు. తక్కిన లెంక లది చూచి సహించక రాజుతో కొండెములు చెప్పినారు. రా జతనిని పిలిచి తన తమ్మను తినుమంటే అత డట్లు చేయ నిరాకరించినాడు. తన్ను దండించకముందే నామయ్య రాజుకు బసవని మహిమలను తెలిపి, తన తలను తానే ఖండించుకొని కైలాసమునకు పోయినాడు. ఉదయావవనీశుడు వంశముతో నాశన మయినాడు.

పండితు డక్కడనుంచి వనిపురమునకు పోగా శంకరయ్య అనే భక్తు డతనికి సకలోపచారములున్ను చేసి ఆదరించినాడు. అక్కడనుంచి కల్యాణకటకమునకు పండితారాధ్యులు బయలుదేరుతూ ఉండగా, ఒకడు కల్యాణములో భక్తి గజిబిజి పుట్టి బిజ్జలుని జగదేవ మొల్లబొమ్మయలు చంపినారనిన్ని, బసవేశ్వరుడు కప్పడి సంగమేశ్వర మునకు పోయి దేహముతో సంగమేశుని గర్భములో చొచ్చినా డనిన్ని చెప్పగా విని, పట్టరాని దుఃఖముతో పలవించినాడు.

మల్లికార్జున పండితారాధ్యుడు వనిపుర శంకరయ్యగారిని వీడ్కొని బయలుదేరి శ్రీశైలమును చేరుకొన్నాడు. అతని కాశైలము తనభక్తిదృష్టికి లింగాకారముగాతోచినది. శ్రీశైలోత్పత్తిని స్మరించి, దాని మహిమను స్తుతించి, దానిపై నెక్కి పాదములతో తాకడమునకు జంకి, శిష్యుడైన దోనయ్యను శైలము నెక్కి మల్లికార్జునస్వామి దర్శనము చేసి, తనభక్తిని నివేదించవలసిన దని నియోగించి నాడు. నానాదేశములనుంచి శ్రీశైలయాత్రార్థమై వచ్చిన భక్త

సంఘములతో దోనయ్యా కొండ యెక్కుచూ ఉండగా, మల్లికార్జున స్వామి అతనికి వృద్ధతపోధనునివేషముతో ఎదురై, పండితారాధ్యుని కుశల మడిగి, దోనయ్యకు శ్రీ శైలములో నుండే అన్ని ప్రదేశము లను ఒక దీపవృక్షము మీదనుంచి చూపినాడు. దోనయ్యా పట్ట రాని సంతోషముతో అన్నిటినీ చూచి, పండితుని ప్రసాదముచేత గదా ఈభాగ్యము నాకు కలిగినదని వెల్లటూరికి పోయి జరిగిన దంతా విన్నవించినాడు. పండితుడున్ను "నేనేకదా చరితార్థుడను! మల్లికా ర్జునస్వామి నన్ను తలచినాడా ?. నీవంటి శిష్యుడు కలుగబట్టి కదా నేను ధన్యుడనైనాను" అని తన్ను ప్రమథగణములలో చేర్చుకోవలసి నదిగా మల్లికార్జునస్వామిని వేడుకొన్నాడు. ఆ ప్రార్థన నాలించి అభవు డతని నాత్మగర్భస్థుని చేసినాడు. అంతలోనే పండితారా ధ్యుని ఆత్మసంతతి కులసతీసమేతముగా లింగోదరములో లీనమైనది.

పండితారాధ్యుడు గొప్ప వీరశైవకవిగా సోమనాథుడు పేర్కొన్నాడు. హరలీల, మహిమ్నస్తవము, మలహణము, అనామ యము, హలాయుధము, పంచగద్యములు, శివతత్త్వసారము, రుద్ర మహిమ, సంసార మాయాస్తవము, శంకరగీత, ఆనందగీతములు, బసవగీతములు, (8) 180-1 ; దక్షాధ్వరము, న్యాసాష్టకము, గణా డంబరము, శారభము, తుమ్మెదపదములు, ప్రభాతపదములు, పర్వత పదములు, ఆనందపదములు, శంకరపదములు, నివాళిపదములు, వాలేశుపదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములు, సంజవర్ణన, గణవర్ణన పదములు (1) 512-13 ; బాణగద్య అక్షరగద్య, వర్ణాడం బరము, నీలకంఠస్తవము, మయూరస్తవము, మలయరాజీయము, మానిదండకము, మహాస్తోత్రసూత్రములు, శతకము, దీపకళిక, మహానాటకము, ఉదాహరణములు, ముక్తకములు, గీతసూక్త ములు, భృంగీస్తవము, రుద్రసహస్రనామము, (౨) ౮౩౨-౩,

మొదలయిన గ్రంథముల పేళ్లను సోమనాథుడు మల్లికార్జున పండితారాధ్య రచితములుగా ధ్వనించేటట్లు సూచించినాడు. వీటిలో శివతత్త్వసార మొక్కటిమాత్రము బయలుపడినది. తక్కిన వన్నీ ఏమయినవో తెలియదు. సోమనాథుడు శివతత్త్వ సారమును పండితారాధ్యకృతిగా చెప్పడమేకాకుండా, దానిలోని చాలాభాగము నున్నదున్నట్లు ద్విపదలో ఇమిడ్చి పండితారాధ్య చరిత్రములో చేర్చివేసుకొన్నాడు. ఇట్లే తక్కినవాటిలో అనేకము లున్న పండితారాధ్యచరిత్ర బసవపురాణములలో చేరినవేమో చెప్పలేము. శ్రీశైలయాత్రాసందర్భములో యాత్రికులు పాడిన పాటలు కొన్ని ఈ గ్రంథములలోనివేమో!

---

# 3

## సోమనాథుని కులగోత్రములు

సోమనాథుడు ఆరాధ్యబ్రాహ్మణు డని కొందరున్ను, జంగము డని కొందరున్ను అంటున్నారు. వేదాదివిద్యల నభ్యసించి,అనేకశాస్త్రముల పారమును చూచినవాడున్ను, హరితస గోత్రోద్భవుడయిన పాల్కురికి సూరనామాత్యునికి 'ముద్దుమఱంది'న్ని అయిన సోమనాథుడు బ్రాహ్మణుడే అయిఉండెవలె నని మెదటివారివాదము. భృంగిరిటిగోత్రు డయినవాడు జంగముడే అయి ఉండవలెనని రెండోపక్షమువారి వాదము. జంగము లకు కూడా వేదవిద్యాధికార మున్నదని వీరిసిద్ధాంతము. ఇది ప్రయోజనము లేనివాద మని నా తలంపు. సోమనాథుని కాలములో ఆరాధ్య బ్రాహ్మణశాఖగాని, జంగమజాతిగాని ఉన్నవనడాని కాధార ములు కానరావు. వ్యక్తులపేళ్లకు ఆరాధ్య అనే ఉపపదమును చేర్చి నంతమాత్రముచేత ఆరాధ్య బ్రాహ్మణశాఖ ఆ కాలములో ఉండేదని చెప్ప వీలులేదు. ఆపదము పూజార్థమున చేరుతూ ఉండేది. అది పరమశివ నిష్ఠాపరులై, శివాచారమును పరిపాలించే నైష్ఠికుల పేళ్ల కనుబంధముగా ఉండేది. అట్లే, జంగమ శబ్దము సంసారబంధములను విడిచిన యతులకుమాత్ర మన్వ యించేది. యత్యాశ్రమము ద్విజుల కందరికిన్ని ఉన్నది. యతులైన జంగములు ద్విజులలో ఎవ్వరయినా సరే పూజ్యులే అయినా, సోమ నాథుని కాలమునాటికి బ్రాహ్మణులయిన శివద్విజులే జంగములై ఉంటూ ఉండేవారు. శూద్రులలోను, పంచములలోను జంగమము లుండేవా రనడాని కాధారములు లేవు. వారిలో శివభక్తు లనేకులు

మహిమవంతు లుండేవారు. కాని, వారు జంగమ శబ్దవాచ్యులు కారేమో అని తోస్తుంది. ఎట్లయినా ఆకాలములో జంగమజాతి మాత్రము లేదని నిశ్చయముగా చెప్పవచ్చును.

బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో చాలచోట్ల శివ ద్విజుల ప్రసక్తిఉన్నది. (౨) ౧౫౪, ౧౬౭ మొద. శైవభక్తులు భూదేవ, భూసురాదినామములతో సంబోధింపబడినారు. వీటికి యౌగి కార్థమును మాత్రము చెప్పడము సరికాదు. శ్రీశైలమును "'బ్రాహ్మణ' క్షత్త్రియ, వైశ్య శూద్రాదిసత్కులజులును దుష్కులజులు, సెట్టిమాన వులు" మెట్టినా వారి పాపములుపోయి అభిమతసిద్ధి కలుగుతుంది. (పండి. చ. ౨. ౨౬౭.) దీనినిబట్టి ఆకాలములో శైవులలో వర్ణ విభేద మున్నదనే చెప్పవలెను. 'వెలివాడ గలుగునే వేదఘోషంబు?' (బస. పురా. పు. ౧౫౪) అనడముచేత ఆకాలములో పంచములు వెలివాడలో నివసించి, వేదాధికారము లేనివారుగా ఉండేవారని తెలుస్తుంది. వీరశైవులలో వర్ణవిభేదము లేదని అభిప్రాయము కలవాడయితే సోమనాథు డీరీతిగా అనడు. శాసనములలో శివ ద్విజులు, శివబ్రాహ్మణులు అనేపేళ్లు తరచుగా కనబడుతున్నవి. ఉదాహరణములు: ఎ. పి. రిపో. సం. ౧౯౧౧, నం ౫౩౦ రు. క్రీ. శ. ౧౧౩౦. శివద్విజులు; సం. ౧౯౦౯, నం ౪౧౭ రు, క్రీ. శ. ౧౨౪౩. శివబ్రాహ్మణులు; సం. ౧౯౦౯, నం ౩౧౪ రు, క్రీ. శ. ౧౨౭౫, "నం ౩౧౨ రు, క్రీ. శ. ౧౦౬౧;" ౧౯౦౭, నం ౨౧౯ రు, క్రీ. శ. ౧౦౨౧; "౧౯౦౭, నం ౧౬౧ రు, క్రీ. శ. ౧౦౬౦;" నం ౫౪౯ రు;" ౧౯౧౨, నం ౫౦౫ రు, క్రీ. శ. ౧౦౭౦; సం ౧౯౦౯. నం ౭౩౧ రు; శివబ్రాహ్మణులు. శివయోగుల ప్రస్తావనకూడా అనేక శాసనములలో కనబడుతున్నది. ౧౯౧౧, నం ౧౨౪, ౨౨౫, ౨౨౭ రులు; ౧౯౦౭, నం ౧౭౭ రు, మొదలయినవి ఉదాహరణ

ములు. శివయోగులతోపాటు దేవరడియర్, తపస్వులు, అపూ ర్వులు, శైవాచార్యులు, కడిగై మధ్యస్థులు, కారణత్తార్, వైఖాన సులు మొదలయినవారి పేళ్లుకూడా శాసనములలో కనబడుతున్నవి. కాని, ఒక్కదానిలోను ఆరాధ్య బ్రాహ్మణులు జంగమములు, అనే పేళ్లు జాతివాచకపదములుగా కానరావు. 'ఆరాధ్య' అనేపదము శైవులకే కాక ఇతరులకు కూడా వర్తిస్తూఉండే దనడానికి 'ఆరాధ్య తీర్థాచార్య' అనే మాధ్వాచార్యుని పేరు ప్రమాణముగా ఉన్నది (మెకెన్ జీవ్రాతప్రతులు, సంపుటము౧౮, పుట౧౫౭.) ఈ మాధ్వ గురువు శక.౧౬౭౦ సం.రమువాడు.

పైదానినిబట్టి చూస్తే, సోమనాథుని కాలములోనే కాక, అంతకు పూర్వమున్నూ తరువాతనుకూడా శైవులలో చాతుర్వర్ణ్య ముండేదనిన్ని, జంగమము లనేవారు గృహస్థాశ్రమమును విడిచి సన్న్యా సులవలె శైవధర్మప్రచారముకోసము దేశసంచారము చేసేవారనిన్ని, వారిలో వర్ణభేదము పాటింపబడేది కాదనిన్ని, అన్నివర్ణముల వారి నుంచిన్ని జంగమములలో చేరుతూ ఉండేవారనిన్ని, జంగమములు కాని శైవగృహస్థులు తమతమ వర్ణాచారములను యథావిధిగా పరిపా లిస్తూ ఉండేవారనిన్ని, వారిలో శైవబ్రాహ్మణులు సాధారణ బ్రాహ్మ ణులవలెనే వేద వేదాంగాదివిద్యల కధికారము కలిగి, ((౧) ౫౧౫ మొద.) వాటికి శైవపరముగా అర్థము చెప్పకొంటూ ఉండేవారనిన్ని తేలుతున్నది- శైవబ్రాహ్మణులు మహాబ్రాహ్మణులట. (౧) ౫౧౫.

శైవులలో లింగధారులు, లింగధారులు కానివారు కూడా ఉండేవారు. వీరశైవసిద్ధాంతము నంగీకరించినవారు సాహిత్యలింగము లను ధరించేవారు. మల్లికార్జునపండితారాధ్యుడు లింగధారియే. 'భూతి యు రుద్రాక్షములుఁ దాల్పనగునె? నీతియే లింగసన్నిహిత మైయున్కి?' అని పండితుని బ్రాహ్మణు లాక్షేపించినారు. అతడు లింగధారణ

మహిమను గురించి ఉపన్యసించినాడు. బసవపురాణకథాశ్రోత అయిన గొబ్బూరి సంగనామాత్యుడున్ను, పాల్కురికి సూరామాత్యుడున్ను అట్టివారై ఉంటారు. సూరామాత్యునికి 'ముద్దుమఱంది' అయిన సోమనాథుడున్ను అట్టివాడే అని నా అభిప్రాయము.

సోమనాథుడు బ్రాహ్మణుడు కాడనడాని కతని భృంగిరిటి గోత్రత్వము నుదాహరించి, హరితసగోత్రజుడయిన సూరనామాత్యునితో అతనికిగల 'ముద్దుమఱంది' సంబంధము ఔపచారికముమాత్ర మని కొందరంటారు. పాల్కురికి సోమనాథుని కదే యింటిపేరుగల సూరనామాత్యుడు 'మఱంది' ఎట్లవుతాడని వారి సందేహము. పాల్కురికి అనేది ఊరిపేరు; గృహనామముగా ఇద్దరికిన్ని కుదురుకొన్నది. ఏకగ్రామమువారు భిన్నగోత్రస్థులు కావజాని కాటంకములేదు. ఉదాహరణమునకు - చిలుకూరి నారాయణరావు నైననాది ఆత్రేయసగోత్రము, చిలుకూరి వీరభద్రరావుగారిది వాధూలసగోత్రము. నేను మాధ్వుడను, ఆయన నియోగి. అయితే సాధారణబ్రాహ్మణులలో భృంగిరిటి గోత్రము లేదు. అది వీరశైవులలో ప్రచారములో ఉన్నది. సూరనామాత్యునిది హరితసగోత్రము. హరితసగోత్రము సాధారణబ్రాహ్మణులలో నేడున్నది గాని వీరశైవులలో లేదు. అందుచేత 'ముద్దుమఱది' తనము నిజమైనది కాదనేదానికి సమాధానము చెప్పవలసి ఉన్నది. వీరశైవులలో వృష, నంది, భృంగ, వీర, స్కందు లెప్పటినుంచి గోత్రకర్తలుగా ఏర్పడినారో తెలియదు. సుప్రభేదాగమ మాధారముగా చేసుకొని 'శ్రీ వీరశైవబ్రాహ్మణ కులదీపిక' అనే గ్రంథమును వ్రాస్తున్నా మని తత్కర్తలు రేవణ, మరుళసిద్ధ, ఏకోరామ, పండితార్య, విశ్వారాధ్య, అనే పంచాచార్యులవంశములవారికి వరుసగా పైని చెప్పిన అయిదుగోత్రములున్ను కలిగిన వని వివరించినారు. పై పంచాచార్యుల పేళ్లు కలియుగములోనివట. ద్వాపరయుగములో

ఆ పేళ్లు వరుసగా రేణుక, దారుక, గజకర్ణ, ఘంటాకర్ణ, విశ్వకర్ణ అని ఉండేవట. ఈ ద్వాపర యుగములోని పేళ్లే వీరశైవులకు గోత్రనామములుగా కూడా ఉన్నవని అచ్చటి వీరశైవ సంప్రదాయజ్ఞులు చెప్పినట్లు ౧౯౦౧ సం॥ రపు మైసూరు జనాభా రిపోర్టులో వ్రాయబడినది. ఈ గోత్రములు సన్న్యాసులయిన జంగమములలోనే ఉండేవికాని, సాధారణవీరశైవగృహస్థులకుకూడా వర్తించేవో లేదో చెప్పలేము. మధురలోని కలక్టరు బంగాళాలోని ఒక శిలాశాసనములో మూడో కులోత్తుంగదేవుని పధ్నాలుగో రాజ్యసంవత్సరము నాటి (క్రీ. శ. ౧౯౯౨) ఒక శాసనములో ఆముండమఠములోని నందికేశ్వర సంతానమునకు చెందిన జ్ఞానమూర్తిదేవునిపే రున్నది. నందికేశ్వరసంతాన మంటే నందిగోత్రమని చెప్పవలెనేమో తెలియదు. అట్లు చెప్పకొన్నా ఆగోత్రము సన్న్యాసి అయిన జ్ఞానమూర్తిదేవునికిమాత్రమే వర్తిస్తుంది. నందికేశ్వరసంతానమువలె తక్కిన వృష, భృంగి, వీర, స్కందుల సంతానములున్ను ఉండేవేమో తెలియదు. శివదీక్షను పొందినవారు గురువు గోత్రమును చెప్పకొనడ మాచారము. ఆ ఆచారముచొప్పన పాల్కురికి సోమనాథుడున్ను తాను భృంగిరిటి గోత్రజుడనని చెప్పకొన్నాడో, ఈశ్వర కులజుండ, బసవగోత్రుండ, అని చెప్పకొన్నట్లే శివగణమయిన భృంగిరిటి గోత్రుడ నని చెప్పకొన్నాడో నిర్ణయించడము కష్టము. శివబ్రాహ్మణు లాకాలములో భరద్వాజ, హరితాది ఋషులను గోత్రకర్తలుగా చెప్పకొనడము కలదు. కొండగుడికేశిరాజు వీరశైవుడేకదా. అతడు భరద్వాజగోత్రజుడయినట్లు ఎపిగ్రాఫియా కర్నాటికా,షికారుపూరు ౧౯౯, ౧౬౩ శాసనములలో చెప్పబడినది. నెల్లూరిలో కలక్టరు కచేరీగోడలోకట్టబడిన శిలమీది శాసనములో కులోత్తుంగుని ముప్పయిఆరో రాజ్యసంవత్సరములో భారద్వాజగోత్రుడయిన శ్రీ మాదేవభట్టు

మొదలయినవారు ఆళుడైయార్ మనుమసిద్ధేశ్వరాలయములో తైనెల నుంచిన్ని సంధ్యాదీపమును వెలిగించడాని కంగీకరించినట్లు తెలుపబడి నది- ఈ కులోత్తుంగుడు మూడో కులోత్తుంగు డయితే శాసనకాలము క్రీ. శ. ౧౨౧౮ సం॥రమునాటి దవుతుంది. మాదేవభట్టు శివబ్రాహ్మణుడు. అట్లే పాల్కురికి సూరనామాత్యుడుకూడా శివబ్రాహ్మణుడున్ను నైష్ఠికుడున్ను అయినా, సోమనాథునివలె విరాగియై జంగముడు కాకపోవడముచేత హారీతసగోత్రజుడుగానే చెప్పబడి ఉంటాడు. సోమనాథుడు జంగముడు కావడముచేత తన పూర్వాశ్రమములోని గోత్రమును ప్రశంసించుకోలేదు. అట్లు ప్రశంసించడము పాతకహేతు వని అతని అభిప్రాయము. ఒకవేళ కావ్యములో తన పూర్వాశ్రమ ములోని గోత్రము స్మరించడానికి సందర్భపడకపోయి అయినా ఉం టుంది. సూరనామాత్యునిగోత్రమును చెప్పి, బసవపురాణకథాశ్రోత అయిన గొబ్బూరి సంగనామాత్యుని కౌట్టిగోత్రమును అతడు చెప్పలేదు గదా. సోమనాథుని పూర్వాశ్రమములోని గోత్రము మనకు తెలియ నంతమాత్రమున అతని శివబ్రాహ్మణత్వమునకు క్షతి లేదు. శివబ్రాహ్మణులలో సారితాది గోత్రములుం డేవి- వారు భవులు కారు. అట్టిగోత్రములు కలవారు భవులే అయితే, భవు లంటే కిట్టని సోమనాథు డతనిని 'ముద్దుమఱంది' అని సంబోధించి పండితారాధ్యచరిత్ర కథాశ్రోతగా చేయడమే ఉండదు.

---

౪

## సోమనాథుని వైదుష్యము

సోమనాథుడు కేవల కవి కాడు. అతడు కవిత్వము మూల ముగా వీరశైవమతవ్యాప్తికి కంకణము కట్టుకొన్న అసమాన మేధా శాలి. లోకములో వ్యాపించి ఉన్న బౌద్ధ, జైన, వైష్ణవాది మత ములను, శంకరాచార్యుని అద్వైతవేదాంతము మొదలైన సిద్ధాంత ములను ప్రతిఘటించి, వాటిని త్రోసిరాజు చేసి వాటి ఆటను కట్ట డానికి కావలసిన పాండిత్యము నంతటిని సంపాదించుకొన్నవాడు. ఆపాండిత్యమును చతుర్వేదసారము, సోమనాథభాష్యము మొద లయిన గ్రంథములలో వినియోగించినాడు. కాని, వాటివల్ల శాస్త్రీ యముగా వీరశైవసిద్ధాంతము స్థాపితమవుతుందే కాని, అది జనసామా న్యములో వ్యాపించవలె నంటే, కేవల విద్వాంసుడున్ను, పండితు డున్ను పనికిరాడు. దాని ననుష్ఠించి, ఆచరణలో పెట్టి, లోకము నకు లక్ష్యప్రాయుడై ఉండేవాడు కావలెను. తనవలె ఇతరులున్ను అనుష్ఠింపవలె ననే బుద్ధిని కలుగజేయవలెను. వారి కుత్సాహమే కాక ఆవేశమున్ను పుట్టవలెను. ఆవేశము పుట్టించడానికి తానున్ను ఆవేశపరుడు కావలెను. జనులలో ఆవేశము పుట్టించ డానికి దేశభాషలో, దేశీయచ్ఛందస్సులో దేశీయరీతిని కవిత్వము చెప్పడముకంటె మరొక మార్గము లేదనే రహస్యమును తెలుసుకొని ఉండవలెను.

ఈ గుణము లన్నీ సోమనాథునిలో నిండుకొని ఉన్నవి. అతని పాండిత్యము నిరుపమాన మైనది. పండితారాధ్య చరిత్రము చదివినవారికి కా పాండిత్య విస్తారమే కాక, దాని లోతుకూడా బోధ

పడుతుంది. ఆత డుదాహరించిన గ్రంథముల పేళ్లనుబట్టి చూస్తేనే మన కాశ్చర్యము కలుగుతుంది. పండితారాధ్యచరిత్రములో అతడు పేరుపెట్టి చెప్పిన గ్రంథములను చూడండి :—

ఋగ్యజుస్సామాథర్వవేదసంహితలు, బ్రాహ్మణములు, రుద్రసూక్తములు, శతరుద్రీయము, పురుషసూక్తము, చరణవ్యూహము, వేదభాష్యములు, వ్యాసభాష్యము, మహాస్తోత్రము, పవమాన, కైవల్యా, కేన, ఈశ, జాబాల, కాలాగ్నిరుద్ర, మానవ, జైగీష, మారుత, నారాయణ, బ్రాహ్మణ, శివసంకల్ప, రుద్రచయ, అథర్వశిరస్, అథర్వశిఖ, బృహదారణ్యా, గర్భ, హంస, శ్వేతాశ్వతర, రుద్రోపనిషత్తులు.

కాత్యాయనగృహ్యసూత్రము, జాబాలిస్మృతి, రౌద్రబోధాయనస్మృతి, శాతాతపస్మృతి, విజ్ఞానేశ్వరము, వృద్ధశాతాతపము, లౌగాక్షికస్మృతి, యజుర్వేదసూత్రము, పారాశరస్మృతి, యమస్మృతి, రుద్రాక్షకల్పము, వ్యాసస్మృతి, బోధాయనస్మృతి, వసిష్ఠస్మృతి, వాల్మీకిస్మృతి, వాధూలము, గౌతమస్మృతి, ఈశానసంహిత, జాబాలస్మృతి, కైవల్యస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి.

శైవ, స్కాంద, కూర్మ, లింగ, వాయు, వామన, బ్రహ్మ వైవర్త, పద్మ, నారద, బ్రహ్మాండ, వారాహ, గారుడ, మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మ, వైష్ణవ, ఆగ్నేయ, మానవ, వాసిష్ఠరామాయణ, వాసిష్ఠలైంగ, సూతసంహిత, భారత, హరివంశ, సావర్ణిసంహిత, శివ, శివధర్మశాస్త్ర, ఈశానసంహిత, బృహత్కాలోత్తరము, వ్యాస జైమినిసంవాదము మొదలయిన పురాణోపపురాణేతిహాసములు.

వీరశైవధర్మశాస్త్రము, భీమాగమము, సర్వాగమోత్తరము, కారణాగమము, పాణిస్థతిలము, దివ్యాగమము, ఈశ్వరాగమము మొదలయిన వీరశైవధర్మప్రసాద కాగమాదిగ్రంథములు.

వ్యాకరణ, చ్ఛందోలంకార, షట్తర్క, వైశేషిక, హఠయోగ, నేత్రవైద్య, విషవైద్య, రసవాద, జ్యోతిష, కొక్కోక, భరత, సంగీతాదిశాస్త్రములు.

ఆంధ్ర, కర్ణాట, తమిళ, మహారాష్ట్ర, సంస్కృత భాషా పాండిత్యము.

ఇన్నివిషయములనుగురించిన్ని సోమనాథునికి సంపూర్ణముగా తెలియడమే కాకుండా, నానాదేశాచారములు, నానామతసిద్ధాంతములు, నానావిధాహార, విహార, వేషసంప్రదాయములున్ను తెలుసును. అతడు ఉత్త వేదజడుడు కాడు. గొప్ప లౌకికుడు. ఉద్ధతుడు. ఒకరిని లక్ష్యపెట్టేవాడు కాడు. పాండిత్యవిషయములో శ్రీనాథుని కంటె నూరు రెట్లెక్కువ అని చెప్పవచ్చును. శ్రీనాథుడు గౌడ డిండిమభట్టుకంచుఢక్క నొక్కదానిని పగులగొట్ట గలుగుతే, ఇతడెన్ని ఢక్కలను ఎట్టిఢక్కలనైనా పగులగొట్టుగల అపారపాండితీ ప్రజ్ఞాధురంధరుడు, నోటిబూకరము కలవాడు కూడాను.

పరమతఖండనమున కితడవలంబించిన పద్ధతిలో ఒక విశిష్టత ఉన్నది. అతడొకొక్క వాదమును తీసుకొని, దాని స్వరూపమును ముందుగా తెలిపి, తరువాత వేదవాక్యముల నుదాహరించి, ఆ వాక్యముల కావాద మెట్లు విరుద్ధముగా ఉన్నదో స్పష్టము చేసి, తరువాత పురాణేతిహాసములనుండి ఐతిహ్యముల ననుసంధించి, దానిని తుక్కుతుక్కుగా ధూళి కెగురగొట్టుతాడు. ఆ వాదపద్ధతి సంపూర్ణముగా నైయాయికపద్ధతి ననుసరించి ఉంటుంది. వీరశైవసిద్ధాంతమే సరియైనసిద్ధాంత మని సంపూర్ణమైన విశ్వాస ముండడము చేత అతని కెక్కడను లేని వాగౌద్ధత్యము కలిగినది. అతని కొకరి లక్ష్యము లేదు. ఎదిరిపక్షమువా డతని కొక చీమవలెనో, దోమవలెనో కనబడతాడు. వాదప్రకరణములో ఒకొక్క వాదము

నెత్తుకొని దానిని చీల్చి, చెండాడి, దుమ్మున కెత్తిపోసి, తుట్టతుదకు శివపరమోత్తమత్వమును సిద్ధాంతించి, అదే సరియైన సిద్ధాంతమని రుజువుచేయడానికి, "గౌరీశుమీఁద శైవంబులేఁడని తలయిచ్చి పడయుదును, మంటఁబట్టుదుఁ, దొడరిన గెలుతుఁబనుగొన వాద వితండ జల్పములను" అని ప్రతిజ్ఞచేసి, "శివుమీఁద నొకఁడు గలఁడన్న నాయఱకాలెత్తి వాని నడుదలఁ దన్నుదు" అని గర్జించినాడు. ఎంతటి ఔద్ధత్యము! ఎంతటి సాహసము! ఎంత పొగరు!

సోమనాథుని వైదుష్యముమ, లోకజ్ఞానమును బసవపురాణ పండితారాధ్యచరిత్రములలో అనేకవిధములుగా ప్రస్ఫుటితమైనది. హఠయోగము. బ. ౧౫, (౨) ౩౬౬-౭ ; రసవాదము (౧) ౮౪౪-౭౦ ; నేత్రవైద్యము (౨) ౧౦౭-౯ ; సర్పవైద్యము (౧) ౮౩౬, ౫౧౩ ; ద్యూతవిద్య (౧) ౩౬౭, ౮౧౩, శకునశాస్త్రము బ. ౨౮౨, ౨౮౮ ; (౨) ౫౯-౬౦, ౧౯౩ ; వేశ్యావర్ణనము (౧) ౩౮౩-౩౮౯ ; కామశాస్త్రము (౧) ౩౩౫-౩౪; చోరవిద్య బ. ౧౫౮ ; మృగయ బ ౯౬, ౧౬౯ ; గర్భచిహ్నాలు బ. ౧౮ ; పిల్లలను పెంచేవిధము బ. ౬౪ ; పిల్లలను లాలించే విధము (౧) ౮౫౬, బ. ౪౦ ; పిల్లల ఆటలు (౧) ౮౬౦ ; శరీరావయవకర్మలు (౧) ౮౭౫ ; వస్త్రభేదములు ; బ ౫౬ (పంద్రెండేండ్లు నేసిన పసిఁడిపటవలి పుట్టమును గురించి సోమనాథుడు చెప్పినాడు బ. ౫౪ ; కోటలనిర్మాణము బ. ౪౮ ; ఈరీతిగా ఎన్నో విషయములను గురించి సోమనాథుడు విస్తరించి చెప్పినాడు.

---

౫

## సోమనాథుని గ్రంథములు

బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, అనుభవసారము' చతుర్వేదసారము, సోమనాథభాష్యము, రుద్రభాష్యము, బసవ రగడ, గంగోత్పత్తిరగడ, సద్గురు రగడ, చెన్నమల్లుసీసములు, నమ స్కారగద్య, వృషాధిపశతకము, అక్షరాంకగద్యపద్యములు, పంచ ప్రకారగద్య, అష్టకము, పంచకము, రెండుదాహరణములు, మొద లయిన కృతులను పాల్కురికి సోమనాథుడు రచించినాడని పిడుపర్తి సోమన తన పద్య బసవపురాణములో చెప్పినాడు. వీటిలో కొన్ని సంస్కృతములోను కొన్ని కన్నడములోను ఉన్నవి. బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, అనుభవసారము, చతుర్వేద సారము, చెన్నమల్లు సీసములు, వృషాధిపశతకము, ఒక బసవోదాహరణము, తెలుగు గ్రంథములు. సోమనాథుని సంస్కృత కర్ణాటక గ్రంథ ములతో మన కిక్కడ పని లేదు. వాటినిగురించి తెలుసుకొననెంచిన వారు శ్రీ ప్రభాకరశాస్త్రులవారు రచించిన బసవపురాణ పీఠికలో చూచుకోవచ్చును.

సోమన తెనుగుకృతులలో అనుభవసారము, చెన్నమల్లు సీస ములు, అనే గ్రంథములలోని విషయములు కేవలము వీరశైవమత బోధను ప్రతిపాదించడమే లక్ష్యములో ఉంచుకొని వ్రాసినవి. వీటిలో సోమనాథుని కవితాగౌరవము తేటపడదు. వృషాధిపశతకము కొంత మేలు. బసవపురాణ కథాసార మిందులో చేరినది. కవిత శబ్దనైచిత్రి గలిగి, ధారావాహికగా ఉన్నది. దీనిలోని సంస్కృత,

ద్రావిడ, కర్ణాట, మహారాష్ట్ర భాషలలో రచింపబడిన పద్యము లున్నూ, మణిప్రవాళ శైలిలో రచితము లయినవిన్నీ సోముని వివిధ భాషాపాండిత్యముల వెల్లడిస్తున్నవి. బసవోదాహరణము తెనుగు వాఙ్మయములో ఒక విశిష్టకృతి. ఉదాహరణకృతులు మరికొన్ని త్రిపురాంతకోదాహరణములవంటివి తెనుగులో వెలసినవి.

సోమనాథ స్తవ మనే గ్రంథ మొకటి సోమనాథకృత మని బండారు తమ్మయ్యగారు చెప్పినారు. అది సోమనాథునికృతి కా దని ప్రభాకరశాస్త్రిగారి తలంపు. ఈ తలంపున కా గ్రంథము లోని కవిత్వరీతి అంత ప్రశస్తమైనది కాకపోవడమే కారణము. పిడుపర్తి సోమన్న పాల్కురికి సోమునికృతులలో ఈ గ్రంథమును చేర్చకపోవడ మొక ఉపకారణము. పిడుపర్తిసోమన్న వివరించిన గ్రంథముల పట్టికతరువాత 'ఆదియగు కృతుల్' అని చెప్పి నాడు కాబట్టి వాటిలో ఈ సోమనాథ స్తవమేకాక, మల్లమ దేవి పురాణము, భక్త స్తవము, అనేవికూడా చేరి ఉండవచ్చు నని తమ్మయ్యగారు వ్రాసినారు. (ఆం. సా. పరి. ప. xxi 3.) తమ తలంపున కాధారముగా బసవపురాణ పండితారాధ్య చరిత్ర ములకున్నూ వీటికిన్నీ రచనలో కొన్ని పోలికలు చూపినారు. ప్రాసయతివిషయమున నీ గ్రంథమునకున్నూ, బసవపురాణ పండితా రాధ్య చరిత్రములకున్నూ భేద మున్నా, సోమనాథస్తవము, సోమ నాథుని ప్రథమకృతి అయి ఉండవచ్చునని అభిప్రాయపడినారు. కాని రచనలో అక్కడక్కడ కొన్నిపోలిక లున్నంతమాత్రము చేతనే ఆ గ్రంథము సోమనాథ కృతి కాజాలదు. సూక్ష్మముగా ఆలోచిస్తే ఆగ్రంథముధోరణి పాల్కురికి సోమనాథుని నుడికారమునకు దగ్గరగా కూడ రాదు. అయినా, ఇతరాధారములవల్ల దీని కర్తృత్వమును నిర్ధారణ చేసేవరకున్నూ ఏమీ చెప్పడానికిన్నీ వీలులేదు.

సోమనాథుని ఆంధ్ర కృతులలో బసవపురాణ పండితారాధ్య చరిత్రములు పేరెన్నిక గన్నవి. ఈ రెండింటిలోను పండితారాధ్య చరిత్ర మెన్నో రెట్లు కవిత్వవైభవములో అతిశయిస్తున్నది. అయినా బసవపురాణరచనపోకడలు కొన్ని పండితారాధ్య చరిత్రములోను ప్రతిఫలించినవి. ఒక్క ఉదాహరణము.

"హరుఁడు నిరాకారుఁ డైనచో బసవఁ
డరయంగ సాకారుఁ డై చరియించు,
హరుఁడు సాకారుఁడై యలరుట సూచి
శరణుఁడై బసవండు సంచులేకుండు,
శరణుఁడై బసవండు సందు సేకొన్నఁ
బరమభక్తిస్థితి బసవన్న గొలుచు,
భక్తుఁడై లింగంబు ప్రకృతి సేకొన్న
వ్యక్తిగా బసవన్న వరవుడు సేయుఁ,
... ... ... ...
సాలోక్య సామీప్య సారూప్య పదవు
లోలిని బొంద సాయుజ్యంబుఁ జెంద
వచ్చుఁగా కిల బసవస్వామిగాఁగ
వచ్చునే పెఱపెఱవారల కెల్ల."

బస. పు. ౫, ౬ పుటలు.

పై పంక్తులలో హరునకున్ను బసవన్నకున్ను అభేదమును కల్పించిన కవి పండితారాధ్యచరిత్రములో పండితుని హరునికంటె అధికునిగా చేసినాడు.

"చిరతమోగుణపరిస్ఫీతుఁడు శివుఁడు
వరసత్త్వగుణవికస్వరుఁడు పండితుఁడు,
అరయ నచరలింగ మాలింగమూర్తి
యరయఁగాఁ జరలింగ మా పండితయ్య,
యసమలోకాధీశుఁ డంబికాధవుఁడు
అసమలోకారాధ్యుఁ డా పండితయ్య,
యఖిలలోకమయుండు హైమవతీశుఁ
డఖిలలోకాతీతుఁ డా పండితయ్య,
లోకానుసారి త్రిలోచనుం డిల న-
లోకానుసారశీలుఁడు పండితయ్య,
యరుదగు లోకసంహారుండు శూలి
గరుణనై లోకోపకారి పండితుఁడు,
అసితకంఠుండు దా నసమలోచనుఁడు
భసితకంఠుండు శ్రీ పండితేంద్రుండు,
ఊర్ధ్వైకలోచనుం డుడురాజమౌళి,
యూర్ధ్వద్విలోచనుం డొగిఁ బండితయ్య,
భక్తైకదేహుండు పరమేశ్వరుండు
భక్తసత్ప్రాణుండు పండితస్వామి,
మల్లికార్జునసామి మల్లికార్జునుఁడు
మల్లికార్జునకీర్తి మల్లికార్జునుఁడు,

మహిలోనఁ బండితమల్లికార్జునుని
మహిమలు వర్ణింప మనుజులతరమె ?"

పండి.. చ I. ౫-౭

ఇటువంటి పోలిక లీ రెండుగ్రంథములలోను అడుగడుగు
నన్ను కనబడుతవి. కాని, ఎత్తుబడిలో, తూగులో, ధారలో, నడక
లో, జిగిబిగులలో బసవపురాణము పండితారాధ్య చరిత్రమునకు
తీసిపోతుంది. దీనిలోని పాండిత్యము దానిలో లేదు, దీనిలోని ఆవే
శము దానిలో లేదు. దీనిలోని ఔద్ధత్యము దానిలో లేదు. నూతన
పురాతన శైవభక్తులకథలు బసవపురాణములో ఒక మాహాత్మ్య వర్ణ
నము గల గ్రంథమువలె ఎదుగుబొదుగులు లేని రోకటిపాటవలె
నడిచే ద్విపదలలో చెప్పబడినవి. బసవపురాణమునకు కావ్యలక్షణము
లేదని కాదు. కాని, పండితారాధ్యచరిత్రమున కా లక్షణము
సంపూర్ణముగా పట్టినది. భవికవుల ఆంధ్ర గ్రంథములలో మహా
భారత మెట్టిదో శివకవుల గ్రంథములలో సోమన రచించిన పండితా
రాధ్యచరిత్ర మట్టి దని చెప్పడ మతిశయోక్తి కానేరదు.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని,
వేదాంతవిదులు వేదాంత మనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని,
కవివృషభులు మహాకావ్య మనియు,
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని,
యైతిహాసికు లితిహాస మనియుఁ,
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ-
యం బని మహిఁ గొనియాడుచుండ,

వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీన మై
పరగుచుండఁ జేసె భారతంబు"

పై పద్యములోని ఎత్తుగీతిలోని వేదవ్యాసునికి బదులుగా పాల్కురికి సోమనాథునిపేరును భారతమునకు మారుగా పండితారాధ్య చరిత్రమును, విష్ణుసన్నిభుఁ డనే మాటకు మారుగా హరసన్నిభుడనిన్ని పఠిస్తే పండితారాధ్యచరిత్ర స్వరూపమునకు సరిపోతుంది.

పండితారాధ్యచరిత్రములో వీరశైవ ధర్మము సంపూర్ణముగా వివరింపబడినది. వీరశైవ సిద్ధాంతము నిష్కర్షగా ప్రపంచింపబడినది. వీరశైవనీతిమార్గము బాహాటముగా వర్ణింపబడినది. దానిలో ఎన్నో అపూర్వములైన ఇతిహాసములు చేరినవి. నూత్న పురాతన శైవభక్తులను గురించిన పురాణకథలు చేరినవి. దాని కావ్యత్వవిషయమున్ను, లక్ష్యసంగ్రహత్వ విషయమున్ను చెప్పనే అక్కరలేదు.

---

౬

## కావ్యకళ

కావ్యకలను గురించి సోమనాథు డిట్లు చెప్పినాడు :—

"ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరస మై పరగిన జానుఁదెనుంగు
సర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కి దైవారఁ;
దెలుఁగుమాట లనంగవలదు; వేదముల
కొలఁదియకాఁ జూడుఁ డిల,—నెట్టు లనినఁ,
బాటితూమునకును బాటియౌ నేనిఁ
బాటింప నోలయుఁ బాటియ కాదె ?
అల్పాక్షరముల ననల్పార్థరచన
గల్పించుటయకాదె కవివివేకంబు ?
అలరుచు బసవనిఁ దలఁచుతలంపు-
బలుపునఁ గాఁజేసి భావమ్ము మెఱసి
యకలంక లింగరహస్యసిద్ధాంత
సకలవేదపురాణసమ్మతం బైన
యాతత బసవపురాతన భక్త
గీతార్థసమితియే మాతృక గాఁగఁ

బూరితంబై యొప్పుపూసలలోసఁ
దారలక్రియఁ బురాతనభక్తవితతి
చరితలలోపల సంధిల్ల బసవ
చరిత మే వర్ణింతు సత్కృతి యనఁగ"

బస. పు. ౫.

"ఐనను లోకహితార్థంబు గాఁగ
నా నేర్చుకొలఁది వర్ణన సేయువాఁడ;
నవరసరసికత భువిని బేర్కొన్న
శివకవిప్రవరుల చిత్తంబు లలర;
నిప్పాట నితరులఁ జెప్పెడి దేమి ?
తప్పులు దారులు దడఁబడఁ బలికి
వెలసినచదువులు వీటఁబో జిత్త
పాలిసిపోయిరి దమపురులు దూలంగ;
మృదుమహత్త్వముఁ గానమిని బొంకులనఁగఁ
బడుఁ 'గవయః కిం న పశ్యంతి' యనుట
యనుచుఁ గుకవులగీటునఁబుచ్చి పేర్చి
వినుతింతు."

బస. పు. ౬

"బసవవర్ణనల్ సేసితి వరుసన వీనులారంగ;"
"తన్మహాభక్తైకమహిమఁ బసరింపు, మసమ
వాక్పాటవశక్తి నొసగితిమి."

 పండి. చ. (౧) ౧౨

"బసవపురాణ ప్రబంధ మన్ పేరి
బసవపురాణ మన్ పట్టి గీలాండ;
... ... ... ...
బసవన్నఁ బొగడఁ బొల్పడు కవీంద్రుఁడను
బసవన్నఁ బొగడఁ బొల్పడుపాఠకుండ"

పం. చ. (౧) ౧౪

"వాచూర భక్తుల వర్ణింపఁ గంటిఁ
బాయక నాజిహ్వ పావనం బయ్యె,
[బ]దికితి.

పం. చ. (౨) ౧౩

"బసవేశు డక్కిన భక్తుండ వనియు
ననదృశలీల మా కనుగులం బనియు
మచ్చిక నాముద్దుమఱంది వీ వనియు
నెచ్చెలికాఁడవు నీవ కా కనియుఁ
జాతుర్యసాహిత్యశాలి వీ వనియు,
శ్రోతృత్వమునకుఁ బాత్రుండ వీ వనియు
రచియింతుఁ బండితారాధ్యచరిత్ర;
... ... ... ...
దీవించి, నిన్ను సంభావించి, శ్రోతఁ
గావింతు సచివాగ్రగణ్య! సూరార్య!"

పం. చ. (౧) ౧౬-౧౭

"సత్కృతి యన నూత్నసంగతి దనరఁ
దొమ్మిదిరసములు దులు కాఁడ, దాని
యిమ్మడివర్ణన లెసగంగ, ద్విగుణ
మగునలంకారంబు లసలార, దాని
ద్విగుణార్థభావముల్ దీటుకొనంగఁ
దేట తెనుంగున ద్విపద రచింతు"

పం. చ. (౧) ౧౮

"ఆమ్నాత గద్యపద్యాది ప్రబంధ-
పూరిత సంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు"

పం. చ. (౧) ౧౮

"జాతులు రచనా ప్రణీతులు గావ్య -
నీతులు రీతులు నేతులుట్టంగ
వరకవుల్ గొనియాడ వర్ణనకెక్క-
ధరఁ జెప్పఁ గృతియు సద్యత్కృతి."

పం. చ. (౧) ౧౯-౨౦

" వస్తునుఁ బెరుఁగుఁ బిసుకుచందపు బిలిబిలి
కృతుల్ గృతులె; "

పం. చ. (౧) ౨౦

"పటుగద్యపద్యప్రబంధసామ్యముగఁ
గావ్యకళాప్రౌఢిఁ గల్పింతు ద్విపద
కావ్యంబు భావ్యంబు గాన."

పం. చ. (౧) ౨౦

"తిన్నని సూక్తుల ద్విపద రచింతు."

పం. చ. (౧) ౨౨

పైని బసపురాణపండితారాధ్యచరిత్రములనుంచి ఉద్ధరించిన వాక్యములలో సోమనాథుని కావ్యకలాసిద్ధాంతము నిర్వచింపబడినది. కావ్యమునకు వస్తువు, స్వరూపము, రెండున్ను ముఖ్యములే. వస్తువు పురాతనమైనదిగా ఉండవలెను. ఆద్యసత్కథలతో ఒప్పవలెను. ఆ వస్తువు కవిజీవితాశయముల కనుసంధానము కలిగిఉండవలెను. అందు చేతనే సోమన్న తనదృష్టిలో హరునితో సమానుడైన బసవన్నను, హరు నతిశయించిన మల్లికార్జున పండితారాధ్యుని తనకావ్యములకు నాయకులగా చేసినాడు. వారిచరిత్రలను పూసలలో దారమువలె పురాతనభక్తవితతిచరితలలోపల సంధించినాడు. తనకావ్యనాయకుల యెడల కవి కసమానగౌరవము, భక్తి, ప్రపత్తి ఉన్నది. పురాతన భక్తుల కతడు పెంపుడుకొడుకు. బసవడు నందికేశుని అవతారమూర్తి సోమన్న బసవగోత్రుడు, బసవని పాదపద్మసేవకుడు, అతనికవీంద్రుడు, అతనిపాలకుడు. అతనికి దూత, బంటు, లెంక, లెంగి, ఇలువుట్టుబానిసకొడుకు, అతనిపన్నలపన్న. ఇక పండితారాధ్యుడు మనుష్యుడే కాడు. వివిధప్రమథగణముల ప్రత్యేకగుణములు ప్రోవయి యేర్పడినమూర్తి. పరమపరానందమొసగే శివభక్తి, నందికేశుసర్వజ్ఞత, భృంగిసహజనిష్ఠ, దుర్వాసాదులశాపశక్తి, అక్షపాదాదులవాగ్విచక్షత, ఉపమన్యుసద్గురుత్వంబు, ప్రమథగణములప్రసాదైకరతి, ప్రాక్తన

నూతనభక్తగణముల వ్యక్తదృష్టప్రత్యయగూఢమహిమ, వీరభద్రుని శౌర్యము, ఇవన్నీ తగినపాళ్లలో మేళనము పొంది, ముద్దగించి, కరుడుగట్టి, ఘనీభవించినమూర్తి అతనిది. అట్టినాయకులను 'తలఁచు తలంపు బలుపునఁ గాఁజేసి' అతనిభావము మెరసినది. 'అకలంక లింగరహస్య సిద్ధాంత సకలవేదపురాణసమ్మతమైన భక్తిగీతార్థసమితి' తనకావ్యములకు మాతృక.

వస్తు వెంత మంచిదయినా, శిల్పి దాని నుపయోగించి, దిద్ది తీర్చడములో దానిమేలిమి బయలుపడుతుంది. ఉన్నదున్నట్టుగా బోడిగా వస్తువును నిర్మించడము పురాణమార్గము. భక్తమాహాత్మ్యములు, స్థలమాహాత్మ్యములు మొదలయినవి పురాణవస్తువులు. కాని, పురాణ వస్తువుల కందము కల్పించి కావ్యవస్తువులుగా మార్చడానికి 'మాత్న సంగతి'ని కల్పించవలెను. నాచనసోమనాథుడు నవీనగుణసనాథుడ నని వర్ణించుకొన్నాడు. నవీనగుణము లంటే నవీనకావ్యగుణము లని అతని అర్థము. అతని నవీనకావ్యగుణములను శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తమ 'సారస్వతోపన్యాసము'లనే గ్రంథములో వివరించినారు. పాల్కురికి సోమనాథుని మాత్నసంగతి నాచన సోముని నవీనతకు చాలా విలక్షణమయినది. ఈతని నవీనగుణములను వివరించి చెప్పడానికిక్కడ తావు చాలదు. అయినా సంగ్రహముగా చెప్ప యత్నిస్తాను:

(౧) కథావస్తువులో క్రొత్తదనము. ఇతనికి పూర్వము శైవ కావ్యము లున్నా, వాటికిన్ని సోమనాథుని గ్రంథములకున్ను పోలిక లేదు.

(౨) వీరశైవసిద్ధాంతమును వివరించే ఉద్దేశములో కావ్యమనే ఆధారమును కల్పించుకొని, సిద్ధాంతమును ప్రత్యేకముగా విస్తరించి

చెప్పక కథతో మేళగించి, కవి తనసిద్ధాంతమును ప్రతిపాదిస్తున్నా డనే విషయము పాఠకులకు తోచకుండా చేయడము.

(3) అనేకములయిన విడివిడి భక్తమహాత్మ్యకథల నొక్క చోట చేర్చి, అవి అన్నీ ప్రత్యేకకథలు కానట్లు కావ్యస్వరూపమును కల్పించడము.

(४) తనకు గల ప్రత్యేకవిద్యలను గురించినజ్ఞానమును విస్తరించి చెప్పినా, పాండిత్యప్రకటనముకోస మిట్లు చేస్తున్నా డన్నభావము చదువరులకు కలుగనివ్వకపోవడము.

(౫) వేద, వేదాంగ, స్మృతి, పురాణేతిహాసములనుంచి వాక్యములను న్నవున్నట్లుగా ఉదాహరించినా, అవి ఉద్ధృతవాక్యములనే జ్ఞానమును కల్పించక, తనకవితాధారలో వాటిని లయముచేయడము.

(౬) వేదశాఖలు, పురాణములు, ఉపనిషత్తులపేళ్లు, రాగములు, అభినయభేదముల పేళ్లు, పత్తిరి, పండ్లు, కాయలు, పుష్పముల పేళ్లు, మనుష్యులపేళ్లు ఈరీతిగా ఎన్నో ఉత్తపేళ్ల గుత్తడములమ పుటలకొలది నింపినప్పటికిన్ని, విసుగెత్తించకుండా ద్విపదలను సాగించడము.

(౭) చెప్పినవిషయమునే మళ్లీ చెప్పతూఉన్నా, అది పునరుక్తిగా తోచకుండా చెప్పడము.

(౮) తనకు పూర్వము కేవలము పాటలకు, పదములకు మాత్ర ముపకరిస్తూఉండే ద్విపదాచ్ఛందస్సును మహాకావ్యోపయోగిగా దిద్ది తీర్చడము.

(౯) ద్విపదలలోని మాత్రాగణముల సులువుగా నుపయోగించుట్యని, ఆయామనోవస్థల కనుకూలపడేటట్లు వాటిని సవరించడము.

(౧౧) అంతకుపూర్వము సంస్కృతభూయిష్ఠముగా ఉండే ఆంధ్రకావ్యరచనలను నిరసించి జానుతెనుగను పేర సమసంస్కృతోక్తులతో రచనను సాగించడము.

(౧౨) దేశినుడికారమును సంపూర్ణముగా అవలంబించి, తెనుగు తీయదనమునకు లోనై, 'జాతులు రీతులు నేతులుట్టంగ' రచించడము.

(౧౩) కేవల దేశీయపదముల నుపయోగిస్తూ, ఉపయోగిస్తూ, వాటివల్ల కవిత పేలవము కాకుండా మధ్యమధ్య సందర్భము ననుసరించి దీర్ఘసంస్కృతసమాసములను గుప్పించడము.

(౧౪) ప్రాచీనకావ్యలక్షణముమీద దృష్టిని విడువకుండా ఇటూ అటూ పరుసలెత్తి, మళ్లీ స్థాయికి రావడము.

(౧౫) అనుప్రాసాదిశబ్దాలంకారములను బలాత్కరించి తెచ్చిపెట్టకుండా, ఉత్సాహము, ఆవేశము, భావప్రవాహము, సిద్ధాంతస్థాపనము, మొదలయిన సందర్భాలలో ఇక్కడ ఈ అలంకార మున్నదని తోచనీయకుండానే పాఠకుని తనకవితాప్రవాహములో ఈడ్చుకొని పోవడము.

(౧౬) ఉపమాద్యర్థాలంకారములను సహజముగా ఉండవలసిన చోట్ల ఉపయోగించి, మనస్సుకు ఆనందము కూర్చడము.

(౧౭) ఉపమానములను కుప్పలుతిప్పలుగా గుప్పించి పాఠకుని ఊపిరి తిరుగకుండా చేయడము.

(౧౮) సంపూర్ణాసంపూర్ణక్రియాపదములను విధివిరామములు లేకుండా, గ్రుక్కతిరుగకుండా, ఒకదానివెంట నొకదానిని గుండ్ల బారులవలె ప్రయోగించడము.

(౧౯) ఆమ్రేడితోక్తులచేత భావమును [illegible] లేవడము.

(౨౦) కావ్యలక్షణమునకు తాను వశుడు కాక, లక్షణమును సంపూర్ణముగా తనవశములో ఉంచుకొనడము.

(౨౧) ద్విపదలను గోకటిపాటగా చేయక, మహావేగముతో పోతూఉన్న మెయిలుట్రెయిను నడకవలె, అనేక ప్రకారములుగా నడిపించడము.

(౨౨) శబ్దముల ధ్వని, నడక, వేగములతోనే ఆయాసందర్భముల కర్థస్ఫూర్తి నతిశయింపజేయడము.

(౨౩) వీరశైవేతరుల కపరిచితులైన శైవభక్తుల పేళ్లు, కథలు, మొదలయినవాటినికూడా చెవులలో గింగురుమన్నట్లు ప్రయోగించి ప్రయోగించి, అవి పరిచితము లయినట్లు చేయడము.

(౨౪) వీరశైవేతరపాఠకుని కితరసమయములలో వెగటుగా తోచే విషయములనయినా తనకవితానైపుణ్యముచేత హితవుగా ఉన్నట్లే తోపజేయడము.

(౨౫) సందర్భముననుసరించి భాషపోకడలను మార్చివేయడము. ఈరీతిగా పాల్కురికి సోమనాథుని కవితలోని నూత్నసంగతి నెంతయినా వివరించి చెప్పవచ్చును. ఈ నూత్నగుణము లడుగడుగునకున్నూ కనబడుతవి కాబట్టి వాటి కుదాహరణముల నివ్వనవసరములేదు. కవిత చెప్పితే జిహ్వ పావనమయేటట్లు 'వాయార' చెప్పవలెను. ఆ కవిత వినేవారు 'వీనులార' వినడానికి యోగ్యత కలిగి ఉండవలెను.

కావ్యములో తొమ్మిది రసములును తులుకాడవలెనని చెప్పి సోమనాథుడు తులుకాడించినాడు. శృంగార, హాస్య; రౌద్ర, కరుణ; వీర, అద్భుత; బీభత్స, భయానక; శాంతరసముల కుదాహరణములను బసవపురాణ, పండితారాధ్యచరిత్రములనుండి ఎన్నిటినయినా ఈయవచ్చును.

లక్షణగ్రంథములలో చెప్పబడిన శృంగార మీకావ్యములలో ఉన్నదానికి కొంత విలక్షణముగా ఉన్నది. ఈ కావ్యములలోని నాయకులు సాధారణకావ్యములలోని నాయకులవంటివారు కారు. నాయకునికిన్ని నాయికకున్ను గల సంబంధముచేత శృంగారరస మేర్పడుతుంది. కాని, సాధారణకావ్యములలోని నాయికలవంటి నాయికలకు సోమనాథుని గ్రంథములలో తావు లేకపోయినది. అందుచేత అతడు భక్తిశృంగారమనే ఒకక్రొత్తరీతిశృంగారమును కల్పించినాడు. బసవేశ్వరుని పెండ్లికొడుకువేషము భక్తిశృంగార మయినట్లు కవి వర్ణించినాడు. కాని, కావ్యరసనిరూపణవిషయములో నిజముగా బసవేశ్వరుడున్ను పండితారాధ్యుడున్ను నాయకులుకారు. వారు నాయికలు; శివుడు నాయకుడు. ఈ అపూర్వ నాయికా నాయకులకు గల సంబంధముచేత ఏర్పడిన భక్తిశృంగారమును సోమ నాథు డత్యద్భుతముగా నిరూపించినాడు. బసవేశ్వరునికిన్ని శివుని కిన్ని గల నాయికానాయకశృంగారభావనను చూడవచ్చును:

పనుగొన గురుమూర్తి పతి కూటమునకు
మనసు నపుంసకం బన నెట్లు వచ్చుఁ
బున్నపుంసకగుణంబులు గల్గెనేని
నెన్నంగ నతికామియే, యట్లుఁగాక—
మగలకు మగడగు మత్పతిఁ గవయ
మగవాండ్రు నాండ్రుగా మరుగుదు రనిన
మనసుగూడుట సోద్యమా పతినునుట
మనసున కటమున్న తనవిభుఁ గదిసి
మనికుగై తకుదాన మఱచియున్నట్టి

యనువు దానిదియొకో!-యట్లనుగాక,
సొగయంగ నొక్కుటఁ, జూచుట రెంట,
వగ మూఁట, నూర్పులు నిగుడనాల్గింటఁ,
దాప మైదంటను, దయ్యు డాఱింట,
నేవారఁ గుదువమి యేడింట మరులు,
నొక్కుండుఁ బలుకమి యొగి నెన్మిదింట,
నిక్కుమూర్పులు లేమి నెఱఁ దొమ్మిదింటఁ,
జావుపదింటఁ గ్రచ్చుఱ విరహులకు
భావింప నివియ దశావస్థ లండ్రు;
దా విభుఁ బాయక చావక చచ్చు
నీవిషయావస్థ లితరుల కగునె

... ... ... ... ...

నంబి పరమనాచుల కథలో కోకోకశాస్త్రము నంతటిని ఇమిడించిన సోమనాథకవికి శృంగారవర్ణనసామర్థ్యములో ఏమి కొరత ఉంటుంది?

హాస్యరసము భారతీయవాఙ్మయములో వ్యగ్యము. వికారము లైన అంగవ్యాపారములవర్ణనముల చేతను, తిండిపోతుతనము త్రాగుబోతుతనముల వర్ణనము చేతను, శీఘ్రముగా వెగటుపుట్టించే హాస్య మక్కడక్కడ కనబడుతుంది గాని, చల్లని హాస్యము, చిరునవ్వును పుట్టించి మనస్సు నానందింపజేసే హాస్యము సంస్కృతములో వలెనే తెనుగులో కూడా చాలా తక్కువ అని చెప్పవచ్చును. పింగళిసూరన గ్రంథములలో అది కొంచెముగా కనబడుతుంది; ఆతరువాత చేమకూరి వేంకటకవి విజయవిలాసములో కొంత గోచరిస్తుంది. ఆంధ్రములో పూర్వకావ్యములలో ఇట్టినిజమైన హాస్యరసము లేనేలేదనవ

మతిశయోక్తి కాదు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర ములో అట్టిహాస్యము కొంత దోబూచులాడుతున్నది. సూరసాని యింటిలో మాదిగవేషములో ఉన్న శివుడు మాదిగయే అని నిశ్చయించి అచ్చట చేరిన బ్రాహ్మణులు:

అగ్రహారంబను నలుకువ లేక
... ... ... ...
ఉక్కడంగింతు రన్నలుకును లేక
యరుచుఁ దానొక యయగారువోలె
నిలవేషధారి జంగిలియున్న వాఁడు,
వచ్చెఁదనకు జావువడిఁ దప్ప దనుచుఁ
జెచ్చెరఁ గుడిచియే చచ్చెద ననుచు
నాయంత్యజుం డుండెఁబో.........

పం. చ. (౧) ౧౨౪

అని పలికిన వెటకారపు మాటలలోని హాస్యము రమ్యముగా ఉన్నది.

మాయలు వన్నక మాఁదిగకొయ్యఁ
జూపుము చూపుమెచ్చోట దాచితివో

పం. చ. (౧) ౧౩౧

'మాదిగకొయ్య' అని బ్రాహ్మణు లనడములో వెగటైన హాస్య మున్నది.

పండితారాధ్యుడు వేదాంతవాదమును పడగొట్టి,

మొదల నీవేదాంతమున కభిప్రాయ
మెద్దియో యని నిశ్చయింపక సకల

వేదాంతవిషయవివేకంబు నీకు
లేదు; - కించిత్సాంఖ్యవాదివో కాని

పం. చ. (౧) ౫౬౦

పైదానిలో 'కించిత్' అనేశబ్దము మందహాసప్రేరక మవు తున్నది. బౌద్ధులు 'చంపిపెట్టినఁ దిం' డ్రట, కాని 'చంపగా' దం డ్రట కూడాను. పం. చ. (౧) ౫౮౮. పండితునితో వాదమునకు వచ్చిన ప్రతిపక్షు లంటున్నారు:

(శివుని) అపవిత్రు నొకదైవమని సమర్థించి
పలికెద విదియు, నీపండితత్వంబు -
కలిమియె? విద్వన్నికాయంబునగరె?
పొదపద మింక నీపొత్తంబు గట్టి
చదువులు గిదువులు సాలింపుము"

పం. చ. (౧) ౬౦౪

అనడమువల్ల పండితుని చూచి అతని విద్వేషులు కూడా నవ్వి ఉండవలెను. అంచెన్నశివునితో మోటుగా బావమరదిహాస్యము చేస్తున్నాడు.

'జడ్డలాడెదు కాక శంకర! యేను
గ్రుడ్డినో మఱి నీవు గ్రుడ్డివో చెపుమ;
కోల నిచ్చెదువాడు గుడికడ నుండఁ
జాలక నశః పెట్టి చనియె నింటికిని;
నంబే యనిన నోంటి నరుగుదేనేర,
నంబా యనిన నోంటి నరుగుదేనేర' అని

పం. చ. (౨) ౧౧౨

ఈ ప్రోసముదక్షాధ్వరధ్వంసము, ప్రలయలీల మొదలయినవాటి వర్ణనములలో నిండుకొని ఉన్నది. బసవని నిర్యాణవార్త విని పండితుడు పలవించినపట్టు కరుణరసము పొంగి అనేకమయినవాటిలో ఒకటి. వీరరసము మడివాలు మాచయ్య మొదలయిన వీరభక్తుల కథలలో వెల్లివిరిసినది. అద్భుతరసము మల్లికార్జునశివుడు దోనయ్యకు శ్రీశైలముమీాది అద్భుతవిషయములను చూపించే సందర్భమున అందగించినది. బీభత్సము అల్పాయుష్కుడని తెలియకమునుచేత బెలిదేవి వేమనారాధ్యు లాశీర్వదింపకపోగా కాలగతిపొందిన రాజు శవము వర్ణనము ఏవపుట్టించి భీతి గొలిపిన పట్టున కనబడుతున్నది. భయానక రసము పల్నాటి చోళుని వంశక్షయవర్ణనము చేసినచోట ప్రవహించినది. పండితారాధ్యుని లింగార్చనావర్ణనసమయమునలో శాంతిరసము మూర్తీభవించినది. ఆయారసముల కుదాహరణములు సోమనాథుని కావ్యములలో నిండుకొని ఉన్నవి. ఎక్కువ ఉదాహరణము లిచ్చి గ్రంథవిస్తరము చేయబనిలేదు.

మహాకావ్యములో పద్ధెనిమిది వర్ణనము లుండవలె ననడము లాక్షణికసంప్రదాయము. కాని, ఈ అష్టాదశవర్ణనము లేవి అనే విషయములో అభిప్రాయ భేదమున్నది. శైలము, అంబుధి, పురము, రాజు, ఋతువులు, యాత్ర, యుద్ధము, మంత్రము, ఉద్యానము, చారుడు, సురతము, వివాహము, జలక్రీడ, విప్రలంభము, చంద్రోదయము, సూర్యోదయము, పుత్త్రుడు, మధుపానము అని ఒక పట్టిక ఉన్నది. కావ్యములో ఈ వర్ణనలే ఉండవలె ననడము కావ్యరచన క్షీణదశకు వచ్చిననాటి సంప్రదాయము. పాల్కురికి సోమనాథుడిట్టి లాక్షణికాజ్ఞలకు లోబడే ఘటముకాదు. అష్టాదశవర్ణనలే ఉండవలె ననడ మెందుకు? వాటికి ముమ్మడి నలుమడి వర్ణనలనుకూడా అతడు చేసినాడు. వాటిలో కావలిస్తే పద్ధెనిమిదివర్ణనలుకూడా

ఉన్నవి. కావ్యములో పద్దెనిమిది వర్ణన లున్నది సత్కృతి అవుతుంది అని అతడు చెప్పినదానికి వర్ణన లాసంఖ్యకు తక్కువ పడకూడదు, కావ్యము వర్ణనబహుళముగా ఉండవలెను అని అర్థము.

సత్కృతిలో అలంకారములు ముప్పైఆరుండవలెనని సోమనాథుడు చెప్పడ మాతనికాలమునాటి సంప్రదాయమై అతని ప్రాచీనత్వమును తెలియజేస్తుంది భామహ, దండి, ఉద్భట, వామనులు చెప్పిన అలంకారములసంఖ్య ముప్పైఆరు ఆప్రాంతములో ఉంటుంది. భామహు డలంకారములను నాలుగువర్గములుగా విభజించినాడు. మొదటివర్గములో (౧) అనుప్రాసము (౨) యమకము (3) రూపకము (౪) దీపకము, (౫) ఉపమ, అనేవి చేరినవి. రెండో వర్గములో (౧) ఆక్షేపము (౨) అర్థాంతరన్యాసము (3) వ్యతిరేకము (౪) విభావన (౫) సమాసోక్తి, (౬) అతిశయోక్తి అనేవి చేరినవి. యథాసంఖ్యము, ఉత్ప్రేక్ష, అనేవి మూడోవర్గములోనివి. నాలుగోవర్గములో అతడు ఇరవై నాలుగలంకారములను చేర్చినాడు. ఈరీతిగా భామహుడు చెప్పిన అలంకారములసంఖ్య ముప్పై ఏడయినది. భామహునికి తరువాతివాడైనదండి ముప్పైఅయిదుఅర్థాలంకారములను పేర్కొన్నాడు. శబ్దాలంకారము లన్నీ ఒక్కరీతివే అని అతని అభిప్రాయము కాబట్టి, అతడు వివరించిన ప్రధానాలంకారముల సంఖ్య ముప్పైఆరవుతుంది. ఈప్రధానాలంకారములలో కొన్ని ఉపభేదముల నాతడు వివరించినాడు కాని ప్రధానాలంకారసంఖ్యా గణనములో వాటిని చేర్చకూడదు. వామనుడున్ను ఉద్భటుడున్ను చిన్నచిన్న భేదములతో అలంకారములసంఖ్యను ముప్పైఆరింటి ప్రాంతములోనే ఉంచినారు. ఆ తరువాతివా రాసంఖ్య నమితముగా పెంచినారు. కాబట్టి పాల్కురికి సోమనాథుడు అలంకారములు ముప్పైఆరు అనే ఆలంకారికసంప్రదాయము ప్రబలముగా ఉండిన కాలమువాడని నిశ్చయింపవచ్చును. నిరలంకృతిగా సోమనాథుని

పలుకు బయలుదేరను కాబట్టి ఆయా అలంకారముల కుదాహరణము లను సులభముగా ఏర్పాటుచేయవచ్చును.

అలంకారముల తరువాత కావ్యమునకు ముఖ్యమని సోమ నాథుడు వచించినవి అర్థభావములు. ఇవి ఏభై రెండని అతని అభి ప్రాయము. స్థాయిభావములు, విభావములు, అనుభావములు, సాత్త్విక భావములు, సంచారిభావములు, అనేవే అర్థభావములని సోమనాథుని అభిప్రాయమై ఉంటుంది.

ఈ రీతిగా సోమనాథుడు తననాటి అలంకారికసిద్ధాంతమును పేర్కొని కావ్యత్వసిద్ధివిషయమై తన అభిప్రాయమునుకూడా సూచిం చినాడు. రసమునకు భావము ప్రధానము. భావము 'తలఁపు బలుపు' మూలముగా బయలుదేరవలెను. పనిపట్టి బలాత్కారముగా సృష్టి చేసినది భావము కానేరదు. కావ్యరచన కొకప్రయోజన ముండ వలెను. ప్రతిపాదితవిషయము 'సకలవేదపురాణ సమ్మత'మై, వేదాంత 'రహస్యసిద్ధాంత'స్థాపనమూలముగా మోక్షహేతువు కావలెను. కావ్యము 'లోకహితార్థ'ముగా రచింపబడవలెను. కావ్యవస్తువు కేవల కల్పితమై ఉండక శ్రుతిస్మృతిపురాణేతిహాసములలోని కథలను 'మాతృక'గా కలిగిఉండవలెను. కవికి 'వాక్పాటవశక్తి' ఉండవలెను. అతడు 'అల్పాక్షరముల ననల్పార్థరచన' చేయగల ప్రజ్ఞ కలవాడు కావలెను. 'కవయః కిం నపశ్యంతి' అనే సూక్తి చొప్పున కవి సమస్తవిషయములను తెలిసినవాడుగా ఉండ వలెను. కావ్యబంధము బిగువుగా ఉండవలెను గాని 'వడ్లను బెరుఁగుఁ బిసుకుచందపుబిలిబిలికృతి'గా ఉండకూడదు. 'జాతులు రచనాప్రణీ తులు కావ్యనీతులు రీతులు నేతులుట్టంగ' కావ్యమును సాగించవలెను. కావ్యములో కళాప్రౌఢి నిండుకొని ఉండవలెను. చెప్పిన విషయము వాయూర జిహ్వాప్లావనమైనట్లు చెప్పవలెను. వినేవారు వీనులార

వినేటట్లు చెప్పవలెను. నవరసరసికతకు పేరుగొన్న వరకవులు మెచ్చుకొనేటట్లు కావ్య ముండవలెను.

సోమనాథుడు విస్తరించిన కావ్యగుణములున్నూ దోషము లున్నూ లాక్షణికులు వివరించినవాటికి భిన్నముగా ఉన్నవి. లక్షణ గ్రంథములలో కావ్యగుణములు శ్లేష, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఉదారత్వము, ఓజస్సు, కాంతి, సమాధి అని పది. కాని సోమనాథుడు సరళత, ప్రసన్నత, చెన్ను, పరిణతి, గణపదపద్ధతి, శబ్దశుద్ధి, ప్రయోగప్రసిద్ధి, కళాసమృద్ధి, నానుడి, వడి, మితి, రతి, అర్థపుష్టి, నైజము, రసపుష్టి, వినూత్నసృష్టి, విశేష్యవిశేషణశ్లేష, సొంపు, కుమారత, పెంపు, మాధుర్యము, మృదుత్వము, ఓజ, ఋజువు, యమకము, గమకము, యతి, గతి, కారకము, పూరకము, క్రీడ, కాంతి, విశ్రాంతి, రంగు, బెడంగు మెఱుంగు, సమానసంగతి, అక్షరశయ్యాసంఘటన, నిపుణత, రసికత, సమాధానము, ఉపమానము, అవధానము, ఉత్ప్రేక్ష, లక్ష్యలక్షణవ్యక్తి, అలంకారయుక్తి, చక్షుత, సుమతి, విచక్షత, అని నలభైతొమ్మిదింటిని ప్రపంచించినాడు. పైని పెద్దచ్చులో ముద్రించిన పదింటిలో తొమ్మిదిపేళ్లించుమించుగా లక్షణగ్రంథములలోని కావ్యగుణముల పేళ్లే. 'బెడంగు' అనేది దశగుణములలోని ఉదారత, అవుతుందేమో! 'యస్మిన్ సతి నృత్యంతీవ పదాని' అని శబ్దగుణమైన ఉదారత్వము పరముగాను, అగ్రామ్యత్వమని అర్థగుణమైన ఉదారత్వము పరముగాను వామను డాపదమునకు నిర్వచనముచేసినాడు. వామనుని ప్రకారముకావ్యగుణములు పదే అయినా శబ్దార్థములకు ప్రత్యేకముగా సంబంధించినవై అవి ఇరవై అవుతున్నవి. కాని, సోమనాథుడు కావ్యగుణములను వివరించేటప్పుడీ యాలంకారికుల మార్గము నవలబించలేదన్న మాట స్పష్టము.

సంస్కృతలాక్షణికులు కావ్యదోషములనుకూడా పదింటిని చెప్పినారు. సంఖ్య పదే అయినా ఆలంకారికుల ప్రకారమా దోషములన్నిటిలో కొంచెము భేదము కనబడుతున్నది. భరతుడు ప్రపంచించిన దోషములు గూఢార్థత, అర్థాంతరము, అర్థహీనత, భిన్నార్థము, ఏకార్థము, అభిప్లుతార్థము, న్యాయాపేతము, విషమము, విసంధి, శబ్దహీనత, అని పది. భామహుని ప్రకారము అపార్థము, వ్యర్థము, ఏకార్థము, సంశయము, అపక్రమము, శబ్దహీనత, యతిభ్రంశము, భిన్నవృత్తము, దేశ-కాల-కలా-లోకన్యాయాగమవిరోధము అని పదిదోషములు. అతడు నేయార్థము, క్లిష్టము, అన్యార్థము, అవాచకత, గూఢశబ్దాభిధానము, అయుక్తిమత్త్వము, శ్రుతిదుష్టము, అర్థదుష్టము, కల్పనాదుష్టము, శ్రుతికష్టము, అని మరి పదిదోషములనుకూడా పేర్కొన్నాడు. భామహుడు చెప్పిన దోషములనే దండికూడా వివరించినాడు; కాని, ఆ దోషముల నిర్వచనములలో ఇద్దరికిన్ని భేద మున్నది. గుణమునకు వ్యతిరేకమైనది దోషమనికూడా దండి చెప్పుతూ (౧) శ్లేషకు వ్యతిరేకమైనది శిథిలము (౨) ప్రసాదమునకు వ్యుత్పన్నము (౩) సమతకు వైషమ్యము (౪) సుకుమారతకు దీప్తము (౫) కాంతికి అత్యుక్తి (౬) అర్థవ్యక్తికి నేయత్వము, అనేవి దోషములుగా వివరించి ఊరకొన్నాడు. తక్కిన నాలుగుగుణములకున్ను వ్యతిరేకములయిన దోషముల నాతడు పేర్కొ లేదు. ఆలంకారికదోషనిరూపణ మిట్లుండగా సోమనాథుడు తాను స్వయముగా జల్లి, పూరకము, అపశబ్దము, అక్రమము, పొల్లు, నిక్రియ, జడ్డు, సొడవు, అసంఘటన, కొరకు, వ్యర్థము, అసంగతి, విరసము, వైకల్యము, అత్యుక్తి, వైరిపదము, తలవిరుపు, అసమగ్రత, శిథిలబంధము, ఒలుపు, అబంధము, గ్రామ్యోక్తి, కంటకము, ద్రాఘ్య, ఛందోవిరుద్ధము, అని ఇట్టి వైరూపాదు కావ్య

దోషములను వివరించినాడు. ఈ గుణదోషములనే సోమనాథుని బసవపురాణమును కన్నడించిన భీమన ఈ క్రింది షట్పదులలో సంగ్రహించి చెప్పినాడు.

గుణములు

సరస మృదుతర యమక గమక వి -
సర సమానప్రాస దేశీ -
సరణి శబ్దార్థోపమాచాతుర్య మాధుర్య
సరళ పదశయ్యా దృఢ వ్యా -
కరణ యుత లాలిత్య నియమా -
క్షర సలక్షణ భావమాగిరె రచిసువెం కృతియాః

దోషములు

వైరిపద మపశబ్ద మచమ -
త్కార మధమోపమె వియతి పద
పూరకం దుస్సంధి యనిబద్ధం విరుద్ధార్థం,
నీరసం శైథిల్యావర్ణం
కారకవిరహితం క్రియాలం
కారహీనమెనిప్ప పొళ్లం తూఱి, కళెదింతూ

కావ్యము లోకహితార్థము రచింపబడవలెనంటే, అ 'సర్వసామాన్యము'గా, అనగా, పండితపామరుల కందరికిన్నీ ఆనంద జనకముగా ఉండవలెను గాని, ఏకొలదిమంది విద్వత్కవుల మెప్పు కోసము మాత్రమే వ్రాయబడకూడదు. సోమనాథునికి పూర్వామం

దుండినది 'ఆగూఢ గద్య పద్య ప్రబంధపూరిత సంస్కృతభూయిష్ఠ రచన'. అది 'సర్వసామాన్యము కాదు. కావ్యమునకు ప్రసాదగుణము ముఖ్యము. ఈగుణము కలుగడానికి 'జాను తెనుగు' పనికివచ్చేటట్లు మరొకటి పనికిరాదు. 'జాను' అనేది 'చదును' శబ్దమునకు రూపాంతరము. 'చదును' 'చదురు'నకు రూపాంతరము. ఇది 'చతుర' శబ్దభవము.

'జాను తెనుగు' లేక 'చదునైన తెనుగు' అంటే లోకవ్యవహారములోనున్న, సర్వజన సుబోధమైన తెనుగు. దీనినే సోమనాథుడు 'తేటతెనుగు' 'తిన్నని సూక్తి' అనికూడా అన్నాడు. దీనినే కర్ణాటకలాక్షణికులు 'సమసంస్కృతోక్తి' అన్నారు. ఆదికవుల విద్వత్తను ప్రకటించడానికి నిఘంటువ్యాకరణముల మూలముగా బోధపడే సంస్కృతపదభూయిష్ఠముకాక, అదేపనిగా, వికారముగా, బలవంతముగా, ఏర్చికూర్చిన 'అచ్చతెలుగు' మాటలతో మాత్రము కూడిన భావయున్ను కాక, లోకవ్యవహారసిద్ధములైన సంస్కృతాంధ్రపదములతో వెలయవలెను. 'తెలుగుమాటలయ్యా!' అని ఎవరైనా యీసడిస్తారేమో - వారవివేకులు. తెలుగుమాట లయితే నేమి? నాటిని 'వేదముల కోలఁదియకాఁజూడ' వలెను.

భావ ఎట్లో ఛందస్సుకూడా అట్లే 'సర్వసామాన్యము'గా ఉండవలెను. 'ఉరుతరగద్యపద్యోక్తులకంటె' ద్విపదలు 'సరసము'లైనవి. ద్విపద అంటే సామాన్యమైనదా? 'ఐహికాముష్మికద్విపదహేతు వసుట చేత'దాని కాపేరు కలిగినది.

సోమనాథుని రచనకు ప్రత్యేకలక్షణముల నింతకుపూర్వము పేర్కొన్నాను. వాటిలో కొన్నిటికిమాత్ర ముదాహరణములను సూచిస్తున్నాను:

ప్రభాతవర్ణనము (౧) ౨౬౧-౨; సూర్యాస్తమయవర్ణనము (౨) ౪౨౧; భాషాసౌభాగ్యము (౧) ౧౭౬, ౧౭౮, ౧౮౮-౯, ౨౪౧; మొద; ఉపమానపరంపర I. ౮; ఆవేశము వచ్చినప్పటిభావ (౧) ౬౨; సిద్ధాంతమును నిష్కర్ష చేసేవిధము (౧) ౭౭; నోటి బూకరము, ఔద్ధత్యము (౧) ౫౮౬, ౬౭౬; కోపము వచ్చినప్పటి రచన (౧) ౨౮౩; శబ్దమర్థమునకు మెరుగెక్కించడము (౧) ౨౧౯; (౨) ౪౦౦-౨; కంటికి కట్టినట్లు చిత్రించడము (౧) ౧౧౬-౧౭, ౧౨౩, ౧౩౩, ౧౪౭, ౩౯౩, ౫౯౫ (౨) ౬౮; మొద; కవితా ప్రవాహము (౧) ౮౫, ౪౨౩; అనుప్రాసరచన (౧) ౯, ౧౬౧, ౧౬౩, ౨౦౩, ౨౬౭, ౨౬౯, ౩౮౫, ౪౬౩, ౪౬౫, (౨) ౧౭౭-౮, ౧౮౧-౨, ౨౩౮-౪౦, ౩౦౩, ౩౨౪, ౩౬౩, ౩౬౪, ౩౯౩ మొద.

సమానసందర్భములలో పూర్వమువాడిన వాక్యములనే మళ్లీ వాడడము. ఒక్క ఉదాహరణము:

మస్తకవిన్యస్త హస్తుఁడైతన్నుఁ బ్రస్తుతింపుచు. బ. ౧౨, మస్తకతట న్యస్తముకుళితహస్తుఁడై బ. ౫౩; మస్తకవిన్యస్తహస్తులై మునులు, ప్రస్తుతం బెలుఁగుచుఁ బ్రస్తుతుల్ సేయ, బ-౮౬, ౧౪౧ సకలమానవులు మస్తకతటన్యస్తముకుళితహస్తులై మ్రొగి జయవెట్ట (౧) ౧౫౯; మస్తకవిన్యస్తహస్తుఁడై (౧) ౨౪౨, ౭౦౭; (౨)౧౪౩, ౧౫౩; ఇట్లే (౧) ౨౯౨, ౩౧౬, ౩౨౩, ౩౨౭; (౨) ౧౭౫; మొద.

మళ్లీ మళ్లీ అవేవాక్యములను చేర్చడానికి మరికొన్ని ఉదాహరణములు :

జనని జతర కఠోరపితరాపహరణ కర్తయుఁడు (౨) ౯౫; అన్యోన్య సందర్శనాన్యోన్య వినమితాన్యోన్య వాగ్బంధురాలింగ

నాది సముచితసవినయ సత్కారపూర్వకముగ. (౨) ౧౬౦; మందరభూధర సుందరసుకరకందరాంతర్బిల మందిరుం డగుచు (౧) ౧౧౧, కన్నప్ప దేవునికన్నులసఖులా...బ. ౮౬; తిరిగీ ఇట్లే పండితారాధ్యుడు అమరారామములో కన్నులను పొందినప్పుడుకూడా; బసవపురాణములోని శివతాండవవర్ణన. బ. ౪౮, అట్లే పండితారాధ్యచరిత్రములోనున్న; బసవపురాణములోని గణవర్ణనకును (బ. ౩౯) పం. చ. లోనిదానికిన్ని పోలిక; ఇట్లే (౧) ౧౨౫, ౨౮౫; (౧) ౨౨౫, ౨౮౫, ౩౦౨; (౧) ౭౬౭, ౫౮౬, ౬౪౬; (౧) ౨౨౦, ౨౬౯, ౨౪౧

ద్విపదల వడకలోనిమార్పు: (౧) ౯, ౨౭౪, ౨౫౧, ౨౫౩, ౨౬౪, ౨౯౪, ౩౯౪, ౭౦౦, ౫౨౬, ౬౫౨-౩; (౨) ౨౪; ౬౬, ౨౮౭-౫; ౨౯౪, ౩౭౮, ౩౪౧-౨; ౩౪౯, ౭౨౪-౯, ౭౫౪, ౭౮౯,

దీర్ఘసంస్కృత సమాసరచన: (౧) ౫౧, ౧౪౨, ౨౫౨ ౬౧౩, ౬౫౯-౬౧; ౬౪౨-౩; (౨) ౩౬-౪;

సోమనాథుని వర్ణనలన్నీ లాక్షణికుల సూత్రముల ననుసరించి ఉండక, లాక్షణికులే ప్రత్యేకముగా గురుతింపవలసినవిగా ఉన్నాయి. ఈ మహాగ్రంథములో ఒక్కచోటమాత్ర మతడు కొంచెము కక్కుర్తిపడినాడు. నవనవోన్మేషశాలిత్వమునకు పేరు నిలుపుకొన్న సోమనాథుడీక్రింది ద్విపదల నెందుకు వ్రాసినాడా అని సందేహము కలుగుతున్నది. కొన్ని ప్రతులలో ఆ పంక్తులు లేకుండా ఉంటే అవి ప్రక్షిప్తములని త్రోసివేసి ఉందును. కాని, అవి అన్నిప్రతులలోను ఉన్నవి. లాక్షణికసంప్రదాయము తనకు తెలియకపోలేదని చూపించడాని కట్లు వ్రాసిఉంటాడా? ఎట్లయినా అవి ఆ సందర్భములో అందమును తగ్గిస్తున్నవని చెప్పకతప్పదు. తలచుకొ

నంజెన్న విరహావస్థపొందుతూ ‘ఓ చూతమా, ఓ నారికేలమా, ఓ అశోకమా, ఓ ఘనసారమా, ఓ వప్రమా’ అని యీరీతిగా కనబడిన చెట్లను, వస్తువులను సంబోధిస్తున్నాడు. వాల్మీకి రామాయణములో కూడా రాముడు సీతనుంచి ఎడబాసి విరహార్తుడై ఇట్లే పలవించినాడు. ఇది రామాయణానుసరణ మని తృప్తిపడినా, సోమనాథుని ఇతర రచనకున్న దీనికిన్ని పొత్తు కుదురలేదు. (౧) ర౨౬-౭.

సోమనాథు డష్టవిధకవిత్వములను చెప్పగలడు. కాని, అతడు ముఖ్యముగా వాచకుడు. వర్ణనలను చేసేటప్పుడు ఒకటిరెండు విషయములను తెలిపి తక్కినవాటిని వ్యంగ్యధ్వనులకు విడిచిపెట్టక, తాపట్టిన విషయమును సంపూర్ణముగా, సవిస్తరముగా వర్ణిస్తేనేకాని అతనికి తృప్తి లేదు. ఈ విషయములో నాచనసోము డితని కీడవుతాడు.

---

౭

# ద్విపద

కన్నడులకు త్రిపద ఎట్లో, అట్లే తెనుగువారికి ద్విపద జాతీయచ్ఛందస్సై అనాదినుంచిన్నీ వెలసినది. అది తెనుగువారి జీవితములో అల్లుకొనిపోయినది. తెనుగులో కావ్యమనేది ప్రాదుర్భవించక ముందటినుంచిన్నీ దీని ఉనికి కనబడుతున్నది. తొమ్మిదో శతాబ్దము వాడయిన గుణగవిజయాదిత్యుని శాసనములో ద్విపదవిశేషమయిన తరువోజ కనబడుతున్నది. నన్నయకూడా తరువోజను వాడినాడు. దాని ప్రచారము నాటినుంచి నేటివరకున్నూ పల్లెపాటలలో, పడవపాటలలో, విసురురాతిపాటలలో, దంపుడుపాటలలో, జోలపాటలలో, పెండ్లిపాటలలో, తెనుగువారి జీవితములోని సమస్త విషయములలోను, వారిఆనందము, వారినవ్వు, వారి కోపము, వారి జాలి, వారికన్నీళ్లు, వారి ఉత్సాహము కనబడినచోట్లన్నిటిలోను సాగుతూనే ఉన్నది. ఇట్టి సర్వసామాన్యమైన ద్విపదాచ్ఛందస్సు ఆంధ్రవాఙ్మయము కేవలసంస్కృతపండితుల చేతులలో పడడముచేత కొన్నాళ్లు అజ్ఞాతముగా జనులలోనే నిలిచినది. దాని కొక ఉన్నతి నిచ్చి పైకి తెచ్చినవారిలో మొదటివాడు పాల్కురికి సోమనాథుడు.

అన్నిఛందస్సులలోను ద్విపద అప్రయత్నముగా అనాయాసముగా కూర్పదగినది. మూడింద్రగణములమీద ఒక సూర్యగణము చేరుస్తే ఒకపాద మవుతుంది. పాదములోని మొదటి రెండు గణముల మీద యతి ఉంటుంది. ఏపాదముయతి ఆపాదముతో సరి. అటువంటి రెండుపాదములను ప్రాసాక్షరము కలుపుతుంది. యతికిమాదిరిగా ప్రాస

యతినికూడా వేసేసంప్రదాయము ప్రాచీనమైనదని సోమనాథు డన్నాడు. కాని, అతని కాలమున కెందుచేతనో అట్లు చేయకూడదనే నిషేధము వచ్చినది. సోమనాథు డానిషేధమును గణించలేదు. ఏపాదమున కాపాదము ప్రత్యేకముగా ఉండవలెనన్నిన్ని, పాదము కొన నున్న పదము తరువాతిపాదములలోనికి సంక్రమింపకూడదనిన్ని మరొక సంప్రదాయ మేర్పడినది. దీనినికూడా సోమనాథుడు మన్నించలేదు.

సోమనాథుని తరువాత ద్విపదవాఙ్మయ మమితముగా బయలు దేరినది. విస్తారమునుబట్టి చూస్తే ఇతరవాఙ్మయముకంటె ద్విపద వాఙ్మయమే ఎక్కువగా ఉన్నట్లు కనిపిస్తుంది. ఈక్రింద తెనుగులో బయలుదేరిన ద్విపద వాఙ్మయమును గురించి కనబడినంతమట్టుకుసంగ్రహముగా తెలుపబడుతున్నది.

## ద్విపదకావ్య కవుల చరిత్రము

### పాల్కురికి సోమనాథుడు

ఇతడు రచించిన ద్విపదకావ్యములలో బసవపురాణము, పండితారాధ్యచరిత్రమును ముఖ్యములు—సోమనాథుని జీవితమును గురించిన్ని, కృతులను గురించిన్ని ఈపీఠికలో ఇతరత్ర చూచుకో వలెను.

### గో (కో) న బుద్ధరాజు

ఇతడు విఠ్ఠలభూవిభునిపుత్త్రుడు. బుద్ధభూవిభుని పౌత్త్రుడు - ఈ బుద్ధభూవిభుని తాత పేరు రుద్రనరేంద్రుడు. రుద్రనరేంద్రుని తండ్రి గోనకాటిభూపతి.

గోన బుద్ధరాజుకవి తనతండ్రి విఠ్ఠలుని ఆజ్ఞచొప్పున రామాయణము వట్కాండలను ద్విపదకావ్యముగా రచించినాడు. ఈరామా

యణము లోకములో రంగనాథరామాయణ మని ప్రసిద్ధికెక్కినది. రంగనాథుడనే ఒకానొక కవి ఈ గ్రంథమును వ్రాసి విఠ్ఠల, బుద్ధ రాజులపేళ్లను గ్రంథములో చేర్చినాడని పండితలోకములో ఒక జన శ్రుతి ఉన్నది. పూర్వకవిస్తుతులలో సాధారణముగా రంగనాథుని పేరే ఆంధ్రకావ్యములలో కనబడుతూ ఉండడమే ఈ వాడుకకు కారణము కావచ్చును. కాని, (రంగనాథ) విఠ్ఠలుని కంకితముగా రచింపబడడముచేతనే గ్రంథమునకు రంగనాథరామాయణ మనేపేరు కలిగిన దని నా అభిప్రాయము. రంగనాథు డనేకవియే గ్రంథమును రచించినట్టయితే అతని ఊరిపేరుగాని, కులగోత్రములుగాని, తల్లి దండ్రుల పేళ్లుగాని మనకు తెలియవు.

## కాచభూవిభుడు – విఠ్ఠలభూవిభుడు

వీరు సోదరకవులు. ఇంటిపేరు గోనవారు. బుద్ధభూవిభునికొడు కులు. బుద్ధభూవిభుడు రామాయణము షట్కాండములను తెనుగున ద్విపదగా రచించినాడు. దీనినే రంగనాథరామాయణ మంటారు. (పాండురంగ) విఠ్ఠలభూపుడనే పేరు గల తన తండ్రిని కృతిపతిగా గల రామాయణము కాబట్టి దీనికి రంగనాథరామాయణమనే పేరు వచ్చి ఉండవచ్చును. రంగనాథుడనేఒక కవి ఉండేవాడనిన్ని, అతడు గ్రంథములో విఠ్ఠల, బుద్ధభూవిభులపేళ్లు చేర్చి గ్రంథమును రచించి నాడనిన్ని ఒక కథ ఉన్నది. తెనుగుకవులు పూర్వకవులను స్తుతించే టప్పుడు రంగనాథునిపేరే ఉదాహరించినారు. రంగనాథు డనగా బుద్ధభూవిభుని తండ్రి అయిన (పాండురంగ) విఠ్ఠలభూవిభుడే కాని మరిఒకడు కాడు.

బుద్ధభూవిభుడు రామాయణమును రచించి ఉత్తర రామాయణ మును తన కొడుకు లిద్దరిచేతను చెప్పించి, తా నిది నా అంకితము నందు

కాని, స్వయముగా కవి కావడమే కాక, కవి జనకుడు కూడా అయినాడు.

కాచభూవిభునికి 'మీసరగండ' అనిన్ని, విఠ్ఠలభూవిభునకు 'మను' అనే బిరుదమున్ను ఉన్నవి.

## పినయెల్లయ

ఇతడు 'ఎఱ్ఱగడ్డ పాటిపోట్లాట' అనే వీరకథను ద్విపదగా రచించిన కవి; కోమనాలగోత్రుడైన గంగుల యెల్లయ్యకొడుకు. ఈకథనే శ్రీనాథుడీకవికి పూర్వము ద్విపదకావ్యముగా రచించి ఉండెనట. అది యిప్పుడు లభ్యముకాదు. ఈ కథనే కాటమరాజు కథ అని కూడా అంటారు. దీనిలోనిదే అయిన బట్టురాయబారము ప్రత్యేక గ్రంథముగా ప్రచారములో ఉన్నది. ఇది పదములను పాడేవారి వోళ్లలో పడి భాషావిషయములో చాలా వికారములకులోనైనది. తప్పుల తడకగా అచ్చుపడిన ప్రతులు గుజలీబజారులలో లభ్యమవుతున్నవి. ఈ గ్రంథము శ్రీనాథుని పల్నాటి వీరుల చరిత్రమునుపోలి, వీరరస ప్రధానముగా ఉన్నది.

## పల్నాటి భారతకవులు

పల్నాటి వీరచరిత్రము ప్రతులు లోకములో అనేకములుగా ఉన్నవి. కాని, ఇవేవిన్ని సంపూర్ణమైనవి కావు. ఒకొక్కదానిలో కొంతకొంత భాగముమాత్రము కనిపిస్తున్నది.

బాలునియుద్ధము, కన్నమనేనియుద్ధము, అనే భాగములుగల ప్రతులలో కవి శ్రీనాథుడని చెప్పబడినది.

ఒక ప్రతిలో :

వలను భరద్వాజ వంశవర్ధనుడ
మారయపుణ్యాభీమాంబకడ్పునను

స్థిరముగాఁగలిగిన తేజంబుఘనుఁడ
గారవంబైనట్టి ఘనుఁడ శ్రీనాథు
చేపట్టివీరుల చెరితమంతయును
తగఁజెప్పె నాచంద్రతారార్కముగను

అని ఉన్నది. దీనినిబట్టి శ్రీనాథుని సహాయముతో ఎవడో ఈ గ్రంథ
మును రచించినట్లు తేలుచున్నది. మరిఒక ప్రతిలో—

ఘనుఁడైన శ్రీనాథకవిరాజరాజు
చెన్నునికృపచేతఁ జిత్త ముప్పొంగి
బాలుని విక్రమ ప్రౌఢియంతయును
విరచించె జనులకు విదితంబుగాను.

అని ఉన్నది. దీనినిబట్టి గ్రంథము శ్రీనాథవిరచితమే అని
చెప్పవలెను. ఇట్టినీరసరచనమును శ్రీనాథునంతటివాడు రచించి
ఉంటాడా అని సందేహము కలుగుతున్నది. కాని, ఇది పామరజనుల
నుద్దేశింపబడినది. కాబట్టి చాలా తేలికగా రచింపబడి ఉంటుంది.
ఇదిగాక, పాటగాండ్లనోళ్లలో పడి మూల మనేకవికారములకు లోనై
ఉండవచ్చును.

'కోళ్లపోట్లాట'భాగముగల ఒకప్రతిలో దానికర్త మల్లయ
అని తెలుపబడినది. ఈ మల్లయ కౌండిన్యగోత్రుడయిన గౌరయా
మాత్యుని కొడుకయిన రామనమంత్రికిన్ని అమలాంబకున్ను పుత్త్రుడు.

'కొమ్మరాజుయుద్ధము' అనేభాగముగల ఒకప్రతిలో—

"సంగీత సాహిత్య చాతుర్యకవితఁ
జెప్పనేర్చినవాఁడ జెల్లలసన్న

రాయని...మహిమఁ బెంపొందువాఁడ,
......................శామిసెట్టి
సర్వనార్యసుతుఁడ,..........
...కొండనాహ్వయుఁడను..."

అని కవి తన్ను గురించి చెప్పుకొన్నాడు.

ఈ రీతిగా పల్నాటివీరుల చరిత్రమును భారతచరిత్రమును వలెనే శ్రీనాథ, మల్లయ, కొండనలు వేర్వేరు భాగములుగా రచించి అయినా ఉంటారు. లేదా, ఆముగ్గురున్ను గ్రంథమును సంపూర్ణముగానే ప్రత్యేకముగా వ్రాసి ఉంటే, వాటివాటిలోని భాగములు మాత్రము మిగిలి అయినా ఉంటవి అని ఊహించుకోవలెను.

## మడికిసింగన

ఇతడు జ్ఞానవాసిష్ఠమనే పద్యకావ్యమును, భాగవతమనే ద్విపద కావ్యమును రచించినాడు. రుక్మిణీకల్యాణ మనేపేర ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో ఉన్న ద్విపదకావ్య మీతనిభాగవతము లోనిదని భాండాగారనివేదికలో తెలిసినారు కాని, అది దోనూరు కోనేరునాథుని బాలభాగవతములోనిదై ఉండవచ్చును.

## నాదిండ్ల గోపనమంత్రి

ఇతడు శ్రీకృష్ణదేవరాయలకాలములో కొండవీటి దుర్గాధ్యక్షుడుగా ఉండేవాడు. ఇతడున్ను ఇతనితమ్ముడు అప్పన్నయున్ను తిమ్మమంత్రి కృష్ణాంబల కొడుకులు - వరదధీమణి పౌత్త్రులు - కృష్ణరాయని మంత్రిఅయిన సాళ్వ తిమ్మనికి మేనల్లుళ్లు - గోపనమంత్రి కొండవీటిలోని రాఘవస్వామి ఆలయమునకు ప్రాకారమును, గోపురమును, మంటపములను కట్టించి, గుడికి బంగారుకలశము నెత్తించి,

స్వామికి మైదవోలు అనే గ్రామము నిచ్చినాడు. ఇతడు ప్రబోధ చంద్రోదయమునకు సంస్కృతవ్యాఖ్యను వ్రాసినాడు. మాదయ్యగారి మల్లన్న తన రాజశేఖరవిలాసమును గోపనతమ్ముడు అప్పనమంత్రి కంకితము చేసినాడు.

ఇతడు 'కృష్ణార్జునసంవాదము' అనేపేర గయామాహాత్మ్యకథను ద్విపదకావ్యముగా రచించినాడు. ఈగ్రంథములో ఈతనివంశక్రమ మిట్లు చెప్పబడినది—వరదధీమణికిన్ని గోపమాంబికకున్ను తిమ్మమంత్రి, చినతిమ్మన, కొండన, అని ముగ్గురుకొడుకులు - వారిలో తిమ్మమంత్రికిన్ని కృష్ణమాంబకున్ను కోనమంత్రి, అప్పమంత్రి, అని యిద్దరు కొడుకులు పుట్టినారు. వారిలో అప్పయమంత్రి రాజశేఖర చరిత్ర కధినాథుడు. అతడు 'శ్రీకృష్ణదేవరాయ సామ్రాజ్యభార ధురంధరు'డైన సాళువతిమ్మదండనాయకునికిన్ని లక్ష్మమ్మకున్ను పుత్రిక అయిన తిరుమలాంబను పెండ్లిచేసుకొన్నాడు. గోపన్న మంత్రి. నాదెండ్లశాసనుడై 'సాళ్వతిమ్మ దండనాయకుని సంతత కృపామహిమ వినుతికెక్కిన కొండవీటిదుర్గంబు, నేలినవాడు. ఇతడు రచించిన కృష్ణార్జునసంవాదము రసవంతముగా ఉన్నది.

కవి కృష్ణదేవరాయల కాలమువాడు కాబట్టి క్రీ. శ. ౧౫౧౦ సం॥ ర ప్రాంతములవాడని చెప్పవచ్చును.

## పిడుపర్తి బసవన

ఇతడు పిడుపర్తి రమణయ్యకున్ను మల్లమాంబకున్ను పుత్రుడుని వీరశైవుడు; 'పాలుకరికి సోమేశ్వరారాధ్య శిష్యశిష్యప్రశిష్యుడ'న. ఇతడు చెప్పకొన్నాడు. ఇతడు "వీరశైవ దీక్షాబోధ" అనే గ్రంథ మును కన్నడములో కెరెయ పద్మరసు రచించిన గ్రంథము! నాధార ముగా చేసుకొని రచించినాడట. కెరెయపద్మరసు వీరశైవ దీక్షాబో

ధను మొదట సంస్కృతములోను, తరువాత కన్నడములోను రచించి
నాడట. పద్మరసు క్రీ. శ. ౧౧౬౫ సం॥ ర ప్రాంతమువాడు
పాల్కురికి సోమనాథునికి పూర్వుడు.

బసవన తనగ్రంథమును తిమ్మభూపతిపుత్త్రుడయిన వీరభూపతి
కంకితము చేసినాడు. తిమ్మభూపతికి రాజశేఖరుడు, వీరభూషణుడు,
గుర్వరాజు, వీరభూపతి అని నలుగురు కొడుకులు. ఈ నాలుగో
కొడుకే వీరశైవదీక్షాబోధకు కృతిభర్త. వీరశైవధర్మ ప్రచారము
కోపము చెన్నబసవయ్య అనేయోగి వీరభూపాలునివద్దకు వచ్చి వీర
శైవతత్త్వమును వినిపింపగా, అది తెనుగులో ఉంటే బాగుంటుం దని
అంతకు పూర్వమే బసవపురాణమనే పద్యకావ్యము మొదలయిన
కృతులను రచించిన పిడుపర్తి బసవన్న చేత ఈ గ్రంథమును
వ్రాయించి, కృతిపొందినాడు. వీరభూపతి మధురనేలిన వీరప్పనాయ
కుడైతే క్రీ. శ. ౧౫౭౨-౯౫ సం॥ రముల మధ్య ఉన్నవాడు.
కాబట్టి పిడుపర్తి బసవనకాలముకూడా అదే అయిఉంటుంది.

## పిడుపర్తిసోమన

ఇతనితండ్రి దీక్షాబోధ అనేగ్రంథమును వ్రాసిన పిడుపర్తి
బసవన. బసవన పాలుకురికి సోమేశుడు చెప్పిన కృతులను భూమిలో
వెలయించినవాడు. సోమన తన్నుగురించి "పాలుకురికి సోమేశ
ప్రసాద విదితాష్టభాషాకవిత్వ ప్రవీణ ఛామిత్ర పిడుపర్తి బసవేశ
పుత్త్రి సోమయదేవాఖ్యుడ" నని చెప్పుకొన్నాడు. ఇతడు బసవ
పురాణము, ప్రభులింగలీల అనే రెండు గ్రంథములను వ్రాసినాడు.
వీటిలో బసవపురాణము పద్యకావ్యము. ప్రభులింగలీల ద్విపదలుగా
రచింపబడినది.

ప్రభులింగలీల కన్నడభాషలో చామరసు అనేకవి రచించిన
ప్రభులింగలీలకు తెనుగు అనువాదము. చామరసు తనగ్రంథమును

నెయ్యినూటపదకొండుపదములుగా రచించినాడు. దాని నిత డిరవై యైదు "గతులు"గా అయిదాశ్వాసములలో రచించినాడు. చామరసు పదిహేనోశతాబ్దమువాడు. అతనికావ్యము భామినీషట్పదములలో వ్రాయబడినది. సోమనగ్రంథము—ప్రథమాశ్వాసములో: (౧) భక్త నమస్కారము, గుహస్తుతి; (౨) కైలాసవర్ణనము; (౩) మాయా జననము; (౪) గురుస్తుతి; (౫) అల్లమమాయనాడించుట; అనే అయిదుగతులున్ను;

రెండో ఆశ్వాసములో (౧) విమలాగమము (౨) ప్రభు వ దృశ్యుడగుట (౩) మాయ పార్వతియొద్దకుఁ బోవుట (౪) ప్రమథా గమము (౫) అక్కమదేవి అనే అయిదుగతులున్ను—

మూడో ఆశ్వాసములో (౧) గొగ్గయ్య (౨) ముక్తాయి (౩) సిద్ధరామయ్య (౪) ప్రభువుకల్యాణమునకు వచ్చుట (౫) మరుళ శంకరుడు అనే అయిదుగతులున్ను,

నాలుగో ఆశ్వాసములో (౧) ఇష్టలింగము (౨) అక్క మహాదేవి (౩) ప్రాణలింగము (౪) గోరక్షుఁడు (౫) ప్రభువు మునుల కుపదేశ మిచ్చుట అనే అయిదుగతులున్ను

అయిదో ఆశ్వాసములో (౧) శూన్యసింహాసనమును గట్టుట (౨) ప్రభువు శూన్యసింహాసన మెక్కుట (౩) ఆరగింపు (౪) భావ లింగము (౫) వీరశైవమహిమ అనే అయిదుగతులున్ను మొత్త మిరవై అయిదు గతు లున్నవి.

కాంచీనగరములో 'ధర్మద్రావిళ' అనే బిరుదముతో ధర్మ వాణిజ్యము చేసే నెల్లూరి రామలింగయ్య ప్రేరణచేత సోమన ఈ గ్రంథమును రచించి తనగురువైన సిద్ధవీరేశ్వరుని కంకితము చేసినాడు. ఈ సిద్ధవీరేశ్వరగురువు రామలింగయ్యను అతనితల్లి తిరువమ్మను,

ష్ములు చినగురవప్ప, సిద్ధవీరయ, నములినాయు, కాళహస్తి అనే వారికినికూడా హరదీక్ష నిచ్చినాడు.

## పోచిరాజు వీరకవి

ఇతడు 'విభూతిరుద్రాక్షమాహాత్మ్యము' అనే ద్విపదకావ్యమునకు కర్త. గ్రంథారంభములో శ్రీపతి పండితేంద్రుని తలచినాడు. "శ్రీపతిపండితుడు కౌశికగోత్రజుడు. నాగలింగారాధ్యునిపుత్త్రుడు. మహాదేవుని పౌత్త్రుడు" అని కవిచెప్పినాడు. కవి ఉద్దేశించిన యీ శ్రీపతి పండితత్రయములో ఒకడనడానికి సందేహములేదు. ఇతనిని గురించి

"అనుదినశివసపర్యాసక్తుపేర
అభియుక్తివీరశైవాచారుపేర
శుభకరోద్యద్గుణశోభితుపేర
విజయవాటీపురవిభుకృపాలబ్ధ
నిజమహత్త్వౌదార్యనిర్ణయుపేర
పటుశమీశాఖానిబద్ధవస్త్రాంత
ఘటితవైశ్వానరకల్పునుపేర"

శ్రీపతి పండితునిపేర తనగ్రంథమును రచించినానని కవి చెప్పినమాటలను గమనించవలెను.

కవి తనవంశక్రమము నిట్లుచెప్పుకొన్నాడు.—శాండిల్యగోత్రజుడు, ఆపస్తంబసూత్రుడు, ఈశవనిపురవాసుడు, వీరభద్రభక్తుడు అయిన భద్రనమంత్రికిన్ని ఎల్లాంబకున్ను వీరయామాత్యుడు పుత్త్రుడు. అతనికిన్ని కొండమాంబకున్ను వీరభద్రుడు, భద్రుడు అని యిద్దరు

కొడుకులు పుట్టినారు. వారిలో వీరభద్రునికిన్ని మూర్తిమాంబకున్ను వీరకవి తనయుడు. ఇతడు రచించిన గ్రంథమువిషయము బ్రహ్మోత్తరఖండమునుంచి గ్రహించబడినదట.

## ఈవనివీరభద్రకవి

ఇతడు శ్రీపతిపండితారాధ్యుని వంశమువాడ నని చెప్పుకొన్నాడు. శ్రీపతిపండితుడు విజయవాటీపుర విదితసంచారుడు, కృష్ణవేణీతీరకేళీవిహారుడు, ఇంద్రకీలాఖ్యపర్వతముఖ్య నవ్యశృంగాలోకన విలోలలోచనుడు, నాగలింగారాధ్యపౌత్త్రుడు, శ్రీమహాదేవుని పుణ్యతనూజుడు అని కవి వర్ణించినాడు. పోచిరాజు వీరకవి కూడా శ్రీపతిపండితునిగురించి ఇదేరీతిగా చెప్పినాడు.

వీరభద్రకవి బ్రహ్మోత్తరఖండములోని సోమవారమాహాత్మ్య కథను 'సీమంతినీకథ' అనేపేర ద్విపదకావ్యముగా రచించినాడు.

శంభుసద్గురుడున్ను లింగాంబయున్ను తన తల్లిదండ్రు లని చెప్పుకొన్నాడు. ఇతనికిన్ని ఈవనిపురవాసియే అయిన పోచిరాజు వీరకవికిన్ని ఏమయినా సంబంధ మున్నదేమో తెలియదు.

## దోనూరు కోనేరునాథుడు

ఇతడు శ్రీవత్సగోత్రుడు, ఆశ్వలాయనసూత్రుడు, దోనూరు నాగయమంత్రి కొడుకు. ఇతడు బాలభాగవతమును శక ౧౪౬౯ ప్లవంగనామసంవత్సరములో (క్రీ. శ. ౧౫౪౭) రచించినట్లు గ్రంథములో తెలిపినాడు. గ్రంథ మార్వీటి తిమ్మభూపాలుని మూడోకొడుకయిన చిన్నతిమ్మభూపాలుని కగ్రజుడు తిరుమలభూపాలుని కంకితము చేయబడినది.

సోమవంశాంబుధిసోముడు, ఆపస్తంబసూత్రుడు, ఆత్రేయ గోత్రుడు అయిన బుక్క రాజు రామభూపతి తిమ్మరాజు ప్రపౌ

త్రుడు. అతనికొడుకు రామభూపతి తిమ్మరాజు. అతనికొడుకు తిరుమల రాయడు. విఠ్ఠలరాయడు, చినతిమ్మరాయడు, పాపతిమ్మరాజు అనేవా రితని సోదరులు.

దోనూరి కోనేరునాథకవి బాలభాగవతమును పద్యకావ్యముగా కూడా రచించి, తిరుమలరాజు తండ్రి అయిన తిమ్మరాయని కంకితము చేసినాడు. దానినే ద్విపదకావ్యముగా రచించి, తమ్ముడయిన చినతిమ్మ రాయల కంకితముచేయవలసినదిగా తిరుమలరాయడు కోరినందున అట్లే చేసినట్లు గ్రంథములో చెప్పబడినది.

కృతిభర్తవంశక్రమ మీక్రిందివిధముగా బాలభాగవతములో చెప్పబడినది. ఆ రెవీటిబుక్కరాయలకు సాళ్వ నరసింగ రాయడు సఖుడు. బుక్కరాయలకున్ను బల్లాంబికకున్ను రామ రాయలు పుట్టి, కందనవోలిదుర్గమున కధినాథుడై, జాతివీరులైన డెబ్బదివేవురాశ్వికులు తన్ను కొలువగా 'సవా' సైన్యముపైకి పోయి, దానిని పంచబంగాళము చేసినాడు. ఆదవేనిదుర్గము నేలుతూ ఉండిన కాచరాజును జయించి అతని సప్తాంగములను హరించినాడు. బుక్క రాయలకున్ను లక్కాంబికకున్ను తిమ్మరాజు పుట్టినాడు. అతడు వేంకటేశ్వరుని అనుగ్రహముచేత ఒకకంటిచూపును పొంది, దానిని తనసభకు వచ్చిన ఒకగ్రుడ్డిగొల్లవాని కిచ్చినాడట. అతడొక చైత్ర మాసములో సైన్యముతో దండువెడలుతూ త్రోవలో నీరు లేక సైన్యము దప్పికతో బాధపడుతూఉండగా, డోనిశిరంగరాజుకొండ నెత్తములో విష్ణుమూర్తిని తలంచగా, ఒకబుగ్గ బయలుదేరి, రెండు గడియలసేపట్లే ఉండెనట. మానువకర(డ) అనే రణరంగములో అతడు ఏదులఖానును జయించి, ఆదవేనిదుర్గమును సాధించి, వీరనరసింహ రాయలకు ద్రోహి అయిన ఆదుర్గమునధిపతికి ఒప్పగించి, రాయల నుంచి స్వామిద్రోహరగండపెండారమును పొందినాడు. ఇతడే బాల

భాగవతప్రబంధనాయకుడు. ఈ తిమ్మరాజునకున్ను గోపమాంబకున్ను తిరుమలరాయడు, విఠ్ఠలరాయడు, చినతిమ్మరాయలు, పాపతిమ్మరాయలు మొదలయిన పలువురు కొడుకులు పుట్టినారు. తిమ్మరాజు రెండో భార్య అయిన తిరుమలదేవికి గోసపరాయలు, శ్రీరంగరాయలు అని ఇద్దరుకొడుకులు పుట్టినారు.

పైవారిలో తిరుమలరాయలు అహోబలపతికి వనము, మంటపము, సత్రములును చేయించినాడు. గరుడాద్రినాథునికి కర్పూరకస్తూరికా కాగంధసేవ చేయించినాడు. శ్రీ నృసింహునికి కోనేరు కట్టించినాడు.

చినతిమ్మరాయలకు కేరళ, తిరువడి, పాండ్య, చేర, చోళ రాజులుపాయనము లిస్తూ ఉండేవారు. పూర్వము శ్రీరాముడు లంకకు విభీషణునికి పట్టముగట్టినాడు కాని, అతని నక్కడ నిలుప లేకపోయినాడు. ఆకొదువను తీర్చడానికి శ్రీరాముడే చినతిమ్మ రాయలుగా పుట్టి, తిరువడిని జయించి, దానికి రాజును స్థిరముగా ఏర్పాటుచేసినాడు. ఇతనికి 'విజయమోదవంత', 'హాసబిరుదరగండ', 'మన్నెవిభాళభీమ', 'సమరగాండివశరాసన', 'కామరువేశ్యాభుజంగ', 'అవఘళురాయలమానమర్దన', 'కానరానికోటలగొంగ', 'సుజన మనితషోడశదానమండలేంద్ర', 'గండరగూళి', 'గండరగండ', 'వెగటుమన్నియమృగవేటకార', 'ఇనద్రోహరగండ', 'ధరణీవరాహ', 'ఆశ్రితప్పవరగండ' అనేబిరుదము లుండేవి. ఇతడు చంద్రగిరిదుర్గవితత మహైశ్వర్యవిలసితాత్ముడు, కేరళులకు భయోత్పాతహేతువు, తిరువడి రాజ్యప్రతిష్ఠాపకుడు, పాండ్యరాజశాసనుడు, చేరచోళాదిరాజు లితనికి సామంతులు.

దోనేరు కోనేరు నాథకవి తన్ను కవిసార్వభౌమునిగా వర్ణించుకొన్నాడు.

బాలభాగవతము మిక్కిలి రసవంత మైన గ్రంథము.

## రత్నాకర గోపాలకవి

ఇతడు భారద్వాజ గోత్రుడు, కొండఘన కృష్ణధన్విని సుతుడు. ఇతడు తానురచించిన "సౌగంధికాహరణము" అనే ద్విపద కావ్యమును రావిళ్ల కొండరాజు పుత్రుడయిన లింగభూపాలుని కంకి తము చేసినాడు. ఈ లింగభూపాలుడు నరపతిసింహాసనస్థాపకు డని కవి చెప్పినాడు. నరపతిసింహాసన మనగా విజయనగర రాజ్యము. లింగ భూపాలుడు వెల్లుట్లగోత్రుడు. నరపతిదత్త నానారత్న భూష కరి తురం గాది గాంభీర్యుడు; సింధురాజార్పిత సింధురచ్ఛత్ర సైంధవబంధుర స్యందనుడు! సౌరాష్ట్రనృపదత్త రత్నహారుడు! వేగినాయకుడు. ఇతనికి పరబలభీమ, సత్యహరిశ్చంద్ర, కేళాదిరాయ, చలమర్తి గండ, జగనొబ్బగండ, హత్తుమూవరగండ, గగ్గోలురాయ, మొదల యిన బిరుదము లుండినట్లు కవి వర్ణించినాడు.

కొండరాజు ఆరవీటి బుక్కరాజవంశమువా డని సర్ వాల్టర్ ఇలియటుగారి బ్రిటిషుమ్యూజియములో ఉన్న శక౧౪౭౭లో కొండ రాజు కోరికపైని రామరాయలు సదాశివరాయలచేత రామానుజయుతి కనేక గ్రామముల నిప్పించి నాడని చెప్పబడ్డ తామ్రశాసనములో ఉదాహరింపబడినవాడై ఉంటాడు. గుంటూరుజిల్లా, వినుకొండ తాలూకా, వినుకొండ నరసింహస్వామి ఆలయములోని ఒక శిలా శాసనములో ఈ కొండరాజే కొండరాజయ్యదేవమహారాజు అని చెప్పబడ్డాడు. ఇతనికి మహామండలేశ్వర రామరాజ తిరుమల రాజయ్యదేవ మహారాజు వినుకొండసీమను నాయంకరమున కిచ్చినా డని ఈశాసనములోన ఉన్నది. ఈశాసనము శక ౧౪౭౪ దుందుభి సం॥ ర॥ ఆషాఢ శుద్ధ ౧౧ ఏకాదశి శుక్రవారమునాటిది. రత్నా కర గోపాలకవి తన గ్రంథము నతని కుమారుని కంకితము చేసినాడు

గనుక క్రీ. శ. ౧౫౭౦-౮౦ సంవత్సరముల ప్రాంతములో ఉండి ఉంటాడు.

## గౌరనామాత్యుడు

ఇతనిది గౌతమగోత్రము. ఇతడు సింగయమాధవ నృపాలుని మంత్రి అయిన పోతరాజుకు తమ్ముడయిన అయ్యలుమంత్రి కొడుకు. ఇతడు రచించిన దిపదకావ్యము సుప్రసిద్ధము. ఇతడు నవనాథచరిత్రమునుకూడా ద్విపదగా రచించినాడు. నవనాథు లనగా (౧) శివుడు (౨) మీననాథుడు (౩) చౌరంగి (సారంగధరుడు) (౪) గోరక్షనాథుడు (౫) మేఘనాథుడు (౬) నాగార్జునుడు (౭) సిద్ధబుద్ధుడు (౮) విరూపాక్షుడు (౯) కణికుడు — అనే తొమ్మండుగురుసిద్ధులు: పైవారిలో తుది ఆరుగురున్ను దేశాటనముచేసి శిష్యులకు తమవిద్యల ననుగ్రహించినారట. వారిలో విరూపాక్షుడో అతని శిష్యులో 'అమృతఘ్నసిద్ధి' 'అమృతము' అనేగ్రంథములను రచించినారట.

నవనాథచరిత్రమును గౌరనకు పూర్వము శ్రీగిరి అనే కవి తెనుగులో పద్యప్రబంధముగా రచించినాడట. దాని ననుసరించి తా నీగ్రంథమును వ్రాసినానని గౌరన చెప్పుకొన్నాడు. శ్రీగిరి ఎవడో తెలియదు; అతని గ్రంథము కానరాదు. నవనాథచరిత్రము 'కుహనాబిరుదజైనకోలాహల,' 'రాయగురుశిఖామణి', 'బిజ్జలరాయమానమర్దన', 'సన్నాహగజపతి సప్తాంగహర' అనేబిరుదులు కలిగినట్టిన్ని, శ్రీశైలమల్లికార్జునస్వామి సర్వసామ్రాజ్యభారనిర్వాహకుడు, శైవదీక్షాగురుడు, సకలకర్ణాట మండలాధీశ్వరమావిలసనుడు, సర్వభాషావిశేషకోవిదుడు అయినట్టిన్ని ముక్తిశాంతభిక్షావృత్తిరాయడనే వీరశైవగురువుమీదిభక్తితో, అతని కనవరతాభ్యుదయాభివృద్ధియును, [illegible] ప్రసిద్ధియును

కలిగేటట్లు రచించి గ్రంథమును శ్రీగిరి మల్లికార్జునస్వామి కంకితము చేసినాడు.

ఇతడు రచించిన రెండో ద్విపదకావ్యము "హరిశ్చంద్రచరిత్ర" నవనాథచరిత్రములో దీనిపేరుగాని దీనిలో దానిపేరుగాని ఉదాహరింపబడలేదు గాని రెండుగ్రంథములలోని కవివంశక్రమమునుబట్టి చూస్తే అవి ఏకకర్తృకము లనడాని కెట్టిసందేహమున్ను లేదు. హరిశ్చంద్రచరిత్రములో కవివంశక్రమము కొంచెము విపులముగా ఉన్నది.

సింగనమాధవక్షితిపాలునికి మంత్రి అయిన పెద్దనపోతరాజుకు తమ్ముడైన ఎల్లమంత్రికిని, వల్లభమంత్రికిని గంగాంబకును కూతురైన పోచాంబకును గౌరన పుత్త్రుడు. ధరణిమంత్రి గౌరనకు అన్న, నవనాథచరిత్రములో గౌరనతండ్రిపేరు అయ్యలుమంత్రి అనిన్ని, హరిశ్చంద్ర చరిత్రలో ఎల్లమంత్రి అనిన్నిఉన్నా, తక్కిన వివరము లనుబట్టి ఆలోచిస్తే వీ రిద్దరున్ను ఒక్కరే అయిఉంటారని తెలుసుకోవచ్చును. వెలుగోటివారి వంశచరిత్రములో సింగయమాధవ, పెద్ద పోతరాజులను గురించిన శక ౧౨౭౭ సంవత్సరపు శిలాశాసన మొకటి ప్రకటింపబడినది. ఇది యెంతవరకు విశ్వసించదగిన శాసనమో తెలియదు. అది విశ్వాసార్హమే అయినయెడల గౌరన ఆకాలమునకు ముప్ఫై యేళ్లు తరువాతివాడై క్రీ. శ. సం॥ ౧౪౦౦ రపు ప్రాంతపువాడై ఉండవలెను. కాని, శ్రీశైలములో శాంతిభిక్షావృత్తి అయ్యవారు అనే వీరశైవగురువు కోరికపైని విజయనగరరాజయిన వీర తిరుమలయ్యదేవమహారాజు కొడుకు వీరప్రతాప రామరాజయ్యదేవ మహారాజు ఆజ్ఞచొప్పున దంతికంటి లింగప్పణ భోగావతీ నదికట్ట తెగిపోగా దానిని బాగుచేయించినట్లు శక ౧౪౯౬ భావ సం॥ర వైశాఖ బహుళ ౩౦ అమావాస్యనాటి ఒకశిలాశాసన మున్నది.

గౌరన చెప్పిన ముక్తికాంత శాంతిభిక్షారాయడున్ను ఈ శాసనములోని వారున్ను ఒక్కరే అయితే గౌరన క్రీ. శ. ౧౫౭౭ సం॥ర ప్రాంతములవాడై ఉంటాడు.

## భాస్కరాచార్యుడు

ఇతడు బ్రాహ్మణుడు, గౌతమ గోత్రమువాడు, అనే విషయములు తప్ప మరేమిన్ని తెలియదు. ఇతడు వైశ్యపురాణము రచించి వైశ్యులందరికిన్ని అంకితము చేసినాడు. పెనుగొండలో వెలసిన కన్యకాపరమేశ్వరికథ ఈ గ్రంథములో వర్ణింపబడినది.

కర్నూలుజిల్లా, సిరివేలుతాలూకా, దిగువ అహోబలములో కంచుగుంబ గోపురద్వారమునకు కుడివైపున ఉన్న శిలాశాసనములో భాస్కరాచార్యుని శిష్యులున్ను వాసవ కన్యకారాధకులున్ను అయిన వైశ్యుల ప్రస్తావన ఉన్నది. ఈశాసనము విజయనగరరాజయిన వీరవేంకటపతిరాయదేవ మహారాయల కాలమునాటిది. శక ౧౫౩౧ (క్రీ. శ. ౧౬౦౯) సౌమ్య సం॥ర జ్యేష్ఠ బహుళదశమీ శుక్రవారమునాటిది. కాబట్టి భాస్కరాచార్యులు క్రీ. శ. ౧౬౦౯ సం॥రమునకు చాలా పూర్వుడై ఉండవలెను.

## భద్రకవిలింగభూవిభుడు

భద్రకవిలింగభూవిభుడనే ఈకవి రామయప్రభుని కుమారుడు, సంగమేశ్వరుని శిష్యుడు. ఇతడు దేవాంగపురాణమనే గ్రంథమును రచించి, ముదనూరిలోని రామేశ్వరదేవుని కంకితము చేసినాడు. గ్రంథములో పాలకూరి (పాలకురికి కాదు) సోమనారాధ్యుడు, పిడుపర్తిబసవన్న, శేషయోగీంద్రుడు, రంగనాథుడు, గోవింద భట్టారకుడు అనేవారు స్మరింపబడ్డారు. శేషయోగీంద్రుడు, గోవింద భట్టారకుడు ఎవరో తెలియదు; కవులై ఉండరు. పిడుపర్తి

బసవన్నను కవి స్మరించినాడు. ఇతడు క్రీ. శ. పదహారోశతాబ్దమునకు తరువాతివాడై ఉంటాడు. ఇతడు తనతండ్రి 'శివధర్మశాస్త్ర కోవిదుడు', 'పరమశివజ్ఞానభరితాత్ముడు' అని చెప్పినాడు. "ద్రావిడ మధ్య దేశమున"కు 'పడవీడు' రాజధాని. దానికి 'కాళహస్తీశ్వరు' డనేవాడు ప్రభువు. ఆ పట్టణములో రామేశ్వరుని దేవాలయ మున్నది. నూలిపౌర్ణిమనాడు దేవాలయముఖమంటపముమీద కూర్చుండి, ఊరిలోని పదివేలమంది దేవాంగప్రభువులు కాశ్యప గోత్రజులు దేవాంగమునీశ్వరుని చరిత్రమును ద్విపదగా రచింపగ& కవు లెవరైనా ఉన్నారా అని కాళహస్తీశ్వరు డడుగగా, కూడలిస్థ లిలో భద్రకవిలింగవిభు డున్నాడని చెప్పినారు. పడవీటిప్రభు వాతని పిలిపించి దేవాంగపురాణమును వ్రాయించినాడు.

దేవాంగవంశక్రమ మీ రీతిగా గ్రంథములో చెప్పబడినది. (దేడర?) దాసయ్యకున్ను మార్తెమ్మకున్ను కృష్ణమ్మ అనేవాడు పుట్టి నాడు. కృష్ణమ్మకున్ను రాగమ్మకున్ను చెన్నయ్య పుట్టినాడు. చెన్న య్యకున్ను పల్లెమ్మకున్ను కామరేంద్రుడు పుట్టినాడు కామరేం ద్రునికిన్ని లింగమ్మకున్ను కామరుసామి పుట్టినాడు. కామరుసామి భద్రమ్మను పెండ్లాడినాడు. అతనికలలో బసవేశుడు కనబడి అతడు ౧౧౫ సం॥లు బ్రతికి వంశాభివృద్ధికి మూలపురుషు డౌతాడని వర మిచ్చినాడు. ఆ వరముప్రకారము దేవాంగకులము నానాటికిన్ని వృద్ధిపొందినది.

భద్రకవి లింగకవి సానందచరిత్రమనే మరొక ద్విపదకావ్య మునుకూడా రచించినాడు. దానినిబట్టి అతడు శోణాద్రి (తిరువణ్ణా మలె) కుత్తరముగా ఉన్న అరుణాద్రిమంగళమనే గ్రామమువాడు. ఇతని తండ్రి రామయప్రభువు, తల్లి అమలాంబ. కాళహస్తిలోని శివయోగి చెన్నవీరభద్రేశ్వరుని శిష్యుడయిన సంగయదేవరకు వీర

భద్రయ్య, మహంత(ర్త?)య్య అనేవారు కొడుకులు. మహంతయ్య ప్రేరణముచేత లింగకవిచేత సానందమునీశ్వరుని చరిత్రమును వీరభద్రయ్య వ్రాయించినాడు. కవి తనగ్రంథమును శివయోగి చెన్నవీరుని శిష్యుడయిన శివయోగి వీరేశ్వరుని పేర రచించినాడు. గ్రంథములో పండితత్రయము, పాలకురికి సోమనారాధ్యులు, రంగనాథులను స్మరించినాడు.

## పచ్చకప్పురపు తిరువెంగళ కవి

ఇతడు భట్రాజుకులమునకు చెందినవాడు. ఇతడు తిప్పరాజు కొడుకు, తిమ్మరాజు మనుమడు. తిమ్మరాజున్ను ఆతనితమ్ముడు అయ్యలరాజున్ను కన్నడరాయడైన ప్రౌఢరాయని మెప్పించి ఘనసారదానమును పొంది 'పచ్చకప్పురపువా'రనే బిరుదమును గృహనామముగా పొందినారట.

తిరువెంగళకవి చెయ్యేటిదరినున్న 'ఓరుగంటమ్మ' అనేశాంభవికి భక్తుడు. చెయ్యే డనంతపురమునకు ఏడుమైళ్ల దూరములో ఉన్నది. ఇతడు 'అఖిలసామ్రాజ్య వైభవు'డైన 'చినరామపార్థివేశ్వరు'ని ఆజ్ఞప్రకారము 'చొక్కనాథచరిత్ర' మనే ద్విపదకావ్యముగా రచించి, చినరామరాజు అన్నయైన పెదరామరాజు కంకితముచేసినాడు. ఈ పెదరామరాజుకు 'ఉపనూరిసింహము' 'అచ్యుతదేవరాయప్రతాప దక్షిణబాహుదండాంకుడు', 'కొదమనాయంకరగండ,' 'స్వామిద్రోహగండ' అనేబిరుదములున్నవనిన్ని, అతడు 'అరుణాచలేంద్ర పూజామోద విభవుడై, 'నన్ననందలి' పురమున కధ్యక్షుడై ఉండేవాడనిన్ని, పిప్పాలగోత్రుడనిన్ని, వ్యాసతీర్థులవారి ప్రియశిష్యుడనిన్ని, అచ్యుతదేవరాయప్రతాపకార్యధురంధరు డనిన్ని, కమ్మవంశమువా డనిన్ని, గోళ్లబసవరాజుకున్ను, తిప్పమాంబకున్ను పుత్త్రు డనిన్ని, వాకిటి చిన్నభూపాలునికి [illegible] డనిన్ని కవివర్ణించినాడు.

కవిరచించిన 'చొక్కనాథచరిత్రము' ఎనిమిదాశ్వాసముల ద్విపదకావ్యము. చొక్కనాథు డనగా మధురలో నెలసిన సుందరేశ్వరస్వామి. కథ హాలాస్యమాహాత్మ్యములోని మధురాకాండములోనిది. శివుని చౌషష్టి (64) లీలలీ గ్రంథములో వర్ణింపబడినవి. కవి వేములవాడ భీమన, నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథులను స్మరించినాడు.

## కట్టా వరదరాజు

కావేరికి కట్టకట్టించిన కరికాలచోడుని వంశములో కట్టాన్వయుడైన తెలుగు బిజ్జనకు 'హత్తుమూవరగండ, హన్నిబ్బరగండ, వెండికిగండ, వాండికిగండ, బారా మండలికరగండ, నాళీకతాటకీ నారాయణ, నవలక్షదళవిభాళాంక, మీసరగండ, పాతకీపుత్ర' అనే బిరుదము లుండేవి. అతని వంశములోని 'తాతనకేసరి' అనే బిరుదము గల కట్ట రంగరాజుకు హరిదాసరాజు పుత్త్రుడు. అతడు పోచిరాజు సింగరిరాజు కూతురైన కృష్ణమాంబను పెండ్లాడినాడు. కృష్ణమాంబ చెల్లెలయిన ఓబమాంబను శ్రీరంగరాయలు పరిణయ మైనాడు. ఓబమాంబకు రామదేవరాయలు పుట్టినాడు. హరిదాసరాజుకున్ను కృష్ణమాంబకున్ను రామరాజు, వరదరాజు, తాతరాజు, అనే ముగ్గురుకొడుకులు పుట్టినారు. వీరిలో రెండోవాడైన వరదరాజే రామాయణము యథావాల్మీకముగా ద్విపదకావ్యముగా సంతరించినాడు. యతిరాజయోగి ఈతనిగురువు. వరదరాజు తాను 'పరమభాగవతచరిత్రము,' 'రంగమాహాత్మ్యము' అనే పద్యకావ్యములను రచించినాడు. రంగమాహాత్మ్యము' నూరధ్యాయముల గ్రంథమట. ఈ గ్రంథముల నన్నిటిని కవి తిరువంగళనాథదేవుని కంకితము చేసినాడు.

కవి రామాయణములో కావ్యదోషముల నీ క్రింది విధముగా వివరించినాడు:

'జల్లిమాటలు, నపశబ్దముల్, జజ్జి-
టల్లికల్, ప్రావ, లందదుకుఁబల్కులును,
పునరుక్తములు, వట్టిపూఁదెలు, కాకుఁ-
దెనుఁగు, లీచలును, సందిగ్ధముల్, ప్రాలు-
మాలికల్, కటువు, లేమఱపులు, కొసరు,
లాలంబములు, వెట్టియతకడంబులును,
ఛాయలెత్తుట, లర్థచౌర్యముల్, పెట్టుఁ
జాయలు.....................'

కవిత యెట్లుండవలెనో యీరీతిగా చెప్పినాడు.

'...కావ్య మందమై, తేఁట-
వ్రట్టంగ నవరసంబులు పిచ్చిలంగ,
..............లక్షణసమ్మతముగ
నందమై, సుకవు లౌరా యనఁ, జెవుల-
విందుగా, కపురంబువెద చల్లినట్లు,
ధ్వనులు, వ్యంగ్యములు, వింతలు, వాసనలును,
మినుకులజిగిబిగి, మెరవడుల్, జాతి,
వార్తలు, నుపమలు, వర్ణనాంశములు,
మూర్తిమద్వాక్యముల్ ముద్దులు చూప,
నొకమాటకన్న వేఱొకమాట వింత,
యొకపాదమునకన్న నొకపాద మొరపు,
నొకపద్యమునకన్న నొకపద్యం బంద,

మొకయుత్తరము మించ నొకయుత్తరంబు,
వెలయంగ ద్విపద' గావింపవలెనట !

భోసల ఏకోజీకవి (౧౬౭౬-౮౩.)

ఇతడు తంజావూరిని క్రీ. శ. ౧౬౭౬ నుండి ౧౬౮౩ సం॥రము వరకు పాలించిన మహారాష్ట్రరాజు. విజయనగరపు తెనుగురాజుల అనంతరము తంజావూరిని మహారాష్ట్రు లేలినారు. మహారాష్ట్ర రాజవంశము వారే కాక, వారి అనుయాయులై తంజావూరు రాజ్యములో నివాసము లేర్పరుచుకొన్న ఇతర మహారాష్ట్రులును తెనుగుపై మక్కువతో అనేకాంధ్రకావ్యములను రచించినారు. ఏకోజీ వాల్మీకి రామాయణమును యథామాతృకాక్రమముగా ద్విపద కావ్యముగా రస ముప్పతిల్లునట్లు రచించినాడు. గ్రంథములో కవి తనవంశము నీరీతిగా వర్ణించు కొన్నాడు.

భోసలవంశస్థు డైన మాళోజీకి శాహరాజున్ను, అతనికి ఏకోజీ, అతనికి శాహాజీ, శరభోజీఅనే యిద్దరుకొడుకులున్ను పుట్టినారు. శరభోజీతల్లి దీపాంబ. అతనికొడుకు తులుజభూపాలుడు. అతనికొడుకే రామాయణకర్త అయిన ఏకోజీ. ఇతడు తనరామాయణమును తన తండ్రి కంకితము చేసినాడు.

చక్రపురిరాఘవాచార్యుడు (౧౬౮౦)

ఇతడు తిరువెంగళాచార్యుని పుత్త్రుడు. కందాళ దొడ్డయాచార్యుని శిష్యుడైన చక్రపురి దొడ్డయాచార్యుని పౌత్త్రుడు. ఇతడు తానురచించిన 'నలచక్రవర్తి చరిత్ర' మనే ద్విపదకావ్యమును ఘటికాచలక్షేత్రములో వెలసిన నృసింహస్వామి కంకితము చేసినాడు. ఇతడు 'విష్ణుభక్తచరిత్రము' అనే ద్విపదకావ్యమునుకూడా రచించి, దానిలో పన్నిద్దరాళ్వారులు మొదలయిన విష్ణుభక్తులచరిత్రమును

చెప్పినాడు. ఈ గ్రంథముకూడా ఘటికాచల నృసింహస్వామికే అంకితము.

నెల్లూరుజిల్లా, ఉదయగిరితాలూకా, సింగరెడ్డిపల్లి అనేగ్రామములోని ఒక శిలాశాసనముప్రకారము సింగరెడ్డిపల్లిని శ్రీవాడ పెద్ద వేంకటాద్రినాయనింగారు శక ౧౫౭౩, నందన, చైత్ర పౌర్ణమినాడు (క్రీ. శ. ౧౬౫౨-౫౩) కందాళ దొడ్డయాచార్లు అయ్యవార్లుగారికి జాగీరుగా ఇచ్చినట్లున్నది. ఈ దొడ్డయాచార్యులే షోలింగరు నివాసి అయిన మహాచార్యులు. కాబట్టి చక్రపురి రాఘవాచార్యులు క్రీ. శ. ౧౬౯౦ ప్రాంతములవాడై ఉంటాడు.

## తాళ్లపాక తిరువెంగళనాథుడు

ఇతడు భారద్వాజగోత్రుడు, ఆశ్వలాయన సూత్రుడు, నందవరీకస్మార్త బ్రాహ్మణుడు. తాళ్లపాక అన్నయ పౌత్త్రుడు, తిరుమలార్యుని పుత్త్రుడు. ఇతడు హరివంశోక్తమయిన ఉషాపరిణయకథను తీసుకొని ద్విపదకావ్యముగా ఉషాకల్యాణమనే పేర రచించినాడు. గ్రంథాదియం దితడు తిరుమలార్యుని పుత్త్రుడ ననిన్ని, ఆశ్వాసాంతములలో 'తిమ్మార్యతనుజన్ముడ' నని న్ని వ్రాసుకొన్నాడు.

ఇతడష్టమహిషీకల్యాణము, పరమయోగివిలాసము అనే మరి రెండు ద్విపదకావ్యములనుకూడా రచించినాడు. దానిలో తనవంశము నీవిధముగా చెప్పుకొన్నాడు. తాళ్లపాక అన్నయాచార్యుని మొదటి భార్య తిమ్మాంబకు నరసింహుడున్ను, రెండోభార్య అక్కాంబకు తిరుమలాచార్యుడనే పుత్త్రుడున్ను, నరసమ్మ, తిరుమలాంబ అనే ఇద్దరు పుత్త్రికలున్ను పుట్టినారు. తిమ్మాంబకొడుకు నరసింహుని మొదటిభార్య నాచారియమ్మకు నారాయణుడనే కొడుకున్ను, రెండో భార్య అనంతమ్మకు అప్పలాచార్య, అన్నయాచార్యులనే ఇద్దరు

కొడుకులున్న పుట్టినారు. అక్కాంబ కొడుకు తిరుమలాచార్యునికి చినతిమ్మయ, అన్నయాచార్య, తిరువేంగళ, తిరువేంగళ, కోనేటి వెంగళ, అనే అయిదుగురు కొడుకులు పుట్టినారు.

పైవారిలో మూలపురుషుడైన అన్నయాచార్యుడు వేంకటేశ్వరస్వామిమీద పదములను రచించినాడు; పంచమాగమ సార్వభౌము డని పేరుపొందినాడు. నరసింహుడు సంగీత విద్యా పారంగతుడు. అక్కాంబ కొడుకు తిరుమలాచార్యుడు ఆంధ్రవేదాంతము, ఆంధ్రహరివంశము, చక్రవాళమంజరి, రేఫఱకార నిర్ణయము, అనే ద్విపదకావ్యములను రచించినాడు. తిరుమలాచార్యుని కొడుకులలో రెండోతిరువెంగళుడే అష్టమహిషీకల్యాణకర్త. ఇతడు తన కవితా సామర్థ్యమునుగురించి "కావ్యంబు సెప్పి, యెనలేని శ్రీవేంకటేశు మెప్పించి, సకలంబు సెఱుఁగ నసాధారణాంక మకరకుండలము లిమ్మహిఁగొన్నవాఁడ, దినములోనసెఽవేయిద్విపదలింపొంద వినుతవర్ణనలతో విరచించువాఁడఃగవిశిరఃకంపయోగ్య ప్రతిద్విపద నవబిరుదాంకుండ" నని చెప్పుకొన్నాడు.

ఇతడు రచించిన పరమయోగివిలాస మెనిమిదాశ్వాసముల గ్రంథము. అలమేలుమంగా వేంకటేశ్వరుల కంకితము. పన్నిద్దరాళ్వారుల చరిత్రము లీగ్రంథములో వర్ణింపబడినవి. ఆళవందారు, రామమిత్రుడు, పుండరీకాక్షుడు, నాథముని, పరాంకుశుడు, వేంకటాచలపూర్ణుడు, సర్వనంబి, తొండమాన్ చక్రవర్తి, దాశరథి, భట్టరాచార్యుడు, అనంతాళ్వారు, శఠగోపముని అనేవారు పన్నిద్దరాళ్వారులు. ఈ గ్రంథపీఠికలో "వేదంబు తెనుఁగుగావించి సంసారఖేదంబు మాన్పినకృష్ణమాచార్యు" డొకడు స్తుతింపబడినాడు. వేద మనగా ద్రావిడాగమమై ఉంటుంది. "కృష్ణమాచార్య సంకీర్తనములు" అనే గేయగ్రంథమును వ్రాసినవా డీ కృష్ణమాచార్యుడేనేమో! ద్రావిడ

గ్రంథము నాధారముగా చేసుకొని కవి పరమయోగి విలాసమును రచించినాడట.

## ద్విపద భారతకవిత్రయము

### (౧) తిమ్మన

ఇతడు కాశ్యపగోత్రుడు, వల్లభనూరికొడుకు. ఇతని ఇంటి పేరు ఆతుకూరివారు. ఇతడు మహాభారతములోని ఆది, ఆరణ్య, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణపర్వములను ద్విపదరూపముగా రచించినాడు. విణ్ణ (వర్ధ?) మానపురవరాధీశ్వరుడును, 'చెరమీర(చలమర్తి?) గండ', 'కర్ణాటతిలక', బిరుదాంకితుడును, పంటరెడ్డిప్రభువును, బట్టేపాడుగ్రామనివాసిన్ని అయిన దేవయమున్మయకు పుత్త్రుడును, మలిరెడ్డికి పౌత్త్రుడున్ను అయిన జంగాలమున్మయరెడ్డికి విరాటపర్వమును, వేంకటేశ్వరస్వామికి ఉద్యోగపర్వమును, భీష్మ ద్రోణపర్వములను రామచంద్రమూర్తికిని అంకితము చేసినాడు. విరాటపర్వమునుది నొకప్రతిలో దానిని 'శాహావనీపతి' కోసము నింబాజి కుప్పయమంత్రిచేత వ్రాయించినాడని ఉండడముచేత కవి సహాజీకాలమువాడో, అంతకుపూర్వుడో అయిఉంటాడు.

### (౨) సోమయ

ఇతడు తిమ్మనపుత్త్రుడు. ఇతడు కర్ణపర్వమునుంచి తక్కిన మహాభారతములోని అన్నిపర్వములను రచించినాడు. విరాటపర్వములోని ఒక ఆశ్వాసమునుకూడా ఈతడే రచించిన ట్లొకప్రతిలో ఉన్నది. ఇతడు తాను రచించిన అన్నిపర్వములను వేంకటేశ్వరస్వామికే అంకితము చేసినాడు.

## (౩) బాలసరస్వతీశ్వరుడు

తిమ్మన యేకారణముచేతనో సభాపర్వమును వ్రాయక విడిచి పెట్టగా దానిని బాలసరస్వతీశ్వరుడనే కవి పూర్తిచేసి 'శ్రీరంగయామాత్యశేఖరపుత్త్రు'డైన 'శ్రీనంతయామాత్యశేఖరు'ని కంకితము చేసినాడు.

## గోవర్ధన అనంతకవి (౧౭౯౪)

ఇతడు వేంకటరాయనిపుత్త్రుడు. వేంకటకృష్ణుని శిష్యుడు. ఇతడు 'మువ్వార్తవైభవము' అనే ద్విపదకావ్యమును శక ౧౭౧౬ సం॥రము క్రీ. శ. ౧౭౯౪) ఆనందసంవత్సరములో రచించినాడు. గ్రంథములో సౌమ్యజమాతృముని, పరవస్తులక్ష్మణమునీంద్రుడు అనే వారిప్రస్తావన ఉన్నది. మువ్వార్తవైభవము శ్రీవైష్ణవగ్రంథము. దీనిలో పరవాసుదేవుని పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారములనే పరిణామములు వివరింపబడినవి.

## కొండయ్య

ఇతడు చెన్నమల్లికార్జున ప్రపౌత్త్రుడు. చిట్టయ ప్రభుతిమ్మ శేఖరుని పుత్త్రుడు. మెచ్చుగండపట్టణము చెన్నమల్లు కసవయచిట్టయామాత్యుని మనుమడు. ఇతడు "ద్వాత్రింశత్సాలభంజికల కథలను" విక్రమార్కుని కథలు" అనేపేర అయిదాశ్వాసములుగా ద్విపద కావ్యము రచించి, కాశ్యప గోత్రోద్భవుడున్ను, దేవయమంత్రి కొడుకున్ను అయిన పెద్దయమంత్రి కంకితము చేసినాడు.

## బచ్చు సిద్ధకవి

ఇతడు మటిబసపురాణమును రచించినాడు. ఇతడు సిరిపురి వీరసింగయ్య కరగర్భజనితుడననిన్నీ చరలింగమర్థల పర్వతార్యుని

శిష్యుడ ననిన్ని చెప్పుకొన్నాడు. గ్రంథమున సంగయ అనేవానిని కథా శ్రోతగా నిలిపినాడు. పాల్కురికి సోమనాథుడు గొబ్బూరి సంగనను బసవపురాణమునకున్ను, సూరన్నను పండితారాధ్యచరిత్రమున కున్ను కథా శ్రోతలనుగా చేయడమును చూచి ఇతడున్ను ఆ సంప్రదాయము ననుసరించి ఉంటాడు. చిక్క వీరాచార్యుడు తనకు వినిపించిన రీతిగా గ్రంథములోని కథను వ్రాసినానని కవి వ్రాసినాడు. పాలకురికి సోమనాథుడు తన ద్విపదలలో వ్రాసయతులను వాడినాడు కాబట్టి అతని అనుమతిని తానున్ను వాడినానని న్ని, రేఫ అకార మైత్రి శివ కావ్యములలో చెల్లుతవి కాబట్టి ఆ రెండింటికిని భేదమును పాటించ లేదనిన్ని చెప్పుకొన్నాడు.

బసవేశ్వరుడు కాక మరొక బసవేశ్వరు డున్నాడనిన్ని, ఆబస వేశుని చరిత్రము కాబట్టి గ్రంథమునకు మఱి బసవపురాణమనే పేరు వచ్చినదని కొందరున్ను, బసవపురాణములో చెప్పబడని 'మఱి' కొన్ని కథలు బసవని గురించినవి చెప్పబడడముచేతనే గ్రంథమున కాపేరు కలిగినదని కొందరున్ను అంటారు. 'మఱిబసవేశ శ్రీమన్మహామూర్తి' అని కవి ఒకచోట సంబోధించి ఉండడముచేత బసవనాముడే మరొక డున్నాడని మనమనుకోవచ్చును. కాని, కన్నడవాఙ్మయములో 'మల (లె) బసవపురాణ' అనే గ్రంథమున్ను, 'మలెయ బసవ రాజ' అనే వ్యక్తి పేరున్ను కనబడుతున్నది. 'మలె బసవ' డే తెనుగులో 'మఱిబసవడు' గా మారిఉంటాడు.

## తరిగొండ వేంగమాంబ

ఈమె సుప్రసిద్ధురాలైన కవయిత్రి. నందవరీక బ్రాహ్మణు డున్ను, వసిష్ఠగోత్రుడున్ను కానాలవంశ్యుడున్ను అయిన కృష్ణా ర్యునకున్ను మంగమాంబకున్ను ఈమె పుత్రిక. ఈమెకు చిన్నతన ములోనే వైధవ్యము ప్రాప్తించగా, అప్పటినుంచిన్ని శ్రీవేంకటే

శ్వర భక్తురాలై సద్గ్రంథరచనతో కాలము వెళ్లబుచ్చుకొన్నది. సుబ్రహ్మణ్యుడనేవాడా మెకు గురువు. ఈమెరచించిన శ్రీభాగవతములో శ్రీవత్సగోత్రుడు, నుంజేటి వంశ్యుడు అయిన తిమ్మయకు కొడుకు వేంకటాచలపతి పాదపద్మములను మనస్సులో ఉంచుకొని వేంగమాంబ ఆ గ్రంథమును రచించినట్లు చెప్పుకొన్నది. ఈవేంకటాచలపతి తన చిన్నతనములో చనిపోయినభర్త అయిఉంటాడు. ఈమె అనేకగ్రంథములను రచించినది. (౧) నారసింహశతకము (౨) నారసింహవిలాసకథ, (౩) శివనాటకము, (౪) రాజయోగసారము (ద్విపద) (౫) కృష్ణనాటకము, (౬) పారిజాతాపహరణము, (౭) రమాపరిణయమనే పెండ్లిపాట, (౮) చెంచునాటకము, (౯) శ్రీకృష్ణ మంజరి, (౧౦) రుక్మిణీనాటకము, (౧౧) గోపికానాటకము, (౧౨) వేంకటాచలమాహాత్మ్యము, (౧౩) వాసిష్ఠరామాయణము, (౧౪) శ్రీభాగవతము, అనేవి వాటిలో ముఖ్యములు. ఈమె తన గ్రంథములను తరిగొండ నరసింహస్వామికిన్ని, తిరుపతి వేంకటేశ్వరునికిన్ని అంకితము చేసినది.

## పేకువుళ్ల రంగశాయి

ఈతడు రచించిన శ్రీభాగవతమనే గ్రంథ మొకటి ప్రాచ్య లిఖితభాండాగారములో ఉన్నది కాని, అది చాలా శిథిలావస్థలో ఉన్నది. మాతృకనుబట్టి కొంతభాగము నెత్తి వ్రాసినారుగాని దానిని సంపూర్ణముగా నుద్ధరించడానికి సాధ్యము కాలేదు. ఉద్ధృతభాగమునుబట్టి కవినిగూర్చిన విషయములేవిన్ని తెలియరాకున్నవి.

## శ్రేష్ఠలూరి వేంకటార్యుడు

ఇతడు భరద్వాజగోత్రుడు, ఆపస్తంబసూత్రుడు. కృష్ణార్యునికిని లక్ష్మకిని పుత్త్రుడు. వాధూలగోత్రుడయిన అన్నావినప్పలాచార్యుని శిష్యుడు. ఈతడు సంస్కృత, ప్రాకృత, ద్రవి, డాంధ్రభాష

లలో ప్రబంధము "లెన్నియైన" రచించి తిరుపతి శ్రీనివాసదేవుని కంకితము చేసినాననిన్ని, "అష్టభాషా కవిత్వార్జిత ప్రౌఢ్యదష్టావధాన విఖ్యాత బైరుదుఁడ" ననిన్ని చెప్పుకొన్నాడు. వేంకటాచల మాహాత్మ్యకథలు వారాహ, వామన, పాద్మ, గరుడపురాణములలో ఉన్న వాటికి పరస్పరవైరుద్ధ్యము సంభవించకుండా కథ నేర్పాటుచేసుకొని 'శ్రీనివాసవిలాససేవధి' అనే ద్విపదకావ్యము నారాశ్వాసములుగా రచించినాడు. ఇది చాలా ప్రశస్తమైన గ్రంథము. "రసభావయుక్తి సంగతుల, అష్టాదశవర్ణనల్ మెఱయ, మహాకావ్య పూర్ణలక్షణము" పట్టునట్లుగా గ్రంథమును రచిస్తినని కవి చెప్పుకొన్నాడు. ఈగ్రంథము తిరుపతి గోవిందరాజస్వామి కంకితము చేయబడినది.

## ముకుందయోగి

ఇతడు కాశ్యపగోత్రజుడు. కాశ్యప గోత్రుడైన కోవిల కందాడయణ్ణ పెద్దకొడుకయిన నాయనయ్య తమ్ముడు. అప్పలాచార్యుని శిష్యుడు. ఇతడు బ్రహ్మాండ పురాణములోని శ్రీరంగమాహాత్మ్య వర్ణననుసరించి తన శ్రీరంగ మాహాత్మ్యమును ద్విపదకావ్యముగా సవరించినాడు.

## శ్రీగిరి మల్లికార్జునస్వామి

ఇతడు సోమవారమాహాత్మ్యమును మంజరీద్విపదకావ్యముగా రచించినాడు. శైవులకు సోమవారవ్రతము చాలా ముఖ్యమయినది. సోమవారములలో మాఘసోమవారములు చాలా ముఖ్యములని కవి చెప్పినాడు.

## శేషము చెన్నుభట్టారకుడు

ఇతడు కౌండిన్యగోత్రోద్భవుడు - వేంకటార్యునికిన్ని లక్ష్మమ్మకున్ను పుత్త్రుడు. వైష్ణవమతమును వృద్ధిచేసిన రామానుజసురునకును సీతమదేవికిన్ని భట్టరార్యుడు పుత్త్రుడు. భట్టరార్యునికి రాగమ్మ, సత్యభామ అని యిద్దరు భార్యలు. వారిలో రాగమ్మను వేంకటార్యుడు

పుట్టినాడు. వేంకటార్యునికిన్ని లక్ష్మమ్మకున్ను రఘునాథుడు, రామానుజుడు, చెన్నభట్టారకుడు అని ముగ్గురుకొడుకులు పుట్టినారు. ఈ చెన్నభట్టారకుడే అభిమన్యుకల్యాణ మనేపేర శశిరేఖాపరిణయ కథను ద్విపదకావ్యముగా రచించి శ్రీరాముని కంకితము చేసినాడు.

## గద్దె చంద్రశేఖరకవి

ఇతడు సానగగోత్రుడయిన గద్దె వీరశరభాచార్యుని కుమారుడు. ఇతడు వీరశైవకవి. ఇతడు రచించిన ఉత్తర హరిశ్చంద్ర చరిత్రమనే ద్విపదకావ్యమును చెంగరాయాపరనాముడగు కుమారస్వామి కంకితము చేసినాడు.

## విజయరాఘవుడు

ఇతర వంశక్రమ మీ క్రిందివిధముగా నున్నది.

కృష్ణభూవరుడు
|
తిమ్మభూపాలుడు
(భార్య: బయ్యాంబిక)
|
పెద చెవ్వనాయడు | చిన చెవ్వనాయక1 | పెద్ద మల్ల | చిన మల్ల

(చిన చెవ్వనాయక1) ఇతని భార్య అచ్యుతరాయని భార్యకు సోదరి అయిన మూర్తిమాంబ
|
అచ్యుతరాయడు2
(భార్య: మూర్తిమాంబ)
|
రఘునాథుడు3 (౧౬౩౩–౭౩)
(భార్య: చెంపరాజు కుమార్తె లక్ష్మాంబ అనే కళావతి)
|
విజయరాఘవుడు4.

ఇతడు 'రఘునాథనాయకాభ్యుదయము'ను ద్విపదకావ్యముగా రచించిన కవి. ఆ గ్రంథములో ఆతడు తనవంశక్రమము నీ క్రిందివిధముగా చెప్పుకొన్నాడు.

౧. చినచెవ్వనాయకుడు శ్రీశైలమల్లికార్జునునికి నానావిధ కైంకర్యములను చేసినాడు.

౨. అచ్యుతరాయడు శ్రీరంగనాథునికి బంగారుసజ్జలు, ప్రాకారములు, కిరీటము, శృంగారవనములు ఇచ్చినాడు. మన్నీలను యుద్ధములో జయించినాడు.

౩. రఘునాథనాయకుడు తుండీరరాజు నోడించినాడు. జగ్గరాజును యుద్ధములో చంపినాడు. పాండ్యరాజును జయించి అతనిపుత్త్రికలను తనజోదులచేత చెరపట్టించి తెప్పించినాడు. పెనుగొండసింహాసనముమీద రామదేవరాయలను నిలిపినాడు. షోడశ మహాదానములు చేసినాడు.

౪. కవి అయిన విజయరాఘవుడు పడమటిదొరను గెలిచి, పట్టాభిషేకదినమున షోడశమహాదానములు చేసినాడు. యుద్ధములో సవరము వేంకటపతిని త్రోలి, పందసెల్లూరసేపట్టణము నొకగడియలో నిర్మించినాడు. శ్రీరంగరాయలను సింహాసనముమీద నిలిపి, పాండ్య తుండీరపతులను ఖండించి వారిని వాకిటికావలికి నిలిపినాడు. రఘునాథపురము, చంపకవల్లి మొదలయిన ఎన్నో అగ్రహారములను నిలిపినాడు. ఇతడు శ్రీతిరుమల తాతాచార్యదేశికునిచేత వైష్ణవమత దీక్షను పొంది. తండ్రియే దైవమని భావించేవాడు. ఇతడు తనతండ్రి రఘునాథరాయలచరిత్రమును రఘునాథాభ్యుదయములో వర్ణించి మన్నారు రాజగోపాలస్వామి కంకిత మిచ్చినాడు.

ఇతడు 'అష్టభాషావిశేషాభిజ్ఞ సుకవి పుష్టిదాన నిదాన భోజభూజాని' నని వర్ణించుకొన్నాడు.

రఘునాథరాయలు రుక్మిణీకల్యాణము మొదలయిన నాటకము లను వ్రాసినాడు. 'మహనీయపదపద్యమంజరీముఖ్య బహుళప్రబంధ నిబంధనశాలి' అట ఇతడు.

## దర్భా కవిగిరి

ఇతనికి వేంకటగిరి అనిన్ని పేరున్నది. ఇతడు 'రుక్మాంగద చరిత్ర'మును ద్విపదకావ్యముగా వ్రాసినాడు. ఇతని వంశము గ్రంథ ములో నిట్లు వర్ణితమైనది.

దర్భావంశమువాడు, లోహితగోత్రోద్భవుడు, ఆపస్తంబ సూత్రుడు, అయినగోపాలమంత్రికిన్ని చెంగమాంబికకున్ను ఔభలన్న పుట్టినాడు. ఔభలన్నకున్ను జానకాంబకున్ను గోపన్న, గిరిరాజకవి, వెంగనార్యుడు, వేంకటకవిగిరి, అని నలుగురుపుత్త్రులు ప్రభవించి నారు. వారిలో అగ్రజుడైన గోపన్న శాహాజీరాజుసభలో కీర్తి కెక్కి నాడు.

వేంకటకవిగిరి రుక్మాంగదచరిత్రమును మాళివంశమువాడైన విచిత్రరాయనికొడుకు ఖండోజీరాయని కోరికపై వ్రాసి, మన్నారు రాజగోపాలుని కంకితముచేసినాడు.

## ఓబళయ్య

ఇతడు సర్వయ్యపుత్త్రుడు. కపోతవాక్యమనే ద్విపద గ్రంథ మును రచించినాడు. ఇది భారతములోని కపోతలుబ్ధోపాఖ్యానపు కథ. కపోతవాక్యమనేపేర ఆర్వేలనియోగి బ్రాహ్మణు డయిన వేంక టగిరి అనే కవి రచించిన ద్విపదకావ్యము మరొకటున్నది. ఈ రెండు గ్రంథములను రచించినవా డొక్కడే అయి ఉంటాడు.

భారతకథకాక కల్పితమైన కథకలిగిన కపోతవాక్యమనే ఒక ద్విపదకావ్య మున్నది. కాని దానికర్తయెవరో తెలియదు. విభీష

ణుడు రామునికి శరణాగతుడై రాగా సుగ్రీవుడు విభీషణుని చేర దీయవద్దని వారించినాడు. అప్పుడొక కపోతము వచ్చి రామునితో విభీషణుని చేరదీసి తనశరణాగతవత్సల బిరుదమును నిలుపుకోవలసిన దని హెచ్చరిస్తుంది.

## రేటూరి (రెట్టురి) భావయామాత్యుడు

ఆదిలక్ష్మి అయిన కామేశ్వరికిన్ని కృష్ణునికిన్ని జరిగిన పరిణయ కథ నీకవి కామేశ్వరీచరిత్ర మనే ద్విపదకావ్యముగా రచించినాడు. దీనికి 'ఆదిలక్ష్మీవిలాస' మనికూడా పేరున్నది. కవి శ్రీవత్సగోత్రుడు, ప్రెగడయామాత్యుని పౌత్రుడు. రామధీమణికిన్ని నాచారమ్మకును పుత్రుడు. అద్దంకి సింగరాచార్యు డితనిగురువు. కవి తనగ్రంథమును గుంటిచెర్వు ఖుంచకామేశ్వరీదేవి కంకితము చేసినాడు. కామేశ్వరికి 'కామవల్లి' అనికూడా కవి పేరుపెట్టినాడు.

కామేశ్వరి ఆదిలక్ష్మి. ఈమెను 'అక్కలు' అనేపేర బ్రాహ్మణులు మొదలయినవారిలువేల్పుగా ఆరాధిస్తున్నారు. శ్రీరామమూర్తిని ఆదిలక్ష్మి మోహించినది. కాని, ఇష్టార్థసిద్ధి కలుగలేదు. అందుచేత ఆమె ఆదేవుని కృష్ణావతార మెత్తవలసినదిగా శపించినది. కృష్ణుడామెను కామేశ్వరిగా అవతరించవలసినదని ప్రతిశాప మిచ్చినాడు. శ్రీకృష్ణుడవతరించినప్పుడు కామేశ్వరి సప్తకన్యలుగా అవతరించినది. కాని, ఆతనిప్రేమను పొందలేక పోయినది. అందుచేత అనేకులయిండ్లలో ఇలువేల్పుగా నెలకొని, వారికి కోరినకోర్కెలిస్తూ, విరహతాపమును భరించుకొంటూ ఉన్నవిషయము "కామేశ్వరీ చరిత్రము"లో వర్ణింపబడినది.

## లావనూరి రామనార్యుడు

ఇతడు జైమినీభారతాంతర్గతమైన కుశలవోపాఖ్యానమును ద్విపదకావ్యముగా రచించినాడు. కవి నందవరీక నియోగిబ్రాహ్మణుడు.

'ప్రాచీనవేదమార్గప్రతిష్ఠాపనాచార్యు'డైన శ్రీ సింగరాచార్యుని ప్రపౌత్త్రుడు. తిరుమలాచార్యుని పౌత్త్రుడు. ఔబళమంత్రికిని సిరియమాంబకును పుత్త్రుడు. సిరియాంబ బ్రహ్మశిష్టనామాత్యవరుని అనుజుడైన దుర్గన్నకు జ్యేష్ఠపుత్త్రుడైన మాచయప్రోలు గ్రామ వాస్తవ్యుడైన చిలుకలనారయకు పుత్త్రిక. కవికుటుంబము లావనూరిలో ఉండేది గనుక అతనియింటిపేరు లావనూరివారని వచ్చినది. ఔబళమంత్రి నందనగరాగ్రహారపతి అట. రామనామాత్యుడు తిరుమలాచార్యుని శిష్యుడనని, సంగీతసాహిత్యచతురుడనని, రామకథావిశారదుడనని, "రామాయణచక్రవర్తి" అనేబిరుదము కలవాడనని చెప్పుకొన్నాడు.

పైనిచెప్పిన సింగరాచార్యుడు కామేశ్వరీచరిత్రమును వ్రాసిన రేటూరి భావయామాత్యుని గురువైన అద్దంకి సింగరాచార్యుడై ఉంటాడు.

తిరుమలాచార్య శిష్యు డొకడు నలచరిత్రమును వ్రాసినాడు. అతనిపేరు వ్రాతప్రతిలో కానరాదు. అతడున్ను రామనార్యుడే అయిఉంటాడేమో!

## చిత్తారు గంగాధరుడు

ఇతడు జంగమకులమువాడు. శిరువకోడ్పురక్షేత్రనివాసి. నాగలింగయ్యకును సోమాంబకును పౌత్త్రుడు. వీరయ్యకును మల్లాంబకును పుత్త్రుడు. జాలరికులములో ఏలూరిలో అవతరించిన గంగకున్ను శివునికిన్ని జరిగిన వివాహకథ నితడు 'గంగావివాహము' అనే పేర ద్విపదకావ్యముగా రచించి చిరిచకోడూరిలోని శ్రీరామేశ్వరదేవుని కంకితమిచ్చినాడు. మల్లయ్య, వీరయ్య అనేవారు కవికి అన్నలు.

ఈకవినే 'భల్లాణచరిత్రము' అనే మరొక ద్విపదకావ్యమును వ్రాసి రాచవీటి వీరభద్రస్వామి కంకితము చేసినాడు.

"సిరియాళచరిత్రము" అనే మరొకద్విపదకావ్య మున్నది. దానికర్త వెనెవెళ్ల గంగాధరుడని కలదు కాని, ఇతడున్ను తన తలిదండ్రుల పేళ్లను వీరయ్య మల్లాంబలుగా చెప్పడముచేతనున్ను, సిరియాళ చరిత్రము భల్లాణచరిత్రమువలెనే రాచవీటి వీరభద్రస్వామి కంకితము కావడముచేతనున్ను వీరిద్దరున్ను ఒక్కరేఅని చెప్పడాని కవకాశ మున్నది.

## నరసింహుడు

ఇతడు కడమతాతార్యుని శిష్యుడట. ఇతనినిగురించి ఇతర విషయములు తెలియవు. ఇతడు 'ధర్మజకృష్ణసంవాదము' అనేద్విపద కావ్యమును రచించినాడు. గ్రంథనామము గ్రంథములో కానరారు. విషయమునుబట్టి పేరూహింపబడినది.

## బొమ్మకంటి నరసింహాము

ఇతడు కౌండిన్యగోత్రుడు. మాధవునికిని నర్సమాంబ (సర్వాంబ) కును పుత్త్రుడు., అని ఒక ప్రతిలో ఉన్నది. ఇతడు 'ధర్మాంగద చరిత్ర' మనే ద్విపదకావ్యమును రచించి, మారకాపుర చెన్నకేశవ స్వామి కంకితము చేసినాడు.

ధర్మాంగదుడనేరాజుకు సర్పాకారముతో ఒక కొడుకు పుట్టి నాడు. ఆకొడుకు మనుష్యుడే అని లోకమునకు నమ్మకముపుట్టేటట్లు పెంచి, పామునకు సత్యవతి అనేకన్యక నిచ్చి పెండ్లిచేసినారు. సతని వతి పామే తన భర్తగా ఎంచుకొని దానిని బుట్టలో నెత్తుకొని రక్షిస్తూ, తీర్థముల వెంబడి తిరుగుతూ, తుదకు బ్రహ్మకుండములో దానిని కడుగగా, పా మొక్క రాజకుమారుడైన కథ ఈ కావ్యములో

అతి సరసముగా చెప్పబడినది. ఈ గ్రంథమును లోకములో 'పాము కథ' 'పాముపాట' అనే పేళ్లతో స్త్రీలు మిక్కిలి గారాముతో పాడుకొంటూ ఉంటారు.

## తిమ్మన

ఇతడు కాశ్యపగోత్రుడు, వలభసూరిపుత్త్రుడు. నలచక్రవర్తి చరిత్రమును వ్రాసి శ్రీరామాంకితము చేసినాడు.

ఈ గ్రంథపు ఒకానొక వ్రాతప్రతిలో 'పుష్కరిణీతటమున', 'ఉభయకావేరీమధ్యమున' నెలకొన్న గోవిందునికి కవి భక్తుడనిన్ని తిరుమలాచార్యునిశిష్యు డనిన్ని ఉన్నది. కాని దానిలో తిమ్మయ నామ ముదాహరింపబడలేదు. గ్రంథభాగము లీ రెండింటికిని చాలామట్టుకు సామాన్యముగా ఉండడముచేత ఈ రెండింటికిన్ని కర్త తిమ్మనయే అని అనుకోవచ్చును.

## పోలిశెట్టి లింగనకవి

ఈకవి వీరశైవుడు. బగిరాముపల్లి నివాసి అయిన చకిలాల లింగప్ప కోరికచొప్పున ఈతడు 'నవచోళచరిత్రము' అనేపేర ద్విపద కావ్యమును రచించి బగిరాముపల్లిలోని మృత్యుంజయేశ్వరుని కంకితము చేసినాడు. కవి యింటిపేరు 'పోశెట్టి'అని ఉన్నది.

'పోల్ శెట్టి' అని ఉండవలెనేమో. కవి తనకు పూర్వులుగా పాలకురికి సోమేశుని, గార్లపాటి లక్ష్మణుని స్మరించినాడు. చకిలాల లింగప్ప గుండయ్య బ్రహ్మయ్యగారి అంశమున పుట్టినాడట. కన్నర మఠమందలి సదాగారగురువుకు శిష్యుడయిన చెన్నబసవన్న కవికి కవితాగురువు.

లింగనకవి నవచోళచరిత్రమునేకాక, శంకర దాసమయ్య చరితము, వీరసంగయదేవచరితము, మల్హణచరితము, శివ్యప్రబోధనము, అనే గ్రంథములనుకూడా రచించినట్లు చెప్పుకొన్నాడు.

నవచోళు లనేవారు గొప్ప శివభక్తులుగా వీరశైవ కావ్యములలో స్తుతింపబడ్డారు. కరికాలచోడుడు, కరయూరిచోడుడు, రాజేంద్రచోడుడు, నరేంద్రచోడుడు, ఉత్తుంగచోళుడు, విక్రమచోడుడు, నంబిచోడుడు, వీరచోడుడు, వెలనాటిచోడుడు, అనే వారు నవచోళులు. వీరందరున్ను చరిత్రప్రసిద్ధులు.

నవచోళచరిత్రమును తనకు పూర్వము కన్నడకవులు కన్నడములో వ్రాసినా రనిన్ని, దానిని 'తెనుగున ద్విపదగా తేటతెల్లమిగ' రచింపవలెననిన్ని చకిలాల లింగప్ప తన్ను కోరినట్లు కవి వ్రాసినాడు. కన్నడములో 'నవచోళచరిత్ర' అనే గ్రంథము బయలుపడలేదు. కాని, చోళసాంగత్య, చోళరాజరసాంగత్య, అనే రెండు గ్రంథములున్నవి. మొదటిది పదిహేనో శతాబ్దమునాటిది, కర్తపేరు తెలియదు. రెండోది పదహారో శతాబ్దమునాటిది, దీనిని లింగకవి రచించినాడు. సాంగత్య మనేది ఒకరీతి కావ్యరచన, పాటలరూపముగా యక్షగానమును పోలిఉంటుంది.

## ఔబళకవి

ఇతని తండ్రి వింటి సిద్ధన. ఇతడు స్కాందపురాణాంతర్గతమైన శివరహస్యఖండమును తెనుగున ద్విపదకావ్యముగా రచించినాడు.

## ఉలిచి భావజ్ఞుడు

ఇతనిని గూర్చిన వివరము లేవిన్ని తెలియరాకున్నవి. పరశురాముడు కార్తవీర్యార్జును నోడించిన కథను 'పరశురామాయణ' మనే పేర మంజరీద్విపదకావ్యముగా రచించినాడు.

## చంద్రశేఖరకవి

ఇతడు "విశ్వకర్మాన్వయము"న జనించిన కిన్నెర బ్రహ్మ వంశజుడు. సుపర్ణసగోత్రుడు. ప్రమథయాచార్యపౌత్రుడు. కంచర్ల య్యవారి పుత్రుడు. ఇతడు బ్రహ్మకూతురైన సంజ్ఞాదేవిని సూర్యుడు వివాహమాడినకథను "భానుకల్యాణ" మనేపేర ద్విపదకావ్యముగా రచించినాడు. కవిత్వము చాలా చక్కగాఉన్నది.

## కాచన

ఇతడు కౌశికగోత్రుడు, మల్లరి అయ్యలన్నకున్ను లక్క మాంబకున్ను పుత్రుడు. శ్రీహరికులజుడ నని చెప్పుకొన్నాడు. ఇతడు రచించిన ద్విపదకావ్యము మైరావణచరిత్రము. దీని నాతడు శ్రీశైలమున కుత్తరముగాఉన్న చెలలూరిలో వెలసిన చెన్నకృష్ణుని కంకితము చేసినాడు. గ్రంథము మంజరీద్విపదాచ్ఛందస్సులో ఉన్నది.

## సిద్ధేంద్రయోగి

ఇతనిని గురించిన వివరములు తెలియవు. ఇతడు 'బాలబ్రహ్మ లింగ విగ్రహవిశాల కృపాలబ్ధ సత్కవిత్వంబు శ్రీమతిఁ గైకొన్న వాడ'నని చెప్పుకొన్నాడు. ఇతడు రచించిన ద్విపదకావ్యము 'యోగీ శ్వరవిలాసము.' అల్లమప్రభువు అక్కమహాదేవి కుపదేశించినట్లు దీనిలో వీరశైవసిద్ధాంతము వివరింపబడినది.

## బాణాల శంభుదాసుడు

ఇతడు విశ్వకర్మకులమువాడు. గౌతమగోత్రుడు. నాగాంబ కున్ను అప్పయకున్ను పుత్రుడు. ఇతడు కొండపల్లి (పల్లికొండ అని ఒకప్రతిలో ఉన్నది.) గోపాలుని వరముచేత కవిత్వ శక్తిని సంపాదించినాడట. 'సారంగధరచరిత్రము' అనే ద్విపదకావ్య

మీతనికృతి. దీనిని బూదవాఁడె నీలకంఠేశ్వరస్వామి కంకితము. చేసినాఁడు

"కర మనురక్త్యుక్తి గల చేమకూర
యప్పన చెప్పినయాప్రకారమున"

సారంగధరుని కథను చెప్పినా నన్నాఁడుగాని, ఈ అప్పన యెవరో తెలియదు. అతఁడు రచించిన సారంగధరచరిత్ర కానరాదు. చేమకూరి వేంకటకవికే అప్పన అని సురొకపే రున్నదేమో! వేంకట కవి కృతిలోని కథకును ఈ కవి చెప్పిన కథకును కొన్ని భేదము లున్నవి.

## గురవయ్య

ఇతఁడు బాదరాయణ గోత్రమువాఁడ నని చెప్పకొన్నాఁడు. బాదరాయణుఁడు గోత్రకర్తగా ఎక్కడను చెప్పబడలేదు. ఇతని తండ్రి దావులపురమునకు కరణమైన వెంకటనరసింహము. ఇతఁడు కాశీ ఖండములోని సురాభాండేశకథను 'సురాభాండేశ్వరము' అనేపేర ద్విపదకావ్యముగా రచించినాఁడు. దీనిలో ఇంచుమించు ౨౨౦ ద్విపదలలో కామశాస్త్రము వివరింపబడినది.

## పరమానంద తీర్థుఁడు

ఇతఁడు దత్తాత్రేయయోగికి శిష్యుఁడు. ఇతఁడు రచించినది 'శివజ్ఞానమంజరి' అనే ద్విపదకావ్యము. దీనిలో శైవవేదాంతము ప్రతిపాదింపబడినది.

"సిద్ధానుభూతి సంసిద్ధి వహించు
సిద్ధులు లోకప్రసిద్ధులు చెప్ప

మున్ను నేసినయట్టి ముఖ్యశాస్త్రంబు
లన్నియుఁ జూచి నే నందలియర్థ
భావ మెల్లను దేటపఱిచెదఁ బ్రౌఢి"

అని కవి చెప్పినాడు.

ఇతడే 'అనుభవదర్పణము' అనే మరొక ద్విపదకావ్యమును రచించినాడు.

## మరిగంటి వేంకటాచార్యుడు

ఇతడు మల్లారిచరిత్రమను ద్విపదకావ్యముగా వ్రాసినాడు. భారతయోధుడయిన కర్ణుని వంశచరిత్రము దీనిలో వర్ణింపబడినది.

## ఎఱ్ఱమిల్లి వేరరాజకవి (౧౮౬౦)

ఇతడు మరిగంటి వేంకటాచార్యుడు రచించిన మల్లారి చరిత్రము సంగ్రహముగా ఉండడము చూచి గోడే సూర్యప్రకాశ రావుభార్య జానకయ్యమ్మ ఆజ్ఞప్రకారము మూలద్విపదగ్రంథమునకు మంజరీద్విపదలనుచేర్చి విస్తరించినాడు. మల్లారికరుణచేత గోడేవారికి రాజ్యము వచ్చినదట. అందుచేత జానకయ్యమ్మ ఈగ్రంథమును విస్త రింపజేయించినది. మల్లారిచరిత్రములో భారతవీరుడైన కర్ణునివంశము వర్ణింపబడినది.

ఈకవి ౧౮౪౦ - ౬౦ ప్రాంతములలో ఉండిఉంటాడు.

## పర్వతమంత్రి లింగనామాత్యుడు

ఇతనిని గురించిన వివరము లేమిన్ని తెలియరావు. ఇతడు వీర శైవుడై ఉంటాడు. ఇతడు 'రుద్రాక్ష మాహాత్మ్యము'ను ద్విపదలో రచించినాడు.

## చౌదరి రామదాసు

ఇతనిది కొలుచనూళ్లగోత్రము. ముత్తనకున్ను, వెంకమ్మకున్ను నాయడు పుట్టినాడు. అతనికిన్ని గంగమ్మకున్ను సుర్వప్ప పుట్టినాడు. అతనికిన్ని కోనమ్మకున్ను రాయప్ప పుట్టినాడు. చౌదరి రామదాసు రాయప్పకు కొడుకు.

ఇతడు రుక్మిణీకల్యాణమును ద్విపదకావ్యముగా రచించినాడు.

## చల్లా గురవయ్య

ఇతడు శుక్లయజుశ్శాఖీయుడు, పేరయ్యకు పుత్త్రుడు, 'బాలసరస్వతి' బిరుదాంచితుడు. ఇతడు కృష్ణాపాత్రుని వేంకట మంత్రి ప్రేరణచేత 'యాజ్ఞవల్క్యవిజయము' అనే ద్విపదకావ్యమును షట్కాండలుగా రచించినాడు. జన్మకాండ, వేదకాండ, మైత్రేయ కాండ, పరబ్రహ్మకాండ, యజ్ఞకాండ, విశ్వజిత్కాండ అని ఆ కాండముల పేళ్లు.

కొచ్చెర్లకోటలో మంత్రిగా ఉండిన అమరన్నకున్ను లక్ష్మమ్మకున్ను మాదనమంత్రి పుట్టినాడు. అతనికిన్ని తిరుమలమ్మకున్ను కొడుకు కేసప్రధాని. అతనికిన్ని తిప్పమ్మకున్ను ఏటామహాపాత్రుడు జన్మించినాడు. అతనికిన్ని గోపమ్మకున్ను పుత్త్రుడు కృష్ణామహాపాత్రుడు. ఇతడే యాజ్ఞవల్క్యవిజయ కృతిభర్త. ఇతనిభార్య అమ్మమాంబ.

కొండపల్లి నివాసి చల్ల అనంతయ్యకున్ను, యజ్ఞమ్మకున్ను తిప్పయమంత్రి పుట్టినాడు. ఆతనికిన్ని వీరమాంబకున్ను పేరప్రధాని, మల్లమంత్రి కూనయమంత్రి అని ముగ్గురు కొడుకులు. వారిలో పేరమంత్రికిన్ని ఎల్లమాంబకున్ను గురవయ్య, గురువయ్య, మల్లికార్జునుడు అనేవారు కొడుకులు. వీరిలో పెద్దవాడే యాజ్ఞవల్క్య విజయ

కృతికర్త. తాను యాజ్ఞవల్క్యవంశజుడనని్ని కౌండిన్యగోత్రజుడ నని్ని చెప్పకొన్నాడు.

## పాతూరి తిరుపతికవి

ఇతడు ఆరాధ్య అమ్మయామాత్యుని పుత్త్రుడు, పేరనమంత్రి పౌత్త్రుడు, శ్రీవత్సగోత్రజుడు, తుమ్మపూడి నివాసి. ఇతడు మైరావణ చరిత్రమును ద్విపదగా రచించినాడు. ఇతడు హనుమద్విజయమనే ప్రబంధమునుకూడా రచించినట్లు చెప్పకొన్నాడు.

## లక్ష్మణార్యకవి

ఇతడు రామానుజాచార్యులవారి విశిష్టాద్వైతసిద్ధాంతమును 'తత్త్వార్థదర్పణము' అనేపేర ద్విపదకావ్యములో వివరించినాడు. ఇతనినిగురించి ఇతరవిషయము లేవిన్ని తెలియరావు.

## యోగానందావధూత

ఇత డద్వైతవేదాంతబోధకముగా 'ఆత్మైకబోధ' అనే ద్విపద కావ్యమును రచించినాడు. ఇతడు లింగసురునిశిష్యుడు.

## రామూరి వేంకటలింగకవి

ఇత డార్వేలనియోగిబ్రాహ్మణుడు. సుబ్బమాంబారామయార్యుల పుత్త్రుడు. ఇతడు బంగారు వేంకటవీరభూపాలుని ప్రేరణచేత సంస్కృతభాషలో కృష్ణమిశ్రుడు రచించిన ప్రబోధచంద్రోదయ నాటకకథ నెత్తుకొని ద్విపదకావ్యముగా రచించినాడు. ఇతడు సద్ఘనేంద్రునిశిష్యుడు.

కౌండిన్యగోత్రుడు, ఆపస్తంబసూత్రుడు, ఆర్వేలతిలకుడు, అయిన రాచూరి తిమ్మయామాత్యునికిన్ని లింగాంబకున్ను వరద మంత్రి కొడుకు. అతనికిన్ని జ్ఞానాంబకున్ను రామమంత్రి, కృష్ణ

మంత్రి, అని యిద్దరు పుత్త్రులు పుట్టినారు. వీరిలో రామమంత్రి కసువా నరసార్యుని కూతురయిన సుబ్బమాంబను పెండ్లాడినాడు. వీరిద్దరికిన్ని రాచూరి వేంకటలింగకవి జనించినాడు. ఇతడు పెరవురి చంద్రశేఖరుని పుత్త్రుడైన బంగారు వేంకటవీర పృథ్వీవల్లభునికిన్ని, అతనికొడుకు చంద్రశేఖరరాజుకున్ను సన్నిధినుండి తన గ్రంథమును రచించినానని చెప్పుకొన్నాడు.

## కన్నడ నరసకవి

ఇతడు కన్నడనరసమంత్రి కొడుకు. బడిగలనాటి బ్రాహ్మణుడు. 'నింబజామాహాత్మ్య' మనే ద్విపదకావ్య మీతనికృతి. గ్రంథము ప్రథమాశ్వాసాంతములో దీనిపేరు 'ఏకవీరామాహాత్మ్యము' అని కలదు కాని, తక్కిన ఆశ్వాసాంతద్విపదలలోను గ్రంథము మధ్య అచ్చటచ్చటను 'నింబజామాహాత్మ్యము' అనియే ఉన్నది. మన్నారు జెట్టి అనే అతడు కవితో

'దేవమల్లుని కథ దేవిమాహాత్మ్య
మీవిధం బని శాఖ లేర్పాటుగాఁగ
రమణ బ్రహ్మాండపురాణసంహితల
విమలమౌ దశగోత్రవిధము లేర్పడఁగఁ
దెనుఁగునఁ దేటగా ద్విపదకావ్యంబు
నొనరించి రఘుపతి కొప్పించుము'

అన్నాడట. మన్నారుజెట్టివంశ మిట్లు తెలుపబడినది.

దేవమల్లకులములో విశ్వామిత్రగోత్రము, ఋక్శాఖ, ఆశ్వలాయనసూత్రము వాడయిన కలిగె విఠలజెట్టికి వెంకటజెట్టి, గోవింద జెట్టి అని యిద్దరు కొడుకులు. వెంకటజెట్టికి తొక్కడమ్మ వెంకట

జెట్టి అనికూడా పేరున్నది. అతనికిన్ని రంగమాంబకున్ను మన్నారు జెట్టి, రామా జెట్టి అని యిద్దరుకొడుకులు పుట్టినారు. వారిలో కృష్ణమాంబ భర్త అయిన మన్నారు జెట్టియే నింబజామాహాత్మ్యమును నరసకవిచేత వ్రాయించినవాడు. గ్రంథము 'ధేనువాళము గరిడిలోన నెలసిన శ్రీరఘురాముని' కంకితము.

## లోకేరావు సోమన

ఇత డాశ్వలాయనసూత్రుడు, హరితసగోత్రుడు. ఇతని మూల పురుషుడైన శివదేవమంత్రి లోకేరావు అనే ఊరిని ప్రతిష్ఠించడము చేత ఆవంశమునకు లోకేరావువా రని పేరు వచ్చినది. శివదేవమంత్రి వంశములో మాయదేవునికి పావనామాత్యుడున్ను, అతనికి ఆరుగురు కొడుకులున్ను పుట్టినారు. ఆ ఆరుగురిలోను నాగమాంబవల్ల పుట్టిన నాగనార్యునికి చెన్నయ్య, విత్తయ్య అని యిద్దరుపుత్త్రులు పుట్టినారు. విత్తయ్య లింగమంత్రి, ...మంత్రి, ధర్మమంత్రి, అని ముగ్గురుకొడు కులను కన్నాడు. ధర్మమంత్రికిన్ని లక్కమాంబకున్ను సోమన్న, విత్తన్న, కొండన్న, అని ముగ్గురుకొడుకులు. సోమన్నయే 'బలభద్ర విజయము' అనే ద్విపదకావ్యమును వ్రాసినాడు. తా నింకను బల్లాహ చరితము (పద్యకావ్యము,) శివరాత్రి మహత్త్వము (వచనము), లక్షణాదేవి కల్యాణము (ద్విపద యక్షగానము), శుకరంభాసంవాదము (యక్షగానము) అనే గ్రంథములను రచించినట్లు బలభద్రవిజయావ తారికభాగములో కవి చెప్పుకొన్నాడు.

## సింగనామాత్యుడు

ఇతడు భరద్వాజగోత్రుడు, అయ్యలార్యునిపుత్త్రుడు. ఇతడు భాగవత దశమస్కంధమును ద్విపద కావ్యముగా రచించి శోభవమంత్రి గంధామాత్యుని కంకితము చేసినాడు.

---

## ౮

## సోమనాథుని ద్విపదారచన

సోమనాథుడు బసవపురాణ, పండితారాధ్య చరిత్రములలో "వేదవేదాంతేతిహాస వివిధాగమ పురాణ విహితసూక్తముల నిదమిత్థ మనుచోట నివియ ప్రమాణపదము' లనేటట్లు ద్విపదలలో ఆయా ప్రమాణవాక్యములను చేర్చినాడు. ఆ వాక్యముల నట్లు చేర్చడమే తనప్రజ్ఞ అని చాటుకొన్నాడుకూడాను. ఆ చేర్చడములో కొన్ని జల్లిపదములు చేర్చవలసివచ్చినది. అట్లు చేర్చుతున్నా నన్నవిషయ మతనికి తెలియకపోలేదు. కాని, దానికి సమాధానము చెప్పుకొన్నాడు. 'సొట్టైనరత్నంబుచుట్టును బసిడిగట్టినభావన' 'అని తనరచనను చూడు మన్నాడు. 'వేదవాక్యంబు ద్విపదకొలందిన పలుకుటకును మది మెచ్చ' మన్నాడు. 'ప్రేలిముద్రిక రత్నకీలన సేయుచో లేశమైన వచ్చునె రత్తమొత్త ?' రత్నమునొత్తుటకు వీలులేదు. రత్నము సొట్టదయితే 'దానిచుట్టును బసిడిగట్టుట యది వివేకంబు'అని సమర్థించుకొన్నాడు. అత డుదాహరించిన వేదవాక్యములు రత్నములే అయినా, వాటిని ద్విపదలలో అతికించడాని కుపయోగించిన 'జల్లి'పదములు పసిడి అవుతుందో కాదో చెప్పలేముగాని, అతని కవితా ప్రవాహములో వాటి ఉనికి అంతగా పట్టి ఇవ్వదనిచెప్పడ మతిశయోక్తికాదు. ఆయాగ్రంథ ములనుంచి యెత్తి ఉదాహరించడాని కాత డుపయోగించిన నిరర్థక పదము లనేకము లున్నవి. వాటి నీక్రింద ఇస్తున్నాను.

అట, అడి, అనగంజాలి, అనదె, అనుమక్తిన్, అమరి, అరయన్, అర[illegible], [illegible], అవున్, అపలారన్;

ఆయతిన్, ఆరన్; ఇదె, ఇలన్; ఉఱున్, ఉలియన్; ఎనయంగన్, ఏన యు, ఎలమిన్, ఎసగి; ఒగిన్, ఒనరన్, ఒలయన్, కడునర్థిన్, క్రియన్, కడుభక్తితో, కదలి, కదిరి, కనలి, కయికొని, కరమర్థిన్, కరము, క్రియగొని; ఖ్యాతిన్; గతిన్, సుజీన్; చనన్, చనదె, చను, చెనసి; జగతి, జడను; తగన్, తగి, తగిలి, తతిన్, తనరన్, తనరి, తనరారు చున్, తరమిడి, తటిన్, అత్తటిన్, తలంపన్, తవిలి, తా, తాన, తివిరి, తుదిన్, తెలియంగన్, తొడంగి, తొడరి; ధరన్, ధృతిన్; ననిచి, నన్ని, నలిన్, నలుపొందన్, నిగుడన్, నియతమతిన్, నియ తిన్, నెగడన్, నెగడి, నెటీన్; పదరుచున్, పరగన్, పరిన్, పరు వడిన్, పాయక, పెనగి, పెసుపొందన్, పెలుచన్, పొగడంగ, పొదలి, పొనరంగన్, పొరిన్, పొలంగన్, ప్రతిన్, ప్రబలి, ప్రయ తిన్, ప్రాప్తిన్, ప్రీతిన్; బిగిన్; భంగిగా, భాతిగా, భువినొప్పన్; మగుడన్, మతిన్, మనసిడి, మరి, మసలి, మాపు, మానక, మానరీతిన్, మును, మున్న, మృదురీతిన్, మొగిన్, మొదలన్, మొనసి; యశమ్మారగాన్; రంగద్గతిన్, రతిన్, రూఢిమైన్; లలిన్, లలితోక్తిన్, లలిదలిర్పంగన్, లీలన్; వగవన్, వగవంగన్, వడిన్, వరుసన్, వలనొప్పన్, వలన, వసుధన్, వారక, వావిగిన్, విధృతశీల, వినన్, విరలము, విసళ్మృతిన్, వెలయన్, వ్యక్తము, వ్రతయుక్తిన్; సడిసనన్, సత్తుగా, సఫలతన్, సరిన్, సహజంబు, సొగసి, మొదలైనవి.

ఇక నాయా వాక్యములను ద్విపదలతో కవిచేర్చినవిధము నాలోచింతాము. అత డుదాహరించిన ఒక్కవాక్యమైనా సంపూర్ణ ముగా ఒక్కచోట చేరలేదు. ద్విపదలో అది చేరడానికి కష్టమైనది. కాబట్టి ఆ వాక్యముల నాతడు తుండుతుండ్లుగా తెగగొట్టినాడు. రెం డుదాహరణాలు.

"త్వమశ్రియాం మరుతో మర్జయంత రుద్ర యత్తే
జనిమ చారు చిత్రమ్." ఋక్సంహిత

దీనిని ద్విపదలలో పొందించినవిధము:—

.....................వీరభక్తి స్థలచిత్తు
లయి 'మరుతో మర్జయంత' నాశ్రుతిఁజ-
నిన 'రుద్రయత్తే జనిమ చారుచిత్ర'
మన దె?

పండి. చ. (౧) ౪౯

దీనిలో 'త్వమశ్రియం' అనే భాగము లోపించినది.

"యశ్శ్రాద్ధకాలే హరభుక్తశేషం
దదాతి భక్త్యా పితృదేవతానాం
తేనైవ పిండైశ్చ తిలైర్విమిశ్రై
రాకల్పకోట్యాం పితరః సుతృప్తాః"

కూర్మపురాణము.

దీనికి ద్విపదలు:—

ఓలిన "యఛ్ఛ్రాద్ధకాలే' యనంగఁ
జెనసి తా 'హరభుక్తశేషం దదాతి'
యన హరభుక్త శేషాన్నపానములు
దివిరి 'భక్త్యా పితృదేవతానా' మ-
నవినుడు పితృదేవనివహంబులకుఁ దొ-

డంగి 'తేనైవ పిండై స్సతిలై ర-
నంగఁ బిండము దర్పణము సమర్పింపఁ
బ్రాప్తి 'నాకల్పకోట్యాం పితరస్సు-
తృప్త' నాఁబితృకోటి దృప్తి నొందంగ.

పండి. చ. (౧) ౨౩.

దీనిలో 'పిండైశ్చ' లోని 'చ' లోపించినది.
'సుతృప్తాః' అనేది 'సుతృప్త' అయినది.

ఒకొక్కచోట ఉదాహృత వాక్యములను ద్విపదలలో కూర్చ డానికి సోమనాథుడు చాలా కష్టపడ్డాడు. ఒక్క ఉదాహరణము చాలును.

ఉర్వి వెండియును దదుక్తిమధ్యమున
'సర్వజ్ఞతా చ సంజాత దేవేంద్ర
న హి సంశయో' యనన్ సర్వజ్ఞతయును
సహజంబువడసె నిస్సంశయం 'బింద్ర
చ ననంద సాక్షాత్ప్రసాదభోగేన'
యన మఱి 'భక్తోఽయ' మన 'లభతే ఫ-
ల' మ్మన శివుకేవలప్రసాదము ము-
దమ్మునఁ గుడుచుఫలమ్ము 'దద్వాక్తు'
నున 'నహి మే శక్తి' రన 'న గిరో'' య-
న 'న గిరాం పతయే' యనఁగ.....

ఒకొక్కప్పుడు ఉదాహృత వాక్యమునే కొంచెము మార్పు చేసినాడు.

(౧) ౩౮. "ఇట్లు, లియు 'స్రష్ట సృష్టిచ్ఛలేనాహ, యనఁగ. దీనిలో 'స్రష్టా' అనేమాటను 'స్రష్ట'గా మార్చినాడు.

(౧) ౩౭. మలిన మొందఁ 'గో ఽ పి మలినధారి' యనఁగ.

'మలినధారీ' అని ఉండవలెను.

(౧) ౩౯. 'నాధికుర్వంతి దగ్ధాంగ' నా నెట్లు.—'దగ్ధాంగా'అని ఉండవలెను.

(౧) ౪౨. 'యజ్విప్ర సంఘ్యాదిషు చకర్మసు,యనఁగ 'విప్రస్సంధ్యాదిషు' అని ఉండవలెను.

(౧) ౪౩. 'త్రిపుండ్రావలిప్తాంగి' యనఁగ. 'లిప్తాంగీ' అనడానికి.

(౧) ౪౪. 'త్రిపుండ్రాంకితసర్వాంగి యనఁగ.-'సర్వాంగీ' అనడానికి.

(౧) ౫౨ 'అయం మాతా అయం పితా' యనఁగ. 'అయం మాతాఽయం పితా.—' అనడానికి ఇట్లు చేయడము తప్పని కాదు.

(౧) ౬౦ తుది 'స భూమిం విశ్వతో వృత్వా' యనఁగ. 'వృత్వా' అనడానికి.

(౧) ౬౦. ఎనయంగ 'నమృతత్వస్యేశాన' అనఁగ:— 'త్వ' సురువై గణము చెడినది.

(౧) ౬౨. ఆదిన 'రేతసి ఆపో' యనంగ. 'రేతస్యాపో' అని ఉండవలెను.

(౨) ౮౩. ప్రాప్తి 'నాకల్పకోట్యాం పితరస్సుతృప్త' నా 'సుతృప్తా' అనడానికి.

(౨) ౮౫. నిష్ఠిత వట్టర్క విధులు 'వ్యాసో వసిష్ఠ వాల్మీకి' నాం 'వ్యాసో వసిష్ఠో వాల్మీకి' అనడానికి.

(౧) ౭౭ అ, పంక్తులిం బాసి, 'వ్యంహ విగతపాప'.—'వ్యంహో' అని ఉండవలెను.

(౧) ౯౦. పరగి 'యా త్తమ్మన్న భక్షణే' యనఁగ.—'ఆత్తమన్న భక్షణే' అనవలెను.

(౧) ౯౩. అనుమతి 'యా యా క్రియా విధాతవ్య' యనుచు. 'విధాతవ్యా' అని ఉండవలెను.

(౧) ౯౪. సరిఁ 'గర్మణా మనసా వాచ' యనఁగ. 'వాచా' అనవలెను. ఒకప్పు డనుకరణము చేయకుండానే ఉదాహరిస్తాడు.

(౧) ౯౬. 'బహ్వాపి స్తోకమేవాపి శిష్టమన్నం విమిశ్రిత' మానుగాను

సాధారణముగా ఉదాహృత సంపూర్ణ వాక్యమును చిన్న చిన్న ఖండములుగా కీలనచేసి ద్విపదలలో పొదిగినా, ఒకొక్కప్పుడు పెద్దఖండమునుకూడా కూర్చడాని కవకాశము కల్పించుకొన్నాడు.

(౧) ౯౬. 'ప్రవితత మాహేశ్వర వినిశ్చృత- విఘసీభూత వేదై రాగమైశ్చ శబ్దరూపైశ్చ'నా.

(౧) ౯౯. నిస్సంశయం బింద్ర, చ ననంద సాక్షాత్ ప్రసాదభోగేన. 'ఇంద్రశ్చ' అనడానికి.

(౧) ౧౦౦. 'మార్తాండ భానో కుష్ఠ'యనుచు. దీనిలో 'కుష్ఠో భవ' అని ఉండవలెను- త్రుంచివేసినాడు.

(౧) ౨౩౦. క్షితి 'జనితాగ్నే ర్జనితసూర్య'యనఁగ. 'జనితా సూర్యస్య' అనడానికి. తలఁపఁ 'బితా దేవతా స్రష్ట' యనఁగ. 'స్రష్టా' అనవలెను.

(౧) ౨౩౦. దృష్టంబు మఱియును "దేవాశ్చ పశవస్సృష్టా" యనఁగ.
పాదాంతములో సగణము.

(౧) ౨౩౨. 'అంగుష్ఠ తర్జనీభ్యాం సభస్మా'యనంగ..
దీనిలో 'భస్మ' 'భస్మా' అని పొడిగింపబడినది.

(౧) ౨౩౨. పురాణ, మితి 'తవోన్మేషని మేషేభ్య' యనఁగ.—
దీనిలో 'నిమేషాభ్యాం' అనేద్వివచనరూపమునకు బహు
వచనరూపము వచ్చినది.

(౧) ౨౩౨. భగ్నంబునొంద 'న బ్రహ్మా న విష్ణుర్ నాగ్నిర్న సూర్యో'
నా. 'విష్ణుర్' అని గగము చేర్చబడినది.

(౧) ౬౫౯. 'ధీయతే రుద్రాయతే రసతే నమో' యని.
'రసవతే' అనడానికి ఛందస్సుకోసము 'రసతే' అని పడినది.

(౧) ౭౦౬. భయంకరంబయ్యెన 'య్యత్యతిష్ఠద్దశాంగులం' బన
'ఆ' అనే విశేషణము ఛందస్సుకోసము కక్షూర్తి. వందలకొద్దీ
ఉదాహరింపబడినవాటిలో ఈపందొమ్మిదింటిలోమాత్రము చిన్న
మార్పులు పొందక మంతగా పాటింపదగినది కాదు.

బ. ౨౦౩. సంతతంబును శ్రుతి సన 'హరిగుంతంహారం' బనుచు.
'హరిమ్' అనే దానిని వేదములో 'హరిగ్ం' అని
పలుకుతారు. ఆంధ్రదేశోచ్చారణములో అది 'హరిగుం'
అని అవుతుంది. ఆ ఉచ్చారణము నుపయోగించుకొని కవి
దానిని ద్విపదలో పొందించినాడు. కాని, 'రతిబుతగ్'
సత్యం పరబ్రహ్మ, యనఁగ, అనే పాదములో ఇట్లు చేయ
లేదు.

బ. ౨౦౨ రమణఁ దద్విష్ణోః పరం పద.—మనఁగ, 'పరమం, అనేది
పొదరక 'పరం' అని సద్దించినాడు.

బ. ౧౬౪. పాయక శ్రుతి ' రసాన్ భక్తస్య జిహ్వాగ్రే 'యని.— పాదాంతములో గగము.

బ. ౧౦౬. ప్రేమం బెలర్పఁగ 'భృత్యాపరాధసాన్వ్యామినో దండ 'యన్ చదువు'.— పాదాంతములో గగము.

(౧) ౩౨౨. ధృతిగాని 'సురజా అధిష్ఠిత' మ్మనియు – గణముకోసము సంస్కృతవిసంధి.

అనుకరణవిషయములోనే కాక సంస్కృతసమాసములలో కూడా ద్విత్వాక్షరపూర్వాక్షరము గురువు కానట్లుగా చదువుకో వలసిన దని కవి సూచించినాడు.

బ. ౧౯౫. గోవిందప్రతిమ సద్భావం బెలర్ప.

పం.చ. (౧) ౨౮. మల్లికార్జునకీర్తి మహిత శ్రీశైల

,, (౧) ౩౦. పడసి తత్తను సమర్పణ ప్రసాదంబు

,, (౧) ౫౬౪. సాంగోక్త శ్రుతులుదా 'రత్యతిష్ఠద్ద శాంగులం' బనఁగాన.

,, (౧) ౩౮. పాపాత్ముఁ డతఁడట్లు వారాశరాది ఖ్యాపితలీల.

,, (౧) ౨౧౬. నిజగురుశ్రీహస్త నీరజోద్భూత ద్విజుఁడు.

తెనుగుమాటలలోకూడా ఒకప్పుడు ద్విత్వాక్షర పూర్వాక్షరమును తేల్చి పలుకవలెను.

బ. ౧౭౪. అట్టియు నీడ్పించి యగడ్త వైపించె.

---

౬

# కొన్ని ఛందో విశేషములు.

## ప్రా స య తి

ద్విపదలలో ప్రాసయతి కూడదనే నియమ మిటీవల లాక్షణికు లేర్పటిచినారు. అయినా, కవు లందరున్ను ద్విపదలలో ప్రాసయతి నుప యోగిస్తూనే వచ్చినారు. అయినా ద్విపదలలో ప్రాసయతి క్వాచిత్క మనే చెప్పవలెను. సాధ్యమయినంతమట్టుకు దానిని వాడకుండడమే కవిసంప్రదాయ మని చెప్పవచ్చును. ప్రాసయతి నుపయోగించడము కవికర్తృత్వ అనే అభిప్రాయము సోమనాథుని కాలములో ప్రబలి ఉంటుంది. దాని నానాటి పండితు లాక్షేపించిఉంటారు. అందులో బ్రాహ్మణనింద నపరిమితముగాచేసిన వీరశైవకవి అయిన సోమనాథుని ఈ విషయములో బ్రాహ్మణకవులు నిరసించడ మాశ్చర్యముకాదు. 'పాల్కురికి సోమపతితుండు ప్రాసవళ్లు పెట్టి రచించిన అప్రమాణపు బసవపురాణము' అని వారన్నమాట సత్యమే అయిఉంటుంది. సోమనా థుడు బసవపురాణములో ప్రాసయతిని చాలా తక్కువగా వాడి నాడు. కాని, దాని నాధారముగా చేసుకొని శైవేతరకవులు తనకవి త్వమును నిందించడముచేత వారిని మరింత ఏడ్పించడానికో అన్న ట్లుగా ప్రాసయతిని ద్విపదలలో వాడడానికి ప్రమాణవాక్యము నెచ్చ టినుంచో సంపాదించి,—

"......'అనియతగణైరా' ర

రనియము 'ప్రాసో వా' యనియు 'యతిర్వా' య

నియుఁ జెప్పుఛందోవినిహితోక్తి గాన
ప్రాసమైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాదిప్రాసనియతిఁ
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు"

అని ఢంకాపాయించి పండితారాధ్య చరిత్రములో ప్రాస యతిని ఎక్కువగా వాడినాడు. అయినా, ఈవిషయములో అతడు మితిమీరిపోలేదు. అతడు రచించిన ముప్పైరెండువేలకు పైగాఉన్న ద్విపద పంక్తులలో ఇంచుమించు ఇన్నూఱింటిలోమాత్రము ప్రాసయతిని వాడినాడన్న సంగతి స్మరిస్తే అతనికికూడా ద్విపదలలో ప్రాస యతిని వాడడమంత యిష్టములేదని తెలుస్తుంది. అతడు ప్రాసయతిని రెండుసందర్భాలలోమాత్ర ముపయోగించినాడు. మొదటిది అను ప్రాసావేశము వచ్చినప్పుడు,

"......శ్రీ పర్వతక్షేత్ర
వాసులు, యామ్యకైలాసచూడాని –
భాసితకీర్తివిభ్రాజితమణులు,
వరభుక్తి చిరముక్తికర భక్తిరతులు,
నరచర్మధర కర్మహర ధర్మవరులు,
గృతకృత్య హితభృత్య ధృతసత్యరతులు,
వ్రతధామ భృతసీమ జితకామముఖులు,
హారతంత్ర గురుమంత్ర పరతంత్రచరులు,
ధన్యులు, సుకృతవదాన్యులు, విగత –
దైన్యులు, లోకైకమాన్యులు, వరమ –

పాత్రప్రసాదైక గాత్రులు, గర్వ -
జైత్రులు, భవలతాదాత్రులు, ద్రిమల -
దూరులు, శుభతరాకారులు, గతవి -
కారులు, విజితసంసారుల్ దయావి -
నిద్రులు, కలియుగరుద్రులు, వీర -
భద్రులు, కరుణాసముద్రులు, బుధమ -
నోజ్ఞులు, దూరీకృతాజ్ఞులు, శ్రుతివి -
ధిజ్ఞులు, వినుతదైవజ్ఞు, లవార్య -
వీర్యులు, శివపదాచార్యులు, ప్రణమి
తార్యులు, ద్రిభువనవర్యు లనంగ.

(౧) ౯—౧౦.

రెండోసందర్భము సంస్కృతవాక్యముల కనుకరణము చేసేటప్పుడు. చిన్నచిన్న వాక్యముల నుదాహరించేటప్పుడు సాధారణముగా సాధారణయతినే వాడినాడు. పెద్దవాక్యముల నుదాహరించినప్పుడయినా చిక్కులి జాగ్రత్తగా సాధారణయతిమాత్రము పడేటట్లు చూచుకొంటూ, అట్లు చేయడము సాధ్యము కానప్పుడే ప్రాసయతిని వాడినాడు. ఉదా. భంగిగా 'రాజా' యనంగ, 'దేశా'త్త నంగ...(౧)౪౧.

బసవపురాణములో ప్రాసయతి విరళముగా ఉన్నది. పండితారాధ్యచరిత్రములో ఎక్కువగా ఉన్నది. దీనికి కారణము తెలుసుకొనడానికి బసవపురాణ రచనకున్ను పండితారాధ్యరచనకున్ను గల భేదమును మనము గమనించవలెను. బసవపురాణములో ద్విపదపాదములు సాధ్యమయినంతమట్టుకు దేనికది ప్రత్యేకముగా ఉండి, ఒక పాదములోని తుదిపదము రెండో పాదములోనికి సంక్రమించలేదు.

అట్టి సంక్రమణము చాలా కొద్దిచోట్లమాత్రము జరిగినది. అందుచేత బసవపురాణపుద్విపదలు కొన్ని కటిపాటలుగా ఏర్పడినవి. పండితారాధ్యచరిత్రములో సోమనాథుడు ద్విపదననేకవిధములుగా నడిపించినాడు. దాని కెంతస్వాతంత్ర్యము నివ్వడానికి సాధ్యమవుతుందో అంత స్వాతంత్ర్యమును ఇచ్చినాడు. గణవిభజనము చేసుకొంటే అది ద్విపదగా కనిపిస్తుంది కాని, సర్వసాధారణముగా పండితారాధ్యచరిత్రమును చదువుతున్నప్పుడు మనకు ఛందస్సుమీద గురుతే ఉండదు. క్షణక్షణమునకున్నూ ద్విపదనడక మారిపోతూ ఉంటుంది. మహాసముద్రములోని అలలవలె పదము లనేకవిధములుగా ప్రవహిస్తూ ఉంటవి. ఆ అల లొకప్పుడు భంగము పొందుతవి. ఒకప్పుడభంగములుగా నడుస్తవి. ఒకప్పుడు చిన్నఅలలు, ఒకప్పుడు మహాతరంగములు లేస్తూఉంటవి. అవి మనలను క్రిందికి మీదికి, ఈప్రక్కకు ఆప్రక్కకు, అన్ని ప్రక్కలకు ఉగులాడిస్తూ, ఒకప్పుడు లాలించి, ఒకప్పుడు జోకొట్టి, ఒకసారి పైకెత్తి, ఒకసారి క్రిందికి పడవేసి, అనేకవిధములుగా మనకు సంతోషము కూరుస్తవి. ఇట్టిరచనలో ప్రాసయతులు పడితేనేమి, సాధారణయతులు పడితేనేమి? ఒకచోట ఒకఅక్షర మిటుపోతేనేమి, అటు పోతేనేమి? ఆ కవితాలయముతో తన మనస్సుకూడా లయము చేసుకోలేనివా డరసికుడు.

సోమనాథుడు ప్రాసయతిని వాడేటప్పుడు ద్విపద మొదటి పాదములో ప్రాసయతి, రెండోదానిలో యతి; మొదటిపాదములో యతి, రెండోదానిలో ప్రాసయతి; రెండుపాదములలోను ప్రాసయతి;—ఈ మూడువిధములుగా కూడా వాడినాడు. ఈ మూడు పద్ధతులకున్నూ పై నుద్ధరించి వ్రాసిన పంక్తులలోనే ఉదాహరణము లున్నవి.

## కొన్ని విశేషప్రాసములు

(౧) ట, ఠ, ప్రాసము :

హఠయోగ రాజయోగాది విభ్రాంతిఁ
బటువగు పశుయోగ బంధంబులేమి.

(౨) ౩౨౭.

(౨) డ, ఢ, ప్రాసము :

రూఢి నసంఖ్యాత రుద్రులబంటఁ
బాడానఁబాడిన ప్రమథులబంట.

(౧) ౧౩౮

రూఢి 'సర్వం నమో రుద్రాయ' యనఁగఁ
గూడంగ 'నిత్యేన కుర్యా'త్తనంగ.

(౧) ౯౩

వేడుక నాయజుర్వేదసూత్రోక్తి
రూఢిమై 'భగవాంశ్చ రుద్రం పవిత్ర'
మన.

(౧) ౪౬.

(౩) ద, ధ, ప్రాసము :

వ, సుధ 'గృహేయస్మిన్ ప్రసూతా' యనంగ
వదరుచు నంద......

(౧) ౪౮.

(౪) థ, ధ, ప్రాసము :

మేధావిరుద్రుండు మిండసంగయ్య
మైథునరామయ్య మగతిలకవ్వ

(౨) ౯౦

(౫) శ, స, ప్రాసము :

శశిలేనినిశి, దివస్పతిలేని పగలుఁ
బసులకాఁపరిలేని పశునివహంబు.

దీనిలో 'పసుల' అనకూడదు. అది సోమనాథుని తెనుఁగువాడుకకు విరుద్ధము.

(౬) ష, స, ప్రాసము :

దూషక! వినుము 'మాదుస్తతిర్ వృషభ
మాసహూతి' యనుచుమహిమ్రోయుచుండ
(౧) ౬౫౧

(౨) ౨౧౫ లో 'రసహీనమైన నిస్సారంపుఁ గవిత' అనే పాదములో యతిభంగ మయినట్లు కనబడుతుంది గాని 'నిర్ + సారము'=నిస్సారము, అని యిక్కడ సంధి కాబట్టి సోమనాథుడిక్కడ 'ఉపసర్గయతి'విశేషముగ వాడి ఉంటాడు.

---

# ౧౦

## పాల్కురికి సోమనాథుని భాష

సోమనాథుని భాషనుగురించి విస్తరించి వ్రాయడానికీ పీఠికలో స్థలము చాలదు. తెనుగుభాష అతని సొమ్ము. తక్కిన అనేక కవులవలె అతడు భాషకు అధీనుడు కాలేదు. భాష అతడు చెప్పినట్లతని నోటిలో తిరిగినది. దానిని పరిచ్ఛేదించి వర్ణించడము కష్టసాధ్యమైనపని. ఈ క్రింద అత డుపయోగించిన కొన్ని ప్రయోగములనుమాత్రము కొన్ని వర్గముల క్రింద ఏర్పరిచి చూపుతున్నాను.

### అజ్లోపము

#### పదమధ్య అకారము:

కర్వన్ (౧) ౪౬౯; కస్వ (బ. ౮౫); తర్గు (౧) ౩౭౩

#### పదమధ్య ఇకారము

అర్ది (౨) ౧౧౮; ఉల్వ బ. ౧౩౦,౧౫౫; పెర్కులు బ. ౧౧౪; కన్నెర్కము (౧) ౩౪౦; బఱ్తె (౧) ౧౨౬; లంజెర్కము బ. ౬౨,౧౪౪; ఎర్గి బ. ౮; కడ్గి బ. ౧౫౩; (౧) ౧౧౫; కన్నెర్గి. బ. ౮; (౧) ౪౧౮; చివ్కు బ. ౮౩; చెర్చి బ. ౭౨; నర్కు (౧) ౨౭౫; కుర్యన్ బ. ౭౬, (౧) ౧౪౧; తివ్యన్ బ. ౧౯౦; మర్గెదరు (౧) ౧౨౮,౧౨౭; కుర్యునే? బ. ౨౦౯; తివ్యించెన్ బ. ౧౮౭;

కొనిపోవన్ = కొంపోవన్ (ఇత్వలోపము, నకారమున కనుస్వారాదేశము) బ. ౮౯; వెల్లి + విరియన్ = వెల్విరియన్ (ఇత్వలోపము, ద్విత్వాభావము) బ. ౧౨౬; (౧) ౪౦౦

## పదమధ్య ఉకారము:

ఇస్తు బ. ౫౪, ౭౮, ౭౭; ఉరుక్క (౧) ౧౨౬; ఎర్గుదురె ? (౧) ౩౩౧; కడ్వ బ. ౧౯౭; కాపెరుక్కలు బ. ౨౨౦; కాల్దుము= కాలుదుము బ. ౨౨౮; కుద్తురు (౧) ౯౧; కుడ్వనైతి బ. ౬౮; కుర్చు (౧) ౫౭౪; పెర్గు (౧) ౩౮౨; తూపాడ్వన్. బ. ౬౪; తొడ్కంగన్. ౨౧-౮౭; నిడ్డ (౧) ౫౭౪; నెన్నడుమ్మ (౧) ౩౬౩; పర్నవేదుల బ. ౧౫౬; పల్వర్న (౧) ౨౯౮; పొర్గింటి కిర్గింటికిని (౧) ౪౭౩; మిడ్తలట్లు బ. ౨౧౪; మెర్గు బ ౧౭,౭౪; వల్వ బ. ౫౭; విర్గన్ (౧) ౧౨౬.

## అంత్య ఉకారము

అనియెదర్ (౧) ౩౨౬; ఆన్రవము (౧) ౧౧౨; అర్పించు కొన్ భాతి (౧) ౧౦౮; తొంగిళ్లఁ గార్నిరు బ. ౬౭; నేఁడ్ వింత వాఁడు. బ. ౧౦౧; పదటిపాల్ నేసి. బ. ౨౮౨; పదన్ సెడకుండ. బ. ౨౩౮; ఏఁగెడువార్ జంగమములు బ. ౫౮; కొనఁగ వార్ (౧) ౪౮౧; వచ్చువార్ గలరు. బ. ౧౫౧; వెడల్ (౧) ౪౨౪; వ్రాలు దుర్ (౧) ౩౪౯; ముత్తవవు + నాకు = ముత్తవవ్ నాకు. బ. ౭౦.

## ద్విత్వహల్లోపము

చిటిపొటి సమయంబులు బ. ౧౯౭.

## అర్ధానుస్వారము

ఈ క్రింది పదములలో యతిప్రాసముల ననుసరించి అర్ధానుస్వారము లున్నవని నిర్ణయించవచ్చును.—

అనఁగి పెనంగి. బ. ౧౩

ఆఁకొను - వీఁకతో. బ. ౧౩౮; సాఁకించి. బ. ౬౭

ఆఁగు - మ్రాఁగుచు నేఁగుచు, వీఁగుచు వాఁగుచు (౨) ౨౯౫-౬

నాఁడు - వేఁటాడ. బ. ౪౯; వీఁడు; వేఁడుసే బ. ౭౪;
పోఁడి. బ. ౭౪

నేఁడు - వీఁడు; పోఁడి. బ. ౪౬, ౭౭; పట్టి, నాఁడు (౧) ౮౫౬; వాఁడో (౧) ౬౮౯; మూఁడు (౧) ౬౩౨

నోఁచు. బ. ౧౩

పాఁగెము. బ. ౧౪

పాఁచి - కొాఁచుట. బ. ౪౦

పాఁతర - లోఁతు. బ. ౪౮

పీఁకె. బ. ౧౫౮

పెనఁగు - అనఁగిపెనంగి. బ. ౧౩

ప్రాఁత. బ. ౧౮౦

ప్రోఁగు బ. ౧౭౬

పూఁట బ. ౩౮

పోఁడి- అఁడురూపము (౧) ౬౧౯; నాఁడు బ. ౪౬; ౭౪; నేఁడు బ. ౭౭; మూఁడు బ. ౨౬; (౨) ౬౨,౫౨౦; వేఁడుఁడు. బ. ౬౬; వేఁడుము. (౨) ౨౫౯; వేఁడక (౨) ౫౦౫ (కాని, బ. ౪౧. లో 'షోడశపందువు... పోఁడిగా, అని సానుస్వారనిరను స్వారప్రాస మున్నది. ఈ పాఠము తప్పయి ఉంటుంది.)

పోఁడు = పొద - లేఁడు (౧) ౧౩౦

మాఁకులు బ. ౪౫

మాఁటిమాటికి - ఆఁటబానిని (౧) ౨౭౫

మాదిఁగి - లింగులకాక మా - దింగు లున్నారె? (౧) ౧౨౪

మీఁగాలు - ఏఁగంగ (౧) ౩౯౧

మీఁదు - రాఁదివ్వు (౧) ౬౯౪; ఏఁకెవ్వు బ. ౪౧

మూఁక - ఊఁకరల్. బ. ౧౬౦; మూఁగుచు నేఁచుచు మూఁకలు
గొనుచు, వీఁగుచు నాఁగుచు. (౨) ౨౯౫, ౬

మూఁడఁనవులు - (౧) ౫౬౭

మూఁడు - నేఁడు (౧) ౬౩౨; వీఁడు;

రేఁగు. బ. ౧౫౫; నాఁగిమలజ. (౧) ౭౪

రోఁజు (?) (క్రియ) బ. ౭౭

వీఁక - ఆఁకొంటి బ. ౧౩౭; తాఁకిన (౧) ౩౦౯; తాఁకు
(౧) ౪౪౯.

వీంగు - చాంగు భళా! (౨) ౩౪

వీఁగు - తాఁగరిగొన్న (బ) ౨౩౬

వేఁచు బ. ౫౫

వేఁటాడు - నాఁటి బ. ౭౯

వేఁడిమి - వీఁడు

వేఁడు (క్రియ) - వీఁడు; నాఁడ. బ. ౭౭; పోఁడిగా బ.
౬౬; (౨) ౨౫౯, ౫౦౫

సాఁకించు - ఆఁకొనఁగా బ. ౬౭

సాందు - (౨) ౪౨౯

సంధివశమున వచ్చిన అరసున్నలుగల కొన్ని పదముల కుదాహ
రణములు.—

ఎక్కుడుఁగుజ్జు. బ. ౧౪౧, కోటానఁగోట్లు. బ. ౧౯౯; (౧) ౫౪౭, ౬౨౨; గీటునఁబుచ్చి. బ. ౬,౫౭; చుబ్బనఁజూలి, బ. ౭; చెల్లఁబో!. బ. ౧౦౭; తొడీఁదొడీ (౧) ౪౬౯; పాడానఁబాడు. (౧) ౧౩౭; లేఁబురులు. బ. ౧౭; మొదలయినవి.

ఈ క్రిందిమాటలలో అరసున్నలు లేవు.—



ఇగ-జగము. బ. ౧౭౫

ఎసగు-అను,(౧)౩౮; ౫౫ జగతి (౧) ౫౯; మొగి (౧)౫౩
త్రాగు-సాగర (౧) ౬౯౫
వేగు-రాగిల్లె. బ. ౧౭
పోటరులు-కోట. బ. ౭౪

ఇట్లే, పరగు, తోచు, ఒసగు, లలో కూడా అరసున్నలు లేవు.

కొన్ని పదములలో అరసున్నలున్నవో లేవో నిర్ణయించడము కష్టము.

(౧) బ. ౧౧౪. ఈగి చెల్లింపక యెట్లు నాచేతఁ జాగదవని.

'ఈగి' శ. ర. లో అరసున్న లేదు. 'ఈఁగు'లో ఉన్నది. భార. శాంతి. (౨) ౩౭౨ లో నిరనుస్వారము. కాని, 'చాగు'=పోవు అనే అర్థములో నిరనుస్వారముగా శ. ర. లో ఉన్నది. అయినా అనుస్వారనిర్ణయమున కనుకూలమైన ప్రయోగము లివ్వబడలేదు. 'చాఁగు' అని సానుస్వారముగా కూడా అర్థభేదముతో ఒక పదము శ. ర. లో ఉన్నది గాని, దాని నిర్ణయమునకున్ను అనుకూలపడే ప్రయోగ ముదాహరింపబడలేదు.

'ఒఱగు'లో అరసున్న ఉన్నదా?బ. ౪౮లో ప్రభాకరశాస్త్రి గారరసున్న పెట్టలేదు. నేను పండి. చ. (౨) ౪౦౪లో పెట్టినాను. వారు పెట్టకపోవడానికిగాని, నేను పెట్టడమునకుగాని ప్రమాణము లేదు.

చాడయ్య (బ.౬౯), చాడరసు (బ.౩౭)లలో ప్రభాకర శాస్త్రిగారరసున్న నుంచలేదు. నేనుంచినాను. ఇద్దరికిన్ని ప్రమాణములు లేవు. కాని, కన్నడములో 'చాండ', 'చాండరస' అని ఉండడముచేత నేనరసున్న నుంచినాను.

బ. ౫౬లో 'తొఁరిగన్' అని ప్రభాకరశాస్త్రులుగారు. శ.ర.లో 'తొఁఱఁగు అని అత్వమధ్యమము, శకటరేఫము, సార్ధాను స్వారము. 'భంగించి యితరకాంతల దొ్ఱఁగుట తప్పి తడంబడుచి పురుషులకున్' కళా. ౭. ప్రయోగము. కాబట్టి, బసవపురాణములోను పండితారాధ్యచరిత్రములోనుకూడా 'తొఁఱఁగు' అని చదువుకోవలెను.

(౧) ౫౦౯ దోనమ రాజయ్యగారు. 'అయ్యంగారు', అయ్య గారు, అని రెండువిధములుఁగాను వ్యవహారములోను శాసనములలోను కనబడుతున్నది- 'కాఁడు' అనేదానికి 'కారు' బహువచనమయితే, దానికి 'గారు' రూపాంతరమయితే 'గా'కు పూర్వ మరసున్న ఉండవలెను.

మామిడి, మావిడి. బ. ౨౧. వీటిలో అరసున్న ఉండవలెను. 'మావిణ్డివాడ' అని శాసనప్రయోగము.

మూతులు. బ. ౨౩౭. మూతిలో అరసున్న ఉన్నదా? ఆపదము 'మూయు' ధాతువుతో సంబంధించినదైతే ఉండవలెను. ముట్టి, ముట్టెలతో సంబంధించినదైతే ఉండకూడదేమో. రూపనిర్ణయము చేయడానికి ప్రమాణాలు దొరకలేదు.

'వరవుడు'లో 'డు'కుపూర్వ మరసున్న ఉన్నదా? అది మహన్మహతీవాచకముగా ఉండడముచేత అరసున్న ఉంచితే కేవల మహద్వాచకముగా స్ఫురిస్తుందని అరసున్నను వదలుతారు. కాని, డుజ్వర్ణకము కేవల మహద్వాచకపదములలో మాత్రమే ఉండ నక్కరలేదు- అయినా, దీనిలో అరసున్నను ఉంచడానికి కాని, ఉంచకపోవడానికి గాని ప్రమాణములు లేవు.

'సురుగు'లో అరసున్నకు, 'పంది సురింగిపోయిన' అని విక్ర మార్క చరిత్రములోని ప్రయోగము ప్రమాణము. కాని తత్పూర్వ కావ్యములలో ప్రమాణములు కానరావు.

(౪) వెంట్లు. బ. ౭౫- అశిష్ట్లు. (౧) ౫౩- ద్విష్ట్లు. బ. ౩౦, (౧) ౧౭౯, ౧౯౪, ౨౨౧, ౨౨౫, ౩౩౨, ౩౪౪, ౩౬౬, ౪౨౨, ౪౨౪, ౬౧౩, (౨) ౫౮, ౨౨౦, ౩౨౯, ౪౦౫- దుష్ట్లు (౧) ౨౫౧- భ్రష్ట్లు (౧) ౩౪౪, ౪౨౨, ౬౯౧- (౨) ౨౨౦.— శిష్ట్లు (౧) ౨౫౧.

(౫) దివ్వటీలు. (౨) ౭౪.

(౬) బంట్లు. బ. ౭౪- నిఘంట్లు (౧) ౬౧౫.

(౭) పెటికెసెట్లు. బ. ౪౩.

(౮) మేలుకట్లు. బ. ౫౯- కంభకట్లు. బ. ౫౯ - ముప్పెట్లు (౧) ౧౧౮- చొట్లు (౧) ౩౦౯,

(౯) వెరవిండ్లు. బ. ౨౨౪- పిల్లాండ్లు (౨) ౩౪౧.

(౧౦) అంగళ్లు (౨) ౩౯౮- అల్లుళ్లు బ. ౭౪- ఊరళ్లు (౧) ౧౪౭- కళ్లు (ఏక.కడి) బ. ౩౭- చేకళ్లు బ. ౬౯ - కావళ్లు (౨) ౩౯౭- చావళ్లు (౨) ౩౯౭- బుడివుళ్లు బ. ౨౦౫, ౨౧౪, ౨౩౦, ౨౩౧, ౨౪౨, (౨) ౩౧, ౩౪౪- మండళ్లు (౨) ౩౯౭- సంగళ్లు (౨) ౩౯౮- సందళ్లు (౨) ౪౧౪.

(౧౧) అల్లురు. (౧) ౬౮౮- అల్లుండ్రు (౧) ౬౮౭- ఒయ్యాన గాండ్రు బ. ౧౪౫- మత్తికాండ్రు బ. ౬౨. (౧) ౨౩౭ ఒడిసెల కాండ్రు బ. ౭౪.

(౧౨) ఎక్కుళ్లు, డిగ్గుళ్లు. (౨) ౩౩౯.

(౧౩) దండ్లు బ. ౨౧౪.

(౧౪) అవుసులు. బ. ౧౫౫.

(౧౫) వెడ్డుబుడ్లు. బ. ౭౧.

(౧౬) వాటుజాలు. బ. ౧౫౪

(౧౭) పాఁతళ్లు. బ. ౭౪- పిత్తాళ్లు (౧) ౮౩

(౧౮) మోపరుల్. (౨) ౩౯౭

(౧౯) చూపలు. (౨) ౩౯౭- బ. ౨౨౧

(౨౦) ఊళ్లు, పేళ్లు. (౨) ౪౧౮- చివ్వళులు. బ. ౭౭

(౨౧) అడబాళ్లు (ఏక. అడబాల) బ. ౨౩౪

(౨౨) ఇటికెళ్లు (౧) ౧౩౦- ఎంగిళ్లు. బ. ౨౧౫- ఓకిళ్లు బ. ౧౪- తమ్మళ్లు. బ. ౭౯,౧౬౨- తొంగిళ్లు. బ. ౬౭- నక్కళ్లు. బ. ౨౦౬- పక్కళ్లు. బ. ౮౪- పిచ్చిళ్లు (౧) ౩౬౩- పుక్కళ్లు. బ. ౮౧- పెండిండ్లు. బ. ౩౩- మిక్కిళ్లు బ. ౨౦౯- వడగళ్లు. బ. ౪౨

(౧౩) బహువచనార్థములో ఏకవచనము: పంద్రెండులక్షులు బలవత్పదాతి. బ. ౨౮.

సంబోధన ప్రథమ.

(౧) బసవరో! బ. ౪౭. బసువరో! (౧) ౨౧౩- వీరభద్రయ్యరో (౧) ౪౨౭.

(౨) ఏలయా! బ. ౭౧- కరుణయా! (౨) ౩౪౮

(౩) ఏమేమిరోరి! బ. ౧౭౬- ఓరోరిబిష్ణు! బ. ౧౯౮.

(౪) చా! ఠక్కులార! బ. ౪౩- చా! దున్న! బ. ౧౦౭- చా! పంద! పంద! బ. ౪౫. (వీటిలో 'చా!' అనేది 'ఛీ'వంటిది. 'చావుము, చావుఁడు' అని అర్థముకాదు. దీనికి తాలవ్యోచ్చారణమని నా అభిప్రాయము. 'ఛీ!'వలె-

(౫) పాపికా! బ్రమసితే? బ. ౬౫. (ఇది 'కాన'వంటిది, లేదా, 'కాఁడు'కు సంబోధన రూపమేమో!)

ఔపవిభక్తికములు

(౧) అమటన్ (౨) ౪౮౦, బ. ౨౧౩, గూగెంటన్, చేతెంటన్, జుట్టెంటన్, జేనెంటన్, నల్లెంటన్, పాటెంటన్, మూరెంటన్, వ్రేలెంటన్ (౨) ౪౮౧

(౨) నల్లెంటిమానంబు (౧) ౩౯౩. ఇటమీఁదటికిని. బ. ౧౭ నల్లేటిపాడవు. బ. ౨౨౨ –

(౩) ఎక్కడితల్లి మీరెక్కడితండ్రి,యెక్కడితోడు. బ.౨౨.

(౪) పెడతటికి (౧) ౪౩౩ – పిడికిటిలోనసె. బ. ౧౧౦ – కరసంటి (౧) ౪౭౯ – తలుసంటి క్రియ. బ. ౬౮ – తలుసంటి యాఁకలి బ. ౧౧౯ – వలపటన్. బ. ౧౧౬ – దాపటను. బ. ౧౧౬

(౫) కొంటర్. ౪౪ – వల్లకాటికిని. బ. ౬౭.

(౬) చాఁకింటన్ బ. ౯౭.

## తృతీయావిభక్తి

తన్నకాఁగూడన్ = తనతోకూడా. బ. ౨౫, మాయసుమతిఁ జేసి. బ. ౯.

## పంచమీవిభక్తి

(౧) ఎన్నటిఁగోలెన్. బ.౮౧. ఎన్నటఁగోలెన్ ౧౬౩- ఎప్పటఁగోలెన్. బ. ౧౦౮ –

(౨). ఎప్పటికంటెన్. బ. ౧౪–ఎల్లవారలకంటెన్. బ. ౧౩-

(౩) ఏలినకంటెన్. బ. ౨౭.

(౪) పట్టి = కారణముచేత. (౧) ౫౪౦.

## షష్ఠీవిభక్తి

(౧) కరికాలచోడుకుఁ గనకవర్షంబు. బ. ౨౦౫-

(౨) నీయొక్కసంగతి (౧) ౮౯. (అర్థము చెప్పేటప్పుడు కావ్యములో 'యొక్క'ను సోమనాథుడుమాత్రమే వాడినాడు.)

## సప్తమీవిభక్తి

మంచుఁ గుంచానఁ గొలుచు (౧) ౩౫౯- పాషాణానఁ బసిఁడి (౧) ౨౦౯.

## కారకము

(౧) అమ్మునుల్ జన్నంబు వెడలక (౧) ౫౯౧.

(౨) స్వస్తి! దీర్ఘాయువు! శంకర! బ. ౨౯ ('తే' అధ్యాహార్యము.)

(౩) నాబారిఁ బాటితి=నుండి బ. ౧౪౬-ఇంక నెవ్వరికి బ్రదుకంగవచ్చునే భక్తులచేత బ. ౧౦౧- అరుగుము భక్తజనాళిలో వెడలి=నుండి బ. ౨౩౫-

(౪) పసిఁడియారతులకు ఫల మెక్కుడు పిండియారతులు (౧) ౧౫౫- భక్తపాదోదకం బీసుపాదోదకములకు ఫల మెక్కుడు (=కంటె) (౧) ౨౬౬-

(౫) నీకు మెచ్చితిని (౧) ౧౦౪- బాణునకును మెచ్చి. బ. ౧౩౨- అతనికిఁ గూర్చువారలకు (౧) ౨౪౭- ప్రాణమునకు నలుగంగక. బ. ౬౬- ఆవీరవరురాక కరికట్టి. బ. ౧౦౩- కాని, 'నీకు నెదురించు తప్పు సైరింపుము' (తప్పునకు) బ. ౧౦౬. అపరాధశత సహస్రావలి సైఁచి (సహస్రావలికి) బ. ౧౧౦- ఈ తప్పుసైరింపవలయు (తప్పునకు.) బ. ౧౦౭-భూమి సర్వాంగముల్ వొందంగ మ్రొక్కి (భూమికి) (౧) ౧౩౪-

(౬) వ్యవహార మేఁగు (వ్యవహారమునకు) బ. ౪౨- ఇక్కడ రానోడి (ఇక్కడకు) బ. ౧౦౫- కడజాము వేచి (జామునకు) బ. ౧౦౫- మఠ మేఁగి (మఠమునకు) బ. ౧౧౧- శ్రీ పర్వతం బేఁగి (శ్రీ పర్వతమునకు) (౧) ౧౧౫-

(౮) భార్యను గినిసి (భార్యకు) (౧) ౨౧౬- మహాలింగదేవు సమ్ముఖుడై (దేవునకు) బ. ౭

(౭) కుష్ఠరోగంబునఁ బొందుము (౧) ౧౦౨

## సర్వనామములు

(౧) తానొక్క యిద్భువాఁడయ్యె (తానుకూడా) బ. ౧౦౮. ఒకానొక్క జ్ఞానంబు (౧) ౫౮౬ - ఒక్కొక్కగిరులందు (౨) ౨౩౪- ఒక్కొక్క కోర్కుల (౨) ౨౭౭ -

(౨) ఏడి మీసుతుఁడు - బ. ౧౧౬.

(౩) కొలు చిన్ని లేక (ఇంత) బ. ౧౧౧.

(౪) నాదుచిక్కుట. బ. ౮౪.

## తాను

'తాను' ప్రథమపురుష సర్వనామముఁగనే కాక ఉత్తమ మధ్యమ పురుషార్థములలోను వాడబడినది.

## ఉత్తమపురుషము

(౧) తల్లి సచ్చినఁగాదె తాను డస్సితిని. బ. ౬౬ - తా నెట్లు పోవుదు నానందమూర్తి - బ. ౯౬ - పూని తాఁ బోయెదఁ బోయెద ననఁగ (౧) ౧౪౫.

(౨) ద్విజులము తారయంత్యజులము. (౧) ౧౫౯ -

(౩) తనుఁజేర్చికొనువాఁడ ననఁగె పెనంగి (నన్ను), బ. ౧౩ - పెనిమిటి తన్నుఁ జంపినఁ జంపనిమ్ము (నన్ను) బ. ౬౬ - తన్నుఁ బోలంగ విటులున్నవారె? (నన్ను) (౧) ౩౩౪- తన్నొల్లవేనియు (నన్ను) (౧) ౩౩౫- తనుఁగూడి చూడు (౧) ౩౩౫- తన్ను = నన్ను (౧ ౩౩౮ - తడయ కెక్కడనైనఁ దనుఁ గొనిపొమ్ము.

(౪) తమ్ముఁ జీరికిఁ గైకోరు సెంబలివారు బ. ౨౦౯ (మమ్ము)

(౫) ఆసాసలఁ దనయన్నలు నీకు దప్పిరి. (నాయన్నలు.)

(౬) తక్కినమాటలు దన కింపవు (నాకు) బ. ౬౫ - తల్లిని గలుగంగఁ దనకు రోగంబుఁ బొందంగ నెట్లుంపవచ్చు? బ. ౭౦ - తనకు నెప్పుడుఁ జావుదప్పదు (నాకు) బ. ౭౧ - తనకు = నాకు. (౧) ౩౩౯, ౫౮౨.

(౭) ధారుణి యేలంగఁ దను కింకఁ బాసె (మాకు) బ. ౧౪౫.

## మధ్యమపురుషార్థము

(౧) ప్రమథాధీశ! తనమనోధర్మంబుఁ దారి దెలిపెంగి (నీ) (౨) ౭౯౪.

(౨) తనుచింతలేల పొదం డనుకరణి (మీ) (౨) ౭౯౪.

## క్రియలు

### ధాతువులు

(౧) ఉత్సాహించు (౧) ౫౧౭ - అలంకారించు బ. ౨౮ - (౨) ౧౭౯ - ఉద్దేసించు బ. ౭౨ - అహంకారించు బ. ౧౧౦, ౧౧౮ - అసహించు (౧) ౩౨౪, ౩౨౮ - శాపించు బ. ౨౩౨

(౨) చయ్యున...అభి, ధియ్యతే (౧) ౬౩ - అలంకారించి (౨) ౭౯ - అహంకారించి బ. ౧౧౮ - ఆర్చి=ఆడించి బ. ౮౨

(౩) క్త్వార్థకములు: ఇటికి=ఇటికించి బ. ౯౭ - ఉత్సాహించి (౧) ౫౧౭ - ఉద్దేసించి బ. ౭౨ - ఎగిడి బ. ౧౯౦, ౨౦౦, ౨౧౯ - తొడికిలి బ. ౧౧౯ - తొడుకొనిపోయి (౧) ౧౧౯ - సాతి=ధరించి బ. ౨౩ - ఎత్తుక (౧) ౧౪౯

(౪) వ్యతిరేకక్త్వార్థకములు: చెప్ప లూడ్వక బ ౧౭౦. కొసనక (ధాతువు: కొసను) బ. ౧౧౨- కొలువక తక్కినక్ బ. ౨౧- తొడిఁబడక బ. ౨౩౭

(౫) తుమున్నర్థకములు: అలంకారింపక్ బ. ౨౮- అసహింపక్ (౧) ౩౨౪- తక్కినక్ బ. ౨౧- తొరలక్ బ. ౨౯

(౬) ధాతుజవిశేషణములు: అహంకారించు బ. ౧౧౦- ఆర్చు = ఆడించు (౧) ౪౯౭- దరిసించు=చూపించు బ. ౪౫.

## సంపూర్ణ క్రియలు

## ఉత్తమపురుషము

(౧) విన్నాఁడను, బ. ౧౧౬ -

(౨) పనతున్ = పనయుదున్ (౨) ౧౧౧ - శాపింతున్. బ. ౨౩౨.

(౩) తొడికింతము. బ. ౧౮౫.

(౪) చూతండు. బ. ౨౧౫, ౨౩౮, (౧) ౪౭౯, (౨) ౩౩- చెప్పదండు బ. ౧౫౦ - చొత్తండు (౧) ౪౩౯ - తీర్తండు (౧) ౪౫౬ - పడుదండు (౧) ౪౫౪ - పెట్టుదండు. బ. ౧౬౨ - పోదండు బ. ౭౧ - మ్రొక్కుదండు (౧) ౪౫౬ - వయితేఁడు (౧) ౪౩౯.

## మధ్యమ పురుషము

(౧) పుట్టినాఁడ ( - డవు) బ. ౨౦ - మినికితో (౧) ౪౫౪, మటావము. బ. ౭౦.

(౨) చా! కాటు లేమని చదువుచున్నారు? బ. ౨౧౫.

(౩) నృత్యమాడుదుగాని (బ) ౬౨.

## ప్రథమ పురుషము

(౧) ఉన్నాఁడు, చదువుచున్నాఁడో - ఆడుచున్నాఁడో - బ. ౧౧౬.

(౨) ఏతెంచెన్ బ. ౧౬ - పరదేశి కింక రాఁబాసె మాపురికి. బ. ౧౦౧.

(౩) ఏతెంచెఁగానోపున్. బ. ౧౬ - వేవునో ప్రొద్దు! బ. ౧౦౫, చెల్లునో! బ. ౪౪ - వచ్చునె? (౧) ౧౦౨.

(౪) చావనద్దురు (అవతురు) బ. ౭౧ - ఇత్తురు. బ. ౧౬౨- అసహింతురు (౧) ౩౨౮-

(౫) ఆర్చెడిని = ఆడించెడిని. బ. ౧౦౧.

గాలివోసఁగుఁగాక! క్రమ్మటుము (=గాలి లేదు, తప్పకో!) బ. ౨౯.

(౬) ఒమ్మరు. బ. ౧౩౯

(౭) అందురు. బ. ౧౪౫

(౮) భవిష్యదర్థమున భూతకాలక్రియ: కొలువక తక్కినబోలిసె బ్రాహ్మణ్యంబు, గొలిచెనేనియు భక్తివోలిసె (పొలియును) బ. ౨౧. బాధలపాలైతి పొమ్ము (అనుదువు)బ. ౧౭౦-కోటీశు లైరి(=అగుదురు) (౧) ౪౮౧

(౯) సందేహార్థకములు: వేవునో ప్రొద్దని. బ. ౧౦౫.

(౧౦) ప్రశ్నార్థకములు:

(౧) -ఆ : తెత్తునా? బ. ౭౧- చొచ్చితా? (౨) ౨౦౩- దాసిదేవయ్యగారా? బ. ౧౧౩.

—ఎ: కనుఁగొన, ముట్ట, నాకర్షింప, నెట్లు వచ్చునె? దివాకర! నీకు? (౧) ౧౦౨- అంత భక్తుఁడనె? బ. ౩౯-

—ఏ: కుదుపు నీకొయిదదే? బ. ౬౯

—ఒ: చదువుచున్నాఁడో?, ఆడుచునున్నాఁడో? బ. ౧౧౬,
—ఓ: చెల్లుకో? బ. ౪౪.. మినికితో? (౧) ౪౫౪-

(౭) ఏమి, 'ఎట్టు,'లతో:

ఈనెట్టులు? బ. ౧౫౪-కాలు లేమని చదువుచున్నారు? బ. ౨౧౫-చెప్పెడి దేమి? బ. ౭౮-కథ లేమి చెప్ప ('కలవు' అని అధ్యాహారము చేసుకోవలెను) బ. ౧౯.. (౧) ౧౭౯- ఏమని చెప్ప ? బ. ౬౦, ౬౭-ఈఁడెట్టు. బ. ౫౭-భావించె దెట్లు? బ. ౧౯- కల రెట్లు? బ. ౧౪౫- నేర్చు సెట్లు? బ ౨౪౦,

(౧౧) శాపార్థకములు: భస్మమయ్యెడము! (౭) ౫౭, ౩౭౭.

(౧౨) ప్రార్థనార్థకములు:

(౧) అవధారు (=అవఘరింకు తత్సమరూపము) (౧) ౩౭౬.

(౭) పాదపదము (౧) ౬౦౭ - పాదము. బ. ౧౦౭ - [౧) ౩౩౮.

(౩) అదిగొమ్మ (=అదిగో) బ. ౧౯ - ఊరకో. బ ౭౪.

(౪) చా! యనవయ్య. బ. ౧౦౯ - చా! యెట్టి మిండఁడ! బ. ౧౪౩ - చా! కాలు లేమని చదువుచున్నారు? బ. ౨౧౫.

(౫) రావయ్య! బ. ౧౧౭, రావన్న ! బ. ౧౧౭.

(౬) తల! తల! మని. బ. ౧౦౩. తొల! తొల! (౧) ౩౯౪-తొల! తొలఁడు! బ. ౨౧౫.

(౭) రండ! పొండ! కొండ! బ. ౨౩౦.

(౮) కొట్టుఁడా! బ. ౨౧౫.

(౯) స్త్రీలమీఁద కన్నార్పకుమీ! బ. ౨౫.

(౧౦) భక్తికాంతుండ! రావె!బ.౧౧౭-వనజాక్షి! వినవె! బ.౮.

(౧౧) ఈసంకటంబు నాదేవునకు మాన్పవే! ౭. ౬౫.

(౧౨) లే! బ. ౧౦౭.

(౧౩) ఈఁజుమ్మర! బ. ౧౪౫.

(౧౪) పొడుతుఁజుండో! బ. ౧౦౦! వెలియుఁజుండో! బ. ౧౨౫! ఆజ్ఞఁదప్పినవారు సుండో! (౧) ౫౦౮! చూడుఁడో! (౧) ౧౨౫! మనుడుఁడో! బ. ౧౦౩! వినవో (స్త్రీ) (౧) ౪౫౯.

(౧౩) అవధారణార్థకము: పరమతత్త్వామృతంబయు చన్నుఁ బాలు బ. ౯.

(౧౪) యద్యర్థకము: అటుగానినాఁడు బ. ౯; కలిగిరా= కలిగితే (౧) ౪౮౧

వడుధాతువు

(౧) కర్మణ్యర్థము: ఎన్నఁబడు (౧) ౪౯౮, భక్తనిచయ పాదాంబు లెవ్వనిచే భజియింపంగఁబడును (౧) ౨౭౮. సర్వజ్ఞుఁ డనబడి (౧) ౭౯౨, (కీర్తి) అంకింపంగఁబడియె. బ. ౨౨౪.

(౨) వీరిదుర్జనత గనుఁగొనఁబడియె. బ. ౭౧౪, భక్తి లోకం బునం దవలోకింపఁగఁబడియె బ.౧౨, గండరింపఁబడెనొ(౧) ౧౫౩, కనుఁగొనఁబడియె (౧) ౧౫౫, ౧౯౦, వినఁబడునె? బ. ౮౨, కానఁ బడియెఁ (౧) ౧౫౪. పైవానిలో 'పడు' ధాతువు కర్మణ్యర్థములో రాలేదు.

(౩) నీడు ప్రాణాంగముల నొడఁబడియుండువాఁడ. బ. ౧౩ చాఁగిలఁబడి మ్రొక్కి. బ. ౩౩, చాఁగఁబడి మ్రొక్కి బ. ౧౧,

(౪) భక్తియు నీవును బడ్డట్లు వడుము బ. ౨౦-

(౫) పోవంగఁబడుడుఁ (=పోవడము సంభవింపగా) (౧) ౧౪౬

(౬) తోప్పనఁబడు బ. ౭౧- ఒల్వవడు బ. ౯౦- తూనిగి. లింగఁబసుక్ (౧) ౪౬౧

## అవ్యయములు

(౧) సంస్కృతావ్యయములు వ్యస్తముగా: నాకన్యథా శరణం బొండు లేదు (౧) ౧౦౨- ఉపనిషది (౧) ౭౦- రుద్రోపనిషది- మూర్ధ్ని ధరించు (౧) ౬౦

(౨) ఉగ్రమునన్=గా బ. ౧౩౩ - మహోగ్రమునన్ బ. ౧౫౫- తెల్లము (=తెల్లముగా) (౧) ౫౭౩- కల్యాణకటక మంత యును బ్రథితంబు మాలలపాలయ్యె బ. ౨౦౯ - శివునిమాఱంకనై బ. ౧౭౨- వ్యక్త మి ఱేఁగెడువార్ బ. ౫౯-

(౩) నీవొండెఁబుట్టంగవలయు నట్టుగా కేనొండెఁ బుట్టంగ వలయు. బ. ౯౦- ప్రొద్దెక్కనో యొండెఁ బోగయు వచ్చెడినో బ. ౭౦ - పడసినాఁడొండెఁబొడగంటి మిపుడు పొడగంటిమి బ. ౨౧౧-

(౪) అర్పింపఁదడవ. బ. ౯౫ - అడుగఁగఁదడవ బ. ౪౦, ౫౭-కదియింపఁదడవ. బ. ౧౦౩- చనుదేరఁదడవ. బ. ౧౩౭ - చూడఁగఁదడవ. బ. ౨౧౭ - జంకింపఁ దడవ. బ. ౧౦౭ - తలవ్రేయఁ దడవ (౧) ౩౧౪ - తాఁకింపఁ దడవ. బ. ౧౪౯ - తూపొడ్వఁదడవ బ. ౬౫ - సాఁకఁగఁ దడవ. బ. ౧౦౯. పుట్టఁగఁ దడవ. బ. ౧౬ - పుడుకంగఁ దడవ. బ. ౧౧౧ - ప్రవేశింపఁదడవ. బ. ౧౪-ప్రసాదింపఁదడవ - బ. ౧౪. చూపఁదడవ. బ. ౪౭ - ముట్టఁదడవ (౧) ౩౦౪ - వాయింపఁదడవ. బ. ౭౯ - వినిపింపఁదడవ. బ. ౧౪౨. వినుపింపఁదడవ. బ. ౧౪౬ - వేడంగఁ దడవ. (౧) ౨౧౨, వైవంగఁ దడవ. బ. ౧౩౬.

(౫) తోడ్తోన. బ. ౧౪ - పుట్టఁగఁ దోడనె. బ. ౯.

(౬) అచ్చన = నిశ్చయముగా. బ. ౭౧ - అప్పటిన్ = ఆ ప్రకారము (౧) ౩౦౯ - ఇరవిరిన్. బ. ౧౦౯ - ఒత్తువట్టగన్ = గట్టిగా. బ. ౬౨ - ఇంతటన్ బ. ౭౫- పింగల. బ. ౩౦- ముంగల. బ. ౩౦ -

(౭) కనుకనిగా బ. (౧౫) తొడీ దొడిగా బ. ౩౭, ఆటి మునిగా పోలెగా (ఇది మరి ఒక ఉపమానవాచకము మీదకూడా చేరుకుంది. వడువునుబోలె బ. ౩౭, విధమునుబోలె బ. ౧౫, పగిది యుంబోలె (౧)౨౯) కరణినిబోలె బ. ౩౭ తెఱగునుబోలె బ. ౧౧౦.

(౮) ప్రతిగా (౧) ౪౪౧, ౬౫౯, ౬౫౯, ౬౭౪- ప్రతిగట్టి (౨) ౧౯౪, ౩౯౭-ప్రతిసేయు బ. ౨౨౫- ప్రతినూపు (౧) ౧౨౯. ప్రతివక్క (౧) ౪౪౦- ప్రతిదాల్పఁ గలఁడె. బ. ౨౭- ప్రతిపొల్చు (౨) ౧౯౨- ప్రతిమాటలు. బ. ౨౨౨- (౧) ౧౨౯- ప్రతిలేని (౧) ౪౭౯;— ప్రల్లఁబల్కుచున్. (౧) ౨౯౭;— నీయంత సుందుము బ ౫౪- ఈఁడెట్టు? బ. ౫౭- భావించె డెట్లు? బ. ౧౯- కలరెట్లు? బ. ౧౪౫- నేర్చునెట్లు? బ. ౨౪౦-

(౯) ఆశ్చర్యార్థములు:

ఉఫే! (ఇది మహారాష్ట్రపు ఆశ్చర్యార్థ కావ్యయము. 'భళీ' అనిఅర్థము) బ ౧౮౬, ౨౧౪, ౨౪౫. ఉచ్చుచ్చిరే! బ. ౨౧౨- ఓ! బ. ౧౦౭- ఓచెల్ల. బ ౧౨౧- చాంగు! (౧) ౨౪౬- చాంగు! బళా! బ. ౨౨. నల్లవో (ఇదిఅరవముమాట) బ. ౧౩-(౧) ౨౦౭- మజబాపు (ఇది అంతా ఒక్కటే మహారాష్ట్రపుమాట. నాథండ్రీ! అని అర్థము) (౧) ౨౦౭, ౨౪౬- మజబాపురే! బ. ౧౦౯- హో! బ. ౧౦౭

## సామెతలు, ఉపమానములు

బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో సోమనాథుడు వాడిన సామెతలీక్రింద అకారాదిగా వర్గీకరింపబడినవి.—

అంకురించు నూ్రనికి నీరు మాని వట్టి కొ ఱటికి నీ రెత్తునట్లు. (౧) ౨౧౨

అక్కజం బగుచు వజ్రాయుధం బుండ, మొక్కల సురియకు మోహించినట్లు. బ. ౩౪౦

అంగిట నూరెడు నమృతంబు. బ. ౨౪౦

అగ్గిలోపల మూత్రమటిముటేఁ బోసి, దగ్గటి వేల్వఁ దొడంగిన యట్లు. బ. ౨౪౧.

అగ్నిసాన్నిధ్యతఁ గాక యినుము ద్రావఁగనేర్చునే యుదకములు? (౧) ౨౦౧

అచ్చఁగ్రుచ్చులు (౧) ౩౪౧

అచ్చుగా నర్ఘ్యపణ్యంబులు దెచ్చి, యిచ్చఁ గుక్కల కాళులిలఁ బూన్చినట్టులు. బ. ౨౪౧

అద్దంబులోపలి నీడయట్లు. బ. ౧౭౩

అబ్జంబు పంకంబున (నున్నట్లు) (౧) ౨౦౯

అభిమానంబులేని మానిని. (౧) ౨౧౭

అమృతంబునందు దివ్యంబగు చేగపుట్టినట్లు బ. ౩౭.

అల్గి తన్నినఁ బఱపుపైఁ బడిన తెఱఁగు (౧) ౩౭౬.

అసత్యముచేత సత్యము మెఱయునట్లు (౨) ౧౭౭.

ఆకసమునఁ జిత్రరూపములు వ్రాయునట్లు (౧) ౩౫౯.

ఆడఁబోయినతీర్థ మెదురు వచ్చినట్లు (౧) ౩౭౮.

ఆవమునఁ గల్గునే రాగిచుంతి? బ. ౧౫౪.

ఆవులు దలంచినచోటఁ బూరి మొలచినట్లు (౧) ౩౭౮.

ఇక్షుఫలములు (౨) ౩౯౯.

ఇంత లింగసపర్యుఁడయ్యు నీఁగడవు దవు డింటిలోలేదు. బ. ౧౧౧.

ఇంతింత గాఁ జేయు నిక్షుఖండంబు, నంతకంతకుఁ దీపు లధికమాఁ గాదె? బ. ౧౧౦.

ఇంద్రచాపముల్ (౨) ౪౯౯ (అనిత్యములు)

ఇనుముసుణ మరయునే పగుసంబు? బ. ౧౫౪.

ఇసుకఁ ద్రాడ్వేయు (౧) ౩౫౯.

ఇసుమంతబూడిద నొసలఁ బూసినను, మసలక కొండంత మరు లొందును. బ. ౧౦౭.

ఈసంగఁ గాచి నక్కలకు నిచ్చినయట్లు. బ. ౨౦౯.

ఉడువీధియందు విద్యుల్లతవుట్టి యుడువీథియందు డా నడఁగిన యట్లు. బ ౨౮౫.

ఉప్పుముడియ నీర నున్న నందణఁగుచొప్పున. (౧) ౧౮౨.

ఉప్పుముల్లియ నీర ముంచినయట్లు. బ. ౪౨.

ఉప్పాలికి యిమ్మడియైనయట్టివడువు. (౧) ౩౮౭.

ఊబరబుడిబుల్లు (౧) (౧) ౩౪౪.

ఊరు లేక పొలిమేర గల్గునే - (౧) ౬౩౬.

ఎడపకపాలు దానెన్ని వోసినను, విడుచునే, సర్పంబు విస మొకింతైన? బ. ౨౪౦.

ఎండచే నీడ మెఱయును (౨) ౧౮౮

ఎండమావులు (౨) ౪౧౭ (అనిత్యములు.)

ఎండమావుల కడగాల్లగట్టు (౧) ౩౫౯.

ఎద్దీనె ననిన గొందిఁ గట్టు మనినచందము (౨) ౧౮౫.

ఎద్దీనెననుటయును గొందిఁగట్టుమనుమనువారుగల రెల్లు. బ. ౧౮౫.

ఎన్నిమాఱులు నీళ్లలోపలను గొఱపడం బుదికిన మఱి తెల్ల నగునె? బ. ౨౬౦.

ఎఱుఁగునే యలదిగ్గజేంద్రంబు, కొదమ, యెఱపంది చను సీక? బ. ౫౫.

ఏనాఁట బద్దల నెంతగట్టినను, శ్వానంబుతోఁక దాఁ జక్కఁన యగునె? బ. ౨౬౦.

ఏనుఁగుపండ్లు దాఁ బట్టి చూచు మనుజుండు బ్రదుకునే మడి యునకాక? బ. ౧౧౨.

ఏనుఁగు వన్నగునే గాడిదలకు? బ. ౨౭౯.

ఏనుంగు పుడుదోము (i) (౧) ౩౫౯.

ఒజ్జశివ్యన్యాయము. (౨) ౫౧౭.

ఒండొండ బొరలుచ్చి వైవ ననఁటి దా- లేకుండినట్టిచందమున. (౧) ౨౭౯.

గొల్లవాఁడేనియు, నొల్లనివెలయాలి నొల్లనినృపతి, నొల్లని చెలిఁ బాయ నొల్ల డేనియును. (౧) ౩౩౯.

ఓడునఁ బోసిన యుదకంబులట్లు బ. ౨౬౧.

కంటికసవు. (౧) ౫౧౧ - కంటిలోనికసవు. బ. ౮౬.

కడ లుడిగినయట్టి జడనిధిపవిది. (౧) ౨౨౨.

కనకాద్రి యురయునే కాకిగుణంబు? బ. ౧౫౪.

కన్నమోహంబునకంటె నగ్గలము పెంచినమోహము బ. ౭౦.

కంపులేనిపుష్పంబు (౨) ౨౧౮.

కప్ప లెఱుంగునే జడనిధిలోఁతు? బ. ౨౬౦.

కప్పురంబున నగ్గి గప్పినయట్లు. బ. ౬౨.

కమ్మపసిఁడి (౨) ౩౯౯.

కరిణి మత్తేభంబు ముట్టుపొలువున (౧) ౮౦.

కరితోఁ గ్రామసూకరములు సరియే? బ. ౨౧౦.
కరినైరితోఁ గుక్కలు బోల్ప సరియె బ. ౨౧౦.
(శ్రీశైలము) కరువుగట్టిన మహాకాశము (౧) ౮.
కర్కటిగర్భంబుపోలె. బ. ౧౬.
కలఁగని మేల్కన్నయట్లు. (౧) ౨౪౯.
కలగన్నచోటికి గంపఁ గొంపోవ, ఫలసిద్ధి యనుటెల్ల భాగ్యం
బు గాదె! బ. ౪౯.
కలి వెన్నఁ బుచ్చు (ట) (౧) ౩౫౯.
కల్పవృక్షంబు వ్రాఁకి నల్లడలఁ జుట్టునట్లు (౧) ౧౪౬.
కల్లనెల్లెపాలు కథలేల? బ. ౧౦౧.
కసుఁగాయఁ ద్రెంచినఁ గాయగుఁ గాక, పసనిపండగునయ్యా?
బ. ౯౭.
కాకి పడగలు బ. ౨౩౦.
కాకివ్రాఁతల పగిది (౧) ౬౪౫.
కాకులు పెంచినకోకిలపిల్ల, గాకులఁ బోలునే కావుకావనుచు?
బ. ౨౨.
కాంతిలేని మణి (౨) ౨౧౭.
కానశేర్పునె రవిఁ గౌశికవితతి? బ. ౨౪౦.
కాలియు రూపడంగని త్రాళ్లపగిది (౨) ౩౨౬.
కాలునినోరు డాకాలఁ దన్ను (౧) ౪౪౯.
కాష్ఠంబున నగ్ని (౧) ౨౦౯ - కాష్ఠంబు పావకునట్లు
బ. ౧౭౩.
కుక్కముట్టిన కడ్వకును విధియేమి?, చక్కనఁ గాల్చిన సరి
యగుఁ గాదె? బ. ౧౯౪.

కులమునకెల్లను సుద్దలిగొనియె (౧) ౧౨౫.

కులమెల్లఁ గొనిపోయి బిలములోఁ గలిపె. (౧) ౧౨౫.

కూటికేద దోడ్డప్పె ననుమాట బ. ౨౧౯.

కూసి కుక్క దువ్వఁ దెచ్చికొనినవిధము బ. ౨౦౬.

కొంగనిఁ దిగిచి వంగనిని వ్రాలంగఁ దిగిచితిరి బ. ౨౧౪.

కొండలు దొంతి వేర్చుట (౧) ౩౫౯.

కొలుకునకేఁగి బడిగంటఁ జావఁబడిన మూషకముల భంగి. బ. ౨౩౦

కొల్లకుఁబోయి యెదురెదుర్ గాను బైచీర గోల్పడ్డభావన. బ. ౨౩౦

కోటికిఁ బడగెత్తినవానిఁ బదివేలకాఁపనై బ్రదుకుమన్నట్టు. బ. ౬

ఖలునిచే బుధుఁడు (మెఱయును) (౨) ౧౮౭.

క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస, గొరునే పడియాలనీరు ద్రావంగ? బ. ౫౪.

క్షీరోదకన్యాయము. (౧) ౨౭౭.

గంగతో వెడవ్రంత సరియె? బ. ౨౧౦.

గజశాస్త్రవేత్తల కెట్లు వచ్చు గజాధిరోహణము సేయంగ? (౧) ౫౭౦.

గజస్నానము (౧) ౧౬౪. (నిరుపయోగము)

గతాగతద్వారదకర్ణములు (౨) ౪౧౭. (అనిత్యము)

గంధద్రవ్యములు దగుల్కొన్న వలువచందమున (౧) ౧౭౭.

గాలిలోపల సురగాలివుట్టి గాలిలోనన కలిసినయట్లు బ. ౨౪౫.

గుండాడ గావునకును జన్నె? (౧) ౪౭౦.

గ్రామోనాస్తి, తత్సీమయన్నట్లు (౧) ౬౩౬.

ఘటపటాదులలోని గగనంబునట్లు బ. ౧౭౪.

ఘనసారవృక్షముల్ ఖండించి సెల్లు, వెనుఁజె యుల్లమఁ జుట్టుఁ
బెట్టినయట్లు బ. ౨౪౧.

(శ్రీశైలము) ఘనీభవించిన పరంజ్యోతి (౧) ౭.

చచ్చిపుట్టుట (౧) ౩౫౯.

చట్రాతిపైఁ గ్రుంకుట (౧) ౩౫౯.

చండిచే శూరుడు (మెఱయును) (౨) ౧౭౭.

చదువఁబెట్టినను, గలమతియును జెడ్డ కారణంబయ్యె బ. ౧౧౩

చంద్రుతో నుడుపంక్తి సరియె? బ. ౨౧౦.

చలనము లేని వాయువు భాతి (౧) ౨౨౨.

చలమున ముక్కు వొలియించుకొన్నట్లు బ. ౧౦౭.

చిక్కంబుచేర్లు దీసినమాడ్కి (౧) ౨౨౧.

చిచ్చులుకంగఁబోవుచుఁ జీరకొంగోసరించు పె న్వెంగలియట్లు.

చిత్తరువునకు జీవంబు పుట్టినట్లు. బ. ౩౭.

చీకటిచేత జ్యోతి (మెఱయును) (౨) ౧౭౭.

చూతఫలంబులఁ జుంబించుచిలుక బూరుగు మ్రానిపండ్లఁ
గన్గొనునె? బ. ౫౪.

చెఱకునఁ బండు పుట్టినట్లు బ. ౩౭.

చెఱకుపండెనుం దొక్కయీనె సిక్కిన నోడు లేకాడె? బ. ౯౭.

చేతిచేదీపుఁ (మెఱయును) (౨) ౧౭౭.

జలధితోఁ జౌటిపడియలు సరియె? బ. ౨౧౦.

జలకుంభములలోని చంద్రునియట్లు బ. ౧౭౩.

జలతరంగములు (౨) ౪౧౭ (అనిత్యములు)

జలబుద్బుదంబులు (౨) ౪౧౭ (అనిత్యములు )

జలములయందు వర్షాఫలంబమరి, జలములలోనన సమసినయట్లు
బ. ౨౧౫.

జాతినాగులఁ జంపునాండి ప్రతిమనాగులకును బాల్పోయు
నట్లు (౧) ౨౦౨.

జారచే సాధ్విఁ (మెఱయును) (౨) ౧౮౮.

జాలిపడి కనక సాములు దమక వేలిచికొన్న విధము. బ. ౨౩౦.

జీమూతములలోని చంద్రునిపోలుపున (౨) ౩౨౬.

జ్వరపీడితుఁడు వాలరుచి యే మెఱుంగు? బ. ౨౪౦.

తంగేటిజున్ను. బ. ౨౪౦.

తననీడఁ గడవంగఁబాలు (౧) ౩౫౯

తనపూర్వ లిఖితంబుఁ దప్పించి పిదప, వనజజుఁడైనను మనఁ
జేయఁగలఁడె? (౧) ౪౩౩

తపనుతో ఖద్యోతతు తెల్ల సరియె? బ ౨౧౦

తప్తలోహంబుల జలము లింకినట్టు (౧) ౧౬౮

తిలసుండు. (౧) ౫౧౧

తవరాజ మమరి ముందఱఁ బ్రోకయుండఁ, దవుడు బొక్కుడు
నని తలఁచినయట్లు. బ. ౨౪౦

తుది నాలుక ముల్లు (౧) ౫౧౧

తెల్కికి నువ్వు పండినయట్టి పరుసు (౧) ౩౮౬

దానంబులేని మాతంగంబు (౨) ౨౧౮

దివియలేని మందిరము (౨) ౨౧౮

దిశలు దాలములు వాయించు (౧) ౩౫౯

దీవించువా రేండ్లేల యిత్తురు? బ. ౧౬౨

దుఃఖముచేత సుఖము (మెఱయును) (౧) ౨౧౮

దుర్మేఘపటలంబు దూరఁగప్పియును, నిర్మలరవి దివి నిలిచిన
యట్లు. (౧) ౩౯౨

దృష్టిహీనుండు దా దీప మే మెఱుఁగు? బ.

పిపీలికామార్గంబులు (౨) ౪౧౮ (అనిత్యములు).

పులిజున్నుఁ గోయని యమ్ము (ట) (౧) ౩౫౯.

పువ్వుఁగంపునై. బ. ౬, పువ్వునుగంపునుబోలె. బ. ౨౪౫.

పూసలలోనిదారంబుక్రియ. బ. ౫, పూసలలోని దారంబు
నట్లు. బ. ౧౮౩.

పెన్నుదు లురువడిఁ బాఱి శరధిఁ గూడినయట్లు. (౧) ౧౬౬.

పెన్నిధి యుంపఁగ మన్నడుగుదురె? బ. ౧౧.

పేద దాఁ బెన్నిధి యింటఁ గన్నట్లు (౧) ౧౮౦.

పైఁగొసరఁ గుచంబు గూలఁబడ్డట్లుగఁగూడ నిమ్మనిన బ. ౨౩౦.

పొట్టపొర్వునఁ గల్పభూరుహం బుండ, వట్టి వృక్షమునకు
వడినేఁగినట్లు. బ. ౨౪౦.

పొట్టలోపలియమ్ము. (౧) ౫౧౧.

పొలమున నాఁబోఁతుఁ బులిగొన్నయట్టిపొలుపు. బ. ౭౫.

పొలుపుగాఁ దేనియ వోసి నూటినను, నిలఁ దీయనైయుండునే
వేఁపనార? బ. ౨౪౦.

పోల దుర్జనుఁ గూడిపొందునకంటెఁ జాల మేలండ్రు సజ్జనవిరో
ధంబు. (౧) ౩౧౩.

ప్రపంచంబుచేఁ బరమాత్మైకసిద్ధి. (మెఱయును) (౨) ౧౮౮.

ప్రాణంబుగల్గినను, బలుసాకుఁదినియైన బ్రతుకంగవచ్చు. బ.
౨౩౦.

ప్రాణంబులేని దేహంబు (౨) ౨౧౮.

బండు లొండొండె తాఁ బాయఁబెట్టుడును, బండి లేకుండు
పగిది. (౧) ౨౯.

బయలిదీపములు (౨) ౪౧౮ (అనిత్యములు).

బారిసమరేదుమిత్రి. (౧) ౫౧౧.

బాలకులమాటల్. (౨) ౪౧౮.

బిచ్చంబు మాన్పిన భక్తి సెడునె? సుంకుఁగల్లుడాచినఁ బెండ్లి సెడునె - (౧) ౩౮౩.

బీజములోని వృక్షంబునట్లు. బ. ౧౮౪.

బెండ్లు దేలెడిఁగాక పేరేటనైన, గుండ్లు దేలునె - బ. ౨౨౯.

భజనలేనితపము. (౨) ౨౧౮.

భాగ్యహీనుండు డాఁ బసిఁడిఁ బట్టిన న-యోగ్యంపులోష్టమై యున్నట్లు. బ. ౨౦౯.

భుజియించువడన ముండంగఁ బెడతల గుడుపుచందమున. (౧) ౨౦౨.

భృంగసంస్పర్శఁ బతంగంబు కొంటె, యంగంబునకుఁ బాయు టది దెబ్బ గాదె? బ. ౨౨౪.

భ్రమరకీటన్యాయము. (౧) ౨౨౬.

మంచుఁ గుంచానఁ గొలుచు (ట) (౧) ౩౬౯.

మదకరిఁ గట్టినపాశములట్లు. (౧) ౧౭౭.

మయిలచే మడుఁగు (మెఱయును) (౨) ౧౮౮.

మరులోవెయి రోఁకలిఁ గొనిరండు తలఁజుట్టుకొనియెద నన్నట్లు బ. ౯౮.

మరువంబు జనియింప మరువంబుతోన, పరిమళం బుదయించు భాతి. (౧) ౨౦౯.

మర్కటన్యాయము. బ. ౩౬.

మలకల మాట్లు (౧) ౩౪౪.

మలయజకుజమునఁ బూవుపుట్టినట్లు. బ. ౩౮. మలయజపుష్పముల్ (౧) ౩౯౯.

మలినదర్పణములమాడ్కి (౨) ౩౨౭.

మల్లిమొగ్గలునైవ మదనుని వేఁడినెల్లగాఁ జేసితి (వి) బ. ౧౮౦
మసికప్పడమునఁ గప్పఁబడియు వెలుఁగు మాణిక్యంబునట్లు.
(౧) ౩౯౧.
మహాబ్ధిలో వర్షోపలములు విరిసినట్లు (౧) ౧౮౨.
మాణిక్య మొకమసిలోకఁబొదివినఁ గాంతిసెడునె? బ. ౨౨౪.
చూ. ౨౨౧.
మానకజలములలోన నేప్రొద్దు, నానిన శిల మెత్తగ నేర్చునెట్లు?
బ ౨౪౬.
మామిఁడివిత్తుఁ దా మహిమీఁద విత్తవే మగునే? బ. ౨౧
మాలకుమాంసము మతిగొడారికిని, వోలునుగాకుండ. బ. ౧౦౪.
మీఁదఁటఁబ్రాఁచి గప్పియును నమలినంబైన గంగాంబువులట్లు
(౧) ౩౯౨.
ముక్కుపైఁ గత్తి (౧) ౫౧౧.
ముంగిటిపెన్నిధి బ. ౨౪౦.
ముంజేతికంకణంబున కద్ద మేల? (౧) ౬౨౦.
ముండమోపులపగిదిన్. (౧) ౨౪౪.
ముందటిశిరం బుండ, మోకాలికిని సేసవెట్టినట్లు. (౧) ౨౦౨.
ముల్లుచ్చి పెద్దపద రడ్చినట్లు. బ. ౨౧౨.
మృగపతి యొద్దెస మేయునే పుల్లు? బ. ౫౪.
మృగవ్యాధుఁ డొడ్డినయురుఁవలలభావమున. (౧) ౧౭౭.
మెడఁ జుట్టెడిపాము. (౧) ౫౧౧.
మెఱుఁగుఁదీవెల్ (౨) ౪౧౮ (అనిత్యములు.)
మేరువుతోఁ బెఱమెట్టలు సరియె? బ. ౨౧౦.
మేరువుసోఁకి కాదె తచ్ఛాయఁగాకి వట్రిల్లు? - బ. ౨౨౬.
మొయిలుమెఱుఁగు (౨) ౪౧౮ (అనిత్యము.)

మోకాళ్లను బట్టతలలను ముడిపెట్టు (౧) ౩౫౯.

రత్నపరీక్ష యెఱిఁగి చేపట్టుబద్పునుబోలె. (౧) బ ౯౭

రవితోడఁ గిరణము లస్తమించుపగిది. (౧) ౨౨౧.

రసహీనమైన నిస్సారంపుఁగవిత (౨) ౨౧౭.

రాకామలజ్యోత్స్నఁ ద్రావుచకోర, మాకాంక్ష సేయునే
        చీకటిఁ ద్రావ? బ. ౫౬.

రాజితాంచిత రత్నరాజ ముండంగ గాజుపెంచిక లేఱి గమి
        యించినట్లు. బ. ౨౬౦.

రా నేర్చునే పుష్పరసమున కీఁగ? ప ౨౬౦.

రెండుగాఁ బాపెడునీరు ద్రేయు (ట) (౧) ౩౫౯.

రెండునోళ్లను గుహ్యమండినఁగుక్షి, నిండునే గంధభేరుండంబున
        కును ? (౧) ౨౦౨.

రే పగలునేయు (ట) ౩౫౯.

రోఁకటఁ జిగురులు గోయు (ట) (౧) ౩౫౯.

రోఁకటిపాటలట్లు. బ. ౨౧౨.

లంపానఁ గోసిన లాచిన నెఱియఁ, గంపెక్కఁ గాదె శ్రీ
        గంధంబునకును ? బ. ౧౧౦

లా నార యొలుచు (ట) (౧) ౩౫౯

లోష్ముఁగూటము (౧) ౫౧౧

లోళ్ల రోఁకళ్లఁ బాడు (ట) బ. ౧౨౮.

లక్ష్యము ధనుర్ధరుఁ డేయఁ బడిన శరములట్లు. (౧) ౧౭౭

(శ్రీశైలము) లతగరిగొన్న మూలస్తంభము (౧) ౮.

వట్టియాకులు గాలివడిఁ దూలుఁగాక, మెట్టలు దూలునే యొట్టి
        గాడ్పునను? బ. ౨౨౯.

వడగండ్ల గుండ్లు గట్టు (ట) (౧) ౩౫౯.

వజ్రగర్భవర్గంబు వారాశిఁ గురియువడువున బ. ౪౨.
వజ్రపుటట నోడయుండంగ వదరూఁడినట్లు బ. ౨౪౦,
వాడపొత్తు (౧) ౩౪౧.
వానరం బెఱుఁగునే వరరత్నమహిమ? బ. ౨౪౦.
వానవల్లులు (౨) ౪౧౮. (అనిత్యములు.)
వాయసఫలన్యాయము. బ ౩౫.
వాయువుఁ బట్టు (ట) (౧) ౩౫౯
వారిధిఁ దటినీప్రవాహముల్ గలియఁ, బేరున్న దే వేఱ?బ.౨౭౪
విద్యాప్రభవములేనట్టి సభాసమూహంబు (౨) ౨౧౮.
విమలమాణిక్యగర్భమున దీపంబు వుట్టినట్లు. బ. ౩౮.
విరిదమ్మివాసన విహరించుతేఁటి, పరిగొని సుడియునే ప్రబ్బలి
    విరుల? బ. ౫౪.
వీచి ప్రవర్తితంబగుచు వచ్చు వహిత్రంబు వడువునబోలె.
    బ. ౩౭
వీపుఁగోల. (౧) ౫౧౧.
వెన్నెలఁ బ్రోవుగాఁ జేయుట (౧) ౩౫౯.
వెలివాడఁ గలుగునే వేదఘోషంబు? బ. ౧౫౪.
వెల్లవేగియుఁ దినికి చాబిడ్డఁ గనినచందము. బ. ౨౭౦.
వేమాఱు వెంతగాచినను వన్నెకుఁగాదె సువర్ణంబు?బ.౧౧౦
వేయివిధంబుల వెలిగడ్డ వదరుఁ,గాయలోపలిచేదు వాయని
    యట్లు. (౧) ౧౬౫.
శబ్దంబులోపలి యర్థమట్లు. బ. ౧౮౪.
శరనిధిఁ గెరటలు జనియించి వెండి శరనిధిలోనన సమసినయట్లు.
    బ. ౨౪౦.
శర్వాణి నీలాంబుజముఁ దాల్చునట్లు (౧) ౧౮౦.
శశిలేని నిశి (౨) ౨౧౮.

శాంతిలేని యతి. (౨) ౨౧౭.

శారదాభ్రములు. (౨) ౪౧౭.

శిఖి లక్క వుత్తడి వొందు తెఱఁగు (౧) ౧౭౨.

శిల్పకుచేత జిను రంటినట్లు. (౧) ౧౮౮.

శుక్తిచేఁ బొదువంగఁ బడియుఁ దనరు

(శ్రీశైలము) సదాశివుని యంబరము (౧) ౭.

సన్మానంబులేని దానధర్మములు (౨) ౨౧౭.

సన్న్యసింపఁబోవుచును నిల్లప్పగించి నయ్యిబ్బంది యట్లు
బ. ౯౮.

సర్వసంగముల్ విడిచి తా నాశ్రమముఁ గోరు తపసిచందము.
బ. ౯౮.

సిద్ధరసస్పర్శఁజేసియేఁ గాదె, శుద్ధసువర్ణంబు శుద్ధతామ్రంబు?
బ. ౨౨౪.

సీతుచే నష్టము (మెఱయును) (౨) ౧౭౭.

సుతుల్ జనకునిఁ గౌఁగిలించుకరణి (౧) ౧౮౮.

సోడంబుతో ముక్కు మోకుగాఁ గోసి, కూడనిట్టిఁ బ్రాము
(౮) బ ౨౪౦.

స్ఫీతాగ్నిచే నవనీతంబు గరఁగుభాతి. (౧) ౧౭౨.

స్ఫుటతులాయష్టి సంపుటభూషణాదు లిటఁ గల్గెలేక యె
త్తెఱుఁగంగరాదు. (౨) ౧౭౮.

స్వామిభృత్యజ్ఞానసత్త్వంబు (౧) ౨౨౬

స్వామిభృత్యసంబంధము. బ. ౧౩౨.

హృదయశల్యము. (౧) ౫౧౧. మొదలయినవి.

---

## జాతీయములు

అక్షమాలినభంగిన్ (బ. ౨౧౮), అంగిటిముల్లొత్తు (బ. ౬౪) భవబాధలకు నగపడి (బ. ౧౭౧); ఉపయోపకలమున్న యుపయోంచె మహిమ, ఇంపారి నునుపారి కంపుసొంపారి చాలనొప్పెడు బిల్వపత్రి (బ. ౭౦), ఉన్నయున్కిన (౧) ౮౫౧, ఎక్కుగొట్టు (౧) ౫౧౧, కనుమూయసెసయు లేదనఁగ ముప్పెట్టిగొనియె (బ. ౪౩), ఇట్లింతకత్తి కొన్నాఁడింక నిఁకమీఁద నెంత కత్తికో నున్నాఁడో? (బ. ౧౫౫), ఒంటొరుఁ జేప్రేసి నవ్వన్ (బ. ౬౩), వడిఁబాఱు జలముల కొడలెల్లఁ గాల్లు, వడిఁ గాలుచిచ్చున కొడలెల్ల నోళ్లు, వడి వీచుగాడ్పున కొడలెల్లఁ దలలు, వడిఁ జేయుబసవన కొడలెల్ల భక్తి (బ. ౩౭), పుడమి ఒడ్డగెడవయ్యో (బ. ౩౩), ఒత్తుపట్టఁగన్ (బ. ౬౨), ఓరంతప్రొద్దు (౧) ౮౫౦; ప్రోలు నూడఁగఁగంటిన్ (౧) ౧౮౬; కనుఁగవ ధూళిఁ జల్లు (౧) ౮౯౯, కన్గంట వీక్షించి (బ. ౧౧౬), ముకురంబు గన్గొల్పి (౧) ౨౧౩, కుండగూల్చినభంగి వారక వర్షంబు వఱుగొని కురియ (౧) ౧౮౬, కెలస మానతియిండు (బ. ౨౪౧), కోయనిపొగడు (బ. ౩౪), గామడ్చినట్టులు (బ. ౨౦౬), గుండెబెదరు (౧) ౫౧౧; కుడుపున కియ్యెడ నుడనుడ లేల? (బ. ౪౧), గొడ్డువీఁగి కనినకొడుకు గారాముబిడ్డని (౨) ౧౬౪, గోరంతప్రొద్దు (బ. ౪౮), నీవుఁజాలుదే రష్మ, చాలవేఁ జిక్కుము (౨) ౫౧౩, చిత్తంబుచిగురు (బ. ౧౫౬) చీరికిఁ గైకొన్నె (బ. ౧౦), చెమటయే నెత్తురన్ తల్లి (౨) ౧౫౬, ముక్తిచేగరై గరిగొన్న శివుప్రసాదంబు (౧) ౧౦౦, చొల్లువాఱుడు మాటలు (బ. ౯౯౬), చోళవాలికకాక వేళవాలికిని వత్తురే? (బ. ౯౯౫), కొలువక తక్కినఁ బొలిసె బ్రాహ్మ్యంబు, కొలిచె నేనియు భక్తి వొలిసె (బ. ౨౧), నీయాగి వేయును మాకు వచ్చెఁ దక్కుము (౧) ౩౬౨, బసవనిఁ దలఁచుతలఁపు బలుపువఁగాఁ జేసి భావష్టు మెఱు

సిన (బ. ౫), తేటతెల్ల (బ. ౧, ౧౧, ౨౫, ౩౬) భక్తి దుర్దశ్శికి తన లోనఁ దొట్రుకొనఁగ (బ. ౨౫), (ఒకబూరె) నమలెనో నమలఁడో (బ. ౧౧౯), నవకమెసఁగ (బ. ౧౧), నాను మేయుట (బ. ౨౦౨) నిన్నగా దటుమొన్న (౧) ౬౩౭, నిలుకాల నిలువంగ నేరక తిరుగు నలమట (బ. ౬౨, ౨౦౦) నిఃవుఃఖవశి శివునేత్రత్రయంబు (బ. ౭౬), నోములుగీములు వేములఁ గలిపి (బ. ౧౬), పచ్చిబొంకులు (౧) ౩౪౧; అతఁడు పట్టెడుకూటికర్గ్వాంశు (బ. ౨౮), భక్తియు నీవును బడ్డట్లు పడుదు (బ. ౨౦) - పాషాణానఁ బసిఁడి (౧) ౨౦౯ - విధి గట్టి పిట్టతాఁకు (౧) ౪౪౯ - పున్నెంబు మాలినపాడు (డు) వలము (బ. ౧౫౦) - పుట్టినాఁడ కులము పురులు వోనాడెన్ (బ. ౨౦) - పుట్టువుమాలుపోఁతు (౧) ౧౨౬ - పురులువోనాడి (బ. ౧౦౮) - వార్తయుఁ బూసగ్రుచ్చినయట్లుగాఁ జెప్పి (బ ౧౫౦) పొట్టపొర్వ్వన (బ. ౨౪౦) - సర్వాంగములన్ భువిఁ బొంద మ్రొక్కి (బ. ౭) (౧) ౧౩౪ - శరణుల గలుకడ లరసిపట్టి చూడంగ నీప్రాప్తియే? (బ. ౨౧౨) - ప్రాలుగల్గు సుపుత్త్రుఁబడసితిమి (బ ౨౦) - ప్రేవులుమాడు (బ. ౮౦) - అద్రిజాత వలపలిబరి (౧) ౮ - బుడిపుల్లవోవు (బ. ౨౧౪) - బొంతకు గంతకుఁ బ్రోవిడి (బ. ౧౧౧) - మంచుఁ గుంచానఁగొలుచు (౧) ౩౪౯ - మడికూటివృత్తి (బ. ౨౨౯) వెదకిననైననొకఁడు మందునకైన సూరిలో లేఁడు (బ. ౨౪) - మనసు తల్లడము (౧) ౫౧౨; శేవన్నఁ బోవునే శేదలమునుక? (బ. ౧౧౪); అచ్చెరువుఁ బ్రహర్షంబు భక్తి ముప్పిరిగొని (బ. ౧౧) - ముదము గోపము దెంపు ముప్పిరిగొనఁగ (౧) ౨౮౪ - రీతులు నేతు లుట్టంగ (౧) ౧౮౦; లోకుల కాకబుపులు (బ. ౧౦౨) - విక్కన విరియు (బ. ౨౨౧, ౨౨౪) - వ్రచ్చివందబలాకు (బ. ౧౦౪) - 'హా' యని సత్త్రపాయుక్తి (బ. ౩౭) - మొదలయినవి.

## జంటపదములు

భాషలోని అందమును చాలామట్టుకు జంటపదముల ప్రయోగము వల్ల సోమనాథుడు వెలయించినాడు. ఇవి అనేకవిధములుగా ఉన్నవి. కొన్నిటిని క్రింద చూపుచున్నాను.

(౧) కట్టెగిట్టె (బ. ౭౫) - కట్నంబు గిట్నంబు (౧) ౩౪౦ - జక్కులు గిక్కులు (బ. ౧౧౩) - నోములు గీములు (బ. ౧౬) - బాసలు గీసలు బ. ౧౦౮ (౧) ౨౪౩.

(౨) కస్వాగట్ర (బ. ౭౫) - కొజుకుకొట్ర (బ. ౭౫) - నలినట్ర (బ. ౭౫) - బడియబట్ర (బ. ౭౫) - మానుమట్ర (బ. ౭౫.)

(౩) అంజలి గుంజలి (బ. ౧౦౪) - ఆకులునలము (బ. ౭౭) కోరికకడమ (బ. ౮౮) - చుట్టాలం బక్కాల (బ. ౨౩౪) - దిక్కునాదెసయును (బ. ౧౪౦) - దెసయు దిక్కు (బ. ౧౩౬ (౧) ౨౦౨) పండుగులు ప్రబ్బములు (౧) ౩౪౦ - పూరియుంబుడుక. బ. ౭౫ - పేదలపాదుల. బ. ౧౧౪ - పాలముపోకు. బ. ౧౦౩ - మందుమ్రాకు. బ. ౬౮, ౭౫, ౮౫ - మాడమడక (౧) ౩౪౦ - వీసము నాసము. బ. ౧౧౪ - వేరు వెల్లంకి. బ. ౭౭ - వేసరనాసరన్. బ. ౬౯ -

ఇట్టిజంటపదములను వాడి సోమనాథుడు కవితకు తెచ్చిన అందమునకు క్రింది ఉదాహరణ మొక్కటి చాలును.

"ఆలింగమూర్తి నెయ్యంబు దియ్యంబు,
మూలంబు దాలంబు, ముద్దునుందుద్దు,
భ్రాంతియుంగాంతియు, రంగుబెడంగు,
శ్రాంతివిశ్రాంతి లక్షణము సద్గుణము,

భాతియు రీతియుఁ, బదమును ముదముఁ,
బ్రీతియు నీతియుఁ, బెంపును సొంపు,
నేపును నోపును, నెలమియుఁ గలిమి,
వ్రాపును దీపును, రూపు రేఖయును,
మురువును వెరవును, మొగియును బిగియుఁ,
బురులును నెరులుఁ, బ్రస్ఫూర్తి దస్ఫూర్తి,
సెన్నును నన్నును, జెలువును నలువు,
నున్నతి సన్నుతి, యొప్పును మెప్పు,
లలియును లులియును, లాగును బాగుఁ,
బొలుపును బలుపుఁ, బ్రస్ఫూర్తివిస్ఫూర్తి,
భరితమై పండిత ప్రభుదృష్టి యలద,
కరువునఁ బోసినగతిఁ బిక్కటిల్లె"

(౧) ౧౭౪.

(౫) వ్యతిరేకములు: ఏఱువల్లము, చెట్టుగట్టు, తెరువడవి. బ. ౩౭.

(౬) పిట్టపిడ్గరన్. బ. ౧౯౯; బట్టకబయలు. బ. ౨౬;

(౭) అవసరవేళ (౧) ౧౬౮; శూలకట్టు. బ. ౧౭౨.

## ఆమ్రేడితము

తెనుగు అందమునకు పదముల నామ్రేడితము చేసి పలుకడ మొకలక్షణము. దీనిని సోమనాథుడు సంపూర్ణముగా వినియోగించు కొన్నాడు. కొన్ని ఉదాహరణములు:

(౧) బసవస్వామిగాఁగవచ్చునే పెఱపెఱవారలకెల్ల. బ. ౬
అలుగగ్గరాచి (మిక్కిలి అరుసనట్లుగా) (౧) ౪౩౪; కథకథను
నవ్వుచును, గడియగడియ దప్పక. బ. ౯౯; సోమవారము సోమవారము
(=ప్రతిసోమవారమున్ను) (౨) ౧౧౪; వారవారము.

(౩) ౧౧౫; ముదలింపముదలింప బ. ౨౧౨; ఆడియాడి,
ఉప్పొంగియుప్పొంగి, క్రాలిక్రాలి, చేసిచేసి, చొక్కిచొక్కి, తేలి
తేలి, తొప్పఁదోఁగితోఁగి, పొర్లి పొర్లి, మ్రొక్కిమ్రొక్కి, వ్రాలి
వ్రాలి, సోలిసోలి, (బ. ౭౩.)

(౪) కదలకమెదలక, గ్రుక్కుమిక్కనక, చెప్పకచేయక
మొదలైనవి.

## పదజాలము

(౧) అచ్చతెనుఁగు మాటలలో సోమనాథుఁ డుపయోగించి
నన్నిటిని మరియే తెనుఁగుకవిన్ని ఉపయోగించలేఁడు. ఇతఁడు వాడిన
వందలకొద్దీపదములు నిఘంటువులలోని కెక్కలేదు. అట్టివాటిలో
కొన్నిటినిమాత్ర మీక్రింద చూపుచున్నాను.

అంకన, అంకనము, అంకుసాంకులు, అకో!, అఖండ బిల్వ
పత్తిరి, అక్షిరోగము, అనుద్వ, అబవిలు, అడపతిత్తి, అడిప్రాత
కచ్చడము, అతకులు, అతము, అందుల, అద్దరి, అనసులకోల, అనసుల
మొగడ, అనసులు, అనుగులవు, అనువు గద్దెఁగరులు, అన్నెకుక్క
అమరారు, అరజలు, అరమని, అరసుట్టు, ఆరిగిపండ్లు, అర్ఘ్యపణ్య
ములు, ఇజ్జలజ్జలవారు, అలుకటము, అలిముటితనము, అలువ, అలసుల
కలశము, అసిగోఁత, ఆఁక= ప్రక్క, ఆటకూటము, ఆండెలి, ఆదరి
కము, ఆనందవతి, ఆనందవర్తి, ఆనుపడి, ఆరతిజోళ్లు, ఆరతిపలుకలు,
ఆరాధ్యసంపద, అళ్లరి, ఇక్కంటి, ఇలువుట్టు, ఇలువుట్టుదాసి,

ఇల్లిదే! ఉక్కుసిల్లు, ఉఘే!, ఉత్తెర, ఉనుపరి, ఉప్పసము, ఉప్పర గుల్లు, ఉటిముళ్, ఉజ్జుట, ఉలిపిజంగెత, ఉల్లిగడ్డము, ఉవియు. ఉసుగు, ఉసులు(క్రియ), మొదలయినవి.

(౨) సోమనాథుడు తన కాలములో వ్యవహారములో ఉండిన అన్యదేశ్యశబ్దములను ప్రయోగించడానికి వెనుదీయలేదు:

కతారము. బ. ౨౩; కడానినక్కులు. బ. ౧౧౪; కోర=కెన్నె. బ. ౬౯, (౧) ౪౮౩; జోహారు (౧) ౪౩౧, మొద.

## (౩) కొన్ని శబ్దముల అర్థవిచారము :

(౧) మంగళారతి. (౧) ౩౭౨. ఇది మిశ్రసమాసము; 'ఆరతి' తెనుగుమాట. ఇది 'ఆళతి'కి రూపాంతరము. కన్నడములో 'ఆళతి' అంటే పాట. దీనికి 'అణతి' రూపాంతరము. 'ఆళతి' బ. ౬౨. మంగళపుపాట పాడుతూ కర్పూరము మొదలయినవాటిని వెలిగించి చుట్టూ త్రిప్పుతారు గనుక అట్టి ధూపదీపములకున్ను, వాటిని త్రిప్పుటకున్ను కూడా ఈమాట కుదురుకొన్నది. శ. ర. లో 'ఆళతి' అనేపదము లేదు. 'ఆగతి'కి 'హారతి' మొదటిరూప మని ఉన్నది. ఇది తప్పు. 'ఆరతి' మొదటిరూపము. 'ఆరతి'కిగాని 'హారతి'కిగాని శ. ర. లో అర్థము లేదు. అది వైకృతము అని మాత్రమున్నది. దేనికి వైకృతమో చెప్ప లేదు. 'ఆళతి' 'ఆలప్తి'కి తద్భవరూప మని నాతలంపు.

(౨) అనుమానము. బ. ౬౪. సందేహము; ఈ అర్థము సంస్కృతములో లేదు.

(౩) అర్ఘ్యపణ్యములు. బ. ౬౧. శ. ర. లో లేదు. దానిని మించసంకల్పించిన సూర్యరాయాంధ్రబృహన్నిఘంటువులో కూడా లేదు. ఈ మాటను సోమనాథుడు చాలా తరచుగా ఉపయోగిస్తాడు. చూ. బ. ౬౧, ౧౧౦౮; (౧) ౨౭౬, ౨౭౭, ౪౭౩, మొద. శ. ర.

లో 'పణ్యారము' ఉన్నది. దానికి 'నానఁబప్పు, భక్ష్యము' అని అర్థము లివ్వబడినవి. ఇది 'ప్రతిహారము'నుండి పుట్టినదని నాతలంపు. 'ప్రతిహారుఁడు' అంటే 'సేవకుడు.' ప్రతిహార మంటే సేవ. ప్రతిహారము, పడిహారము, పణిహారము, పణియారము, పణ్యారము అనే రీతిగా మార్పుకలిగినది. 'పణిహారమువారు' అని వైష్ణవకుటుంబమువారున్నారు. 'ఆలయములో కైంకర్యముచేసేవారు' గనుక ఆయింటి వారి కా పేరు వచ్చినది. ఇప్పుడు వారు 'ఫణిహారము'వా రని చెప్పుకొంటారు. వైష్ణవులయి ఉండి వా రట్లు శివపరమైన పేరి నేర్పరుచుకొనడము తగదు. తమ పేరు సంస్కృతపదముగా మార్చుకొనవలెనని వారట్లు చేసుకొని ఉంటారు. రాయలసీమలో 'పానకపణ్యారము' అంటే 'పానకసేవ, పూజ' చేస్తారు. ఆసమయములో పానకముతో బాటు నానబప్పు (వడపప్పు)ను కూడా ఇస్తారు. పణ్యార మంటే సేవ, పూజ, అనే అర్థమును విస్మరించి, పానకముతో వడబప్పుకూడా ఇస్తారు కాబట్టి, పణ్యార మంటే వడబప్పు అని అర్థము చేసుకొంటున్నారు. 'అర్ఘ్యపణ్యాము'లోని 'పణ్యాము' 'పణ్యారము'నకు రూపాంతరమయి ఉంటుంది. అర్ఘ్యపణ్యాములు అంటే అర్ఘ్యపూజలు, అర్ఘ్యసేవలు, అని అర్థము. లేదా, 'పడియము' పణియముమయి, పణ్యాముగా ఏర్పడి ఉండవచ్చును. ఈ మాట శ. ర. లో లేదు. ఆడుబిడ్డ లత్తవారింటికి పోయేటప్పుడున్ను ఇతరశుభకార్యముల లోను పడియ పెట్టుతారు. వివాహములలో 'పడియదినము' ప్రత్యేకముగా ఉన్నది. పడియ పెట్టడమంటే ఉపచారముచేయడము. పడియ దినమంటే వరోపచారము చేసేదినము.

(౮) 'అటుగాని యవసరం బలవడ నేరదు.' బ. ౧౮౮. అవసర మంటే పూజ.

(౫) 'ప్రస్తుతం బెట్టెఁగి' (౧) ౧౮౧. సమయము, వీలు, కని పెట్టి, అని అర్థము.

(౬) 'అంగడ.' బ. ౨౦౯, ౨౫౧. 'అంగద' అంటే 'ఆకలి' అనే శ. ర. లోని అర్థము తప్పు. అహంకారము అని అర్థము.

(౭) అరివి బ. ౭౩, శిథిల మని అర్థము. శ. ర. లో లేదు. 'గుడియును బ్రస్సియుఁ గూలిపోయినది, యజరుమంటపమును నరివి యైనయది'

(౮) ఇండె=చీలిక, అని శ. ర. 'ఇండెగ ట్టైడిది మాయిండె రేకవ్వ, ఖండదీపము వాఁడు గా నమినంది.' బ. ౫౫౪. ఇచ్చట 'ఇండె' అంటే 'పుష్పమాలిక' అని అర్థమేమో.

(౯) ఊడుకలు. బ. ౨౦౯. జంతుమాంసములో ఒకనిషము శ. ర; సూర్యారాయనిఘంటువులో గాని లేదు.

(౧౦) ఏటము. (౧) ౪౮౦.

'చిరివినబొంతయుఁ జేతికత్తియును
జెరివినతడుపునుఁ జేతికాయకముఁ
జేటల నమ్మి తెచ్చిన లబ్ధి యదియు
నేటంపుఁ బదమగు నిలువడి సూచి'

ఈపదము శ. ర. లో లేదు. ఇచ్చట 'ఏటము' అంటే 'దారిద్ర్యము'అని అర్థము చెప్పవలెను. కాని. ఈ పదమునే సోమ నాథుడు బసవపురాణములో

'కోకమ్మి పడసిన కొలుచు గాదియుఁ
లేకేమి కొనిరావు గాక యేమియును
నేటంపుసంపద లెం డేఁగె నింక.'

దీనిలోని 'ఏటము'నకు సూర్యరాయాంధ్రనిఘంటుకారులు 'అధికము' అని అర్థము చెప్పినారు. 'అస్థిరము' అని చెప్పవలెనేమో.

మాటలు నేరక పలికిన
నోటమిగాఁ గొనక కార్యమున్న నిజముఁ దాఁ
బాటించి నృపతి ధర్మ్యం
బేటముగాఁ బాడి నిర్ణయింపఁగ వలయున్

విజ్ఞా. వ్యవ. ౨౭.

ఈ పద్యములోని 'ఏటము'నకు 'అధికము' అని అర్థము చెప్పితే సరిపోతుంది గాని, సోమనాథుని ప్రయోగములనుబట్టి చూస్తే 'ఏటము' గా= అనుసరించి, అని అర్థము చెప్పవలె ననిపిస్తుంది.

(౧౧) ఒటిమిఁడివిప్రులు :(౧) ౨౧౬. 'ఒఱిమిఁడి'అని పాఠాంతరము. 'ఓర్వలేని బ్రాహ్మణులు' అని అర్థము చెప్పవలెను. ఈపదము శ. ర. సూ. ఆం. ని. లలో లేదు.

(౧౨) క్రిత్తము: బ. ౨౫౩. శ. ర. లేదు. 'పూర్వము'అని అర్థము. వ్యవహారములో దీని అర్థ మిట్లే ఉన్నది.

(౧౩) చోళవాళిక కాక క్షోణిత లేశ
వేళవాళికిని వత్తురే;

బ. ౧౯౫.

చోళవాళిక కాక క్షోణీశ లేశ
వేళవాళికిఁ గర్తవే;

(౨) ౧౯౫.

చోళవాళి అంటే చోళపాళి, చోళరాజ్యము, అనిన్ని, వేళవాళి=కాలవాళి = కాలుని, అనగా యమునిరాజ్యము అనిన్ని శ్రీ. శే. కొ. వి. లక్ష్మణరావుగారన్నారు. వ్యాఖ్యాత భవశేష

నామయ్య, సానుగంటిరాజయిన ఉదయావనీశ్వరునితో అన్నది. ఉదయావనీశుడు చోళరాజయినందు కాధారము లేదు. పైవాక్యమే అందు కాధారము. ఆ వాక్యపు అర్థమే ఇప్పుడు విచార్యము. కన్నడ ములో 'చోళదవాళి' అని ప్రయోగమున్నది. దానికి ఋణము, విశ్వాసము, అని కర్ణాటకచరిత్రకారు లన్నారు. కాని, ఈ అర్థము పై వాక్యములో కుదురదు. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు 'చోళ(ద) వాళి=జొన్నలనూలి, అనిన్ని, వేళవాళి=జీవితకాలపు విధానము', అనిన్ని అర్థము చెప్పినారు. కాని, కన్నడములో జొన్నలు అనే అర్థములో 'జోళ' అనేపద మున్నదిగాని, 'చోళ' అని లేదు. 'చోళం' అనేది అరవ మలయాళభాషలలో ఉన్నది-అయినా ఆకాలములో 'జోళ'శబ్దము కన్నడములో 'చోళ' అని ఉండేదేమో మరొక్క అర్థము నిర్ణయించలేనప్పుడు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చెప్పిన అర్థమునే ఇప్పటి కంగీకరించవలసి ఉన్నది.

(౧౪) తెఱవేటకాడు: (౧) ౪౫౫. శ. ర. లో లేదు. 'తెఱ' అనగా వల. వలలుపరచి వేటాడేవా డని అర్థము.

(౧౫) పిదవు (౧) ౩౦౦. శ. ర. లో లేదు. 'పిదవగు నేభక్తి పెద్దతికంబు' తక్కువ, పేద. అని అర్థము.

(౧౬) బసరు. బ. ౭౦. శ. ర. లో లేదు. 'ఈశ్వరుడు' అని లక్ష్మణరావుగా రర్థము చెప్పినారు. 'బసరు'= లింగము అనవలెనా? 'బసరుడు=ఈశ్వరుడు, అనవలెనా: 'బసరున కారగింపఁ బెట్టుమమ్మ' అని ప్రయోగము.

(౧౭) పిమ్మిటి. దీనిని 'బిమ్మిటి' గా. శ. ర. కారుడున్న్ను ఇతరు లున్ను బకారాదిగా ఉదాహరించినారు. బకారాది అనడానికి తగిన ప్రమాణము కానరాదు.

'ఒక్క మహావిషోరగము...కఱచి, వెలికిలంబడుడు నవ్వాలఁడి మేల్కాంచి, వెలి కుర్కి హోయని పిమ్మిటి నొందు కలకలంబున' అని (౧) ౪౩౫.

'నోరు వెన్నకుఁ దెఱవకయున్న యక్షుణమ,
బిట్టులిక్కిపడి తల్లి బి(పి?)మ్మిటి నొడలు
పట్టలేక!

'నోరు వెన్నకుఁ దెఱవకయున్నయక్షుణమ,
బిట్టులిక్కిపడి తల్లి బి (పి?)మ్మిటి నొడలు
పట్టలేక !

బ. ఉా.

శబ్దరత్నాకరములో బిమ్మిటి= వివశత, అని అర్థమిచ్చి ప్రయోగము లిచ్చినారు. 'పిమ్' అంటే 'వెనుక' అని అర్థము. 'పిమ్మల్' అంటే 'వెనుక భాగము' దీనినుంచే 'పింగల,' 'పిమ్మట' మొదలయిన శబ్దములు పుట్టినవి. 'పిమ్మిటి గొనడ'మంటే వెనుకకు తగ్గడమని నేననుకొంటున్నాను. ఈపదము బకారాది అనడానికి తగిన ప్రమాణము దొరకేవరకున్నూ అది పకారాది అని అనుకోవలెను.

ఈరీతిగా పాల్కురికి సోమనాథు డుపయోగించిన అనేక శబ్దముల కర్థ నిర్ణయమున్నూ రూపనిర్ణయమున్నూ చేయవలసి ఉన్నది. అన్ని శబ్దములకున్నూ అట్టి వివరణము చేయడాని కీపీఠికలో స్థలము చాలదు.

## వీరశైవవాఙ్మయము

పాల్కురికిసోమనతరువాత వీరశైవగ్రంథము లనేకములు బయలుదేరినవి. వాటిలో మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము లోను తంజావూరు సరస్వతీమహలు పుస్తకభాండాగారములోను ఉన్నపుస్తకములపట్టికల నీక్రింద చేర్చుతున్నాను.

### వీరశైవగ్రంథములపట్టిక

(మద్రాసుప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము)

అక్కమహాదేవిచరిత్ర: పాపమ్మ. యక్షగానము.
అక్షరాంకములు: పాల్కురికిసోమనాథుడు.— స్తుతి.
అనిమిషయ్యకు లింగమిచ్చినకథ.— కథ.
అన్యవాదకోలాహలము.— శైవము.
అమరావత్యుమామహేశ్వరశతకము: విశ్వనాథ కామయ్య— శతకము.
అమరేశ్వరతీర్థమాహాత్మ్యము: మాహాత్మ్యము.
అల్లమప్రభుశతకము: దెందులూరి పద్మనాభయ్య.— స్తుతి.
ఒడయనంబివిలాసము: అజ్జరపు పేరయలింగము.— ప్రబంధము.
కూనపాండ్యరాయనికథ: కథ.
గణమాలిక: శైవము.
గణసౌజన్యాఖ్యానశతకము: నాగరాజు.— స్తుతి.
గురునంబిచరిత్రము: పిడుపర్తి నిమ్మనాథుడు.— చరిత్ర.
చతుర్వేదసారము: సోమనాథుడు.— శైవము.
చిక్కయరాజు [illegible]

చిక్కనాయకథ: నిమ్మనాథుడు.— కథ.

చిరుతొండభక్తకథానిధానము: వాలె కోటయ.—యక్షగానము.

చెన్నబసవపురాణము: అత్తలూరి పాపకవి.—పురాణము.

చెన్నబసవేశ్వరవృత్తాంతము.

చెన్నమలదేవస్థానమహిమ, (?) మాహాత్మ్యము.

చెన్నమల్లేశునికీర్తన: గేయము.

చెన్నమల్లేశ్వరశతకము: స్తుతి.

జంగమకాలజ్ఞానము: వీరప్పయ్య.— జ్యోతిషము.

జంగమబ్రహ్మలక్షణము: శైవము.

దేవాంగఋషివంశము.

దేవాంగపురాణము: భద్రకవి లింగకవి.— పురాణము.

ధర్మసప్తాభ్యుదయము: కాశీనాథుని వీరారాధ్యుడు.—
ప్రబంధము.

నవచోళచరిత్రము: లింగనసుకవి.—చరిత్రము.

పండిత శివపూజావిధి—శైవము.

పండితారాధ్యచరిత్రము - పాల్కురికి సోమనాథుడు.—
పురాణము.

పాల్కురికి సోమనాథుడు జయించినకథ, కథ.

ప్రభుదేవరవాక్యము: శైవము.

ప్రభులింగలీలలు: కొచ్చెర్లకోట రామకవి. — ప్రబంధము.
,, పిడుపర్తిసోమన.

ప్రమథగణమాలిక, స్తుతి.

బసవకల్యాణము: అనుమోదసన్న్యాసికవి, యక్షగానము.

బసవకీర్తనలు, గేయము.

బసవదండనాయకవృత్తాంతము, కథ

బసవపురాణము: మహాదేవకవి, పురాణము
,, పాల్కురికి సోమనాథుడు ,,
బసవమహిమామృతము: వరవీరభద్రుడు ,,
బసవరగడ: సోమనాథుడు, స్తుతి
బసవవిజయము: మల్లంపల్లి నాగభూషణకవి, ప్రబంధము
బసవశతకము, స్తుతి
బసవసంబోధనము ,,
బసవస్తుతి ,,
బసవేశలింగశతకము ,,
భల్లాణచరిత్రము, ద్విపద—గంగానరుడు, ప్రబంధము
భల్లాణదండకము, ప్రబంధము
భల్లాణనాటకము ,,
భవానీమనోహరవచనములు, స్తుతి
భవానీమనోహరశతకము, పండితారాధ్యుల వీరేశలింగము, స్తుతి
భవానీశతకము ,,
భైరవశతకము, స్తుతి
మల్లారిచరిత్రము (?) మరింగంటి వేంకటాచార్యుడు, ప్రబంధము
మల్లీశ్వరశతకము, శృంగారము
మల్లేశ్వరశతకము, చేబవర్తి కొండయ్య, స్తుతి
మల్హణచరిత్రము, ఎడపాటి ఎఱ్ఱయ, ప్రబంధము
మహాదేవిచరిత్రము: అల్లమరాయడు, చరిత్రము
మహాప్రభుశతకము, స్తుతి
మహిషాసురమర్దనీశతకము, మల్లంపల్లి బుచ్చయ్యశాస్త్రి, స్తుతి
మురుమల్ల వీరశంకరశతకము ,,
మూర్ఖచరిత్రము, మాజేటి సర్వేశలింగము, ప్రబంధము

వడియనంబిచరిత్రము, యక్షగానము
వీరకాళికాంబశతకము, స్తుతి
వీరసురువరేణ్యశతకము ,,
వీరచోడప్పకథ, సాంబయ్య, ప్రబంధము
వీరచోడప్పచరిత్ర, పోతయ్య ,,
వీరప్పయ్యగారి వచనాలు, వీరప్పయ్య, వేదాంతము
వీరభద్రవిజయదండకము, శంకులచోడయ, స్తుతి
వీరభద్రశతకము ,,
వీరమాహేశ్వరాచారసారసంగ్రహము, పర్వతమంత్రిలింగన, శైవము
వీరశంకరశతకము, శృంగారము
వీరశైవకీర్తనలు ,,
వీరశైవదీక్షాబోధము, పిడుపర్తి బసవన, శైవము
వీరశైవాచారసంగ్రహము, శివరామలింగకవి ,,
శంకరవచనాలు, స్తుతి
శివకీర్తనలు ,,
శివతత్త్వసారము, మల్లికార్జున పండితారాధ్యుడు, శైవము
శివదండకము స్తుతి
శివనామసంకీర్తనము ,,
శివపారిజాతము, యక్షగానము
శివభక్తిదీపిక, రంగనకవి స్తుతి
శివభక్తిపద్యములు ,,
శివయోగసారము, గణపతిదేవకవి, శైవము
శివరహస్యఖండము, జౌబళకవి, పురాణము
శివరాత్రిమాహాత్మ్యము, అక్కనార్యుడు, మాహాత్మ్యము

శివలింగప్రభావము, శైవము
శివలీలావిలాసము, తిమ్మకవి, ప్రబంధము
శివశతకము, అమలాపురపు సన్యాసి, స్తుతి
శివస్తుతి ,,
,, పద్యములు ,,
శీలసంపాదనము, శైవము
శైవగ్రంథము, బాలకవి అనంతయ్య, ప్రశంస
శైవవిషయకశ్లోకము, ప్రశంస
శైవసిద్ధాంతశిఖామణి, చెన్నాప్రెగడ నాగేశ్వరకవి శైవము
శైవాగమశిఖామణి, నెప్పల్లె అప్పనార్యుడు ,,
శైవాచారసంగ్రహము, తిరుమలనాథకవి ,,
శ్రీకాళహస్తిశతకము, విరూపాక్షకవి, స్తుతి
శ్రీవిశ్వేశ్వరశతకము, వేల్పూరి నిస్సన్న, సాంబశివకవి, స్తుతి
శ్రీశైలఖండము, అత్తలూరిపాపకవి, మాహాత్మ్యము
శ్రీశైలమల్లికార్జునశతకము, శృంగారము
శ్రీశైలమాహాత్మ్యము—మాహాత్మ్యము
శ్రీశైలశతకము, స్తుతి
శ్రీశైలరహస్యవివరణము, మాహాత్మ్యము
షట్స్థలజ్ఞానము, యోగము
షట్స్థలవివరణము, సిద్ధనాథుడు, యోగము
షట్స్థలనిర్ణయము, శైవము
సంగమేశ్వరశతకము, స్తుతి
సర్వజ్ఞకాలజ్ఞానము
సర్వేశ్వరశతకము, అన్నమయ్య, స్తుతి
సాంబశివవిలాసము, యక్షగానము

సాంబోపాఖ్యానము, మోచర్ల అన్నయ
సిద్ధేశ్వరచరిత్రము, చరిత్రము
సిద్ధేశ్వరవసంతవిలాసము, పెద్ద వేంకటాచలపతి, యక్షగానము
సిద్ధేశ్వరస్వామిదండకము, పెద్ద వేంకటాచలపతి, స్తుతి
సిరియాలచరిత్ర, ద్విపద, గంగానరుడు, ప్రబంధము
,, తిమ్మకవి, యక్షగానము
సోమనాథలింగశతకము, స్తుతి
సోమనాథ స్తోత్రము, స్తుతి.
సోమేశ్వరశతకము, శివరామయ్య, స్తుతి.
హైమవతీపతిచత్వారింశత్, స్తుతి.

## తంజాపూరు సరస్వతీమహాలు పుస్తక భాండాగారము

శివయోగసారము (౨౬౦౩) గణపతిదేవ.
శంకరసంహిత (౩౫౭–౮)
శివజ్ఞానమంజరి (౩౫౯–౬౧) పరమానంద తీర్థుడు.

## ౧౨

# శైవ సంప్రదాయము

బసవేశ్వరునికి పూర్వముందుండిన శైవసంప్రదాయ మెట్టిది? బసవేశ్వరుడు నెలకొల్పనెంచిన శైవధర్మ స్వరూపమేమి? పాల్కురికి సోమనాథుడు తన గ్రంథములలో ప్రతిపాదించిన వీరశైవ సిద్ధాంతమునకును తత్పూర్వసిద్ధాంతమునకును భేద మున్నదా? సోమన అనంతరము వ్యాపించిన వీరశైవాచార మెట్టిది? అనేవిషయాలను నిర్ణయిస్తేనేకాని, వీరశైవమత చరిత్రస్వరూపము తేటపడదు. ఆనిర్ణయమునకు చాలాపరిశోధనము కావలసిఉన్నది. ఉపలభ్యములైన పరికరములతో ఈవిషయమునుసరించి యీక్రింద సంగ్రహముగా వ్రాస్తున్నాను.

శైవమత మనాదిగా భరతవర్షములో నెలకొనిఉన్నది. ఋగ్వేదములో శివుని పేరు కనబడకపోయినా రుద్రుడు ప్రధానదైవములలో ఒకడుగా ప్రశంసింపబడినాడు. ఉపనిషత్తులలో రుద్రపరములైన ఉపనిషత్తు లున్నవి. పురాణముల కాలమునాటికి త్రిమూర్తుల పూజ దేశములో నెలకొన్నది. పురాణములలో కొన్ని శివపరములైన వున్నవి.

శైవులలో పాశుపతశాఖ చాలా పురాతనమైనది. ఇది వైష్ణవ పాంచరాత్ర సిద్ధాంతమును పోలినది. ఈ రెండింటిలోను ఏది ముందో చెప్పడానికి వీలులేదు. ఈ రెండింటికిన్ని సాంఖ్యయోగము లాధారములు. ఉపనిషత్తుల ప్రమాణమువీదనే ఇవిన్ని నిలిచిఉన్నవి. పాశుపతములో లింగపూజకు ప్రాధాన్యమివ్వబడినది. లింగపూజ యెప్పటినుంచి ఈ దేశములో ప్రబలినదో చెప్పలేము. కాని, భూగర్భమును త్రవ్వి పూర్వచరిత్రమును నిర్మిస్తూఉన్న పురాతత్వ శాస్త్రజ్ఞులు

లింగముల ఉనికి క్రీస్తుపూర్వము చాలా కాలమునుంచిన్ని ఉన్నదని తెలియ జేస్తున్నారు. క్రీ. పూ. 5000—6000 సం॥రముల నాటి దని చెప్పబడే మొహంజోదరో, హరప్పాలవద్ద బయలుదేరుతూ ఉన్న సింధుదేశనాగరికతను గురించి తెలిపే అనేకవిషయములలో లింగ ములు బయలు-దేరడ మొకవిశేషము. దక్షిణ హిందూదేశములో పాశు పతశాఖ ఎప్పటినుంచి వ్యాపించినదో చెప్పడాని కాధారములు కాన రావు. ఉన్నవిమాత్రము పదోశతాబ్దమునుంచిన్ని ఉన్నవి. తిరు చునాపల్లిజిల్లా, తిరుచునాపల్లి తాలూకా, అల్లూరు గ్రామములో ఒక శాసనములో పశుపతీశ్వరాలయమునకు క్రీ. శ. 910 సం॥రములో దానము చేయబడిన ట్లున్నది. అదేజిల్లా, కరూరుతాలూకా కరూరు గ్రామములోని ఒక శాసనములో క్రీ. శ. 1067 సం॥రములో పశు పతీశ్వరముడైయారుకు దానము చేయబడిన ట్లున్నది. అల్లే తంజా వూరుజిల్లా, కుంభకోణముతాలూకా, తిరునాగేశ్వర గ్రామములో అచ్చటి శివాలయములోని ఉత్సవ విగ్రహమునకు పాశుపతిదేవు డని క్రీ. శ. 1030 ప్రాంతమునాటి ఒకశాసన మున్నది. తంజావూరు జిల్లా పాపనాశంతాలూకా, ఆవూరు గ్రామములోని శివాలయము లోని ఒక శాసనములో (క్రీ. శ. 1234) ఆలయములోని శివుని పేరు పశుపతీశ్వరముడైయాన్ అని ఉన్నది. పాశుపతశాఖ తమిళ దేశమునుంచి ఉత్తరమున కాంధ్రదేశములోనికి తరువాతి కాలములో వ్యాపించినట్లు కనిపిస్తుంది. అథర్వశిరోపనిషత్తు, అథర్వశిఖోపని షత్తు, నీలరుద్రోపనిషత్తు, కైవల్యోపనిషత్తులలో పాశుపత సిద్ధాంత మునకు మూలాధారములు కనిపిస్తున్నవి. వాయుపురాణములో దీని ప్రస్తావన అధికముగా ఉన్నది.

లాకులశైవము పాశుపతశాఖలో అంతర్భాగమై ఉంటుంది. లాకుల మనగా గద. గదను ధరించిన విగ్రహములు క్రీ. శ. 125-

౧౮౦సం॥రములమధ్య రాజ్యము చేసిన కుషనురాజయిన హువిష్కుని నాణెములమీద కనబడడముచేత, అవి లకులీశుని విగ్రహములై ఉండవచ్చునని ఫ్లీటుపండితుడు తలంచినాడు. గదాధరత్వమేకాక లకులీశుని విగ్రహలక్షణములలో ఊర్ధ్వలింగత్వము, నగ్నత్వము కూడా ఒకటిగా ఉన్నది. మహాభారతములో ఊర్ధ్వలింగత్వము, స్థిరలింగత్వము, ఉర్ధ్వరేతస్త్వము, మహాశేఫత్వము, నగ్నత్వము, శివునికి చెప్పబడినవి కాని, శివునికి లకులీశ డనేపేరు కాన రాదు. వాయుపురాణములో కల్పవర్ణన మయినతరువాత, ఇప్పటి కల్పములో ఇరవైయెనిమిదియుగము లుంటవనిన్ని, ప్రతియుగము లోను శివు డవతరిస్తా డనిన్ని, కృష్ణుడు వాసుదేవుడుగా అవతరించి నప్పుడు శివుడు కాయారోహణమనే స్థలమువద్ద స్మశానములో ఒక మృతకళేబరములో ప్రవేశించి, లకులి అనే యోగివేషముతో అవత రిస్తా డనిన్ని, అతడు కుశికుడు, గార్గ్యుడు, మిత్రుడు, కౌరష్యుడు అనే నలుగురుశిష్యులతో పాశుపతయోగము నభ్యసిస్తాడనిన్ని ఉన్నది. శివు డిట్లు కాయావరోహణముచేసిన స్థలము భారుకచ్ఛదేశములోని దనిన్ని, అందుచేత ఆ స్థలమునకు కాయావరోహణమనేపేరు కలిగిన దనిన్ని రాజపుత్రస్థానములోని ఉదయపురమునకు ౧౪ మైళ్లదూర ంరములో ఉన్న ఏకలింగజీ ఆలయములోని ఒక శాసనములో చెప్పబడినది. చింత్రప్రశస్తి అనే గ్రంథములో లకులీశుడు లాటదేశ ములోని కారోహణమనేచోట అవతరించినాడని ఉన్నది. ఈకారో హణమే నేటి బరోడాసంస్థానములోని కార్వారట. ఆగ్రామములో లకులేశ్వరాలయ మున్నది.

లాకులశైవశాఖను గురించి ఆర్. డి. భండార్కారుపండితుడు విపులముగా పరిశోధనముచేసి వ్రాసినాడు. క్రీ. శ. ఏడో శతాబ్దము లోని ఒక లకులేశ్వరాలయమును గురించి ఫెర్గ్యుసన్ పండితుడు

ప్రస్తావించినాడు. లకులేశ్వరవిగ్రహములు రాజపుత్రస్థానమునుంచి మైసూరువరకున్ను కనబడుతున్నవి. గుజరాతు, రాజపుత్రస్థానము లలో లకులేశ్వరారాధన ఉన్నది.

బళ్లారిజిల్లా, బళ్లారితాలూకా, ఒరువాయిగ్రామములోని శక ౧౦౭౧ సం॥రపు ఒక శాసనములో కాళిదేవుని భక్తుడయిన భీమ రాసిపండితుడు లకులాగమసంప్రదాయస్థుడని చెప్పబడినది. అదేజిల్లా, హడగల్లితాలూకా మోరిగేరి గ్రామములోని ఒక శాసనములో సింహపర్షెకు చెందిన లకులీశసంప్రదాయస్థులయిన పండితుల పేళ్లు న్నవి. ఈ శాసనము శక ౯౬౭ సం॥రమునాటిది. ఉత్తరార్కాడు జిల్లా, వందవాసితాలూకా, మేల్పాడిగ్రామములోని ఒకశాసనములోను (క్రీ.శ.౧౦౨౧) దక్షిణార్కాడుజిల్లా, తిరుకోయిలూరుతాలూకా, జంబైగ్రామములోని ఒక శాసనములోను (క్రీ. శ. ౧౦౬౯) లకులీశ్వరపండితు డొక డుదాహరింపబడినాడు. పై మేల్పాడి లోని లకులీశమతము రాజపుత్రస్థానములోని కారోహణమతమునకు శాఖ అని హుల్ట్జ్ పండితుని అభిప్రాయము. చెంగల్పట్టుజిల్లా, సైదా పేటతాలూకా, తిరువొత్రియూరులోని గౌరీశ్వరాలయములోని శివవిగ్రహము లకులీశ్వరునిదే అని గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టుగా రన్నారు. లాకులసంప్రదాయముకూడా ఆంధ్రదేశములోనికి తరు వాతికాలములో వచ్చిఉంటుంది.

కాపాలికశాఖకూడా పాశుపత సంప్రదాయములోనిదే. చెంగ ల్పట్టుజిల్లా, సైదాపేటతాలూకా, తిరువొత్రియూరిలోని ఒకశాస నములో (క్రీ. శ. ౧౧౮౧) వాగీశ్వరపంతుడనేవాడు ఆలయములో సోమసిద్ధాంతమును బోధిస్తూఉండేవాడని తెలుసబడినది. సోమసిద్ధాం తము కాపాలికసంప్రదాయమునకు సంబంధించినది. కాపాలికులకు మహావ్రతు లనికూడా పేరున్నది మహావ్రతులు అనేవారు తిరువొత్రి

యూరుశాసనములోనే కాక, రామనాథజిల్లా, అరుప్పకోట్టై తాలూకా, పళ్లిమడగ్రామములోని శాసనములలోకూడా కనబడుతున్నది. ఆంధ్రదేశములో ఈశాఖ వ్యాపించినదో లేదో తెలియదు.

దక్షిణ హిందూదేశములో కాలాముఖులనే పేర కొందరు శైవసంప్రదాయస్థులపేళ్లు శాసనములలో కనబడుతున్నవి. బళ్లారి జిల్లా, బళ్లారితాలూకా, కురుగోడుగ్రామములోని ఒకశాసనములో (క్రీ. శ. ౧౧౭౫) కాలాముఖుడయిన అమృతాశిదేవునిపే రున్నది. అదేజిల్లా, అదేతాలూకా, సిందిగేరిగ్రామములోని ఒకశాసనములో (క్రీ. శ. ౧౧౪౩) నిర్వాణదేవునిపే రున్నది. ఇతడు కుమారదేవుని శిష్యుడు. కుమారదేవుడు త్రిలోచనదేవుని శిష్యుడు. ఆతడు ఏళ్ కోటి చక్రవర్తి అనే అపరనామముగల వామదేవుని శిష్యుడు. వామదేవుడు ముళుసంద గ్రామములోని స్వయంభూదేవాలయములోని కాలాముఖాచార్యుడు. చెంగల్పట్టుజిల్లా, మదురాంతకంతాలూకా, తిరువానక్కోయిల్ గ్రామములోని ఒకశాసనములో (క్రీ. శ. ౧౨౩౧?) గోమడత్తు జ్ఞానరాసిపండితుడు, శైలరాసిపండితుడు, అనే కాలాముఖాచార్యులపే ళ్లున్నవి. ఉత్తరార్కాడుజిల్లా, వందవాసి తాలూకా, వేడల్ గ్రామములోని ఒక శాసనములో (క్రీ. శ. ౯౨౪) కాలాముఖు డయిన దాసపూరియన్ అనేవానిపే రున్నది. ఇతడు హారీతగోత్రుడు, ఆపస్తంబసూత్రుడు. కాలాముఖులు శాక్తేయు లని బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ పీఠికలో వ్రాసినారు. ఏమో చెప్పలేము. కాలాముఖు లాంధ్రదేశములో ఉండినట్లు గుంటూరుజిల్లా, సత్తెనపల్లెతాలూకా, సత్తెనపల్లె గ్రామములో దొరకిన ఒక తామ్రశాసనములో కాలాముఖాచార్యులు కొంద రుదాహరింపబడ్డారు. ఈ శాసనము తూర్పు చాలుక్యరాజయిన రెండో అమ్మరాజు కాలమునాటిది. శక ౮౯౦ సంవత్సరము నాటిది.

గోరక్షనాథ సంప్రదాయ మొకటి పాశుపతములో అంతర్భాగమైనది. ఇది ఉత్తరహిందూస్థానములో మిక్కిలి ప్రచారములో ఉన్నది.

మాధవాచార్యుడు రసేశ్వరసంప్రదాయము నొకదానిని శైవసంప్రదాయములలో పేర్కొన్నాడు కాని, అది యిప్పు డంతరించిన ట్లున్నది.

పైని వివరించిన శైవసంప్రదాయమువారు కాక ఆగమముల నాధారముగా చేసుకొన్న శైవసిద్ధాంతసంప్రదాయమువారు దక్షిణదేశములో ఎక్కువగా ఉన్నారు. కాశ్మీరదేశపు శైవ సిద్ధాంతమునకును దాక్షిణాత్యాగమిక శైవసిద్ధాంతమునకును కొన్ని పోలికలున్నవి గాని, దాక్షిణాత్య సంప్రదాయము కాశ్మీరమునుంచి దక్షిణమునకు వచ్చినదని చెప్పడానికి వీలులేదు. ఉత్తర హిందూస్థానములో కాశ్మీరసంప్రదాయ మెక్కువగా వ్యాపించలేదు.

శైవాగమములు శివపరములుగా కొన్ని, రుద్రపరములుగా కొన్ని ఉన్నవి. కామిక, యోగజ, చింత్య, కరణ, అజిత, దీప్త, సూక్ష్మ, సహస్ర, అంశుమాన్, సుప్రభ (సుప్రభేద), అనే ఆగమములు శివపరములు. విజయ, నిశ్శ్వాస, స్వాయంభువ, ఆగ్నేయక, భద్ర, రౌరవ, మకుట, విమల, చంద్రహాస (లేక చంద్రజ్ఞాన), ముఖయుగ్బింబ (లేక ముఖబింబ), ఉద్గీత (లేక ప్రోద్గీత), లలిత, సిద్ధ, సంతాన, నారసింహ,(లేక సర్వోక్త, లేక సర్వోత్తర), పరమేశ్వర, కిరణ, పర (లేక వాతూల), అనే ఆగమములు రుద్రపరములు. మొత్తము ౨౮ ఆగమములలో ఒక్కొక్కదాని కనుబంధములుగా కొన్ని ఉపాగమము లున్నవి. అన్నీ కలిసి ఆగమగ్రంథముల సంఖ్య ౧౫౦ గా చెప్పబడుతున్నది.

కాశ్మీరదేశములో శైవాగమములు వేదములవలె ప్రమాణము లుగా స్వీకరింపబడినవి. క్రీ. శ. ౮౫౦ సం॥ర ప్రాంతములో శివ సూత్రము లనే గ్రంథము బయలుదేరినది. ఈ సూత్రములకు స్పంద కారికలు రచింపబడినవి. ఈ రెండింటిని ఆధారముగా చేసుకొని క్రీ. శ. ౯౦౦ సం॥ర ప్రాంతములో సోమానందుడు శివదృష్టి అనే గ్రంథమును రచించినాడు. శివదృష్టిలో అద్వైతము ప్రతిపాదింప బడినది. కాని, శంకరాద్వైతమునకున్ను దీనికిన్ని భేద మున్నది. జీవి సాధనమూలముగా శివునితో ఐక్యమును ప్రత్యభిజ్ఞామూలముగా సాధించవలెను. ప్రపంచము మాయ కాదు, అది ఆభాసము. శక్తి ద్వారా శివుడు ప్రపంచముగా పరిణమిస్తాడు. ఈపరిణామము శివునికి తెలిసేజరుగుతుంది. కాని, ఈశ్వరునికి గల ప్రపంచపరిణామ జ్ఞానమునకున్ను సాధకునిజ్ఞానమునకున్ను భేద మున్నది. ఈ పరిణా మము సాంఖ్యసిద్ధాంతము ననుసరించే చాలామట్టు కుంటుందిగాని, కొన్ని ముఖ్యభేదము లున్నవి. ఈసిద్ధాంతములోని తత్త్వమునకు త్రిక మనిపేరు. శివుడు, శక్తి, అణువు, లేక పతి; పాశము; పశువు; అనేవే త్రికము. ఈత్రికమునకు ప్రతిభిజ్ఞనుకూడా చేర్చవలెను. మాధవ రచితమైన సర్వదర్శనసంగ్రహములో ఈ సిద్ధాంతమును గురించిన వివరములు విపులముగా తెలుపబడినవి. ఆగమములు సాధారణముగా ద్వైతసిద్ధాంతమును బోధిస్తవి. శంకరాచార్యుని అద్వైతసిద్ధాంతము నకు ఆగమములబోధనల ననుసంధింప ప్రయత్నించడముచేత ఈ శివా ద్వైతసిద్ధాంతము బయలుదేరిన దని తజ్ఞులు చెప్పుచున్నారు. కాశ్మీరశైవసిద్ధాంతమునకు నానాటికిన్ని ప్రచారము తగ్గిపోతున్నది.

తమిళదేశములో బయలుదేరిన శైవసిద్ధాంతము ద్రావిడ మనిన్ని, సాంస్కృతిక మనిన్ని రెండు భేదములుగా కనబడుతున్నది. సాంస్కృతికశైవసిద్ధాంతమును మాధవుడు తన సర్వదర్శనసంగ్రహ

ములో వివరించినాడు. ఆ దర్శనమునకు ప్రమాణములుగా ఆరుఆగమ ముల నుదాహరించినాడు. ఈసిద్ధాంతము సంస్కృతభాషలో తెలుప బడినది. కాని, దానిని తెలిపే ఆగమములు కొన్నితప్ప తక్కిన వాఙ్మయమంతా ఖిలమైపోయినది.

ఈ సాంస్కృతికశైవసిద్ధాంతమునకున్ను ద్రావిడశైవసిద్ధాంతము నకున్ను భేదము లేదని కొందరంటారు. కాని, సాంస్కృతికసిద్ధాంతము ననుసరించేవా రందరున్ను బ్రాహ్మణులు. సిద్ధాంతము శివిశిష్టాద్వైత ప్రతిపాదకము. తమిళగ్రంథములలో తెలుపబడినశైవము ననుసరించే వా రందరున్ను బ్రాహ్మణేతరులు. వారిది భేదాభేదసిద్ధాంతము, లేక శివాద్వైతము.

తమిళగ్రంథములలో తెలుపబడిన శైవసిద్ధాంతమును ప్రతిపాదించినవారిలో జ్ఞానసంబంధర్, అప్పర్, సుందరమూర్తి- అనే వారు ముఖ్యులు. వీరిని త్రిమూర్తు లంటారు. వీరిలో మొదటి యిద్దరున్ను ఏడోశతాబ్దమువారు. మూడోవాడు ఎనిమిదోశతాబ్దములోనో తొమ్మిదోశతాబ్దములోనో ఉండేవాడు- వీరిపాటలు శివభక్తితో నిండిఉంటవి. జ్ఞానసంబంధుడున్ను, అప్పరున్ను ఆగమములను స్మరించలేదు. సుందరమూర్తి వాటిపేరునుమాత్ర మెత్తినాడు. వీరికి పురాణేతిహాసములే ముఖ్యములు. తిరుమూలుడు (క్రీ. శ. ౮౦౦) శివ తిరుమంత్రమనే గ్రంథములో ఆగమసిద్ధాంతమును ప్రతిఫలింపజేసినాడు. అతని తరువాత మాణిక్కవాచకుడు (క్రీ. శ. ౯౦౦) తిరువాచకమును రచించినాడు. ఈ గ్రంథము తమిళవాఙ్మయమునకు శిరోరత్నముగా ఉన్నది. కావ్యముగానే కాక భక్తిప్రతిపాదక గ్రంథము గాను తత్త్వబోధకగ్రంథముగాను ఇది మహాప్రసిద్ధిని పొందినది. ఆతరువాత పదోశతాబ్దములో పట్టిణత్తుప్పిళ్లై శివభక్తిప్రధానము లయిన చాలా గేయములను వ్రాసినాడు. ఇవికూడా మతవాఙ్మయములో ప్రధాన

స్థానము నాక్రమించినవి. రాజరాజచోళునికి (క్రీ. శ. ౯౮౫-౧౦౧౪) సమకాలికుడయిన నంబి ఆండార్ నంబి జ్ఞానసంబంధర్, అప్పర్, సుందరమూర్తుల పాటలనన్నిటిని ఒకచోటచేర్చి దేవారమ్ (దేవహారము) అనే సంపుటముగా కూర్చినాడు. రాజరాజు నాటికి ద్రావిడసంగీతమునకు మేళగించి ప్రధానశైవాలయములలో నిత్యపాఠము జరిగేటట్లు ఏర్పాటుచేసినాడు. పూర్వపువైదిక సంప్రదాయమునకు భంగము కలుగకుండా దేవారమునుకూడా పఠింపజేసి శివపూజావసరములకు రాజరాజు గొప్పశోభను కల్పించినాడు. నంబి తిరుమురళ్ అనే గ్రంథమునుకూడా కూర్చినాడు. తనకాలములో ప్రచారములో ఉన్న శైవగీతములనన్నిటినీ పదకొండు గ్రంథములలో ఈతడు చేర్చినాడు. ఈ గ్రంథసంచయమునకే తిరుమురళ్ అని పేరు. పండ్రెండో శతాబ్దములో దీనికి పండ్రెండో గ్రంథము మరొక్కటి చేర్చబడినది. ఈ గ్రంథమే పెరియపురాణము. దీనిని శెక్కిరరు రచించినాడు. వీనిలో అఱువత్తుమూవరనబడే శైవభక్తులచరిత్రములు డెబ్భైరెం డధ్యాయములలో వివరింపబడినవి. తమిళశైవులకు పెరియపురాణము చాలా ప్రీతికరమైన గ్రంథము. ఈ కాలములోనే కంజీవరవాసి అయిన కాంజీఅప్పరు స్కాందపురాణమును కంద పురాణమనేపేర తమిళములో వ్రాసినాడు.

ఇంతవరకున్ను తమిళశైవులకు సిద్ధాంతగ్రంథ మేదన్నీ లేకుండేది. ఈ లోపము పదమూడు పధ్నాలుగో శతాబ్దములలో తీరినది. తమిళశైవమునకు సిద్ధాంతమును కల్పించినవారిలో ముఖ్యుడు మెయ్కండదేవుడు- ఇతడు శూద్రుడు. ఇతనిశిష్యు లీ సిద్ధాంతమును వ్యాపింపజేసినారు. పాల్కురికి సోమనాథునికి వీరు తరువాతివారు కాబట్టి ఈ సిద్ధాంతభాగముతో మనకు పనిలేదు.

వీరశైవసిద్ధాంతము తమిళశైవసిద్ధాంతము ననుసరించిన దని చెప్పడానికి సందేహము లేదు.

తమిళశైవభక్తులయిన నాయనారులచరిత్రములు దేశమందంతటా వ్యాపించినవి. అఱువత్తు మూవురేకాక ఇతరులైన తమిళశైవభక్తులున్ను తమిళదేశములోనే కాక ఆంధ్రకర్ణాటక దేశములలోనున్ను పూజ్యులయినారు. సిద్ధాంతభాగము కొంతవరకు ఆగమములమీదనున్ను చాలావరకు శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములమీదనున్ను ఆధారపడినది. బసవనికి పూర్వ మీసిద్ధాంతమునకు వీరశైవ మనే పే రుంన్నదో లేదో చెప్పలేము-

వీరశైవులకు మూలపీఠము లైదున్నవనిన్ని, వాటిని పంచాచార్యులనబడే ఏకోరామ, పండితారాధ్య, రేవణ, మరుళసిద్ధ, విశ్వారాధ్యులనేవారు క్రమముగా హిమాలయములలోని కేదారము, కర్నూలుజిల్లాలోని శ్రీశైలము, మైసూరు పశ్చిమభాగములోని బాళేహళ్లి, బళ్లారిజిల్లాలోని ఉజ్జయిని, కాశి, అనేస్థలములలో స్థాపించినారనిన్ని చెప్పుతారు. ఇప్పుడా పంచసింహాసనములున్ను ఉన్నవి. ఇప్పటివీరశైవు లీ పంచాచార్యులను స్మరిస్తారు. కాని, ఇంత ప్రసిద్ధులయిన ఆచార్యుల పేర్లను సోమనాథుడు తన బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో ఎత్తలేదు- ఏకాంతరామయ్య, రేవణదేవడు అనేవారి నాతడు స్మరించినాడు. వీరే ఏకోరామ, రేవణు లని అనుకొన్నా, వీరు బసవనికి సమకాలికులయిన సాధారణభక్తులుగా వర్ణింపబడినారు కాని మతస్థాపకాచార్యులుగా స్మరింపబడలేదు- అయినా తరువాతి కాలపు కన్నడ వీరశైవ కవులందరున్ను వీరిని స్తుతించినారు. వీరినిగురించిన విషయములు కన్నడ వాఙ్మయమునుంచి తెలియవచ్చినంతమట్టు కిక్కడ తెలుపుతున్నాను.

రేవణసిద్ధుడు కొల్లిపాకలోని మహాలింగగర్భమునుంచి బయలువెడలినాడు, చాళుక్యరాజు కొక సురియను చూపినాడు, విక్రమునికి సురియ నిచ్చినాడు, వైష్ణవచోళుని వాదములో గెలిచినాడు, రాజేంద్రచోళుడు మొదలయిన రాజుల కూతుళ్లను పెండ్లాడినాడు.

ఇతనికొడుకు రుద్రముని. ఇతని నుద్దేశించి రేవణసిద్ధేశ్వరపురాణము మొదలయిన గ్రంథములు బయలుదేరినవి.

మరుళసిద్ధుడు కగ్గల్ల గవుడనికి కొడుకుగా దొరకినాడు. జజ్జగంతను ధరించి కొల్లాపురపురాక్షసిని చంపి, దాని అవయవములతో కిన్నరవీణను చేసుకొన్నాడు. పిచ్చివానివలె ఉండి ఉజ్జయినిలో బయలయినాడు.

పండితారాధ్యుడు మల్లికార్జున పండితారాధ్యుడే అని కొందరంటారు. కాదని కొందరంటారు. పండితారాధ్యు లనేకు లున్నారు.

ఏకోరామతందె చెన్న ముద్రాపురపు భక్తుల గర్భములో జనించినాడు. ఘంటాకర్ణ గణనాథాచార్యునివల్ల ఉపదేశమునుపొంది శివమహత్త్వాధిక్యమును శాస్త్రపూర్వకముగా శివభక్తులకు బోధించినాడు. అనేకవాదులనుజయించినాడు. ముద్రాపురపువీరభాస్కరనృపతివైష్ణవమతోద్ధారకుడున్ను షట్శాస్త్రపారగుడున్ను అయిన వ్యాసుడనే విద్వాంసునికి మర్యాదచేయడముచూచి, అతనిని వాదములో ఓడించి, అతనికి రామనాథాచార్యుడనే పేరుపెట్టినాడు. భోగమల్లికార్జున లింగాలయమునకు వచ్చి, ఆలింగగర్భములో చేరినాడు. దేవాంగపురాణమనే కన్నడగ్రంథములో దేవాంగన ఏడో అవతారమైన దేవదాసనికి ఏకోరాముడనే ఒకకొడు కున్నట్టున్ను, అతడు జైనమతస్థురాలయిన బిజ్జలునిభార్యను శైవమతస్థురాలుగా చేసినట్టున్ను వ్రాయబడినది.

విశ్వేశ్వరాచార్యునికే విశ్వారాధ్యుడని మరిఒకపేరు. ఇతనిని గురించి విశేషముగా ఏమిన్ని తెలియరాకున్నది. పదహారో శతాబ్దమువాడయిన సిద్ధనంజేశుడనే కర్ణాటకవి తన గురురాజచరిత్రములో 'ఈశ్వరుడే విశ్వేశ్వరుడై ధరను పాలించినా'డనిన్ని, ఇతనిశిష్యుడు పంచవణ్ణిగెయస్వామిఅనే పేరుగలసదాశివాచార్యుడనిన్ని చెప్పబడినది.

## ౧౩

# అఱువత్తుమూవురు

తమిళ దేశములో శైవభక్తికి ప్రసిద్ధికెక్కినవారు క్రీ. శ. నాలుగో అయిదో శతాబ్దములనుంచిన్ని కనబడుతున్నారు. బౌద్ధ, జైనమతవ్యాప్తి నరికట్టడాని కాకాలములో శైవము భక్తిరూపముగా పొడచూపినది. ఈ భక్తి కేవలము బ్రాహ్మణులలోనేకాక సకల వర్ణములవారిలోను వ్యాపించినది. భక్తుడయినవానికి జాతివర్ణములతో భేదములేదనే సంప్రదాయము వ్యాపించినది. ఈ భక్తిసంప్రదాయము ననుసరించిన అనేకశైవభక్తులు తమిళదేశములో వెలసినారు. వారిలో అరనైముగ్గురు పరమభక్తాగ్రేసరులుగా పరిగణింపబడుతున్నారు. వీ రందరున్ను క్రీ. శ. ఎనిమిదో శతాబ్దమునుంచి పదోశతాబ్దమువరకు ఉన్నవారు. వీరిమాహాత్మ్యములను గురించి శేక్కిలార్ అనే తమిళ కవి పండ్రెండో శతాబ్దములో తాను రచించిన పెరియపురాణములో వర్ణించినాడు. అఱువత్తుమూవురమాహాత్మ్యకథలు తొలుత కన్నడ దేశములో వ్యాపించినవి. పాల్కురికి సోమనాథునిమూలమున అవి పదమూడో శతాబ్దాంతములో తెనుగుదేశములోకూడా వ్యాపింప నారంభించినవి కాని, అంత ప్రచారములోనికి రాలేదు. అఱువత్తుమూవురు సేక్కిలారుకే పురాతను లయినారు. అతడు వారి పేళ్లను సరిగా తెలిపినాడో లేదో చెప్పలేము. కన్నడ భాషలోనికి వచ్చేసరికి అవి కొంత వికారమును పొందినవి. సేక్కిలారు చెప్పినపేళ్లు కొన్నిలోపించినవి; కొన్ని క్రొత్తగా చేరినవి. పాల్కురికి సోమనాథుని గ్రంథములలో ఆ పేళ్లింకా వికారమును పొందినవి. ఈవికారము తమిళశైవమున్ను, ఆంధ్రకర్నాటక వీరశైవమున్ను సాధారణజనులలో వ్యాపించడముచేతను, వారికి తమిళసంప్ర

దాయము తెలియకపోవడముచేతను, భాషాసంప్రదాయానుసారముగా మార్పులుపొందడముచేతను, వీరశైవగ్రంథముల వ్రాతప్రతులను వ్రాసినవారు అరువత్తుమూవుర సంప్రదాయముతో కాని, వారి పేర్లతో గాని పరిచయములేని వారై ఉండడముచేతను కలిగి ఉంటుంది. ఈ అఱువత్తుమూవురలోనివారి కథలలోను మూడుభాషల గ్రంథముల లోను కొన్ని భేదములు కనబడుతున్నవి. ఈ అఱువత్తుమూవురనే నాయనార్లనికూడా అనడము కలదు. వీరిలో ఎవరిని నిశ్చయముగా ఆవర్గములో చేర్చవచ్చునో నిశ్చయించడము కష్టము. ఈ విషయమై తమిళదేశములోనే పరిశోధనము జరుగలేదు. నాకు తెలిసినంతమట్టుకు (౧) పెరియపురాణము (తమిళము) (౨) స్కాందోపపురాణము (సంస్కృతము) (౩) శివరహస్యము (సంస్కృతము) (౪) శివభక్త మాహాత్మ్యము (సంస్కృతము) (౫) అరవత్తుమూవరపురాతనచరిత్రె (కన్నడము, వచనము) (౬) త్రిషష్టిపురాతనచరిత్రె (చంపువు, కన్నడము, కర్ణాటకకవిచక్రవర్తిరచితము) (౭) అరివత్తుమూవర పురాతనశరణచరిత్రె (కన్నడము, పద్యకావ్యము, విరూపాక్షకవి రచితము) (౮) త్రిషష్టిపురాతనవిధి (కన్నడము) (౯) హాలాస్య మాహాత్మ్యము (సంస్కృతము, తెనుగు) (౧౦) భువనకోశము (౧౧) కన్నడబసవపురాణము (౧౨) తెనుగుబసవపురాణము (౧౩) పండితారాధ్యచరిత్రము (౧౪) శాసనములు—వీటిననుసరించి నిర్ణయింప ప్రయత్నిస్తాను.

(౧) అడిభక్త: తమిళములో ఇతనికి అడిపత్తన్, అతిభక్తర్, అనిపేర్లు. బెస్తవాడు. తనకు ప్రతిదినమున్ను దొరికిన మొదటిచేపను శివుని కర్పించే వ్రతముకలవాడు. ఒకనాడు బంగారుచేప దొరకగా వెనుదీయకుండా శివుని కర్పించినాడు. పండితారాధ్యచరిత్రములో ఇతనిపేరుమాత్రమున్నది. పైకథ బసవపురాణములో చెప్పబడినది. (పుట. ౧౩౬.)

(౨) అరివాళు : అరివాళ్ తొండనాయనార్, అని, తమిళము. శూద్రుడు. ఇతనికి సంకులాదాయుడనికూడా పేరున్నది. శివుని కారగింపు పెట్టడానికి వండిన అన్నము నతని భార్య తలమీద పెట్టుకొని పోతూఉండగా బురదలో కాలుజారి అన్నమంతా పోగా, అరివాళుడు తనతలనే అర్పింప నుద్యుక్తుడైనప్పుడు శివుడు ప్రత్యక్షమై మెచ్చుకొన్నాడు. తెనుగు బసవపురాణములోనికథ ఇది (పుట ౧౩౫) అతడు త్రికాలములోను లింగమునకు రాజనపుబియ్య మారగింప బెట్టుతూ ఉండడముచేత ఇంటిలో బియ్య మయిపోవడముచేత, కొడవలిపట్టుకొని, కూలికిపోయి రాజనముల సంపాదించి తనవ్రతము నెరవేరుస్తూ ఉండేవాడు. కొన్నాళ్ల కాకూలికూడా దొరకలేదు. ఐదుదినము లుపవాస మున్నాడు. ఎట్లో మరునాడు రెండుకుంచముల రాజనములు కూలిదొరికినది. దానిని సంభ్రమముతో శివుని కర్పించడానికి తెస్తూ ఉంటే అవి క్రింద నెరియలలోపడి ఎత్తడానికి వీలుకాలేదు. అప్పు డతడు కొడవలితో గొంతుక కోసుకొన నుద్యుక్తుడు కాగా శివుడు ప్రత్యక్షమై అతనిని వారించినాడు.

(౩) ఇరువదాండారి : ఇరువత్తు డనికూడా పేరున్నది. తమిళములో ఇరిపత్తునాయనార్, ఇరిభక్త అని పేళ్లు. సంస్కృతములో శరభక్తుడు. పండితారాధ్యచరిత్రములో ఇతనిపేరుమాత్ర మున్నది. బసవపురాణములోని ఇతనికథ ఇట్లున్నది. ఇతడు శివద్రోహరగండడు. పాతకులను కారణము లేకుండగనే చంపుతానని ఇతని వ్రతము. ఒకనా డొకభక్తుడు శివపూజకు పూవులుకోసుకొని యింటికి వస్తూ ఉండగా ఒక ఏను గతని కెదురై తొండముతో పైకెత్తి క్రిందికి పడవైచి దంతములతో పొడిచినది. అతని ఆర్పును ఇరువదాండారి విని వచ్చి ఏనుగును చంపి మావంతుని చంపినాడు. ఈ సంగతి ఆ ఊరు

రాజయిన కరయూరిచోడుడు విని వచ్చి, భృత్యాపరాధమునకు స్వామిని దండించవలెననే న్యాయము చొప్పున తానే చావడానికి సిద్ధముకాగా, శివుడు ప్రత్యక్షమై ఇరువదాండారిని రాజునుకూడా కైలాసమునకు తీసుకొనిపోయినాడు. తమిళములోని కథ కొంచెము భేదముగా ఉన్నది. పొఘళ్ చోళుడనే రాజు ఏనుగు శివకాముడనే భక్తుడు పూజకోసము తీసుకొని పోతూవున్న పూలసజ్జను తొండముతో లాగి కాలిక్రింద వేసి తొక్కడము చూచి ఇరువత్తరు ఆ ఏనుగును చంపినాడు. రాజతనిని మెచ్చినాడు. ఈ రాజు పేరు మనుచోళుడు, అనపాయచోళుడు, పొగళ్ చోళుడు అని వివిధముగా చెప్పబడినది. మనుచోళుని గురించికాని, పొగళ్ చోళుని గురించి కాని శాసనములవల్ల ఏమిన్ని తెలియదు. త్రిభువనచక్రవర్తి కులోత్తుంగచోళదేవుడనే రాజకేసరివర్మ తంజావూరు జిల్లా, నాగపట్టణము తాలూకా, తిరువారూరు గ్రామములో వేయించిన శాసనములో అతనిపేరు అనపాయుడని తెలుపబడినది, (ద. ఇం. ఎపి. రిపోర్టు. ౧౯౦౧ సం.రం. ౨౬౯ సం.) ఈతడు రెండో కులోత్తుంగచోళుడు. ఇతడు క్రీ. శ.౧౧౩౨ సం. రములో రాజ్యమునకు వచ్చినాడు. దీనినిబట్టి పెరియపురాణమును రచించిన సేక్కిలారు ఈ రెండో కులోత్తుంగుని కాలమువాడనిన్ని, కాబట్టి పన్నెండో శతాబ్దమువాడనిన్ని కొందరు చెప్పతున్నారు. పైకథ సేక్కిలారుకు చాలాకాలము పూర్వమందే జరిగి ఉండవలెను కాబట్టి అతడు కులోత్తుంగునితరువాత ఒకశతాబ్దమయినా తరువాతివాడై పాల్కురికి సోమనాథునికి సమకాలికుడు కావలెనని నా అభిప్రాయము. సోమనాథునికి పెరియపురాణముసంగతి తెలియదు.

(౪) ఎల్లమ: బసవపురాణపీఠికలో 'ఎల్వ' అని ప్రభాకర శాస్త్రులుగారు దీనికి పాఠాంతర మిచ్చినారు. ఇతనిపేరు బ. పు.

పం. చ. లలో లేదు. తమిళములో ఈ పేరుకు దగ్గరగా ఉన్న పేరు గల ఇయర్పగైనాయండనయినార్ అనేవా డున్నాడు. ఇతనికి ఐహిక రిపు, స్వభావరిపు అని సంస్కృతములో పేళ్లు. కొన్ని తమిళగ్రంథములలో ఇత డొక తమిళరాజుగాను, కొన్నిటిలో వైశ్యుడుగాను వర్ణింపబడినాడు. ఒక శైవభక్తుడు కోరగా తనభార్యనే అతని కర్పించినాడు. తనబంధువులు వారించగా వారిలో చాలామందిని చంపినాడు.

(౫) ఏణాధినాథుడు: తమిళములో ఏణాదినాయన్. తెనుగు బసవపురాణములోని కథ ఇది. (పు. ౧౩౬): ఇత డేలాపురమునకు రాజు. దేశములను జయిస్తూ కప్పములను బలాత్కారముగా తీసుకొంటూ ఉంటే, వారొక దళవాయిని పంపినారు. ఏణాధినాథు డతని నెదురుకొన్నాడు. కాని, అతని భూతిరుద్రాక్షధారణమును చూచి ఖడ్గమును విడిచి అతని కాళ్లమీద పడినాడు. వా డూరుకోకుండా ఖడ్గముతో నరకుతూఉంటే రాజు 'శివ, శివ' అనగానే, ఆ వ్రే టతని కంఠములో పువ్వులదండ అయినది. శివు డతనికి ప్రత్యక్షమై అక్షరత్వము నిచ్చినాడు. పెరియపురాణములో ఈకథ కొంచెము భేదముగా ఉన్నది. ఇతడు నానావిధాయుధప్రయోగములలో నిపుణుడు. ఒకనా డతిశూరుడనే ఒకయోధునితో అతనికి ద్వంద్వయుద్ధము సంభవించినది. ఆ యోధుడు ధరించిన భూతిరుద్రాక్షములవల్ల అతడు శివభక్తు డని తెలుసుకొని రాజు తన ఖడ్గమును విడిచి పెట్టినాడు.

(౬) ఒణుమూర్తి: బసవపురాణములో ఎణుమూర్తి అని ఉన్నది. ఇతనికథ తమిళములో లేదు. బసవపురాణములోని కథ ఇది (పుట ౧౩౮): ఇతడు తన ప్రాణలింగమునకు నిత్యమున్న మేలి చందన మర్పించే వ్రతముకలిగి దాని నాచరిస్తూ ఉండగా దగ్గరనున్న

ధనమంతా వ్యయమయినది. తన వ్రతమును నిలుపుకొనడాని కతడు తన మోచేతిని సానమీద నూరి అర్పింపగా అదే చందనమయినది. ఈ భక్తికి మెచ్చి మృడు డతనిని తన విమానములో తీసుకొని పోయినాడు.

(౭) కడమలనంబి : ఇతడు శివునికి నిత్యనేయేసి అఖండదీపములను వెలిగించే వ్రతముకలవాడై ధనమంతా వెచ్చపెట్టి, మరేమీ లేక పోగా తనజుట్టును నిప్పంటించుకొని తానే అఖండదీపముగా వెలిగినాడని బసవపురాణములో ఈతనికథ చెప్పబడినది. ఈతని పేరును దగ్గరగా ఉండే పేళ్లుగల ఇద్దరు నాయనార్లు పెరియపురాణములో ఉదాహరింపబడినారు. వారిలో ఒకడు అయ్యడిగళ్ లేక కాడవర్ - కో - నాయనార్. ఇతడు కంచి రాజధానిగా ఏలిన పల్లవరాజు. ఇతనికి సింహాంక, పాదసింహ, పంచపాదసింహ, అనికూడా పేళ్లున్నవి. ఇతనితండ్రి భీముడు లేక భీమవర్మ అని పై పురాణములో ఉన్నది కాని, శాసనముల ప్రకారము భీముడు సింహాంకునికొడుకు. ఇతడు క్రీ. శ. ౫౫౦ ప్రాంతములవాడు. ఇతడు విస్తారమైన తనరాజ్యపు ఆదాయము నంతటిని శివాలయములు, శివారామములు, శివకూపములు, శివతటాకములు, శివునిసత్రములు కట్టించడమునకు వినియోగించినాడు. రెండోవాడు కడుమారనాయనార్ లేక దీర్ఘమారుడు. ఇతడే మధుర నేలిన కూనపాండ్యుడు, లేక కుబ్జపాండ్యుడు. జినసేన, భట్టాకలంకాది జైనాచార్యుల మూలమున జినదీక్షను తొలుత స్వీకరించినా, ఇతనిని తిరుజ్ఞానసంబందరు మళ్లీ శైవములోనికి త్రిప్పినాడు. జుట్టుకు నిప్పట్టించుకొన్నవాడయిన కణ్ణంపాలుడు లేక కణోలపుడు అనేవానికథ ఒకటి పెరియపురాణములో ఉన్నది.

(౮) కన్నప్ప : కాళహస్తివాడు. శివునికి కన్ను లర్పించి, ముక్కన్నుపొందిన సుప్రసిద్ధభక్తుడు. బోయకులమువాడు. ఉడుమూరి కన్నప్ప అనిన్ని ఇతనికి పేరు.

(౯) కరయూరిచోడడు: ఇతడే మనుచోళ, అనపాయచోళ, పొగళ్ చోళ అనే పేర్లుకలవాడు. శివశాసనధరులను తన ప్రాణలింగములుగా భావిస్తూఉండేవాడు. ఒకనాడీరాజు శత్రువులనుచంపి నారి తలలను ముప్పైపొణకలలో తేగా, ఆతలలో ఒకటి హరభక్తునితల వలె జడలతో కనిపించినది. అది చూచి రాజు తనతలను కోసి ఆ తలపై పెట్టగా శివు డతనిని కైలాసమునకు తీసుకొనిపోయినాడు. ఈకథ బసవపురాణములోనిది. ఇదే కొంచెముమార్పులతో పెరియపురాణములో ఉన్నది. పొగళ్ చోళనాయనారు చోళరాజు. ఆతనిరాజధాని క్రావేరిపొంబట్టణము. గిరిదుర్గములో ఉన్న అధికుడనే రాజుమీది కితడు దండనాయకుని సేనతో పంపగా, నాడు శత్రువుల తలలను తెచ్చినాడు. వాటిలో ఒకటి జటలతోను భూతిరుద్రాక్షములతోను ఉండడము చూచి రాజు అగ్నిప్రవేశము చేయడానికి సిద్ధముగా ఉండగా శివు డడ్డపడినాడు. కన్నడములో ఇతనిపేరు కరవూరిచోడ అని ఉన్నది.

(౧౦) కలిగణనాథుడు: ఇతనిపేరు పం. చ. లో ఉన్నది. బ. పు. లో లేదు. పెరియపురాణము ప్రకార మీతడు శైవభక్తులకు నిరతాన్నదానముచేసే వ్రతము కలవాడనిన్ని, తిరుజ్ఞానసంబందరుకు సమకాలికు డనిన్ని తెలుస్తున్నది.

(౧౧) కలికామదేవుడు: ఇత డొక చోళరాజు సేనానాయకుడు. మానకంజనదీశుని అల్లుడు. సుందరనంబి మిండెతలతోగూడి భోగలోలుడై ఉండడము చూచి అతనిమొగము చూడనని పంతము పట్టినవాడు. బసవపురాణములో ఒడయనంబి ఇతనిని లంజెయింటికి పనిమీద పంపగా ఇతడు పో నిరాకరించినా డని ఉన్నది. (పుట. ౧౩౨.)

(౧౨) కళియంబ: పెరియపురాణములో ఇతనిపేరు కలికంబ అని ఉన్నది. ఇతడు చోళరాజు. ఇతడు కులమును విచారించ కుండా శివభక్తుడెవడైనా సరే కాళ్లు కడిగి పూజించేవాడు. ఒకనా డతనిసేవకుడే శివభక్తులతోకూడి రాగా, రా జతనికాళ్లుకడుగడాని కుద్యుక్తుడై భార్యను నీళ్లు పోయుమన్నాడు. ఆమె సందేహించడము చూచి ఆమె రెండుచేతులను నరకి తానే కాళ్లుకడిగి అందరితో బాటు వానికిన్ని విందారగింపజేసినాడు. ఈకథ బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో కూడా ఉన్నది.

(౧౩) కాళవ్వ: కరికాళవ్వ అనిన్నీ పేరున్నది. సంస్కృత ములో పూతవతి. శివుడీమెయింట 'మామిడిపండులమఱుఁగున నమలి' నాడట. (బ.పు. ౬.౯) పెరియపురాణముప్రకార మీమె వైశ్యస్త్రీ. భర్త తనకిచ్చిన రెండు మామిడిపండ్లను గంపలకొద్దీ పండ్లగా మార్చి శివుని కారగింపజెట్టినది.

(౧౪) కులచ్చిరియారు: బసవపురాణములో కులచ్చిరియారు. పిళ్లనయనారు జైనుల నోడించి మధురరాజుకు శివదీక్షయిచ్చి, జైనుల నినుపశూలములతో పొడిపించినప్పు డాశూలములను బాసగా కాల్చి యిచ్చిన శివభక్తుడు. ఇతనిని నాయనారుగా పెరియపురాణము పేర్కొలేదు.

(౧౫) కోల్పులి: కొల్పులి అని బసవపురాణపీఠికలో ప్రభాకర శాస్త్రిగా రిచ్చినపాఠము. పెరియపురాణములో ఇతనిపేరు కొట్పులి నాయనార్; సంస్కృతములో వీరశార్దూలము. ఇతడొక చోళరాజు సేనానాయకుడు. అతడు శివభక్తులకోసము గా దెలలో ధాన్యము నిలువజేసి యుద్ధమునకు పోయి ఉండగా, అతని బంధువులువచ్చి ధాన్యము నుపయోగించుకొన్నారు. అత డింటికివచ్చి,

వృత్తాంతమును తెలుసుకొని వారి నందరిని చంపివేసినాడు. ఈ కథ కొంతకల్పనతో పండితారాధ్యచరిత్రములోని కెక్కినది.

(౧౬) గుగ్గులుకలియారు: తమిళములో కంగులినాయనార్. బసవపురాణములో ఇతనికథ ఇట్లున్నది. ఇతడు త్రికాలములలోను శివునికి గుగ్గులుధూపమువేసే వ్రతముకలవాడై, ధనమంతా వ్యయము కాగా ఆలిమంగళసూత్రమునుకూడా అమ్మివేసినాడు. తిరుపరంధాము మనేపురములో ఉరగేశ్వరలింగము ముందట ఉరగకన్యకలు పాడగా, పారవశ్యముచేత లింగము ముందుకు వ్రాలినది. లింగమును సరిగా నిలుపడానికి రాజెన్నో ప్రయత్నములు చేసినాడుగాని సాధ్యము కాలేదు. అప్పుడు గుగ్గులుకలియారు రాజువద్దకు పోయి తనకు కావలసినంత గుగ్గిలమిస్తే లింగమును సరిగా నిలబెట్టుతానన్నాడు. రాజొక గుగ్గిలపురాశి నివ్వగా, కలియారొకబట్టను చించి దాని ఒకకొనను లింగమునకున్ను, రెండోకొనను ఖడ్గమునకున్ను కట్టి, ఖడ్గము మెడమీద పెట్టుకొని వెనుకకు నిగుడడము చూచి నాగేసు డెప్పటివలె నిలిచినాడు.

(౧౭). చండుడు: చండేశు డనికూడా పేరున్నది. ఇతడు బ్రాహ్మణుడు. ఒక ఆవులకాపరి ఆవులను హింసించడముచూచి సహించక తానే నాటికి కాపరిగా ఉండడమున కొప్పుకొన్నాడు. ఆవులపాలు పిండి శివలింగమున కభిషేకము చేస్తూఉండడము చూచి ఆవులకాపరులతనితండ్రితో చెప్పగా తండ్రి అతనిని దండింపవచ్చినాడు. చండుడు కోపముతో తండ్రి నొకకట్టెతో చావమోదినాడు. ఇది చూచి శివుడు మెచ్చుకొన్నాడు. ఈకథ పండితారాధ్యచరిత్రములో కూడా ఉన్నది.

(౧౮) చిఱుతొండడు: సుప్రసిద్ధ శివభక్తుడు. దభ్రభక్తుడని కూడా ఇతనికి పేరు. ఒక చోళరాజు సేనానాయకుడు. పశ్చిమ

చాలుక్యులరాజధాని అయిన వాతాపి (బాదామి) దుర్గమును పట్టుకొని దానిరాజును (రెండోపులకేశిని) తనరాజు కొప్పజెప్పినాడు. ఇతని కొడుకు సిరియాలుడు (శ్రీలాలు డనిన్ని పేరున్నది.) చిఱుతొండడు శివునికోరికచొప్పున కొడుకును చంపి అతనిమాంసము నారగింపు చేసినాడు. దానికి మెచ్చి శివుడు సిరియాలుని (శ్రీలాలుని) బ్రతి కించినాడు.

(౧౯) చిఱుత్తొణ: చిఱుతొణు అని బసవపురాణ పీఠికలో పాఠము. తమిళములో నరసింగమొనయర్, నరసింగమునయార్, శిరత్తుతొనాయనార్ అనిన్ని, సంస్కృతము లో రణమిత్ర డనిన్ని పేళ్లున్నవి. నరసింహముని శివభక్తుడయిన రాజనిన్ని, అతడు సుందర నంబిని కొడుకుగా పెంచుకొన్నాడనిన్ని తమిళపురాణము చెప్పు తున్నది. శిరత్తుతొనాయనారు ప్రత్యేకశివభక్తుడుగా పెరియపురాణ ములో పేర్కొబడ్డాడు. కంచిలోని పల్లవరాజయిన కళర్చింగ నాయనారనే పాదసింహునిభార్య శివనిర్మాల్యమైన పూలదండను వాసన చూచినదని ఆమెముక్కును కోసివేసినాడు. కళర్చింగనాయ నారుకూడా పెరియపురాణములో అఱువత్తుమూవురలో చేర్చబడి నాడు. భార్య శివనిర్మాల్యమయిన పూలదండను చేతితో తీసి వాసన చూచిన దని ఆమెచేతిని నరకివేసినాడు.

(౨౦) చిఱుపులియారు: తమిళములో శిఱుపులి; సంస్కృత ములో నిరోధిశార్దూలుడు. ఇతడు తనయింటికి వచ్చిన శైవభక్తుల కందరికిన్ని విందుచేసే వ్రతముకలవాడు.

(౨౧) చీరాలదేవుడు: చిఱుతొండనికొడుకు. ఇతనిమాంస ముతో తండ్రి శివునికి విందుచేయ నుద్యమించగా శివు డితనిని బ్రదికించినాడు. తంజావూరుజిల్లా, నన్నిలంతాలూకా, తిరుచ్చెం గాట్టంగుడిగ్రామములో సీరాలదేవునిమంటప మున్నది. చిఱుతొండ

డిగ్రామమువాడట. జ్ఞానసంబందరుకు సమకాలికుడట. చిఱుతొండని విగ్రహము తంజావూరులో ప్రతిష్ఠింపబడినది. (ద. హిం. శా. ౨. ౧౭౨. ద. హిం. ఎ పి. రిపోర్టు. ౧౯౧౩ సం.రము నం ౫౯ రులో చిఱుత్తొండనంబి సీరాలదేవుని భక్తుడని చెప్పబడినది. చిఱుతొండడు కొడుకు కీదేవుని పేరుపెట్టియుంటాడు.

(౨౨) చెన్నయ్య: ఇతనిని పాల్కురికి సోమనాథుడు మాత్రము అఱువత్తు మూవురలో చేర్చినాడు. చెన్నయ్య యింటిలో శివుడు పులియంబకళము జుర్రినాడట.

(౨౩) చెలఁది: ఈపేరు పండితారాధ్య చరిత్రములో అఱువత్తుమూవురలో చేరినది. కాళహస్తిలింగమునీద సాలెగూటి నల్లి ఏనుగను చంపినందున ఈచెలఁదికూడా అఱువత్తు మూవురలో చేరినదేమో.

(౨౪) చేదిరాజయ్య: ఇతనికి సిద్ధిరాజనికూడా పేరున్నది - పరరాజులను యుద్ధములో చంపుతూఉండగా శత్రువులు పదుముగ్గురకు భూతి రుద్రాక్షములు తగిలించి శివభక్తుల వేషముతో ఎదురుపంపగా ఇతడు వారిని చంపక విడిచినాడని బసవపురాణములో ఉన్నది. పెరియపురాణములోనికథ వేరుగా ఉన్నది. తన సామంత రాజులలో బౌద్ధ మతావలంబి అయిన ఒకడు శైవునివేషము వేసుకొని ఒకనాటిరాత్రి నిరాటంకముగా రాజుకోటలోనికి పోయి, శైవధర్మమును బోధిస్తానని చెప్పగా రాజతనియెదుట మోకరించి తలవంచి వింటూఉన్న సమయములో ఆకపట శైవుడు రాజు తల మీద గాయము చేసినాడు. రాజసేవకులతనిని పట్టుకొన్నారు. చేది రాజు కైలాసమునకు పోతూ ఆరాజును హింసించవద్దనిన్ని, అతనిని కోటలో సురక్షితముగా విడిచిపెట్టవలసినదనిన్ని చెప్పినాడు.

(౨౫) చేరమరాయడు : ఇతనికి పెరుమాళు డని నామాంతరము. ఇతడు మిఱుమిండనికిని, సుందరనాయనారుకును సఖు కాలికుడట.

(౨౬) చోడడు : ఈ పేర పండితారాధ్య చరిత్రములో ఆఱువత్తు మూవురలోని ఒక డుదాహరింపబడినాడు. ఏచోడడో తెలియదు.

(౨౭) జడయారు : జడైనాయనారు, నీలజ్ఞాని కపర్ది, అని నామాంతరములు. ఇతడు తిరుజ్ఞానసంబంధికి తండ్రి.

(౨౮) తిరుకురిపి తొండడు : తిరుకురు తొండనాయనార్, విచారభక్తుడు, అని నామాంతరములు. చాకలి. శైవభక్తులబట్టలను కూలిలేకుండా ఉతికేవ్రతము కలవాడు. ఒకనాడొక వృద్ధ శైవ భక్తుడు తన మురికిబట్ట నుతకడానికిచ్చినాడు - మేఘములు క్రమ్మడముచేత సాయంత్రమునకు బట్ట యెండినదికాదు. తనమాట చెల్లించుకోలేకపోయినానుకదా అని అతడు గొంతుకకోసుకొనడానికి ప్రయత్నపడగా శివు డడ్డపడినాడు.

(౨౯) తిరునాళ్లపోవ : తిరునాళ్ పోవర్, తిరునాళ్ పోవన్ శ్వాగంత్రి, అని నామాంతరములు. చండాలుడు. ఇతడే చిదంబర నివాసి అయిన నందుడు.

(౩౦) తిరునీలకంఠడు: యాల్పానాయనారని నామాంతరము. గొప్ప సంగీతవేత్త, చేరమరాయనిచేత అనేక బహుమానములను పొందినవాడు.

(౩౧) తిరునీలనక్క : నీలనక్క డని నామాంతరము. శివ లింగముమీద ఒకచెలదిపట్టు పెట్టగా ఇతనిభార్య దానిని తననాలుకతో తొలగించినది. అది తెలిసి ఇతడు భార్యను విడిచిపెట్టజూచినాడు. శివు డట్లు చేయగూడదని చెప్పినాడు.

(32) తిరుమూలదేవుడు: మూలదేవు డని నామాంతరము. ఉత్తరాపథమువాడు. వైష్ణవుడు. ద్రావిడదేశములో సంచారము చేస్తూఉండగా, ఒకచోట ఆవులకాపరి ఒకడు చచ్చి పడి ఉన్నాడు. ఆవు లతని కళేబరమును విడువక అక్కడనే కన్నీళ్లు కారుస్తూ నిలబడినవి. అతనికి జాలి కలిగి యోగ బలముచేత తనదేహము నొక పొదచాటున దాచి పసులకాపరిమృత దేహములో ప్రవేశించినాడు. తమకాపరి ఎప్పటివలె ప్రాణములతో ఉండడము చూచి ఆవులు మేతమేసినవి. సాయంత్ర మత డావుల నింటికి తోలుకొనిపోయి రాత్రి అచ్చటనే ఉన్నాడు. అసలు పసులకాపరిభార్య వైష్ణవమతస్థురాలు. తనభర్త శివనామస్మరణ చేయడము చూచి ఆమె ఆశ్చర్యము పొందినది. ఉదయము యథా ప్రకారముగా అత డావులను పొలమునకు తోలుకొనిపోయి తన దేహముకోసము వెదుకగా అది కనబడలేదు. అందుచేత అతడు జీవితాంతమువరకున్ను శైవుడుగానే నిలిచిపోయినాడు.

(33) అళియదంగుళినాయనారు: తెనుగు బసవపురాణము లోను సంస్కృతబసవపురాణములోను ఇట్లే ఉన్నది. కాని, పండితారాధ్యచరిత్రములో ఆళియదంగుళి నాయనా రని ఉన్నది. తమిళములో ఈళైయాండకుడిమారనాయనార్ అనిన్ని, ఈలా నందకుడిమార అని సంస్కృతములోనున్ను ఈపేరు కనబడు తున్నది. ఒకనాడు వర్షము పడుతూ ఉండగా ఒకవృద్ధ శైవభక్తుడు వడవడవడకుతూ పోవడము చూచి, అతని నింటికి తీసుకొనిపోయి, అతని చలి పోవడానికి తనపాకను కాల్చినాడు. ఆకలివేస్తున్న దంటే తొలినాడు పొలములో చల్లిన విత్తుల నూడ్చితెచ్చి, వెచ్చ చేసి, అన్నము వండి పెట్టినాడు. పాకను కాల్చిన విషయము పెరి యపురాణములో లేదు.

(౩౪) దీపదకళియారు : కలినీతి అని మరి ఒక పేరు. శివాలయములో రాత్రి అంతా దీపము వెలిగించే వ్రతము గలిగి, ధన మంతా వ్యయముచేసి చమురుకోసము తనభార్యను విక్రయింపబోగా ఎవ్వరున్ను కొనలేదు. తన వ్రతమునకు భంగమువచ్చినది కదా అని ఆత్మ హత్య చేసుకో యత్నించినాడు. శివు డడ్డపడ్డాడు, అని పెరియ పురాణకథ.

కాంచీపురములో దీపదకళియా రనేభక్తు డుండేవాడు. ఒక నా డత డొక అడవిలో జీర్ణాలయములో శివలింగమును చూచి, "అయ్యో, ఇత డెంతమందినో సంహారించినాడు. చాలామంది శత్రువు లున్నారు. ఇట్లొంటరిగా ఉంటే అపాయము వస్తుంది." అని అక్కడ నొక పెద్దకోటను కట్టించి కోటచుట్టూ రాత్రిపూట జోడుదివిటీలు వెలిగించి కావలికాస్తూ ఉండేవాడు. కొన్నాళ్ల కతని దగ్గరఉండే ధనమంతా అయిపోయినది. అప్పటినుంచిన్ని కట్టెగిట్టె, చిదుగుచిట్ర వెలిగించి కొన్నాళ్లు గడపినాడు. ఒకనాడు అవికూడా దొరకకపోగా తన తల వెంట్రుకలను జడగా అల్లి వెలిగించినాడు. ఇట్లు మండిపోతూఉంటే శివుడు ప్రత్యక్షమై అతనిని అచ్చటికోటతోకూడా కైలాసమునకు తీసుకొనిపోయి నాడు. ఇది తెనుగుబసవపురాణపుకథ.

(౩౫) నంగ : చందన (స)ంగ అని బసవపురాణము. సంగ శవ్వ అని మరొక పేరు. ఈమె చిఱుతొండని భార్య; సిరియాలుని తల్లి - ఈమెయే పిట్టినంగ కావచ్చును.

(౩౬) నమిత్తాండియూరు : నాట్యనమిత్తండి, దండియడిగళ్ అని నామాంతరములు. ఇతడు కంచిలో ఏకామ్రనాథుని గుడికి పోయి నటేశ్వరవిగ్రహమును చూచి నాట్యభంగిమములో ఉన్న ఆవిగ్రహమును తలచి, శివునికి వాయురోగము వచ్చినదని

భ్రమించి, అక్కడి అర్చకుడైన కూత్తాడి నాయనారితో "ఏమయ్యా! శివు డెట్లా రోగముతో బాధపడుతూ ఉంటే, మందు వేయకుండా ఊరకొంటావు?" అని అడిగినాడు. పూజారి నవ్వి విగ్రహస్వరూపమును తెలియజేసినా, నమిత్తాండి ఒప్ప కొనక, వాయుతైలము చేసి విగ్రహమునకు మర్దించి, ఆకులు అలములు వెచ్చచేసి కట్టి, ఎన్నితంటాలు పడినా, విగ్రహమునకు వంకర పోలేదు. అందుచేత నమిత్తాండి తన్నే అర్పించి రోగము మాని పిస్తానని ఆత్మహత్యకు తలపడగా శివుడు ప్రత్యక్షమై తనతాండవ మూర్తిస్వరూపము నతనికి బోధచేసి విమానములో అతనిని కైలాస మునకు పంపివేసినాడు. ఇది తెనుగుబసవపురాణములోనికథ.

పెరియ పురాణములో ఇతనికి దండియడిగళ్, అనిన్ని సంస్కృతములో చండిభక్తు డనిన్ని పేళ్లు. తమిళ పురాణము ప్రకా రము ఇత డంధుడు. శైవులకోసము నూతిని త్రవ్వ నారంభించగా జైను లతనిని చూచి నవ్వినారు. వారిని గణించక అతడు నూతిని పూర్తిచేసి, దృష్టిని పొందినాడు.

(౩౭) నమినంది: నేమినంది అని మరొక పేరు. ఇతనిది శైల్లత్తిరువాలూరు - భర్గునకు నిత్యము నేతితో నేయిదీపములు వెలి గించే వ్రతము గలవాడు - జైనులత డట్లు చేయడము చూచి ఓర్వ లేక, ఊరిలో అతనికి నేయి దొరకకుండా చేయగా, నమినంది ఆత్మార్పణమున కుద్యుక్తు డైనాడు. శివుడతనితో "భయములేదు. చెరు వులోని నీళ్లతో దీపములు వెలిగించు! జైనుల పశువులన్నీ చచ్చే టట్లు చేస్తాను" అన్నాడు. అత డట్లే చెరువునీళ్లతో వేలకొద్దీ దీపాలు వెలిగించినాడు. జైనుల పశువులన్నీ చచ్చినవి. జైనులు భయ విభ్రాంతులు పొంది నమినందికాళ్లమీద పడగా అతడు వారి పశు వులను బ్రదికించి వారి నందరినీ శైవులుగా చేసినాడు.

(౩౮) పరమనాచి : ఈమె గొప్ప భక్తురాలు - గయకుపోయి పితాళ్లకు పిండములు వేయవక్కరలేదని చెప్పి చెల్లితిరువాలూరిలో వీథులలో పిండములను వేయించి వేలకొద్దీ పితాళ్లను రప్పించినది. హరుడు నంబికిన్ని ఈమెకున్ను మధ్య కుంటెన పోతూ ఉండేవాడు.

(౩౯) పిట్టి: పిట్టవ్వ అని మరొకపేరు - ముదిగొండవాస్తవ్యురాలు - కరికాలచోడుడు కావేరికి కట్ట కట్టిస్తున్నాడని తెలిసి తానున్ను వెట్టికి పోయినది.

(౪౦) పిల్లనాయనారు : తిరుజ్ఞాన సంబందర్ ఇతడే. శంకరాచార్యుడితనిని శివానందలహరిలో 'ద్రవిడశిశు'వని మన్నించినాడు. వాగీశనాయనారు, సక్కనాయనారు, స్కందనాథుడు, కులపతుడు, హరదత్తాచార్యుడు, ఇతనికి సమకాలికులు. ఇతడు తిరుమంగై ఆళ్వారుతో సంభాషించినట్టు చెప్పుతారు. ఇతడు శివుని అవతారమని శైవులవిశ్వాసము. మధురరాజయిన కుబ్జపాండ్యునికి జ్వరము రాగా అతనిజైనగురువు లయిన జినసేనుడు మొదలయినవారు తమ మంత్రతంత్రములతో కుదుర్చలేకపోయినారు. జ్ఞానసంబందరు కుదిర్చి అతనిని శైవుని చేసినాడు. ఇతడు గజారణ్యమునకుపోయి చోళరాజయిన శుభదేవునికొడుకు రక్తాక్షచోళుడు ప్రతిష్ఠించిన శివలింగము నర్చించినాడు. వాదిభసింహుడనే ప్రసిద్ధజైనాచార్యుడీతనితో శైవమతాధిక్యమునుగురించి చర్చించినాడట. ఇతనికథ బసవపురాణములోను, పండితారాధ్యచరితములోను వర్ణితము లయినవి.

(౪౧) పూసలనాయనారు : పోసలనాయనారు, భోసలుడు, అని నామాంతరములు. బ్రాహ్మణుడు. హృదయమునే శివాలయముచేసి మానసికపూజతో శివుని మెప్పించినాడు.

(42) మంగయక్కరసి: సుందరపాండ్యునిభార్య. ప్రాగ్వాళ్ చోళుని (కరయూరిచోళుని) కూతురు. తనభర్తను శైవునిగా చేయడములో తిరుజ్ఞానసంబందరుకు తోడ్పడినది.

(43) మానకంజారుడు: మానకంజర, మానకంజనదీశ, అని నామాంతరములు. చోళరాజు. ఇతనికూతురు పెండ్లిపీటలమీద కూర్చుంపెగా ఒకశైవభక్తుడా మెజుట్టును అర్థించగా, వెనుదీయక కత్తిరించి ఇచ్చినాడు.

(44) మారఁడు: ఏమారడో తెలియదు. ఇతనిపేరినిమాత్రము సోమనాథుడఱువత్తుమూవురసంఖ్యలో చేర్చినాడు.

(45) మిఱుమిండయారు: తమిళములో మిఱెమిండర్, విరన్ మిండర్, శంసనాయనార్ అని ఇతనిపేళ్లు. వీరమిండడని సంస్కృతములో పేరు. సుందరనంబియారు మిండెతల సంగతిని తగిలి ఉండడము చూచి అతనిమొగము చూడనని శపథము చేయగా శివుడు వారిద్దరికిన్ని సమాధానము కుదిర్చినాడట. ఇతడు చేళొండ నివాసి. నెలనెలను శివరాత్రినియమము తప్పక పంద్రెండేళ్లు చెల్లించినాడు.

(46) మురుఘు: మురుహ అని నామాంతరము. శూద్ర శైవుడు, దినదినమును శివునికి పూలదండల నర్పించే నియమము కలవాడు - మూర్ఖ నాయనారని సంస్కృతములో ఇతనిపేరు. పండితారాధ్య చరిత్రములోని ఇతని కథ ఇది: ఇతడు జూదగాడు. తాను జూదములో గెలిచిన ధనమును శైవభక్తులకోసము వినియోగించేవాడు. ఒకనాడు హరుడే అతనితో జూదమాడవచ్చి, ఓడిపోయి, పణము నివ్వలేకపోగా, మూర్ఖుడు హరునితలను కాళ్లకు బట్టతోకట్టి ధట్టించినాడు. శివుడు నిజరూపము చూపి, ఏమికావలెనని కోరగా,

నీవు నా కివ్వవలసిన ధనమును జంగములకు వినియోగించు మని చెప్పినాడు.

(౪౬) మొన్నయగరుడు : నరసింగ మొన్నయనారని మరొక పేరు - ఇతని భార్య ఒకనాడు లింగ నిర్మాల్యమైన చెంగల్వ పూవును మూర్కొనగా పూజారి ఆమెముక్కును కోసినాడు. ఆమె చెలికత్తె లీవిషయము రాజుతో చెప్పగా అతడు భార్యను పిలిపించి వాసనచూచిన ముక్కుకంటె పూవును ముట్టినచేతిని ముందుగా నరకవలెనని బాడితతో ఆమెచేతిని నరకినాడు.

(౪౭) రోహిణి: ఈమె ఎవతో తెలియదు. పండితారాధ్య చరిత్రములో చెప్పబడిన అఱువత్తుమూవుర సంఖ్యలోని కెక్కినది.

(౪౮) వాగీశనైనారు: అప్పర్ అని తమిళపుపేరు; ధర్మసేనుడని సంస్కృతములో పేరు. బ్రాహ్మణుడు. గొప్పవిద్వాంసుడు. ఇత డొదుకో జైనుడయి అనేక జైనగ్రంథములను వ్రాసినాడు. ఇతని చెల్లెలి భర్త యుద్ధములో చనిపోగా ఆమె మళ్లీ పెళ్లిచేసుకోకుండా నిలిచినది. ఈమె శైవభక్తురాలై అన్న జైనుడుగా ఉండడము సహించలేకపోయేది. అప్పరుకు గొప్పరోగ మంకురించినది. జైనుల మందులకు మంత్రాలకు అది లొంగలేదు. శైవమంత్రముల చేతను, భూతిపూతలచేతను నయమైనది. అంతటితో అతడు మళ్లీ శైవభక్తుడయినాడు. సంస్కృతములోను తమిళములోను ఇతడు రచించిన అనేకములయిన పాటలున్నవి. ఇతడు తిరుజ్ఞానసంబందరుతో మధురకుపోయి కూనపాండ్యుడు శైవుడుగా మారడానికి తోడ్పడినాడు.

(౪౯) వీరచోడుడు : వీరచోడు లనేకు లున్నారు. వారిలో ఇత డెవ్వడో తెలియదు.

(౫౦) వీరపెర్మాండి. ఇత డెవరో తెలియదు. పశ్చిమగాంగ రాజయిన కొంగుణిఅరసర్ అనే వానికి పెర్మానడి అనేపేరున్నది.

(౫౧) సంగ: సంగునాయనారని నామాంతరము. వీరమిండ, మెఱెమిండ అనికూడా పేళ్లున్నవంటారు. అయితే మిఱుమిండ నాయనారే ఇత డవుతాడు. పాల్కురికి సోమనాథునికి మిఱుమిండనాయనారే సంగునాయరన్న సంగతి తెలిసిఉండకపోవచ్చును.

(౫౨) సాంఖ్యతొండడు: సక్కినాయనారు, శాక్యనాయనారు, అని నామాంతరములు. బ్రాహ్మణుడు. తొలుత బౌద్ధుడై తరువాత శైవు డయినాడు ఇతనికి పువ్వులు దొరకకపోగా శివుని రాళ్లతో పూజించినాడు.

(౫౩) సోమాసి: ఏకాసిసోమాసి అని సోమనాథుడు వ్రాసినాడు. సోమాసిమారనాయనార్ అని తమిళములో పేరు. సోమయాజి అని సంస్కృతపుపేరు. బ్రాహ్మణుడు. ఇతడు యజ్ఞముచేస్తూ ఉండగా అక్కడ కొకచండాల శైవభక్తుడురాగా అతనిని పూజించడము చూచి ఋత్విక్కులయిన బ్రాహ్మణులు యజ్ఞశాలను విడిచి పోయినారు. శివుడు ప్రత్యక్షము కాగానే వారందరున్నువచ్చి యజ్ఞమును పూర్తి చేసినారు.

ఇంత వరకున్ను పండితారాధ్యచరిత్రలో చెప్పబడ్డ అఱువత్తుమూవురిలో ఇతరాధారములవల్ల తెలియవచ్చిన శైవభక్తులను గురించి వివరించినాను. తక్కిన పదిమందిని గురించిన్ని వివరములు తెలియవు. పెరియపురాణము మొదలయిన గ్రంథములలో అఱువత్తుమూవురలో అప్పాదినాయనారు, అమరనీతి, అయ్యడిగళ్ లేక కాడరర్ కోనాయనారు, కారినాయనారు లేక కారినాథ, కుత్తువనాయనారు లేక కృతాంతక, కులబఱై నాయనారు లేక కుల

పక్షీ, కెరనాయనారు లేక స్నేహనాథ, చొక్కనాయనారు, పర మల్లైతె కురుంబర్ నాయనారు లేక మిథిలాద్విజ, మూర్తి నాయనారు లేక మూర్తినాథ లేక ఉలఘుంఠమూర్తి, యస్యజ్ఞాని, రుద్రపశుపతి, వాయిలారునాయనారు లేక వాగ్మి, సత్తినాయ నారు లేక శక్తినాథ, అనేపేళ్లు తెలియవస్తున్నవి. వీరిలో యస్య జ్ఞాని జ్ఞానసంబందరు తల్లి. అమరనీతి, చొక్కనాయనారు, అనేవారు అఱువత్తుమూవరలో చేరకపోయినా, బ. పు., పం. చ. లలో గొప్ప శైవభక్తులుగా చెప్పబడ్డారు. బసవపురాణపీఠికలో 'కారి' అనే పేరు పం. చ. లోని అఱువత్తుమూవురగణనములో పాఠాంతరముగా చేరినది. తక్కినవారినిగురించి నిర్ణయించడాని కాధారములు లేవు.

పై నుదాహరించినవారిలో జ్ఞానసంబందర్, అప్పర్ అనేవారు మాత్రము చారిత్రకపురుషులుగా కనబడుతున్నారు. తమిళవిద్వాం సులు మరికొందరినికూడా చారిత్రకపురుషులనుచేయడానికి తంటాలు పడుతున్నారు. కాని వారి ఊహ లిప్పటికి సరి అయినవని చెప్పడానికి ధైర్యముచాలదు. వీరుకాక తక్కిన అనేకులు చారిత్రకపురుషులయి ఉంటారా? కవులున్ను, భక్తులున్ను కల్పించినవారయి ఉంటారా? అనే ప్రశ్నల కిప్పటి చారిత్రిక పరిశోధనావస్థలో, సమాధానము చెప్పడము కష్టము. ఇట్లుండగా శిలాశాసనములలోను, తామ్ర శాసనములలోను, అఱువత్తుమూవురలో కాని, వీరశైవ గ్రంథకర్తల ఇతర గ్రంథములలో గాని, కానరాని నాయనార్ల పేళ్ల నేకములు కానవస్తున్నవి. అట్టివారిలో కొందరిపేళ్లు నీ క్రింద ఇస్తున్నాను:

అంజాద పెరుమాళ్ నాయనార్, అప్పండినాయనార్, అంబలింగముడైయనాయనార్, అముదన్ తిరుచ్చిట్రంబలముడై యార్, అమ్మయప్పేశ్వరనాయనార్, అమ్మైయప్పనాయనార్, అరైశందురై నాయనార్, అరుమొళీశ్వర ఉడైయనాయనార్, అరు

ళానాథనాయనార్, అవైయన్ పెరియనాయనార్, అళగియతిరుచ్చిట్రంబలముడైయార్ నల్లనాయనార్, అళుడైయ పిళ్ళైయార్, అవుడైయనాయనార్, ఇళంబయం గొట్టూరుడైయనాయనార్, ఉడైయార్ తిరుకళావూర్ నాయనార్, ఉలగుయ్యనాయనార్, ఉళ్లంగకుళున్దనాయనార్, ఉళ్లంగై కొణర్న్దనాయనార్, ఎన్నుడైయనాయనార్, కడారంగొండ చోళేశ్వరముడైయనాయనార్, కుట్రంపోరుత్తరులియనాయనార్, కులశేఖరముడైయనాయనార్, కొడుంగన్నముడైయనాయనార్, తొయిలుం నల్లచోళేశ్వరముడైయ నాయనార్, తిరుక్కరూరముడైయ నాయనార్, తిరుక్కళుకున్ట్రనాయనార్, తిరుకాామీశ్వరముడైయ నాయనార్, తిరుక్కాల్కోడీశ్వరముడైయ నాయనార్, తిరుకుట్రాలముడైయ నాయనార్, తిరుత్తాన్దోండ్రి - ఆలుడైయనాయనార్, తిరునల్లూర్ నాయనార్, తిరునాగేశ్వరముడైయనాయనార్, తిరునెడుంగలఉడైయనాయనార్, తిరుప్పంగాడుడైయనాయనార్, (లేక అంబుషయనాయనార్), తిరుప్పాసురుడైయనాయనార్, తిరుప్పిలావయలుడైయనాయనార్, తిరుప్పలిప్పగవనాయనార్, తిరుప్పెరుమానందనాయనార్, తిరుమండవముడైయనాయనార్, తిరుమణియూారన్ నాయనార్, తిరుమలై ఆళుడైయ నాయనార్, తిరుమలై నాయనార్, తిరుమలైయిల్ నాయనార్, తిరుమూలత్తాణముడైయ నాయనార్, తిరుమేట్తళిఉడైయ నాయనార్, తిరువగత్తీసరముడైయ నాయనార్, తిరువంజియముడైయనాయనార్, తిరువణ్ణామలైఉడైయ నాయనార్, తిరువనీశురముడైయనాయనార్, తిరువరంగిల్ అండమురని మిరుదరులిననాయనార్, తిరునాలకోయిలుడైయనాయనార్, తిరువాలుంగాడుడైయనాయనార్, తిరువీరత్తాణముడైయనాయనార్, తిరువీరనీశురముడైయనాయనార్, తిరువీర్ శోళముడైయనాయ

నార్, తిరువెల్లికీశ్మైయనాయనార్, తిరువేగంబముడైయనాయనార్, తిరువేడగముడైయనాయనార్, తుయ్యమామణినాయనార్, తురుదండేశ్వరముడైయనాయనార్, తోసుమామణినాయనార్, నర్క్కరదేవనాయనార్, నాగీశురముడైయనాయనార్, నాయనార్ తిరుక్కాళాన్ జేవిఉడైయార్, నాయనార్ తిరువణ్ణీసురముడైయ తంబిరానార్, నాయనార్ పెరియపిరాన్, నాలాయిర ఈశ్వరముడైయనాయనార్, నిన్రుళియనాయనార్, నీళళర్ శోళవనముడైయనాయనార్, పాలవణ్ణైశాయనార్, పులియూరుడైయనాయనార్, పెరియనమశ్శివాయనాయనార్, బ్రహ్మీశ్వరఉడైయనాయనార్, భీమేశ్వరముడైయనాయనార్, మణ్ణైనాయనార్, మూడందై పాగనాయనార్, మూన్రుగై ఈశ్వరముడైయనాయనార్, వరాహనాయనార్, వల్లీశురముడైనాయనార్ వాదవూర్ (వాదవురళి)నాయనార్, వాల్మీకీశ్వరముడైయనాయనార్, వీడవిడంగనాయనార్, వెణ్ణైక్కూత్తనాయనార్, వైరావన ఈశ్వరముడైయనాయనార్, శంకరనాయనార్, శివలోకముడైయనాయనార్, శోళగంగదేవనాయనార్, సోమనాయనార్, మొదలయినవారు.

పైపేళ్లలో కొన్ని ఊళ్లనుబట్టి ఆయాలింగములకు వచ్చినవి. కొన్ని భక్తులపేళ్లు. లింగ ప్రతిష్ఠలు సాధారణముగా శైవభక్తుల సమాధులమీద జరుగుతూ, ఆలింగముల కాయాభక్తులపేళ్లు కలుగుతూ ఉండడము చరిత్రప్రసిద్ధము. కొన్ని సమాధులమీద కాకుండా ప్రత్యేకముగా ప్రతిష్ఠింపబడినవిన్ని లేకపోలేదు. కాని, పురాతన దేవాలయములలో ఏవి ఎట్టివో నిర్ణయించడానికి తగిన ఆధారములు లేవు. పైని చెప్పిన అన్నీ కాకపోయినా కొన్ని అయినా భక్తులపేళ్లయి ఉంటవని నిస్సంశయముగా చెప్పవచ్చును.

నాయనార్లు వ్యాపింపజేసిన శైవము కేవల భక్తి ప్రధాన మయినది. వారిగీతములనుంచి శివజీవ సంబంధమును మన మూహించుకోవచ్చునే కాని, ఆవిషయమును స్పష్టముగా తెలియజేసే సిద్ధాంతగ్రంథ మేదిన్ని ప్రాచీనమైనది కనబడదు. వీరశైవముకూడా నాయనార్ల భక్తిమార్గమునే ఎక్కువగా అనుసరించినది. కాని, ఇది ఒకప్రత్యేక సిద్ధాంతముగా నిరూపించే గ్రంథములు బయలుదేరినవి. వాటిలో శ్రీపతిపండితుడు రచించినాడనిచెప్పబడే శ్రీకరభాష్యము పురాతనమైనదిగా కనబడుతుంది. శ్రీకరుడనే నాడొకడు ఉత్తరమీమాంసకు భాష్యము వ్రాసినాడనిన్ని, అందుచేతనే దానికి శ్రీకరభాష్యమనిన్ని, ఇప్పుడు ప్రచారములో ఉండే శ్రీకరభాష్యము శ్రీపతిపండితరచితము కావడ మసంభావ్యమనిన్ని కొందరంటున్నారు. ఈ వివాదముతో మనకు పనిలేదు. వీరశైవసిద్ధాంతస్వరూపమును మాత్ర మిక్రింద సంగ్రహముగా నిరూపిస్తున్నాను.

---

## వీరశైవసిద్ధాంతము

వీరశైవసిద్ధాంతమునకు భేదాభేదసిద్ధాంత మని పేరు. దీనిని కొందరు శివవిశిష్టాద్వైత మంటారు. కాని, శివవిశిష్టాద్వైతమునకున్ను దీనికిన్ని భేద మున్నది. శంకరాచార్యులది అద్వైతసిద్ధాంతము; రామానుజునిది వైష్ణవవిశిష్టాద్వైతము; శ్రీకంఠునిది శివాద్వైతము; ఆనంద తీర్థునిది ద్వైతము. వీరశైవము భేదాభేదసిద్ధాంతము ననుసరిస్తుంది. ఇది రామానుజు డంగీకరించిన ద్వైతభావము నంగీకరిస్తూ, నిత్యసామీప్యము, సారూప్యము, భోగమాత్రము అయిన సమత్వరూపముగల శివజీవాద్వైతమును ప్రతిపాదిస్తుంది. దీని ప్రకారము శివునికిన్ని జీవునికిన్ని అభేదత్వము చాలా కొంచెముమాత్రమే. ఇద్దరున్ను నిత్యులే; అంతటితో అభేదత్వము సరి. ఇద్దరికిన్ని భేదమే ఎక్కువ. శివుడు పూర్ణుడు; జీవు డపూర్ణుడు. ఈశ్వరుడు ప్రభువు, శక్తుడు, ముఖ్యుడు; జీవుడు భక్తుడు, అశక్తుడు, అముఖ్యుడు. ఈశ్వరుడు సర్వస్వతంత్రుడు, జీవుడు సర్వాధీనతంత్రుడు. జీవునికి సారూప్యముక్తి మాత్ర మున్నది. ఇదే శివసామరస్యము. జీవునికి సారూప్యమే కాని సాయుజ్యము లేదు. 'నిరతిశయ స్వరూపానంద సాక్షి స్వప్రకాశ శివరూప పరాహంభావాపత్తి'యే ముక్తి. ద్వైతసిద్ధాంతము ప్రకారము అయిదువిధములయిన భేదము లున్నవి, (౧) జీవేశ్వర భేదము, (౨) జీవునికిని జీవునికిని భేదము, (౩) జీవునికిని జడమునకును భేదము, (౪) ఈశ్వరునికిని జడమునకును భేదము, (౫) జడమునకును జడమునకును భేదము, అని. భేదాభేదసిద్ధాంతము ప్రకారము జీవేశ్వరులకు సంసారదశలో భిన్నత్వమున్నది. మోక్షదశలో ఇద్దరికిన్ని అభిన్నత్వము. అద్వైతములోని జగన్మిథ్యాత్వ, మాయాసిద్ధాంతము

లను భేదాభేదసిద్ధాంతవాదు లొప్పుకోరు. అట్లే, చేతనాచేతన స్వరూపమైనజగత్తు ఈశ్వరశరీరమనే విశిష్టాద్వైతవాదమునుకూడా ఒప్పుకోరు. అరీతిగానే, మోక్షదశలకు పూర్వమున్ను పరమందున్ను కూడా జీవేశ్వరులకు భిన్నత్వ మున్నదనే ద్వైతసిద్ధాంతమునున్ను ఒప్పుకోరు. శివుడే పరబ్రహ్మవాచ్యు డనే శివాద్వైతవాదుల సిద్ధాంత మునకున్ను ద్వైతాద్వైతసిద్ధాంతమునకున్ను ఆవిషయములో భేదము లేదు. కాని, చేతనాచేతన ప్రపంచము ఈశ్వరునికి భిన్నమై నది, ఈశ్వరునిమీద ఆధారపడిఉన్నది. ఈశ్వరునికే కర్తృత్వశక్తి ఉన్నది. భేదాభేదసిద్ధాంతమును విశ్వసించి షట్స్థలమనే అభ్యాస యోగము చేయుటచేత శివత్వము ప్రాప్తిస్తుంది. దీనికి ఉపాసన, ధ్యానము, ధారణము, జ్ఞానము అనేవి సాధనములు. జ్ఞానముచేతనే శివత్వము కలుగుతుంది. ఈశ్వరుడు ద్రష్టవ్యుడు, శ్రోతవ్యుడు, మంతవ్యుడు, నిదిధ్యాసితవ్యుడు. అట్లు చేస్తేనే జ్ఞానోత్పత్తి అవు తుంది. షట్స్థలజ్ఞానము లేక యోగము కుదురదు. వీరశైవ సిద్ధాంత ములో షట్స్థలజ్ఞానము చాలా ముఖ్యమయినది. కాబట్టి దానిని గురించి కొంత వివరించవలసి ఉన్నది.

## షట్ స్థలములు

భిన్నాచారములతో కూడినట్టిన్ని, భిన్నార్థ ప్రతిపాదకము లయినట్టిన్ని అనేకసిద్ధాంతములు భిన్నరుచికములై ప్రబలినవి. సాం ఖ్యము, యోగము, పాంచరాత్రము, వేదమతము, పాశుపతము, ఇవన్నీ వేదముల నాశ్రయించినవే. కాని, అవి వేదములోని కొన్ని భాగములను మాత్రమే తీసుకొని తక్కినవాటిని విడిచిపెట్టుతవి. శైవసిద్ధాంత మట్లు కాక సమస్తవేదమును ఆశ్రయించినది. కాబట్టి అది అన్నిసిద్ధాంతములకంటె ఉత్తమమైనది. కాబట్టి వేదమువలె అదికూడా పరమప్రామాణ్యమును పొందుతున్నది.

శైవాగమములు శైవము, పాశుపతము, సోమము, లాకులము అని నాలుగు భేదములుగా ఉన్నవి. వాటిలో శైవము వామము, దక్షిణము, మిశ్రము, సిద్ధాంతము, అని నాలుగు విధములు. వాటిలో వామము శక్తిప్రధానము. దక్షిణము భైరవాత్మకము. మిశ్రము సప్తమాతృపరము. సిద్ధాంతము వేదసమ్మతము. ఈసిద్ధాంతమును ప్రతి పాదించే కామికాగమములో ఉత్తరభాగములో వీరశైవసిద్ధాంతము తెలుపబడినది. 'వి' అంటే 'విద్య'; విద్యలో రమిస్తారు కాబట్టి వీరశైవు లని చెప్పబడుతారు. విద్యలో రమించేవాడు వీరుడు; శివరూపమైన విద్యలో విశేషముగా రమించేవాడు కాబట్టి వీరశైవు డనిపించుకొంటాడు. విద్యలో రమిస్తూ హేయ మైన మాయను విడిచిపెట్టుతాడు కాబట్టి వీరమాహేశ్వరు డౌతాడు. శైవులు జ్ఞాన యజ్ఞరతులు, మాహేశ్వరులు కర్మ యజ్ఞరతులు. కాబట్టి శైవు లాభ్యంతరార్చనను చేస్తారు; మాహేశ్వరులు బాహ్య పూజను చేస్తారు. శైవ మాహేశ్వరులకు భేదములేదు.

వీరశైవ సిద్ధాంతములో షట్స్థల జ్ఞానము ముఖ్యమైనది. భక్తస్థలము, మాహేశ్వరస్థలము, ప్రసాదస్థలము, ప్రాణలింగస్థలము, శరణస్థలము, ఐక్యస్థలము, అనేవి ఆరున్ను అంగస్థలములు– ఈస్థల ధర్మవిభేదముచేత వీరశైవులు భక్తాది సంజ్ఞలు గలిగి ఆరువిధములుగా ఉంటారు.

ఎవనిలో శైవభక్తి సముత్పన్నమైనదో వాడు భక్తుడు. అతడు తా ననుష్ఠింపవలసిన ధర్మములతో కూడి ఉండడము భక్త స్థలము. ఇది పిండస్థలము, పిండ విజ్ఞానస్థలము, సంసారహేయతా స్థలము, గురు కారుణ్యస్థలము, లింగధారణ స్థలము, భూతిధారణ స్థలము, రుద్రాక్షధారణస్థలము, పంచాక్షరజపస్థలము, భక్తిక్రియా స్థలము, ఉభయపూజాస్థలము, జంగమపూజాస్థలము, ప్రసాదస్వీకృతి

స్థలము, సోపాధికదానస్థలము, నిరుపాధికదానస్థలము, సహజదాన స్థలము, అని పదిహేను అవాంతరభేదములను కలిగిఉన్నది.

కేవల సహజదాన నిష్ఠాపరుడై, శివతత్పరుడై, బ్రహ్మాది స్థాన విముఖుడై ఉండేవాడు మాహేశ్వరు డనిపించుకొంటాడు. భక్తివైరాగ్యము లెక్కువ అయి, స్థిరవివేకము కలవాడే మాహేశ్వరుడు. అట్టి మాహేశ్వరధర్మమును పరిపాలించడమే మాహేశ్వరస్థలము. దీనిలో, మాహేశ్వర ప్రశంసాస్థలము, లింగనిష్ఠాస్థలము, పూర్వాశ్రమనిరసనస్థలము, సర్వాద్వైతనిరసనస్థలము, ఆహ్వానవర్జనస్థలము, అష్టమూర్తి నిరసనస్థలము, సర్వగత్వ నిరసనస్థలము, విశ్వశివస్థలము, భక్తశివత్వస్థలము, అని తొమ్మిది అవాంతరభేదము లున్నవి.

లింగనిష్ఠాదిభావముతో పాపబంధములను ధ్వంసము చేసి, మనః ప్రసాదమును కలిగి ఉండడమే ప్రసాదస్థలము. దీనిలో ప్రసాదిస్థలము, గురుమాహాత్మ్యస్థలము, లింగమాహాత్మ్యస్థలము, జంగమ గౌరవస్థలము, భక్తమాహాత్మ్యస్థలము, శరణప్రశంసాస్థలము, శివ ప్రసాదమహిమస్థలము- అని ఏడు అవాంతరభేదము లున్నవి.

పైనిచెప్పిన భక్తుడు, మాహేశ్వరుడు, ప్రసాది- అనే ముగ్గురున్ను కర్మప్రధానమైన యోగముకలవారు. వారి జ్ఞానయోగ మిక చెప్పబడుచున్నది.

లింగము చిదాత్మకమైన బ్రహ్మము. దానిశక్తి ప్రాణరూపిణి. అట్టిరూపముగల లింగమును తెలుసుకొన్నవాడు ప్రాణలింగి. ప్రాణ లింగధర్మము ననుష్ఠించడమే ప్రాణలింగస్థలము. దీనిలో ప్రాణలింగ స్థలము, ప్రాణలింగార్చనస్థలము, శివయోగసమాధి, లింగనిజస్థలము, అంగలింగస్థలము- అని అయిదవస్థ లున్నవి.

అంగలింగజ్ఞానము కలిగి తాను సతి నని భావించి, పతి అయిన శివుని ధ్యానించి, ఆధ్యానసౌఖ్యములో ప్రవేశించినవాడు శరణుడు. శరణభావమును కలిగి ఉండడము శరణస్థలము. దీనిలో శరణస్థలము, తామసవర్జితస్థలము, నిర్దేశస్థలము, శీలసంపాదనము- అని నాలుగు అవాంతరభేదము లున్నవి.

ప్రాణలింగాదియోగముచేత సుఖాతిశయము ననుభవిస్తూ శరణుడు శివునితో ఐక్యమును కల్పించుకొనడము ఐక్యస్థలము. ఇది ఐక్యస్థలము, ఆచారస్థలము, ఏకభాజనస్థలము- అని నాలుగవాంతర భేదములను కలిగిఉన్నది.

ఇంతవరకున్ను చెప్పినది షడంగస్థల వివరణము. ఇక లింగ స్థలములు చెప్పబడుతున్నవి. ఈలింగస్థలములు పైనిచెప్పిన షడంగ స్థలముల ననుసరించి ౫౪ భేదములు కలిగిఉన్నవి.

భక్తస్థలమునకు సంబంధించిన లింగస్థలములు దీక్షాగురుస్థలము, శిక్షాగురుస్థలము, జ్ఞానగురుస్థలము, క్రియాలింగస్థలము, భావలింగస్థలము, జ్ఞానలింగస్థలము, స్వస్థలము, చరస్థలము, పరస్థలము- అని తొమ్మిది.

మాహేశ్వరస్థలమునకు సంబంధించిన లింగస్థలములు క్రియాగమస్థలము, భావాగమస్థలము, జ్ఞానాగమస్థలము, సకాయస్థలము, అకాయస్థలము, పరకాయస్థలము, ధర్మాచారస్థలము, భావాచారస్థలము, జ్ఞానాచారస్థలము- అని తొమ్మిది.

ప్రసాదస్థలమునకు సంబంధించిన లింగస్థలములు కాయానుగ్రహస్థలము, ఇంద్రియానుగ్రహస్థలము, ప్రాణానుగ్రహ స్థలము, కాయార్పణస్థలము, కరణార్పితస్థలము, భావార్పితస్థలము, శిష్యస్థలము, శుశ్రూషస్థలము, సేవ్యస్థలము- అని తొమ్మిది.

ప్రాణలింగస్థలమునకు సంబంధించిన లింగస్థలములు ఆత్మస్థలము, అంతరాత్మస్థలము, పరమాత్మస్థలము, నిర్దేహాగమస్థలము, నిర్భావాగమస్థలము, నష్టాగమస్థలము, ఆదిప్రసాదిస్థలము, అంతప్రసాదిస్థలము, సేవ్యప్రసాదిస్థలము- అని తొమ్మిది.

శరణస్థలమునకు సంబంధించిన లింగస్థలములు దీక్షాపాదోదకస్థలము, శిక్షాపాదోదకస్థలము, జ్ఞానపాదోదకస్థలము, క్రియానిష్పత్తిస్థలము, భావనిష్పత్తిస్థలము, జ్ఞాననిష్పత్తిస్థలము, పిండాకాశస్థలము, బిందాకాశస్థలము, మహాకాశస్థలము, క్రియాప్రకాశస్థలము, భావప్రకాశస్థలము, జ్ఞానప్రకాశస్థలము అని పండ్రెండు.

ఐక్యస్థలమునకు సంబంధించిన లింగస్థలములు స్వీకృతప్రసాదస్థలము, శిష్టోదనస్థలము, చరలయస్థలము, అచరలయస్థలము, భాండస్థలము, భాజనస్థలము, అంగలేపస్థలము, స్వపరాజ్ఞస్థలము, భావాభావలయస్థలము అని తొమ్మిది.

మొత్తము లింగస్థలములు ఏభైయేడు.

---

## ౧౫

## సోమనాథుడు నిరూపించిన వీరశైవము

పైని వివరించిన విషయములన్నిటిని సోమనాథుడు తనకావ్యములో మేళగించి, మనకు తనకావ్యముమూలముగా వీరశైవసిద్ధాంతమును బోధిస్తున్నాడన్న సంగతిని మరపించేటట్లు కవిత్వమును సాగించినాడు. సోమనాథుడు పరమవీరశైవుడు. భవులంటే అతనికి పడదు. భవులయిన బ్రాహ్మణులను చెడాపడా తిట్టినాడు. చూడండి—

### బ్రాహ్మణనింద

సోమనాథుడు బ్రాహ్మణులను నోరారా తిట్టుకొన్నాడు. ఆనింద పండితారాధ్యుని నోటినుంచి వచ్చినట్లు వ్రాసినా, తిట్లన్నీ సోమనాథునివే.

(౧) వారిని త్రాటిమాలలు, పచ్చిమాల లన్నాడు:

శూలిభక్తుల కెత్తుకే లది ద్రాటి
మాలల కెత్తుట మఱి తప్పు గాదె."

బ. ౧౯.

మాలల యీత్రాటిమాలల, పచ్చి
మాలలమాటలు వోలునే వినఁగ ? "

బ. ౨౦౯.

అనమాత్రుఁ గొలువని యగ్రజుండైన
వసుధ మాలల మాలవాఁడకా కెట్లు

మాలఁడే యీతని మాలఁడన్ ద్రాటి
మాలలు భువిఁ బచ్చి మాలలుగాక !

బ. ౨౧౭.

మార్గమే యీద్రాటిమాలలఁ గలియ ?

బ. ౨౪౦.

పురహరార్చితునకు మున్నెత్తుకేలు
ధర నెత్తఁగూడునే ద్రాటిమాలలకు?

బ. ౨౩౭.

(౨) వారిని ద్రాటికుక్కలు, మాలకుక్క లన్నాడు:

శ్రీమహాదేవు నర్చించుచేతులను
నామాలకుక్కల నర్చింపఁదగునె ?

బ. ౨౩౭.

కుక్కయే యిది ? దీని గుక్కయన్ ద్రాటి
కుక్కలు భువిఁ జెడ్డకుక్కలు గాక !

(౨) ౧౪౨.

(3) బ్రాహ్మణులు గాడిద లన్నాడు:

...వేదభరాక్రాంతు లనఁగఁ
బడిన బ్రాహ్మణగార్దభంబులతోడఁ
... ... ... ...
బ్రతిసేసి యాడినఁ బాపంబు వచ్చు.

బ. ౨౨౫.

...'వేదభారభరాక్రాంత' యనవ
గవ 'స వై బ్రాహ్మణగార్దభ ' యన నె
గడి శ్రుతుల్ మోపరిగాడ్డులై మోవఁ
బడిన బ్రాహ్మణగార్దభంబులకంటె

(౧) ౭౫.

(౪) వారిని 'కర్మచండాలు' రన్నాడు (౧) ౭౫; వారు 'వ్రతభ్రష్టులు, పశుకర్ములు, అధికపాపాత్ములు, కర్మజీవులు, సోమపానంబు గావించు పాటులు, దుర్జాతులు' అన్నాడు. బ. ౨౨౫.

(౫) వారిని 'బాఁపనకూళఅపు' లన్నాడు. బ. ౨౧౬.

(౬) బ్రాహ్మణులు శివభక్తుని కాలిచెప్పుతో తులమూగ రన్నాడు. అందు కొక కథను కల్పించినాడు. బ. ౨౧౩.

(౭) వారియింటిపేళ్లను పేళ్లను వికారముగా కల్పించి వెక్కిరించినాడు:

గుడ్డిగోవిందుడు, కొమ్మనఘటశాళి, బమ్మనభట్టు, వామనప్పన, త్రేదులవారు, ఆదిత్యకూచి, మచ్చుతాడన, బచ్చలికేశవుఁడు, మాసకొమ్మన, సన్న్యాసివామన, కుశదర్భపిన్నయ్య, అళనమువారు,—బ. ౨౧౬.

ఎగ్గెన్న, భిన్న, మైలారు, సోమయాజులపెద్ది, వామనభట్టు, దామోదరప్పన, వామనకూచి, కేశవపుటశాస్త్రి, కేమనపెన్ని, పాళము మైలారుభట్లు, ఉపధ్యాయు చప్పట్లపెద్ది, అంశను, సూరపోతి, పప్పుకేశవుఁడు, సంబవులమాధవుఁడు, మానంబుమారన్న, మంచయ, దొడ్డదోనయభట్లు, ధూర్తవిఠ్ఠలుఁడు, చిమ్మెనమల్లి, కూచెనగారితమ్మి, కొమ్మనప్పన, బొల్లికోడెఅల్లాడి, ఉష్మమునాలిపెద్దొ్న జ్జులు,

కప్పకృష్ణమ్మ, యరగడ్డకేసునకూచి, వరిగడుప్పవారికప్పన, యాజివంగి పరకయజ్ఞమ, ఉండిభాస్కరయొజ్జ, గందిగిజైతన, కామయగ్గన, దక్షిణగోపాలమంచి, మేడిచెట్టయితన, మింఢవల్లభుఁడు, దూడ గప్పప్పన, దుష్టరాఘవుడు, ఎత్తుగా లైతన (౧) ౧౨౦-౧.

(౭) జైన బౌద్ధాదులతో బాటు బ్రాహ్మణులమీదకూడా ఎంత కోపమో చూడండి.—

కొండెంబు సెప్పు నా కుక్కలఁ జెండి,
నాలుకల్ గోసి, సున్నము సాలఁ బూసి
పోలవేఁచిన యిస్మ పోయింతు నోళ్ల.

బ. ౫౫.

శివుమీఁద నోకఁడు
గలఁ డన్న నాయలకా లెత్తి వాని
నడుదలఁ దన్నుదు, నాదుప్రతిజ్ఞ.

(౧) ౭౧౧.

(౯) వీరశైవుడు బ్రాహ్మణుని చంపుతే రా జతనిని దండింప కూడదు. ౨ (౧౭)

అయితే, సోమనాథుఁడు నిందించిన బ్రాహ్మణు లెవరు?

అతడు వేదముల ప్రమాణముల నంగీకరించినాడు. వీరశైవమత మును స్థాపించడానికి వేదములనే ప్రధాన ప్రమాణములుగా అంగీక రించినాడు. తాను చతుర్వేద పారగుడు. వేదముమీద ఆధారపడి ఉన్న స్మృతీతి హాసములుకూడా అతనికి ప్రమాణములే. కాని, వీర శైవులకు వేదాధ్యయనాధికార మున్నది. వారి యింటి కుక్కలు

కూడా చతుర్వేదములను నేర్చి ఉంటవి. కేవలము నేర్వడము మాత్రము కాదు; అవి శాస్త్రీయముగా తత్తన్మ్రాపనాదులతో కూడా వేదములను పఠించగలవు. బ. ౫ ౨౧౨. కాని, వేదములనాదులు కావు. శివుడే అనాదిపురుషుడు. విశ్వములోని సమస్తమున్ను అతనినుంచి కలిగి, అతనిమీద ఆధారపడి, అతని అనుగ్రహమువల్లనే సత్తాను కలిగి ఉన్నది. ఈ సిద్ధాంతము నామోదించినవారిమీద సోమనాథునికి ద్వేషము లేదు. సోమనాథునికి పూర్వము శివద్విజు లున్నారు. నంబెన్న = వనిత అయిన పెరియనంగ 'శివద్విజునివనిత' (౨) ౧౫౪; నంబి 'శివద్విజుఁడ, స్వాధ్యాయపరుండ' అన్నాడు (౨) ౧౬౭; నంబెన్న శివద్విజుని 'భూవిబుధేంద్ర' అని సంబోధించినాడు (౨) ౧౬౯. మల్లికార్జున పండితారాధ్యుడే 'ద్విజోత్తముఁడు, వేదవిదుఁడు (౧) ౩౧; పండితుడు పల్నాటిచోడని ఆస్థానమునకు వాదముకోసము వెళ్లినప్పు డతనివెంట—

"ఉపనిషచ్చయములు, రుద్రప్ర-
శంసాపరోక్తు లాశ్చర్యం బెలర్పఁ
బరమలింగార్చనాపరులు, స్వాధ్యాయ
పరులునై చను మహాబ్రాహ్మణోత్తములు
సదువుచు వేదభాష్యములు సెప్పుచును
ముదమున నిరుదెస మ్రొక్కుచును"

నడచినారు. (౧) ౫౧౫.

ఒకరాజు బెలిదేవి వేమనారాధ్యునికి మ్రొక్కగా అత డల్పాయుష్కుడని తెలిసినవాడు కాబట్టి ఆతడు రాజును దీవించలేదు. అందుమీద రాజు,—

సంతతాభ్యుదయ -
కరులు మహాభక్తవరులు భూసురులు
హరవేషధరు లఘుహరులు సిత్పరులు
నార్యులు, శివమతాచార్యు, లవార్య -
వీర్యులు, సన్మార్గచర్యు, లుత్తములు"

వీరని పలికినాడు. గర్భాష్టకమున వడుగుచేయడము బ్రాహ్మణా చారము. నంబికొడుకును గర్భాష్టకమున వడుగుచేయ నెంచినాడు (౧) ౧౫౪; 'చేయుము వడు గభిజిత్కాలమున' (౨) ౧౬౦, అని నంబికి నంబెన్న చెప్పినాడు. బసవనికాలమువరకున్ను శైవులలో గర్భాష్టమములోనే ఉపనయనము చేస్తూఉండేవారు. బసవేశ్వరుని తండ్రి "గర్భాష్టమమున, సుతునుపనయనంబు శుభముహూర్తమునఁ జేయుదునని తద్దఁ జిడిముడివడఁగ" ఉపనయనము వీరమాహేశ్వరా చారదీక్షితునికి తగదని తండ్రిని మందలించినాడు. "పరమాత్ముడైన శివుడే గురువు, ఇతరదుర్నరులను గురువుగా భావించడము నరక హేతువు. శైవదీక్షితుడు గతపూర్వజన్మ సంస్కారుడై మళ్లీ ద్విజత్వ మును పొందడము పతితత్వమునకు పాల్పడడమే. గురుకృప జన్మము గలవానికి కర్మజన్మము దుష్కర్మమే. గురుపాదముల నర్చించేవాడు హవిస్సుతో అగ్నినర్చించడము తప్పు. మలహరాత్మకమైన మంత్రమును నేర్చినవా డితరమంత్రములను నేర్వకూడదు. శూలిభక్తులకు నమ స్కరించే చేతులతో ప్రతిమాలలకు నమస్కారము చేయకూడదు. కర్మపాశములను తెగగొట్టుకొన్న శివదీక్షితుడు తిరిగీ "కర్మంబుత్రా ళ్ల"ను కట్టుకొగూడదు. రుద్రాక్షభసితాది ముద్రలు ధరించినవాడు క్షుద్రముద్రలను ధరించగూడదు. ఉభయకర్మలను నిర్మూలించు కొన్నవాని కుపనయనము చేయడ మతనిని కర్మాబిలో ముంచడమే.

శివభక్తుడు ప్రమథైకవంశ్యుడు, బ్రహ్మవంశ్యుడు కాజాలడు. అతడు జాతి గోత్ర క్రియాశ్రయుడు కాడు. ఇది బసవనివాదము. ఇక అతనితండ్రి శైవద్విజుడు. గర్భాష్టమమున ఉపనయనము వేదోక్తమని నమ్మినవాడు. బ్రాహ్మణులకు షోడశసంస్కారములు వేదోక్తములు. వాటిలో ఒక్కటి లోపించినా ద్విజకులోత్తముడు కాజాలడు. ఉపనయనమా పదహారు సంస్కారములలో ఒకటి. చాలా ముఖ్యమయినది కూడాను. కాని, ఆ ఉపనయనము శైవ సంప్రదాయము ననుసరించినది. బసవనితండ్రి ఉపనయనకర్మను సమర్థిస్తూ పలికినవాక్యాలు లివి.

"అందు విరుద్ధ మెయ్యది రుద్రగణము
నాంది ముఖ్యం బుపనయనపూజకును
బనుగొనఁ బ్రణవంబు భర్గుఁడే దైవ
మనుటయు మంత్రంబు, నట్లునుఁ గాక,
పెట్టిన సూత్రముల్ భీమసర్పములు,
నట్టినపాత్రంబు బ్రహ్మశిరంబు,
వాలాశదండంబు వంకజోదరుని
కోలెమ్ము, దలచుట్టు కూఁకటుల్ జడలు,
నఱితికృష్ణాజిన మది గజాజినము,
వఱలుమేధావియే నెఱిభూతి గాఁగ
హరుఁడు భిక్షాటన మాచరింపంగ
నరిగినవేష మింపారఁ దాల్చినను
నట్టిసఁ గాని బ్రాహ్మణుడు గాఁ డనిన

నిట్టువిరుద్ధమే యీశుభక్తునకు ?
వడుగు నేసిన భక్తి వట్టివా టగునె."

అని.

ఉపనయనవిధిని తిరస్కరించి, కులగోత్రముల నెడబెట్టి, జాతి వర్ణ విభేదములను పాటింపక, లోకమంతటిని వీరభక్తిమయముగా చేయడానికి బసవేశ్వరుడు సంకల్పించినాడు. అతనికి పూర్వ మట్టి వీరశైవము లేదపోలే దని పాల్కురికి సోమనాథుని అభిప్రాయము. అది 'మఱపడ్డది!' బసవడు పొత్తిళ్లలో ఉన్నప్పుడు,

ఇల మఱపడ్డ నిర్మలశివభక్తి
దలయెత్తువడువునఁ దాఁ దలయెత్తు.
కడఁకతో నాదిమార్గము తప్పకుండ
నడుగిడులీలఁ దప్పడుగులు వెట్టు'

బసవ పు. ౧౫.

నని సోమన్న వర్ణించినాడు. కాని, బసవన్న లేవదీసిన వీర శైవ సంప్రదాయముమాత్ర మంతకుపూర్వ మున్నట్లు సోమనా థుని వ్రాతలవలన స్థిరపడదు. బసవడు పుట్టగానే అతని తలిదం డ్రులు "భక్తులఁ బిలువంగఁ బనిచి, ప్రణామ మాచరించి, సింహాసన మ్మిడి, విభూతి వీడ్యమ్ము లర్పించి, పాదోదకమ్ములు వట్టి మైఁ గడిగి, భూతి ఫాలమ్మునఁ బూసి పైఁ జల్లినారు."

బసవడు వడుగునొల్లక తండ్రియిల్లు విడిచిపోగా, బిజ్జలుని బం డారి బలదేవదండనాయకు డాపరమశైవభక్తుడయిన బసవనికి తన కూతురైన గంగాంబ నిచ్చి పెండ్లిచేసినాడు. ఆ పెండ్లిసమయములో బలదేవుడు,

"రండు ! భక్తులఁ బిలువుండు ! మీ రెదురు
వొండు ! వేగమ తోడితెండు! తెం' డనుచు
నిట వచ్చు నయ్యల కెదురు వచ్చుచును
నట వచ్చు నయ్యల కర్థి మ్రొక్కుచును
సింహాసనస్థులఁ జేసి యా కర్మ -
సంహారమూర్తుల చరణముల్ గడిగి "

అర్చించినాడు. ఇట్లు బసవేశ్వరు పెండ్లికి తండోపతండములుగా వచ్చిన భక్తులు,కర్మసంహారమూర్తు లెవరు? వారిక్రొత్తరీతి పెండ్లినామోదించినవారు, బసవేశ్వరుని క్రొత్తసిద్ధాంతము నామోదించినవా రనడానికి సందేహములేదు. వారిలో పూర్వకాలమునుంచిన్ని ఉన్న జంగములున్ను క్రొత్తగా బసవనిమతము నంగీకరించిన వారున్నుకూడా ఉండిఉంటారు. బ్రాహ్మణులలో సన్న్యాసులవలె శైవబ్రాహ్మణులలోకూడా యజ్ఞోపవీతమును త్యజించి శైవధర్మ ప్రచారమే ముఖ్యముగాచేసుకొన్న వీరశైవసన్న్యాసులుకూడా ఉండేవా రనడానికాక్షేపణ ముండకూడదు. వీరిని జంగమము లంటే తప్పలేదు. కాని, సోమనాథుడు వారు భక్తు లన్నాడుగాని జంగమము లనలేదు. ఆనాడున్ను అంతకు పూర్వమున్ను జంగమము లుండవచ్చును. కాని, జంగమజాతి ఉన్నట్లు కనిపించదు. బ్రాహ్మణసంస్కారములను శివసంప్రదాయము ననుసరించి జరుపుకొంటూ ఉండే సాధారణ శైవగృహస్థులున్ను, వారిలోనే శైవధర్మ ప్రచారమునకుగాను తిరుగుతూఉండే జంగమములున్ను ఉండేవారు - శైవబ్రాహ్మణులలో జాతి వర్ణ భేదము లుండేవి. వాటి కతీతులయినవారు జంగమములు. శైవుల నందరినీ జంగమములుగా చేసి, వారిలో వీరశైవభక్తిని ప్రబలచేయడమే బసవేశ్వరుడు సంకల్పించినది. వీరశైవునికి జాతివర్ణ

భేద ముండకూడదు. అంత్యజు డయినా భక్తుడై వీరశైవదీక్షను గ్రహిస్తే వానిని పూజించవలెను. అతడు శివమూర్తి, కర్మసంహార మూర్తి. కులజు డెవడు అనే ప్రశ్నకు సమాధానముగా,

'కులజులు గులజులే? కులహీను లైనఁ
గులజుల శివభక్తి కలిమి'

(౧) ౧౫౧

నని సోమనాథుడు నూరసాని ముఖమున చెప్పినాడు.

'కర్మదృష్టులఁ జూడఁగాఁగుల భ్రాంతి
ధర్మంబగు తోఁచుఁ; దత్త్వోక్తశైవ
ధర్మదృష్టులఁ జూడఁ దత్కుల భ్రాంతి
ధర్మేతరం బసద్ధర్మమై తోఁచు'

(౧) ౧౫౧-౨

అని అతని అభిప్రాయము. 'భక్తుఁ డేయాకృతినున్న నిటల నేత్రుఁడ కాక నిందింపఁదగునె?' (౧) ౧౩౨, అన్నాడు. అంత్యజు డెవడు? శివకేశవుల 'కైక్యమన్వాఁడ చన నంత్యజుఁడుగాక సహజ మంత్యజుఁడు నంత్యజుండే?' (౧) ౬౭౫; 'శివునకు విష్ణునకు నభేదంబుఁ బలుకు నజ్ఞానియ పతితుండు' (౧) ౬౭౬. బసవని ఈ సిద్ధాంత మానాటికొందరు బ్రాహ్మణులకున్ను బ్రాహ్మణేతరులలో అనేకులకున్ను సమంజస మైనట్లు తోచినది. బ్రాహ్మణేతరులలో క్షత్రియ వైశ్యులు బసవని వీరశైవము నంగీకరించినారో లేదో తెలి యదుగాని, చతుర్థపంచమవర్ణములలోమాత్ర మది అతిశీఘ్రముగా వ్యాపించినది. బ్రాహ్మణు లయినా మొదటి ఆవేశములో కొందరు బసవని జాతి వర్ణ పరిత్యాగ సిద్ధాంతము నామోదించి బసవని అను యాయులలో కొందరు చేరినప్పటికిన్ని, అనేకులు బసవని అవతార

పురుషునిగా గ్రహించి, అతనియెడల భక్తిని ప్రకటిస్తూ వచ్చినారే కాని, తమ బ్రాహ్మణత్వమును ద్విజత్వమును విడిచిపెట్టలేదు, ఎప్పటివలెనే వేదములను శైవపరముగా అర్థముచేసుకొని బ్రాహ్మణాచారములనే అవలంబిస్తూ వచ్చినారు. బసవనిమీద నిర్వ్యాజమైన భక్తికలిగి, అతని సందర్శనార్థము దక్షారామమునుంచి కల్యాణకటకమునకు వృద్ధాప్యములో కూడా బయలుదేరిన మల్లికార్జున పండితారాధ్యుడే బ్రాహ్మణధర్మమును విడిచిపెట్టలే దన్నప్పుడు సాధారణబ్రాహ్మణులనుట చెప్పనక్కరలేదు.

బసవనిపెండ్లి వేదోక్తశివధర్మవిధిగా జరిగినదట. ఆ పెండ్లిని చూచినవారు 'ఏనాఁట వింటుమే యిట్టి పెండిండ్లు' అని ఆశ్చర్యముతో వినుతింపజొచ్చినారట. బసవని పెండ్లికొడుకు వేషమును చూడండి!

'దివ్యాంబరయుగ్మంబు సాతి,
భసితంపునెఱపూఁత వలుచగాఁ బూసి,
నొసలఁ ద్రిపుండ్ర మొప్పెసగ ధరించి,
మౌళిఁ బ్రసాదసుమంబులఁ దుఱిమి,
పోలఁగ రుద్రాక్షభూషలు దాల్చి,
సారమై లింగపసాయితం బనెడు
పేరను గల్గు కఠారంబు గట్టి

... ... ...

భక్తిశృంగార మేర్పడఁ జూఱగొన్న
భక్తికళార్ణవుఁడు గా' ఉన్నాడు.

వధూవరులమీద శివభక్తవనితలు సేసలు చల్లినారు. శివబలం బగ్గలించిన ముహూర్తములో పెండ్లిచేసినారు. తక్కిన గ్రహచంద్ర తారాబలముల యెక్కువ తక్కువలతో పనిలేదు.

'కరుణఁ జూచుటయ లగ్నంబు; సేయుటయు
వ్రతముహూర్తంబు; దీవనయ బలంబు'

పెండ్లి కెక్కువగా అంతులేదు.

బసవడు పట్టిన లింగపసాయితమనే కఠారము తనసిద్ధాంతమును లోకములో వ్యాపింపజేయడమునకు పట్టినది. 'లింగపసాయిత' శబ్దము 'లింగప్రసాదిత' శబ్దభవము. బసవన్న ఈ కఠారమును ధరించినట్లే అతనికాలములో బసవనిమతమును వ్యాపింపజేయ సంకల్పించిన మరి కొందరు భక్తులుకూడా ఆయుధములను పట్టుకొని విచ్చలవిడిగా తిరుగుతూ ఉండేవారు. సురియ చౌడయ్య, ముసుండి చౌడయ్య లట్టివారు. ముసుండి అనేది ఆయుధము. తరువాతికాలములో చౌడయ్య ముసిడిపండ్లు తినేవా డన్నకథ బయలుదేరినది. వీరశైవులు పరమతములను నిర్మూలించడానికి దౌర్జన్యమును నిరాటంకముగా ఉపయోగించినారు. జైనులవసదులను నిర్మూలముచేసి ఆస్థానములలో శివుని ప్రతిష్ఠించిన వృత్తాంతము పండితారాధ్యచరిత్రములో ఎక్కువగా వర్ణింపబడినది. పండితారాధ్యుని నిందించిన బౌద్ధుని అతని అనుయాయులు చంపివేసినారు. బసవని అనుసరించిన వీరవ్రతులలో దొంగతనములో ఆరితేరినవారున్ను ఉన్నారు. కన్నదబ్రహ్మయ్యకథ ఇందుకు సాక్షి. కన్నద బ్రహ్మయ్య అనేపదము కొన్ని ప్రతులలో కన్నడ బ్రహ్మయ్య అని కనబడుతున్నది - ఆపాఠములు తప్పు. వీరశైవమత వ్యాప్తికోసము చేసినది హింసకాదనే సిద్ధాంత మానాడు పూర్తిగా ప్రబలినది. శివప్రీతికోసము చేసిన ఏపని అయినా ఒప్ప

యినదే. తప్పొప్పులు సంకల్పితార్థము ననుసరించి ఉంటవి. ఫలము ననుసరించి సాధనములకు నిందాస్తుతులు కలుగుతవి. కన్నద బ్రహ్మయ్య దొంగతనము చేయడము కుమార్గము కాదు. అది భక్తి మార్గము కాబట్టి సన్మార్గము.

"ఇల జూదమునఁ బాండవులు భ్రష్టులైరి
నలి జూదమున మూర్ఖనగజేశుఁ గూడె;
వేఁటాడి రాముండు వెలఁదిఁ గోల్పడియె
వేఁటాడి యెఱుకు దా విశ్వేశుఁ గలిసె,
పరసతీవశ్యులై నరపతుల్ ద్రుంగఁ
బరసతీవశ్యుఁడై హరుఁ గూడె నంబి,
చంపి మాండవ్యుండు సరిఁ గొఱ్ఱఁబడియెఁ
జంపి చండుండు ప్రసాదంబుఁ గనియె,
బొంకిన బ్రహ్మకు భువిఁ బుట్టువూలె
బొంకి చిర్తొండండు బొందితోఁ జనియె,
గొఱియ మ్రుచ్చని శూద్రకుఁడు నఱుకువడెఁ
గఱకంఠు గణనంది గలిసెఁ దెర్వడచి,
రమణ 'రాజ్యాంతే నరక' మన ముక్తి
విమలతఁ గనిరి సేరమయుఁ జోడండుఁ,
గాన యెట్లును నమార్గం బనరాదు
దా నీశ్వరార్థమన్ తలఁపునఁ జేసి,
ధర 'నధర్మో ధర్మతాం వ్రజే'త్తనఁగ
హరునివాక్యము గాన యట్టి దీపథము."

బసవపు. ౧౫౬

శివుడు భీతునికి మృత్యుత్వమును ప్రసాదించినప్పుడు భీతుడంమువల్ల తనకు పాపము రాదా అని అడుగగా శివుడు చెప్పుతున్నాడు.

'సన్నుతలింగప్రసాదివి నిన్నుఁ
బున్నెంబుఁ బాపంబుఁ బొందవు...
...మదీయమహీయః ప్రసాది
వొందునే యెట్లును బుణ్యపాపముల'

(౧) ౧౦౫

అని శివభక్తుల యెడలను, శివప్రీతికోసమునుఅహింసనే అవలంబింపవలెను. దసరయ్య హింసేతరుడు. జితకోపుడై సర్వజీవ దయాపరత నతి కెక్కు సువ్రతుడు. తనసుఖ మెరుగక సర్వభూత హితమునే కోరే బుధుడు. తాను నొచ్చినప్పటికిన్ని నొప్పించడము తగవు కాదని సైరింపజాలే సజ్జనుడు. ఎదిరిచిత్తము లెట్లానో అని ఒత్తిలి మాటాడెడు. జంతువులేనైనా తనకాలిక్రింద పడి చస్తవేమో అని ముందు చూడకుండా పాదము కదల్పడు. చేతు లిటు నటు త్రిప్పితే ఏవయినా జీవులు పడునేమో అని త్రిప్పడు. చెట్టున ఉన్న పువ్వులను కోస్తే చెట్టుకు నొప్పికలుగునేమో అని భూమిమీద తమంతట పడిన పుష్పములనే తీసుకొనివస్తాడు. (౧)౨౯౭. 'ఖ్యాపితంబగు శాంతియను ఖడ్గమునను గోపమన్ రిపుఁ దెగఁగొట్టు నెవ్వాండు, వాఁడచూ శూరుండు, వాఁడ మాంత్రికుఁడు, వాఁడ విద్వాంసుండు, వాఁడ తపస్వి' 'అహింసాపరమో ధర్మః, నహంతవ్యః ప్రయత్నతః, నవిచార్య శివాజ్ఞయా' ఇటువంటి వెన్నో అహింసాపరములైన వాక్యములు శైవశాస్త్రములలో ఉన్నవి.

వీరశైవములో జంగము డుత్తమోత్తముడు. అతనికిన్ని లింగమునకున్ను భేదములేదు. లింగశరీరమే జంగమ శరీరము. లింగప్రాణమే

జంగమ ప్రాణము. జంగమమూర్తి లింగమూర్తి అని అర్చించడ ముత్త మము. అతడు గురుమూర్తి అని అర్చించడము మధ్యమము. అతడు శివశాసనధారుడని అర్చించడము తుది కక్ష్య. ఒకరీతిగా ఆలోచిస్తే లింగముకంటె జంగమమే అధికుడు. లింగ మచరము, జంగముము చర లింగమూర్తి. లింగము కాయము, జంగమము ప్రాణము. లింగము ప్రాణలింగావతారము, జంగమ మాచార్యావతారము. లింగ మంగసన్ని హితమునకు మాత్రము, జంగమము ప్రాణసన్నిహితమునకు. లింగము మంత్రక్రియాధారము, జంగమము తంత్రక్రియాధారము. లింగము నకు యోగమజ్జనము, జంగమమునకు భోగమజ్జనము. ఒకమూర్తి పూజాస్థానము, రెండోది ఆరాధనస్థానము. ఒకదానికి త్రికాలార్చ నలు మాత్రము, రెండోదానికి సర్వకాలార్చన. ఒకదానికి షోడశోప చారములు, రెండోదానికి రాజవదుపచారములు. లింగమునకు మనో గుణనివేదనముమాత్రము, జంగమమునకు తనుమనోధననివేదనము (౧) ౨౦౭-౬. లింగార్చనముకంటె జంగమార్చన ముత్తమమైనది. 'శివ భక్తిపరులఁ బూజింప కేప్రొద్దు, శివపూజ లొక్కకోటి సేసిన వృథయ, శివభక్తిపరులఁ బూజించినఁ జాలు, శివపూజ లొక్కకోటి సేసిన వాఁడు.' (౧) ౨౦౦. 'జంగమభక్తిహీనునిపూజ, వీనుఁగుఁ గైసేయఁ బూనినయట్లు' (౧) ౨౦౧. లింగము కేవలశిల అని భావించిచేసిన పూజ నిష్ఫలము, పాతకహేతువు. జంగమములో లింగభావము నారోపణచేసి ప్రాణవంతుడయిన ఆజంగమమునే ఆరాధించవలెను. 'బ్రతికి ఉన్నమనుష్యుని ఆరాధించండోయి' అని సోమనాథుడు చేసిన ఉద్బోధము భారతీయజాతికి తిరిగి ప్రాణము పోసినది.

నెఱి నంకురించు వృక్షానికి నీరు మాని
నెఱిపట్టికొఱటికి నీరెత్తినట్లు,

గుటిలుఁడై జాతినాగులఁ జంపుచుండి
ప్రతిమనాగులకును బాలోఁ్పయునట్లు,
వడిగొని భుజియించువదన ముఁడంగఁ
గడిసేసి పెడతలఁ గుడుపుచందమున,
నొనర ముందటిశిరం బుండ మోఁకాలి
కిని సేస వెట్టంగఁ గ్రియగొనినట్లు
(గ) ౨౦౨.

జంగమపూజను వర్జించి కేవల లింగపూజను చేయడము.

బసవభక్తుని బాల్యవర్ణనము మనోహరముగా ఉన్నది. అతనికి శివలింగసౌఖ్యానుభవము చన్బాలు, గురుపదధ్యానము వెన్న, వేదాంత సూక్తులు తొట్రుఁబలుక్కులు, ఆదిమార్గము తప్పటడుగులు, లింగ పూజలే బాల్యక్రీడలు. శివభక్తిస్వరూపమున్న శివునికిని తద్భక్తుని కిన్ని గల సంబంధమున్ను ఎంతో చక్కగా సోమనాథుడు నిరూ పించినాడు. (గ) గ౭౬-౯-శివభక్తునికి వీరవ్రతము, వీరమాహేశ్వర వ్రతము కావలెను. వీరమాహేశ్వరపూజయే పరమశివపూజ. అసం ఖ్యాత వీరమాహేశ్వరపూజ ఆకాలములో విస్తరించి ఉండేది. గురువు సంసారికి వీరభక్తిదీక్ష నిస్తూఉండేవాడు. ఈదీక్ష పండితా రాధ్యునికి పూర్వమందున్ను ఉండేది. ఆ సంప్రదాయము ప్రకా రమే మల్లికార్జునపండితుడున్ను ఆదీక్షను పొందినాడు. వీరభక్తి దీక్షను పొందే ఆచారము బసవనితో ఆరంభించినదికాదు. బసవని కంటె పండితారాధ్యుడు వయస్సులో పెద్దవాడు కదా. అతడు బాల్యములోనే ఆదీక్షను పొందినాడు. వీరభక్తి (గ) 3గ౬ లో నిరూపింపబడినది. నిజమైన శివపూజ ఎట్టిదో (గ) గ౫3-౪, ౨౨3 లలో వర్ణింపబడినది. అది బాహ్యాభ్యంతర భేదములచేత రెండువిధ

ములు. బాహ్యపూజ మంచిదేకాని,ఆభ్యంతరపూజ ఉత్తమోత్తమము. భక్తిప్రాబల్యమున కొత్తార్పణము సురుతు. తమభక్తినిరుజువుచేయడానికి వీరశైవులు కళ్లుపీకుకొని కళ్లుపొందుతూ ఉండేవారట. నాలుకలు పెరుకుకొని నాలుకలు పొందుతూఉండేవారట. తలలు తరుగుకొని తలలుపొందుతూ ఉండేవారట. శ్రీశైలములోని వీరమండపమిట్టిభక్తి ప్రకటనమునకు స్థానముగా ఉండేది. లేపాక్షి వీరభద్రాలయముగర్భ గృహమువెనుకగోడలో ఉన్న ఎర్రనిమచ్చ విరుపణ్ణఅర్పించినకన్నని ఇప్పటికిన్ని చెప్పుకొంటున్నారు. భక్తినిరూపణార్థము ఘటసర్పము లను చేతితో పట్టుకొనేవారు. దీపమునకు చమురులేకపోతే జుట్టుకు నిప్పంటించుకొనిదీపము వెలిగించేవారు. ధూపమునకు గుగ్గిలములేకపోతే దేహములనుకాల్చి ఆపొగతో ధూపమువేసేవారు. ఇదీ వీరభక్తిఅంటే. "పురుషుఁడు శివభక్తివిరహితుఁడేని౯ బురుషునిమీఁటుట దరుణికిఁబక్షము."- బ. ౧౯౦. ఇట్టి వీరభక్తు లాకాలములో లెక్కకుమీరి ఉండేవారు. వీరే అసంఖ్యాత మాహేశ్వరులు. బసవనికాలములో కల్యాణ కటక ములో మాత్రము లక్షాఎనభైవేలమంది భక్తలింగములు, తొమ్మిదివేల మంది వ్రతస్థులు, పదివేలమంది ఛలవాది శీలవంతులు, ఏడువేల యేడు వందలమంది వీరగణములు, పండ్రెండు వేలమంది మిండజంగములు మొత్తము రెండులక్షల పద్దెనిమిదివేల ఏడువందలమంది వీరవ్రతము నవలంబించినవా రుండేవారట. (౧) ౨౩౨-౩౪.

మల్లికార్జున పండితారాధ్యునినోట సోమనాథుడు ఖండించిన మతములలో బౌద్ధ జైన మతములుకూడా ఉన్నవి. ఇవి వేదబాహ్య ములు. వీటి సిద్ధాంతములున్ను సంప్రదాయములున్ను వేరు. ఆంధ్ర దేశములోనే కాక దక్షిణదేశమం దంతటా ఇంచుమించు క్రీ. శ. నాలుగు, అయిదో శతాబ్దములవరకున్ను బౌద్ధమతము మిక్కిలి ప్రచారములో ఉండినది. బౌద్ధమతము క్షీణిస్తూరాగా అరవదేశ

ములలో శైవమున్ను, కర్ణాటకాంధ్ర దేశములలో జైనమున్ను తల యెత్తినవి. ఆంధ్ర దేశములో పదోశతాబ్దమునకు జైనమతము క్షీణించి నదని చెప్పవచ్చును. కర్ణాటకములోమాత్ర మది మరిరెండు శతాబ్ద ములవరకున్ను నిలిచినది. బౌద్ధజైనమతములు క్షీణించడానికి శైవమత వ్యాపనమే కారణము. వీరశైవము బయలుదేరిన తరువాత అవి బొత్తిగా క్షీణించిపోయినవి. వీరశైవులు బౌద్ధారామములను జైనవ సదులను బుద్ధిపూర్వకముగా, బలవంతముగా, దౌర్జన్యముతో, క్రూరముగా పాడుచేసినారు. ఆస్థానములలో లింగప్రతిష్ఠలు చేసి నారు. పండితారాధ్యచరిత్రములో శైవులు జైనవసదులను నాశనముచేసినవిధము శైవోత్కర్ష కుపబలముగా వర్ణింపబడినది దేవరదాసయ్య పొట్లచెరువులోని ఏణ్ణూరువసదులను వ్రచ్చివైపించి, జినప్రతిమలను విటతాటమాడినాడట. అల్లే కోవూరిలోని వసదుల కన్నిటిని బ్రహ్మయ్య నాశనము చేయించినాడు. అబ్బలూరిలోని వసదులను ఏకాంతరామయ్య పడగొట్టించినాడు. కటకములో బండారు బసవన్న జైనులను భస్మముచేసినాడు. వరవళిగెలో వైజ కవ్వ జినప్రతిమను పడగొట్టి ఆస్థానములో వైజనాథేశ్వరుని ప్రతి ష్ఠించి జైనుడనే వార్త లేకుండా చేసినది. మారుళిగెలోని హిరియ వసదిలోని జైనులను హిరియనాగయ్య మొదలయిన పదముగ్గురు వీరావతారులు వధించి మహేశ్వరప్రతిష్ఠ చేసినారు. పులిగెఱెలోని సురహొన్నవసదిని పడగొట్టి ఆదయ్య అనేవాడు సౌరాష్ట్రమునకు పోయి సోమలింగము నాహ్వానించి ప్రతిష్ఠించినాడు. పిళ్లనయనారు జైనులను వాదములో ఓడగొట్టి కూనపాండ్యుని గూనిని పోగొట్టి, జినమంత్రపత్రమును శివమంత్రపత్రమును అగ్గిలో వేయగా జైన పత్రము కాలిపోయినది, శైవపత్రము కాలలేదు. తరువాత ఆ పత్రములను కావేరివరదలో విడువగా జైనపత్రము వరదలో

కొట్టుకొనిపోయినది, శైవపత్రమేటి కెదురెక్కినది. ఈ ప్రత్యయ
మును చూచి రాజు జైనులను కొఱ్ఱు లెక్కించినాడు. నిడుమారడనే
రాజు రాజ్యములోని జైనుల నందరిని పిలిపించి, వారిని వాదములో
ఓడించి, వారితలలు తీయించినాడు. వాగీశనాయనారిని జైను
లనేకవిధములుగా బాధింపగా అతడు పంచాక్షరీమంత్ర దహనేభ
జలవిషోద్ధతిచేత వారినందరిని చంపినాడు. ఇకిత్తాండి అనే పుట్టుగ్రుడ్డి
అయిన శివభక్తుని జైనులు బాధింపగా, అతడు శివుని ప్రార్థించి
రెండు కన్నులను పొంది, జైనులకళ్లు పోయేటట్లు చేసినాడు. నమి
నంది అనే శైవభక్తుడు దినదినమున్ను శివునిముందర వేయినేతిదీప
ములు పెట్టేవ్రతము కలవాడై ఉండగా జైను లతనికి నేయి దొరక
కుండా చేసినప్పుడు లింగోదకములతోనే దీపములు వెలిగించి,
జైనులపశువులు చచ్చేటట్లు శపించి, 'వసదిజైనుం డనునార్తయు
నడచి'నాడు. తొండమండలములో జినబుద్ధ ముఖ్య సమయములు
నిస్తుష మయేటట్లు శపించి వాటిని తుడిపించి వేసినాడు. ఇట్టి
తీవ్రాపదలకు లోనై అనేకులైన బౌద్ధులును జైనులును మృతిపొంది
నారు. కొందరు శైవమతములో ప్రవేశించినారు. నానాటికిన్ని
ఈరెండు మతములున్ను భరతవర్షములో నామమాత్రావశేషము
లైనవి.

సోమనాథుని కాలమునాటికి బౌద్ధమతము కేవలము నశించిన
దనే చెప్పవలెను. బౌద్ధకుటుంబములు కొన్ని అక్కడక్కడ సకృ
త్తుగామాత్ర ముండేవి. బౌద్ధాలయముల కితర మతస్థులు దానములు
చేస్తూ ఉండేవారని శాసనములవల్ల తెలియవస్తున్నది. కాని, ఆకాల
మునకు బుద్ధదేవర శాక్యముని అయిన బుద్ధుడుకాడు. విష్ణువు దశావతా
రములలో ఒకడుగా ఏర్పడినాడు. బౌద్ధమతమును ఖండిస్తూ పండితా
రాధ్యు డీవిషయమునే సూచించినాడు. వైష్ణవమతము ఖండింపబడి

నప్పుడు, విష్ణువు అవతారమయిన బుద్ధుని మతముకూడా ఖండిత మైనట్లే అని బౌద్ధవాదఖండనోపక్రమణమును చేసినాడు. బౌద్ధులు కానివారుకూడా బుద్ధుని పేరు పెట్టుకొంటూ ఉండేవారు. పూర్వకాలపు బౌద్ధారామములకు దగ్గరగా ఉండే గ్రామములలో ఉండే బౌద్ధేతరులు నేడుకూడా బొజ్జన్న, బొజ్జమ్మ, మొదలయిన పేళ్లను పెట్టుకొంటున్నారు. 'బొజ్జ' అనేది 'బౌద్ధ'కు తద్భవము- బౌద్ధమంత క్షీణదశలో ఉన్నప్పుడు వెలనాటిచోడుడు పండితారాధ్యునిమీద అంత కసికొనడ మెట్లు సంభవించినదో చెప్పలేము. ఆకాలపు వెలనాటిచోడుడుగాని, పండితుని కన్నులు తీయించినవాడని కొండవీటి దండకవిలెలో చెప్ప బడిన కొండపడమటి బుద్ధరాజుగాని బౌద్ధులయినట్లు కనబడదు. వారు శివ కేశవాలయములకు చేసినదానముల శాసనములు కనబడుతున్నవి. ఎట్లయినా వారు పండితునిమీద అంతక్రౌర్యము చూపేటంతటి వీర బౌద్ధులై ఉండరు. దీని యాథార్థ్యమేమో తెలియరాకున్నది.

———

# ౧౬

## కొన్ని స్థలములు

బసవపురాణ పండితారాధ్యచరిత్రములలో అనేకములైన దేశములు, గ్రామములు, కొండలు, నదులపేళ్లుదాహరింపబడి ఉన్నవి. వాటివల్ల ఆకాలములో వీరశైవాది మతవ్యాప్తి యెట్లుండేదో విశద మవుతుంది. వాటివాటిపేళ్ల నీక్రింద ఇచ్చినాము.

అంగ(రాయఁడు) ౨ (౯౦)
అగస్త్యేశ్వరము (౨) ౫౩౭
అగ్నీశ్వరము (౨) ౫౩౮
అచలేశ్వరము (౨) ౫౨౯
అనంతము (౨) ౪౧౬
అనలేశ్వరము (౨) ౫౩౭
అంబెపురము (౨) బ. ౭౯
అబ్బలూరు బ. ౧౯౧; (౧) ౫౯౧; (౨) ౫౬
అమరగుండము (మల్లన) (౧) ౩౨౩
అమరారామము (౨) ౫౪, ౫౯, ౯౬
అమరావతీపురి (౨) ౫౨౭
అమృతేశ్వరము (౨) ౫౩౩
అరువదేశము (౨) ౩౭౭
అలంపూరు బ. ౨౦౫
అశ్వమేధేశ్వరము (౨) ౫౩౭
అశ్వత్థేశ్వర?
అస్తపర్వతము (౨) ౨౩౩, ౨౬౫
అళయూరు బ. ౬౩

ఆకాశజాహ్నవి (౧) ౬౪౦
ఆంధ్రదేశము (౨) ౩౮౪
ఆరెదేశము (౨) ౩౭౧, ౩౭౮
ఆవటిక (౧) ౧౪౯, ౧౫౦
ఆవలూరు (౧) ౧౨౧, ౧౬౨, ౧౮౨
ఇంగుళేశ్వరభాగవాడి (౧) ౨౦౭
ఇడిసుడి (మారయ్య) (౨) ౭౬
(ఇడైకటి?)
ఇంద్రకీల(పర్వతము) (౧) ౨౩౨, ౨౬౫, ౩౯౨
ఇంద్రేశ్వరము (౧) ౫౩౩, ౫౩౬, ౫౩౭
ఇరుగుడుములు (౧) ౧౮౭
ఇల్లకప్పడి సంగమేశ్వరము బ. ౧౮, ౨౪
ఇల్లిపాళ (బ్రహ్మాయ) (౨) ౯౦
ఇష్టకామేశ్వరము (౨) ౪౮౨, ౫౩౫
ఇష్టసిద్ధేశ్వరము (౨) ౫౩౫
(సిద్ధేశ్వర?)

మేరు(పర్వతము)
మైనాక (,,)
మొగలేఱు (మొగల్లూరు?)
మొగవాడ (బసవయ్య)
మోక్షేశ్వరము
యమున(నది)
యమేశ్వరము
యోగేశ్వరము
యామ్యజకుండము
రసకుండము
రససిద్ధేశ్వరము
రాజరాజేశ్వరము
రామకుండము
రామేశ్వరము
రావణకుండము
రావణేశ్వరము (రావణసముద్రం?)
రుద్రపాదతీర్థము
రుద్రసోమ (నది, గంగానదిశాఖ)
రుద్రాక్షపర్వతము
రోహణ ,,
రౌప్య ,,
లంక బ. ౨౦౪
లకులేశ్వరము
లక్ష్మణేశ్వరము
లాంగూలతీర్థము
లాట (దేశము)
లింగ (పర్వతము) (లింగాలకొండ?)
వజ్ర ,,
వటేశ్వరము (వటార్ణవేశ్వరః?)
వనిపురి
వరకొండ
వరాహేశ్వరము,
వారాహేశ్వరము
వరుణేశ్వరము
వర్ధమాన(పర్వతము)
వారణాసి,
వారాణసి
విజయాపురము
విద్యుత్ (పర్వతము)
వింధ్య ( ,, )
విభీషణకుండము
విమల (నది)
విమలేశ్వరము
విముక్తేశ్వరము
వృషభతీర్థము
వృషభపురము
వృషభేశ్వరము
వెండికొండ
వెల(ల్ల)టూరు
వెలిగొండ(మహాదేవుఁడు)
వెల్లగొండ (,,)
వేంగి
వేగవల్లి (నది)
వేత్ర(త్రా)వతి (నది)
వేదపర్వతము (వేదాద్రి?)
వేదవతి (నది)
వైతరణి(నది)
వ్యాసేశ్వరము
శంకరమహాతీర్థము

శతమేరు (పర్వత)
శాంకరీపురము
శాంతమంగ (పురి)
శిఖరేశ్వరము
శుక్తిమత్ (పర్వతము)
శృంగ (,,)
శోణ(నది)
శ్రీకాళిపురి
శ్రీశైలము (పర్వతము)
శ్వేత (,,)
సకలేశ్వరము
సంతేరి (దేశము)
సనదవోలు
సప్తకోటీశ్వరము
సరయూ(నది)
సరవూరి (జంకయ్య)
సరస్వతి (,,)
సహ్య (పర్వత)
సారంగ (,,)
సారంగేశ్వరము
సాలంకమత్స్యకేశ్వరము
సాలంకేశ్వరము
సింధు(దేశము)
,, (బల్లయ్య)
సిద్ధవటము
సిద్ధేశ్వరము
సింహాళిక (దేశము)
సీతా(నది)

సీమ (పర్వతము)
సురభీశ్వరము
సురస(నది)
సురహోన్న
సువేల (పర్వతము)
సూర్యకుండము
సూర్య(పర్వతము)
సూర్యేశ్వరము
సైకతపురము
సైంధవ(పర్వతము)
సాన్నలికపురము
సోమ(పర్వతము)
సోమశిల
సోమేశ్వరము
సౌగంధిక(పర్వతము)
సౌరాష్ట్ర(దేశము)
సౌవర్ణ (పర్వతము)
స్కాండసోమేశ్వరము
హాటకేశ్వరము
హారిత(పర్వతము)
హావినహళ్లి
హావినహాళు
హింగులేశ్వరభాగవాటి
హిద్దోర(నది)
హిరియువసది
హిమవత్ (పర్వతము)
హేమకూట (,,)
హోమకుండము

పైస్థలము లెక్కడెక్కడ నున్నవో నిర్ణయించి ఒక దేశపటమును వ్రాస్తే, సోమనాథుని కాలమునాటి వీరశైవవ్యాప్తి కొంత బోధ పడుతుంది. ఆపనిని పరిశోధకులకు విడిచిపెట్టుచున్నాను.

పైవాటిలో మన పండితారాధ్యచరిత్రమునకు ముఖ్యమయిన శ్రీశైలమును గురించి మాత్ర మీ క్రింద సంగ్రహముగా తెలుపుతున్నాను.

# ౧౨

# శ్రీ శై ల ము

మహాశైవక్షేత్రములలో శ్రీశైలము చాలా ప్రసిద్ధికెక్కినది. ఇది కర్నూలుజిల్లా, నందికొటుకూరుతాలూకాలో నల్లమలకొండల లోని అడవులమధ్య ఉన్నది. ఇచ్చటి కేశేటా మల్లికార్జునశివుని దర్శనముకోసము శివరాత్రి నాటికి లక్షలకొలది భక్తులు యాత్ర పోతారు. శ్రీశైలమును చేరడానికి బెజవాడ-గుంతకంటి రైలు మార్గములో గాజులపల్లిస్టేషనులో సాధారణముగా యాత్రికులు దిగుతూ ఉంటారు. దిగువమెట్టస్టేషనునుండికూడా శ్రీశైలమునకు పోవచ్చును కాని, గాజులపల్లిస్టేషనులో దిగితే కొంతదూరమువరకు మోటారుబస్సులో ప్రయాణము సాగించవచ్చును. ఆతరువాత కాలినడకనే పోవలెను. మార్గము దుర్గమారణ్యప్రదేశమధ్యముగా పోతుంది. యాత్రాదినములలో తప్ప తక్కిన సమయములలో ప్రయాణము చాలాకష్టము. క్రూరమృగముల అలుకుడు ఎక్కువగా ఉంటుంది. అక్కడక్కడ చెంచుగూడెములలో తప్ప జనసంచార ముండదు. యాత్రాదినములలోమాత్రము కొండ జనసమూహములతో క్రిక్కిరిసి ఉంటుంది. చెంచువాళ్లు యాత్రికులకు చాలా సహాయము చేస్తారు.

శ్రీశైలమునకు నానా దేశములనుంచిన్ని యాత్రికులు వస్తారు. ముఖ్యముగా ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర దేశములనుంచి వచ్చే వారిసంఖ్య ఎక్కువ. తమిళదేశస్థులుకూడా చాలామంది వస్తారు. యాత్రికులు పరస్పరసహాయము చేసుకొంటూ జాతివర్ణవ్యవస్థలను చాలావరకు మరచిపోతారు.

శ్రీశైలము పురాణకాలమునుంచిన్ని గొప్ప శైవక్షేత్రముగా ప్రసిద్ధి కెక్కినది. మహాభారతములో దాని ప్రశంస ఉన్నది. అచ్చటి స్వయంభూలింగమునకు మల్లికార్జునలింగ మని పేరు రావడానికి చంద్రగుప్తుని కూతురైన చంద్రవతీకన్య స్వయంభూ శివుని వలచి, అతనికి ప్రతినిత్యమున్ను ఒక మల్లికాదామమును సమర్పిస్తూ, అతనిని మెప్పించి తుదకు పెండ్లాడిన దని శ్రీశైలస్థల మాహాత్మ్యగ్రంథములో చెప్పబడినది. దానినే పాల్కురికి సోమనాథుడుకూడా పండితారాధ్యచరిత్రములో వర్ణించినాడు. పదహారో శతాబ్దపు ఒక శ్రీశైలశాసనములోకూడా ఈకథ ఉన్నది. దీనినిబట్టి శ్రీశైలము గుప్తరాజుల కాలములోకూడా ప్రసిద్ధికెక్కి ఉండేదని జనులనాడుక తెలుపుతున్నది. పొ - లో - ము - లో - కి - లి (చీనాభాషలో 'శ్రీశైలము') మీద సా - తో - పొ - కో - అనే రాజు నాగార్జునాచార్యుడనే బౌద్ధగురువుకోస మొక సంఘారామమును నిర్మించినాడనిన్ని, నాగార్జును డచ్చట ననేక బౌద్ధభిక్షువులను నిలిపి, వారికోసము సమస్తబౌద్ధమత గ్రంథములును, వాటిమీది వ్యాఖ్యానములును కలిగిన గొప్పగ్రంథభాండాగారమును ఏర్పాటు చేసినాడనిన్ని హూానుత్సాంగు అనే చీనాయాత్రికుడు వ్రాసినాడు. టిబేటులోని బౌద్ధగ్రంథములలో నాగార్జునుడు ద్పల్ - గ్యి - లి (శ్రీపర్వతము) మీది సంఘారామములో నిర్వాణముపొందినా డని ఉన్నది. నాగార్జునుడు క్రీస్తుశకము మొదటి శతాబ్దమువాడు. ఆనాటికే అక్కడ బౌద్ధమతముతోబాటు శైవమతములున్ను ఉండేవని మనము నిశ్చయించవచ్చును. క్రీ. శ. ఆరోశతాబ్దమువా డయిన కదంబరాజు మయూరవర్మ శ్రీశైలపాదమువరకున్ను గల అరణ్యమునంతటిని ఆక్రమించినాడని అతని శాసనములు చెప్పుతున్నవి. క్రీ. శ. ఆరు ఏడో శతాబ్దములలో రచితము లయిన 'దేవారము' 'దేవహారము'

అని చెప్పబడే తమిళేషులోని శైవభక్తికావ్యములలో 'శ్రీశైల' ప్రశంస ఉన్నది. పన్నెండో శతాబ్దములో హొయ్సళరాజు సామంతు డొకడు లింగప్రతిష్ఠలు చేయడానికి శ్రీశైలములోని పాతాళగంగనుంచి లింగములను తెప్పించుకొన్న ట్లొకశాసనములో నున్నది.

శ్రీశైలముమీది ఆలయములోనున్న శాసనములు మాత్రమంత పురాతనమైనవి లేవు. వాటిలో అతి ప్రాచీనమైనది మూడో కులోత్తుంగుని కాలము (౧౧౭౮-౧౨౧౮) నాటిది. తరువాత కాకతీయ ప్రతాపరుద్రునిది, శక ౧౨౩౪ సం.రము నాటి దున్నది. అక్కడ నుండి పదిహేడో శతాబ్దమువాడున్న విజయనగర రాజ్యపు శాఖవాడున్న ఆయిన కర్ణాటరాజు నాలుగో రామదేవునికాలమువరకు శిలా శాసనములు కనబడుతున్నవి. శ్రీశైలములో పాల్కురికి సోమ నాథునికి చాలా పూర్వముంచిన శాసనములు లేకపోయినా, ఇత రాధారములవల్ల దాని ప్రాచీనత స్థిరపడుతూనేఉన్నది. ఆంధ్ర దేశములోని స్మార్త బ్రాహ్మణు లందరున్న సంకల్పము చెప్పేటప్పుడు తామున్న దేశమునకు శ్రీశైలము ననుసరించి దిఙ్నిర్దేశము చేస్తారు. ఆంధ్ర దేశమునకు శ్రీశైలము ఇంచుమించుగా నట్టనడుమనుండుట చేత ఇట్లు చేయడము సహజమే.

శ్రీ శైలములో వెలసిన భారతీయశిల్పము పల్లవశిల్పమును పోలి ఉన్నదని పాశ్చాత్యశిల్పపండితు లంటున్నారు. ఇచ్చటి శిల్పము ననుసరించి పల్లవశిల్ప మేర్పడినదో, దానినుండి ఇది యేర్పడినదో నిర్ణయించడాని కాధారములు లేవు. ఇచ్చటి ఆలయములు, విమాన ములు, గోపురములు, గొప్ప స్తంభములు, ద్వారతోరణములు, నంది విగ్రహములు, ప్రాకారములు, అన్నీ అద్భుతశిల్పకళను గలిగి, ఎంతో మనోహరములుగా ఉన్నవి. ఇప్పు డీ ఆలయముచుట్టును

నిబిడములైన అడవులు బలసినవి. అడవులలో ఇప్పటికిని మిక్కిలి తరచుగా పాడుపడిన మఠములు, కాపురముండే ఇండ్లు, కనబడు తున్నవి. దీనినిబట్టి ఒకానొకప్పు డీ కొండ కన్ని ప్రక్కలను గొప్ప నగరము వ్యాపించి ఉండేదని చెప్పవచ్చును. ఆనాటివైభవము నేడు మరుగుపడినా, నిలిచినవాని నయినా పునరుద్ధరించడానికి భక్తులు పూనుకోవలసి ఉన్నది.

శ్రీశైలములోని వీరశైవమఠములు చాలా ముఖ్యము లయినవి. అసలు వీరశైవమునకు ముఖ్యమఠములు అయిదనిన్ని, అవి (౧) రేణుకాచార్యుడు లేక రేవణసిద్ధుడు స్థాపించిన కొలనిపాకలోని మఠము (౨) మరుళసిద్ధుడు స్థాపించిన బళ్లారిమండలములోని ఉజ్జీనిమఠము (౩) ఏకోరాముడు స్థాపించిన కేదారములోని మఠము (౪) పండితారాధ్య స్థాపిత మయిన శ్రీశైలములోని మఠము (౫) విశ్వారాధ్యుడు స్థాపించిన కాశిలోని మఠము, అనేవి అని కొందరంటున్నారు. ఇది ఆంధ్ర వీరశైవ సంప్రదాయమువారు చెప్పేవివరము. మహారాష్ట్ర దేశములో (౧) మరుళారాధ్యాచార్యుడు శ్రీశైలములోను (౨) ఏకోరనాధ్యా చార్యుడు కొల్లిపాకలోను (౩) రేవణారాధ్యాచార్యుడు ఉజ్జయిని లోను, (౪) పండితారాధ్యాచార్యుడు కాశిలోను (౫) విశ్వా రాధ్యాచార్యుడు బాళేహళ్లిలోను వరుసగా పంచసింహాసనములను స్థాపించినట్లు విశ్వసిస్తున్నారు. ఈ రెండో విషయము 'పరమ రహస్య' మనే గ్రంథములో ఉన్నదట. ఈవిధముగా శ్రీశైల సింహా సనస్థాపకుడు ఏకోరాముడా, పండితారాధ్యుడా అనే ప్రశ్నకలుగు తున్నది. పండితారాధ్యుడు పండితారాధ్యచరిత్రనాయకు డయిన మల్లికార్జున పండితారాధ్యుడు కాడనిన్ని కలియుగాది నవతరించిన

తన్నామకు డనిన్ని కొందరంటున్నారు. కొల్లిపాకలో ఇప్పుడు వీరశైవమతము లేదు. దీనినే బాళేహళ్లికి మార్చినారట.

శ్రీశైలమతమునకు మొదటిపే రేమో శాసనాధారములవల్ల నిర్ణయించడానికి సాధ్యము కాకున్నది. శ్రీశైలముమీద అయిదు ముఖ్యమతములు స్థాపితము లయినవనిన్ని, వాటిలో వీరశైవసిద్ధభిక్షావృత్తిమతము ప్రసిద్ధికెక్కినదనిన్ని శాసనపరిశోధకు లంటున్నారు. కాని, ఈమతమును గురించి శాసనము లేమిన్ని చెప్పకున్నవి. వీరశైవ సిద్ధభిక్షావృత్తి అయ్యవారు అనేవ్యక్తి శక ౧౪౭౪ (క్రీ. శ. ౧౫౫౨) సంవత్సరములో కర్నూలుజిల్లా, నందికొట్కూరు తాలూకా, ఆత్మకూరు గ్రామములోని సిద్ధేశ్వరస్వామి ఆలయమునకు అయిదుతూములభూమి దానము చేసినట్లున్న (నూయెలు: ప్రాచీన చారిత్రకవిషయముల జాబితాలు: సంపుటము ౧, పుట, ౨౭; దత్తమండలముల శాసనములు పుట ౪౫౬, నం. ౧౨౫ రు) కడప జిల్లా, పుల్లంపేటతాలూకా, ఓబలిగ్రామములోని సంగమేశ్వరాలయములోని ఒకశాసనములో పై అయ్యవారి ముద్రాకర్త అయిన మందుల బసవయ్యసమక్షములో వీరముష్టి సింగారము వీరయ్య ఓపిలిగ్రామము నుంచి తనకు రావలసిన ఆదాయమును వీరేశ్వరాలయమునకు దానము చేసినాడనిన్ని వీరశైవసిద్ధభిక్షావృత్తి అయ్యంగారి శిష్యులయిన పర్వతయ్య, అతనిభార్య శకసం. ౧౪౪౦ రము (క్రీ. శ. శ్రీశైల మల్లికార్జునునకు దానము చేసినారనిన్ని (ఎ పి. రి. ౧౯౧౫, ౧౨ నం. మూడు ప్రమాణములుమాత్రము కనబడుతున్నవి. శ్రీశైలముమీది వీరశైవసిద్ధభిక్షావృత్తి మతము ఇతనిపేరనే వెలసి ఉంటుందనుకొంటే, అది పదహారోశతాబ్దమునుంచిన్ని ఉన్నదనిమాత్రము చెప్పవలెను. అంతకు పూర్వపు శాసనములలో ఈ మతముపేరు కానరాదు. శాసనములప్రకారము శ్రీశైలముమీద ఉండే మతములు (౧) నతా

లోకసూరియన్ తిరుమడెము (ఎపి. రిపోర్టు. ౧౯౧౫, నం ౪ రు); ఈ శాసనము త్రిభువనచక్రవర్తిన్ కోనేరిన్ మై కొండాన్ అనే రాజు పదమూడో సంవత్సరము, ౩౦౬ దినమునాటిది. ఇతడే క్రీ. శ. ౧౧౭౮ నుంచి ౧౨౧౬ వరకు రాజ్యముచేసిన మూడో కులోత్తుంగచోళుడు. (౨) బసవమఠము, శక ౧౪౫౧ (క్రీ. శ. ౧౫౨౯) సం॥రమునాటిశాసనము (ఎపి. రిపో. ౧౯౧౫, నం ౧౫ రు); (౩) గణమఠము (౪) అరసెపుఠము (౫) కలుమఠము (ఎపి. రిపో. ౧౯౧౫, నం ౪౧ గా; శక. ౧౩౨౭, క్రీ. శ, ౧౪౦౫ సం॥రము); (౬) సారంగమఠము (ఎపి. రిపో. ౧౯౧౫. నం ౪౪ రు, శక ౧౫౦౭, క్రీ. శ. ౧౫౮౫ సం॥రము); (౭) గోళగిమఠము (కర్నూలుజిల్లా, మార్కాపురంతాలూకా, త్రిపురాంతకము, ఎపి. రిపో. ౧౯౦౫, నం ౧౯౫ రు; శక ౧౧౭౪, క్రీ. శ. ౧౨౫౨, కాకతీయగణపతిదేవునిది) అనేవి తెలియవస్తున్నవి. వీటిలో నరాలోకసూరియన్ తిరుమడమున్ను, గోళగిమఠమున్ను పురాతనములు. వీటిలో ఏకోరాముడో, పండితారాధ్యుడో స్థాపించిన మఠ మేదో తెలియరాదు.

పాల్కురిసోమనాథుని కాలములో శ్రీశైలము మహావైభవముతో ఉండేది. ఆ వైభవమును గురించి తెలుసుకొనడానికి పండితారాధ్యచరిత్రములోని పర్వతప్రకరణమును చదువవలెను.

---

# శ్రీ పండితారాధ్యచరిత్ర

---

## ప్రథమ సంపుటము

విషయ సూచిక

మల్లికార్జున

# పండితారాధ్యచరిత్ర

## దీక్షాప్రకరణము

### కృతిపతినిరూపణము

శ్రీగురుమూర్తి నూర్జితపుణ్యకీర్తి
నాగమాంతస్ఫూర్తి నానందవర్తి
వృషభస్వరూపు నవిద్యాదురాపు
విషయప్రతాపు నిర్విషయకలాపుఁ
బరమకల్యాణు సద్భక్తధురీణు
శరణాగతత్రాణు సజ్జనప్రాణుఁ
[1]బ్రమథైకవిశ్రాము [2]భసితలలాముఁ
గమనీయ[3]గుణధాము గణసార్వభౌము
నీతజంగమదాస్యు [4]నిగమమయాస్యు
భూతలైకనమస్యు బుధజనోపాస్యు

---

౧. బ్రమథైక. ౨. భక్త. ౩. సద్గుణ. ౪. నిగమా.

శివభక్తసింహంబుఁ జిన్నివాసంబు
భవగిరికులిశంబు బసవలింగంబుఁ
దెల్లంబుగా నస్మదీయేశుఁ జెన్న
మల్లికార్జునదేవు మహితరూపంబు
దానైన బసవన దండనాయకుని
జానొంద మత్కృతిస్వామిఁ గావించి;

భక్తప్రార్థన

[1]కమనీయ సకల నిష్కల తత్త్వమయులఁ
[2]బ్రమథులఁ ద్రిభువన ప్రమథులఁ దలఁచి;
నుత పురాతనభక్త నూతనభక్త
వితతి లింగంబ కా వీక్షించి [3]కొలిచి;
యారూఢముగ మల్లికార్జున పండి
తారాధ్యుల చరిత్ర మర్థి వర్ణింతుఁ.

కృతిఫలము

[4]బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
నిండారు శివభక్తి నియతి వర్ధిల్లుఁ;
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను

---

౧. కమనియ్యా — శాసనములందున్ను, తాటాకుపుస్తకములందున్ను '—అనియ్యా' అనే రూపము ప్రకటముగా ఉన్నది. ౨. విదులఁ. ౩. తలఁచి. ౪. కొన్నిపుస్తకములలో వాక్యావసానమందు అరసున్న, ఆదేశము కానరావు.

దండతండములు పాతకములు పొలియుఁ;
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
పండిన సద్భక్తి భాగ్యంబు పొందుఁ;
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
మండెడి దావాగ్ని మంచయిపోవుఁ;
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
జండోరగాది విషంబులు గ్రాగుఁ;
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
[౧]దుండగంబులు [౨]బహుదుఃఖముల్ వాయుఁ;
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
దండి భవాంబుధి పరతర మింకుఁ;
బండితారాధ్యులఁ బ్రస్తుతించిన న
ఖండితైశ్వర్యప్రకాశ[౩]త దనరు
భావింప నటు గాన పండితారాధ్య
దేవుని చరిత్రఁ గీర్తింతు నెట్లనినఁ:

సురస్తోత్రము

జిరతమోగుణ పరిస్ఫీతుండు శివుఁడు
[౪]వరసత్త్వగుణ వికస్వరుఁడు పండితుఁడు;

---

౧. “దుర్దమా విషయక్లేశా శ్శాంతి మాయాంతి సత్వరం” అని సం. ౨. విష. ౩. మిం పొందు. ౪. పరతత్త్వ.

అరయ నచరలింగ మా లింగమూర్తి
యరయఁగాఁ జరలింగ మా పండితయ్య;
యసమలోకాధీశుఁ డంబికా¹ధవుఁడు
అసమలోకారాధ్యుఁ డా పండితయ్య;
యఖిలలోకమయుండు హైమవతీశుఁ
డఖిలలోకాతీతుఁ డా పండితయ్య;
లోకానుసారి ద్విలోచనుం డిల న
లోకానుసార శీలుఁడు పండితయ్య;
యేరుదగు లోకసంహారుండు శూలి
గరుణమై లోకోపకారి పండితుఁడు;
అసితకంఠుండు దా నసమలోచనుఁడు
భసితకంఠుండు శ్రీ పండితేంద్రుండు;
ఊర్ధ్వైకలోచనుఁ డుడురాజమౌళి
యూర్ధ్వ²ద్విలోచనుం డో³గిఁ బండితయ్య;
భక్తైకదేహుండు పరమేశ్వరుండు
భక్తసత్ప్రాణుండు పండితస్వామి;
మల్లికార్జుననామి మల్లికార్జునుఁడు;
మల్లికార్జునకీర్తి మల్లికార్జునుఁడు;
మహి³లోనఁ బండిత మల్లికార్జునుని

---

౧. రమణుఁ-డ. ౨. లోచనయుగం. ౩. లోకబంధుఁడు.

మహిమలు వర్ణింప మనుజుల తరమె ?
కడు నర్థి నుత్పత్తికర్త నాబ్రహ్మ
వడి బ్రహ్మ మను బ్రహ్మవాదులఁ ద్రుంచి
హరభక్తి యుత్పత్తి కధిపతి నాఁగఁ
బరగెఁ దాఁ దొల్లి శ్రీపతి పండితయ్య ;
స్థితికర్త హరి నుమాపతికి మ్రొక్కించి
క్షితి విష్ణువాదులఁ గీ టడఁగించి,
చెనసి భక్తిక్రియా స్థితికర్త యనఁగఁ
జనియెను లెంక మంచన పండితయ్య,
[౧]గాథగా సంహారకర్తయ యనుచు
సాధారణముగ నీశ్వరుఁ బల్కుభక్తి
దూరాన్యసమయసంహారుఁడై చనియె
శూరుండు మల్లికార్జునపండితయ్య ;
ఖ్యాపితభక్తికిఁ గారణపురుషు
లై పండితత్రయం బన భువిఁ జనియెఁ ;
దనరు నీ పండితత్రయములో మాన్యుఁ
డన నొప్పు మల్లికార్జున పండితయ్య ;
అట్టి పండితమల్లికార్జును[౨]మహిమ

౧. గాథమై (యై; య). సం.-" సంహారకర్తైవ మహాదేవ ఇత్య
సమంజసం వచ శ్శాస్త్రపరిజ్ఞాన మవిజ్ఞాయ వదంతి యే". ౨. చరిత.

మిట్టలంబుగ నుతియింతు నెట్లనిన
ధరఁ దత్కథానుసంధానంబు[1] వినుము——
కర మొప్పు దక్షిణ కైలాస మనఁగఁ
జను సర్వపర్వత సార్వభౌమాఖ్య
తను బేర్చు శ్రీగిరీంద్రంబు దా నదియు
ననుపమ ప్రమథ[2]గణాస్థాన వేది,
మునుల ముముక్షుల [3]మూలబండరువు,
బాగొందఁ [4]బర్వతు పండినతపము
ప్రోగైన [5]మూర్తి, శంభుని యశోరాశి,
గరువుగట్టిన మహాకాశంబు, శ్రుతుల
శిరము, ఘనీభవించిన పరంజ్యోతి,
దఱిగని పుణ్యంబు, తవనిధినుతుల
గుజ్జీ, సదాశివుని యంకుర, మద్రిజాత
వలపలి బరి, భక్తవరుల యిల్వేల్పు,
సలసంబు లేని విజ్ఞానాబ్ధికడలు,
ధృతి ముద్దగించిన దివ్యామృతంబు,
లత గరిగొన్న మూలస్తంభ మనఁగఁ
జెలువారునట్టి యా శ్రీశైల శిఖర

---

౧. వినుఁడు. ౨. మహాస్థాన. ౩. మొదలి. ౪. బండితు. ౫. ముక్తి.

కలితత్రిలోక విఖ్యాతయశః ప్ర
పూర్తియా శ్రీ స్వయంభూలింగ చక్ర
వర్తి, యసమకీర్తి, వారితనతజ
నార్తి, శ్రీమన్మల్లికార్జున లింగ
మూర్తి యొప్పారు [1]సమున్నత మహిమ,

భక్తప్రశంస

నట్టి శ్రీమన్మల్లికార్జున భక్తి
పట్టభద్రులును, శ్రీ పర్వతక్షేత్ర
వాసులు, యామ్య కైలాసచూడా వి
భాసితకీర్తి విభ్రాజితమణులు,
వరభుక్తి చిరముక్తికర భక్తిరతులు,
నరచర్మధర కర్మహారధర్మవరులు,
గృతకృత్యహితభృత్యధృతసత్యరతులు,
వ్రతధామభృతసీమజితకామసముఖులు,
సిరకోపపరతాపఖరపాపహరులు,
హారతంత్రగురుమంత్రపరతంత్రచరులు,
ధన్యులు, సుకృతవదాన్యులు, విగత
దైన్యులు, లోకైకమాన్యులు, వరమ
పాత్రప్రసాదైకగాత్రులు, గర్మ

[1]. సంపూరిత.

జైత్రులు, భవలతా దాత్రులు, ద్రిమల దూరులు, శుభతరాకారులు, గత వికారులు, విజిత సంసారుల్, దయా వినిద్రులు, గలియుగరుద్రులు, వీర భద్రులు, గరుణాసముద్రులు, బుధమనోజ్ఞులు, దూరీకృతాజ్ఞులు, శ్రుతివిధిజ్ఞులు, వినుతదైవజ్ఞు, లవార్య వీర్యులు, శివపదాచార్యులు, ప్రణమితార్యులు, ద్రిభువనవర్యు లనంగం బూజ్యత శ్రుతి పరిస్ఫుట వీరభక్తి రాజ్యైక మహిమాభిరతి సుఖించుచును. మానితాసంఖ్యాత మాహేశ్వరులు, శివానందనిలయులై యుం దొక్కనాఁడు.

భక్తానుగ్రహణము

అరుదుగ శ్రీమల్లికార్జున దేవు
ానురుమంటపస్థలి నొడ్డోలగమున
శివభక్తి తత్త్వగోష్ఠీ ప్రసంగమునం
దవిలి నూతన పురాతన భక్తమహిమ
లంకించుచును నిజాపాంగ హర్షాశ్రు

౧. వర. ...వడ్డో.

కంకణంబులు రాలఁ గరుణ నన్ జూచి
యాలోన మధు మధురాంచితాలాప
జాలంబు గర్ణరసాయనంబుగను
వీరమాహేశ్వరాచారవర్తనులు,
వారి దృష్టాదృష్ట వైభవోన్నతులు,
దండి[1]తాఘులు మన దండనాయకులు
వండితసత్తముల్ [2]దండితాఘులును

ప్రబంధకృతి స్వీకారము

విస్తరించిరి దొల్లి విఖ్యాతిగాఁ బ్ర
శస్త సద్భక్త ప్రసాదాతిశయత
ఖ్యాతిగా సద్భక్తగణ[3]లాలనముగ
నూతనంబుగ జగన్నుతముగా మున్ను
"బసవపురాణ" మొప్పఁగ రచించితివి;
బసవపురాణ ప్రబంధంబునందు
ప్రథిత పురాతనభక్త[4]గణాను
కథనంబు లితిహాసఘటనఁ గూర్చితివి;
వర వీరభక్తి సవైదికంబుగను
విరచించితివి "సతుర్వేదసారము"న;
బసవన్నమహిమ శుంభద్భక్తియుక్తిఁ

---

౧. తాఘులు. ౨. ఖండితాఘులును. ౩. లాలస. ౪. గణాను..

బసరించితివి గద్యపద్యాదికృతుల;
నర్ణవావృతధాత్రి[1]యం దొప్పు బసవ
వర్ణనల్ సేసితి వరుసన నీను
లారంగ [2]గురుమల్లికార్జున పండి
[3]తారాధ్యులచరిత్ర మర్థి వర్ణింపు;
పరిశిష్ట పరిమిత ప్రాక్తనభక్త
చరితంబు లితిహాససంగతి నొలయ
సంధింపు పండితచరితంబునందు;
బంధుర తన్మహాభక్తైకమహిమ
బసరింపు మసమ వా[4]క్పాటవశక్తి
ససలార [5]నొసగితి మని ప్రసాదింప

కవీశ్వర నామంబు

నిండారు భక్తితో నిఖిల భక్తులకు
దండ నమస్కృతిత్రయ మాచరించి
సరస[6]సద్భక్త ప్రసాదేక్షుణామృ
తరసాబ్ధి కేలీ నితాంతసౌఖ్యంబుఁ
బరిచితసద్భక్త పాదారవింద

౧. నట్లొప్పు. ౨. మన. ౩. తారాధ్యచరితంబు నట్లు. ౪. క్పాటన. ౫. నొసఁగె. ౬. తద్భక్త.

పరిమళోత్తంస [౧]విస్ఫార వైభవము
నసమసద్భక్త పాదాంకిత రేణు:
లసితఫాల స్థలాలంకృతమహిమ
భాసిత సద్భక్తపద నఖముకుర
భాసమానాంగ[౨] విభ్రమముఁ దలిర్ప
భవదీయ కారుణ్య పాత్రుండ నైతి
భువి నేన ధన్యుండఁ బుణ్యుండ నాదు
వీర[౩]భక్తిస్థల విశ్రుతాచార
సార వ్రతాదులు సఫలత[౪]నొందె.
వాయార భక్తుల వర్ణింపఁ గంటిఁ
బాయక నాజిహ్వ పావనం బయ్యెఁ;
బ్రదికితి; నా జన్మఫలమెల్ల నేఁడు
దుదిముట్టె ననుచు సం[౫]తోషాబ్ధిఁ దేలి
శివ[౬]భక్తతతియాజ్ఞ శిరమునఁ దాల్చి
శివకవుల్ హర్షింపఁ జెప్పె[౭]దఁ గవిత.
ధర "నుమా మాతా, పితా రుద్ర" యనఁగ
వరపురాణోక్తి నీశ్వరకులజుండఁ
బే రెక్కఁదగిన శ్రీబలిదేవి వేమ

౧. విస్తార. ౨. విగ్రహము. ౩. భక్త. ౪. నొంద. ౫. తోషం బెలర్ప. ౬. భక్తవరులాజ్ఞ; భక్తులాజ్ఞ నా. ౭. మ కవిత.

నారాధ్యులను పరమారాధ్య దేవు
మనుమశిష్యుండ శ్రీమద్గురులింగ
ఘన కరుణాహస్త గర్భసంభవుఁడ;
మును బసవపురాణమున నెన్నఁ[1]దగిన
పెనుపారు జనులకుఁ బెంపుడుఁగొడుక;
బసవపురాణ[2]ప్రబంధ మన్ పేరి
బసవపురాణ మన్ పట్టి గలాఁడ;
బసవగోత్రుండను బసవని కరుణ
బసవేశు శ్రీపాదపద్మ[3]సేవకుఁడ;
బసవన్నఁ బొగడఁ బొల్పడు కవీంద్రుఁడను;
బసవన్నఁ [4]బొగడఁ బొల్పడు [5]పాఠకుండ;
బసవన్న దూత; నే బసవన్న బంట;
బసవన్న లెంక; నే బసవన్న లెంగి;
బసవన్న యిలువుట్టు బానిసకొడుక;
బసవన్న పన్నల పన్నఁ గావునను
బసవేశు పేరిటఁ బ్రాప్తవ్య మగుట
మసలక మా చెన్నమల్లికార్జునుని
బసవనామం బిడి భక్తిపెక్కువను

౧. బడిన. ౨. ప్రబంధంబు పేరి. ౩. శేఖరుఁడ. ౪. బాడ. ౫. కవీంద్రుండ.

బసవలింగం బని ప్రణుతించువాఁడ;
భవికృతారంభసంభవ[1]ధాన్యనిచయ
భవినిరీక్షణ రసపాకవితాన
భవిహస్తగత ఫలపత్ర[2]శాకాది
భవిగృహ[3]క్షేత్రాంఘ్రిప ధనవర్జితుఁడ;
భవజన దర్శన స్పర్శ నాలాప
వివిధ దానాదాన విషయదూరగుఁడ;
శుద్ధ[4]భక్తిస్థల శ్రుతిమతాచార
సిద్ధవీరవ్రత శీలాన్వితుండ;
నలిఁ బాల్కురికి సోమనాథుం డనంగ
వెలయువాఁడను; జతుర్వేదపారగుఁడ
నైన మత్కృతి విన నర్హుండు వలయుఁ
గాన నీ వర్థి నాకర్ణింపవలయు.
విను [5]సూరనామాత్య, వినమితామాత్య,
యనఘసాంగత్య, దృగంచలశైత్య,
పరమపవిత్ర, యాపస్తంబసూత్ర,
హరితసగోత్ర, విద్యాపుణ్య[6]యాత్ర,
బసవాంతరంగ, శుంభద్గుణోత్తుంగ,

---

౧. భావ్య. ౨. శాకాఘ. ౩. క్షేత్రాంక పతన. ౪. భక్త.
౫. మాదనామాత్య. ౬. గాత్ర.

యసమవిలాసాంగ, యార్యానుషంగ,
వీరభక్తిస్థైర్య, విపులదోర్వీర్య,
సార[1]తరౌదార్య, సంచితధైర్య,
వీర[2]పోచేశ్వర విశ్రుతాచార్య
కారుణ్యహస్తాబ్జ గర్భసంభవుఁడ,
చరలింగ గురులింగ సాహిత్యలింగ
చిరసమనిష్ఠైకశీలవర్ధనుఁడ
[3]కడు మించి శివునకుఁ గన్ను లర్పించి
పడసిన దృఢవీర[4]భక్తివర్ధనుఁడ,
నీ దృగర్పితపునరాదాన[5]రతికి,
నీ దానధర్మవినీతికి మెచ్చి
బసవేశుడక్కిన భక్తుండ వనియు,
నసదృశలీల మా కను[6]గులం బనియు,
మచ్చిక నా ముద్దుమఱఁది వీ వనియు,
నెచ్చెలికాఁడవు నీవ కా కనియుఁ,
జాతుర్య సాహిత్యశాలి వీ వనియు,
శ్రోతృత్వమునకుఁ బాత్రుండ వీ వనియు,
రచియింతుఁ బండితారాధ్యచరిత్ర

---

౧. గుణౌ. ౨. పూజేశ్వర ; పోలేశ్వర; దోరేశ్వర ; మహేశ్వర. 3. కడ మించి. ౪. భక్త. ౫. రతిని. ౬. గలం.

మచలితప్రీతి[1]యు, నతిశయభక్తి
బుద్ధియు,[2] భవదీయ పుత్రపౌత్రాభి
వృద్ధియు, సంపత్సమృద్ధియుఁ, జిదభి
వృద్ధియు, నిష్టార్థసిద్ధియు, నాత్మ
శుద్ధియు, లోకప్రసిద్ధియు, నాయు
రారోగ్య భాగ్య సదైశ్వర్య సౌఖ్య
భూరిసమృద్ధియుఁ బొందె[3]డ మనుచు
దీవించి నిన్ను సంభావించి శ్రోత్రఁ
గావింతు సచివాగ్రగణ్యా సూరార్య

కావ్యకలానుక్రమణిక (కవితాప్రశంస)

తత్కథావిషయ వైదగ్ధ్య మెట్లనిన—
[4]సత్కృతియన నూత్నసంగతి దనరఁ
దొమ్మిదిరసములు [5]దులు[6]కాడు దాని
యిమ్మడి వర్ణన [7]లెసగంగ ద్విగుణ
మగు నలంకారంబు లన[8]లారు దాని
ద్విగుణార్థభావముల్ దీటుకొనంగఁ

౧. నీ కతి. ౨. భవదియ్యా—ఇట్లు పూర్వులు వ్రాసేవారు. ౩. దమ. ౪. ఇక్కడనుండి సంస్కృతగ్రంథములో కవిత్వమును గురించిన ద్విపదల కనువాదము లేదు. ౫. దొలు. ౬. కాడవాని. ౭. లెసగఁ జద్వి. ౮. లారవాని.

దేట తెనుంగున ద్విపద రచింతుఁ
బాటిగాఁ దత్కథాప్రౌఢి యెట్లనిన—
జాతులు మాత్రానుసంధాన గణవి
నీతులు గాన 'యనియతి గణై' ర
నియముఁ 'బ్రాసోవా' యనియు 'యతిర్వా' య
నియుఁ జెప్పు ఛందో వినిహితో క్తి గాన
ప్రాసమైనను యతిపైవడి యైన
దేసిగా నిలిపి యాదిప్రాస నియతి
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు
నొప్పదు ద్విపద¹గ్రామ్యోక్తి నావలవ
దారూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు
నట్టులుఁగాక కావ్యప్రౌఢిపేర్మి
నెట్టణ రచియింప నేర్చినఁజాలు
నుపమింప గద్యపద్యోదాత్తకృతులు
ద్విపదయు సమమ భావింప నెట్లనిన
సరళత సరణి ప్రసన్నత సెన్ను

---

౧. గ్రామ్యోక్తి.

# దీక్షా ప్రకరణము

పరిణతి గణపదపద్ధతి శబ్ద
శుద్ధి ప్రయోగప్రసిద్ధి గళాస
మృద్ధి నానుడి వడి మితి రతి యర్థ
పుష్టి నైజము రసపుష్టి వినూత్న
సృష్టి విశేష్యవిశేషణశ్లేష
సొంపు గుమారత వెంపు మాధుర్య
మింపు మృదుత్వంబు [1]నింపో[2]జ [3]ఋజువు
యమకంబు గమకంబు యతి[4]గతి గార
కము పూరకము క్రియ గాంతి విశ్రాంతి
రంగు బెడంగు మెఱుంగు సమాన
సంగతి యక్షరశయ్యాసంఘటన
నిపుణత [5]రసికత నెఱిసమా[6]ధాన
ముపమాన మవధానముత్ప్రేక్ష లక్ష్య
లక్షణవ్యక్తి యలంకారయుక్తి
దక్షత సుమతి విచక్షత యనిన
జాతులు రచనాప్రణీతులు గావ్య
నీతులు రీతులు నేతు లుట్టంగ
వరకవు ల్గొనియాడ వర్ణనకెక్క

---

౧. గుం; నుం. ౨. జా. ౩. చ (స)దువు. ౪. రతి. ౫. సర సః. ౬. సార్థ.

ధరఁ జెప్పఁ గృతియు నుద్యత్కృతిగాక,

కుకవినింద

జల్లి పూరక మపశబ్ద మక్రమము,
[1]వొల్ల విక్రియ జడ్డువాడ వసంఘటన,
గాకు వ్యర్థం బసంగతి విరసంబు
వైకల్య మత్యుక్తి వైరిపదంబు,
దలవిరు పసమగ్రత శిథిలబంధ,
మొలు పబంధంబు గ్రామ్యోక్తి గంటకము
[2]ద్రాప ఛందోవిరుద్ధం బాదియగున
లాపప్రలాపోక్తి లాఘవం బనక
వసిగూర్చు కృతులునా వడ్లనుఁ బెరుఁగుఁ
బిసుకుఁ చందపు బిలిబిలికృతుల్ గృతులె?
యటుగాన యభినుతానందితోక్తిఁ
బటుగద్యపద్యప్రబంధసామ్యముగఁ
గావ్యకళాప్రౌఢిఁ గల్పింతు, [3]ద్విపద
కావ్యంబు భావ్యంబుగాన యట్లయ్యు
నవికల వేదవేదాంతేతిహాస
వివిధాగమపురాణ విహితసూక్తముల
నిదమిత్థ మనుచోట నివియప్రామాణ్యా

---

౧. వొల్లు. ౨. లాప; లాబ. 3. ఁగవిత.

పదములుగాఁగ ద్విపదలు సంధింతు,
సొంపైనరత్నంబుచుట్టునుఁ [౧]బసిఁడి
గట్టిన [౨]భావన నెట్టణఁ దెనుఁగు
సంధిపూర్వాపరసంఘటనముల
బంధురఛందోనిబద్ధముల్గాఁగ
వేద[౩]సూక్తములకు వెరవైనమాట
లాదటఁ గల్పింతు నవిజల్లియనక
[౪]వలనెఱింగియు వేదవాక్యంబు ద్విపద
కొలఁదిన పలుకుటకును మది మెచ్చి
[౫]వ్రేలిముద్రిక రత్నకీలనసేయు
చో లేశమైన వచ్చునె రత్నమొత్త
సొంపైన రత్నంబుచుట్టును బసిఁడి
గట్టుట యది వివేకం బట్లయయ్యు
దేసిగా విరచించు ద్విపదకు వళ్లుఁ
ప్రాసంబులును బొందువడఁ దాపవలయు
ననుచుఁ దదీయ సూక్తాక్షరపంక్తిఁ
[౬]జైనకక [౭]యింతొప్పఁజెప్పనే యనుచు

---

౧. బైఁడి. ౨. భావాన. ౩. సూక్తులకును. ౪. వలగని తద్వేధవాక్యంబు; వలగని తద్వేదవేదులు. ౫. కేలి. ౬. జైనయక. ౭. యింపొంద.

సన్నుతిసేయుచు సత్కావ్యు లలరఁ
దిన్నని సూక్తుల ద్విపద రచింతు
నదియునుగా నైహికాముష్మిక ద్వి
పదహేతువగుట ద్విపదనాఁగఁ బరగు
ద్విపదాంబురుహముల ధృతిబసవేశు
ద్విపదాంబురుహము లతిప్రీతిఁ బూన్తు
బసవలింగము గృతిపతియగు, కృతియు
రసికతఁ బండితారాధ్యచరిత్ర
మగు, పాల్కురికిసోమనార్యుఁడు సుకవి
యగు, కథాశ్రోత సూరామాత్యుఁడగు
కృతిపతి గృతి గవి గృతికథాశ్రోత
క్షితిఁ జెప్పనొప్పదే శివభక్తసభల

అవాంతర పండితాది దేశికవర్ణన

శ్రీశైవసమయ దేశికచక్రవర్తి[1]
[2]పాశమోచనకళా పారీణమూర్తి
శుంభద్దిగంతవిశ్రుత[3]శివకీర్తి
శాంభవదీక్షాభిజాతానువర్తి
యుత్తమోత్తముఁడు, సంయుతవీరభక్తి

---

1. ఇంతవరకును సంస్కృతానువాదము లేదు. 2. పాశవిమోచన పటుకళామూర్తి. 3. సిత; శుభ.

వృత్తచిత్తుఁడు, సతుర్వేదార్థవేత్త,
గహనసంసృతి శిరఃఖండనహేతి,
మహితపంచాక్షరీమంత్రసిద్ధుండు,
వేదాగమపురాణ [1]వివిధ[2]శాస్త్రోప
[3]పాదితరుద్రాక్షభసితభూషణుఁడు
యమనియమాదివ్రతాచారసార
శమదమోత్కృష్టనిష్ఠా[4]గరిష్ఠుండు,
నంతర్బహిర్ధ్యాన యజనవంతుం, డ
వాంతరయ్యయనంగ హరగణాఢ్యుండు,
వారిశిష్యుండు దుర్వారసంసార
దూరవీరవ్రతోద్ధురవర్తనుండు,
శైవధర్మోత్తమాచార్యం [5]డనంగ
దైవుండు నద్వైతతత్త్వతత్పరుఁడు,
న్యాయవైశేషికోదాత్తశాస్త్రాన
పాయదర్శన పరిపాలనక్షముఁడు,
స్వాకృపావలోకనోత్సారితశిష్య
నికరమలత్రయ [6]నిష్ఠితేంద్రియుఁడు,
దంత్రా[7]ధిగతవీరతంత్రస్వతంత్ర

---

౧. విహిత. ౨. శాస్త్రను. ౩. వాదిత. ౪. మహి.
౫. డునతగ. (?) ౬. నిరసి. ౭. భి.

మంత్రాధిగతరాజ మంత్రసిద్ధుండు,
వేదవేదాంత వివిధపురాణోప
పాదిత కేవల భక్తివర్ధనుఁడు,
వండిత నతపాదపద్ముండు, సుకవి
మండలి విబుధసమాజపూజితుఁడు,
ఆహాఢకీర్తిశుఁడగు కోటిపల్లి
యారాధ్యులనఁగ లోకారాధ్యమూర్తి,
యసమతదీయ లోకారాధ్య శిష్య
విసరాగ్రగణ్యుండు వీరవ్రతుండు
సన "సరుద్రోనాత్ర సంశయో"యనఁగ
జనియించినట్టి సాక్షాద్రుద్రమూర్తి,
వశుయోగపాదాదిపరవాది విసర
విశసనప్రత్యక్షవీరభద్రుండు
దండితాఘుఁడు జగత్పావనకార
ణుండు విశ్రుత జగన్నుత సితకీర్తి
యధికశాపానుగ్రహసమగ్రబలస
మధిగత దివ్యపంచాక్షరీవేత్త
వావదూకానీక వాగ్బంధనక్రి
యావిశారదుఁడు లోకారాధ్యమూర్తి,

---

౧. ణానువాదిత. ౨. భక్త. ౩. నుత. ౪. శివ.

వరగి "శైవో దశప్రత్యయో" యనఁగ
వరువడిం జనుదశప్రత్యయాన్వితుఁడు,
ధన్యుండు, దేశికోత్తముఁడు, లోకైక
మాన్యుండు, పండితమల్లికార్జునుఁడు
అట్టి పండితమల్లికార్జునారాధ్య
పట్టబద్ధుని సముద్భవ మెట్టులనిన—

మల్లికార్జున పండితోత్పత్తి

ననమాంబకుఁడు శ్రీవృషాధినాయకుని
బసవనామంబిడి ప్రమథానుమతిని
వాలారుసద్భక్తి వర్ధనార్థముగ
భూలోకమున కర్థిఁ బుత్తెంచుతఱిని
ననుపమ పరమపరానంద మొసగు
తనపాదభక్తియుఁ దన్నంది కేశు
సర్వజ్ఞతయు, భృంగి సహజనిష్ఠయును,
దూర్వాసముఖ్యుల ధ్రువశాపశక్తి,
యక్షపాదాదుల యతులితవాగ్వి
చక్షత, యుపమన్యు సద్గురుత్వంబు
మహనీయరుద్ర ప్రమథగణాధిపుల
సహజస్వకీయ ప్రసాదైకరతియుఁ
బ్రాక్తననూతన భక్తగణముల . .

వ్యక్తదృష్టప్రత్యయారూఢమహిమ,
ఘనవీరభద్రు విఖ్యాపితశౌర్య
మునుగూడనట్లొక్క మూర్తిగాఁ దలఁప
ముక్కంటితలఁపు దా మూర్తీభవించి
చక్కగా భువిఁ జక్కఁ జాగిలమ్రొక్క
నానందుఁడై శంభుఁ డమ్మూర్తి కపుడ
నానాపురాణ విజ్ఞానంబు నొసగి
తనదు ప్రసాదసుధావృష్టి ముంచి
యనుపమ ప్రమథగణస్థాన మమర
బసవకుమారుని పజ్జను నీవు
వసుధకు శివభక్తి వర్ధనార్థముగ
నరుగుము[1]నేను లో[2]కారాధ్యమూర్తి!
కరచరణాద్యంగకములతో వచ్చి
శిష్యుఁగా నిన్ను శిక్షించి రక్షించి
శిష్యప్రశిష్య ప్రసిద్ధుఁ గావించి,
లోకగురుత్వ, మలుప్తవైభవముఁ,
బ్రాకటస్వసమయ పాలనత్వంబుఁ,
బరసమ[3]యాంతక ప్రథిత[4]ప్రశక్తిఁ,
బరమపాండిత్య విభ్రాజితమహిమ,

---

౧ నేము. ౨. నంద. ౩. యాంతర. ౪. ప్రసక్తి.

వీరభక్తస్థల విశ్రుతా[1]చార
సారవ్రతైక నిష్ఠాపరత్వంబు,
నసమశాపానుగ్రహ సమగ్రతయును,
రసవిషయాది వైరాగ్యవర్తనము,
వేదవేదాంతోపపాదితమత్ప్ర
సాదవిశేష సం[2]పాదనప్రతిభ,
[3]శివమహత్త్వప్రతిష్ఠిత[4]వచస్సిద్ధి
శివతత్త్వసార సంచితకళావృద్ధి
సము[5]దిత[6]శివయోగ సంపత్సమృద్ధి,
నమిత[7]దృష్టప్రత్యయాంచిత మహిమ
ఘోర[8]నిస్సార సంసారవారాశి
పారగత్వముఁ గళాపరతంత్రతయును
నొసఁగెద వేంగీమహోర్వీస్థలమున
నసమానలీల[9]దక్షారామమొప్పు
నప్పురంబున సముద్యన్మహామహిమ
నొప్పు శ్రీభీమేశ్వరోరులింగంబు;
[10]రూఢిఁ దద్దేవు పురోహితశ్రేష్ఠుఁ,

---

౧. చార్య. ౨. పాఠిత. ౩. శివతత్త్వసారసంచిత. ౪. మహా మహిమ; కళాప్రౌఢి. ౫. చిత. ౬. వినియోగ. ౭. దివ్య. ౮. సంసారదుర్వార. ౯. ద్రాక్షా. ౧౦. ప్రౌఢి.

డీడిత [౧]విద్వన్మహిష్ఠుండు వీర
భక్తిసత్తముఁడు సద్బ్రాహ్మణోత్తముఁడు
వ్యక్త[౨]వానసవంశవర్ధనకరుఁడు
వాత్రుండు భీమనపండితేంద్రుండు
పుత్రార్థియై మమ్ము భువి భజింపుచును
శ్రీదివ్యపంచాక్షరీ[౩]శుభమంత్ర
మాదటఁ శుద్ధాత్ముఁడై యనుష్ఠింప
బహుపురశ్చరణలు వాటిల్లె నిపుడు
మహినొప్పు శ్రీగిరి మల్లికార్జునుని
సన్నిధి నొకపురశ్చరణ గావింపు
చున్నవాఁ డతనికి నుదయింపు మనుఁడు
ననురక్తి సాష్టాంగుఁడై యేఁగుదెంచి
జనియించె భీమాఖ్యు సాధ్వి గౌరాంబ
జఠరంబున జనని జఠరకఠోర
పిఠరాపహరణ[౪]కర్మఠుఁ డురుమతిని
మల్లికార్జున[౫]కీర్తి మహితశ్రీశైల
మల్లికార్జునదేవు మహనీయనామ
మగుటఁ బండితమల్లికార్జునుం డనఁగ

౧. దీవ్య. ౨. కారణ; సం. కన్న. పాణస. ౩. సిద్ధమంత్ర; మంత్రరాజ. ౪. కర్మఠలుంఠమతిని; కర్మఠుఁడుసమ్మతిని; ౫. మూర్తి.

నగణిత ప్రీతి దక్షారామమునకుఁ
జని యంత మఱియును సద్గురుమూర్తి
యనఘుఁడు గోటిప ల్లారాధ్య దేవ
దేవుని సత్కృపా దృగ్విలోచనసు
ధావార్ధి మధ్యగత క్రీడవలన
సంకీర్ణబహుపూర్వ జన్మ[1]మలాది
పంకం బణఁచి వీరభక్తిదీక్షాది
విధిఁ గ్రియా[2]సంస్కార విధు లాచరించి
విధిలిఖితలలాట వివిధదురక్ష
రావళి మాయ భస్మాభిషేక ప్ర
భావసంగతిభూతి పట్టంబుఁ బూని
శస్తసదాచార్య హస్తస్వకీయ
మస్తకసంయోగ విస్తార[3]విధులఁ
బాంచభౌతికశుద్ధి భావశుద్ధియు సృ
జించి తదీయ దేశికదయారూఢి
శ్రీమూలమంత్ర దయామృతసార
కామితనిజకర్మ కలితసంగతిని
ధృతిఁ బశుపాశపతి జ్ఞానదృష్టి
మతివెల్గ మాయాతమంబుఁ దూలించి

---

౧. ఫలాది. ౨. సుస్థాన. ౩. విమలపాంచ.

సద్గురుకరుణా సముద్గత పరమ
చిద్గతతన్మంత్ర హృద్గతలింగ
సన్నిహితాంగ సత్సంగతలింగ
సన్నిహితప్రాణ సంబంధకళల
సప్రాణలింగ లింగప్రాణమథన
సుప్రసాదానుభవ[1] ప్రమత్తేంద్రి
యావధానము, విషయాన్యసుఖాంత
రావధానముం, దదీయాసక్తిం బడసి
విధినిషేధాతీత వీరశైవోక్త
విధి "సద్గురుభ్యో నివేదయే" త్తనంగ
నవికల ప్రాణదేహార్థముల్ పూర్వ
భవ భావి భవసముద్భవహారు, సకల
భవహారు, సాత్త్వాదభవు, జితభావ
భవు, శివు, శ్రీకోటి పల్లియారాధ్య
దేవు శ్రీపాదు కేందీవరంబులకు
భావం బెలర్ప నర్పణ మాచరించి
పడసి ప్రాణార్పణ ప్రాణలింగంబు
వడసి తత్తనుసమర్పణ ప్రసాదంబు
వడసి తద్ధన సమర్పణ జంగమంబు

౧. ప్రమథేంద్ర సావధానము. ౨. జేసి.

వడసి తత్పూజాను భవభజనంబు
లొడఁబడ వీరవ్రతోద్యుక్తి నడవ
బుడివుల్లు వోవుచు భూసురుల్ నరులుఁ
బండితుఁ జూచి సైఁపక యొక్కనాఁడు
"పండితయ్యా! నీవు పౌరాణికుఁడవు,
సద్విజోత్తముఁడవు, సచ్చరిత్రుఁడవు,
విద్వాంసుఁడవు, వేద విదుఁడ వట్లయ్యు
భూతియు రుద్రాక్షములుఁ దాల్పనగునె
నీతియె లింగసన్నిహితమైయున్కి?
పాదోదకంబుఁ బ్రసాదంబుఁ గొనఁగ
భూదేవతార్హమే వైదికమతమె?
హరివిరించ్యాదిసురాసురముని ని
కరముఁ దాల్చినవారుఁ గలరె మున్నాది?"
ననుడుఁ గించిద్దరహసితాస్యుఁ డగుచుఁ

విభూతిమహిమ సిద్ధాంతము

గనుఁగొని "యాద్యులఁ గానరె? వినరె?
యితరులే? చదువరే? యెఱుఁగరే? నీచ
మతులె? 'భూత్యై న ప్రమదితవ్య' మనఁగ
నాయజుశ్శ్రుతి దదీయార్థంబకాదె?
మ్రోయంగ 'నగ్నే స్వముత్థయా' యనియు,

దఱిఁ ' త్రిపుండ్రస్యచ ధారణం ' బనియు
మఱియును ' నైవప్రమదితవ్య ' మనియు
మనువాక్య మఖిలసమ్మత మధర్వణము;
సను ' విమృజ్యాంగాని సంస్పృశే ' త్తనఁగఁ
దదనంతరంబ కాత్యాయనగృహ్యా
మదియు ' దేవానాం త్రయాయుష 'మ్మనఁగ
నొందఁగాలాగ్ని రుద్రోపనిషత్తు
నందతా ' నచపున రావర్తత ' యనఁ
బరగ నారాయణోపనిషత్తునందు
వరువడి ' విరజా విపాప్మా ' యనంగ
నలలేక మఱియు భీమాగమసూక్తి
గుఱిఁ ' దత్ఫలం కోటిగుణితం ' బనంగ
సంశయం బేల భస్మస్నాన మన, ' న
సంశయో ' యన, భువిఁ జాటుచునుండు
నొగియు శ్వేతాశ్వతరోపనిషత్తు
దగ ' మంత్రితం భస్మ ధారయే ' త్తనఁగఁ
బాటియై పరగు జాబాలిశాఖలను
మాట ' సపప భస్మజ్యోతి ' యనఁగ
వరుస దీనికి మానసపురాణసూక్తి
వరుసగా ' జ్యోతిర్భవత్యేవ ' యనఁగఁ

దా రౌద్రమైన బోధాయనస్మృతియు
వారక 'మా త్వా హవామహే' యనఁగ.
భాతిగా శాతాతపస్మృతి సదభి
జాతోక్తియట్ల 'భస్మచ్ఛన్న' యనఁగ
జ్ఞానాదిమైన విజ్ఞానేశ్వరంబు
దాన 'భస్మోద్ధూళితం' బన నింకఁ
జదువులేఁటికి ? వృద్ధశాతాతపంబు
నది 'వైశ్వదేవేశ్వరార్చనే' యనఁ దొ-
డంగి 'ధృతత్రిపుండ్ర' యనఁగ నట్ల
సాంగమై మ్రోయు లౌగాక్షిక స్మృతియు
రంగదతిని 'త్రిపుండ్రం బ్రాహ్మణో' య-
నంగఁ దా 'విద్వా' ననంగఁ గూర్మమున
లలి 'మనసాపి న లంఘయే' త్తనఁగఁ
దెలియంగ 'శ్రుత్యా విధీయతే' యనఁగ
'యస్మా' త్తనంగఁ 'దత్త్యాగీ' యనంగ
విస్మృతిఁ 'బతితో భవే' త్తన నట్టు
లడరి త్రిపుండ్రవాక్యంబాది నెన్నఁ
బడఁగ మీఁద 'సురవిప్రాణా' మనంగ
సురలకు ద్విజుల కచ్చుగఁ ద్రిపుండ్రముగ
నరుదొంద భస్మ మర్హంబు దాల్పంగ

వల 'వర్తులంన్నృపవైశ్యయో' రనఁగ
లలి నృపులకు వైశ్యులకు వర్తులముగ
సాంగంబుగా 'నర్ధచంద్రం తు వా' య-
నంగ 'శూద్రాణా' మనంగ శూద్రులకు
ధృతి 'నర్ధచంద్రాకృతి' రనఁగ నున్న
యితరజాతులకు 'నన్యేషా' మనంగ
నట 'నూర్ధ్వపుండ్రకం' బన నూర్ధ్వపుండ్ర
మటుగూడఁదాల్ప నర్హము భూతియంద్రు
ప్రతి 'నగ్నిదగ్ధేన భస్మనా' యనఁగ
ధృతి 'నగ్నిదగ్ధ మితి' శ్రుతియనఁగ
రయమందఁ గూర్మపురాణంబు నిట్లు-
లియ 'స్రష్టస్పృష్టిచ్ఛలేనాహా' మనఁగ
సరిఁ 'త్రిపుండ్రాంకం ప్రశస్యతే' యనఁ దొ-
డరి 'ససర్జ చ లలాటం హి తిర్య 'క్క-
నఁగ మఱి 'యూర్ధ్వం' బనంగ 'వర్తుల' మ-
నఁగ సృష్టిసేయుచో నాఁ డాయతముగఁ
జేసెనో, నడుప్రయ్యఁ జేసెనో, పొడవు
సేసెనో, వట్రువసేసెనో మున్ను,
భూతిత్రిపుండ్రముల్ పూయ దేహులకు
భాతిగాఁ జేసెనో ఫాలముల్ మఱియుఁ

భాన లేమిటికి 'లుంపంతి దైవలిఖి
తాని 'నా ' నేతాని తాని 'నా మొదల
జగతివెండియును శ్రీస్కాందసూక్తమునఁ
దగిలి ' యధీతం శ్రుతం తేన ' యనఁగఁ
బెనుపొంద ' యేన విప్రేణ శిరసి' య-
నను ' త్రిపుండ్రం భస్మనా కృతం ' బనఁగఁ
దగి ' కృతం స్యా దకృతంచైవ ' యనఁగఁ
దగ ' శ్రుతమ ప్యశ్రుతం భవే ' త్తనఁగ
ధర ' నధీత మనధీతంచ ' యనంగ
ధరఁ ' త్రిపుండ్రం న యో ధారయే ' త్తనఁగ
సననేల వేయు సర్వాగమోత్తరము
నను ' నాస్తి భస్మవినా స్నాన ' మనఁగఁ
బొరి ' న దీక్షా న తపోమంత్ర ' మనఁగ
ధర ' నయజ్ఞా దేవతార్చన ' మనఁగ
జడను ' వేదాగమజ్ఞాన ' మనంగ
వడి ' భస్మమాహాత్మ్య వర్జితం ' బనఁగ
గరుడపురాణ విఖ్యాతసూక్తంబు
ధర ' నభావే వా తథావిప్ర ' యనఁగ
దగ ' లౌకికాగ్నే స్తదాహారే ' త్తనఁగ
వగవంగ ' భస్మ నైవ ప్రకుర్వీత '

యన 'నకుర్యాన్మృత్తికాదిభి' రన, ము-
లిన మొందఁ 'గోఽపి మలినధారి' యనఁగ
రతి నట్ల వాసిష్ఠరామాయణంబు
దతి 'యదసత్యం మృదా ధార్య' మనఁగ
నతిశయప్రీతి బ్రహ్మాండపురాణ
మత 'మహో! మోహస్య మాహాత్మ్య' మన మొ-
దలఁ 'ద్రిపుండ్రం మోక్షదం త్యక్త్వ' మన, వి-
రల 'మేత దన్యత్ర రమతే' యనఁగ, ను-
చితసూక్తి యట్ల వాసిష్ఠలైంగంబు
మత 'మహో! మోహస్య మాహాత్మ్య' మనఁగఁ
జన, 'మయా వక్తుం న శక్యతే' యనఁగఁ
జెనసి 'యన్యత్ర విచేష్టితం' బనఁగ
సతతంబు నది సూతసంహితాసూక్త
మత 'మహో! మోహస్య మాహాత్మ్య' మనఁగ
వడి 'మునీంద్రా బ్రహ్మవాదినో' యన ని-
గుడ 'భస్మ సంత్యజ్య కుర్వ' న్ననంగ
నత్తఱి 'నన్యత్సమాహితా' యనఁగ
నత్తుగాఁ జను భవిష్యత్పురాణమునఁ
జనుసూక్తి 'శుధ్యతే సర్వపాపైశ్చ'
యన 'సితభస్మనా' యను మనుప్రోక్త

మయి 'శ్రుతయ స్స్మృతయశ్చైవ' యన వె-
లయఁ 'బురాణా స్యఖిలాని చ' యనఁగ
నలుచు 'భస్మమాహాత్మ్యం' బనంగ
నిలఁ 'దత స్తద్ధారయే త్సదా' యనఁగఁ
గయికొనియట్లన కారణాగమము
క్రియ 'భస్మ హామకరే స్థాప్య' మనఁగ
మతి 'దక్షిణే నాభిమంత్రితం' బనఁగ
రతి శివధర్మశాస్త్రాభిఖ్యాపితప్ర-
యుతసూక్తి 'వారుణ ముత్సృజ్య' యన ని-
యతమతి 'నాగ్నేయ మాచరే' త్తనఁగ
ఘనతరంబైన లింగపురాణయుక్తి
ననుపక్తి 'సర్వతీర్థావగాహశ్చ'
యనఁగ 'భూతిస్నాన' మనఁగ నుత్తమము
నను భవిష్యత్పురాణము భారతంబు
ననుమతి 'రక్షార్థ' మన 'మంగళార్థ'
మనఁ 'బవిత్రార్థంచ' యనఁగ 'లింగార్థ'
మన 'భస్మ దత్తం మయా పురా' యనఁగ
ననుపమ వేద వేదాంత స్మృతీతి,
హాసపురాణాగమాదుల నిట్లు
భూసురాహ్వమని త్రిపుండ్రంబుఁ జెప్ప

వినిహితజ్ఞానులై వేఱొండు దాల్పఁ
జన 'దూర్ధ్వపుండ్రం ద్విజాః కుర్యు' రనఁగ.
ధర 'లీలయాపి కదాచన' యనఁగ
సరిఁ 'దదాకారేణ శస్త్రేణ' యనఁ ద-
గిలి 'భిద్యతే యమకింకరై' రనఁగఁ
దలఁపరే యముచేతి దండనం బీద్వి-
జులు 'నూర్ధ్వపుండ్రం త్రిశూలంచ' యన మ-
సలి 'వర్తులం చార్ధచంద్రకం' బనిన
యెడ 'లలాటే ధారయిష్యంతి' యన నె-
గడి 'మనుష్యాః పాపకర్మిణో' యనఁగఁ
బాపాత్ముఁ డతఁ డట్లు వారాశరాది
ఖ్యాపితలీల శ్రీస్కాందంబునెూయ
ధర 'నశుద్ధంచ తథాప్రోక్త' మనఁగఁ
బూరి 'వర్తులం తూర్ధ్వపుండ్రకం' బన నె-
సగి 'యశుద్ధం చార్ధచంద్రకం' బనఁగ
నగు 'కీర్తితం చాంకుశాదిభి' రనఁగఁ
జన సాంబ మాసూతసంహితసూక్తు
లొనర నశ్రౌతంబు లూర్ధ్వపుండ్రాదు
లన 'లలాటే శ్రద్ధయాసహా' యనఁగ
మును 'ధారయిష్యంతి మోహేన' యనఁగఁ

నంద 'పాషండోపహత' నాఁ బురాణ-
నందితంబైన మానవపురాణోక్త
గతి 'నధార్యం వైదికై ర్జనై' రనఁగ
స్మృతుల పాటిన మనుస్మృతి నూర్ధ్వపుండ్ర
మవునె 'సోర్ధ్వం పుండ్ర' మన వాని మొగముఁ
డవిరి చూడఁగ 'ముఖం దృష్ట్వా' యనంగఁ
జరియింపవలయును జాంద్రాయణము వి-
నరె 'వ్రతం చాంద్రాయణం చరే' త్తనఁగ
నటుగాన శంఖచక్రాంకితులైన
కుటిలాత్ములను జూడఁ గూడునె? యట్టి
యెడ 'నాంకయే న్నదహే ద్దేహ' మన నె-
గడ 'నదహేత్కామకారత' యనఁగ
బోధాయనస్మృతి భువి శ్రౌతవిధికి
'నాధికుర్వంతి దగ్ధాంగ' నా నెట్లు
దెలియంగ 'నాంకయే ద్విప్రో' యనంగ
లలి 'దేవతాయుధలాంఛనై' రనఁగ
మొనసి యంద 'యది వా మోహా' త్తనంగఁ
జనఁ 'బతత్యేవ న సంశయో' యనఁగ
గౌతమస్మృతియు 'నాంగం దహే' త్తన స-
మాతతయుక్తి యమస్మృతిసూక్తి

యిల 'నాంకయేన్న దహేద్గాత్ర' మనఁగ
లలి 'దేవతాయుధలాంఛనై' రనఁగ
నత్తఱిఁ 'బాతిత్య'మన 'యాతి త్వ-
ణా' త్తన స్మృతినివహార్థంబ; మఱియు
నరసమై చను సూతసంహితోక్తుల నొ-
నర 'న కుర్యా దంకనం నరో' యనఁగ
నరయఁ 'గుర్యాచ్చ చక్రాద్యై' రనంగ
నరిఁ 'బతత్యేవ న సంశయో' యనఁగ
న్యాయోక్తిఁ బరగు మానవపురాణంబు
'నాయుధై శ్శంఖచక్రాద్యై' రనంగఁ
దగ 'న దహేచ్చ కదాచన' యనఁగఁ
దగ 'నాధికార్యాః కదాచన' యనఁగ
నవు 'న సంభాష్యా ద్విజాదిభి' రనఁగ
నవల 'న దర్శనీయా' యన నృపతి
వేవేగఁ దనభూమి వెడలింపవలయు
వావిరి 'శీఘ్రం ప్రవాసయే' త్తనఁగఁ
బలుకఁజూడఁగరాని బ్రాహ్మణులైన
నిల శంఖచక్రాంకుఁ డేని వెండియును
బొరి 'న దహే చ్చక్రపూర్వాకై' రనఁ గ-
దిరి 'యంకతో యస్య దేశాంత' మనఁ గ-

శాసనంబెసగ 'రాజా శీఘ్ర' మనఁ 'బ్ర
వాసయే' త్తనఁ బతి వాని దేశంబుఁ
జను వెలార్పఁగఁ బరాశరపురాణంబు
ననయంబుఁ జాట బ్రాహ్మణునైన నపుడ
పదపడి యజ్ఞవైభవఖండ సరణిఁ
దుదిఁ 'గస్యచి ల్లాంఛితో మర్త్య' యన మొ-
దల 'న సాక్షీ సర్వదా భవే' త్తనఁగ
లలి 'నాధికారీ చ లాంఛితో' యనఁగఁ
జని 'లాంఛితో హి నసంభాష్య' యనఁగఁ
బెనుపొందు నంద 'యస్పృశ్యా' యనంగ
నవల 'నదర్శనీయా' యన నతనిఁ
దవిలి పల్కఁగ ముట్ట దర్శింపరామి
భంగిగా 'రాజా' యనంగ, 'దేశా' త్త-
నంగఁ, దద్ద్విజులనానరపతి యపుడ
వేవేగఁ దనభూమి వెడలింపవలయు;
వారిఁ 'శీఘ్రం ప్రవాసయే' త్తనఁగ
నటుగాన శంఖచక్రాదిముద్రలను
స్ఫుటతరంబుగ నూర్ధ్వపుండ్రంబుఁ దాల్చు
పాతకి ముట్టంగఁ బలుకంగఁ జూడ
నీతిగాదని చాటు నిగమ స్మృతితతి-

హోస పురాణాగమాదులు వినరె?
భూసురు లటు దాల్పఁ బూయఁగఁబగునె?

రుద్రాక్షమహిమ

యదిగాక శ్రుతుల రుద్రాక్షధారణ స-
ముదితరహస్య ప్రసూక్తు లె ట్లనిన
విలసిల్లు నల యజుర్వేద సూత్రోక్తి
నలరి 'యేతాని రుద్రాక్షాణి' యనఁగ
నంద 'వేదా ధారయంతి' యనంగ
నంద 'దేవా ధారయంతి'నా, నాది
యయిన లైంగ్యంబు 'రుద్రాక్షధర శ్శు-
చి'యనంగ, మఱి 'శిరసిస్థితే' యనఁగ
భ్రమితులై మత్స్యపురాణంబు నట్ల
రమణ 'రుద్రాక్షధర శ్శుచి'యనఁగఁ
దనరారి కూర్మంబుఁ 'దరతి పాప్మాన'
మన 'వైశ్వదేవే సురార్చనే'యనఁగ
నాయతి 'మృణ్మయం వాపి'యనంగ
'తే యాంతి పరమాం గతి'మనఁగ, నట్ల
విచిత్రశైవోక్తి 'య ద్విప్రసంధ్యాది-
షు చ కర్మసు'యనంగ సూతసంహితయుఁ
నది వినరే 'కంఠమాశ్రిత్య' యనఁగ

మృదురీతి 'శ్వాపి వామ్రియతే' యనంగఁ
న్యాయోక్తినట 'కింపున ర్జానవాద-
యో 'యని మ్రోయంగ వేయేల యిట్లు
మఱియుఁ బురాణాగమ శ్రుతి స్మృతులు
నఱ లేక చెప్ప రుద్రాక్ష కల్పముల
నదిగాక భూతి రుద్రాక్షముల్ దాల్చి
వదలక శివుఁ గొల్చువారల వినుఁడు
అచలిత ప్రీతి బ్రహ్మాండపురాణ
వచనంబు 'రుద్రాక్షవలయా' యనంగఁ
బ్రతి 'జటాజూట విరాజిత 'యన, వి-
రతిఁ 'ద్రిపుండ్రేన విరాజిత 'యన, మ-
లిన మేది 'భస్మావలిప్త సర్వాంగ.'
యనఁగనొప్పఁ బ్రణవ వ్యావర్ణనంబు
వొగడంగ 'రుద్రాక్షభూషణా' యనఁగఁ
దగ 'జటామండలధారిణీ' యనఁగఁ
దఱి 'నక్షమాలార్పిత కరా' యనంగ
నెఱిఁ 'గమండలు కరాన్వితా' యనంగ
నుఱుఁ 'ద్రిపుండ్రావళి యుక్తాంగి' యనఁగ
గుఱి 'ఋుగ్యజుస్సామ [1]ఘోషేణ' యనఁగ

---

౧. సం. రూపేణ.

నిల 'సేవతేస్మ మహేశ్వర' యనఁగ
నలరుఁ దా గాయత్రీ వ్యావర్ణనంబు
రతిఁ 'ద్రిపుండ్రేన విరాజిత' యనఁగ
వ్రతయుక్తి 'రుద్రాక్ష వలయా' యనఁగ
సొగసి 'శుభ్రో జటాజూట' యనంగి
వగవంగ నది గ్రతువ్యావర్ణనంబు
సరిఁ 'ద్రిపుండ్రోద్భాసి సర్వాంగ' యన న-
మరి యంద 'రుద్రాక్షమండనై' రనఁగ
వడి వాయవీయసావర్ణిసంహితల
నడిసన నిదియుఁ దా సమిదభిధాన
దేవతావ్యావర్ణనావృత్తి యనఁగఁ
దా వెండియుఁ బురాణతతులలోఁ దెల్పు
సరిఁ 'ద్రిపుండ్రాంకిత సర్వాంగి' యన న-
మరి యంద 'రుద్రాక్షమండనై' రనఁగ
నదిగాక మొదల 'శుద్ధాత్మా' యనంగ
నదె వషడ్దేవతా వ్యావర్ణనంబు
దివిరి 'త్రిపుండ్రకో దివ్యై' రనంగ
నవిరళప్రీతి 'రుద్రాక్షైశ్చ' యనఁగఁ
దుది 'శుశుభే¹ సతతోవిష్ణు' రనఁగ

---

౧. సతతం.

నదియు 'భస్మస్నిగ్ధ' మనఁగ నవ్విష్ణు
వ్యావర్ణనము యజుర్వ్యావర్ణనంబు
శైవాదులందిట్లు సాంగమై మఱియుఁ
బోలంగ 'శుభ్రత్రిపుండ్రాణి' యనఁగ
లీల 'రక్షాభి రుద్ధూళిత' యనఁగ
మనసిడి 'రుద్రాక్షమాలా' యను వ-
చనము 'రుద్రాంశ్చ పంచబ్రహ్మ' యనఁ ద-
గిలి 'యథర్వశిర శ్శిఖే' యను నివి మొ-
దలఁ దుదఁ బెనఁగ రౌద్రముల మంత్రముల
వెలయుఁ 'బంచాక్షరీం విద్యా' మనంగ
నొలయ షడక్షరియును జపించుచును
నిటఁ 'బూజయేత్ పరమేశ్వర' మనఁగ
స్ఫుటభక్తి నీశ్వరపూజాభినిరతుఁ
డనఁగ నావ్యాసుని వ్యావర్ణనంబు
మును గాశికాఖండమునఁ జెప్పమఱియు
భువినొప్ప 'రుద్రాక్షభూషణా' యనఁగ
నవుఁ 'ద్రిపుండ్రాలంకృతాంగాశ్చ' యనఁగఁ
బోరి 'నక్షమాలావిభూషితా' యనఁగ
నరుదుగా స్వాయంభువాది మనువుల
వ్యావర్ణనము సెప్పఁ గావున నిట్టు

లావిధి విష్ణు సురాసురమునులు
భాస్వన్మహిమఁ గూర్మఫణితి 'సర్వే త-
పస్వినో' యన జటా భసితరుద్రాక్ష
ధరులు శివార్చనాపరులు గావునను
ధర నన్యలాంఛనధరు లెవ్వ రింక
నదిగాక శ్రుతుల ముఖ్యంబైన విజిత
మదనపాదోదక మహిమయు వినుఁడు

పాదోదకమహిమ

ధృతి 'నథాత్తో మహాదేవస్య' యనఁగ,
గతి 'వరం పాదోదకవిధి' యనంగఁ
జనఁగ 'వ్యాఖ్యాస్యామ శంఖం ప్రపూర్య'
యన 'గంధపుష్పాక్షతాదిభి' రను ని-
యతి 'నయం మే శిర స్యభ్యర్చ్య' యనఁగ
రతి 'ఋతగ్ సత్యం పరంబ్రహ్మ' యనఁగఁ
బ్రీతి 'నితి ప్రపిబే'త్తనఁ దదను
భూతి పాదోదకంబులు గొనఁ జెప్ప
వేడుక నాయజుర్వేద సూత్రోక్తి
రూఢిమై 'భగవాంశ్చ రుద్రంపవిత్ర'
మన 'శతధా చ సహస్రధా సమ' మ-

స 'స పరిమితధా' యనంగ, 'ననంత'
మనఁగఁ దదీయసూక్తావసానప్ర-
జనితవాక్యముల శ్రీ 'శంభు పాదోద
కం శుభం' బనుచుఁ ద్రాగఁగఁజెప్ప మఱి య-
సంశయంబుగ మూఁడుసంధ్యలయందు
శివపురాణంబు ప్రసిద్ధిగా నిట్లు
భువిని 'పాదోదకం పురభిద' యనఁగ
రతిఁ 'పాశజాలహరం పరం' బన, ని-
యతిఁ 'పాణిశుక్తిభి రాదాయ' యనఁగ
నిలఁ 'బపుగ కామం గణేశ్వరా' యనఁగఁ
బెలుచఁ 'పాదోదకం పీత్వా' యనంగ
నాదిఁ బాణిస్థలంబను సూక్తియంద
పాదోదకముఁగాని భ్రాంతి 'పశ్చా ద-
శుచిశంకయా' యన సూతకియయ్యొ
శుచియయ్యెఁ జేయియంచును నతిమోహ-
మున 'య ఆచామతి మోహేన' యనఁగఁ
గానకాని చేగడ్గికొనఁగఁ దలంచు
ఖలుఁడు 'వింద్యాద్బ్రహ్మ ఘాతుక' మ్మనఁగఁ
దలపోయ బ్రహ్మఘాతుకుఁడు వెండియును
నిల 'భూమిభాగాశ్చ మే శుభా' యనఁగ

నెలమిఁ 'దీర్ఘోదకపైస్స్యతే' యనంగ
శ్రుతిఁ 'గళాం నార్హంతి షోడశీ' యన, ని-
యతి 'దశపూర్వాణ్ దశాపరా' ననఁ జ-
నదె 'యగమ్యాగామినశ్చైవ' యనఁగ
నిదె 'దురాచారాశ్చ యే నరా' యన, న-
వలఁ 'దేఽపి పూతా భవం త్యాశు' అనఁగఁ
దలపోయఁ 'బాదాంబుధరణా' త్తన న-
మరి 'సర్వమంగళమాంగళ్య' మనఁగఁ
బరి 'సర్వపావన పావన' మ్మనఁగ
లలి 'సర్వతీర్థఫలం సద్య' యనఁ బొ-
దలి 'ప్రాప్యతే మూర్ధ్ని ధారణా' త్తనఁ ద-
విలి 'యశౌచం నైవ విద్యేత' యనఁ ద-
గిలి 'సూతకే ప్రేతకే తథా' యన, ప-
సుధ 'గృహే యస్మిన్ ప్రసూతా' యనంగఁ
బదరుచు నంద' సంభోగా' త్తనఁగఁ బ్ర-
బలి 'దూషితశ్చాపి పాదాంబు' అనఁ గ్రి-
యలను 'బిభ్ర చ్ఛుద్ధి మాప్నుయా' త్తనఁగ
జగతి 'నుత్పాతప్రశమన' మ్మనంగ
బిగి 'సర్వరోగ ప్రభేదన' మ్మనఁగ
ధర 'నిష్టసిద్ధి ప్రదాయక' మ్మనఁగ

నవి యాదిగాఁగ బ్రహ్మాండపురాణ
వివిధసూక్తుల వేనవేల్విధంబులను
గలికంపు పాదోదకము విస్తరించు
మఱియు లింగార్చనమహిమ యెట్లనిన—

## లింగార్చన మహిమ

వినరె శ్రౌతస్మార్తవిధులు శోధించి
ననిచి 'ధ్యానా దర్చనా ద్ధారణా ద-
పి 'యనంగ విష్ణుప్రభృతిసురల్ మునులుఁ
బ్రయతి సంసార తారకమునా మన కి-
దియయంచు వీరభక్తిస్థలచిత్తు
లయి 'మరుతో మర్జయంత' నాశ్రుతిఁ జ-
నిన 'రుద్ర య త్తే జనిమ చారుచిత్ర'
మనదె 'న వాఽపి గుహ్యం' బన విష్ణుఁ
డును బ్రహ్మయును నింద్రుఁడును సురల్ గొల్చి
పనుగొని తమతమపదములు వడయఁ
జనునంద 'సుయజా యజామహే' యనఁగ
మునులు క్రియాసాంగముగ భజియింప
'మా 'యంచు మృత్యువు మాయ 'యజామ-
హే 'యంచు మును బ్రమథేంద్రులు గొలువ,
గర్భాపదలు వాయ నర్భకుల్ గొలువ

గర్భోపనిషది వ్యక్తంబగు సూక్త-
ముల 'యది యోఽన్యాః ప్రముంచ్యామి' యనఁగ
నిలఁ 'దం ప్రపద్యే మహేశ్వర' మ్మనఁగఁ
జనఁ దదర్థము సూతసంహితసూక్త-
మున 'యది యోఽన్యాః ప్రముంచ్యామి' యనఁగ
నిలఁ 'దం ప్రపద్యే మహేశ్వర' మ్మన మ-
సలి 'విరజానలజం భస్మ' యనఁగ
నోగి 'గృహీత్వా చాగ్నిహోత్రజ' మ్మనఁగఁ
దగు 'సముద్ధూల్య సదాచార్య' మనఁగ
వినఁ 'బ్రణిపత్యాత్మవిద్యయా' యనఁగఁ
జని మీఁద 'సంసారసాగరం ఘోర'
మన 'లంఘయామ్యహ మాత్మనో' యనఁగఁ
బనుగొనఁ దలఁచు గర్భగతుండు మఱియు
నవిక లాగమ పురాణామ్నాయ ముఖ్య
సవిశేష శివధర్మశాస్త్రాది సూక్త
ములఁ 'బునరావృత్తి మోచన' మ్మనఁ ద-
విలి 'పునర్జన్మ నవిద్యతే' యనఁగ
హారుఁబూన్పు నొకపుష్పమటుల జనని జ-
ఠరకఠోరపిఠరాటనము హరించు
ననిన నానాకుసుమావళిఁ బూన్చు

నన విధిఫలము లేమనవచ్చు? మఱియుఁ
బురహారు నొకతుమ్మి పూవునఁబూన్చి
పరగ విష్ణుత్వంబు వడసె విష్ణుండు
బ్రహ్మేశు ద్రోణపుష్పంబులఁ బూన్చి
బ్రహ్మ బ్రహ్మత్వంబు వడసె, వెండియును
నొకపువ్వు శ్వేతుఁ డేయుక్తినో పూన్చి
ప్రకట సురాధీశపట్టంబుఁ దాల్చె
నర్కపుష్పముల నశ్కాత్ముఁ బూజించి
యర్కుండు వడసెఁ దా నర్కపదంబు
అక్షతలందు ఫాలాక్షుఁ బూజించి
ఋక్షేశుఁడు వడసె ఋక్షేశు పదవి
శ్రీవృక్షదళముల శివునిఁబూజించి
శ్రీవనితయు నిజశ్రీత్వంబు వడసె
నవియేల వేయు మహాయజ్ఞనిచయ
వివిధదానానేక విపులధర్మముల
సకలతీర్థవ్రజ జపతపోధ్యాన
నికరనానావ్రత ప్రకరసంజనిత
ఫలకోటి యొక్కపుష్పంబునఁ బూన్చు
ఫలమున వెయిపాళ్లపాలికి నెయిద-
వను పురాణము బ్రాహ్మణాదులు వినరె?

ఘొనరంగ 'న్య సైక పుష్పస్య' యనఁగఁ
బొరి 'సహస్రాంశం నపూరయే' త్తన న-
లరి 'యత్ ప్రమాణఫలం భవే' త్తనఁగ

లింగధారణ మహిమ

మఱిలింగధారణ మహిమ వేదముల
నెఱుఁగరే యదియుఁదా నెయ్యది యనిన
నదిగాదె ఋక్సూక్తి యనుభవరోఁగ
భిద 'మయం మే విశ్వభేషజో' యనఁగ
రతి '¹యం శివాభిమర్శన 'నాఁగ మతి ని-
యతి 'నయం మాతా అయం పితా' యనఁగ
వట 'నయం జీవాతు రాగమ' త్తనఁగ
ఘటియిల్లు ముంజేతికంకణంబునకు
దర్పణంబేల యంద 'యిదం తవ ప్ర
సర్పణ' మ్మంచు ఋక్సంహిత సాట
గూఢవేదాంత సంకులశిరోరత్న
రూఢి వెండియును శ్రీరుద్రోపనిషది
వడిఁ 'ప్రథమే నానువాకేన' యన నె-
గడు ప్రథమానువాక ప్రసూక్తంబు
ఆర 'యాతేరుద్ర' యనఁగ 'శివా త-

---

౧. సం. అయం.

నూ రఘోరా ' యని నొడువ, ' నపాప-
కాశినీ 'యనెడు వాక్యమున ' కపాప
కాశినీవపు 'రనంగా ' శ్రుతంతేన '
యను మహాస్తోత్ర విన్యాసనిరూఢిఁ
దనరి ' శిష్టాః ప్రసిద్ధా భగవ న్న
పాపా 'యనఁగ భవుభక్తుల భువి న-
పాపుల్ ప్రసిద్ధులు వరమ శిష్టులును
వ్యక్త ' మత స్త్వదీయా నపహాయ
భక్తా 'యనఁగ శివభక్తులు దక్క-
నన్య లశిష్టుఁ బాపాత్ములు, మఱియు
' నన్యా నశిష్టా ' ననఁగ ' నితినిశ్చి-
నోమి 'నా నిటు జగన్నుతి నిశ్చయించు
నామహాస్తోత్ర సూత్రార్థ మయ్యాదిఁ
జను రుద్రసూత్రార్థసరణి దానెట్టు
లన ' నఘోరాంగుఁడవయిన యోరుద్ర !
యొగి నీమహాలింగమూర్తియ ట్లొప్పె-
సగ నవినాభావసంబంధలీలఁ
జన నపాపులయంద నరిఁ బ్రకాశించు'
ననియెడుఁగాన నిరంతరలింగ
సహితులు, భువిఁ బాపరహితు లిమ్మాడ్కి-

మహిఁదాల్చినట్టి సన్మతు లెవ్వరనిన
నవికల వేదాగమార్థ ప్రయుక్త
సవిశేష శివధర్మశాస్త్రమార్గస్థు
లై 'యింద్రనీలమయం లింగ' మనఁగ
నాయింద్రనీలమయంపు లింగంబు
విష్ణుండు ధరియించి వేడ్కఁ భజించి
విష్ణుత్వ మది దనవృత్తిగాఁ బడసె
నప్పాట 'శైలమయం లింగ' మనఁగఁ
దప్పక చంద్రకాంతంపు లింగంబు
బ్రహ్మయు ధరియించి భక్తి భజించి
బ్రహ్మత్వ మది తనపాలుగాఁ బడసె
నిచ్చలు 'లింగం మణిమయ' మ్మనఁగ
నచ్చుగాఁగ మణిమయంపు లింగంబు
నింద్రుండు ధరియించి యింపారఁ గొలిచి
యింద్రత్వ మది దన యిరవుగాఁ బడసె
మసలి 'లింగం హేమమయ' మని మ్రోయ
నసలార హేమమయంపు లింగంబు
ధనదుండు ధరియించి తవిలి భజించి
ధనదత్వ మది తనధనముగాఁ బడసె
'నతులిత రౌప్యమయం లింగ'మనఁగఁ

ప్రతివాసరంబు రౌప్యస్ఫూర్తి వెలుఁగు
శివుఁదాల్చి కొల్చి విశ్వేదేవతలును
దవిలి విశ్వేదేవతాత్వంబు వడసి
రగు 'నారకూటమయం వాయు' వన నె-
సగు నారకూట భాస్వల్లింగ మూర్తి
వాయువు ధరియించి వరుస భజించి
వాయుత్వ మది దనవరముగాఁ బడసెఁ
గడుభక్తితోఁ 'గాంస్యకమయ'మ్మనఁగ నె-
గడి 'వసవః కాంస్యకం లింగ' మనఁగ
వసువులు ధరియించి వారక కొలిచి
వసుపదంబది దమవలఁతిగాఁ గొనిరి
భంగిగాఁ 'బార్థివలింగ'మ్మనంగ
సాంగపార్థివమయ లింగంబుఁదాల్చి
యశ్వినీదేవత లతిభక్తిఁ గొలిచి
యశ్వినీదేవత్వ మశ్వినుల్ వడయ
మనఁగ నాస్ఫాటికాయత లింగమూర్తి
వరుణుండు ధరియించి వలచి భజించి
వరుణత్వ మది దనవరముగాఁ బడసె
ననుపక్తి 'నన్నమయం లింగ' మనఁగ
ననుపమితాన్నమయంపు లింగంబు

నగ్నిదా ధరియించి యనయంబుఁ గొలిచి
యగ్నిత్వ మది దన యతముగాఁబడసె
ధృతి 'దారుజం నిర్మృతి శ్చైవ' యనఁగ
మతినుబ్బి దారుజమయ లింగమూర్తి
[¹నిర్మృతియు ధరియించి నిష్ఠ భజించి
నిర్మృతిపదముఁ దన నెలవుగా' బడసె]
ఘనభక్తిఁ 'దామ్రలింగంసదా' యనఁగ
ననిశంబుఁ దామ్రమయంపు లింగంబు
సూర్యుండు ధరియించి సుమతి భజించి
సూర్యత్వ మది దనసొమ్ముగాఁ బడసె
లలితోక్తి 'ముక్తాఫలమయ' మ్మనంగ
వెలయు ముక్తాఫల విశదలింగంబు
సంద్రుండు ధరియించి సద్భక్తిఁ గొలిచి
చంద్రత్వమది దనసరకుగాఁ బడసె
లలి దలిర్పఁగఁ 'బ్రవాళమయ' మ్మనంగ
నలరుఁ బ్రవాళమయంపు లింగంబు
పన్నగుల్ ధరియించి భక్తి భజించి
పన్నగత్వముఁ దమపదముగాఁ గొనిరి

---

౧. ఈవాదములకు సంస్కృతానువాదము లేదు. వీటిని తరువాత నెవరో చేర్చి ఉంటారు.

సహజంబు 'గృష్ణాయస మయ' మ్మనంగ
మహిత కృష్ణాయసమయ లింగమూర్తి
రాక్షసుల్ ధరియించి రతి భజియించి
రక్షఃపదము దమ రమణగాఁ గొనిరి
జానెలర్పఁ 'ద్రపుసీస మయ' మ్మనంగ
మానితత్రపుసీసమయలింగములఁ బి-
శాచముల్ దాల్చి పూజానిష్ఠమైఁ బి-
శాచత్వ మది దమజాతిగాఁ బడసెఁ
గడునర్థిఁ 'త్రైలోహకమయ' మ్మనంగఁ
గడపక త్రైలోహకమయ లింగముల
గుహ్యకుల్ ధరియించి కొల్చిసంతతము
గుహ్యకత్వముఁ దమకోర్కిగాఁ బడసి
రతులిత సర్వలోహపులింగముల ని-
యతి 'సర్వలోహమయం లింగ' మనఁగ
మాతృకల్ ధరియించి మక్కువఁగొలిచి
మాతృకత్వముఁ దమమహిమగాఁ బడయ
[మును 'బిభ్రతిద్రుమమం మూర్ధ్ని' యనంగ
ననురక్తి వృక్షమయంపు లింగంబు
లక్ష్మి శిరంబున లలిఁదాల్చి కొలిచి
లక్ష్మీత్వమది దనమహిమగాఁ బడసెఁ

జార్ముండి 'సైకతం సాక్షా' త్తనంగ
నర్మిలి సికతామయంపు లింగంబు
సార్ముండిధరియించి సద్భక్తిఁగొలిచి
చార్ముండికాత్వంబు సరకుగాఁబడసె
నాᵒదుర్గ 'విష్టమయం లింగ' మనఁగ
నాదటఁ బిష్టమయంపు లింగంబు
వేదోక్తిగా భక్తి వేద్యమై కొలిచి
యాదట దుర్గాత్వ మమరంగఁబడసె
నొగి 'గంధలింగం మనోన్మని' యనఁగఁ
దగ మనోన్మనియు గంధంపులింగంబు
దనమది నిష్ఠతోఁ దగ నిల్పి కొల్చి
మును మనోన్మని యన ముదమొప్పఁబడసె
నాసక్తి 'దూర్వామయంలింగ' మనఁగ
నాసరస్వతియు దూర్వాంకలింగంబు
మరిగి 'సర్వం దధిమయ' మన శ్రుతులు
దిరమగుభక్తి దధిమయలింగంబు
నియతి 'మంత్రా జ్యామయ' మన మంత్ర
చయ మాజ్యలింగంబు సతతంబుఁదాల్ప
ధరఁ 'గుశాగ్రమయ ముత్తమ' మన మునులుఁ

---
౧. దుర్గి.

గరమర్థితోఁ గుశాగ్రమయ లింగంబుఁ
దా 'యమో మారకత' మ్మన యముఁడు
వారక మరకతస్ఫారలింగంబు
వడి 'నవనీతం గవాం కుల' మ్మన నె-
గడి నవనీతలింగంబుఁ గోకులము
గరమర్థిఁ 'బుష్పలింగ' మనఁ బర్ణాదు
లరుదారఁ బుష్పమయంపు లింగంబు
భజియించి తమతమ పదములు వడయు
నజవిష్ణుముఖ్యులు నాదిశక్తులును
మునులు నమ్మైలింగముల లింగమూర్తి
ననయంబుధరియించి యర్చింతు రనిన
జగతిఁ బద్మపురాణసంహితలం దె-
నగు శంభు రాఘవ సంవాదములను
జలజజ హరిముఖ్య సకలదేవతలు
నలి 'మస్తకే ధారణం శుభ' మ్మనఁగ
మునుకొని 'విన్యస్త ముకుటే' ప్వనంగ
నునిచి 'యంతర్ధారణం శుభ' మ్మనఁగ
ముకుటంబులను లింగమూర్తులు దాల్తు
[1]రకుటిల భక్తిఁ బాయక దివానిశము

---

1. రకలంక.

:నలి 'లలాటే ధారణం శస్త్ర' మనఁగ
:నలికాగ్రములఁదాల్తు రత్యంతభక్తిఁ
దగ 'యథా లక్ష్మ్యా ధృతంపురా' యనఁగ
జగతి లక్ష్మీముఖ్యశక్తు లన్నియును
మున్ను బాణుఁడు 'ధృతం మూర్ధ్ని' యనఁగ స-
మున్నతినట్టుల మూర్ధ్ని ధరించు
నిరువంద నెప్పుడు నితరరాక్షసులు
ధర 'వినిర్భిద్య యథాగాత్ర' మనఁగ
దేహముల్ వ్రచ్చి తద్వీరవినిహిత
లోహపాత్రములఁ దాల్తురు మహోత్సుకతఁ
'గంఠేచ' యన హరకంఠాదిమునులు
గంఠంబులను సదాకాలంబుఁ దాల్తు
రితరులు దమతమ యిష్టాంగములను
రతిఁదాల్తు రఖిలపురాణాగ మాది
యగు 'నయం మే' యన 'హస్తో' యనంగ
'భగవా'నన సమానబంధోక్తి బుక్కు-
నందు సెప్పినయట్ల యాపురాణములు
దండడి వెండియు 'ధారయే ద్యస్తు
హస్తేన 'యనఁగ 'లింగాకార' మనఁగ
'హస్తతలేఽపి చ'యనఁగ నాహస్త

తలమున 'మస్తకే ధారణ'మ్మనఁగ
నిల 'మూర్ధ్నివా ధారయే ల్లింగ'మనఁగఁ
గ్రియగొన 'నుత్తమాంగే గళే 'యని యు-
లియ 'నుత్తమాంగే గళేవాపి ' యనఁగ
రతి 'గళే కక్షే పరాయణా 'యనఁగ
హితమతి 'నాభౌచ హృదయేచ ' యనఁగ
దనుఁబొందవే యవస్థలు నెందు దాలి-
చిన 'శుచిర్వా ప్యశుచిర్వాపి ' యనఁగ
నెంగిలి 'యుచ్ఛిష్ట మితి నిశ్చిత 'మ్మ-
నంగను 'బిభ్రతో లింగ 'మ్మనంగఁ
దగ 'సదా హ్యై లింగధారణ ' మ్మనఁగ
మొగి 'నకదాచి ద్విమోచయే' త్తనఁగ
నెఱిఁ 'దథైవ మమ సాన్నిధ్య ' మ్మనంగ
నుఱు 'నిమేషార్ధం వియోగేన ' యనఁగ
రమణ నీ లింగధారణ విశేషంబు
క్రమ మిది యంచు సాంగంబుగా నిట్లు
బ్రాతిగా వేదపురాణాగమ స్మృ-
తీతిహాసాదుల నిటు ప్రస్తుతించి

ప్రసాదస్వీకార మహిమ

పండితేంద్రుఁడు దన ప్రశ్నలన్నియును

ఖండింప ఖండింప నుండఁజాలకయు
నన్నియు నవి యెట్లు లయ్యెఁబో యిట్లు
సన్నె యీశ్వరుని ప్రసాదంబుఁ గొనఁగ
నిది యవైదికమార్గ మిది విపరీత
మిది గడు నుద్ధతి యిది ధర్మహాని
దా విరుద్ధము నిషిద్ధంబు ప్రసిద్ధ
మే వేదములఁ బురాణేతిహాసాగ
మాదుల విందుమే ? యాద్యులు గలర
కాదె ? యెచ్చటనైనఁ గందుమే శివుఁడు
నలి 'ననర్హాం మమ నైవేద్య' మనఁగఁ
గలుగు నిత్యాదివాక్యంబులు వినరె ?
యుడుగక భక్తి మదోద్రేకవృత్తిఁ
గుడిచిన నితరులు గుడుతురుగాక
వేదాఢ్యు లగు మహావిప్రవంశజుల
కాదరణీయమే య ట్లయ్యె నేనిఁ
దగిలి ప్రాణాగ్నిహోత్రం బెట్లు సేయ
నగుఁ దదీయేష్టలింగార్పితాన్నంబు
నదియునుఁ గాక లింగార్పిత శేష
మది పితృదేవతార్హమె శ్రాద్ధములను ?
నశ్లాటఁ బంచయజ్ఞాదికర్మముల

నెట్లర్హమగునయ్య యీశ్వరార్పితము?
గాన బ్రాహ్మణులకుఁ గాదు సేవింపఁ
దా నీశ్వరప్రసాదమని ¹గర్హింపఁ
బండితనుత పాదపద్మయుగుండు
వండితారాధ్యుండు భక్తివర్ధనుఁడు
సిర శుద్ధ సిద్ధ ప్రసిద్ధ ప్రసాద
పరమ తత్త్వోన్నతి వర్ణింపఁబూని
నలి 'సనర్హం మమ నైవేద్య' మనిన
పలుకున కర్థంబుఁ దెలుపంగఁ దలఁచి
చయ్యన 'నైవేద్య శబ్దేన కి మభి
ధియ్యతే' యనుచు నుద్దీపితప్రౌఢి
నైవేద్య శబ్దంబు నానార్థవాచి
గావున నది ముఖ్య గౌణార్థయుక్తి
నిదమిత్థ మని నిశ్చయింపంగలేక
యది యెట్లు మును రహస్యార్థంబు లెఱుఁగ
నవు? 'షడ్విధం తథా' యనఁగ నిర్మాల్య
మవుల నొక్కొక్కండ యాఱువిధమ్ము
లవి యెవ్వి యనిన దివ్యాగమోక్తమునఁ
ధవిరి దేవస్వంబు దేవతాద్రవ్య

౧. గ్రహింప; వర్ణింప.

మును మఱి నైవేద్యమును నివేదితము
నొనర ఖండద్రవ్యమును బహిఃక్షి ప్త
మునునాఁగ షడ్విధములఁ జెప్పనొప్ప
వినుతింప నీయాఱువిధములలోన
మొగి దేవుసొమ్ము భూములు గ్రామములును
నొగి దేవతాద్రవ్య ముపకరణములు
ధనధాన్యవస్త్రగోధన భూషణములు
ననుపమఛత్రధ్వజాది వస్తువులు
దివిరి 'సంకల్పితం దేవాయ' యనఁగఁ
దవిలి తత్సంకల్పితంబులై మున్న
శివునకు ముంద చేసిన పదార్థములు
నవి 'యన్నపానాది యత్సర్వ' మనఁగ
నెనయంగ 'నైవేద్య మితి కీర్తిత'మ్మ-
నను శివోద్దిష్టంబు నైవేద్య మిదియు
మఱిఁజూడఁ 'ద్రివిధనిర్మాల్య మనర్హ
మితికీర్తిత'మ్మన నివి యనర్హములు
మానక త్రివిధనిర్మాల్యంబుఁ బొందు
నేనియు వానికి హీనరౌరవము
నవు 'నరకే కాల మక్షయ' మ్మనఁగ
భువి వెండియు శివోపభుక్తంబునైన

'అన్నపానాదికం యత్సర్వ' మనఁ బ్ర
సన్నోపభుక్తంబు సను నివేదితము
వయిపడి యదియు సద్భావార్థ మయ్యెఁ
గ్రియగొనఁ 'బ్రాణలింగే చరే' యనఁగ
నది 'రత్నలింగే స్వయంభువి' యనఁగఁ
దుది 'నచండోఽధికృతో భవే' త్తనఁగఁ
గలుగు నిత్యాది లింగంబులు దక్క
నలి 'స్థాపితం విధినా లింగ' మనఁగ
వాయారఁగా 'సురై ర్వా మునిభి ర్న
రై' యనఁ 'ద్రివిధనిర్మాల్యే' యనంగ
నా యమర ఋుని గణాదిప్రతిష్ఠి
తాయతలింగమహాస్థానములను
గలుగు నీత్రివిధలింగముల నిర్మాల్య
మలరుఁ జండద్రవ్య మది యట్లుగాఁగ
మఱి పూర్వసంధ్యాసమర్చనవేళఁ
దఱిమిన నిర్మాల్య తతి 'బహిఃక్షిప్త'
మని యెన్నఁబడఁగు నీ యాఱింటిలోనఁ
జను నివేదితములు శరణార్థమయ్యె
నట్లాట నైవేద్య మది యనర్హంబు
నట్లునుఁగాక గౌణార్థ మూహింప

నదియు నట్టుల భవిష్యత్పురాణ ప్ర
ముదిత దివ్యాగమ మూలమై యాడఁ
జను వ్యాస జైమిని సంవాదమునను
జననుతవ్యాసు నా జైమిని సూచి
నలి 'ననర్హాం మమ నైవేద్య' మనఁగ
నలరు నీశ్వరుని వాక్యార్థ మెట్లనినఁ
దనరి 'యే వీరభద్ర విశపితా' య
నను వీరభద్రగణశ్రేష్ఠు చేతి
శాపదగ్ధులకును సరి నన్యదేవ
తాపరులకు శివాత్మకదీక్షలేని
యితరులకును శివు నితరదైవములఁ
బ్రతిఁ [1]గొల్చు ఖలులకు భక్తిహీనులకు
నననేల 'తేషా మనర్హా మీశస్య'
యనఁ బ్రసాదచతుష్టయం బనర్హాంబు
గాక భక్తులకు శ్రీకంఠప్రసాద
మాకాంక్ష భోగించు టది యనర్హాంబె?
యనెడు జైమినికి నీ యర్థంబు వ్యాసుఁ
డనురక్తిఁ జెప్పుచు నంతటఁబోక
నలి 'ననర్హాం మమనైవేద్య' మనఁగ

౧. బొల్చు.

నిల నీశ్వరప్రసాదేతరం బెద్ది ?
సకలవిశ్వపదార్థ జాలంబులెల్ల
సకలేశుమూర్తి ప్రసాదముల్ గావె ?
యది యెట్లులనిన దివ్యాగమవేద
విదిత మీయర్థంబు వినుఁడు వెండియును
వీనుల కింపుగా 'విశ్వరూపాయ
వై నమో' యనఁగ 'విశ్వపతిభ్య' యనఁగ
'విశ్వతశ్చక్షుశ్చ విశ్వగర్భశ్చ'
'విశ్వరూపాయ' నా వేదాంతసూక్తి
వరుస 'యదేక మవ్యక్త' మనంగఁ
బరగి 'యనంతరూప'మ్మన, నంత
ననిచి 'విశ్వం పురాణ'మ్మన మీఁదఁ
జనఁ 'దమసఃపరస్తాదితి' యనఁగఁ
బెనఁగి 'తద్విశ్వరూపిణి' యన, వెండి
యును 'బరమేశ్వరా దుత్పన్న' యన మ
సలి 'షడ్రసోపేత షడ్విధాహార
జలపుష్పజాతాని సర్వాణి' యనఁగఁ
జన 'నభిదేవ ప్రసాదలబ్ధాని'
యన 'భవేయు' రనఁగ 'యస్మా'త్తనంగ
'నపరమేశం కించి' దనఁగఁ దత్సూక్తి

విపులభాష్యంబు 'న విద్యతే' యనఁగ
లోలతఁదగిలి 'య ల్లోకేఽస్తి' యనఁగఁ
జాలి 'యోగ్యపదార్థ జాత' మ్మనంగ
భువిని వెండియు 'నుపభుజ్యతే' యనఁగఁ
దివిరి 'దేవేభ్యో హి దీయతే' యనఁగ
నైశ్వర్యగతి మీఁద 'యస్మా దనర్హ
మీశ్వర నైవేద్య మిత్యాది' యనఁగ
'వచనం సమర్థితం వ్యర్థ' మ్మనంగఁ
బ్రచురించి సూక్తి కర్థం బెట్టు లనిన
విశ్వరూపుఁడు పరమేశ్వరువలన
విశ్వంభరను సంభవించిన షడ్ర
సములతోఁ గూడిన షడ్విధాహార
సముదయ జలపుష్ప జాతముల్ మును ని
పాదించి చూడఁ దత్పరమేశ్వర ప్ర
సాదలబ్ధములు నిశ్చయ మట్లు[1]గాన
సహజ మింపుచుకమైన శంభు ప్రసాద
రహితమై చను పదార్థంబు[2]లు లేమి
యెనసి [3]లోకంబులం దెద్దియేనియును

---

౧. గాక. ౨. దాలేమి. ౩. లోకములం దేదియునొకటి ; లోకములయం దేది యన్నియును.

జనుఁ దదీయ పదార్థ జాతముల్ శ్రుతుల
ననుభవింపఁగ యోగ్య మైయుండు మున్ను
అనుభవింపఁగ యోగ్య మై దేవతలకు
నర్పణార్హములగు నటుగాన యీశ్వ
[1]రార్పితాన్నాదు లనర్హమన్ సూక్తి
కర్థంబు వ్యర్థంబు నాగమోక్తుల స
మర్థింపరాదు యథార్థంబు మఱియుఁ
దలఁప 'సంగా' త్తనఁ దన్నిజాంగంబు
వలన 'సంగాత్సంభవసి' నాఁగఁ దండ్రి
యంగంబు సుతుసంగ మై సంభవిలు న
సంగ 'నాత్మావై' యనఁగ శ్రుతిఁ 'బుత్ర
నామాసి' యనఁగ జనకుఁడు దాఁ బుత్ర
నామంబు దగఁ [2]బెట్టు [3]నా నాదిరుద్ర
మూర్తివలనను సముదితమై యష్ట
మూర్తుల్ సరాచరమునకు నిమిత్త
కారణోపాదాన కరణంబులగుచుఁ
దా రుండువారి యుత్పత్తి యెట్లనిన
మొదలి ఋగామ్నాయమున బ్రాహ్మణంబు
తుదిఖండలందు సదువుదురు ద్విజవ

---

౧. రార్పణా. ౨. బుట్టె. ౩. శాఖాది.

రులుఁ 'నమో భగవతే రుద్రాయ' యన మొ
దలఁ బ్రణవానుబంధంబగు సూక్త
మున శ్రుతిభవు పదాంబుజముల [1]కెఱఁగు
చును జగదుత్పత్తి సూచించువేళ
విమలినమతి యజుర్వేదంబు నట్ల
రమణమయి బృహదారణ్యోపనిషది
పురుషసూక్తమునఁ దత్పురుషమహత్త్వ
మరుదరుదనుచు వేదాఢ్యులు వొగడఁ
జెనసి యాది 'సహస్రశీరుషా పురుష'
యన 'సహస్రాక్ష స్సహస్రపాత్తనఁగఁ
దుది 'సభూమిం విశ్వతో వృత్వా' యనఁగ
నది 'యత్యతిష్ఠ ద్దశాంగుల' మ్మనఁగ
నెనయంగ 'నమృతత్వ స్యేశాన' యనఁ గఁ
జను 'నుపనిషది పంచబ్రహ్మ' యన య
శమ్మారఁగాఁ 'బురుషం కృష్ణపింగ
ళ' మ్మన నిజలక్ష్య లక్షణోక్తముగ
వెలయఁ 'దత్పురుషాయ విద్మహే' యనఁగ
నలువొంద నంద 'పూర్ణం [3]పురుషాయ'
యన 'నుత్తమపురుషాయ' యన నామంబు

---

౧. కెఱఁగిచను. ౨. తేల్చిపలుకవలెను. ౩. పురుషేణ.

నరుదొంద మిన్నంది యా యజుర్వేద
పురుషుఁ డాదిపురుషుఁ బొగడుచుఁ బురుష
సూక్త మాఱవయది శుచి నాది [1]సర్గ
వ్యక్తంబుగాఁ జెప్ప నాది ఋక్సూక్తి
మీఁద 'స ఈక్షతే మే ను లోకాంశ్చ'
నాఁ దనరుచు నుమానాథుండు వేర్చి
నియమితాతీత ప్రళయగతభూత
చయ బీజసంచయ స్థానకారణము
లైన నిజాంగముల్ దాని రక్షింపఁ
దోన యయ్యష్టమూర్తులు పుట్టునంద్రు
అడరంగఁ 'జక్షుష ఆదిత్య' యన, మ
గుడ మీఁది శ్రుతులఁ 'జక్షోస్సూర్య' యనుచు
మతి 'మనసశ్చంద్రమా' యన మీఁది
శ్రుతి 'సంద్రమా మనసో జాత' యనఁ 'బ్ర
యతి 'ముఖాద్వాచోఽగ్ని' యన మీఁది శ్రుతి ని
యతి 'ముఖాదింద్రశ్చ' యనఁగ 'నగ్నిశ్చ'
యనఁగఁ 'బద్భ్యాం భూమి' రన నందు గ్రింద
జనితమై 'శోత్రాద్దిశా' యన మీఁది
శ్రుతియర్థ 'మితిదిశ శ్రోత్రా' యనంగ

---

1. మార్గ; సృష్టి.

నతిరతి 'నాత్మాన మాత్మనో' యనఁగ
నాదిన 'శేతసి ఆపో' యనంగ
నాదటనట 'విరాడాపో' యనంగ
నాతతప్రీతి 'నాభ్యా' మన, మాన
రీతి 'నాసీ దంతరిక్ష' మ్మనంగ
నవిరళంబుగఁ దదీయాష్టమూర్తులును
భవుని నానాంగసంభవమయ్యె నందు
హరునేత్రజుం డర్కుఁ డగుటఁ దదీయ
ఖరకరాంతర్భావగతుఁ డీశుఁడగుటఁ
జనఁగ 'సూర్యం డీశుఁ' డనఁగ 'సూర్యోఽపి'
యనఁగ 'నీశ్వర ఏవ సోఽపి' యనంగ
దాని భాష్యంబు 'భూతానా' మనంగ
దానిమీఁదటఁ 'బదార్థానా' మనంగ
నిల 'రస మాకర్ష తీత్యర్థ' యనఁగఁ
దలఁపఁ బదార్థభూత ప్రాణ రస వి
తాన మాకర్షింపఁ దపనుచేఁ బడుటఁ
బూని తత్సూర్యోపభుక్త శిష్టప్ర
సాదంబు సకల విశ్వపదార్థజాత
మాది సనర్హంబు లని పాయఁ జనునె?
ధృతిఁ 'దండులై ర్జుహోతి' యన వెండియు వి

దిశమున 'లాజై ర్జుహోతి' యనఁ జెలంగుఁ
గాన యిత్యాది వాక్యములు వ్యర్థములె?
పూని 'యిత్యాది వాక్యాని' యనంగ
దా నిటమీఁద 'వ్యర్థాని స్యు' రనఁగ
మానక 'తండులాదీనా' మనంగ
నవల నిర్మాల్యత్వ మన వ్యాసభాష్య
వివిధ [1]సూక్త్యర్థంబు వినరె? వెండియును
మదనారిరేతస్సముదితాంబుజాల
మది 'జలరూపీ మహాదేవ' యనఁగ
నాతత దక్షిణాయన సూర్యకిరణ
జాత పయోదగృహీత విముక్త
జలములు శివుపాదజలములు గావె?
యెలమిఁ 'దస్మేఘ గృహీత (ంజల) మపి'
యనఁగఁ దదీయసూక్తావసానమున
నొనర 'శివస్య పాదోదక మేవ'
యనఁగ నయ్యర్థంబు నాయజుస్సూక్తిఁ
దనర 'నాపో వా ఇదం సర్వ' మన న
లరుచుఁ 'దస్మా త్సకలం జలమీశ
చరణాభిషిక్త ప్రసరిత నదీ ప్ర

---

౧. సూక్తంబులు.

వాహాస్వరూపమేవ' యనంగఁ దత్ప్ర
వాహాముల్ 'విశ్వవిశ్వంభరా' యనఁగ
విశ్వవిశ్వంభరాన్విత తీర్థజలము
శశ్వన్మహేశాంఘ్రి జలము లకావె?
యవియు విసర్జనీయములె? యాళ్లైనఁ
దివిరి 'తీర్థేస్నాతి తీర్థేహితేషు'
అనఁగఁ దాఁ 'బ్రావేశయన్' నాఁగ శ్రుతులు
వినరె? యంతియకాదు వెండియు నఁదు
భవునాసికోద్గత ప్రాణసంజాతుఁ
డవు జగత్ప్రాణుండ హారుఁడౌటఁ జేసి
సరి 'వాతరూపేణ శంభునా' యన న
లరి 'గృహీతపరిమళాని పుష్పాణి
పత్రాణి' యనఁ దత్ప్రభంజనోపహత
పత్రపుష్పాదు లొప్పవె? యనర్హములె?
యదియ 'యోऽపాంపుష్ప' మనఁగఁ బుష్పము ని
వేదించుడుఁ బ్రసాద విభవంబు లొందు
నను శ్రుతి వ్యర్థమే? యట్లునుఁగాక
మును మహేశమనస్సముద్భవంబైన
యాకళానిధికళలంద దేవత ల

౧. సుగాదె.

నాకులమతి నజరామరు ల్గారె?
భువి 'శివనిర్మాల్య భూత' యనఁగ నె
నవి 'సుధాకరకరాసార ప్రసారి-
త సుధాభిషిక్త' నాఁ దవిలి ప్రీవ్యాదు
లసమాక్షునిర్మాల్య మవి యనర్హములె?
'ప్రనితత మాహేశ్వర ముఖ వినిశ్చ్యు:
త-విఘనీభూత వేదై రాగమైశ్చ
శబ్దరూపైశ్చ' నా శబ్దంబు సర్వ
శబ్దముల్ శివుని ప్రసాదంబు లగుటఁ
బ్రాపింపఁ 'బరమేశ్వరముఖా' త్తనంగ
'సోఽపి నిర్గతశబ్దరూపశ్చ' యనఁగ
వడిఁ 'బ్రపంచోఽపి సర్వశ్చ' యనంగ
నడరంగ 'సర్వా ణ్యనర్హాతా స్యా' త్త
నంగ శబ్దంబు లనర్హంబులని తొ
లంగవచ్చునె మత్తెఱంగున మఱియు
'నాత్మాన మాత్మనో' యనఁ బరమాత్మ
యాత్మఁ బుట్టినయట్టి యాత్మ యేకాత్మ
[3] యయ్యె 'నణో రణీయా న్మహతో మ
హీయ్యా' ననంగఁ దదీయ సూక్తంబు

---

౧. స్వ్య. ౨. వికసీ. 3. యయ్యా.

అంత 'నాత్మా గుహాయాం నిహితోఽస్య
జంతో' యనఁగ సర్వజంతువులందు
జైతన్యరూపమై చను తదీయాత్మ
చేతఁ జరాచర భూతజాలంబు
సేతరించుటఁజేసి శివుని ప్రసాద
చైతన్యవర్తులు జంతువు లగుట
నెవ్వ రొల్లనివార ? లెవ్వి యనర్హ ?
మి వ్వేదవాక్యంబు [1]లెవ్వారేఁ జదివి
దూషింపఁదగునె ? 'రుద్రోవా' యనంగ
'నేషా య దగ్ని' నా నిట యజుస్సూక్తి
నినుపారఁ జెలఁగి 'యగ్నిర్నామ రుద్ర'
యన నగ్నినామాంకుఁ డగు రుద్రువలన
భంగిగా 'యత్పాకపరివర్తిత' మ్మ
నంగఁ 'దత్సర్వ' మ్మనంగ 'శివోప
భుక్త' మ్మన శివోపభుక్తముల్ గావె ?
వ్యక్తిఁ బాకాదు 'లేవం స్యా' త్తనంగ
రతి దేవతోపహారము వైశ్వదేవ
హుతముఖప్రాణాగ్నిహోత్రంబు లతిథి
సంతర్పణంబునం జను ధర్మములకు

౧. లెఱుఁగరే, చదివి.

నంతఁ బక్వాన్నాదు లవి యనర్హములె?
మున్న 'యత్తత్సర్వ మన్న' మ్మనంగ
నెన్న 'రుద్రోచ్ఛిష్ట మేవ' నా, మఱియుఁ
బరమేశ్వరవ్యాప్త పరమేశ్వరాత్త
పరమేశ్వరోచ్ఛిష్ట పదపదార్థములు
గలవె లోకంబులు? కావున మఱి స
కలమ్ములుఁ బాదోదకప్రసాదముల;
యట్టట శివుప్రసాదాన్యంబు లెందుఁ
బుట్టవు, వేదోక్తి యట్టిద, యట్టి
వేదోక్తముగను నైవేద్యమన్ శబ్ద
మాదిగాఁ గఁ 'బురతో న్యస్త' మనంగఁ
దలి 'దర్శనా త్స్వీకృత మ్మయా' యనఁగ
వ్వలి 'రసాస్యభక్తస్య' నా, దాని కనుగు
ణమ్ముగ 'జిహ్వాగ్రా' త్తనంగ 'నశ్నామి
కమలోద్భవా' యని స్కాందంబు మ్రోయ
భక్తహృన్మధ్యస్థు భక్తవాత్సల్యు
వ్యక్తిగాఁ బ్రాణాదివాయుస్వరూపుఁ
డగు పరమేశుఁ బ్రత్యర్థిభావమునఁ
దగిలి ప్రాణాగ్నిహోత్రము విత్యదేవ
తాతిథిసంతర్పణాదులఁ జేయఁ

బూతంబు వరమేశు భుక్తశేషంబు
గాన విప్రులకు లింగప్రసాదంబు
దానర్హమగు యథార్థం బెట్టులనిన
సకలవిశ్వపదార్థజాతంబు లెల్ల
సకలేశుమూర్తిప్రసాదంబయేని
జనులెల్ల లింగప్రసాదుల కారె
యనరాదు శైవోక్తమగుదీక్ష లేమిఁ
జను 'మహేశ్వరకృతం సర్వ' మ్మనంగ
నెనయె 'నభక్తా మహేశ్వరే' యనఁగ
వినరె 'కృతఘ్నా భవిష్యంతి' యనఁగ
మును 'కృతఘ్నోఽపి న ముచ్యతే' యనఁగఁ
దనదేహ మలదూషిత ప్రదేశంబు
మనుజుఁ డెట్లనువొంద మనసున రోయు
మలహారుఁడును నట్ల మనసునరోయు
మలదేహి సండనిర్మాల్యంబు గొనిన
ధర 'మలదేహీ న ధారయే' త్తనఁగ
సరి 'నభోజ్యం శివశాసన' మ్మనఁగఁ
బరువడి 'లోభా న్న భక్షయే' త్తనఁగఁ
దరమిడి 'లోభా న్న ధారయే' త్తనఁగ
మలదేహులకు లోభమానసులకును

మలహారుశుద్ధ నిర్మాల్య ప్రభుక్తి
ధరను సంస్పర్శన దర్శన ముఖ్య
పరిలంఘన క్రియల్ వాపహేతువులు
నెఱి 'భక్షయే చ్ఛివనిర్మాల్య' మనఁగ
నెఱి 'ధారయే చ్ఛివనిర్మాల్య' మనఁగ
నెఱి 'నిర్మలత్వాచ్చ నిర్మాల్య'మనఁగ
గఱి 'నరో నైర్మల్య కారణ' మ్మనఁగ
ధృతిమతి గురుకృప దీక్షైకవిమల
మతులకు శివుని నిర్మాల్యోప భుక్తి
ధరణి సంస్పర్శన దర్శన ముఖ్య
భరితక్రియలు వీరభక్తి హేతువులు
గాని వారికిఁ గాదు గాక శ్రుత్యుక్తి
నైన భక్తుల కనర్హమె ప్రసాదంబు
దవిలి ప్రాణాగ్నిహోత్రం బాచరింప
శివు ప్రసాదంబు నిషిద్ధ మం చెట్టి
భంగి 'నిమం పశుం పశుపతే తే' య
నంగఁ దా 'నద్య బధ్నామి' యనంగఁ
దనరి 'యజ్ఞే సుకృతస్య మధ్యే' య
నను వెండియును 'సుమన్యస్వ' నా మఱియు
'సుయజాయజామ' 'న జుష్ట' మ్మనంగ

రయ మొందఁగా వ్యాకరణసూత్ర యుక్తిఁ
దడయక 'జుష్ట'మన్ ధాత్వర్థ మరయ
వడి 'జుష ప్రీతిసేవనయో' రనంగ
వరుసఁ 'దత్సూక్తి దేవానా'మనంగ
నరయంగ 'నిదమస్తు హవ్య'మ్మనంగ
దివ్యయజ్ఞములందు దేవతాదులకు
హవ్యకవ్యంబుల కర్హమై యుండ
ధరణిఁ బ్రాణాగ్నిహోత్రక్రియాదులకు
హరభుక్తశేష మనర్హమెట్లయ్యె
స్వాహాఁ 'బరమేశ్వరప్రీత్యర్థ' మనుచు
రహితాగ్నులును నవిరహితాగ్నులును జ
నంగఁ 'బ్రాణౌ కరణం కరిష్యే' య
నంగ 'నగ్నౌ కరణం కారయే' త్త
నను శ్రాద్ధవేళ నన్నంబుఁ బితాళ్ల
కనురక్తి వడ్డింప కటమున్న కాదె
యాయవిచ్ఛిన్నాగ్ను లగ్నౌకరణ స
మ్మాయత విశ్వదేవావశిష్టంబుః
ఫణితి విచ్ఛిన్నాగ్నిపరులు పాణౌ క
రణహవిశ్శేష పరంపరాన్నంబు
మొదలవడ్డింతు రిమ్ముల హవిశ్శేష

మఱి యెట్టులయ్యెఁ బ్రాణాహుతుల్ గొనంగ
మున్ను హవిశ్శేషమునకంటె హరుని
సన్నుతభుక్తశేషము నిషిద్ధంబె?
నన్ని 'సోమోవై' యనంగ 'సౌమ్యం చ-
రు న్నిర్వపే' త్తన శ్రుతులందు వినరె?
సకలహవిశ్శేష చరుభక్షణాదు
లకును బ్రాణాహుతుల్ వలువనియట్ల
పొరిఁ బిత్ృశేషాన్న భోజనాదులకు
వరుసఁ బ్రాణాహుతి వలువదో మఱియుఁ
జనదొ బ్రాహ్మణునకు శ్రాద్ధభోజనము
సనునొ బ్రాహ్మణునకు శ్రాద్ధభోజనము
ప్రాణాహుతులు శ్రాద్ధపంక్తికి వలదొ?
ప్రాణాహుతులు శ్రాద్ధ పంక్తికి వలెనొ?
శ్రాద్ధంబులఁ గుడువఁ జనియెడు విప్రు
నిద్ధరఁ దమతమ యిండ్లదొప్పలను
గొంతకొంతయుఁ గూడుఁగొనిపోయికొండ్రు
అంత దొప్పలన నయ్యజమాను లిండ్ల
కొలఁదిన నడ్డించుకొండ్రె ప్రాణాహు
తులకని యొకకొంత దొలఁగ నేకతమ
యటుగాక పిత్ృదేవతార్పితాన్నంబు

నటు విధియించి ప్రాణాహుతుల్ గొండ్రొ
యట్టేని పిత్రుదేవతార్పితాన్నంబు
నెట్టు ప్రాణాహుతుల్ వెట్ట శ్రాద్ధముల
నైన విశ్వేదేవతార్పితాన్నంబు
దాను బ్రాణాగ్నిహోత్రమున కౌనేని
వగవంగఁ బిత్రురూప వసుసమర్పణము
దగిలి ప్రాణాగ్నిహోత్రమున కౌనేని
నలఁ బితామహరుద్ర నామార్పితంబు
దలఁపఁ బ్రాణాగ్నిహోత్రమున కౌనేని
ధృతిఁ బ్రపితామహాదిత్యార్పితంబు
దతిని బ్రాణాగ్నిహోత్రమున కౌనేనిఁ
గ్రమమున శ్రాద్ధరక్షకుఁడు విష్ణ్వర్పి
తమును బ్రాణాగ్నిహోత్రమున కౌనేని
శివప్రసాదంబు నిషిద్ధ మెట్లయ్యెఁ
దవిలి ప్రాణాగ్నిహోత్రం బాచరింప
వ్యాసస్మృతియు వేదవచనప్రయుక్తి
భాసురంబుగ 'యద్యభక్త' మ్మనియును
గరమర్థిఁ 'బ్రథమ మాగచ్ఛే' త్తనియును
నరయఁ 'దద్ధోమీయ' మనియును మ్రోయ
నదిగాక బోధాయ నానుమతోక్తి

యదియుఁ ‘ దద్ధోహారాయ ’ మని యట్లు వ్రాయ
శ్రుతిమతిస్కాందవిశ్రుతసూక్తి పూర్వ
గతి ‘యథా హారాయ కల్పిత’ మ్మనఁగ
లీల నట్లునుఁగాక లింగపురాణ
మోలిన ‘యచ్ఛ్రాద్ధ కాలే’ యనంగఁ
జెనసి తా ‘హారభుక్త శేషం దదాతి’
యన హారభుక్తశేషాన్న పానములు
దివిరి ‘భుక్త్వా పితృదేవతానా’ మ
న వినుఁడు పితృదేవనివహంబులకుఁ దొ
డంగి ‘తేనైవ పిండై స్సతిలై’ ర
నంగఁ బిండము దర్పణము సమర్పింపఁ
బ్రాప్తి ‘నాకల్పకోట్యాం పితర స్సు
తృప్త’ నాఁ బితృకోటి దృప్తినొందంగఁ
బాపండులకుఁగాక భ్రమసి తత్పితృ వి
శేషంబు హరున కిచ్చినవాఁడు సఫల
తఁ ‘బితృశేషంతు యో దద్యా’త్తనఁగ ర
హిఁ బితాళ్లకును రేత మిచ్చినవాఁడు
భంగిగాఁగ ‘హారాయ పరమాత్మనే’ య
నంగఁ ‘రేతోఽధా’యనఁ ‘బితర స్తస్య’
యనఁ గ్లేశభాజనుం డగువాఁడు వోలు

పను 'భవంతి క్లేశ భాజినో' యనఁగ
దోషాత్ము లెఱుఁగ రెందును హరభక్త
శేషాన్నభుక్తి నిషిద్ధంబయేని
నదియునుంగాక ము న్నాయజుర్వేద
మదియు 'రుద్రే ణాన్న మమృత' మ్మనంగ
వ్యక్తంబుగాఁగ 'దేవావై' యనంగ
'భోక్తుకామా' యన భువిదేవతలును
ఘనరతి 'వేదాశ్చ కామయంతే' య
నను వేదపురుషులు నలిఁ బ్రసాదింపఁ
బారిఁబారిఁ గామించి భోగింతురన వి
నరె భవిష్యత్పురాణ మిట్లు సెప్ప ?
విన నేరుపాటుగా 'వీరభద్రస్తు'
అనఁ 'బ్రమథాదయో' యనఁ బ్రమథులును
శేఁగి మఱి 'యజ్ఞో హరి స్సహస్రాక్షు'
నాఁ గమలజ రమానాథాదులైన
త్రిదశులు నల్ల విధించి 'బాణాసు
ర దశాననా' యన రాక్షసాదులు ని
యతిఁ 'బాణినశ్చ కణాదశ్చ' యన ని
యతిఁ 'గపిలో గౌతమాదయో' యనఁగ

నిష్ఠిత ¹షట్తర్క నిధులు 'వ్యాసోవ
సిష్ఠ వాల్మీకి 'నా స్మృతికారకులును
వారితాఘుండు దుర్వాసుఁ డగస్త్య
నారదముఖ మునినాథ యూథంబు
చర్చ శ్రౌతస్మార్తసరణి నిష్ఠించి
'యర్చనా ద్ధారణాదపి' యన వీర
శైవవ్రతోత్కృష్ట సరణిఁ 'బ్రసాద
సేవనా' త్తనఁగ నిశ్శ్రేయ స్సుఖైక
కారణంబనఁగ లింగప్రసాదంబుఁ
గోరి భోగింతు రఖండితభక్తి
వా రవైదికులో సవైదికులో వి
చారింప లింగప్రసాద విదూరు
లవు 'వేదభారభరాక్రాంత' యన వ
గవ 'సవై బ్రాహ్మణగార్దభ' యన నె
గడి శ్రుతుల్ మోపరి ²గాడ్దులై మోవఁ
బడిన బ్రాహ్మణగార్దభంబులకంటెఁ
గర్మచండాలురకంటె నామ్నాయ
నిర్మాణ మెఱుఁగంగనేరరో యట్లు
దగు శ్రుతిమతము నాద్యస్వీకృతంబు

---

౧. షట్కర్మ, ౨. గాండ్లయి.

నగు ప్రసాదం బనర్హమె? శాపదగ్ధు
లకు నిదానీంతనులకు వేదవిముఖు
లకు ననర్హమెకాక లక్షింప నిట్లు
దొల్లింటిసురల నాద్యులఁ జెప్పనేల?
తెల్లంబు వార్షణోద్దిష్టకాలముల
నగునుగాదొ వసు రుద్రాదిత్యరూప
ముగ భువిఁ బెట్టిన మూఁడు పిండములు
మధ్యమపిండంబు మగువలకెల్ల
విధ్యుక్తమై కొన విహితమై యునికి
నెలమిఁ 'బత్నీం ప్రాశయే' త్తనుసూక్తిఁ
దలపోయ శ్రుతి విరుద్ధమె? ప్రసాదంబు
దవిలి శ్రీస్కాందసూక్తంబును నట్లు
భువి 'మధ్య పిండస్తు పుత్రద' యనఁగఁ
బడి 'కిం పున ర్బహుభాషణై' రనఁగ
మృడుప్రసాదం బర్హమేకాదె శ్రుతు ల
నని పండితేంద్రుఁ డీ యర్థంబు [1]వేద
వినుతసూక్తులఁ జూప వెండియుఁ దలఁచి
యంతఁ 'ద్వాదశ్తైభి' రన నంద 'రుద్ర
శంతమేభి' రను ఋక్సంహితోక్తికిని

---

[1]. శ్రుతుల.

జను వ్యాసజైమినిసంవాదజనిత
వినుత భాష్యార్థంబు వెరవెట్టు లనిన
'హే రుద్ర' యనుట దానోరుద్ర యనుట
యారంగఁ దా'త్వయా' యనుట మీచేత
ననుట, వెండియు 'నశీయ'యన 'భుక్త్వా' య
నను జను పదయుక్తి నలి నారగించి
యాదట 'దత్తేభి' రనియు 'దత్తైః' 'ప్ర
సాదితై'రనియుఁ బ్రసాదింపఁబడిన
శ్రుతి 'శం తమేభి' నా 'సుఖితమై' రనఁగ
నతిసుఖితమమునై యవ్యయమనఁగఁ
జనను 'సంసారస్య' యన 'భేషజేభి'
రన 'భేషజై' రన 'నౌషధై'రన వి
శేషించి సంసార చిరరోగమునకు
నౌషధం¹బులునైన యాప్రసాదంబు
సేతగాఁజేసి తత్స్వా²కిక్రియాబుద్ధి
ఖ్యాతి 'శతం హి మా' యనఁగ 'శతం స
మా' యనఁ దన జీవమానాంతముగ 'శ
తాయుః పురుష' యన నట్టి ప్రతిజ్ఞ
భంగిగాఁగ 'వితతం పరమశైవ' మ్మ

౧. బైనట్టి; బైపట్టి. ౨. కృతే.

నంగఁ దాభక్తజనంబన నెట్లు
జగతిఁ దదేకనిష్ఠాపరతంత్రు
లగు శివసంబంధు లగు భక్తజనుల
కనుబంధమై 'చాతయస్వ' నా వెండి
యును 'నాత్మనా సహ యోజయ' యనఁగఁ
దనరి నీతో నిరంతర సాహచర్య
లను జేయుమనుచు నుల్లాసంబెలర్ప
నిల 'యథాయ'మ్మన నెవ్వఁడే నిట్లు
మలువక నడచు 'నస్మద్వేష' యన 'న
హంకృతి వర్జిత' యనఁగఁ దా నిట్ల
హంకృతిఁ బాసి 'వ్యంహ విగతపాప'
యనఁగ విగతపాపుఁడై 'వ్యమీ వా'య
నను భక్తి యుక్తియైనను విశేషించి
పరమభవత్పాద భక్తిమైఁ బొంది
సురుచిరంబు¹గ 'న విషూచీ' యనంగ
వసుధ 'మేధావీ భవతి' యన నంత
నసలార మేధావియై ప్రవర్తిల్లు
ననఁగఁ దత్సూక్తి భాష్యం బొప్పె మఱియుఁ
జను వ్యాసజైమినిసంవాదమునను

---

౧. గను 'విషూచీ'

వినుతింపఁబడి యజుర్వేదాంత మగుచుఁ
దనరు శ్రీరుద్రసూక్తంబున శ్రుతుల
యనుమతంబై యట్ల 'యచ్ఛందమోళ్ళ'
'మను రాయజే పితా' యనఁ 'ద దస్యామ
తవ రుద్ర' యనఁ 'బ్రణీతౌ' యనఁ జనిన
యవిరళసూక్త భాష్యార్థ మెట్లనిన
'హేరుద్ర' యనఁగఁ దానోరుద్ర యనుట
వారక మఱియుఁ 'దవ ప్రణీతా' వ
సంగఁ బూర్వార్థ మనంగ నీయొక్క-
సంగతి లింగపూజావేళలందు
వ్రాని 'యో' మను మంత్ర 'తేన' నా నెద్ది
యేనియు నొకమంత్ర మిల దానిచేత
నవు 'భవంతం భవ ఆయజే' యనఁగఁ
దవిలి నిన్బూజించెదము, మీఁద 'య త్త్వ'
మనఁగ నేది నిమిత్త మనఁగఁ దత్సూక్తి
గనుఁగొన 'సర్వలోకానాం పితాసి'
యనఁగ లోకముల కెల్లను దండ్రివగుచు
నొనరుదుగాన 'తవోపభుక్త' మ్మ
నను మీర లారగించిన ప్రసాదంబు
ననయంబుఁ గుడుతు నే 'నశ్నామి' యనఁగఁ

'దేవ'యనంగఁ దత్క్రియలుగాఁ జేసి
పూని 'శం యో'యన భువి నెల్ల జను¹ల
కెఱుఁగఁబడఁగ వైషయికసుఖం బనఁగ
మఱియునంద 'పరమాత్మా' యన నంద
నెనయుఁ 'బ్రాప్నోతి' నా 'నిత్యర్థ' యనఁగఁ
జనుటను విషయగోచరములు గాని
యీభంగిఁ జను పరమేశ్వర సమర
సీభావసుఖమునఁ జెందుదమనుట
యాది 'రుద్రేణాత్త మశ్నంతి' యనఁగ
నాదట బోధాయనార్థ మెట్లనిన
ఖ్యాతిగా 'రుద్రేణ' యనుట నారుద్రు
చేత ననుట మఱి ధాతు సూత్రోక్తిఁ
బరగి 'యాత్త''మ్మన్న భక్షణే' యనఁగ
సరి 'నాత్త' మనఁగ భక్ష్యములపే రగుటఁ
బరువడి భక్షింపఁబడు పదార్థముల
నరుదుగా 'నశ్నంతి' యనఁ గుడ్తురనుట
వెనుపొంద 'రుద్రేణ పీతం పిబంతి'
యనుశబ్ద ముఖ్యార్థ మారుద్రుచేత
భావింప జలముఖ్య పానీయ సమితిఁ

---

౧. లుసె.

ద్రావింపఁబడినవి ద్రావుదు మనుట
యనువొండ 'నాఘ్రాత' మనుట 'జిఘ్రంతి'
యనఁగ ¹ఘ్రాణాదులు నట్ల తా ననుట
సరసఁ బూర్వాపర సంఘటితార్థ
సరసైకవ్యాహారసంగతిఁ దలఁప
ననయంబు నెవ్వారే హారు ప్రసాదంబు
ననుభవింతురు దదీయాది సూక్తార్థ
సంగతి మఱియుఁ 'దస్మాద్బ్రాహ్మణా' య
నంగ వారలు బ్రాహ్మణశ్రేష్ఠులగుటఁ
దఱువాతఁ జను 'ప్రశాంతమనసో' యనఁగ
మఱి వార యతిశాంతమానసులగుట
వారక మఱియు 'విద్వాంస' యనంగ
వార లుత్కృష్ట విద్వాంసులు ననుట
'నిర్మాల్యమేవ' య న్నిర్ధారణంబు
నిర్మాల్యమనుటయ నిర్ధారణార్థ
మీాక్షింపఁగా వల దితరాన్నమనుట
'భక్షయంతి' యనుట భక్షింతురనుట
యీావిదితో క్తికి నెసగు 'నిర్మాల్య
మేవ నిషేవేఽత్ర' నా వేఱ కొనక

---

¹ ఘ్రాతవ్యాదులట్ల.

చెనసి నిర్మాల్యంబ సేవింతు మర్థి
ననుట వెండియుఁ బ్రదేశాంతరంబునను
శ్లాఘార్హమగు యజుస్సంహితఁ 'గేవ
లాఘో భవతి కేవలాదీ' యనంగ
నిక్షిప్త మదియట్ల 'నిర్మాల్యమేవ
భక్షయే' త్తనుచు జాబాలంబు మ్రోయ
క్షితిఁ బేర్మి నంద 'భుంజీయా' త్తనుచు వి
ధృతశీల 'సర్వతో ద్విజ' యంచు మ్రోయఁ
జావి మాధ్యందిన శాఖ 'నిర్మాల్య
మేవ' యంచును నట్ల యేర్పడి మ్రోయ
రతి బృహత్కాలోత్తర మను నాగమ ని
యతి 'భుక్తిభాక్సదా నాన్యథా' యనఁగ
సరిఁ 'గర్మణా మనసావా చ' యనఁగ
ధరఁ 'ద్రివిధం చార్పితం శుభ' మ్మనఁగఁ
జదురొంద నీశాన సంహితాగమము
నది 'భుజ్యతే' యనునట్లు మఱి లలిత
భైరవాగమము నేర్పడఁగ 'నిర్మాల్య
ధారణా' త్తనుచు నుద్యత్ప్రీతి మ్రోయ
ననఁ నేల వేయుఁ గాత్యాయన గృహ్య

---

౧. ద్యద్వృత్తి.

మున దినచర్య విప్రులకు విధింపఁ
బడి 'నమో రుద్రాయ పథిషదే' యనుచుఁ
నడచు పథం బర్పణముసేసి మఱియు
వడి 'నమో రుద్రాయ వనసదే' యనుచుఁ
దడయక యర్పించి తఱియు వనంబు
లగు 'నమో రుద్రాయ'యనుచు నర్పించి
తెగిచొచ్చు 'నప్సుషదే' యన నీరు
ఆరఁ 'దస్మాత్తన 'యత్కించన' యన
వారక 'కర్మకుర్వన్‌స్త'త్తనంగ
రూఢి 'సర్వం నమో రుద్రాయ' యనఁగఁ
గూడంగ 'నిత్యేవ కుర్యా'త్తనంగ
నర్పించి సర్వక్రియలు వొందునట్లు
నేర్పెలర్పఁగ ధరణీసురోత్తములు
అనుదినోన్నిద్ర నిద్రాభ్యంతరమున
దినచర్య యట్ల వర్తింపఁగవలయు
ననుమతి 'యా యా క్రియావిధాంతవ్య'
యనుచు వాధూలంబునం దట్లుమ్రోయ
మఱియును [1]గౌతమామ్నాయంబునందు
నెఱిఁ 'ద్రిగుప్తాన్నత్త మశ్నీయా' త్తనంగఁ

---

౧. గౌరవా; ఘనతరా.

దనరుఁ దత్సూక్తి కర్థంబు దానెట్టు
లనఁదగుఁ 'ద్రిగురితి యత్రిగోశబ్ద'
యనఁగఁ దద్గోశబ్ద మదియు వ్యాకరణ
జనితధాతుప్రోక్త సంఘట్టనమున
సరిఁ జక్షురింద్రియస్వర్గ పశ్వాది
వరనామములయందు వర్తింపుచుండ
ననుపమప్రకరణార్థౌచిత్యములను
జనుటఁ దానట్లు 'గోశబ్దేన చక్షు
రుచ్యతే' యనఁ దత్ప్రయోగ పదాక్ష
రచ్యుతి గామిని రసికుల శ్లాఘ్య
ననఁగఁ 'ద్విస్రో గావ' యను సమాసంబు
సనఁగ నమ్మిఁదటఁ [1]'చక్షూంషి యస్య'
యన 'నసౌ త్రిగు' రన నాత్రిగుశబ్ద
జనిత పూర్వాపర సంఘట్టనలఁ 'త్రి
యంబక ఇత్యర్థ' యనఁగ ఛందోగ
ణంబు లింపడరఁ 'దేన ప్సాత' మన న
భంగ ధాతువునంద 'ప్సా భక్షణే' య
నంగ 'నప్సాధాతు' రనఁగఁ దత్సంధి
నినుపార 'గిర్మణి నిష్ణాత' మనఁగ

౧. చక్షుషీ.

నినుపారఁ గర్మణి నిష్క్రాంతయుక్తి
దాన 'ప్సాతం భక్షిత'మనం 'ద్రియంబ
కేన భక్షిత' మనం గ్రియఁ బ్రసాదం బ
నంగ 'నశ్నీయా'త్తనఁగఁ దత్ప్రసాద
మంగీకరింపంగ నర్హమైయుండు
ననయంబుఁ 'బాహ్మా శివానర్పిత' మ్మ
ననుఁ 'ద దేనో భుంక్ష్వ' యనునట్ల మఱి 'క్రి
మిం భుంక్ష్వ' యనఁగ 'మలంభుంక్ష్వ' యన 'న
ఘుంభుంక్ష్వ' యన 'నధోగచ్ఛ'నా మఱి 'య
ధోగచ్ఛ' యను వీప్స దుదియుగా భాష్య
మాగమోక్తంబుల నట్లనుష్ఠించు
నెడ శంభునవధాన హీనమై తాన
కుడుచుట దింట ద్రాగుట యది దా ని
రంతరంబును 'శ్వమాం సాస్థిమూత్రంచ
భుంక్తే' యన శ్వమాంసములు గొంట 'ఖాద
తి' యనంగ నెమ్ములు దింటయుఁ 'బిబతి
చ' యన మూత్రము ద్రాగుటయు నని చెప్పఁ
గాన విప్రులకు లింగప్రసాదంబు
దానర్హమింక నుదాసీన వచన
ములు నఖిలపురాణములు నాగమములు

దలఁప శివార్పితేతర మిట్లు సాల
దుష్టంబు 'బహ్వాపి స్తోకమేవాపి
శిష్టమన్నం విమిశ్రిత' మనుగాన
లలి 'మిశ్రితం నిష్ఫలం భవే' త్తనుచు
నలరుఁ గావునఁ దదీయార్థ మెట్లనిన
ఫల పత్ర శాకాన్న పానాదు లోలి
నలి 'మనఃపూర్వంతు నైవేద్య' మనఁగ
భువి 'నయనానంద పూరిత' మ్మనఁగ
సవి¹ మనంబారఁ గన్నార శివార్థ
మతి ననాత్మీయార్థమతి నొక్కమాఱు
రతిగూడ వడ్డించి ప్రాణలింగార్ప
ణము సేసి సావధానముగఁ బ్రసాద
మమలినమతిఁ గొను టాది మార్గంబు
దడబడి యటుగాక తత్ప్రసాదంబు
గుడుచుచో ఘనమైనఁ గొండుకనైన
శిష్టాన్నమిందు మిశ్రితమయ్యెనేని
దుష్ట మనర్పితోద్దిష్టంబు గాన
కుడువఁ జిక్కిన కాయగూర లన్నంబు
వడఁకక మఱిమీఁద వడ్డించుకొనిన

---

౧. మనంబారంగ నరసి.

క్రియఁ 'దదేవోన్నత కిల్బిష' మ్మనఁగ
రయమునఁ గూలు నరకవార్ధి ననుట
మిశ్రితశ్రుతిమత స్మృతిపురాణోక్తి
విశ్రుతశ్రీవాయవీయసూక్తంబు
దనరారుచు 'నివేదితం చ దేవాయ'
యనియుఁ 'దచ్ఛేషంచ' యనియును జెప్పఁ
దివిరి 'జుష్టంచ తచ్ఛేషాన్న' మనిన
నవి పూర్ణమయ్యె సిద్ధాంతపక్షములు
అవిమిశ్రితప్రసాదైకసేవనము
వివిధవేదాగమ విహితమార్గంబు
దలపోయ వాధూల తంత్రాగమంబు
నిల 'నసమర్ప్య యదీశాయ' యనుచు
ధర 'వస్తు కించి త్కదాచన' యనియుఁ
బూరిఁ 'గదాచి న్నైవ భుంజీత' యనియుఁ
బాయక మఱి 'శివభక్తిపరో న
రో' యని వెండియు మ్రోయంగ మఱియు
భువి 'నుపభోగాయ పురతో' యనంగ
నవియును 'దత్తత్సమర్ప్య దేవాయ'
యన 'స్వేష్టలింగస్య యద్దత్త' మనఁగఁ
జని 'చరుకం త న్న సంశయో' యనఁగ

నెసయంగ 'దత్త్వాశయే' త్తన దీని
కనుకూలముగ బ్రదేశాంతరసూక్తి
సంచితవాయవ్యసంహిత 'దత్వ
యుంచ భుంజీత' నా నాప్రసాదంబు
ప్రాశించునది 'స్వయం ప్రాజ్ఞా' యనంగ
బ్రాశింపనొల్లక పరుల కిచ్చినను
నాదోక్తియంద 'నా న్యస్యైవ' యన 'న
దద్యా' త్తనంగ మఱి ధర గోజలాదు
లందిడి నరకాగ్ను లందుదు రిత్తు
దిం దా 'న గోజలాదిభ్యో' యనంగ
రమణ 'దద్యా చ్చే న్నరక' మన నదియ
క్రమము గేవలము లింగప్రసాదులకు
దమతమ లింగార్పిత ప్రసాదంబు
దమక యర్హము యథార్థంబట్లు గాక
శ్రోత యింద్రుండు వ్యాఖ్యాత నారదుండు
భూతిగా హరివంశమున విముక్తి ప్ర
మోదైక కారణంబు 'గదాచి దీక్ష
పాదాంబు నిర్మాల్య పరిమిళితోయ
సంగ మిళితశివా నాథాంఘ్రి సలిల
మంగళనిర్మాల్య మారుతం బొక్క

యెడఁ 'భవనః పన్నగేశేన' యన నె
గడి 'నిపీతః పుణ్యకారిణా' యనఁగ
నురగ మొక్కండు పుణ్యోపేతుఁ డయ్యె
నరిఁద్రావి 'విశ్వవిశ్వంభరా భార'
యన 'ధురీణత్వ మవాప్యతే' యనఁగఁ
దనరు విశ్వంభరా ధౌరేయతయును
వరుస 'భోగీశ్వరత్వ మచల' మ్మనఁగ
ధర 'నీశభూషణతా' మన నప్పు
డహిపాలనత్వంబు నచలితత్వంబు
బహువిధపార్వతీపతిభూషణత్వ
మూర్వి వెండియును దదుక్తిమధ్యమున
'సర్వజ్ఞతా చ సంజాత దేవేంద్ర
న హి సంశయో' యనఁ సర్వజ్ఞతయును
సహజంబు వడసె నిస్సంశయం 'బింద్ర
చ ననంద సాక్షా త్ప్రసాదభోగేన'
యన మఱి 'భక్తోఽయ'మన 'లభతే ఫ
ల'మ్మన శివుకేవలప్రసాదము ము
దమ్మునఁ గుడుచు ఫలమ్ము 'దద్వక్తు'
మన 'న హి మే శక్తి' రన 'న గిరో' య
న 'న గిరాంపత మే' యనఁగ నాకెఱుంగ

వాక్కుల కెఱుఁగఁ దద్వాక్పతి కెఱుఁగ
నొక్కింత శక్తిలే దొండేమి మఱియుఁ
గృతిఁ 'దేన జానంతి కిం నరా' యనఁగ
నితరుల్ ప్రసాదమహిమ నెఱుంగుదు రె?
యనుచుఁ దదీయ మహా ప్రసాదంబు
ఘనత నారదుఁడు ప్రకాశించె నిట్టు
లాది విష్ణుపురాణ మటె, హరివంశ
మాదటఁ జెప్పవాఁ డటె నారదుండు
నాగమోక్తంబటె యదియును ముక్తి
చేగమై గరిగొన్న [1]శివ ప్రసాదంబు
మహిమఁ బ్రత్యక్ష ప్రమాణమై యిట్లు
విహితమైయుండంగ వేఱొండు లేల?
కృతిఁ 'దేన జానంతి కిం నరా' యనఁగ
నితరుల్ ప్రసాదమహిమ నెఱుంగుదు రె?
తామసులగు శాపదగ్ధ విప్రులకు
సామాన్యులకుఁ గర్మ చండాలురకును
శ్రీమత్ ప్రసాద ప్రసిద్ధ మహత్త్వ
మేమనఁగావచ్చు నేల చేకురు శి
వప్రసన్నుల కశివప్రసాదము? 'శి

౧. ఁశదేల.

న ప్రసాదస్తు శివప్రసాదా' త్త
నంగ లింగప్రసాదాంగీకరణ సు
సంగత లింగ ప్రసాదుల మహిమ
కరముఁ 'బ్రసాదయుక్తానా' మనంగ
నరయ 'నాజ్ఞామైవ' యన నొప్పఁ దద్వి
ధము 'వాంసవః పర్వతా'యనఁ బర్వ
తమగుఁ బాంసువు ; పర్వతము వాంసు వగును;
అదియునుగాక దివ్యాగమ మూల
విదితేతిహాసముల్ వినరె యెట్లనిన

ఘంటాకర్ణుని కథ

శ్రీకంఠమూర్తి ఘంటాకర్ణుఁ డన ని
రాకులకీర్తి దిగంతరాళుండు
మతి నిష్టలింగ నిర్మాల్య పుష్పాను
గత మకరంద మాకర్షింప సూర్య!
యగు నె తాల్పఁగ భవదంగీకృతంబు
లగు శివనిర్మాల్య మఃను రేణు మారు
తానల చంద్రసూర్యాతపాంబువుల
చే నుపహతమగు శివుప్రసాదంబు
భోగింతురే భక్త పుంగవు లీశ్వ
రాగమంబుల 'నవర్హం చైవ' యనఁగఁ

జను నాత్మలింగ ప్రసాదపుష్పములు
గనుగొన ముట్ట నాకర్షింప నెట్లు
వచ్చునె నీకు దివాకర! నీవు
ప్రచ్చురఁ గుష్ఠరోగంబునఁ బొందు
మనుచు ఘంటాకర్ణుఁ డారవితోడఁ
గనలి యమోఘంబుగా శపియింప
నడరెఁ గుష్ఠవ్యాధి యాగమోక్తముగ
నుడువ 'మార్తాండ భానో కుష్ఠ' యనుచు
నంత సూర్యుఁడు భయాక్రాంత దురంత
సంతాపమునఁ జిక్కి చాఁగిలి మ్రొక్కి
'కల దపరాధంబు కావవే పృథివిఁ
గల పదార్థంబు లాకర్షించునట్ల
యెఱుఁగ కాకర్షించి యాశాపశిఖికి
గుఱినైతి దెసయు దిక్కును నీవ మఱియు
నాకన్యథా శరణం బొందులేదు
నీకొని రక్షింపు శిక్షింపు' మనుచు
వెండియు ధరణి మార్తాండుఁడు మ్రొక్కి
యుండ ఘంటాకర్ణుఁ డురుదయఁజూచి
'యాదిమనోహరుఁ డను గణనాథు
పాదోదకములచేఁ బడయు నీమేను'

నావుఁడు భానుఁడు నలి మనోహరుని
భావించి ప్రార్థించి పాదోదకములు
వడసి శరీరంబు వడసెఁ గావునను
నడిగొన్న లింగప్రసాదులు భువిని
ననమశాపానుగ్రహ సమర్థు లఘ ని
రసనులు ద్రిభువనారాధ్యులు మఱియు

భీతునికథ

నొక్క మునికుమారుఁ డుడుగని భీతి
పెక్కువ నెక్కొన భీతుం డనంగఁ
గడఁకమై నెవ్వారేఁ గదియనే తేరఁ
బొడగని బిట్టువాపోవుచు నుండ
నక్కజపడి తండ్రి యాత్మజుఁ జూచి
-ఁ మిక్కుటంబగు తొలి మేనిదుష్కర్మ
ఫలమిది మఱియొంటఁ బాయ దేభంగి
మలహారు సద్భక్తి మహిమన కాని
యని వీరమాహేశ్వరాచారదీక్ష
నినుపార లింగసన్నిహితుఁ గావింప
నాభీతి యడఁగి మహావీరభక్తి
లోభంబునం దతిలోకుఁడై యుల్లు

లింగ౧ప్రసాదైక లీలావధాన
సంగతి. నిరవధిసౌఖ్యసమృద్ధి
సతతంబువొాదలఁ బ్రసాద ప్రసూన
ధృతశిరోభాగుఁడై ధృతిఁ బ్రవర్తింప
నతనిఁ బ్రసాదనిష్ఠానవరత ని
యతి పెంపు ఘర్షింప హరుఁడు దలంచి
యొక్క ప్రసాద పుష్పోదరంబునను
గ్రక్కున నొక కీటకంబుఁ గల్పింపఁ
గనుఁగొని యదియు లింగప్రసాదంబ
యని శిరంబునఁ దాల్ప నంతకంతకును
బాదలుచు నత్తలపునుకయుఁ దక్క
మెదడును రక్తంబు మేని చర్మంబు
నెమ్ములుఁ దక్క ము న్నడి తొల్చితొల్చి
క్రమ్మన భక్షింపఁగా లెక్కగొనక
యతులప్రసాద నిష్ఠాంచిత వ్రత ని
యతిఁ జలింపకయున్న నభవుండు 'నీకు
మెచ్చితి నిచ్చితి మృత్యుత్వ' మనుఁడు
'నొచ్చెల్ల! నాకిది యోగ్యమే జియ్య!
హింసకు నోర్తునే యిందుకలావ

౧. ప్రసాదావలీలానుభావ; ప్రసాద విలీనావధాన.

తంస! యిక్కర్మంబు ధర్మవే తలఁప?'
ననుడు 'మదీయార్పితావధానాభి
జనన ప్రసిద్ధి ప్రసాదినై పరగు
నిర్మాల్యనిష్ఠైక నిరతుండు నుభయ
కర్మాపహరుఁడు నిక్కంబట్లుఁగాక
నెఱియుఁ 'గిమర్హ' యనియు నాగమోక్తి
నెఱియఁ గర్మార్హుండనియు మ్రోయఁగాన
సన్నుతలింగ ప్రసాదివి నిన్నుఁ
బున్నెంబుఁ బాపంబుఁ బొంద వెట్లనిన
వసుధచేఁ గొన్ని జీవంబులు ప్రబలు
వసుధచేఁ గొన్ని జీవంబులు మడియు
జలములచేఁ గొన్ని జంతువుల్ ప్రబలు
జలములచేఁ గొన్ని జంతువుల్ మడియు
శ్వసనునిచేఁ గొన్ని జంతువుల్ ప్రబలు
శ్వసనునిచేఁ గొన్ని జంతువుల్ మడియు
నందుఁ బృథివ్యాదులైనభూతములు
వొందునే యయ్యయి పుణ్యపాపముల
నిందు మదీయ మహీయఃప్రసాది
వొందునే యెట్లును బుణ్యపాపములు?
సత్య మిట్టిది' యని శంభుండు దెలిపి

మృత్యుత్వ మొసఁగె నామృత్యుదేవతకు
నటుగాక యుభయకర్త్రాతిక్రముండు
స్ఫుటతరలింగ విశుద్ధ ప్రసాది

దూర్వాసుని కథ

దూర్వాసుఁ డపరరుద్రుండు మునీంద్ర
సార్వభౌముఁడు 'శైవసహిత ప్రసాద
సేవనా'త్తన లింగదేవ ప్రసాద
సేవాన్వితుఁడు క్రోధ సిక్తతపోని
యతుఁడు స్వైరవిహార రతుఁడు విజ్ఞాన
యుతుఁడు ద్వారావతి కొక్కనాఁ డరుగఁ
గృష్ణుండుఁ దాను రుక్మిణియు సంభ్రమత
నుష్ణీషమును గుచయుగముఁ బైకొంగు
నటయిటఁ దూల సాష్టాంగులై మ్రొక్కి
పటుతరాభ్యాగత ప్రతిపత్తిసలిపి
పాయసాహారం బ[1]పారంబుగను స
మాయతభక్తి పెంపార వడ్డింప
నమ్మునీశ్వరుఁ డీశ్వరార్పణ సేసి
సమ్మదలీల ప్రసాదభోగంబు
గావించి తత్ప్రసాదావశిష్టంబు

౧. బుపాహారముగ.

'గోవింద! కడుపారఁగుడిచి చిక్కినది
వూసికో సర్వాంగములనంచు నోసఁగ
నానక్తిఁ గుడిచి భుక్తావశిష్టంబు
నఱికాళ్లఁదక్క సర్వాంగంబులందు
నెఱిఁబూసికొనుటయు 'నీ విదియేమి
యఱికాళ్లఁ బూయవై తచ్చోట నీకు
నెఱనుగా నొకబోయ నిశితబాణోప
హతి మరణంబు నీ కయ్యెడ' ననుచు
నతికుపితాత్ముఁడై యతని శపింప
మృతిఁబొందెఁ గృష్ణుండు మృదుప్రసాదుల ని
రతిశయమహిమ యేమనిచెప్ప మఱియు

సుకేశికథ

మును వామనపురాణమున నితిహాస
వినుతకథాయుక్తి వినుతింప నొప్పు
శీలవంతుండు ప్రసిద్ధ ప్రసాది
శూలిభక్తుఁడు సుకేశుండను గణము
సర్వాంగలింగ ప్రసాదోపభోగి
సర్వప్రసాద ప్రసాది గావునను
భూతపంచకగుణంబులు దదంశములు

---

౧. శేషంబు. ౨. అన్ని ప్రతులలోను 'పూసు' అని ఉన్నది.

భూతపంచకమునఁ బుట్టి ద్రవ్యమ్ము
లవిమిశ్రిత ప్రసాదైకవర్తనులు
భవుని కర్పించుకొంటభాతిఁ దానిట్లు
హరున కీవలయు బాహ్యాభ్యాంతరములఁ
బరగు రూపానిరూప ద్రవ్యతతులు
నగు స్వరూపము లుభయార్పణార్హంబు
లగు నిరూపంబు లేకార్పణార్హములు
గల్పితి ఖండితాఖండితస్థితి న
నల్పాల్పరూపంబు లగువానిలోనఁ
దేరాదు మనము నేతికి మనంబునకు
నీరాదు వెన్నెల లెండలెట్లనిన
నొందు ఖండితరూప మోషధిప్రభృతి
యం దఖండితరూప మవనీతలంబు
గలయనీరాని యాకయు మెట్టరాని
కలితరూపిత తదఖండితపృథ్విఁ
దొడరి ప్రసాద పాదుకములు మెట్టి
వడిఁ జరించుపగిది వర్తింపరాదు;
ఖండితాఖండితాకారముల్ గాన
వెండిజలంబులు వేఁగయ్యె వాని
వలన వర్షాంబుప్రవాహోదకాదు.

లిలఁ దక్కనిచ్చున [1]ట్లేఁ బొందరాదు;
ఖండించి లింగసంస్కారంబు నేసి
మండు దీపాగ్నుల మాడ్కి నీరాదు
అచ్చుగాఁ దద్విషయంబగు వాయు
విచ్చి పొందెడుమాడ్కి నివి వొందరాదు;
అవకాశ మర్పించి యంబరాంతరము
దవిలి పొందెడుమాడ్కిఁ దాఁ బొందరాదు
జలదభూరుహగృహచ్ఛాయాదు లిచ్చు
పొలుపున నర్పించి పొందనీరాదు
గంధాదులట్ల యకామ కృతంబు
సంధిల్ల దంతర్విషయములు గామి
విషయపంచకములో వివరింప నాల్గు
విషయంబు లాంతరవిషయంబు లొక్క
విషయంబు దా బాహ్యవిషయ మాస్పర్శ
విషయసుఖం బాత్మ విషయంబుగాన
స్పర్శనద్రవ్యంబు బాహ్యంబుఁ బొంద
స్పర్శనసుఖ మాత్మఁ బ్రాపించుఁగాన
పరిమితంబైన రూపంబులభాతి
నరసి యంగముచేత నర్పింపరాదు

---

౧. ట్లిల; ట్లీ.

మఱి నిరూపములట్ల మనసు చేతులకు
వెలవ కీరాదు దృగ్విషయముల్ గామి
బెరయరా దెట్లు నర్పింపరా దొక్క
వెరవున నర్పింప వెరవయ్యెనేని
బరదైవకిరణ సంస్పర్శనార్పణము
ధరణి దుర్గంధార్పితం బట్లమైన
మతి యకారణము దా మర్త్యులకెల్ల
ధృతి 'న త థాలింగ్యతే పతి' యనుట
సాలదే మును మానసం బర్పితంబ
యోలి బాహ్యమన నీకున్న నేమనిన
నగు నిరూపములు దానై పొందుచోటఁ
దగు మనంబున నర్పితము సేయఁగాన
మును దాన యర్పించి ముట్టునిరూపములు
మనమున నెట్లు సమర్పింపఁగూడు
నే? 'గవాం సర్పిః శరీరస్థ' మనఁగ
నాగమోక్తమె మానసార్పణం బరయ?
ధర 'నకరోతి హితం నృషు' అనఁగ
హరుఁడు హితంబు సేయఁగనేరఁ డెట్లుఁ
గావున శుద్ధ సూక్ష్మప్రసాదులకు
నేవెంటఁ బొందరా దెండవెన్నెలల

ననుచు నాదిత్యచంద్రాతపద్యుతులు
దను బొందసీని నిత్యవ్రతనియతి
మందరభూధర సుందర సుకర
కందరాంతర్బిల మందిరుం డగుచు
నాస్థఁ దదీయసీమాలంఘన వ్ర
తస్థితి భక్తులుఁ దాను వర్తింప
నారదుం డొక్కనాఁ డేఁగు చేర
ద్వారపాలురు దను వారింప మగుడి.
యినలోకమున కప్డు యేఁగి 'భాస్కరుఁడ!
విను, సుకేశుండను వెడఁగుభక్తుండు
మందరభూధర సుందరసుకర
కందరాంతర్బిల మందిరంబునను
నినుజూడ రాదంచు నీకిరణములు
దను బొందనీనంచు ధర నున్నవాఁడు;
అనిమిషశ్రేష్ఠుండ వైయుండి యొక్క
మనుజుచే ని ట్లవమానతఁ బొంది
[1]బ్రదికెడు బ్రదుకుదాఁ [2]బదటికే' యనుడు
మది నల్గి సూర్యుఁ 'డా మందరాచలము
పటపటవ్రక్కలై పడఁగాసి యతనిఁ

---

౧. బ్రదుకటిబ్రదుకు. ౨. బ్రనుకటి కనుచు.

జటచిట ప్రేల్చెద శీఘ్రింబ చూడు
మా మునీశ్వర!' యంచు నాత్మసహస్ర
ధామ సంజనిత నిదాఘాగ్ని శిఖల
నాయద్రిఁ గాల్ప 'హా' యనక 'నమో భ
వాయ రుద్రాయ శివాయ' యక్షరవము
సనఁజన నొత్తిలి సంస్తుతింపఁగను
విని రుద్రుఁ డతికోప వివశాత్ముఁ డగుచుఁ
దప్పక చూచుడుఁ దరణియు ధరణి
దొప్పనఁబడి శివస్తుతులు సేయుచును
'గావవే భక్తయోగక్షేమయుక్త!
కావవే కారుణ్య కలితాత్మ!' యనుచు
వసుధపై వేమార్లు వలగొని మ్రొక్క
నసమాక్షుఁ డాభువనాక్షు వీక్షించి
'చిద్భరితాత్ములు శీలసంపన్ను
లద్భుత చారిత్రు లశరణశరణు
లనఘులు నిత్యలింగార్చనా నిరతు
లనక మాభక్తుల కపకారివైతి;
ఘనుని ఘంటాకర్ణు గణనాథు లెక్క
గొనని నీ తనువునఁ గుష్ఠువ్రాసెంచె;
నాది మనోహరుం డను గణనాథు

పాదోదకములు మైఁ బడసిన విధము
నొండేఁటికిని దక్షునూఁదినకతనఁ
బండులు వోనాడి పథము వోనాడి
పన్నుగా మును [1]శిలా [భావాంగుళి యను
విన్నన] నీ పదివ్రేళ్ల నఱ్ఱ బూన్చి
యడర నీ పదివ్రేళ్లు నాది నీపదము
వడసినవిధము నప్పుడ మఱచితివో
కలహాభోజను ముని కష్టు నారదుని
పలుకులు నినుఁ బదభ్రష్టుఁ గావించె
నెడసేయ కింక నీ విప్పుడ పొమ్ము
వడి డొల్లిడొల్లి శ్రీవారణాసికిని
రమణ బాలార్కేశ్వరం బను నచటఁ
గ్రమమొంద నొక్కలింగముఁ బ్రతిష్ఠించి
పడయుము నీసూర్యపదము' నావుడును
'వడి డొల్లిడొల్లి శ్రీవారణాసికిని
బోయి బాలార్కేశు భువిఁ బ్రతిష్ఠించి

---

౧. "శిలాభావాంగుళీ రాఖ్యే స్థానే మే స్వాంగుళీ గ్దళే, సమ ర్పాల్యలభథాస్త్రాశ్చ స్వపదం కిన్ను విస్మృతమ్" అని సంస్కృతాను వాదము. 'శివభావాంగు నింద; శివభావాంగుడతని; శివభావాంగు ళింద; శివభావాంగుళీయ;' అనిన్ని, 'విన్నాగ', 'వెన్నాగ' అనిన్ని వ్రాతప్రతుల పాఠములు. ఇవేవిన్ని కుదుర లేదు.

యాయతభక్తి సూర్యత్వంబు వడసెం
గాన విశుద్ధలింగప్రసాదుల య
నూన మహత్త్వంబు నుతియింపఁ దరమె?'
యనుచుఁ బండితమల్లికార్జునుఁ డాదిఁ
జను శుద్ధలింగ ప్రసాదుల మహిమ
యును బ్రసాదమహత్త్వమును జెప్ప విప్ర
జనులు గీర్తించుచుఁ జని రంత నిచట.

సూరసానికథ

వీరభక్తస్థలవిదిత¹పోరండ్ల
సూరసానవ్వ నా ధారుణిఁ బరగు
నరిది మున్నాయవ్వ చరిత మెట్లనిన
నరయఁ బోరండ్లను నగ్రహారమునఁ
బతిపరోక్షంబునఁ బ్రథితసద్భక్తి
నతివయుఁ దొల్లింటియట్ల సంతతము
జంగమారాధనల్ సలుపుచునుండ
వెంగలులైకూడి విప్రులందఱును
నాయూరి ప్రజలును నధిపతిఁ గానఁ
బోయి యిట్లనిరి 'యో²భూమీశ వినుము
ధరణి మాయూర నుత్పాతముల్ పుట్టె

౧. పోరండ. ౨. భూనాథ.

నరయంగఁదగు సూరమవ్వక యనఁగ
సాధుమార్గమున నిచ్చట నుండియుండి
వైధవ్యవర్తనల్[1] వఱితిపాల్సేసి
యరయ నుమ్మెత్తకాయలు దిన్నయదియొ
మరులుగొన్నదియొ ముఱ్ఱ మతిదప్పినదియొ
కనుఁ[2]గొనఁ జెక్కిళ్లఁ గడఁతలఁ గడవ
నెనయ [3]బూడిదమెత్తుకొని మేనఁ[4]బూయఁ
దల నర్తఁ జెవ్రలఁ జేతులను రుద్రాక్ష
ములుఁ బటికంబు పూసలును ధరించి
ధరణి నిక్కపుభక్తిపరురాలువోలెఁ
దిరిపంబు మనువుగాఁ దిరియు బోడలను
వ్యక్తిగా విను పెద్దభక్తులు పెద్ద
భక్తు లనుచుఁ గాళ్లఁబడి కడ్గి త్రాగుఁ
జేకొని కుడిచి డించినఁ[6]గుడ్చు నంతఁ
బోక మాలలఁ గల్పె భువి[7]జను లెఱుఁగ
ననసేల యీయగ్రహార మంతయును
బనుగొన మాలలపాలయ్యె నిట్లు
దానును మాలలుఁ దనయింట నుండఁ

---

౧. వఱద. ౨. గవ. ౩. భూతియు. ౪. బూసి. ౫. ంబ.
౬. మెక్కు; గుప్పి. ౭. యొల్లనె.

గా నష్టు సూపినం గలవె దండింప
ననవుడుఁ బట్టింపుఁడని యల్క రాజు
వనుప విప్రులు వోఁచికొని యున్నయెడను
వద్దు మొగంబును వలుదచేతులును
బ్రద్ద చిఱుఁదొడలు బరడుఁ బ్రక్కలును
గాయగాచిన యఱచేయి నెందోళ్లు
గోయఁ దాఁకిన యసిగోఁతడాచేయి
మట్టిపాదంబులు మలినంపుమేను
మిట్టనుదురు మ్రక్కిమెడయును బ్రాకు
వట్టిన [1]యరవిరి పండ్లుఁ [2]బొక్కంపుఁ
బొట్టయు వెడ [3]గ్రుక్కు వోయిన వీఁపు
బొడ్డికన్నులు ముడిబొమలు వ్రే[4]ల్పెవులు
దొడ్డముక్కును గుజ్జుఁ దొడలును బరటి
వ్రేళ్లును గమలిన గోళ్లు లోవంక
కాళ్లును గందిన కటములు నమరఁ
దెలుపారుబూది నొసలనిండ మెత్తి
కలయఁ జేతులఁ [5]బెండెకట్లుగాఁ బూసి
నలి దొడ్డరుద్రాక్షములు [6]వల్దపటిక

---

౧. యలివిరి. ౨. జొక్కంపు. ౩. పొంకు; గొంకు; గ్రొంకు. ౪. ల్జుకలు. ౫. బండె. ౬. దొడ్డ.

ములు సాలమాని పూసలపేర్లుఁ దాల్చి
కుఱు[1] వెండ్రుకలవెడ గొప్పలో పలను
గఱకంఠ[2] గద్దెనగరు గానుపింప
బలువుగా శివసూత్ర మలవడఁగట్టి
మొల[3] నరవణి దూటి [4]తలనరసుట్టి
యూరెయుఁ గత్తియు నట్టలమోపు
వారెనల్ మ్రొక్కులు వలచేత నొక్క-
[5]సెంబళిగోలయుఁ జెన్నొంద శివుఁడు
వంచినయంత్యజు భావంబుఁ దాల్చి
యచ్చుగాఁ జనుదెంచి యగ్రహారంబు
జొచ్చి యల్లంత భూసురులు రాఁజూచి
చెంగుచు 'సెంబళి, సెంబళి' యనుచు
వంగుచుఁ దొలఁగుచు వాడవాడలను
భోరన 'మ్రొక్కులు గోరె! వారెనలు
గోరె! [6]వారెనలు మ్రొక్కులుఁ గోరె!' యనుచు
నమ్ముచుఁ జనుచు నంతంత నిల్చుచును
[7]గ్రమ్మన వచ్చిన క్రంత వచ్చుచును
గలయంగ నింటింటఁ బిలుపించికొనుచు

---

౧. వెంట్రు. ౨. గట్టిన. ౩. దిరువణి. ౪. మొలవడుపట్టి. ౫. చెంబళి. ౬. యనుచు వింతగూత బెట్టుచును. ౭. క్రమ్మర.

వెల మొంత యనిన వెగ్గలము చెప్పుచును
వెడజట్టి సూపుచు విప్రులయిండ్ల
కెడనెడఁ బలుమాఱు నేఁగుచుఁ జనుచు
గఱకంఠభక్తులఁ గన్నంత [1]నవ్వ
'[2]సఱణార్తి! సఱణార్తి! సఱణార్తి!' యనుచు
గరమర్థి వారిచేఁ [3]గాల్గట్టఁగొనుచుఁ
బారిబారిఁ బ్రాంతచెప్పులు ముడుచుచును
వెనువెంట మును పొంచికొని[4]యున్న విప్రు
లను నెఱింగియు నెఱుంగనియట్లు గూడ
నప్పాట నూరెల్ల ముప్పెట్లు వెట్టు
చొప్పేరుపడియుండ సూరసానమ్మ
యింటికి నేతేర నింతియుఁ గాంచి
పంటింప కెదురుగాఁ బఱతెంచి మ్రొక్కి
యలరు వారెనలు మ్రొక్కులుఁ [5]బుచ్చి యెదిరి
చిలుకకొయ్యఁ దగిల్చి చేతికత్తియును
నారెయు ముంగిట నఱుఁగుపైఁ బెట్టి
వారి సెంబళికోల వడిఁ[6]జూరఁ [7]జెఱివి
పాదము ల్గడిగి యా పాదోదకమ్ము

---

౧. నవుల; దవుల. ౨. సరణార్తిశరణార్థి. ౩. కాల్గటి. ౪. వచ్చు. ౫. బంచి. ౬. జూర్చ. ౭. జెక్కి.

లాదటఁ బ్రాశించి యంత[1]లోపలికిఁ
దోడుకొనిపోయి యుత్సుకలీలతోడ
గడియ [2]గ్రక్కునఁ బెట్టి కడుఁగడు నలరి
సింహాసనాసీనుఁ జేసి యాకర్మ
సంహారు లింగావసరముఁ జెల్లించి
కదళీదళం బిడి కన్ను దనియఁగఁ
బదపదార్థములును బక్వాన్నములును
దృక్కొనఁ [3]గూడ వడ్డింప నాయయ్య
యక్కజంబుగ లోన నారగింపంగ
'నెట్టకో సూరమ యింతగాలంబు
గట్టడివై మాలఁ గలిపి తియ్యారు
సిక్కితిగాక మా చేత నీవింక
నెక్కడపోయెద విట్లు బోడలకుఁ
బోఁడిగా నంబలి వోసినవిధము
నేఁడుగదా నీకు నిండారఁ బండె
మంటి సఫలమయ్యె [4]మన్న ఫలంబు
నింటిలోనన [5]సుఖ యింతు గా' కనుచు
వెలిఁ బొంచికొనియున్న విప్రు లక్షణము

౧. లోపలను. ౨. క్రే; డె. ౩. గుడువ. ౪. మన్నన.
౫. భుజియించు.

తలుపు [1]డగ్గఱఁ దీసి తాళంబు [2]వెట్టి
కొందఱ వాకిటఁ గూర్చుండఁ బెట్టి
[3]కొందఱ నిలుసుట్టికొనియుండఁ గొలిపి
[4]యోరోరి [5]యెగ్గెన్న యోరోరి భిన్న
యోరోరి బలభద్ర యోరి [6]మైలార
మత్తైన లోఁబడె మనవిప్రసహిత
మత్తలారులఁ బిల్వఁ [7]డనుసంతలోన
సోమయాజులపెద్ది [8]వామనభట్టు,
దామోదరప్పన వామన [9]కూచి,
గేశవపుటశాస్త్రి. కేమన[10]పెన్న
వాశము [11]మైలారు భట్లుపాధ్యాయ
నప్పట్లపెద్ది యంశమసూర[12]పోత్రి
వప్పు కేశవుఁడు [13]సంబపులమాధవుఁడు
మానంబుమా[14]రన్న [15]మంచయదొడ్డి
దోనయభట్లును, ధూర్తవిట్టలుఁడు
[16]సిమ్మెనమల్లి గూచెనగారి[17]తమ్మి

౧. ద. ౨. నైచి. ౩. కొంపటి. ౪. యజ్ఞన్న. ౫. మా. ౬. రా. ౭. కో. ౮. న. ౯. పెద్ది. ౧౦. ఘడ (డె) శాసి (చి). ౧౧. మల్లయ; దోనయ. ౧౨. బో. ౧౩. సంచనంబ. ౧౪. దన. ౧౫. మాచియుదొడ్డి. ౧౬. చిమ్మిలి. ౧౭. దుమ్మి; తుమ్మె.

[౧]కొమ్మనప్పన బొల్లికోడె [౨]యల్లాడి
యన్నమువారి పె[౩]న్నొజ్జులు [౪]గప్ప
కృష్ణమ్మ, యరగడ్డ కేమన [౫]కూచి
[౬]వరిగడ్డువారి కుప్పనయాజి [౭]వంగ
వరక [౮]యజ్ఞము [౯]యుండి భాస్కరయొజ్జ
[౧౦]గందిగిజైతన గామ[౧౧]యగ్గెనము
కుందన [౧౨]దక్షిణ గోపాలమంచి
[౧౩]మేడిచెట్టయితన మిండవల్లభుఁడు
దూడగడ్డప్పన [౧౪]దుష్ట రాఘవుఁడు
[౧౫]నెత్తుఁగాలైతన యీశ్వరభట్టు
నత్తతి వీరెల్ల నాదిగాఁ గల్గు
ద్విజులును దలవరుల్ దీర్పరులెల్ల
ప్రజలును నట్లున్న భంగినవచ్చి
యధిపతిఁ బిలుపించి యందఱలోన
నధికుఁడైయున్న బ్రాహ్మణుఁ డిట్టులనియె:
'నొండేమి[౧౬]సెప్పెదు నుర్వీశ[౧౭]వినుము

౧. కొమ్మల; కొమ్మెన. ౨. యల్లారి. ౩. పి. ౪. గంప; గర్వ. ౫. మాచి. ౬. పర. ౭. రంగ. ౮. యగ్గెన. ౯. గంటి; వుంటి; పుంటి. ౧౦. గందిగిజేతన; కందింశ్రీ జగంజాయిత్త. ౧౧. యజ్ఞన; యజ్ఞించు. ౧౨. దక్కిణ. ౧౩. మేడునచట్టన్న. ౧౪. దుడ్డు. ౧౫. ఎత్తుగాలైదన; ఎత్తుగాల్ రామన; ఎత్తుగోలాదెన. ౧౬. చెప్పెదము. ౧౭. నేఁడు.

పండె నీసూరమవ్వక్కగారి తపము
వెలయంగఁ బెనిమిటి వెనుక నిట్లుండ
వలవదా[1]కడతాలి వర్తన[2]లొప్పెఁ
గడుసాంగమయ్యె నీగరిత భక్తియును
గడుఁగడుఁ గాకయ్యెఁ గథ లేమి సెప్ప
వీదివీదుల వింతమాదిఁ గెబత్తుఁ
డాదట మ్రోఁకుల నమ్ముచు వచ్చి
యిల్లిల్లు దప్పక యెడ[3]దాఁకి మ్రోఁకు
లొల్లకున్నను డస్సి మెల్లన వచ్చె
నింతలోఁ[4]గని యెదు రేఁగి తా[5]మ్రొక్కి
యెంతయు సంప్రీతి [6]నింటికిఁ దెచ్చి
కాళ్లనుగడిగిన కందువసూడు
కాళ్ల చెప్పులు మును గ్రక్కున దివిచి
చెరివిన దదె చూడు సెంబళ్లికోల
యరుఁగుపై నదె చూడు మారెయుఁ గత్తు
లివె చూడు వారెన లీచిల్క కొయ్య
నవె చూడుమా మ్రోఁకు లాచిల్క కొయ్య
నక్కజంబందుచు నందఱుఁ జూడ

---

౧. కడలాలి; కదలాలి. ౨. ముప్పె. ౩. దారి; దాలిఁ త్రాడు. ౪. లోనవెయెదు రేఁగి. ౫. వచ్చి. ౬. నింతియు.

లెక్క సేయక లోపలికిఁ గొనిపోయి
తలుపు మూయుఁడు నంతఁ దాళంబు వెట్టి
'[1]పిలుపించితిని [2]నిన్నుఁ బృథివీశ!' యనుచుఁ
జెప్పుచుండఁగ [3]లోని శివుని మూర్తియును
జప్పుడుగాఁగ నాస్వాదించి జుట్టు
జుట్టునఁ బడిదంబు జుట్టుచు గట్టు
గట్టునఁ ద్రెస్సుచుఁ గాయ లేమేనిఁ
[4]గఱుకనఁ గఱచుచుఁ [5]గఱుబోరు గొనఁగఁ
[6]బఱపుగా నమలుచుఁ బాఱ మ్రింగుచును
మానుగా ఫలము లేమేనిఁ బీల్చుచును
నానుచు నీక్రియ నలి నారగించి
చెలువార వాసించు శీతలోదకము
లలుకుచు [7]గ్రుక్కు గ్రుక్కనఁగ ద్రావుచును
బూరించి ఘుళఘుళం బుక్కిలించుచును
సారించి యుమియుచుఁ జప్పుడు గాఁగ
నాలుక [8]దొడయుచు నలిఁ బలువరుస
వ్రేలిడి ప్రాముచు వినఁ గ్రేటి క్రేటి

---

౧. పిలిపించితిమి. ౨. మిమ్ము. ౩. లోన. ౪. గటుకున గముచుచు. ౫. గరపురలెసగ గరుసు మ్రొరుమగచ. ౬. పటువుగా. ౭. గ్రక్కు గ్ర. ౮. దడి.

వెండియు నుమియుచు వికృతము సేయు
చుండంగ విని విని యుండంగ రాక
కడునల్గి విప్రులు గ్రక్కున లేచి
"ధరణీశ! వింటిగదా మత్తి [1]గాడు
శంకింపఁ డెంతయుఁ జప్పుడు గాఁగఁ
గొంకక యింటిలోఁ గుడుచుచున్నాఁడు
అగ్రహారంబను [2]నలుకువ లేక
యగ్రజన్ములయందు లనుభీతి లేక
తను బట్టవచ్చిరన్ తలఁకును లేక
మన మున్నవార మన్ మది [3]భీతి లేక
చిక్కితిననియెడు చింతయు లేక
యుక్కడఁగింతు[4] రన్నులుకును లేక
యులరుచుఁ డా నొక యయగారువోలె
నిజ వేషధారి [5]జంగిలి యున్నవాఁడు
వచ్చెఁ దనకుఁ జావు వడి దప్పదనుచుఁ
జెచ్చెరఁ గుడిచి యే చచ్చెద ననుచు
నాయంత్యజుం డుండెఁ బో యెట్టు లైన
నీయింతిఁ జూడుఁ డా యిందఱలోన

౧. కాఁడు. ౨. నలుకును; నడకువ. 3. ఉసుల్. ౪. రన్ డక్కును. ౫. వెంగళి; జంగలి; జగ్గలి.

నీలువు వోనాడు టిది దప్పు నాక
శీలంబు విడుచుట చేటు వొమ్మనక
[1]కులధర్మ మెడపుట గుణముగా దనక
యిలువడి [2]విడదలుట యెగ్గు వొమ్మనక
విధవతనమునకు వెలితి వొమ్మనక
విధి లేదు సతిసెడ్డ విధి[3]యింతె యనక
యిట్టైన విప్రుల కెడ యాదు ననక
పుట్టుం బుట్టువు[4]మాలు వోతు వీఁడనక
పతికిని బిత్రులోకగతి దప్పుననక
పతి విన్నఁ బ్రాణంబుపై వచ్చు ననక
బంధులలో నగుఁబా టవుననక
సంధిల్లఁ[5]గాని దుర్జాతి వీఁడనక
కులమున కెల్లను గుద్దలి గొనియెఁ
గులమెల్లఁ గొనిపోయి [6]బిలములోఁ గలపె
వింటిమి విన మిప్డు గంటిమి గాన
[7]కుంటిమి యీలేమ నూరివా రెల్లఁ
జూడుఁడో[1] యనుచు భూసురులు బిట్టలిగి

---

౧. పలుమారు యిది యేటిబ్రతుకుదాననక. ౨. దప్పుట. ౩. యింప. ౪. మాతలుంబోతుయనక; మాలుబోతుకతన; మాలు (దూలు) బోయబో యనక; దూలుపోతువీడనక. ౫. రాని. ౬. జల. ౭. ముంటిమిలేమనకూరి.

గోడలుగూల గ్రక్కునఁ గొట్టుఁడనుచుఁ
దలుపు నెమ్ములు గ్రక్కదలఁ దన్నుఁడనుచు
నలుదెసల్ వైకెక్కి యిలు ద్రవ్వుఁ డనుచు
గడియలోపలఁ గూడి పడఁ బొడ్వుఁ డనుచుఁ
గడఁగి పెండెలు విర్గఁ గాఁ [1]దివుఁడనుచు
నెట్టణ యింటిలోనికి నుర్కుఁ డనుచుఁ
దొట్టరు లిరువురఁ బట్టి తెండనుచుఁ
బచ్చి[2]బడ్డెల వారిఁ బడఁ గొట్టుఁ డనుచుఁ
జెచ్చెర నటుగూడఁ జిచ్చిడుఁ డనుచు
నందఱు [3]విప్రులు నత్తలవరులు
నందడింపుచు నాతి జడియ [4] కిట్లనియె:
'నంత్యజుఁ డంత్యజుఁ డనుచుఁ గుయ్యిడెద
రంత్యజునకుఁ జొర నది యెట్లు వచ్చు
నరుదగు మీయట్టి యగ్రజన్ములకు
హరభక్తు లిండులు సొరఁగరా [5]దనఁగఁ
గన్నులఁగానరు గా కింటిలోన
నెన్నంగ గులహీను లెట్లున్న వారు?
రుద్రభక్తుల యిండ్ల రూఢిఁ బ్రత్యక్ష

---

౧. దీయు. ౨. బడియల. ౩. భూసురుల. ౪. కపలిక. ౫. దనుచు.

రుద్రులు గాకేమి క్షుద్రు లున్నారె?
మాహేశ్వరుల నిజమందిరంబులను
మాహేశ్వరుల కాక మనుజు లున్నారె?
ప్రమథకులీనుల [1]పాలి నగళ్లఁ
బ్రమథులకాక దుష్పాత్రు లున్నారె
లోకవంద్యుని గణానీకాలయముల
లోకవంద్యులకాక లోకు లున్నారె?
శరణగణప్రాణు శరణాలయముల
శరణులకాక సంసారు లున్నారె?
భవరహితుని భృత్యభవనంబులోన
భవరహితులకాక భవు లున్నవారె?
కులజాగ్రగణ్యదాసుల నిలయములఁ
గులజులకాక దుష్కులజు లున్నారె?
లింగసన్నిహితుల యంగణంబులను
లింగులకాక మాదింగు లున్నారె?
పరమేశసద్భక్తిపరుల నిందించి
నరకాగ్నిశిఖలచే నెరియ మగ్గెదరు;
నిటలాక్షుభక్తుల నిటు సెడనాడి
కుటిలభవాంబుధిఁ గూల నిమగ్గెదరు;

---

౧. పాటి. ౨. సేఁగె.

గాలకోలాహలు గణములఁ దెగడి
కాలుదండంబుచేఁ గూల [1]మ్రగ్గెదరు;
అంతకాంతకు శరణావలిఁ దెగడి
యంతకు [2]పాలికి నరుగ మ్రగ్గెదరు;
గర్మసంహారుని జంగము నొవ్వఁబలికి
కర్మగతులపాలు గాఁ[3]గ మ్రగ్గెదరు;
గాక కర్మిత్వంబు కలిమికి ఫలమె
శ్రీకంఠభక్తులఁ [4]జెట్టలాడెదరు;
ఇంటిలోనున్నవాఁ డీశుండు భక్తి
కంటకులార! శక్యమె మీకుఁగాన
భవుఁడ యున్నాఁడు మా భవనంబులోన
భవులార! మీకు సంభవమౌనె యెఱుఁగ?
లోకైకనాథుండు లోనున్నవాఁడు
లౌకి[5]కులార యాలోకింపఁగలరె?
లోపలనున్నవాఁ డేపార శివుఁడు
పాపాత్ములార! మీ ప్రాప్తి యేనెఱుఁగ;
లోచనత్రితయుండు లోనున్నవాఁడు
నీచులారా! మీకు గోచరుం డగునె?

---

౧. బోయె. ౨. పురికిని. ౩. మరిగెడరు. ౪. చిట్టు; చెడ్డ.
౫. కాచారు లా.

యొండేమి¹శర్వాంశ యున్నాఁడు గర్మ
చండాలులార! వశంబె మీ కెఱుఁగ?
నీడితకీర్తి మాహేశుండు వీఁడె
చూడ శక్యంబేనిఁ జూతురుగాక
ప్రతిమాట లేఁటికిఁ బట్టిన నింకఁ
బ్రతి సూపకున్కి² దాఁ బాడి గా దనుచు
గడియ గ్రక్కునఁ బుచ్చి గ్రమ్మనఁ దలుపుఁ
గడుఁ బాఱఁదెఱచుడుఁ గనుకని ద్విజులు
సొచ్చుడు నంతలో ³సోమార్ధమౌళి
యచ్చెరువంద నిరాకా⁴రుఁ డగుచు
లోపల నంత్యజు⁵రూపంబు గాన
కా! పోయెఁ బోయెఁ దాననుచు⁶ నోవరుల
గొందులఁ బెడసందు సందుల దాపు
మందసంబులచెంత మదురుల పొంత
దేవార్చనంబుపందిరిమీఁద నరుఁగు
క్రేవల పీఠముక్రిందను దీప

---

౧. లింగంబ; లింగమై. ౨. గట్టిన. ౩. సోమవతంసి. ౪. రమగుచు. ౫. జూపరులు. ౬. గొందుల సందుల గోడల పొంత; గొందులు బెడదలసందులుఁదావు; గొందులను బెరళ్లసందుల ద్రోపు; గొందులను బెడలసందలద్రోపు.

గంభాల[1]మెత్తున గంటలవెనుక
గంభీరమగుకొల్చు గాదెలలోన
నిఱికిళ్లఁ [2]గుమ్ములమెడలను దలుపు
మఱుఁగునఁ బన్నా[3]ర్ల మాటున నడ్డ
గోడలపజ్జను గుదురిఱికిటను
గోడుగోడంచును గూడనిల్లెల్ల
వెదకి తా రత్యంత విస్మయాక్రాంత
హృదయులై కానక యిది విచిత్రంబు
సనియెఁ గోడలు నూఁకికొని యందమేనిఁ
జను-చోటఁ గోడనూఁకిన చొప్పు లేదు;
ఇలు[4] వ్రచ్చికొనిపోయె నితఁ డందమేనిఁ
[5]వలువదే యిలుగప్పు వ్రచ్చిన-చోటు;
వాకిట వెడలినవాఁ డందమేని
వాకిట మనమున్న వార మెట్లేఁగెఁ?
బోఁడులోనను డాఁగినాఁ డందమేని
లేఁ డింటిలోనఁ గల్గినఁ గాన మెట్లు?
మాయమయ్యెనొ కాక మహి నంద మేని
మాయంబు గానేర్చు మహి నరుం డెట్లు?

---

౧. పొత్తున; మొద్దను. ౨. గ్రమ్ముల. ౩. ళ్ల. ౪. వ్రచ్చు; వ్రవ్వి. ౫. దెలియదే...దీసిన (దిగిచిన).

పాన లిన్నియు నేల పడఁతిఁ బట్టినను
వానిఁ జూపక పోవవచ్చునే యనుచు
నాయమ్మ డగ్గఱి యది[1] యేమి యింక
మాయలు వన్నక [2]మాదిఁగి కొయ్యఁ
జూపుము చూపు మెచ్చోట డాఁచితివో
చూపుము చూపు మెచ్చోటి కన్చితివో
యని సందడించు న య్యధమ [3]పాఱులను
గని సూరసానమ్మగారు గోపించి
మాటిమాటికిఁ గ్రొవ్వి [4]మాదిఁగియనుచు
నేటికిఁ బలుక ధర్మేతరులార!
మాదింగియే తొల్లి మహిమెల్ల నెఱుఁగ
మాదేవుఁ డంత్యజు మార్గంబుఁ దాల్చి
చెచ్చెర మఱియొక్క చచ్చిన పెయ్య
నచ్చుగా మెడనిడి యరిగి కెంబావి
భోగయ్య యింటికిఁ బోవుడు నతఁడు
స్వాగతాసనముఖ్య సముచితార్చనలు
నేసి ఖండంబుగాఁ జేసి పాకంబు
నేసి యాఁబెయ్యను శివుని మూర్తికిని

---

౧. యేలనిం. ౨. మాదిగె (గి). ౩. పౌరులను; పామరుల.
౪. మాదిగ (గె).

నారగింపఁగఁబెట్టినంత నయ్యగ్ర
హారంబుభూసురు లందఱుఁ గూడి
గుండులు బడియలుఁ గొని పాఱి పాఱి
యొండొరుఁ గడువంగ నుద్వృత్తి [౧]నేఁగి.
యిట్టులు [౨]సెనసిక నయ్యాశుమూర్తియును
నట్టె నిరాకారుఁ డగుచును భోగి
దేవయ్య యూరు దాఁ దెరలంగ నపుడ
పోవంగ నంతఁ గెంభావి లింగములు
భోగయ్యవెనుకను భువి డొల్లి డొల్లి
వేగంబ పోవుడు విప్రులు జనులు
నరిగి [3]యందంద సాష్టాంగులై మ్రొక్కి
కరమర్థిఁ బ్రార్థింపఁ గరుణ భోగయ్య
నరుదుగా నాలింగపరికరుఁ డగుచు
మరలి కెంబావికి [౪]నరుగుదెంచుడును
నాలింగములు భక్తికట శాసనముగ
నోలిన నిల్చె నొండొంటఁ బీఠముల
నటుగాన భక్తుఁ డేయాకృతినున్న
నిటలనేత్రుఁడకాక నిందింపఁదగునె?

౧. వచ్చి. ౨. కడునీశు. 3. యందఱును. ౪. నరుదేరఁబిదప.

# దీక్షాప్రకరణము

## సామవేదికథ

యామహాదేవుండ యట్లునుగాక
సామవేదుల జన్నసాలలోపలికిఁ
జచ్చినపెయ్యఁ దాఁజండాలుపగిది
నచ్చుగా మెడనిడి యరుగు దేరంగ
గుఱుచ మట్టుపొడవు గురుజఘనంబు
వఱికి వెండ్రుకలును గొఱఁగుఁబాపటయు
[౧]నడ్డంపు [౨]ముక్కఱ యసియాడునడుము
దొడ్డుఁగజ్జెలచీర దూగుఁబయ్యెదయు
నలరుఁగెమ్మోవియు నన్నువనుదుఱుఁ
గలికి క్రొఁగన్నులు గఱివంకబొమలు
నల్లనిమైదీగ దెల్లఁబల్వరుస
దెల్లని భసితంపుఁ దిలకంబు [౩]దెల్ల
గద్దెనగరు దోఁచు గనయంబు కీలు
నిద్దంపుఁజాయయు నిండుఁబాలిండ్లు
[౪]గ్రంగుక్రంగనుకాళ్లఁ గంచుమట్టియలు
నుంగరంబులు వద్దియూరులు నల్ల
గాజులుఁ దగరంపుఁ గడియముల్ వచ్చ
గాజుఁబూసలును సంకంపుఁ బూసలును

---

౧. నడ్డము. ౨. ముంగర ; ముక్కెర. ౩. వెండి. ౪. కంగుకంగున మ్రోగు.

నులిగొన్న నల్లంబూసల బన్నసరము
గలయ లోయఅతినాల్కలమిన్కు లమర
గంప సాంకిట నిడి గౌరియు వెనుక
నింపారం జనుదేర నిరువురం గాంచి
సామవేదులువచ్చి సతియును దాను
భూమి సర్వాంగముల్ వొందంగమ్రొక్కి
కడుసంభ్రమంబునం గపటచండాలు
మెడనున్న పెయ్యం దా మెడం బెట్టికొనుచు
నెక్కుడు సంతోష మెసంగం దోడ్కొనుచుం
జక్కనం దా జన్నసాల సొరంగం
గనుకని విప్రులు గని పాఱిపోవ
మనుజులు విస్మయమానసు [1]లగుచు
నంత నయ్యిరువుర నర్థిం దోడ్తెచ్చి
సంతోషమున [2]జన్నసాలమధ్యమున
నాదట మెడపెయ్య నటువెట్టి సామ
వేదిపాదాబ్జముల్ వేడుకం గడుగ
గిరిజమూపున నొక్క కరమిడి, యున్న
కరమును దనకటిం గదియించి [3]నెపము

౧. లుగను; ల్గాగ. ౨. యాగశాలాంతరమున. 3. సేవ; సెవము; తపము.

ముందటికిని వ్రాల మూఁడు [1]నేత్రంబు
లందంద తనదు పాదాంబువులందు
నలరుచుఁ దళతళ యనుచు వెలుంగ
వెలుఁగు దోఁచుడు సామవేదుల భార్య
యడుగుల కర్ఘ్య [2]పణ్యములు వోయుచును
బొడగని బిట్టుల్కిపడి సంభ్రమమున
'[3]నో వీఁడె దేవర దేవర' యనుచు
భావించి తనచేతి పసిఁడి [4]గలంతి
యటువెట్టి యత్యద్భుతాక్రాంత యగుచు
నిటలతటం బజనియతమై యుండఁ
దనసతిఁ గనుగొని దరహాసరసము
గనుఁగవఁ [5]దుఁలుకాడఁగా సామవేది
మనుజుండె ముక్కంటి మానిని యింత
యనుమానమేల నీ కనుచు నుప్పొంగి
పాదాబ్జములు గడ్డఁబడుటగాఁ జేసి
పాదోదకము లనఁబడియెఁ దజ్జలము
లంబికాధవునీడయందు దోఁచుటఁడు న
యంబుగ లింగోదకం బయ్యె నదియు

1. గన్నులునున. 2. వ. 3. బో. 4. గల(ళ)ంతె.
5. తొలకాడ. 6. డునునింబుల......

శివుఁడు ప్రసన్నదృష్టిని జూచుమాత్ర
నవియుఁ బ్రసాదోదకాఖ్యమై తనరె
నొక్కఁడఁ దత్త్రివిధోదకంబులును
నెక్కొనియునికికి నెమ్మనంబలర
నిల దురితేంధనంబులు గాల్పఁ బాద
జలములకాక యాజ్వాలనుని వశమె?
యప్పాల బ్రుంగఁగా దండు రీలింగ
మప్పాల బ్రుంగఁ గృతార్థతగాదె?
జననుతంబగు నీప్రసాదోదకంబుఁ
గొనఁ దల్లిచన్నుఁబాలకును వైరిగాదె?
యాగమోక్తిఁ 'బశవ ఆపో' యనంగ
వేగంబ పశుపాశ విలయం౧బనంగ
౨నీత్రివిధోదకం బిల నిది దా వి
చిత్రమిట్లనుచుఁ జెచ్చెరఁ దాను సతియు
నంతఁ దత్త్రివిధోదకాబ్ధి నోలాడి
యంతకాంతకుని సుఖాసీనుఁ జేసి
యాయతభక్తిమై నర్చన లిచ్చి
పేయఁ బాకము సేసి పెక్కుసందముల

---

౧. బునేయ. ౨. నిలఁ ద్రివిధోదకంబులు గడు చిత్ర మిలఁగాన నను సామనేదియు.

నటమున్న యజ్ఞార్థమై సర్వశక్తిఁ
బటుమతిఁ గూర్చిన పదపదార్థములు
శాకంబు లోనగూర్చి శంభుమూర్తికిఁ
నాకాంక్షతోడ సమర్పణ సేయ
నత్యంతసంతుష్టుఁడై యంత నపుడ
ప్రత్యక్షమూర్తియై భర్గుండు నిలిచి
యభిమతంబగు భక్తి కాత్మ మెచ్చితిమి
యభిమతార్థము లిత్తు మడుగడుగు మన
వారక దాసయ్య వస్త్రము గట్టి
యారగింపక పోయినట్లు పోరాదు
కోరి చిర్తొండనికొడుకుఁ ౧జంపించి
యారగింపకపోయినట్లు పోరాదు
ఆరయ బల్లహు నాలంబు నేసి
యారగింపకపోయినట్లు పోరాదు
కూరంగ జలములఁ గుండయ్య ముంచి
యారగింపకపోయినట్లు పోరాదు
కూరిమి నంబెన కొడుకనిపట్టి
యారగింపకపోయినట్లు పోరాదు
చేరమముందఱఁ ౨ జెలువుగా నాడి

---

౧. వధించి; వఢ్డింప. ౨. ఛెచ్చెర.

యారగింపకపోయినట్ల పోరాదు
సారంగపు టణుమూర్తి సందనం బలఁది.
యారగింపకపోయినట్ల పోరాదు,
ఆర నోహిళుని ధూపావసరమున
నారగింపకపోయినట్ల పోరాదు,
ధీరుఁడౌ నమినంది² దీపముల్ సూచి
యారగింపకపోయినట్ల పోరాదు,
చేరి పిళ్లయినారిచే భూతిఁగొంచు
నారగింపకపోయినట్ల పోరాదు,
నిక్కమెట్లన విను మొక్కవిన్నపము
ముక్కంటి! నీకు నేఁ దక్కినబంట
³కూఢి నసంఖ్యాతరుద్రులబంటఁ
బోడాసఁబాడిన ప్రమథుల బంటఁ
జన్నపురాతనశరణుల బంట
నున్న నూతనభక్తయూథంబు బంట
మఱియును జేర్కొన్న మాహేశ్వరులకుఁ
గొఱలు సద్భక్తులకును బంటుబంట
నటుగాన నన్ను దయాదృష్టిఁ జూచి
పటుమతి నారగింపవె ప్రాణనాథ!

---

౧. బునణు; బుయణు. ౨. దీపాగ్ని. ౩. ప్రోషయ.

చెన్నగణాధీశు జిహ్వాగ్రమునను
జెన్నుగా నారగించిన చందమునను
నాకాంక్షఁ గరికాళయవ్వ వడ్డింపఁ
జేకొని యారగించిన చందమునను
నాసక్తి [౧]సురగి చౌడయ్య [౨]చేకళ్లు
సేసాచి యారగించిన చందమునను
ననచినకూర్మిఁ గ[౩]న్నప్ప వడ్డింప
సను[౪]షక్తి నారగించిన చందమునను
సలరుచుఁ బిట్టుపిట్టవ సమర్పింపఁ
[౫]జెలువార నారగించిన చందమునను
జగతిలో [౬]నరివాళశాల్యన్న [౭]మింపు
సిగురొత్త నారగించిన చందమునను
[౮]నాయత వీరచోడవ్వ వడ్డింపఁ
జేయార నారగించిన చందమునను
నిచ్చమై నిమ్మవ్వ యింటికి వచ్చి
చెచ్చెర నారగించిన చందమునను
గొనకొని యిళెయొండ గుళియారు నింటఁ
[౯]దనిగొన నారగించిన [౧౦]చందమునను

---

౧. సుడిగె; సురియ. ౨. చేగళ్లు. ౩. న్నపసమర్పింప. ౪. రక్తి; వుగా. ౫. జెలువుగా. ౬. నరియవ్వ; నరిపాలు. ౭. మిడిన. ౮. నాయతి. ౯. మనామర; దనిసన. ౧౦. విధంబునను.

బరమభట్టారక పరమస్వతంత్ర
పరమేశ పరమాత్మ పరమపరుండ
యజ్ఞశిరోహర యజ్ఞ[1]సంహార
యజ్ఞేశ యవికల యజ్ఞ[2]సత్ఫలద
యిల ననంఖ్యాతరుద్రుల[3] నుద్దేసించి
యలరంగఁ బ్రమథాధిపుల నుద్దేసించి
కలయ పురాతనగణసమూహంబుఁ
బోలుచు నూతనగణంబుల నుద్దేసించి
ప్రవితతంబుగఁ బంచభక్ష్యాన్నములుగ
నవధరించుటకు మహాప్రసాదంబు
స్వాదై[4]కదివ్యాన్న షడ్రసంబులుగ
నాదరించుటకు మహాప్రసాదంబు
ఆరంగ [5]రుచ్యాన్న [6]హారము ల్గాఁగ
నారగించుటకు మహాప్రసాదంబు
అంచు సాష్టాంగుఁడై యాఁబునుఁదాను
మించి ప్రార్థించి కీర్తించుచునున్న
భక్తైకదేహుండు భక్తవత్సలుఁడు
భక్తప్రియుఁడు భక్తపరతంత్రమూర్తి

---

౧. సంహరణ. ౨. సద్వరద. ౩. కనితలఁచి. ౪. 'దైవ' అనియుంపవలెను. ౫. రుచ్యాప; రుచ్యాప. ౬. హారాన్నములుగ,

## దీక్షా ప్రకరణము

శ్రీనీలగళుఁడు భవానీశుఁ డీశుఁ
డానందలీలమైఁ దానారగించి
వెలఁదికి నాసామవేదికిఁ గరుణ
దళుకొత్తఁ [1]దమప్రసాదముఁ గృప[2]నేసి
బలసి యంతకుమున్న ప్రమథులు రుద్రు
లలరుచు నిరుగెలంకులఁ జేరి కొలువ
ముందట నందంద మ్రొక్కుచు భక్త
సందోహ మచలితానందంబుఁ బొంద
శ్రీవాగ్వధూనాథ జిష్ణులు నవిక
లావరణస్థులై యభయముల్ వేఁడ
మస్తకవిన్యస్తహస్తులై మునులు
ప్రస్తుతం[3]బెట్టఁగి ప్రశస్తులు నేయ
నారంగఁ జండకీర్త్యాదులు సెలఁగ
వారివారికయి కైవారముల్ నేయ
శివదుందుభులు మ్రోయ [4]దివిఁ బుష్పవృష్టి
యవిరళంబై కుర్య నంతభర్గుండు
వెలయంగ మును సామవేదియజ్ఞమున
కలరుచు నేతెంచి యట్లున్నభూసు
రావలి ముప్పదియాఱుబాళ్ల వారు

౧. నా. ౨. నేయు; నేసె. 3. బైనట్టి ప్రస్తుతుల్. ౪. భువి.

గావున వారెల్లఁ గాపున్నయట్టి
[1]సత్త్రిసపురములు సతిసామవేది
నుత్తమ మణిహేమయుతవితానములఁ
గొనిపోయెఁ గైలాసమునకు నీశానుఁ
డనుపమలీల దుఃఖాడ నక్షణము
శివరహితంబుగాఁ జేసిన దక్షు
వివిధాశ్వమేధంబు [2]విఫలతఁ బొందె
శివసహితంబు [3]సేసినసామవేది
సవిశేషయజ్ఞంబు సఫలతఁ బొందె
భక్తిహీనులు చేయు బహుమఖావళులు
యుక్తంబులే దోషయుక్తము లగాక
ద్విజులకుఁ [4]జెల్లునే దేవయజ్ఞంబు
[5]నిజము మాదరచెన్న నియతుని పగిది
పితృయజ్ఞమున్నదే వేఱ విప్రులకు
స్తుతియింప నుత్తుంగచోడని పగిది
భూసురులకగునె భూతయజ్ఞంబు
భాసురంబుగఁ జెన్నబసవయ్య భాతి
నమర మనుష్యయజ్ఞము సిద్ధరాము

---

౧. సత్త్రీసు. ౨. విక. 3. గాఁజేసినయట్టి. ౪. గల్గు. ౫. భజియింపఁగాఁ జెన్నబసవనిభాతి.

క్రమమునఁ జెల్లినే బ్రాహ్మణతతికి
నజగమకాయస్థ మగు బ్రహ్మయజ్ఞ
మజవంశజులకేల యగు నట్లుఁ గాక
వెలయ దక్షుని యజ్ఞఫలము దాఁదొంటి
తల [1]వాయ మేషంబుతల నియమించె
నలరారు సగరుల [2]యశ్వమేధంబు
ఫల మొక్కమునికోపవిలయాగ్ని [3]కొగ్గఁ
బరికింప నహుషభూపతిక్రతుఫలము
ధరఁ బెద్దసర్పమై చరియింపఁజేసె
సంధిల్లు ధర్మజు జన్నఫలంబు
బంధుక్షయంబు నాపదయుఁ గావించె
నిల సామవేదుల యీ మహోద్యోగ
ఫలము సదాశివుఁ బ్రత్యక్షుఁ జేసెఁ
బార[4]మొందింపఁడే 'భక్తిరేవాత్ర
కారణ'మ్మను శ్రుతిగతి యట్లుఁగాక
క్షోణిఁ బేర్కొను రాజసూయము ల్వేయు
నేణాదినాథు చెయ్దికి సమానంబె?
సారగోమేధ లక్షలును భోగయ్య

౧. గొని; వోయ. ౨. యధ్వర కోటి. ౩. కోడ. ౪. మేఁదిం పఁడే.

గారి చేతకు నెన్నఁగా సమానంబె?
యరయంగఁ బౌండరీకాధ్వరకోట్లు
వరగంగ ¹నిరువోతు భక్తికి ²నెనయె?
యాసురంబగు నరయాగార్బుదంబు
లా సిరియాళు కృత్యమునకు నెనయె?
బహుసువర్ణక్రతు పద్మపద్మములు
మహిలోన బసవయ్య మహిమకు సరియె?
ప్ర³విమల సద్భక్తి ఫలమహత్త్వంబు
భువి నగణ్యం బొక్క పుష్పమాత్రమున
ఖ్యాతంబుగా శతక్రతుఫలమెల్ల
శ్వేతున⁴కయ్యె మఱి జెప్పెడిదేమి?
కావున శివభక్తగణముల మహిమ
దేవుండ యెఱుఁగుఁ దద్దేవుని రాక
వ్యక్తంబుగా నితరాకృతినున్న
భక్తుఁ డెఱుంగుఁ దద్భావ మెట్లనిన
బహురూపమాడుచోఁ బాటి వెండీఁడు
సహజంబు సూపకే జాడవచ్చినను
సరయనేరంగ మధ్యంబున నున్న
తరుణి యెఱుంగదే తనమగఁ డగుట

---

౧. నిగువత్తు. ౨. సరియె. ౩. తతశివ ౪. కయెనన్న; కెనయన్న.

హరుఁడు భక్తులమనం బరయఁ దలంచి
యరుగుదెంచును వికృతాంగముల్ దాల్చి
వచ్చుభావము భక్తవర్గంబు లెఱిఁగి
యచ్చుగా భువిఁ గొనియాడుచుండుదురు
హరుఁడు లీలార్థమై యధమవేషములు
ధరియించి మీఁదటఁ దద్రూప మగుట
యరిదియే యనవల దధమలాంఛనము
ధరియించునతఁడ ప్రత్యక్షరుద్రుండు

## తిరునాళ్లప్పోవ కథ

దప్ప దెట్లనినను ద్రావిళభూమిఁ
జెప్పనొప్పు దిరునాళ్లప్పోవ యనఁగఁ
బ్రాకటంబుగ నొక్క [1]బాపనియింటఁ
జేకూలికిని గొల్చి జీవించుచుండి
లింగార్చనములు సల్లీలఁ జేయుచును
జంగమారాధనల్ సల్పుచున్నంత
నొగిఁ [2]బెరుమట్టపుర్యూరు తిర్నాళ్ల
కగణిత [3]ప్రీతిమై నరిగెడు వేడ్కఁ
బూని తాఁబోయెదఁ బోయెద ననఁగ
నానాఁటికిట్లు దినంబులు సనఁగ
వారక పండ్రెండువర్షంబులకును

౧. బ్రాహ్మని. ౨. బెనుమటపులియూరు; బెనుమెట్టపురి.
3. ప్రేమ.

౧భోరన నాయయ్య పుణ్యంబునిండ
నావిప్రునకు వెట్టి యప్పారంబునకుఁ
బోవంగఁబడదు నుప్పొంగి యెంతయును
గ్రాలుపుణ్యము వెట్టి కారణంబునను
బ్రోలుసూడఁగఁగంటెఁబోదు నే ననుచు
విప్రునకై తానవెట్టికిఁ బోవ
క్షిప్రంబ పనివూని సుప్రభాతమున
ఘనతరంబుగ నొక్క కసవుమోపెత్తి
కొనిపోవునెడఁ గుండ గూల్చిన భంగి
వారకవర్షంబు ౨వఱుగొనికురియ
భోరనఁబోవుచుఁ బోకచిక్కుచును
నూరెట్టకేలకుఁ జేరుదుఁ దోడి
వారెల్ల నటమున్న భోరనఁ బోవఁ
గ్రక్కునఁ జీకటి౩గవియంగ రాత్రి
యొక్కరుండును గోడ యొత్తున నొదిగి
మొలబంటి౪వఱదలో నిలుచుండి కసవు
దల కడ్డమిడికొని తడియుచుండియును
యెప్పుడెప్పుడు శ్రీపతీశు తిర్నాళ్ల
యొప్పు సూడఁగఁ గందునో యను తలఁప
కాని యొండెఱుఁగఁడు గదలఁడు మెదలఁ
డానందలీలమై నట్లు వేఁగినను

---

౧. భోరున. ౨. వఱ్ఱు (ట్టు; ల) గొని. ౩. గది. ౪. వఱలి.

దిరునాళ్లఁ [1]జూతురక్షా భరమున నుండి
హారుఁడు శ్రీపతినాథుఁ డరిగి స్వప్నమున
ిననఘులైనట్టి మహాభక్తతతికిఁ
దన నియోగములకుఁ దా నిట్టులనియె
నీపురి తూర్పున నీశాను దెసను
గోపురప్రాకారకోణంబునందు
గసవుమో పుత్తమాంగమున నుండియును
వసిగొని పై[3]నురువంగఁ గ్రిందటను
వఱదవారఁగ మీఁద వానయుఁ గురియఁ
బఱ తెంచుఁ గసవు[4]తెప్పంబులు నూఁక,
నోగి బీరనరముల బిగిఁ గడుపూఁద
గగురుపొడ్చుచు మేను గడగడవడఁక,
బలువంటఁ[5]దాఁక, తెప్పలువొంగ, జిహ్వా
దళమెక్క, సధరంబు వెలవెలఁబాఱ
వ్రేళ్ల[6]సంధులును నారల్లుగొనంగఁ
గాళ్లువావఁగ నఱకాళ్లును వ్రయ్య
వానఁ దడియుచున్న వాఁ డటమున్న
యేనును నాయయ్య కెదురుగఁ బోయి
యాతనియొద్దన యట్లున్నవాఁడ
భాతిగాఁ గైసేసి భద్రగజంబుఁ

---

౧. జూచుసంబరమున. ౨. నసుఁగు. ౩. నువ్వగసవు. ౪. తెప్పలుబడనూక. ౫. దోఁగ. ౬. సంధులు; గ్రంథులు.

గొనివచ్చి మమ్ముఁ దోకొనిపొండు వేగ
ననవుడు నందఱు నట మేలుకాంచి
క్రంతక్రంతల నిల్చి కలలు సెప్పంగ
నంత వానయు వెల్వ నఖిలభక్తులును
సకల నియోగంబుఁ జక్కనఁబోయి
ప్రకటతరంబుగా భద్రగజంబు
నెక్కించి యాయయ్య నెలమిఁ [1]దో[2]డ్తేర
గ్రక్కున గుడిసొచ్చెఁ గానంగరాఁడు
నలిగొని శ్రీపతినాథునియందు
గలసె నంత్యజుఁ డనఁగా నెట్లు వచ్చు
నిక్కమట్లునుగాక ముక్కంటిగణము

ముక్కంటిగణము మహిమ

గక్కయ్య మహిమ ప్రఖ్యాతి యెట్లనిన
శ్రుతి 'ఏకఏవ రుద్రో' యని చాట
నితరంబుగాఁ గొని యితరదైవములఁ
బ్రస్తుతించు పురాణభట్టుని భువిఁ బ్ర
శస్తంబుగా నప్డు చంపివైచుడును
న వ్విప్రవరుదేహ మాక్షణంబునన
ప్రువ్వులప్రోకమై రూపఱియుండె
నటుగాక డోహారి యన నెట్లువచ్చుఁ
బటుతరంబగు భక్త[4]వరుని వెండియును

---

౧. దోతేర. ౨. తమె. ౩. ప్రోసుగా భువిఁగానఁబడియె. ౪. రుల. ౫. వరుల.

మాదరదూడయ్య మహనీయమహిమ
యీ దేశమంతయు నెఱిఁగి కీర్తింపఁ
గాదె యాయయ్య పాదోదకచయ ని
పాదితం బగు రొంపిఁ బఱతెంచి పారలఁ
బారల నేణ్ణూర్వురు భూసురాధముల
కరయఁ గుష్ఠవ్యాధు లడఁగె వెండియును
భువిఁ జెప్పనొప్పు గుడ్డవనాఁగ నొక్క
యువిద సద్భక్తినియుక్తి యెట్లనిన
నరయ నావటికకు నట్లొక్కనాఁడు
వరదానమున కేఁగఁ బురివిప్రులెల్ల
భంగింపుచును గూడఁ బఱతెంచి యులిపి
జంగిత[1] నీవేల చనుదెంచి తిట్లు
గ్రాలుచు ధరణి నిక్కపు[2]బత్తురాలుఁ
బోలె రుద్రాక్షముల్ భూతియుఁ దాల్చి
చని కూయిడెదు 'వరద నమశ్శివాయ'
యనుచు నెఱుంగుదె హరు మహత్త్వంబుఁ
జండాలురాలి కీ[3]సడ్డ లేలనుచు
గుండును బడియయుఁ గొని తమ యూరు
వెడలంగఁ గొట్టుడు వెలఁదియుఁ దనువు
వడయక చొత్తునే పల్లె యింకనుచు
ముదమున సౌరాష్ట్రమున కేఁగ నేఁగఁ

౧. యెక్కడ. ౨. భక్తు. 3. శ్రద్ధ; స్రడ్డ.

బదయుగ్మము ముగిసి కదలి రాకున్న
ధారుణిఁ బడిపడి తాఁ బొర్లి పొర్లి
వారకచన మేను వ్రక్కలై విరియ
సచ్చరిత్రకు మెచ్చి సౌరాష్ట్రనాథుఁ
డచ్చోటి కెదురుగా నపుడ యేతెంచి
నెలఁతకు మేనిచ్చి యెలమి సోమేశుఁ
డలర నావటికకు నట్టి విప్రులకు
మేనులు సెడియె న మ్మెలుత శాపమునఁ
గాన గుడ్డవనొండు [౧]నా నెట్లు వచ్చు
మఱియును శివనాగమయ్యా నా నొక్క
కఱకంఠభక్తుఁ డక్కజము దన్మహిమ
దండనాయకుఁడును దానును గూడి
యుండంగ భూసురు లొండొండ పల్క
బండారు బసవన దండనాయకుఁడ
దండియై నాగయ్య ధర్మహస్తమునఁ
బరమామృతము వెల్లివఱపఁడే తొల్లి
శరణులు వొగడ బిజ్జలు సభాస్థలిని
గర్మదృష్టిని జూడఁగాఁ గులభ్రాంతి
ధర్మంబయై తోఁచుఁ [౨]దత్త్వోక్త నియతి
నటుగాన నాగయ్య నమృత శరీరుఁ
గుటిలతఁ జండాల కులుఁ డనఁ జనునె?

---

౧. గా నెన్న నెట్లు. ౨. దద్భక్తి.

విపరీతచరితుండు వేయేల మఱియు
శ్వపచయ్యనాఁగ నా సామవేదులకు
నారాధ్యుఁ డట యింక వారి మహత్త్వ
మారంగ వినఁ జెప్ప నలవియే కాదు
సన్నుతి మాదర చెన్నయ్య మహిమ
మున్నె యుంగరె విని యెన్నంగ నేల?
కావున శివభక్తగణము[1] లుత్తములు,
భావింపఁ[2]గా శివప్రతిబింబతనులు
గులజులు గులజులే కులహీనులైనఁ
గులజుల[3] శివభక్తి కలిమి నెట్లనినఁ
బసిఁడియుఁ బసిఁడియె పంచలోహములుఁ
బసిఁడియె మఱి రసస్పర్శగాఁ జేయ
శారదమేఘముల్ సంధిల్లునప్పు
డారంగ ధూమాందు లవి గప్పినపుడు
దా నిర్మలమకాక తన్నభంబునకు
న్యూనాతిరిక్తంబు లేనాఁటఁ గలవు?
త్రాడును బామును రజతంబు శుక్తి
సూడికిఁ గొఱడును జోరుండుఁ దెలియ
కున్న నెవ్వరికైన భిన్నభావముల,
సన్నుతి దెలిసిన సహజరూపముల,
కర్మదృష్టులఁ జూడఁగాఁ గులభ్రాంతి

---

౧. లమహిమ. ౨. నీశ్వర. ౩. సద్భక్తి.

ధర్మంబమై తోఁచుఁ దత్స్వోక్తశైవ
ధర్మదృష్టులఁ జూడఁ దత్కులభ్రాంతి
ధర్మేతరం బసద్ధర్మమై తోఁచుఁ
బ్రథిత మిట్టిద ¹శివభక్తుల మహిమ
కథలును నీతులుఁ గారణంబులును
జెప్పి మాటల మిమ్ము జప్పడించుటలు
సొప్పగునే ప్రతిసూపెద మీకు
నఖిలంబు ముప్పదియాఱు తత్త్వముల
శిఖరంబమై యున్న శివలింగమూర్తి
హరివిరించ్యాదుల కరయ నాద్యంత
విరహితమైయున్న యురులింగమూర్తి
వేనవేల్విధముల వేదాంతములకుఁ
గానంగఁజాలని ఘనలింగమూర్తి
సనకాదియోగీంద్ర సన్మనోగతుల
కనుపమంబైన మహాలింగమూర్తి
నలఘు పురాణసిద్ధాంత శాస్త్రములు
నెలవెఱుంగనియట్టి నిజలింగమూర్తి
శేషవాసుకి బహుజిహ్వాగ్ర వినుతి
భాషలఁ గడచిన ²పటులింగమూర్తిఁ
గానంగ నలవియె మానవులార
మైనఁజూడుఁడు చూడుఁ డటతొల్లిఁ' డనుచు

---

౧. యని. ౨. ప్రభు.

నవిరళప్రీతి మున్నారగించుచును
శివమూర్తి గూర్చున్న సింహాసనంబుఁ
దొలఁగఁ బుచ్చుడుఁ దళతళఁ బ్రజ్వరిలుచు
నలరె నక్షణమ స్వాయంభులింగంబు
దలఁప నాయమ్మ హృద్గత మూలమంత్ర
మిల మూర్తిమంతమయ్యెనో కాక యనఁగ
వనిత శివైక్యభావధ్యాన సుఖముఁ
జెనసి ఘనీభవించెనో కాక యనఁగ
నావామ వరమశివాచారవల్లి
సేవ దానంకురించెనో కాక యనఁగఁ
బూనర భామిని సేయుఁ బుణ్యాంబుప్రోక
దనరారి కరడుగట్టెనో కాక యనఁగ
జలజాయతాక్షి విశ్వాసంబు నివ్వ
టిలి గండరింపఁబడెనో కాక యనఁగ
నలరారి సతిచేత కమర ద్రుమంబు
* [ఫలము దా మహిఁ దేజరిలెఁ గాక యనఁగ
లలన హృద్ధ్యానలాలన పరంజ్యోతి
నెలకొని యిలఁ బ్రజ్వరిలెఁగాక యనఁగఁ
బనుగొన నాతిసౌభాగ్యాతిశయత
మెనయుచుఁ గరిగొనిమెనో కాక యనఁగ]

---

* కుండలీకరణము చేసిన పాదములకు సంస్కృతానువాదము లేదు. కొన్ని ప్రతులలో తార్మారుగా ఉన్నది.

మునుమూర్తి హీనమయ్యును రాహు వవని
నినశశిగ్రహణంబులను దోఁచునట్లు
గణుతింప రూపులేకయు మారుతంబు
దృణరేణుసంగతి దీపించునట్లు
హరుఁడు నిరాకారుఁడయ్యు * (సూరాంబ
వరమనోభక్తి) భావనఁ గానఁబడియె
సంగనబసవయ్య సద్భక్తిమహిమ
వంగకాయలు ప్రాణలింగంబు లయ్యెఁ
దెల్లంబు బల్లేశు మల్లయ్య మహిమ
సల్లిలవెలయఁ గుంచము లింగమయ్యెఁ
జాటివీరఁడు కాట కోటయ్యగారి
యేట పెంట్రుకయుఁ దా నిల లింగమయ్యె
నిమ్ముల[౧] బాపూరి బ్రహ్మదేవయ్య
నమ్మి పిల్చుడును జొన్నలు లింగమయ్యె
సరళసద్భక్తిమైఁ జండీశ్వరునకు
సురలెల్ల జూడ నిసుక లింగమయ్యె
నా నాయనారికి నఖిలంబు నెఱుఁగ

---

* 'సద్భక్తిఁగరమనోగ్రహణతఁ గానంగఁబడియె' అనిప్రాతప్రతిపాఠము. సంస్కృత గ్రంథములో 'నిరాకారోఽపి సర్వేశస్సూరాంబాభావతస్తథా, ప్రత్యక్షం దదృశే సర్వైర్జనైరతనువైభవః' అని ఉన్నది. దీని కనుగుణముగా ద్విపదీకరణము చేసిన మాటలను నేను చేర్చినాను.—చి. నా.

౧. బావూరి; బాహూరి.

మానుగా నాబోతు మహిలింగమయ్యె
[1]భాసిలు–[2]దేవగ దాసయ్య[3]బాస
నాసక్తి ఘటసర్ప మది లింగ మయ్యె
నమితసన్మతికి [4]సిద్ధమరాయనికిని
రమణమై దనశరీరము లింగమయ్యె
ననఁగ విందుము దొల్లి యాద్యోక్తులందు
గనుఁగొనఁబడియె నిక్కంబుగా నిప్ప
డంగద సూరసానమ్మ గారికిని
జంగమంబ స్వయంభులింగమై [5]పొలిచె
ననుచు సద్భక్తగణావలి యుబ్బి
యనురాగ మొంద సూరాంబయు నంత
నందమై తనరారు నాలింగమూర్తి
నందంద తనకన్నులారఁ జూచుచును
నలి రేఁగి వీఁడువో నాయింటిలోనఁ
జెలఁగుచు నారగించిన జంగమంబు
వీఁడువో భవుఁడన విశ్వధరిత్రి
నేఁడును రక్షించు నిజదయాపరుఁడు
వీఁడువో హరుఁడన విశ్వధరిత్రి
వేఁడికంటను జూచు విశ్వప్రతాపి
వీఁడువో వేనవేల్విధములఁ బొగడ

1. దేసిగా 2. దేవర. 3. భావ. 4. సింధమ. 5. తోఁచె.

మూఁడు మూర్తులకును [1] మొదలైనమూర్తి
వీఁడువో విష్ణుని విధిఁ గాఁడువఱచి
నాఁ డురులింగమై నలి నున్నవాఁడు
వీఁడువో రుద్రుండు విశ్వాధికుండు
గాఁడన్న వ్యాసునికరముఁ గొన్నతఁడు
వీఁడువో తోఁడలేక వినువీథిఁ దిరుగు
మూఁడుపురంబుల మున్నేర్చినతఁడు
వీఁడువో హరిపుత్త్రు విషమనేత్రాగ్నిఁ
జూఁడి భస్మముగాఁగఁ జుఱవుచ్చినతఁడు
వీఁడువో జగములు [2] వినుతింపుచుండ
నాఁడురూపము సగమైయున్నయతఁడు
వీఁడువో కలఁడన్న వీరశైవులకు
వేఁడినవరములు [3] వెదసల్లునతఁడు
వీఁడువో జగములు [4] వినుతింపుచుండ
మూఁడుగన్నులు దాల్చి మురియుచున్నతఁడు
వీఁడువో దక్షుని విశిరస్కుఁ జేసి
వేఁడిమిఁ దాల్చిన వీరభద్రుండు
వీఁడువో యద్వైతవిధు లనుష్ఠించి

---

౧. ముదమైన. ౨. వెఱచుచునుండ. ౩. జోఁడిచ్చు. ౪. వెఱచుచునుండ.

లేఁడన్న మునులఁ దూలించినయతఁడు
వీఁడువో నిజతత్త్వవేత్తల [1]జట్టి
కాఁడయి భవవార్ధిఁ [2]గడపెడునతఁడు
వీఁడువో యా చతుర్విధమోక్షములకు
ఱేఁడునా మహిమమిూఱినయట్టి [3]యతఁడు
వీఁడువో మిమ్మెల్ల వెఱ్ఱులఁ జేసి
నేఁ డంత్యజుండన నెగడినయతఁడు'
అనుచు హర్షాశ్రు లపాంగమార్గములఁ
జనఁజనఁ జేతులు సాచి సూపుచును
ననుకీర్తిసేయు సూరాంబిక నంతఁ
గనుఁగొని ద్విజులు రాజులు సర్వజనులు
మది నద్భుతము సంభ్రమంబును బెఱసి
ముదముతో [4]నన్నొండొండ ముప్పిరిగొనఁగ
నంతంత సాష్టాంగులై సూరసాని
కెంతయు భక్తితో నిలఁ జాగిమ్రొక్కి
హరుని గానఁగ మాకు నలవియే [5]తల్లి!
హరుఁడవు నీవ సద్గురుఁడవు నీవ
ధాతవు నీవ విధాతవు నీవ

---

౧. బు(పు)ట్టి. ౨. గడ జేర్చువాడు. 3. ఘనుఁడు. ౪. నందంద. ౫. తొల్లి.

మాత్రవు నీవ వేమాట[1]లు నేల
యిట్టి నెట్టణభక్తి యిట్టి విశ్వాస
మిట్టి సాహసవృత్తి యెందునుఁ గలదె?
విందుమే యిట మున్ను వేదశాస్త్రములఁ
గందుమే మూఁడులోకంబులఁ [2]దొల్లి
నల్లవో మాయమ్మ నల్లవో తల్లి
నల్లవో పార్వతి నల్లవో గౌరి
యగణితంబగు నీమహాత్మ్యాతిశయము
వాగడంగ గోచరంబగునమ్మ [3]మాకు
నెఱినొక్క మాటికిఁ గఱకంఠుఁడైన
నెఱయ నీమహిమలోఁ దెలియఁగ లేఁ[4]డనిన
నేమని చెప్పుదు మేమనియందు
మేమని వర్ణింతు మేము మర్త్యులము,
మందబుద్ధులము, సన్మార్గదూరులము,
ఛాందసులము, వేదజడులము, గర్మ
చండాలురము సదాచారదూరులము
దండధ[5]రోద్దండ దండపాత్రులము
దప్పులు మాయందు దలఁపంగ వలవ

౧. లేటికిని; లేమిటికి. ౨. యాందు. ౩. మీకు; తల్లి. ౪. డమ్మ; డవని. ౫. రాయస.

దప్పుడే మధమచర్మావృతరుద్రుఁ
డంత్యజుఁ డంత్యజుఁ డంటి మాయయ్య
నంత్యజుండేయయ్య నంత్యజుం డన్న
ద్విజులము దార యంత్యజులము గాక
ద్విజులమే యని చాఁగి వెండియుమ్రొక్కి
సకలమానవులు మస్తకతటన్యస్త
ముకుళితహస్తులై మొగి జయవెట్ట
భూతలేశ్వరుఁడును జేతులు[౧] మొగిచి
యాతతభక్తి సాష్టాంగుఁడై మ్రొక్కఁ
బరమానురాగసంభరితాత్ములగుచు
హరుభక్తు లేతెంచి యాసూరమాంబ
పాదాబ్జములమీఁదఁ బడియుండువారు
పాదరేణువులందు వడి[౨]పొర్లువారు
వాయకచుట్టును [౩]బ్రణుతించువారు
నాయమ్మ నెత్తుక యాడెడువారు
నాయమ్మ నాయక్క నాతల్లి యనుచు
నాయతప్రీతి ముద్దాడెడువారు
మొలలను దలలను మ్రొకులు వారె
నలుఁ జుట్టుకొని ప్రీతి నటియించువారు

---

౧. మోడ్చి. ౨. పొరల్. ౩. బడియుండు.

సెలఁగుచుఁ జూరిలో సెంబళికోల
నలి దూసికొని కేళికలు సేయువారు
వారక కత్తియుఁ నారెయుఁ బట్టి
యార నెగిరి యెగి రాడెడువారు
నలరి యాపాదరక్షలు దారతార
తలలపై నిడుకొని యిల నాడువారు
వాటిహర్షమున సంబవులొక్కఁడొకఁడ
తాటించి యాధూళి ధరియించువారు
నాచెప్పు లొడియుచు నందంద యెగుర
వైచుచుఁ బట్టుచు నడినాడువారు
సుట్టును జప్పటల్ వెట్టి బిట్టుబ్బి
నెట్టణ గునిసి గునిసి యాడువారు
ముదితసద్భక్తి సమున్నత మహిమ
వదపద్యములఁ గూర్చి పాడెడువారు
ప్రకటించి దండనాయకుని గీతములు
సుకరోక్తిఁ బాడుచు సోలెడువారు
మఱియుఁ బురాతన మహితగీతములు
దఱితఱిఁ బాడుచుఁ దమకించువారు
పంచమహావాద్య పటలంబు లులియ
నంచితప్రీతిమై నాడెడువారు

గోయని యార్చుచు గునిసి యాడుచును
ఘో యని చాంగుభళా యనువారు
ప్రీతిమెలర్ప విభూతి వసంత
మాతతప్రీతిమై నాడెడువారు
దవిలి యప్పాట భక్తవ్రాత ముబ్బి
శివమహోత్సవములు [1]సెలఁగి చేయుచును
బరగ నాయూరి యాబాలవృద్ధాదు
లరుదొండఁ బుణ్యాపణ్యాంగనల్ మఱియుఁ
జనుదెంచి పాదాంబుజంబుల కెఱఁగి
యనుకీర్తిసేయంగ నా[2]సూరసాని
యప్పురంబునఁ [3]దొంటియట్ల సద్భక్తి
యొప్పార వర్తించుచుండె నంతటను

ఆరాధ్యదేవు లింగార్చన

జంగమసహిత సంసార విరహిత
భంగుర[4]గుణజైత్ర ప్రమదాశ్రునేత్ర
సద్భక్తతిలకసంజనితముత్పులక
సద్భావనోపేత సత్యసంధాత
గద్గదకంఠహృద్గతసితికధర

౧. సేయునంతటను. ౨. సూరమాంబ. 3. దొల్లిటట్ల. ౪. మరు.

దద్గతభక్తసందర్శనాసక్త
పరిచితవిఖ్యాత భక్తినిర్ణేత
[1]యరివర్గగిరిశంబ యగు సూరమాంబ
భక్తైకచైతన్యుఁ [2]బ్రణతపర్జన్యు
సూక్తాతిమాన్యుఁ బాదోదకధన్యు
నపనీతమన్యు నియంత్రితదైన్యు
నపహృతభవజన్యు నఖిలైకమాన్యు
ధూతమాలిన్యు నిర్మాతృకాస్తన్యు
వీతమన్మథసైన్యు విగతకాఠిన్యు
నమితవదాన్యు ననన్యసామాన్యు
శమితజఘన్యు సాక్షాదుపమన్యు
ఖండితభవబీజు దండితవిషయు
మండితసద్గుణుఁ బండితారాధ్యు
నసదృశభక్తి రసామృతవార్ధి
దెసల వసుంధర దివి [3]దీఁటుకొనఁగ
నంతర్నిహితసాంబ యఘగిరిశంబ
శాంతగుణకదంబ గాంతసూరాంబ
వేరెన్నఁబడిన శ్రీ బెల్దేవి వేమ
నారాధ్యులాదిగా నలరుజంగములు

---

౧. హరివర్య. ౨. బ్రమితప్రజన్యు. ౩. నిట్టవొడువ.

పసిలి పండితవిభు దర్శించువేడ్క
నివుడంగ సద్భక్త [1]నివహంబు వొదల
[2]నరుదెంచుచుండంగ నంత నిక్కడను
బరమమాహేశ్వర పట్టబద్ధుండు
శివభక్తి [3]శుద్ధుండు [4]సిత్సమృద్ధుండు
భవ[5]గుణా[6]నద్ధుండు [7]ప్రణవసిద్ధుండు
హాతజైనబౌద్ధుండు [8]ఋత[9]సమృద్ధుండు
ప్రోద్ధత శ్రద్ధానిబద్ధకారణ వి
శుద్ధసంతత [10]సమిత్తేద్ధహృదబ్జ
మధ్యవికస్వర మహితశివైక్య
సాధ్యుండు వండితారాధ్యుండు శివప
దధ్యానసుఖనిరంతరుఁ డొక్కనాఁడు
మధ్యాహ్నవేళ సమ్మదము వట్రిల్ల
నధ్యాత్మ[11]విద్యేతరాద్యాగమోక్తి
విధ్యుక్తతంత్ర సాన్నిధ్య సత్క్రియలు
సాంగమై తనర లింగార్చనోద్యుక్త
సంగతమతిఁ బ్రహర్షము దళుకొత్త

---

౧. నికరంబు. ౨. సరుసదెంచుచునుండ. ౩. సిద్ధుండు. ౪. చిదభివృద్ధుండు. ౫. దయా. ౬. రు(ఋ;వృ;)ద్ధుండు; రుద్రుండు. ౭. ప్రణుత. ౮. మత. ౯. సముద్రుండు. ౧౦. సమ్మితే; నిమిత్తే. ౧౧. విద్యాగమాద్యుక్తయుక్తి.

నతివిహితము గృతమతులకు మఱియు
శ్రుతివిహితంబగు రుద్రాక్షచయము
సంతతకృతకర్మసఫలభావమున
నెంతయుఁ బ్రీతి వహింపఁగ వలయుఁ
గావున వేదవేదావసానోక్త
శైవశాస్త్రాగమ సంహితలందు
నిమ్ములఁ దా 'నసంఖ్యేయ గుణాధి
క'మ్మని మీఁది యర్థమ్మున నంద
యొనరంగ 'వారుణ ముత్సృజ్య' యనియు
ననుపక్తి 'నాగ్నేయ మాచరే'త్తనియు
భసితమహత్త్వ మింపెసగంగ మఱియు
బసరించుటను జేసి పలుతీర్థములను
మునుఁగు జలస్నానములు వేనవేలు
మొనసి భూతిస్నానమున కెనగామిఁ
బూని భూతిస్నానహీనుండు సేయు
స్నానంబు లవి గజస్నానంబు లగుటఁ
గప్పలు మీలు జల్గలు నీటిలోన
నెప్పుడునుండియు నిల శుచిగామిఁ
గ ర్తిఁగోసిన మేను జొత్తిల్లఁ [1]గడుగ

[1] నుడుగు.

సత్తజి శుద్ధిగా దనువాక్యమునికి
వేయివిధంబుల వెలిగడ్డ¹ వదరుఁ
గాయలోపలి చేఁదు వాయనియట్లు
దలఁప వెండియుఁ బురాతనమతంబులను
దెలియ నుత్తమము భూతిస్నాన మనియు
రుద్రాపరావతారుండు ప్రత్యక్ష
రుద్రుండు మల్లికార్జునశివయోగి
యలరి భూతిస్నాన మంగీకరించి
కలయఁద్రిపుండ్రరేఖలు ధరియించి
శిరమునఁ జేతుల శిఖను గర్ణముల
నురమునఁ గళమున నుపవీతభాతి
శివపురాణమునందు సెప్పినయట్టు
లవిరళప్రీతి రుద్రాక్షముల్ దాల్చి
యాద్యసద్భక్తిసం³పాద్యగీతములు
గద్యపద్యములు నాకాంక్షఁ బాడుచును
జదువుచు వేదికాస్థలము వీక్షించి
మెదలు జంతువులను మెల్లన నూఁకి
ఖ్యాతసూక్తుల 'సర్వకార్యేషు వస్త్ర
పూతోదక'మ్మని పొల్పుఁ గావునను

౧. నసు(సా)ర; వదర. ౨. మహిమలు. ౩. వాద్య.

నోలసిన వస్త్రపూతోదకంబులను
నలిరేఁగి సమ్మార్జనంబు గావించి
[1]కళికలుఁ బత్త్రముల్ గమలముల్ బంధ
ములు ముకుళంబులు ముఖ్యంబు గాఁగ
నిగ్గారు పంచవన్నియలతోఁ గూర్చి
ముగ్గులు వెట్టి సముదితసంప్రీతిఁ
గ్రక్కున సకలోప[2]కరణంబు లోలిఁ
జక్కాల్పి దీపంబు లెక్కుడు నిల్పి
యనలారఁగాఁ బిండి యారతు ల్వెట్టి
పసిఁడియారతులకు ఫల మెక్కుడనియు
భ్రాజిల్లుఁ బిండియారతులు గావించి
రాజితంబుగఁ బళ్లెరంబుల నిల్పి
క్రమమున హస్తోదకము శీతలోద
కముఁ దగ నుష్ణోదకమును శోధించి
ఫలము లక్షతలుఁ బుష్పములుఁ బత్త్రియు
నిల ధూపదీపపాత్రలు [3]గుగ్గిలంబు
గలపంబు గస్తూరి వెలయఁ బన్నీరు
నలిఁ గుంకుమము జందనమును [4]గంధంబు

---

౧. కళసలు. ౨. కరణముల్ ప్రీతి. ౩. గుగ్గ. ౪. మేలైన విభూతి.

గర్పూరసహితంబుగా విడియంబు
లర్పింపఁబడిన పదార్థంబు లెఢమ
దిక్కున నిడి యటఁ ద్రివిధోదకమ్ము
లొక్కొక్క పడిగంబు లోడఁగూర్చి మున్న
మస్తకంబున దయామతి[1]త్రోడ గురుఁడు
హస్తంబిడిన సాత్మ[2]కిది శుద్ధిగాన
తనుశుద్ధి గురుఁడ చేసిన దానఁ బోక
తనుశుద్ధిఁ జేసుకోఁ దనకుఁ దావశమె?
తనుశుద్ధిఁ జేసికోఁ దాను నేర్చినను
మును గురుండేల యిమ్ముల నట్లుఁగాక
శివుఁడున్న యచ్చోట యవిముక్తభూమి
[3]యవుటఁ బూజాస్థాన మదిశుద్ధిగాక
మున్న శుద్ధస్థానమునఁ గూరుచుండి
యెన్న నచ్చట శుద్ధి యేఁటికిఁ జేయ?
దేవదేవుని సన్నిధిని శుద్ధివడయు
భావింపఁ దత్పదార్థావలిగాక
యిద్ధపదార్థాలి [4]కెట్లు సిద్ధించు
శుద్ధి వంచేంద్రియ చుంబకుచేత?
శుద్ధానిషిద్ధ ప్రసిద్ధ ప్రబుద్ధ

---

౧. నాఁడె. ౨. కను. ౩. యవుల. ౪. కేల.

శుద్ధవేదాంత సు¹సిద్ధలింగంబు
శుద్ధిసేసెదనను ²సుగ్గుండు జడుఁడు
బుద్ధిహీనుఁడు భవబద్ధుండు గాఁడె
యతులితాఘోరపంచాక్షరీపాశు
పతపురోగమశైవ మత³మంత్రవితతి
యా నీలకంఠనా ⁴మాక్షరాత్మకము
గాన మంత్రము శుద్ధికరము గాదేని
యేమంత్రమున నగు నీమంత్రశుద్ధి
యామంత్రశుద్ధి దా నదియు నెట్లయ్యె
భావింప నటుగాన పంచశుద్ధులును
గావించు చూడ్కి-యె కాదె తప్పనుచుఁ
బానర లింగోదక ప్రోక్షణప్రేక్ష
ణ నిరీక్షణ స్పర్శనంబులవలన
నా వినిర్మల పదార్థావలి శుద్ధి
గావించి లింగసంస్కారంబు సేసి
స్వార్థ లయాంగ భోగాంగ పూజనము
లర్థిఁ గావించు నయ్యవసర వేళ
నున్న భక్తావళి యుత్సవంబంద
సన్నుతి సేయుచు సంస్పృహత్వమున

౧. సం. ౨. సుగ్గడి. ౩. తంత్ర. ౪. మాత్మకాక్షరము.

మల్లికార్జునుఁడు సమ్మతి నాచరించు
తల్లింగపూజావిధానము సూచి
యతిశయ విధినిషేధాతీతభక్త
మతి శివాచార సన్మార్గప్రయుక్త
సకలేంద్రియకరణ సత్ప్రసాదాంగు
లకు సకలీకరణకలాప మేల
యాసక్తి లింగసింహాసనాత్ములకు
నాసనభేదంబు లలజడు లేల
వలవ దంగన్యాసములు గరన్యాస
ములు భక్తివిన్యాసకలితచిత్తులకు
వరుసన దిగధీశవందితభక్తి
పరుల కేమిటికి దిగ్బంధనక్రియలు
దోసముల్ శోషించు ధూర్జటిభక్తి
పోషకులకు నేల శోషణక్రియలు
మహితసద్గురుదయానిహితచిద్వహ్ని
దహనాంగులకుఁ బునర్దహనంబులేల
యలఘుతరప్రసాదామృతప్లావ
నుల కేల ప్లావనంబులు[1]రిత్త దలఁప
బ్రత్యక్షసద్గురు ప్రతిబింబ మరయ

---

౧. మదిం,

నిత్యస్వతంత్రసన్నిహిత లింగంబు
నప్పటికప్పటి నట్లావహించు
తప్పులఁ దామసధ్వాంతాత్ము లగుచు
గురుఁ డావహించిన వరలింగమూర్తి
ధరవిసర్జించు విస్తర[1] పాతకులకు
సంతతప్రాణనిరంతరలింగ
వంతు[2] లౌనం డ్రె మైవడి నెట్టులనిన
వరవృషభై వేల్పు నావహనంబు సేసి
ధర విసర్జించిన వరవుండో వేల్పు
గురుఁ డావహించిన వరలింగమూర్తి
ధరవిసర్జించిన హరుఁడో వేఱొండొ
యటుగాన నింద్యంబు లావాహనంబు
లట విసర్జనములు; [3]నది యట్లుఁగాక
యంగమాభ్యంతర మగు నప్రధాన
మంగజారికి బాహ్య మగుఁ దత్ప్రధాన
మంగీకరింపక యాభ్యంతరాంగ
మంగీకరించుట యవినీతి[4] యగుట
నూహింప నభ్యాసయోగమార్గములు

---

1. పాతకములు. 2. లుపేంద్రె; లువెండి. 3. నట్లును.
4. యనక.

సోఽహముల్ గీహముల్ ద్రోహముల్ గాక
యక్కలింపులు వాయు వెక్కనూర్పుటలు
ముక్కువట్టుట దొలుదిక్కుసూచుటలు
నిఱునిఱ నీల్గుటల్ నెక్కొన వీఁపు
విఱిచికొనుటలును వెడగుముద్రలును
జిడిముడి ధ్యానముల్ [1]సికిలించుటలును
బుడిబుడిజపములు వ్రాస లెన్నుటలు
గుడుచుచుఁ గట్టుచు మృదు బట్టబయల
మడియింపఁ దలపోయు మానసార్చనలు
నావరణాది సింహాసనపూజ
గావించుటయు నాదిగా నిట్టికర్మ
యోగంబు మీఱు వేదోక్తసద్భక్తి
యోగంబునక కూర్చు నుగ్రుఁ డెట్లనినఁ
బ్రకటించెఁగాక చేరమ నీశ్వరుండు
ప్రకటించెనే సకలకరణాత్ములను
మానకంజారుని మన్నించినట్లు
మానుల[2]దానుల మన్నించె నెట్లు?
గేసిరాజు శిరోని[3]వాసిమైనట్టు
లాసనవిధులను హరుఁ డుండె నెట్లు?

---

1. చింతించుట. 2. తపసుల. 3. వాసుఁడై.

తివిరి యుత్పత్తి స్థితిన్యాయరతులఁ
దవిలెనే భోగయఁ దవిలినయట్లు
వలచె నోహిళునకు వరదుఁ డాభంగి
వలచెనే ముద్ర లావాహనంబులును
బూని బల్లహువాక్యమున నానినట్టు
లానెనె శోషదహనప్లావనములఁ
దడిచీరె వఱచి చల్లెడి యర్ఘ్యములకు
నోడఁబడెనే భక్తి కొడఁబడినట్లు
మృడుఁడు సౌడనచేతఁ గుడిచినభంగిఁ
గుడిచెనే విధులచేఁ గడిసేసిపెట్ట ?
నట్టునుగాక కారాకునం బాదివి
పుట్టికలోఁ బెట్టినట్టిచో శంభుఁ
డుండునే భక్తులయొద్ద నత్యర్థి
నుండుఁగా కనుచు నీ పండితయ్యయును
నీక్షితిఁ జనుపూర్వపక్షసిద్ధాంత
పక్షముల్ దత్కర్మభాగైకపూర్వ
పక్షేతరజ్ఞానభాగసిద్ధాంత
పక్షవేదాంతోపపాదితపరమ
శైవాత్మకాచార్య సంసిద్ధ శుద్ధ

౧. నానెశోషణదహనప్లావనముల. ౨. వేదార్థోప.

కేవలభక్తి సద్భావనోపేత
వీరమాహేశ్వరాచారమార్గాను
[1]సారిమై 'శివతత్త్వసార' సత్కృతిని
గాదె కేవలభక్తిగతిఁ బ్రతిష్ఠించి
యాదటఁ దానును నట్ల వర్తించు
చున్నవాఁడని [2]వెండియును బ్రశంసింప
మన్ననపేర్మి నమ్మల్లికార్జునుఁడు
నష్టవిధార్చన వ్యతిరిక్తమైన
యష్టాంగభక్తి క్రియలు సాంగముగను
[3]బ్రతిషోడశోపచారక్రియాతీత
రతి రాజవదుపచారములు శోభిల్ల
సహజైకలింగ నిష్ఠాపరతంత్ర
మహితసద్భక్తి సమగ్రత దనర
నభిరమ్యలీల లింగార్చన సేయ
నభిముఖుండై హృదయాబ్జకర్ణికను
లెప్పమా తనప్రాణలింగంబు సజ్జ
[4]నుప్పళింపుడుఁ దదీయోరులింగంబు
దళతళమని ప్రజ్వరిలుచు నాత్మాను
కలితమై దృఙ్మనోగమ్యమై వెలుఁగ

---

౧. సారమై. ౨. యెద్ది. ౩. వ్రత. ౪. నుప్పరించుడు.

నాలింగమూర్తి నెయ్యంబు దియ్యంబు
మూలంబు దాలంబు ముద్దును దుద్దు
భ్రాంతియుఁ గాంతియు రంగు బెడంగు
శ్రాంతి విశ్రాంతి లక్షణము సద్గుణము
భాతియు రీతియుఁ బదమును ముదముఁ
బ్రీతియు నీతియుఁ బెంపును సొంపు
నేపును నోపును నెలమియుఁ గలిమి
[1] వ్రాపును దీపును రూపు రేఖయును
మురువును వెరవును మొగియును [2]బిగియుఁ
[3]బురులును [4]నెరులుఁ బ్రస్ఫూర్తి దస్మూర్తి
సెన్నును నన్నును జెలువును నలువు
నున్నతి సన్నుతి యొప్పును మెప్పు
లలియును లులియును లాగును బాగు
[5]బొలుపును [6]బలుపుఁ [7]బ్రస్ఫూర్తి [8]విస్ఫూర్తి
భరితమై పండితప్రభుదృష్టియంద
కరువునఁ బోసినగతిఁ బిక్కటిల్లఁ
బండితలోచనాబ్జంబులయంద
గండరించినయట్టి గతిఁ [10]గుక్కిదముగ

౧. ప్రో. ౨. జి. ౩. పుర. ౪. నెరలు. ౫. నల. ౬. మొల. ౭. ప్రఖ్యాతి. ౮. విఖ్యాతి. ౯. నాంభఃప్రభవముల. ౧౦. నుంతితే; నుక్కివ.

నచ్చుగా నాపండితయ్య కన్దోయి
నచ్చొత్తినట్ల తా నచ్చెరువంద
మత్తిల్లుఁ బండితమల్లుచక్షులను
జిత్తరించినమాడ్కిఁ [౧]జిలిబిలిపోవ
నా పండితయ్యయు నట మున్ను తనదు
చూపులు శివునంద చుట్టు [౨]మట్టాడ
ననిమిష కేసిరాజయ్య లింగంబు
ననిమిషుండై చూచునట్ల చూచుచును
నవుకరుల్ కేతయ్య భవుఁ దనకన్నుఁ
గన [౩]ప్రేఁగులుగఁ జూచుకరణినిఁ జూచు
గజ్జేశు మసణయ్యగారు దన్మఱచి
హృజ్జన్మరిపుఁ జూఁచె [౪]నెట్టట్ల చూచుఁ
దవిలి నాఁటిన దృష్ట్లు దంత్రులై యులియ
శివదేవుఁ బ్రభువుఁ జూచినభాతిఁ జూచు
నంగగుణాతీతుఁడై లింగమూర్తి
భృంగీశ్వరుఁడు సూచుసంగతిఁ జూచు
నందికేశ్వరుఁ డవినాభావలీలఁ

౧. జిలిబిలి; జిరిబిరి; ౨. ముట్టంగ; ముట్టాడ. ౩. సంస్కృతములో 'అంత్రమోః' అని ఉన్నది. అనువాదకుఁడు 'ప్రేఁగులు' అని చదువుకొన్నాఁడు. 'భారముగా' అని కవిహృదయము. ౪. నేత్రర.

గందర్పహారుఁ జూచు క్రమమునఁ జూచు
దగిలించుఁ [1]దాపించు [2]దండడిగొల్పు
నిగుడించు [3]నిష్ఠించు [4]నేమించు నాఁచు
సంధించు సారించుఁ జనఁ[5]జొన్పు నునుపు
బంధించు [6]బిగియించుఁ బైకొల్పుఁ జలుపు
నెక్కొల్పుఁ బెనఁగొల్పు నెలకొల్పు నిల్పుఁ
జక్కొల్పుఁ బురికొల్పు సమకొల్పుఁ గల్పుఁ
జిక్కించు నాటించుఁ జెందించుఁ జేర్చుఁ
జొక్కించు సోలించు నెక్కించుఁ గూర్చుఁ
బొరయించుఁ [7]బోఁదించుఁ బొందుగావించు
దొరయించుఁ గీలించు [8]మరిగించు నించు
నంతకుమున్న యి ట్లంత కాంతకు ని
రంతరాక్రాంతమై యలరుఁ దద్దృష్టు
సిరమూలమంత్రంబు శిష్యకర్ణములఁ
బరగఁ జిక్కనమాడ్కి భవునంద చిక్కఁ
[9]బాచి వేదాంతముల్ భవు[10]పదాబ్జములు
మోఁచినభావన ముక్కంటి మోచి
రతిఁ గల్పవృక్షంబు వ్రాఁకి నల్గడల

---

౧. దాటి (డి) ంచు. ౨. తద్దతి; దండరి. ౩. నాటి. ౪ నెమ్మించు. ౫. గొల్పు. ౬. బోధించు. ౭. బొలి (ల) యించు. ౮. మఱి (ర). ౯. బ్రాచి. ౧౦. నందచిక్కు.

గతిఁ జుట్టు [1]నెలమి లింగమునంద ప్రాఁకి
పరగ లక్ష్యము ధనుర్ధరుఁ డేయఁబడిన
శరముల ట్లీశ్వరు నిరుమెయిఁ గాఁడి
సరసుతుల్ జనకుని వడిఁ గౌఁగిలించు
కరణి నెక్కొన నీలగళుఁ గౌఁగిలించి
కలితంపు మదకరిఁ గట్టినపాశ
ములయట్ల లింగంబు ముచ్చుట్లు సుట్టి
యొలయ మృగవ్యాధుఁ డొడ్డిన యురుల
[2]వలలభావమున నీశ్వరునంద [3]నిలిపి
ననచిన వరునితో నాతి యట్లనఁగి
పెనఁగిన ట్లీశుతో ననఁగి పెనఁగి
జిగి[4]గొన [5]నొండొంట శిల్పకుచేత
జిగు రంటినట్లు దా శివునంద యంటి
యలరుగంధద్రవ్యములు [6]దగుల్కొన్న
[7]వలువచందమున భావజహరుఁ బొదివి
ధరణిపైఁ బెన్నదు లురువడిఁ బాఱి
శరధిఁగూడినయట్లు శంకరుఁగూడి
నెలకొని పాలలోపల నుదకములు

౧. బ్రాఁకిలింగమునందయొలమి. ౨. వలన. 3. దవిలి. ౪. బిగి. ౫. నొండొంష. ౬. వడబడిన. ౭. వలపు.

గలసినపద్ధతి గణనాథుఁ గలసి
యంకింపఁ దప్తలోహంబుల జలము
లింకిన ట్లీశుపై నింకి వెండియును
[1]దివుదీపు లాడక దెసలకుఁ జనక
తపులంబు గుందక తమకంబు సెడక
తరలత్వ మదిలేక తిరుగుడు వడక
పొరిఁ బొరి నెగురక పొందంటఁ గొనక
కెలనికి నిగుడక [2]క్రేగంటఁ జనక
కలఁగక తొలఁగక చలనంబు లేక
చెదరక యుదరక చిడిముడి [3]వడక
బెదరక [4]పదరక [5]పిదపిద గాక
క్రొవ్వాడి సూపక క్రూరత లేక
[6]మవ్వముఁ దప్పక మాంద్యంబు గాక
సుడివడ[7]కెఱఁగక సొలయక జడ్డు
వడక వెన్బడక తప్పక [8]తారువోక
యక్కిలివఱపక యరగన్ను గొనక
వెక్కుక వీఁగక వెడఁగుడు వడక

౧. దివిదీవు. ౨. క్రేకంట. ౩. గొనక; వోక. ౪. వదలక; మఱవక. ౫. పెదపెద. ౬. మవ్వమేదకమన్న. ౭. కెగరక. ౮. జారు.

మెఱుమిట్లు వోవక మీఱక సందు
వఱపక కంట నీ[1]రురులంగనీక
మగ్నత సూపక [2]ప్రాఁగుడు వడక
భగ్నంబుగాక తెప్పలు [3]మాటువడక
లీనమై తన ప్రాణలింగంబునంద
తా నిరీక్షణసుధాధామంబు దనర—
మును మజ్జనాంబువుల్ ముంచినదృష్టి
నినుపారి తనుపూఁత [4]నిగిడినదృష్టి
వొనరారి క్రొవ్విరుల్ వూన్చినదృష్టి
ఘనధూప[5]ధూమంబు గప్పినదృష్టి
వరగంగ నారతుల్ వర్వినదృష్టి
గరము నైవేద్యముల్ [6]గప్పినదృష్టి
లెసగుఁ దాంబూలాదు లింపైనదృష్టి
లసమపుష్పాంజలు లసలారుదృష్టి
గా నీశ్వరార్చన దా నిరీక్షణ వి
ధానంబునంద సంధానమై పరగెఁ

---

1. రుఱుకంగ; రురువంగ. 2. ప్రాసుఱు. 3. మాఱు
4. నెగ. 5. ధూమ్ర. 6. గఱపిన; గలపిన.

జెన్నారనీక్రియ మున్నవసరము
సన్నుత లింగదర్శనమాత్రయంద
యంతఁ బండితమల్లికార్జునప్రభువు
సంతసం బలర సంస్పర్శన నియతి
నెన్నంగఁ బేద దాఁ[1]బెన్నిధియింటఁ
గన్నట్ల ప్రాణలింగము నంటియంటి
మెలయించు కరిణీ మత్తేభంబు ముట్టు
పొలుపున నన్నిలగళు ముట్టిముట్టి
శర్వాణి లీలాంబుజముఁ దాల్చునట్లు
గుర్విగా సితకరాంకునిఁ బట్టి పట్టి
నాతికుచస్పర్శనము సేయు నంబి
భాతి స్పర్శన ముమాపతిఁ జేసిచేసి
పంబి 'ప్రాణేశ్వరుఁ బాయక యివ్వి
ధంబున సంస్పర్శనం బాచరించి
బాహుల లింగసంస్పర్శన [2]సుఖకు
తూహలం బంద [3]సమాహితలీల
నక్కజంబుగ మున్న యంగవిక్రియలు
నెక్కొనురీతులు నేతులుట్టంగ
గద్గదకంఠావికస్వర రసస

1. బెన్నిరు పేద. 2. లసుఁసు. 3. నాతుదిమోహా; సమోహిత.

ముద్గత స్తవన సంయుతవాక్యుఁ డగుచు
హరలీలఁ [1]దేలుచు హరలీల దనర
'హరలీల' యనుకృతి హరలీలఁ బొగడు
మహిఁ జెప్పఁ[2]బడు 'మహిమ్న స్తవ'ంబునను
మహిమాకరుని మహామహిమఁ గీర్తించు
మలహరణం బగు 'మలహాణ'ంబునను
మలహాణప్రియుని ద్రిమలహరుఁ బొగడు
శ్రీమయంబైన 'యనామయంబు'న ని
రామ[3]యుండగు కరుణామయుఁ బొగడు
నాయత ప్రీతి 'హలాయుధం'బున హ
లాయుధప్రియుఁ ద్రిశూలాయుధుఁ బొగడుఁ
బాంచభౌతికపంచపంచేంద్రియ ప్ర
పంచదూరు నుతించుఁ 'బంచ[4]గద్య'ముల
శివతత్త్వసారసంచితమహామహిమ
'శివతత్త్వసార' మన్ శివకృతిఁ బొగడు
మహనీయమగు 'రుద్రమహిమ' యన్ కృతిని
మహనీయమగు రుద్రమహిమఁ గీర్తించు
నలరు 'సంసారమాయా స్తవం' బునను
నలరు సంసారమాయాదూరుఁ[5]బొగడు

1. దెలుపుచు. 2. నొప్ప. 3. యంబును. 4. గద్దెలను. 5. బాడు.

'శంకరగీత' భాస్వత్పదావళిని
శంకరు దురితభయంకరుఁ బొగడు
'నానందగీతంబు' లనుపదంబుల స
దానందు భక్తగణానందుఁ బొగడు
'[1]బండారు బసవన్న [2]భవ్యగీతముల'
[3]బండారు బసవన్న ప్రాణేశుఁ [4]బొగడుఁ
బ్రాక్తననూతన భవ్యగీతప్ర
సూక్తులవెండియు భక్తాత్ముఁ బాడుఁ
బనుగొన నిబ్భంగిఁ బాడుచుఁ బొగడు
చును నాల్క కసివోవ శూలిఁ గీర్తింప
నటమున్న విషయగుణావళిఁ గూడ
నిటలాక్షునంద సాన్నిధ్యముఁ బొంద
మత్తిల్లి శిఖి లక్క పుత్తడివొందు
నత్తెఱంగున నొడల్ హరునంద పొంద
నుప్పు[5]ముడియ నీర నున్న నందణఁగు
చొప్పున దేహంబు శూలియం దణఁగ
వరుస మహాబ్ధిలో వర్షోపలములు
విరిసిన ట్లంగ మీశ్వరునంద విరియ
స్ఫీతాగ్నిచే నవనీతంబు గరఁగు

౧. బండరు. ౨. భక్తి. ౩. బండరు. ౪. బాడు. ౫. మూటలు.

భాతి[1] దేహము గుణాతీతుపైఁ [2]గరఁగఁ
జను సదానంద సంజనితాశ్రు సమితి
దనహృదీశునకు మజ్జనవారి గాఁగఁ
దనరు చిత్రాగ్రంబు దడియొత్తు గాఁగ
ఘనసత్క్రియారతి గంధంబు గాఁగఁ
బొనరు ముత్పులకలు పుష్పముల్ గాఁగ
వినుత తత్త్వవిభూతి మును భూతి గాఁగ
సతతనిజాత్మ వాసన ధూప[3]ముగను
నతిశయజ్ఞానాంశు లారతుల్ గాఁగ
భరితనివేదిత ప్రాణప్రథంబు
హారున కర్పించు పదార్థముల్ గాఁగ
శమితేంద్రియానురాగము విడియముగ
నమితవాఙ్మణులు పుష్పాంజలుల్ గాఁగ
భావింప మఱియు [4]మహావసరంబు
నీవిధంబునఁ జెల్లె నిల నట్లుగాఁగ
జలకంబు సేయుచో [5]శంభునిమీఁద
నలరి తజ్జలధారనై యుండు మనసు
నాసక్తిఁ బూజించు నత్తఱి శివుని
కాసారభంబు దానై యుండు మనసు

---

౧. సంగము. ౨. పస. ౩. యొప్ప. ౪. మో. ౫. స్వామిమీఁదటను.

మలహరునకు గంధ మలఁదు నచ్చోట
నలరినకంపు దా నై యుండు మనసు
నిందుమౌళికి ధూప మిచ్చునవ్వేళ
లందు దా వాసనయై యుండు మనసు
నీశున కారతు లెత్తెడు [1]వేళ
నా శుభమంగళం బై యుండు మనసు
నారగింపఁగఁ బెట్టునట్టిచో శివున
కా రుచికరము దానై యుండు మనసు
గాన మర్త్యులకుఁ బ్రధానంబు మనసు
దా నిట్టి మనసు నీశానునియంద
లగ్నమై భక్తికళాయుక్తమై ని
మగ్నమై లీనమై మానాటఁ జేసి
యతుల బాహ్యాభ్యంతరార్చనంబులకు
సతతంబు బీజంబు [2]సమ్మతిగాన
భంగిగా దర్శన స్పర్శనంబులను
లింగార్చనం బవలీల దోఁపంగ
[3] [గణనాథునం దసంఖ్యాతులై[4]నట్టి

౧. నప్పుడా. ౨. సన్మతి. 3. సంస్కృతానువాదములో ఈ ఆరుపంక్తులకున్ను అనువాదము లేదు. రెండు వ్రాతప్రతులలో ఈ పంక్తులు లేవు. బ్రౌను పాఠములలో గ్రంథపాతముగా ఇచ్చినారు. వ్రాత ముద్రిత ప్రతిలో ఉన్నవి. ౪. నంబి.

గణములఁ గాంచి నిర్గత¹బాహ్యుఁడగుచు
శ్రీకంఠునకును బారిషదుల కరయ
నేకాలమున వేఱు లేకుండుఁ ²గాన
నాగణంబులమాఱు గాఁగఁ బ్రాణేశుఁ
డేగతియని నుతియించెనో యనఁగ]
నంతట వెండియు నాపండితేంద్రుఁ
డెంతయు ³నటువోక 'యీశ! ప్రాణేశ!
శ్రుతి 'విశ్వత శ్చక్షు రుత' యంచు నిన్నుఁ
దతిఁ జూడఁ గన్నులు దశకోటి కోట్లు
రతి 'విశ్వతోముఖ ఇతి' యంచు నిన్ను
నుతియింప జిహ్వలు శతకోటికోట్లు
భ్రాజిల్ల 'విశ్వతోబాహు' నా నిన్నుఁ
బూజింపఁగా హస్తములు గోటికోటు
లిల 'జనయన్ దేవ ఏకో' యనంగఁ
దలఁప మనోముఖంబు లనంతకోట్లు
గా నొసంగవె నాకుఁ గళకంఠ, శివ, స
దానంద, గురులింగ యట్లు గాదేనిఁ
గనుఁగవ యొడలెల్లఁ గాఁ జేయవయ్య

౧. బాహు. ౨. టయును. 3. నాపోవకీ.

యనఘ యంచును గన్నులార [1]వీక్షించుఁ
గరముల యొడలెల్లఁ గాఁ జేయవయ్య
హరుఁడ యంచును జేతులారఁ బూజించు
జియ్య నాయొడలెల్ల జిహ్వలు [2]సేయ
వయ్య యఁటంచు వాయారఁ గీర్తించుఁ
జెవుల కా యొడలెల్లఁ జేయఁ గదయ్య
శివుఁడ యంచును వినుఁ జెవులార నుతుల
నొడలెల్ల మనసకా నొగిఁ జేయవయ్య
మృడుఁడ యంచుఁ దలంచు వడి మనంబారఁ
బనుగొన నిబ్బంగిఁ బ్రార్థన సేయు
చును జూచుచును ముట్టుచును దలంచుచును
దన్మహిమయ పించు దానిట్లు భక్తిఁ
జిన్మయానందవశీకృతబుద్ధి [3]
స్ఫురియింప శివుఁ జూచిచూచి క్రాలుచును
హరసుఖామృత మానియాని క్రోలుచును

---

1. (జూచుచును. 2. చేయుమయ్య. 3. ఈపాదము తరువాత బ్రౌనుప్రతిలో "ఆలీలఁ బ్రమథగణానందవార్ధిఁ, దేలుచు మఱుఁగుచు దృఢతరభక్తి, శివునిలోఁ జిత్తంబుఁ జేర్చి నెండియును, శివుకంటె నన్యంబు దవులక యుండి" అనేపంక్తులున్నవి. ఇవి వ్రాతప్రతులలో కాని, ప్రాతముద్రితప్రతిలోకాని లేవు. వీటికి సంస్కృతానువాదము లేదు.

దీ క్షా ప్ర క ర ణ ము

శివదర్శనము సేసిచేసి [1]వ్రాలుచును
[2]నవిరళోత్సవ మందియంది సోలుచును
దనుగుణంబులు దక్కితక్కి పాయుచును
ననురాగమున నన్నియన్ని యేచుచును
గణనాథులను గాంచి కాంచి మ్రొక్కుచును
బణుతులారంగఁ బాడి పాడి [3]చొక్కుచును
లీలాంబునిధిఁ దేలి తేలి యాడుచును
శూలిలోనన చొచ్చి చొచ్చి కూడుచును
సాంగంబుగా బహిరంగంబు నంత
రంగంబు దనప్రాణలింగంబుఁ గూర్చి
యున్న పండితు విష[4]యోద్వృత్తిఁ జూచి
పన్నగాంకుని భక్తిపరులు వెండియును
ననిమిషాధీశు సహస్రాంబకములు
ఘనమల్లికార్జును కనుఁగవ కెనయె?
యారయ రవివేయుహస్తముల్ వండి
తారాధ్యహస్తతోయజముల కెనయె?
వివరింప శేషుని వేయు నాలుకలు
శివకవిమల్లయ్య జిహ్వకు సరియె?
యననేల చతురాననుని కర్ణవితతి

---

౧. కొల్చు. ౨. నవిరతో. 3. సోలుచును. ౪. యోద్యుక్తి.

వినుతింపఁ బండితు వీనుల[1]సరిమె ?
సనకాదియోగులు సన్మనోగతులు
ఘనుఁడు పండితు మనో[2]గతికిని బురుడె ?
పండితారాధ్యుల పంచేంద్రియములు
[3]దండధరారి పాత్రంబులు గావె
పండితారాధ్యుల పంచేంద్రియములు
సండీశువరదు భాజనములు గావె
పండితారాధ్యుల పంచేంద్రియములు
ఖండేందుశేఖరు కరములు గావె?
పండితారాధ్యుల పంచేంద్రియమ్ము
లండ[4]జకల్పు ప్రత్యంగముల్ గావె
పండితారాధ్యుల పంచేంద్రియమ్ము
లొండేమి శివుభుజదండముల్ గావె
పండితారాధ్యుల పంచేంద్రియములు
వెండియు నీశ్వరు విషయముల్ గావె
వేయేల? [5]కవిమల్లు విషయేంద్రియములు
మాయని లో[6]చేయి సేయనితపము
లెఱుఁగని యెఱుక; దన్మఱవని మఱపు;

---

౧. సమమె. ౨. గతిసమానంబె. 3. చండవిషాంశు నిస్తారముల్ గావె. ౪. జోకొల్పు. ౫. కై (శివు) గన్న ౬. సేవ.

మెఱుఁగని మెలుకువ; దఱగని నెనరు;
గలసి పాయని కూర్మి; గలలేని నిద్ర;
గెలిచినతుర్యంబు; గ్రియసెడ్డ నడపు;
త్రెవ్వనిత్రెంపు సే తివ్వని తనివి;
నవ్వనికూర్మి యానని పంట ప్రోది
వెంపని పెంపు లాలింపని వినికి
దెంపని తెంపు నేమింపని వలపు
వడిలేని సంధాన మిడరాని తమక
మెడవోని నెయ్యంబు గడివోని తలఁపు
యెరికిఁ గల్గునే యీపండితయ్య
గారిక కాకంచు వారక పొగడ
నంత నితాంత నిరంతరభక్తి
మంతుండు పండిత మల్లికార్జునుఁడు
శుద్ధలింగార్చనస్తోక క్రియా స
[3]ముద్ధతరతిసాంగపద్ధతి దనర
నియతి మున్ దర్శన నీరాంజనంబు
నియతి మున్నవసర నీరాంజనంబు
నియతిని మజ్జన నీరాంజనంబు

---

౧. ఐమువు; నెలవు. ౨. తప్పని; దిప్పని. ౩. ముద్ధతి.

నియతి¹ని మాంగల్య నీరాంజనంబు
నియతిని శృంగారనీరాంజనంబు
నియతిని మఱి మహానీరాంజనంబు
నియతిని నానందనీరాంజనంబు
నియతి నసంఖ్యాతనీరాంజనంబు
నియతిగా నీయష్టనీరాంజనములు
గ్రియగొన ధూపాదిసమయములఁ దీర్చి
నయ్యయివేళల నర్ఘ్యపాద్యాదు
లయ్యయివేళల నభ్యర్చనమ్ము
లిటు గాలవేళల నింపునుసొంపు
ఘటియిల్ల శీతోష్ణగంధోదకములు
గడునొప్ప నక్షత గంధపుష్పాదు
లొడఁబడ రాజవదుపచార³తతికి
సాంగమై చను లింగశృంగార రచన
లంగీకరించి ప్రహర్షంబు దనర
మున్నవసరము సమున్నతిఁ ⁴జలిపి
సన్నుతలీల మజ్జన మాచరించు
సమయంబునను సూర ⁵సానమ్మ జంగ

౧. తోమంగళ. ౨. సత్క్రియలును. ౩. రతికి. ౪. సలిపె; జరిపె. ౫. సానియా.

మును బెలిదేవి వేమనపండితులును
జను దేర ముందటఁ జాంగుబళా య
నిన మంగళధ్వని నిండారి పారి
భావంబు సెన్నయ్య దేవునియంద
భావంబు[1] వొలయుడుఁ బండితేంద్రుండు
జంగమవేషంబు లింగదర్పణ సు
సంగతంబై యున్కి [2]సహజంబకాన
జంగమరత్నంబు లింగాబ్ధిమధ్య
సంగతంబై యున్కి [3]సహజంబకాన
పొడగని బిట్టుల్కిపడి యద్భుతంబు
వెడగువఱప లింగ విక్రియల్ వొదల
జంగమదర్శన సంస్పృహానంద
మంగళామృతవార్ధి మధ్యావగాహ
వితతసంభ్రమకృత విస్మరణప్ర
యుత నిజాంతఃకరణోపేతుఁ డగుచుఁ
గూర్చున్నవాఁడ లింగార్చన కనక
చర్చింప నిదియు మజ్జనవేళ యనక
తగ దవధానంబు దప్పెనో యనక
మొగిఁ గరస్థలి లింగ మున్నవాఁ డనక

౧. వొరయుచు. ౨. సత్యంబ. 3. సాంగంబ.

హరునకు మున్న సింహాసనంబైన
కరము నర్చనలిచ్చు కరమును మోడ్చి
యక్కజంబుఁ బ్రియంబు హర్షంబుఁ దనర
మ్రొక్కంగఁ బండితుమ్రోల సల్లీల
నంత నచ్చెరువంద నాలింగమూర్తి
యంతరిక్షంబున నట్లుండె నునికిఁ
బోలు లింగములోన పొలయు జంగమము
ఆలింగమునకు సింహాసనంబుగను
బాలయు జంగమరూపమునకుఁ బండితుని
చెలువారు భక్తియ సింహాసనముగ
నక్కజంబుగ వేమనయ్య సూరాంబ
సక్కనఁ జనఁజొచ్చి శరణార్థి సేయ
మరలి చూచుడు జంగ[౧]మమునంద తోఁచె
నరయఁ దత్ప్రాణలింగాకృతి యట్ల
జంగమమూర్తి సర్వాంగంబు నంత
రంగంబు లింగమయంబ యెట్లనిన
జంగమపాదాంబుజంబులు సకల
మంగళతీర్థ సర్వాంగాలయములు
జంగమాంఘ్రులు ఘనసంసారదుఃఖ

---

౧. మంబునై.

భంగురరోగ [1]విపద్భేషజములు
జంగమాంఘ్రులు [2]నతజనచయ నిటల
సంగతాశుభదురక్షర హరణములు
జంగమాంఘ్రులు గిరిజావరదోత్త
మాంగ సన్మార్గ పూ[3]జావిధానములు
జంగమాంఘ్రులు భక్తజనకల్పతరులు
జంగమాంఘ్రులు ప్రాణలింగాంఘ్రి చయము
లరయ జంగమ వామహస్తతలంబు
సిరలింగమూర్తికి సింహాసనంబు
అలరు జంగమ వామహస్తతలంబు
సెలువార [4]శివునకు శృంగార గృహము
శస్తజంగమ వామహస్తతలంబు
హస్తిచర్మాంబరు నాస్థానవేది
దలపోయ జంగమదక్షిణహస్త
తలము లింగమునకుఁ దాజన్మభూమి
దవిలి జంగమమూర్తి దక్షిణకరము
శివునకుఁ బరిచర్య సేయునియోగి
[5]యీక్షింప జంగమ దక్షిణకరము

౧. భీమ.గ్భేష. ౨. ఘనసంసారదుఃఖ. ౩. జాభి. ౪. హరు. ౫. ల.

దక్షమఖారికిఁ దగినపూజారి
జంగమహస్తముల్ లింగైకసఖులు
జంగమహస్తముల్ లింగహస్తములు
జంగమనయనముల్ లింగంబుమీఁద
భంగిగా నేప్రొద్దుఁ బాయనివిరులు
లీల జంగమదృష్ట్లు లింగంబు[1] మ్రోలఁ
గ్రాలుచునుండు నఖండదీపములు
వరగ జంగమదృష్ట్లు ప్రమదాశ్రుసమితి
హారు మజ్జనంబార్చు [2]నాకలశములు
నెఱయు జంగమదృష్ట్లు వఱలు లింగంబ
యొఱఘుఁగా మెఱుఁగారి యొప్పు [3]సన్మణులు
జంగమదృష్టు లీశ్వరు కులాంగనలు
జంగమ దృష్టులు లింగంబు దృష్ట్లు
పూని జంగమజిహ్వ పురహరుం డర్థి
తోనారగించు తద్భోజనపాత్ర
దొడరి జంగమజిహ్వ మృడుఁడు దా రుచులు
గడిసేసి కడిసేసి కుడుచుహస్తములు

---

౧. మీఁద. ౨. నట్టిఘుట. 3. బాణము.

సెనయ జంగమజిహ్వ శివుఁ డొర్ల కీక
యెనయ సత్యంబుఁ దాఁచిన కరవటము
దవిలి జంగమజిహ్వ దప్పకయుండ
శివు[1]నంకనములు వ్రాసిన పుస్తకంబు
భాతి జంగమజిహ్వ బసవలింగంబు
గీతముల్ వాయించు కిన్నరవీణ
జంగమజిహ్వయ లింగంబు జిహ్వ
జంగమ వాక్యంబ లింగవాక్యంబు
జంగమముఖమ తా లింగముఖంబు
జంగమకుక్షియ లింగంబుకుక్షి
జంగమవక్షంబ లింగవక్షంబు
జంగమోదరమ తా లింగోదరంబు
జంగమభోగంబ లింగభోగంబు
జంగమతృప్తియ లింగంబుతృప్తి
జంగమఘ్రాణంబ లింగనిర్మాల్య
సంగతసౌరభాస్వాద [2]భృంగంబు
జంగమఘ్రాణం బసాధారణంబు
జంగమఘ్రాణ మీశ్వరునిఘ్రాణంబు
జంగమకర్ణముల్ లింగతత్త్వప్ర

---

౧. నంకణ. ౨. లిం.

సంగతామృతపూర్ణ చారుకుంభములు
మఱియును దజ్జంగమంబు కర్ణములు
గొఱలు శ్రుతిస్మృతి కుండలాంకములు
జంగమకర్ణముల్ లింగశబ్దాద్య
భంగనామావళీ పటుముద్రితములు
జంగమకర్ణముల్ లింగాలయములు
జంగమకర్ణముల్ లింగకర్ణములు
జంగమలింగభాస్వన్మనోమార్గ
మంగజహరుని విహారస్థలంబు
జంగమలింగభాస్వన్మనోమార్గ
మంగజహరున కేకాంతవాసంబు
జంగమలింగ భాస్వన్మనోమార్గ
మంగజహరునకు ¹నంతర్గృహంబు
జంగమలింగభాస్వన్మనో వీథి
లింగదేవునకుఁ గేళీమందిరంబు
విశ్రుతజంగమ ²విదితమానసము
విశ్రమస్థానంబు విశ్వేశ్వరునకు
వేయేల జంగమ విమలమానసమా
వాయని నెచ్చెలి పరమేశ్వరునకు

---

1. నట్లనుసారి. 2. విమల.

జంగమంబు మనస్సు లింగకారణము
జంగమంబు మనస్సు లింగంబు మనసు
జంగమకాయంబు సత్పరంజ్యోతి
జంగమకాయంబు శాంతతరాసి
జంగమకాయంబు లింగవాహనము
జంగమకాయంబు లింగంబుశయ్య
జంగమకాయంబు లింగాలయంబు
జంగమకాయంబు లింగకాయంబు
జంగమ[1]మూర్తియ లింగంబుమూర్తి
జంగమవేషంబు లింగవేషంబు
పరికింప జంగమ ప్రాణపదంబు
నరయ లింగప్రాణ [2]మట్లునుగాక
యాదిజంగమమూర్తి యై వచ్చి గురుఁడు
గాఁడె లింగంబు జంగమమును నయ్యె
నట్టి సద్గురుమూర్తి యగుజంగమంబు
నెట్టణ గురుఁడని [3]నిష్ఠింపవలయు
ఘనజంగమంబు సాక్షాద్గురురూప
మనుచు నర్చన సేఁత యదిమధ్యమంబు

1. గురుమూర్తి. 2. మటుగానజూడ. 3. నిష్ఠబెంపొందు నీక్షింపవలయును.

సన జంగమము శివశాసనధారుఁ
డనుచు నర్చనసేఁత యది దుదికత్యా
గాన సద్గురుమూర్తి యైన జంగమ ని
జాననంబునఁదోఁచు టరుదె లింగంబు?
అనుచుఁ బండితమల్లికార్జునస్వామి
వనుగొన జంగమపరవశోద్వృత్తి
నంత ముందటికిఁగాెె నతిభక్తిరసము
వింతయై తనుముంప విభ్రాంతి వదలి
యరుదొంద వేమనయ్యయు సూరసానిఁ
గరమభిలాషమైఁ గౌఁగిటఁ [1]జేర్చి
జంగమ శ్రీపాదసంకలితోత్త
మాంగుఁడై యందంద సాష్టాంగుఁడగుచు
శంకరభక్తుల శరణంటె భవము
లింకు మాయాజాల పంకంబు లారుఁ
బాపారిభక్తుల పాదము ల్గంటి
నోపుదు భవదుఃఖ కూపముల్ వెడల
నేపారభక్తుల శ్రీపాదధూళి
నాపయిఁ బొలింగఁ బాపము ల్వ్రాలెసెఁ
బట్టింప సద్భక్తి భక్తుల చెప్ప

---

౧. జేర్చు.

లిట్టలంబుగఁ దలఁ బెట్టంగఁ గంటి
భావజాంతకు భ క్త పాదోదకంబుఁ
ద్రావంగఁగంటి నే ధన్యుండనైతి
మృడుని భక్తుల ప్రీతిఁ గుడిచినచోటఁ
బడిన ప్రసాదంబు గుడువంగఁ గంటి
ననుచుఁ గీ ర్తించుచు నాడుచుఁ బాడు
చును [1]జంగమము పాదవనజము ల్గడిగి
పాదోదకముఁ గొని భ క్తి నర్చించి
యాదట ధూపదీపాదు లొనర్చు
నెడ దీపకంభంబు లిరుదెస వెలుఁగఁ
బడిగంబుమీఁదటఁ బ్రజ్వరిల్లుచును
నంతరిక్షంబున నలరు లింగంబు
నంతలోనన జంగమావళిఁ గాంచి
పండితమల్లన్న ప్రస్తుతింపుచు న
ఖండితైశ్వర్య సంకలితాత్ము లగుచుఁ
జనుఁజను లింగావసరము సెల్లింప
ననుచు నాజ్ఞాపనం బాచరించుడును
గలగని మేల్కాన్న కరణి నద్భుతము
దొలఁక లింగమునకు దోఃస్థలంబొగ్గి

---

౧. జంగముల.

నిన్ను గన్నప్పుడు దన్నును జగముఁ
బన్నుగా మఱవంగ భక్తాత్మ వలయు
మఱి భక్తుఁడగు జంగమముఁగని నిన్ను
మఱవవలయు జంగమము నీవకాన
యలరి జంగమలింగ మగు భక్తుఁ గాంచి
కొలువఁడే వృథ శివుఁ గోటి పూజలను
శివభక్తి పరులఁ బూజింప కేప్రొద్దు
శివపూజ లొకకోటి సేసిన వృథయ
శివభక్తిపరులఁ బూజించినఁ జాలు
శివపూజ లొకకోటి సేసినవాఁడు
వేడుక మదిఁ దులుకాడ నెంతయును
గూడ భక్తులఁ గొనియాడఁడే నతని
యాడంబరంపు దేవార్చనలెల్ల
నోడునఁబోసిన యుదకంబు లట్ల
కాన లింగార్చనకంటె నుత్తమము
జానొందఁ గావించు జంగమార్చ¹నయు
లింగార్చనం బగు జంగమార్చనము
జంగమార్చన గాదు లింగార్చనంబు
వ్యక్తలింగాంగుఁ డీశ్వరుఁ డనుకంటె

---

౧. నము.

భక్త్యైకతనుఁ డను భావ ముత్తమము
వనుగాన లింగంబు ప్రాణమర్థ కంటె
మును జంగమము ప్రాణ మను డుత్తమంబు
లింగార్పణముసేత యంగభోగంబు
జంగమార్పణసేత లింగభోగంబు
లింగార్చనముకంటెఁ లీల నెక్కుడుగ
జంగమార్చనసేత సరి నుత్తమంబు
లింగజంగమపూజ లెక్కింప నొక్క
భంగిన చేయంగఁబడుట మధ్యమము
లింగార్చనముఁ జేసి జంగమార్చనము
నంగీకరింపమి యధమ మెట్లనిన
లింగార్చ¹నము లింగ మంగోపచర్య
భంగి జంగమపూజ ప్రాణోపచర్య
గాన జంగమభక్తిహీనుని పూజ
పీనుఁగుఁ గైసేయఁ బూనినయట్ల
నినుపార నగ్నిసాన్నిధ్యతఁ గాక
యినుము ద్రావఁగనేర్చునే యుదకముల ?
నెక్కొన్న జంగమాన్వితము గాకున్న
నిక్కంబుభోగింప నేర్చునే శివుఁడు ?

---

౧. ర్చనము. ౨. నంబసునం.

మును లింగజంగమం బను రెండునోళ్లఁ
గొనక తృప్తుఁడగునె గురులింగమూర్తి?
రెండునోళ్లను గుడ్వ [1]కుండినఁ గుక్షి
నిండునే గండభేరుండంబునకును?
నెఱి నంకురించువృక్షానికి నీరు మాని
నెఱవట్టి కొఱటికి నీ రెత్తినట్లు,
[2]గుతిలుఁడై జాతినాగులఁ జంపుచుండి
ప్రతిమనాగులకును బాలోయునట్లు
వడిగొని భుజియించు వదన [3]ముండంగ
గడినేసి పెడతలఁ గుడుపుచందమున
నొనర ముందటి శిరం బుండ మోకాలి
కిని సేస వెట్టంగఁ గ్రియగొనినట్లు
గావున భక్తుండు నీవ యన్మతిని
భావించి మిక్కిలి భజియింపవలయు
భక్తుని గొలుచుట భవుఁగొల్చుటనుచు
భక్తితో నే ప్రొద్దు భజియింపవలయుఁ
దవిలి భక్తప్రసాదము సంతతంబు
భవుప్రసాదం బని భజియింపవలయు

---

౧. తున్నను. ౨. బ్రతికిన నాగులఁబట్టి చంపుచును.
3. మ్ముగలుగ.

భక్తుల వరువుండ, భక్తులబంట
భక్తుల యిలువుట్టు బన్న నాకెపుడు
భక్తుల యేడ్గడ భక్తుల దిక్కు-
భక్తుల దెసయని భజియింపవలయు
నావారు శివభక్తులే వారివాఁడ
భావింప దృఢ[౧]మని భజియింపవలయు
నని చెప్పఁగాదె మీ యానతి జియ్య
ఘనభక్తచిత్త ప్రకల్పితశయ్య
౨భక్తాంఘ్రికౌముదీపానచకోర
భక్తాస్యదర్పణ ప్రథితసాకార
భక్తసరోవరసక్త మరాళ
భక్త మనోంబుజ భ్రమరసల్లీల
భక్తాత్మమందిర ప్రబలప్రదీప
భక్త సర్వాంగ సత్ ప్రాణస్వరూప
గురుమూర్తికాయంబు హరుఁడు మీ మూర్తి
గురులింగప్రాణ మాచరలింగమూర్తి;
ధరఁ బ్రాణలింగావతార మీమూర్తి
ధరణి నాచార్యావతార మామూర్తి;
దగ నంగసన్నిహితమున కీమూర్తి.

౧. మతి. ౨. భక్తదృక్కౌముదీ.

దగుఁ బ్రాణసన్నిహితమున కామూర్తి;
సారమంత్రక్రియాధార మీమూర్తి
సారతంత్రక్రియాధార మామూర్తి;
మును యోగమజ్జనంబున కిది తావు
సను భోగమజ్జనంబున కది తావు
ఎనయఁ బూజాస్థాన మీలింగమూర్తి
దనరు నారాధనస్థాన మామూర్తి;
మును ద్రికాలార్చనఁ గొనఁగ నీమూర్తి
యనయంబు భజియించుకొనఁగ నామూర్తి;
రతి షోడశోపచారక్రియ లిందు
సతత రాజవదుపచారంబు లందు;
రమణ కరస్పర్శనమున కీశిరము
రమణ శిరస్పర్శనమున కాయడుగు;
అఖిలాత్మవిషయేంద్రియార్పణం బిందు
నఖిలసుఖోపభోగార్పణం బందు;
పూని రూపార్పణస్థాన మీమూర్తి
పూని రుచ్యర్పణస్థాన మామూర్తి;
శుద్ధప్రసాద సంసూచనం బిందు
సిద్ధప్రసాదసంసేవనం బందు;

---

౧. యాస్పదం.

దనుమనోగుణ నివేదనము దా నిందు
దనుమనోధన నివేదనము దానందు;
గావున గురువు జంగమమును నొక్క-
భావంబుగాఁ జూచు భక్తి నాకొసఁగు.
వేవురు వేయన్న నీవంకనున్న
దేవ! మదీయ మనోవర్తనమున
నీవు భక్తుండను భావవిభేద
మావంతయును లేని యట్ల నా కొసఁగు.
మది జంగమంబు దా నిది లింగమనక
మది నేకమనియెడి మార్గంబు నొసఁగు
రెండను భేదమెుక్కండును సందు
వెండియు నాత్మ లేకుండఁగ నొసఁగు
చేరి సద్భక్తగోష్ఠీ ప్రసంగము న
హోరాత్రమును బాయకుండంగ నొసఁగు
మట్టిభక్తుల-పొట్టలందు సంప్రీతిఁ
బుట్టెడుపుణ్యంబు పుట్టువు నొసఁగు
మది యసంభవమయ్యె నాభక్తులిండ్లఁ
బొదలి మెట్టెనను బుట్టంగ నొసఁగు
పని సేయ నిలువుట్టు బానిసనయ్యుఁ

౧. జూపు. ౨. కడ్పు.

[1]బనివడుతినెద్దుగా, భవనంబుఁ గావ
శునకముగానైన శూలి! నీభక్త
ఘనగృహంబులఁ బుట్టఁగాఁ గృపసేయు
మంతియచాలు నా కపవర్గపదవి
సింతింప నేనొల్ల శివలింగమూర్తి!
యనుచుఁ బండితమల్లికార్జునారాధ్యుఁ
డనురాగలీల లింగార్చన సేయ
సూరసానియు గణస్తోమంబు వేమ
నారాధ్యులును సము[3]ద్యద్భక్తవితతి
ఘనతరలింగజంగమ పారవశ్య
వినుతసుఖామృతవనధి నోలాడి
పండితమల్లన్న భావంబుఁ గని య
ఖండితానందాశ్రుగణములు[4]దొరుగ
నిట్టిజంగమనిష్ఠ యిట్టిమాహాత్మ్య
మిట్టి యాజ్ఞాసిద్ధి యితరుల కగునె?
బాపురే మాయన్న పండితవిభుఁడ!
బాపురే మాయన్న పండితేంద్రుండ!
బాపురే మాయయ్య పండితారాధ్య!

---

౧. దునిబడు; మనిబను. ౨. నెద్దనయ్యునునిలుగావ. 3. ద్యద్భక్తినిరతి. ౪. గ్రమ్మ.

## దీక్షా ప్రకరణము.

బాపురే మాస్వామి పండితమల్ల !
నల్లవో పండిత నతపండితౌఘ !
నల్లవో పండిత [1]నందితకీర్తి !
మజ బాపు పండిత మత్కులాచార్య !
మజబాపు పండితమల్లికార్జునుఁడ !
విని[2]కాని యెఱుఁగము మును గథలందు
గనుఁగొంటి మిపుడు ప్రఖ్యాతంబుగాఁగ
నెట్టన్న వీరమాహేశ్వరాంకుండు
[3]ధట్టుండు దురితఘరట్టుండు ఘనుఁడు
శివభక్తియుక్తి[4]పెక్కునఁ దొల్లియట్ల
తవిలి శ్రీబసవన్న దండనాయ[*]కుఁడు
సంగతిఁ బ్రాణంబు సంధించెఁ గావె.
జంగమంబందు దచ్చరిత మెట్లనిన
స్రష్టయు హరియును సకలప్రపంచ
మష్టతనువులు బ్రహ్మాండసంఘములు
గౌరీవివాహంబు గరళాపహార
భూరికార్యావళి పుట్టకమున్న
యేకాకియై పరమేకాంతమునఁ జి
దాకారుఁ [5]డీశానుఁ డభవుఁ డీశ్వరుఁడు

౧. నందీశ. ౨. కని. ౩. ద. ర. నె. ౪. కులు. ౫. డాహారు

శంభుండు దాన యాసక్తి ద్వితీయ
శంభుండనంగ వృషభమూర్తిఁ దాల్చి
యడియు వాహనముగా నర్థిఁ జరింప
సదమలేచ్ఛామాత్ర జగములు వుట్టె
నరుదుగా నంత శిలాదుండు దన్నుఁ
జిరతపోనిష్ఠ భజించి [1]మెప్పింపఁ
దాన యయోనిజుఁడై నందికేశ
మానిత దివ్యాభిధానంబుఁ దాల్చి
వెండి శిలాదపుత్త్రుండు నందీశ్వ
రుండనఁ బరగి నిరూఢిమై నంత
వీరమాహేశ్వరాచారప్రచార
పారీణమతి జగత్పావనం బయ్యె
ననమసద్భక్తి హితార్థ[2]ంబు గాఁగ
వసుధ నయ్యీశుండు బసవనామమున
స్థిరమతిఁ గర్ణాట దేశంబునందు
గరమర్థి [3]నింగుళేశ్వర భాగ[4]వాడి
యనునగ్రహారంబునందు విఖ్యాతి
మనుచుండు మండఁగె మాదన్నయతివ
శ్రీమతి మాదాంబ శ్రీనందికేశు

౧. మెచ్చించి. ౨. ంబకాన. ౩. హిం. ౪. వాటి; వాడ.

నేమించినోమిన నోముఫలమున
సంభవంబయ్యె స్వయంభులింగంబు
సంభవంబైనట్లు గుంభినిమీఁద
సంభవంబయ్యెఁ గాష్ఠంబున నగ్ని
సంభవంబైనట్లు గుంభినిమీఁద
సంభవంబయ్యె నబ్జంబు వంకమున
సంభవంబైనట్లు గుంభినిమీఁద
సంభవంబయ్యెఁ బాషాణానఁ బసిఁడి
సంభవంబైనట్లు గుంభినిమీఁద
జంగమమూర్తి యాలింగమూర్తియును
సంగతంబైకూడ సద్గురుమూర్తి
యెనఁగఁ గూడలి సంగమేశుండు నాఁగ
ననలారులింగంబు నదియ ప్రాణముగ
నుదయింపఁ దోడ్తోన నుదయించె భక్తి
యుదయింప కటమున్న నుదయించె మహిమ
మరువంబు జనియింప మరువంబుతోన
పరిమళం బుదయించు భాతి వట్రిల్ల
శివలింగసౌఖ్యానుభవమ చన్నాలు
దవిలిన గురుపదధ్యానంబ వెన్న

  

వేదాంతసూక్తుల వెడఁ¹దోట్రుఁ బల్కు
లాదిమార్గమ తప్ప ²డడుఁగిడు నడుగు
గా లింగపూజాత్మకక్రియావిలయ
లాలనం బమర బాలక్రీడలుగను
ఘనతరలింగజంగమభక్తి నిట్టు
లనుదినవర్ధమానాంగుఁడై యంత
సర్వజ్ఞు నందికేశ్వరుమూర్తి గాన
సర్వవిద్యలు సహజంబ పాటిల్లఁ
గర్మోపనయనాది కర్మనిర్మథన
కర్మకర్మఠ శివ ³ధర్మశాస్త్రాది
శివరహస్యార్థ విశేష ప్రయుక్తిఁ
దవిలి పూర్వాశ్రమ ధర్మము ల్విడిచి
యుండంగ బలదేవదండనాయకుఁడు
దండియై గంగాంబఁ దనయ నిచ్చుటయు
వరియించి సతియు సోదరియును దాను
గురుదర్శనాసక్తి పరవశలీల
లెసగఁ గప్పడి సంగమేశ్వరంబునకు
నసదృశ⁴గతి నేఁగ నాసంగమేశు
నంద సద్గురుమూర్తి యాకృతిఁ గాంచి

౧. దొప్పు. ౨. ట. 3. కర్మ. ౪. రతి.

యందంద సాష్టాంగుఁ డై ప్రణమిల్లి
సంగయదేవుండు సద్గురురూప
మంగీకరించి ద¹యాంబుధి ముంచి
తన ప్రసాదము వెట్టి ఘనశివాచార
మను డిట్టిదని తెల్పి హరుఁడయి నిల్వ
నతిమృదుమధుర రసాంచిత గీత
వితతి సద్గురుమూర్తి వినుతింపుచుండ
నంత నాదండనాయక బలదేవుఁ
డంతకరిపుప్రోలి కరుగ బిజ్జలుఁడు
బసవన్నఁ దోడ్తేరఁ బంచి సంప్రీతి
ననమసకల నియోగాధ్యక్షుఁ జేయ
జనపతిరా²జ్యంబుఁ జక్కఁబెట్టుచును
ఘనలింగజంగమార్చనలు సేయుచును
మాన్యుండు సకలేశు మాదిరాజయ్య
మాన్యుండు మడివాలు మాచిదేవయ్య
³గిన్నరబ్రహ్మయ్య మున్నాదిగాఁగఁ
బన్నగధరభక్తి పరులఁ గొల్చుచును
ననమశిష్యుఁడు సెన్నబసవన్న దనకు
ననలారుభక్తిసహాయుండు గాఁగఁ

1. యాబుద్ధి. 2. రాజ. 3. కిన్నెర.

దనుమనోధననివేదనపరతంత్ర
వినుత వీరవ్రతాన్విత శుద్ధభక్తి
నిర్వంచకస్థితి శర్వభక్తులకు
సర్వధనంబులు సమయుచునుండ
వంగకాయలు గట్టుఁగొంగులఁ బొదిగి
లింగసన్నిహితుల లీలఁ బొల్పార
దొంగలు బందివెట్టంగ నేతేర
భంగిగా బసవయ్య భావసంస్పర్శ
వంగకాయలుఁ బ్రాణలింగంబులయ్యె
సంగతి దొంగలు సద్భక్తులైరి
యత్తఱి నొకజంగమయ్య యేతెంచి
ముత్తియంబులు గొన్ని క్రుగ్గున కడుగ
జంగమాగమమ తా స్వాతివర్షముగ
నంగడఁ దనచూడ్కు లవియుఁ జిప్పలుగ
వీక జొన్నలరాశి వెలుఁగు ముత్తియపుఁ
బ్రోక గావించి యప్పుడ నివేదించె.
వెండియు నొకనాఁడు మిండజంగమము
దండించి యర్థమంతయు వేఁడఁదడవ
బిజ్జలు బండరుపెట్టెలనూడ

౧. నడుగక.

లజ్జంగముంబున [1]కప్పడ యొసఁగ
ఘట్టించి యారాజు దన యర్థమడుగ
నెట్టణ బసవన్న నిజభక్తిమహిమ
నందిముద్రలమాశి[2] లొందంగ భక్త
బృందంబు హర్షింపఁ బెట్టెలు నిండె
జంగమలింగవేషంబున మఱియు
సంగయదేవుండు సక్కసవచ్చి
నొసలికన్నడుగఁ బ్రహసితాస్యుఁడగుచు
బసవయ్య శివుముఖపంకజంబునకు
ముకురంబు గన్గొల్పి ముక్కన్నుసూపి
సకలేశ యదె చూడు సహజంబ యనుడు
ముక్కన్ను వొడగాంచి యక్కజం బలర
ముక్కంటి దనతొంటి మూర్తియతాల్చె
గొల్లెత [3]వెండియుఁ గుడుబెకాళవ్వ
నల్లియమ్ముచు రొంపిఁ జనిచని జాఱి
పడి వడి దవ్వుల బసువహో యనుడుఁ
బడకుండ నిటయుండి పట్టె నాకడవ
బిజ్జలుఁ డద్భుతోపేతాత్ముఁడగుచుఁ

---

[1] కట్లయొసంగ. [2] లం. [3] మఱియును.

దజ్జనులును దాను దత్సతిం బిలిచి
యంతదూరమున నీ వవనికి వ్రాల
నింతదవ్వులనుండి యిత డెట్లు వచ్చె
నిది యేమి యాశ్చర్య మెఱిగింపు మనిన
నిది సోద్యమే రాజ! యీబసవయ్య
యెక్కడ నెక్కడ నిల నీశు డుండు
నెక్కడ నెక్కడ [1]నిల భక్తు డుండు
నక్కడక్కడ దత్సభాంతరంబులను
దక్కక బసవయ్య దానమై యుండు
నెట్టణ దొల్లియు నీప్రసంగంబు
వుట్టుడు భక్తులు వుచ్చు నక్షణము
శివలోకమున కేగి సిద్ధ[2]రాముండు
భవుమ్రోల బసవన్న బరికి[3]ంచు డెఱిగి
యెసగ నీశుడు దన హృదయంబు దెఱచి
బసవన్న జూపుచు బార్వతి యదుర
వినుతింప బసవన్న, 'వెండియు గలరె
మనుజలోకములోన మనభక్తు' లనిన
'భక్తుండ నేన; మీ భక్తులందఱును
భక్తాత్మ! మీస్వరూపము కాన' యనుచు

---

౧. నెట. ౨. రామయ్య. ౩. ంపు.

బసవన్న శివుఁడును భాషించుటయును
బసవమాహాత్మ్యంబుఁ బర్వతాత్మజకుఁ
దతి 'యస్యవక్త్రే స్థితం దేవి' యనఁగ
రతి 'బసవే త్యక్షరత్రయ' మ్మనుచుఁ
దనర 'వసామి తత్ర సతతం సత్య'
మనుచును 'సత్యం న చాన్యథా' యనుచుఁ
జెప్పుటయును విడి సిద్ధరామయ్య
యొప్పఁజెప్పఁగ వింటి నుర్వీశ[1] యనుచుఁ
బొనరుచుఁ [2]గాళవ్వ [3]బోయత వోవ
వినుతిసేయుచు బసవనదండనాథు
ఖ్యాతమహత్త్వంబు గారవించుచును
బ్రీతిమై మ్రొక్కుచు బిజ్జలుఁ డుండె;
మఱియొక్క మిండయ్య మాయిదేవమ్మ
యఱిముఱిఁ దన చెవియాకీక పెనఁగఁ
జెక్కిళి [4]ప్రేయంగఁ జెలువ వాపోవ
నక్కటా! నోర్చరా యయ్య! చేయనుచుఁ
గరపద్మ మొత్తుచు గారవింపుచును
శరణార్థి [5]సేసి తజ్జంగమంబునకు

౧. యేన. ౨. గాళక్క. 3. బోయిని; వోయెనో; బోవ అపుడు. ౪. ప్రేయుడు. ౫. యనుచు.

బసవన్న యప్పుడ భార్యకర్ణంబు
పసిఁడియా కిప్పించె భార్యను గినిసి
మఱియు దుష్కులుఁడని [1]యొఱిమిడి విప్రు
లిఱితోడ శివనాగమయ్య నిందింప
శివనాగమయ్యకుఁ జేయిచ్చుకొనుచుఁ
దవిలి బిజ్జలు సభాస్థలికిఁ [3]దోడ్తెచ్చి
యతులప్రసాదదివ్యామృత దేహు
నితని దుష్కులజుగా నెన్నంగఁదగునె?
యట్టునుగా కుత్తమాధమనదులు
పట్టంబు దోఁచునే వారాశిఁ గలయ?
[4] [యసమభేరుండ వాయసతనుచ్ఛాయ
లెసగంగ నున్నవే హేమాద్రి [5]సోకఁ]
దలఁప నయస్కాంత తారాంతరములు
గలుగునే పరుసంబుఁ గదిసిన పిదప?
నగణితశైల రత్నాది లింగములు
నొగిఁ బ్రతిష్ఠితమైన నొండనఁ జనునె?
నిజగురుశ్రీహస్త నీరజోద్భూత
[6]ద్విజుఁడు సండాలుఁ డంత్యజుఁ డనఁ దగునె?

---

౧. యొఱపిడి. ౨. దఱి. ౩. నేతెంచి. ౪. ఈపాదములకు సంస్కృతానువాదము లేదు. ౫. గలయ. ౬. ద్విజుఁడును శూద్రుఁడం.

మలయుతులార! నిర్మలదేహుఁడైన
మలహరు సద్భక్త మదకరి సరియె ?
భవదుఃఖులార! నిర్భవదుఃఖుఁ డైన
భవదుఃఖహారభక్త పంచాస్య సరియె?
మృత దేహులార! యమృత దేహుఁడైన
మృతిదూరు సద్భక్త మేరువు సరియె?
దుర్మదసప్తధాతుమయాంగులార !
కర్మభూసురులార! ¹ఘర్షించి చూడ
జగతిలో సిద్ధప్రసాదామృతాంగుఁ
డగు శివనాగమయ్యకు మీరు సరియె ?
యట్టాట కిది ప్రత్యయము సూడుఁ డనుచు
ధట్టుండు బసవనదండనాయకుఁడు
శివనాగమయగారి శ్రీహస్తమొత్తి
తవిలి దివ్యామృత ధారలు వఱపె
బసవన్నకును శివభక్తియన్ సురభి
వెస నివ్వటిలఁ జన్నవిసికారునట్టు
లంత నయ్యమృత ధారావలి సూచి
యెంతయు నద్భుతాక్రాంతులై సర్వ
జనులును ద్విజులు బిజ్జలుఁడు మ్రొక్కుచును

---

౧. గర్వించి. ౨. కాఱు.

వినుతింప బసవన్న వెలసె లోకముల;
వెండియు మఱియొక్క మిండజంగమము
దండియై బసవన్నతరుణి గంగాంబ
గట్టిన [౧]పహాంబట్టు పుట్టంబు వేఁడ
నట్టున్నభంగి సభాభ్యంతరమునఁ
జలియింప కింతి వస్త్రముఁ దానపట్టి
గొలువంగ నొలువంగ నొక్క వస్త్రంబు
భార్యకటిస్థలిఁ బాయక యుండె
నార్యుండు బసవన్న హస్తసంగతిని
నంగనయభిమాన మంతరింపమికి
జంగము లలరఁ దజ్జంగమం బంత
మోవనోపిన [౨]వస్త్రములు మోపుగట్టి
లావునఁ గొనిపోయి లంజియ కిచ్చె;
వెండియు బోయలు విభ్రాంతి నొంది
తండములై ప్రసాదమునకుఁ బెనఁగ
నవుఁగాక తప్పేమి శివప్రసాదంబుఁ
దవిలి భోగింపంగఁ దలఁచెద రేనిఁ
[3]గొండురు మూరంచు దండనాయకుఁడు
చండోరు[౪]గోగ్ర విషంబులుఁ గూర్చి
యుగ్రుండుఁ దనుదాల్ప [౫]నోపండ యనుచు
నుగ్రాంబకునిమీఁద [౬]నోటంబు వెట్టి

౧. పటవలి. ౨. యంతమోపు వస్త్రములు. 3. కొండుదు; కొండొరు. ౪. గాది. ౫. నోపఁడా. ౬. నోటమి; నోలము; నోలమి.

యురగరాడ్గ్రైవేయకోద్యద్గళంబు
గరళంబు వచ్చెనో[1] కాక యన్నట్టు
లసమాక్షు నిటలనేత్రాగ్ని బోయలను
వసుధ నాహుతిగొన వచ్చినయట్లు
వాపి నిషాదుల [2]బాడబవహ్ని
యాపోశనము [3]గొందునని వచ్చె ననఁగ
భుగులుభుగుల్లన [4]బొగిలి [5]క్రొం బొగల
నెగసి విషార్చులు గగనంబుఁ [6]గప్పెఁ
బరికింపఁగాఁ బట్టపగలింటిసూర్యు
కరణిఁ దప్పక చూడఁగారాని విషము
ఉరుతరకాల మహోర[7]గాననము
కరణి [8]నెట్టును [9]దొల్గఁగారాని విషము
వీఁకమైనంత నవ్విషసౌరభంబు
దాఁక నిషాదులందఱు నష్టచావ
భావించి నూరినఁ బ్రేవులు దెగియెఁ
ద్రావంగవచ్చునే [10]బ్రదుకంగ ననుచు
జను లద్భుతాత్ములై సంస్తుతుల్ సేయ
ననఘుండు దండనాయకుఁడు నవ్వుచును

౧. వచ్చెనో యనగ. ౨. బడబానలాగ్ని. ౩. గొనననట. ౪. బొంగి. ౫. కెం. ౬. నిండె. ౭. గానల. ౮. నేరికి. ౯. దొడ్డ. ౧౦. తాఁబ్రతుకనుచు.

లింగార్పణం బవలీలఁ గావించి
యంగద భోగించె నా ప్రసాదంబు;
వెండియు నొకనాఁడు దండనాయకుఁడు
నిండారు సద్భక్తి నియతి దుల్కాడ
జంగమపూజావసానంబునందు
లింగార్చన క్రియా లీలానుషక్తి
స్ఫురియింప శివుఁ జూచి చూచి క్రాలుచును
హారసుఖామృతమాని యాని క్రోలుచును
శివు[1]స్పర్శనము సేసి చేసి వ్రాలుచును
నవిరళోత్సవ మంది యంది సోలుచును
దనుగుణంబులు దక్కి తక్కి[2]పాడుచును
ననురాగమున నెన్ని యెన్ని [3]యెన్నుచును
గణనాథులను గాంచి కాంచి మ్రొక్కుచును
బ్రణతులారఁగఁ బాడి పాడి[4]చొక్కుచును
లీలాంబునిధిఁ దేలి తేలి యాడుచును
శూలిలోనన చొచ్చి చొచ్చి కూడుచును
లింగంబునం దిట్లు లీనమై విషయ
సంగతంబగు మన శ్చరితం బణఁగ
హరునంద సన్మతి యణఁగుటఁ జేసి
సరిఁ జేతులాడక సత్క్రియ లుడుఁగ

౧. దర్శనము; (బర్సనము. ౨. పాయు; చూచు. ౩. యెన్ను. ౪. మాడు.

గద్గదకంఠసంగతిఁ జేసి చెలఁగు
సద్గుణస్తుతిఁ జేయు శబ్దం బడంగ
సన్నుతానందబాష్పంబు[1]లఁ జేసి
కన్నారఁజూచు వీక్షణములు [2]మునుఁగఁ
జిక్కంబుచేర్లు దీసినమాడ్కి మనసు
గ్రక్కునఁ [3]దవిలిన కరణేంద్రియములు
రవి[4]తోడఁ గిరణముల్ భువి నస్తమించు
పవిది లింగంబులోపల నస్తమింప
వెలిసూచుదృష్టు[5]లో వీక్షించుమనసు
నలవడ లింగంబు నంద చిక్కుడును
దన్నును జగమును దలఁపును దృష్టి
సన్నుతాంతర్బహిశ్చరితంబు మఱచి
కలితాష్టదళపద్మ కర్ణికామధ్య
విలసనుండగు ప్రాణవిభునంద యడఁగి
ప్రవితతయోగానుభవభవ్యసుఖము
నివుడంగ శివయోగనిద్ర వొందుడును
బసవన్నయున్న సద్భావంబు సూచి
యసలార నా చెన్నబసవన్న మ్రొక్కి
ముద్రితశివయోగ నిద్రాతిశయ స
ముద్రుండు మద్గురుమూర్తియ కాక

---

౧. బుసెలగ. ౨. నలఁగ. ౩. గవలిన; దగిలిన. ౪. లోడి (న) కి. ౫. జన్.

నిద్ర [1]వోవంగ జడ నిద్రావశులకు
నిద్ర [2]వోయిన యోగనిద్ర సొప్పడునె?
యురుశివయోగ నిద్రోత్పత్తివేళ
గురుమూర్తి యునికిం దా [3]గుర్తుగాం జూడం
గడ లుడిగిన యట్టి [4]జడనిధి పగిది
వడి సలనములేని వాయువు భాతి
నరయంగ నిశ్శేషు మైయున్న నభము
కరణి నింద్రియముల గజిబిజిం బాసి
సన్నుతానంద సంసక్త భావమున
మిన్నక శివలీల నున్నాండొ మఱియుం
బొనరం గరస్థలం బొత్తునో శివుస
కనుచు హృత్పద్మాసనాసీనుం జేసి
పలుమఱు శీతోష్ణ సలిలాభిషేక
ములం గందునో లింగమూర్తిమే ననుచు
బొనరు చిదభ్రవిస్ఫురిత సుధాంశు
జనిత పంచామృత [5]స్నపనుం గావించి
పుడమిం బుట్టినచెట్ల పుష్పముల్ ప్రాన్పం
దొడరి కాఠిన్యంబు దోంచునో యనుచుం
బుడమి నింకెన్నడుం బుట్టనిచెట్ల

---

౧. వోయెడి. ౨. గాకను. ౩. గుర్వాను; నఖుతుగా. ౪. కంధియుబోలె ౫. స్నాతు.

నడరు సహస్రదళాబ్జంబు వ్రాన్చి
ఘనధూపధూమసంగతిఁ బ్రాణనాథు
తనువు విచ్ఛాయ వొందునో యని తలఁచి
సంగతి విమల విజ్ఞానాగ్నిలో ద
శాంగం బిడక ధూప మర్పణ సేసి
యనుపమ నీరాజనాంచితజ్యోతు
లొనర వేఁడిమిసూపు నో పతికనుచు
విలసితాఖండిత [1]విస్ఫారమహిమ
నలరు నాత్మజ్యోతి నలి నివాళించి
క్షారాన్న ముఖ్యోపహారము ల్గాడఁ
గ్రూరముల్ దోఁచునొ-కో శూలి కనుచుఁ
బాదలి మెఱ్యేడఁ బాలివోవని ప్రాణ
పదమను నోగిరం బాదవ నర్పించి
యుపమింపఁ దక్కిన యుపచారవితతి
యుపచారములకాక యొడయని కనుచుఁ
బొనర నిజాంతర పూజానురక్తి
మనికుఁడై తనుదాన మఱచి యున్నాఁడో
యసలార శమితేంద్రియ ప్రవర్తనము
నసదృశంబై యొప్ప యమములుఁ గాఁగ

---

౧. విస్తార. ౨. రుద్రుని.

నేదెస శివుఁగాని యెఱుఁగని నియమ
మాదట నియమగుణావలి గాఁగ
నిల యోగనిద్రావశేచ్ఛాసనంబు
నలర సుఖాసనం బై నివ్వటిల్లఁ
దనరు మందశ్వాస తతియ స-గర్భ
మనెడు ప్రాణాయామమై పూరితముగ
విలసితాంతర్ముఖ విషయచరిత్ర
మలరఁ బ్రత్యాహారమై సంచితముగ
వరలింగజంగమ స్వప్నవీక్షణమ
స్థిరతరంబైన మూర్తిధ్యానముగను
సారాంగలింగప్రసన్నసద్భావ
సారూప్యలింగంబు ధారణంబుగను
నిశ్చయశివయోగనిద్రాసమాధి
యాశ్చర్యసుఖకరం బగు సమాధిగను
నొనరి యిట్లష్టాంగయోగసద్భక్తిఁ
దనుదానమఱచిన తఱియొకో మఱియుఁ
దలఁచుఁ దానును దన తలఁపును నాత్మఁ
దలఁపంగఁ దోఁచు నత్తలఁపునం దడఁగుఁ
జూచుఁ దానును దనచూపును దెలిసి

---

౧. సీనమై. ౨. దర్భ.

చూచుచో ¹గాన్పించు శుభగునం దడఁగుఁ
బలుకుఁ దానును దన పలుకును ముట్టఁ
బలుకుచో దీపించు ప్రభునంద యడఁగు
వలచుఁ దానును దనవలపును దగిలి
వలచుచో సుఖమిచ్చు వరునంద యడఁగుఁ
దివురుచనున్న జ్ఞాతృజ్ఞానయుగము
నవిరళంబై జ్ఞేయునంద యడంగు
నెఱుఁగుఁ దానును దన యెఱుకయు మఱచి
యఱలేక శివమగ్నుఁడై యున్నవాఁడొ
తన దృష్టు ²లినాఁటి నొచ్చునో లింగమూర్తి
కనుచు భావము సూపులన చూచు విధమొ
కరముల ముట్టినఁ గందునో యనుచు
హారు మనస్పర్శనం బాచరించుటయొ
పులకలు దాఁకనోపునొ ³శూలి కంచు
నలి నాత్మ నాలింగనము సేయు విధమొ
వినుతింప నొత్తునో పెనుమాత్ర లనుచుఁ
దనవిభుఁ దలఁచు విధంబొ వెండియును
భ్రమరకీటన్యాయ భావన నొక్క
రమణి వాయక తన రమణుని నాత్మఁ

---

౧. సాఖను. ౨. దాటి. ౩. శివు.

దలపోయఁ దలపోయఁ దాఁ బురుషత్వ
మలరుట రతికేళి కంతరాయంబు
గలుగునో యని [1]పతిఁ దలఁప నోడుచును
దలఁచుచు నోడుచుఁ దన్వంగి యుండెఁ
దలఁపంగ మఱవ స్వాతంత్ర్యత లేమిఁ
జెలువల వలపులు సెప్పంగ [2]నెద్ది?
వలపారఁ దన మనోవల్లభు శివునిఁ
దలఁపంగఁ దలఁపంగఁ దద్రూపమగుచు
స్వామి భృత్యజ్ఞాన [3]సత్త్వంబు దప్ప
నో మీఁద ననుచుఁ దన్నును నత్తలంపు
మఱచి లింగమునంద మగ్నఁడై యున్న
తెఱఁగు దానిదియొక్క మఱి యట్లుఁ గాక
ననిచినఁ దనప్రాణనాథుఁ డొడ్డేర
వనజాక్షి యొక్క[4]తె మనసుఁ [5]బంపుదును
జని మనోహరునితోడను రమియింపఁ
దను గిలుఁబాడెఁ గదా మనం బనుచు
నెనయ నపుంసకం బిల మనశ్శబ్ద
మనిన పాణినిసూత్ర మాలిసేయుచును

1. మది. 2. నెట్టి; బడుట. 3. సౌఖ్యంబు. 4. తి. 5. వుచ్చుడును.

వనిత [1]గోపించుడు వచ్చె నమ్మనసు
వనితలు ముగ్ధలు వలపు లిట్టివియ
పనుగొన గురుమూర్తిపతికూటమునకు
మనసు నపుంసకం బన నెట్లువచ్చుఁ
బున్న పుంసక[2]గుణంబులు గల్గు నేని
యెన్నంగ నతికామియే, యట్లుఁగాక
మగలకు మగఁడగు మత్పతిఁ గవయ
మగవాండ్రు నాండ్రుగా మరుగుదు రనిన
మనసు గూడుట సోద్యమా పతి ననుట
మనసున కటమున్న తనవిభుఁ[3]గదిసి
మనికుఁడై తనుదాన మఱచియున్నట్టి
యనువు దానిదియకో యట్లునుగాక
సొగయంగ నొక్కటఁ జూచుట, రెంట
వగ, మూఁట నూర్పులు, నిగుడ నాల్గింటఁ
దాప, మైదింటను[4]డయ్యు, డాఱింట
నేపారఁ గుడువమి, యేడింట మరులు
నొక్కండుఁ బలుకమి యెఁగి నెన్మిదింట,
నిక్కి మూర్పులు లేమి నెఱఁ దొమ్మిదింటఁ
జావు వదింటఁ, గ్రచ్చఱ విరహులకు

---

౧. గోపించిన. ౨. గుణములక. 3. దగిలి. ౪. చక్కి.

భావింప నివియ దశావస్థ లండ్రు;
దా విభుఁ బాయక చావక చచ్చు,
నీవిషయావస్థ లితరుల కగునె?
వివిధజీవన్ముక్తి విషయైకహేతు
భవభక్తిలలనాపరవశభావమున
నస్తోకనిరుపాధికావస్థ శివసు
శాస్తమితేంద్రియుఁడై యట్ల చూపు,
వగపు, నిట్టూరుపు, జ్వరము, డయ్యుటయు
నొగి నిరాహారంబు నున్మత్తవృత్తి
మౌన, మూర్ఛలు లేమి, మరణం బనంగఁ
దానెన్నఁబడు నవస్థలుగూడఁ బదియు
మున్న మఱచి యవిచ్ఛిన్న నిష్పన్న
సన్నుతశివయోగసంచితావస్థఁ
దానును బొలతి యన్ దరిలేక యదియ
తానయైయున్న చందంబకో మఱియు
నలవడ భక్తదేహైకదేహునకు
నలరు దేహంబు దేహముగ నర్పించి
తగిలి భక్తానుబంధప్రాణునకును
దగిలి ప్రాణముఁ బ్రాణముగ నివేదించి
ప్రణుతింప శరణకరణునకుఁ గరణ

గణములు గరణముల్ గా నియోగించి
యిల భక్తగణవిషయేంద్రియేంద్రియ న
కల విషయేంద్రియావలులు సంధించి
¹బండు లొండొండ తాఁ బాయఁ బెట్టుడును
బండి లేకుండిన పగిది²యుం బోలె
గుణము లొండొం డీశుఁగూడ నర్పించి
ప్రణుతింపఁ దానను భావంబు లేక
పొనరెడు నొండొంత పొర లొల్చి³వైవ
ననఁటి దా లేకుండునట్టి చందమునఁ
గ్రియగొనఁ బఙ్గుణేంద్రియ మనః ప్రాణ
చయము⁴లట్ల పొరలొల్చి శంభునిగూర్చి
యవిచలితానంద శివయోగనిద్రఁ
దవిలి యున్నట్టి చందంబకో మఱియు
మన మీశ్వరునకు సమర్పణ సేసి
తనువు ⁵ప్రసాదార్పితం బాచరించి
ప్రాణంబు జంగమార్పణము గావించి
ప్రాణమనఃకాయపద్ధతుల్ మఱచి
లింగంబునంద విలీనుఁడై యున్న

---

౧. బండి యొండ్రొండ; బండియోడొండుండు; బండియం దొండొండు. ౨. యపోలె. ౩. వేయ. ౪. లపొర. ౫. ప్రసిద్ధా.

భంగి దానిదియకో బసవనలింగ
మని పెక్కుభంగుల నగ్గురులింగ
మును జెన్నబసవన్న మున్ను గీర్తింప
నంత[1]లోనన దర్శనాసక్తి భక్తి
కాంతుఁడపూర్వజంగమ మేఁగుదెంచి
నినుపార శివయోగ నిద్రాతిశయతఁ
బనుగొనియున్న యాబసవన విధము
ద్వారపాలకులచేతను విని యపుడు
మారారి భక్తుండు మగుడి పోవుడును
బసవన్న జంగమప్రాణి గావునను
బసవన్నప్రాణ మా భక్తిలింగంబు
తోడన పోవ సద్భృతచిత్తులగుచుఁ
గూడఁ దత్పరిచారకులు సందడింప
[2]సహజైకలింగనిష్ఠా పరతంత్ర
మహిముండు సకలేశు మాదిరాజయ్య
మదనమదోద్రేకమర్దనభక్తి
మదకరి మడివాలు మాచిదేవయ్య
భవనిరాసన కళా భరిత లింగాను
భవసుఖి [3]గిన్నర బ్రహ్మదేవయ్య

---

౧. లోపల. ౨. సహజలింగైక. 3. కిన్నెర.

వివిధ విశ్రుత భక్తి విఖ్యాతకీర్తిఁ
దివురు మహాత్ముండు దెనుఁగు జొమ్మయ్య
పరవాదిదుర్జన భంజన భక్తి
పరుఁడు సొడ్డలదేవు బాచిరాజయ్య
నిగ్రహానుగ్రహాన్వితభక్తి బలస
మగ్రుండు మాళిగ [1]మారయ్యగారు
స్ఫీతప్రతాపుఁడు, విగతకోపుఁడు, వి
ధూతపాపుఁడు, గల [2]కేత బ్రహ్మయ్య,
ధిక్కృత పరవాది, ముక్కంటి భక్త
దిక్కరి, ద్రోహారి కక్కయ్యగారు
ధైర్యాధికుఁడు జగద్వర్యుఁ డవార్య
[3]చర్యుఁ డార్యుఁడు [4]సుర్య చౌండయ్యగారు
దండితపాషండ పండితవాది
ఖండితాఘుండు ముసుండి చౌండయ్య
శాంతుఁ డేకాంతనితాంతసద్భక్త
కాంతుండు దాంతుఁ డేకాంతరామయ్య
మంగళభక్తిక్రియాంగభావాంగ
సాంగచర్యుం డుత్తమాంగద కేశి

---

౧. మారదేవయ్య. ౨. ఘాత. ౩. శౌర్య. ౪. సుర్గి.

వృథుభక్తగణమనోరథసుఖ[1]ప్రదుఁడు
ప్రథితుండు గన్నడ బ్రహ్మదేవయ్య
యడరెడుభక్తిమై నడిఁ దనశిరము
గుడియుగాఁ జను కొండగుడి కేశిరాజు
నవిరళ భక్తిరసామృతాంగుండు
[2]ధ్రువదయాపాంగుండు శివనాగమయ్య
పరిచితభవముక్త [3]వరగుణయుక్త
గురుభక్త పదసక్త [4]గుడుబె కాళవ్వ
యిట్టట్టుగా లెక్క కెన్నిక మిగులఁ
గట్టుగ్రలీలఁ జన్ హిట్టు గొగ్గవ్వ
యిటుగూడఁ గల్యాణ కటకంబునందు
నటుభక్తి[5]సామ్రాజ్య పట్టవర్ధనులు
నెన్నంగ లక్షయు నెనుబదివేలు
నన్నుగాఁ జరియించి భక్తిలింగములు
నటుభక్తి శివరాత్రి [6]భద్రదేవండు
ఘటికావసరములఁ గాలకంఠుండు
నలరుఁ బసిఁడియారతుల వీరభద్రుఁ
డిలఁ బట్టునూలివత్తుల త్రిపురారి

---

౧. దుండు. ౨. శివపదధ్యానియా. ౩. పరభావ. ౪. గురుబె; గుడుజ. ౫. సాంబ్రాజ్య. ౬. బత్తిదేవుండు; భద్రిదేవండు.

లీలఁ గస్వరపునివాళి సంగయ్య
మోలిఁ గస్తురి[1]ప్రేఁక యుద్భటయ్యయును
వరలు ముత్తెపురంగవల్లి [2]మాయణ్ణ
దొరలు వ్రతస్థులు దొమ్మిదివేలు
నిల నిచ్చపంట [3]సోద్దేవుఁ డాదిగను
[4]ఛలవాదిశీలవంతులు వదివేలు
గన్నులు రెండు ద్రికాలంబులందుఁ
బన్నగా శివుఁ[5]గూర్చి పడయు [6]విధమున
నలరుఁ గంగళవిరూపాక్షు [7]దేవండు
నిల నట్ల నాలుక నీశ్వరుఁ బూన్చి
యసలారఁ గొత్తజిహ్వాను శివుఁ బొగడు
హాసనాలిగెయ శివయోగి [7]దేవండు
నెప్పుడుఁ బ్రేవుల నిండెలుగట్టి
తప్పక మూఁడుసంధ్యల శివుఁ బూన్ప
విరచించుచును జనుల్ వినుతించుచుండఁ
బరగిన ప్రేవుల ప్రబ్బతయ్యయును
నొగి మూఁడుదినముల కొక్కొక్కమాఱు
దగిలి యీశ్వరుఁ దన తల[8]దర్గిపూన్చి

౧. ప్రోఁక. ౨. మాస(వ)ణ్ణ. ౩. మా. ౪. చలపాది. ౫. బూన్చి. ౬. వ్రత. ౭. దేవుండు ౮. ద్రెవ్వి.

శిరములు వడయు విచిత్రసద్భక్తి
భరితుండు గోవిందభట్టారకుండు
వీరాదిగా నతివీరతఁ బరగు
వీరగణము లేడువేలు[1] నేణ్ణాఱు
స్నిగ్ధభావనుఁడు సంసిద్ధ చిద్వహ్ని
దగ్ధదుర్విషయుండు ముగ్ధసంగయ్య
ఝూమున కొక్కొక్క జాతి పుష్పములు
ఝూమున కొక్కొక్క జాతి పూఁతయును
ఝూమున కొక్కొక్క చందంపుఁ దొడవు
ఝూమున కొక్కొక్క భామకూటంబు
నేమంబుగా నిట్లు [3]నిచ్చలు నడచు
నష్ట ప్రహారము సోమాంకుఁ డాదిగ న
భీష్టోపభోగంబు లెలమిఁ బొందుచును
నెఱ [4]నేకలింగైక్య నిష్ఠ పెక్కువను
మెఱయుఁ బండ్రెండువేల్ మిండ జంగములు
వెండియు వ్రతవీర వితరణభక్తి
మండిత నిష్ఠాసమగ్రతవలనఁ
గటకంబులో నెన్నఁగల మహాభక్తు
లటుగూడ నేతెంచి హరసుఖానంద

1. నేమ్నా(భ్నా). 2. చాయ. 3. నడచి (వ; పు). 4. సిన.

సంగతి సంధ్యావసరసమయమున
లింగార్చనావేళ లీలఁగొల్వుండి
బసవన్నయున్న సద్భావంబు సూచి
యసమాక్షు భక్తు లత్యాశ్చర్య మంది
యేమిగార్యంబొ యిదేమి నెపంబొ
యేమి ప్రస్తుతమొ యిం కెఱుఁగంగవలయుఁ
బిలువుండు పరిచారకుల ద్వారపాల
కుల నిజాప్తుల నియోగులఁ [1] గరణముల
నరయుండు నేఁటి లింగార్చనోచితము
నరయుండు నేఁటి [2]గీతావసరములు
సరసర గీత బండరు కవిలియలు
నరయుఁడు శోధింపుఁ డవ్వచనములు
నెట్టణ బాసలుఁ నేఁడేమి వల్కెఁ?
బట్టిన వ్రతముల పగిది నేఁడేమి?
యెవ్వరు వచ్చిరి [3]యిట మున్న భక్తు?
లెవ్వరు వోయిరి యెవ్వరున్నారు?
యెఱుఁగుదు రేఁ గార్య మెఱుఁగింపుఁ [4]డనినఁ
బఱతెంచి యాచెన్నబసవన్న మ్రొక్కి

---

౧. గరణాల. ౨. లింగా. ౩. యిటకు మున్భక్తు. ౪. డనుడు.

[1]యవసర వేళ లింగానంద మలర
శివయోగనిద్రమైఁ జిక్కి మద్గురుఁడు
నుండంగ జంగముం బుద్వృత్తి వచ్చి
నిండారు శివయోగ నిద్రమై నునికి
ద్వారపాలకులచేతన్న విని యప్డు
సారించి నిలువక చయ్యనవారు
మగుడి యంతఁ జనిరి మఱి వారిఁ గాన
మొగి నెపం బిదియ కానోపు నెట్లనిన
నక్కుజం బక్కుజం బన [2]భాసగీత
మొక్కఁడానతియిచ్చె నొక్కింతమున్న
తలఁచిన నవియు డెందంబు దద్భాష
వలికిన నాలుక వగులుఁ దద్భాష
యియ్యాభాషమైఁ జరియించెద మనఁగ
[3]నేభంగి నలవడు నే యితరులకు
[4]మానుగ భాషయు మహిమయు నెఱుఁగ
నానేర్చుభంగి విన్నపము సేసెదను
భక్తులకెల్లను బ్రాణలింగంబు
వ్యక్తసద్గురు దయాయత్త లింగంబు

౧. యవధరింపుండు. ౨. యిబ్భంగి నిటుమైచరిం. ౩. నెబ్భంగి. ౪. మానను.

ప్రాణలింగమున కేర్పడఁగఁ దద్గురువు
ప్రాణంబు దద్గురు ప్రతి[1]లింగమైన
జంగమలింగంబు [2]సరి మాకుఁ బ్రాణ
లింగ మిట్లాట కీసంగయ్య సాక్షి
సత్య మిట్టిదియ నిజవ్రతం బనుచు
నిత్యజంగమభక్తి నిష్ఠ పెక్కువను
ధట్టుండు బాసగీతం బానతిచ్చె
నెట్టిచో విందుమే యిట్టిసద్భాష
దలఁపంగవచ్చునే తలఁచి రేనియును
బలుకంగవచ్చునే పలికి రేనియును
నడువంగవచ్చునే ననుబోఁటిభక్తి
గడుసరులకు మత్తి [3]కాండ్రకు నెట్లుఁ
దలఁపంగ నేరుచుఁ దలఁచినయట్ల
పలుకంగ నేరుచుఁ, బలికినయట్ల
చరియింపనేరుచు జంగమప్రాణ
పరిభాష మెఱసి మీబంటఁ గావునను
బాసలు వలుకంగ బాసలు నడవ
బాసల[4]బల్లఁడు బసవయ్యగాక
బసవన్నవ్రాసిన బాస లన్నియును

౧. నిధియైన. ౨. సతి (ఖ). ౩. గా. ౪. బల్లాఁడు; బల్లాణ (ఛ).

నెసగ మీకవిలియ నెక్కించుకొనఁగఁ
బార మీఁదింప మీపాలు గావునను
భారంబు గల్గునే బసవేశ్వరునకు?
[1]నది జంగమము వచ్చి యడిగినవిధము
[2]నిది జంగమము ప్రాణపద మనుబాస
మెఱసి పల్కుట గాదు మీ సమక్షమున
వెఱవకయున్నట్ల విన్నవించితిని
అనుచు సాష్టాంగుఁడై యాచెన్న బసవఁ
డనురక్తి ముకుళితహస్తుఁడై నిలువఁ
బరమానురాగ సంభరితాత్ములగుచుఁ
బరమమాహేశ్వరపట్టవర్ధనులు
[2]పణిహారులను బిల్వఁబంప నక్షణమ
[3]కణఁకతోఁ గల్యాణకటకంబునందు
వాటికెక్కిన భక్తభవనంబులందు
మాటకూటములందు [4]మహామనె లందు
నరసి యాజంగమం బడుగుల కెఱఁగి
సరసరఁ దోడ్తెండు చనుఁడు మీరనుడు
శివభక్తరాజికి భువిఁ జాగి మ్రొక్కి
యవుఁగాక యనుచు[5]నంతంత నారయుచు

---

౧. యాదిజంగము. ౨. పడి. 3. కడ. ౪. మహి. ౫. వారంత.

నేడ్తెర దళుకొత్త నేఁగి జంగమముఁ
దోడ్తేరఁ బ్రాణంబు దోడ్తోనపోదలె
బసవన్న జంగమప్రాణి గావునను

కిన్నర బ్రహ్మన్న కథ

బసవన్న ప్రాణంబు ప్రబలి యేతెంచి
భాతిగాఁ గిన్నెర బ్రహ్మయ్య ప్రాణ
మేతేరఁ దనప్రాణ మేతెంచినట్లు
నదియుఁ దానెట్లన్న నాకిన్నెరన్న
వడపడి బసవన్న ప్రాణమైయున్న
తెఱఁ గెఱుంగెద నని దేవదేవుండు
మఱి యంత బసవన్న మనసులోఁ దరయఁ
బూఁచి కిన్నరుప్రాణములు దనలోన
డాఁచుడు నత్యుత్కటప్రేమఁ జేసి
[1]బసవన్న గిన్నర [2]బ్రహ్మన్నఁ జూచి
యసమశోకాక్రాంతుఁ డగుచు 'నాయయ్య!
నాయయ్య! నాతండ్రి! నా కులస్వామి!
నాయిష్టబంధుఁడ! నాచెలికాఁడ!
మన్మనోరమణీయ! మన్మనోరమణ!
మన్ముఖముకురంబ! మాసితే నేఁడు,

౧. బసవయ్య. ౨. బ్రహ్మయ్య.

ఆస్థానదీపంబ! [1]యడఁగితే నేఁడు,
సుస్థిరగుణరత్న! [2]సురిగితే నేఁడు,
నరలోకమెల్ల శూన్యంబయ్యె నేఁడు,
పరమాత్మతత్త్వంబు బయలయ్యె నేఁడు,
నామనోరథము భిన్నంబయ్యె నేఁడు,
నామనోవల్లి [3]భిన్నంబయ్యె నేఁడు,
నాభక్తియుక్తి సన్నంబయ్యె నేఁడు,
నాభూరిశక్తి [4]భిన్నంబయ్యె నేఁడు,
నాయిలువేల్పు! కిన్నరబ్రహ్మదేవ!
నాయాత్మతత్త్వ! కిన్నరబ్రహ్మదేవ!
నా[5]గుణాధార! కిన్నరబ్రహ్మదేవ!
నా[6]గుణాధ్యక్ష! కిన్నరబ్రహ్మదేవ!
నా మనోల్లాస! కిన్నరబ్రహ్మదేవ!
నా మనోవాస! కిన్నరబ్రహ్మదేవ!
నా[7]చిరకీర్తి! కిన్నరబ్రహ్మదేవ!
నా [8]చిరమూర్తి! కిన్నరబ్రహ్మదేవ!
నానిత్యకృత్య! కిన్నరబ్రహ్మదేవ!

---

౧. యాటితే. ౨. చూఱు(ర) బోయితివె. ౩. భిన్నంబయ్యె. ఛిన్నతవొందె. ౪. హీనత బొందె. ౫. సుశోభాస. ౬. గణా; ౭. సిత. ౮. సత్యకీర్తి.

నానిత్యసత్య! కిన్నరబ్రహ్మదేవ!
నాకళావేది! కిన్నరబ్రహ్మదేవ!
నాకులా[౧]పాది! కిన్నరబ్రహ్మదేవ!
నాకల్పవృక్ష! కిన్నరబ్రహ్మదేవ!
నాకులాధ్యక్ష! కిన్నరబ్రహ్మదేవ!
హా॰కిన్నరన్న! యహంకారదూర!
హా॰కిన్నరన్న! సదాచారవర్తి!
హా॰కిన్నరన్న! దూరీకృతక్లేశ!
హా॰కిన్నరన్న! పూరీకృతాత్మేశ!
హా॰కిన్నరన్న! నిరంతరసౌఖ్య!
హా॰కిన్నరన్న! మహాగణముఖ్య!
హా॰కిన్నరన్న! దయారమణీయ!
హా॰కిన్నరయ్య! శివానందశయ్య!
హా॰కిన్నరయ్య! నాయయ్య! నాజియ్య!
హా॰కిన్నరన్న! నాయన్న! నాచెన్న!
యని విలపించుచు నడలుచు శోక
వనధిఁ దేలుచు దుఃఖవహ్నిఁ గ్రాఁగుచును
బొగులుచుఁ బురపురఁ బొక్కుచు[౨]నంద
వెగచుచు వెడవెడ వెచ్చుచు బిట్టు

౧. ధార. ౨. దద్ద.

వసరుచు దుఃఖవివశచిత్తుఁ డగుచుఁ
[1]బనువుచు నిమ్మాడ్కి బసవన్నయున్న
యవసరంబునఁ[2]బడిహారి బాచయ్య
శివదేవు మదమత్తసింధురం బనఁగ
మడివాలుమాచయ్య మందిరంబునకు
వడి[3]నేఁగి కిన్నరువార్త విన్పింప
[4]'నాచోటి కొడయులు వచ్చిరే? బసవఁ
[5]డోచెల్ల యేమిసేయుచు నున్నవాఁడో!
ప్రస్తుతంబేమి యేర్పడఁ జెప్పు మనిన
మస్తకవిన్యస్తహస్తుఁడై యతఁడు
మాదిరాజయ్యగారాదిగాభక్తు
లాదట నోలగంబై యున్నవారు
బసవన్న గిన్నరప్రభుఁ గౌఁగిలించి
యసమశోకాక్రాంతుఁ డైయున్నవాఁడు'
నావుడుఁ గలకల నవ్వి, 'యేనేమి!
రావచ్చెనా భక్తరాజి యక్కడకు
బసవన్న గిన్నరప్రభుఁ గౌఁగిలించి
యసమశోకాక్రాంతుఁడై యున్నవాఁడె?
బాపురే! జంగమప్రాణవిలీన!

---

౧. బన. ౨. బణి. ౩. నేఁగు. ౪. నచ్చోటి. ౫. డొచ్చెల్ల.

బాపురే! జంగమ ప్రాణసంధాన!
బాపురే! జంగమ ప్రాణప్రయాణ!
బాపురే! జంగమ ప్రాణసంత్రాణ!
చాంగురే! జంగమ సమసుఖాయత్త!
చాంగురే! జంగమ సమదుఃఖచిత్త!
పట్టినబాసలు వట్టిపడంగ
[1]నెట్టకో ప్రాణంబు వట్టియున్నాఁడు
మఱిఁ బేర్చి యొక్కొక్కమఱి బసవనికి
నుతభక్తి[2]మదము గన్నుల కెక్కునొక్కొ!
పలుకు దుర్ఘటమైన బాస దద్భావ
వాలివోవకుండంగఁ బూరించు[3]నిపుడు
మఱచెనే మును జంగమప్రాణ మనిన
నెఱబాస యిదియేమి నిశ్చేష్టుఁ డగుట?
వసరుట[4]వందుట వగచుట లిట్లు
వనుగొన జంగమప్రాణుల గుణమె?
బాసలు గీసలు వదటిపాల్గాఁగఁ
జేసి యేమని కార్లు సేయుచున్నాఁడు?
బాపురే! జంగమప్రాణు లిబ్బంగి

---

౧. నెట్టిక. ౨. పథ; రస. ౩. నపుడు; నతఁడు. ౪. గు.

[1]వాపోవుదురె ముండమోపుల[2]పగిదిఁ ?
గటకటా ! మెచ్చునే [3]కల్లినాథుండు ?
నిటు విందుమే భక్తిహీనంపువార్త ?
కేవలభక్తుఁడే కిన్నరబ్రహ్మ
దేవుఁ డాతని దేవదేవుండుగూడి
కొనియెంబో, యతనికిఁ గూర్చువారలకుఁ
జనునె యేడ్వంగ సంసారుల పగిది
భాషదప్పటయు సద్భక్తిగాఁబూన్చి
భూషింపనేరము వొచ్చెంబులాడి
తో డేడ్వనేరము దురటిల్లి యట్ల
పాడంగనేరము వనుపుచు రిత్త
వనరంగనేరము వచ్చి మాచేయు
[4]పనియేమి ? దానికి బసవఁడ చాలుఁ
బొమ్మన్న [5]బడిహారి భోరన వచ్చి
యమ్మహాగణరాజి కంతంతమ్రొక్కి
కొంకుచు, వణఁకుచుఁ, గొసరుచు, మేను
శంకింప కరతలాబ్జంబులు [6]మొగిచి
మాచిదేవప్రభు మాటలన్నియును

1. వాపోదురే. 2. భంగి. 3. కలినాథుఁ డిపుడు. 4. పనులేమి. 5. ఫణి. 6. మోడ్చి.

సూచింప బసవన్న శోకం౧బడంగి
బిట్టులిక్కిపడి మదిఁ బిమ్మటఁ దెలిసి
నెట్టన తనబాన ౨నెఱయ నాటుటయుఁ
బ్రాణంబుఁ గిన్నరబ్రహ్మదేవయ్య
ప్రాణంబునంద సంబంధించె నంతఁ
బ్రాణబంధములగు బానలు దెలుపఁ
బ్రాణంబుతో నేల బసవయ్య యుండు
నొకటిఁ దలంప వేఱొకటి ఘటించె
నకట! యేమనవచ్చు నఱలేనిభక్తి
మర్మకర్మము లాడ మాచయ్య యెఱుఁగు
నర్మిలిఁ జను బసవయ్య యెఱుంగు
నటమీఁదిపనులు మహాదేవుఁ డెఱుఁగు
నిటువంటి వెయ్యేడ నెఱుఁగ మేమనుచు
గణకూట మెంతయుఁ గలకలం బెసగ
గణుతింప విన్నఁ జూడఁగాఁ జోద్య మనుచుఁ
బడిహారి వెండియుఁ బనుచుడు నేఁగి
మడివాలు మాచయ్యయడుగుల కెఱఁగి
బసవన్నవార్త యేర్పడ విన్నవింప
నసదృశానందాంతరంగుఁడై పొంగి

---

౧. బడంౘ. ౨. నెనరు; నెఱను.

బాపురే! జంగమ ప్రాణవిలీన!
బాపురే! జంగమ ప్రాణసంధాన!
బాపురే! జంగమ ప్రాణప్రయాణ!
బాపురే! జంగమ ప్రాణసంత్రాణ!
నల్లవో! జంగమానల్పసత్ ప్రాణ!
నల్లవో! జంగమానవరతప్రాణ!
చాంగురే! జంగమసంతతప్రాణ!
చాంగురే! జంగమ సహజసంత్రాణ!
మజ బాపు! [1]జంగమమంగళప్రాణ!
మజ బాపు! జంగమ [2]మార్గప్రయాణ!
చనుఁజను బసవన్న జంగమప్రాణ
యనఁజెల్లు ననఁజెల్లు నఖిలలోకముల
విన[3]నొప్పు విన[3]నొప్పు [4]విశ్రుతభక్తి
యనుపమం బనుపమం బంచు నతఁడు
కల్లినాథుని భద్రగజ మిది యనఁగఁ
గల్లినాథునిచేతి [5]కరవాలు మనఁగఁ
గల్లినాథుని రత్నకంఠిక యనఁగఁ
గల్లినాథుని వీరకటకం బనంగఁ

---

౧. రేజంగమతుర్కాలాచార్య. ౨. మహిమ సంత్రాణ. ౩. జెప్ప. ౪. విస్మయ. ౫. కాఁడితండనఁగ; కరవాలనంగ.

గల్లినాథుని వీర[1]కర్ణిక యనఁగఁ
గల్లినాథుని[2]యంకకాఁ డితఁ డనఁగఁ
గల్లినాథుని చెలికాఁ డితఁ డనఁగఁ
గల్లినాథునికూర్చు [3]కట్టనుం గనఁగ
మడివాలుమాచయ్య మహనీయ మహిమ
గడుబెడంగని యెన్నఁగా మును విన్న
పరవాదు [4]లడర సద్భక్తులు సెలఁగఁ
బురి భవుల్దూలఁగ శంభునిమది గలఁగ
వీరత సొంపెక్క విజయంబుదక్క
శూరత మదినిక్క సుజనులు మ్రొక్కఁ
జూపఱు గీర్తింప సురలు శంకింపఁ
[5]బాపముల్ గంపింపఁ బ్రభుత[6]వర్ధింపఁ
గణఁక వట్రిల్ల నక్కటిక రంజిల్ల
గణములు వొగడంగఁ గవు లుల్లసిల్ల
మృడుభక్తిమేలెల్ల మిన్నుగర్జిల్లఁ
గడుభయంబునఁ బొంద గడుసరు లంద
[7] [పొడవులు సెడి పాఱ పొందులఁబూరఁ

---

౧. కన్యక. ౨. లెంక. ౩. కట్టెమఁగనఁగ. ౪. లణఁగ. ౫. పాపులు. ౬. వర్తింప. ౭. కుండలీకరణముచేసిన పంక్తులు వ్రాతప్రతులలో లేవు. అచ్చుప్రతిలో ఉన్నవి. ఇవిలేకపోతే 'కేలికలో నేయ' అనేదానికి కర్త కనబడదు. కాని, 'పోడిమిసెడి' అనే పాఠముమాత్రము కనబడుతున్నది. ఛందస్సు చెడుతుంది. అందుచేత 'పొడవులుసెడి' అని కూర్చినాను.—చి. నా.

1గమసంభ్రమంబున గణములు గదలి ]
కేలికల్ సేయ సంకీర్తనల్ మ్రోయఁ
గాలు గర్వము వాయ గణకోటి డాయ
నేతేర నాశ్చర్య మింపుసొంపార
ఖ్యాతి దిక్కులఁ గూరఁ గడురయం బార
నాభక్తవరులు నన్యోన్యనమస్కా
తాభిగమన సుమహాలింగనములఁ
2దనిసన వారును దాను హర్షించి
యనుపమరతిఁ దద్గణాజ్ఞాపనమున
మడివాలుమాచయ్య మఱిభక్తతతికిఁ
బుడమి సర్వాంగముల్ వొందంగ మ్రొక్కి
ప్రమథపురాతన భక్తదివ్యాంఘ్రి
కమలాంతరంగుఁడై 3గ్రక్కునఁ గదిసి,
కిన్నరబ్రహ్మయ్య! గీర్వాణవంద్య!
సన్నుతకీర్తి! సాక్షాద్రుద్రమూర్తి!
ప్రాణమిత్రుండగు బసవన్నఁ బాసి
యేణాంకధరుపురి కెట్లేఁగవచ్చు?
బసవండు శివునాజ్ఞ వరిపూర్తిగాక
యసువులు నినుఁగూర్ప నది యెట్లు వచ్చు?

---

౧. జనులు. ౨. దనిసి సనగవారు. 3. కదిసియు మ్రొక్కి.

గణము లెవ్వారు నెఱుంగకయుండ శివుఁడు
గుణనిధి నిన్నెట్లు గొనిపోవవచ్చు?
బసవండు జంగమప్రాణవ్రతోక్తి
నసలార నీయంద యడఁగు నడంగ
నసమాత్మ భక్తిమహత్త్వ మంతయును
బసవకుమారుని పజ్జన యడఁగు
నశ్లైన భక్తిశూన్యంబగు జగతి
నిక్లేలచెల్లు మీఱియిచ్చలఁ బోవఁ
గావున బసవన్న గలకాలమెల్ల
నీవును బసవసన్నిధి నుండఁ బాఁడి
లే లెమ్మనుడు నవలీలఁ గిన్నరుఁడు
లోలతఁ గలగని [1]మేల్కాన్న యట్లు
గ్రమ్మన లేచి యక్కజము వట్రిల్ల
నమ్మాచిదేవుని యడుగుల కెఱఁగ
[2]బసవండు నంతలోపలన యేతెంచి
యసలార మాచయ్యయడుగుల కెఱఁగ
నాముువ్వురును నసంఖ్యాతగణాంఘ్రి
తామరసముల కుద్యల్లీల మ్రొక్క
[3]నంత నత్యద్భుతాక్రాంతులై లింగ

1. మేల్కాన్న. 2. బసవన్నయం. 3. నంతట నద్భు.

వంతు లందఱు మడివాలుమాచయ్య
వీక్షించి సద్భక్తి వెలితి గాకుండ
రక్షింప శిక్షింప రాజవు¹నీవ
కలియుగరుద్ర! సాక్షాద్వీరభద్ర!
కలితగుణోన్నిద్ర! కరుణాసముద్ర!
జితభవకదన! సుస్మితచారువదన!
గతమదమదన! సంగతదయాసదన!
శ్రితభక్తవర్గ! వశీకృతభర్గ!
హితవీరమార్గ! బహిష్కృతస్వర్గ
పరవాదిజయశౌండ! బహుళప్రచండ!
శరణరత్నకరండ! శమితవేదండ!
నిహత బిజ్జళగర్వ! నిచితగాంధర్వ!
మహితగుణాఖర్వ! మన్నేత్రపర్వ!
నితర్జితసంహార! నిదళితవికార!
నిర్జితాహంకార! నిఖిలైకవీర!
న్యాయనిష్ఠురవాక్య! నరవరాశక్య!
యాయతౌత్సుక్య కోదాత్తశివైక్య!
దుర్దాంతశీల! విధూతాఘజాల!
మర్దితలయకాల! మా మడివాల!

౧. గావె. ౨. వ.

సాహిత్యచితౌస్ఖ్య! సజ్జనముఖ్య!
మాహేశ్వర ప్రఖ్య మాచిదేవాఖ్య!
దండితనీచ! విఖండితాశౌచ!
మండితాంతశ్శౌచ! మడివాలుమాచ!
ముదలింప మనసులఁ గదలింప జడత
వదలింప భాసఁ బాదలింపభక్తి
గీలింప శివునాజ్ఞ వాలింప ఖలులఁ
దూలింప భవము లున్మూలింపఁ గీర్తి
రూఢింప బిజ్జలు నోడింప [1]గజముఁ
బీడింప జగము లల్లాడింప దుష్ట
శిక్షింప శిష్టరక్షింపం గ్రమముగ
టాక్షింప వ్రతులఁ బరీక్షింపఁ జాలి
[2]పనివడి వచ్చిన ప్రమథేంద్రమూర్తి!
ఘనతరభువనప్రకాశితకీర్తి!
బసవన్నఁ గిన్నరబ్రహ్మయ్య నిపుడ
యసదృశభక్తిమహత్త్వంబు మెఱయ
సంజీవితులఁ జేసి జగతిఁ బేర్గొంటి
ముంజేతికంకణంబున కద్దమేల?
వ్యక్తమయిన భవన్మాయ్యయనిష్ఠుర హి

---

1. జగము. 2. పనిఁబూని.

త్రోక్తులు సెవుల కత్యుష్ణంబులయ్యుఁ
బథ్యమై మీఁదఁ సత్ఫలసిద్ధు లొసఁగుఁ
దథ్యమిట్టిద పదార్థంబులు వచన
కాలంబునం దుడుకవే తెకతెకన
యొలిఁ బక్వాన్నంబు లుడుకుట మీఁదఁ
జవి సేయఁగాక రసము గాల్చుకొంటకె
శివభక్తియుక్తుల శిక్షలు నటుల
యుడికించి విదలించి యుదికి ఘట్టించి
మడఁచుట మైలలు మడువు సేయఁగను
నలవియ కావున నట్ల మీశిక్ష
మలినంబుఁ బాసి యుష్మత్కీర్తితోన
తెలుపొందె బసవన్న దీప్తప్రతిజ్ఞ
కలరించెఁ బ్రమథుల కవిలియ కెక్కె
మీయిరువుర వచోమృతమథనమున
నీ యసంఖ్యాత మాహేశ్వరమాన
సాలవాలమున నుద్యచ్ఛివానంద
లాలితకల్పవల్లరిభాసురాంకు
రిత పల్లవిత కోరకిత కుసుమిత ఫ

---

౧. సద్భక్తియొసంగు. ౨. త్రి (త్రె) కత్రి (త్రె)కన. ౩. రసన. ౪. తెలివొందె.

లిత పరంపర లసల్లిల వర్తించె
నంచు మాచనఁ గొనియాడుచు [1]నతిస
మంచితరతిఁ బసవయ్య నాత్మీయ
నిరతిశయాపాంగ [2]సిర్యద్దయామృ
తరసపయోధిమధ్యమునఁ దేల్పంగ
[3]బసవేశుఁ డుండె సద్భక్తులుఁ దాను
నసదృశలీల మున్ననుచు నిప్పాట
నాకాంక్ష నతులసింహాసనాసీను
లై కొలువున మహాభక్తవరులు
దయ నివ్వటిల్లంగ దండనాయకుని
పయిఁ జూడ్కు లందంద పంపుచు నాఁడు
గూడికొనియెఁ జంద్రచూడుండు సూడఁ
జూడఁ గిన్నెర నీవు తోడన యేఁగి
మాచిదేవయ్య సమగ్రదయాన
మీచీనతను వచ్చు డిదియెంత నేఁడు ?
జంగమం బేతెంచి చనుమాత్రలోన
నంగడఁ బ్రాణంబు నరిగి యాజంగ
మము [4]గ్రమ్మరుడుఁ దాను మగుడి యేతెంచె

---

౧. నలి. ౨. నిత్యద. 3. బసవుండునుండె. ౪. గ్రమ్మరఁగ.

నమితమహత్త్వ మేమనవచ్చు బసవ!
శివశివ! జంగమ స్వీకృతప్రాణ!
శివశివ! జంగమాశ్రిత నిజప్రాణ!
హరహరహర! జంగమార్పితప్రాణ!
హరహర! జంగమాయతనిజప్రాణ!
బాపురే! జంగమ పరివృత ప్రాణ!
బాపురే! జంగమ¹భక్తి సంత్రాణ!
మజ బాపురే! జంగమస్ఫురత్ ప్రాణ!
మజ బాపురే! జంగమ స్థిరప్రాణ!
నల్లవో! జంగమనందితప్రాణ!
నల్లవో! జంగమోన్నత నిజప్రాణ!
నిత్యజంగమలింగ నిష్ఠితప్రాణ!
సత్యజంగమలింగ సంచితప్రాణ!
భవ్యజంగమలింగ పరిచితప్రాణ!
దివ్యజంగమలింగ దీపితప్రాణ!
ప్రకటజంగమలింగ బంధురప్రాణ!
సకలజంగమలింగ సంయుతప్రాణ!
జంగమైక్యప్రాణ సౌఖ్యసంధాన!
జంగమైక్యప్రాణ సతతావధాన!

---

౧. పరిచితప్రాణ; ప్రాణప్రధాన. ౨. మాన్వి.

ధనము నివేదింపఁ [౧]దావచ్చుఁగాక
తనువు నివేదింపఁ దానెట్లు వచ్చుఁ?
దనువు నీవచ్చుఁబోదాసతా నియతి
మనము నివేదింప మఱి యెట్లువచ్చు?
మనము నీవచ్చుఁ బో మచ్చికవలన
నెనయఁ బ్రాణంబుఁ దా[౨]నెట్లీయవచ్చు
భావింప నిజవీరభక్తివిస్ఫూర్తి
నీవచ్చుఁబ్రాణంబు నిల నొక్కమాఱు
జంగమంబంద నిజప్రాణచర్య
సంగతంబుగ నెట్లు సంధింపవచ్చు?
వారకమును [౩]టంగుటూరి [౪]మాచయ్య
గారి ముప్పురబాస గడునొప్పె నాఁడు
నుతియింప నరుగును [౫]నులిగె చందయ్య
నుతగుణ[౬]భాష మున్నును జెప్పఁబడియెఁ
గూరిమిమైఁ గొండ గుడికేశిరాజు
గారి బాసయుఁ జెప్పఁగా నిలఁబరగె
నేమించి సత్తేశు చామయ్యబాస
భూమిలో [౭]నదియు నద్భుతమనఁబరగె

---

౧. ధరమెచ్చు. ౨. నెట్టులీ. ౩. తంగ; తుంగ; దంగ; టంగ. ౪. మార. ౫. నులక. ౬. బాస. ౭. పలను.

లాలనమతిఁ గమలాదేవి బాస
[1]మేలనంబున నొప్పె మేదినిమీఁద
నొసర లింగప్రాణులును బ్రాణలింగు
లును నాఁగఁదొల్లియు వినఁబడుఁగాన
ప్రాణలింగులుగల రాజంగమంబు
ప్రాణంబుగాఁజను భక్తులు గలరె?
భంగిగా జంగమలింగంబు ప్రాణ
లింగమన్ బాస సెల్లెంగదా నీకు
ననుచు వెండియు బసవనదండనాథు
ఘనభక్తమండలి గారవింపంగ
జంగమప్రాణి నా సద్భక్తిఁ బరగె
భంగిగా సంగనబసవన్న నాఁడు
వసుధ జంగమపారవశ్య సద్భక్తి
యసలార నీకు లోకారాధ్య నేఁడు'
అనుచు నవ్వేమనయ్యయు సూరసాని
ఘనుఁ బండితేంద్రు నొక్కటఁ గొనియాడ
బసవపురాణానుభవ [3]సుధాంభోధి
నసమానలీల నోలాడుచు[4]నుండెఁ

* * * * *

౧. మేలుమేలన. ౨. జూడ. 3. సుఖాం. ౪. నుండి.

బండితారాధ్య ప్రబంధనిస్తార!
పండితారాధ్య ప్రబంధవిస్తార!
పండితారాధ్య ప్రబంధశృంగార!
పండితారాధ్య ప్రబంధప్రపూర!
పండితారాధ్య ప్రబంధానుసార!
పండితారాధ్య ప్రబంధవిహార!
పండితారాధ్య ప్రబంధోరుహార!
పండితారాధ్య ప్రబంధచిత్సార!
పండితారాధ్య ప్రబంధసత్కార!
పండితారాధ్య ప్రబంధావతార!
సూరకవీంద్ర మందార! శుభప్ర
కార! విన్మిదియు దీక్షాప్రకరణము

* * * * *

ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య
పదపద్మసౌరభ భ్రమరాయమాన
జంగమలింగప్రసాదోపభోగ
సంగత సుఖసుధాశరధినిమగ్న

సుకృతాత్మ పాలుకురికిసోమనాథ
సుకవిప్రణీతభాసురతరదండ
నాయకబసవాంకనఖ్యాతగుణగ
ణాయతకీర్తిదిగంతత్రిలోక
గురుపండితారాధ్య చరితంబునందుఁ
గర మిట్లు ప్రథమప్రకరణ మొప్పారు.

---

## మల్లికార్జున

# పండితారాధ్య చరిత్ర

---

## పురాతన ప్రకరణము

---

శ్రీవృషాధీశ సంచితదయా[1]భావ
భావుకమంత్రీశ [2]పాల్కురికి సూర
యంత వెండియుఁ బండితారాధ్యదేవుఁ
డంతకాంతకమూర్తి యట్లొక్కనాఁడు
క్షిప్రంబ తానును శిష్యవర్గంబు
సుప్రభాతమున నుత్సుకత మేల్కాంచి
మసలి చుక్కలు [3]కాంతి మాయకమున్న
యసమశంఖధ్వానము లలరక మున్న
యభవాలయంబుల నలరుదీపములు
ప్రభ సెడి వెలువెల్లఁ [4]బాఱకమున్న
పరగువెన్నెల [5]వరపర గాకమున్న
సరసిజంబులు మొగి విరియకమున్న

---

౧. పాంగ. ౨. పాల్కురి. ౩. దివి. ౪. నెలవెల. ౫. వరంపర.

జిగిసెడి కలువలు మొగుడకమున్న
మొగిఁ జకోరములు నో[1]స్స్రాయకమున్న
చొక్కి యొక్కొక[1]యెడ సుఖియింపఁ దలఁచి
జక్కవల్ గవగూడఁ జనకటమున్న
దినమణి దన పూర్వదిక్సతిమీఁద
మనసెత్తి [2]పదపారి మఱవకమున్న
తొలుకోడి గనువిచ్చి నిలిచి మైవెంచి
జలజల ఱెక్కలు సడలించి [3]నీల్గి
గ్రక్కనఁ [4]గాలాఁచి కంఠంబు విచ్చి
ముక్కున [5]నీఁకలు [6]నక్కొల్పి కడుపు
[7]వెక్కించి మెడసాఁచి నిక్కి మిన్ సూచి
కుక్కుఱోకోయని కూయకమున్న
ప్రబ్బతనాథ ప్రబ్బతనాథ యనుచు
[8]నుబ్బి నీర్గొల్లు గూయుడుగకమున్న
ననురాగలీల నాత్మారామమునకుఁ
జని పుష్పములు గోయు సమయంబునందు
పూని కించిద్దళంబున శివుఁ బూన్పఁ
గా నమరేంద్రత్వ మీనుచున్నట్టి

---

౧. చోట. ౨. పదవాళి. 3. నీడి. ౪. గాలార్చి. ౫. నీకలు. ౬. నిక్కొల్పి. ౭. ౙెక్కించి. ౮. కుఱ్ఱని. ౯. నుబ్బియుఁగోల్లు.

[1]"పరమమహత్త్వసంపద గలయట్టి
కరవీరపుష్పముల్ గలియంగఁ గోసి,
శ్వేతున కొకపువ్వు నేతప్పి పడ్డుఁ
బ్రీతితో [2]సీశ్వరార్పిత మన్నమాత్రఁ
[3]గావలుఁ డనక మోక్షం బిచ్చినట్టి
[4]చేవంతిపుష్పముల్ సెచ్చెరఁ గోసి,
చేతుల శివునందు నేతు లుట్టఁగ వి-
నీతులై పూన్స దుర్జాతులనైన
ఖ్యాతులకెక్కఁ సజ్జాతులఁ జేయు
రీతులు గల [5]విరజాదులఁ గోసి,
ముక్కంటి పాదాబ్జముల [6]కర్థిఁ దమ్ము
నెక్కించుమనుజుల నిలఁ దమయట్ల
తెల్లంబు నిర్మలతేజిష్ణుఁ జేయు
మల్లికాపుష్పముల్ మాపటి కునిచ్చి,
యాదటఁ దొలుమేన నంబార్ధదేహు
పాదాబ్జములఁ బూన్పఁ [7]బడయుదుఁ గీడు
జాతులనైనను సన్మతి నగ్ర
జాతులుగాఁ జేయు జాతులు డాఁచి,

౧. పరగు. ౨. దాశివా. ౩. గాముకు. ౪. చేమంతి; సేవంతి. ౫. విరిజాతుల. ౬. కును. ౭. బడుదురు.

త్రెంచివైచిన చెంచుదేవుని పురికిఁ
బంచిన మారేడుఁబత్త్రిఁ గోసి,
యర్కపదంబు దా హరుఁ బూన్ప నిచ్చు
నర్కపుష్పంబు లత్యర్థితోఁ గోసి,
కనకపుష్పసహస్రమున కెనయైన
కనకపుష్పంబు లాకాంక్ష[1]మైఁ గోసి,
హరి యొక్కపువ్వునకై తనకన్ను
సరిసేసి శివుఁ బూన్పఁ జక్రంబుఁ గన్న
నప్పుడ శివునిచే నిప్పించి మహిమ
నొప్పారుఁ జామర లొకకొన్ని గోసి,
యెల్లపుష్పంబుల నుల్లసమాడు
నల్లఁగల్వలు సమున్నతిఁ గొన్ని గోసి,
పరిమళావృత భృంగపక్షోపనిహతిఁ
[2]జిరిగిన ఱేకులు ఛిద్రపుష్పములు
సుడిసి తుమ్మెదలు పుప్పొడి గ్రోల వదలి,
పడియున్న యా స్వయంపతితపుష్పములు
[3]దనపసరులఁ దేంట్లు ద్రావ లా[4]వెడలి
మొనలు[5]వోఁ దారిన మొగ్గపుష్పములఁ

౧. తో. ౨. జిరివిన. ౩. దనుబరుసన. ౪. వేది. ౫. లో దాల్చిన.

గడివోవ నళుల లానఁగా తేకులెడలి
యుడిచేనైలైన పర్యుషితపుష్పములు
నపవిత్రమని యవి యాదిగాఁ గలుగు
నుపహతపుష్పంబు లోలి వర్జించి,
భర్గునిఁ బూన్ప నిష్ఫలముల యనుచు
నిర్గంధయుతపుష్పనిచయముల్ దక్కి
యుగ్రునిఁ బూన్ప నయోగ్యంబు లనుచు
నుగ్రగంధపుఁబువ్వు లోలి వర్జించి
యాతతంబుగ బ్రహ్మకై [1]బొంకినట్టి
కేతకిపుష్పముల్ గీడని మాని
యల్లనాఁడు మరున కస్త్రమైనయట్టి
మొల్లపుష్పంబుల ట్లొల్లక మఱియు
నక్కజంబుగఁ జెట్టుపినంద యున్నేని
నొక్కపువ్వున [3]కగు నొక్కఫలంబు
ఆపువ్వుఁ గొనివచ్చి యభవుఁ బూజింప
నేపారఁ గోటివే లిష్టఫలంబు
లనుచుఁ బుష్పము లన్నియును గోసికొనుచు
ననుషక్తి నేతేర నంత నిక్కడను

---

[1]. బొక్కి. [2]. నందయ్యోనేని. [3]. నను.

వెల్లఁగొండ మహాదేవయ్యాగారికథ

మహనీయసద్భక్తి [1]మహి వెల్లఁగొండ
మహాదేవుఁ డొక్కింత మసలి మేల్కాంచి
యెవ్వరే నెడనెడ నేఁగి యింతకును
గ్రొవ్విరుల్ గోయుదురో కూడ ననుచు
[2]దాఁటులుగొని లతాంతంబులమీఁద
[3]దేఁటుల [4]పరిగాల్లఁ ద్రెవ్వునో యనుచు
మలయానిలము వెంట నలి వచ్చివచ్చి
యలిపించు [5]మసరి మట్టాడునో యనుచుఁ
దుమ్మెదల్ నెమ్మి వాతులు [6]దొల్చితొల్చి
కమ్మని [7]లేగంపు [8]గవియునో యనుచు
విచ్చి పట్పదములు వెసఁ గ్రోలి క్రోలి
యచ్చవాసన [9]వెలివుచ్చునో యనుచుఁ
దనిసన భ్రమరముల్ దఱిఁ బీల్చిపీల్చి
ననుజిగి సూర[10]గొనునో మున్న యనుచుఁ
[11]దొడరి భృంగములు పుష్పాడి రాల్పరాల్పఁ
గడివోయి తేకులు గందునో యనుచుఁ

౧. మతివెల. ౨. దాంటులు. ౩. దేంట్లపై. ౪. పరిగాండ్లఁ; పరిబాలి; పరిగాలి. ౫. మసలిముద్దాడునో. ౬. దల్చితల్చి. ౭. లేగుప్పు. ౮. గమి. ౯. పౌలి. ౧౦. గొను నొక్కో. ౧౧. దొడఁగి.

జని పుష్పములు గోసికొని వచ్చునంత-
టన పోవునో శివార్చనము ప్రొద్దనుచు
వంతయుఁ జింతయు వఱలఁ బుష్పముల
కెంతయు సంభ్రమాక్రాంతుఁడై యరుగఁ
గాళ్లు శివార్చోపకరణముల్ దాఁకఁ
గాళ్లును రెండు నత్తుణమ గుత్తులకుఁ
[1]గడికండలుగఁ గొట్టి కలుషంబు వుట్టి
మృడునిముందఱఁ బెట్టి మెఱవడిఁ [2]బెట్టి
భవమున కొఱ[3]గట్టి ప్రతిలేనియట్టి
శివభక్తి దుద[4]ముట్టి చింత వోఁదట్టి
యాసలఁ దల[5]గొట్టి యఱలేనిగట్టి
[6]బాసలు నేపట్టి పరగుచున్నట్టి
[7]తెఱఁగు గలంతయు నెఱిఁగి యద్భుతము
దుఱఁ గలింపఁగ భక్తి నెఱక లుప్పొంగ
మతి వీరరస సముద్ధతి నుతికెక్క-
నతిసంభ్రమాక్రాంతుఁడై పండితయ్య
వొదలు భృత్యాచార మిదిగాక, భక్తి

౧. 'ఖడిఖండ' అని అన్ని వ్రాతప్రతులును. ౨. వట్టి. 3. గొట్టి. ౪. ముట్ట. ౫. మెట్టి. ౬. బాసయుచే. ౭. తెఱగెంతయును నంత.

యిదిగాక, వీరత్వ మిదిగాక, యుచిత
మిదిగాక, [1]ధన్యత్వ మిదిగాక, నేరు
పిదిగాక, సౌభాగ్య మిదిగాక యనుచుఁ
జనుదెంచి మహాదేవశరణునిఁ గాంచి
కనుఁగవ హర్షాశ్రుకణములు దొరుగ
'నాయయ్య కంటిరా నాతండ్రి కంటి
నాయన్న కంటిరా నాస్వామి కంటి
నిట్టుండవలవదా [2]పుట్టినఫలము
నిట్టుండ వలవదా ముట్టినచలము
తిరుగునే ముట్టిన ధీరుండు గలన
సురుగునే ముట్టిన శూరుఁ డెవ్వలన
బాపురే భక్తప్రతాపవిలాస!
బాపురే భక్తప్రతాప నివాస!
నల్లవో ధర్మసనాతనకీర్తి!
నల్లవో కర్మవినాశనమూర్తి!
వీరభృత్యాచారవిషమైకవర్తి!
[3]చారుభృత్యాచారసంపత్ప్రపూర్తి!
బహుళభృత్యాచార[4]పదచక్రవర్తి!
సహజభృత్యాచారసంయుతానార్తి!

౧. భృత్యత్వ. ౨. ముట్టిన. ౩. సార. ౪. పథ.

గహనభృత్యాచారగతభవజార్తి!
విహితభృత్యాచార¹విషయవిస్ఫూర్తి!
ధీరత నీకొప్పెఁ ²దెగువ నీకొప్పె
వీరత నీకొప్పెఁ ³తెంపు నీకొప్పె
సద్వృత్తి నీకొప్పెఁ జలము నీకొప్పె
నుద్వృత్తి నీకొప్పె యుక్తి నీకొప్పె
³నెఱవడి నీకొప్పె నేర్పు నీకొప్పె
⁴నుఱుభక్తి నీకొప్పె నుబ్బు నీకొప్పె
నిట్టిభృత్యాచార మిట్టివిచార
మిట్టి సాహసకర్మ మిట్టి సద్ధర్మ
మిట్టి యుదారత్వ మిట్టి వీరత్వ
మిట్టియుద్ధురభక్తి యిట్టియుద్వ్యక్తి
యీ మహిలో నెన్న నితరుల కున్న-
దే మహాదేవన్న భూమప్రసన్న
సరిలేని భవదీయ చరితంబు జియ్య
పరులకు నగునయ్య భక్తాంఘ్రిశయ్య
యతులభక్తివివేక నుతివావదూక
మతుల కగునె నీక మహి నగుఁగాక
శమితేంద్రియానీక విమలశివైక

---

౧. వినయ. ౨. వెరవు. ౩. నెర. ౪. నురు.

సముదితపరిపాక సౌఖ్యాభిషేక
కరుణాన్వి[1]తాలోక వరభక్తినూక
విరహితభవిలోక వినమితనాక
పరసమయానీకభంగలుంటాక
పరవాది[2]కులటాక పటుతరశ్లోక
వీరగణపతాక విగతచార్వాక
ధీరగుణాస్తోక ధిక్కృతనాక'
యని గారవించుచు హరభక్తరాజి
కనురక్తి సాష్టాంగులై ప్రణమిల్లి
మేదినిఁ దునుకలై మృదుమ్రోల నున్న
పాదఖండములకుఁ బ్రణమిల్లి మఱియుఁ
గరకంజముల నెత్తి యురమున నొత్తి
భరమున నెక్కొల్పి శిరమునఁ దాల్చి
'యీపాదములఁ దాల్చు [3]టాపరమేశు
శ్రీపాదములు దాలిచినయట్లకాదె
యీపాదధూళి దా నాపరమేశు
శ్రీపాదధూళి ప్రసిద్ధంబ కాదె
యీపాదములకును నాపరమేశు
శ్రీపాదములకును జెప్ప వేర్గలదె

---

౧. తవిలోక. ౨. కుట్టాక ; కులధాక. ౩. డా.

శ్రీపతి గానక చిక్కినయట్టి
యాపరమేశు పాదాబ్జంబు లివియు
నేపొంద నాచంద్రు సిలఁ బ్రామినట్టి
యాపరమేశు పాదాబ్జంబు లివియు
నోపి గయాసురు వీఁపున నున్న
యాపరమేశు పాదాబ్జంబు లివియు
నాపోవ కబ్జజుం డతిభక్తి నొత్తు
నాపరమేశు పాదాబ్జంబు లివియు
వాపోవ రావణు వడి నొత్తినట్టి
యాపరమేశుపాదాబ్జంబు లివియుఁ
జూపోప కంధకాసురు మెట్టినట్టి
యాపరమేశుపాదాబ్జంబు లివియుఁ
బైపడి సద్భక్తిపరులు పూజించు
నాపరమేశుపాదాబ్జంబు లివియు
రూపిత వేదాంత రూఢి వెలుంగు
నాపరమేశుపాదాబ్జంబు లివియు
నేపారఁ దీర్థంబు లెల్ల వసించు
నాపరమేశుపాదాబ్జంబు లివియు
నాదట మచ్చగా హరిబొమ్మఁ దన్ను
నాదధీచ్యాదుల పాదంబు లివియు

భవునకుఁ గన్నుఁ బ్రవాదాబ్జమగును
ధ్రువకీర్తి నొక్కశిరోమణి యట్లు
శరణకోటులకు నీచరణాంబుజములు
ధర శిరోమణులచందంబులై పరగు
నాపాదములు నాక హారుమీఁది పూజ
నీపాదములపూజ లిచ్చుభక్తులకు
నీపాదపద్మంబు లీక్షించుమాత్రఁ
బాపంబులన్నియుఁ బరతీపర గావె
యీపాదపద్మంబు లిటఁ దాల్పఁ గనిన
నేపార దే జగద్వ్యాపితకీర్తి
నీపాదధూళివై నిండునంతటను
బ్రాపింపదే శుద్ధభక్తిసంయుక్తి
యీపాదములు నుతియించుధన్యత్వ
మాపోవ కింతంతయన నావశంబె'
యని వినుతించుచు నాడుచుఁ బాడు
చును బాదఖండముల్ సూచి మ్రొక్కుచును
లలి నీశ్వరుండు జలకమాడినట్టి
జలముల యెల్లవిషములకు మందు
భ్రమలేల యొందు శస్త్రవ్రణసంకు

౧. జాబ్జయుగము. ౨. పర. ౩. నిడినయం.

లమునకు దీపతైలంబ యౌషధము
గడువిచిత్రము భక్త గణముల కనుచుఁ
దడయక మృదుదీప తైలంబుఁ దెచ్చి
వడిఁ జేర్చి మును [1]ద్రెంచివైచినయట్టి
యడుగులయందు గుల్ఫాంతంబులందు
గ్రక్కునఁ [2]బూసి తున్కలును గుత్తులును
జక్కొల్పి నిగుడించి సంధించి యొత్తి
యాసక్తి భక్తహస్తార్పితభూతిఁ
బూసి పైఁజల్లి యద్భుతము నెక్కొనఁగ
నామహాదేవయ్య యంత భక్తులకు
భూమి సర్వాంగముల్ వొంద మ్రొక్కించి
పాదంబు లీమహాభక్తులు నీకు
నాదటఁ [3]గృపసేసి రన్న లెమ్మనుచుఁ
గరమర్థి [4]త్రో నెత్తి కౌఁగిటఁ జేర్చి
యరుదొంద జనులు ఘే యని జయవెట్ట
ధ్రువకీర్తి మల్లికార్జునపండితయ్య
శివభక్తులకుఁ బ్రదక్షిణము[5]గాఁ బనుప
నెరపి చూపఱు మ్రొక్క నిక్కంబు దక్క

1. ద్రుంచి. 2. దుత్తునుకలు గుత్తులందు. 3. దయ. 4. లే. 5. రా.

హరుదయా[1]లతసుట్ట హర్షంబు వుట్ట
దివిఁ బ్రమథులు సూడ ధృతి విడులుకాడ
సవినయం బొందఁ బ్రసన్నత సెంద
వీరత్వ మొలయ నుదారత [3]వెలయ
ధీరత వెంపారఁ దేజంబు గూరఁ
బరసమయులు [4]వ్రాల బంధముల్ దూల
హరభక్తు లుప్పొంగ సురలు గలంగఁ
బండితయ్య నుతింపఁ బ్రత్యయం బింప
దండితనము వోల ధైర్యంబు సాల
భృత్యత సంధిల్ల బిరుదు వర్ధిల్ల
సత్యంబు దనర నాశ్చర్యంబు [2]వొనర
నక్షయకీర్తి వాపక్షయమూర్తి
యక్షణంబునను [5]బ్రదక్షిణంబుగను
నడచె సద్భక్తులు నడచు తొల్లింటి
నడ యిట్టిదని చూప నడచినయట్లు
నడచె నీశ్వరుఁ బ్రసన్నత సేయఁ బూను
నడ యిట్టిదని చూప నడచినయట్లు
నడచె నద్వైతుల నడుదల మెట్టి

---

౧. రతులుట్ట. ౨. దొలు; మలు. ౩. మె. ౪. గూ. ౫. లొ.
౬. బ్రత్యక్షంబుగాను.

నడచుమార్గముఁ జూప నడచినయట్లు
నడచెఁ గర్మంబులు నరములై పర్వ
నడచుమార్గముఁ జూప నడచినయట్లు
నడచె భవాంబుధిఁ [1]గడకాలఁ దన్ని
నడచుమార్గముఁ జూప నడచినయట్లు
నడచె భక్తగజంబు గడుమదోద్వృత్తి
నడచుమార్గముఁ జూప నడచినయట్లు
నడచెఁ గ్రాలుచు నపునర్భవసరణి
నడచుమార్గముఁ జూప నడచినయట్లు
దెల్లంబుగా మహాదేవయ్య యంతఁ
దొల్లింటియట్ల యద్భుతలీలఁ దనరఁ
గొంకులువోక లోవంకలు గాక
పొంకంబు దప్పక పొందులు సెడక
కుదికిలంబడక, యెక్కుడు గాక, బిగువు
వదలక, యదికిన [2]వాయి [3]సొప్పడక,
నెత్తురు లూరక, నెఱి నీచ[4]వోక,
గుత్తులు వొంగక, [5]గొట్టెంత లేక
గ్రక్కిరువడక, నరంబులు స్రుక్క

---

౧. నడగాల. ౨. వరుస; వాటు. ౩. సూపడక. ౪. (బోక. ౫. నెత్తింత.

కొక్కరోమము దుల్ల, కక్కజంబగుచుఁ
బాదముల్ దొల్లింటి భాతిన యమర
నాదట భక్తగణాళి హర్షించి
ముట్టినచోఁ బ్రాణముల కాశపడక
దిట్టమై పాదముల్ దెగఁగొట్టికొన్న
యీమహాదేవయ్య యిద్ధమహత్త్వ
మేమనికొనియాడ నేమి వర్ణింప
నప్పుడు దుత్తున్కలైనపాదమ్ము
లొప్పార శివునిచే నిప్పించినట్టి
యూర్జితపుణ్యుఁ డుపార్జిత యశుఁడు
దర్జితాఘుఁడు మల్లికార్జునపండి
తారాధ్యులమహత్త్వ మది యెట్లు వొగడ
గౌరీశ్వరుఁ[1] డెఱుంగుఁ గాక యిద్ధరణి

కళియంబ కథ

మున్నఱువత్తరి మువ్వురలోన
నెన్నంగఁబడిన మాహేశ్వరోత్తముఁడు
ననఘుండు గళియంబ యనుగణనాథుఁ
డనయంబు జంగమార్చన సేయునెడను
నెప్పుడు జంగమం బేతెంచు నింటి

---

[1] దయొగ్గు. ౨. బడ్డ.

కెప్పుడు దా ముట్టి యడుగులు గడిగి
పాదోదకంబులు ప్రాశించికాని
యేదెసఁ గావింపఁ డితరసత్క్రియలు
నాదట భక్తపాదోదకం బీశు
పాదోదకములకు ఫల మెక్కుడనుచు
నాదట భక్తపానాంబుసేవనము
నాదిమలత్రయ వారణహా ననియు
నాదట భక్తపాదోదకంబులు భ-
వాదిరోగములకు నౌషధం బనియు
నసమాత్మభక్త [1]దివ్యాంఘ్రిజలంబు
లసమపాతకరాసు లడఁగించుననియు
నఖిలేశుభక్తది వ్యాంఘ్రిజలంబు
లఖిలధర్మంబుల కాలయం బనియు
నారుద్రభక్త దివ్యాంఘ్రిజలంబు
భూరిసంపదలకుఁ బుట్టినిల్లనియుఁ
బరమేశుభక్తుల చరణోదకంబు
వరగ దృష్టాదృష్ట ఫలహేతు వనియు
సర్వేశుభక్తుల చరణోదకంబు
సర్వజంతువులకు [2]నిర్వాహ మనియు

౧. జనా. ౨. నిర్వాణ.

సకలేశుభక్తుల చరణోదకంబు
సకలతీర్థములకు జనయిత్రి యనియుఁ
బలుతీర్థములఁ గ్రుంకఁ బఱచుటకంటె
నిల భక్తపాదాంబువులు గొను టుఱువు,
నెట్లన్నఁ దీర్థంబు లేఁగుట భార
మట్లనుఁగాక స్వర్గాదిఫలంబు
లారుద్రభక్త పాదాంబువుల్ ద్రావ
భార మేమియు లేదు ప్రాపించు ముక్తి
యరయ క్షీరోదకన్యాయ మన్మాట
వరపరనయ్యె నీపాదోదకంబు
ద్రావినప్రాస్వామిఁ దల్లిచన్బాలు
గావునఁ బాదోదకము యెక్కుడనియుఁ
బ్రవిమల[1]మగుభక్తపాదోదకంబు
శివతీర్థమని శ్రుతుల్ సెప్పెడిఁగాన
నివ్వటిల్లఁగ భక్తనిచయపాదాంబు
లెవ్వని ధన్యుగా నేప్రొద్దుఁ జేయు
నివ్వటిలఁగ భక్తనిచయపాదాంబు
లెవ్వనిచే భజియింపంగఁ బడును
నివ్వటిలఁగ భక్తనిచయపాదాంబు

---

౧. మతి.

లెవ్వని[1]కిని మనోహృద్య[2]మై యొప్ప
నివ్వాటిలఁగ భక్తనిచయపాదాంబు
లెవ్వని[3]వంశసమృద్ధిఁ బ్రాపించు
నివ్వాటిలఁగ భక్తనిచయపాదాంబు
లెవ్వని కిచ్చు నభీష్టార్థసిద్ధి
నివ్వాటిలఁగ భక్తనిచయపాదాంబు
లెవ్వనియందు వ్రహ్వాప్తతఁ బరగుఁ
బోఁడిగా నిన్నిటఁ బొలుపైనయట్టి
వాఁ డీశుఁ డీశుండు వాని భావించు
వానిచేతన వ్రాలు వానికై వ్రాలు
వానివలనఁ జిక్కు వానికి డక్కు
వానియంద వసించు వలపార ననియు
మానిత సద్భక్తిమహిమ దుల్కాడ
[4]వానికిఁ బ్రతివోల్ప [5]వసుధ వా గలదె.
పూని పాదాంబువుల్ పొలు పేమిసెప్ప
గుఱి పుణ్యములకెల్లఁ గొనియాడ ననుచు
నఱలేక భక్తపాదాంబువుల్ దాల్పు
డిదియ నేమంబుగా నిలఁ బ్రవర్తింప
నది యొక్కవాఁడు భక్తాలి యేతేరఁ

1. కై. 2. త్వమొసగు. 3. వలన. 4. దానికి. 5. ధరనెన్నఁ.

బాదముల్ గడుగంగ బానిసకొడుకు
నాదట జంగమంబై యేఁగుదెంచి
పాదముల్ సాఁచ దద్భక్తుండు నతని
నాదిదేవుండ కా నర్థి నిగుడించి
పాదంబు లత్యంతభక్తితోఁ గడుగఁ
బాదాంబువులఁ బోయుపడలతి వీక్షించి
మన సిరియక కొడుకు మల్లండు మల్లఁ
డనుమాన మొక్కింతయును వల దిపుడ
చని తల గొరిగించికొని వచ్చినాఁడు
వనిసేయనోపక భక్తుండు వీఁడె
యిట్టేల చూడవా యీపన్న కాళ్లు
వట్టి కడిగె దెంత బ్రమసితే చెపుమ
మహి భక్తి కూఁతయే మల్లని కాళ్లు
నిహపరంబుల కూఁతయే వీని కాళ్లు
కాయంబుతోడ నక్కైలాసమునకుఁ
బోమె దే చోడఁడు వోయినభంగి
వనితయు నీవు నీశ్వరుపురంబునకుఁ
జనిమెదే గుండయ్య సనినచందమునఁ
బురివాడలును నీవుఁ బురహరుపురికి

---

౧. సూప. ౨. దలంచి.

నరిగదే సిరియాలుఁ డరిగినపగిది
మూఁగినమూఁకతో ముక్కంటి పురికి
నేఁగదే చేరమ యేఁగినపగిది
యిటుగాని నీభక్తి యెఱుఁగంగరాదె
కటకటా! నగరె లోకంబులవారు
వఱకట పెంటల బ్రాతియే బూది
గొఱుగరే తల యొకకొణి దెంటికైన
నంతన జంగమం బనఁ జనునేని
నింతయవస్థ దానేల భక్తికిని
మన్నించి యిప్పు డీపన్న గైకొన్న
నున్నపన్నెఁబు వత్తు రిన్నియునేల
కాళ్లను గడుగు నిన్నాళ్లను నీకుఁ
గాళ్ల నీవెట్టులు గడిగె [1]దీతనికిఁ
గడిగినఁ గడుగుదు గాని యేఁ గాళ్లు
గడుగ వీనికి నుదకంబులు వోయ
బంధులు నగుదురు వరమార్థమనుచు
బంధురంబగు చేతి పసిఁడిగలంతి
యవలఁ బెట్టుడుఁ దనయాలిమాటలకు
శివశివా! యని కేలు సెవులఁ జేర్చుచును

---

[1] దు నీవు.

గానవుగాక సాక్షాల్లింగమూర్తి
బానిసకొడుకని భావింపఁ[1] జనునె
రుద్రాపరావతారునిఁ జూచి చూచి
క్షుద్రకర్మి యిటుగూడునే తెగడఁ
గలియుగరుద్రు నిక్కము సూచిచూచి
మలినాంగి ! కూడునే మతిమాలి నుడువఁ
బ్రత్యక్షరుద్రు నేర్పడఁ జూచిచూచి
యత్యనుచిత మాడనగునె దుష్కర్మి
రెండవరుద్రుని క్రియఁ జూచి చూచి
చండాలురాల ! మున్ సనునె నిందింప
రూపుదాల్చిన యీశ్వరుని జూచిచూచి
పాపిరో ! కూడునే పలుమాటలాడఁ
గర్మసంహారు దేహగతి సూచిచూచి
కర్మికిఁ గూడునే కారులాడంగ
జంగమలింగంబు సనఁ జూచిచూచి
వెంగలి ! కూడునే లెంగిగాఁ దలఁప
[2]మల్లీదళముభాతి మసలి మిన్నేఱు
మల్లిగాండ్రకు నెందు మాళిపైఁ గలదె
ఖండమృణాళంబుగతిఁ గిరీటమున

---

1. దగునె. 2. మల్లికాదళభాతి.

ఖండేందుఁ డితరుల కుండునే చెపుమ
మున్నెందుఁ జిటిప్రేల ముద్రిక యగుచు
నున్నాఁడె యహిపుఁ డీపన్నలకెల్లఁ
బాలయుఁ [1]గార్యోగులు లోఁపలి విమించుఁదునుక
వాలుపునఁ నొసలిక న్గలవె మర్త్యులకుఁ
బండన నేరేటిపంటి భావమున
నుండునే కుత్తుక నొరులకు విషము
ప్రకటింప నిలువుట్టి బానిసకొడుకు
నకు నిట్టి రుద్రచిహ్నాలు సంభవిలునె
మల్లఁడు వీఁడంచు మఱిగెదు లెంక
మల్లఁడే శ్రీగిరిమల్లఁడు గాక
నిన్ను నీవెఱుఁగక వెన్నెక్కి క్రొవ్వి
కన్నులఁగానక కలకంతుమూర్తి
నొడలు గన్గఁగఁ జూచి యొరునిగాఁ జూచి
జడమతిగాఁ జూచి శతునిగాఁ జూచి
జనితుఁగాఁ జూచి సంసారిగాఁ జూచి
కొనకొని బానిసకొడుకుగాఁ జూచి
యడుగుల కర్ఘ్యపణ్యాంబులు వోయ
కెడ నేసినంతన యెఱుఁగమి, దప్పు,

---

౧. నెల్యాయులు. ౨. మెగ్గ.

వాతక, మొప్పమి, వాపంబు, దుర్వి-
నీతి, యన్యాయయంబు, నేరమి, యొగ్గ,
గర్మ, మధర్మ, మజ్ఞాన, మూగడము,
దుర్మార్గవర్తన, ధూర్తతనంబు,
ద్రోహంబు, దోషంబు, దుష్టుతనంబు
మోహంబు నేకమై ముంచె నిన్నొకట
నేమి సేసినఁ బోవునే కోప మనుచు
భామిని నప్పాడ పడఁగొట్టి, రెండు
చేతులఁగట్టి, డాచేతఁ దాఁబట్టి,
దాతిపై నిడి, బాడితయు నెత్తి పూఁచి,
మని¹కట్టులకు మోపి, మానంబు సూపి
మనసిడి యూఁకించి మఱి వ్రేయఁ దడవ
మనికట్టులకుఁ దెగి మఱి మిట్టిపడియె
వనిత చేతులు రెండు దునియలై యంత
మలహరాత్మకుఁ బాదమజ్జనంబునకు
జలములు వోయని చండిచేతులకు
నిది వెద్దయే యంచు మదిఁ గళియంబ
ముదవు గోపము దెంపు ముప్పిరిగొనఁగఁ
బడఁతికాళ్లను జల్లి పగ్గంబుఁ గట్టి

---

౧. కట్లుకిడివాపి.



వాక

పెడలికి నీడ్చించెఁ దొడఁగి వాచఅవఁ
గులసతి యనియెడు కూరిమి లేక
యిలువడి గలదని యెడ ప్రేమ లేక
ప్రజలఁ గన్నది యను పక్షంబులేక
నిజ మాప్తురాలను నెన రింత లేక
మతి నభిమాని యర్ఘామన్నన లేక
హితురాలు దన కను హితమును లేక
మాఁటిమాఁటికిఁ జూచు మక్కువ లేక
యాఁటదానిని జంపు[2] టవినీతి యనక
శివభక్తియుక్తిపెక్కువ సతిచేతు
లవిచారమున నక్కి యాల వైచుటకు
హరభక్తు లత్యద్భుతాక్రాంతు లగుచు
నెరవిఁగీర్తింతురు నిజ మట్లకాక
యిసుక లింగంబుగా నిలఁ జేసి నిలిపి
పసులఁ గావఁగఁబోయి పాలు నిత్యంబు
శివునకు క్షీరాభిషేకంబుగాఁగఁ
బ్రవిమలసద్భక్తిఁ బైఁ జీటి పిదుక
నేలరా మొదవులపాలెల్ల నేల

---

౧. టవ. ౨. జీబచీబ ; జీటిచీటి; జీటిచిటక; జింఎఁబిదుక; జంట పిదుక; జీఁటిపిదుక; జిందఁజింద.

పాలు సేసెద వంచుఁ గాలఁ దన్నుడును
దండ్రి యనియెనె మున్ను జండేశుఁ డపుడు
గండ్రలుగాఁ గొట్టెఁ గాళ్లను శిరము
నేటపెంట్రిక నిల్పి యిల లింగమనుచుఁ
బాటించి మేఁకలపాలు నిత్యంబు
శివునకు క్షీరాభిషేకంబుగాఁగఁ
బ్రవిమలసద్భక్తిఁ బైజీటి పిదుక
నేలరా మేఁకలపాలెల్ల నేల
పాలుసేసెద వంచుఁ గాలఁ దన్నుడును
దండ్రియనియెనె మున్ను దలయును గాళ్లు
గండ్రలుగాఁ గొట్టెఁ గాటకోటండు
నిష్ఠహి వెండియు నిద్ధసద్భక్తి
సమ్మిళితాచార సార నిష్ఠవ్వ
ము న్నీశ్వరార్థమై ముద్రింప లోన
నున్న పక్వాన్నాదు లువిదకుఁ గాన
రాకుండఁ దలు పోరవాకిలి సేసి
యాకాంక్షఁ దమకించి యం దొకబూరెఁ
బట్టి తివుచుడు నాపట్టెఁ బోనీక
పట్టి భంజింపదే పరమనిష్ఠురత
మఱియు నట్టుల చోడమండలేశ్వరుఁడు



శిరః

గజకంఠభక్తుఁ డఖండితకీర్తి
పరరాష్ట్రపతులపైఁ [1]బడి దండువోవఁ
దరుణి యాచోడభూవరు నగ్రమహిషి
క్షామంబు వుట్టుడుఁ గడు మతిమాలి
కామాంగనాశను గాదెలఁ గొల్చు
దనబంధువులకును దల్లిదండ్రులకు
మునుమిడి కొలువంగ ముక్కంటి వోయి
యలరెడు మాగాదియలు గొల్చు వెనుక
నిల వీటిఁ బోయె నీ కెక్కడి దండు
మగుడు నావుడుఁ జోడమహిపతి వేగ
మగుడి [2]యింటికిఁ జని మగువ రావించి
కొట్టరు [3]వ్రప్పించి కొలుచు లెవ్వరికిఁ
బెట్టించి తదియేమి వుట్టె నావుడును
దేవ క్షామంబైన దేశముల్ విడిచి
నీవరువ్రుళ్లెల్ల నిన్ను గుఱించి
[4]యడలుచుఁ దొంటిరాజాన్నముల్ దలఁచి
వడిగాళ్లు మొగములు వాఁచి [5]వచ్చుడును
క్షామమైనను జోడ జనపతి యత్త

---

౧. బ్రతి. ౨. యపుడు దన ౩. వి. ౪. యడరుచు. ౫. చ.

మామలవారెల్ల [1]మడిసిరి భువిని
నను నపఖ్యాతి నీకగునని [2]లింగ
గొని కొలిపించితిఁ గొలుచు నావుడును
నింతి! నీ పుట్టిన యింటివారయ్యు
నంతయు నేల మాయత్తవారయ్యు
నేల దుర్దశనొంద నిందఱ నవని
పాలురఁ జేసెదఁ బశుతి రప్పింపు
మనవుడుఁ దమ [3]యిజ్జ లజ్జలవారిఁ
దనవారిఁ దనతల్లిదండ్రులవారి
నరసి కూచయ్య పెద్దయ్యలవారి
నిరుగింటివారిని బొరుగింటివారిఁ
జుట్టాలఁ బక్కాలఁ జోడనికడకు
నట్టున్న భంగిన యతివ రప్పింప
నలరుచు భూమీశుఁ డందఱ నొక్క-
యిలుసొర నడిపించి యీశుగాదియల
దొడ్డలుగొన్న యాద్రోహుల కింత
పెద్దగాదని పొంగి తద్ద గోపించి
తుండముల్ దలలు దుత్తునియలుగాఁగ
వండఁ దఱిగినట్లు వారి వధించి

---

౧. మఱచిరి. ౨. దేవ; నాంగ; నాస. ౩. యాజ్ఞ.

గర్భిణియగు నాతిగర్భంబు [1]విచ్చి
యర్భకునకు [2]నంత నలుగుడు మనుజ
నాథ! వేఁడుమటంచు నాతియుఁ బ్రమథ
నాథుఁ డయ్యర్భకునకు నడ్డపడఁగ
భర్గుభక్తుఁడు బంధువర్గంబు నతివ
వర్గుగాఁ జోడభూవరుఁడు గొట్టండె?
మఱియును ద్రావిడమండలంబునను
నఱలేని శుద్ధశివాచారపరుఁడు
నరసింగ [3]మొన్నయనా రనురాజు
తరుణి వాల్మీకేశుఁ దా నర్థిఁ జూడ
వచ్చుచు నయ్యుమేశ్వరునకు మీఁదు
వుచ్చిన చెంగల్వపువ్వు మూర్కొనుడు
నా[4]చెల్వ నాసికం బప్పుడ కోసి
వైచుడుఁ బూజారివడుగు రప్పించి
ముట్టినచేయుండ ముక్కేమిసేయుఁ
జిట్టివాఁ డెఱుఁగునే శివభక్తిపథము
నట్టుగాదని పువ్వుముట్టిన చేయి
మొట్టమొదలికిని గొట్టఁడే [5]త్రెవ్వఁ?

---

౧. వ్రచ్చి. ౨. నల్గునంతన. ౩. మొన్నాం; మోనా. ౪. చెలి. ౫. త్రవ్వ; యప్పుడ.

గావున లింగజంగమదూషకులను"
బోవంగనిత్తురే పాఱిగొంద్రుగాక
తల్లిదండ్రులనైన దయలేక చంపఁ
జెల్లు శైవాగమస్థితి విచారింప
రతి 'మాతరః పితరశ్చైవ' యనఁగ
హితు¹రాం డ్రనఁగవచ్చునే ²నిందకులను
ననుచు భక్తానీక మాకళ్లియంబ
నను గీర్తిసేయు నయ్యవసరంబునను

పిళ్లనయనారుకథ

లాలితకీర్తి పిళ్లయనాయనారు
శ్రీలింగమూర్తి దేశికగుణాధారుఁ
డతులిత ప్రమథగణా³న్వయాచారుఁ
డతిశయశుద్ధశి⁴వైకవిస్తారుఁ
డవికల విధినిషేధాగమదూరుఁ
డవధూతజైన బౌద్ధాది ప్రచారుఁ
డుద్ధతరుద్రసముదితావతారుఁ
డిద్ధప్రతాపన దేకాంగవీరుఁ
డెసకంబు దళుకొత్త హేమాసనంబు
నసమమై యొప్పు ముత్యాలపందిరియు

౧. లా. ౨. నిందలకును. ౩. న్వితా; శ్రియా. ౪. వైక్య, శ్రైవ్యం

ఘనతరధవళశంఖంబులు [1]మహిమఁ
జను ధవళచ్ఛత్ర చామరంబులును
నాత్తత వేదబాహ్యసమయధూమ
కేతునా మ్రోయు విఖ్యాతకాహళలు
వాతపూరణములు వడిఁ గ్రాలు వృషభ
కేతనానీకముల్ గీతనినాదములు
నేపార నిన్నియు నిద్ధభక్తి ప్ర-
తాపహేతువులయి తనకు నొప్పారఁ
జను దేరఁ గళియంబ సక్కన నెదురు-
సని భక్తిమైఁ జక్కఁ జాఁగిలి మ్రొక్కి-
యేడ్తెఱ మదిగూర నింపుసొంపారఁ
దోడ్తెచ్చి మఱియు భక్తులకట్ల మ్రొక్కి-
పాదముల్ గడిగి తత్పాదోదకములు
నాదటఁ బ్రాశించు నవసరంబునను
నింతవృత్తాంతంబు నెఱిఁగి యంతయును
సంతోషచిత్తుఁడై సంస్తుతింపుచును
గళియంబ నందంద కౌఁగిటఁ జేర్చి
కళియంబ కాంత నక్కడకు రావించి
శివదేవు సద్భక్తసింహంబులకును

1. మరియు. 2. వాద్య

భువి సమస్తాంగములఁ బొంద మ్రొక్కించి
యనుపమ శక్తిఁ¹ బిళ్లనాయ్నారు సద్భక్తి
దనరఁ దానును భక్తతతి కట్లమ్రొక్కి
చేతులుఁ దెగిన యచ్చేతులుఁ గూర్చి
భూతిమైఁ² జల్లి యద్భుతము నెక్కొనఁగ
"నోతల్లి! నీరెండు నేతులు నెత్తి
భాతిగా మ్రొక్కు మాభక్తుల" కనుడు
హస్తములఁ దొల్లింటియట్ల యొప్పార
మస్తకంబున నెత్తి మగుడయు మ్రొక్క
సకలసమయులు మస్తకతటన్యస్త
ముకుళితహస్తులై మొగిఁ బ్రస్తుతింప
నాయెడ నంత భక్తాళియు మెచ్చి
యీయయ్య మహిమకు నిది యెంత పెద్ద
యరయఁ గుమారుని యంశంబునందు
ధరఁ బుట్టె పార్వతీస్తన్య³ప్రసక్తి

వేలమనికథ

సర్వజ్ఞుఁ డనఁబడి జైనబౌద్ధాది
చార్వాక⁴వాదుల గర్వం బడంచి
మధురకు నేఁగుచో మటి వెల్మఁ డొకఁడు

1. రక్తి. 2. మై. 3. ప్రశస్త. 4. జడులను.

డధముండై చిరకాల మతివ నర్థించి
యిలట్ల మందఁగఁ గూఁతు లేద్వూర మెఱఁగి
పిలిపించి యొరులకుఁ బెండ్లిండ్లు సేయఁ
గడపుట్టుకూఁతురి క్రమమెల్ల నెఱిఁగి
"తడయ కెక్కడకైనఁ దనుగొని పొమ్ము
ఆస్నానలన తనయన్నలు నీకు
బాసఁదప్పిరి యొక్క పదుచు నీరైరి"
యనుచు నిర్వురుఁ గూడి యర్ధరాత్రంబు
సనఁజన నతిఘోరసర్పంబు గఱచి
వెలమఁడు సచ్చిన వేన వేల్విథులఁ
బలవరింపుచునున్న బాల నాలించి
దయవుట్ట నంతఁ బిళ్లయనాయనారు
వయిపడి యొసఁగఁడే ప్రాణమాతనికి ?

వాగీశనైనారు కథ

నిదియునుఁగాక వాగీశనైనారు
సదమలసద్భక్తి నంపద మెఱసి
మృడుచేత నొకకూఁతుఁ బడసి యాబాల
నొడయపిళ్లకకాని యొరుల కీనఁగఁ
దనయఁ బెండియును నంతట మృతివొందఁ

---

౧. నాయి. ౨. యెంతయు దస్సి తా.

దనబాస మెల్లైనఁ దప్పనీ ననుచుఁ
గడువలోపలఁ బెట్టి వడిఁ గాతి యున్న
యెడఁ బిల్లనాయనా రేఁగుదెంచుడును
నమితసద్భక్తి సాష్టాంగుఁడై మ్రొక్కి
సముచిత సత్కార సంపదఁ దనిపి
యటమున్న తొమ్మిది యబ్దముల్ గాన
ఘటములోపల నెముకలు సిక్కియున్న
తనపుత్త్రియెమ్ము లాస్థానమధ్యమున
నునిచి నీ కిడుదని యొకకూఁతుఁ గంటి
వచ్చె నా బాస నీ కిచ్చితి బాలఁ
జెచ్చెఱ నేమైనఁ జేసికొమ్మనుడు
ననుమక్తిఁ బిల్లనైనారు సద్భక్తి
జనమండలికి మ్రొక్కి చనుదెంచి భక్తిఁ
గల్యంబుఁ దనరారఁ గడువలో నున్న
శల్యముల్ ముట్టి భస్మంబుఁ బైఁజల్ల
ఘటము వెల్వడి యష్ట కకన్యక నిలిచెఁ
బటురూపగుణహావభావంబు లమర
నటుగాన పిల్లనైనారిమాహాత్మ్య
మిటువంటి దనవచ్చునే యీశ్వరునకు

౧. కల చిక్కి. ౨. జచ్చె. ౩. బాల. ౪. కన్నియ.

ననుచు భక్తావళి యద్భుతంబంది
వినుతింప లోకముల్ విభ్రాంతినొంద
నలిరేగి పిళ్లయనైనారు నాఁడు
గళియంబకాంతకుఁ గరము లిప్పించె
నప్పాట నీపండితారాధ్యదేవుఁ
డిప్పించెఁ బాదంబు లీశుచే [1]నేఁడు
దెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారును జూడ నిల నట్లుఁగాక

దసరయ్య కథ

యసమానభక్తసంయమి దసరయ్య
యసదృశభక్తిక్రియాధురీణుండు
దళితసంసారుండు దురితదూరుండు
భరితయశుండు సచ్చరితాశ్రయుండు
హింసేతరుఁడు గుణోత్తంసుఁడు శ్రుతివ-
తంసుఁ డాచారవతంసుఁ [2]డుత్తముఁడు
ప్రోత్సారితాఘుఁ డుద్యత్సూనృతుఁడు శి-
వోత్సుకావాసుండు సిత్సుఖాశ్రయుఁడు
ధీరుండు భక్తశృంగారుండు గతవి-
కారుండు లోకానుసారుండు మఱియు

---

౧. నిపుడు. ౨. డుత్తముఁడు.

స్వీకృతశరణుఁ డూరీకృతాద్యుఁడు దృ-
ణీకృతలోకుఁ డప్రాకృతకర్మి
రమణ దయా దాన శమ దమ యమ ని-
యమ ముఖ్యశైవధర్మములు వాటిల్ల
సంతతగురులింగ జంగమార్చన ని-
రంతరభక్తిమై నాచరింపుచును
హరపూజనార్థమై యర్థిఁ బుష్పముల
కరుగంగ నొకనాఁడు నెరవి దుర్జనులు
నింపార మనయూర నీశ్వరభక్తి
పెంపున వీరశ్రేష్ఠ పేర్గలవారు
జితకోపులై సర్వజీవదయాప-
రత నుతికెక్కు సువ్రతులచే వీరు
నేతటిఁ దమసుఖం బెఱుఁగక సర్వ
భూతహితము కోరు బుధులచే వీరు
దారు నొచ్చియు నొంపఁ దగవుగా దనక
సైరింపఁ జాలు సజ్జనులచే వీరు
అదిగాక దృష్టించి యది వీరు సూడ
నెదిరిచిత్తంబులు నెట్లానో యంచు
నొత్తిలి మాటాడ కొరు లెవ్వరేని
నొత్తురోయని తారు నొడువరు సెలఁగి

జంతువు లెడనెడఁ జచ్చునోయనుచు
నంతంతఁ బరికింప కట యడుగిడరు
సెనసి యడ్డమువాఱు జీవులు వడునో
యనుచుఁ జేతులు వీవరలె వేఁగుచోట
నిన్నియుఁ జెప్పంగ నేల నీయయ్య
మున్ను దానలె పుష్పములుగోయఁ జెట్లొ
హో నొచ్చె నొచ్చితి మనకుండఁ జిదుము-
చో నెత్తు రటువంటి సోనలుగాఱు
ని చ్చెట్లు వట్టిన నిట్టువల్కెడిని
ఇచ్చెట్ల నొప్పించు డిది హింస యనుచుఁ
జెలువంబుగాఁ బూలచెట్టులచుట్టు
నలికి గాలికిఁ జాప లడ్డంబుగట్టి
తడవుగా నొండొండ ధరఁ దమయంతఁ
బడిన సుమంబు లెప్పుడుఁ గొనివచ్చి
తా నిట్లు శివుఁబూన్పుఁ గాని యాచెట్ల
నైనను నొప్పింపఁడలె హింసాత్మ,
మిది, సర్వసామాన్య మిది, భక్తు లెడకు
మది భక్తి యెట్టిదో, పాదలు విశ్వాస
మెట్టిదో, యింక నహింసాపరత్వ
మెట్టిదో, సైరణ యెట్టిదో, కరుణ

యెట్టిదో, శాంతత యెట్టిదో, క్షాంతి
యెట్టిదో మన మది యెఱుఁగుద మనుచుఁ
జండి నితరసభాస్థలి వ్రేలుసట్టి
రెండునేతులు లేని మొండి గావించి
యప్పుడు దల నున్ననైయుండఁ గొరిగి
ముప్పిరియగు దొడ్డమొలత్రాడు గట్టి
తడిపి భస్మము మేనఁ దల మొగంబుననుఁ
గడుదట్టముగఁ బూసి కాల్దోమి కడిగి
వెలయఁగా రుద్రాక్షములు దొడ్డపటిక
ములుఁ గట్టి మెఱుఁగెక్కఁ బల్వర్నఁ బ్రామి
రిత్త గద్దెనగరుఁ గుత్తుకఁ గట్టి
మెత్తనివస్త్రముల్ మీఁదను జుట్టి
చక్కగా నీక్రియ జంగమవేష
మెక్కించి పురిజను లక్కజంబంద
నొండేమి దసరయ్య యుత్తమాంగంబు
దండమై నీరెండు మొండిచేతులను
బొడువుము వెఱవక, పొమ్మను నతఁడుఁ,
"బొడువుఁ డాయయ్య' నాపుతు నతఁ డపుడ
నిఱనిఱ నీల్గుచు నిక్కుచు వీఁపు
నిఱిచికొనుచుఁ గాళ్లు విఱియఁదన్నుచును

దనుదానచూచుచుఁ దలయుఁ ద్రిప్పుచును
మునుమిడి[1] మ్రోయుచు ముఱికటింపుచును
భుజములు విచ్చుచుఁ బొంగుచుఁ దాను
గజిబిజింపుచుఁ జిట్టకంబు లాడుచును
గ్రేళ్లువాఱుచు నీడఁ [2]గ్రేకటించుచును
బ్రల్లఁ బల్కుచు వెస [3]మాట లాడుచును
[4]బండగించుచుఁ గూడఁ బఱచుచు రెండు
మొండులు గిఱుపుచు దండయిచ్చుచునుఁ
గ్రాలుచుఁ బిగియుచుఁ గతులు ద్రొక్కుచును
సోలుచు ఠాయముల్ సూపుచుఁ గదిసి.
శరణార్థి యనఁబోయి వెఱవడి నాల్క
దిరుగక యల్పాయు దీర్ఘాయు వనుచుఁ
జక్కన యంతలో ఝంగమవేష
మెక్కించికొన్న నన్నేల భజింప
వో దసరయగారు! ఓ దసరయ్య!
యో దసరయలింగ! యో దసరన్న!
యేమి దేవా మమ్ము నెఱుఁగవే వెనుక
నే మెప్పటంగోలె నేఁగుదేరంగ
లెక్కసేయవు పోక చిక్కవు నిలిచి

---

౧. క్రే. ౨. కేగరింపు. ౩. పాటబా. ౪. బండ్లిగిల్పుచు.

యెక్కడ వోయెద రెటగార్య మనవు
నలుకవు సరకుసేయవు మహాదేవ
మలసెదు గబ్బింతవలెనటే నీకు
నెల్లెడ నన్ను నీ వెఱుఁగవే యొండి
మల్లలింగం బంద్రు [1]మహి నట్లుఁగాక
నచ్చిన ప్రబ్బతనాథునికొడుకఁ
గ్రచ్చఱ నేమత్తిగాఁడనే చెపుమ
మరలిచూచినఁ గొంతమానంబు సెఘునె
శరణార్థియనినఁ బెంపరుగునే కొంత
గ్రక్కునఁ బఱతెంచి కాళ్లపైఁ బడిన
[2]నక్కలివడునె నీయయగారితనము
మద[3]మఱి నాతోడ మాటలాడినను
బిద[4]వగునే భక్తి పెద్దఱికంబు
నేల నీకన్నుల [5]యెదిరికి నింత
సాలమో మమ్ముఁగాక కేలి సేసెదవు
దయయు సైరణయు శాంతత్వయు సద్భక్తి
భయమును [6]నయము వినయము నిర్ణయము
గలవాఁడవని చూడఁగావచ్చినట్టి

---

౧. మరియట్లు. ౨. నక్కలి. 3. ముడ్డి. ౪. వడు; పసు. ౫. యెదిటికి. ౬. నయమ్మునుభక్తి.

ఫలమెల్లఁ గంటిమి వలుమాట లేల
యంచుఁ దన్నిట్లు [1]ధట్టించుచునున్న
సంచితలింగలాంఛనభిధాఁ గాంచి
కర మజ్జుఁడన కతికపటుండు నసక
చిరమదాంధీభూత చేతస్కుఁ డనక
బండఁడనక కడుఁదుండరి యనక
రెండు సేతులు లేని మొండి వీఁడనక
యంగహీనుఁడనక యల్పుండుననక
జంగమవేషంబు నంగీకరించి
నిండువిశ్వాసంబు నెఱభక్తి కలిమి
నొండెఱుంగక యీశ్వరుండని నమ్మి
దేవమనుష్య చర్మావృతరుద్ర
కావవే తప్పులు గల వనంతంబు
లెఱుఁగమి నాయెడ నెంతేనిఁ గలదు
గఱకంఠసన్నిభ కరుణింపు దేవ
గర్వంబు నాయెడఁ గలదు నిక్కంబు
సర్వజ్ఞసన్నిభ సైరింపు దేవ
వేయపరాధముల్ నాయెడఁ గలవు
గాయజాంతకమూర్తి కరుణింపు దేవ

---

౧. కట్టించు ; దండించు. ౨. ధరు.

కడుఁగడుఁదప్పులు గలవెల్లఁ బోవ
నడఁచి రక్షింపవే మృడమూర్తి యనుచుఁ
బుడమి నంతటఁ జాఁగఁబడి మ్రొక్కి మఱియుఁ
నడుగుల కెఱఁగ నాయయ్యశిరంబు
ముడివడఁ దనరెండు మొండిచేతులును
బొడుచును వ్రేయుచు నడఁచుచుఁ గూరు-
కొనుచు ఘట్టించుచు [1]గోముకుచుఁ గోప-
మున [2]మోరుమోరులు వోవఁ గొట్టంగఁ
గాఁటులుఁ గంటులుఁ గట్టి శిరంబు
దూఁటులువోయి నెత్తురు [3]లులుకంగ
హా నొచ్చె నొచ్చితి నయ్యయ్య యనక
యే నీకుఁజేసిన యెగ్గేమి యనక
ఓసీక [4]శతన్నెల పొడిచెద వనక
యానసూ పొడిచిన నయ్యో నీకనక[5]
నిరపరాధులఁ గొట్ట నీతియే యనక
శరణులు విన్నను సైతురే యనక

---

౧. గు. ౨. మొరుమొర్రలు; మొరమొట్లు. ౩. జి. ౪. న.
౫. ఈపాదముతరువాత ముద్రితప్రతిలో 'నినుఁజూచి నేనేల నిలచితిననక, వెనుదీక నరవక విసువకయాత్మ' అను రెండుపాదములున్నవి. ఇవి వ్రాతప్రతులలో కానరావు. వీనికి సంస్కృతానువాదము లేదు. బ్రౌను పాఠములలోను ఈపాదములు లేవు.

కదలక మెదలక గ్రక్కుమిక్కనక
యదరక బెదరక యక్కటా యనక
యలయక సొలయక హరహరాయనక
పలుకక మూల్గక తలవ్రస్సె ననక
నుసుగక నొసగక వసిమాలితనక
విసువక పఱవక వెండియు నాత్మ
త్ర్యష్టైకమూర్తి నాయం దెగ్గుఁగాంచి
శిక్షించెడినో కాక చేముట్టి తాన
కడుఁగడువేడ్కయో కాక నాశిరము
వొడిచి పొడిచి [1]యాడ నొడయ [2]నీకెట్లు
గరమిడి గతపూర్వకాయుగా నాడు
కరము నేఁడిదె భక్తకాయుగా నిడిమోఁ
దడవయ్యె నింక నాతలయుఁ గాఠిన్య
మొడయ నీహస్తంబు లోర్వ వింతటికిఁ
జిత్తజాంతకమూర్తి చేతికి నిదియు
నుత్తమాంగంబేని మెత్తగావలదె
హరుభక్తునకు వంగు శిర మయ్యెనేని
గరములు నొప్పింపఁగా నోడవలదె
తర్కింప నిదియ నా తలయేని నింత

---

౧. చూడ. ౨. నికిట్లు.

గర్కశం బగునె జంగమము చేతులకు
వలదన్న నొచ్చు దేవరమూర్తి మనసు
వలదనకున్న నొవ్వవె కరాబ్జములు¹
అని తలపోయుచు నాపోట్లఁ బడుచు
వినయపూర్వకముగా వేండియు మ్రొక్కి
తనువున మఱియు మెత్తని²తావు లుండఁ
బునుకఁ జేతులు నొవ్వఁ బాడుతురే స్వామి!
ఈకఠినపుశిరం బిటుముట్టఁ దడవ
మీకరంబులు నొచ్చెనో కదా స్వామి!
ఈఘట్టియగు తల యిటుసోఁక నిర్ఘ-
తాఘ! నొచ్చెనుగదే హస్తాంబుజములు
గర్కశంబగు మస్తకంబు సోఁకుడు న-
కర్కశాత్మక! నొచ్చెఁ గరయుగ్మ మనుచు
నెయ్యం బెలర్ప నాయయ్యహస్తంబు
లొయ్యనొయ్యన దసరయ్య భయంబు
ననుఁ బట్టిపట్టి మర్దన సేసి చేసి
చన నొత్తి యొత్తి యొయ్యనఁ దోమితోమి
మును నిగుడ్చినిగుడ్చి చనఁ జాఁగఁ దివియఁ
దునిసిన మొండిచేతులు రెండు నపుడ

---

౧. వేట్ల. ౨. తావు.

మొలచి ¹యంకురములై మోసులు సాఁగి
యలరీ కరాంబుజంబులు దొంగలించె
నీవీరమాహేశ్వరాచారమునకు
వావిరిఁ గొమ్మలు వచ్చినయట్లు
భాతిగా శివుఁబూన్న భట్టబాణునకుఁ
జేతులు మొలచి యచ్చెరువగునట్లు
మొఱటదబంకయ్య కట లేక పట్టి
కొఱట లేఁజిగురు లంకురితమైనట్లు
దసరయ దివ్యమస్తకసుర ధేను
వెసఁగఁ జేకూనల నీనినయట్లు
దసరయ్య శుద్ధభక్తిసరోవరమున
వెసఁ గరపద్మముల్ వికసిల్లినట్లు
సెన్నయ్యజిహ్వకుఁ జేతులు వచ్చి
యున్నట్లు గరయుగ్మ మొప్పె నయ్యకును
ఘనతరసద్భక్తికల్పభూరుహము
మునుకొని దసరయ్య మొలవఁబెట్టుడును
వేళ్లుసాగినయట్టి విధిదోఃస్థలమున
వ్రేళ్లునుఁగూడ నావిష్కృతంబయ్యె
నఖములు భక్తియర్ఘ నాతిచెల్వారు

¹. యంకురితమై.

ముఖపద్మమున కిడ్డ ముకురంబులట్లు
గర[1]మొప్పె నిటుగూడఁ గరపల్లవములు
వరగంగ నాజానుబాహులై చాల
నవకంబులై సువర్ణంబులై కాంతి-
నివహంబులై కళాన్వితములై మఱియుఁ
బరమేశు శ్రీపాదపద్మంబులట్ల
స్ఫురితసంచితకాంతిపూరంబు లగుచు
హరుపాదనఖరముకురదీప్తులట్ల
వరవినిర్మలయశో[2]భరితంబు లగుచుఁ
బరమమునుల తపోభావంబులట్ల
పురుషార్థములకెల్లఁ బుట్టినిండ్లగుచు
భసితావలిప్తుల పాదంబులట్ల
యెసగు దుర్లేఖా[3]నిరసనంబులగుచు
ధర మణికర్ణికాతటములయట్ల
పరమపావనకళాప్రఖ్యంబు లగుచు
ననుపమశైవాగమార్థంబులట్ల
తనరు దర్శితసత్పథంబులై చనుచు
లలి శివపూజాఫలంబులయట్ల
యలరి యగణ్యపుణ్యాయుతంబు లగుచు

[1] మొప్పనటు. [2] వంతంబు. 3. నిరసితంబు.

హారుని. దానాభయహస్తంబులట్ల
పరగు దానాభయభరితంబు లగుచు
మహనియ్యమగు మూలమంత్రంబులట్ల
సహజశిష్యాళికి సదనంబు లగుచు
విపులభక్తికి స్పర్శవేదులయట్ల
యపగతపూర్వ వర్ణాంకంబు లగుచు
ధర శివనాగయ్య కరములయట్ల
విరచితామృతరసాన్వీతంబు లగుచుఁ
గన్నప్పపాదరత్నులయట్లు మఱియుఁ
గ్రొన్నెలదాల్పు శిరోమణులగుచుఁ
బ్రస్తుతికెక్కి నిప్పాట జంగమము
హస్తముల్ దసరయ్య హస్తసంగతిని
నఱిత గద్దెనగరునందు లింగంబు
నెఱియ నంతటను సాన్నిధ్యమై పరగెఁ
గడుసంతసంబు నక్కజము భక్తియును
దొడరంగఁ జేతులు దొడరి చూచుచును
నఱితిలింగము నంటి యంటి చూచుచును
మఱియును జేతుల మసలి చూచుచును
దసరయ్యఁ జూచుచుఁ [1]దల వంచికొనుచు

---

[1]. దలయూవంచుచును.

వసుధ నంగుటమున వ్రాయుచుఁ దొంటి
తప్పులు దలఁచుచు దసరయ్య భక్తి
యొప్పులు దలఁచుచు నుండె జంగమము;
దసరయ్యయును సముద్యన్మహా మహిమ
యసలార నాయయ్యహస్తతలంబు
నటు సాఁగఁ దిగుచుచు [1]నప్పటివ్రేళ్లు
నెటికలు విఱుచుచు నెమ్మి నొత్తుచును
వెండియు నయ్యరు వినమితుండగుచు
నుండె సద్భక్తినియుక్తి వెంపార
నంత నంతకుమున్న హరభక్తవరులు
వింతవేడుకతోడ వినమితు లగుచు
ననమాసమహిమ సదాంతర్నివిష్ట
బసవపదాంభోజ ప్రవిమలతేజ
దసరయ్య యిపుడు నీ తల ముట్టఁగాని
మొనగ నెన్నఁడుఁ గాన మిట్టిచోద్యములు
భంగిగా బసవన్న భావసంగతిని
దొంగల చీరల కొంగుల నున్న
వంగకాయలు ప్రాణలింగంబు లయ్యె
సంగతి దొంగలు సద్భక్తులైరి

---

౧. నప్పటప్పటికి.

యంగహీనుండైన యవినీతుండైన
లింగబాహ్యుండు సలింగుండై పరగ
నొండేమి నీదు దోర్దండసంగతిన్ని
మొండివానికి వచ్చె రెండు సేతులును
నంతన చరితార్థుండైన యాలింగ
వంతుని కరపల్లవస్పర్శంజేసి
మీయుత్తమాంగంబు మృదునుత్తమాంగ
మైయుండె నెట్లన్న నంతకు నరుదు
వీంకవైచిన సాంఖ్యవిభు రాలవాట్లు
ద్రాంకినయట్టి బాందలకయివడిని
బిట్టవ్వకై చేయు వెట్టికై, తట్ట,
కట్టు లొత్తినయట్టి కంట్లచందమున
నొప్పెడు కన్నప్ప చెప్పారాయడిని[1]
జొప్పార నుసిగిన చొట్లభావమునం
దడయక[3] సింధమ దానవై నిలిచి
పొడిపించుకొన్నట్టి పోటులపగిదిం
బొరలి పొరలి పోయి భోగయ్య వెనుక
ధర దాంకి యొరసిన పొరలచందమునం

౧. మై. ౨. అన్ని వ్రాతప్రతులయందును 'రాయడి' అని అకారమధ్యమముగానే యున్నది. ౩. సిద్ధమ.

జిలుతొండ్డనికిఁ దోడు సెలకులు మోచు
తఱిఁ గ్రుంగియున్న క్రంతల తెలంగునను
బొట్లును బొందలుఁ బొరలెత్తియున్న
¹చొట్లును నుసిగిన చొట్లును గంట్లు
వెలయుచు భక్తవత్సలతానియుక్తి
నలరారుటయు శివుతలయ నీతలయుఁ;
దలఁపంగ నటుగాక ధరఁ దనతలయ
తలయుఁగా మనువానితలయ నీతలయు;
జలజాసనాచ్యుతాదులలోనఁ బెద్ద
తలయుఁగా మనువాని తలయ నీతలయుఁ;
జెలువారఁగ "సహస్రశీర్షా" యనంగఁ
దలల నొప్పెడువాని తలయ నీతలయు;
నొగి విశ్వమంతయు నొకతలగాఁగఁ
దగి వెలుంగెడివాని తలయ నీతలయు;
నిలఁ బొక తల్రాక తలలేనియట్టి
తలగల కడయింటి తలయ నీతలయుఁ;
దలలేని తలవాని తలయ నీతలయుఁ;
దలమీఁది తలవాని తలయ నీతలయుఁ;
జతురాస్యునాల్గు, దశగ్రీవుపదియు,

---

౧. చొటులు.

శతదశాస్యునివేయు, షణ్ముఖునాఱు
దలలెన్నసరియె నీతలతోడ శివుని
తల యీఁడుగాక (ధ్యాతల్లభును సరియె ?)[౧]
హరుఁడవు నీవ, శంకరుఁడవు నీవ,
గురుఁడవు నీవ, భక్తుండవు నీవ
ఖ్యాపితంబగు క్షాంతి యను ఖడ్గమునను
గోపమన్ రిపుఁ దెగఁగొట్టు నెవ్వండు,
వాఁడచూ శూరుండు వాఁడ మాంత్రికుఁడు
వాఁడ విద్వాంసుండు వాఁడ తపస్వి
యని చెప్ప శైవశాస్త్రార్థంబు నీక
చనుఁగాక యొరులకుఁ జనునయ్య జియ్య!
మొగి 'నహింసా పరమో ధర్మ' యనుట
యగు నీకకాక దురాత్ముల కగునె?
యట 'నహంతవ్యః ప్రయత్నతో' యనుట
గుటిలాత్ములకు నెట్లగును నీక కాక;
యగు 'నవిచార్య శివాజ్ఞయా' యనఁగఁ
దగుసూక్తి నీకకా కగునె స్వల్పులకు?
నననేల 'లింగద్వయం సమాఖ్యాత'

---

౧. అన్ని ప్రతులలోను 'నీతలతోడసరియె' అనియే ఉన్నది. కాని యాపాఠమువలన పునరుక్తి, అర్థక్లిష్టత కలుగుచున్నవి.

మనువృత్తి నీకకా ¹కన్యులకగునె?
సంచితాగమ శైవశాస్త్రానుగత స-
మంచిత సద్ధర్మమార్గానుపాల
ప్రమథానుకూల సద్భక్త²విలోల
సముదితశివలీల సంహృతకాల
పరభక్తిమూల భవప్రతికూల
చరలింగసుఖజాల సముదయకాల
నికృతదుర్భవశీల నీతివిశాల
సుకృతమహోత్తాల సుగుణాలవాల
యని పెక్కుభంగుల ననుకీర్తిసేయ
జను లర్థి జయజయధ్వనులతో మ్రొక్క-
నట్టున్న దసరయ్య కహితంబు సేయఁ
గుటిలలాంఛనధరుఁ గొలిపిన ఖలులు
నంత వెండియు భయాక్రాంతాత్ము లగుచు
³నంతంతఁ జాఁగి సాష్టాంగులై మ్రొక్కి
"యపరాధులము గడు నపవిత్రమతుల
మపనీతపుణ్యుల మపగతాత్ములము
గఠినచిత్తుల మహంకారవృత్తులము

1. కగునె యన్యులకు. 2. విలోల. 3. నంతంతసాష్టాంగులై పోయిమ్రొక్కి.

శతులము వాపకర్మతుల మజ్జులము
సంసారులము సదాచారదూరులము
హింసాపరులము భాగ్యేతరాత్ములము
గావునఁ దప్పులు గల వెల్ల దసర-
దేవయ్య మాయయ్య కావవే జియ్య
మీమహాత్త్వముపెంపు మృడుఁడ యెఱుంగు
నేమెఱుంగుదు మనఁగా మావశంబె?
నీతి దలంపక నీ కెగ్గు సేసి
నాతఁ డప్పుడ రెండు నేతులు వడసె
నన నేల వేయు నీ కహితంబు సేయఁ
బనిచిన యేమును బ్రదుకంగవలదె?
ఖోల దుర్జనుతోడి పొందునకంటెఁ
జాల మేలండ్రు సజ్జనవిరోధంబు
నటుగాన నీదుమహాత్త్వంబుఁ దలఁచి
పటుదయామతిఁ [3]గావఁ బాడి మమ్మనుచు
మఱియును మ్రొక్కంగ మనుజులు గొంద
ఱఱిముఱిఁ దమలోన నచ్చెరువంది
సిరి మహాదేవ విచిత్రంబుగాదె
ధర మన నేల మాదసరయ్యఁ బట్టి

౧. వయ్య. ౨. పొత్తు. 3. బ్రో.

దండించుచును దన తలవ్రేయఁ దడవ
మొండి¹మల్లని కప్పు రెండు సేతులును
దా మెచ్చి యిచ్చెఁ బాదములపైఁ బడిన
నేమేమి యిచ్చునో యీయయ్య యనుచు
వారక నుతియించువారును మ్రొక్కు-
వారును గొనియాడువారు నిబ్బంగి
నక్కజంబందంగ నన్యదర్శనులు
మ్రొక్క భక్తావలి మోదంబునంద
నప్పాట దసరయ్య యాయయ్య కిచ్చెఁ
జెప్పఁ జిత్రముగాఁగఁ జేతులు రెండు
నచ్చుగా నీపండితారాధ్య దేవుఁ
డిచ్చెఁ బాదములు దా నిప్పు డొప్పారఁ
దెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారును జూడ నిల నట్లుఁగాక

## గురుభక్తయ్య కథ

పరమసద్గురులింగ పాదారవింద
పరవశీభూత విస్ఫారమానసుఁడు
ధర గురుభక్తి సుధారసాంభోధి

---

౧. మల్లన.

వరగురుభక్తి సువర్ణభూధరము
సిరతరగురుభక్తి వరసురతరువు
గర మొప్ప గురుభక్తి కామదుఘంబు
నెట్టణ గురుభక్తినిధి గురుభక్తి
పట్టబద్ధుఁడు గురుభక్తయ్య యనఁగఁ
శ్రుతి "యో గురుః స శివః ప్రోక్త" యనియు
శ్రుతి "య శ్శివ స్సగురు స్స్మృత" యనియు
శ్రుతి "నాస్తి తత్త్వం గురోః పర" మనియు
శ్రుతిఁ "త్రిసంధ్యాసు గురోః పూజ" యనియు
మ్రొయంగ నియతిమై మూఁడుసంధ్యలను
బాయక తన గురుపాదాంబుజాత
పాంసువు దనకు నుత్తంసంబుగాఁ బ్ర-
శంసింపుచును జక్కఁజాఁగిలి మ్రొక్కి
యనురాగశక్తిఁ బాదమజ్జన మాచరించి
తనశిరంబున దేహమునఁ జల్లికొనుచు
నడుగు లొయ్యన దుకూలాంబరంబునను
దడియొత్తి సాంద్ర చందనపంక మలఁది
చెలువు మీదుల్కాఁడ సర్చించి పూజించి
యలరుచు ధూపదీపాదు లొనర్చి

---

౧. ర. ౨. దొ.

యంజలీకృతహస్తుండై యంత మ్రొక్కి
రంజిల్లు నవ్యపుష్పాంజలు లిచ్చి
మస్తక విన్యస్తహస్తుండై గురువుఁ
బ్రస్తుతింపుచుఁ బద్ధాబ్జంబుల కెఱగి
వలగొని వెండియు నిలఁ జాఁగి మ్రొక్కి
యెలమిమైఁ బరిచర్య లిట్లు సేయుచును
గురుపదాంబుజభక్తి గురుకార్యయుక్తి
గురుదాసతాసక్తి గురువచనోక్తి
ధనదారఁ దన తనుధర్మముల్ మఱచి
యనయంబు వర్తించు నది యెట్టులనిన
నప్రతర్క్యం బభేద్యం బప్రమేయ
మప్రమాణం బగమ్యం బప్రచార
మప్రతిమం బసాధ్యం బప్రచింత్య
మప్రపంచం బనన్యం బనావాస
మనవొప్పు శివతత్త్వ, మాశివుఁ డీశుఁ
డనుపముఁ డీశానుఁ డంబికారమణుఁ
డాది భక్తానుగ్రహార్థమై తాన
మోదంబుతో గురుమూర్తి ధరించి
భవపాశములు ద్రెంపఁ బాల్పడ వచ్చి
భువి ముముక్షులనెల్ల బోధించుమతిని

ఘనదయామృతహస్తవనజాతుఁ డగుచుఁ
దనుదాన కావ్పింపఁ దలఁచి యాగురుఁడు
నాది నవాఙ్మనసాతీతు శివు మ-
హాదేవు వాఙ్మనోవ్యాపకుఁ జేసి
యిల సర్వగతు భక్తహృద్గతుఁ జేసి
యిల సర్వమయు భక్తహృన్మయుఁ జేసి
యరయ సర్వాత్ము భక్తాత్ముఁగాఁ జేసి
పరగు సర్వేశుఁ దత్ప్రాణేశుఁ జేసి
యేతఱిని మనోగృహీతంబుగాని
యాతత్త్వ మెఱుఁగంగ నరుదు గావునను
దా నీశు సర్వగతత్వాదిగుణవి-
తాను సావయవవిహీనుఁ గావించి
కోరి శిష్యుని నహంకారాది గుణవి
దూరుఁగా నుభయసంస్కారముల్ సేసి
మూర్తుల మిగిలిన మూర్తిని లింగ-
మూర్తిగా నియమించి మును శిష్యు చేతఁ
బెట్టి ప్రాణముఁ దుదముట్టించి యాత్మఁ
బట్టింపఁ దచ్ఛివ్య పరిమితంబుగను
దానికిఁ దగ గురుదక్షిణ శిష్యుఁ

డీ నెద్దియును లేక యిలఁ దాన కాక

యని 'శరీరం ప్రాణ మర్థం చ' యనియు
విన 'సద్గురుభ్యో నివేదయే' త్తనియు
మ్రోయుఁ గావునఁ బ్రాణమునుఁ దనధనము
గాయంబు గురున కాకాంక్ష నర్పించి
లింగసాన్నిధ్యంబు జంగమభక్తి
సంగతంబగు తత్ప్రసాదము వడసి
యిట్లు దా వర్తించు ²డిది గురుభక్తి
యట్లుగా కుదరార్థమై బొనఁదప్పి
యాగురు ప్రతిబింబ మగు జంగమమున
కాగురుస్వామికి నాలింగమునకు
నటు³గూడ నర్థదేహప్రాణముల న-
కుటిలత నిర్వంచకుండు గానట్టి
కట్టడికి మొదలి కాలిక పోవు
ముట్టినలింగంబు మొదలి పుణ్యంబు
వుట్టి తా మగుడినయట్టిచందమున
నిట్టిద గురుభక్తి యిల నట్లుఁ గాక
కుంచితుఁడగు ప్రాణవంచకునకు న-
మంచితంబుగఁ దక్క దా³ లింగభక్తి
సంగతి నర్థవంచకుల కెయ్యెడల

---

౧. టి. ౨. గాన ప్రాణ దేహార్థంబులందు. ౩. గురు

జంగమభక్తి సుసాధ్యంబు గాదు
దనువంచకునకు నె[౧]క్కొనదు ప్రసాద
మనిన సద్గురు[౨]మూర్తి కాదిదేవునకుఁ
ద్రివిధంబుఁ జూపిన త్రివిధాత్మునకును
ద్రివిధంబు వంచింపఁ ద్రివిధంబు గలదె?
గురుఁడ యెఱుంగుఁ దద్గురుభక్తిమహిమ
విరచింప శక్యమే హరునకునైన
[3]గురుభక్తి యఘపయోధరమారుతంబు
గురుభక్తి మదవనస్ఫురితదావాగ్ని
గురుభక్తి యజ్ఞానతరుకుఠారంబు
గురుభక్తి యపరాధగుణలవిత్రంబు
గురుభక్తి పాతకగిరికులిశంబు
గురుభక్తి దుఃఖదుస్తరధూమకేతు
గురుభక్తి గర్మసాగరబడబాగ్ని
గురుభక్తి భవగజక్రూరసింహంబు
నుపమింప గురుభక్తి యుక్తి వేఘేల
యపునరాగతిహేతు వది యట్లుఁగాక

---

౧. క్కొనునె. ౨. నకు నాదిమూర్తికిని. 3. ఇక్కడనుండి యెనిమిదిపాదములకును సంస్కృతానువాదమున వాక్యములు వెనుక ముందయినవి; శ్లోకరచనాసౌకర్యముకోసమైయుండును.

మాతయై కొనియాడు మహి గురుభక్తి
భ్రాతయై ప్రాపగుఁ బటుగురుభక్తి
దాతయై శిక్షించుఁ దాగురుభక్తి
దాతయై రక్షించుఁ [1]దగ గురుభక్తి
వైద్యుఁడై రుజఁ [2]బాపు వరగురుభక్తి
యాద్యుఁడై బోధించునది గురుభక్తి
గురుభక్తి వెలియుగాఁ గోటిభంగులను
హరుభక్తిఁ జేసిన నది నిష్ఫలంబు
గురుభక్తి హరుభక్తి [3]కిరవు గావునను
గురుభక్తి హరుభక్తి [4]తెరవుగావునను
గురుభక్తి హరుభక్తి [5]కొర్కి గావునను
గురుభక్తి హరుభక్తి [6]కొలికిగావునను
గురుభక్తి హరుభక్తి [7]కరుదుగావునను
సకలసంపదలకు సకలశక్తులకు
సకలమోక్షములకు సకలసిద్ధులకు
సకలేశుభక్తికి సద్గురుభక్తి
ప్రకటింపహేతువు పరమార్థమట్లు
గావునఁ బ్రాణంబు గాయంబు ధనము

---

౧. ధర. ౨. మాన్పు. ౩. ఉనుకు. ౪. ఆరవు. ౫. కొర్కె. ౬. కొలిక. ౭. కరదు; కెరవు.

భావించి గురుపదార్పణము గావించి
చాయక సద్గురు పరిచర్య లర్థిఁ
జేయుచు సాత్త్విక శ్రేయస్సంతతిని
గురుభక్తులెల్లఁ దన్గొనియాడుచుండ
భరితచిత్సుఖగురు "భక్తయ్య నిత్య
తంత్రంబు గురు²పర తంత్రకృత్యంబు
మంత్రంబు సద్గురు మంత్రప్రశంస
దపము సద్గురుపద ధ్యానానుషక్తి
జపము సద్గురుపర చరణ ³సంస్మరణ
వ్రతము సద్గురుపారవశ్యవర్తనము
మతము సద్గురుదివ్య మార్గానుచరిత
నేమంబు సద్గురు నిరతిశయాజ్ఞ
హోమంబు గురుపాద యుగ్మార్చనంబు
ధ్యానంబు సద్గురు తత్త్వచింతనము
దానంబు గురుపాద తనుసమర్పణము-
గా నిరంతరపరమానందలీలఁ
డా నిట్లు గురుభక్తి తత్పరత్వమునఁ
జరియింపుచును వేగుజా మొక్కనాఁడు
గురుపూజనార్థమై కుసుమముల్ దేర

---

౧. భక్తునిశలఁపు. ౨. పద. ౩. సేవనము.

నాదట ¹నేఁగుచో నగ్గురునాథు
పాదుకంబులు గురుభక్తయ్య దనదు
చరణముల్ సోఁకుడు హరహర యిట్టి
పరమపాతక మిది ప్రాప్తవ్య మగునె
దురితమున్నదె గురుద్రోహంబుకన్న
సరిఁ 'బాదుకాసనశయ్యాది' యనియు
ధృతి 'గురుణా అధిష్ఠిత'మ్మనియుఁ
దతి 'నమస్కుర్వీత తత్సర్వ' మనియుఁ
జెప్పెడు శ్రుతి 'నస్పృశేత్కాచి'త్తనియుఁ
దప్పఁ దా నింకెట్లు ధరియింపవచ్చు
దండధరోద్దండ దండాభినిహతి
దండింపఁబడు మీఁది దండన కోర్వఁ
గాళ్లు దుత్తునుకలుగాఁ గొట్టికొట్టి
తోళ్లొల్చి మాంసంబుఁ గళ్లు గావించి
నెక్కొన దొప్పల నెత్తురు నించి
చక్కడ్చి యెమ్ములు సమిధలు సేసి
యోలి శివాగ్ని కాహుతులు గా³వించి
వేలుతు నిదియ తా విధి దీని కనుచుఁ
బాదంబు లొండొండ పట్టి గుత్తులకు

1. నరుగుచో. 2. దేవు. 3. నిట్లు.

ఛేదించి గండ్రలుసేయు నత్తఱిని
దండితపాపుఁడు దనగురుఁ డమర
గుండము మల్లనాఖ్యుఁడు వటుకీర్తి
గంతుసంహరుభక్తగణములుఁ దాను
నింత వృత్తాంతంబు నెఱిఁగి యేతేరఁ
బొడగని బిట్టుల్కిపడి [1]సాధ్వసంబుఁ
గడుసంభ్రమము భక్తి దొడిఁబడఁ బెనఁగ
నద్ధర సాష్టాంగుఁడై తన్ను మఱచి
యుద్ధతి నటుమ్రొక్క నూహింపఁ దడవ
గురుదయామృత సరోవరమధ్య[2]మునను
జరణాబ్జములు వికస్వరమయ్యె [3]నాఁగ
మొలచెఁ గాళ్లను రెండు మును గురుభక్తి
కెలమిఁ గాళ్లును రెండు మొలచినయట్ల
యంత సపాదుఁడై యా గురుభక్తుఁ
డెంతయు భక్తిమై నిలఁ జాఁగిమ్రొక్కి
మస్తకవిన్యస్తహస్తుఁడై గురునిఁ
బ్రస్తుతింపఁగ గురుభక్తునిఁ జూచి
యిదియుఁ దాఁ జోద్యమె యిల గురుభక్తి
విదిత [4]భవద్భక్తివిధిఁ దలపోయఁ

౧. విభీతియును. ౨. మందు. ౩. గాన. ౪. సద్గురుభక్తి.

గథలేల మొన్ననకాదె యెట్లనినఁ
బ్రథిత సద్గురుపాదపరతంత్రమతికి
సద్గురువరపరిచరణాభిరతికిఁ
దద్గురు కరుణానితాంతసంస్థితికిఁ
దనతోడి శిష్యు లెంతయు నసహింప
ననఘుఁ డాగురుదేవుఁ డాగురుభక్తు
నెట్టన గురుభక్తి నిష్ఠాపరత్వ
మిట్టలంబుగ వారి కెఱుఁగింపఁ దలఁచి
పట్టెమంచంబును బఱపును వెనుకఁ
బెట్టించి శిష్యులఁ బిలువంగఁ బంచి
యొక్కఁ డొక్కండ కూర్చుండుఁ డే తెంచి
చక్కనఁ బట్టెమంచముమీఁద ననుడు
నిదియేమి విపరీత మిట్టిది గలదె
మది మఱపొందినమాటలు గాక
సరి సన్నుతాసనశయ్యాదులందు
గురులసన్నిధి నెట్లు గూర్చుండవచ్చు
నని శిష్యు లట నపహాస్యంబు సేయఁ
జనుదెంచి నిజపదార్చన మాచరించు
గురుభక్తు వీక్షించి కూర్చుండు పొమ్ము
సరసరఁ బట్టెమంచముమీఁద ననుడు

స్థిరభక్తి సద్గురు శ్రీపాదములకు
ధరణీ మహాప్రసాదం బంచు మ్రొక్కి
లలి 'గురో రాజ్ఞాం నలంఘయే' త్తనఁగ
జెలువారు వాక్యంబు శిరమునఁ దాల్చి
వడి 'గురో రాజ్ఞానువర్తన' మ్మనఁగఁ
బడు సూక్తి యది ప్రాణపదముగా నెఱిఁగి
సరసరఁ బట్టెమంచంబుమీఁదటను
గురుభక్తుఁ డపుడు మ్రొక్కుచుఁ గూరుచుండఁ
దఱిఁదఱి శిష్యులందఱు విజృంభించి
వెఱవక చూడుఁడా వీఁడు మాగురుల
సన్నిధిఁ బట్టెమంచంబుపైఁ గూరు-
చున్నవాఁ డొక్కింతయును లెక్కఁగొనఁడు
మనసులోఁ దరయంగ మందలించినను
జను నెట్లు వట్టెమంచముమీఁద నుండ
గురువులు మము నిట్లు గూర్చుండు డనిన
గురువుల పంపని కూర్చుంటి మెట్లు
మాయట్టి [1]యధికులు మది భయంబంద
నీయధమునకు నె క్కెక్కంగవచ్చు
నిల [2]వేయు నినననేల యీగురుద్రోహి

1. భక్తులు. 2. నిదియేల.

తలఁ దున్ని¹ వైవక తక్క వే మనుచు
సందడింపఁగ గురుస్వామి దచ్ఛిష్య
బృందంబు భావించి పృథుభక్తి నిరతు
గురుభక్తు డిగుమని కొసర కక్కడను
గురుతరంబుగ నొక్కకొట్టు వాతించి
యతఁడు గురుద్రోహి యధముఁ డట్లుండె
నతులితు ల్గురుభక్తు లధికు లేనియును
నెక్కుఁడా మెవ్వరే నీకొట్టు మీఁదు
స్రుక్కక మీభక్తిఁ జూచెద ననుడుఁ
జనునయ్య పట్టెమంచంబొండె నెక్కుఁ
డనిమెద రొక్కట్టెక్కుఁ డనిమెద రొండె
వినుఁ డిట్టిభక్తికి వెఱతుము మున్ను
వనిచినయతనిన పనుపుఁ డేమేల
స్రుక్కక మును మంచమెక్కినయట్ల
యెక్కనుగాకేమి యిక్కొట్టు ననుడుఁ
బ్రియతరచిరపరిస్ఫీతకారుణ్య-
మయవీక్షణసుధాబ్ధిమగ్నుఁ గావించి
యమ్మహాత్ముండు నయ్యనఁ బ్రసాదంబుఁ
గొమ్మంచు నొసగ నెక్కొను నిజదత్త

---

1. వేయక.

చర్విత తాంబూలసరస ప్రసాద
సర్వాంగ లేపనాస్వాదనుండైన
గురుభక్తునకు [1]నెక్కఁ గొల్చు సూపుడును
గురునకుఁ జాఁగిమ్రొక్కుచు శరణనుచు
సరసరఁ బట్టెమంచంబుపై నెక్కఁ
కరణిఁ గొఱ్ఱెక్కఁ జక్కన నెత్తి వెడల
'నోన్నమో సద్గురుభ్యోనమో' యని స-
మున్నతి మ్రొక్కుచు మున్న గొఱ్ఱార
గించియుఁ గొఱ్ఱారగించినట్లుండ
కంచితభక్తిఁ గరాబ్జముల్ మొగిచి
గురుశరణనుచున్న గురుపాదభక్తు
గురుభక్తు గురుసక్తు గురుదయాసక్తు
గురుకృతాజ్ఞాప్రాణు గురువాక్ప్రమాణు
గురుపదాబ్జధురీణు గురుమతత్రాణు
నస్తమితాఘు నిరస్తాంగగుణస-
మస్తు మస్తన్యస్తహస్తప్రశస్తు
లోకభీకరుఁ జిత్ప్రభాకరు సద్గు
ణాకరు భవజయు శ్రీకరు శూక
శూలసుఖాసీను శూలసంధాను

---

[1] నొక్క.

శూలాన్వితక్రీడు శూలా*త్ముఁ జూడు
శూలి నంతఃస్థితశూలిని విధృత
శూలిఁ[1] గుజనశిరశ్శూలు నీక్షించి
యమరగుండము మల్లికార్జునుఁ డంతఁ
దమయున్న శిష్యప్రతానంబుఁ జూచి
యితనిచరిత్రకు నితనిసద్భక్తి
కితనినిష్ఠకు నసహింతురు మీరు
వ్యక్తవేదేతిహాసాదులయందు
వ్రాక్తననూతనభక్తాదులందు
[2]వింటిరే యిటువంటి విక్రమశక్తి
[3]కంటిరే యిట్టి దుర్ఘటభక్తియుక్తిఁ
బరువడి మీరును భక్తులమనుచు
విరసంబులాడుచు విఱ్ఱ[4]వీఁగెదరు
భావింప మాక్షమా పాత్రులు మీరు
భావింప మా కృపాపాత్రుండు వీఁడు
నెఱిఁ బ్రాణపద మీతనికి మదీయాజ్ఞ
మఱి యపహాస్యంబు మాయాజ్ఞ మీకు
సరిఁ ద్వదీయేచ్ఛానుసారులు మీరు

---

* త్మ చూడు. ౧. "గుజనశిరశ్శూలి" ననియే కవి వ్రాసియుండ వచ్చును. ౨. వింద్రేమి. ౩. కండ్రేమి. ౪. వీఁగుదురు.

సరి మదీయేచ్ఛానుసారి యీతండు
నితనికి మీకును నెన్నిచూడంగ
నతులపర్వతపరమాణ్వంతరంబ
యిదిసమున్నతి శయ్యయనియు మున్నెఱుఁగఁ
డిదియు శూలంబని యెఱుఁగఁ డిప్పుడును
మావచనంబ ప్రమాణంబుగాన
మావచనము పట్టిమంచంబుఁ గొట్టె
నిది యిట్లయునికి కిం కిన్నియు నేల
యిదె ప్రత్యయము సూడుఁ డిందఱు ననుచు
గురుదేవుఁ డతిదయాంకురితాత్ముఁ డగుచు
గురుతరంబైన నీగురుభక్తియుక్తి
గరళాంకు ప్రమథుల కవిలియ కెక్కఁ
గర మొప్పె దిగిరమ్ము గ్రక్కున నతఁడు
[3]దుట్టించి పలుకఁ జేతుల నూఁది యెగసి
మిట్టి యల్లంతట మేదిని కుఱికి
సరసరఁ జనుదెంచి సద్గురుస్వామి
చరణాంబుజములకుఁ జాఁగిలి మ్రొక్కి
గురుదేవుఁ డగ్గి నెక్కొన గురుభక్తుఁ

౧. నిట్లెన్ని. ౨. భక్తుల. 3. సంస్కృతము: "ప్రీతమానసః".

గరమిడి లేనెత్తి కౌఁగిటఁ జేర్చి
స్వాదుస్వకీయప్రసాదామృతాబ్ధి
నాదట నోదార్చి యగ్గురుభక్తు
లసితదేహంబు శూలాగ్రస్థూలనిహతిఁ
గసుగంద కం దొక్కకంటిరంధ్రంబు
వ్రణము నెత్తురుగంటి వాపుఁ గుబ్బిలుట
యణుమాత్రమును లేమి యది ప్రత్యయముగ
భువి సోద్యమనుచు నద్భుతచిత్తు లగుచు
శివసహోదరులు విజృంభణ దక్కి
వినుతింప మున్నను వెలయదే నీదు
ఘనగురుభక్తి విఖ్యాపితమహిమ
యిప్పుడు వెలయదే యేమెల్ల నెఱుఁగ
నొప్ప సద్గురుభక్తియుతమహామహిమ
యటుగాన యిట్టిప్రత్యక్షప్రమాణ
పటుమహిమాపరంపరహేతువైన
సుమహదపారభాసురభవదియ్యా
కమనియ్యగురుభక్తి కలితైకమహిమ
యేక్రియ నరులేల యీశునకైన
వాక్రువ్వఁ బొగడఁగ వశముగాదనినఁ

౧. స్తంభ. ౨. ను.

[౧]బరులెఱ్గదురె భవపాశవిముక్త
గురుచరణాంభోజ [౨]సరళసద్భక్త
గురుదయామృతరస శరధినిషిక్త
గురుగుణప్రకర [౩]సంస్మరణానుషక్త
గురునిరంతరవరచరణానురక్త
గురుపరతంత్ర నిర్భరగుణోద్యుక్త
గురుకార్యచిరధురంధరకళాయుక్త
గురుమనోజ్ఞాంచితచరితప్రసక్త
గురువరమహిమానుగుణగురుభక్త[౪]

..............................

యంచు భక్తానీక [౫]మచ్చెరువంది
యంచితప్రీతి [౬]దుల్కాడఁ గీర్తింపఁ
దడయక గురుకృపఁ దనపదాబ్జములు
వడసె నీక్రియ గురుభక్తయ్య నాఁడు
ఖండేందుధరు భక్తమండలి వొగడఁ
బండితేంద్రుఁడు నేఁడు వడసెఁ బాదములు
దెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారునుజూడ నిల నట్లుఁగాక

---

౧. బరులెఱుంగుదురె యీభవపాశముక్తి. ౨. సరస. ౩. నిస్తరణాను. ౪. ఈపాదముతరువాత ఒకపాద మన్ని ప్రతులలోను లోపించినది. ౫. మతిచోద్య. ౬. దొ.

గురుభక్తాండారికథ

స్ఫుటతరగురుభక్తి పుణ్యాసక్తముఁడు
వటుతరగురుభక్తి పాత్రోత్తముండు
లాలితగురుభక్తి లక్షణాన్వితుఁడు
గీలిత¹గురుభక్తి కృత్యసంయుతుఁడు
ప్రస్ఫురగురుభక్తి పాలనరతుఁడు
విస్ఫురగురుభక్తి విజ్ఞానయుతుఁడు
భ్రాజితగురుభక్తి పారయుతుండు
రాజితగురుభక్తి రసనిషిక్తుండు
నవిరళగురుభక్తి వివశగాత్రుండు
ప్రవిమలగురుభక్తి²పదసుచరిత్రుఁ
డనఁగ నొప్పు గురుభక్తాండారి వీథిఁ
జని వేశ్యవాటికాస్థలముకట్టెదుర
వనిత ప్రౌఢవతినాఁ జనునొక్క వేశ్య
దనదు గృహాంగణంబునను గైసేసి
యచ్చెరువంద విటావళి నెఱక
లుచ్చిపాఱఁగఁ జూచు నుపుదృష్టులుసూచి
యువిద దృగ్రోచులో యొడ్డినయురులో
ధవళాక్షిచూపులో దావాంకురములో

---

౧. సద్భక్తి. ౨. పథ.

మెలఁతకన్నెఱుఁగులో మెఱుఁగులగనులో
పొలతిదృగంశులో పొలయుదీపములో
ముదితవీక్షణములో మోహపాశములో
మదిరాక్షి చూపులో మదనబాణములో
లోలాక్షిదృగ్రుచులోఁ[1] కట్టుబండ్లో
బాలవీక్షణములో పన్నినవలలో
యిలఁ జోద్యమంచు నయ్యింతి దృగ్వీథి-
తులఁ జిక్కఁ బడి యిలఁ దొట్రుకొనుచుఁ
బసరింప నొండేమి భామకన్గొనలఁ
గుసుమాస్త్రహతికిఁ దా గుఱియైయెత్తి, నూఁకి
పోరాదు, వెనుకకు రారాదు, గోలు
పోరాదు తాల్మిఁ, బల్కఁ రాదు సతికి,
నేమి సేయుదునంచు నీశుభక్తుండు
దా మది నూహించి తప్పేమి దీన
నదియును భక్తురా లట్లునుగాక
వడిగొని మ్రొక్కు[2] శైవపురాణములను
నీతిదప్పక 'మైథునే రతా' యనియు
సూతసంహితయందు సురుచిరంబుగను
మఱి 'యత్సుఖం తత్సమర్పిత' మ్మనియుఁ
దఱి మ్రొక్కుఁగావునఁ దనుఁ బొందినట్టి

1. కనుకట్లో; క్షట్టుబండ్లో; కట్టుబరులో. 2. యీ.

సుఖము లింద్రియములఁ జో౯కకయుండ
ఘుఖమెర్గి శివున కాసుఖము లర్పించు
క్రమమెఱింగినఁజాలు గాఁడు దుర్వ్రటుఁడు
శమదమాత్ములకంటెఁ జాల నుత్తముఁడు
నీక్షింప భక్తియం దిదియును నొక్క
పక్షంబు గావున భ్రాంతియేలనుచుఁ
దన చెలికానిచేఁ దన్వికి రోయి
వనుచుచు సతియుఁ దద్భక్తునిఁ జూచి
వలనుగా దనవుడు వాఁడేఁగు దేర
వలవంత వెండియు వానిన పనుపఁ
బొలతి వెండియు నిది వొలుపు గాదనుచుఁ
బలికినవానిన పనిచినఁ జూచి
లలన వెండియు నిదిలాగుగా, దేల
పలుమారుఁ జను దేరవలదు వొమ్మనుచుఁ
బడతి యేక్రమమున నొడఁబడకున్నఁ
గడుఁగడుఁ దమకించి వడి తాన యేఁగి
'కటకటా! రోఁగొనఁగా నొల్ల నంటి
వఁట తన్ను బోలంగ విటు లున్నవారె
నాయిాగి సాలకున్నను నొల్లనంటి
వో యేల తలనిల్వువోయనే పసిఁడి
భవినని యొల్లవో పరమభక్తుండ

నవివేకి యనియెదే నటువొందిచూడు
రూపు లేదనియెదే రూపించి చూడు
ప్రాపు లేదనియెదే భక్తులబంట
దొరయుఁ గాఁ డనియెదే దొరకు బిడ్డండఁ
బురులు లేదనియెదే పురుషార్థపరుఁడ
ధూర్తుండు వీఁడని తోఁచెనే[1] యిట్టి
వార్తయే లేదు నావలన నిక్కంబు
దక్కువెక్కువయని తనొల్లవేని
యొక్కప్రాయము సూడు మొగి నీకు నాకుఁ
జదురుండు గాఁడని మది నొల్లవేని
మదిరాక్షి చూడు నామాటలయంద
మొకనికి వలచి త నొల్లవేనియును
సుకుమారి తనుగూడి చూ డొక్క[2]మాలు
జానొంద గుణములు జాతు లిచ్చలును
యోనిదండంబుల న్యూనాధికములు
సమరతిగాక విషమరతియైన
సమరతి గూర్చునాసనభేదములును
గరణముల్ రతులును గాలవేళలును
బరగు మనోగతభావంబు లెఱిఁగి
బాల యౌవన ప్రౌఢ లోల యనంగఁ

౧. నిట్లు. ౨. మాటు.

దా లలనల వయోధర్మంబు లెఱిఁగి
నెఱయఁ బాదాంగుష్ఠ మఱికాలు గుత్తి
సిఱుదొడ గుహ్యంబు మఱి నాభి ఱొమ్ము
సను మూఁపు మెడ సెక్కు సరి నధరంబు
గను దెప్ప ఫాలంబు గచభరంబందు
గటిక్రింద వ్రేలిడి యట క్రిందఁ బెనుప
నిట ద్రిప్పి వ్రేయఁ జే నిఱియంగఁ బట్టి
మూఁట రేఖలు సూప ముదమున రెంట[1]
నాఁటను గబళింప నలివేణిఁ బట్టఁ
గళలు దా శుక్లపక్షంబున నెక్కు
వలపట డిగి మున్ను వామభాగమునఁ
బొడుచు మన్మథరసాంభోనిధి ముంచి.
మడఁతులఁ దముదార మఱువంగఁ జేఁత
యిది యెంత పెద్ద నా కిందీవరాక్షి
ముదమున నాకు సమ్ముఖ మిచ్చి చూడు
మాలింగనాద్యుచితాలాపములను
లోలత నీవల్పుఁగీ లెడలంగ
నున్మీలితాక్షివై యొండేమి యచట
మన్మథరసవార్ధి మరులుగొనంగ
వెండి నిన్నెఱుఁగక యుండంగఁ జేయ
కుండితిఁ నేని నీ కోడినవాఁడ

---

1. రెంటను.

ననుచు వెండియును దదంగంబులైన
యనునయాలాపంబులను నేర్పు మెఱయ
నాతి దాఁ జిఱునవ్వు నవ్వుచు భక్తి
నీతి విచారింప నీకును నాకు
కెరవుగాదన్నను వెండియు నేర్పు
విరచింపఁగలవె వివేకి వేనియును
నెఱిఁగెడివాఁడవే నింతలోపలన
మొఱఁగంగ వలవదే యెదిరిచిత్తంబు
రసికుండవేనియు వసదక్క యాత్మ
నుసిలిన మఱి మీఁద నో రెత్తఁగలవె
యే వీడఁ బల్కిన భావంబుఁ జూచి
భావజ్ఞుఁడవయేనిఁ బోవంగవలదె
మిండండవేనియు మీఱి రాఁదగునె
వెండి గుంటెనతోడ వెఱవు గాదనిన
వితతరతికళా ప్రవీణుండవేని
రతిఁ జూపకున్కి నీమతి నెగ్గవలదె
తలఁపంగ లింగావధానివేనియును
బాలుపుదక్కినపల్కు వలుకంగఁ దగునె
ప్రాయిఁడితనములఁ బనియు లే దింక
వేయును నివియేల విచ్చేయు మనుడు

న ట్టేలవోదు నే నంబుజ[1]నేత్రి
దిట్టవై యెుల్లని తెలుఁగల్లఁ జెప్ప
మొుడఁబడు మొుండేని నోగి నింకఁ బడసి
కుడువవేనియుఁ జేసికొను మెుండొఁ దన్ను
గాదేని నిది య్యాదిగా మగవారి
నాదటఁ బిల్వ[2]నేనని బాసఁ బల్కు
తక్కుము నీవిప్డు దత్తి మహాదేవి
యక్కవోలెను విషయ[3]భ్రాంతు లొండె
నరుదరుదనఁ దిలకవ్వచందమునఁ
బురుషత్వ మిప్పుడ ధరియింపు మొండె
నేల నిన్నియుఁ జెప్ప నింతులలోనఁ
దాలిమిగలభక్తురాల వేనియును
వీరచోడనిభంగి మారాడఁ గవయఁ
గోరెదేఁ బాదము దక్షారామమునకు
నూరక పొమ్మన్న నోడబడ నేను
గారణం[4]బేమేనిఁ గలదేని యిట్లు
వోను నీవాదొండె నేనాదు నొండెఁ
గాన వేయును నేల కమలాక్షి' యనుడు

---

౧. అన్నిప్రాతప్రతులలోను 'నేత్రి.' ౨. వేనట. 3. భ్రాంతి దలిపా. ౪. బిచియునుగాదేని.

సద్దిరామేలువో హరహర యిదియ
[1]దొడ్డవో తనకు నీతోడికూటంబు
బాపురే మిండండ బాపు భక్తుండ
బాపురే బాపురే [2]పడుచులభ్రాత
నల్లవో [3]భామలయుల్లంబు లెఱిఁగి
గొల్లవాఁడైనను గోరునే కవయ
నొల్లని వెలయాలి నొల్లని నృపతి
నొల్లనిచెలిఁ బాయ నొల్లఁడేనియును
దెఱవల మనసుకీ లెఱుఁగు నతండు
నెఱవిటుఁ డంగజుఁ డెఱుఁగవే కథల
లోకంబు విటులు వివేకులతలల
నీకెలుగట్టితి గాకేమి సెప్ప
నిస్సిస్సిరో మెత్తురే సరివిటులు
వ్రస్సిపడ్డను నీకు వత్తురే సతులు
నీడిగిలంబడు డిది నీకు భక్తి
పాడియే మఱి మిండపాడియే చెపుమ
గజిబిజింపను మాటుగలుపింప నను
బొజుఁగువో మగఁడవో పొందుగావింప
మిడమిడమిడికెదు మేలువో కడవఁ

---

౧. దొడ్డ. ౨. పడతులభ్రాంత. ౩. భామినులుల్లంబు.

గుడిచినారమె పండుగులఁ బ్రబ్బములను
రమణఁ గట్నంబు గిట్నము మాడ మడకె
గమియంగ నిచ్చితో కళవళించెదవు
జానొంద నన్ను విచారించి పలికె
దేనియు మదిఁ జూడుమా నిన్ను నీవ
భక్తుండ వట్లయ్యుఁ బ్రభుఁడ [1]వియ్యార
యుక్తిమంతుఁడవు గుయుక్తులు దగునె
జానొందు నన్ను విచారించి పలికె
దేనియు నుదరార్థిఁగా నిట్లు వినుము:
ఇమ్మున గురులింగమిచ్చిన కాయ
కమ్మిడి [1]యిట్లయ్యుఁ గరకంఠభక్త-
గణములఁ గాని నేఁ గలనైన నెఱుఁగఁ;
గణుతింప నంగవికారిగా, నిట్లు
వడసిన ధనము డాఁపఁగనేర మున్న,
నొడయ లెఱుంగుదు రొండేమి సెప్ప
నెన్నఁడుఁ గనివిని యెఱుఁగను నీవు
నెన్నఁ డెఱుఁగుదు నన్నిట్లు సిక్కింపఁ;
గలపినవాఁడవో కన్నెర్కు మెడయు,
నెలపినవాఁడవో నిండుజవ్వనము,

---

[1] ౧. వట్లయ్యు.

పుట్టినవాఁడవో మున్నొక్కమాఱు,
పట్టినవాఁడవో పడయ నంగళ్ల,
నాపినవాఁడవో యటఁ గొన్నిదినము,
లేపినవాఁడవో యేఁ నీకు వలవఁ,
గలసినవాఁడవో కంచానఁ దొల్లి,
వలచినవాఁడవో వాడపొత్తునను,
నచ్చినవాఁడవో నావారిలోన,
మెచ్చినవాఁడవో మనసుకీ లెఱఁగి,
బెరసినవాఁడవో పెండ్లిండ్ల నిండ్ల,
నరసినవాఁడవో యప్పు నాకిచ్చి,
కాచినవాఁడవో కని తప్పు సైఁచి,
ప్రోచినవాఁడవో బుఱ్ఱగర్వాలను,
నేలినవాఁడవో యిల జీత మిచ్చి,
చాలినవాఁడవో చంప రక్షింపఁ,
బాపినవాఁడవో భవబంధములను,
జూపినవాఁడవో శూలిసద్భక్తి,
వలచినకూర్చినవాఁడవో, తక్కు
పిలుపులవాఁడవో యిల నట్లుఁగాక,
యే ముండఱెల్లాలనో, మఱి లంజ
నో, మేనవదినియనో, మఱఁదలనో,

యిలువుట్టుగొంటినో, యింత నీ కెట్లు
బలువు సేయఁగవచ్చు నిలఁ దేరకాఁడ!
చను, వేడ్కకాఁడు దోసం బెర్గఁ డెందు
నని యాడుమాట నీయం దేను గంటి
క్షితి నతిమోహంబుగతి సే టనంగ
నితరేతరుఁడవె? నీవెఱుఁగవె చెపుమ,
ధర మాన మాచంద్రతారకంబనఁగ
వెరవఱి మానంబు విడుతురే యింత
యీనాఁటనేఁగాని యింతులు లేరె
తా నాఁడుపాడి భువి మానెఁ డమ్మెడినె
జ్ఞానాత్మ శివుఁ గొల్చువానికి నింత
యైనఁ బరేంగితజ్ఞానంబు వలదె?
లజ్జింప విది గడులాఘవం బనవు,
నుజ్జగింపవు సలంబాక్కింత యేని,
వలదన్న మానవు వక్కరించెదవు,
వలనుగాదన్నఁ బోవవు దగదనుచు,
భక్తియుక్తియు మిండపాడియుఁ జూపి
యుక్తి సెప్పిన నెట్లు నొడఁబడకున్న
మఱి యట్లుగాక మన్మథరతులందు
నెఱి రోఁతఁ బుట్టింప నెలఁతుకఁ దలఁచి

యోపి వేకుండ! వేశ్యావిడంబనము
నీవెఱుంగవె మున్ను నిక్క మంగనలు
మిండెతల్, గత్తికి ౧మిగిలినగొంట్లు,
గొంటెంపుఁగోఅవ్వలు, బండెతల్, ప్రుచ్చు,
లెడపరుల్, శఠమతు, లేవంపుఁబుట్టు,
లోడపరు, లుపసంతు, లొగి నోంటికిట్లు,
దులువలు, దొట్టరుల్, దోపరు, లూర
నొలిచి తిండ్లును, డట్టు, లుదరపోషకుఁబు
బొంకులపుటికలు, రంకుల.గొంట్లు,
బంకెతల్, రక్కెతల్, వచ్చిరక్కసులు
రొమ్ములకుంపట్లు, రోఁత ప్రామిండ్లు,
బమ్మెతకత్తెలు, నమ్మనిబోంట్లు
గోపపుంజము, లారగొ, ల్లెత్తుబోల్లు
పాపజాతులు, వినపరులు, వెడ్డరులు,
మాటల ప్రుచ్చులు, మందులమార్లు,
దాటకుల్, దొంగలు, దల్లు, లోడ్డిళ్లు,
నొడవగొంట్లు, ముడియవిడుపులు, సాల
గడుసరుల్, గయ్యాలగచ్చులు, వసిఁడి,
వాపులు, దుష్టులు, వరటలు, గృత్తి

౧. మీటిన.

రూపులు, బరులు, విరోధులు, మృత్యు-
కన్నెలు, వంగులగద్దరుల్, రిత్త
వన్నెకత్తెలు వారవనితలు; మఱియుఁ
జపలముల్ దగులముల్ సంచలత్వములు
గుపితలులాయముల్ క్రూరముల్ వాల్గు
వఱచులు వికృతముల్ భ్రమితలు ముచ్చు
లఱికులు మాయావు లవిచారపరులు
గలుకు లాశావంతములు గర్మమార్గ
ములు బెట్టిదమ్ములు మ్రొగ్గలగములు
స్వవశేతరములు గావలములు దుఃఖ
భవనంబు లింద్రియభ్రాంతిహేతువులు
వా వెఱుంగనిభ్రష్టలు వలఁతియుఁ గులముఁ
దావిచారింపక తగులు పాపిష్టు
లపవిత్రములు ధృతాహంకరణములు
నుపతాపబీజంబు లువిదలదృష్టు
మఱియు వైశికములు మలకలమాట్లు
మఱగులు బొంచు లూబరఁబడిబుల్లు
వచ్చిబొంకులు బహుభావ లిమ్మెచ్చు
లచ్చఁగ్రుచ్చులు ఘోరపాచ్చెముల్ దొంట్లు
మిన్నకరిత్తలు సన్నట్లు వెక్కు-

వన్నెలు మాయలు వరటలు వట్టి
యుపచారములు దీపు లురు లెఱుంగములు
విపరీతములు మదాన్వితము లనంగు
నప్రస్తుతములు హాస్యైకహేతువులు
విప్రలంభంబులు విషయబీజములు
గడుయంత్రజంత్రముల్ నోడుతగితనము
లడియాస లిచ్చలు వెడఁగులు దేఁట
వెడ్డుబుడ్డులు [1]స్రడ్డలొడ్డిసములును
[2]నడ్డ[3]గొడ్డంబులు [4]నొడ్డారములును
దప్పాలు దారులు దడబాట్లు వినఁగ
నొప్పాలు రొప్పాలు నుచితముల్ హృదయ
శల్యముల్ గడుఁ దీఁగసాఁగులు లేని
లౌల్యంబు లలుకలు లఘువు లాలములు
యేనగోసములు దామితరేతరములు
గానముల్ వెలయాంధ్రపానముల్ మఱియు
వితతముల్ మాంద్యముల్ వెలఁదు లస్థిరము
లతిభిన్నములు ద్రిప్పు లల్పముల్ వారలు
మలినముల్ గల్మషంబులు గఠినములు

౧. సడ్డ; సరు; సమ, ౨. దొడ్డరాడ్డంబులు బడ్డపేరెములు, ౩. గి, ౪. బడ్డారపములు.

వలుదెఱంగులదెసల్ [1]వలుచఁదనములుఁ
గలఁకలు గొందుకలు గఱకులు మొఱకు
లిల నపాత్రము లశుచులు నిషిద్ధములు
జడము లొల్లములు నిలజ్జావిహీనములు
నెడమతు లింద్రియహేతుభూతములు
వాతకావాసముల్ వక్షపాతములు
పూతముల్ భంగురంబులు నీరసములు
గపటముల్ నానాముఖములభావములు
గృపణముల్ గండెముల్ గెలసము లరలు
గుపితాలవాలముల్ గుటిలకారణము
లపరాధరతులు వేశ్యలమానసంబు
లననేల వేయు రూపును నేర్పుఁ గల్గు
వనితలతనువు లైనను బరీక్షింపఁ
గమియంగ శ్లేష్మికగతములు నాసి-
కములు, లాలాకీలితములు వక్త్రములు,
గలయ బాష్పాన్వితంబులు నయనములు,
నిల నమేధ్యాగారములు జఠరములు,
దలపోయ వారకాంతల నితంబములు
వలుపాపముల కున్కిపట్లగు మఱియుఁ

౧. చులుక, ౨. నాజ్ఞా.

దొడరి కామాంధులు వడియెడి బ్రాంద
లెడవడఁ గంపువల్చెడి దుర్వ్రణములు
మొదలఁ దా నరివర్గముల పుట్టినిండ్లు
[1]చదలినయట్టియశౌచభాండములు
నుడుగ కెప్పుడు మూత్రమూరెడుకుంట
[2]లడిపికాంద్రును గొట్టుపడియెడుకండ్లు
నిజరజోదూష్యమా నెత్తురుఁగురుపు
లజహరీంద్రాదుల నడఁచినగుహలు
ధరణిరేతశ్శోణితంబులమడుగు
లరయంగఁ బ్రత్యక్షనరకకూపములు
గులహీను లధములు గులజు లుత్తములు
దొలఁగనికలుఁగొట్టత్రోవలు మఱియు
నందగు సుఖము దా నట్లునుఁగాక
చెంద నిత్యంబని చెప్పను లేదు
నలి[3]తనిరంతరాశ్వత్థపర్ణాగ్ర
సలిలకణక్షణ చలనమాత్రంబు
లింతటికై యెడ లెఱుఁగమిఁ జేసి
యింతులఁ గోరి పోయెడిదురాత్ములకు
మానభంగం బొందు, గానమి రెండు,

---

౧. చదికులు. ౨. లడవివారలు. ౩. తానిలాంతరా.

నానసెడుట మూఁడు, నగుబాటు నాల్గు,
మనసుతాపం బైదు, ధనహాని యాఱు,
వెనుపగుముక్తికిఁ బెడబాయు టేడు,
నెప్పాటనైనఁ దా సియ్యేడు సేట్లుఁ
దప్పనే వెలయాండ్రఁ దగులువారలకుఁ
గలసిరి సతులని తలపోయరాదు
గలియు నూనెయు రెండుఁ గలిసినయట్ల
వట్టిరి దమ్మని భావింపరాదు
వట్టుగా జలగలు వట్టినయట్ల
సరసహా రూపని చర్చింపరాదు
వొరపొచ్చె ముడుగ నూసరవెల్లులట్ల
మెలుకువ లెఱుఁగుదు మిల నాఁగ రాదు
జలములలోని మత్స్యంబులయట్ల
విచ్చలవిడి మాటవిం డ్రనరాదు
సొచ్చి కట్టుదు రల్లజూదరుట్ల
కడఁ జూపఁ గుంపిపఁగా మనరాదు
విడిచినఁ బొఱుదుర్ వడి డేగలట్ల
పట్టింపరని వెండి వసరింపరాదు
వట్టి కట్టాడుదుర్ వడిఁ దీఁగలట్ల

---

౧. రొడి.

తేల నర్థంబిచ్చితిమి నా౽గ రాదు
వ్రాలుదుర్ దలలట్లు వరిగింజ సూప
వలతురు సతులని వలపింపరాదు
వలపులన్నియు౽ గార్యవశము లూహింప౽
గావున నిట్టివేశ్యావిడంబనము
లావనితలమాట లాటలు దృష్ట్లు
భావముల్ మనసులు వరికించిచూడ
నేవముల్ గాక యం దెంతసుఖంబు
గామారి భక్తులు గామింతు రెట్లు
వారాంగనాళి నిస్సారసౌఖ్యంబు౽
జీరికి౽ గైకొండ్రె శివభక్తిసుఖులు
[1] వ్రాలెడువారాంగనాలోకనంబు
లాలముల్ గాక శ్లాఘ్యములె భక్తులకు౽
దవిలివారాంగనానివహంబుమాట
లవశముల్ గాక ప్రియములె భక్తులకు
నెసగ వారాంగనావిసరదుర్మతులు
హాసనముల్ గాక సహ్యములె భక్తులకు౽
జారువారాంగనాజన దేహకళ ల-
సారముల్ గాక రుచ్యములె భక్తులకు

---

౧. క్రా.

నాభోగవారాంగనానుభవములు
బీభత్సములకాక స్పృహాలె భక్తులకు
భావింప నిట్టివేశ్యావిడంబనము
లేవముల్గా కవి హృద్యంబులగునె
భావింప భక్తిక్రియావిడంబనవి-
భావను లగుమహాభక్తుల కెందు
గావున భక్తిసంగతుఁడవు, భక్తి
భావనుఁడవు, భక్తిపరుఁడవు, భక్తి
పాలనుఁడవు, భక్తిపాత్రుండ వింత
యేలయా నిన్ను నీ కెఱుఁగకయుంట
యిన్నియు నేల నీవెఱుఁగనిత్రోవ
లున్నవే యెఱుఁగంగ నొల్లవుగాక
తామసులము భక్తిసామాన్యమతుల
మే మాఁడువారము గామచర్యలము
మాకంటె హీనమే మీకు లౌకికవి-
వేకంబు భక్తివివేకం బటంచుఁ
బరగు వేశ్యావిడంబనమును గామ-
హరుమహిమావిడంబనమును నట్ల¹
చెప్పంగ మిండండు సెవి యొగ్గి వినక
యెప్పటిక్రియ మది నేవంబుఁ లేక

౧. మాలి.

ముదము గోపము దెంపు మది దమకంబు
నుదయింపఁ దన్నెర్గకున్నఁ గన్నెఱిఁగి
ధ్యాకమలదళాయతాక్షి దా నంతఁ
బోక వెండి యతని బోధింపఁ దలఁచి
' మిండపాడియు లేద మృడుభక్తి లేద
యొండేమి మది నెప మొక్కింత లేద
చన్నపురాతన శరణులమహిమ
విన్నను సద్భక్తి వికసితం బగునె
చెప్పి చూచెదఁగాక శ్వేతాదిమునులు
దప్ప కాప్తులబుద్ధిఁ దా ర్విన్నవిధము
భక్తిసంపూర్ణమై పరగినవిధము
ముక్తులై శివుఁగూడి మున్నున్నవిధము
నని తలఁచి గురుభక్తాండారిఁ జూచి
'వినుము తొల్లిటిపురాతనులలోపలను
నాప్తుల సద్బుద్ధు లంగీకరించి
ప్రాప్తి జయించినభక్తులు గలరు
నెఱుఁగుదు రుత్తము లెల్లగార్యంబు
లఱలేక తమయంద నగజేశుకరుణఁ
జెప్పినమాత్రానఁ జేసి కార్యంబు
లెప్పాట మధ్యము లెఱుఁగుదు రపుడ

యార్యులు సెప్పినవైన నధములు
గార్య మెఱుంగరు గర్మవశమునఁ
గాన తజ్ఞులు సెప్పఁగాఁ గార్య మెఱిఁగి
రేనియు మేలకా కెగ్గేమి దాన
నిప్పాట రంభయు హితముఁ దలంచి
చెప్పిన వినఁడె మున్ శ్వేతుఁ డట్లనిన.

శ్వేతుని కథ

భూరిదివ్యామృతపూరశరీర
సారతరాప్సరోజనవంద్య రంభ
దనపాలనున్న మదనవికారాంధు
ఘనతరసంచితాఘసమేతు శ్వేతుఁ
గనుఁగొని [1]సస్మితాననపద్మ యగుచు
మనమునఁ దలపోయ మగువ నీక్షించి
తఱిఁదఱి నిర్నిమిత్తమునఁ దన్ జూచి
చిఱునవ్వు నవ్వెన తెఱఁ గేమి యనుడు
నతిదయాభావన నంత నారంభ
ధృతిఁ [2]పుట్ట నతని బోధింపంగఁ దలఁచి
దురితైకమూలంబు[3] దుది నీచరిత్ర
[4]మరిది దా వివరింప నది యెట్టులనిన

1. వి, 2. యెక్క. 3. దుష్టవర్తనము. 4. సరుదార.

నను నీ వెఱుంగఁజొచ్చిననాఁటనుండి
నిను నీ వెఱుంగక నీమదోద్వృత్తి
ధరణిఁ ద్రికాల మదగ్రస్తమైన
కరియునుఁ బోలెను గడుఁగడుఁ[1] గ్రొవ్వి
పాయక రేయునుఁ బగలుఁ గామినుల
మాయల విషయనిమగ్నతఁ బొంది
గుడిఁ గనిదైనను మృడ శరణనవు
గడకంటనైనను గానవు గురుల
మ్రొక్కవు భక్తుల కొక్కమాటైనఁ
దక్కవు దుర్మార్గ మెక్కింతమైన
మున్ను రుద్రాక్షింబు ముట్టి యెఱుంగ
వెన్నడును ధరింప నెఱుఁగవు భూతిఁ
బుట్టితిగాని మున్[2] పుణ్యమన్వార్థ
మెట్టిదో కలనైన నెఱుఁగవు, పాప
కర్మంబు ధర్మంబుఁ గామంబు నేమ
మర్మిలి భోగంబు యాగంబుగాఁగ
నడచుచు మఱియొక్కనాఁడు లంజియకు
నడిఁ బుష్పములు గొనివచ్చు నత్తఱిని
జెనసి[3] పువ్వొకటి యంచితభూప్రదేశ

---

౧. ప్రస్సి. ౨. ముల్. ౩. పువ్వొక్కడుచ్ఛిష్ఠ.

మునఁ దెగిపడఁ బుచ్చికొనఁగ లజ్జించి
యదియు శివార్పితంబని యలపోక
మదిలోన నొక్కింత¹మాత్రంబుఁ దలఁప
నా పోవ నొండేమి యది దొలుమేని
నీపుణ్యఫలమునఁ బ్రాపించె నట్టి
తలఁ పటుగాన తత్ఫలమున నపుడ
ఫలియించె దేవేంద్రపట్టంబు నీకు
నదియుఁ దదియ్యఫలానుభవమున
నిది యొక్కదినము దా నిట్లుగావునను
వేవిను నరకాగ్ని వేగ నేఁగుటకు
నీ విప్పుడు మదించి నిన్నెఱుంగమికి
వగపును నగవును వట్రిల్లె' ననుడు
'వగవంగ నవ్వంగ వనిత నీకేల
పరసతుల్ గలియుగ స్మరుఁ డితం డనఁగ
సరివిటుల్ వీఁడపో జాణ యనంగఁ
బ్రదికితి నిప్పుడ త్రిదశేంద్రభోగ
విదితానుభవసుఖవివశుండ నైతి
నదియునుఁగాక మున్నవికల దేవ
సుదతులతోఁ గామసుఖము లందితిని

౧. మాత్రదలంప.

రంభ! యీ యప్సరోరమణులలోన
శుంభదుదాత్తభాసురకీర్తియుతవు
నిట్టినీతోఁడఁ బంచేషుసౌఖ్యంబు
లిట్టలంబుగఁ బొంద నిదె యున్నవాఁడ
నల్లెడ విజయుండు నిల నేనకాక
యెల్లింటినరకంబు లే లెక్కసేయ
నాపుణ్య శివు[౧]నెద్ది యట్లయ్యె నేని
యాపుణ్యఫలమున నమరేంద్రపదవి
గలిగె నేనియు నొండుగా నేలవచ్చు
మలహరుసేగియు బిలిబిలియగునె
పుల్లవడఁగ నేల పుల్లాంబుజాత
సల్లలితాస్య! రా శయ్యకు' ననుఁడు
'దానికి వేగమ తల్లడంబేల
యే నొండుదెస కింక నేఁగుదునెట్లు?
నీవు నాసన్నిధి నేఁ డుండి యెల్లి
పోవఁ జూడఁగఁ జాల భువి కధోగతికి
నామాట విను వజ్రి నలకూబరాది
కాముకులను సురౌఘంబు గైకొనిన
యమరాంగనాసహస్రావళి నిన్ను

౧. నిది.

బ్రమదంబు సస్నేహ భావంబుఁ దనర
ననయంబుఁ గామసుఖామృతాపార
వనధిని దేల్చెడివా రుండ నుండు
ననువు దెల్పెద నిదె యర్ధరాత్రంబు
సనియె నాయెడ నొకజాము సుఖంబు
గావున నిత్యసుఖావాప్తి నీకు
గావింతు నమ్ము నిక్కమ్మని రంభ
యతని నొడఁబఱిచి యతులరుద్రాక్ష
యుతదేహు విమలభస్మోద్ధూళితాంగుఁ
గావించి యీశ్వరాగారంబుఁ జూప
నావామ సెప్పిన యట్ల శ్వేతుండు
ననమాత్ముగుడిలోని కనవులు దుడుచు
వెస నల్కు మ్రుగ్గు లొప్పెసగ రచించుఁ
బూవుఁ బత్తిరిఁ గోయు వేవేగఁ బఱచి
యావియద్గంగాంబు లాదటఁ దెచ్చు
జలకముల్ సేయుఁ బూజాప్రకాండంబు
లలరించు ధూపదీపాదు లొనర్చు
వలగొని చక్కఁ జాఁగిలఁబడి మ్రొక్కుఁ
జెలఁగుచుఁ గీర్తించు నలిరేఁగి యాడు
నుడుగ కెప్పుడు షోడశోపచారములు

విషువక శివరాత్రి విధి నాచరించు
భావింప నతసపాపప్రాప్తిప్రొద్దు
వేవినక్రియఁ బ్రొద్దువేవుడు వచ్చి
నిన్న నింద్రుండంప నీపాల రాత్రి
నున్నవానిని జూపు మోరంభ యనుచు
గాసిల్లుచున్న యాకాలుదూతలను
డాసి తోడ్కొనిపోయి చేసన్నఁ జూప
భర్గభక్తిక్రియాపరసమంచిత ని-
రర్గళైశ్వర్యసమగ్రత మెఱసి
పరమతపోధన భ్రాజిష్ణులీల
మారు భజాంపుచునున్న యాశ్వేతు దాలఁ
బొడ గని ముందఱ కడుగిడ వెఱచి
వడవడవడఁకుచు వచ్చి కాలునకు
దూత లిట్లని చెప్పఁ దొడ వ్రేసికొనుచు
శ్వేతుఁ డీగుడిలోన శివు భజించెడిని
యేమేమిరా రంభ యేమి పంచినదె
యామహాదేవుఁడే యడ్డ మాతనికి
నననేల యింక నాయధికార మొప్పఁ
గొననిమ్ము రుద్రుండు గోపించెనేనిఁ

బలివరకు[1] తప్పఁ దల్పొలిదా ననుచుఁ
బలితెంచు జముకెౌద్రభావంబుఁ జూచి
కాలారి యల్గి కరాళశూలమునఁ
గాలునివక్షంబు గాడిపో వైచె
నమరులు గీర్తింప నంత శ్వేతునకుఁ
బ్రమథ సదైశ్వర్యపట్టంబుఁ గట్టె
రంభోపదేశవి[2]స్రంభైకగతిని
శంభు శ్వేతుండు ప్రసన్నుఁగాఁ బడసెఁ
గావున హితలగు కాంతలబుద్ధు
లేవెంట హితమకా కేల యొండగును

మలహణునికథ

మఱి [3]యట్లుగాక విన్ మలహణుఁ డనఁగఁ
గలికంఠభక్తుండు గవిరాజనుతుఁడు
విటపుంగవుం డొక్క వేశ్యయుఁ దాను
బటుతరాన్యోన్య విస్ఫారానుమతిని
వలరసం బలర సమ్మిళితసౌఖ్యంబు
దళుకొత్త వర్తించుఁ దత్ప్రస్తవమున
నెట్టణ నేలకు నింగికి సూత్ర-

౧. తక్కఁదాపాటిదా. ౨. జృంభితమతిని. 3. యట్లులును గాక.

పట్టె, మోకాళ్లును బట్టతలలును
ముడివెట్టి తనసేడఁ గడవంగఁబాఱి,
వడి నెండమావుల కడగాళ్లు గట్టఁ,
బాయక రెండుగాఁ బాఱెడు నీరు
[1]ప్రేయంగఁ, బులిజున్ను గోయనియమ్మ,
శా నార యొలువఁ, జట్రాతిపైఁ గ్రుంక,
నేనుంగు పురుషోమ, నిసుకత్రా[2]డ్వేన,
లలిఁగొన దిశలు దాలములు వాయింపఁ,
జెలఁగుచు[3] ఠోఁకటఁ జిగురులు గోయఁ,
గలి వెన్న[4]ఁ బుచ్చ, గొండలు దొంతి పేర్చ,
నిల మంచుఁ గుంచానఁ గొలువ, రేవగలు
సేయఁ, నాకసమునఁ జిత్రరూపములు
వ్రాయ, వాయువుఁబట్ట, వడగండ్ల గుండ్లు
గట్ట, వెన్నెలఁ[5]బ్రోవుగాఁ జేయఁ, జచ్చి
పుట్ట, నప్పడ సేర్చు బుద్ధుల ప్రోక
[6]గోలాసకత్తియ [7]గొరబనప్రోడ
యాలంజతల్లి దా నల్లునిఁ జూచి

---

౧ ప్రేయఁబులిజున్నుగోఠోయని. ౨. డ్వేయ. 3. ఠోఁకండ్ల. ౪. గ్రొవ్వ. ౫. గుంపు; గాము; గోవు; గోపు; గోక; నేయ. ౬. గోలాట. ౭. గొడ.

పిన్ననాఁటనుగోలె నిన్నకా నెఱుఁగ
వెన్నడు మాబిడ్డ గన్నెకూరిమిని
వలచుట పాపమే, వట్టి [1]బేటంబు
నలుపుట నీతియే, సరిపిటుల్ సగరె,
గాదియకొలుచౌనో నీదొరతనము,
గాదేని [2]దొడవా నీకవిత గాంతకును,
ముడువఁ బసిఁడియె నీనుడుపులతీపు,
గడుఁగాక నీభక్తిగతి తెర్వ మాకు
నెట్టేల మేలుమే లెల్ల [3]సొమ్మలయఁ
బెట్టినాఁడవె నీవు వెనుపండువులను,
వీరభద్రునియాత్ర వెలఁదులు వోవ
హారముల్ రోయిడి యరిగె మాబిడ్డ,
యంగుళీయక మమ్మి యాశివరాత్రి
జంగమారాధనం బంగన సేసె,
నింతులుమెచ్చ వసంతోత్సవంబు
గాంత సేసెను హస్తకటకంబు లమ్మి,
తరలాక్షి ముందటి [4]దవనపున్నమను
[5]సరిపిణి రోయిడి గురుకట్న మిచ్చె,

---

౧. పంబింబు. ౨. దొడవౌనెకవిత. ౩. రొమ్మరువ; రొమ్మె రువ. ౪. తమస; దవన. ౫. సరిపణల్.

నూలిపున్నమనాఁడు నూపురం బమ్మి
బాలభక్తుల కొప్పఁ బండువు సేసెఁ,
బదకంబు రోయిడ పడతి దివ్వెలకు
మదనారికిని దీపమాలిక లెత్తె,
నిడెవచ్చెఁ బులివలె నీశివరాత్రి
ముదిత రోయిడఁ బుచ్చె ముత్తెంపుసరుల,
నెన్నఁడు వెట్టంగనున్నాఁడ విట్లు
సన్న యేనాఁటను సతి వెట్టిగలదె,
యెఱుఁగవే యెఱిఁగియు నెఱుఁగనియట్ల
వఱటలఁ బెట్టుచు వచ్చెదుగాక
పొలయఁ గయ్యము వన్ని గెలు[1]పిచ్చి చెనఁకి
యలిగినఁ గీడ్వడి [2]యలరించి తవిలి
పాసినఁ బైఁబడి పట్టిన స్రుక్కి
ప్రేసిన నొడలొగ్గి డాసినఁ గవిసి
సొగసిన రతిసేసి చొక్కినఁ జొక్కి
మొగిచినఁ గైకొని మునుకొన్నఁ బొదవి
మాటల మరగించి మక్కువ నించి
కూటమి మనసిచ్చి కూరిమి సొనిపి
కళలపోఁడి మెఱింగి కామంబు సలిపి

---

౧. పించి. ౨. యెలయించి.

వలరసంబున ముంచి లాలనఁ జొక్కించి
యలసిన శ్రమమార్చి యన్నియుఁ దెలిపి
మలయుచు మురియుచు మగలంజవోలె
మానాతి వలపించి యేనేఁడు నీవు
గానక తలక్రిందుగా నడచెదవు
డక్కులు శేవలు డంబు[1]కంబులును
జొక్కులు నేర్పులు [2]సూటిమాటలును
సంగతి [3]నీకామశాస్త్రముల్ బిడ్డ
[4]కన్నట్టి కాళ్లను గట్టింప నెట్లు
విచ్చేయు నీయాగి వేయును మాకు
[5]వచ్చెఁ దక్కును చాలు వనిత నీవనుచు
[6] దండించి తర్కించి తనకూఁతు నొక్క
మండలాధిపుపాల నుండఁ [7]బంచుడును
నంత నిక్కడ మలహణుఁడు గామాగ్నిఁ
గాంతావియోగదుఃఖం [8]బిన్మడింపఁ
దనుధర్మములు దక్కి తన్విభావంబు
మనమున నెక్కొన మును బద్మనేత్రి

౧. రంబు. ౨. సొగసు. ౩. సంగజు. ౪. కంగటి. ౫. వచ్చెనుజాలుఁనీవనితనుగూడ. ౬. దండింపశంకించి. ౭. బుచ్చు. ౮. విరహాగ్ని. ౯. బెబ్బ.

౧దవ్రులంబుతోఁ జూచు ౨తలఁపుఁ దలంచుఁ
బవడంపుఁగెమ్మోవి భావంబుఁ దలఁచు
దాసిన హర్షించు తాళంబుఁ దలఁచుఁ
జేసినశృంగారచేష్టలు దలఁచుఁ
జెలఁగుచు నవ్వెడుచెన్నుఁ దలంచు
నలరుచుఁ బులకించు నలువుఁ దలంచు
౩మాటమాటకుఁ జూచు మక్కువఁ దలఁచు
మాటలఁ ౪బిచ్చిల్లు మధురంబుఁ దలఁచు
సరసంబు లాడెడి౫జాను దలంచుఁ
గరమొప్ప నెమ్మోము కాంతిఁ దలంచు
నంగదీధితుల యొయ్యారంబుఁ దలఁచుఁ
బొంగారు జారుఁ గొ౬ప్పు సొగసుఁ దలఁచుఁ
గలికి ౭క్రాల్గన్నులపొలుపుఁ దలంచుఁ
౮దెలుపారి మెఱుఁగెక్కు పలువర్సఁ దలఁచుఁ
గుటిలకుంతల౯ముల కొమరుఁ దలంచు
బటువగు నెఱివేణి౧౦భారంబుఁ దలఁచుఁ
జెన్నుగా నసియాడు నెన్నడ్ముఁ దలఁచు

---

౧. తవిలించితను. ౨. తవులంబు. ౩. మాటిమాటికి. ౪. బిచ్చుర్లు. ౫. జాను. ౬. ప్పునునొప్పు. ౭. వా. ౮. తెలుపారుపల్వర్స, తేట. ౯. కొప్పు. ౧౦. భావంబు.

సన్నుతికెక్కిన జఘనంబుఁ దలఁచు
నెఱసినపాలిండ్ల నిగ్గుఁ దలంచు
నఱగొఱలేని నెయ్యంబుఁ దలంచు
లింగార్చనము సేయు లీలఁదలంచు
జంగమారాధనాసక్తిఁ దలంచు
మేలంబులాడెడి [1]మెలపుఁ దలంచు
నాలింగనాదుల కీలుఁ దలంచు
మఱిమీఁది రతికళామదనసౌఖ్యంబుఁ
దఱిదఱి వెండియుఁ దలఁచితలంచి
యుండఁజాలక యవ్వియోగదుఃఖాగ్ని
మండంగ ధృతి [2]సిగ్గు మానంబు వదలి
యడలుచు సతిమాట లయినను వినక
తడసిన నిలుచునే తనప్రాణమనుచు
రమణి కేళీమందిరముపంచఁ జేరి
కుమతియై [3]సతిచెల్మిఁ గోరుచున్నెడను
వెండిలోపలఁ గ్రొత్తమిండనిపాలఁ
గొండొకప్రొద్దుండి కోమలిదల్పు
గ్రక్కునఁ దెఱచి యక్కాంతుపై నీళ్లు
పుక్కిలించుటయును నొక్కింతమెఱవ

---

౧. మెలుపునుదలఁచు. ౨. నీతి. 3. శూరిమి; చెలువము.

నెలనాగ గని 'యిది యెవ్వరు మీరు
మలహాణ నీతియే [1]మఱలి యేతేరఁ
[2](దక్కిపోయినమీఁదఁ దనువున జీవి
దక్కినవచ్చునే ధర్మమే యిట్లు)
మెఱచినఁగాని [3]యిమ్మెయిఁ గానరాని
నెఱసిన చీఁకటి నీయున్కిఁగాన
కుమిసితిఁ బైఁబడనోయెర్గ' ననుచుఁ
ధమకంబువట్రిల్లఁ దన్వి సెయ్యిచ్చి
యడలుచు వెడలి విటాశ్రమంబునకుఁ
దోడుకొని పోయి పైఁబడుదు మల్హణుఁడు
గట్టర్మి నినుఁజూచి కాని ప్రాణంబు
వట్టఁజాలక వచ్చి పడతి నిన్ గంటి
నాతతంబుగఁ జాలు నంతియకాక
నీతియె వరుఁడుండ నిను నాకుఁ గవియ
నింతప్రొద్దుటికి నోయిచ్చినవాఁడు
గాంతుండు గాకంచు గమనంబుసేయ
నెట్టింకవలతు నీ కేనును నీకు
నట్టిద వలపు నాయందు గావునను

---

1. మగిడి. 2. కుండలీకరణముచేసిన రెండుపంక్తులకును సంస్కృతానువాదము లేదు. 3. యె.

దమతల్లియర్థంబు దనియంగనీక
తమకంబెఱుంగదు దర్శించు మనల
సద్భక్తిపరుఁడవు సత్కవీశ్వరుఁడ
వద్భుతకవితాసమగ్రత మెఱసి
పైచని యద్దంబుపై మిన్నగింజ
వైచినఁ బడు నెంతవడి నంతమాత్ర
యిద్ధసమాధిభూయిష్ఠతఁ దగిలి
శుద్ధత నేకాగ్ర సుఖమనోవృత్తి
హరుఁ బ్రశంసింపుమా వరదుఁ డయ్యెడిని
జిరభుక్తిముక్తులు సిద్ధించు మనకు
ననవుడుఁ జనుమొన లర్థి నాపీఁపు
నను మోపి యాలింగనం బాచరించి
యుండుము నావెన్క నుడురాజవదన
యొండన నేల నే నొక్కపద్యమున
మాటలాడించెద మనతోడఁ జంద్ర-
జూటుఁ బ్రసన్నుగా సుదతి కీర్తింతు
ననవుఁడు మఱునాఁడు హరుని నివాస
మున కేఁగి పరమేశు ముందఱ నిలిచి
నెలఁతయు నట్ల తన్నెక్కొని యుండ
మలహరుపై దృష్టులు నిల్పి సన్మతిని

దనరు సద్భక్తి "గాంతా కచప్రచయ"
యనుచు నుద్యుక్తుఁడై హరుమనం బలరఁ
బ్రస్తుతాలంకార బంధురమధుర
విస్తారమతి మల్హణస్తోత్ర మనఁగ
నప్పాడ ముప్పదియాఱు శ్లోకములు.
సెప్పినంతట మెచ్చి శివుఁడు మల్హణుని
లంజియచిలుకను. లంజియతల్లి
లంజ నక్షణమ కైలాసంబునకును
బ్రవిమల కనక దివ్యవిమానములను
భువనముల్ వొగడంగ బొందులతోన
కొనిపోవఁ జనిరి గావున హితమైన
వనితలబుద్ధులు వినుట హితంబు

కుమారపాల ఘూర్జరుని కథ

గణుతింప నట్లల కటకంబు భక్తు
లణకించిపలికిన నదియ హితంబు ;
ఎట్టన్న వీరమాహేశ్వరాంకుండు
ధట్టుండు దురితఘరట్టుండు ఘనుఁడు
వాలిత సద్భక్తిపరుఁడు గుమార
పాలఘూర్జరుఁ డను పార్థివేశ్వరుఁడు
వానందలీలమై. న ట్లొక్కనాఁడు

దానును సతియు నెత్తంబాడు తఱిని
గాంత! ప్రసారు లేకాదశేంద్రియము
లంతశ్చతుష్టయంబు బంచ దొక్కమూఁడు
నారయ మోహంబునను నలోకాను
సారులు నెత్తంపు సారులుగాఁగఁ
జను పరిపూర్ణప్రసాదావధాని
దనపదియేను నత్తరళాయతాక్షి
వదియేను నేర్పను పలకపైఁ బెట్టి
వది నిహపరములన్ వాడలయందు
వాపపుణ్యము లను పాసికల్ వైవఁ
బ్రాపించు ఫల మెన్నఁబడ దాయముగను
భక్తియు నీరైఁదుఁ బాఱెఁ బొమ్మనుచు
వ్యక్తినా నీరైఁదు వచ్చిననాఁడు
పరము నిహంబనఁ బరగు నీ దుగను
హరుభక్తి ప్రబలు నానాఁడు నిద్దుగను
ద్రివిధలింగములకుఁ ద్రివిధార్పణంబు
లొనరించు నిత్తిగ యను దాయ మాడుఁ
వలవ దచ్చోక మాటలు నీకు ననుచు
నలఘుఁడు దచ్చోక ముని దాయమాడుఁ
బంచేంద్రియములకు భవ్యప్రసాదంబుఁ

బంచిపెట్టినమాడ్కిఁ బంచియవెట్టు
దోసకార్లకు జౌక దుగఁబెట్టునట్లు
గాసిలనాడుఁ జౌక దుగంబు వడిన
ననయంబు నీశరణ్యము వీరభద్ర!
యనుచు వీరుఁడు భద్ర మను దాయమాడు
నోడలు సత్తా శివయోగుల కనుచుఁ
దడయక యాడు సత్తా యని పడిన
నాకు నా తీవంచనయె గెలుపనుచు
నాకాంక్షఁ దీవంచయను దాయ మాడు
వనిత మెచ్చవు వంచవైచిన ననుచు
సనఘుఁడు సావంచి యనుదాయ మాడు
నీనెత్త మిట్లాడ నితరులతరమె
పూని యీశ్వరుకృప లేనివారలకు
నంచు నంతంత భక్తావళి వొగడ
నంచితభక్తిసమగ్రత దనర
నాదిభక్తి విరుద్ధమైన జూదపు వి-
నోదంబు భక్తివినోదమై పరగ
వేడుక నిట్లాడియాడి యాచంద్ర
చూడభక్తుఁడు దనసుదతి వీక్షించి

---

౧. దంబుగాఁగ.

దరహాసభావవిస్ఫురితాస్యుఁ డగుచు
నరనాథవల్లభి నలుదెసల్ సూచి
యిరువురమునుదక్క నొరులు లే రిచట
నరయంగ నొండుగార్యము మున్న లేద
యేమియుఁ గో నెపం బీదరహాస
ధామంబు నిర్నిమిత్తము దన్న ముంఫ
నంచు నీసును సిగ్గు నటు దొట్రుకొన స-
మంచితాననపద్మ మల్లన 1ముడిచి
పాసికల్ నెత్తంపుఁ బలుకపైఁ బెట్టి
యాసతి యంతట నాట సాలించి
యనఘ! నిష్కారణ హాసంబు నీకు
జనియించుకతన సంశయమయ్యె నదియు
సతత బాహ్యాంతరార్పిత సావధాన
వితత సుఖానంద మతిశయించినను
దప్పితి నయ్యవధాన మేనని యొ
యప్పు డేమేని నాయం దెగ్గుఁ గనియొ
నెత్తమాడుట భక్తి నీతి గా దనియొ
తత్తరపడి సారెఁ దప్పఁబెట్టితినొ
పాసిక లొండొండ పట్టివైచితినొ

---

1. మోడ్చి.

యీసారె వలుకయు నే గెల్వ ననియొ
పాలిండ్లపయ్యెద బయలువర్చితినో
వేఁలంపుమాటల మెలవుఁ దప్పితినో
పోయినరే రతిఁ బూరగింపమినో
కాయజుఁ డెదఁజొచ్చి కరముఁబట్టిననో
వచ్చిన సారెయే వచ్చెఁ బొమ్మనియొ
చెచ్చెర ద్విగుణంబు సేసి యుబ్బిననో
సారియ దూరానఁ జంపితి ననియొ
యూరక నవ్విన కారణం బేమి
యొడఁబడఁ దత్కార్య మున్నట్లు సెప్ప
కెడపితివేని నీయడుగులయాన
యనవుఁడు ఘూర్జరుఁ డాటసాలించి
ఘనుఁడు వెండియు నవ్వుచును సతికనియె

[1]ఓహిళుని కథ

వినుము సౌరాష్ట్రంబునను సోమనాథు
ననయంబు భజియించు ననుఁగుభక్తుండు
నోహిళుండనఁగ సమున్నతికెక్కు
మాహేశ్వరుండు సన్మార్గానువర్తి

---

౧. మోహిళుఁడనియుఁ బాఠాంతరము. సంస్కృతానువాదమునుబట్టి 'ఓహిళుఁ'డనుపాఠము నిర్ణయింపఁబడినది.

యాతనిచారిత్ర మది యెట్టులనినఁ
జేతోభవారికిఁ జెప్పఁ జిత్రంబు
హారు సోమనాథుని యాజ్ఞన వచ్చి
పరమభట్టారకుఁ, బరమేశు, భువన
సేవ్యు, సౌరాష్ట్రంబు శ్రీసోమనాథు
భవ్యుని గని పదాబ్జంబుల కెఱఁగి
యానందబాష్పపూర్ణాననుం డగుచు
మేన ముత్పులుకలు మిళితమై తనరఁ
గంఠంబునందు గద్గదిక నెక్కొన న-
కుంఠితభక్తి భర్గుని నుతింపుచును
మంగళరుద్రాక్షమాలికాధరుఁడు
సంగతభసితసర్వాంగుండు నగుచు
నలి సముద్రోదకంబులను సహస్ర
కలశాభిషేకంబుగా నాచరించి
ప్రీతిమై నచ్ఛిద్రబిల్వపత్రము వి-
నీతుఁడై శివుమీఁద నిండారఁ బూన్చి
యనుపమంబగు మహిసాక్షి గుగ్గులము
దనమెత్తు వెట్టి యంతయు ధూపమిచ్చి
యంచితంబుగ మంగళారతు[1]లెత్తి

---

[1] లిచ్చి,

పంచభక్ష్యాన్నముల్ భవున కర్పించి
వసుసను వేమార్లు వలగొని మ్రొక్కి
హాసఁ బెక్కువిధముల ననుకీర్తి సేసి
పాయక యిమ్మాడ్కి భగ్గు సౌరాష్ట్ర-
నాయకు శ్రీసోమనాథునిఁ గొల్చి
యనయంబు మహిసాక్షి యదియాదిగాఁగఁ
దనమెత్తు నిత్యంబుఁ దప్ప కర్పింతు
నిదె నియమంబని మది నిశ్చయించి
మదనారిఁ గొల్చుచు [1]మహిని వర్తింప
నార్జితయశుని ఘూర్వార్జితవిత్త
మూర్జితంబుగ గుగ్గులోపయుక్తముగ
సమయుడు నాత్మలో [2]సంశయం బుడిగి
తమనియమం బెట్లుఁ దప్పనే యనుచు
నిడువగ లిదిరాత్రి యిదిప్రొద్దుఁ బొడుపు
నది మెట్లుపోవచ్చు నడవికి ననక
యంతఁ బశ్చిమసముద్రాంతికానంత
కాంతారఘోరదుర్గంబుల కేఁగి
గుగ్గులుతరువుల కూటువ లరసి
యగ్గలంబుగ మహిసాక్షి [3]సాధించి

---

1. మఱియునర్పింప. 2. సంచలం. 3. గావించి.

చొక్కంబుగా నటు శోధించి రెండు
దిక్కులు కావట నొక్కొత్తు వెట్టి
చందనతరువుల కందువ కేఁగి
నందితంబై యొప్ప నాలుగుజాల
గంధంపుఁజెక్క లాకాంక్షమైఁ దెచ్చి
బంధించి [1]కావటి పక్కిళ్లఁ జెరివి
వెల్లుగాఁగ నఖండబిల్వపత్త్రియు
మెల్లన శోధించి మృదుతరంబైన
సరసతరంబైన సురుచిరంబైన
పరిపూరితంబైన బంధురంబైన
నడులేతమై సువర్ణప్రాప్తమైన
కడివోనిదైన యకాలిన్యమైన
కోమలంబైన యకుంఠితంబైన
యామోదకరమైన యనుపమంబైన
యచ్ఛిద్రమైన శుద్ధాత్మకంబైన
స్వచ్ఛతరంబైన సచ్ఛవిమైన
జంతువర్జితమైన సమరసంబైన
యెంతయుసొంపైన [2]యింపు డంబైన
యపరిమితంబైన యసమానమైన

---

౧. కావళ్లపక్కలం. ౨. యింపర; యింపప.

యపరిహార్యంబైన హారయోగ్యమైన
భాస్వరంబైన వికస్వరంబైన
సుస్వాదితంబైన [1]శోధితంబైన
యానందయుతమైన యపవర్గహేతు
వైన యఖండితంబైన యఖండ
బిల్వపత్రము లతిప్రీతి సద్భక్తి
నల్వురు వట్రిల్ల ఘనంబుగాఁ గోసి
సజ్జ నిండఁగఁ బెట్టి [2]చాఁకిట నిశికి
హ్యాజ్జన్మ రిపుభక్తుఁ డిల గుగ్గులంబు
భావించి ధాతుకప్పడమునఁ గప్పి
కావడి తూఁకువగా వడిఁ దాల్చి
సంతసం బల[3]రార జనులు గీర్తింప
నెంతయు రయమున నేతెంచుచుండ
నంతకుమున్న యొప్పాగ నాళికులు
గాంతిపూజయును లతాంతపూజయును
గావించి తగినశృంగారంబు నేసి
[4]దేవు శ్రీసోమేశదేవుసన్నిధిని
ననఘులు దపసులు నాదిబాహాత్త-
[5]రి నియోగమున నతిప్రియభక్తిఁ గొలువ

---

౧. శోభి. ౨. చంకిట. ౩. రంగ. ౪. దేవునిశ్రీసోమ. ౫. వి.

నిది యవసరమగు నిదికాదు నాక
మదనారిఁగొలుచునప్పుదము నట్రిల్లి
గ్రక్కున గుడిసొచ్చి కావడి డించి
యక్కజంబుగ సముద్రాంబువుల్ దెచ్చి
స్రుక్కక యటమున్న శోభిల్లు పూజఁ
జక్కన నటనూఁకి జలకంబు సేసి
సంధిల్లఁ దడియొత్తి శంభున కిచ్చ
గంధంబుఁ దివిచి యాకాంక్షమై నలఁది
పల్వగల్ దక్కి సద్భక్తి నఖండ
బిల్వపత్త్రిరి నెలఁదాల్పుఁ బూజించి
మహిఁ బ్రోఁకమైయున్న మహిసాక్షి గూడ
దహనాంబకునకు నెంతయు ధూపమిచ్చి
ధూర్జటి యవధారు ధూపావసరము
దర్జితభవ యవధా రవధారు
కారుణ్యమూ ర్త్యవధా రవధారు
సౌరాష్ట్రపతి యవధా రవధారు
సోమార్ధశేఖర సోమనామాంక
సోమాగ్నిరవినేత్ర సోమేశ యనుచు
వసుధఁ జాఁగిలిమ్రొక్కి నొసలఁ గేల్మోగిచి

వెస బొబ్బలిడుచు [1]సంప్రీతి నార్చుచును
[2]ఘోషియించుఁ జాంగుభళా యంచు ఘంట
వాయించుచును గణావళిఁ దలంచుచును
నాడుచుఁ గునియుచు హరు[3] నుతింపుచును
బాడుచుఁ జెలఁగుచుఁ బ్రభువ సోమేశ
భస్మ[4]మయ్యెడమ నాపాపప్రకరము
లస్మత్కృతైక ధూపాగ్ని చే ననుచు
నోహిళదేవుఁ డత్యున్నతసుఖకు-
తూహలం బేర్పడ ధూప మర్పించి
తక్కినపూజావిధానంబు లెల్ల
దక్కువ[5]వడకుండఁ దా నాచరించి
ప్రతిదినంబందు ని[6]ష్పాటన నడవ
నతులకోపోద్రిక్తు లగుచు నగ్గాళ
తపసులందఱుఁ గూడి తమపురి నిట్టి
విపరీతములు దొల్లి వినమ కన్గొనమ
యొక్కభక్తుండ లే యోహిళుఁ డనఁగ
నెక్కడనుండియో యేతెంచినాఁడు
గన్నులఁ గానఁడు గర్వమై యెదిరిఁ

---

౧. నొప్పెసగె; సాంపెసగె. ౨. ఖే. ౩. వలంచు. ౪. మాఁగాక. ౫. గాకుండ. ౬. ష్పాటవర్తింప.

దన్ను నెఱుంగఁ డెంతయు మదోద్వృత్తి
నిక్కంబు దా నొక్క నియమస్థుఁ బగిదిఁ
జక్కఁ ద్రొక్కఁడు నేల నొక్కింత యేని
నడవిచెట్టులబంక లాకులు నలము
వెడవట్టి చెక్కలు వెల్లుగా మోచి
కొని¹ తెచ్చు వడిడించు గుడిఁ²జొచ్చుఁ బూజ
యును బుచ్చు మఱియిచ్చుఁ దనమెచ్చు పూజ
నచ్చగు తోలుపూజ వుచ్చినఁగాని
చెచ్చెర మఱి పూజ సేయంగరాదె
శివు హరిప్రభృతులు సేసినపూజ
నవల నూఁకిన భృంగియానో తానిట్లు
సెలఁది మున్నల్లిన శివుమీఁది పూజ
యలిగి నూఁకినకరియగునె తా నిట్లు
సెన్నారఁ దపసి పూజించినపూజఁ
గన్నిడి నూఁకినకన్నప్ప యగునె
భూసురుల్ ముదనూరఁ బూన్చినపూజ
³గాసిల్లినూఁకిన దాసయ్య యగునె
చనుఁ దొంటిపూజ మెచ్చ క⁴రాలఁ బూన్చు
మనసాంఖ్యతొండండగునె యట్లుఁగాక

౧. వ. ౨. జొచ్చిపూ. ౩. గాసిల్ల. ౪. రాళ్ల.

యనవసరంబున నభవాలయంబు
నను జొరను దన కింత నన వెట్టుగగ్గె
నుపమన్యు గణనాథుఁడో వృషాధిపుఁడొ
యుపమింప దూర్వాసుఁడో భృంగిరిటియొ
కా దేని సద్భక్తగణములం దొకఁడొ
యాదటఁ దా నెప్పుడైనఁ జొరంగ
హరి సోమనాథు మున్నర్చింపవచ్చి
చొరనోడియుండె నీశుకనాసియందు
మృడునవసరముఁ దాఁబడయునంతకును
గుడివెలి నజుఁడుండె మృడు నుతింపుచును
ననిమిషపతి యిమ్మహాదేవుఁ గొలువఁ
జని కాచికొనియుండుఁ గను తెప్పలిడక
హరు నవసరమగునంతకు రవియు
సరసిజంబులు గొని తిరుగుచునుండు
వేళయౌనంతకు విశ్వేశుఁ గొలువ
పూళిన చంద్రుఁ డేమఱకుండు నెపుడు
నినింతింతవారల కీశ్వరావసర
మింత దుర్ఘటమన్న నితఁ డెంతవాఁడు
ననవేల యనుగకుమన్నను బ్రెగడ

౧. సుక. ౨. నింతటి.

తనమున్న దెట్టు లీతని; కింతయేల
చొరకుమన్నను గుడి సొర నెట్లువచ్చు
నరుగుమన్నను నిల్వ నది యెట్లువచ్చు
నాది నంతర్వర్తు లగు¹ పోధనుల
కాదట గుడిసొచ్చి యర్చించు ²డిదియుఁ
బరదేశులకు నున్న పరిచారకులకుఁ
జొరఁగరా దీగుడిసొచ్చినఁ దప్పు
గడువడిఁ గొల్చు నాకాంక్ష గల్గినను
గుడి వెలినుండియ కొలువ నిమ్మనుచు
నాజ్ఞాపనము సేసి రాఁగాళతపసు
లజ్ఞులై యోహిళయ్యను బవలెల్ల
లోపలఁ జొరకుండఁ గాఁపిడి రాత్రిఁ
దాపసుల్ వాకిళ్లఁ దాళముల్ వెట్టి
యరుగుడుఁ దొల్లింటియ ట్లోహిళయ్య
యరుగుడు సోమేశుఁ డర్ధరాత్రంబు
నెఱిఁగి తలుపులు వాఱఁ దెఱచుడుఁ జొచ్చి
వెఱవ కెప్పటియట్ల విభుని భజింప
వేవినఁ దపసు లీవృత్తాంత మెఱిఁగి
భావజహారునకు భక్తుండౌ వీఁడు

౧. టిదియు; నపుడు.

నాసక్తి రామేశుఁ డమ్ముదునూర
దాసయ్యకును మున్ను దలుపులు దెఱచె
నఱలేక కిన్నరయ్యకుఁ గటకముసఁ
దెఱచెఁ దల్పులు వాఱఁద్రిపురాంతకుండు
దిరుమడక్కడయందు దెఱచె మున్ దలుపు
లురుకీర్తి బ్రహ్మేశుఁ డొడయపిళ్లకును
నిమ్మవ్వ[1] కేడుదినమ్ములు శివపు-
రమ్ము తల్పులు శివారమణుండు దెఱచెఁ
దఱి నింక[2]నితనికిఁ దలుపులు దెఱచెఁ
గఱకంఠుఁ డనుచెల్ల గపటంబుగాచె
మనయాజ్ఞఁ దా లెక్కగొన కర్ధరాత్రిఁ
జనుదెంచి కుటిలుఁ డేచందంబు[3]నందు
గుడిఁ జొచ్చి తొల్లిటివడువునఁ జేయు
వెడమాయములు నేసి వెడలినవాఁడొ
యిదియది యననేల యీయూర నితఁడు
గదలకుండినమీఁదఁ గార్యమెట్లగునొ
పురి వెడలింపమి బుద్ధిగా దొక్క
వెరవున నెట్లైన వెడలింపవలయు
భిక్షుముల్ మనయిండ్లఁ బెట్టకయున్న

1. కైయేడ్డి. 2. నోక. 3. నంద.

నుక్షవాహానుభక్తుఁ డోహిళుఁ డెటుఁగి
జలపత్ర వాలుకానిలకందమూల
ఫలశిలాహారులై భక్తులు వొల్లి
దపములు సేయుచు నపహృతకాము
నపరిమితప్రీతి నర్చింప రెట్టు
లట్టేల ప్రాణంబు లట వాసి చనిన
మిట్టి శిరము దెగి మేదినిఁ బడినఁ
గొంకునే చాబొంకు బొంకనుఁగాక
శంకరార్చన సేయు సద్భక్తిపరుఁడు
గాన భుక్త్యర్థమై కళవళించినను
దా నవ్వఁడే యుమాధవుఁ డట్లుఁగాక
తలఁపఁగ మాతృకాస్తన్యంబునందు
నలరిననాఁటిదేహమకాదె యిదియు
నవిగాక యింతంతనవనీతమునను
నవకంబు నొందిన నాఁటిదకాదె
యదియునుఁగాక మితాహారమునను
బొదలినయద్దేహ మిది తానకాదె
యంతకంతకు మను చాకాంక్షసేయ
నంతకంతకుఁ బెర్గు నశనేచ్ఛ యొడల
నంతకంతకు మనం బాకాంక్ష దఱుగ

సంతకంతకుఁ దర్గ నశనేచ్ఛ గాన
సేవించి మదిఁ బరిణామించికొనినఁ
గామించునే యెడల్ దా మించుఁగాక
నీచుల చైది ముక్ దిగనున్నచోట
వైచి తాగుబ్జ మావడి[1]నున్నయట్టి
కారణంబయ్యె నీసౌరాష్ట్రనాథు
కారుణ్య మిదిగదా కలఫలం [2]బనుచు
నేన యీ[3]తిరిపెంబు మానంగనున్న
చో నది దనుదాన మానె మేలయ్యె
మును గుండుఁగల్లు డాఁచినఁ బెండ్లి సెడునె
చెనసి [3]బిచ్చమ్ము మాన్చిన భక్తి సెడునె
యలయక యుద[4]రార్థినై తిరుగంగఁ
దలఁచుట సోమేశుఁ దలఁచుట యగునె
యిల్లిల్లు దప్పక యేఁగుట ప్రాణ
వల్లభు గుడిచుట్టు వలగొను టగునె
యాత్మార్థమై యొరు నన్న మర్థించు
టాత్మేశుసద్భక్తి నర్థించుటగునె
పెక్కువన్నెలకూడు ప్రీతిఁ దెచ్చుటయుఁ
[5]ద్రెక్కొనఁ బూవుఁ బత్తిరిఁ దెచ్చుటగునె

---

౧. సన్న. ౨. బింక. ౩. తిరిపెము. ౪. రార్థమై. ౫. ద్రిక్కకపూ.

[1]తద్భక్తి శివపదధ్యానసుధార-
సాద్భుతాంచితభక్తి యగానె కావునను
సతతబాహ్యాంతరార్పితసావధాన
హితసన్నిహితసంజనితసుఖం బొనగు
సప్రాణలింగమహాప్రసాదామృ-
తప్రశస్తానుభవప్రాప్తి లేని
దండి దుర్వ్యాపి యెవ్వండేని దిరిపి-
దిండియ, కాక భక్తుండు దానగునె'
యనుచుఁ గించిద్దరహసితాస్యుఁ డగుచుఁ
దనురక్షణార్థంబు గొన నేల యింక
నెయ్యది భోగింప నెవ్వనితనువు
సయ్యన నొందుఁ బ్రసాదసౌఖ్యంబు
నెయ్యది భోగింప నెవ్వనిప్రాణ
మయ్యమృతత్వంబు నాపటఁ బడయు
నెయ్యది భోగింప నెవ్వనిమదికి
నెయ్యంబుతోఁ గల్గు నిర్మలత్వంబు
నెయ్యది భోగింప నెవ్వనియాత్మ
శయ్యగా నీశుండు సతతంబు నుండు
నెయ్యది భోగింప నెవ్వనిచరిత

[1] తద్భక్తి. [2] యిట్లు.

మియ్యకోలై రాశికెక్కు లోకముల
నెయ్యది భోగింప నెవ్వనిహృదయ
మెయ్యెడఁ బొలివోక యీశునిఁ బొందు
నెయ్యది భోగింప నెవ్వనికృతులు
దియ్యా[1]మై జగముల దీపించుచుండు
నెయ్యది భోగింప నెవ్వని మనుజు
లయ్యయ్య యని కొనియాడుచుండుదురు
నెయ్యది భోగింప నెవ్వరి సుమహా-
నియ్యత జగముల నిండి వెలుంగు
నట్టి నిర్మాల్యం[2]బ యాహారముగను
జట్టన దినములు సలుపుదు నదియ
కల్యాణతరము నైర్మల్యంబు నమృత-
తుల్యంబు గుజనహృచ్ఛల్యంబు మఱి య-
మూల్యంబు సితసుధాకుల్యంబు భక్త
లౌల్యంబు దత్తకైవల్యంబు[3] ప్రమథ
లాల్యంబు [4]వరముక్తిమూల్యంబు దత్త్వ-
కల్యాత్మకంబు నిర్మాల్యంబనంగఁ
బరగంగఁ దొలునాఁడు హరుపూజ సేసి
ధర వెలి మఱునాఁడు దరిమినయట్టి

౧. లై. ౨. త్వమా. ౩. ముక్తి. ౪. ముక్తికి.

పత్తిరి యొక్కింత వాటించి తెచ్చి
యుత్తమసద్భక్తియుక్తి వర్త్రిల్ల
గాదన కదియ ప్రసాదభావమున
నాదటఁ దా నోహిళయ్య భుజింపఁ
బాపాత్ములై భువిఁ బరగినగౌళ-
తాపసు లెఱిఁగి [1]యాతం డెవ్విధమునఁ
జావండకాఁడె యాచక్కిన [2]వెడలి
పోవండు భిక్షముల్ పుట్టకయున్నఁ
బత్తిరిఁ దినఁజొచ్చె బ్రదుకు నెట్లైనఁ
బత్తిరిఁ గాల్త మప్పటి[3]కి నప్పటికి
మనపురి భక్షింప మఱి యొండు లేక
చనియెడుఁ గాదేనిఁ జచ్చెడిఁగాక'
యనుచుఁ బత్తిరిగూడ నటు ప్రోఁక వెట్టి
యనలంబు దరికొల్పి యార్చుచుఁ గాల్పఁ
బత్తిరి గాల్చిన భస్మంబు ప్రోఁగు
నెత్తఱి మఱి యోహిళయ్య వీక్షించి
మొదలఁ దా నిర్మాల్య మదియు విభూతి
దుది నిట్టిభాగ్యంబు దొరకొనెనయ్య
నెఱి నల్గి తన్నినఁ బఱపుపైఁ బడిన

1. యా. 2. వడలి. 3. కప్పటికిని.

తెలుఁగు నాకయ్యె నోదేవ సోమేశ
పుడమి నుప్పాలికి యిమ్మడిమైనయట్టి
వడువు నాకయ్యె నావరద సోమేశ
నెరయఁ బాయసముపై నెయ్యెల్కినట్టి
యురవు నాకయ్యె నాయొడయ సోమేశ
[1]పరగఁ దెల్కకి నువ్వు వండినయట్టి
పరుసు నాకయ్యె నాభర్గ సోమేశ
చెలఁగి యావులు దలంచినచోటఁ బూరి
మొలచినట్లయ్యెఁ జిన్మూర్తి సోమేశ
యిచ్ఛమై నాడఁబోయినతీర్థ మెదురు
వచ్చినట్లయ్యె నాప్రభుఁడ సోమేశ
తలఁచినతలఁపు లిద్దర వేయునేల
తలకూడినట్లయ్యె దాత సోమేశ
భావింప నెట్లన్న నావేషమునకు
నావిర్భవించిన యాహారమయ్యె
విస్మయశాతాతపస్మృతిఁ జెప్ప
భస్మాశనప్రణిపత్తి [2]నాకయ్యె
వితత శాతాతపస్మృతిమూలమైన

---

౧. 'చెఱకునఁ బండు నాచేతికినబ్బి (-నిచ్చి)' దీనికి సంస్కృతానువాదము లేదు. ౨. దానయ్యె.

హితభస్మశయ్య సంగతమయ్యె నాకు
వృద్ధశాతాతపస్మృతిమూలమైన
సిద్ధభస్మచ్ఛన్నసిద్ధి నాకయ్యె
నాయతప్రీతిఁ ద్రియాయుషంబన్న
నాయజుస్సూక్త్యర్థ మలవడె నాకు
నొంచెఁ గాలాగ్నిరుద్రోపనిషత్తు
నం దొప్పు భస్మ మాహాత్మ్యంబు నాకు
జాబాలకైవల్యశాఖాదులందు
ప్రాబల్యమగు భస్మపదవి నాకయ్యె
సంభవిల్లెను మఱి 'సర్వం హ వా ఇ-
దం భస్మ' యనెడి యథర్వోక్తి నాకు
వైమల్యమెసగ శైవ స్కాంద కూర్మ
వామన బ్రహ్మకైవర్త పాద్మేయ
నారద బ్రహ్మాండ వారాహ లైంగ్య
గారుడ మత్స్య మార్కండేయ భాగ-
వత భవిష్య 1బ్రహ్మ వైష్ణ వాగ్నేయ
మితిఁ జను పదునెనిమిదిపురాణములఁ
బసరింప నొప్పు శ్రీభసితైకసేవ
యసలారె నాకుఁ గృతార్థుండ నైతిఁ

1. బ్రాహ్మ్య.

బ్రదికితి నాజన్మఫలమెల్ల నేఁడు
దుదిముట్టె ననుచు సంతోషాబ్ధిఁ దేలి
తద్భస్మ మొకకొంత దనువునఁ బూసి
యద్భుతంబుగఁ గొంత యర్థి సేవించి
యయ్యున్నభస్మంబు శయ్యగా నోహి-
శయ్య¹ వర్తించుచు నట్లన కొలఁద
నిట్టిచోద్యంబు మేమెఱుఁగము భువిని
బుట్టనిచిత్రముల్ వుట్టె నీయారఁ
బత్తిరిగాల్చిన భస్మంబు నమలి
నిత్తఱి నోహిళుం డిదె యున్నవాఁడు
నిచ్చ భస్మముఁ దిని యెట్టులు బ్రదుక
వచ్చు నూరక యెట్లు వచ్చునుండంగ
భస్మంబుఁ దినెనేని భస్మంబు గాఁడె
భస్మంబుఁ దినఁడేని భస్మంబు గాఁడె
మందులో వ్రాఁకులో మంత్రతంత్రములొ
యొందు నభ్యాసాదియోగసాధనలొ
కాదేని యెవ్వఁడేఁ గరుణించిపెట్ట
నాదటఁ గుడుచునో యన్నంబు మొఱఁగి
యుత్తరసాధకుం డొక్కఁడు వెట్ట

---

¹. భోగిం.

నెత్తఱఁ గుడుచునో యేమేని మఱియు
నిట్టిద యనవచ్చునే నిశ్చయించి
యట్టులుఁగాక శివార్చనాసక్తిఁ
దవులు నాహార నిద్రా భయ మైథు-
న వికారములు వొందవవి స్వేచ్ఛలందు
రసమాత్రభక్తుల కనుచు నిర్గాలి
పసులగు గాళతాపసులు నిందింప
నొక్కనాఁ డడవికి నోహిళుం డరిగి
యక్కడఁ దొల్లింటియట్ల గందంబు
చెక్కలుఁ బత్తిరిఁ జక్క నమర్చి
యక్కజంబుగ మహిసాక్షి గుగ్గులము
కావడిఁ దేఁ బడిఁ దా వడిఁ జూపఁ
గావడి నుద్ధతిగావడిగాఁగఁ
బఱతేఱ నొకకొయ్య యఱకాలు గొన్నఁ
జుఱచుఱ నరములు స్రుక్కఁ దివుచుడుఁ
బుడమిఁ ద్రొక్కఁగరాక యడుగిడ రాక
మడువంగరాక మైవడిఁ జూపరాక
యింకనెట్లని యాత్మఁ గొంకక, మనసు
బింకంబు వదలక, పృథుసాహసమున
నొరగాలనేఁగుచు నొకకొంత దవ్వఁ

బూరిఁ బరుగెత్తుచు భువిఁ గొంతదవ్వు
మడిమయ మోపుచు మఱికొంతదవ్వు
నెడగాల నేఁగుచు నించుకదవ్వు
మునివ్రేళ్ల మోపుచు మొగిఁ గొంతదవ్వుఁ
గొనినకొయ్యయ యూఁదికొని కొంతదవ్వు
నేఁగంగ నేఁగంగ వీఁగక కొయ్య
మీఁగాలఁ బొడసూప మృడుఁ డొడయండు
భక్తవత్సలుఁడు సద్భక్తచేతనుఁడు
భక్తయోగక్షేమభావయుక్తుండు
శివుఁడు సౌరాష్ట్రంబు శ్రీసోమనాథుఁ
[1]డవికలనిత్యదయామతిఁ దాన
చెంచుభావంబున శివభక్తచిహ్నా
నంచితంబై యించుకించుక దోఁప
భువి మసికప్పడమునఁ గప్పఁబడియు
నివిడి వెలుంగు మాణిక్యంబునట్ల
మిక్కుటంపునివుఱు మీఁదగప్పియును
నక్కజంబై మించు ననలంబునట్ల
పొనరంగ శుక్తిచేఁ బొదవంగఁబడియుఁ
దనరు ననర్ఘ్యముక్తాఫలంబట్లు

---

౧. డవిరళ.

గమియ మీఁదటఁ బ్రాచి గప్పియుండియును
నమలినంబైన గంగాంబువులట్ల
దుర్మేఘపటలంబు దూరఁ గప్పియును
నిర్మలరవి దివి నిలచినయట్ల
యనలార శబరచర్మావృతుఁ డయ్యు
ననదృశైశ్వర్యసమగ్రత దనర
నాదటఁ దనత్రొక్కినచట మూర్కొనుచు
వేదకుక్కురములు వెనుక నేతేర
ధరఁ గమలాసనుఁ దల¹దైవ్వ నేయ
నరుగుదెంచినమృగవ్యాధరుద్రుండో
నలి నింద్రకీలంబునకు వినోదార్థ
మలనాఁడు వచ్చిన యాకిరాతుండో
యద్రిక్తసద్భక్తియుక్తి హా²న్నయ్య
భద్రమైచను తుంగభద్రోదకములు
నేమంబుగాఁ జని నిచ్చలుఁ దెచ్చి
ప్రేమతోఁ పులిగరసోమేశ్వరునకుఁ
బ్రీతి వాసననేసి శీతలోదకము
లాతతసద్భక్తి నర్పించుచుండ
నిప్పాటఁ దొంబది యేండ్లు సనంగ

౧. దెగవ్రేయ; ద్రవ్వనేయ. ౨. హుల్లి; హాలి.

దప్పక వృద్ధుగదా యెట్టులనక
నడుచుచు రే యొక్కనాఁడు గావటను
గడురయంబున నుదకముఁ దెచ్చి తెచ్చి
గద్దించి మఱియొక్కకాలువ దాఁటి
యద్దరి నిలువ వీఁ పప్పుడ విఱుగఁ
గావడి విడువ కక్కట సోమనాథ
దేవ నాయొడలను జీవ ముండంగ
వదలుదునే నిజవ్రతమంచు నచటఁ
గదల నుంకింప నక్షణమాత్రమంద
పఱతెంచి కావడిఁ బాపి మూపునకు
మఱి మీఁద నల్లెంటిమానంబునొంద
నరుగు డేఁ గరుణించినట్టి ప్రచ్ఛన్న-
హరుఁడ తానను శబరావతారుండో
వెసఁ జెంచెతలలోన విహరింప వచ్చి
మసలిన శ్రీగిరిమల్లికార్జునుఁడో
నిచ్చలు మృగముల నిటలాక్షుపురికిఁ
బుచ్చుఁ దెనుఁగుజొమ్మభూవినుతుండో
యెప్పుడుఁ దిరుకాళి నొప్పుకన్నప్ప
తప్పని యపరావతారుండో మఱియు
శివరాత్రిఫలము సెచ్చెరఁ జూఱగొనుచు

శివపురి కేఁగిన చెంచకో యనఁగ
నొక్కఁడ యేతెంచి యోహిళుఁ జూచి
'యక్కట! శివశివ! యకాలఁ గొయ్య
నాటియుండఁగ నెట్లు నడచెద విట్టి
నాటకంబులు దొల్లి నగవుగా దెఱుఁగఁ
దగవుగా దాత్మఘాత, యొకింత యొడలి
బిగువు దప్పిన మఱి పెట్టలే వడుగు
నిటుగాని మెచ్చఁడే యిందుశేఖరుఁడు
గటకటా చూడంగఁ గాదు దోషంబు
నిలునిలు కావడి నిల దింపుదింపు
తొలతొల యిదియేల చల ముడుగుడుగు
పెఱికికో నీవైన వెఱవక కొయ్య
వెఱతేని నేనైనఁ బెఱికెదఁ జూపు'
మనుచు డగ్గఱ నోహిళయ్య యీవేగ-
మునఁ బోదు ముట్టకు ముట్టకు కాలు
మునుముట్ట నదియేల [3]ముఁగతనంబు
మునుముట్టవచ్చు రాదని [4]కాన వెట్లు
సెంచెనవచ్చునే శివభక్తిపరుని
నించుక కాలోస్సకనీగియ తప్పు

---

౧. తకమింక నీకు. ౨. వైతివేపెరకని. ౩. మొగ్గ. ౪. యొర్గ.

గానడి ముట్టెడికరముల [1]నాకు
నీవల కాల్మెట్టు [2]డిది గడుఁ దప్పు
నడమడించుట దప్పు నాయకోత్తముఁడ
నడవు మేనెత్తైన నడచెద ననుడు
గుడి సేరరాక కావడి డింపరాక
యెడ నిల్వ[3]రాక [4]కాలిడ మున్నరాక
యిన్నిసంకటముల నేల ప్రాపించె
దన్న నీమన సెట్టు లట్ల చేసెదను
అంటక పుచ్చిన నౌఁగాదె పాద
మంట నేఁ దంటసంబంధి పుచ్చెదను
నెమ్మికో యామ్రాన రమ్మంచుఁ దంట-
సమ్మున నిడి కొయ్య సక్కనఁ బెఱుక
యారగించినభస్మ మంగంబులోనఁ
బూరించి మును దిత్తిఁ బోసిన ట్లునికిఁ
బింజించి వెడలెఁ దాఁ బృథుభస్మధార
వింజనఁగ్రోళ్లను బింజించినట్టు
లాహారమూర్తియు నంత హర్షించి
మోహిళా మోడకు మోడకు మనుచు
నలరెడిచో మఱి యాకులవల్వ

---

౧. చేత. ౨. టి. ౩. లే. ౪. మేవడి.

మలహరమూర్తి గ్రమ్మనఁ జించి చుట్టి
ప్రక్కన భస్మంబుగారు రంధ్రంబు
గ్రుక్కిదంబై కట్టుకొని కీలుకొనుడు
నడువుము సౌరాష్ట్రనాయకు కరుణ
[1]వడయు పొమ్మని యట నడచె నయ్యెఱుక
సోమేశ్వరుండ తా నామీఁది కరుణ
నీమూర్తి ధరియించి యేతెంచెఁగాక
సామాన్యుఁడైనట్టి శబరుని కిట్టి
భూమంబు నతిదయాధామంబుఁ గలదె
యని [2]వినుతించుచు నంత నోహిళుఁడు
సనుదెంచి తొల్లింటిచందంబు నొంది
కఱకంఠుచేఁ దల్పు దెఱపించి చొచ్చి
తఱిఁదఱిఁ బూజావిధానంబు సలిపి
[3]పరువగు పెనుధూపపాత్రంబునందు
దరికొల్పి ధూపాగ్నిఁ దాఁ బ్రజ్వలించి
పిడిఘంటకనిపోవునెడ గౌళతపసు
లడర గుగ్గులము దాఁచుడు నోహిళయ్య
సెచ్చెర నేతెంచి చేఘంట వ్రాయ
నచ్చోట మహిసాక్షి యాగుగ్గులంబుఁ

---

౧. నడువు. ౨. నుతియించు. ౩. పరపను.

గానక సోమేశు నానతి యిదియు
నేన గుగ్గులముగా కీపూఁట కింక
ననుచు వీక్షించుచో నాధూపవహ్ని
గనలుచుఁ[1] బొనలుచుఁ గణకణ యనుచు
మెఱచుచు వఱలుచు మించుచు దృష్ట్లు
మిఱుమిట్లు గొలుపుచు మీఁది కుబ్బుచును
నీఱువాఱుచు వెండి నిట్టవొడుచుచుఁ
దూఱఁదాఁకుచుఁ బ్రభఁ దురఁగలింపుచును
ధళధళ వెలుఁగుచుఁ దనరుచు నౌష్ణ్య
మలరుచు నిప్పులు ిమలమల యనుచుఁ
బొగలుచుఁ బొంగుచు భుగభుగయనుచు
నిగుడుచుఁ జిఱుమంట లెగయుచుఁ జేర్చి
ప్రతిలేని ఫాలాక్షు ఫాలనేత్రాగ్ని -
ప్రతిబింబభావనఁ [3]బ్రజ్వాలింపంగ
నదరక యదిసూచి బెదరక, డెంద
ముదరక, చిత్తంబు చెదరక, మనసు
గలఁగక, యాత్మలో నలఁగక, బుద్ధి
దొలఁగక, యొంటికిఁ దలఁగక, చలము
డింపక, ఱెప్పలు వంపక, యురముఁ

౧. బొసరుచు. ౨. డు (దు) లకు (దు) ల. ౩. ప్రభరిం.సు

బెంపక, [1]శివకాంక్షఁ ద్రెంపక, పదము
గోరక, గుణములు గూరక, యాసఁ
జేరక, [2]తపముల వారక, నొచ్చి
పలుకక, యితరుల కలుగక, తెగువ
కులుకక, ధైర్యంబు [3]నొలుకక, వెనుక
సూడక, తలపు లల్లాడక, జడతఁ
గూడక, హరున కెమ్మోడ, కక్షణమ
యవధారు సోమేశ యాత్మాంగధూప
మవధరించుటకు మహాప్రసాదంబు
అలరి యిమ్మహిసాక్షియందు సౌరభము
వలువకుండిన నిజవ్రతభంగ మిదియు
మహిలోన ధూపదమాచయ్య దొల్లి
మహనీయకీర్తి సన్మార్గానువర్తి
వలమెడు మహిసాక్షి ప్రతిదివసంబు
మలహరునకుఁ ద్రిసంధ్యల సమర్పింప
నొక్కనాఁ డెట్లును జక్కనకున్న
గ్రక్కనఁ దనమేని కండలు గోసి
పాయక ముప్పొద్దుఁ బలమెడుపలమె
డాయతభక్తి సమర్పణ సేయ

---

౧. భవ. ౨. తపసుల. ౩. నె.

నింపుగా మహిసాక్షి కంపుగా కొండు
[1]గంపు మున్నాలచెనే కాయసంగతిని
వెండియు శ్రీగిరివీరశంకరుఁడు
మండెడుపెనముపై నుండి కాలుచును
నొండొండ ముప్పదిరెం డాయుధముల
దండియై కెలసంబుఁ దా నాచరింపఁ
గమరువచ్చెనె యాత్మకమలసౌరభము
గమియకా మిము ముంచెఁగాక వెండియును
ఘనకీర్తి గుగ్గులుకళియారి దొల్లి
దనయెత్తు మహిసాక్షి దప్ప కీశునకు
నిచ్చలు నర్పించు నియతిమై నడువఁ
గ్రచ్చఱ నొకనాఁడు ఘటియిల్లకున్న
నత్తఱి మహిసాక్షికై తనప్రాణ
మిత్తుఁ బొమ్మనుచును గుత్తుక నలుఁగుఁ
గదియింప విఖ్యాత కమలసౌరభము
విదితమై పరగదె యదియునుఁగాక
కడమలనంబి యఖండదీపముల
కడరఁ దైలము లేక యారుచున్నెడను
దలవెండ్రుకల నగ్ని దరికొల్ప నపుడు

---

౧. కంపవునేయాత్మ కమలసౌరభము.

వలచెనే [1]కంపు దా నిల నట్లుఁగాక
యణుమూర్తి యనుభక్తుఁ డతఁడు[2] మ్రోచెయ్యి
గణనాథుసానపైఁ గదియించి [3]తివియ
సంధిల్లి మఱియొండుసందంబుగాక
బంధురమహిమ శ్రీగంధంబు గాదె
దీపదకళియారి దేవదేవునకుఁ
బ్రాపుగా గుడిచుట్టు రాత్రు లొక్కరుఁడు
దిరుగ నత్తఱిఁ [4]గవదివియలు నార
సరసర జడయల్లి కరమునఁ బట్టి
దీపంబు ముట్టించి తిరుగుచో దిశల
వ్యాపించి కంపొండు వలచెనే తొల్లి
యట్టిభక్తుల తదీయప్రసాదమునఁ
బుట్టినదేహంబు నట్టిద కాదె
పంటింప వినుము నీబంటుపంతంబు
ఘంటమ్రోయకయున్నఁ గరమాడకున్నఁ
బరిమళింపకయున్న బాగుదప్పినను
విరసంబు దోఁచిన వేళ కంపైనఁ,
జొక్కిన, నరములు స్రుక్కిన, జీవి
వెక్కిన, పచ్చినీ రెక్కిన, నొడలు

౧ కమరు. ౨. మ్రోచేత. ౩. చెయ్యి. ౪. గడ.

నలుపుసూపిన, నవర్ణంబు వెస్బడినఁ;
గలయఁ జర్మాస్థులు గఱఁగకయున్నఁ,
దవిలి పైత్యశ్లేష్మ తతులు రంధ్రములఁ
గవిసిన, రోమముల్ గమరువాల్చినను,
నోడవిరి రక్తంబు వెడలిన మున్న
వెడవెడ ధూమంబు విచ్ఛాయవడిన
నగ్గి గొనకయున్న నలరి మండినను
గుగ్గులమునకంటె నిగ్గుదఱిగినఁ
గనుఁగవఁ బొగసొచ్చి కంకణావళులు
ననినఁ దద్ధూమంబు నల్లగాకున్న
ఘనధూపధూమసంజనితసౌరభము
దనకుఁ దా నీకర్పితము గాకయున్న
నమరంగఁ దనువు సమాప్తంబుగాక
నమసిన దృక్కులు సంచలించినను
బ్రమథులయాన సంభావింపు మనుచుఁ
బ్రమథాదిసద్భక్తిపరులఁ దలంచి
యుద్ధతసద్భక్తియుక్తి నోహిళుఁడు
దద్ధూపపాత్ర మధ్యమునఁ గూర్చుండ
నంగధూపామోద మప్పుడ యెగసి
భంగిగా సోమేశుపై వెల్లివిరియ

సంతన శివుఁడు ప్రత్యక్షమై <sup></sup>నిలిచి
కాంతు నయ్యోహిళగణనాథుఁ గదిసి
హితదృగంచలసముద్గతదయామృతవి
నుతరసాంబుధిసుఖస్థితి నోలలార్చి
కరమర్థి నందంద కౌఁగిటఁ జేర్చి
పరమప్రసాదవిస్ఫారాంగుఁ జేసి
యోహిళు సద్గుణదోహాలు నతికు-
తూహాలు దురితకోలాహాలుఁ దత్త్వ
పారగుఁ బ్రమథేంద్రపట్టంబు గట్టి
సారూప్యపదవి ప్రసాదింపఁ దడవ
నంతలోనన సముద్యన్మహాభక్తి
కాంతుఁ డయ్యోహిళగణనాథుఁ డెగసి
కరమునఁ బడిఘంటఘుణఘుణమ్రోయఁ
గర మనురాగతఁ గైలాసమునకు
నాపరమేశు దయపూర్తిఁ జేసి
హాహోయె హోయె నా నరుగుచున్నాఁడు
అటమున్న పేర్చి భక్తానీక మార్చి
నటియింప సౌరాష్ట్ర మిట వెంపుఁ బెంప
మంగళధ్వను లింప మతులు హర్షింప

౧. భక్తి. ౨. దలఁప.

సంగీతములు మ్రోయ సఫలత డాయ
ధూపధూమము నిండి వ్యాపించుచుండఁ
బాపముల్ దూల సంభ్రమలీల గ్రాలఁ
బరవాదు లడఁగి శుభంబులు దోడఁగ
వరకీర్తి దివిఁదాఁకి వడి దిశల్ సోఁక
దూషకుల్ [1]ద్రుంగ సాధ్యులు గడుఁ బొంగ
[2]బాసయుఁ దుదిముట్ట భవుఁడు సేపట్ట
నక్కజంబొలయ నుదాత్తత వెలయ
నిక్కంబు సంధిల్ల నియతి వర్ధిల్ల
ననుషక్తి దులుకాడ నప్పురిఁ జూడ
జనులు ఘేయని మ్రొక్క శరణులు సొక్కఁ
జూపఱు జయవెట్టఁ జోద్యంబు వుట్ట
నాఁపోవ కటమున్న యజ్ఞులై యున్న
బండలు గాళతాపసులు సాష్టాంగ
దండప్రణామముల్ దఱిఁదఱిఁ జేసి
హోహోహిళయ్య హోహోహిళదేవ!
హోహోహిళన్న యిదో శరణార్థి

---

౧. గ్రు. ౨. భావ (శ, వ, స, ల ప్రాస మప్రశస్త మని లాక్షణికులు; కాని, యిచ్చట 'బాస'కు 'భావ' యని నిల్పిన యెడల నర్థసిద్ధి కలుగదు. 'బాస' అను తద్భవార్థము 'భావ'కు లేదు.

శరణార్థి శరణార్థి శాంతిస్వభావ!
శరణార్థి శరణార్థి సత్యానుభావ!
కారుణ్యాయుతభావ కలితసద్దైవ
వీరసంచితశైవ విగతాన్యదైవ
దురితాటవీదావ [1]ధూతనిర్దైవ
సురుచిరసద్భావ పరమప్రభావ
లలితానుభావ తప్పులుదూఁద్రోవ
నెలకొని మముఁబ్రోవ నిష్ఠించి కావఁ
దలఁచి యోహిళదేవ తమచేత దీవ
నలఁ బొంద వేదైవ మిల నింక నీవ
కాక వేఱొకత్రోవ గలదె మీసేవ
మాకున్న దే దేవ మహిదేవదేవ!
యని వినుతించెద రదె పురిలోనఁ
జనుచున్నవాఁ డిదె శరణుఁడోహిళుఁడు
గావున నొక్కండ కైలాసమునకుఁ
బోవంగఁ గని నవ్వువుట్టె నెట్లనిన
నపరిమితంబైనయతివీరఘోర

---

౧. ఈపాఠము వ్రాతప్రతులలో లేదు; సంస్కృతానువాదములోనిది.—'దూరనిర్దైవ' అని వ్రాతప్రతులు. ౨. ఇందువల్ల ఓహిళశబ్దము యకారాది కాదని నిశ్చయమగుచున్నది.

తప మాచరించి ముందగునట్టి వ్రతముఁ
దొడఁగియు, నింతింత గడిఁది దుఃఖములఁ
బడియు, నీశ్వరు మెచ్చఁ బడసియుఁ దాన
పోయెడిభక్తిఁ డిప్పుడ, యొక్కరుండ
పోయెడి, నిలఁ గొన్ని పురములు లేవె
కొని పోవ నియ్యార మనుజులు లేరె
తన కొంటిఁ జన నింత దైన్య మేమిటికి'
యని వెండియును నవ్వ హర్షించి వారిఁ
గను తెప్ప లిడక యాకాశమార్గంబుఁ
గలయంగ నోహిళ గణనాథు వెదకి
చాలసి కానక పతి కిలఁ జాఁగి మ్రొక్కి
యే మేఘములపొంత నేదెస నెచట
నేమానమున నెట యెంత దూరమున
నేయెడ నెప్పాట నాయోహిళయ్య
పోయెడిఁ జూపవే భూమీశ యనుఁడుఁ
గడురయంబునఁ జేత ఘణఘణయనుచుఁ
బిడిఘంట మ్రోయంగఁ బృథునభోవీథి
నిదె వీఁడె పోయెడి నిటు సూడు మనుచుఁ
గదిసి చూపుడుఁ గొంత గడు సంతసిల్లి

---

౧. చుచుఁ దనవీర. ౨. వ్రతంబులనెల్ల.

యా మోహిళయ్యకు సాష్టాంగ మెరగి
పాయక మ్రొక్కుచుఁ బ్రణుతి సేయుచును
భంగిగా ఘోరతపఃపరిపూర్తి
నంగంబు ధూపాగ్ని హరియింపకునికిఁ
గాయఘూపం బిందు గంపువల్వమియుఁ
గాయంబుతోడన కైలాసమునకుఁ
బురహరు మెప్పించి పురజను ల్వొగడ
నరుగు టెంతయునన్ జోద్యముగాదె, నడువ
వచ్చునే యిట్టు లెవ్వరికైనఁ జెప్ప
వచ్చుఁ గాఁ కని యాడవచ్చుఁగా కనుడుఁ
జోద్య మిం దెయ్యది శూలికిఁ దపము
లాద్యు లనుష్ఠించునం దిది యెంత
మఱి యట్లుఁగాక మున్నెఱుఁగవే వహ్ని?
కఱకంఠుభక్తులకంటె నగ్గలమె?
జిహ్వలుఁ జేతులుఁ జిదిమి పావకుని
విహ్వలుఁ జేయఁడే వీరభద్రుండు?
బడబాగ్ని యంతయు ఫాలమధ్యమున
మృడుగణంబొకఁడు బొట్టిడికొనఁడెట్లు
గనుఁగొల్కిఁగాదె యొక్కఁడు ప్రళయాగ్ని

౧. కనుపల్క.

ననుదినంబును డాఁచికొని యున్నవాఁడు
యదియేల వ్యాఘ్రపాదాదినందనుని
బాదివినవహ్ని దా భువి నేమి సేసె
శంకరదాసి నొసలికంటఁ గాదె
యంకితుండై యుండు ననలుండు మఱియు
వైరిజైనులు దొల్లి వాగీశనాయ
నారిని భంగించి ఘోరాగ్నిఁ ద్రోవ
ఘనసరోవరమయ్యెఁ గాక తద్వహ్నిఁ
గనలెనే యొకవెంట్రుకైనఁ గడపట
నధికుండు మఱియుఁ [1]బిళ్లననాయనారు
మధురలోనుండ దుర్మతులును వహ్ని
కంటకులగు జైనకష్టు లెబ్బంగి
నొంటక వారున్నయింటఁ జిచ్చిడుడుఁ
గడుభయంబున నారెఁ గా కొక్కపూరి
పుడుకయుఁ గందెనే పొగచూరి యెట్లు
వెండియు శ్రీపతిపండితుల్ భువి న
ఖండితైశ్వర్యవికస్వరలీల
వర్తింపుచును బరవాదులకెల్లఁ
గర్తలు భర్తలుఁ గాఁ బ్రతిష్ఠించి

---

౧. బిళ్లమ.

తొడఁగి పైపాత్రిపచ్చడమున నిప్పు
లడరంగ ముడిచిన నది యేమిసేసెఁ
గావున భక్తుల కావహ్ని వెలుచు
టేవంక నరుదని యెన్నంగఁ గలదె?
కాయంబు మహిసాక్షిగతిఁ గంపు వలచె
నాయెడ నిది సోద్య మనియెదే వినుము
మొలటదబంకయ్య నెలభక్తిఁ గాదె
కొలకు దలిర్చె నంకురితమై పెరుగ
గొడ్డును లేఁగటిపడ్డయై యపుడ
గడ్డుగ [1]నిండారఁగాఁ బాలు గురిసెఁ
దిలకవ్వ సద్భక్తి దీపితమహిమఁ
బొలుపుగా నప్పాడ పురుషత్వ మొందెఁ
బదపడి కలకేత బ్రహ్మయ్యగారు
వదడు సేపట్టుడుఁ బసిఁడియై చనదె
మక్కువ మొళిగమారయ్య మోఁపు
చెక్కలన్ని గడానినక్కలు గావె
ముసిఁడి చౌండయ్యకు ముసిఁడిఫలంబు
లసలార నమృతఫలావళుల్ గావె
ప్రథితంబుగా నిండిపాతెడి యేలు

---

1. దైవార.

వథమయ్యెఁగాదె సద్భక్తి వారలక
నలిగొను నేణాధినాథు సద్భక్తి
కలుగుఁ బూవులదండమై యొప్పెఁగాదె
తొలఁగక దాసిపుత్త్రుఁడు పుట్టఁ దొడుక
వలుదసర్పంబు నేవళమయ్యెఁ గాదె
యసముఁ జేలేశు కేతయ్యగారికిని
మసిపిత్తులను జేను మహిఁ బండెఁగాదె
ధరఁ గుఱచ్చిరమారి వరభక్తిరతిని
జరియించు నక్క లశ్వంబులు గావె
తలఁచినంతటన పూసలనయనారి
కలరదె దేవాలయం బీశ్వరునకు
నదిగాక దీపసహస్రంబు లోలిఁ
బొదలవే నమినంది కుదకంబు లంద
మఱియు నాజ్ఞాసిద్ధి నెఱపినయట్టి
కలకంఠభక్తులు గల రిజ్జగమున
నక్లేశమునఁ బొంది రభిమతార్థము ల
తిక్లేశమునఁ దపోధీరత్వమునను
గాయంబు ధూపంబు గావించెఁగాదె
యీవెహిళయ్యపెం పెంత గావునను
నరిగె దేహముతోన యతఁడంటివేని

నరుఁడె యొక్కఁడపోవు టది యెట్టులనిన
బెరసిన యెనుబదివే లశ్వములకుఁ
బరపగు రుద్రాక్షపక్కెరల్ పూన్చి
చేరమరాయండు శివపురంబునకు
భోరన మును దాడివోవఁడె యెగసి
దేవుపాలికి సుఖస్థితి సామవేది
వోవఁడే [1]బత్తీసుపురములుఁ దాను
శివపురి కేఁగఁడే భువి నరుల్ వొగడ
నవపురంబులుఁ దాను నలి హలాయుధుఁడు
గోరి పిళ్లయనయనారి సొరండె
యూరివారును దాను మారారియందు
వఱలంగఁ గంచేడువాడలుఁ దానుఁ
జెలుతొండఁ డేఁగఁడే శివపురంబునకుఁ
గలయంగఁ బురిజనంబులుఁ దానుఁ జనఁడె
మలయరా జొయ్యన మలహరుపురికిఁ
బందుగ సేయు సద్భక్తులుఁ దాను
వెండికొండకు మిరుమిండండు సనఁడె
[2](తాను నల్లుఁడు పుత్త్రి దరుణియుఁ జనఁడె

౧. 'సత్తీసు' అని వ్రాతప్రతులు, ముద్రితప్రతి; సంస్కృతానువాదములో 'ద్వాత్రింశత్'. ౨. కుండలీకరణము చేసిన రెండు పంక్తులకును సంస్కృతానువాదము లేదు.

మానకంజారుఁ డీశానుప్రోలికిని)
వటముతో నెణ్ణూరువరభూతములను
నిటలాక్షుపురికి నుద్భటుఁడు గొంపోఁడె
తగిలి జొమ్మయ్య నిత్యమును నేడేసీ
మృగములఁ బుచ్చఁడే మృడుపురంబునకుఁ
జిలుకయు లాఁజె లంజియతల్లి దాను
మలహాణుఁ డేఁగఁడే మలహాణుపురికిఁ
బడతు లిద్దఱుఁ దాను బంధులుఁ జనఁడె
కడుఁబ్రీతి నంబెన్న గరకంఠుపురికి
నటుగాన వెండియు నాద్యులలోన
నిటువంటిభక్తు లనేకులు గలరు
ఒక్కండ యేఁగిన యోహిళు నింత
యెక్కుడు గొనియాడ నెద్ది దాననుచు
నతినిరాదరణమై నాయయ్య వలుకఁ
బతిమాట లిచ్చగింపక తద్వ్యధూటి
నీవు సకామివి నిష్కామి యతఁడు
భూవిభుఁడవు నీవు వావనుఁ డతఁడు
ద్యూతవ్యసని వీవు భూతలాధీశ
యాతఁడు సతతలింగార్చనావ్యసని
గ్రథితసంసారానురక్తుండ వీవు

ప్రథిత సంసారవిరక్తుఁ డాతండు
నరలోకవరుఁడవు నరనాథ నీవు
హరలోకచరుఁ డోహిళయ్య గావునను
వలతేనిఁ గొనియాడు వలవదే మాను
చులుకగా నాయయ్యఁ బలుకకు మనుజుఁ
గామంబులేని నిష్కాముల కెట్లు
గామించి యీశ్వరుఁ గలయంగ వచ్చుఁ
గామి వీఁడని నంబిఁ గలయక విగత
కాములఁ గలసెనే గౌరీశ్వరుండు
వ్యక్తిగా భూమియు నర్థంబు లేక
భక్తుల కెట్లు దాఁ బరిచర్య సేయు?
ధరణీశులన మున్ను గరికాలచోడుఁ,
గరయూరచోడు, విక్రమచోడు, వీర
చోడు, నయ్యుత్తుంగచోడు, నరేంద్ర
చోడు, నారాజేంద్రచోడు నీశ్వరుఁడు
దవులక నిర్ధనతనువంచకులను
దవిలెనే భక్తికి ధరణిపుల్వొలిమె?
జూదంబు నింద్యమే సూచింప శివవి-
నోదంబు గాఁగ నివేదింపఁ గనినఁ
గాయకం బొం డెఱుంగమిఁ జేసి మూర్ఖ

నాయనా రెప్పుడు నలి జూదమాడి
గెలిచి యర్థముఁ దెచ్చి వలయుపదార్థ
ములఁ గూర్చి జంగమంబులకు నర్పింప
హరుఁడు ద్యూతక్రియ నరుదెంచి యాడి
శరణున కర్థంబు చాలనోడుడును
ఘట్టించి తనతలచుట్టునఁ గాలు
వట్టి మోవఁగ నెత్తి కట్టుడు నతఁడు
విడువంగనేరఁ డేనడువున ననుచు
నొడయండు శివసూత్ర మొక్కింత సూప
హరహర లాంఛనపరుని గట్టితిని
బరికింప కే నంచు భవమూర్తి కాలు
గట్టిన తనతలచుట్టున శిరముఁ
[1]జట్టనఁ దెగఁగోయు నట్టిచో శివుఁడు
ప్రత్యక్షమై నిల్చి భక్తి నీకిత్తు
నత్యర్థి నభిమతం బడుగడుగు మన
నొడయుండ! మున్ను నీ యొడినధనముఁ
గడుపక పెట్టు జంగమముసామ్మదియు
నంతియచాలు నాకనుచుఁ దద్భక్తుఁ
డంతయర్థము జంగమార్చన సేయఁ

---

1. జె.

గాయంబుతోడన కరుణించి మూర్ఖ
నాయనారిని గొనిపోయె నీశ్వరుఁడు
జూదరిఁ జూడంగఁ గాదని నిల్చె
నే దేవదేవుండు నిజ మట్లకాదె
యర్మిలి వ్యసనార్థమై జూదమాడి
ధర్మజముఖ్యులు నిర్మూలమైరి
అదట భక్తిహితార్థంబుగాఁగ
జూదమాడినమూర్ఖు శూలిఁ గూడండె?
ప్రకటసంసారానురక్తి విరక్తి
యొకనిరూపణయంద యుండు నెట్లనిన
వ్యక్త మీశ్వరముఖానర్పిత సుఖవి-
రక్తి సంసారవిరక్తి శివోప-
భుక్తి ప్రసాదానురక్తిహీనతయు
యుక్తి సంసారానురక్తి యట్లయ్యు
బెరసినయట్లుండుఁ బరులకుఁ జూడ
బెరయదు జలముల సరసిజమట్ల
బెరసినయట్లుండుఁ బరులకుఁ జూడ
శరణుఁడు బెరయండు సంసారమునను
లోకభేదం బవలోకింప [౧]విగత

---

౧. విదిత.

లోకుండె సద్భక్తిలోకుండు గాన
నరలోకమనఁగ నీశ్వరలోక మనఁగ
హరసమేతున కిక్కడక్కడ గలదె
బాలవు భక్తిసకీలకంబెఱుఁగ
వేల మాటలు వేయు నింతి నీకనుడు
నెఱుఁగఁబో భక్తి నీ వెఱిఁగెడువాఁడ
పులక యాడెడువాఁడ వోహిళప్రభుని
యట్టిభక్తుఁడ వింక నెట్టువోయెదవొ
కట్టుగ్రమున భక్తిఁ గైలాసమునకు
నెప్ప డేక్రియ నెన్నఁ[1] డెవ్వరితోడఁ
జెప్పుమా పోయెదు సృష్టీశ యనుఁడు
నిప్పు డీక్రియ నేఁడె యిందఱఁ గొనుచు
నొప్పారఁ బోయెదఁ జెప్పలే దెడయుఁ
గొంతగాలం బెడగొన నేల భక్తిఁ
బంత మేము సలింపఁ బాడియే తడయఁ
జెలువఁ జూచియె సంతసింతుఁ గాకనుచు
నలరుచు ఫణిహారి నంతఁ బిల్పించి
బాసవట్రిల్లఁ గైలాసప్రయాణ
మానకలము విన నటఁ జాటఁ బనిచి

౧. డిందఱ.

యుల్లం బలరఁ దమయూళ్ళూళ్ళవారి
నెల్ల రావించి యుత్ఫుల్లసన్మతిని
గరమొప్ప సహజశృంగారంబు సేసి
యురుతరలీల నశ్వోత్తమం బెక్కి
తరుణులుఁ బుత్త్రులుఁ దగినబాంధవులుఁ
బరిజనంబులుఁ దన్ను బలసి కొల్వంగ
నందంద చాంగు! భళా! యంచు భక్త
సందోహ మలరుచు ముందఱ నడువ
గొడుగులు గొడుగులుఁ గూడి క్రిక్కిఱియఁ
బడగలుఁబడగలు పుడివడి వ్రాల
సంగీతనాదముల్ సరసమై యులియ
మంగళారవములు మధురమై చెలఁగ
శివదుందుభులు మ్రోయ భువిఁ బుష్పవృష్టి
యవిరళంబై సర్వదివి గూడ నద్రువ
నారయ దేవకార్యమునకుఁ బూరుగు
నూరికిఁ బోవున ట్లొక్కట నెగసి
ధేయని నూకి యుద్దీపితమహిమ
నాయభ్రవీథి దేవావళి వొగడ
హరభక్తతతియాజ్ఞ శిరమునఁ దాల్చి
భరితతదీయకృపాసమగ్రతను

బ్రస్ఫీతభక్తి ప్రభా¹భాస్వదతులి-
త స్ఫురదమలయశస్స్ఫూర్తి దనర
భద్రావినిద్రానుముద్రితసుమహా-
దుద్రిక్తమహిమఁ దారాద్రికిఁ జనియెఁ
బాలితోద్ధతభక్తిపరుఁడు గుమార-
పాలఘూర్జరుఁ డతిప్రణతనిర్జరుఁడు
గావున హితలగు కాంతలు హితము
భావించి చెప్పినఁ బరగ నొండగునె
గణుతింప హితలగు కాంతలమాట
లణుకంబులైన మేలై యుండుననుచు
మగువ సెప్పఁగఁ బెనుమాటి² నే వోయ
ధగధగయనుచు నుద్ధతి మండునట్టు
లీప్రోడ నేర్పుఁ గళాప్రవీణతయు
సుప్రలాపములు భక్తిప్రశంసయును
విన నతనికిఁ దొంటి కనుకలికంబెఁ
బెనుకలి కామాగ్ని వేగంగ లేక
యొండుదలంపంగ నున్నయత్తఱి న-
తండల్లుకన్నెర్గి తరళాయతాక్షి
గామాంధునకు³ నొండు గార్యంబు గాన-

౧. స్ఫాయ. ౨. నెయ్యాయ. ౩. వొక్క.

రామి దెల్లమిగాదె యేమిసేయుదును
దా నీకు లింగంబు నానతి యొంత
గా నున్నదో నీదు కానమిఁ జేసి
యిప్పాట నొడఁబడ వేని నాపలనఁ
దప్పాలే దెట్టులు సెప్పకపోదుఁ
బ్రాకటంబుగ గురుభక్తియె నాకు
నీకును బ్రాణంబు నిజ మట్లుగాన
పాడియే బిట్టాసపడి నన్నుఁ బిలువఁ
గూడునే తొల్లి మాగురులింగ మొక్క-
నాఁడు దా విచ్చేసి నాపాల నున్న-
వాఁడుగావున నిట్లు వలదంటి ననుడు
నిప్పుఁద్రొక్కినయట్లు నెట్టుల్కి నేలఁ
దొప్పనఁ బడి మూర్ఛతో వ్రాలి నోరి
నడచి యడచికొంచు, నఱచుచు, వాయి
విడిచి యేడ్చుచు, శోకవిపధిఁ [1]దేలుచును,
హాగురునాథ! యాహా గురుస్వామి!
హాగురుదేవ! హాహా గురులింగ!
హా చెడితినిగదే యయ్యా నేననుచు
వాచఱచుచు వచ్చి వనితకు మ్రొక్కి

1. మ:స్థ.

నాయమ్మ నీమీఁద నయనంబు లిడిన
యీయెడ లెఱుఁగమి కెయ్యది దెఱఁగు?
నాతల్లి నీమీఁదఁ బ్రీతిఁ గావించు
నీతప్పునకు నాకు నిఁక నేదిదరియు?
నాయక్క నీతోడ నవ్వినయట్టి
యీయపరాధ మింకెట్టులు వాయు?
రూపించి నీతోడఁ గోపించినట్టి
యాపాతకమునకుఁ దేప దానెద్ది?
పైపడి నిను నొవ్వఁ బలికినయట్టి
యాపాపమునకుఁ దా నెద్ది నిర్ణయము?
నిశ్చయంబుగ మది నీమీఁద నిడిన
[1]దుశ్చేష్టలకును బ్రాయశ్చిత్త మెద్ది?
యర్మిలి నినుఁగూడ నాసించినట్టి
కర్మంబునకుఁ దీరుగడ యెద్ది తల్లి?
పిట్టబిడ్డగ నొందె నిట్టిదుష్కర్మ
మెట్టిపాతకుఁడనో యేఁ దొలుమేన?
నలరఁ ద్రికాలలింగార్చన లర్థి
నలవర్ప నోయమ్మ యద్వైతమతిని?
హారుఁ డీశుఁ డేఁ దాసి నను స్వామిభృత్య

౧. దుశ్చరిత్రునకుఁ.

సరణి వర్తింపనో ఛాందసంబునను?
బ్రతి షోడశోపచార[1] భ్రాంతివలన
రతిరాజవదుపచారములు దక్కితినో?
యర్చించితినో ఫలమాసించి శివుని
జర్చించితినో యన్యశాస్త్రమార్గముల?
నవసరోచితముల నరుగుదే భక్త-
నివహంబు నూఁకితినే చౌరనీక?
చక్కనఁ గన్నంత జంగమావళికి
మ్రొక్కనో చాఁగిలి మోడ్పనో కేలు?
శివలాంఛనుల నుదాసీనంబు నేసి
భువి నున్నతాసనంబునన యుండితినో?
జంగమం బేతేర సముచితక్రియలు
భంగిగా జరుపనో పటుకర్మవృత్తి
ననుభక్తితో జంగమారాధనంబుఁ
జెనసి యథాశక్తిఁ జేయనో భక్తిఁ
గాదేనిఁ గూడ జంగమ వేళఁ బంక్తి-
భేదంబుఁ జేసితినో దీనవృత్తి?
నరసితినో జంగమావళి కులము
బెరసితినో భవిభేదంబుఁ దక్కి?

---

౧. ప్రభావళిని. ౨. డాసియు మదంబునను.

కైకొంటినో యసంస్కారులు సేయు
పాకంబు, విడువనో భవుల సంసర్గ
నెగ్గులు [1]వట్టితినే జంగమముల
సిగ్గువట్టితినో గోష్ఠీప్రసంగముల
నాదటభక్తి శివాచార్యచర వి-
భేదంబుఁ జేసితినో దుర్వినీతిఁ
జలుపనో గురుపరిచర్య లత్యర్థి
నిలుపనో గురునాథువలనఁ జిత్తంబు,
శిర మొగ్గనో గురుశ్రీపాదములకుఁ,
గరముమన్నింపనో గురుకులావళుల,
మఱవనో పూర్వజన్మము శివాజ్ఞలకు
వెఱవనో యవికలవిషయేంద్రియముల
కంటితినో యీశ్వరానర్పితంబుఁ
బంటించితినో వ్రతభావులమెడలఁ
గని ప్రసాదావలంఘనముఁ జేసితినో
కొనుప్రసాదముఁ బల్కుచునో రుచులాని
తలఁచితినో యన్యదైవంబు మఱచి
వలచితినో భవవ్యాసంగమునకుఁ
బలికితినో తొట్రుపడి యసత్యముల

---

౧. వల్కు.

నలిగితినో దూషకావలియెడల
వింటినో శివనింద వీనులయెడఁ
గంటినో తెల్లంబుగా వ్రతభ్రష్టులఁ
బలిపితినో దృష్టులు వరభామలందుఁ
గలిపితినో యిట్లు గ్రహించి పోరఁ
జేసితినో హింస శివభక్తిపరులఁ
బాసితినో తప్పవన్ని మిన్నకయ
సమయాపరాధినో, జడుఁడనో, యన్య-
సమయాశ్రితాచారసమ్మిశ్రితుఁడనో
నీతివిహీనుండ నే మదాంధుండ
నో, తామసాత్ముండనో, హీనమతినో,
దుర్మార్గవర్తినో దురితాత్మకుఁడనో,
కర్మవాదినో, యతికార్పణ్యమతినో,
యిష్టవంచకుఁడనో, దుష్టచిత్తుఁడనో,
శిష్టాపకారినో, కష్టమర్త్యుఁడనో,
పాపినో, 'రోషినో, బహుజల్పకుఁడనో,
కోపినో, గర్వినో, కుటిలాత్మకుఁడనో,
పరమమాహేశ్వరాపాదితాచార
విరహితవర్తినో, వేయేల, యిట్టి

---

౧. దో. ౨. జాల్మ.

గురుతల్పగేచ్ఛ సేకూఱె నెట్లనిన
ధర శ్రుతి, "గ్న్యాథా ధృతాచ "నా మఱియుఁ
బూని, "క్రీతాచ మూల్యేనచ " యనియు
మానం బెలర్ప "సమావృత" యనియుఁ
దగ, "సకృత్కామగతావాఽపి" యనియు
నొగిఁ "బంచధా గురుయోషితో" యనియు
జదువుఁ గావునఁ దమసద్గురు దేవు
వదినెయు మఱఁదలు వారివారలును
వారాఁచి విడిచిన వారాంగనలును
వారర్థిసేయు నవ్వారాంగనలును
నెట్టణ రోయిచ్చినట్టి లంజియలు
నెట్టైన నొకపరి ముట్టినసతులు
విరచింప నీమైదువిధములవారు
గురురాణివాసంబు సరిగాదె తల్లి
యీమహాపాతకం బెట్లు దరింతు
నేమిసేయుదుఁ జెప్పవే యమ్మ యనుచు
నడలు, నిల్చును, నిల్వఁబడు, లేచుఁ, జూచుఁ,
బడలిపాదంబులపైఁ బడి పెనఁగుఁ,
జనుఁ, దఱిఁ డాకించుకొనుఁ, [1]బొట్టఁ గ్రుద్దు

---

౧. గద్దు.

కొను, నేలఁబడి పొర్లుఁ, గూయిడు, నఱచు,
నొడలు విడువఁజూచు నుగ్మలిఁ జూచు
వడి లింగగర్భంబు వగఁ జొరఁజూచుఁ
గాయంబు [1]దునియలుగాఁ గొట్టికొట్టి
పాయక ధరఁ జుట్ట బలి జల్లఁ జూచు
చక్కడ్చి రాఱోటఁ ద్రొక్కి దేహంబుఁ
గ్రక్కున వక్త్రేటఁ గలుపంగఁ జూచుఁ
గనియంగఁ గాఁ గొట్టి కాలినయినుప
పెనముపైఁ దనువిడి ప్రేలుపఁ జూచుఁ
గాలిచి భస్మంబుగాఁ జేసి యొడలు
పాలఁ బెన్గాలిలోఁ జల్లంగఁ జూచు
నఱకు చొండొంటితో నఱుగర్గ రాచి
కఱకు దేహము బయల్గాఁ జేయఁజూచు
మఱియును నెఱ్ఱైన మడియంగఁ జూచు
మఱి యట్లుఁగాక యమ్మగువపై దృష్టుః
నాటించి చూచిన నయనముల్ డుల్చి
బేట మాసించి యుబ్బినకోలఁ గోసి
యేఁగుదెంచినకాళ్ల నిల నర్కివైచి
కౌఁగిలింపఁగఁగోరుఁ గరములు దునిమి

[1] దునుకలు.

చదురులాడెడుజిహ్వ మొదలికిఁ బెఱికి
పొదలినవక్త్రంబు పొం గడఁగించి
తలయెత్తి చూచిన తలఁ ద్రెవ్వనడచి
పులకలెత్తినయొడల్ [1]నిలుతిత్తి యొలిచి
చనుఁగవఁగోరు వక్షము గాడఁ బొడిచి
పెనుఁబొట్ట మఱివ్రస్సి ప్రేవులు సాగి
నెట్టణ గుడిసుట్టు సుట్టంగఁ జూచు
నెట్టైనఁగానిపో దీకర్మమనుచుఁ
గనలుచుఁ [2]గోపాగ్ని గన్నులఁ గ్రమ్మఁ
గనుఁగొని [3]యెదిరిని దనుఁ గానలేక
యరుగ, నంతనె నిల్చి మరులుగొన్నట్లు
వురి వెడల్ [4]మఱిసాఱి మరలి యేతెంచు
గుడిసొచ్చు, గుడి వెడల్ వడి లేచుఁ జూచు
నడవులపాలయి యరుగు నెందేనిఁ
బ్రకటితంబుగ శోకపారవశ్యమున
నొకచోటఁ గాలునిల్వక తిర్గితిర్గి
భ్రమితుఁడై వాపోవు భర్త యీపాత-
కమునకు నెఱి గుఱి గలుగునే కొంత

౧. నిలువుతిత్తొలిచి. ౨. శోకా. ౩. యెదిరిఁదన్నును. ౪. పలుమారు; వడిఁబాఱు.

యెవ్వారిఁ గాల్ద్రవ్వునో వృషభేంద్ర
చెప్పవే నా కింకఁ "జేర్గడ యెద్ది
యీతప్పనకు విధి యెట్టిదో శ్రుతులఁ
జూతమా యరసి యో చూపుమా యంచు
నో నారికేలంబ యీనారి గురుల
యానారి మది నెట్లు నానేరమికిని
శోకంబులేని యశోకంబ యే న-
శోకి గానేర్తునో కోకర్మ మడఁచి
యో ఘనసారంబ యీఘనాఘంబు
మోఘంబు సేయుఁగ్రియాఘంబు గలదె
నాచంద మిట్లయ్యె నోచందనంబ
యేచందమును గాద యేమి సేయుదును
భ్రమియింపుచున్న యో భ్రమరమా యిట్లు
భ్రమియింపుచున్న నా భ్రమ లెట్లు వాయు
నో కూయుఁ గోకిలా యెడఁబడిగాఁగ
నాకూయి యడఁగునే యేకాల మైనఁ
బురివిచ్చియాడు నో పురినెమ్మి శివుని
పురి నమ్మి యే జముపురి కెట్లువోదు
నేగతియును లేమి నే రాజహంస

---

౧. చెయిదంబులెవ్వి.

క్రే! గో! యనుచు మమ్ముఁ గేలి సేసెదవు
యోపల్కు- కీరమా యోడకు మనుచు
నాపల్కు- లుడుపంగ నేపల్కు- గలుగు
దీప్రమై యున్న యోవప్రమా యీ మ-
హాప్రమాదము వాయునే ప్రమోదమున
రుద్రుని యోముఖభద్రమా యీయు-
పద్రవం బెట్లు దా భద్రమై తనరు
నాకు నోనంది మహాకాళులార!
యేకాలమునఁ గూడునో కాలగళుఁడు
ముందటనున్న యోనందికేశ్వరుఁడ
నందితంబంద నాకం బెట్లువాయు
నోవీరభద్రయ్యరో విదితంబు-
గా నిధి దీనికిఁ గలుగునో కొంత
ప్రథితులై చను నోప్రమథులార! పాప
మథనంబు గావించుమతము దా నెట్టు
లోపురాతనులార యోపుదునయ్య
యీపాతకము దరియింపంగ నింక
నూరకుండఁగఁ దగ దోయసంఖ్యాతు-
లార! యెట్లుడఁగు నా కీరోదనంబు
నేల యోవీరమాహేశ్వరులార!

యాలింపుఁ డింక నా [1]యఱిమిఱివిధముఁ
జెచ్చెర వేయును జెప్పంగనేల
చచ్చి శుద్ధుఁడనౌదు శంకరా యనుచు
నందంద పొడిచి లో[2]నార్చి కెలంకి
కందికొయ్యలు రెండు గన్నులఁ దొలిచి
క్రమమున దేహంబుఁ గండలు సేయఁ
దమకించియున్న యత్తఱి కటమున్న
వృత్తాంతమంతయు విని యాక్షణమ సు-
వృత్తుండు చిత్సుఖాయత్తుండు గుణస-
మగ్రుండు స్వగుఃహస్తాగ్రజన్ముం డు-
దగ్రత నేతెంచి తమ్మునిఁ గదియ
బిట్టుల్కి గురుభక్తిఁ బ్రీతి సంభ్రమము
రెట్టింప దుఃఖాగ్ని నెట్టుకొనంగఁ
బఱతెంచి యడుగులఁ బడి వాయి విడిచి
యఱచుచు లేవక యట్ల వాపోవ
గురుభక్తివర్ధన గురుభక్తితిలక
గురుభక్తిశృంగార గురుభక్తిసార
వందకు మనసునఁ గందకు మాత్మఁ
గుందకు మెందును గొఱంత లే దింక

---

౧. యఱిమెడి. ౨. నార్చియుఁగెలని.

నడిసన్నయట్టి యుష్మద్గురుభక్తి
గడసను¹భక్తులకవిలియ కెక్క
నేపార వేయునునేల దుఃఖోప-
తాపోపశమము నుద్ధతి నిర్వహింప
లెమ్మని చేసాచి లేనెత్తి కూర్మి
గ్రమ్మంగ నందంద కౌఁగిటఁ జేర్చి
యూఱడిల్లఁగ శిరం బురమున నొత్తి
కాఱెడు రక్తాశ్రుకణము లందంద
తుడుచుచు భక్తి సద్గురులింగమూర్తి
యడుగులఁ దలఁప నయ్యాండరి కపుడ
కన్నులు రెండు నొక్కటఁ దేజరిల్లెఁ
బన్నగధరుభక్తిపరులు హర్షింప
భువిజను ²ల్నైరవి యద్భుతలీలఁ జూడ
నవిరళభక్తిఁ దచ్ఛివసహోదరుఁడు
దండియయ్యు గురుభక్తాండారి కొసఁగె
రెండుగన్నులు నాఁడుఁ బ్రీతితో నేఁడుఁ
బాదముల్ గృపసేసెఁ బండితారాధ్యు
లాదట భక్తిమహత్త్వంబు వెలయఁ
దెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారును జూడ నిల నట్లుఁగాక

౧. ప్రముఖుల. ౨. ల్నైరసి; ల్నైరవి.

బెలిదేవి వేమనారాధ్యులకథ

మలహరసద్భక్తిమత్తవారణము
బెలిదేవివేమన పెద్దయ్య[1]గారు
శ్రీశైవసమయైక దేశికోత్తముఁడు
పాశవిమోచనపటుకళావిదుఁడు
సకలంకదివ్యాగమార్థసంవేత్త
ప్రకటచతుర్వేదపారంగతుండు
ఖ్యాపితధర్మార్థకామమోక్షప్ర-
దీపితమార్గప్రతిష్ఠితకీర్తి
మహితపంచాక్షరీమంత్రసిద్ధుండు
సహజకటాక్షవీక్షణ[2]నయాంభోధి
వీరమాహేశ్వరాచారవిస్తార
సారగుణోదారచారువర్తనుఁడు
బసవపాదాంభోజభాజనస్వాంతుఁ
డసమశాపానుగ్రహసమగ్రబలుఁడు
నానతజనమృత్యుహరణ[3]ప్రభావుఁ
డానతజనపునరాయుఃప్రదాత
సర్ప వృశ్చిక మృగ శ్వాసన జలాగ్ని
దర్పిత[4]నృపచోరదర్పాపహారుఁడు

1. దః సుధాం. 2. పావన. 3. ప్రతాపు. 4. మృగ. 5. పుండు.

నానావికలజనానందకరమ్ము
గా నిట్లు వర్తింపఁగా నొక్కనాఁడు
వొరుగూరనుండి భూవరుఁ డొక్కరుండు
పరిణయంబై తనపత్నియుఁ దాను
వెస వచ్చివచ్చి యవ్వేమనారాధ్యు
నసలారఁ గాంచి జోహారని మ్రొక్క
బుధపుంగవుఁడు పుష్పములు గోసికోసి
యధిపు నయ్యశ్వరథారూఢుఁ జూచి
యార్తివిదూరుఁ డనాగతాతీత
వర్తమానజ్ఞానవంతుండు గాన
యాతఁ డల్పాయుష్యుఁ డౌట నెఱింగి
యాతని దీవింప కవుల నేఁగుడును
వినతుండ నైతి దీవింపరు వీరు
వనితయు నవ్వునో యనుచు లజ్జించి
వినఁడొకో నాజోహా రనువచనంబు
వినెనేని దానెట్లు సనియె నొండెడకుఁ
గనుఁగొనఁడొకొ నాదు కరము లెత్తంగఁ
గనుఁగొనఁడేని నా క్రమ మెల్లెఱుంగుఁ
జేమెత్తి మ్రొక్కిన నాయయ్యగారు
వా మెత్తకునికి గర్వమయంచు, బండి-

దిగనుర్కి వెనువెంటఁ జగిలి యిగ్గేలు
మొగిడించి యయగారు మ్రొక్కెద ననుడు
వెండియు నతని దీవింపకయున్న
దండిమై నృపకుమారుం డంతఁ బోక
కొంకులజ్జయు నొక కొంతగోపంబు
గొంతభక్తియుఁ దోఁప సంతతాభ్యుదయ-
కరులు మహాభక్తనరులు భూసురులు
హరవేషధరు లఘహరులు సిత్పరులు
నార్యులు శివమతాచార్యు లవార్య
వీర్యులు సన్మార్గచర్యు లుత్తములు
మీరని మ్రొక్కుడు మేలొందు మనక
యూరకయుండుట యుచితమే పెంపె
పెద్దతనంబె గాంభీర్యగుణంబె
తద్దయు భక్తియే తగవె పూజ్యతయె
యీమూర్తి యీవేష మీదేశికత్వ
మీమహనీయత కీయహంకృతియె
నీవు న న్నిప్పుడు దీవింపకున్న
నావంతయును నాయు వది దక్కువగునె
నీవు న న్నిప్పుడు దీవించుమాత్ర
మావంతయును నాయు నది మెక్కువగునె

మననివారల నీవు మనిపెదవయ్యా
తనుఁ బొందుమృత్యువు దాసియే నీకు
వడి బ్రహ్మ నుదుట మున్ వ్రాసినవ్రాలు
వెడతటి కేఁగునే పెక్కు లేమిటికిఁ
దనపూర్వలిఖితంబుఁ దప్పించి పిదప
వనజజుఁడైనను మనఁజేయఁగలఁడె
మెయ్యెడ నిట్టి వేమెఱుఁగము మీర
లయ్యగారయ్య లోకావళికెల్ల
నిట్లైనఁ గృతమతు లేలపాటింతు
రిట్లైన నెవ్వ రిట్లేల మ్రొక్కెదరు
ఆలించి మేలగు ననిన మీనోరు
గోలుపోవునె యిట్లు గురుమార్గ మిదియె
మీకు యుండెడుఁగాక మీమహత్త్వంబు
మాకేమి దీవింప మఱి బుధుల్ లేరె
యనవుడు నెల్లి మధ్యాహ్నంబునకును
మనుజాధిపుఁడ నీకు మరణమయ్యెడిని
ఇట్టి యల్పాయుష్య నెంతరాజైన
నెట్లు దీవింతు మన్నెఱేఁగి యెఱింగి
తివిరి యల్పాయుష్య దీవింతు రెట్లు

౧. నవుడు; వేళ. ౨. జనాధుఁడ.

శివభక్తు లటుగాన చిరదయామతిని
దీవించి రేనియు దీర్ఘాయువుగను
వాఖిఁ గృపసేయవలదె కావునను
వాదేల "దీవన నాదువాక్కులకు
రాదు నీతొంటిప్రారబ్ధ మెట్టిదియొ
నీచావు దప్పదు నిక్కువం బెల్లి
వే చనుమనుడు నవ్విభుఁడు గోపించి
వలచి కావఁగ లేఁడు వరపుత్త్రు విష్ణుఁ
డలిగి చంపంగలేఁ డాజలంధరుని
వలచి బ్రహ్మయుఁ దనతలఁ గావ లేఁడు
అలిగి చంపంగలేఁ డాగజాసురుని
నలిగినప్పుడు సంపఁదలఁచినఁ గావఁ
దలమె ఫాలాక్షుండు దక్క మర్త్యునకుఁ
బరమేశలాంఛనపరుఁడవు గాక
నరులు మ్రొక్కినమాత్ర హరుఁడ వీ వగుదె
నిక్కంబపో మఱి నీమాటలెల్లఁ
జక్కన యెల్లియ చచ్చితినేని
నిల నెందు నయ్యగారలు మిమ్ముఁబోలఁ
గలుగరు వొమ్మంచు గర్వోక్తు లాడి

---

౧. దేవనావాపునకెట్లు.

చని [1]నిజాంతర్గృహమున సతి దాను
ననుపమ సురతసుఖాబ్ధిఁ దేలుచును
పృథుతరానోన్యసంప్రీతి నవీన
మథనంబు దళుకొత్త మగ్నత దనర
నలసి లావణి సురతాంతంబునందు
సొలసి నిద్రింప నుయ్యాలచేరువెంట
నఱిముఱి నొక్క మహావిషోరగము
వఱతెంచి యతనియుప్పలవాయి గఱచి
వెలికిలంబడుడు నవ్వోలఁది మేల్కాంచి
వెలికుర్కి హాయని పిమ్మటినొందు
కలకలంబునఁ బతి గ్రక్కున లేచి
బలువిడి రక్తధారలువాఱు కరము
ఘనఘోరసర్పంబుఁ గాంచి మూర్ఛిల్లి
జనపతి యప్పుడ చచ్చెఁ; జచ్చుడును
నాద్యులు ననుభవవేద్యులు శాస్త్ర
వైద్యులు గారుడవరమంత్రవిదులుఁ
జనుదెంచి విషముచేఁ జచ్చిన నృపతిఁ
గనుఁగొని యిది యశక్యంబంచు నేఁగ
మఱియొక్క గారుడమంత్రసిద్ధుండు

1. నిజగృహమున సతియును దాను. 2. భీతి.

వఱితెంచి విషదగ్ధభావంబుఁ జూచి
యక్కటా కఱచెరా హరహరా పాము
నెక్కాని కాలంబు నిండెనో కాక
సుమహత్స్వరాణ వాసుకి మణినాగ
విమలకర్కోటక కుముదాక్ష కుముద
శలపోత కానిల శబ లాశ్వతల, వి-
మలిన పిండకర వామన కుహాకోట
నఖ మహోదర హవిర్ముఖ హేమశంఖ
నఖ హవ్యకర్ణ ధనంజయ పంచ-
రక పరివర్త కార్యక శిఖి నిష్ఠు-
రక మిత్ర కల్మ షైరావత శబల
కౌల కౌశిక తక్ష కాశేష శంఖ-
పాల పుండ్రక ముగ్ధ కైలాసుతాది
నాగసహస్రము దెన్నంగ నష్ట
నాగంబులన నిరు నాల్గుజాతులకు
స్వాములై తమతమ జాతులయందు
నేమించి కఱచు దుర్నీతిపాపులను
ధరణి గారుడమంత్ర తంత్రౌషధములఁ
బరమమృత్యువు దక్కఁ బాయుఁ దద్విషము
వెండి గజుఁడు దుర్ముఖుండు మిత్రారి

దండపాదుఁడు గుళికుండు రేణకుఁడు
జనకుండు స్వర్ణకుండును మొదల్ గాఁగఁ
జను కిల్బిషోరగ శతసహస్రములు
సత్య మకిల్బిష సర్పముల్ వరమ
మృత్యు వాసన్నమై మెడఁ ద్రొక్కకున్న
గారుడక్రియ వల్క నేరకుండినను
ధారుణి మంత్రౌషధములచేఁ బాయు
నీవేళ నీజాతి యిన్ని దంతంబు
లీవల నీయంగ మిట యనిచెప్పఁ
దమితమవలంతులు దప్పక కలుచు
నమిత మహాష్టనాగాంశోరగములు
గారుడమంత్ర సంస్కార ప్రశక్తి
నారంగ నావేశ మతనికి వచ్చి
పలుకు ననాగతంబులఁ జెప్ప విషముఁ
దొలఁగించుఁ బరమమృత్యువు గానినాఁడు
అపమృత్యు[1]వులనైన నన్ని దంతములు
నపరీక్ష నాఁటిన నరుదు దక్కింప
నగ్గికాకలను జలాభిషేకముల
లగ్గగు నొక్కపల్ నాఁట నాడినను

---

౧. నైనను.

దండిమంత్రములచేఁ దరియుదంతములు
రెండూన నౌషధక్రియలచేఁ బాయు
నరు మూఁడుదంతముల్ నాఁటిన ద్రెగుఁ
బరువడి మఱినాల్గు వండ్లు నాఁటినను
ధర మంత్రతంత్రౌషధక్రియ లేల
హరివేధలకుఁ గావ నరుదుగావునను
నదియును గర్కోటకాంశ మీపాము
మొదల నాలుగుదంతములుఁ గాడె నవియు
ఫాలలోచనుఁ డహిపతికంకణుండు
గాలకాలుండు నిర్గతమృత్యుభయుఁడు
గాలకంఠుఁడుఁ గావఁజాలునో యతఁడుఁ
జాలఁడో చాలసంశయమంచు నరుగఁ
గమియంగ నార్తారవములు హాహార-
వములు నురస్తాడనములుఁ జెలంగఁ
బరిజనుల్ పురజనుల్ బంధువర్గంబుఁ
బొరిఁబొరి వాచర్యఁ బొలఁతి దోడ్తోన
చని నిశ్చయము నేసి తనమనోహరుని
గనుఁగొని యాయయ్యగారి వాక్యంబు
దప్పదు వొమ్మంచుఁ దత్ప్రసంగంబుఁ
జెప్పడు జనకులుఁ జెలులుఁ జుట్టములు

నిని యింక నదియేల వేయును జనుఁడు
చని యంద [1]డాయయ్యశరణుసొత్తండు
వయిత[2] డాయయగారివాకిట శవము
దయసేయ కది యెట్లు దప్పింపవచ్చు
నంచు నందఱు నేఁగి యయ్యకు మ్రొక్కి
పంచత్వమును బొందెఁ బ్రభువ మీబంటు
లీ మీదీవెనలేమిఁ దదీయ
కాల మాసన్నమై కడచెఁ గదయ్య
యది యేలతప్పె మీయానతి జియ్య
సదమలసద్భక్తహృదయాబ్జశయ్య
చిరసఫలీకృతాశీర్వాదనాద
పరిచితానంతార్థపరిమిత వేద
పరమసుఖావేశ భరితప్రమోద
త్వరితసంతతమహాదానవినోద
యవితతనిరతిశయాగణ్యపుణ్యా
ప్రవితతోద్ధతవీరభక్తాగ్రగణ్యా
యశరణజనతాసమగ్రశరణ్యా
పశుపతిసమమాధ్వపథికవరేణ్యా
సకలలోకైకప్రసారితకీర్తి

---

[1] అముసయ్య. [2] వయిచుఁడా.

ప్రకటితశివయోగపరతంత్రమూర్తి
స్థిర పశు పాశుపతి జ్ఞానవర్తి
పరమవీరవ్రతపథచక్రవర్తి
కాలాహిదష్టుని గరుణించి కావ
నాలించి యోడకుండని దయఁ బ్రోవ
సభయాత్ములగు మాకు శరణంబు నీవ
యభయ మి మ్మోవేమనారాధ్యదేవ
ప్రతి దక్కఁ మీదయఁ బడయంగలేక
యితఁడు గాలాహి కాహుతియయ్యె నిపుడు
మ్రొక్కక చెడు టది మోసంబుగాన
మ్రొక్కెఁగదయ్య యీముగ్ధుండు మీకు
ముసిఁడిచౌఁడయ్యకు మ్రొక్కినకన్య
యసలార దీవెన లందదే దేవ
దీవించి కొనిపోయి జీవంబు విడువ
భావించి పడయదే ప్రాణ మాయయ్య
యప్పు డక్కన్యకు నల్పాయువనుచు
నెప్పాట దీవింప కేఁగిరే వారు ?
జనకులు దమకూఁతుశవ మప్డు దెచ్చి
మునుకొని చౌఁడయ్యముందటఁ బెట్టి
నీదీవెనలు దప్పునే దేవ యనుచుఁ

బాదాబ్జములమీఁద బడి లేవకున్న
నువిదకుఁ బ్రాణ మయ్యానికిస ముసిఁడి
చన్నుఁడయ్య యొసఁగఁడే జగమెల్ల నెఱుఁగఁ
గాన భక్తుల భక్తిఘనతఁ దలంపఁ
గా నిది దా నెంతగార్యంబు దేవ
కావున మముఁ గటాక్షప్రేక్షణమున
భావించి యితనికిఁ బ్రాణదానంబుఁ
జేయవే యనుచు నత్యాయతభక్తిఁ
బాయక మ్రొక్కుచుఁ బ్రణుతి సేయుచును
శరణన్నఁ గాచు మీబిరుదింక నేఁడు
వరమాత్మ మఱవంగఁ బాడియే దేవ
యభయంబు వేఁడిన నాలంబు సేఁత
యభయాత్మ యిది మీకు విభవమే దేవ
మఱుఁగుసొచ్చిన నేత్తె యొఱవునఁ బోవ
నుఱు వీరభక్తికి యోగ్యమే దేవ
దెస దిక్కు నీవన నుసిలిపోవంగ
నసమాన మీకిది యర్హమే దేవ
గతియును మఱియు నేడ్గడ నీవయనఁగఁ
౧బ్రతిని జూఁడమి భక్తి పాడియే దేవ

---

౧. ప్రతినిజూపమి; ప్రతిఁజూపకునికిదాఁ.

యనుచుఁ బ్రార్థించుచు నడుగుల కెఱఁగు
చును, ముట్ట ముదలించుచును, గణస్తుతులు
దనరి చేయుచుఁ, బ్రాణదానంబు వేఁడి
కొనుచుఁ, గృపావలోకనముఁ గోరంగ
నతిదయాభావన నతకులఁ జూచి
యతుల సద్భక్త మహత్త్వంబుఁ దలఁచి
శరణన్న నరుఁ గావఁజాలకయున్న
హాని భక్తిమాహాత్మ్య మణఁచుటగాదె
ముదలించి పలుకంగ మూర్ఖులపగిది
మదినైనఁ గోపించు డిది వెర్రిగాదె
మీఱిన సద్భక్తి మితిముట్టఁ బలుక
జాఱిన నవ్వారె శరణవత్సలులు
ఘాత వృత్తించిన దాఁడుపై విడువ
భీతిల్లి పాఱుట బిరుదుతనంబె
ప్రాణదానము వేఁడి భక్తిపై మోపఁ
బ్రాణవంచన నేఁత వంత నే యనుచు
శివభక్తవితతిఁ జెచ్చెరఁ బిల్వఁబంచి
యవిరళభక్తి సాష్టాంగుఁడై మ్రొక్కి
యనుపక్తి విపుల సింహాసనాసీను
లను జేసి కేళికలును వడిదనర

నాయెడఁ జాంగుభళా యనురవము
ఘేయనురవమును బాయక మ్రోయఁ
గవులు వారకులు నాకాంక్షఁ గీర్తింప
వివిధవాద్యధ్వనుల్ దివి దీటుకొనఁగ
మృడుభక్తనివహంబు లడుగు లాకాంక్షఁ
గడిగియుఁ బాదోదకములు గుంభములఁ
బట్టి సభాస్థలిఁ జెట్టి వాసెనలు
సుట్టి జనావళి సూడ నర్చించి
హారభక్తితతికి నక్షతగంధ
వరపుష్పమాలి కోత్కరము లర్పించి
ఘోరన బహుఘంటి కారావ మెసఁగ
నారంగ ధూపదీపాదు లొనర్చి
స్ఫుటభక్తియుక్తి విభూతి వీడియము
లటుగూడ భక్తజనావళి కిచ్చి
యసలార నవ్యపుష్పాంజలు లెత్తి
వసుధ ముమ్మాఱుగా వలగొని మ్రొక్కి
యనుపమభక్తగణాజ్ఞాపనమున
జనపతిశవముఁ దెండని పంప నదియుఁ
[1]దిరిగిన వెలిగ్రుడ్లు దెఱచిననోరు

౧. దిరుగని.

నరమొగిడ్చిన ఱెప్ప లురుతరోష్ఠములుఁ
గ్రుంగినకటము లెక్కువ మొత్తమగుచుఁ
బొంగి దూలము విర్గి వంగినముక్కుఁ
బచ్చనిపండ్లు వెల్వడి తీగచొల్లు
విచ్చినరంధ్రముల్ వీడిన కొప్పు
నంగవిచ్ఛాయయుఁ బొంగినకడుపు
వంగినవీపును వ్రాలినశిరము
వొందఱిసగ్గొంట్లు వోయిన సందు
సందులనెత్తురు నచ్చినతోలు
గళదప్పి బలసి దుర్గంధంపుఁబ్రోయి
వలరుచుఁ దనువెక్కి [1]వాచిన[2]మేను
మూఁగుచు జుమ్మని వీఁగుచు మఱియు
మూఁగుచు మునరు నయ్యీఁగలుఁజూడఁ
గంపు నేవము భయంకరమును దోఁప
గుంపిడి జనులు ముక్కులు వట్టికొనుచుఁ
గటకటాయనుచు నెక్కడి దీఁక ననుచుఁ
దొటుకున నుమియుచుఁ దొలఁగిపోవంగ
ననుపమభక్తసభాభ్యంతరమున
జనులు దజ్జననాథుశవముఁ దెచ్చుటయు

---

౧. వాచిన. ౨. మోము.

నప్పాట జలముల నాతని దేహ
మొప్పఁగాఁ గంపులేకుండఁ దోమించి
భక్తలింగముల శ్రీపాదధూళియును
భక్తహస్తార్పితభసితంబుఁ గలయఁ
దత్పాదజలమిశ్రితము సేసి భక్తి
తాత్పర్యమతి వానితనువునఁ బూసి
యాపూఁతపైఁ ద్రిపుండ్రాంకముల్ మృతుని
రూపితాంగముల నారోహణ సేసి
మండితభక్తనిర్మాల్యపుష్పములు
దండలుగాఁ గట్టి తనువునఁ జుట్టి
దురితవితానగోధూమఘరట్టుఁ
డురుకీర్తి వేమసద్గురుమూర్తి మఱియు
మండితాసంఖ్యాతమాహేశ్వరులకు
దండప్రణామముల్ దగ నాచరించి
నయమొంద [1]వినయవినమితోత్తమాంగుఁ
డయి వీరభక్తమహత్త్వంబు మెఱసి
విజ్ఞాపనంబు సద్విధిఁ జేసి, తద్గ-
ణాజ్ఞాపనంబు దయాసమగ్రతయుఁ
బడసి వెండియు మహాభక్తరాజికిని

---

౧. (బ్రీతి.

పుడమి సర్వాంగముల్ పొంద మ్రొక్కుచును
ప్రమథపురాతనభక్తపదాబ్జ
సముదితస్మరణప్రసక్తాత్ముఁ డగుచుఁ
బంచాక్షరీమంత్రభవ్యకళాస-
మంచి తానుష్ఠాన మపుడు దొల్కాఁడ
భద్రభక్తార్పితభస్మశేషము స-
ముద్రిక్తనృపపుత్త్రు మొగమునఁ జల్లి
లేలెమ్మనుచు నవలీల దయావి-
శాలత నతనిహస్తము వట్టి తివియ
నంతలోనన సజీవాంగుఁడై, గతకృ-
తాంతకమృత్యుభయాక్రాంతమతిని
ఁజడిగొని వేమనస్వామిపాదములు
పిసువకఁ యంతంత వినమితుం డగుచుఁ
గృపయును భక్తియుఁ గీర్తన దనర
నృపపుత్త్రు లింగసన్నిహితుఁ గావించి
యవ్వేమనయ్యయు నతిభక్తిమహిమ
నివ్వటిల్లఁగఁ దాను నృపకుమారుండు
నతుల తదీయ మహాభక్తగణవి-
తతికి సాష్టాంగులై ధరఁ జాఁగిమ్రొక్క

౧. వ. ౨. యందంద.

నయ్యసంఖ్యాత మహాభక్తవరులు
నయ్యన వేమనాచార్యు నవార్యు
మహనీయసద్భక్త మహితపదాబ్జ
నిహితశిరోభాగు నిత్యానురాగుఁ
బరమమాహేశ్వర పాదాబ్జరేణు
పరికల్పితలలాటు భక్తకిరీటు
శరణపదాబ్జభాస్వరమకరంద
పరి[1]శేషసర్వాంగు [2]బసవాంతరంగు
గణపాద నఖరదర్పణభాసమాన
గుణగణాంచితదేహు ప్రణుతదాసోహు
భక్తాంఘ్రినఖకాంతి పటుచంద్రికాప్ర-
సక్త దివ్యచకోరు సత్యవిస్తారు
శతపత్రసంభవకృత దురక్షర ని-
యతి నిరాసకమహిమాఢ్యు నహూఢ్యు
ననుపమ విష్ణుమాయావినిర్దళన
వినుత చిద్విద్యాప్రవీణు నక్షీణుఁ
బశుపాశమోచన పాటవధుర్యుఁ
బశువాహనసమాను భక్తినిధాను
నుద్ధతమృత్యు దంష్ట్రోత్పాటన ప్ర-

౧. శేష. ౨. భసితా.

సిద్ధకళాకల్యు శివగణలోల్యు
నురుతరదండ ధరోద్దండ దండ
వరనిహతిక్రియా ¹వర్జితు ఖ్యాతు
విజితకాలోరగ విషహరు ధీరు
నిజదయామృతపయోనిధి నోలలార్చి
యటిముటి దనర సాష్టాంగుఁడై మఱియు
మఱియును మఱియును మహిఁ జాఁగి మ్రొక్క-
వేమనారాధ్యు సంస్తుత్యనిఖసాధ్యు
నామహాభక్తు లత్యర్థి లేనెత్తి
లాలితానోన్య ప్రియాలింగ నోప-
లాలనాది క్రియాసంకృతుఁ జేసి
బాపురే వేమన ప్రభువ సర్వజ్ఞ
బాపురే వేమ సద్భక్తమనోజ్ఞ
నల్లవో వేమ సముల్లాసకీర్తి
నల్లవో వేమ సానందైకమూర్తి
పీనుంగునకుఁ బ్రాణదానంబు సేయఁ
గా నీక చనుఁగాక కరుణాభిషేక
హరివేధలవశంబె యమునోరఁ దావఁ
బరమ మృత్యువుఁద్రోవఁ బ్రాణంబుఁగావ

---

౧. చరితుఁబ్ర. ౨. ఖా.

నిట్టి పీరత్వంబు నిట్టి ధీరత్వ
మిట్టి మహత్త్వంబు నిట్టి సత్యంబు
వినుమే యెందు భావించి యెందైనఁ
గందుమే నీయందకాక సుశ్లోక"
యనుచు [1]భక్తవ్రాత మభిరమ్యలీల
వినుతింప బెలిదేవి వేమయ్యగారు
సచ్చిన నృపునకు సరగునఁ బ్రాణ
మిచ్చె నచ్చెరువుగా [2]నీడితమహిమ
నప్పాట నీపండితారాధ్యదేవుఁ
డొప్పారఁ గరుణ నేఁ డొసఁగెఁ బాదములు
దెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారునుజూడ నిల నట్లుఁగాక

సకలేశ్వరమాదిరాజయ్యకథ

మహి సకలేశ్వర మాదిరాజయ్య
మహిత శివాచార మార్గవర్తనుఁడు
గాలమృత్యువు కనుఁగవ ధూళిఁ జల్లి
కాలునినోరు డాకాలన తన్ని
వీఁక[3]తోఁ దుద వడి విధిగట్టి పిట్టి
తాఁకు[4]వట్టించి విధాతఁ గీటడచి

---

౧. భక్తానీక. ౨. నిడితన. ౩. తోడనతనివిధి గట్టిపెట్టి ౪. పెట్టించి; వడ్డించి; వత్రించి.

యారంగ విష్ణుమాయాంతకుం డనఁగ
ధారలు ఘూర్ణిల్లఁ దమతేజ మలరఁ
బ్రోడి "శతాయుః పురుష" యనుశ్రుతుల
దాడలు వడ భువి నేడునూఱేండ్లు
లింగార్చనక్రియాలీల సోలుచును
జంగమారాధనాసక్తి వ్రాలుచును
వరనాథసుఖసుధావార్ధిఁ దేలుచును
బరమశివాచారసరణి నేలుచును
జరియింపఁ జరియింప సాత్త్వికభక్తి-
చరితుండు చిక్కమాదరసు నా నొక్క-
భక్తుఁ డతిస్నేహబంధురభక్తి-
యుక్తిఁ బ్రవ్యక్తిగా నోరంతప్రొద్దు
మాదిరాజయగారి పాదపద్మముల
నాదటఁ గొలుచుచు నాలును సుతుఁడు
నిది దమజీవనం బీకుటుంబమున
కిది [1]యుపార్జిత మిది [2]బ్రదు కెట్టు నాక
మృడుఁ డకల్పితమైన వెడగాయకమున
బడివెట్టునంతన [3]మడిగి సమృద్ధి
యంతయు లేమికి వంతయు స్వగృహ-

౧. యుపార్జన. ౨. యీబ్రదుకనక. ౩. యడఁగి.

చింతయు నాత్మ నొక్కింతయు లేక
యతిభక్తి మాదిరాజయ్యపాదములె
గతియును మతియు నేర్పడయుఁగా నడువఁ
గొన్నిదినంబులు సన్నఁ దద్భక్తుఁ
డున్నయున్కిన మృతియుత దేహుఁడగుడుఁ
బాదోదకములను బతిమేను గడిగి
బూది సమస్తాంగములనిండఁ బూసి
పడఁతి యాశవము గంబంబునఁ జేర్చి
యెడవారి నెవ్వరి నెఱుఁగంగ నీక
[1]యింతి దదీయ గృహాంగణంబునను
గొంతు నిక్షేపింపఁగా [2]గుహ సేయు
చప్పుడు విని నిద్ర దెప్పిరి బాలుఁ
డప్పుడు మేల్కాంచి యర్ధరాత్రమున
వోయమ్మ యేమి సేయుచు నున్నదాన
వోయమ్మ మాయయ్యయును గంబ మఱుత
నూర కేమిటికిఁ గూర్చున్నవాఁ, డయ్య-
గారి నేమని కొల్వఁగాఁబోదు నేఁడు
నరగలి గొనక లింగార్చన సేయు
నరుగేల [3]త్రవ్వెదవమ్మ యొక్కతవుఁ

---

౧. యంత. ౨. గొబ. ౩. త్రొ.

జెలఁగి లింగార్చన సేయు వేదికను
జెలమ సేసినఁగాని చేకొన ననుచు
నేమంబువట్టెనో నేఁడు మాయయ్య
గావించి యం దుదకంబులు వడ్డఁ
గలకంఠునకు జలకం బాచరించి
మఱికాని పలుకఁడో మనతోడ నయ్య
గా దేని యేమేనిఁ గారణంబునను
వాదైన నలిగినవాఁడొ నీతోడ
నే తెఱంగున గల్గఁ డింతగాలంబు
నీతోడ నలిగిన నెప మేమి నేఁడు
గాలావసరములు గడలు వెట్టితివొ
శీలవ్రతంబులు సిక్కువర్చితివొ
సమయోచితాగత జంగమావళికి
నలి నుపకరణముల్ బెళగవో, బింది
యలు గడ్గవో, పళ్లెములు వీడువడెనొ,
సమ్మార్జనంబు లొనంగవో, గోమ-
యమ్మిడ జంతువు లందడంగినవొ,
ముగ్గుసాలదొ, పద్మములు సెదరినవొ,
నిగ్గారుగంధంబు నెరను దోఁచినదొ,
తడియొత్తు కరవట్టు దడిసియున్నదియొ,

¹వడవెట్టవో ²యర్ఘ్యపణ్యాముల్ గూడఁ,
దొడిమవుచ్చినపువ్వు దొలినాఁటిపువ్వు
గడియుఁ బోయినపువ్వు గందినపువ్వుఁ
బోలశోధించిన పుష్పంబులందుఁ
దూలి ³తా నొకటియుఁ ⁴దొలఁగియున్నదియొ
గుగ్గులం బియ్యవో యగ్గలంబిడిన
నగ్గి యాఱినదొ రసాధిక్యమగుడు
నీరాజనంబులు నియమంబుమిఱికిఁ
బూరగింపమినొకో యారతి యీవొ
కెంఁకుల దీపంబు లలరవో, యుక్క-
వొలసెనో, కొడుఁగుర్లు వుచ్చకుండినవొ,
మృదున కోగిరములు ⁵వడి నిచ్చునపుడు
దొడఁబడ ⁶సందిచ్చితో మనంబిడితొ
యర్పితంబైన మహాప్రసాదంబు
నర్పింపఁబడని ద్రవ్యములఁ గూర్చితివొ
కలిపితో త్రివిధోదకములు వూర్వమ్ముఁ
దలఁచితో తత్ ప్రసాదంబులవలనఁ
బనిచిన నేమైనఁ బనిసేయవైతొ

౧. వడి. ౨. యర్ఘ్య. ౩. యంవొ. ౪. దొరలి. ౫. గడ(డు). ౬. వంచించి.

మినికితో పిలిచినఁ బని యేమి యనవొ
మఱుమాట లిచ్చితో [1]మందె మేలమున,
వెఱపుసెడితో, మాటవినవొ, మార్పడితో,
ధర నెన్నఁడును లేనిదానవో యమ్మ
పొరుగింట నిరుగింటఁ బ్రొద్దువుచ్చితివొ
యూరక యలిగినకారణం బేమొ
యూరకుండంగ నీ కుండంగఁ దగునె
యమ్మమ్మ మాయయ్య యడుగులమీఁద
గ్రమ్మనఁ [2]బడుదండు రా నీవు నేను
నలుక [3]దీఱెదుఁగాక పలికెదుఁగాక
యలిగిన నెప మిది యనియెదుఁగాక
వడి శివార్చన సేయ వచ్చెదుఁగాక
యెడప కయ్యకు మ్రొక్క నేఁగెదుఁ గాక
చెలమఁ బిమ్మట వచ్చి సేయంగరాదె
యలుక దీర్తము మ్రొక్కి యట్లయుండుదము
తడవు సేయక రావె తల్లి నీవనుచుఁ
జెడగచ్చ యిడి తల్లిఁ గొడుకు దివుచుడుఁ
గొఱఁతలఁ దీర్చెదు కొడుకవుగాక
చిఱుతలమాటల తెఱఁగులే యివియుఁ

౧. మంద. ౨. బడుదము. 3. దేఱె.

జెలమ సేయక యయ్య యలుక దీఱండు
సెలవు గావించి వచ్చెదఁ బవ్వళింప
నరుగుచు మీయయ్య యవసరం బిపుడు
వరిపూర్తిగావింపఁ బట్టి యెన్నఁడును
నలుక యెల్లమి కోప మ ట్లొక్కమాఱుఁ
బలుకు లేకుండంగఁ బదిలంబు సేసి
తెలిపెదఁ బిదప నిద్రింపు నీవిప్పు
డలుకఁ దీర్పంగ మనకొలఁది గాదనుచు
నాత్మజుహ స్తంబు లల్లన నాపి
యాత్మేశుఁ దెసఁ జూచి యతివ నవ్వుచును
గుపయ సేయుచునుండఁ గొడు కిల్లువెడలి
యుపతాపితాత్ముఁడై యొక్కెండ మున్న
దమతండ్రి యోగంగఁ దాఁ దోడ నేఁగు
క్రమమునఁ జని తల్పు గఱ్ఱిన నూఁకి
నాదసుధారసార్ణవమగ్నుఁడైన
మాదిరాజయ్యకు మఱి చాఁగి మ్రొక్కి
యయ్య మాయయ్య మాయమ్మతోఁ బలుకఁ
డమ్యెడి రాఁగదే యలుక మాన్పింతు
రిది నెపఁ బిది ద్రోహ మిది పదప్పనందు

౧. దశ. ౨. దప్పసాఁడు.

గదలఁడు మెదలఁడు గంబంబు నెమ్మిఁ
[1]జెరివినపటముఁ జూచియు మొన్నమీరు
గరుణించినట్టి యూకావిపచ్ఛడము
ముసుఁగిడి శిరమున మొగమున మేన
భసితం బలఁది యెట్లు వలుకకున్నాఁడు
నేఁ డయ్యయును గ్రొత్తనేమంబు వట్టి -
నాఁ డని లింగార్చనము సేయుచోటఁ
జెలమఁ ద్రవ్వెడినమ్మ సే ముట్టి తాన
యలుకదీరం డయ్య యటుగాన యనుచు
నయ్యకు [2]మ్రొక్కెదం డలుక [3]దీర్తండు
నయ్యన రమ్మన్న సంబరపడక
యలుక దీర్పఁగ మనకొలఁది గాదనుచుఁ
జెలమయుఁ ద్రవ్వెడిఁ జిరునవ్వు నగెడి
నలిగిన నమ్మతో నలిగెఁబో యేల
పలుకఁడు నామీఁదఁ బ్రాణమైయుండుఁ
గన్నంత దరహాసకలితాస్యుఁ డగుచుఁ
గన్నంత రోమాంచకలితాంగుఁ డగుచు
నన్నన్న బాలలింగన్న రావన్న
యన్నన్న బాలలింగయ్య రావయ్య

---

౧. జిరిగిన. ౨. మ్రొక్కెదము. ౩. దీర్చెదము.

యించుఁ జేతులుసాచు, నరుగు దే సంత-
సించు, నురంబొగ్గుఁ, జెయ్యారఁ గౌఁగి
టను జేర్చు, నూరుపీఠమునకుఁ దిగిచి
కొను, నెత్తిముందటి కూఁకటిదువ్వి
జడయల్లి తుదఁద్రాట ముడుచుఁ బుష్పంబు
లెడఁ బచ్చుఁ గాటుకయిడి భూతి నొసలఁ
దలవంచుకొని మోముఁ దప్పక చూచుఁ
బులకించుఁ దిలకించుఁ దలఁ దలమోపుఁ
బ్రక్కలు విఱుఁగంగఁ బకపక నగఁగఁ
గ్రిక్కించుఁ జక్కిలిగిలిగిలి యనుచుఁ
జక్కిలింతలు వుచ్చుఁ బ్రక్కలు వొడుచుఁ
దొక్కులు వినఁగోరు నొక్కించునోరు
ముదమున ననుఁ జిన్నిముద్దులు వేఁడుఁ
జొదవి పంచాక్షరిఁ జదివించుఁ బ్రీతి
నాయన్న నాకున్న నాచిన్ని వడుగ
నాయయ్య నాపట్టి నాముద్దుఁగుఱ్ఱ
యెవ్వరిదాసి వీఁ డెవ్వరిభృత్యుఁ
డెవ్వరి [1]లెంక వీఁ డెవ్వరిబంటు
బసవన్న యిలువుట్టు బానిసకొడుకొ

---

౧. టెంకి.

ముసిడి చౌండయగారి ముద్దుమన్మండో
సురియచౌండయగారి పరిచారకుండో
కరికాలచోడని [1]కట్టున [2]యలవో
కక్కయ్యవాఁకిటి [3]కాఁపులవాఁడో
చిక్కబసవరాజు శిష్యసంతతియొ
చీరాలదేవుని చెలికాఁడో, పండి
తారాధ్యదేవు నెయ్యంపుఁ బౌత్రుండో
తెలుఁగుజొమ్మయగారి తెలివేఁటకాఁడో
కలకేత బ్రహ్మయ్యగారి [4]భృత్యుండో
పొడ్డలబాచయ్య గుడ్డమో, నంబి
బిడ్డఁడో, [5]నిమ్మవ్వ పెంపుడుఁ గొడుకో,
మేలేశు కేతయ్య [6]కీలరువాఁడో,
మోళిగమారయ్య మూలబండరువో,
శంకరదాసయ్య లెంకమో, [7]సుంకి
బంకయ్య లింగిమో, ప్రభు చెలికాఁడో,
చెన్నయ్యపన్నమో, చీరాలునంగ-
కున్నఁడో, కిన్నరు కొడుకో, సత్తేశు-

---

౧. కట్టువ; కట్టిన. ౨. యలుఁగొ. 3. కావలి. ౪. పుత్త్రుండో. ౫. సంస్కృతానువాదములో 'అమ్మవ్వ' ౬. కిలరువు. ౭. సుంకె. ౮. పుశిష్యుండో; చిటికాఁడో; సంస్కృతానువాదములో 'స్నానప్రదాయకః'.

చామయ్యగారి ప్రసాదిమో, సిద్ధ-
రాముని బంటో, చేరమ [1]మందకాడో,
మాదిరాజయగారి మనుమఁడో, చిక్క-
మాదని [2]మహాదేవి గాదిలిసుతుఁడో,
యనుచు ముద్దాడాడు మనుచు నవ్వేఁడు-
కొనుఁ, బాడు, సతిఁ జూడుమని కొనియాడు.
నొక్కింత యాఁకొనియున్న నఁజూచి
గ్రక్కునఁ బాపని కాలమజ్జనము
నేయించుఁ, దడవేల చేసెదు పొద్దు
వోయిటు రా వినవో యేఁటిపనులు
నట్టేల లింగన్న కారగింపంగఁ
[3]బెట్టెదు రావొ నాపట్టి యాఁకొనియె
నని పిల్చు నమ్మకుఁ బనిగల్గెనేనిఁ
జనుదెంచి [4]కడికడిఁగొని తానె కుడుపు
నిచ్చమై నటకటం బెక్కించుకొనుచు
వచ్చు మిమ్మర్థిఁ గొల్వఁగ వచ్చునపుడు
జడులకై వడి నాత్మసంతతిఁ గూర్చి
యడిమోహమున ముద్దులాడుట గాదు

౧. డింగరీఁడో; సంస్కృతానువాదమున 'అశ్వపాల'. ౨. మహాదేవి. ౩. బెట్టింతు. ౪. కడిగడి.

ఆరంగ నేఁ దమ యారాధ్యదేవు
పేరుగావున నన్నుఁ బెద్ద మన్నించుఁ,
బొందంగ రాగుంజుపోగుంజులాట,
గుండెన [1]గుడిగుడి గుంజంబులాట,
యప్పలవిందులయాట, వల్మాఱుఁ
జప్పట్లువెట్టుట, సరిగుంజులాట,
నేర[2]బొంతలయాట, సిట్ల[3]పొట్లాట,
గోరంటలాట, డా[4]గుడుమూఁతలాట
దీకొని దిగుదిగుదిక్కానునాట
లాకాంక్ష నాతోడ నాడెడువాఁడు,
విలిచిన ముందట నలిచినఁ బలుకఁ
డలవోకయును జూడఁ డలుక యెట్టిదియొ
కాలమజ్జనముల వేళలు దప్ప
బాలురతో నాడఁ బఱవఁ డెన్నడును
నమ్మెదుబందుల కట్టులు సాప
నమ్మ నా కిదివెట్టుమని [5]వేసరింప
ననయంబు [6]మాలింగమున కిచ్చి కాని
కొనఁ డేపదార్థంబులును దాన యెఱుఁగు

౧. గుదిగుది. ౨. బోతల. ౩. పా. ౪. గురు. ౫. వేసరిం. ౬. నా.

నలిగెడుసంత యన్యాయంబు సేయఁ
బలుకకుండుటకు నావలన లే దెగ్గు,
అక్కజం బీయల్క యదియు మీచేతఁ
జక్కఁగాకున్నె దర్శనమాత్ర యంద,
విచ్చేయవే దేవ విచ్చేయవయ్య
విచ్చేయు నాస్వామి విచ్చేయుమనుచుఁ
బుడమిఁ జాఁగిలిమ్రొక్క నడుగుల కెఱఁగుఁ
దొడఁగి డగ్గుత్తికతోడన లేచు
ధర వెండియును మ్రొక్క నురము లింగంబు
నిర[1]వడఁ [2]జాఁకిట [3]నిరుకుచు లేచుఁ
జక్కఁ జాఁగిలఁబడి జగతి వెండియును
మ్రొక్క నెంతయు నేడ్పుమొగముతో లేచుఁ
బెక్కుమారులు నిట్లు మ్రొక్కుఁ బ్రార్థించుఁ
జక్కన నయ్య పచ్చడము చెఱంగుఁ
బట్టి తూనిగిలఁగఁ[4]బడుఁ గ్రుచ్చి తివుచుఁ
గట్టల్క మీచేతఁగాని పోదనుచు
నాపాపఁ డీభంగి నలమటపడ, ద
యాపూర్తి మాదిరాజయ్యగా రంత
దశనదీధితులు వక్త్రమునఁ దులకాడ

---

౧. పడ; పద. ౨. జంకిట. ౩. నిడుకొని. ౪. వడి.

శిశువాక్యమునకును జింతనవ్వు నగుచు
నింటింటఁ గలరుగా కిల శీలవంతు
లింటిలోపలఁ జెప్ప లెందును గలవె
యలిగికఁ దిట్టుదు రటుతుదుగాక
పలుకకనుండు దుర్భావంబు గలదె
యిల [1]బాల లింటింటఁ గలరుగా కెందుఁ
దలపోయ నిట్టిముగ్ధ గలండె తొల్లి ?
వీనిమాటలు సూడ వేఱొండువిధము
గానోపు సకలేశు నాసతి యదియుఁ
బదపద శిశువ! వచ్చెదనంచు నచటఁ
గదలి యేతెంచుచు ఘనమైనయట్టి
పదము నేఁ గోరమి కది దాన సాక్షి
యదియునుగాక మహాభక్తవితతి
వావిరి దయసేయ వరద నీదాసి
గావున సకలేశ దేవదేవుండ
యెన్నఁడువలయు నా కిది యనఁ గాన
మన్నింతుగాక నామాట నేఁడనుచు
నిమ్మాడ్కి నొకగీత మిల మృదుమధుర
సమ్మిలితవినయసరసోక్తు లలర

[1]. చిన్నపాపలు. [2]. ంబుగా.

నానతి యిచ్చుచు నల్లన సుస్మి-
తాననుఁ డగుచు గృహంబు డగ్గఱుచు
నేమి సేసెద వింటిలో మహాదేవి!
యేమిటి కలిగినాఁ డింతి [1]నీవరుఁడు?
పడఁతి నీపుత్త్రుండు బాలలింగన్న
నడురేయి యిల్లు వెల్వాడి యేలవచ్చె
ననుచు నానతియిచ్చు నమ్మాత్రలోన
విని యుల్కిపడి బలువిడి నేఁగుదెంచి
చక్కఁ జాఁగిలఁబడి మ్రొక్కుచు [2]వెండి
యక్కాంత పలుమారు నడుగుల కెరఁగ
నొక్కింత సని చొచ్చి చిక్కమాదన్న
[3]యెక్కడ నున్నాఁడ వేమి సేసెదవు?
లేలెమ్ము, చనుదెమ్ము, లింగార్చనమ్మ
కాలమాసన్నమ్ము గ్రక్కున రమ్ము;
అట విముక్తిపదమ్ము నం దేసుఖమ్ము
స్ఫుటభక్తిమార్గమ్ము భువి మనసొమ్ము
గాన చైతన్యమ్ముఁ గైకొమ్ము, సహజ-
మానమ్ము వోనిమ్ము, మాకుఁ బ్రియమ్ము
వలుక ననుచలమ్ము నలుక నెపమ్ము

---

౧. నీవిభుఁడు. ౨. మఱియును. ౩. యిక్కడ నీవిట్లు.

గలుషమ్ము నీయెడఁ గలదని మమ్ము
నలుక మాన్పింతు రమ్మని తెచ్చెఁ జుమ్ము
బలువడి తథ్యమ్ము బాలలింగమ్ము
అనుచు దయావలోకనసుధాసార
వినుతపయోరాశి వెల్లినైఁ [1]బజప
యలసి నిద్రించిన [2]యధ్వగు వ్రేసి
తెలుపఁగ నొయ్యనఁ దెప్పి [3]రినట్లు
గలయఁ బ్రాణము మేన నెలకొన వీఁపు
నులిగొల్పి కరతలంబులు వ్రేళ్లఁ బెనచి
తల నెక్కొలిపి చెమటలుగూడ నొక్క-
వలనికి వ్రాల్చి బాహులు నూరగించి
కటములు బొమలుఁ జక్కనఁ బట్టి ముక్కు-
పుటములు నోస్ఠముల్ వొంద మో మెత్తి
తనువు నుల్చుచు [4]నిక్కుచును నావులించు
చును నూర్పు లందఁబుచ్చుచుఁ గనువిచ్చి
ఘను మాదిరాజయ్యగారికట్టెదురఁ
గని సంభ్రమముఁ [5]బ్రీతి గంపంబు భక్తి
సుడిగొన బిట్టుల్కిపడి సాఁగిలంగఁ

---

1. గరిమ. 2. యట్టిచందమున. 3. ల్లి. 4. నిల్గు. 5. దయాకంపితభక్తి.

బడి పదాబ్జంబులపైఁబడి మ్రొక్కి-
ధన్యుండ పుణ్యుండ ధర నేన విగత
దైన్యనిరస్తజఘన్యమహావ-
దాన్య యనన్యసామాన్య లోకైక
మాన్య దూరీకృత మాతృకాస్తన్య
జితమనోభవసైన్య హతభవజన్య
సతతనిర్దళితాన్యసమయచైతన్య
యనుచుఁ గీర్తించి యిల్లాలును దానుఁ
దనయుండు వెండియు ధరఁ జాఁగిమ్రొక్క-
నంత భక్తానీక మలరుచు మ్రొక్కి-
చింతింప నిట్టివిచిత్రంబుఁ గలదె
తనయుని ప్రాణంబుఁ దండ్రిభక్తికిని
ననుషక్తి శివునీగి కది సెల్లె నాఁడు
దనయుని భక్తికిఁ దండ్రిప్రాణంబు
ననుషక్తి గురునీగి కది సెల్లె నేఁడు
మజ! బాపు! సకలేశుమాదరాజయ్య!
మజ! బాపు! సద్భక్తమానసశయ్య!
తావకమూర్తి దాదాలఁ గాంచినజ-
నావళి బహుపాతకావళుల్ సెడవె?

భవదతులితమూర్తిఁ దవిలి కన్గొన్న

నవినీతుఁడైనఁ గృతార్థుండు గాఁడె?
వేయేల? మీతనుచ్ఛాయ పైఁ బాలయఁ
బాయవే జీవుని పాశబంధములు?
బాగొంద మీస్నేహపటువీక్షణమున
రోగియు నపుడ నీరోగియై చనఁడె?
విధియింప మీదయాన్విత వీక్షణమున
బధిరుండు సకలశబ్దశ్రోత గాఁడె?
భవదియ్య కారుణ్య భరితేక్షణమున
ధ్రువము మూఁగైనఁ జతుర్వేది గాఁడె?
నెట్టన ¹మీదయాన్వితవీక్షణమునఁ
బుట్టుఁజీఁకునకైనఁ బొడలవే దృష్టు?
పాలింప మీదుకృపావలోకనము
వ్రాలిన వృద్ధైన బాలుండు గాఁడె?
యంకింప మీదు ఘృణావలోకనత
నంకురింపదె కొరడైన నక్షణము?
గణుతింప మీకాల్యకరుణైకదృష్టిఁ
గుణపమైనను లేచి గునగువఁ జనదె?
భావింప మీమోహాభరితైకదృష్టి
దావానలంబైనఁ దా మంచు గాదె?

---

౧. నీ.

లీల మీహితౌ¹దృగ్విలోలసంగతిని
హాలాహలంబైన నమృతంబు గాదె?
మహనియ్యభవదియ్యమహిమ దలంప
సహజంబకాక ప్రశంసింప నెద్ది
ప్రార్థింపఁ గైకొని పైకొని సుతుని
నర్థి సల్పంగ విజయించేసినాఁడఁ
బూని మీరై ప్రాణదానంబు సేయ
మానుగా ³నీచిక్కమాదన్న మనుట
యిది సోద్యమే యంచు నిల భక్తవితతి
వదలక నిజకీర్తి వర్ణింప నిట్లు
మాదిరాజయ్య సమ్మదలీలఁ జిక్క-
మాదన్న ప్రాణంబు మహి నెత్తినాఁడు
అరుదరు దనఁగ ⁴దయామతి నేఁడు
గరుణించెఁ బండిత⁵ఘనుఁడు వాదములు
దెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారునుజూడ నిల నట్లుఁగాక

కదిరె రేమయ్య కథ

కదిరె రేమయనాఁగఁ గరుణాప్రపూర్తి
విదితసద్గురుమూర్తి సదమలకీర్తి

---

౧. దృష్టి. ౨. యముచేసి డాసి. 3. నిల. ౪. నేఁడలిదయా మతిని. ౫. గురుఁడు.

యఘఘాతవినతజనార్తి చిన్మూర్తి
యవిధి నిషేధక్రియాచక్రవర్తి
యారంగ గురుదర్శనాసక్తి నొక్క-
యూరికిఁ జను చతఁ డూరి చేరువల
నాసక్తిఁ గాలలింగార్చనవేళ
యాసన్నమగుడుఁ గాలాతిక్రమంబు
సేయఁ దప్పగునని శివపురాణములు
మ్రోయుఁ గావునఁ ద్రికాలాయత నియతి
యొక్కింతయును దప్పనోయని యచట
నొక్క భక్తునియింటి కుద్వ్యృత్తి నరుగ
నతిశయప్రీతిమై నా[1]భక్తవరుఁడు
[2]సతియు సుతుఁడుఁ దాను జాఁగిలి మ్రొక్కి
యప్పుడు నిత్యలింగార్చ[3]నా నియతి
దప్పకయుండ సద్భక్తిఁ జెల్లించి
యారంగ లింగార్చ[4]నావసానమున
వా రారగింపంగ వడిఁ జాఁగి మ్రొక్కి
జనకుఁ డాయయ్యప్రసాదంబు వేఁడి-
కొన, నట్లు సుతుఁడు నకుంఠిత[5]భక్తి

---

౧. భక్తిప. ౨. సతియును దారును సుతుఁడును. ౩. నవేళ.
౪. నాంతంబునందు. ౫. ప్రీతి.

దనర మ్రొక్కుచుఁ బ్రసాదంబు వెట్టించు
కొని, తల్లియును దానుగూడ భోగింప
నంత నాఁకదిరె శేమయ్య సద్గురు ని-
తాంతదర్శనసముద్యత్ప్రీతి మెసగ
నరిగి తద్గురుకరుణామృతాంభోధి
నరుదొందఁ దోలాడ నంత నిక్కడను
గొడుకు దోడ్తోడన యెడదాఁక తల్లి
విడుకలు గొనివచ్చు నెడ మహోరగము
వెనువెంట వచ్చు పుత్త్రునిఁ గర్వ, నవ్వ-
చును దేవునానతి యనుచుఁ దత్సుతుఁడు
అమ్మమ్మ పాముపా మటువోకు మనుచుఁ
గ్రమ్మన లింగంబుఁ గలియుడు నంతఁ
జిడిముడిపడక చచ్చెర సుతుం డనక
తొడిఁదొడి వైద్యులఁ దోడితెం డనక
యురగ మెక్కడనుండియో వచ్చె ననక
ధరఁ బూర్వలిఖితంబు దప్పునే యనక
ఝల్లన గుండె ధిగుల్లన నవసి
యుల్లంబు గలఁగక యుపతాపపడక
చెల్లఁబో యనక హా శివశివా యనక

తెల్ల మొక్కుండుగదే పుత్త్రుఁ డనక
భావింప సుతుఁ దిన్న పాపంపుఁ బుర్వ
దేవుఁడ మమ్మేల తినదయ్యె ననక
పసనిపండుండఁగఁ గసుఁగాయఁ ద్రెంచు
[1]అసమాక్ష [2]నీదుమహత్త్వమే యనక
పండుగానని[3]దొంగభావనఁ జూప
[4]గుండాడ గావ్రనకును జన్నె యనక
పూనిభక్తులచేతిభూతిఁ బెట్టింపుఁ
డైనను బ్రతుకఁడా యాత్మజుఁ డనక
యొలయ మీభక్తుల కొకబారి యైనఁ
దలఁగఁ దల్పమి మీకు ధర్మమే యనక
ధర నరుల్ ధర్మంబు దలఁ గాచునండ్రు
వరభక్తి సుతుఁ గావవలవదే యనక
మలహార, మిమ్ము నిచ్చలుఁ బూజసేయు
ఫలమకో మాముద్దుపట్టి చావనక
మృడుఁడ మ్రింగిన నీవ మ్రింగుదుగాక
కొడుకుఁ బాముచ కేల కడిసేసి తనక
గళమున విషవహ్ని దల విషపూర
మల రెడు విషమవిషాహి ముంజేత

౧. అసమాన. ౨. నీకిదియుంగమే. ౩. దొంద. ౪. గుండుండ.

జ్వాలనాక్ష [1]మిముఁగోరి కొలుచువారలకుఁ
దలపోయఁ జావెట్లుఁ దప్పనే యనక
చెచ్చెర సుతుప్రాణ మిచ్చిన నేఁడ
యచ్చనలాడెద నభవ మీకనక
వీరభద్రయ్య [2]యీబారి గడపిన
వారక జాతర వచ్చెద ననక
యనుపక్తి వ్రేళ్లతో నారతు లిత్తు
మనుపరే పుత్త్రుఁ బ్రమథులార యనక
తాలుతుఁ బసిఁడి [3]పాదములు మీపేర
బాలు గుడ్డవతల్లి బ్రదికింపు మనక
ఘనముగా [4]మీూఁపునఁ గండ లిచ్చెదను
దనయు మన్నరె పురాతనులార యనక
తల్లిదండ్రులు దమతనయునిఁజూచి
మెల్లన నవ్వుచు మేలయ్యె ననుచు
ఖ్యాతిగాఁ బ్రమథుల కవిలియ కెక్కెఁ
బో తనూజుండని పొంగుచుఁ దార
యిరుగులఁ బొరుగుల నిండ్లిండ్ల భక్త
వరులును నరులు నెవ్వరుఁ గానకుండ

---

1. మిమ్మునిచ్చలుఁ బూజసేయు. 2. రో. 3. యారతులు. 4. వీపున.

వరసుతుఁ దద్గృహాంతర్వేదియంద
పరమసమాధి [1]సంప్రాప్తుఁ గావింప
ధీమణి గురుభక్తితిలకుండు గదిరె
రేమయ్యయును గురుస్వామి భజించి
[2](పాఱఁబోరి నేడ్దినంబులును దదీయ
గురుని యాజ్ఞాపన శిరమునఁ దాల్చి
మరలి యాభక్తుని మందిరంబునకు
నరుగుదేఁ దొల్లింటియట్ల భక్తుండు
మ్రొక్కి తత్కాలసముచిత సత్క్రియలు
నెక్కొల్పి లింగావసరముఁ జెల్లించి)
యంతఁ బ్రసాదభోగావసరమునఁ
గాంత గాంతునిఁ జూచి కదిరె రేమయ్య
వచ్చినప్పటఁగోలె వరపుత్త్రుఁ గాన
మెచ్చట నున్నవాఁ డేల తోడ్తేరు
మొన్న వచ్చిన మీరు మ్రొక్క మీ కంటె
మున్న చాఁగిలి మ్రొక్కు ముద్దు దులాడ
సతియు [3]నీవును బరిచర్యలు సేయ
సుతుఁడు నందించుచుఁ జూచుచునుండెఁ

౧. ప్రాప్తవ్యు. ౨. కుండలీకరణము చేసినపంక్తులు పూర్వ ముద్రణములో లేవు. ౩. (బతియుఁ.

జైనసి మాలింగంబుచేఁ బ్రసాదంబుఁ
గొనఁగఁ జేయొగ్గి తాఁగొనియె మీఁ వెనుక
వెండి మాయొద్దన యుండె మే మిచట
నుండ నొండెడఁ గుమారుం డేడ నుండె
నింటిలో లేఁడు వొర్గింటి కిర్గింటి
కొంటఁ-బోవఁడు గరసంటి నీ వింటి
వెలుపల నిలుచుండి పిలువుమా తల్లి!
పిలిచిన విని రాని బిడ్డలుఁ గలరె?
యనవుడు సంగళవ్వ నె సుతుఁ బిలువఁ?
దనయుఁ బిల్వకయుండఁ దాను నిమ్మవనె?
పిలువని నిమ్మవ్వ విలిచిన సంగ
యిలువుట్టుగొంతుల కెనగాని నన్ను
నెట్టణ భక్తసన్ని హితగాఁ దలఁచి
పట్టెఁ బిల్వఁగఁబంపఁ బాడియే దేవ?
వైరాగ్య మగునో పిల్వకయున్న సుతునిఁ
గోరి సంసారంబగునో సుతుఁ బిల్వఁ
బిలిచెద నననేర బిలువ నా నేర
నిల దయాత్మక నీవ యెఱుఁగుదు దేవ,
కొడుకు మీయడుగులకడన యుండంగ

---

౧. యొడ్డి. ౨. గాఁబోయెనోయునిడ. ౩. హితుఁగావించి.

వడి నొండుసోటఁ బిల్వఁగనేల యనుడుఁ
దఱిఁదఱి మఱితాన తనయు సమాధి
దెలిపించి [1]పువ్వుఁబత్తిరి విభూతియును
దలఁగ నూఁకుచు మహోద్ధతలీలఁ బేరఁ
బిలుచుడు నిద్రదెప్పిఱినట్ల సుతుఁడుఁ
గనువిచ్చి శరణార్థియనుచు రేమయ్య
గనుఁగొని ముకుళితకరకంజుఁ డగుచు
సరసరఁ దల్లినిజస్తన్యవృష్టి
గురియఁ [2]జుఁకిట నిడి [3]కొని పుత్త్రుఁదెచ్చి
కదిరెరేమయ పాదకమలముల్ నుదురు
గదియంగ మ్రొక్కింపఁ గరుణ దలిర్పఁ
దనయునకును బ్రసాదముఁ గృపసేసి
జననీజనకుల కాశ్చర్యంబు గాఁగఁ
బూని యేడ్దినముల పీనుంగునకు ద
యానూనమతిఁ బ్రాణదానంబు సేసెఁ
గదిరెరేమయ్య ప్రకాశితభక్తి
విదితంబుగా నాఁడు వెలయంగ నేఁడు
సదమలదృఢభక్తి సంపద మెఱసి
పదములు గృపసేసెఁ బండితేశ్వరుఁడు

---

[1] బిల్వపత్తిరియు విభూతి. [2] జంకిట. [3] కొమరుని.

వెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారును జూడ నిల, నట్లుఁగాక

### చేటల వేమయ్యగారి కథ

వెండియుఁ జేటలవేమయ్య నాఁగ
ఖండేందుధరభక్తగణమదేభంబు,
నాద్యష్టఁ డణిమాదికాష్టైకగుణ స-
ముద్ద్యోతితైశ్వర్యయుత యశోరాశి
గహనభక్తిమహత్త్వకాష్ఠేయకృత్తి
బహురససిద్ధనివహాఘోణుఁ [1]డనఘుఁ
డపగతరస రసాయనభోగముఖ్య
విపులరాజిత రాజ్యవిభవ సౌఖ్యుండు
నిర్గతస్వర్గాపవర్గమార్గుండు
భర్గనిరర్గళభక్తికాంతుండు
బసవనామార్పిత [3]ప్రాణార్థదేహ
విసరుండు జం[4]మవిషయ[5]వర్తనుఁడు
బసవపాదాంభోజ పరి[2]వర్ధమాన
విస్ఫురరాంచిత హృదయ సరోవరుండు
బసవపాదధ్యాన పటుకల్పవృక్ష
లసితచిత్తాలవాల ప్రశస్తుండు

---

౧. డసము. ౨. వ. ౩. ప్రాణదేహార్థ. ౪. చిత్తుండు. ౫. వర్త.

* (బసవపురాతన ప్రబంధైక లిఖిత
రస[1]వాదిగణమనో[2]రాగ [3]ప్రస్తరుఁడు)
బసవాక్షరానర్ఘ బహుళమణి సంప్ర-
వసనసముదయ జిహ్వాకరండుండు
బసవాక్షరత్రయప్రఖ్యాత దివ్య
కుసుమనిజాత్మ[4]నిష్కుటిలషట్పదుఁడు
బసవాక్షగశ్రవణ సుధాసమాన
రసపూర్ణకర్ణాంతరతకలశుఁడు
బసవగుణస్తోత్ర పరిచితచిత్ర
రసికరసజ్ఞాన రాజిత[5]పటుఁడు
బసవగీతలతాప్రభాస[6]వేల్లిత స-
రస మనఃకల్పకరాజితుం డనఁగ
వీఁగుచుఁ జేటలవేమయ్య [7]భువిని
దాఁగాక మఱియు మేదరులు గొందఱకు
జీవితంబులు సేసి చేటలు సాలఁ
గావించి బండ్లను గడపి యూరూర

---

* కుండలములలోని రెండుపాదములకును సంస్కృతాను వాదము లేదు.

౧. ణాదిభాస్త్రైక ; జైకభ ద్రైక (పాలైక.) ౨. నామ. ౩. పుస్తకు. ౪. జాతమున. ౫. మయూఁడు. ౬. వేల్లన. ౭. యవని.

నమ్మించి తెప్పించి యందుల లబ్ధి
నెమ్మితో జంగమనివహార్పణంబు
సేయుచు సద్భక్త శిష్టసద్గోష్ఠిఁ
బాయక శుద్ధసద్భక్తిఁ జరింప
జనులు గీర్తనసేయ విని వారివారి
కనుఁగొన భక్తి సందర్శనార్థ మేతేర
శుద్ధాత్ము వేమయ్యఁ జూచు నాకాంత
నుద్ధతి నొకరససిద్ధుఁ డేతెంచి
చేయు కాయకమును శివభక్తితతికిఁ
బాయ కట్టుల [3]సమర్పణ సేయుటయును
గని యతివిస్మయాక్రాంతాత్ముఁ డగుచుఁ
దన రససిద్ధి యత్తఱి కంచు మున్న
రసము శోధించి, చారణలు గావించి,
యసమౌషధంబుల రసతైలములను
దొఱలఁ బాషాణధృతులను మర్దించి,
నెఱయ మూర్ఛకుఁ దెచ్చి, మఱి చంపి, కల్క-
ముగ సాంగముగఁ బిండములను భావించి,
తగు వజ్రమూష మందపుఁగాకఁ దీర్చి,
యలఘు పక్షచ్ఛేద నౌషధావళులఁ

౧. ష. ౨. వితతి. 3. ప్రణిపత్తి.

బలుమరు నందు వేపనము గావించి,
వర[1]మంత్రమూలికావ్రాతసారమునఁ
గరమొప్పఁ దద్రసకల్కంబు నొదవి,
క్రమమొంద భాగసంఖ్యను మిశ్రపంచ
కము, దాని కథరోత్తరముగ సంధించి
పొందుగా నందించి మందతీవ్రాగ్ని
పొందుపాక మెఱింగి, యూఁదించి, పుచ్చి,
సాంగశీతలమైన యాఘుటికకును
భంగిగా నట్లు దీపనము పుట్టించి,
భువి జంత్రములఁ బుటంబుల నౌషధములఁ
దవులఁ బాషాణసత్త్వంబు హేమంబు
గరమొప్ప వజ్రసంఘము గ్రాస మిచ్చి,
పరితృప్తిఁ బొందించి, [2]పండినయట్టి
చిరమూలికాబద్ధ వరరసఘుటిక
విరచింపఁగ సహస్రవేది గా ననుచు
వినతుఁడై సిద్ధుండు వేమయ్యపాద
వనజాతములపొంత వడి నిడి యరుగఁ
దగు సిద్ధరసనిమిత్తంబున నర్థ
మగుఁ గోటిసంఖ్యల కందుల లబ్ధి

---

1. మంద ముష. (పి)కా (క) 2. పండించినట్టి.

[1]పలచిన వస్తువు లిల జంగమముల
కలరించి యిత్తుఁ గాయక మేల యనక
వాఁడు సిద్ధుం డిది వరరసం బనక
పోఁడిగా నొకపూరిపుడకకుఁ గొనక
పాయక తనచేయుఁ గాయకం బట్ల
చేయుచు వేమసుధీయుతుం డుండ
నంతకు మున్న తా నటయున్కి నేసి
యింతవృత్తాంతంబు నెఱిఁగి యొక్కయ్య
[3]ధర నచ్చటనయున్న వరరసఘుటిక
యొరు లెఱుంగకయుండ నొయ్యన పుడికి-
కొనిపోయి ప్రజలును వనితయుఁ దాను
మనుచుండె సకల[4]సమగ్రత దనర
నంత సిద్ధుండు వేమయ్యఁ దలంచి
యింత కెట్లుండెనో యిలఁ బ్రతిలేని
రస మిచ్చితిఁ బడయరానిది గలదె
రస సిద్ధి రాజులరాజు గాఁ డెట్లు
[5]సూతండుగాక యంచును రససిద్ధుఁ
డేతేర వేమయ్య మెప్పటియట్ల

---

౧. చలపిననవలీల జంగమార్చనము ౨. చేయింతు. 3. ధర ణిన. ౪. సద్గనతసెలంగ. ౫. జాతును.

చిరివిన బొంతయుఁ జేతికత్తియును
జెరివిన తడుపునుఁ జేతికాయకముఁ
జేటల నమ్మి తెచ్చిన లబ్ధి యదియు
నేటంపుఁ బదమగు నిలువడి సూచి
చేటలు గీటలు సేయంగనైనఁ
జేటల వేమఁ డంచిన పేరడంచి
చేటలయర్థంబు శివదేవుభక్త
కోటి కిచ్చుటఁ జేసి కువలయంబునను
జేటలవేమఁడన్ సిరిగలపేరు
వాటిగా మును రసబద్ధ మిచ్చుటయు
ననుభవింపమి నిష్ప్రియత్వమో, లెక్క-
గొనమి గర్వమొ, యొల్లకునికియో, భక్తి-
మహిమయో, యింకేల మాసొమ్ము దెమ్ము
[1]మహి నమూల్యంబగు మారసఘుటిక
యనవుడు నద్దిరా యది సిద్ధరసమె
ఘనత నేమియు నెఱుంగముగదే యకట
మినమిన మెఱచుచు మును వెండిపూన
యునుబోలె నుండె నయ్యునిచినచోన
మును నీవు సెప్పంగ విని యెవ్వఁడేనిఁ

1. మహిత.

గొనిపోయెనో యెవ్వరును గానకుండ
బొమ్మలకని కొనిపోయిరో బాలు
రమ్మొయి నిమ్మొయి నాడుచుఁ గాంచి
యఱితిపూసలకొల్కి కని పుచ్చికొనిరొ
వఱలఁ జేటలు విల్వవచ్చినవారు
మెలఁగువారలు భువి మెట్టిరో క్రుంగఁ
గలసిపోనూకిరో కసవుతోఁగూడఁ
గ్రేవ నెండెడి ప్రత్తిగింజలఁ గలయ
భావింప కెత్తిన గోవులు దినెనొ
పెట్టినచోటనే పెంపేది ధూళి
పట్టియున్నదొ మును పరికింపలేము
ఇచ్చవేఁడఁగనె నీకిచ్చితి రసము
పుచ్చుకోనని పెట్టిపోయితే నాఁడు
నదియేల పెట్టితి వక్కడ ఘుటిక
యిదియేల యరసెద విప్పుడు వచ్చి
యెవరిచేతికి నిచ్చి తేలవచ్చితివి
యెవరి వేఁడెద విదియేల కలంగఁ
గొనినవా గ్గలిగిరా కోటీశ్వరులైరి
యునిచినచోటన యుండె లేకుండె

౧. లో.

సిద్ధరసం బడి సెడునె యెబ్భంగి
బద్ధంబు దా నేలపా లగునెట్టు
లననేల తనచేత నది గానిపనియె
యనుట సిద్ధులగుణం బంతటఁ బోక
యనుభవింపుఁడు రసం బది యొల్ల వేనిఁ
దనకిందు పోమెద ననసేల వేయు
నిక్కడఁ బెట్టిపోయితిగదా యాక
నక్కడిక్కడఁబోయె ననియె దేమనుడు
మొదల నీఘుటికకుఁ బదిమణుఁ[1]గులుగ
నిది యెక్కుడుగ నిత్తు నిందు రమ్మనుచు
నలఁదిన నిజలలాటాంకిత ఘర్మ
జలమిశ్రితవిభూతి నలఁచుచు ఘుటిక
గావించి యతనిచే గ్రక్కునఁ బెట్టి
భావించి సిద్ధుండు భ్రమితాత్ముఁ డగుచుఁ
గనుగొన దశపరీక్షల సిద్ధమగుడు
ననుకీర్తి సేయంగ నంతకుమున్న
వేమయ్య[2]మహిమయు వేమయ్య[3]యోగి
వేమయ్య భక్తియు వినఁజోద్యమగుడు
దండిజంగమము ప్రత్యక్షుఁడై వచ్చి

౧. గులకు. ౨. యోగియు. ౩. మహిమ.

పండుగనియతిఁ బంద్రెండు వేలకును
[1]గొడగలుఁ కట్నముల్ గుజ్జము ల్దగిన
తొడవు లొడ్డెన లారతులుఁ బడిగెములు
గలఁతులుఁ గోరలుఁ గంటలుఁ [2]గంచ
ములు ధూపముల దీపముల పాత్రములును
బంచామృతములును బాయసాన్నములుఁ
బంచభక్ష్యాద్యన్నపానోదకములు
ఘనసారతాంబూల గంధమాల్యాదు
లను [3]రక్తి నటుగూడ నర్పించికాని
కుడువఁ బ్రసాదంబు, దడసిన మేను
విడుతుఁ జేటలవేమ! వినుమంచుఁ జెప్ప
నప్పాట సిద్ధున కారసంబిచ్చు
నప్పుడు నావ్రేళ్ల నంటినమన్న
ఇసుమంత నిలిచి చే నిచ్చి మ్రొక్కుడును
మసలక తజ్జంగమంబు హర్షించి
ఘనుఁడ చేటలవేమ [4]కలియుగసోమ
ఘనుఁడ చేటలవేమ [5]ఘనదానకామ
బాపు చేటలవేమ బసవేశధామ

---

౧. గొడుగులు. ౨. కంబ. ౩. భ. ౪. 'కలికాలవృషాధీశ' అని సం. ౫. 'కామ్యప్రదాన' అని సం.

బాపంచు నాయయ్య వరువడి నేఁగి
పండుగు నుడివిన బాస నీపదియు
రెండువేలకు సమర్పించిన శైలజేఁగి
యరిగెఁ దాఁ బరిభవం బందుచు సిద్ధుఁ
డురుకీర్తి వేమయ్య యుండె నవ్వుచును;
అదియునుగాక లింగార్చనా నియతి
యుదయమజ్జనవేళఁ గదియవచ్చుడును
నసదృశంబగు గురుధ్యానైక భక్తి
బసవపదధ్యాన భావనాపూర్వ
నిద్రార్పితోచిత నిజలింగగర్భ
ముద్రితేంద్రియచయంబులు విషయములు
చొంగిలింపకయుండె లింగసంస్పర్శ
నాంగీకరణ నియమావళి సలుప,
వడి "నమోరుద్రాయ పథిషదే" యనఁగ
వడి "నమో రుద్రాయ వనసదే" యనఁగ
ధృతి నట్ల "యప్సుషదే స్వస్తి" యనఁగ
శ్రుతులు "౧సర్వం నమ రుద్రాయ" యనఁగ
సతతంబు భువి వనజల సంగమములు
శ్రుతి "త్వత్ ప్రయుక్తం కరోమ్యహ" మనఁగ

---

౧. సర్వో హ్యేష రుద్రో.

మతి నేకజీవ, కర్మద్వయ, త్రిగుణ,
చతురంతరంగ, నిజస్థూల భూత
పంచక, షడ్వర్గ, పటుసప్తధాతు,
వంచితాష్టమద, [1]నవరస, వికార
వితతదశప్రాణ, విరచితక్రియల
నతుల సముదిత నిద్రాంతరచర్య
దేవ యంతయు భవదీయప్రసాద
భావంబకా నన్ను భావింపుమయ్య
యనుచుఁ బ్రార్థన చేసి యవధానలీలఁ
ననయంబుఁ "దత్తత్సమర్ప్య దేవాయ"
యనఁగఁ దత్తద్విషయములు గార్యాఘ
మును "గథంచినోప్నపభుంజీత" యనఁగఁ
దనప్రాణలింగార్పిత క్రియారంభ
మునకు నుద్యుక్తుఁడై తనచరిత్రకును
మెట్టెడి ముట్టెడి పట్టెడి మేనఁ
బెట్టెడి కట్టెడి పృథువస్త్రసమితి
యెయ్యవి వలయుఁ [2]దా నివియాదిగాఁగ
నయ్యెపదార్థంబు లర్పింప నంత
[3]సరి బసవధ్యాన పరమామృతంబు

---

౧. 'ఋణా నవ' అని సం. ౨. ద్రాంచిత. ౩. ప.

భరితమై దేహకుంభమున దైవారఁ
బొలుపు నంతఃపరిపూరిత బసవ
కలితశబ్దంబు వాగమృతమై తనర
వడి 'బసవా! బసవా!' యను వాక్య
మడరుడు బసవనామాంకితుఁ డొక్క-
బాలుఁ'డో' యంచును బళిఱ తేరఁ గాంచి
తా లేచి బిట్టుల్కి ధరఁ జాఁగి మ్రొక్కి-
శ్రీవృషభేం౧ద్రాపరావతార ప్ర-
భావస్వభావుండు బసవన్న వచ్చెఁ,
జట్టన నందికేశ్వరుఁడు శిలాదు
పట్టి దానైయున్న బసవన్న వచ్చె,
భువిని ద్వితీయశంభుం డను పేరఁ
బ్రవితతంబైయున్న బసవన్న వచ్చె,
మండెంగ మాదన్న మాదాంబ కడుపుఁ
బండువై పుట్టిన బసవన్న వచ్చె,
సంగమేశ్వరుఁ డర్ధజనితంబునంద
భంగిగా గురువైన బసవన్న వచ్చె,
* (నామిండనికిఁ జెవియా కీకయున్న

---

౧. ంద్ర. * కుండలీకరణము చేసిన రెండుపంక్తులును సంస్కృతానువాదమునఁగాని, వ్రాతఁ ప్రతులందుఁగాని లేవు. బ్రౌను ఇచ్చినాఁడు.

భామ శిక్షించిన బసవన్న వచ్చె)
క్షోణిఁ బేర్కొనిన తద్గురుమూర్తి దనకుఁ
బ్రాణలింగంబైన బసవన్న వచ్చె,
ధట్టుండు బలదేవదండనాయకుని
పట్టికి [1]మగఁడైన బసవన్న వచ్చె,
నెలమిఁ గప్పడిసంగమేశు తద్గురువు
వలికించి వెలసిన బసవన్న వచ్చె,
దండి బిజ్జలుఁడు ప్రార్థనసేయఁ దవిలి
బండారు గైకొన్న బసవన్న వచ్చె,
మిండభక్తునకు నమ్మేదినీనాథు
బండరు విచ్చిన బసవన్న వచ్చె,
ముద్దసంగయ్యఁ గాముకునిఁ జేసిన వి-
పద్దలనుండగు బసవన్న వచ్చె
నేణాంకధరుభక్తుఁ డేఁగ నేతేరఁ
బ్రాణంబు లెడదాఁకు బసవన్న వచ్చె,
శూలి వేఱొకరూపమై లీల వేఁడ
ఫాలాక్షు మిచ్చిన బసవన్న వచ్చె,
ముదమున జొన్నలు ముత్తియంబులుగఁ
బదపడి [2]చేసిన బసవన్న వచ్చెఁ,

---

[1] ఁ. వరు. [2] ౨. చూపిన.

బాలించి యొకపెద్దభక్తుని మేనఁ
బాలు సూపినయట్టి బసవన్న వచ్చె,
ననమప్రసాద మనన్యార్హ మనుచు
విసము సేవించిన బసవన్న వచ్చె,
వడి దూరమున 'బసవా'యనఁ [1]గడవ
వడకుండఁ బట్టిన బసవన్న వచ్చె,
సిద్ధరాముఁ డరయ శివుహృత్కమల ని-
బద్ధుఁడై యున్న యాబసవన్న వచ్చె,
నాలించి నను దయఁ బాలించుబుద్ధి
బాలునికై వడి బసవన్న వచ్చె,
నాబసవేశుండ! నాబసవయ్య!
నాబసవస్వామి! నాబసవన్న!
తొలుమేని నాపుణ్యఫలమున నిపుడు
నలి విజయముసేసె నా గృహంబునకుఁ
గంటి నే దర్శింపఁ, గంటిఁ గీర్తింపఁ,
గంటిఁ జాఁగిలిమ్రొక్కఁ, గంటి భజింప
ధన్యుండఁ బుణ్యుండ ధరఁ గృతార్థుండ
మాన్యుండ గణ్యుండ మహి నేన యనుచు
సుకర పరమసుఖాశ్రులు వెల్లి [2]గొనఁగ

---

1. గుండ. 2. విరియ.

ప్రకటరోమాంచకంచుకితాంగుఁ డగుచు
గద్గదస్వరము దాఁ గంఠంబునను స-
ముద్గతంబుగ వఁగి మొగ మోరవుచ్చి
[1]యెసగఁగఁ గనుఱెప్ప లిడక యాబాల
బసవయ్య మొగము దప్పక చూచిచూచి
'బసవా'యనిన బాల, బసవఁ 'డో'యనుడు
బసిగొని యడుగులపైఁ బడి పొరలు,
'బసవా'యనిన బాల, బసవఁ 'డో'యనుడుఁ
గసిపోవ నడుగుల నొసలిడి రాచు,
'బసవేశ్వరా'యన్న బాలుఁ 'డో'యనుఁడు
నసలారఁ గౌఁగిట నందంద చేర్చు,
'బసవరాజా'యన బాలుఁ 'డో'యనుడు
నెసగంగ నిఱికిట నిడుకొని యాడు,
'బసిపిగా' యనిన నాబాలుఁ 'డో'యనుడు
వెస నెత్తియెత్తి శిరసునంద తాల్చు,
'బసవాయ' యనఁగ నాబాలుఁ 'డో'యనుడు
వసుధ ముందటియట్ల వడిఁ జాఁగిమ్రొక్కుఁ,
బాయ కిట్టులు 'బసవా'యన్న బాలుఁ
'డో'యన్నఁ 'గృతి నేఁగదా' యని యుబ్బి

---

౧. యెసకంబుగను.

తనరుచు బాలుపాదముల గజ్జియలు
ధ్వనివుచ్చి ధ్వనివుచ్చి గునియుచు నాడు,
¹వలలుచు బాలుని వామపాదంబు
²గిజిగిటగాఁ బట్టి కేళికల్ సేయు,
'బసవ! యోబసవ! యోబసవ! యోబసవ!
బసవ!' యంచును దాళపద్ధతి నాడు,
జతిగీతముల బాలు సంస్తుతింపుచును
గతులు సూపుచు నాట్యగతులకు నాడుఁ,
గోడంగిగతి బాలుఁ డాడుమనంగ
వేడుక మదిఁ దులుకాడంగ నాడు,
బాలుండు దన కేశభర మూఁది నవ్వఁ
గ్రాలుచు సోలుచు గంతులు వైచు,
జతితాళగతి బాలు నుతగతి మఱచి
యతిరతి యుఱికుర్కియాడుచు నట్ల
కొనిపోయి యంత బాలుని గృహాంతరము-
నను దివ్యసింహాసనస్థుఁ గావించి
బసవబాలుని పాదపద్మముల్ గడిగి
యసలారఁ బాదోదకాబ్ధి నోలాడి
బసవబాలుని సమభ్యర్చితుఁ జేసి

౧. వలరుచు. ౨. గిలిగిట.

యసదృశతద్దయారసవార్ధి మునిఁగి
బసవన్న కారగింపంగఁ బెట్టించి
యసమప్రసాదామృతాంబుధిఁ దేలి
తాంబూలగంధమాల్యాంబరాదులు ము-
దంబున నర్పించి తనయింటఁ గలుగు
ధనధాన్యములు [1]జీవితము మొదలైన
మనుమంతయును దెచ్చి ముందటఁ బెట్టి
బసవబాలుండ నాపరమసద్గురుఁడ!
బసవబాలుండ నన్ను బాలించుతండ్రి!
బసవబాలుండ నాపాలిలింగంబ!
బసవబాలుండ నాప్రాణలింగంబ!
యవధరింపవె దేవ యంచు నిల్సూఱ
సవిశేషమతి నేమశరణుఁ డొప్పించి
వనితయుఁ దానును వడిఁ జాఁగి మ్రొక్క-
జను లద్భుతంబంచు వినుతింపుచుండఁ
గరమర్థి బసవన్న చరణాంబుజములు
సురభూరుహముల కాకరములు గావె?
పొలుపగు బసవన్న పుణ్యహస్తములు
మలయు నా సురభులమందలు గావె?

---

౧. జీవనమాదియైన. ౨. డర్పించి.

ధృతినొప్పు బసవన్నదివ్యచిత్తంబు
నుతియింపఁ జింతామణులయిక్క గాదె?
యసలారుబసవన్నయమృతేక్షణములు
దులుకాడు పరుసవేదులగనుల్ గావె?
భావింప వేమయ్య[1] బసవైకభక్తి-
భావంబు గరిగొని బలియుటఁ జేసి
బసవన్నదివ్యరూపంబ యాబాలుఁ
డెసఁగ నాబాలుండ బసవన్న యగుట
బసవబాలునిమూర్తి ప్రత్యక్షముగను
నసమసంపదల కిల్లయ్యె నాయిల్లు
దనిసనఁ దత్పదార్థంబు లాబాలు
జననియు జనకుండుఁ గొనిపోవ నంత
బసవన్నసొమ్ము మాపాలిద యంచు
నసమజంగమకోటి యంత నేతెంచి
పెనుమందసములోని పృథువస్త్రసమితిఁ
గొనిపోవఁబోవఁ దక్కువ గాకయుండె;
నేపారఁ బెట్టెల నిడినట్టి సొమ్ము
లాపోవఁ గొనిపోవ నధికమై యుండె,
మును బొంకరల ధాన్యమును బండ్లఁ బూన్ప

[1] ౧. బసవయ్య. ౨. వస్తు.

మును బొంతరల ధాన్యములు వొరగుచుండె,
గోధనంబుల రొప్పికొని పోవఁబోవ
గోధనంబులు లెక్కకును మిక్కుటముగఁ
దద్గృహోపకరణతతిఁ గొనిపోవఁ
దద్గృహోపకరణతతు లెక్క[1]చుండె
వాహనధనధాన్య వస్త్రాభరణ స-
మూహగోధనరాజి ముందటి కంటె
వెగ్గలంబై యున్న వేమయ్యగారి
[2]నగ్గించి యగ్గించి హరభక్తవితతి
వెక్కసంబందుచు నక్కజం బనుచు
మ్రొక్కుచుఁ జొక్కుచు [3]మోదంబు తోడ
నమ్మిన నీరీతి నమ్మంగవలదె
నమ్మితి మందు రెన్నఁగఁ బసవేశుఁ;
దలఁచిన నిటువలెఁ దలపంగవలదె
తలఁతు మంద్రు బసవదండనాయకుని;
గొలిచిన నిటువలెఁ గొలువంగవలదె
కొలుతుమంద్రు బసవగుర్వవతారు;
వలచిన నిటువలె వలవంగవలదె
వలతుమండ్రెద బసవప్రభువునకు;

---

౧. వుండె; ఘుండె. ౨. హగ్గించి హగ్గించి. ౩. మోహంబు.

వలతురు దలఁతురు గొలుతురు నెమ్మి
నిల నిట్టి చోద్యంబు లిటు దొల్లి నేఁడు
విందుమే యిలుసూఁ అవినుతురే తొల్లి
గందుమే భక్తుల కథలయందైన
నిండినయిండ్లును నిండినభంగి
యుండెఁబో వేమయ్య యురుభక్తిమహిమఁ
గనుఁగొనఁ బాలు సాక్షాద్బసవేశుఁ
డని నమ్ముటయు మనంబున నమ్మినట్లు
బసవేశ్వరుండు నబ్బాలునియంద
వసియించి [1]సత్యంబు వరదుఁడై యునికి
వరదుఁడై [2]యక్షయవరసంపదలును
వరగృహాంతరమున వర్తిల్లఁ జేసెఁ
బ్రాకటంబుగ నివి వడయంగ శావు
గాక, యంతయు నీగి కడిఁదియ కాక
పాయనిమతి 'బసవా' యనుమాత్ర
నోయన్న బాలుని నాయన్న [3]గాక
భావంబు సద్భక్తి భావనా[4]సక్తి
గావలునకు నేల గతివడఁ జాలు,
జగములలో మీకు సడిసనుఁగాక

౧. తథ్యంబు. ౨. యష్టుత. ౩. మాత్ర గాఁగ. ౪. శక్తి.

నిగమార్థపరిపాక నిష్ఠితశ్లోక!
పరమవిశ్వాససద్భావవిలాస!
దురితసంహార! నిర్ధూతసంసార!
సద్గుణోత్తుంగ! ప్రసాదసర్వాంగ!
చిద్గతనిజచిత్త! శివతత్త్వవేత్త!
యసమవదాన్య! సనాతనధన్య!
బసవనామోచ్చార! [1]ప్రభుగుణాధార!
యవికల్ప సంకల్ప! హరగణాకల్ప!
శివభక్తిగుణధామ! చేటలవేమ!
యనుచుఁ బ్రార్థనసేయ ఘనుఁడు వేమయ్య-
యును బాలబసవయ్యఁ గొనియాడుచుండ
లీలమై నటు గొంతకాలంబు సనఁగ
శూలిభక్తుఁడు నందికోల బల్లయ్య
బాలు నర్ధోదయకాలంబునందు
గ్రాలుచు లింగసంస్కారుఁ గావించి
ఖ్యాతమహాభక్తగణసంతతికిని
భూతివీడియము లొప్పఁగ నివేదించి
విమలాత్ము సలపూరి వీరషోడశ గ-
ణముల పేరిడి మహానందంబుతోడ

---

౧. ప్రతిదినా.

సతులసద్భక్త హస్తార్పితభూతి
సుతుఫాలమునఁ బూసి సుదతియుఁ బతియు
వీరషోడశు నెత్తి వేమయ్యగారి
యూరుపీఠంబున నునిచి పట్టుడును
బసవన్నఁ దలఁచుచు బాలుని నొసల
భసితంబు వ్రాయంగఁ [1]గిసుకనఁ దుమ్మ
నావేమవిభుఁడు శతాయుష్య మనుచు
దీవింప మఱికొన్నిదినములు సనఁగఁ
గారణం బొండు లేకయును [2]బల్లయ్య-
గారిపుత్త్రుండు లింగముఁగూడ నపుడ
తాను నకామకృతమున వేమయ్య-
గారేఁగుదేరంగఁ గాంచి షోడశుని
జననియు జనకుండు నస్మితవక్త్ర
వనజాతు లగుచును వడిఁ జాఁగి మ్రొక్కి
సముచితాభ్యర్చనల్ సలిపి తత్సుతు శ-
వము గానరాకుండఁ బైఁ జీరఁ [3]గప్పి
'యయ్య యవధరింపు మవసరవేళ
యయ్యెన్న [4]దనుచు గృహాంతరంబునకుఁ

---

౧. కన. ౨. బొ. ౩. దిగిచి; వైచి. ౪. యదియని యాగృహంబునకు.

దొడికొనిపోవఁ బుత్త్రుని దెసఁ జూచి
కడుఁగడుఁజిత్ర మీకొడుకున్న విధము,
గదలఁడు మెదలఁడు గాలుసె య్యార్పఁ
డదరిపడఁడు దనహ స్తముల్ వూనఁ
డారగింపఁడు దృష్టి కడ్డమైయున్న
చీరవోఁ బెనఁగఁడు సెలఁగి యేడ్వండు
ఉద్రిక్తమతి వేఁడఁ డుగ్గుఁబా లోలి
నిద్రయో మఱి దీర్ఘనిద్రయో చూడఁ
డనుచుఁ గప్పనవస్త్ర మటుగూడఁ దివియఁ
బనిచి షోడశుఁ జూచి ప్రహసితవదనుఁ
డగుచు మున్నేము శతాయుష్య మనుచుఁ
దగిలి దీవించుట దలఁప కీబాలు
నుగ్రలోచన ! తీర్ప నుచితమే లింగ
విగ్రహ ! కరుణాసమగ్ర ! నీకనుచు
బసవన్నఁ దలఁచుచు నొసటను మేన
భసితంబుఁ జల్లి [1]షోడశు నెత్తి తెచ్చి
తల్లిచే నిడి నిజస్తన్యపయోధి
వెల్లి నోలార్చ వేవేగ నీవనుడు
నటమున్న సప్రాణుఁడై [2]తనూజుండు

---

౧. యాబాలునిదెచ్చి. ౨. తనూభవుఁడు.

గటకట నేడ్చుచుఁ గరములఁ దల్లి
చనుఁగవఁ బుడుకుచుఁ జన్నారగింప
జను లద్భుతంబంది సంస్తుతింపంగఁ
జేటలవేమయ్య, సన్నిధి, సంద్ర-
జూటుభక్తుండు, భవాటవీ వహ్ని-
లీల నీక్రియ నందికోల బల్లయ్య
బాలుండు షోడశిప్రాణంబు వడసె
నాఁడు, వండిత మల్లినాథదేవుండు
నేఁ డిచ్చెఁ గృపఁ బాదనీరజాతములు
దెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారునుజూడ [1]నెలమి దుల్కాడ
ననుచు వెండియు భక్తజనరాజి యట్ల
చనుఁ బురాతనభక్త చరితాంకనములు
హేతువుల్గా నతిప్రీతిఁ బూజించుఁ
జాతుర్యమునకు సజ్జను లుత్సహింప
నడిసన్న సద్భక్తి జగమున నెన్నఁ
బడు మల్లికార్జున పండితేంద్రుండు
మహనియ్యా సద్భక్తిమతి వెల్లగొండ
మహాదేవశరణుండు మహిఁ దొంటియట్ల

---

1. నిలనట్లుఁగాక.

పటుతరభక్తి మున్నటియట్ల నడచె
నట [౧]వెలిగొండమహాదేవుఁ డననిఁ
ప్రథితులై యుండిరి భక్తు లందఱును
బృథుతరానోన్యన్య సంస్పృహాలీల దనర
శ్రీబసవేశ్వర శ్రీపాదభక్త
శ్రీబసవేశ్వర సేవానుసక్త
శ్రీబసవేశ్వర చిరదయా[౨]సిక్త,
శ్రీబసవేశ్వర చిద్భావయుక్త
శ్రీబసవేశ్వ[౩]రాంచిత గు[౪]ణాసక్త
శ్రీబసవేశ్వర శిష్టమంత్రోక్త
శ్రీబసవేశ్వర [౫]స్థిరకథాసూక్త
శ్రీబసవేశ్వర శ్రీసము[౬]ద్రిక్త
శ్రీబసవేశ్వర శ్రేయోభిషిక్త
శ్రీబసవేశ్వర చేతఃప్రయుక్త
ప్రార్థితకీర్తి! సూరన! మంత్రినాథ,
యూథ! యిది పురాతనప్రకరణము

* * * *

---

౧. వలి; వెల్ల. ౨. యుక్త. ౩. రార్జిత. ౪. ణవ్యక్త.
౫. చింతనాసక్త. ౬. ద్యుక్త.

ఇది యసంఖ్యాత మాహేశ్వరదివ్య-
పదపద్మసౌరభభ్రమరాయమాణ-
జంగమలింగ ప్రసాదోపభోగ-
సంగత సుఖసుధాశరధి నిమగ్న-
సుకృతాత్మ పాలకురికి సోమనాథ-
సుకవిప్రణీతభాసురతర దండ-
నాయక బసవాంకన ఖ్యాతగుణ గ-
ణాయతకీర్తి దిగంత త్రిలోక-
గురు పండితారాధ్యచరితంబునందు
గరము ద్వితీయప్రకరణ మొప్పారు.

---

మల్లికార్జున

# పండితారాధ్యచరిత్ర

## వాదప్రకరణము

శ్రీగురులింగ! సంచితదయాపాంగ!
భాగమహోదార[1]! పాల్కుర్కిసూర!
వెండియు నొకనాఁడు దండితవాది
పండితారాధ్యుఁ డఖండితకీర్తి
ననద[2]వోలను మహాసద్భక్తిమహిమ
దనరార వర్తింపఁ దత్ప్రస్తవమునఁ
బండితారాధ్యుల ప్రభుశక్తి, మహిమ,
పాండిత్యమును, శివభక్తి పెక్కువయు,
సకలవిద్యాప్రౌఢి, సర్వజ్ఞతయును,
సుకృతిచిహ్నాయు, భావశుద్ధి, [3]సిచ్ఛుద్ధి,

---

౧. ద్ధార. ౨. ప్రోలనుపురి. ౩. చిద్బుద్ధి.

శీలసంపద, వచస్సిద్ధియుఁ జూడఁ
జాలక చాల నసహ్యాభావమున
నరపతియగు వెలనాఁటిచోడనికి
గురుఁడగు బౌద్ధుండు గుటిలుండు పాప
కర్మి యసద్వాది గపటుండు సకల
ధర్మేతరుండు వేదవిరుద్ధవర్తి
గష్టుం డశిష్టుండుఁ గడునికృష్టుండు
దుష్టు దురాచారి ధూర్తు గావునను
వెలనాఁటిచోడనిఁ బిలువంగఁ బనిచి
కలుషంబు వర్ట్రిల్లఁగా నిట్టులనియె :
"లోకవంద్యుఁడవు భూలోకాధిపతివి,
లోకపావనుఁడ వాలోకించి చూడ
లోకంబు నీయాజ్ఞలోనిది గాన
లోకంబనఁగ నీవ లోకేశ ! నీకు
గురులగువార సద్గురులును లోక-
గురులును గాక యేగురులును గురులె?
తమకు గురుత్వంబు దానెట్లువచ్చెఁ,
దమకుఁ బండితశక్తి దా నెందుగలదు,
బౌద్ధదర్శనపట్టబద్ధుండు గురుఁడొ
శుద్ధవైదికశైవబద్ధుండు గురుఁడొ

బుద్ధుండు త్రిజగత్ప్రబుద్ధుండయేని
బౌద్ధంబ మోక్షైకపదహేతువేనిఁ
దమకు లోకారాధ్యసముదితప్రతిభ
దమకుఁ జెల్లెడి పండితత్వంబు గాక
దైవంబు రుద్రుండు దా నయ్యేనేని
శైవంబ మోక్షైకసాధనంబేని
యతనిక యసమలోకారాధ్యమహిమ
యతనిక పండితాహ్వాయముఁ [1]గాసిప్పు
వారికి మాకును వాద మిప్పింపు,
వారి నోడింతు, దైవంబను వార్త
వారింతు, నే నెటువంటియారాధ్య
గీరాధ్యుఁ బండితు గిండితు నెఱుఁగ,
నటు సూతుగాని మీయాచార్యు ప్రతిభ
యిటు "విల్వగాఁబంపు మెడనేయ" కనుడు
స్వసమయస్థుల స్వవచనవిరుద్ధులను
బ్రస్మృమరపాపుల బౌద్ధవాదులను
శ్రుతివివర్జితులను సుజన[2]దూషకుల
సతతాపరాధుల జైనవాదులను,
శ్రౌతకర్మభ్రష్ట సన్న్యాసులను[3] వి-

[1]. వంపుమాపిల్వనెడ. [2]. దూషితుల. [3]. సు.

నీతివర్జితుల నద్వైతవాదులను,
బ్రహ్మబంధులఁ బరబ్రహ్మదూరులను,
జిహ్మస్వభావుల బ్రహ్మవాదులను
విద్విష్టమతుల నసద్వాదరతుల
విద్వద్వి[1]ముఖుల నవేదవాదులను,
భ్రాంతచిత్తులఁ బాంచరాత్రవ్రతుల ని-
రంతర[2]పాపుల నాంతరాలికులఁ,
బరమాత్మదూరులఁ బరపరాఙ్ముఖుల
నరివర్గరతుల నేకాత్మవాదులను,
వైదికాచారవివర్జితమార్గ-
చోదితమతుల నభేదవాదులను,
దైన్యస్వభావుల మాన్యేతరుల జ-
ఘన్యచరిత్రుల శూన్యవాదులను,
అల్పమతుల బహుజల్ప[3]కులను వి-
కల్పతత్త్వజ్ఞులఁ గాలవాదులను,
నిర్మితకర్ముల [4]నిర్దేవులను న-
ధర్మప్రవర్తులఁ గర్మవాదులను,
ప్రస్తుత పుణ్య పాప స్వర్గ నరక-
నాస్తిక చార్వాక నిస్సారమతుల,

౧. రతుల. ౨. వాదు. ౩. వాక్కుల. ౪. నిర్దేహు.

సుకృతవిదూరుల నికృతధార్మికుల,
వికృతైకవేషులఁ [1]బ్రకృతివాదులను,
బ్రచ్ఛన్నబౌద్ధనిబద్ధమై చను మ-
టాచ్ఛాదితులను మాయావాదరతుల,
భ్రమితులై యులియు "శబ్దం బ్రహ్మ" మనుచు
భ్రమమించి పలుకు శబ్దబ్రహ్మపరుల
నాపోవ హేతుదృష్టాంత విరహితు-
లై పల్క నేరని యధ్యాత్మమతుల,
ధరణిఁ గార్యత్రయాంతరమూర్తి భేద
మరయని త్రిపురుషత్రయైకవాదులను,
దా నెన్నిచూడ నేదర్శనమతముఁ
గాని ద్విపురుషైకకలితవాదులను,
గార్యకర్తల నాదికర్తగాఁ బలుకు
నాశ్వేతరాష్ట్రమూర్త్యైకవాదులను,
వేదభ్రమితుల నవైదికవిరచ-
నాది కుయంత్ర విద్యావిశారదుల,
స్మార్తుల యోగశాస్త్రభ్రమితులఁ, బ్ర-
వర్తిత రసమంత్ర వాదసిద్ధులను,
సవిశేష తర్కశాస్త్రప్రమాణికుల

---

[1] ప్రకృత. [2] యాత్రిపూర్వైక ; యాత్రిపూర్వాత్మ.

నవికల ధర్మశాస్త్రాతీతచరుల,
నంచితాఖిల పురాణాగమతత్త్వ-
సంచారితార్థ విచార[1]దూరగుల,
సకలతార్కికులను షట్తర్కవిదుల
బ్రకటకౌటిల్యశాస్త్రప్రబుద్ధులను,
బటుకళాదక్షుల బహుజల్పకులను
గుటిలుఁ బరిహాసకులఁ బాతకులను
సకలాగమికుల [2]నక్షత్ర[3]పాఠకులఁ
బ్రకటిత కవి బుధ పండితాదులను
వీరాదిగాఁగ వివిధకళావిదులఁ
బేరుపేరులఁ గూడఁ బిలిపించి మఱియు
"నూర నీసభకు రాకుండు సిక్కినను
ధారుణీశ్వరునాజ్ఞఁ దప్పినవారు
సుండో" యనుచుఁ బురిచుట్టుఁ జాటించి
పిండుగా [4]మనుమారఁ బిలువంగఁ బనిచి
మండలేశామాత్య మంత్రి సామంత
దండాధినాథప్రధాన ప్రభృతులు
దాసులు భటులు నర్తకులు గాయకులు
దాసీజనంబు విలాసినీజనము

---

౧. దూఱులను. ౨. సచ్ఛాత్ర. ౩. పారగుల. ౪. మనుమాది

హితులు భృత్యులుఁ బురోహితులును రాజ-
సుతులు బండరులు [1]రాహుతులు లెంకలును
నను వీరలాదిగా నఖిలనియోగ
మును గొల్వఁ నృపతియు [2]మూర్ఖ బౌద్ధుండు
విభవంబుతో రాజసభయును బ్రహ్మ-
సభయును గూడి యాస్థానమధ్యమున
నుండ బౌద్ధుండుఁ దర్కోన్ముఖోద్ధతిని
బండితేంద్రుని బిల్వఁ బంప నిల్లెఱిఁగి
యంకింప వ్రతికైన నధిపతికైన
నంకంబుఁ దర్కంబు నన్నఁ బోవలయు
దానఁ దప్పేమియోఁ దగవగు ననుచు
మానితభక్తి సమగ్రతఁ దనరి
లింగార్చనంబు సల్లీలఁ గావించి
భంగిగాఁ బ్రమథులపాదముల్ దలఁచి
చెన్నొంద జంగమాశీర్వాదములు స-
మున్నతిఁ దా సదాయుక్తిఁ గైకొనుచు
నసలార వారికి నభిమతార్థంబు
లొసగుచుఁ దద్గమనోన్ముఖుం డగుచుఁ
బ్రఖ్యాతి దోనమరాజయ్యగారు

---

౧. రావుతులు. ౨. మూర్ఖ.

ముఖ్యంబుగా శిష్యు లాఖ్యాతయశులు
నరుదొంద గురుమల్లికార్జునదేవు
చరణాంబుజములకుఁ జాఁగిలి మ్రొక్కి,
“బసవకృపాపాత్ర పరవాదిజైత్ర
యసమానశౌర్య శివాశ్రమాచార్య
కరుణాపరిష్కార ఘనశివాచార
నిరవధినిజపుణ్య నిఖిలవరేణ్య
ప్రమథానుగతశీల భక్తాతిలోల
సుమహద్యశస్క విశుద్ధమనస్క
యసమలోకారాధ్య కుసమ[1]యాభేద్య
స్వసమయనిస్తార జగదేకవీర
హరభక్తిశుద్ధ పంచాక్షరీసిద్ధ
చిరదయారసకుల్య శివగణలౌల్య
గతదుష్టయంత్ర జంగమపరతంత్ర
హితశుద్ధశైవమహిష్ఠానుభావ
పండితనతపాద పరిచితవేద
పండితారాధ్య సద్భక్తిసాన్నిధ్య
వీరావతార సంవిత్సుఖాధార
భూరియశఃపూర్తి బుధచక్రవర్తి

[1] యాసాధ్య. ౨. ౨.

వరమూర్తి మీ మహత్త్వముఁ దలంచినను
బరసమయములెల్లఁ బలుపలు గావె?
సన్నుత మీనామసంకీర్తనంబు
విన్న దుస్సమయులు విరథులుగారె?
ప్రమథాత్మ మీమహత్త్వంబెన్న నన్య-
సమయులు గిమయులు భ్రమితులై చనరె?
పండితారాధ్య మీపరిచితపరమ-
పాండిత్య నిత్యసంపాదిత మహిమ
మొగి బౌద్ధసమయుల ముక్కుపైఁ గత్తి,
యొగిని నార్హతసమయుల వీఁపుఁగోల,
దోలఁగని భేదవాదుల కెక్కుఁగొఱ్ఱు,
ఇలఁ బాంచరాత్రవ్రతుల తలగుండు,
నేకాత్మవాదుల హృదయశల్యంబు,
లోకాయతుల పొట్టలోపలి యమ్ము,
వెలయ నద్వైతవాదుల రొమ్ముఁగూట,
మలరెడు బ్రహ్మవాదుల కంటికసవు,
కాలవాదుల తుదినాలుకముల్లు,
దూలెడుఁ గర్మవాదుల గుండెబెదరు,
శూన్యవాదుల మెడఁజుట్టెడిపాము,
సన్న్యాసులను బారిసమరెడు మిత్తి,

నెఱియ మాయావాది నెత్తిగాలంబు,
మఱి వేదవాదుల మనసుతల్లడము,
వొలయ నధ్యాత్మవాదుల "నోరితాళ,
మిల నల్లుగావున నెన యెందుఁ గలదె?
తఱఁదఱఁ బరవాది దాఁ గాకయంచు
మెఱసి మీముందఱఁ బఱవక నిలువఁ
గలఁగక తర్కింపఁగా నెట్టితార్కి-
కులకును వావదూకులకును వశమె ?
కావున నిది యొక్క కార్యంబు గాఁగ
భావించి యేల మీపాదంబు లెత్త
నేమ చాలుదు మేల యిటువంటిసభల
నేమించి "నిర్ధూమధామంబు సేయ"
ననుచుఁ బండితమల్లికార్జునయ్యకును
వినయంబుతో విన్నవింపుచు మొక్కఁ
గ్రమమున "దక్షాధ్వరంబు," "వ్యాసాష్ట
కము"ను, "గణాడంబరము", "శారభంబు,"
నొత్తిలి చదువుచు నుబ్బుచుఁ జనుచు
నత్తఱి భట్లు గైవారంబు సేయ
"శ్రుతిఁబంచగద్యముల్", "రుద్రమహిమ"యు

౧. నోటి. ౨. నిర్ధూమ.

శతకంబు "శివతత్త్వసార" మాదిగను
గద్యపద్యంబు లాకాంక్షఁ జదువుచు
హృద్యంబుగా సత్కవీశ్వరుల్ వొగడ
మది నుబ్బి "సంసారమాయాస్తవంబుఁ"
బదములుఁ దుమ్మెదపదముల్ ప్రభాత-
పదములుఁ బర్వతపదము లానంద-
పదములు శంకరపదముల్ నివాళి-
పదములు వాలేశుపదములు గొబ్బి-
పదములు వెన్నెలపదములు సంజ-
వర్ణన మఱి గణవర్ణనపదము
లర్ణవఘోషణ ఘూర్ణిలుచుండఁ
బాడుచు నాడుచుఁ బరమహర్షమునఁ
గూడి సద్భక్తసంకుల మేఁగుదేర
నలరు ఋగ్వేదాది [1]యది యాదిగాఁగఁ
దలుకొత్తు రుద్రసూక్తములుఁ దన్నుతులు
సుమహిష్ఠలీల యజుర్వేద నమక
చమక పంచబ్రహ్మ సంస్తుతోక్తులును
ననుపమసామవే[2]దాన్వితమహిమఁ
జనిన రుద్రప్రశంసాపరోక్తులును

---

౧. యాగమోక్తముల. ౨. దాన్వీత.

గ్రమమొంద రుద్రసూక్తప్రతానములఁ
బ్రమథసూక్తములును బసవసూక్తములఁ
దనరు వేదము 'లనంతావై' యనంగఁ
జను చరణవ్యూహసంగతియందు
శ్యామ మాధ్యందిన [1]చర్చక [2]శ్రవణ
[3]శ్యామాయనీయ చర్చ శ్రవణాంత
[4]కౌండల దుందుభి దండి లాంగూల
మాండూక శాకల మైత్రాయణీయ
వైనేయ వైధేయ వార్తాంత[5]వేయ
శౌనకి మౌద్గల్య సాంఖ్యాయనీయ
శాపేయ శౌక్లేయ శాపాయణీయ
కాపాల బాష్కల గాలవ కాణ్వ
[6]దాంత [7]వత్య త్వరిత [8]బ్రహ్మదప్ర-
దాంత [9]ఖల్వల దేవదర్శి [10]జాబాలి
వారాహ [11]కాఠీయ వాజస[12]నేయ
నారాయణీయ [13]యానప[14]హార్ద్రవేయ

౧. చర్వక; చర్చిక. ౨. శ్రవణ. ౩. వార్తాంతవేయ. ౪. పౌండల; కౌండల. ౫. పే; నే. ౬. తాంత; శాంత. ౭. సత్య; పర్య. ౮. బ్రహ్మాండ. ౯. పిప్పల; ఖల్వల. ౧౦. వైజాల; బైజావ. ౧౧. చరకమూల; కఠక; చరకతా; చరకీయ. ౧౨. నీయ; నియ్య. ౧౩. యానవ; యనావర్యవేయ. ౧౪. యాత.

[1]పారాక్ర[2]మేణాంత [3]బొధేయ విరథ
పారక్రమి బ్రహ్మ[4]ఘోష [5]ఖాండిక్య
ఆసురాణీయయాహ్వాయ మూలకఠ య-
[6]వాసురాణీయ కాత్యాయనీ యాశ్వ-
లాయని మొదలు నాయాయిశాఖలను
న్యాయసూత్రంబు లామ్నాయభాగములు
మానిత తదుపశాఖాది సూత్రప్ర-
తానంబులను బవమాన, కైవల్య,
కైనేష, జాబాల, కాలాగ్ని, రుద్ర,
మానవ, జైగీష, మారుతామ్నాయ,
నారాయణ, బ్రాహ్మణ, శివసంకల్ప,
శ్రీరుద్రచయ, బృహదారణ్యాగర్భ,
హంసా ద్యుపనిషచ్ఛయములు, రుద్రప్ర-
శంసాపరోక్తు లాశ్చర్యం బెలర్ప.
బరమలింగార్చనాపరులు స్వాధ్యాయ-
పరులునై చను మహాబ్రాహ్మణోత్తములు
సదువుచు వేదభాష్యములు సెప్పచును

౧. వా; పారణేయ. ౨. ముక్తాంత; మప్రోక్త. ౩. బొధాయనధవ; బైదేయవదవ; భావేయ. ౪. వైషవి; బప్పిలి; పాపవి. ౫. సావిత్య. ౬. దాస.

ముదమున నిరుదెస మ్రొక్కుచు నడువ,
న్యాయవైశేషికోదాత్త శాస్త్రములు
వాయని ప్రీతి నుపన్యసింపుచును
ఖండనాఖండనోద్దండత వెలయ
దండితార్కికు లుబ్బుచనర నేతేర,
బసవయ్య, షోడ్డలబాచయ్య, చెన్న-
బసవయ్య, మడివాలుప్రభువు, సత్తేశు-
చామయ్య, [1]యజగన్న, [2]సవరదసిద్ధ-
రామయ్య, యక్కగార్కల్లి దేవయ్య,
[3]దాసయ్య, శంకరదాసయ్య, దాస-
కేసయ్య, గక్కయ్య, గేశిరాజయ్య,
మసనయ్య, సిక్కయ్య, మాదిరాజయ్య,
యసలార [4]మఱియు [5]శైవాఢ్యులైనట్టి
[6]సకలపురాతన [7]సద్భక్తగీత-
నికరముల్ గాయకనికరముల్ పాడ,
'శివమస్తు, శివమస్తు, [8]శివమస్తు' అనుచుఁ
దవిలి [9]దీవించుచుఁ దపసు లేతేర

---

౧. యజగమ (-న,-ణ); ౨. సకలేశ, 3. 'దసరయ్య' అని సంస్కృతానువాదము; ఛందస్సుకోసము 'దాసయ్య' అనుపాఠము గలిగినది. ౪. వీరాదియైనట్టివారి. ౫. గతాఢ్యు. ౬. ప్రకట. ౭. భక్తుల. ౮. శివమస్తటంచు. ౯. దీవింపుచు.

ధర నేకశంఖముల్ ధవళశంఖములు
పొరిం బొరిం [1]బరిగొన ఘోరన మ్రోయ,
నలరారుఁ బంచమహా[2]వాద్య వితతు
లోలయంగఁ గాహళు లొక్కట మ్రోయ,
నంతట నిల్లింత నల్లంత నంత
సంతసంబున నరుల్ జయవెట్టుచుండఁ
[3]బురి భక్తతతులు విభూతివీడియము
లరుదందఁ [4]దారు సమర్పణ సేయఁ
బ్రణుతవాఙ్మణులు నీరాజనదీప-
మణులును [5]భక్తి[6]దృఙ్మణులు సంధిల్ల,
[7]నంగద వివిధపుష్పాంజలు లిచ్చి
మంగళారతు లెత్తి మహి మ్రొక్కి చనఁగ,
నంగళ్ల వీథుల నంతంత నిలిచి
లింగభక్తుల కెదు[8]ర్లేదు [9]వొమ్మనుచు
నార్యులుఁ బుణ్యపణ్యాంగనల్ భక్తి-
శౌర్యాతిశయత కుత్సాహించి పొగడ,
లింగభక్తుల నిజాపాంగమార్గంబు
సంగతి దయఁజూచు శాంతనందులును,

---

౧. బురిగొని. ౨. నాద. ౩. బొరి ౪. మ్రొక్కి. ౫. భక్తి. ౬. దిఙ్మణులు. ౭. సంగత. ౮. ర్లేదు. ౯. పొండనఁగ.

బరసమయంబుల భస్మంబు సేయ
నురువడిఁ జూచు నుప్పరమునందులును,
బటు జైన చార్వాక బౌద్ధసంఘముల
స్ఫుటమందఁ దగ [1]నేవఁ జూచునందులును,
మానితంబగు కేతనానీకములును
బూని చిక్రాలెడు వాతపూరణంబులును
ముడివడ [3]పణిహార్లు ముందట [4]వెనుక
నడరంగఁ 'జాంగు! భళా!' యంచు నడవఁ
జెనసి మఱి 'ఛత్రం శశినిభం' బనంగఁ
జనఁగను వాయవ్యసంహితయందు
నినుపార 'ఛత్రోఽతినిర్మలం' బనుచుఁ
బూనరఁ బద్మపురాణమును జెప్పఁ గాన
"శ్వేతాతపత్రం తు విశ్వేశ్వ - య
పీతాతపత్రం తు విష్ణవే" యనుచుఁ
దప్పక విధికి రక్తచ్ఛత్ర మనుచుఁ
జెప్పచుండెడిఁ గాన శ్రీస్కాందసూక్తు
లమరంగ నాలవట్టములుఁ జామరలుఁ
గ్రమమున నట్టివిగాఁ జెప్పఁగాన
సరి ధవళచ్ఛత్రచామరావళులు

1. నేల. 2. వీచెడు. 3. పడిః ఫణి. 4. వెనక మడరంగ.

ధర రుద్రునకు భక్తతతికిని దక్క-
నొగి బ్రహ్మవిష్ణుముఖ్యుల కిడ నరక-
మగు "నరకంప్రజే" త్తనుఁగాన, యట్ల
వినుతహస్తిక దామవిలసిత మహిమఁ
జను ధవళచ్ఛత్త్ర చయము వొల్పార
వేవేగ తమతోడ [1]వెల్లగొండ మహా-
దేవయ్యగారు నుద్దీపితభక్తి-
ధీరతఁ బోరండ్ల సూరసానమ్మ
గా రాదిగా భక్తగణములు నడవఁ
బరవాదిభంజనపటుపరాక్రమముఁ
జరలింగసామ్రాజ్యసంపద దనరఁ
జను దెంచుమల్లికార్జునపండితేంద్రు
ననఘుని బౌద్ధుఁ డల్లంతటఁ గాంచెఁ
బరవాదిఘోరసాగరబాడబాగ్నిఁ
బరవాదిమత్తేభపంచాననంబుఁ
బరవాదిమేఘదుస్తరమారుతంబుఁ
బరవాది[2]ఘనవనస్ఫురితదావాగ్నిఁ
బరవాది[3]విషభూజపటుకుఠారంబుఁ
బరవాదిదుస్త[4]ర్దుర్భరధూమకేతుఁ

---

1. వెలగొండవంశ. 2. వనఘన. 3. వనభూజ. 4. నిర్భర.

బరవాదిభూరిభూధరకులిశంబుఁ
బరవాదివల్మీకవరఖనిత్రంబుఁ
బరవాదిభేకభీకరభుజంగంబుఁ
* బరవాదిపురహరఫాలనేత్రంబుఁ
† (బరవాదితస్కరబహుళశూలంబుఁ
బరవాదివనలతాప్రథితదాత్రంబుఁ
బరవాదిసారసవరసిశాకరుని
బరవాదివార్ధిశుంభత్కుంభజన్ము)
గని బౌద్ధుఁడంతనుత్కటకోపవహ్ని-
కొనలను దనుదాన కొని కాలుచుండ
నానతబుధుఁడు లోకారాధ్యయశుఁడు
నైన పండితమల్లికార్జునప్రభుని
వలపటిదెస నుమావరభక్తరాజి
నలిగొన సింహాసనస్థులఁ జేసి
హరునిభక్తులయాజ్ఞ శిరమునఁ దాల్చి
గరిడికెక్కిన యంకకాఁడునుఁ బోలె

* ఈపాదమునకు సంస్కృతానువాదమున 'పరవాదిపుర వ్యూహసంహారఫణిభూషణః' అని ఉన్నది. † కుండలీకరణము చేయఁబడిన పంక్తులకు సంస్కృతానువాదము లేదు. అవి ప్రక్షిప్తములేమో. ౧. కోపుఁడగుచు.

నెఱ విడివడ్డ మదేభంబుఁ బోలె
వడి మృగంబులఁగన్న [1]వ్యాధుండుఁబోలెఁ
బగఱఁ గన్ పంతంబు బంటునుఁబోలె
వగనొందు పసిఁగన్న వ్యాఘ్రుంబుఁబోలె
నాసురవృత్తిఁ గోపాటోపచిత్తుఁ
డై సమయుల సమయాధముఁ జూచి
యెక్కడి వైదికుం? డెక్కడిబౌద్ధుఁ?
డెక్కడివైష్ణవుం? డెక్కడిజోగి?
యెక్కడి చార్వాకుఁ? డెక్కడి సాంఖ్యుఁ?
డెక్కడి [2]వేదాంతి? యెక్కడికర్మి?
సిద్ధ మన్యోన్యవిరుద్ధమై చను న-
బద్ధంపుసభల సంపాదన గలదె?
ప్రకటింప [3]వేయు నులుకత్రాళ్లు గూడి
యొక ప్రేంకగునె? సభ్యుఁ డొకఁడైన వలదె?
కంగటికాళ్లు సంకంపుఁ బూసలును,
సంగడించినయట్టి సభలును సభలె?
చాకులకును మఱి సంగవులకును
నేకత్వ మున్నదే లోకంబునందు?
వెట్టికిఁ దెచ్చినవిధమున నూర

1. వ్యాఘ్రంబు. 2. వేదాంతుఁడెక్కడి. 3. నూఱు.

వెట్టిగాఁ[1] దెచ్చినయట్టివి సభలె?
కూటువమూఁకలు వాటిమైకూడఁ
జాటి[2] తెచ్చినయట్టి సభలును సభలె?
యుర్వీశుపరివార ముర్వీశుబంట్లు
నుర్వీశుప్రజలును నున్నవారెల్ల
నిందుఁ, దా సభయన నెద్ది? వినంగ
నిందు సభాపతి యెవ్వఁ డౌననఁగఁ
దర్కింపఁ జర్చింపఁ దలయెత్తిచూడఁ
దార్కికుఁ డెవ్వఁడు దథ్య మిందెన్న,
నితన మగుడుట యిది మాకుభక్తి-
పంత; మట్లునుఁగాక ప్రశ్న నే సెదము,
'ఓవైదికుండ! నీ వాడ లెగ్గ వెట్టు
లీవేల నిటువచ్చి తీవేదబాహ్యుఁ
జూడ ముట్ట వసదఁ జొరఁ బ్రతిమాట-
లాడఁ గా దనఁగ మున్నా శ్రుతి వినవె?
యననేల "హస్తినా హన్యమానో౽పి"
యన "న విశే చ్చ జినాలయం" బనఁగ
ధర నిట్టి జిన బుద్ధ దర్శనాంతరము
లరయఁ గించిద్భేద మఁతియ కాదె?

---

౧. గావించిన. ౨. కూర్చిన.

పరగంగఁ దద్వేదబాహ్యుఁడు వొందు
నరకం బభీష్టమే నలి నట్లుఁగాక

వే ద వా ద ని ర స న ము

విను వేదవాది! నీవేదంబు నిత్య
మనియెదే? ముప్పదియాఱు తత్త్వముల
నైదవతత్త్వ మయ్యాకాశతత్త్వ
మాదట శబ్ద మయ్యాకాశగుణము
దా నిత్యవస్తువై ధర నొక్కప్రకృతి
లేనిది దా నెట్లు దా నుదయించు?
నదిగాక శ్రుతులు స్వయంభు లంటేని
నుదయంబు లయము లేకునికి దా నెట్లు?
నలి నెన్నఁబడు చరణవ్యూహసూక్త-
ముల వినవే స్వయంభువులె వేదములు?
రురువర్ణ దేహంబు ఋగ్వేదమునకు,
ధరణి నాత్రేయగోత్రంబు, గాయత్రి
ఛంద, మయ్యధిపతి సరసిజభవుఁడు,
నందమౌ పద్మపత్రాయతాక్షములు
గుంచిత కేశముల్ గురిమినయట్టు
లంచితంబుగ మఱియా యజుశ్శ్రుతికిఁ
గ్రమమొంద నాది 'భారద్వాజగోత్ర,'

మమరఁ ద్రిష్టుప్ ఛంద, మధిపతి శార్ఙ్గి;
స్థూలకపాలంబు సూర్యకౌశ్యములఁ
బోలెడు తామ్ర విస్ఫురితవర్ణంబు;
సామవేదమునకు ఛందంబు జగతి,
దా మఱి రుద్రుండు దైవంబు, తనువు
గడు శ్వేతవర్ణంబు, గౌశ్యపగోత్ర;
మడరంగ శుచిదేహ మతి దాంతగుణము
వెలయ నథర్వాణవేద శ్శృంగమున
కిల ననుష్టుప్ ఛంద, [1]మింద్రుఁ డధిపతి,
యనుపమంబైన కృష్ణాంకంబు మేను,
దనరు బైజానగోత్రం; బట్లు శ్రుతులు
గొలఁదులు వర్ణముల్ గోత్రముల్ రూప-
ములు నధిదైవతంబులుఁ గల్గియుండు,
నలుకు లేక స్వయంభు లనియెడుశ్రుతులు
దలఁప నిత్యములె? నిత్యంబులయేని
నుదయించుఁ జెడు జగదుదయన విలయ-
విదితకారణములే వేదసంఘములు ?
'భువి నిజ్జగంబులు వుట్టవు, మఱియు
నవియు ననాదుల' యనియెదే వినుము

---

౧. మింద్రుండు దైవమనుపం.

తజ్జ్ఞోక్తిఁ బరగు పూర్వజ్ఞానవిషయ-
తాజ్ఞానకలి తోత్తరజ్ఞానచయము,
నా విషయజ్ఞాన మది వెనుఁ బడఁగఁ
జావి యయ్యుత్తరజ్ఞానంబు దోఁచుఁ;
బూని తదుత్తరజ్ఞానంబు గదియఁ
దా నుత్తరజ్ఞానతతి పూర్వమైన
జ్ఞానాదులై యవి దా మెట్లు దోఁచు?
మానితాక్షరపంక్తి మాడ్కి మెట్లనిన
నగు విషయజ్ఞాన మాద్యక్షరాంక,
మొగి ద్వితీయాక్షరం బుత్తరజ్ఞాన,
మరిగినయది విషయజ్ఞాన, మదియు
నరయఁ బూర్వజ్ఞానమగు, నట్టులైన
నరిఁ దదీయోత్తర జ్ఞానాక్షరంబు
నరయంగ నగు విషయజ్ఞాన, మగుదు
నొగి దృతీయాక్షరం బుత్తరజ్ఞాన-
మగు, నిట్టు లొండొంటి కటమీఁ దెఱుంగ
జన్మపూర్వజ్ఞాన సంగతాక్షరము
లన్నియు నతని కనాదుల కాక
రతిఁగూడ మధ్యాక్షరములెల్ల నెఱుఁగు-
నతని కనాదులే? యట్ల యనాదు-

లను జగంబులు నిత్యమనియు నీజ్ఞాన
౧మునన మెఱింగితో ? ము న్నెనయట్టి
జగములఁ జూచి నిశ్చయ మెఱింగితివా ?
నిగమ ప్రమాణోక్తి నీ వెఱింగితివా ?
యొనర నిజజ్ఞానమునన యెఱింగి
తి ననియెదేని జ్ఞానదృష్టులలోనఁ
దివిరి యాత్మజ్ఞానదృష్టి నెఱిఁగితొ ?
తివిరి చతుర్జ్ఞానదృష్టి నెఱిఁగితొ ?
పూని యాత్మజ్ఞానమున నెఱింగితిని
దా ననియెదె ? పశుజ్ఞానతత్త్వోక్తి
నిన్ను నీ వెఱుఁగంగ నేరనివాఁడ
వెన్న నిజ్జగదాది నెట్టెఱింగితివి ?
కాక, చతుర్దృష్టిఁ గాంచితి ననియె
దా? కనుఁగొనఁగ నేత్రములు నీ కెవ్వి ?
హారుని నేత్రములైన యనలార్కశీత -
కరుల యయ్యధిదైవికస్ఫూర్తిఁగాని
తజ్జ్ఞుల దృష్టులు దాఁ గానవనిన
నజ్ఞాని! కానంగ నలవియే నీకు ?
నిజ్జగంబులఁ జూచి యెఱిఁగితివేని

౧. మును నెఱింగించితో మున్నున్నయట్టి.

నజ్జగంబులు నీకనాదులు, నీవు
మొన్నటివాఁడవు, మున్నున్న జగము
లెన్న ననాదిగా నె ట్లెటింగితివి ?
ఆ జగదాదికి నాదిమైనట్టి
రాజార్ధధరుఁ డుమారమణుఁ డనాది
గావున నవి యెఱుంగఁగ నేర్చుఁగాక
భావింప నితరుల ప్రాప్తియె ? మఱియు,
నిగమప్రమాణోక్తి నీ వెఱిఁగితివె ?
నిగమ ప్రమాణోక్తి నీకుఁ దా నెద్ది ?
యిల 'జగతాంపతయే నమో' యనఁగఁ
గలుగు నిత్యాదిసూక్తము లెగ్గశక్తి
గాన; వనాదులుగా విజ్జగములు;
గాన, వేదములచేఁ గా విజ్జగములు:
[ధృతి వేదములు 'విశ్వదేవో' యనంగ
శ్రుతులకుఁ దండ్రి యీశుండమై యుండ];
శ్రుతి 'శివోఽమేవ మే పితరా' వనంగ
శ్రుతులకుఁ దండ్రి యీశుండ మైయుండఁ
దనరు వేదములు 'పితా తదశ్నామ'
యన శ్రుతులకుఁ దండ్రి సాంబుఁడై యుండ
శ్రుతులు దా రీశ్వరసుతుల మేమనఁగ

శ్రుతులు స్వయంభులంచును బల్కఁదగునె?
శ్రుతిపురుషులు వరిశ్రుతభ_క్తిపాశు-
పతశాంభవవ్రత పారీణమతులు
దనరు వేదములు ' వేదా ధారయంతి '
యనఁ దెల్ల గాదె రుద్రాక్షధారణము?
మేదురశ్రుతులు ' తస్మేఅస్తు ' నాఁగ
నాది 'దేవానాం త్రియాయుషం' బనఁగఁ
బ్రత్యయం బగుఁగాదె భస్మావలి_ప్త-
నిత్యత్రిపుండ్ర వినిహితైకనిష్ఠ
మితి గుల్క శ్రుతు 'లయంమేహ_స్త' యనఁగ
రతిని 'శివాభిమర్శన'నాఁగ నంద
సత్యంబుగాదె యీశ్వరసన్నిహితము?
నిత్యలింగార్చనా నియతానుర_క్తి
వింతయే, శ్రుతులందు 'వేదా శ్చ కామ-
యంతే' యన మఱి 'తదశ్నామి యనఁగ
సుప్రసిద్ధము గాదె శూలిపాదోద-
క ప్రసాదోపభోగ ప్రవర్తనము?
తమభ_క్తిగతి శ్రుతుల్ దార చెప్పంగ
బ్రమసి దైవములని పలుకంగఁదగునె?
పాయక శ్రుత్యు_క్తిఁ 'బంచాక్షరే స్థి-

తా' యన నాది 'వేదాశ్చ శాస్త్రాణి
యనఁగఁ బంచాక్షరియంద లయింప
మును వేదములు నిత్యములు నాఁగఁ దగునె"
కాన, స్వయంభులు గావు వేదములు,
గాన, నిత్యంబులుఁ గావు వేదములు,
'గావేనిఁ ద్రిజగన్నికాయంబులెట్టు
లావిర్భవంబయ్యె నాది' నంటేని
భవుఁడు నిజాజ్ఞా ప్రభావన భవన
భవనంబు లతులితప్రతిభమైఁ బేర్చి
నిజముగా జలకూర్మగజ ఫణీంద్రులను
ద్రిజగదాధారవిధేయత నిల్పి
సంచిత స్థావరజంగమాది ప్ర-
పంచంబుఁ గావింపఁ బ్రబలింపఁ ద్రుంపఁ
గడుఁగడు దక్షతగల మహామహిము
మృడు నెఱుంగుదుగాదె మీ వేదములను
జలము జడ్డును లేని శాబ్దికులకును
దెలియ 'సోమః పవతే' యన మఱియు
నలి 'జనితా మతీనా' మన నవులఁ
*(దళుకొత్తఁగా 'జనితా దివో' యనఁగ,

* కుండలీకరణము చేయఁబడిన పంక్తులకు సంస్కృతాను-వాదములేదు.

స్థిరసూక్తి 'జనితా పృథివ్యా' యనఁగ
క్షితి 'జనితాగ్నే' 'ర్జనితసూర్య్య' యనఁగ
నిరవొందఁ దుదిఁ 'జని తేంద్రస్య' యనఁగ,
విరచించి 'జని తాదివిష్ణో' రనంగ,)
వలపారఁ 'బశవో భవంతి' యనంగఁ,
దలఁపఁ 'బితా దేవతాస్రష్ట' యనఁగ
దృష్టంబు మఱియును 'దేవా శ్చ పశవ
స్సృష్టా' యనఁగ శ్రుతిదృష్టంబులుగను
నొప్పార నిట్టులై యున్న వేదములుఁ
జెప్ప మహాసృష్టి శివునియం దగుట
గాన యీశుండు జగత్సృష్టికర్త
కానేరఁడొండె జగంబు లన్నేని
'వెలినుండి చేసెనో విశ్వాధికుండు
సెలఁగి లోనుండిచేసెనొ విశ్వవితతి'
ననిమెదా? తనదు గర్భాంబుధిలోన
జనియించు బుద్బుదజాలంబులట్ల
మెనయంగ 'లింగమధ్యే జగత్సర్వ'
మనఁగఁ దన్మధ్యంబునంద కావించుఁ;
'జేకొని జగము సృజించు నీశ్వరుఁడు
సాకారుఁడొ మఱి నిరాకారుఁడో? ని-

రాకారుఁడేనిఁ జేయఁగలేఁడు సృష్టి,
సాకారుఁడేనిఁ జేయఁగరాదు సృష్టి,
సృష్టి దా నిత్యునిచేఁగాని కాదు,
సృష్టి యనిత్యునిచే మున్న కాదు;
ఏపార నిత్యస్వరూపియౌ రుద్ర
రూప మేపగిదని రూపించి తీవు ?
హరుని సాకార నిరాకారరూపిఁ
బరగుతత్త్వము లేకభావ మెట్లయ్యెఁ ?
జెనసి యేవిధమున సృష్టిఁ దాఁజేసె ?'
ననియెదా ? 'సృష్టి లీలార్థమై తాన
భవుఁడన రాజసాస్పదగుణంబునను
భువనంబు లేర్పడఁ బుట్టించుఁ బరగ,
మృడుఁడన సాత్త్వికమిళితగుణమునఁ
గడఁగి జగంబులఁ గరుణ రక్షించు,
హరుఁడనఁ దామసోద్ధురగుణంబునను
బరగు జగంబు లేర్పడ సంహరించుఁ,
ద్రిగుణంబులను బాసి దీపితమహిమఁ
దగిలి శివుండనఁ దాన వెలుంగుఁ,
బెంపార నిష్క్రియఁ బృథుశివశక్తి
సంపుటంబుగ జగచ్చక్రంబుఁ ద్రిప్పు,

సకలనిష్కల సద్వైశ్వర్య సంపూర్ణుఁ
డకలంకుఁ డీశానుఁ డాదిరుద్రుండు
శ్రీమహాదేవుఁ డజేయుఁ డక్షయుఁ డ-
నామయుఁ ¹డాద్యుఁ డాద్యంతవర్జితుఁడు
సర్వగతావిగోచరుఁడు నిత్యుండు
శర్వుఁ డవాఙ్మానసప్రగోచరుఁడు
హరుఁ డవినాశనుఁ డజరుఁ డక్షరుఁడు
పరమ తేజఃపుంజభాస్వరాంగుండు
వేదాంతవేద్యుండు విశ్వాధికుం డు-
మాదేవుఁ డతులితమహిమాకరుండు
పరమేశ్వరుఁడు జగత్పతి శంకరుండు
వరదుఁడు సద్భక్తవత్సలుండైన
హరుని సాకారసిద్ధాంతతత్త్వంబుఁ
బరమకారణము నుత్పత్తిహేతువును
గాన యారుద్రుచేఁ గల్పింపఁబడియుఁ
దా నిజ్జగంబులు దథ్య మెట్లనిన,
గలుగని వెట్లును గలుగఁ, దనాదిఁ
గలిగిన వెట్లును గలుగు, శివుండు
గలుగని జగములఁ గల్పించినాఁడో ?

---

౧. డార్యు.

కలిగియుఁ గలుగని విలఁ జేసినాఁడొ ?
యలరి యెయ్యవి సేసె ననియెదే ? వినుము-
సలిలాదిమృద్దండచక్రసూత్రములు
గలుగఁ గులాలుండు గలుగనియట్టి,
యలవడఁ దంతుముఖ్యాది హేతువులు
గలుగఁ గువిందుండుఁ గలుగనియట్టి
ఘటపటాదులఁ జేయుక్రమమునఁ గలుగు
పటుపరమాణ్వాదిపంచశక్తులను
మును లేని యిజ్జగంబుల సృజియించెఁ
దన నిత్యపరమస్వతంత్రత్వ మమర ;
సలిలాదిమృద్దండ చక్రసూత్రములు
గలుగఁ గులాలుండు గాకున్న నేమి ;
యలవడఁ దంతుముఖ్యాది హేతువులు
గలుగఁ ౹విందుండు గాకున్న నేమి;
ఘటపటాదులఁ జేయఁగా నెవ్వఁడైనఁ
బటువుండు గాఁడె యభ్యాసత్వశక్తి
నిలఁ బరమాణువు లేను శక్తులును
గలుగు నేనియు నవి గారణంబేని
జగములఁ జేయ నీశ్వరుఁడైనయట్ల
జగములఁ జేయంగఁజాలఁడె యొరుఁడు ?

ననయంబు జగదాది కాతండ యేల'
యనియెదే? కార్యంబు లవి గారణములె?
యరయఁ గార్యములు బ్రహ్మాండసంఘములు
పరగుకారణములు పంచశక్తులును
బరువడి గార్యముల్ పంచశక్తులును;
వరుసఁ గారణములు పరమాణుతతులు
పరగుకార్యంబులు పరమాణుతతులు
పరమకారణుఁ డుమాపతి యమ్యోనేనిఁ
బరమాణుశక్తుల ప్రా పీశ్వరునకు
నేల తా ననియెదే? యివి సదాశివుని
లీలలు గాక నిజాలోకనంబు
సాలదె యీ జగచ్చయముఁ బుట్టింపఁ
బాలింప సంహరింపంగ ?- నెట్లనిన
నెఱయ ఋగ్వేదాది నిగమసూక్తములు
మెఱయ 'స ఈక్షతే[1] మా న్ను లోకాం శ్చ
[2]లోకపాలాం శ్చ' నా లోలత నంతఁ

---

౧ ఇచట యతితప్పినది. మెఱయ 'స ఈక్షతే మే ను లోకాంశ్చ' అని వ్రాఁతప్రతులయందు యత్యక్షరము సవరింపఁబడినది గాని యాపాత మర్థరహితమగును. ౨ 'లోకపాలాంశ్చ' అనుమాట సంస్కృతానువాదమున లేదు.

బో॥ 'స ఈక్షతే లోకాన్ సృజా ఇ
తి' యనంగ నీశ్వర దృష్టిమాత్రమున
నియతి జనించిన నిఖిలలోకములు
భగ్నంబునొంద 'న బ్రహ్మా, న విష్ణుర్
నాగ్ని ర్నసూర్యా' నా నట్లు పురాణ
మితిఁ౨ 'దవో న్మేష నిమేషేభ్య' యనఁగ
యుతసమాసము 'ప్రళయోదయా' వనఁగ
శివు దృగంచలము విశేషతఁ దనరఁ
దివిరి 'ప్రత్యంజన స్థిష్ఠతి సంయు-
గాంత్యకాలే' యన హరిముఖ్య దేవ-
తాంత్యకాలంబున నాప్రమథాళి
ప్రణుతించి 'త్వం విశ్వభర్తా' యనంగఁ
బ్రణుతించి 'తవ నాస్తి భర్తా' యనంగ
నంకించి 'త్వం విశ్వహర్తా' యనంగ
నంకించి 'తవ నాస్తిహర్తా' యనంగ
శ్రుతి 'ఏక ఏవ రుద్రో' యన మఱియు

---

౧ ఈ వాక్యము సంస్కృతానువాదమున లేదు. ౨ 'తదోన్మేష నిమేషాభ్యామ్' అని యుండవలెను. కాని యది ద్విపదపాదమున నిముడక పోవుటచే 'నిమేషేభ్య' అని కవి సరిపెట్టినాఁడు. ఇట్లుచేయుట సంస్కృత భాషా విరుద్ధమైనను ప్రాకృత సంప్రదాయానురోధియై యున్నది.

సతిరతి ' నేక మే వాద్వైత ' మనియు
నిండి యొక్కండ రుద్రుం డుండ వెండి
రెండవువాఁడు లేకుండుట వినవె ?
యాదిఁ బ్రత్యయము నీ కాగమం బేని
వేదవాదివ యేని వేఱనరాద ;
యది మహాసృష్టి ము న్నైన చందంబు
నిది మహాప్రలయంబు గదియు విధంబుఁ
గాన యనాదులు గావు లోకములుఁ,
గాన దైవంబులు గావు వేదములు ;
భవునిమహిమఁ జదువుపాఠకుల్, వొగడు.
కవులు, ప్రతిష్ఠించు కడిఁది తార్కికులు
గాడెట్లు సకలజగత్ప్రపంచము ని-
పాదించుచును నట్ల భవుఁ జెప్పఁగాన
వైదికాపాదిత ప్రతుల రక్షింప
వైదికేతరజిన ప్రతుల శిక్షింపఁ
గా వివక్షం జేర్మి కలిమి వేదముల
దైవత్వ మెప్పుడుఁ దప్పదం టేనిఁ
దప్పేమి ? వేదంబు దైవమేనియును
జెప్పమా యొకదైత్యుచే మ్రింగఁబడునె ?
తప్పేమి ? వేదంబు దైవమేనియును

జెప్పుమా తమబ్రహ్మశిరముఁ గోల్పడునె?
తప్పేమి? వేదంబు దైవమేనియును
జెప్పుమా దక్షునిచేటుఁ గన్గొనునె?
తప్పేమి? వేదంబు దైవమేనియును
జెప్పుమా కవితలై చెప్పంగఁబడునె?
తప్పేమి? వేదంబు దైవమేనియును
జెప్పుమా యొకపక్షిచేఁ బడి చనునె?
తప్పేమి? వేదంబు దైవమేనియును
జెప్పుమా యొకమునిచేఁ ద్రెంపఁబడునె?
తప్పేమి? వేదంబు దైవమేనియును
జెప్పుమా కుక్కలై శివువెన్కఁ జనునె?
వేదమెట్లును గర్త గాదయ్యె నేని
వేదోక్తకర్మనిపాదితఫలము
దాన స్వర్గాపవర్గానూనఫలవి-
తానముల్ వొందింపఁగా నెట్లు నేర్చు
ననియెదే? కర్తృత్వ మది గర్మమునకు
ననుమతించుటయు సిద్ధాంతమతంబు
గాదు; గర్మమునకుఁ గర్తృత్వసిద్ధి
లేదు; నీవును వేదవాదివి గావు;
వెఱకర్మవాది నీపేరు;—దా నింకఁ
దఱిఁదఱిఁ గర్మవాదంబొ నీమతము—

కర్మవాద నిరసనము

ఘనసూక్త మిదె, "స్వర్గకామో యజేత"
యనుట దైవము సతుర్థ్యంతంబ కాన
తనకర్మఫల మది దాన తత్కర్త
కనుభవయోగ్యమై యలరు నంటేని,
గర్మంబు గాయానుగతమయి సనునో;
కర్మానుగతమయి కాయంబు చనునో
కాయం బనాదియో కర్మం బనాది-
యో, యవి జీవికి నొక్కటియగునో;
క్షణిక మచిత్తు నిర్గుణము గర్మంబు
గణుతింప నది యెట్లు గర్త వసించు,
గర్తయు జడుఁడు దత్కర్మవశుండు
[1]గర్తయుఁ దా నెట్లు గర్మంబుఁ జేయుఁ?
దప్పుఁ జేసినవాఁడు దండించుకొనునో,
తప్పు సంకెలలయి తగులునో తాన?
కలుగును బరగంగఁ గర్త యొక్కండు
నలి నట్ల తత్కర్మఫలమును గుడుప
నిలను గర్మాధీశుఁ డీశుండు, గర్మ-

---

౧. 'గర్తింప' అని వ్రాఁతప్రతులలోను, పూర్వ ముద్రణము నందును నొకపాఠముగలదు.

ఫలదాత యొక్కండు గలిగియుండంగఁ
గర్తృత్వ మున్నదే కర్మంబునకును
గర్త యీశానుండుగా కట్లు వినుము,
పూర్వమీమాంసోక్తభూరికర్మములు
వేర్వేఱ మున్నానువిధములై యుండు,
భాసురంబుగఁ జెప్పఁబడు దర్శపూర్ణ-
మాస యజ్ఞాదికర్మంబులఁ జేయ
నొందు సంస్కార మొక్కొక్కండు గర్త
నందించి పోవంగ, నట్టిసంస్కార-
రూపంబులైన నిజాపూర్వములు ని-
రూపింప నామవిశ్రుతి గూడి యొకటి
వొనరు నామాంతరపూర్వ మైనట్టి
ఘనపర మాపూర్వమనఁగఁ బుట్టించు
నలరెడు తత్పరమాపూర్వవిహిత-
ఫలశిరస్కంబయి పరగుచున్నదియు
ననుపమంబగు దైవమనియు, నదృష్ట
మనియును, మఱి కర్మమనియునుఁ జెప్ప
నమరి, తదీయనామమున గుఱింపఁ
గ్రమమున దేహాంతరమున, లోకాంత-
రమునను, దేశాంతరమునఁ, గాలాంత-

రమున, నయ్యుపభోగరచితఫలములఁ
దా నిచ్చు ననుట వ్యర్థముగాదె ? జడము
లైన కర్మములు గాలాంతరంబునను
గలిసియుఁ దమయంత ఫలము లీనేర
విల నిట్టి జైనబౌద్ధులకు, భాట్టులకు
నొగి దానధర్మఫలోపభోగాదు
లగు కర్మ లవి వ్యర్థ మది యెట్టులనినఁ,
బుట్టిద మగునట్టి భోజనక్రియ య-
దృష్టంబు సావు సిద్ధించెడిఁగాన;
కనుఁగొనఁ గేవలకర్మంబు ఫలద-
మనఁ జనునేనిఁ గ్రియామాత్రఁ దనకుఁ
బుట్టిని మరణంబుఁ బుట్టింపనేల ?
[1]దృష్ట [2]కర్మప్రాప్తి శిష్టాన్నవిషము
లిల [3]జన్మమరణ సంకులము లీఁబట్టి
వెలయంగఁ గర్మముల్ [4]వెనుఁజనుచుండ
నాపోవ సర్వేశుఁ డక్కడక్కడను
నోపి తత్కార్మానురూపితఫలము
హితబుద్ధిఁ గావించు నిటుగాన సర్వ-
గతుఁడు కర్మమునకుఁ గర్త యొక్కండ

---

1 దిష్ట. 2 కర. 3 బుద్ధి. 4 వేచనుచుండ.

యధ్వరపతి రుద్రుఁ డగుట 'రాజాన-
మధ్వరస్య' యనంగ నట్లునుఁగాక,
'ఇంద్రాయ' యనియు 'నుపేంద్రాయ' యనియుఁ
'జంద్రాయ' యనియును స్వాహాంతముగను
హవి వెట్టఁగా భస్మమగు ద్రవ్యములను
దవిలి యపూర్వంబు దా నెట్లుపుట్టు ?
నాయపూర్వంబు స్వర్గాదిఫలంబు
నేయుపాయంబుల నిప్పింప నేర్చు ?
నవి నేరవేనిఁ గాలాంతరహీన
మవునేనిఁ బరలోక మనుట వ్యర్థంబ'
యనియె దేనియును గాలాంతరంబునన
చనియె ముక్తికిఁ దండ్రిఁ జంపి చండుఁడు;
బాలు వధించియుఁ గాలాంతరమున
లీల నీశ్వరు సిరియాలుండుఁ గూడె;
విన భ్రూణహత్య గావించి మీఁదటన
చనియెను బొందితోడను జోడనృపతి;
యరియమరాజు భూసురుఁ జంపి మఱియు
హరునిగర్భముఁ జొచ్చె; నట్లునుఁగాక
దక్షుండు వైదికాధ్వరఫలంబున న-
దక్షుఁడై మీఁదటఁ దలఁ గోలుపడియె;

నటు 'గృతం కర్మ శుభాశుభ' మ్మనెడి
చిటిపొటివాదముల్ సెల్లునె యెందు ?
ధర 'మన్నిమిత్తం కృతంపాప' మనియుఁ
గర 'మపి ధర్మాయ కల్ప్యతే' యనియుఁ
బూరిని 'మా మనుస్మృత్య పుణ్యోఽపి' యనియుఁ
హారునివాక్యమకాదె యలరుచున్నదియుఁ;
గాన కర్మమునకుఁ గర్తృత్వ మెద్ది ?
తా నెట్లు వొందుఁ బాఁ దత్కర్మఫలము ?
నేపాపవర్తన కేపుణ్యపదవి
యేపుణ్యసంప్రాప్తి కేపాపఫలము
గర్తయీ నటుగాన కర్మఫలంబు
గర్త యీశ్వరుఁ డుండఁగా నెట్లువచ్చె ?
కలుగదే మున్ను లోకత్రితికర్త
జలజాక్షుఁడైన శ్రీశ్వరుఁడైన విష్ణు
భృగుపత్నిఁ జంపిన పృథుకర్మఫలము
జగతిపైఁ బదిమార్లు సచ్చుచుఁ బుట్టె,
ఘను వాలి నేసిన కర్మఫలంబు
వనజనాభుని కాలు వ్రయ్య నేయించె,
బలిఁబట్టి కట్టిన పటుకర్మఫలము
జలజాక్షు నాగపాశముల బంధించె,

జెలఁగి కౌరవులఁ ద్రుంచిన కర్మఫలము
గలయ యాదవకులక్షయముఁ గావించెఁ,
జెలికాండ్ర సతిఁ గొన్న చిరకర్మఫలము
వలపార సతిని రావణున కర్పించెఁ,
గావున నితరుల కర్మఫలంబు
వోవంగనిచ్చునే పొంద కంటేనిఁ,
దనరి లక్ష్యము ధనుర్ధరుఁ డేయకున్నఁ
దనకుఁ దా బాణంబు సని యెట్లు దాఁకుఁ?
బెనుపొంద నీశ్వరప్రేరణ లేక
తనకుఁ దాఁ గర్మంబు సని యెట్లు వొందు?
విధి నుత్తమాధమ విరచితక్రియల
విధి నిషేధంబుల వెంటఁ గర్మలకుఁ
బటువగు పుణ్యాపాపములఁ బుట్టించి
యట స్వర్గనరకలోకాదుల కనిచి
ప్రథితశుభాశుభాస్పదసుఖదుఃఖ-
పథముఁ బొందించు నప్పరమేశ్వరుండు
గర్మకర్తలఁ గూర్చుఁ గర్తఁ బ్రాపించుఁ
గర్మంబునం దాదికర్త్రానుసారి
గర్త్రానుసారి యాకర్మంబ యేనిఁ
గర్త గర్మమునకుఁ గఱకంఠుఁడేనిఁ

బ్రేరించు నీశ్వరప్రేరణఁ జేసి
భోరనఁ గర్మంబుఁ బొందఁగా నేనియును
బెంపార నెవ్వని ప్రేరణ బ్రహ్మఁ
జంపినకర్మ మీశ్వరునిఁ బ్రాపించె
ననియెదే? బ్రహ్మ యహంకృతిఁ గ్రొవ్వి
తనుదాన మఱచి మదగ్రస్తుఁ డగుచు
రతి 'ఋతం సత్యం పరంబ్రహ్మ' యనుచు
నతులఋగ్వేదోక్తి ననుకీర్తి సేయ,
ధృతిని 'బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధి-
పతి' రంచు నయ్యజుశ్శ్రుతియును బొగడఁ,
బనుగొనఁ 'దత్పరం బ్రహ్మావిభాతి'
యని సామవేదోక్తి యర్థిఁ గైసేయ
భ్రమఁదక్క 'యత్పరంబ్రహ్మేతి' యనుచు
రమణ నథర్వశిరంబును మ్రోయఁ,
బరగంగ 'నోమితి బ్రహ్మా'దిసూక్తు
లరుదొంద వెండియు సట్లు గుఱింప,
నెన్నఁ బరబ్రహ్మ మీశుండ యనక
యన్ని యెఱుంగ 'కహంబ్రహ్మ' యనుచు
వ్రాలి మేమెఱుఁగని వనజజుఁ గినిసి
కాలభైరవుఁడన గణ మొక్కరుండు

దప్పక బ్రహ్మామీఁదటితలఁ దునుమ
నప్పుడ హరుని సోమాష్టకంబునను
నాకాంక్ష నుతియించి హరుని మెప్పించి
చేకొని మీచేత నీ కపాలంబు
ధరియింపు పరమాత్మ! తత్కపాలంబు
ధరఁబడ బ్రహ్మాండతతి యాక్షణంబ
పరిహృతంబగుఁగాన పాలవైవకుము
పరమభట్టారక! పరమకృపాబ్ధి!
పరమస్వతంత్ర! యక్షర! పరమాత్మ!
పరమేశ! యని బ్రహ్మ ప్రార్థనసేయ
భవుఁడు దాలిచెఁ దత్కపాల, మింతటన
శివు బ్రహ్మహత్య వాసించెనే? మఱియు,
ధృతి సామసూక్తిఁ 'ద్వం దేవేషు' నాఁగ
నతిరతి 'బ్రాహ్మణోస్మ్యహ'మన నాది
నడరుఁ దత్సామోక్తమగు పురాణములు
వడి 'బ్రాహ్మణో భగవాన్ రుద్ర' యనఁగ,
మును 'క్షత్రియఁగి పరమో హరి' రనఁగ,
యను వెలర్పఁ 'బితామహా స్తు వైశ్య శ్చ'
నాఁగ బ్రాహ్మణుఁ డయినంగదా యిట్లు
నాఁగ నేఁటికి నలినజుఁడు బ్రాహ్మణుఁడె?

ర్మైన నొఁగాక, యన్యాయవర్తనులఁ
బూని చంపిన రాజుఁ బొందునే హత్య ?
కర్మిఁ గర్మము చంపెఁగాని శిక్షకుఁడు
గర్మిఁ జంపిన పాపకర్మి గాఁడనఁగ
భాట్టంబునన యొక్కపక్షంబు గలుగ
నట్టున్నదే హత్య ? యదియునుఁగాక
రావణుఁ జంపిన బ్రహ్మహత్య దెలియ
భూవలయంబున బుధులు విధింప
నరుదగు నీ బ్రహ్మహత్యాదోషంబుఁ
బరిహరింపఁగ నొండుపాయంబు లేదు;
నిర్మించి లింగప్రతిష్ఠలు సేసి
నిష్ఠమై శివుఁ గొల్వ నిహాత మా ననుచుఁ
దివిరి రాముండు ప్రతిష్ఠలు సేయ
భువిని రామేశ్వరంబులు గల్గునట్లు
బ్రహ్మ వధించిన బ్రహ్మహత్య యొదవి
బ్రాహ్మణుల్ విధియింపఁ బరగ నొండేని
శ్రీ మహాదేవుఁ డీక్షితిఁ జేసినట్టి
యా మహాదేవేశ్వరాదులు గలరె ?
యదిగాక యప్పటికప్పటి కజుఁడు
మదనారిచేతను మడియుట వినరె ?

చనఁజన దక్షప్రజాపతి శిరముఁ
దునిమిననాఁడు వొందని బ్రహ్మహత్య
దనకూఁతుఁ గవయు పితామహుఁ ద్రుంచి
తనరిననాఁడు నొందని బ్రహ్మహత్య
యమర దక్షునియల్లుఁడగు చంద్రుఁ గాలఁ
జమరినఁ బొందంగఁజాలని హత్య
వనజజు తండ్రి విష్వక్సేనుఁ ద్రుంచి
తనరిననాఁడుఁ బొందని బ్రహ్మహత్య
గూడి బ్రాహ్మణులకు గురువైన యగ్గి
యేడుజిహ్వలఁ గోయ నెయిదనిహత్య
మునుల సాధుల మొత్తి మోపుగాఁ గట్టి
కనలి చంపఁగఁ బొందఁగాలేని హత్య
యనుపమంబైన బ్రహ్మాండసంఘములఁ
జను మహాబ్రహ్మల సద్బ్రాహ్మణులను
గోటానఁగోట్ల లలాటనేత్రాగ్నిఁ
బాటి మహాజగత్ప్రళయకాలమునఁ
జుఱవుచ్చి పేర్చి నిస్తుషము గావింపఁ
దఱిఁదఱి నాఁడుఁ బొందని బ్రహ్మహత్య
మించి చతుర్ముఖుమీఁదటిశిరముఁ
ద్రెంచినంతటన పొందెనె బ్రహ్మహత్య?

యంగహీనునిఁ జేసినంతన యెట్టు
లంగజారికి బ్రహ్మహత్య ప్రాపించె?
బ్రహ్మ నచ్చినఁగదా ప్రాపించు హత్య?
బ్రహ్మ సావక యెట్లు ప్రాపించు హత్య?
బ్రహ్మశిరోహరుఁ బాపనాశనుని
బ్రహ్మేశు భక్తితత్పరులు దర్శింప
ధర 'బ్రహ్మహత్యాయుతాని చ' యనఁగ
ధర బ్రహ్మహత్యలు దఱియు నామీఁద
శేషంబు నా విశేషించి 'దహ త్య-
శేషపాపాని' నాఁ జిరపాతకంబు
లా యజుశ్శ్రుతి 'యఘోరా పాపకాశి-
నీ' యన లింగసన్నిహితులఁ జూడ
బ్రహ్మహత్యాదులు వ్యాపింప వనఁగ
బ్రహ్మహత్య మహేశుఁ బ్రాపించు నెట్లు?
గాన కర్మంబు శ్రీ కంఠానుసారి
పూని తత్కర్మంబు బుద్ధ్యనుసారి
బుద్ధియు ననుసారి భువిఁ బ్రవర్తకుల
కిద్ధర నటుగాన యీశుండ కర్త.

కాలవాద నిరసనము

' మొదలఁ గాలాంతరంబునఁ జేసి కర్త

గదియుఁ గర్మం బట్లుగాన నీకింకఁ

గాలవాదిప, యెన్నఁగా నీమతంబు

గాలవశమ, పుణ్యకర్మసంభవముఁ

గాలవశమ, జగత్కర్త గాలంబుఁ

గాలవశమ, పాపకర్మ సంభవముఁ

గాలవశమ, కర్మగతఫలావాప్తి

గాలవశంబ, జగత్ప్రవర్తనముఁ

గాలవశమ, జగత్కార్యకారణముఁ

గాలవశంబ, జగత్సముత్పత్తి

గాలవశంబ, జగద్వర్తనంబుఁ

గాలవశంబ, జగత్ప్రలయంబుఁ

గాలవశమ, రాజికము దైవికంబుఁ

గాలవశమ, రవిగ్రహాణాదికములుఁ

గాలవశంబ, సుఖంబు దుఃఖంబుఁ

గాలవశమ, సిరికల్మియు లేమి

గాలవశమ, త్రుటిక్షణమాత్ర సంఖ్య

గాలవశంబ, లగ్నము ముహూర్తంబుఁ

౧. యది.

గాలవశము, నవగ్రహబలాదులును
గాలవశంబ, నక్షత్ర¹చారంబుఁ
గాలవశము, యోగకరణముల్ దలఁపఁ
గాలవశము, సర్వకాల²వేళలును
గాలవశంబ, స్వర్గము నరకంబుఁ
గాలవశంబ, మోక్షంబు బంధంబుఁ
గాలవశముగానికార్యంబు గలుగ
దేలోకమున' ననియెదవేని వినుము—
చలితం బనిత్య మచైతన్య మచిర
మిల నిర్గుణంబు నిష్ఫల మశరీరి
క్షణభంగురంబు దత్కాలంబునకును
గణుతింపఁగా నాదికర్తృత్వ మెద్ది?
తిరుగఁగఁ గుమ్మరి త్రిప్పంగ సారె
తిరుగునో తనయంతఁ దిరుగునో ధరణిఁ?
దిరుగనియీశుండు త్రిప్పఁ గాలంబు
దిరుగునో తనయంతఁ దిరుగునో, మఱియు
నాధారశక్తి నిజాజ్ఞాప్రవర్తి
నాధారశిలయుఁగా నటక్రింద నునిచి
కదలనిమేరువుఁ గంబంబుఁ జేసి

---

౧. చయంబు. ౨. వేదములు.

కదియంగఁ గాలచక్రంబుఁ గీలించి
ఖరకరు నందంబుగాఁ జేతఁ బట్టి
తిరుగకఁ ద్రిప్పెడు దేవుఁ డుండంగఁ
జను జీవఘటకర్మచక్ర సూర్యేందు
వినుత బలీవర్ద విభ్రమణమునఁ
గూడంగ భవములంగొరలు [1]రావటన
మాడించుకర్త విశ్వాధికుఁ డుండ
హరి[2]విరించ్యాది సురా[3]సురనికర
పరికల్పితాయుష్యపరిమితి రాశిఁ
దాడిఁ దాడి [4] విధియను తూమునఁ గొలువఁ
గడు నేర్చు లోకైకకర్త యీశ్వరుఁడు
హరుఁడు గాలాతీతుఁ డభవుండు మోక్ష-
[5]కరుఁడు మహాకాలకాలుఁ డక్షరుఁడు
[6]గాలాత్మకుం డతికాలుఁడు నిత్య-
కాలస్వరూపుండు గాలవశుండు
గాలచైతన్యుఁడు గాలాశ్రయుండు
గాలగళుం డుండఁ గాలంబునకును
హరుని యాజ్ఞాశక్తి యనుటయుఁ గాక

౧ రావటమునా. ౨ విరించాది. ౩ సురానీక. ౪ దివి; విరి.
౫ కరుఁడును శ్రీ మహా. ౬ గాలాంత.

పరమకర్తృకమెద్ది వరికించిచూడ ?
శ్రుతులు 'శతాయుగిపురుష' యనఁ గాల-
గతిమీఱి [1]నడచిన గణముల వినరె ?
కాలారికరుణ మార్కండేయుఁ డాదిఁ
గాలమృత్యువుఁ గెల్వఁడే లోక మెఱుఁగ ?
[2]మఱియును సకలేశుమాదిరాజయ్య
మెఱయఁడె కాలంబుమీఱి ? వెండియును
బాలుపైఁ గృప నొక్క భక్తుని విగత-
కాలుఁ గా మనుపఁడే కడఁగి మాదరసు ?
ముసిఁడిచౌఁడయ్య మున్నొక్కి కనకన్య
మసలి కాలమునూఁకి మనుపఁడె ? మఱియు,
మొసలి మ్రింగుడుఁ గాలమున [3]కొఱగట్టి
పసిబాలు మనుపఁడే పరగ నంబెన్న ?
మొదల శల్యములైన ముదిత మన్పండె
పిదపఁ గాలమునూఁకి పిల్లనై నారు ?
తిలి విమానము నూఁకి సుతు మనుపండె
యతికాలుఁ[4]డై రక్కసయ్య దా ? మఱియుఁ,
గాలంబుమీఱిన గణములు [5]గలరు,
గాలవరచకులైన గణములు [5]గలరు,

---

౧. నిలిచి; ౨. ఖుటి. సకలేశ్వరు. ౩. కొరగంటి; కొరగొని, ౪. దైనకకట్టయ్య. ౫. గలవు.

గావుఁగాలంబు గర్త యేనియును
భావించి తనయిచ్చఁ బఱపంగవలదె?
పాన లేమిటికి 'లుంపంతి దైవలిఖి-
తాని' నాఁ గాలస్వతంత్రంబు నెద్ది?
యలరుచు ముప్పదియాఱుదత్త్వముల
వెలుపల లోపల వెలుఁగు శివాజ్ఞ
యం దొక్క తత్త్వమై యలరుకాలమున
కెందును గర్తృత్వ [1]మెట్లు సిద్ధించుఁ?
గాలం బనాది నిష్కళతత్త్వ మనుట
గాలవశంబు లోకంబెల్ల ననుట
వలనుగా దిది గాలవాది యన్మాట;
దెలియ వేదాంతవాదివో, కాన మఱియు,
నాదివై యిట్టి [2]మాయామతంబైన
వేదాంతమార్గంబు వినుము వేదాంతి!

వేదాంతమతనిరసనము

యది యెట్టులనిన వేదాంత [3]మార్గంబు
హృదయనిశ్చయము నీ వెఱుఁగక భ్రమసి
పనటమై 'జీవ శ్శివ శ్శివో జీవ'
యనియెదే? శివు నవిద్యా [4]బద్ధుఁ జేసి

---

౧ పేల. ౨ మాయాంతరంబైన. 3 శాస్త్రంబు. ౪. బుద్ధి.

తా 'నహ మేవ పశూనా మధిపతి'
నా నట్లు 'రుద్రశ్చ పశూనా మధిపతి'
యనఁగఁ 'బశుపతయేచ నమో' యనంగ
మును 'పశుపతయే నమోనమ' యనఁగఁ
బరగ 'బ్రహ్మాదయశ్చ పశవో' యనంగ
ధరఁ బశుపతి యెట్లు దాఁ బశువగును ?
అంత మాధవవిరించ్యాది పిపీలి-
కాంత పశువులకు నధిపతి శివుఁడు;
భావింప జీవులు పశువులు; ప్రకృతి
యావృతంబగు పాశ; మట్లు కెంటికిని
బతి [1]రుద్రుఁడన్ శ్రుతి ప్రత్యయం బునికిఁ
బతి రుద్రుఁ డితరులు పశువులు గాన
గోపతిచేతఁ బాశోపేతమైన
యాపశువులయట్ల యవికలజీవు
లాశావిరహితులై యీశునియంద
పాశమోక్షమునొందు[2]బంధము ల్వాసి ;
పశువులు పశువుల బంధింప విడువఁ
గుశలులే పశుపతి కుశలుండుగాక ?
శివుఁడు దా నధిపతి జీవరాసులకు

---

1 శివు. 2 పదములు.

భవపాశముల చేత బంధింప విడువఁ
[1]బశువులు పతికిని వశవర్తు లెందు ;
వశవర్తులే యెందుఁ బశువు లన్యులకు ?
వావిరి సుఖదుఃఖవార్ధినిమగ్న-
జీవరాసులు [2]సదాశివు దయానూన-
సంపద ముఖ్యులై సాలోక్యముఖ్య
సంపూర్ణపదముల సరి వెలుంగుచును
స్థిరపశుపాశపతిజ్ఞానముఖ్య
సరణియె భవవార్ధిఁ [3]దరియించు తెప్ప,
యెఱుఁగంగఁబడువస్తు, వెఱఁగెడితాను,
నెఱుకయు, నను మూఁడుదెఱఁగులు భువిని
బరగి యబాధితప్రత్యయ మగుచు
నరయ నానాగతి నవగతం బగుట
హస్తామలక మెట్టు లట్టులు సుప్ర-
శస్త జగద్భేదసరణి సిద్ధముగఁ
దమకించి మఱి యభేదముఁ బల్కఁ జనునె ?
ప్రమితిపండిత మభేద మదర్శనంబు
భేదంబు సకలదృష్టాదృష్టమత ని-
పాదిత వైదికపథ దర్శనప్ర-

---

౧. వశవర్తులటుగానపశువులుపతికి. ౨. పరా. ౩.దరిఁజేర్పు తేప.

భావ సంపాదన ప్రతిభ గల్గుటను
గావున భేదసంగతి సిద్ధమగుడుఁ
జెనసి [1]విభేదకసిద్ధి దాఁగలుగుఁ;
బెనుపారఁగాఁ దద్విభేదకసిద్ధి
గతిఁ బడి వేదోక్తకర్మంబులందు
రతిఁ దత్ఫలప్రదారాధ్యసంగతిని
నటుగాన నారాధ్యుఁడైన యీశ్వరునిఁ
బటుభక్తియుక్తిఁ [2]దప్పక భజియింప
నాపోవ స్వర్గమోక్షాదిసౌఖ్యములు
ప్రాపించుఁ గర్మాదిరూపంబు కొలఁది
నిది, వేదశాస్త్రవిహితమహాతత్త్వ-
విదితమార్గం బుండ విభ్రాంతు లేల ?
ప్రత్యక్షమై జగద్భావభేదంబు
సత్యమై తోఁపఁ దచ్ఛద్ధంబునంద
ప్రత్యక్షబాధ సొప్పడు ననునతఁడు
నత్యనుచితవృత్తి నద్వైతమతి న-
నాదిప్రపంచమిథ్యాత్వంబుఁ జెప్ప-
వాది [3]దదీయభావం బెర్గలేక,
యరయ మిథ్యాత్వ మనాశ్రయం బెట్లు

---

౧. భేదకసిద్ధిచేత. ౨. దప్పి. ౩. దదియ్యు.

పరచింపఁ దలపోయు దురభిమానమునఁ
బ్రీతి మానముచే గృహీతంబు గాని
యాతత్త్వ మెఱుఁగంగ నతిదుర్ఘటంబు,
మానగృహీతంబు దాను దథ్యంబు
గాన యెందును మిథ్య గానేర దెట్లు
వృత్తి నుత్తరశుక్తి విజ్ఞానపదవి
వృత్తిమైఁ జనుశుక్తి వెండియుఁ బోలె
నడరు జగద్భేదమనుచు నద్వైతి
యడరంగఁ దా నెన్నఁ డంద్రు దుర్గతిని;
నెక్కాని నిర్వాచనీయంబు లేక
నిక్క మనిర్వాచనీయంబు గలదె?
నిర్వాచనీయ మనిర్వాచనీయ
మర్వి నా నద్వైత మొగి రెంటికగునె?
కావున శివుఁడ తా జీవుఁ డన్ పలుకు
భావింప నైక్య సంపాదకమగునె?
౧శివవశభృత్యుండు జీవుండు గాన
భువి వేఱుగాదనఁ బొందగుఁగాక
భవబంధమోక్షానుపాదితావస్థ
లవి గల్గు జీవుఁడు ౨శివుఁ డనఁదగునె?

---

౧ శివుపశుభక్తుండు. ౨ శివుఁడు దానగునె.

పరమేశునకు జీవపంక్తికి భేదు-
పరమాణుసంగతాంతరము దోపంగ
దనకంటె నీశుండు దా లేఁడు వేఱ
యనువాఁడకాఁడె లోకాయతుఁ డనఁగఁ?
దానచూ యీశుండు దన్నెఱ్గఁ జాలఁ
గాని యజ్ఞానసంగతి నను వాది
జ్ఞానస్వరూపుఁ డీశ్వరుఁ డయ్యె నేనిఁ
దానెద్ది? యజ్ఞానతమ మనవలదె?
వెలయఁ జీకటిలోన [1]వెలయుదుగాని
కలదు దీపం బనఁగా నెట్లువచ్చు?
మాతయు మేయంబు మానంౘు మిథ్య
ఖ్యాతిగా ననుటయ ప్రామాణ్యపథము;
ఆత్మ నా జగదుదయముఁ జెప్పచుండ
నాత్మ నిరాకారుఁ డన నెట్లువచ్చు?
నతుల సచ్చిత్కరుణానంద సర్వ-
గత [2]నిత్య నిజ నిరాకారుఁ డీశ్వరుఁడు
ననుచుఁ దా రద్వైతులట్ల కారణముఁ
జెనసి కల్పింతురు శివున కఽవిద్య
గలఽనఁగా నోపకయును లేదనియుఁ

---

౧ వెలుఁగదు. ౨. భవ్య.

బలుక నేరక మూకబధిరుల క్రియను,
బరగు భువనభిన్న భావంబుఁ జూచి
యరయ నద్వైతుల మనఁగఁ "దావెద్ది?
శర్వా నధీనంబు సర్వంబుఁ గాన
సర్వేశు సగుణ విచారితవృత్తి
సర్వంబు శివుఁడను శబ్దిమాద్యోక్తి
నిర్వాహ మొందంగ నేరుచుఁగాక
సర్వేశు నైశ్వర్య సన్నుతాద్వైత
మర్వి సర్వాద్వైతయుక్తికిఁ జనునె?
మానిసి దైవంబుగా నెట్లు నేర్చుఁ?
దా నెట్లు దైవంబు మానిసి యగును?
దన్నెఱింగిన యీశుదాసి నన్ గాక
తన్నెఱింగినఁ దాన దైవంబ యగునె?
కావున మాయానుగతమైన యట్టి
నీ వేడవాదముల్ నిలుపు వేదాంతి!
స్వామిభృత్యస్థితి శంభునిఁ గొలువ
కేమార్గమున ఫలియింపదు ముక్తి;
యన్యాయతరము హాస్యైకకారణము
శూన్యానుకూలంబు సుజనదూష్యంబు

---

౧. తావేది. ౨. మార్యో.

గర్వాంధవృత్తి సత్కర్మేతరంబు
సర్వప్రమాణ విచారదూరంబు
నాచ్ఛాదితజ్ఞాన తుచ్ఛమార్గమ్ము
ప్రచ్ఛన్నబౌద్ధంబు పరమనాస్తికము
నద్వైతమైన మాయావాదమతము
విద్వద్విరుద్ధంబు వేదాంతమగునె ?
మొదల నీ వేదాంతమున కభిప్రాయ
మిదమిత్థమని [1]నిశ్చయింపక సకల
వేదాంత విషయవివేకంబు నీకు
లేదు గించిత్సాంఖ్యవాదివో కాని,

సాంఖ్యవాద నిరసనము

కాదేని నీ సాంఖ్యవాదైకమత ని-
పాదనంబగు పూర్వపక్షంబు వినుము—
వికృతంబు జడ మసంవిత్తు దా ననుచుఁ
బ్రకృతివాదంబుఁ జెంపక ప్రధానంబు
జగదాది రాజస సాత్త్విక తామ-
స గుణ సామ్యావస్థ సంవిత్స్వరూప,
మదియును నితరగుణానుగృహీత
మొదవ నేకైకగుణోద్రేకమునను

---

౧. నిశ్చయింపంగలేక.

సకల ప్రపంచంబు జనియించు ననుచుఁ
బ్రకటించి నీయుక్తిఁ బలికెదు, వినుము—
ఒక్కొక్క గుణ మట్టు లెక్కు నేనియుఁ
జక్కనఁ జెడు గుణసామ్యంబు గాన
లేదు ప్రధానంబు, గాదు ప్రపంచ
మాదట దానిచే, నట్లునుఁ గాక
యరయ జగద్రూపమై ప్రధానంబు
పరిణమించినచోటఁ బ్రాదేశికతను
బరిణమించున యేని ధర నశ్వరంబు
నరయ సావయవకార్యంబులై వచ్చుఁ
గాన జగత్సృష్టి దానిచే మున్ను
గానేర, దట్లుఁ గాకయుఁ బ్రధానంబు
పరిపూర్ణరూపమై ప్రమితికి మిగిలి
పరిణమించునయేని భావించి చూడ
నదియును నేకకార్యత్వ ప్రసంగ
మొదవుట సృష్టిగా దుభయంబునందుఁ
గడఁగి యతీత జగత్ప్రలయములఁ
జెడిపోవ వర్తించు సృష్టియుఁ గలదె?
పరమాత్మ పరమేశ భవ పరబ్రహ్మ
హర శివ లింగ మహాదేవ నామ—

యుత దివ్య మూలప్రకృతిసముద్భూత
కృతతంత్ర మాయాప్రకృతి జాతమగుచుఁ,
ద్రిగుణసమన్వితం బగుచుఁ, బ్రధాన
మగుచుఁ, గళాత్మకంబగుచు, నా ప్రకృతి
యవ్యక్త మది పురుషాధిష్ఠితంబు,
దివ్యుండు శివుఁడు, దక్షియాజ్ఞఁ జేసి
క్రాలుచుఁ జేయు లోకంబుల నాఁగఁ
బోలఁగుఁగాక విభుత్వ మున్నదియె?
నరి నచేతనమటె, జడమటె, సృష్టి
ధరఁ జేయనేర్చునే తనయంతఁ బ్రకృతి?
కావున దైవంబుగాదు దత్ ప్రకృతి,
దా విముక్తిప్రదాతయుఁ గాదు, గాన
ప్రకృతివాద ప్రతిపాదనులైన
వికృతితార్కికుల దుర్వృత్తి సత్పథమె?
హరుఁడు లేఁడను నిరీశ్వరసాంఖ్యమతము
వరతత్త్వ బోధానుపాదితంబగునె?
యపవర్గ మంతన యమ్యో నేనియును
జపతపోధ్యానాది సత్క్రియ లేల?
మును గపిలుండను మునిముఖ్యు మతము
మును లెఱుంగరె? మోక్షమున కదియగునె?

శుక వామదేవ సనక సనందనులు
సకలామరులుఁ దొల్లి సాంఖ్యసమ్మతులె ?
సేశ్వరసాంఖ్య నిరీశ్వరసాంఖ్య
నీశ్వరోక్తికిఁ బ్రమాణముఁ జూపఁగలవె ?
భువి ననుమానాది భూరిప్రమాణ
నివహంబులం దెద్ది నీకుఁ గారణము ?
నీ కారణంబుల నీ ప్రమాణముల
నే కానగు జగదీశ్వరత్వంబు
నిట నగ్ని లేకయు నెగయదు బొప్ప
మటు నగాగ్రంబున నది వొగ గాదె ?
కలదు ధూమము మీఁదఁ గలుగంగ నగ్ని
గలుగుఁ గ్రిందట ననఁగా నెట్లు వచ్చు ?
వెలయు జగంబులు గలుగంగ నెట్లు
గలఁ డీశ్వరుం డనఁగా వచ్చుననుచు
మహి ననుమాన ప్రమాణంబు నూఁకి
బహుమతంబులఁ బన్ని పలికెదేనియును,
నలరు బొప్పంబు దా నప్రసిద్ధంబు
గలుగునేనియును దాఁ గాదు ధూమంబు
వరగుధూమం బట్లు బొప్పంబువరల
నరయ బొప్పమకాక యది ధూమమగునె ?

జలముల గ్లెండమావులం దోలఁ దోఁప
జలములే యెండమావులుగాక యవియు ?
నొక్కనిపోల్కి వే ఱొక్కండు గలుగ
నొక్కచందము కాక యొకఁడె యిర్వురును ?
గిరితుద ధూమంబు క్రియఁ దోఁచు బాష్ప
మరయంగ ధూమమే? యది ధూమమేని;
మును ధూమమునఁ బుట్టు ఘనమేఘవితతి
వానర బాష్పంబునఁ బుట్టంగఁగలదె ?
కాన; ధూమము మీఁదఁ గానంగఁ బడదు
దానెట్లు గల్గుఁ గ్రిందట నగ్ని ? యట్లు
గాన జగంబులు గలుగంగ శివుఁడు
ధా నెట్లు గలుగుఁ ? దథ్యంబు గావునను
మతి ననుమాన ప్రమాణంబు దత్త్వ-
గతికిఁ గారణ, మట్లుఁగాక వెండియును
బ్రణుతింప నాకాశగుణము శబ్దంబు
నాయాగమముల శబ్దాతీతసుమహా-
నీయతత్త్వం బెట్లు నేరుచు నెఱుఁగ
సాంగోక్తశ్రుతులఁ దా 'శత్యతిష్ఠద్ద-
శాంగులం' బనఁగాన యా శర్వుఁ డుండుఁ

గ. నయ్యా. శ. నియ్యా.

దన మహత్త్వముఁ దాన తవిలి రూపించి-
కొనఁడు దదాగమకోటులఁ; గాని
శివకృతంబగు శ్రుతినివహము ల్వారమ-
శివతత్త్వబోధకు లివి ప్రమాణములె ?
యనియెదేనియును, మాయాంధకారంబు
వినిహతంబుగఁ జేసి విను ముముక్షులకు
రమణ ననన్యశరణజనహృదయ-
కమలస్థుఁడగు తన్నుఁ [1]గాన్పింపు దయను
నవిచారితాగమ వివిధ దీపములు
శివుఁడు ము న్నాది సృజించుటఁ జేసి
మానితంబగు నాగమప్రమాణంబు
దా నూఁకఁబడదు దథ్యంబు; వెండియును
దివిరి యయ్యవి ధాత్రిఁ దృష్టమై తోఁచు
నవియెల్ల నష్టంబులను సూక్తి యునికిఁ
బ్రత్యక్షముగఁ జూడఁబడు హేతువులను
నిత్యంబు గామిని నిత్యాత్ముఁ గాన్ప
ననుబంధమగునె ప్రత్యక్ష ప్రమాణ
మనియెదేనియును, బ్రత్యక్షగోచరము
గాని ప్రమాణముల్ గలవె ? ప్రమాణ

---

౧. గాన్పించు.

హీనమైచను తత్త్వ మెందును గలదె ?
శ్రుతి 'సదా పశ్యంతి సూరయో' యనఁగఁ
బ్రతి 'సూరయో యత్ప్రపశ్యంతి' యనఁగఁ
జిత్రంబు "'వారణాసీ యథా' యనియు
ధాత్రి నిత్యములను సూత్రము లునికిఁ
దివిరి యెయ్యది ధాత్రి దృష్టమై తోఁచు
నవియెల్ల నష్టంబు లన నెట్లు వచ్చుఁ?
జెడియెడి రూపుల చెడుఁగాక, యెందుఁ
జెడని రూపంబులు సెడునె ? వెండియును,
జ్ఞానంబు ధ్యానంబు మానంబు నూఁత-
మై నివ్వటిలఁ దత్త్వ మతిమానసంబె ?
యదియును హేతుదృష్టాంత విరహిత-
పదమేని నెఱుక కుపాయ మున్నదియె ?
కడచన్న పసిఁడియుఁ గల్లెయుఁ దూఁచు-
నెడ సువర్ణాంతరం బెఱుఁగరాకున్నె ?
యెప్పాట మెట్టున కేసినకోల
దప్పునే ? కోల భూధర సమానంబె ?
యడరు తత్త్వము దన యాత్మకు నెందుఁ
బడినేయు శబ్దంబు పాడిగా దెట్లు ;

---

౧. వారాణసీ.

హేత్వంతరము లాద్యు లెన్నరే పరమ-
తత్త్వరూపిత వివిధ ప్రమాణముల?
నట్టిదకాక ప్రత్యక్షప్రమాణ
మెట్లు ద్రోయఁగవచ్చు నెవ్వారికైనఁ?
గాన యీశుఁడు గర్తగాఁ డను పలుకు
లో నిరీశ్వరసాంఖ్య యుడుగు;– వెండియును,

యోగవాద నిరసనము

నాది మీ కపిలోక్తమగు యోగమైన
నాదరణీయమే యాద్యులమతికి ?
నిత్య నిరంజన నిజ శుద్ధ బుద్ధ
సత్య సనాతన సచ్చిదానంద
సగుణకళాతీత సర్వజ్ఞ శాంత
విగత దేహేంద్రియ విమలాత్మమూర్తి
యయ్యు 'నణోరణీయాన్ మహతో మ-
హీయా' ననంగ మహేశుండు శివుఁడు
నానాత్మకంబయి తా నాచరించుఁ
గాన యేకాత్మానుగతము లోకంబు,
నాది యంతముఁ దానయగు పరిపూర్ణుఁ
బ్రాదేశికుండని పలుకంగఁ దగునె?
యనియెదేనియు నిర్మలాత్మకుం డెట్లు

దనువిడ్చి దుర్మలాత్మకులలోఁ గలిసె ?
విగత దేహేంద్రియ విషయాత్ముఁ డెట్లు
దగిలి దేహేంద్రియాత్మకులలోఁ గలిసెఁ
ద్రిగుణరహితుఁడగు దివ్యాత్ముఁ డెట్లు
ద్రిగుణాత్మకులలోన దీపింపఁబడియె ?
సచ్చిదానందభాస్వరుఁ డెట్లు ధూర్త-
సచ్చిదానందుల సంగతిఁ గలసె ?
శుద్ధాత్ముఁ డెట్టు లశుద్ధాత్ముఁ డయ్యె ?
బుద్ధాత్ముఁ డెట్టు లబుద్ధుఁడై చనియె ?
నిత్యాత్మకుం డె ట్లనిత్యులఁ గలసె ?
సత్యాత్మకుం డె ట్లసత్యులఁ బెరసె ?
శాశ్వతుం డెట్టు లశాశ్వతుం డయ్యె?
నీశ్వరుం డెట్టు లనీశ్వరుం డయ్యె ?
నఖిలజీవులుఁ దానయై యాత్మ యెట్లు
సుఖదుఃఖములకు విశ్రుతి గుఱియయ్యెఁ?
జావుఁబుట్టువు లేని సర్వేశుఁ డెట్లు
సావుఁ బుట్టువుఁ గల జీవుఁడై పరగె?
నర్థి 'నణోరణీయా' నను నిష్ఠి-
తార్థంబు సాధారణార్థమై మూడఁ
దవిలి యీశ్వరుని చైతన్యంబ కాక

శివుఁ డుండునే కూడి జీవుల నెల్లఁ ?
బూని బొమ్మలవాఁడు బొమ్మలలోనఁ
దా నుండు నెట్లు సూత్రమయుండుఁగాక ?
పుడమి జీవులఁగూడి పుట్టునె, యట్ల
మడియునె, పుట్టఁడు మడియఁ డీశ్వరుఁడు;
జలకుంభకోటుల వెలుఁగు చంద్రునకు
జలకుంభములు వడఁ గలుగునె పాట్లు?
ఘటములలోన సంగమమగు బయలు
ఘటములు భిన్నంబుగా భిన్నమగునె ?
ముకురంబులను దోచు మూర్తి దదీయ
ముకురప్రభలు సెడ్డ మూర్తియుఁ జెడునె?
యవికలభూతాత్ముఁడైన యీశ్వరుఁడు
శివుఁడు సర్వముఁ జెడఁ జెడునె యెందేని ?
జలములు గాడ్పుచేఁ జలియింప లోనఁ
జలియించు శశియట్లు సర్వేశ్వరుండు
[1]మలువక బహుజన్మ[2]మరణదుఃఖములఁ
జలియించు [3]మతులలోఁ జలియించు నెట్లు?
జీవునిఁ బొందు నానావస్థ లెల్ల
భావింప శివునకుఁ బ్రాప్తవ్యమగునె?

---

౧. మలుగక. ౨. మథన. ౩. మతులతో.

కావున జీవులఁ గలయండు శివుఁడు,
జీవులు జీవుల, శివుఁడును శివుఁడ,
స్వామి యీశుఁడు భృత్యవర్గ మే మనిన
స్వామిభృత్యన్యాయ సత్క్రియారతుల
జ్ఞానదేహములను జలకుంభములను
జానొంద శివుఁడను శశి దోఁచుఁగాక
కలఁగిన జలములు గలఁగునె శశియుఁ?
గలఁగిన మనసులు గలఁగునె శివుఁడు?
మలినోదకంబులఁ బొలయఁడు శశియు,
మలినదేహములలోన [1]వెలుఁగఁడు శివుఁడు;
దర్పణం బనినయంతన చేసి మలిన-
దర్పణంబున మూర్తి దా నెట్లు దోఁచు?
మొదల 'జ్ఞానాదేవ మోక్ష'నా, మోక్ష-
పదము సిద్ధింపదు భక్తిహీనులకుఁ;
దా నృపతి జ్ఞానియైనయంతటన
వా[2]నిఁ బ్రోచునె కొలువని-నాఁడు నృపతి?
ధర గజశాస్త్రవేత్తల కెట్లు వచ్చు
నరయ గజాధిరోహణము సేయంగఁ?
గాన సర్వాద్వైతకల్పితజ్ఞాన

1. వెలయఁడు. 2. వాని.

మేనాఁట ముక్తికి హేతువే తలఁప?
నిలఁ గ్రొవ్వి యంతయు నీశుండ యనుట
విలసితజ్ఞానంబుకలిమికి ఫలమె?
యైనను శర్వుఁడ యఖిలభూతములు
నైనవాఁ డనియొ నీయాత్మలోఁ గంటి?
కన్న యంతన ముక్తి గలుగునె కొలువ-
కున్న? యెఱుకయుండ యోగి దా నగునె?
జ్ఞానవైరాగ్యనిష్ఠాసత్క్రియావి-
హీనమై చను యోగ మొందునుఁ గలదె?
యెడ యెఱుంగక క్రియ లెఱిఁగి యెఱింగి
యుడిగిన పతితుండు యోగవంతుండె?
నడిసన్న క్రియల కాశ్రయమగు తన్ను
నుడుగక సత్క్రియ లుడుగంగఁ దగునె?
యొడఁబడు సత్క్రియ లుడిగి దుర్విషయ-
ముడుగని పతితుండు యోగ¹యుక్తుండె?
రాగాంధుఁ డధికదుర్నయుఁడు నాస్తికుఁడు
యోగియే ముక్తివియోగిగాకతఁడు?
తన్నెఱుంగఁడు శివు మున్నెర్గ యోగి!
తన్నెఱింగిన యోగి మున్నెర్గఁ డీశు!

---

౧. వంతుండె.

కావున జీవులఁ గలయుండు శివుఁడు,
జీవులు జీవుల, శివుఁడును శివుఁడ,
స్వామి యీశుఁడు భృత్యవర్గ మే మనిన
స్వామిభృత్యన్యాయ సత్క్రియారతుల
జ్ఞానదేహములను జలకుంభములను
జానొంద శివుఁడను శశి దోఁచుఁగాక
కలఁగిన జలములు గలఁగునె శశియుఁ?
గలఁగిన మనసులు గలఁగునె శివుఁడు?
మలినోదకంబులఁ బొలయుఁడు శశియు,
మలినదేహములలోన [౧]వెలుఁగఁడు శివుఁడు;
దర్పణం బనినయంతన చేసి మలిన-
దర్పణంబున మూర్తి దా నెట్లు దోఁచు?
మొదల 'జ్ఞానాదేవ మోక్ష'నా, మోక్ష-
పదము సిద్ధింపదు భక్తిహీనులకుఁ;
దా నృపతి జ్ఞానియైనయంతటన
వానిఁ బ్రోచునె కొలువని[౨]నాఁడు నృపతి?
ధర గజశాస్త్రవేత్తల కెట్లు వచ్చు
నరయ గజాధిరోహణము సేయంగఁ?
గాన సర్వాద్వైతకల్పితజ్ఞాన

౧. వెలయుఁడు. ౨. వాని.

మేనాఁట ముక్తికి హేతువే తలఁప?
నిలఁ గ్రొవ్వి యంతయు నీశుండ యనుట
విలసితజ్ఞానంబుకలిమికి ఫలమె?
యైనను శర్వుఁడ యఖిలభూతములు
నైనవాఁ డనియె నీయాత్మలోఁ గంటె?
కన్నయంతన ముక్తి గలుగునె కొలువ-
కున్న? యెఱుకయుండ యోగి దా నగునె?
జ్ఞానవైరాగ్యనిష్ఠాసత్క్రియావి-
హీనమై చను యోగ మొందునుఁ గలదె?
యెడ యెఱుంగక క్రియ లెఱిఁగి యెఱింగి
యుడిగిన పతితుండు యోగవంతుండె?
సడిసన్నక్రియల కాశ్రయమగు తన్ను
నుడుగక సత్క్రియ లుడుగంగఁ దగునె?
యొడఁబడు సత్క్రియ లుడిగి దుర్విషయ-
ముడుగని పతితుండు యోగ[1]యుక్తుండె?
రాగాంధుఁ డధికదుర్నయుఁడు నాస్తికుఁడు
యోగియే ముక్తివియోగిగా కతఁడు?
తన్నెఱుంగఁడు శివు మున్నెఱ్గుయోగి!
తన్నెఱింగినయోగి మున్నెఱ్గఁ డీశు!

---

౧. వంతుండె.

జ్ఞానాత్ముఁడై సమస్తంబును విడిచి
మానక తన్నెర్గ మఱచునంతకును,
నానావిషయభావనా¹ భ్రాంతి విడిచి
మానక తన్నెర్గ మఱచునంతకును,
నైనను గర్వాభిమానంబు లుడిగి
మానక తన్నెర్గ మఱచునంతకును,
బూని శివైక్య సౌఖ్యానంద²నిరతి
మానక తన్నెర్గ మఱచునంతకును,
సంతతక్రియలు నిజక్రీడ లుడుగు
నంతకు నుడిగిన నంతకుఁ డలుగుఁ
గాన, క్రియాఫలాకాంక్షఁ బోవిడిచి
జానొందఁ గ్రియలమైఁ జరియింపఁడేని
నవిరళ నిరతిశయంబగు పరమ-
శివయోగసంపద సిద్ధించు నెట్లు?
ప్రకటితాహంకారపరుఁడగు యోగి
సుకృత దుష్కృతకర్మ సూదనుం డగునె?
యధిక దుర్విషయాత్ముఁ డగునట్టి యోగి
విధినిషేధక్రియా విరహితుఁ డగునె?
క్రచ్చఱ సుఖదుఃఖగతుఁడగు యోగి

౧. భ్రాంతు లుడిగి. ౨. నియతి.

సచ్చిదానంద ప్రసన్నాత్ముఁ డగునె?
శివభక్తియుక్తి వర్జితుఁడగు యోగి
భవపాశములఁ ద్రెంప బలవంతుఁ డగునె?
కాలపాశావృతగతుఁడగు యోగి
గాలమృత్యువుఁ గెల్వఁగా ధీరుఁ డగునె?
భవరోగదుఃఖానుభవుఁడగు యోగి
శివయోగసుఖసమంచితపుణ్యుఁ డగునె?
రాగాదిదుర్గుణరాశి వసించి
యోగి దా ననుట దురుక్తంబ కాదె?
కావున సాంఖ్యయోగభ్రాంతి వదలి
నీవ దైవమ వను నిర్గుణసాంఖ్య!
నీకును నల్ల చార్వాకవాదికి వి-
వేకింపఁగా లేదు వేఱు భేదంబు
గావున నీ వింకఁ గావు సాంఖ్యుఁడవు
వావిరిఁ జార్వాకవాదివి గాని

చార్వాకవాదనిరసనము

వేదవిరుద్ధమై వెలయు చార్వాక
వాది! నీతర్కసంపాదన వినుము—
దేహంబ యాత్మగా నూహింప వేఱ
దేహంబులో నాత్మ దెల్లి మున్నదియె?

తనువునం దొకచోటఁ దఱిగి చూచినను
దనువులో వేఱ తోఁచునె యాత్మరూప ?
మేను నల్లనివాఁడ నెఱ్ఱనివాఁడ
నే నిడ్డవాఁడను నేఁ గుర్చవాఁడ
ననునెడ నొడలికి నాత్మకొక్కంత-
యును భేద మారయ నున్నదె చూడ ?
నొగి భూజలాగ్నివాయుప్రభూతంబు-
లగు చతుర్విధపరమాణువ్ర లొడలు ;
నయ్యెడ ల్మఱి భస్మమైనను బుట్ట
దెయ్యెడ, నటుగాన యిలఁ జావు ముక్తి
గానవచ్చిన యవి గలవు దథ్యంబు,
గానంగరానివి గలుగ వెయ్యెడలఁ;
గరము సుఖంబు స్వర్గంబు, దుఃఖంబు
నరకంబు, మఱి లేదు వరలోక మనఁగఁ,
[1]బ్రాపించు మఱి పుణ్యలోకము ల్లేవు,
నేపార నిజ్జగం బింతయు మిథ్య,
గావున నుత్పత్తికర్తయు లేఁడు,
ననిమెదేనియు విను మాగమ విబుధ-
జనవిరుద్ధుఁడవగు చార్వాకవాది !

---

[1]. బ్రాపించనగు.

జడములై యుండవే సమసుప్తతనువు
లొడలఁ దా నాత్మమై యుండు నేనియును
మృతశరీరంబు నిద్రించు శరీర-
గతి కంతరం బెన్నఁ గలుగు నేనియును
సంగంబు విడిచి యయ్యాత్మ యొండొండు
భంగిఁ బిశాచమై బలి వేడఁ జనునె?
చను, నట్టి నిర్దేహజంతువుల్ గలుగు
ననియెదే? తా హరిహరభట్ట నల్ల-
రావి నుండుదు బ్రహ్మరాక్షసప్రకృతి
నీ వెలుమని బట్టి యేఁపుచున్నాఁడ
నాది యిట్టిద యని యతనిపై నూఁది
వేదంబుఁ జదువఁడె? వేఁడఁడె [1]భుక్తి?
నటుగాన దేహంబ యాత్మ యౌనేని
నిట యెట్లు సరియించు నిల నొడ ల్పమయ?
నొడలు విడువకున్న నొడలితో నాత్మ
యొడఁబడ నిద్రించియుండియు వేఱ
చన్న జాగ్రత్త్వంబు స్వప్నంబు నెఱుఁగు-
చున్నది యాత్మయె యొడలా వీక్షింప
సందడి నయ్యాత్మ జాగ్రత్క్రియాదు

౧. బుత్తి; భక్తి.

లందును స్వప్నక్రియాదులయందు
నలరి నిమిత్తంబులైన కర్మములు
దలమెత్తఁ దత్కర్మఫలకాంక్షనున్న
భూతసూక్ష్మంబులచేత నారబ్ధ
మై తనరెడు నొడళ్లంద వ్యాపించి
ఘనకర్మఫలము లాకాంక్ష భోగింపఁ
దనుఁ బొందు నాయాసజనిత విశ్రాంతి
మానంబు ప్రాపింప మసలు సుషుప్తి
దానిట్లు వరలోకయానవర్తనము
నాత్మయు నొడలు వేఱై యుండియుండ
దాత్మచేతను వ్యాప్తమైన దేహంబు
చెలియించునట్లు దోఁచియు శరీరంబు
జెలియింప దాత్మయ చెలియించుఁగాని;
యగ్నిచేతను వ్యాప్తమగు [1]మడ్డుఁగాల్ప
నగ్నియో యినుమొ దాహకమైన యదియుఁ?
దా నటులయ్యు నాత్మ ప్రజ్వలితము
లైన తద్దేహేంద్రియము లాత్మశక్తిఁ
గార్యాక్షమములగుఁగాని తా నవియుఁ
గార్యక్షమంబులు గానేర వెట్లు

---

౧. గుండు.

నినుమును నగ్నియు నెనసినట్లున్న
నిను మగ్నిగా, దగ్ని యినుమునుగాద;
యాత్మయు దేహంబు నటుగూడియున్న
నాత్మ దేహంబుగా, దాత్మగా దొడలు;
గాన దేహంబునకంటెను వేఱ
తా నాత్మ యది సుప్రసిద్ధం, బట్లకాక
ఘటపటాదులు వేఱ కనియుండునాఁడు
ఘటపటాదులకంటెఁ గలుగఁడె యొకఁడు?
తను విట్టిదని వేఱ కనియెడు నాత్మ
దనువునకంటెను దా వేఱకాన
యాత్మయు నాత్మ, దేహంబును దేహ,
మాత్మయు నొడలు వేఱై యట్టులునికి
గలుగఁ దా నుత్పత్తికర్తయు నొక్కఁ
డలరు; నొకనిచే నిఖిలాండములును
వానితోఁ బుట్టు జీవంబులవలనఁ
బూని నానామతంబుల క్రియల్ దోఁచు,
బనుపడఁ బుణ్యపాపంబులు నంత
నని పొంద నరకంబు స్వర్గంబుఁ గలుగు
ననయంబు శివు మహదాజ్ఞాప్రసక్తిఁ
జనుఁ ద్రిజగత్ప్రపంచం, బట్లుగాన

కానరానివి గలుగవు నాఁగ రాదు
గానని మేరువుఁ గలుగును గాన,
యిహపరంబులుగల్గు నిదియ వేదోక్తి;
యహితచార్వాక మన్యాయమార్గంబు,
గలికాలకలుషసంగత హేతువట్లు
వలదు నీచార్వాకవాదంబు లుడుగు;
గర్వాంధుఁడవు, వాపగతుఁడ, వట్లయ్యుఁ
జార్వాకవాది వసద్వాదరతుఁడ!
పాత్రేతరుండవు ప్రచ్ఛన్నపాంచ-
రాత్రవ్రతుండవన్ క్రమము దోఁచెడిని,
వేదోక్తసన్మార్గ విముఖ, మజాతి-
భేద, మాత్మేచ్ఛ మహాదేవనింద
లఘుతరంబైన కలత్రసామాన్య,
మఘమూలమగు విషయావిరోధతయు
ధర నీకుఁ బాంచరాత్రవ్రతాత్మునకు
సరియయియున్నది సరి, నట్లుఁగాక-

పాంచరాత్రవాదనిరసనము

యో పాంచరాత్రవ్రతోపాదితోప-
తాపితాత్ముఁడ! విను త్వద్వ్రతచర్య,-
నికృతాత్మ మాంతరాళికమనఁ జనుటఁ

ప్రకటితాగమవేదబాహ్యులై తనరు
నాదిఁ గర్మభ్రష్టులనుట నజాతి-
భేదదోషంబు నిపాదితం బగును;
అతులభవజ్వరావృతజల్పు లగుట
సతతంబు శివనింద సహజమైయుండు;
ననయంబు స్వేష్ట¹ దేవార్చనా వితతిఁ
దనరు స్వేచ్ఛాప్రవర్తనమ పాటిల్లు;
నతుల లజ్జాహీనులగుట దుష్టాను-
మతిని గలత్రసామాన్యత్వ మమరు;
జపతపోధ్యాన నిష్ఠాహీను లగుట
నుపమింప దుష్టేంద్రియోద్ధతి దొడరు;
నమయానుగతమగుచరిత మీచంద
మమర నందగుమోక్ష మదియు నట్టిదియ;
కావునఁ దద్వ్రతకర్తమైనట్టి
యావిష్ణుదైవత్వ మదియెట్లు వినుము;-
ఆది నీశ్వరుని వామాంగంబు చెమట
శ్రీదయితుఁడు జనించిన తద్విధంబు,
గ్రచ్ఛుల భృగుశాపగతిఁ బదిమార్లు
నచ్చుచుఁ బుట్టుచు జనియించువిధము,

---

౧. శివా.

నట్టి తిర్యగ్యోనులందు వసించి
ముట్టిన భవదుఃఖములఁ బొందువిధము,
శివమూర్తి సయ్యాయి యవతారములను
దవిలికొల్చుచు ధన్యతముఁడైన విధము,
నొడఁబడి బ్రహ్మకు నొకమాటఁ బుట్టి
యడరి యధోక్షజుఁ డన నున్నవిధము,
నదితి కింద్రానుజుం డనునట్లకాక
యుదయించి దైత్యుల కోడినవిధము,
వేయేల, మఱి బాదరాయణుఁ డనఁగ
బోయెతకడుపునఁ బుట్టినవిధము,
ధర దేవకికిఁ బుట్టి తాఁ గృష్ణుఁడనఁగఁ
బరగి పాండవులకుఁ బనిసేయు విధము,
ధాత్రి వెండియును దత్తాత్రేయుఁ డనఁగఁ
బుత్త్రుఁడై యత్రికిఁ బుట్టిన విధము,
దగిలి దైత్యారినాఁ బొగడించికొనుచు
నొగి జలంధరునకు నోడిన విధము,
శివుఁడు దద్దైత్యుఁ ద్రుంచిన చక్ర మాది-
భవమున శివుఁ గొల్చి పడసిన విధము,
నా చక్ర మది దున్నలై పోవఁగా ద-
ధీచికి నోడి యేతెంచిన విధము,

నుపమన్యు శిష్యుఁడై యదురాజమౌళి
నపరిమితప్రీతి నర్చించు విధము
భువిని వేయిటి కొక్కపువు గొదువైన
శివుఁ[1]గన్నువుచ్చి పూజించిన విధము,
నవిరళభక్తిఁ జక్రార్థియై మఱియు
భవుఁగొల్చి చక్రంబుఁ బడసిన విధము,
మృదు మేషమై తాల్చి మెప్పించి యొక్క
కొడుకు సాంబుండనఁ బడసిన విధముఁ,
దనరి దూర్వాసుండు దన్నినచోట
ముసు మచ్చయై వక్షముననున్న విధము,
ధట్టుఁడై రుక్మిణిం దన్నును బండిఁ
గట్టి యాతఁడు ద్రోలఁగాఁ బాఱు విధము,
యతని యుచ్ఛిష్టపాయస లేపనమున
నతత దివ్యాంగుఁడై చరియించు విధము,
వాఁయనం బఱకాలఁ బూయనిచోటఁ
బోయబాణము దాఁకి పొలిసినవిధము,
బంభద్రుఁ డటమున్న పాసి యొక్కండ
మలుమల మఱుఁగుచు మడిసినవిధము,
మునులశాపాహతి ముసలంబుచేత

1. దనకంట నర్చించిన విధము.

ఘనముగఁ దన కులక్షయ మగువిధము,
నరుగుదెంచి కిరీటి యపుడు శ్రాద్ధంబు
వరగ నారాయణబలి సేయు విధము,
వదియూఱువేల గోపస్త్రీలఁబట్టి
పొదలి చోరులు గొనిపోయిన విధము,
పరశురాముని భువి బాఁపలుగొన్న
శరధిపాలై మున్ను సచ్చినవిధము,
ధరరాజ్యమొప్పించి దశరథ రాముఁ
డఱిగి పేరడవిపాలై యున్న విధము,
గడుఁగూర్చు వనితఁగోల్పడి దైత్యుచేతఁ
బెడకేలుగాఁ గట్టఁబడినవిధంబు,
వ్రాలి రావణుఁ జంపి వడి బ్రహ్మహత్య
పాలయి ధరచుట్టు భ్రమియించువిధము,
నిత్యు రామేశ్వరు నిల్పి యాబ్రహ్మ-
హత్యాపహృతముగా నర్చించువిధము,
దరుణి నమ్మకపుచ్చి తమ్మునిఁ జంపి
సరయువులోఁబడి చచ్చినవిధము,
హరమైన తనదు మత్స్యావతారంబు
సురసింధుధరు తలచుట్టైనవిధము,
హరమగు తనదు కూర్మావతారంబు



హార

హరు హారమధ్యంబునందున్న విధము,
హరమైన తనదు వరాహదంష్ట్రంబు
నురగాంకు ముంజేత [1]నుంచిన విధము,
హరమైన నరసింహు నంచితాజినము
పరమేశ్వరునకు నంబరమైన విధము,
హరమైన తన వామనాస్థిదండంబు
హరుచేత ఖట్వాంగమై యున్నవిధము,
నల్ల జన్మమున నాహవనీయవహ్నిఁ
దెల్లంబుగాఁ దల దెగిపడ్డ విధము,
మృగరూపధారియై వగఁ బాఱలేక
యగపడి తలయుఁ బోనాడిన విధము,
వారక తనదు విష్వక్సేనదేహ-
మారుద్రశూలంబునం [2]దున్నవిధము
[3]గలకేతుఁడై వచ్చి కామారిచేత
బలుకపాలంబులోపలఁ బడ్డ విధము,
నురులింగమూర్తి శ్రీచరణముల్ గాన
కరయంగఁ జని వరాహంబైన విధము,
నూరూర [4]నేఁటేఁట మారునిఁ జంప

౧. నున్నవిధంబు. ౨. దుంచు. 3. కలికేతుఁడై; కలికేతఁడై; కలకేతుఁడై; కలికిరూపున. ౪. నింటింట

వారింపఁజాలక వనరెడి విధము,
గ్రాలుచు వ్యాసునికర మభ్రవీథిఁ
దూలియాడఁగఁ గూర్పఁజాలని విధము,
నివి యాదిగాఁ బార్వతీశుచే విష్ణుఁ
డవమానపడి గర్వ ముడఁగినవిధము,
నదియునుగాక శ్రీరారామమునను
మదనారి నిల్పి సమ్మతిఁ గొల్చువిధము,
రూఢి గోవిందేశ్వరుని నిల్పి భక్తి
గూడ ద్వారావతిఁ గొల్చినవిధము,
సెలువార వారణాసిని దనపేర
నిలిపి విశ్వేశ్వరుఁ గొలిచినవిధము,
వెంపారు నింద్రనీలంపులింగంబు
నింపార నజ్జయం దిడి కొల్చువిధము,
వే యేల, విష్ణుండు విశ్వేశ్వరునకుఁ
బాయనిభక్తుఁ డై భజియించువిధము
నుగ్గ్రాత్ముచే వెండియును నివ్విధమున
నిగ్రహానుగ్రహాన్వితుఁ డై శార్ఙ్గి
భంగంబు నొందుట, వటుగర్వ మడఁగి
సాంగంబుగా భక్తి సలిపినవిధము,
వేదాగమపురాణవివిధశాస్త్రను-

పాదితోక్తులఁ జెప్పఁబడియెడిఁగాన
ప్రత్యయం బొం డేల పాంచరాత్రాద్య-
సత్యవ్రతముల మోక్షంబు సేకుఱునె ?
మానుగా నీశ్వరమహిమకు విష్ణు-
హీనతకును దృష్ట మిదియ తాఁ గాదె ?
భువిని నిత్యుం డగుశివుని భజింప
శివకరం బగుముక్తి సిద్ధించుఁగాక
ధర ననిత్యుం డగుహరిని భజింపఁ
జిరతరం బగుముక్తి సిద్ధించు నెట్లు ?
కావున విశ్రుతభాగవతాదు లాది
గావు, విముక్తిమార్గంబులు గావు,
నీవు కేవలవిష్ణునిజసమయుఁడవు
గావు, బౌద్ధుఁడవు, నిక్కం, బెట్టు లనినఁ—

బౌద్ధవాదనిరసనము

బురము లేర్చెడునాఁడు పురహరునాజ్ఞ
హరియు సాక్షాద్బుద్ధుఁ డై యుండెఁ గాన
జలజనాభునిదశజన్మంబులందు
నిల బౌద్ధజన్మంబుఁ గలుగున కాన,
తగఁ గూర్మవామనదాసులు గలుగ
నొగి బుద్ధదాసి లేకుండఁడు గాన,

సరి శ్రుతిబాహ్యంబు జైనబౌద్ధంబు
నరయఁ గించిద్భేద మంతియ కాన,
వెండి బౌద్ధుఁడు వైష్ణవుండు, మున్ వైష్ణ-
వుండు బౌద్ధుండు గావున, వేయు నేల,
బౌద్ధుండ ! వినుము నీ బౌద్ధంబు శ్రుతివి-
రుద్ధంబు, భవపాశబద్ధంబు, భువి ని-
షిద్ధంబు, దుఃఖ సమృద్ధంబు, పాప-
బద్ధంబు, మున్న యబద్ధ, మె ట్లనినఁ
గొఁలుమనోమయకోశంబులోన
మఱి తోఁచు విజ్ఞానమయకోశ. మదియు
బుద్ధి దా క్షణికంబు పొరిఁబొరిఁ బూర్వ
బుద్ధియం దవగతిఁ బొందించుజీవ-
సంతతిపోలెను జను నుత్తరోత్త-
రాంతరబుద్ధి దా న ట్లుదయింప
నరయ సంతతిరూప మై తోఁచు బుద్ధి,
సరి నాత్మ యీబుద్ధిసంతతియందుఁ
దులుకాడు క్షణికచతుర్విధభావ-
నల నొకానొకజ్ఞానంబు సంధిల్లు,
క్షణము విముక్తిసంగత మగునేని
క్షణభంగురము ముక్తికారణం బగునె ?

యొక్కఁడొక్కఁడ యని లెక్కించి, మీఁద
నొక్కఁడొక్కం డను టుడిగి, రెం డనుచు
ముందట నొక్కండు మూఁ డంచు నిట్లు
ముంద ఱెంచఁగ వెన్క మొగిఁ జెడునట్టు,
లరుగ నదీప్రవాహము వీచు లుడుగ
భరితమై ముందఱఁ బొలుచున్నట్లు,
వెలుఁగెడుదావాగ్ని వెనుక నారంగఁ
గలయ ముందఱఁ బొంగి కాలుచున్నట్లు,
గనుఁగొని విరచితాక్షరపంక్తి సదువ
వెనుకఁ[1]గ్రచ్చఱి ముందఱను జాఁగునట్లు,
ఖండింపకయ పూప కాయ యై, కాయ
పం డయి, పండు నేర్పడ బీజ మయ్యు,
బీజంబు మొలక యై పెరిగి, ముందటను
భూరిజిల్ల వెనుకరూపము సెడునట్లు,
ముందట నాత్మయు ముక్తిఁ బొందంగ
నందంద వెనుకయు నడఁగు నం తేని
వడిఁ బుట్టి నిలిచి తా నడఁగునంతటన
నడి నసఁ దత్క్షణస్థాయిత్వమునకు
క్షణవాదభంగంబు గాదె యీ యుక్తి?

---

1. గ్రచ్చఱి; గర్తరి; దత్తిర; గ్రత్తర.

ప్రణుతింప నెద్ది యుత్పత్తి ? క్షణంబ;
యది వినాశక్షణ మగు నేని నింకఁ
జమవు లేల, స్వనాశ సంగ్రస్తమైనఁ
దళేఁదటి నేర్చునే తా నుదయింప ?
మఱి యది గాఢ్యక్షమంబు దా నగునె ?
తానును మొదలన తవిలిన విష్ణుఁ
డైన సంతతియందు నౌఁగాక, క్షణము
మోక్షంబుఁ బొందిన మును వొందుఁగాక
లక్షింపఁ దన కగు లాభ మున్నదియె?
యంచిత [1]శైవాగమాదుల మఱియుఁ
గించిద్గుణములు మిక్కిలి మీ వ్రతములు
నవియు మాటలన, సత్యము నహింసయును
నివి నిజవ్రతములం డ్రివియును లేవు,
సంపి పెట్టినఁ దింద్రు, సంపఁగాదంద్రు;
సంప సహించుట సంపుట గాదె ?
బొంకీశ్వరుం డంద్రు, బొంకఁ గాదంద్రు
బొంకులలోఁ బెద్దబొంకిది గాదె?
యన్ని యీశ్వరుఁడు లేఁడంద్రు, దా నేల
యెన్నంగ బుద్ధుండు నిలఁ గల్గఁ డెట్లు ?

---

1. శైవగుణాదుల.

క్షణభంగురం (బగుఁ గర్మంబు.) దానఁ
బ్రణుతింపఁ దత్కర్మఫలము వొందించు
ననుటయు బౌద్ధుల కనుమతం బగుటఁ
దనరి యాబుద్ధుండు దైవ మం చెద్ది?
సంగతి దైవంబు శశవిషాణంబు-
భంగి శూన్యం బంచు బౌద్ధాదులాది
విరచింపఁగాఁ జతుర్వింశతితీర్థ-
కరులు భూతాది త్రికాలవర్తనులు
నెన్న డెబ్బదిమీఁద నేడ్వురు మునులు
మున్ను శూన్యధ్యానములు సేయుచునికి
శమదమానుష్ఠానజపతపోధ్యాన-
యమనియమాది కాష్టాంగయోగాది
ధర్మకర్మ ఫలప్రదాత యెవ్వండు
నిర్మించుఁ? గ్రియలకు నిర్వాహ మెద్ది?
తివిరి యుత్పత్తి స్థితి విలయ హేతు
వవునె దైవము శూన్యమయ్యెనేనియును
దెలియ నుత్పత్తి స్థితి విలయ హేతు
విలఁ గానియది దైవ మెట్లునుఁ గాదు;
దలపోయ శూన్యతత్త్వము గల యదియె?
తలపోయ శూన్యతత్త్వము లేని యదియె?

కలదేని శూన్యంబు గాద శూన్యంబు;
గలుగదేని శూన్యంబు గలుగ, నెట్లనినఁ
గలదేని శూన్య మన్ పలుకు దా బొంకు,
గలుగదేన్ శూన్య మన్ పలుకు దా బొంకు;
గాన, యహింసావిహీనులు, సత్య-
హీనుల్, గ్రియాఫలహీనులు, గర్మ-
హీనులు, నిజదైవహీనులు, పుణ్య-
హీనులు నగు బౌద్ధజైనాదులకును
గలుగునే మోక్షవికస్వరసుఖము ?
తలపోసి బౌద్ధ! వాదం బుడ్గు, మట్టి
బౌద్ధంబు [1]సిఱుతలబంటియు లేదు
సిద్ధంబుగా శైవసిద్ధుల కనిన

జైనవాదనిరసనము

నం దొక్క లవమాత్రమగు జైనవాద
మం దెంత గాన; మాయాద్యులలోన
దేవరదాసయ్య భావజాంతకుఁ డ-
దైవంబనుచు జైనతర్కంబు నూఁకి
దర్ప మేర్పడ ఘటసర్పంబుఁ [2]దొడఁకి

---

1. గిఱుతల ('నాభిగుల్ఫ ప్రమాణం' అని సంస్కృతానువాదము.) 2. వొడికి; నూఁకి; నిండి; తొణికి; తొడికి.

సర్వాంకు నుత్తరేశ్వరుఁ బ్రతిష్ఠించి
పౌసపరి వట్రిల్లఁ బొట్లచెర్వునను
వసదు లేణ్ణూఱును వ్రచ్చివైపించి,
వెసఁ జినప్రతిమల విటతాటమాడి,
యెసగునాఁ డీజైను లెక్కడ ననిరి?
భావజాంతకు భక్తవరుఁడు వెండియును
గోపూరి బ్రహ్మయ్య నా వీరగణము
వేరొక్కని జైనులపే రడఁగింపఁ
దర్కంబునం దోడి ధాత్రిలోపలను
మంత్రసిద్ధుల మంచు మదియించి దహన-
మంత్రంబుచే నొక్క మఱ్ఱిఁ గాల్చుడును
మంత్రంబులకు రాజమంత్రంబు మూల-
మంత్ర మనుష్ఠించి మానితభక్తి
నడరంగ మును భస్మమైయున్న మఱ్ఱిఁ
బడసి కోపూరిలోపలఁ గలయట్టి
వసదు లన్నియు వ్రచ్చివైపించి మహిమ
నెసగునాఁ డీజైను లెక్కడ ననిరి?
యదియునుఁగాక యేకాంతరామయ్య
విదితభక్తిస్ఫూర్తి విలసితకీర్తి
నబ్బలూరను సముద్యన్మహామహిమ

నుబ్బుచు జైనుల నుక్కడఁగించి
యప్పురి వసది నాఁడాదిగా నిల్వ
కెప్పుడ పడియెడ మని శాప మిచ్చెఁ;
గటకంబునందు ప్రఖ్యాతిగా మఱియుఁ
బటుకీర్తి బండారు బసవన్న యలర
నసమాంబకుఁడ దైవ మని ప్రతిష్ఠించి
యెసగంగ శిర మిచ్చి యేడ్దినంబులకు
వఱలంగ నప్పురి వాడవాడలను
మెఱయుచు నాడుచు మఱియొండు శిరము
వడసి జైనుల నెల్ల భస్మంబు సేయు
నెడ నాఁడు మీ జైను లెక్కడ ననిరి ?
కృతకృత్య వఱివళిగెను వైజకవ్వ
వతి ధిక్కరించి సద్భక్తిపెక్కువను
జనుదెంచి చనుదెంచి చక్కన వసదిఁ
గని భవాలయ మని కరములు మొగువ
నట జినప్రతిమయూ పప్పుడ ప్రస్సి
పట పట వ్రక్కలై పడఁగ మధ్యమున
వైజనాథుం డుమావరుఁ డుదయింప
వైజకవ్వయు వికస్వరభక్తిమహిమ
వసుధ జైనుండను వార్తయు నడఁప

నెసగుశాఁ డీజైను లెక్కడ ననిరి ?
మారుళిగెను భక్తిమంతులు మఱియు
నారంగ హిరియ నాగయ్యగా రాది
వీరావతారులు వీర లనంగ
నారంగఁ బదుమువ్వ రసమానయశులు
వసిగొని జైనుల వధియించి హిరియ
వసదిన శివు మహేశ్వరుఁ బ్రతిష్ఠించి
యసమకీర్తి ప్రతిష్ఠాచార్యమహిమ
నెసగుశాఁ డీజైను లెక్కడ ననిరి ?
యదిగాక వెండియు నాదయ్య యనఁగ
మదనారి సద్భక్తి మతిఁ బులిగెఱను
వసదులతక్క నీశ్వరనివాసములు
వసది జినుఁడ తక్క నెసగులింగములు
జైనమూఢుల తక్క సద్భక్తవరులు
గాన రామికిని దుఃఖంబు నొందుచును
జూడ నక్కజమగు సురహొన్నవసది
గూడ నాస్వామికి గుడి యెన్న డగునో !
పట పటఁ బగులంగఁ జట చటఁ బాయఁ
బటుతరంబుగ జినప్రతిమమధ్యమున
శివుఁడు సౌరాష్ట్రంబు శ్రీసోమనాథుఁ

డవికల్పమతి నెన్న డవతరించెడినొ!
పొందారఁ దత్ స్వయంభూలింగమూర్తి
యందు ముక్కన్ను నొప్పగు చతుర్భుజము
నందివాహనమును నగజ దాపటను
సుందరతరజటాజూటవిభూతి
గర మొప్ప సాకారకలితదివ్యాంగ
మరు దరు దన దృషదంతరంబునను
నున్నతం బగు తదీయోరులింగంబు
నెన్నఁడు గందునో యేఁ గన్నులార!
వంతయుఁ జింతయు వలపును సొలపు
నంతకంతకు నెక్కు డయ్యెఁ దానిట్లు
దొంబదియేఁడులు దొడిఁదొడిఁ జనునె?
సాంబుండు నాయర్థి [1]సలుపఁ, డింకేన
పోదు శ్రీసౌరాష్ట్రమునకు, సోమేశు
నాదటఁ గొనివత్తు, నట్ల దర్శింతు,
ననుమాన మిం కేల యనుచు నాదయ్య
సనఁజన నొక్కయోజనమాత్ర యంద
యతిసుఖ యతివృద్ధుఁ డతికృశాంగుండు
నతిబలహీనుండు నగుటఁ గాఁ జేసి

౧. సలుపండు నింక.

చరణముల్ వ్రయ్యంగ, జానులు వావఁ,
గరతలాగ్రముల రక్తములు వింజింప,
ఖరతరాతిపసముత్కట తీవ్రనిహతిఁ,
బొరిఁబొరిఁ గన్నుల బొమలు మూయంగ
నడుగెత్తరాకయు నడు గిడరాక,
కడుఁగడు ముందఱఁ గానరాకయును,
జలమును నతిసాహసంబును గలిగి,
తలరక యజ్జమీఁదన యజ్జలిడుచుఁ
దడదడఁ బాఁకుచుఁ ధగులుచు మతికి
వడిఁ దెచ్చికొనుచుఁ బోవక నిలుచుచును,
వడవడవడఁకుచు, వ్రాలుచు, నట్లు
పడిపడిలేచుచుఁ, బథముఁ గన్విచ్చి
చూచుచుఁ, బోవక చూచుచు, నెదురు
సూచుచుఁ, జనుచు, రాచుచును, గూయుచును,
"నోసోమలింగంబ, యోసోమలింగ,
యోసోమనాథయ్య, యోయయ్య, జియ్య,
యోదేవదేవ, మహాదేవ, యోయు-
మాదేవ, మాదేవ, మాధవవినుత,
యజహరీంద్రాసాధ్య, త్రిజగదారాధ్య,
నిజభక్తసాన్నిధ్య, నిష్ఠైకసాధ్య,

గతనతజనతాప, కారుణ్యరూప,
సితకరకీర్తి, సంచితదయాస్ఫూర్తి,
గౌరీసనాథ, గోకాంతావరూథ,
చారుప్రమథయూథ, సౌరాష్ట్రనాథ,'౧
యనుచుఁ గీర్తించుచు నట్లు యేఁగంగ
ననఘు నాదయగారి యతిభక్తిరతికిఁ
బాదలు శ్రీసౌరాష్ట్రపురవరాధీశుఁ
డెదురేఁగుదెంచి సోమేశుఁ డాక్షణమ
జనులు జైనులు విస్మయమంద, నంద
జినునిమధ్యంబుఁ జెచ్చెఱ వ్రచ్చికొనుచు
సాంగ సాకార స్వయంభూప్రసన్న
లింగావతారమ ట్లంగీకరించి,
యంత నాదయ్య కామ్యార్థముల్ సలిపి
వంతయుఁ జింతయు నంతయుఁ బాపి
సారకటాక్షవీక్షణసంజనిత ద-
యారసామృతవార్ధియం దోలలార్చి
జైనకోలాహలశక్తియు, నవిక-

౧. 'జితమదనవికార చిరదయాపూర' అని యొకయధికపాఠ మిచటఁ గొన్నిప్రతులలోఁ గానవచ్చుచున్నది. దీనికి సంస్కృతానువాదము లేదు.

లానూనభక్తియు నవియుక్తి నొసఁగ,
నాజైనమునుల నాదయ్య భంజింప
నీజైనమునులుదా రెక్కడ ననిరి?
మఱి పిల్లనయనాచు మధురలోపలను
దఱిఁదఱి జైనులు దల్లడంబంద
నెఱిఁ గూనపాండ్యుఁడ న్నిఖిలావనీశు
పొఱడువోయిన వీపుపొఱమువోఁ జేసి
ప్రతిపక్షు లగు జైనబౌద్ధులతోడఁ
బ్రతియొగ్గి శివమంత్రపత్రంబు వ్రాసి
జినమంత్రపత్రంబు మనుజేశుచేతఁ
బెనుపగు మంటలోఁ బెట్టఁ బంచుడును
సురనుర దావాగ్నిఁ [1]జొక్కాకు గమరు-
పరుసున జినమంత్రపత్రంబు గమర
వరసరోవరములో వనజాత మున్న
పరుసున శివమంత్రపత్ర మొప్పార,
ధర జినమంత్రపత్రంబును మఱియుఁ
బరువడి శివమంత్రపత్రంబుఁ గూర్చి
కావేరి యుప్పొంగఁగా [2]మధ్య వైవ
వావిరి జినలేఖ వఱతి పాలయ్యె

---

౧. సుడిమాది. ౨. నడ్మ.

శివమంత్రలేఖ యచ్చెరువు వఱ్ఱిల్ల
భువి నేటి కెదురెక్కఁ బోరిఁబోరిఁ బట్టి
కూడ జైనుల నెల్లఁ గొట్టు లెక్కించి
¹కూడిమై వసదుల కూపడఁగింప
నవి యేల వేయు, జైనాధికు లెల్ల
భువి లేరె? నాఁ డెందుఁబోయిరి ?—మఱియు,
ననిగాక నిడుమారఁ డను చోడనృపతి
వెదకుచుఁ దన యేలు విశ్వధరిత్రిఁ
గల జైనమునుల నొక్కటఁ బిలుపించి
వలయు తర్కంబుల వారి నోడించి
తవిలి క్రాఁగిన శిక్షార్ల తలలు గ్రిందుగను
దివియ నాఁ డొం దేఁగితిరి మీర లెల్ల
వారక మఱియును వాగీశనాయ-
నారిని బట్టి నానావిధంబులను
జ్వాలనార్చులను నూఁకఁ జౌదంతిఁ గట్ట
జలముల ముంప, విషముఁ బ్రయోగింప,
మహితపంచాక్షరీమంత్రంబుచేత
దహనేభ జలవిషోద్ధతి దర్పమడఁచి
యజ్జైనముఖ్యుల నందఱఁ జంప

---

౧. ప్రోది. ౨. శూళ్ల.

లజ్జలే[1] కాముసుల్ నాఁ డెందు సనిరి?
ధర వెంజీయును శివార్థం బొక్క-కొలను
సరి నిరిత్తాండి యక్క జాత్యంధుఁ డర్థిఁ
గావింపఁ, గావింపఁ, గడఁగి విఘ్నములు
గావింపఁ గావింపఁ గడుఁగడు సొలసి
పన్నగాంకునిచేతఁ బటుభక్తి రెంపు
గన్నులఁ బడసి, విఘ్నము లాచరించు
జైనులకన్నుల క్షణమాత్రఁ జెఱుప
నాన లేకీముసుల్ నాఁ డెందు సనిరి ?
నమినందియను గణనాథుఁడు మఱియుఁ
బ్రముదితభక్తి దీపములు నిత్యంబు
వేయేసి ముట్టించి విశ్వేశు నీశుఁ
బాయక చేయును బవలును గొలువ
నాయూరఁగల జైను లసహనంబునను
నేయి[2] గరించెడుఁ బోయకయున్నఁ
బ్రతియొగ్గి వేయుదీపములు వేదాను-
గతశుద్ధ లింగోదకముల వెలుంగ
ముట్టించి యాజైనముఖ్యుల పసులఁ
బిట్టుసావంగ శపించి యయ్యూర

---

౧. దీముసుల్. ౨. గరిఁ బెడుసు; గరం బెఁడు.

వసది జైనుం డనువార్తయు నడఁచె,
నెసగ నాఁ డీజైను లెక్కడ సనిరి ?
తొండమండలమున వెండియు సాంఖ్య-
తొండఁ డబ్బువి జైనమండలం బగుట
గుడియు లింగంబు భక్తుం డనువార్త
పుడమిఁ బుట్టదు, విన్నఁ బొరిగొండ్రు, గాన
కుసుమముల్ దేరామి గుడికిఁ బోరామి
భసితం బలఁదరామిఁ బ్రచ్ఛన్నబౌద్ధ
వేషంబునను నిత్యవిధి మూఁడు సేసి
పాషాణములు పుష్పభావన యలర
నడువోలంబునను జీర్ణశివాలయంబుఁ
బొడగని బౌద్ధుండపోలెఁ గన్నలుక
మాపీటిపొంత నీమహి నీకు నుండఁ
గావచ్చునే కంటిఁగంటిఁ బోరాదు
శివ ! నిన్ను జాలవాల్సేదు, నాకుఁ
దవిలి నిత్యంబు వ్రతం బిది యనుచు,
మూఁడుసంధ్యలయందు ముమ్మాఁడుజాలు
వోఁడిగా నద్దేవుఁ బూజింపుచుండ
నదియొక్కనాఁ డూర నగ్గుడినడుమ

---

౧. దూరి యు.

నదిగట్టి పాఱి, వానయు బిట్టు గురియ
నెట్టును శివుఁ గొల్వ నేఁగరాకున్న
నిట్టుపవాస మేన్దినము లుండంగ
నిట్టి నేమంబును నిట్టి వ్రతంబు
నిట్టి చలంబును నేరికిఁ గలవె?
యిద్ధర నీతండ బౌద్ధోత్తముండు
బద్ధవైరంబున భవు ఱాల వైవఁ
బోరాక కటకటా! పొగులుచున్నాఁడు,
వారక నిట్టుపవాస మెన్నాళ్లు
బ్రతిమాలఁ గూడినఁ బాడియె యిట్టి
వ్రతియుండఁగా నిజవ్రతులకు ననుచు
ననయంబు జైన బౌద్ధావళి సాంఖ్యుఁ
గొనియాడుచును గొల్చికొని యిట్లు లుండ
నంత నదీప్రవాహంబు పొంగుడుగ
నాంతరభక్తి మితాంతరోద్ధతిని
దప్పేఁ దద్వ్రతభావ దన బ్రదు కింకఁ
జెప్పకు చెప్పకు శివుఁడు గైకొనునె?
పలికిన వ్రతములు వరిపూర్తిగాక
తలరి యే గుడువంగఁ దా ననదగునె?
వగవ ముప్ప్రొద్దు నీశ్వరుఁ గొల్చువ్రతమొ,

యొగి నుపవాసంబు లుండెడు వ్రతమొ,
పొలుపార నుపవాసములు నుపవాస-
ములు వ్రతంబులు వ్రతంబులు గూడ నిట్టి
శత సహస్రోపవాసములు దదీయ
సతతభాషావ్రతచర్య దా నగునె?
కాన, యీ మర్త్యలోకంబున నునికి
గానేర దది దీరంగాం బరోక్షమున
నీ బొద్దు౧లెక్కడ నేమి దలంతు
రో, బుద్ధిగా దీశ్వరుని నిల్పి పోవ
నవి యేల మఱి కదా యవ్విచారములు
దవిలి నా నిత్యవ్రతప్రచర్యకును
నేనుదినంబుల కెన్నంగ నలువ-
దేను దా లొండొండ యేయంగ జాల
వరున నన్నిట మొత్తువచ్చు పాషాణ
వరపుష్పమొక్కటి నకుం బూన్తుననుచుం
గో! యని యొక పెద్దగుం డెత్తికైవ
నా యీశ్వరుండు నోహో! యంచు నగుచు
శిరమున కడ్డంబు గరము లొడ్డుచును
హరుం డాక్షణంబ ప్రత్యక్షమై నిలిచి

---

౧. లెక్కడికేమి.

'మెచ్చితి సాంఖ్య! నీ మేదురభక్తి,
కిచ్చెద వేఁడు మభీష్టార్థ' మనుడు
శాక్యుఁ డంతకుమున్న సక్కఁ జాఁగిలుచు
వాక్యసంస్తోత్రపూర్వకముగ మ్రొక్కి,
'వేయును నవి యేల, నినుము విన్నపము,
నా యాచరించునన్యాయంపుభక్తి
న్యాయంపుభక్తిగా నవధరించితిరి
యేమెడ నిది సాలదే దయాంభోధి!
కరుణాపరిష్కార! కారుణ్యపూర!
భరితగుణాత్మ! కృపాపరతంత్ర!'
యనుచు వెండియు మ్రొక్కి హరుఁ డాక్షణంబ
యనుపమ కనక దివ్య విమానమునను
గొనిపోయెఁ గైలాసకుధర మేఁగుచును
జిన బుద్ధ ముఖ్యాదిసంచిత సమయములు
మును దొండమండలంబున నిస్తుషముగ
ననఘుఁడు సాంఖ్యనైనారు శపించి
జైన బౌద్ధాది దుస్సమయముల్ దుడువఁ-
గా నాఁడు లేరె యీ జైను లిద్ధరను?
గావున జైనతర్కము లుడుగుఁ" డని

వావిరి జైనాది వాదుల నడఁచి,
చండతార్కిక జయ¹శౌండమండనుఁడు
ఖండనాఖండన క్షమత వేదోక్త-
పరిచి తాప్రతిహ తోపన్యాస సరస-
సరళ తదుత్తర శబ్దజాలముల
దండి ²పూర్వాక్షేపతార్కిక ప్రశ్న
ఖండించుచును బండితుండు సర్చింపఁ
బడు నుత్తరాక్షేప పరిమిత ప్రశ్నఁ
దొడఁగి చేయుచుఁ, దాన తుడుచుచు, నిట్లు
వివి ధాన్యసమయుల విటతాటమాడు
శివభక్తసింహుని జితపరసమయుఁ
బరమ పాండిత్య ప్రభాసమన్వితుని
సురుచిర శుద్ధయశోవిరాజితుని
ననఘుని మల్లికార్జునపండితేంద్రుఁ
గనుఁగొని బౌద్ధుఁ డాగ్రహము వట్రిల్ల
ననిమొ ‘³నెట్టెట్టా ? మహాదేవుఁ డనఁగ
నెనయంగ నొకదైవమే ? నిక్క మెట్లు
శ్రుతిపేర్మిఁ బలుకనేరుతుగదా యనియు
నతివాదములు పెక్కు లాడెదు⁴ శేఁగి,

౧. కాండ; శౌర్య. ౨. పూర్వోత్ప్రేక్షు. ౩. నెట్టెట్టా. ౪. చెలఁగి.

## వా ద ప్ర క ర ణ ము

హరివిరించులు గాన రనియెదు శివుని,
హరుఁ డాదిమధ్యాంతవిరహితుఁడేని
హరికిఁ బుట్టినబ్రహ్మ కట[1] పుత్త్రుఁడైన
సరసిజాహితు నెట్లు జడలలోఁ దాల్చె ?
నభవుఁడేనియు నెట్టు లజు లలాటమునఁ
బ్రభవించి మఱి యేల బ్రహ్మ నధించెఁ ?
గల్యాణ పరమ [2]మాంగల్యాంగుఁడేని
శల్యాజినము లేల [3]లౌల్యుఁడై తాల్చె ?
నీక్షిఁప నిఖిలలోకేశ్వరుండేని
భిక్షాటనమునకుఁ బ్రీతి [4]నెట్లరిగె ?
నద్దివ్యమైన వాహనము లుండంగ
నెద్దు వాహనముగా [5]నెక్కెఁడి దేమి ?
గంగ నెట్టులు దాల్చెఁ గామారియేని ?
యంగ మెట్టులు సగం బంబిక కిచ్చె ?
సగమాఁటదేవర సర్పించిచూడ
జగదండకోట్ల కీశ్వరుఁ డెట్టు లయ్యె ?
నగ్నుఁడై యేల వనంబులఁ దిరిగె?
నగ్ని యెట్టులు నేతి కాయుధంబయ్యె ?

---

౧. పౌత్రు. ౨. మాంగల్యుఁడేనియును. 3. లౌల్యతం. ౪. నెట్లేఁగె. ౫. నెక్కుటట.

నరయ దివ్యాభరణాంకుఁ డే నెట్టు
లురగంబుఁ జేసె యజ్ఞోపవీతముగ?
ననమసుధారసం బమరుల కిచ్చి
విస మేమిటికిఁ ద్రావె వెక్కసంబుగను ?
హరుఁడు దా హరినయనార్చితుం డేని
హరిహరుం డనఁగ నెట్లయ్యె నొకండు ?
యజ్ఞేశుఁ డేనిఁ గ్రియాదక్షు దక్షు
యజ్ఞ మేఁటికిఁ ద్రుంచె నమరులఁ జెఱిచి?
బ్రహ్మాండకోట్లకుఁ బతియేని నిట్లు
బ్రహ్మాండ మెట్టులు భస్మంబు సేసె ?
సచ్చిదానందభాస్వరమూర్తి యేని
నిచ్చమై నొలుకుల [1]నేల వసించెఁ ?
గావున న ట్లమాంగల్యస్వభావు
దేవు విరుద్ధ సందీప్త ప్రభావు
విపరీతచరితు దుర్వేషు దుశ్శీలు
నపవిత్రు నొక దైవ మని సమర్థించి
పలికెద విదియు నీ పండితత్వంబు-
కలిమియె ? విద్వన్నికాయంబు నగరె ?

---

[1] నెట్లు చరించె.

పొద పద మింక నీ పొత్తంబుఁ గట్టి
చదువులు గిదువులు సాలింపు, మనుడు--

ఇందుధారణము

నిందుధారణముఖ్యహితమహామహిమ
నిందుశేఖరునకు నిందగాఁ బలుక
నిగ్గారు నక్షయనిధి యభాగ్యునకు
బొగ్గులై పెంచులై భువిఁ దోఁచునట్లు
వరమేశుమహిమ వాపప్రచారులకుఁ
బరికింప వికృతస్వభావమై తోఁచుఁ
దప్పేమి యని పండితస్వామి నగుచు
నొప్పఁ బురాణాగమోక్తుల వినరె ?
చంద్రకళావతంసస్ఫురన్మౌళి
సంద్రుచిఁ దాల్చిన చంద మెట్లనిన,-
బ్రహ్మోక్త వివిధపురాణాదినైన
బ్రహ్మవైవర్తపురాణ సంహితల
జీవితేశ్వరుసభఁ జిత్రగుప్తుఁడు న-
భోవీథి సౌవర్ణపుష్పకారూఢు
లై చనువారల నద్భుతం బంది
చూచి నీలోకంబుసారక, నిక్క జీరి-

కైననుగొనక, నీయానతి లేక,
యానతుల్ గాక చయ్యన మీఁదిలోక-
ముల కేఁగుటేమి యిమ్ముల వీర లనుడు
నలరుచు ధర్మరాజతనికి ట్లనియె—
దక్షుండు సెలువారఁ దనయల శశికి
నీక్షించి యిరువదియేడ్వుర నిచ్చి
పడఁతుల కొక్కరూపమునన యిచ్చ
నడపుమీ యని ప్రార్థనము నేసి పోవ
నాహిమకరుఁడు భార్యావళిలోన
రోహిణీసతి కతిస్నేహంబు సేయ
నున్న కాంతలు దమ కొక్కరూపమున
మన్నింపఁడని తమ మగనిపైఁ [1]బొలపు
నెఱుఁగింపఁగా దక్షుఁ డెంతయుఁ గినుక
బలితెంచి 'యో పక్షపాతి! శశాంక!
నానాఁటికినిఁ గళాహీనతఁ బొంది
తూనిక దఱుగుచు మే నాశ్రయింపు'
మని శాప మిచ్చుడు, హరుని గుఱించి
చనుదెంచులోనన సకలలోకములు
నక్కజపడ 'నమా' యను నొక్కకళయుఁ

౧. పొలవు; పొఁడము.

దక్కఁ దక్కిన కళల్ దఱిగి వెండియును
జలజారి భువిఁ జక్కఁ జాఁగిలి మ్రొక్కి,
'మలహర ! వాగ్దేవ మాధవవంద్య !
యక్షయ ! విశ్వేశ ! యంబికారమణ !
రక్షింపు' మనుచుఁ గార్యము విన్నవింప
'నోడకోడకు' మంచు నున్నయాకళయుఁ
జూడాగ్రమున నుమేశుండు ధరించి
'దక్షుని శాపోక్తిఁ దఱుగ నానాఁటి
కీక్షితి మాకృప నెక్కు నానాఁటి
కొక్కొక్కకళ' యంచు నుడువల్లభునకు
ముక్కంటి దయసేసి మును సురల్ వొగడఁ
దఱి నాఁడునాఁటికిఁ దఱిగెడు కళలు
గఱకంఠు కరుణ జగద్ధితంబయ్యె
నలి 'నమా' నామకళామాత్ర మనఁగ
లలి 'నమా' నామకళను దాల్చె దివస,
మదియ యమావాస్య యననొప్పె నాఁడు.
మదనారి నేకాగ్రమానసు లగుచుఁ
జెదరనిభక్తి భజించినవారు
సదమలలీల నీ చనియెడువారు'
నని చిత్రగుప్తున కంతకుఁ డంత-

యును జెప్పఁ గాన [1]సమున్నతలీల
నిందుకళామాత్ర మీశుండు దాల్ప
నిందుధరుండగు నింతియకాక
చింతింప నాదిమధ్యాంతవర్జితుఁ డ-
నంత వేదాంతవేద్యప్రభావుండు
హరివిరించుల కగోచరుఁ డగు శివుఁడు
హరుఁడు విశ్వాధికుండైన యీశ్వరుఁడు
ననయంబు శశిమోచికొని యున్నవాఁడె?
వనజారి దలనున్నవాఁడె? [2]యట్లయిన
దవిఁ [3]దిరిగెడునట్టి తిమిరారి బొంకె?
భువిఁ జందురుఁడు వేఱపుట్టెనె యొకఁడు?
[4]శ్రీకంఠుజడలపై శీతాంశుఁ డున్న
నాకసంబునయందు లేకుండవలదె?
యటుగాన నవతంసమయ్యెఁ దత్కళయు
నిటలాక్షునకు నిది నిందయే? మఱియు,

బ్రహ్మముఖావిర్భావము

వనజజుని లలాటమున నుదయించె
మనసిజసంహారుఁ డననెట్లు వచ్చు?

---

1. సముత్తంస. 2. యెట్లొసరి; యెట్లయిన. 3. దిరుగాడెడి.
4. 'ఆకసంబున యబ్జారియున్నని, శ్రీకంఠుజడలపై లేకుండవలదె?' — ఈవాతను కవ్యభిప్రేతము కాదు. చి. నా.

నిల 'స్వేచ్ఛయా చింతయేచ్ఛివం' బనఁగ
నలరి యీశుఁడు శివుఁ డంబికాధవుఁడు
హరుఁడు ముక్కంటి లీలార్థమై గూఁది సృష్టి
విరచింపఁదలఁప నవ్విధియు విష్ణుండు
సరి * 'మదంగస్వేదసంభూత' యనఁగఁ
బరగు దక్షిణ వామభాగాంగములను
దొరఁగెడు ఘర్మబిందువులను బుట్టి
హరునకు సాష్టాంగులై ప్రణమిల్లి
చను 'యస్యపాదరజస్స్పర్శ' యనఁగ
మనసిజారి పదకమల దివ్యరేణు
పటలసంగతి హరిబ్రహ్మల కయ్యె
స్ఫుటగతి సత్త్వరజోగుణత్వముల
నావనజజుఁ డంత నఖిలాండకోట్లు
గావించి కావించి గర్వించి మించి,
తాన పరబ్రహ్మ, తాన యీశ్వరుఁడఁ
దాన దైవం బని కానక పలుకఁ
దద్రజోగుణశక్తి దక్కువపడుచు

* 'మదంగస్వేద సంభూతా' అను శ్లోకభాగ మీద్విపదలో నిముడలేదు. 'సంభూతా' అనుదానిని 'సంభూత' యని వ్రాయ వలసివచ్చినది. చి. నా.

నుద్వృత్తి [1]యడఁగి [2]గరోద్ధతి [3]దక్కి,
నిటలాక్షుఁ దొల్లింటినియతి గుఱించి,
స్ఫుటవీరఘోరతపోనిష్ఠ పేర్మి
నాలుకల్ గోసి పినాకిఁ [4]బూన్చుచును
కేలుఁబగుల్లు నల్లీలఁ గొల్చుచును
నష్టవిధార్చనం బాచరింపుచును
నష్టాంగయోగవిశిష్టసంగతిని
బద్ధాసనస్థుఁడై పరమేశు హృదయ-
పద్మసద్మంబున భరితుఁ గావించి,
రంజిల్లు వామచరణమూల మూఁది,
* యంజూపబంధంబున ట్లాచరించి,
యొలయు ప్రాణాపానయోగంబు గీలు-
కొలిపి, యంతర్యోగకుశలత మెఱసి,
యాది మండలమున నాకుంచనము ని-
ష్పాదించి, సుప్తసర్పముఁ జాగఁ జోఁపి,
యాసక్తి సూర్యశశాంకులఁ గట్టి,

---

1. దక్కి. 2. గర్వోన్నతి. 3. యడఁగి. 4. బూన్చుచును.

* సంస్కృతానువాదములో 'మంజూషబంధ' మని యున్నది. 'మంజూషబంధంబు' అనుపాఠము సరియైనయెడల యతి తప్పును.

నాసాగ్రమున దృష్టి నలి నాటుకొలిపి,
తనరారి యంతర్నితాంతమై వెలుఁగు
తనుఁ దమ్మి దొంతు నూర్ధ్వముఖంబు సేసి,
యుచితంబుగఁ గ్రింది పంచపద్మములు
వంచానన ప్రభ ప్రజ్వరిల్లఁగఁ
దుదిమించి వెలుఁగొందు ద్విదళాంబుజాత-
మది పుష్పమంటపోద్యల్లీల మెఱయ
నగు 'లలాటే చింతయన్ బ్రహ్మ' యనఁగ
వగఁ 'దప స్యగ్రే వ్యవస్థితో' యనఁగఁ
దత్పర దేశ నితాంత మధ్యమునఁ
జిత్పరంజ్యోతి రంజిత దివ్యదేహు
భవుఁ దదావహనాది పంచోపచార-
సవిశేషవిధులఁ బ్రసన్నుఁ గావించి,
సురప నేత్రార్ధ వాసుకి వదనార్ధ-
పరిమితదళ పరిస్ఫురితాబ్జ జనిత-
సుకర నిష్యందమాన కళంక రహిత-
మకరందధారల మజ్జనంబార్చి,
బంధురలీల నా పద్మంబుఁ బూన్చి,
సంధిల్ల భక్తివాసన ధూపమిచ్చి,
వెలుఁగు నాత్మజ్యోతిని నివాళినిచ్చి,

తులుకాదు వేదసూక్తులఁ బ్రస్తుతింప
దేవుండు ఫాలప్రదేశంబునందు
నావేళ కపుడు ప్రత్యక్షమై నిలిచి,
యిచ్చ యెయ్యది నీకు, మెచ్చితి, వేఁడు
మిచ్చెద నావుడు నిలఁజాఁగి మ్రొక్కి-
స్రష్టయు బ్రహ్మేశ్వరాష్టకంబందు
దుష్టిఁ [1]నా శివుని [1]సంస్తోత్రంబు సేసి,
సృష్టికర్తృత్వంబు శివునిచేఁ బడసె;
సృష్టి సేయుచు విరించియుఁ దొంటియట్ల
వర్తించుచుండె నవారిత రుద్ర-
మూర్తి యంతర్ధానమునఁ బొందె, నంత ;
నిదియొక్క నిందయే యిల, నట్లుఁగాక—
సదమలస్థితి నట్లు షట్సమయులకుఁ
దమ తమ నియమముల్ ధ్యానైకనిష్ఠ
దమ తమ హృదయపద్మంబులఁ దోఁచు
నంతన వారి కమ్మైవేల్పు లాత్మ-
సంతతు లగుదురె స్వాములు కాక
యననేల, కాష్ఠంబునం దుదయింప
ననలుండు గాష్ఠంబుతనయుఁడె తలఁప ?

---

1. గా. ప్ర. బ్రస్తుతులొనరించి.

ఘనలార శిలలయం దావిర్భవింపఁ
బసిఁడి పాషాణంబుపట్టియే తలఁప?
నొలయుచుఁ బృథివిపై నుదయించునంత
నలరుభూజములే స్వయంభులింగములు?
నరయంగఁ [1]గంబమునం దుదయించె
ధర నొకఁ [2]డందు రాతఁడు దాని కొడుకె?
కమలాసను హిరణ్యగర్భుఁ డన్నట్టు
లమర దత్తాత్రేయుఁ డన్నట్టు హరిని
గమలనాభుని నధోక్షజుఁ డన్నయట్లు
గమలజుఁ డన్నట్లు గమలజు, మఱియు
నింద్రుని తల్లి కుపేంద్రుఁడు వుట్ట
నింద్రావరజుఁడని యెన్నినయట్లు
స్థిరమతి దివిజుల దివిజులన్నట్లు
వరగఁ [3]గుంభజు ని గుంభజుఁ డన్నయట్లు
నమరసింహ హలాయుధాది నిఘంట్ల
నమరెడు పాణినీయాది శాస్త్రముల
హరుఁ డజనిటలజుండను సూక్తి గలదె?
పరమపాతక మిట్లు వఱకంగఁ దగునె?"

---

[1] గంభము. [2] డందురాతఁడు; డంద్రునాతఁడు [3]. నగస్త్యు

కపాలాస్థిమాలా చర్మధారణము

శల్యముల్ మఱి యమాంగల్యముల్ వివిధ-
తౌల్యంబు లెట్లు దాల్పఁగ నంతేని,
నగణితాతీత కల్పాంతర ప్రలయ-
విగత చతుర్ముఖ విష్ణుకపాల-
నికరాస్థిమాలికా [1]నిచయ సన్నద్ధ-
సుకర పింగల జటాజూట కోటీర-
విలసనప్రభలు సాక్షులుగావె తలఁప
నెలఁదాల్పు మహిమకు నిత్యత్వమునకు ?
దివ్యవక్షస్స్థల దీపితాతులిత-
నవ్యలతామధ్య నాయకరత్న-
సుకర ప్రకల్పిత సూకరదంష్ట్ర-
నికర తత్కూర్మాస్థి నిచయదీధితులు
దులుకాడు ప్రతిభ హేతువుగాదె తలఁప
నెలఁదాల్పు మహిమకు నిత్యత్వమునకుఁ ?
గలయంగ సర్వాంగములఁ దేజరిల్లి
వెలుఁగు సురాసురాదుల కపాలములు
గలితాస్థిచయములు గరిగావె తలఁప
నెలఁదాల్పు మహిమకు నిత్యత్వమునకు ?

---

౧. నికర.

భ్రాజిత నిజదిష్య పాదాంబుజాత-
పూజిత హరినేత్ర పుండరీక ప్ర-
మిలితైకరుచులు నిమిత్తముల్ గావె
నెలఁదాల్పు మహిమకు నిత్యత్వమునకు ?
చలమూఁపుమీఁద ౧శ్రీవరు కళేబరము
నలరారు డాచేత నజు కపాలంబుఁ
గల దివ్యదేహంబుగాదె కారణము
నెలఁదాల్పు మహిమకు నిత్యత్వమునకు ?
నిత్యుండ నేన, యనిత్యు లందఱును
బ్రత్యయం బిదియను భావనదోఁప
హరివిరించ్యాదుల యస్థులుఁ దలలు
హరుఁడు మున్ గరుణమై ధరియింపకున్న
నా ముముక్షులకు స్వర్గాపవర్గాది
కామితసుఖము లే క్రమమునఁ గలుగు
హరి కమలజ కపాలాస్థిసంగతుల
హరుఁడు దా నపవిత్రుఁడగు నే తలంప
హరియును బ్రహ్మ నిజాస్థిమాలికల
హరుఁడు దాల్పఁ గృతార్థులై రెట్టులనిన,
చారు గంగానదీ సంగతాస్థులును

౧. శ్రీధరు.

వారక పరమపావనములు గావె?
భంగురతరశిల్యసంగతిఁ జేసి
గంగాప్రవాహ మమాంగళ్య మగునె?
తనర గంగాసంగత నిజాస్థిచయము
లనయంబుఁ బరమపావనములై వెలుఁగు
నాజీవులకును స్వర్గాదిభోగములు
బ్రాజిల్ల మీఁదట బ్రదుకవే? యట్ల
పొదలు మీఁదట బ్రహ్మపదవికి విష్ణు-
పదమునకి నివి బీజభావముల్ గావె?
హరివిరించుల కపాలాస్థు లట్లగుట
ధరియించు డది వికృత¹ప్రకారంబె?
కావున నింద్యముల్ గావు; సత్కర్మములు
దా విహితంబులే తాల్ప నందేని
నన్నెక్కి మును హిరణ్యాక్షు వధించి
తన్నుఁ దా మఱచి మదగ్రస్తుఁ డైన
నరసింహునకు నల్గి శరభరూపంబు
ధరియించి త్రుంచి యాతనిచర్మ మొలిచి
యలరి లోకముల సంహారంబు సేయు
²పులిరక్కసునిఁబట్టి నిలువు³తి త్తొలిచి

౧. ప్రభావంబె. ౨. పులియగు రక్కసు నిలుతిత్తి. యొలిచి.

పాదప్రకరణము

హరివిరించ్యాది సురాసురాదులను
బరిమార్చ తగ్గజాసురు మెట్టి వ్రచ్చి
మృగరూపమై పాఱఁ దెగిపడ నేసి
నగధరు కృష్ణాజినంబొల్చి హరుఁడు
గవచంబుగాఁ దొడ్గఁగద్దేఁ దాపించె
నివి నింద్యములె సుమహిష్ఠతల్ గాక?

ఉమాపతిత్వము

యోఁడురూపము సగంబైన దేవునకుఁ
బోఁడిగానెద్ది ప్రభుత్వమం దేని,
మొదల దక్షబ్రహ్మ కుదయించి గౌరి
మదనారిఁ దమ తండ్రి మతిదప్పి పలుక
దేవి-యత్యుద్ధతి దేహంబు నాత్మ-
పావకునకు[3] హవిగావించి, మీఁద
సరి నవినాభావ సంబంధలీల
హరు వామభాగంబునం దుండఁబడయ
నీశ్వరుం డర్ధనారీశ్వరుం డనఁగ
శాశ్వతప్రతిభమైఁ జను, నట్లుఁగాక
పలుమఱు 'మాతాచ పార్వతీ' యనియు

---

౧. కట్ట; కట్టు. ౨. యత్యద్భుత. ౩. హవిర్భావనసేసి.

నిలఁ 'బితా దేవో మహేశ్వర' యనియు
హరివిరించి సురాసురాదులు గొలువ
హరుఁడును గిరిజయు నగుదురు గురులు
నడిసన [1]ఖాండిక్యశాఖయం దెన్నఁ
బడు 'స పతిశ్చ స పత్నీచ' యనఁగ
సరి నేకలింగ నిష్ఠాపరతంత్ర
పరమ వీరవ్రత బంధురనిష్ఠ
'తావత్ త్వమేవ మాతా చ పితా త్వ-
మేవ' [2]యనువీర మాహేశ్వరావళికిఁ
దల్లియుఁ దండ్రియుఁ దానయై [3]నుతుల
కెల్లయై యర్ధనారీశ్వరత్వంబు
హరుఁడు ధరించె మున్నట్టిద కాదె ?
సరి నెఱుంగరె ? పరసమయుల్ కుమతులుఁ
గొంకక 'వజ్రచక్రాంక సరోరు-
హాంకం' బనుచు మ్రోయ వ్యాసాష్టకమున
ముంజేతి కంకణంబున కద్దమేల ?
రంజిల్లు వ్యాసకరము సాక్షిగాదె ?
జగములు శివశక్తి సంపుటంబగుచు
నెగడంగఁ గానరె? నిందయే ? మఱియుఁ,

---

౧. గాండీవ; ఖాండవ; కాండవ. ౨. యన్ లీల. ౩. సుతుల; మతుల.

## భిక్షాటనము

ద్ర్యక్షుండు త్రిభువన రక్షకుం డెట్లు
భిక్షాటనముఁ జేసెఁ బ్రీతి నందేని
బ్రహ్మఁ దార తార కర్తలమంచు హరియుఁ
గమలసంభవుఁడును గర్వించి పలుక
హరివిరించులగర్వ మడఁగింతు, నాదు
చిరమహత్త్వముఁ బ్రతిష్ఠింతుఁ బొమ్మనుచుఁ
గలుపించి యేతెంచి కాలరుద్రుండు
దలరక యజు మీఁదితలఁ ద్రుంచివైవ
నామహాబ్రహ్మ దా సాష్టాంగ మెఱఁగి
సోమాష్టకమున సమున్నతిఁ బొగడి
బ్రహ్మశిరోహర ! బ్రహ్మాత్మ ! వరద !
బ్రహ్మేశ ! శ్రీపరబ్రహ్మస్వరూప !
హర ! మత్కపాల మీ యవనిపైఁ బడినఁ
బరిహృతంబగుఁ జగత్త్రితయీయుఁగాన
మీకరోదరమున నీకపాలంబుఁ
జేకొని తాల్చి రక్షింపవే యనుచు
నలువ దా విజ్ఞాపనం బాచరింప
నలరుచు నట్లకాకని దయదొడఁగి
కాలరుద్రుఁడు దత్కపాలంబుఁదాల్చి

త్రాలుచు విష్ణులోకమున కేతెంచి
వాలి తన్నెదురు విష్వక్సేనుఁ బొడిచి
శూలాగ్రమున నెత్తి సురలు భీతిల్ల
కలకేతఁడగు నధోక్షజు రక్త మజుని-
బలుకపాలంబులోపల నించి మించి
నెట్టణ గర్వించినట్టివారలకు
నిట్టిద గతియని యిల విజృంభింప
వడఁకుచు మృత్యుదేవతయు దేవతలుఁ
దొడరుఁ దన్మూర్తి యద్భుతలీలఁ గాంచి,
"హర! దేవదేవ! మహాదేవ! యీశ!
శరణం"బనుచు జయ జయ రవం బెసగ
నంతంత సాష్టాంగులై ప్రణమిల్లి,
"కంతుసంహార! త్రిజగత్కర్త! హర్త!
యజహరిదర్పాపహారణ! రౌద్రాక్ష!
యజశిరోహర! ముకుందాస్థిదామాంక!
నెఱి 'బ్రహ్మణశ్చ దినే దినే' యనఁగఁ
దఱి 'నసంఖ్యాతా పితామహా' యనఁగఁ
గూలారఁ గోటానఁగోటులఁ బ్రలయ-
కాలంబునం దసంఖ్యాతంబులైన
యట్టి బ్రహ్మలను బ్రాహ్మణులను ద్రుంప

నట్టిచో మీకు నేహత్య ప్రాపించెఁ ?
దన కూఁతుఁ గవియు పితామహుఁ ద్రుంప
ననలాక్ష ! మీకు నేహత్య నాఁడయ్యె ?
దక్షప్రజాపతి తలఁ ద్రుంచునాఁడు
నక్షయ ! మీకు నే హత్య ప్రాపించె !
నిత్య స్వతంత్ర వినిర్గత బ్రహ్మ-
హత్యాది పంచమహాపాతకౌఘ-
విఫులదయాత్మ ! నీ విపరీతమూర్తి
నుపశమింపవె దేవ ! యుడురాజమౌళి !
భాగీరథినిబడి [1]బ్రాహ్మలు సావ
భాగీరథికి హత్య ప్రాపించు నెట్లు?
దావాగ్ని భూసురోత్తముఁ[2]డును జావ
దావాగ్ని కెద్ది పాతకము సిద్ధించు?
నితరులదృష్టికి నెట్లుండునో వి-
గత సకలాద్వైత కరుణావిధేయ !"
యనుచుఁ బ్రార్థించుచు నభయార్థు లగుచు
ననుపక్తి వెండియు నభినుతుల్ సేయ
నదియు భిక్షాటనంబన నొప్పెఁగాక
విదితంబుగాఁ బెఱవిధి గలదెట్లు?

---

౧. బ్రాహ్మణుల్. ౨. డొండు; డొకఁడు.

భవుచేతి కమలసంభవు కపాలంబు
భువి 'నార్ధ మ ప్యభిపూరితం' బనఁగ
ననవధియుగము లాహరిలలాటమున
ఘనముగఁ దొరఁగు రక్తప్రవాహమున
నెఱయ నర్ధార్ధంబు నిండద యనినఁ
గఱకంఠుపాత్రకుఁ గలదె భైక్ష్యంబు?
నరయంగ నవికలాజాండ సంఘములు
హరుగర్భ¹కోణంబునం దొక్కవలన
జనియింప మఱియు నీశ్వరుఁడుఁ దా నెఱుఁగఁ
డనిన నయ్యాశున కాఁకలిపోవ
భిక్షమ ల్లెవ్వరు వెట్టెద? రతని
కుక్షి యేక్రమమునఁ గూడంగనిండు?
మొదలబ్రహ్మకు బ్రహ్మపదవియు, విష్ణు-
పదవి విష్ణున, కింద్రపదవి యింద్రునకుఁ
దెల్ల²యిచ్చిన దేవదేవున కేల
యిల్లిల్లు దప్పక యేఁగ భిక్షలకు?
హరివిరించి మదాపహారణార్థమైన
హరుని భిక్షాటనం బను విజృంభణము
నది యీశ్వరునకు మహత్త్వంబుగాన

౧. గో౪. ౨. యిట్టిచ్చిన దేవునకేల.

యది యోగనిందయే? యదిహత్య యగునె ॥
పంచవక్త్రుండు వరబ్రహ్మ దానజుని
పంచమశిరము నేర్పడఁ ద్రుంచివైచె,
నిగ్రహానుగ్రహాన్వితపరాక్రమ స-
మగ్రత దుష్టుల మర్దించుచున్న
కర్తకుఁ ద్రిభువన భర్తకు, సకల
హర్తకుఁ దప్పె యన్యాయులఁ జంప
నంగజసంహరుం డదియునుఁగాఁక
గంగఁదాల్చుట యేమి గారణంబనినఁ

### గంగాధారణము

ప్రవితత సకలపురాణాదిమైన
శివపురాణోక్త ప్రసిద్ధప్రయుక్తి
రాజితంబగు నా పయోజలరాశి
భ్రాజిల్లు నాదిఁ జంద్రసమాగమమునఁ
బుట్టి తారాపథంబున వెల్లివిరిసి
బిట్టుబ్బి దెసలకు నిట్టద్రోచుడును
దేలుచు జగములు దెప్పలువోలెఁ
దూలంగ గంగ యద్భుతలీలఁ బొంగ
హరి విరించి పురోగ మాసుర సురని-

కరము గరము భయాక్రాంతాత్ము లగుచు
నవధులువెట్టుచు భువిఁజాఁగి మ్రొక్కి-
భవున కప్పుడు విన్నపం బాచరింప
మెల్లన నవ్వుచు మృడుఁడు దద్గంగ
మల్లికాదళభాతి మౌళి ధరించి
నాకోపకంఠంబుననుదదీయావ-
లోకనంబున దేవలోకంబు బ్రదుక
నాకాశగంగ దా నందప్పుదాంశ
మాకఱకంఠుఁ డుద్యల్లీల నునిచె
హరుఁడు జగద్రక్షణార్థమై గంగ
ధరియించె నదియు నింద్యమె? యట్లుఁగాక—

గంగావతరణము

యసమలోచను మౌళియందున్న గంగ
వసుధ ²కెవ్విధమున వచ్చెనంటేనిఁ
గపిలుని కోపాగ్నిఁ గాలిన సగర-
నృపసమూహంబున కపవర్గపదవి
గావింప నావియద్గంగఁ బృథివికిఁ
* [దేవలెననుచుఁ] దద్దేవి గుఱించి

---

౧. దదియ్యా. ౨. కు మున్నొట్లు. * ఈ పాఠము నాది. మఱి
యేపాఠమునకును నన్వయము ఘటుకదుగ లేదు. చి. నా.

వారి మనుమఁడు భగీరథుం డనఁగ
ధీరత నతివీర ఘోరతపంబు
నాకాంక్షమై ఁద్రికోట్యబ్దముల్ సలుప
నాకాశగంగ ప్రత్యక్షమై నిలిచి,
మెచ్చితి, నీకోర్కి నిచ్చెద, నిలకు
వచ్చెద, నాదు ప్రవాహంబు రాక
కోర్వఁడు భువి, గాన శర్వు భజింపు,
సర్వలోకాధీశు జడల వసించి
యరుగుదెంతు ననుడు నా భగీరథుఁడు
హరునిఁ బ్రసన్నుఁగా నట్లు మెప్పింపఁ
గామారియును జటాగ్రం బట్టు సాప
నా మహాగంగ గృతార్థతానియతి
ననమ తదీయ జటాగ్ర భాగమున
వసియించి తజ్జటా [1]భసిత మధ్యమున
నింకుడు నతఁడు మహిమ సద్భక్తి
శంకరు మఱియుఁ బ్రసన్నుఁగాఁ బడయ
'నంగుష్ఠ తర్జనీభ్యాం స *భస్మా' య-
నంగ నీశుఁడు జటాసంగతభూతిఁ
జిటికెన ఁవ్రేల నంగుటము గోరంద

1. వబ. * గణముకోసము దీర్ఘము.

యటు గొంత సంధించి యవనిపై ¹విద్రువ
ధర 'నఖాగ్రాదపతి' త్తనఁ బృథివిఁ
బరగె నఖాగ్ర సంభవలీల గంగ;
దుది 'భస్మవర్ణం తతో జలం' బనఁగ
నదియును భస్మవర్ణాంకమై యిట్లు
క్షితి హితార్థమును భాగీరథి గంగ
యతుల నదీప్రవాహ స్వరూపమునఁ
బఱపెఁ దత్సగరులపై భగీరథుఁడు
నలిలేక తమ వంశమ ట్లుద్ధరించె
నిదియు శైవపురాణ విదిత ప్రయుక్తి;
యదిగాక మూలాగమాదులలోనఁ
జారుతరంబగు స్వచ్ఛందలీల

గంగోత్పత్తి

భైరవాగమమునఁ బార్వతీసతికి
వరుఁడు భూమండలవర్ణన లేక
సురగిరి వర్ణించుచును దన్నగంబు
నాల్గుదిక్కుల గంగ నరలోకమునకు
నాల్గుభాగంబులై నలిఁదిగె ననెడు

---

౧. విడువ. ౨. లలిత.

హరునకు గిరిజ గరాబ్జముల్ మొగిచి
'సరిగఁ దా 'యస్య ప్రసాదేన' యనఁగ
మహి 'సురసిద్ధనమస్కృతా' యనఁగ
మహి సురసిద్ధనమస్కృత గంగ
యాది నెట్లుదయించె నాదట నొఁ బ్ర-
సాదింపవే దేవసత్తమ! యదియు
సురగిరి కేమి ప్రస్తుతమున వచ్చెఁ
గర మెట్లు నరలోకగామినియయ్యె'
ననుడు 'గంగాయాస్తు' అన 'సముత్పత్తి'
మనఁ 'గథయిష్యామి' యన 'సువ్రతే' య-
నను బార్వతీశుఁ డన్నాతి వీక్షించి
వినుము గంగోత్పత్తి వివరింతుఁ బ్రియుఁడ
నయి 'జగన్మాతా మహాదేవి' యన వి-
నయ మొంద మును జగన్మాతవై వెలుఁగు
నీవు దొల్లియుఁ దన దేవివ యిట్లు
గావున లోలాక్షి కస్వరబుద్ధి
నొక్కనాఁ డేమఱకుండంగ వెన్క-
దిక్కున నీవు నేతెంచి మేలంబు
దళుకొత్త నాదు నేత్రంబులు మూయ
జలజాక్షి! ఫాలవిశాలలోచనము

విచ్చితి నాకన్ను విచ్చిన నంతఁ
జిచ్చు హేమాచలశృంగంబు దాఁక,
నతిభీతి నీవు నాయంఘ్రుల కెఱఁగి
కతమేమి దేవ! యీకన్ను విచ్చుటకు
నావుడు సస్మితాననరుచు లెసగ
'దేవి! నాకన్నులు దినకరశశులు,
నీవుగప్పుటయును నిఖిలలోకముల
కావృతంబుగఁబర్వె నంధకారంబు,
నీకరంబులు ద్రోవనేరక యేను
లోకత్రయంబును లోవెలుఁగింపఁ
దెఱచితిఁ, దెఱచిన దీని కేమియును
వెఱవంగవల దరవిందనిభాస్య ;
నీమూసినపుడు నానేత్రంబులందు
భామిని! యానందబాష్పముల్ గ్రమ్మ
విడుచుడు నీపది[౧] వ్రేళ్లను దుదలఁ
దొడిఁదొడిఁ బుడమిపై[౨] వొఱఁగె బిందువులు,
వది ప్రవాహంబులై పాఱ నందొక్క-
నది మముఁ బ్రార్థించి నారాయణుండు
గొనిపోయె నందు వైకుంఠలోకమున

౧. వ్రేళ్ళతుదలను. ౨. బడియె.

జనుల నెల్లను గృతస్నానులఁ జేయ;
బ్రహ్మ యం దొకనది భక్తిన న్వెడలి
బ్రహ్మలోకమున కేర్పడఁ గొనిపోయె;
నాకలోకమునకు నన్నుఁ బ్రార్థించి
నాకేశుఁ డందొక్క నదిఁ గొనిపోయె,
నదియును శశిమండ లావృతయగుచుఁ
జదలేఱు నా నొప్పె స్వర్గంబు పొంత;
నున్నయన్నదు లేదు నుప్పొంగి నిండి
సన్నుత గంగాప్రశస్తనామమున
ముల్లోకముల వెల్లి ముంచు నావేళఁ
దల్లడపడి బ్రహ్మ దామోదరేంద్ర-
సకల సురాసుర సంఘ మేతెంచి
చకితాత్ములై చక్కఁ జాఁగిలిమ్రొక్కి,
'యభయ మభయమయ్య యంబికానాథ!
యభయ మభయమయ్య యఖిలాండనాథ!
శరణయ్య శరణయ్య శమితసురార్తి!
శరణయ్య శరణయ్య శాశ్వతమూర్తి!
రక్షింపు రక్షింపు రజతాద్రివాస!
రక్షింపు రక్షింపు ప్రమథవిలాస!
యుద్ధత గంగా మహోర్ములఁ బాపి

యుద్ధరింపుము మమ్ము నుక్షేంద్రవాహ!'
యంచు నన్ బ్రార్థింప నంత తద్గంగ
మంచుబిందువుఁబోలె మౌళిఁ దాఁ దాల్ప
నంత న య్యజహరీంద్రాది గీర్వాణు
లంతంత ధరణి సాష్టాంగులై మఱియు
'గరళాగ్ని మూఁడులోకంబులఁగాల్ప
ధరియించి కాచితి దండ్రి! యానాఁడు,
మూఁడులోకంబుల ముంచిన గంగ
నేఁడు దాల్చి మమ్ము నెఱయఁగాచితివి
గంగాప్రవాహోదకవిలోకనమున
మంగళంబయ్యె నమర్త్యలోకంబు
గావున మర్త్యలోకంబును నిట్ల
పావనంబుగఁ జేయఁబనుపవే శీఘ్ర-
గతి' ననవుడు మహాగంగాప్రవాహ-
పతనవేగంబునఁ బగులు ధరిత్రి
యనుచు మదీయ జటాగ్రకేశంబు-
కొనఁజాఁగి సౌవర్ణకుధరంబుమీఁదఁ
బడి నలుదిక్కులఁ బాఱఁగఁజేయ
వడి భువనములఁ బావనము సేయుచును
నదియు సీతాహ్వాయ మనఁగఁ బూర్వమున

వదలకచని పూర్వవారాశిఁ గలసె;
దక్షిణంబునను 1సుపక్షనాఁ బరగి
యక్షీణగతి దక్షిణాంబుధిఁ గలిసె;
నలిఁ బశ్చిమమున సునంద నాఁ బరగి
యలరుచుఁ దత్పశ్చిమాంబుధిఁ గలిసెఁ;
బూనరుచ నుత్తరంబున రుద్రసోమ
యనఁగూడె నయ్యుత్తరాంబుధి ' ననుచు
నున్నత గంగాసముత్పత్తివిధము
మున్ను లోకము లెల్ల ముంచినవిధము
వెఱచి విష్ణ్వాదులు మొఱవెట్టువిధము
మఱి దేవుఁ డాగంగ పట్టి ధరించి
విష్ణువిరించుల వివిధలోకముల
జిష్ణుముఖ్యులను రక్షించినవిధము
*[సురలప్రార్థనఁ జేసి జూటంబుగంగ
ధరణికి బిందుమాత్రమునను హేమ
నగముపైఁ బడి యది నాల్గుదిక్కులను
దిగి వేలువేల ఘటిల్లు నామముల

---

1. సుదత్త; సుదేతు.

* కుండలీకరణము చేయఁబడిన పంక్తులు పూర్వముద్రణమున లేవు. చి. నా.

నాల్గుదిక్కులఁ బుణ్యనదులుగా నొప్పి
నాల్గువారిధులకు నడచినవిధముఁ
బోవుచు నాగంగ భువిని మర్త్యులను
బావనంబుగఁ జేయఁ బాల్పడ్డ విధము
దేవుఁ డానతియిచ్చె దేవికి నిట్లు]
గావున నదియ గంగాసముత్పత్తి

త్రివిక్రమ ఖండనము

యదిగాక బలిదాన మడుగంగవచ్చి
మదియించి తొంటి వామనరూప ముడిగి
ప్రోడఁ ద్రివిక్రమరూపంబుఁ దాల్చి
యోడక మీఁదికి నొక్కకా లెత్తి
నాకాలిఁ గడిగెఁ దా నటఁ బద్మసూతి
యేకోదకంబైన లోకముల్ ముంప
గాలి మున్నా బ్రహ్మ గడిగిన నీర
యీ లోకముల ముంచె నింత నీరికిని
నిండారు బ్రహ్మాండనిభమైన యట్టి
భాండ మయ్యెడఁ బెట్టి పట్టె నెవ్వండు?
నిల నింత నీరు మున్నేచోట నుండె?
నెలమిఁ దెచ్చిన [1]బుధుఁ డెవ్వఁ డిచ్చటికి

[1] బంధు.

## వాదప్రకరణము

మును గాలిఁ గడిగించుకొనినయతండు
దనకాలి నీరికిఁ దానేల బెదరె?
ఘనమదియట్ల లోకములకుఁ గాక
తనకాలి నీ రిది దనకు ఘనంబె ?
జనముల రక్షింపఁజాలినయతఁడు
మొగి నీశ్వరునకేల మొఱవెట్టవచ్చెఁ ?
బుండరీకభవు కమండలువునకు
నిండారి మున్నున్న నీరయ్యెనేనిఁ
దనకమండలు సముద్గతజలంబునకు
మును శివునకు నేల మొఱవెట్టె నజుఁడు ?
నొడఁబడ విష్ణుపదోద్భూత యనఁగఁ-
బడు వియద్గంగ శ్రీపతికాలినీరె?
హరియనఁ గప్పకు హరియన హరికి
నరయఁ బేరొకఁడైన హరి గప్పయగునె ?
విష్ణుపదం బన విష్ణుకాలికిని
విష్ణుపదం బన విదితంబు దివికిఁ
బేరొక్కఁడైయున్న కారణంబునను
నీరజాక్షునికాలు నింగి దా నగునె?
ధాతుయౌగికయుక్తిఁ దలపోయ శబ్ద-
జాతార్థములు వెఱచందముల్ గావె?

హరికాలిసీరిది యనువార లతని
మరణంబుఁదలఁపరే? మఱియట్లుఁగాక,
యిలఁగ్రొవ్వ మెట్లు గాలెత్తుచుఁ దర్దఁ
గలుపించి యాత్రివిక్రముని భంజించి
కాలునిఁ దలతోన కోలెత్తు విఱచి
శూలి ధరించె మున్ గేల ఖట్వాంగ
గతిఁ 'ద్రివిక్రమ మహాకంకాళ' యనుచు
నతుల మహానాటకాదుల మ్రోయఁ;
గాలు గల్గినఁ గదా కడుగు నొక్కండు?
గాలు గల్గినఁగదా కడగించుకొనుట?
దలఁప నెచ్చటనైనఁ దా నూరులేక
పొలమేర గల్గునే భువిఁ? బురాణోక్తిఁ
జనఁగ 'గ్రామోనాస్తి' యనఁగఁ 'బత్సీమ'
యనఁ గాలులేక నీ గది యెట్లు గలిగె?
మూల మట్లునుఁగాక మొగిఁ ద్రివిక్రముఁడు
గా లూర్ధ్వలోకమున్ గడవఁ జూచుడును
నవిరళంబైన బ్రహ్మాండకటాహ-
మవియుడు మీఁది జలావరణంబు
నీరు పొచ్చుడు దివి నిండెనేనియును
నీరజాక్షుని కాలి నీరు దానగునె?

జహ్నునిలోఁ జొచ్చి జానుల వెడల
జాహ్నవి యను పేరు సంధిల్లునట్లు
హరికాల నది పుట్టె నట్లయ్యెనేని
హరిచరణోద్భూత యను పేరు వలదె ?
తెల్లంబుగా సురదీర్ఘికయండ్రొ
తెల్లంబు వైష్ణవదీర్ఘికయండ్రొ ?
యరయ స్వర్ణదియనఁబరగునో కృతుల
హరిలోకనది యనఁబరగునో కృతుల ?
ధర వియద్గంగనాఁబరగునో కృతుల
ధరఁ బాదగంగనాఁబరగునో కృతులఁ ?
దవిలి సత్కృతుల మందాకినియండ్రొ
భువిఁ జెప్పఁగలదొ వైష్ణవియనుపేరు ?
నీ యథాకథన మిట్లెఱుఁగక భ్రమసి
పాయక తప్పులువలుకు పాతకుని
క్రొవ్వేద వాని ముక్కున నోరఁ దోఁకఁ
బ్రువ్వులు దొలఁగవే భువిఁ గొండలుగను,
నదిగాక యిట్టి దురాత్ములు సదువు
చదువులు వినఁజన్నె [1]సభ్యేతరములు ?
నిన్నఁగా దటమున్న నీరజోదరుఁడు

---

౧. శంభుభక్తులు.

బన్న పఱ్చుచు బలి బంధంబు సేసి-
నంతఁ ద్రివిక్రముండై కాలు సాఁప
నంతరిక్షంబున నంబుజభవుఁడు
దనదు కమండలూదకమునఁ గడుగఁ
జనియించెనట యాదిసంభవ గంగ!
యిట్టి విరుద్ధంబు లీయబద్ధంబు
లెట్టు వినంగ సహింపఁగవచ్చు?
నీలకంఠుఁడు భవానీ వల్లభుండు
లీలమై గంగదాల్చిన మఱి పెక్కు-
యుగములు సనఁజన నొక ప్రసంగంబు
జగదంబ పార్వతి సన్నతి వేఁడ
భవుఁడు సదానంద భరితాత్ముఁడగుచు
నవు 'జగన్మాతా మహాదేవి' యనుచు
రతి 'మమ పత్నీ పురా హి సా' యనుచు
నతులితప్రీతి దుల్కాడ శంభుండు
గంగాసముత్పత్తి క్రమముఁ, దా మౌళి
గంగ ధరించిన క్రమమునుఁ జెప్ప
నంత ననేక మహాయుగార్బుదము
లంతరింపఁగ సముద్యత్తపోనియతిఁ
బృథివికి మఱి భగీరథుఁడను నృపతి

గణనీయ యగు వియద్గంగఁ దెచ్చెదును
గరము భాగీరథీ గంగనా మఱియు
వరకీర్తి లోకపావనలీల నొప్పె,
నిట వామనుని కాల నెసగెనే గంగ
యటఁ దొంటి మత్స్య కూర్మాదివరహా-
నరసింహమూర్తులు నాఁ డెట్లు గలిగె?
హరహర! నేఁ డెట్లు హరి కాలఁ బుట్టె?
హరియవతారాది యనఁ జను మత్స్య
మరుదొందఁ దద్గంగయంద జనించి
మెలమి నగస్త్యదోయిటికి నే తేర
నలి నగస్త్యుఁడు దర్పణము సేసిచేసి
యమ్మీను స్వర్గమయంబౌట నతిము-
దమ్మున నర్ఘ్య[1]మెత్తక చూచుచుండ
‘విడువు మంజలి, దాను విష్ణుండ, భృగుని
కడిఁది శాపమున నీకాయంబుఁ దాల్చి
మహి జనించితి’నంచు మత్స్యపురాణ-
మహితసంగతి నీశు మహిమ నిష్ఠించె,
నదిమున్నొ యిదిమున్నొ? యాగంగ యెట్లు
గదిసి యీ వామను కాల జనించె?

---

౧. మెత్తుక.

నదియునుఁగాక కూర్మావతారమున
మొదలఁ వారాశియం దుదయించి యట్ల
భాగీరథీతీర పావనభూమి
నాగమోక్తిఁగ మునులందఱు వినఁగ
రచియించెఁ గూర్మపురాణప్రయుక్తి
నచలితభక్తి మహాదేవు మహిమ
యదిమున్నో యిది మున్నో? యాగంగ యెట్లు
గదిసి యావామనుకాల జనించె?
నదిగాక తద్వరాహావతారమున
ముదమున నట్లు సన్మునులెల్ల వినఁగ
సుస్థితి 'గంగాతటే స్థితే' యనఁగ
నాస్థ వారాణసియందు వసించి
రమణ వరాహపురాణంబు సేసి
యమృతాంశుమౌళి మహత్త్వంబుఁ దెలిపె
నదిమున్నో యిది మున్నో ? యాగంగ యెట్లు
గదిసి యావామనుకాల జనించె ?
నదిగాక మును నృసింహావతారమున
సదమల ప్రీతి శ్రీ శైలంబునందు
దివురు నావాహన తీర్థంబునందు
భువి సరస్వతియనఁ బొలుచు నాకాశ-

జాహ్నవీ దీర్ఘికా సరళ పాతాళ-
జాహ్నవీ దీర్ఘికా సంగమంబునకుఁ
బారిఁబారి వచ్చుచుఁ బోవుచునుండు
నరసింహ ఖేలమన విరచించి యందు
సను బెంచి సదిఁ గృతస్నానుఁడై యంద
ఱని నరసింహేశు శరభేశు దేవ-
దేవు నావాహన తీర్థాధివాసు
భావించి యనిశంబు భజియింపుచుండ
నదిమున్నొ యిదమున్నొ? యాగింగ మెట్లు
గదిసి మూవామనుకాల జనించె!
నదిగాక వామనుఁ డబ్జజాండంబు
గదియఁ గాలెత్తిన గర్వంబుసూచి
కమలసంభవుఁ డుమాకల్యాణవేళ
నమృతాంశుశేఖరుఁ డసమకారుణ్యా
మతిఁ దనకొసగు కమండలూదకము
ధృతి వియద్గంగాదితీర్థ జలాస్త్ర-
ములచేత నుపశమంబుగఁ జేతఁగాక
కలయఁ ద్రివిక్రము కాల్గడుగుటమె?
యంబువుల్ గైదువులగునె యండ్రేని
నంబువుల్ గైదువులగుట వినుండు—

ఆమహిషాసురహరణంబు వేళఁ
గామించి దుర్గకుఁ గాలకంఠుండు
శూలాయుధమ్ము, విష్ణుండు సక్రము, వి-
శాలకమండలు జల మబ్జభవుఁడు,
నమరేశ్వరుఁడు వజ్ర, మఖిల దేవతలుఁ
దమతమ దివ్యాయుధంబుల నొసఁగ
నరయ మార్కండేయ మను పురాణమునఁ
బొరి 'బ్రాహ్మణీమంత్రపూతేన' యనఁగ
క్షితిఁ 'గమండలు జలాక్షేపేన' యనఁగ
సతి కమండలు జలాస్త్రముల యుద్ధతికి
నగపడి మహిషాసురాదులు మడిసి
రొగి 'హతవీర్యా హతౌజసో' యనఁగ
నటుగాన బ్రహ్మచే నవగతిఁ బొందెఁ
గుటిలవామనుని కా; లటుగాక మఱియు
గిరిజాకరాంగుళ కీలితహర్ష
హరనేత్ర ¹జనిత గంగాంబువు లెట్లు
హరిపాద¹జనిత గంగాంబువులయ్యెఁ ?
బరికింపనిదియు నబద్ధంబు గాదె ?
తనపాదజలములు దన కెట్లు గలిగె

---

౧. సంజనితాంబువు.

ననయంబు నర్ఘ్యపాద్యాది క్రియలకు
హరిప్రతిష్ఠా సమయాభిషేకాది-
కరణాది మంత్రసంస్కారక క్రియలకు
నన్నపానాది సమన్వితక్రియల
కెన్న నర్హంబె, [1]మే మెఱుఁగరుగాక ?
యిట్టి ప్రత్యయము లనేకంబులుండ
నెట్టు వల్కఁగవచ్చునే తార్కికులకు
నదియునుగాక మున్ హరియును హరుఁడు
గదిసి యొక్కండైన [2]క్రమ మెట్టులనిన-
హరుఁడు దా హరిగాఁడు, హరిగాఁడు హరుఁడు,
హరి గుహాసురహరణార్థమై వచ్చి
హరునకు సాష్టాంగుఁడై ప్రణమిల్లి
కరములు నిజమస్తకంబునఁ జేర్చి
"హరుఁడ! శాశ్వతుఁడ! వ్యాఘ్రాజినాంబరుఁడ!
హరుఁడ! యీశ్వరుఁడ! శశాంకశేఖరుఁడ!
హరుఁడ! శంకరుఁడ! యుమార్ధాంగధరుఁడ!
హరుఁడ! మద్వరుఁడ! దయాసరిద్వరుఁడ!
హరుఁడ! చిద్వరుఁడ! నతాఖిలామరుఁడ!
హరుఁడ! కర్మహరుఁడ! హతగజాసురుఁడ!

---

౧. యేమెఱుఁగరు. ౨. కథన మెట్లనిన.

హరుఁడ! సముద్యన్మహాగుణప్రసర!
హరుఁడ! గుహాసురుఁ డనునొక్క యసుర
యేచి సురలనెల్ల నేఁపుచున్నాఁడు
నాచేత మీచేత నలినజుచేతఁ
జావఁ; డొక్కనిచేతఁ జానకుండంగ
భావజారి! వరముఁ బడసినవాఁడు;
ఆరక్కసునిఁ జంప నతులిశశక్తి
వారక కృపసేయవలయు, నెట్లనిన
జహ్నుకన్యావతంసా! నీదురుద్ర-
చిహ్నలంగాని భర్గితుఁడుగాఁ డసుర,
సిరదయామతి రుద్రచిహ్నలు నాకుఁ
గరుణింపవే జగత్కంటకారాతి"
యనుచుఁ బ్రార్థింప శివాజ్ఞాపనమునఁ
దనదేహమున వామదక్షిణార్ధముల
నరుదొంద శంఖ చక్రాదిచిహ్నంబు
లరుదగు రుద్రచిహ్నములు ధరించి
హరు సముద్భట మహదాజ్ఞాప్రశక్తి
హరి గుహాసురుఁ ద్రుంచె, నదియాదిగాఁగ
హరి హరుఁడనన్నొప్పె నంతియకాక
హరుఁ డగునే హరి? యట్లయ్యోనేని

నొగి లక్ష్మియును గౌరియును నర్ధమర్ధ-
మగుశక్తి వలువదే హరిహరాంగునకు?
హరక పుట్టినవాఁ డొక్కరుండు
మారకుమారుల మాడ్కిఁ గావలదె?
కుందక హరిహర గుళ్లమీఁదటను
బందియు నందియుఁ బరగంగవలదె?
హరిహరుఁ డనుమాత్ర హరియును హరుఁడు
సరియనికొలుచు దాసరుల ఫాలములఁ
దిలకంబు నిడుబొట్టు దిరుమన్ను భూతి-
వల దె వారికిఁ గాకి[1]వ్రాఁతల పగిది?
హరిహరాంగము లేక మనియెడు నరులు
వురిగొను సర్వాంగములును బద్మంపుఁ
బూసలుఁ బటికంపుఁ బూసలుఁ దులసి-
పూసలు రుద్రాక్షములుఁ దాల్పవలదె?
హరిహరుఁ బూజించు నతఁగుల కొక్క-
హరిహరలోక మెందైనను వలదె?
యూహింప నిటువంటి వొక్కండు లేమి
నీహరిహరులు దా రేక మెట్లైరి?
యొగి 'యథా స్యాపానయో స్సామ్య' మనఁగఁ

---

౧. వాతుల.

ధగు సూతసంహితార్థము విచారింప
నగునె సమాన మాస్యాపానరంధ్ర-
యుగ మొక్కయెడలన యుండు, నుండియును
నడరు నుత్తమ మధ్యమాధమాంగంబు
లొడ లొక్కటనయుండు, నున్న సమంబె ?
హరిహరాంగము లేకమై మేననున్న
హరునిసమానమే హరి ? యట్లుగాక
ధర * హిరణ్యాక్షుడన్ దైతేయు ద్రుంప
హరి నరార్ధంబు మృగార్ధంబు ననుట
నరుడు సింగంబు [1]నెన్నగ నొక్కడనిన
గరణిమె ? [2]సింగంబు నరుడు దానగునె ?
యానరహరి హిరణ్యాక్షు వధించి
తానహంకారమదగ్రస్తు డగుడు
త్ర్యక్షుండు నరసింహు హరియింప దలచి
పక్షిరూపార్ధ మేర్పడ మృగరూప
మర్ధంబునై నరహరి ద్రుంచె ; దత్ క్ష-
ణార్ధంబునను శరభాహ్వయం బెసగ

---

* 'హిరణ్యకశిపు' — యుండవలెనేమో. కాని యేప్ర
యందును నాపాఠము గానరాదు.

౧. నునలి. ౨. నరుడుసింగంబు.

హరుఁ డిట్లు నరసింహహరణార్థముగను
ధరియించె మృగపక్షితనువు లంతటన
మృగమును బక్షియు మితి నొకఁ డనిన
పగిది నమ్మృగమును బక్షియు సమమె?
స్ఫుటవీరఘోరతపోనిష్ఠవర్తి
నిటలాక్షు గౌరి సాన్నిధ్యగాఁ గొలిచి
పతిదేహ మర్ధంబుఁ బడసినంతటను
సతిగాక గౌరి యీశ్వరుని సమంబె?
కావున హరిహరాంగము గర్గానేని
వారిరి నొకఁ డనవచ్చునె? మఱియు
హరిహరవాద శబ్దార్థప్రయుక్తి
హరిహరుఁడన నొక్కఁ డనియె దేవ్ వినుము-
కాముని హరియింపఁగాఁ గామహరుఁడొ?
గాముండు హరుఁడు నిక్కం బొక్కరుండో?
కాలుని హరియింపఁగాఁ గాలహరుఁడొ?
కాలుండు హరుఁడు నిక్కం బొక్కరుండో?
త్రిపురముల్ హరియింపఁ ద్రిపురహరుండొ?
త్రిపురముల్ హరుఁడును దెల్ల మొక్కండో?
కర్మముల్ హరియింపఁ గర్మహరుండొ?
కర్మముల్ హరుఁడు నిక్కం బొక్కరుండో?

యనయంబు వేదంబు 'హరిగ్ం హరంత
మనుయాంతి దేవ' నా హరి హరించుటను
ధృతి 'హర ఇత్యు¹చ్యసే తతో' యనఁగ
శతధృతిముఖ్యుల సంహరించుటను
మఱియు 'సర్వం విష్ణుమయ' మను హరిని
నఱిముఱి సర్వంబు నటు హరించుటను
హరిహరుండను నామ మయ్యెఁ గా కిట్లు
హరియును హరుఁడు నైక్యముగారు, వినుము—
* [ధర్మంబుగలవాని ధర్మియన్నట్లు
గర్మంబుగలవానిఁ గర్మియన్నట్లు
పాపంబుగలవానిఁ బాపియన్నట్లు
గోపంబుగలవానిఁ గోపియన్నట్లు
గరము గల్గుటఁజేసి కరియన్నయట్లు
[శరము] గల్గుటఁజేసి [శరి] యన్నయట్లు]
హరము గలుగువాఁడు హరియగు, నతని
హరియింపఁ గలవాఁడు హరుఁడగుఁ గాక,
హరిహరనామాంత రాంతరంబైన
నరయంగవలవదే యట్లయ్యెనేని

---

౧. 'చ్యతే'.

* కుండలీకరణము చేసినపంక్తులకు సంస్కృతానువాదము లేదు

హరిగొన్నయర్ధంబు నద్రిజ గొనునె?
హరి యద్రిసుతగొన్న యర్ధంబుఁ గొనునె?
సరి నవినాభావసంబంధ మగుట
గిరిజయర్ధంబు శార్ఙ్గికిఁ గొనరాదు
గిరిజార్ధదేహు దక్షిణభాగ మట్లు
హరికిఁ గొనంగరా దది యసంభవము;
హరునకుఁ దను వర్ధమైన లేకుండ
హరి గౌరిఁజేరి యొక్కర్ధంబుఁ గొనునె?
నాఁడాదిగాఁగఁ బినాకి లేకున్న-
వాఁడో? సాములు గొన్న వనితయు హరియు
ద్రోహిజన్మములో స్వదేహకోపాగ్ని
నాహవనీయాగ్ని నట భస్మముగను
జక్కన తనరెండుసగములుఁ గూర్చి
ముక్కంటి దనతోంటి మూర్తిఁ గైకొనెనో?
హరియు హరుఁడు నర్ధమర్ధంబుఁగూడ
ధర వారి యున్నయర్ధము లెందువోయె?
నావడ శివుని దేహార్ధశేషంబు
ఫాలంతిఁ బార్వతిఁ జేరుఁబో, యట్లుగాక,
సకళనిష్కళ నదైశ్వర్యాంగుఁ డగుట
సకలేశుతనువు శాశ్వత; మెట్లుఁ జెడద;

యక్కట! కమలాక్షు చిక్కినదేహ
మెక్కడఁబడియెనో యిల? నట్లుఁగాక
నిటలలోచనునకు నీరజాక్షునకు
నటమున్న దేహంబు లర్ధమర్ధములొ?
యాక్షితి నవి చేను లిటుఁగొన్ని గలవొ?
లక్షింప హరిహరునకుఁగాని లేవొ?
ఖలు గుహాసురుఁ జంపఁగాఁ బట్టి యిట్లు
గలసిరో సగము సగముఁ జిక్కనిడిచి?
కాదేని హరిహరాంగము లవి గలవొ?
యాదటఁ బుట్టెనో యాక్షణంబునను?
దప్పేమి పుట్టిన? ధరఁ దల్లిదండ్రి
సెప్పఁగలరొ? లేరొ? చెప్పెడిదేమి?
హరి యయోనిజుఁడె పూర్వావతారముల?
ధర లేరె తల్లులుఁ దండ్రులు నాఁడు?
బ్రతి మత్స్య కూర్మ వరాహయుగ్మముల
రతిఁ బుట్టె మత్స్య కూర్మ వరాహతతులు;
బ్రల్లన వ్రేయఁ గంబముఁ జేరఁ దండ్రి
దల్లియుగాఁ బుట్టెఁ దరువాతియతఁడు;
నదియునుగాక యింద్రానుజుం డనఁగ
నదితికి నుదయించె నవ్వామనుండు;

బల్లిదుఁ డనఁబడు పరశురాముండు
డెల్లము రేణుకాదేవికిఁ బుట్టె;
ధరణిఁ గౌసల్యకు దశరథుం డనెడు
నరపతికిని బుట్టె నడిమిరాముండు;
నొగి నొక్కగొల్లెత కుద్భవంబైరి
మొగి బలరాముండు సొగయు కృష్ణుండు
భువి నొక్కజినునకు బుద్ధుండు వుట్టె
నవనీశునకుఁ బుట్టె నటమీఁదఁ గల్కి;
స్రష్ట యథోద్వార సంగతిఁబుట్టె
స్రష్ట నాఁ గౌమారసర్గ నామీఁద;
నాకూతికిని ఋభుండను నొక్కయతికి
నాకాంక్ష జనియించె యజ్ఞుండు నాఁగ;
నలి మరుద్దేవికి నాభిరాజునకుఁ
జెలఁగుచు నర్షభుఁడన్ జినుఁ డుదయించె;
ననసూయ యనుసతి కత్రి యన్ మునికి
ననురక్తిఁ బుట్టె దత్తాత్రేయుఁ డనఁగ;
బోయెతకడుపునఁ బుట్టెను బాద-
రాయణుం డనఁగ నారాయణుం; డట్లు
ధారుణి వెండియు ధన్వంతరియన,
నారదుండన, నరనారాయణులన,

మును గపిలుం డనుమునియు, మోహినియు,
ననువీర లాదిగా నవతారకోట్ల
కెల్లను దండ్రులు, దల్లులుఁ గలుగఁ
దల్లిదండ్రులు[1] లేరె తొల్లియాహరికిఁ?
దల్లిదండ్రులు లేమి దథ్యమేనియును
గల్ల[2]యీ హరిహరాంగముల జన్మంబు;
దల్లిదండ్రులు నుంట దథ్యంబయేనిఁ
దల్లిదండ్రులుగల దైవాధముండు,
భవపాశబద్ధుండు, బహుకష్టగతుఁడుఁ
దివిరి యుత్పత్తిస్థితిలయవశుండు,
హరి[3]పరాత్పరుఁడె? నిత్యానందమయుఁడె?
పరమతేజఃపుంజ[4]భాస్వరాంగుండె?
పరమస్వతంత్రుండె? పరమేశ్వరుండె?
పరమాత్ముఁ[5]డే పరభట్టారకుండె?
సర్వజ్ఞుఁడే? సదైశ్వర్యాతిశయుఁడె?
సర్వేశ్వరుండె? శాశ్వతుఁడె[6]యీశౌరి
హరునితో, నతిదయాపరునితో, మోక్ష-
కరునితో, లోకైకగురునితో, నసమ-

---

౧. వేఔ. ౨. యా. 3. వరాపరు. ౪. భాసు. ౫. డె పరమ.
౬. యా.

నేత్రుతో, నిర్మలగాత్రుతోఁ [1]ద్రిమల
జైత్రుతో, [2]గేయచరిత్రుతో, నిత్య-
కీర్తితో, దూరీకృతార్తితోఁ, జిష్ణు-
పూర్తితో, సురలింగమూర్తితోఁ బోల్పఁ
గలవె యభేద[3]సంగతగుణాంకములు ?
దలపోయ నంతరాంతరములు లేవె ?
ప్రద్యోతనుండును ఖద్యోతములును,
విద్యుల్లతాదులు విస్ఫులింగములు,
పూర్ణచంద్రుండును బోలుచుఁ జుక్కలును,
స్వర్ణాద్రియును వాయసస్వర్ణశిలలు,
బాడబాగ్నియు[4]శిలోద్భవ కృష్ణవర్త్మ
గూడెనె ? [6]యభవుతోఁ గూర్పంగవశమె ?
కావున హరిహరాం[7]గము లేకమగునె ?
యేవెంటఁ బొందుగా దిల ; నట్లుఁగాక,
విష్ణుండు శివుఁడు నా వేఱె ? 'శివాయ
విష్ణురూపాయ' నా, వెండియు నంద
దిను 'శివరూపాయ విష్ణవే' యనఁగ

---

౧. ద్రిసుణ. ౨. గీత. ౩. సంగతి. ౪. వాయసవర్ణపుశిలలు. ౫. శిలోచ్చయ ; బాడబాగ్ని శిలోద్భవశిఖిరుచులు. ౬. యజునకు. ౭. గంబొక్కఁడగునె.

మును మ్రోయఁ దత్సూక్తు లవియె?' యంటేని,
దలఁపఁ బ్రక్షిప్త[1]సూక్తములు గాక శ్రుతులు
వలుకునె శివుని [2]రూపము విష్ణుఁ డనుచుఁ?
దవిలి మూర్తామూర్త తాత్త్వికంబైన
శివు[3] దివ్యరూపంబుఁ జెప్పెద వినుము,-
*[ధరనట్లు పఞ్చవహాస్తంభం బనంగఁ
బరశివతత్త్వంబు వరగు వేదములఁ]
దనరారఁగ 'శివ స్సదాశివ శ్శైవ'
యన, 'మహేశో మూర్తయ [4]స్త్రిధా' యనఁగ,
శివతత్త్వమును సదాశివతత్త్వ మనఁగ
భువి మహేశ్వరతత్త్వమును ద్రివిధంబు;
నరి 'శివమేకం[5]విజానీయ' యనఁగ,
ధర 'సదాఖ్యం పంచధా భవే' త్తనియు,
నంగతిఁ 'బంచవింశతిభేదకం' బ-
నంగ నొప్పగు మహేశాంగంబునందు
[6]శివు నేకతయు, సదాశివపంచకంబుఁ,

---

౧. సూత్రము; సూక్తులు. ౨. రూపంబెవిష్ణుండు? ౩. తత్త్వ. ౪. ఈశ్వరమూర్తయ స్త్రిధా. ౫. 'విజానీయాత్' అని మూలము: కాని యది గణములకు సరిపోదు. ౬. శివమేకమను.

* కుండలీకరణము చేసినపంక్తులకు సంస్కృతానువాదము లేదు.

దవిలి మహేశభేదము లిర్వదేనుఁ,
దానంద మును శివతత్త్వ మప్రతిమ,-
మానంద, మవ్యయ, మతులిత, [1]మభవ,
మప్రతర్క్యాం, బచింత్యాం, బప్రమాణ్యా,
'మప్రాప్యామనసాసహ'యని ప్రపంచ-
సంగతి 'సత్యాతిష్ఠద్దశాంగుల' మ-
నంగ, 'స్మర్యతే నచ దృశ్యతే' య
నంగ, వేదములు నెఱుంగ నేరని శి-
వాంగము [3]వాఙ్మనసాతీతపూత-
సగుణ తిరస్కార శాంతప్రభావ-
విగత దేహేంద్రియ విమల[4]విజ్ఞాన-
సత్య స్వతంత్ర శాశ్వత సదైశ్వర్య-
నిత్య వినిర్మల నిజశుద్ధ [5]బుద్ధ-
సర్వజ్ఞ [6]నిర్విఘ్న సచ్చిదానంద-
సర్వగ తైకభాస్వర పరంజ్యోతి-
రంగంబు పంచేంద్రియాతీత మగుట
భంగిగా నిశ్చయింపఁగ లేక, యేక-
మనియును, నణుతరం బనియును, బ్రహ్మ-

---

౧. విభవ. ౨. మమనస్కమప్రపంచంబు. ౩. వాఙ్మా. ౪. సు. ౫. శర్వ. ౬. సర్వేశ; నిర్మల.

మనియును, విజ్ఞాన మనియు, నానంద
మనియు, నిరాకార మనియు, సాకార-
మనియుఁ జర్చింప నిట్లతులితమహిమ
కవకాశమై యాదిశివుఁ డొప్పనట్టి
శివునంద యొప్పారు శివసదాశివము
నది విశ్వతోముఖమని శ్రుతుల్[౧] సాట
ముదమున సర్వతోముఖమై వెలుగుఁ;
జెనసి తచ్ఛివ సదాశివమూర్తినలనఁ
దనరి యమూర్త సదాశివుం డొప్పు;
శ్రుతు 'లగ్నిమీళే పురోహిత'మ్మనఁగ,
రతి 'నమ స్తుంగశిరశ్చుంబి' యనఁగ
మఱి 'లింగమూర్తే రుమాపతే' రనఁగ
మఱియును -'నాస్తి యస్మాత్పర' మ్మనఁగ,
గతి 'లింగమధ్యే జగత్సర్వ'మనఁగఁ,
బ్రతి* 'లింగబాహ్యాత్పరం నాస్తి'యనఁగ,
సరి 'నమల'[౩]మ్మన, 'స్తంభం' బనంగ,
ధరనట్లు 'హుతవహ స్తంభం'బనంగ,

---

౧. ప్రా. య. ౨. నాగ్నిస్వభస్మ నపరోయనఁగ. ౩. మనస్క..

* 'లింగాద్బాహ్యం పరంనాస్తి' అని సం. అనువాదము.

[1]శ్రుతులందు మూలప్రకృతియును [2]వేద
లతలట్లు 'దివ్యమూలస్తంభ'మనఁగఁ,
బరమలింగంబనఁ, బరమేశుఁ డనఁగఁ,
బరమాత్మమనఁ, బరబ్రహ్మంబనంగఁ,
దగ నయ్యమూర్తి సదాశివువలనఁ
దగు నాదిమూర్తి సదాశివుం డొప్పఁ
బరమ తేజఃపుంజభాస్వత్తదీయ-
పరిచితదివ్యప్రభాపటలంబు-
పయి నొక్కశిరము వి[3]భ్రాజితాననము
నయనత్రయంబు నున్నతనాసికంబు
లంబకర్ణంబులు లసితాభరణచ-
యంబులు దీర్ఘదంష్ట్రాంశులుఁ దనరఁ
దళుకొత్తు మూర్తి సదాశివువలనఁ
దలపోయఁ గర్తృసదాశివాఖ్యంబు
నా నొప్పు నంస్మితాననచతుష్కంబు
జానొందఁ బంచశీర్షములు దత్కళలుఁ
బ్రతి వక్త్రములు త్రి[4]నేత్రములు దంష్ట్రావి-
తతులును జంద్రావతంసరోచులును
శూలాస్త్ర వీక్షణమాలికా వరద-

---

౧. శ్రుతు. ౨. వేఱ. 3. తాజి. ౻. నే.

పాలిత యామ్యదిగ్భాగహస్తములు,
ఖ్యాత కపాలాహి మాతులుంగాభ-
యాతత వామభాగాంక హస్తములు,
దివ్య లేపనములు, దివ్యాంబరములు,
దివ్యాభరణములు దీప్తమై వెలుఁగఁ
గర్తృ సదాశివాఖ్యమునందు లోక
కర్తృత్వ హర్తృత్వ కారణంబగుచుఁ
గర్మ సదాశివాఖ్యము లింగపీఠ
నిర్మలాకారమై, ¹నివుడుచు ²నాద-
బిందు ఘటీకృత పిండితంబగుచుఁ,
జెందు పంచకళావిశేషత దనర
నెత్తఱి నోరుఁ డెర్గనే 'చకిత మభి-
ధత్తే' యనుచు వేదతతులు వడంక
నిష్కళ సకళ సాన్నిధ్యైక గుణప-
రిష్కారుఁడై చను శ్రీ సదాశివుఁడు,
నా సదాశివు సముద్యద్దివ్యదేహ-
భాసురాకార విభాతి యెట్లనినఁ—
బ్రవికాసదర్పణ ప్రతిబింబలీల
నవికల శక్రశరాసన రేఖ

౧. నివురు. ౨. నాడ.

చర్మ మాంస రుధిర శల్యాది దేహ -
ధర్మవిహీనమై తనరు [1]సన్మూర్తి,
గుందేందుచంద్రికా గోక్షీరఫేన
సుందరామల పరిస్ఫురిత సద్వర్ణ-
భస్మ సమాలిప్త భావజదేహ.
భస్మసాత్కరణ విభావసులోచ
న-బ్రహ్మ గీర్వాణ [2]నాకేశవంది -
త-బ్రహ్మయోగి సదా పూజనీయ
సకల నిష్కళవిలసల్లింగ నొప్పు
ప్రకట సద్యోజాత పశ్చిమాననము;—
గౌర విస్ఫార పింగళ కుంకుమ ప్ర -
కారతిలక పాండుగండస్థల ప్ర-
తీక్షణ భ్రూలతా విక్షేపయుత క-
టాక్షేక్ష ణోత్పలాయత చారుకర్ణ -
లసిత నీలాలకాలంకృతోద్యత్ ప్ర-
హసిత సుస్నిగ్ధ బింబాధరపూర్ణ-
సోమమండల నిజస్ఫూర్తిఁ జెల్వారు
వామదే[3]వోత్తరతరవదనంబు ;—

---

౧. సమ్మూ. ౨. నాగేశ. ౩. దవాంచిత ; దేహాంచిత.

దుంగ[1]నీలాంబుద భృంగాంజనాంక
సంగతవ్యావర్త పింగేక్షణాలి-
గంభీర తారప్రకాశిత [3]దశన-
శుంభ ద్విదం ష్ట్రావళోభి తాహీంద్ర-
సుమహత్కపాల భాసురతరమహిమ
గొమరారు దక్షిణాఘోరవక్త్రంబు;—
దీప్తశతత్ఫాలాగ్ని దివ్యతటిత్స్ఫు-
తప్త కనక సముదాత్త తేజోరు-
ణాతి గంభీరస్మితాంశు దశన స-
మాతత ప్రోద్భాసి తాధ రార్ధేందు-
సంగత పింగ ళోత్తుంగ [5]జటాసు-
[6]రంగ భుజంగ విరాజిత సతత-
[7]వినత సిద్ధామ రావిర్భావ మహిమ
బొనరు బూర్వాంక తత్పురుషవక్త్రంబు;—
అంచితావ్యక్త సువ్యక్త గుణప్ర-
పంచేతరామల భరిత షట్త్రింశ-
దారూఢ సర్వ తత్త్వాతీత యోగ
చారుతరధ్యేయ శాంత శుచాతి-

---

౧. నీలాంబుజ. ౨. నాభ. ౩. వదన. ౪. ఫాలాగ్ని దేదీప్యత్తటిత్. ౫. జటాంశు. ౬. రంగద్భు. ౭. వినుత. ౮. ర్భవ.

సూక్ష్మక వ్యాప్త తేజోమయపరమ -
సూక్ష్మతత్త్వోత్తర సుమహాదైశ్వర్య
పరిచి తాప్రతిమ ప్రభలఁ బ్రస్ఫురించు
నురుత రేశాన నామోర్ధ్వ వక్త్రంబు!
సంచితంబై యిట్లు నన్నుతికెక్కి-
పంచశిరంబులుఁ, బంచవక్త్రములు,
నయ్యేముఖముల సూర్యాగ్నీందు సుమహా -
నియ్యరోచులు గల్గు నేత్రత్రయంబు,
నురుమకుటేందు సముదిత [1]దామములుఁ
బరమ శాంతోన్నత ప్రభలుఁ, బద్మాస-
నంబు, నంకుశ, పాశ, నాగ, ఘం, టాగ్ని-
సంబంధ వామ ప్రశస్త హాస్తములుఁ,
బరశు, ఖ, డ్గాభయషవి, శూలలోల -
తర వర దక్షి-[2]ణో దాత్తహాస్తములు
స్ఫటిక మణిద్యుతి స్ఫుటత[3]రాంతగి ప్ర-
కట డశాతట సముత్కట దివ్యరుచులు,
దివ్య లేపనములు, దివ్యాంబరములు,
దివ్యాభరణములు, దివ్యచిహ్నమ్ము,
లొలయు పంచబ్రహ్మసూక్తాభినుతులుఁ,

1. థా. 2. ణోత్తరహస్తములును. 3. రాంగ.

దళుకొత్తఁ గర్మసదాశివుఁ డొప్పు;
నా సదాశివమూర్తియం దసదృక్ష-
భాసుర దివ్యవిభ్రాజిత మహిమ
నలరు మహేశ్వరోద్య న్మహామూర్తి;
యిల 'యగి పర స్స మహేశ్వరో' యనఁగ!
రతిఁ 'బహా త్పరతరో బ్రహ్మా' యనంగ,
స్తుతి 'య త్పరాత్పరతో హరి' రనఁగఁ,
దుది 'య త్పరా*త్సరతో ఈశ' యనఁగ,
నిదిగాక 'తేషాం మహేశ్వరో' యనఁగ,
†భావింప శంభుఁడు 'పశుపతి రీశ్వ-
రో వా' యన, 'మహేశ్వరోవా' యనంగ
సుహితమహాస్తోత్ర సూత్రాంతరమున
'న హి విష్ణు రుక్తో' యనంగ విష్ణ్వాది-
దేవతలకు మహాదేవాహ్వయంబు
వాహిరి నీశ్వరాహ్వయమును గలదె?
భావింపఁగా వాసుదేవుండు, బ్రహ్మ-
దేవుండు, మఱి సూర్యదేవుండు ననియు,

---

* 'పరతఈశ' అని ఉండవలెను; ఉంటే గణభంగము కలుగుతుంది. † 'తయోరైశమ్' అని సంస్కృతానువాదము. ఈ పాదములో 'తయోః' అనక 'తేషాం' అనడము గణములకోసము; అయినా అది ప్రాకృతసంప్రదాయావిరుద్ధము.

౧. జావి 'శంభుర్మృడ శ్శంకర ఈశ్వరోవా'. ౨. దేవర.

శ్రీశ్వరుం డనియు, వాగీశ్వరుం డని, దిన
నేశ్వరుం డనియు, సురేశ్వరుం డనియుఁ
బలపోయ సోపపదంబయు యిట్లు
గలుగునేనియుఁ గల్గుఁగాక, కేవలముఁ
గలుగునే దేవేశ కలితనామముల
పొలుపున ? నటుగాన[1] పూరితనామ-
ముఖ్యనామంబుల ముద్దమంద దేవ-
ముఖ్య మహేశ్వరమూర్తి యొప్పారు,
దివ్యతేజస్సముద్దీపితాంగంబు,
నవ్యసంస్మితవక్త్రనలినరాజితము,
నిటలముద్రితవసుస్నిగ్ధనేత్రములు,
నటనగ్నిసూర్య శశాంకనేత్రములు,
స్ఫుటవియత్తట సముత్కట జటాజూట-
పటుతరకోటీరపరిచితప్రభలు,
మంగళత జటోత్తుంగ గంగా త-
రంగిణీ రంగత్తరంగ సంఘములుఁ,
జంద్రకళావతంసంబు, మహోర-
గేంద్రకుండల సుమహిస్థకర్ణములు,
నసమ త్రిశూల దానాభయ డమరు-

1. భూరితన్నామ. 2. రావ.

గ-సమేతమై యొప్పు కరచతుష్కంబు,
దివ్యభూషావళుల్ దివ్యాంబరములు
నవ్యయ పరమమహత్త్వంబుఁ గలుగు
నామహేశ్వర సముద్యన్మహామూర్తి
నేమించి యెవ్వండు నేర్చు వర్ణింప ?
లలిత తదియ్య లీలామహత్త్వంబు
నిల నెంచరాదన్న నెట్టు లంటేని, —

పంచవింశతి లీలలు

నాకులత్వముఁ బొందు నమృతాంశుఁ గాచి
యాకళఁ దాల్చుట యది యాదలీల ;
దయతోడ సతి దక్షతనయ వరించి
ప్రియుఁడగు యుండుట రెండవ్వలీల ;
వొనర ద్వితియ్యశంభుని వృషభేంద్ర
మును వాహనము సేత మూఁడవులీల ;
గుటిలు గజాసురుఁ గూలార్చి [౧]పుచ్చి
నటనకుఁ జొచ్చుడు నాల్గవులీల ;
ప్రియవివాహోత్సవాభిరతి భవాని-
కయి వరియించుడు నైదవులీల ;
హరిశవంబును దొంటి యజుకపాలంబు

౧. వ్రచ్చి.

నరిగి యరిగి తాల్పు డావువులీల;
హరిపుత్త్రుఁ గాము నేత్త్రానలశిఖల
నెరియించి మించుట యేడవులీల;
గడఁగి శ్వేతునకయి కాలుని వ్రేలి
మిడిలోనఁ జంపు డెన్మిదియవులీల;
ముక్కంటిచిచ్చున ముప్ప్రోళ్ల నేర్చి
మిక్కుటం బగుడు దొమ్మిదియవులీల;
హరిఁ బట్టి కట్టిన యాజలంధరునిఁ
బరిమార్చి పేర్చుడు వదియవులీల;
యెన్ని 'యహం బ్రహ్మ' యన్నఁ దచ్ఛిరముఁ
గొన్నభాతి వదనకొండవు లీల;
ఖండి[౧]తామరదక్షు ఘనవీరభద్ర
చండశౌర్యంబు వండ్రెండవులీల;
యదిగాక శరభమై హరిని హరించి
ముదముఁ బొందుట వదుమూఁడవులీల;
యెలమిమై నర్ధనారీశ్వరత్వంబు
నలి ధరించుడు వదునాల్గవు లీల;
రసికత వెలయఁ గిరాతావతార
మెసగఁదాల్చుడు వదియేనవు లీల;

౧. తాసుర.

ఘనతరం బగునట్టి కంకాళవేష
మనువు దాల్చుట పదియాఱవు లీల;
నచ్చిన [1]చండీశునకుఁ బ్రసాదంబు
నిచ్చుట నగుఁ బదియేడవు లీల;
జగములఁ గాల్చు విషముఁ దాల్చి సురల
మిగులఁ గాచుట పదెన్మిదియవు లీల;
హరికిఁ జక్రంబు నేత్రాబ్జంబు నిచ్చు
చరిత మేకోనవింశతియవులీల;
విఘ్నేశు నతిదయావృత్తి సర్వాశు-
భఘ్నుగాఁ జేయు టిర్వదియవు లీల;
లలి నుమా స్కందాదులకుఁ దమతత్త్వ
మొలయఁ జెప్పు టిరువదొకటవులీల;
దయ నేకపాదావతారంబుఁ దాల్చు
క్రియ యది యిర్వది రెండవు లీల;
వన్నుగా నజ హరి ప్రభృతులు గొలువ
మున్నుంకి యిరువది మూఁడవు లీల;
మునుల శ్రీ దక్షిణామూర్తివేషంబు-
నను బ్రోచు టిరువదినాల్గవు లీల;
గలిత ధీవ్యోరు లింగస్వరూపంబు

---

[1] చండే.

నలిఁదాల్పు డిరువదేనవు లీల యదియుఁ
గృతిఁ 'బ్రజనన మలంకృత' మన శ్రుతులఁ
దతిగొన 'జాతవేదః స్థాణు' రనఁగ
సరి 'నవల' మ్మన 'స్తంభం' బనంగ
సరి నట్ల 'హుతవహ స్తంభం' బనంగ
న్యాయోక్తమున 'జ్వలన స్తంభరూపి-
ణే' యని వెండియు మ్రోయంగ నున్న
ధరఁ దారతార కర్తలముఁగా కనిన
హరివిరించులగర్వ మణఁగింపఁ దలఁచి
మసలక యిరువుర మధ్యంబునందు
నసమదివ్యోరులింగాకార మెనగ
వనజసంభవుఁడును వనజనాభుండుఁ
గనుఁగొని యద్భుతాక్రాంతాత్ము లగుచు
నారంగ నీలింగ మాది యంత్యంబు
భోరనఁగనఁ జూర పో కర్తలనుచుఁ
దనర 'బ్రహ్మోత్పాత దివ మాశు'
అన, 'వరాహో విష్ణు' రనఁగ, నాక్షణమ
గోవిందవేధలు గోల మరాళ
భావనఁ జనిచని పాదముల్ మకుట-
మును గానఁజాలక మ్రొక్కుచుఁ జాల

ననుపత్తి లింగాష్టకాదిసూక్తములఁ
బ్రస్తుతింపఁగ నొప్ప భవ్య దివ్య ప్ర-
శస్తోరు లింగ భాస్వన్మహాలీల
యిరువదేనవునిది యా నప్రతర్క్య-
తర మది గీర్తింపఁ దర మె ? యింకెట్టి
వారికిఁ దన్మహేశ్వరమూర్తివలన
శ్రీరుద్రమూర్తి ప్రసిద్ధమై యొప్పు;

రుద్రాధికత్వము

శ్రుతి 'నమో భగవతే రుద్రాయ'యనఁగ,
శ్రుతి 'నమస్తే అస్తు రుద్రాయ' యనఁగ,
శ్రుతి 'నూర్ధ్వబాహవే రుద్రాయ'యనఁగ,
శ్రుతి 'నేక ఏవ రుద్రో'యన, మఱియు
శ్రుతులు 'విశ్వాధికో రుద్రో'యనంగ
శ్రుతులు 'సర్వోహ్యేష రుద్రో'యనంగ
శ్రుతులు 'మా త్వా రుద్ర! చుక్రుధ'యనఁగ
శ్రుతులు వెండియును 'గద్రుద్రా'యనంగ
మఱి 'నమస్తే రుద్ర మన్యవే'యనఁగ
మఱి 'నమో రుద్రాయ మన్యవే'యనఁగ
నుసలక మఱియుఁ 'దన్నో రుద్ర'యనఁగ
నెనగ 'రుద్రాయ తే రసవతే'యనఁగ

కో! యని శ్రుతి 'సఏకో రుద్ర ఉచ్య-
తే'యన, మఱియు 'రుద్రాయ నమో'య-
నంగ 'రుద్రఃపశూనా మధిపతి'య-
నంగ నిట్లవికలామ్నాయాభివినుతుఁ-
డై వెల్గు శ్రీరుద్రు నతులితమహిమ
మావశం బగునె [1]ప్రమాణతఁ దెలుప
శర్వు [2]సర్వాధీశు సకలస్వరూపు
గీర్వైభవముపేర్మిఁ గీర్తింపఁదొడఁగి
తివిరి యాద్యులు 'యవతి న మనః కస్య
న వచ' నానెవ్వఁ డెన్నఁగఁ[3]జాలు జగతి

హరిహర తారతమ్యము

నట్టి శ్రీరుద్రవామాంగంబునందు
వుట్టిన విష్ణుండు వోలునే రుద్రు?
నవిశేషనిష్కళ సకలాంగమైన
శివుని తత్త్వత్రయాంచిత మూర్తులందు
రూపింప నేమూర్తి రూప మీవిష్ణుఁ?
డేపార విష్ణుని రూప మేమూర్తి?
విను 'శివరూపాయ విష్ణవే' యనఁగఁ
జెనసి వెండియు 'యథా శివమయో విష్ణు'

---

1. సమాఖ్యగావింప. 2. సర్వాచీను. 3. సమర్థుండు.

రన నొక్కచందమే నయ్యీరువురును
జన శివవిష్ణు[1]లు సమమేని జగతిఁ
బొసరఁ గండ-బుకప్పొ, రొమ్ముమచ్చ-
యును దక్క తనుకాంతు లొక్కచందములె?
ముక్కన్ను నిక్కన్ను మొగిఁ గన్నులందు
నెక్కొన్న యనలాబ్జనేత్రంబు లొకఁడె?
హరు గజవ్యాఘ్రాజినాంబరావలులఁ
బరగు పీతాంబరప్రతతులు[2] నొకఁడె?
యందమౌ బ్రహ్మోచ్యుతాస్థిమాలికలఁ
గందెడు వనమాలికాతతు లొకఁడె?
యా[3]యజ్ఞపూరుషు నసితాజినోత్త-
రీయంబు నితరోత్తరీయంబు నొకఁడె?
ఖ్యాతపద్మజ జటాకలిత యజ్ఞోప-
వీతంబుఁ దంతూపవీతంబు నొకఁడె?
హరినేత్రనిచితపాదాబ్జంబు హరుఁడు
గరమల్గి తునిమిన[4] కాలెన్న నొకఁడె?
తగిలి కూర్మకపాల దామోదరంబు
మొగిని దామోదరంబును నొకఁ డగునె?

---

౧. లసామ్యంబయేని. ౨. పరియె. ౩. యగ్ని. ౪. కాలును.

భహుళ[౧]హారోరగ బహుఫణా[౨]మణులు
మహిఁ గౌస్తుభంబను మణియును నొకఁడె?
కన్నిచ్చికొన్న చక్రము విష్ణుపీనుఁ
గున్న శూలంబును నొక్కఁడయగునె?.
కాల విశాల వక్షస్స్థల రక్త-
కేలీవిలోల త్రిశూలంబు సాక్షి;
లాలాసు రోదర కీలాలవిహిత-
కేలీవిలోల త్రిశూలంబు సాక్షి,
వ్యాలదుర్వార విష్వక్సేన రుధిర
కేలీవిలోల త్రిశూలంబుసాక్షి;
హరిముఖ్యదుష్టామరాసురాదులను
హరుఁడు హరించెఁ దా నరిమెదు మహిమ
భువిఁ దోప హరి వెక్కుభుజములయందు
దివిరి త్రిశూలాదిదివ్యాయుధములు
హరుఁడు జలంధరు హరియించి తనకుఁ
గరుణించినట్టిచక్రంబును సాక్షి;
భ్రమఁ గానక దధీచిపయిఁ బ్రయోగింపఁ
దుముకైన చక్రంబుతునుకలే సాక్షి;
యన్నేత్రపద్మ మార్యాపతిఁ బూన్చి

౧. హారో. ౨. వలుల.

¹సన్నుతమతిఁ గొన్న చక్రంబు సాక్షి;
గనుఁగొన హరుఁడు మత్కర్తయు హర్త-
యును ²నగుఁ దచ్చక్ర మొప్పంగఁ దాల్చు
పొలుపును హరిచతుర్భుజములయందు
నలరెడుచక్రాయుధాదులు నొకఁడె?
క్రాలెడు విష్ణు కంకాళాది విధిక-
పాలాది బహుముండమాలికాదులును
నిత్యత్వమున కిలఁ బ్రత్యయం బిదియ
సత్య మన్ క్రియ దోప శంభుండు దాల్ప
స్థిరలీల నొప్పారు దివ్యదేహంబు
హరి యనిత్యాంగంబు నగునె యేకంబు?
తార మందార కర్పూర శేషహార
హార బృందారకాహార నీహార
గౌరీ కటాక్షేంద్రవారణ క్షీర-
సార పారావార చంద్రికాచంద్ర
శారద నీరద చందన కుంద
తారధరాధర ధవలాబ్జ కుముద
డిండీర మల్లికా షండ మరాల
పాండుర ³పిండిత స్ఫార దేహంబు

---

౧. సన్నుతి మతి. ౨. నైక్యమేమఱియు. ౩. మండిత; చ్ఛాయవి.

గాళిందినీకాల కాలభుజంగ
నీలనీలాభ్ర వినీల జీమూత
కాకాంజనాచల కజ్జల [౧]తాళ
కోకిల [౨]కల్మష క్రోడకస్తూరి
భ్రమరచయాజ్ఞాన భల్లూకచర్మ
తమసాగ్ని గిరిగుహాంతర హరినీల
నీలపటాకాశ నీచాంతరంగ
హాలాహ[౩]లాతినీలంబును నొకఁడె?
హరుఁగాని మెఱుఁగని యద్రిజాతయును
బరపురుషులఁబొందు పద్మయు నొకఁడె?
యతులితోక్షేంద్రుండు నతనియూరుపుల
గతి గతాగతుఁడగు గరుడండు నొకఁడె?
హరునందు పుట్టిన యష్టమూర్తులును
ధర మత్స్యకూర్మాద తనువులు నొకఁడె?
యాది [౪]నింతయుఁ దానయైన రుద్రుండుఁ
బ్రాదేశికుఁడు నొక్క పగిదియే? యిట్లు
దనుకాంతులును నాయుధములు శౌర్యములు
వనితలుఁ దొడవులు వాహనంబులును
గళలు గుణంబులుఁ గారణంబులును

---

౧. పాప. ౨. కర్దమ. ౩. లాభ. ౪. యంత్యము.

దలుపోయ నొక్క-చందమె?—యట్లుఁగాక,
పుట్టక యఖిలంబుఁ బుట్టించు భవుఁడుఁ
బుట్టింపఁబుట్టు ప్రభుండు నొక్కండె?
బ్రదుకుచు నఖిలంబు బ్రదికించు శివుఁడు
బ్రదికింప బ్రదుకు శ్రీపతియు నొక్కండె?
హరముగా కఖిలంబు హరియించు [1]హరుఁడు
హరియింప[2]హరమగు హరియును నొకఁడె?
సత్త్వరజస్తమ స్సమగుణగుణుఁడు
సత్త్వైకగుణుఁడును జర్చింప నొకఁడె?
నెఱిఁ బంచవింశతి స్మృతినశివుఁడు
గుఱిఁ బంచవింశతికుఁడును నొకఁడె?
'విశ్వాధికో' యను విశ్వాధికుఁడు
'విశ్వమయో' యను విశ్వుండు నొకఁడె?
'యజ్ఞేశ్వరో' యను యజ్ఞేశ్వరుండు
'యజ్ఞస్య[3]శిర'యనుయజ్ఞుండు నొకఁడె?
శ్రుతులను 'బూర్ణగి పురుష' నాఁ బురుషుఁడుఁ
బ్రతి 'జగత్ప్రకృతి'నాఁ బ్రకృతియు నొకఁడె?
విష్ణుని దేహంబు విష్ణునిశిరము
విష్ణునివక్త్రంబు విష్ణునేత్రంబు

---

౧. శివు. ౨. హరుఁడను. ౩. శిరసినా.

విష్ణుకపాలంబు విష్ణుదంష్ట్రంబు
విష్ణుకంకాళంబు విష్ణు[1]చర్మంబు
నటుగూడ శివునిచే హత్తమైన విష్ణు-
పటుతరాంగంబు లాభరణంబు లగుచు
నాశివు కరచరణాద్యంగములను
నీశత్వ నిత్యత్వ హేతుమహత్త్వ
మలరుట 'విష్ణుమయ శ్శివ' యనిన
పలుకులు[2]నెట్లుఁ జొప్పడుఁగాక, యిట్లు
దమతమభేదముల్ దార చూపంగ
భ్రమితులై[3]వేదాంతఫణితిఁ 'ఽబశ్యామి'
యని చూపి[4]యిద్దఱ కైక్యమన్వాఁడ
చన నంత్యజుఁడుగాక సహజ మంత్యజుఁడు
నంత్యజుండే? యాది 'సోఽంత్యజో నాంత్య-
జోం త్యజ స్స చ పాప జోంత్యజో' యనఁగ
స్కాందంబు 'దోషో న కశ్చి'త్తనంగ,
నంద 'వదంతి దురాత్మనో' యనఁగ
ధర 'మహాపాపవతాం పుంస' యనఁగ
సరి 'నారకాస్తే, న సంశయో' యనఁగఁ

---

౧. చక్ర. ౨. గొంతిసొప్పను. ౩. 'యర్థాంతరం న. ౪. శివవిష్ణులై.

బరఁగ శ్రుతి 'న పరాం ప్రాప్నోతి' యనఁగ
వరుసఁ 'బాపీయాన్ భవతి' యన, మఱియు
నలి శివునకు విష్ణునకు నభేదంబుఁ
బలుకు నజ్ఞానియ పతితుండు గాన
¹హరిహరు లొక్కఁడే యని పల్కుచుంట
వెరవఱి శివరూపు విష్ణురూపనుట
సిద్ధ మన్యోన్య విరుద్ధంబు, విన న-
బద్ధంబు, నరకసమృద్ధంబు, నతిని-
షిద్ధంబుఁ, గావునఁ జెన్నటి ప్రశ్న
నిద్ధర వినఁగూడునే? యట్లుఁగాక,-
శివు నసాధారణాంచిత మహామహిమఁ
దవిలి-వర్తించు వాదపాఢి పేర్మిఁ
దర్కించుచో నన్యదైవంబుఁ దలఁపఁ
బేర్కొనవలసెఁ, దాఁ బేర్కొన్నతప్పు
వాయంగఁ 'బ్రమథేశ్వరాయ నమో న-
మో'యని, 'భృంగీశ్వరాయ నమో న-
మో'యని, 'నందినాథాయ నమో న-
మో' యని, 'బసవేశ్వరాయ నమో న-
మో'యని, వెండి 'శివాయ నమో న-

౧. హరియును హరుఁడును నైక్యంబయనుట. ౨. నిష్ఠిరచు.

మోఁయని శ్రీగురుమూర్తిఁ దలంపఁ-
గా విహితం బట్లుగావున నన్య-
దైవవాదము [1]లప్రశస్తంబు, లుడుగు;—
మద్దివ్యమైన వాహనము లుండంగ
నెద్దునెక్కినవిధం బేమియంటేని
భవుఁ డీశ్వరుండు శ్రీ పార్వతీశ్వరుఁడు
శివుఁ డాది సృష్టి సృజించు నత్తఱిని
రూపింప నస్థూల రూపంబు రోమ-
కూపంబుల నణువు లేపారినట్లు
దలఁపోయ మనుసూక్ష్మ తత్త్వాబ్ధిలోన
మొలచు తద్బుద్బుదంబుల భావమునను
బొంగి కాలాగ్ని [2]రౌద్రాంగాగ్ని శిఖల
సంగతంబగు విస్ఫులింగంబు లట్టుఁ-
లుండు మాహేన బ్రహ్మాండసంఘములు
వెండి యెవ్వం డోపు వేఱ నన్ దాల్ప
ననుచు వేఱొకరూపమై యీశ్వరుండు
దనుదాన ధరియింపఁ దలఁచి [3]సన్మతిని-
బొనర ద్వితీయ శంభుం డనుపేరఁ
దనరారు ధర్మావతారరూపమున

---

౧. లు నప్రశస్త్యముడుగు. ౨. రుద్రా. ౩. సన్మ.

వేదవేద్యుండగు వృషభేంద్రమూర్తి
యాదేవదేవు వాహనమయ్యె నంత;
యోజింప నల్పుండె యుక్షవల్లభుఁడు?
[1]తేజిష్ణులీల ద్వితీయశంభుండు
నెన్నంగ సంసారియే? వృషాధీశుఁ
డున్నతి నెక్క నయోనిసంభవుఁడు
వీక్షింపఁ బశురూపమే నందినాథుఁ
డక్షరుండుఁ జతుర్భుజావతారుండు,
లోకప్రపంచుఁడే గోకులాధిపుఁడు
లోకపావనుఁడుఁ ద్రిలోకవందితుఁడు,
గర్మియే ప్రమథాగ్రగణ్యుండు, సకల-
ధర్మస్వరూపుఁ డుదాత్తయశుండు;
గావున నిట్లాదిగణనాయకుండు
దా వాహనంబుగాఁ దగఁడె? వెండియును,
నతి దుర్మదముపెంట నైరావతంబు
క్షితి సమ్మదముపంట శివునివాహనము;
ననలునివాహనం బతనికిఁ బశువు
వినుతింపఁ బశుపతి వృషభనాయకుఁడు;
నరుదగు జముపోతు యమలోకవర్తి

1. తేజిష్ణు.

సిరకీర్తి వృషభుండు శివలోకవర్తి;
నరరూపధరుఁడు దా నిరృతివాహనము
నరసురవంద్యుండు నందినాథుండు;
జడపాశసంబంధి జలనాథు చోఱ
జడపాశరహితుఁ డీశ్వరునివాహనము;
సంతతచరదుగిఖ శ్వసనుని యిట్టి
యంతకాంతకుని వాహనము నిర్దుగిఖ;
యుత్తరాశావర్తి విత్తేశుహయము
నుత్తమసంతుష్టుఁ డుక్షవల్లభుఁడు;
నేల వేయును జెప్ప నీశానునంది
నేలిననంది మాఘాలాక్షునంది;
జలజాసనునిహంస సను జీవహంస
వెలయు పరమహంస వృషరాజహంస;
ధరణి నంతయుఁ గూడ ధరియించునట్టి
ధరణీధరుని నగధరుని శ్రీధరుని
ధరియించి వచ్చుచుఁ దన్నంది కేశు
వరమహోచ్ఛ్వాస నిశ్శ్వాసోపహతుల
వఱలు 'నుచ్ఛ్వాస నిశ్శ్వాసజై' రనఁగ
నఁఋపురాణాగమసూక్తులు మ్రోయఁ
బారిఁబారి వచ్చుచుఁ బోవుచునుండు

గరుడండు గైలాసకందరంబుననుఁ
నటుగాన పక్షివాహనుఁ డెక్కు పక్షి
స్ఫుటకీర్తియగు నుక్షపుంగవు సరియె?
వాక్రువ్వనేఁటికి వాహనావళులు
నేక్రియ హరిముఖ్యు లెనయఁగా రనిన
స్మృతి 'న ప్రదోషే హరిం పశ్య' యనఁగ
జత 'ద్వాదశాబ్దం వృషభమో' యనఁగ
నతి సుకృతక్షయం బగునట్లుగాన
స్మృతిమెట్టు లట్ల కశ్చిత్పురాణమున
నాదిఁ 'బశ్యే ద్ధరి మాదరా'త్తనఁ ద్ర-
యోదశి హరిఁ జూడఁ గాదని చెప్పఁ;
సరిఁ 'బ్రదోషేషు వృషస్య' నాఁ గర్మ-
విరహితంబగు నంది వృషణ సంస్పర్శ
ధృతి 'నంది మా శ్రిత్య తిష్ఠంతి' యనఁగఁ
౧గృతి 'వృషణాం తస్య స్పృష్ట్వా'యనంగఁ
ధరమీఁదఁ గల్గు తీర్థంబు లన్నియును
విరచింప వృషభేంద్రు వృషణంబులంద
యొగి నాశ్రయించి మున్నుండుఁ దా మనిన
జగముల నందికేశ్వరుఁడు స్వల్పుండె?

౧. స్మృతి "వృషస్య వృషణం.

ధృతి "యత్ర వా దృశ్యతే లింగ" మనఁగఁ
దతి 'సర్వతీర్థాని తత్ర వై' యనఁగ
సంగతంబుగఁ 'దీర్ఘసమితో వసంతి
లింగమూలే తు' నా లింగంబునందు
నుండుఁ దా నట్లు మహోక్షువల్లభుని
యండంబులం దుండు, నది యట్లుఁగాక,
హరిఁ జూడఁగాఁ బాప మగునటే, పాప-
విరహితుం డగునటే విశ్వేశునంది
వృషణ సంస్పర్శన ?- వేయేమి వొగడ
వృషభేశుమహిమ దా వెండియు శ్రుతులు
దూషక ! వినుము "మా దుష్టతిర్వృషభ
మా సహాతి"యనుచు మహి మ్రోయుచుండుఁ
గాన సాక్షాద్రుద్రు శ్రీ నందికేశుఁ
గానక పశువని గణుతింప నగునె ?
వరకీర్తియగు నందివాహనత్వంబు
హరునకు నిందయే ? యట్లునుఁగాక,

గ ర ళ ధా ర ణ ము

గరళ మేఁటికిఁ దాల్చెఁ గరకంఠుఁ డనిన-
శరనిధిమథనావసరమునఁ బేర్చి
హరివిరించిప్రముఖాఖిలసురని-

కరము దానవసముత్కర మోడి పఱవ
నండముల్ మునుమిడి యాహుతిఁగొనుచు
మఃడుచువచ్చు నుద్దండంపువిషము,
మును రుద్రనేత్రాగ్ని కెనయైన విషము,
నను యుగాంతాదిత్యసమమైన విషము,
గాలానలప్రభఁ గడచన్న విషము,
గాలకూటము నాఁగఁ గడచన్న విషము,
నలిఁ 'గృతః కృష్ణో జనార్దనో' యనఁగ
జలజాక్షు నల్లగాఁ జలిపిన విషము,
నలువగడ్డము మీసములుఁ గమరంగ
నిల విస్ఫులింగంబు లెగసెడు విషము,
నలరి జగద్రక్షణార్థమై దేవ-
తలప్రాణములు గావఁ దలఁచి శంకరుఁడు
గరళంబుఁ దాల్చె శ్రీ కంఠుం డనంగ
ధరణిలో నిదియు నింద్యమె? యట్లుఁగాక,

నగ్నత్వము

నగ్నత్వమును ఫణినాథుఁ దాల్చుటయు
నగ్నిఁ జేనిడుటయు నది మెట్టులనిన,-
నలువసుతుండు సనత్కుమారుండు
మలయుచు నద్వైతమతములు వన్ని

మునులు దారునుగూడ మును దేవదారు
వనమునఁ దార యీశ్వరులము గాని
యీశుండు వేఱ లేఁ డిదమిత్థ మనుచుఁ
బాశుపతవ్రతపద్ధతిఁ దుడిచి
తమ బుద్ధియోగశాస్త్రంబులఁ బన్ని
భ్రమఁ బొంది వేదవిరహితులై నడవ
ఖ్యాతిగా వికృతవిటాకృతిఁ దాల్చి
యే తేర మునిపత్ను లీశ్వరుఁ జూచి
కనుకలి నింద్రియస్ఖలనంబుగాఁగఁ
గనుఁగవ గామాంధకారంబు నొందఁ
బరమపతివ్రతాభావముల్ దక్కి
వాను వెనువెంటన యరుగుచునుండ
మునులకు నమ్మాత్రముల శక్తి దొఱఁగఁ
జనుదెంచువాఁ డెవ్వఁడని యాగ్రహించి
వారక మఱి హుతవాహాది మంత్ర-
భూరిక్రియల నాభిచారంబు వేల్చి
పడసి యున్మత్తరూపంబుఁ బైఁ బఱప
మృడుఁ డాయపస్మారమును బడఁద్రొక్క,
మఱియును సర్పంబు మంత్రించి పనుపఁ
గఱకంఠఁ డది హస్తకటకంబుఁ జేయ,

నంత నయ్యగ్నిన హారుమీఁదఁ బనుపఁ
జింతింప కలుగుగాఁ జేత ధరింప,
మఱియును బెక్కు దుర్మంత్రముల్ వన్న
నఱిముఱి లెక్కసేయక [1]హారుఁ డేఁగి,
తనుఁ గని మ్రొక్కని వనజజుకొడుకుఁ
గనుఁగొని యుగ్రంబుగా శపియింప,
వడవడ వడఁకుచు వచ్చి యమ్మునులు
వుడమి సర్వాంగముల్ వొందంగ మ్రొక్కి
'యద్వైతమతుల మహంకారయుతుల
మద్వితీయాది [2]సూక్తార్థవాదకుల
మజ్ఞానులము సహస్రాపరాధులము
దజ్జ్ఞేతరులము మా తప్పులు సైఁచి
కావవే యయ్య ! శంకర ! సదానంద !
దేవదేవేశ్వర ! దివ్యలింగాంగ !
తముఁ బొంద మోహశాస్త్రంబులెవ్వరిని
భ్రమితులఁ జేయవు భక్తవత్సలుఁడ !
యా చతుర్ముఖుఁడు వేదాత్మకుఁ డయ్యు
నేచి మీ మహిమ మెఱుఁగక చెడఁడె ?

---

1. వచ్చిహరుఁడు. 2. సూత్రా.

యతని పుత్త్రుం డిష్వ డద్వైతవృత్తి
మతి నినుఁ గానక మడిసెను దేవ!
వ్యాసుండు విద్యామదాటోపఫలముఁ
జేసేతఁ గానండె జియ్య! విశ్వేశ!
దక్షప్రజాపతి దలఁ గోలువడఁడె
యక్షయ! ప్రథమభాగార్హు నిన్ విడిచి?
కాన మేమును దపోగర్వంబు పేర్మిఁ
గానక యద్వైతకర్మంబు లూఁది
చెడితిమి, గరుణ రక్షింపవే' యనుచుఁ
దొడిఁదొడి వేదసూక్తులఁ బ్రస్తుతింప,
విటవేషరుద్రుండు వికృతవేషుండు
స్ఫుట దిగంబరమహాద్భుతవర్తనుండు
దేవుండు గారుణ్యదృగ్విలోచన సు-
ధావార్ధి నోలార్చి తన లింగమూర్తి
ననయంబు సజ్జలయం దిడి కొల్వఁ
డనుచుఁ బ్రసాదించి యద్వైత మణఁచి
ధృతిఁ బశు పాశ పతి జ్ఞానయోగ-
మత ముపదేశింప మఱియును మ్రొక్కి
యనయంబుఁ 'ద్వచ్ఛేఫసోఽపి మాహాత్మ్య'
మనియుఁ దదీయ సూక్తాపరార్ధమున

నిల'*యువాం ద్రష్టుం న హి క్షమా'వనఁ బ్ర-
బలి 'సూరయో యత్ప్రపశ్యంతి' యనఁగఁ
గ్రాలి 'తద్విష్ణోః పరమ'మన, నట్ల
పోలుగా 'సర్వస్య పూజార్హముత్త-
మాంగం' బనంగ వ్యాసాష్టకంబునను
బొంగి 'సంపూజ్యతే లింగం పరం హ-
రస్య' యనఁగ 'నమోఽస్య జగన్న-
మస్య'యన్ శివలింగమహిమ వేదములఁ
గనుఁగొన శ్రీస్కాంద కాశికాఖండ-
మునను వ్యాసాష్టకంబున నట్ల మ్రోయుఁ
గావున ధర్మార్థకామమోక్షముల
కావిర్భవస్థాన మతుల త్వదీయ-
లింగార్చనమ కాన లీల నీలింగ-
మంగళార్చనఁ జేసి మనుదు మేమనుచు
నా పరమేశుచే నతుల లింగార్చ-
నోపదేశము మునియూథంబు వడసి
నలి దేవదారువనమున లింగార్చ-
నలు సేయఁ దొడఁగిరి నాఁడాదిగాఁగ

* 'ఆవాం' అని సంస్కృతానువాదము. గణము కుదరక 'యువాం' అని మార్పు పొందినది.

నాయుధంబయ్యె నాయగ్ని యీశ్వరున
కాయెడ భూషణంబయ్యె సర్పములు
నగ్నత శివునకు నైజమే? మునుల
భగ్నవ్రతులఁ జేయఁ బాటిల్లెఁగాక;
కావున నగ్నముఖ్యప్రకారంబు
లేవెంట నిందయే యిల? నట్లుఁగాక,

దక్షాధ్వరధ్వంసము

దక్షుని చేయు నధ్వర మేల చెఱిచెఁ
ద్ర్యక్షుం డనియెదేని, దక్షుండు గ్రొవ్వి
యజ్ఞంబు సేయుచు నమ్మునీంద్రులను
నజ్ఞానులను హరీంద్రాది దేవతల
నందఱఁ గూఁతుల నల్లుండ్ర బంధు-
సందోహములను భాషాముఖ్యసతుల
వేగంబ రప్పించి విభవంబు దనర
యాగదీక్షకుఁ జొచ్చు నవసరంబునను
దక్షాగ్రతనయ ఫాలాక్షుని దేవి
యాక్షణంబునన యుద్యత్కోపబుద్ధి
వనజాక్షముఖ్యదేవతలను మునుల
ననుఁగులఁ గూఁతుల నల్లుండ్రఁ గూడ
రప్పించి యధ్వరరాజు నీశ్వరుని

రప్పింపవేల నీక్రతువున కనుడు,
నున్న యల్లురభాతి నుగ్రుండు దన్ను
మన్నింపఁడని మదోన్మాది దక్షుఁడు
దామున్న యీశ్వరు [1]తత్త్వం బెఱుఁగక
[2]మామాఁగదా యను మందెమేలమున
విపరీతచరితుండు విధినిషేధాత్ముఁ
డపవిత్రుఁ డస్థిచర్మాంబరధరుఁడు
నాగకుండలుఁడు వినాకహస్తుండు
యాగయోగ్యుండుగాఁ డని ధిక్కరింప,
హరనింద సేసెఁ జొచ్చునంతలోపలను
స్ఫురితకోపాటోపపూర్ణాత్మ యగుచు
జగదంబ యాత్మసంజనితకోపాగ్ని
భగ భగ [3]భుగులు నభోగతి నెగయఁ
దనకోపశిఖిఁ దాన దరికొని కాలె
వనజాక్షముఖ్యులు వడ వడ వడఁక;
హరనింద విన్న ద్రోహం[4] బొందు వెంటఁ
[5]దరియింపరా దను తలఁపునఁగాక
సురలఁ దండ్రినిఁ జావఁ జూడఁ జాలకయ

౧. దాసీఁగా కనక; దాసిగాఁగనక, ౨. మాన. ౩. భుగులన భోరన నెగయ. ౪. బొందు. ౫. ధరి.

గిరిజ భస్మంబయ్యె హార హా రా యనుచు,
నంత గౌతమ దధీచ్యాది మునీంద్రు
లెంతయు నరిగి శివేతరక్రతువుఁ
జూడంగరాదు, [1]దక్షుఁడు శివద్రోహి-
తోడ సంభాషింపఁ గూడ, దెట్లనిన—
మసలి 'నమో రుద్ర మన్యవే' యనుచు
నసలార ఋగ్వేదమట్లును మ్రోయ,
మఱి 'నమో రుద్రాయ మన్యవే' యనుచుఁ
దఱి యజుర్వేదంబుఁ దా [2]మ్రోయునట్లు
'ధీయతే రుద్రాయతే ర*సతే న-
మో' యని యా సామమును మ్రోయునట్లు
మొనసి 'రుద్రాయ నమో అస్తు' అనుచుఁ
బొనర నథర్వణంబును మ్రోయునట్టు
లున్న వేల్పులకు నియుక్తి వేదములు
మున్న మ్రొక్కిన సూక్తములు గల వెట్లు
తవిలి 'యస్మై నమ స్తచ్ఛిరో' యనఁగ
ధ్రువము 'తస్మై నమో భవతే' యనంగ
మ్రొక్కుల కధిపతి మోక్ష సౌఖ్యముల

---

౧. దక్షుని. ౨. మ్రొక్క. *'రసవతే'అని మూలము; గణ-
ము కోసము మార్పు.

యిక్కయు ముక్కంటి యొక్కండ కాఁడె ?
యూరీకృతోక్తిఁ 'జోరోపనీతమివ
'ధారయే' త్తనఁగనుఁ దగు కిరీటంబు
నిల వచ్చునే ధరియింపఁ జోరులకుఁ
దలపోయ మకుటవర్ధనులకుఁ దక్క ?
రతిఁ 'బరాత్పరతరో బ్రహ్మా' యనంగ
నిస్తుతి 'యత్పరాత్పరతో హరి' రనఁగఁ
దుది 'యత్పరాత్పరతో శివ' యనఁగ
వదిగొను నుపనిష ద్వాక్యముల్ వినరె ?
కొంకు లేక 'శివ ఏకో ధ్యేయ' యనఁగ
నంకించి యంద 'శివంకరో' యనఁగ
నన్యసురార్చనం బర్హమే ? 'సర్వ-
మన్యత్పరిత్యజే' త్తనునట్లుగాక,
యధ్వరపతి శ్రుతులందు 'రాజాన-
మధ్వరస్య' యనంగ నాహ్వాన³మలర
విహితోక్తి 'రుద్రం హువేమ' యనంగ
'సహమహేళపలాశసంకాశ' యనఁగ
నమరంగ 'నిద మస్తు హవ్యం' బనంగ

౧. ధారయితుమనంగ ౨. శ్రుతి 'యత్పరో' యని సూచించు వారిని. ౩. యఖిల.

రమణ 'యజ్ఞేశ్వర స్త్వమసి' నా[1]చాలు-
నే? వ్యాజ[2]మేల? 'యజ్ఞేశ్వరో హవ్య-
కవ్య సమస్త భోక్తవ్య మాత్మా' య-
నంగ వెఱింగి వెఱుంగక పలుక
సాంగంబులగునె యజ్ఞాది కర్మములు?
నలరుచుఁ 'బ్రథమభాగార్హా[3]శ్చ' యనఁగఁ
గలఁడే ప్రథమభాగకర్త యొక్కఁడు?
పూజ్యులుండంగ నపూజ్యులఁ జెందఁ
బూజ్యమే క్రతువు దుర్బుద్ధిగా కనుచు
నాదక్షు క్రతువున కాభిచారంబు
వేదంబులకు శక్తిలేదు విష్ణ్వాది-
సురలకు మునులకుఁ బరిభవంబుగను
వర మంత్రముల ఫలావాప్తులు డక్కఁ
బాషండులై, భక్తిబాహ్యులై, యితర
వేషాఢ్యులై, ముక్తివిముఖులై, ధర్మ-
విపరీతచరితులై, ద్విజులు భ్రష్టులగను
శపియించి యమ్మునుల్ జన్నంబు వెడల
నింత వృత్తాంతంబు నెఱిఁగి యాక్షణమ
యంతకాంతకుఁడు గోపాక్రాంతుఁ డగుచు

౧. హేల. నేవ్యాజ; నీవ్యాజ. ౨. హేల. ౩. స్వ.

వీరావతారుని వీరభద్రేశుఁ
గ్రూర నృసింహ విదారణుఁ బనుప
శ్రీ వీరభద్ర గణావలి గొలువ
శ్రీ వీరభద్రుఁ డజేయుఁ డేతేరఁ
ద్వరిత దక్షాధ్వర ధ్వంసనోద్యుక్త
పరిచిత క్రోధ విస్ఫురితాభిజాత-
నిటల తటానలోత్కట చటులాగ్ని-
పటల పరిస్ఫుటోద్భట విస్ఫులింగ
పటుపాతమునను నొక్కట జన్నసాల
నటు గూడ దరికొన నార్చి భూతములు
దడయక యచట హోతల దర్భతాళ్లఁ
దొడరి యూపంబులతోడ బంధించి,
యత్యాగ్రహమున నాహవనీయ గార్హ-
పత్య దక్షిణ నామ పరిమితాగ్నులను
నావృతంబైన యాగాశ్వంబుఁగంగ-
లో వైచి యల్లకల్లోలంబు సేయ
మలయుచు భద్రరోమజ గణపతులుఁ
గలయ హోమద్రవ్యముల వీటఁబుచ్చఁ
దలర సాధులను సదస్యుల మునుల

---

౧. గాఁగ. తి. హ.

నెలుకల నడచిన పొల్లుపున నడప
నిలఁ గులస్త్రీల జారులు సెచ్చినట్లు
నలినుబ్బి దేవాంగనా సహస్రములఁ
దజిఁ దజి భూతభేతాళురు సెరుప
నజిముజి వీరభద్రాధీశుఁ డంతఁ
బశు పాలకుండుఁ బైపైఁ దల్లడిల్లఁ
బశువులఁ ద్రోలినభంగి దేవతలఁ
బాదఁగొని పఱచుచు నదితి నాసికము
మొదల స్వాహాంగన ముక్కు డాచన్నఁ
గృతి 'నాసికోర్ధ్వోష్ఠ కృంతనం' బనఁగ
నతికోపియై సరస్వతి ముక్కుఁగోసె;
యజ్ఞరక్షకుఁడగు యజ్ఞుని శిరము
'యజ్ఞస్య శిర'ము నా నటు దెగనేసె;
నలిరేఁగి 'దంతవినాశనో' యనఁగ
బలువిడిఁ బూషుని పండ్లువోఁ బొడిచెఁ;
[3]గృతుల 'వహ్నే ర్హస్తగత' యనఁ గోసె
హుతవహు జిహ్వాలు నురుబాహుయుగముఁ;
బొడిచె భగునికన్ను వుడమి నల్లంతఁ
బడ 'భగనేత్ర నిపాతనో' యనఁగ,

౧. శేర్చు. ౨. గొల్పి. 3. శ్రు.

సోము 'సంగుప్షైన సోమాంగ' యనఁగ
భూమిపైఁ బడవైచి ప్రామెఁ బాదమున
నఱిముఱి జగదాడయగు విష్ణుశిరము
నెఱి 'దదా హాహావనీయకే' యనఁగ
నాహవనీయాగ్ని నట్టు వడఁజేసె,
మాహాత్మ్యమలరార; మఱి యట్లుఁగాక
హరి యమేంద్రాది దేవాంగములు ల్గూడ
ధరఁ [1]జెక్కిడెఁ గనంగఁ 'దక్షకో' యనఁగఁ,
ద్ర్యక్షు నిందించిన యతిపాపి యనుచు
దక్షప్రజాపతి తల దెగనేసె,
నుద్రిక్తమతి వీరభద్రేశుఁ డిట్లు
విద్రుతంబుగఁ జేసె విధిసేయు క్రతువు
నాతండు సేసిన యజ్ఞఫలమున
కాతని [2]బుద్ధికి నాభిచారంబు
ప్రాపించు; శివభక్తిబాహ్యులై చేయ
నాపోవ నెట్టి క్రియలు సాంగమగునె?
ధరణీశు: [3]డేలెడు ధరణిలో నొక్క
నరుఁడు గర్వించి యన్యాయంబు సేయఁ
బఱచుట దోసమే? భవుఁడు దాసులను

౧. జిక్కాడి; జక్కడఁచి యంగతతు. ౨. కప్పున. ౩. డేలేడు.

బఱచుట దోసమే భక్తిమాలినను?
హరి విరించ్యాదులు నటు దక్షుఁగూడి
పరిభవంబులఁ బొందఁ బ్రాప్త మెట్లనిన
నిసుముసంగతిఁ జేసి యిలఁ బావకుండు
వనుగొని మర్దింపఁబడుఁగాన హరుఁడు
దక్షుని సురలను దండించు శివున
కీక్షితి నిందయే? యిల నట్లుఁగాక
యాదిఁ దాఁజేసిన యఖిలాండకోట్ల
నాదరింపక చంపఁదగునె యంచేనిఁ,
బశుపతిచేఁ గట్టఁబడిన జీవములు
పశుపతిచే ముక్తిఁ బడయంగలేక
ధర యెల్ల ధూళిగాఁ[1] దగిలింప నెగయు
పరమాణువుల యన్ని భవములఁ [2]దొడర
బ్రాగిన మాతృకాస్తన్యముల్ సప్త-
సాగరోదకము లసంఖ్యముల్ గడవ
నరుదగు [3]సృష్టికణానీకసంఖ్యఁ
బరగు మరణములు ప్రాప్తముల్ గాఁగ
యుగకోట్ల నవికల యోగజన్మముల
కగపడి దుఃఖంబు లందుచు నాత్మఁ

1. దగులంగ. 2. దనర. 3. దుష్టగ.

గుందుచుఁ, దలఁపులఁ గందుచు, [1]నాత్మ
నందఱుచున్న జీవంబులఁ జూచి,
'కట కటా! [2]భవవిపద్గతిఁ బాయలేక,
పటుతరంబగు ముక్తిఁ బడయంగలేక,
కడిఁదిదుఃఖంబుఁ బొందెడిఁగదే' యనుచు
మృడుఁడు జీవావలియెడ [3]దయ పుట్టి
వరదుఁడు సర్వజీవదయాపరుండుఁ
గరుణాకరుండును గాన జీవులకు
విరచించె లయము; నివృత్తి [4]యెట్లనిన,

ప్ర ల య లీ ల

హరుఁ డు ప్రలయలీల కభిముఖుం డగుటఁ
బ్రమథులు రుద్రులుఁ బరగు భూతములు
సమసుప్తివేళ కుత్సవమంది హరుని
ఫాల విశాలకరాల [5]నేత్రాగ్ని
కీలావలీ స్ఫురత్కాలాగ్ని [6]గ్రమ్మ
నిది జగద్విప్లవ హేతువై తనర
నదియ తా సుఖహేతువగుఁ బ్రమథులకుఁ,
గుమ్మరి దగఁ దరికొల్పిన చిచ్చు

౧. మతుల. ౨. భవదీయగతి. ౩. గృప. ౪. కె. ౫. నేత్రోత్థ. ౬. వర్వ.

గ్రమ్మఱం గడవ లావమ్ములం గాల్చు-
విధమున బ్రహ్మాండ వివిధభాండంబు
లధిగత ప్రలయ కాలాగ్నిచేం గాలం
జేకొని ప్రలయాగ్ని శిఖలచే నఖిల-
లోకము ల్గాలు, నాలోకాగ్నిలోన
నా మహాప్రమథగణావలి వేర్చి
కౌముదిలో నాడుగతి నాడునంత
జడనిధి[1] ద్వీపాంత సహిత ధరిత్రి
వడి మీఁది [2]కెగురంగవైచి యార్చుచును
మీఁది లోకములతో మించు నాకసము
రా దివ్యుఁ గ్రిందికిఁ బ్రమథేంద్రుఁ [3]డొకఁడు,
బడబాగ్ని నుదుట బొట్టిడుకొని యాడుఁ
బెడసోలుచును గణవిభుఁ డొక్కరుండు;
సకల వారాసుల జలములు ద్రావి
యొక గణనాయకుం [4]డొర్చి నిద్రించు;
సకలగ్రహాదితారకసమూహంబు
నొక గణనాయకుం డొగిం బాలికనూఁకు,
నేచి యా ద్వీపంబు లేడు సక్రములు
వైచినగతిం ద్రెవ్విచైచు నొక్కయ్య,

౧. ద్వీపాద్రి. ౨. కెగయంగ. ౩. డొడక ద్రేప్పు. ౪. నూఁదు.

యలరి యమేంద్రవాహన దంతశృంగ-
ములు దాళములువైచు మున్నొక్క-గణము,
నల్క- మృత్యువుకోఁటి లటు వెర్క- త్రిప్ప
నుల్కముల్ ద్రిప్పిన శ్లోక గణేంద్రుండు,
నక్క-రువలి యిట్టి నబ్ధీశు చోఁటి
దిక్క-రులను దిని త్రేన్చు నొక్కయ్య,
ధర హిమమేరుమందరముఖ్య గిరుల
వరగణంబులు సూడువట్టు లాడుదురు,
సురగిరిముఖ్యాద్రి సుఖకేలి సలిపి
యురువడిఁ బొడిసేసి యూఁదు నొక్కయ్య,
పొదలి యష్టభుజంగముల వ్రేళ్లఁ దాల్చు
నొదవ ముద్రికలుగా నొకగణాధిపుఁడు,
ఆదివరాహంబు నడఁచి యాదంష్ట్ర
లాదట ధరియించి యాడు నొక్కయ్య
సరి నాదికూర్మ పృష్ఠము గాడి వాడిచి
యురగేంద్రు నిడి త్రిప్పుచుండు నొక్కయ్య,
నరసింహు జడయుఁ గేసరముఁ గంఠంబు
గిరిజపీఠంబుగాఁ బరపు నొక్కయ్య,
గరుడనిపత్రముల్ శిరమునఁ దాల్చు
గురుమకుటాకృతి నొకగణాధిపుఁడు,

హిమకర రవిమండలము లక్షణముల
క్రమమున నిడి చూడు గణనాథుఁ డొకఁడు,
సుఖముగా బ్రహ్మాండ మఱచేతఁబట్టి
పటియలుగా వ్రేయుఁ బ్రమథేంద్రుఁ డొక్కఁ,
డెడఁ ద్రివిక్రముని కోలెమ్ము దండముగ
గొడుగుగా నజుపుర్రఁ గూర్చు నొక్కండు,
నిండంగ నఖిల నజాండముల్ దాల్చు,
నండాభరణుఁడన నలరు నొక్కండు,
గుర్వుగాఁ గరములఁ గులగిరుల్ దాల్చుఁ
బర్వతాభరణుఁ డన్ ప్రమథేంద్రుఁ డొకఁడు,
భూరి ప్రళయవేళ మేరువు నడఁచు
మేరుపాతనుఁడను మృడుగణం బొకఁడు,
సరణముల్ గరములు పురికొల్పి తాల్చు
హరివేధల శవంబు లఖిల నొక్కఁయ్యె,
యారూఢిగాఁ బ్రమథాధిపు లిట్లు
వారక సర్వసంహారంబు సేయ
నొగి దేవ దానవాది గణంబు లడఁగి
గగన మెల్లఁ బ్రమథగణమయం బగుచు,
నా- కమలజ హరీంద్రాది దేవతల
లోకములుఁ బ్రమథలోకంబు లగును,

౧. లయ్యె.

ప్రమథాధిపతు లిట్లు బ్రహ్మాండకోట్ల
నమసు స్తితిఁ బొందించి సంతసంబునను
వడిఁ బొడవగుచు నప్పుడ యుడ్గి గుజ్జు
బొడవుగ వలముగఁ గడు సన్నమగుచు,
నాడుచుఁ బాడుచు నానందలీలఁ
గ్రీడించు ప్రమథుల క్రీడ లెట్లనిన,-
లంబోష్ఠ లంబాక్ష లంబనాసికులు,
లంబజిహ్వాలు బహు లంబకంధరులు,
నజ గజ హయ వరాహ వ్యాఘ్రకర్ణు,
లజ గజ హయ వరాహ వ్యాఘ్రముఖులు,
శరభ సారంగ మార్జాల గో మహిష-
కరరిపు కరి పురోగమ బహు ముఖులు,
బహువక్త్ర బహునేత్ర బహుకర్ణ వర్ణ-
బహుపాద బహుజాను బహుబాహుయుతులు
బాహూరుముఖ ముఖ[౧] బాహూరుతనులు,
బాహుజఠరజాను పాదోరుముఖులు,
ద్విముఖ చతుర్ముఖ త్రిము ఖాష్టముఖులు,
నముఖ పంచముఖ సహస్రాదిముఖులు,
వెండియు వికృత వివిధరూపధరులు,

---

౧. బహు బాహు.

వెండియుఁ జారు వివిధరూపధరులుఁ,
బూని శ్రుతుల్ 'స్మర్యతే న చ దృశ్య-
తే' నాఁగ నిట్లు గీర్తింప వెండియును
నవు 'నసంఖ్యాతా స్సహస్రాణి' యనఁగ
భువి 'నేవమేవ త న్నిబోధత' యనఁగ
'నణుశ్చ మహాశ్చ' యనఁగ [1]శ్రీ రుద్ర-
గణముల వర్ణింపఁగా రామి [2]దథ్య-
మైనను శివపురాణాగమోక్తముగ
నానేర్చు భంగి వర్ణన నేసినాఁడఁ,
బ్రోడిగఁ బ్రమథగణాడంబరంబు
వేడుకఁ జదివిన విన్న వ్రాసినను
దొరఁకొను శుభములు దురితంబు లడఁగుఁ
జిరభుక్తి ముక్తులు సిద్ధించునట్ల,
యమిత [3]ప్రమథులచే నలరుచు నెలమి
సమసృష్టిఁ బొందించు జగము లీశ్వరుఁడు;
డివిరి యుత్పత్తి స్థితి లయ కారణుఁడు
శివుఁడు పుట్టించు రక్షించు నడంచుఁ;
బుట్టించునప్పు డేపుణ్యా మీశునకుఁ?
బట్టి శిక్షింప నేపాప మీశునకు?

---

౧. సుప్రమథ. ౨. ప్రమథ. ౩. ప్రతాపులా ప్రమథులచేత.

జలముల సస్యాది జంతువు లొన్దాదలు
జలముల సస్యాది జంతువు ల్మడియు,
నిలఁ దజ్జలంబుల కింతన చేసి
ఫలియించు నే పుణ్య పాపంబులెందు ?
నటుగాన లీలార్థమై సృజియించు
నటుఁగాన విశ్రమణార్థమై యణఁచు,
నిది హరునకు నిందయే ?—యట్లుఁగాక, —

మహాతాండవలీల

పొదలి తాండవమాడు పోల్కి- మెట్లనిన—
జగదండకోట్లు భస్మముగఁ దద్భూతి
నగజార్ధధరుఁడు సర్వాంగము ల్పూసి
హరివిరించిపురోగ మాసురాస్థులును
వర కపాలావలుల్ వలయుచోఁ దాల్చి,
భరతోక్తి నానాప్రబంధ¹ తాళములు
భరతనందీశు లేర్పడ నుగ్గడింప
రమణమై నండాభరణు లండనికర
మమర మృదంగంబు లట్లు వాయింపఁ
దలకొని మేరుపాతనులచే గిరులు
సెలఁగి యావజములై ఝంకృతులిడఁగ,

---

¹. గీత,

నా కులాద్రులుఁ బర్వతాభరణేంద్రు
లేక శంఖంబుల క్లైలమిఁ బూరింప,
దతి నుబ్బి రుండాభరణులు రుండముల
నతులిత దీర్ఘ కాహళముల ట్లూఁద,
నలరుచు హరి[1]విరించ్యాది కూర్మాంగ-
ములు పటుపటహ విస్ఫురణ [2]మ్రోయింపఁ,
గాలభైరవు లజు ఘనకపాలంబు
డోలుఁ దప్పటముల లీల [3]విన్పింప,
[4]గాలరుద్రులు హరికోలెమ్ము లెలమిఁ
గోలాట[5]గొడియల కొమరున నేయ,
నలరి తత్త్వములఁ దత్త్వాభరణేంద్రు
లిల జయఘంటల క్లైలమి వాయింప,
[6]నేల నింగియు మహాకాళులు సిద్ధి-
తాళముల్ [7]గదియించి తారు వాయింపఁ,
దగిలి రుద్రాంగనాతతులు దిగ్వితతి
నొగిఁ [8]గాంస్యతాళంబు[9]లోలి వాయింప,
నతిలీలఁ [10]బ్రమథాంగనావలి [11]వెట్టు

---

౧. హరులా. ౨. వా. ౩. గా. ౪. లీ. ౫. కండె; కొండె.
౬. నేలయు నింగియుఁ గాలాంతకులును. ౭. ల్గాఁగూర్చి; డాయించి; వాయించి. ౮. సప్త. ౯. నోజ. ౧౦. నమరా. ౧౧. బెట్టు; పెట్లు.

జతులు నానాగీతజాతములు బ్రాఁగ
భూత [1]భేతాళాది భూరి భూషణము
భాతి సముద్భటార్భటరావముగను,
నతుల యుగాంత మహాప్రళయాను-
గత జగత్తాండవ కేళనకుఁ జొచ్చి
హరివేధ లిరుదెసలందు వాయింపఁ
గరిదైత్యు వ్రచ్చినగతి నాడునాఁడు,
బంధురలీల సొప్పడ సుర ల్వొగడ
నంధకాసురు మెట్టి యాడెడునాఁడు,
మఱి మునుల్ వంచిన మహితోరగంబు
గిఱిగిటగాఁ బట్టి క్రియనాడునాఁడు,
వరతపోనిష్ఠకు వ్యాఘ్రపాదునకు
నరుదొందఁ గరుణించి యాడెడు నాఁడుఁ,
గడునర్థి గుండయ్య కడువలు [3]వరుస
నడరు వాద్యము జతికాడెడునాఁడుఁ,
బిట్టవ్వ గై సేయు వెట్టి మైఁ గట్టి
తట్ట వాయించుచో ధర నాడునాఁడు
వలచి చేరమ చక్రవర్తి వాయింప
నలరి పూజావేళలం దాడునాఁడు,

---

౧. వే. ౨. కళలకు. ౩. చఱవ.

నాపోవకున్న మహాప్రలయంబు
రూపించి యాడంగ రుద్రుండు దొడఁగెఁ
గాకేమి యంచు నక్కజమంది ప్రమథ-
లోకంబు వొగడఁ ద్రిలోచనుం డర్థి
వసుధఁ బుట్టనియట్టి వర్ణన లొలయ,
రసికులఁ జోఁకని [1]రసములు వొలయ,
గడనకెక్కని యలంకారముల్ దోఁపఁ
బడి యిడఁగారాని భావంబు లింపఁ
జూడ నక్కజమగు సుగతులు దవులఁ
బాడ నక్కజమగు ప్రతిజతుల్ నివుడఁ
దలపోఁతలకు రాని తాళంబు లులియఁ
గలలలో వినని [2]యుగ్గడనలు వెలయ,
రాగాఢ్యు లానని రాగముల్ దనర,
నాగరికంబగు నటన లింపొనర,
నంతకాంతకుఁ డుబ్బి యంతకంతకు ని-
తాంత తాండవ సముద్ధతి విజృంభింప,
సరిపాదఘట్టన చప్పుడు దక్కఁ
జరణ సంగతి గానఁ [3]జాలరాకుండఁ,

---

౧. రాసముల్. ౨. యుద్గదనలు. 3. జాలకయుండ.

గరతలగతుల [1]యుగ్గడన దక్కంగఁ
గర సహస్రాటన గానరాకుండ,
వఱలు జటాచ్ఛటాధ్వనులు దక్కంగ
నెఱి జటాగ్రములతోఁ గెఱఁగ రాకుండ
మకుట కోటీర ధామంబుల తక్క-
మకుట శిఖర మప్రమాణంబు గాఁగ,
నాద్యంతరహితుఁడై యయ్యద్రిజకు న-
భేద్యుఁడై యుండ నా ప్రియసాధ్వి మ్రొక్కి,
'[2]పరమానురాగ! యపరిమితానంద-
భరిత త్వదీయశుంభ న్మహామూర్తి
విస్మయతాండవోద్వృత్తిమైఁ బేర్చి
యస్మదాదులకు భయంకరంబయ్యె
(?) న 'య్యత్యతిష్ఠ ద్దశాంగులం'బన; ద-
దియ్యాది వేదాంతదృష్టులు గడచె,
'నత్యతిష్ఠ త్సహ[3]స్రాంగులం' బనిన
శ్రుత్యంతరము వేఱ చూపెడు తలఁపొ,
మహి భవత్పరమసూక్ష్మస్థూలరూప—
మహిమయ వేదాగమపురాణములకు

---

[1]. యుగ్గడనలు దక్క, [2]. పరమాంబరాంగ. [3]. స్రంబుమ-
మ్రోయ.

హరి విరించ్యాది సురాసురాదులకు
నరు [1]దెలియఁగనని యత్యద్భుతాటోప-
తాండవాడంబరోద్యన్మహామూర్తి
వెండి యెవ్వరి కింక వీక్షింపవచ్చు?
నాక్రీడ సాలించి యాదిసృష్టికి ను-
పక్రమింపవె, కృపాపర ! జగదాది!'
యంచు నెంతయు జగదంబ మ్రొక్కెడు ను-
దంచద్దయామతిఁ దాండవలీల
సాలించి సతికిఁ బ్రసన్నుఁడై యున్న
వేళ 'న బ్రహ్మా న విష్ణు' రనంగ
సూరులు 'నాగ్ని ర్న సూర్యో న చంద్ర-
తారకా' యనఁగ వేదశిరోక్తు లలర
ధ్రువ 'మేక ఏవ రుద్రో' యన మఱియు
నివుడు నానావేద నివహసూక్తులను
బ్రస్తుతింపుచు మహా ప్రమథాధిపతులు
మస్తకవిన్యస్త హస్తులై మ్రొక్క-
ననమాత్ముఁ డాప్రమథాభిమతంబు
లొనగుచు [2]సృష్ట్యున్ముఖోద్ధతి నిగుడ
నియమితాతీత ప్రలయ [3]గతభూత-

౧. దేరఁగనని. ౨. సృష్టిలీలోన్ముఖోద్ధతిని. ౩. యుగ.

చయ బీజసంచయ స్థానకారణము
లైన నిజాంగంబులందు వీక్షింపఁ
బూని 'స ఈక్షతే మే ను లోకాంశ్చ
లోకపాలాంశ్చ' నాలోలత, నట్లు
గాక 'స ఈక్షతే లోకాన్ సృజా' య-
నంగ వెండియు ఋగామ్నాయంబునందు
సాంగోక్తిఁ 'జక్షుష ఆదిత్య' యనఁగ,
మఱి 'మనస శ్చంద్రమా' యన, నంద
వఱల వెండియు 'ముఖాద్వాచోఽగ్ని'రనఁగ,
నదిగాక 'నాసికాభ్యా' మనుసూక్తి
నదియుఁ 'బ్రాణాద్వాయు'రని [1]సమాసింప
నందితంబంద 'శిశ్నాద్రేత' మనఁగ,
నందుండి 'రేతస ఆపో' యనంగ
నమరఁ 'బద్భ్యాం భూమి' రనఁ బ్రదేశాంత-
రమునఁ దొల్ శ్రుతియు 'శ్రోత్రాద్దిశా'యనఁగ,
'నాత్మాన మాత్మనో' యనఁగ బాహ్యలము
'నాత్మన ఆకాశ' యనఁ దదంగముల
శివుని వీక్షణమునఁ జేసి జనించె
నవికల ప్రకృతి బీజాష్టమూర్తులును

[1] సమసింప.

సటమున్న శివుని దృగంచలోద్భూత-
పటుఘృణామృతవార్ధిపై వెల్లివిరియ
హరుఁడు మున్ దాల్చిన యజ జనార్దనుల
చిరకపాలములకుఁ జేతన[1]మొదవి
యోలిఁ గీర్తింప నం దొక్కొక్క తలకు
శూలి బ్రహ్మత్వ విష్ణుత్వంబు లొసఁగ,
శ్రుతి 'నేష విష్ణోర్జనిత' నాఁగ విష్ణు-
శతపత్రజులు [2]శివు జనితగాఁ బడసి
సత్త్వరజో గుణైశ్వర్యానుపాల-
నత్వంబులకు వారు నాథులై; రంత
భవుఁడుఁ దొల్లిటియట్ల ప్రబలు బ్రహ్మాండ-
నివహముల్ [3]గ్రమ్మఱ నియమించునట్టి
నిగ్రహానిగ్రహోదగ్రైకగుణ స-
మగ్రుఁడై చను లింగవిగ్రహునకును
రమణ ననన్యశరణ్యులై వెలుఁగు
ప్రమథుల మహిమయుఁ, బటు పరాక్రమముఁ
దన స్వతంత్రతయు, నిత్యతయు, నీశత్వ-
మును, [4]జిదానందత్వమును, నిరవద్య-

---

౧. ౦బొందె. ౨. శివజనితులై పరగి. 3. గనుసన్న. ౪. జిరా-
తత.

మహిమ, యనన్య సామాన్యోరు [1]శక్తి
బహుళత వెంపుఁ జెప్పన[2]రాక సృష్టి-
లీలలుఁ దాండవవేళలుఁ బ్రలయ-
కాలముల్, మఱియొక కార్యంబులెట్లు
గాన, యనింది తైక [3]ప్రవృత్తికి, స-
దానంద[4]వర్తికి, నతుల కీర్తికిని
నిందలే యవి మహనియ్యతల్ గాక?
యిందు ధారణముఖాభీష్టవర్తనము
లకుటిల వేద వేదాంత పురాణ-
సకలాగమేతిహాస స్మృతితతులు
ప్రకటించు శబ్దోపపాదితార్థములఁ
బ్రకటించి యున్నట్ల పలికితిఁగాని
భక్తి మదోద్రేకభావనఁ బలుకు
[5]నుక్తులు గాకుండ నూహించుకొనుఁడు;-
అనుచు నిట్లునుగాక యజుఁడు 'గృహ్ణామి'
యనఁ 'బరశుం తప్త' మనఁగ నే మద్దుఁ
బట్టుదు [6]హరుమీఁదఁ బ్రతియు లేదనుచు
[7]నట్టుగా కొండుదయ్యము గల యట్లు

[1] కీర్తి. [2] కాక. [3] ప్రవర్తి. [4] మూర్తి. [5] యు. [6] శివునకు. [7] వట్టుగానొండు దైవము.

లయిన ' మూర్ధ్నా మే తు' అనఁగఁ 'బతిష్య-
తి' యనంగఁ దనతల దెగిమెడఁగాన
కడఁగి కేశవుమీఁదఁ గలఁడు లేఁడనుచు
వడి 'నదైవం కేశవాత్పర'మ్మని ప్ర-
శస్తిగఁ జేయెత్తఁ జక్కఁగ 'నంది-
నా స్తంభితో భుజో' నాఁ దనచేయుఁ
దెగిపడ్డక్రియ నంచు దేవుని మహిమ
జగములో నిష్ఠించె సరసిజభవుఁడు,
పెనసి వ్యాసుఁడు దన చెయి దెగి[౧] పడినఁ
గనుఁగొని వ్యాసాష్టకమున నుతించి
రతి 'నదైవం శంకరాత్పర'మ్మనుచు
క్షితిఁ బ్రతిష్ఠించె మా శివు మహత్త్వంబు
గావున నేనును గౌరీశుమీఁద
దైవంబు లేఁడని తలయిచ్చి పడయు-
దును, మంటఁబట్టుదు, దొడరిన గెలుతుఁ
బనుగొన వాద జల్ప వితండములను
జెలఁగి, యట్లునుఁగాక శివుమీఁద నొకఁడు
గలఁడన్న నాయుజకా లెత్తి వాని
నడుఁదలఁ దన్నుదు నాదు ప్రతిజ్ఞ

౧. పిదప.

యెడపక యేను గాలెత్తితి ననుచు
మానుగా శ్రీ రుద్రమహిమయన్ [1]శ్రుతి స-
దానందుఁడగు శ్రీ మహాదేవు మహిమ-
నారూఢముగ మల్లికార్జున పండి-
తారాధ్యు లాద్యు లౌననఁ బ్రతిష్ఠించె,
ధర నిది నిఖిల విద్వత్సభలందు
గర మొప్పు వాదప్రకరణ మనంగ.

* * * *

గురులింగ శివకరోదర పుణ్యజాత,
గురులింగ చరలింగ గుణగణాఖ్యాత,
గురులింగ చరణాబ్జ పరిమళాఘ్రాత,
గురులింగ చరణముకుర పరిస్ఫీత,
గురులింగ గురుదయాంకుర శుభవ్రాత,
గురులింగ దృక్సరోవరజాత జాత,
గురులింగకుల మహీధర సింహపోత,
గురులింగ దివ్యమందిర పారిజాత,
గురులింగ నిర్మాల్యగోత్ర సంపూత,
గురులింగ మంత్రావికుంఠిత శ్రోత[2],

---

౧. శ్రుతి. ౨. ఈ పాదము తరువాత 'గురులింగ సేవానుగుణ గణోపేత' అని అధిక పాఠము కొన్ని ప్రతులలో ఉన్నది.

వీనుల [1]కింపుగా విను సూర! సావ-
ధానత నిదియు వాద ప్రకరణము-

*  *  *  *

ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య-
పదపద్మ సౌరభ భ్రమరాయమాణ-
జంగమలింగ ప్రసాదోపభోగ-
సంగత సుఖ సుధాశరధి నిమగ్న-
సుకృతాత్మ పాలకురికి సోమనాథ-
సుకవి ప్రణీత భాసురతర దండ-
నాయక బసవాంకసఖ్యాత గుణగ-
ణాయత కీర్తి దిగంత త్రిలోక-
గురు [2]పండితారాధ్యచరితంబునందు
[3]గరము దృతీయ ప్రకరణ మొప్పారు.



౧. కింపాక. ౨. మల్లికార్జున. ౩. గరమొప్పు; గరమర్థి.

# శ్రీ పండితారాధ్యచరిత్ర

## ప్రథమసంపుటము—శుద్ధపత్రము

(తోఁచు, ఎసను, ఒసను, లలో అరసున్న లేదు. గ్రంథము లో ఆపదములలో ఎక్కడనయినా అరసున్న అచ్చులో కనబడితే దానిని తీసివేయవలెను.)

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౫ | ౬ | భవజన | భవిజన |
| ౨౮ | ౧౨ | పిసురుఁచందపు | పిసురుచందపు |
| ౩౪ | ౧౫ | బనఁగ'వర్తల'మ | బనఁగ'నవర్తుల'మ |
| ౩౬ | ౫ | యట్లన | యట్టుల |
| ౪౦ | ౨౦ | దేశాంత | దేశాత్త |
| ౪౭ | ౨౦ | ఈ పాదమునకు ముందు, 'బరగి దుష్టగ్రహోప శమన' మనఁగ' అనే జంటపాదమును చేర్చుకోవలెను. | |
| ౫౬ | ౨౧ | మహిమగా | లాసు (లస్గ) గా |
| ౫౯ | ౩ | వారక | వాయక |
| ౬౯ | ౧౧, ౧౨ | పుత్ర | పుత్త్ర |
| ౭౧ | ౩ | మాఁఅవయది | మాఁఅవునది |
| ౭౧ | ౧౯ | శోత్రా | శ్రోత్రా |
| ౭౭ | ౧౧ | మనఁగఁ | మనఁగ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౭౮ | ౯ | అస్మద్వేవ | అస్మద్దేవ |
| ౭౯ | ౧౧ | మంత్ర 'త్రేవ' | 'మంత్రి త్రేవ' |
| ౯౭ | ౧౯ | నాధా | నాథా |
| ౯౯ | ౧౩ | న హి | స హి |
| ౧౦౬ | ౪, ౬ | అజీక్కార్ల్లః | అజకార్ల్లః |
| ౧౧౦ | ౧౫ | గవాన్ సర్పిః | గవాక్ త్సర్పిః |
| ౧౧౭ | ౧౬ | నఱుఁసపై | నరుఁసపై |
| ౧౨౪ | ౪ | మత్తిగాడు | మత్తిగాఁడు |
| ౧౨౬ | ౧౧ | సందడింపుచు | సంవడింపుడు |
| ౧౩౯ | ౫ | చౌడయ్య | చౌఁడయ్య |
| ,, | ౮ | నవచిన | నసిచిన |
| ౧౪౨ | ౧౦ | భక్తిహీనులు | భక్తిహీనుల |
| ౧౪౫ | ౧౨ | బాపని | బాఁపని |
| ౧౪౬ | ౩ | పోవంగఁబడడు | పోవంగఁబడుడు |
| ౧౪౭ | ౧౦ | కలసె | కలిసె |
| ౧౫౩ | ౧౧ | చేయుఁబుణ్యాంబు | చేయుపుణ్యాంబు |
| ౧౬౦ | ౧౭ | దటీ తటీ | దటీదటీ |
| ౧౬౮ | ౭ | చేసుకో | చేసికో |
| ౧౮౭ | ౧౬ | వఱపక | వఱుపక |
| ౧౯౧ | ౧౧ | వఱప | వఱుప |
| ౨౦౨ | ౧౧ | మోకాలికిని | మోఁకాలికిని |
| ౨౨౫ | ౧౩ | మనస్పర్శనం | మనస్స్పర్శనం |
| ౨౨౭ | ౧౪ | బొలతి | బొలఁతి |
| ౨౩౯ | [illegible] | [illegible] | మనసులో |
| ౨౭౦. | ౯ | గొరిగించికొని | గొఱిగించుకొని |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౭౨ | ౯ | రెండవ | రెండవు |
| ౨౭౬ | ౮ | పైజీటి | పైఁజీటి |
| ౨౯౮ | ౫ | నీయయ్య | యీయయ్య |
| ,, | ౧౬ | డకై | డక్టై |
| ౩౯౯ | ౧౩ | నతఁడు | ననుచు |
| ౩౩౪ | ౧౪ | వొమ్మనుచు | పొమ్మనుచు |
| ,, | ౧౭ | వటి | వట |
| ౩౫౯ | ౨ | ముడివెట్టి | ముడివెట్ట |
| ౪౫౦ | ౧౦ | చిక్క | సిక్క |
| ౪౬౨ | ౫ | నుండు | యుండు |
| ౪౬౫ | ౧౬, ౧౮ | మజ! బాపు! | మజబాపు! |
| ౪౮౮ | ౯ | భక్తి | భక్త |
| ౫౧౫ | ౩ | యాహ్వాయ | ఆహ్వాయ |
| ౫౨౩ | ౫ | ముప్పదియాఱుతత్త్వ | ముప్పదియాఱుదత్త్వ |
| ౫౩౦ | ౧ | స్థిర | స్థిత |
| ౫౮౦ | ౧౫ | దానృపతి | దానృపతియు |
| ౬౧౧ | ౮ | తొరఁగెడు | తొఱఁగెడు |
| ౬౩౯ | ౧౨ | స్వర్గ | స్వర్ణ |
| ౬౮౦ | ౩ | కప్పు, రొమ్ము | కప్పును ఱొమ్ము |

---

# శ్రీ పండితారాధ్యచరిత్ర

## ద్వితీయ సంపుటము

### విషయసూచిక

మల్లికార్జున

# పండితారాధ్యచరిత్ర

## మహిమప్రకరణము

శ్రీమత్ప్రమథగణస్తోమ! దయారస -
 సామృతాబ్ధిసదావిహార! సూరార్యా[1]!
పండితారాధ్యుండు దండిత వాది
ఖండనశాస్త్ర తర్కప్రౌఢిపేర్మి
నతులపురాణేతిహాసాగమాను-
గత[2]నిజోదాసీన[3] కలితవాక్యముల
సకల[4]వేదానంతశాఖోపనిష ద -
వికలతర్కస్మృతివిహితసూక్తులను
శిష్టానుమత హేతుదృష్టాంత సుప్ర-
వ్యాప్తప్రమాణసమీహితోక్తులను

౧. సూరాఖ్యా, ౨. గతి, ౩. జోద్భాసిత, ౪. విధా.

సంపాదనము సేయ సకలసమయులు
సొంపేద౧ మల్లికార్జునుఁడు గావించు
ప్రశ్నోత్తరముల కా బౌద్ధుండు దగిన
ప్రశ్నోత్తరంబు౨ లాపాదింపలేక
కనుఁగవ మంటలు గ్రమ్మఁ దన్దాన
కొని కాలఁగూడ౩ ముక్కునఁ బొగల్వెడలఁ
దనువునఁ జెమటయుఁ ౪దాపంబుఁ దనర
మనసుఁ గలంగ బొమ్మలు ముడివడఁగ
మొలకమీస౫లు రోమములు నిల్వఁబడఁగ
గళము బిగియ నూరు౬వులు సందడింప
నురుకోపవహ్నిఁ ౭బండు లుఱిముఱి ౮గీఱ
గరములు శిరమును గడగడవడఁకఁ
గటములు వొంగ మొగంబు ౯గెంపెక్కఁ
దటఁదట డొందంబదర నోష్ఠ౧౦ముదరఁ
బలుకులు ౧౧దొట్రిలపడఁగ నెంతయును
గలుషంబు ౧౨మదముఁ బెన్గర్వంబు ౧౩నడర

---

౧. సొంపేది; సొంపొంద, ౨. రములకా, ౩. గూడి; గూడు, ౪. ధామంబు, ౫. మీసల; మీసము. ౬. పులు, ౭. పండ్లొండ్లొంటు; పండ్లొండొండ, ౮. గీటు, ౯. వెంపెక్క, ౧౦. మదర; మగల, ౧౧. దొట్రుదు; దొట్రులు, ౧౨. ముదము, ౧౩. దనర.

నారూఢయశు మల్లికార్జునపండి
తారాధ్యుఁ [1]బర సమయాభేద్యు నాద్యు
నంచితపుణ్యు లోకైక[2]వరేణ్యుఁ
గ్రించుబౌద్ధుఁడు ధిక్కరించి [3]పల్కుచును
నందడించుచు సభాస్థలి వెలువడియె
వందుచుఁ గందుచు వాదులుఁ దాను;
నంతఁ బండిత మల్లికార్జునయ్యయు జి-
తాంతకుభక్తులు నతులితప్రతిభఁ
బరవాదనిరసనపటుమహత్త్వంబుఁ
బరమేశు మహిమానుపాలనత్వంబుఁ
బరమతత్త్వ ప్రతిపాదనత్వంబు
గరుణాకరత్వంబు ఘనతరభక్తి-
సత్త్వంబు లోకగురుత్వంబుఁ బండి-
తత్వంబు వీరిక తగుఁదగు ననుచుఁ
బౌరులు బుధులు నప్పాటఁ గీర్తింప
నారూఢభక్తిసమగ్రత దనరఁ
గ్రియఁగొన విజయలక్ష్మియు వీరలక్ష్మి
[4]నియతమహిమలక్ష్మి నిజకీర్తిలక్ష్మి-

౧. బరు, ౨. శరణ్యు, ౩. పల్కుడును. ౪. నియతి.

[1]యును వరువు ళ్లయి యురుకీర్తి [2]సేయఁ
జనుదెంచి రపుడు నిజస్థానములకు
నంత [3]విద్వజ్జను లంతంత నెరవి
చింతమైఁ జేతులు సెక్కిళ్ల [4]నూఁది
'కటకట! పండితుఁ గడవంగఁబలికె
నట మదోన్మత్తుఁడై యధమబౌద్ధుండు,
నేమని తర్కించె నేమని యాడె
నేమని పలికెఁ దా నీపండితయ్య?
నరుఁడె సాక్షాద్దక్షిణామూర్తి [5]గాక
ధరఁ బుట్టె మును జగద్రక్షణార్థముగఁ
గాక యొడల్ గొన్న [6]కారణంబునను
బ్రాకృతపురుషుఁగాఁ బండితవిభుని
నోవంగ[7]ఁబలుకుట [8]నొచ్చెనపోదు
వైవచ్చు నీవిజృంభణ మట్లు గాక
తా మున్నె యుంగె "యత్సంవిత్తి" యనఁగ
భీమేశుగద్యంబ పీఠిక యైన
శ్లోకంబుఁ దప్పుగాఁ గైకొని వావ-

---

౧. యునుదనవరఁవులై; యునా వరదృఢలక్ష్మి, ౨. నెలయే, ౩. విద్వత్తము. ౪. నూరి, ౫. దావ, ౬. యీకారణమున, ౭. వల చెద, ౮. నొచ్చినఁబోదు; నొచ్చె నేపోదు.

దూకులుఁ [1]దారు నిరాకరించుచుండును
[2]వారణాసికి సాక్షి గోరి యాశ్లోక
మారంగ గౌళభట్టారకు[3]కడకుఁ
బనుప 'యత్సంవిత్తి' [4]యనినశ్లోకాదిఁ
[5]బొనరు నాల్గక్షరం[6]బులకు భాష్యముగ
వెరవున నాలుగు[7]వేలు గ్రంథంబు
విరచించి కర్తగా హరుఁ బ్రతిష్ఠించి
శేషాక్షరార్థ మశేషుఁడైనను వి-
శేషించి యిట్లని చెప్పలేఁ డనుచు
ధీరుఁడు గౌళభట్టారకుఁ డతుల -
భూరియశుఁడు వ్రాసి [8]పుత్తేరఁ దార
చదివి [9]సిగ్గిలితర్క జాలంబు లుడిగి
షుద మేది బౌద్ధులు [10]మగుడ రేనాఁడు
మఱియేల [11]తొరలేని మల్లికార్జునుని
[12]దొఱలిబో గెలువంగ? మఱి [13]కల్గు నింక

---

౧. దాను, ౨. వారణాసిని, ౩. ఁబఱప. ౪. యనుచు, యనఁగ, ౫. బొనర, ౬. బులను, ౭. వేల, ౮. పుత్తెంచె, ౯. సిగ్గిడి; సింగడి; శింగిడి; సిగ్గడి, ౧౦. మడుగరే; మడగరే; మడియరే, ౧౧. యాదొర; తొరలెన్; తరలరే; ౧౨. దొరలుఁబో; దొరలెఁబో, ౧౩. గల్గు, గల్గె; గలిగిరే యింక,

నెట్టు గా నున్నదో యీ మహాపురుషుఁ
డిట్టిన ఫలము సంధిలక పోదనుచుఁ
గొనకొని [1]పలుకంగఁ గొన్ని దినములు
నన మున్న మల్లికార్జును ధిక్కరించి
[2]పలికెఁ దా[3]న బౌద్ధపాపి దర్కమున
గెలువంగఁజాలక యిల నట్లుఁ గాక
[4]మలయుచుఁ [5]ద త్సభామంటపంబునకు
బలిమి వట్రిల్లఁ గాకొలని శ్రీ చెన్న-
మల్లికార్జున దీప [6]మాలె[7]గంబంబు
నెల్లవారును జూడ నిది దగదనక
తప్పగు ననక మీఁదట భార మనక
చొప్పగా దన[8]కది [9]యుప్పడం బనక
యుక్తిగాఁ దన కార్య లోడఁబడ రనక
భక్తులు విన్నఁ [10]జంపక [11]తక్కరనక
దోషం బనక శివద్రోహం బనక వి-
శేషించి లోకులు సేకొన రనక

---

౧. పసుపంగ, ౨. పలికినబౌద్ధుండు, ౩. నట, ౪. మలయుక, ౫. దనసభా. ౬. మాలి, ౭. కంభములు; కంబంబు, గ్రంబములు, ౮. కిది; కిల, ౯. యప్పరం; యుప్పరం, ౧౦. జెప్పక, ౧౧. చిక్కు; తప్పు.

వ్రచ్చి తెప్పించిన [1]వాఁడటె వీనిఁ
జెచ్చెరఁ జంపక చిక్కితిమేని
యూహింప నాతఁడు ద్రోహియే మనమ
ద్రోహులమును సభక్తులముఁ గా కనుచు
[2]దిట్టమై [3]రేమయ [4]దేవయ లపుడు
గట్టుగ్రలీలఁ గంకణములు గట్టి
వరుస [5]ఫున్నానుక [6]వైవంగనున్న
సర కంతయును నష్ట [7]చయ్యన నమ్మి
పరు లెఱుంగకయుండ బౌద్ధునక్కడఁచు
[8]వెరవ తలంచుచు వెనువెంటఁ దవులఁ
[9]జన సముద్రాంతరస్థలి [10]నొక్కలంకఁ
దనరు [11]బౌద్ధాలయ [12]మున ననుదినముఁ
గొండొక [13]ప్రౌద్ధుండి కుటిలబౌద్ధుండు
వెండి యే తెం[14]చు త ద్విధముఁ[15]దా మెఱిఁగి
యాసముద్రాంతరమందుల వసది
వ్రాసిన [16]నేలవో వానికి ననుచు

---

౧. వాఁడటే; వాఁడడె, ౨. దిట్టనై, ౩. రేవయ, ౪. దేవయ, ౫. పున్నానుక; మున్నానక; తోడఁ తమును, ౬. వయ్యంగ; వ్రయ్యంగ, ౭. చక్కఁగ, ౮. వెఱవ, ౯. జను, ౧౦. నొక, ౧౧. బుద్ధా, ౧౨. మునకను, ౧౩. ప్రొద్దున, ౧౪. చినవిధ, ౧౫. వారెఱిఁగి, ౧౬. నెలవొకో.

వీరావతారులు శూరు లేకాంగ-
వీరులు మఱి[1]నాఁడు[2]వేగు[3]జామునను
సరసర లింగావ[4]సరముఁ జెల్లించి
హరుప్రసాదం బిరువురును భోగించి
జను[5]లెఱ్గకుండఁ బ్రచ్ఛన్న[6]వేషములఁ
[7]జని శివాచారం[8]బు సన వహిత్రముగఁ
దఱిఁదఱి[9]వననిధుల్ దరియంగఁజొచ్చు
[10]చఱిమఱి[11]ముసిఁడి[12]చౌఁడయ్య, గజ్జేశు-
[13]మసణయ్య, దాసయ్య, మఱి[14]మొగవాడ-
బసవయ్య, [15]గుండయ్య[16]ప్రభువు, వాగీశ-
[17]నయనారియును,నమి నందియుఁ, [18]బిల్లె
[19]నయనారి,చేరమ, నంబిచోడండు,
గురు[20]భక్తుఁడును, గొండగుడి కేశిరాజు,
ధరణి వెండియు జలస్ఫురణఁ బొంగార్చి
పరగు భక్తుల పాద[21]పద్మస్మరణ వి-

---

౧. నాఁటి, ౨. వేవ, ౩. జామంబు; జావంబు, ౪. సరములు నేసి. ౫. లెఱుంగకను; వెఱుంగకను, ౬. వేషమున, ౭. జన; జను, ౮. బుధున;బుచను, ౯. నవనిధుల్, ౧౦. నఱిమఱి, ౧౧. ముశిడి, ౧౨. బౌద్ధయ్య, ౧౩. మసనయ్య; మనసయ్య, ౧౪. మొగి; మోగ, ౧౫. గుడ్డయ్య;గుజ్జయ్య, ౧౬. ప్రభవు, ౧౭. నయనారుగారినిమినంది, ౧౮. బిల్ల, ౧౯. నయనారు, ౨౦. బసుతుఁడు, ౨౧. పద్మసంస్మరణ.

హారణకేళీరతి నద్దరి [1]కేఁగి
యప్పాట బుద్ధాలయం[2]బును జేరి
యొప్పింపుమాద్రోహి [3]నోడకు మింక
వెనుక నిక్కము కాక యనుక్రియ[4]బుద్ధు
వెనుకదిక్కునఁ [5]బొంచికొని యున్నయెడను
బౌద్ధుండు [6]దొల్లింటిపగిదిన వచ్చి
బుద్ధాలయము సొచ్చి భువిఁ జాఁగి[7]మ్రొక్క
[8]వెడవెడ నుఱుమనిపిడుగులు వడిన
వడువునఁ బడి వానిమెడ[9]మెట్టి[10]పట్టి
చెచ్చెర[11]నాద్రోహి శివుదీప[12]మాలె
వ్రచ్చినగతి వాని [13]వలిపొట్ట వ్రచ్చి
భద్రుండు వ్రాఘుని[14]పండ్లువోఁ బొడుచు
[15]నుద్వృత్తి వాని[16]పండ్లూడంగఁ బొడిచి
[17]శ్లాఘి[18]నవీరభద్రుండు వాతకుని
యేతుజిహ్వాలు [19]వెర్క[20]యీడాడినట్లు

---

౧. కెయిది, ౨. బునకేఁగి, ౩. యోడకు, ౪. బౌద్ధు, ౫. జొచ్చికొని, ౬. తొల్లిడి, ౭. మ్రొక్కి, ౮. వెడ వెడ, ౯. ద్రొక్కి; వట్టి, ౧౦. కిట్టి, ౧౧. యద్రోహి, ౧౨. మాల, ౧౩. పైనట్ట, ౧౪. పంక్లూడఁ, ౧౫. నుద్ధృతి; తద్రీతి, ౧౬. దంతములూడ, ౧౭. ప్రోడయాపీర, ౧౮. గావీర, ౧౯. వెజి కీడాడి, ౨౦. కీడాడు.

వండితేంద్రుని గడ్వఁబలికిన పాల-
సుండ! నాలుక సూపు [1]చూపురా యనుచుఁ
[2]దనరఁగ నెలవులు దరగి యా[3]కావ-
[4]లుని రొమ్ముఁ ద్రొక్కి నాలుకఁ బెర్కివైచి
చెలఁగి చెండాడి ప్రేవులు సారి ద్రోహి
తలఁ [5]ద్రెవ్వి పొట్టలోపలఁ [6]బెట్టి కట్టి
ఖలు నుక్కడఁ[7]చి యసంఖ్యాతమాహేశ్వ-
రుల పంపనుచు[8] లేఖ రొమ్మునఁ బెట్టి
భావజహరుభక్త[9] భద్ర[10]గజంబు
లావార్ధి యట దిక్కు [11]త్రేవునఁ జొచ్చి
జగతి బిజ్జలుఁ[12]జంపి చను[13]మల్లెబొమ్మ
[14]జగదేకవీరుల చరణాంబుజములు,
[15]దొడఁగి వేంగీశ్వరుఁ ద్రుంచినయట్టి
[16]హడపదరేచయ్య యంఘ్రిపద్మములు,
[17]శంకరకూచి భస్మము సేసినట్టి

---

౧. చూపరా, ౨. దరలక, ౩. కావ, ౪. లురు, ౫. దర్గి, ౬. బట్టికిట్టి, ౭. ంచివిఖ్యాత, ౮. రేఖ; లేచి, ౯. భక్తి, ౧౦. గణంబు, ౧౧. లేవన, ౧౨. జంపఁజను, ౧౩. మల్లబ్రహ్మ. మొల్లె, ౧౪. జగదేవ, ౧౫. దొడరి, ౧౬. యడపద; యడపడ. ౧౭. సంకర.

బంకిదే[1]వయగారి పాదపద్మములు
వగతుఁ[2]డైచను కేణి ప్రాణంబుఁ గొన్న
[3]సగరద బ్రహ్మయ్య చరణాంబుజములు,
[4]వ్యాజునంకద సెట్టి వధియించినట్టి
[5]రాజన బ్రహ్మ చరణసరోజములు,
[6]మల్లెబోవని [7]జుట్టు మట్టాడినట్టి
బల్లిదు బసవన్న పాదాంబుజములుఁ,
బ్రల్లదు బడగనిఁ బఱచిన కంటె
కల్లయ్య [8]రామయ్య ఘనపదాబ్జములు,
[9]మలధరుఁ ద్రుంచిన [10]మానయ్యగారి
[11]కళ్లి దసరయగారి ఘనపదాబ్జములు,
గరహాటసన్న్యాసిఁ [12]గడపిన విప్ర
[13]వరు సర్వ[14]దేవని వరపదాబ్జములు,
ప్రతినై [15]సమయచక్రవర్తిఁ [16]ద్రుంచిన సు-

---

౧. వుంగారి; వనిగారి; బంకవాదేవని, ౨. డౌచును, క్రేడి; క్రేణి, ౩. సగదర; సగరడ; సరగద, ౪. వ్యాజనంతర, ౫. రాజస, ౬. ముళ్లబొయిన; ముళ్లఁబోయని; మల్లిబోవని, ౭. జుట్టుమట్టాడి; చుట్టుముట్టాడి; జిఱ్ఱుముఱ్ఱాడి; జీరుముడిచిన; బుఱ్ఱిముఱ్ఱాడి, ౮. కామయ్య, ౯. మళవరు; మళరుని; మళంరు; మళరుయ, ౧౦. మారయ్య, ౧౧. కల; కళె, ౧౨. గడలున, ౧౩. వర, ౧౪. దేవుని, ౧౫. మలయ, ౧౬. ద్రుంచియను.

మతి యగు వీరబ్రహ్మాయపదాబ్జములు
మఱియును ద్రోహుల [1]మడయించినట్టి
[2]నెఱి వీరగణముల నిజపదాబ్జములు
నాపయోధికిఁ దచ్చి వాచార మిడిన
తేఁపఁగా [3]రేమయ దేవయ లరుగ
నంత [4]నక్కడ బౌద్ధు [5]లపరాహ్ణవేళ
[6]సంతతంబును వచ్చు సమయంబునందు
రాకున్న శిష్యవర్గం[7]బేఁగి వసది-
వాకిళ్లు దెఱవ మున్ [8]వధఁ బొందియున్న
యట్టి బౌద్ధుని ఖండితాంగంబుఁ దలయు
నట్టియుఁ బొట్టయు [9]నప్పుడ [10]వ్రచ్చి
నెత్తురు [11]వఱదలై నెఱిఁ దేలియాడ
నత్తఱిఁ గాంచి [12]హా యంచు నేడ్చుచును
వాయెత్తి యఱచుచు వారివారికిని
గూయిడుచును వచ్చి కువలయేశునకు
[13]వినుపింప నతిశోకవివశాత్ముఁ డగుచుఁ

౧. మడియించి, ౨. నె రవర, ౩. రేవయ, ౪. నిక్కడ, ౫. డపరాహ్ణ, ౬. సంతసంబున, ౭. బెర్గి, ౮. వది; వడ, ౯. నప్పుడు; ౧౦. వుచ్చి; ద్రుచ్చి, ౧౧. వడదల, ౧౨. హాయంచు; హాయంచు, ౧౩. వినుతింప.

జని యిట్టిమరణంబు సమకూఱు[1]టేమి
యనుచుఁ బరీక్షించి యాఁగొమ్ము[2]లేఖఁ
గనుఁగొని పండితు [3]కతమ కా కనుచు
ధరణీశుఁ డతనికిఁ [4]దగుక్రియల్ నేసి
యరుగుదెంచి ఘనకోపాటోపశిఖలు
నిండా[5]రికన్నుల నిప్పులు[6]డుల్లఁ
బండితేంద్రునిఁ బిల్వఁబంచి యక్షణమ
యసమానవిగ్రహం [7]బవినీతి యనక
కసిమసంగుచుఁ [8]బట్టి కని విజృంభించి
నిత్యు మార్కండేయు [9]నిట్రించి కన్న
మృత్యువుక్రియ[10]మిడుమిడుమిడుఁకుచును,
నంతకజయుశ్వేతు నల్లంతఁ గనిన
యంతకుకరణి [11]రోషాక్రాంతుఁ డగుచు,
[12]శివగణాధిపు దధీచిని గనుంగొనిన
క్షువునట్లు[13]గ్రోధసంక్షుభితాత్ముఁ డగుచు
నసఘు [14]శాపాయుధఘనుని గౌతమునిఁ

---

౧. శైట్టల, ౨. రేక, ౩. కడముగా, ౪. దగఁగ్రియల్, ౫. రఁగన్నుల, ౬. నిండ, ౭. బవనీతి, ౮. బిట్టు; దిట్టు, ౯. నిందించి; నెటిమించి, ౧౦. మిడమిడ, ౧౧. కోపా, ౧౨. శివు, ౧౩. కలువ, ౧౪. శాపాయుతయజ్ఞు.

గనిన దక్షునిగతిఁ గ్రౌర్యాత్ముఁ డగుచు
నపగత[౧]క్రోధు భట్టాచార్యుఁ గనిన
క్షపణేంద్రుక్రియ మహోగ్రక్రోధుఁ డగుచు,
నవిచారవృత్తి మదాంధకారంబుఁ
గవిసినఁ[౨]గన్నులు [౩]గానక నృపతి
జనులు నీకుటిలవేషముఁ జూచి మరులు-
గొని పండితుం[౪]డంచుఁ గొనియాడఁబోయి-
నను విఱ్ఱ[౫]వీఁగుచు నానా[౬]విధముల
మును వాదముల నోడి [౭]మునుపడ లజ్జ
మన నోపవే నీవ [౮]మడియుదు[౯]గాక
చనునె [౧౦]విద్వత్తము సదసద్వివేకు
బ్రహ్మవంశజు బౌద్ధపదపదాచార్యు
బ్రహ్మజ్ఞుఁ జంపింపఁ బాడియే యనుచుఁ
గర మల్గి మును వీరగణము [౧౧]లాద్రోహిఁ
బారిగొని [౧౨]పోవుచు [౧౩]బొందిపై నపుడు
వయిచిన చిగురాకు వడిఁ బండితయ్య

---

౧. శ్రౌతు, ౨. గన్నుల, ౩. గానకా, ౪. డందురొని; ౫. వీఁగెడు; వీఁగెదు, ౬. ముఖముల, ౭. మడివడి; మడివడ, ౮. మడయుదు, ౯. గాన, ౧౦. వీరత్వము, ౧౧. లీద్రోహి, ౧౨. ప్రోవుచు, ౧౩. బొందివై; బొందియుపృథివి.

వయి వైచి ¹చూడుమీ పటుగర్వ ముడిగి
యన నసంఖ్యాతుల యానతి లేఖఁ
గనుఁగొని పౌరు లక్కజమంది చూడఁ
దల ²యెత్తుకొని నిజ దరహాస³రుచులు
⁴దళుకొత్త 'ధరణీశ ! తత్కార్యధార
యెఱుఁగుదు మనఁగ రా ⁵దెఱుఁగము, దీని
⁶నెఱుఁగ ననంగ రా దెఱుఁగుదు, మేమ
⁷యగుదు మాభక్తుల యానతి⁸గాన
గగనంబుఁ బైఁబడ్డ⁹గా దననేర
వాఁ డెన్నబడ్డ శివద్రోహి గాన
వాఁడు వేదవిరుద్ధవర్తి¹⁰యాఁగానఁ
జంపఁ ¹¹బంచినవాఁడఁ జంపించినాఁడఁ
జంపినవాఁడ నజ్జము ¹²ప్రోలి కతని
నంపఁ బంపినవాఁడ నంపించినాఁడ
¹³నంపినవాఁడ నే నౌదు నే నౌదు,
నతఁడు నీ కాచార్యుఁ డది నీకుధర్మ

---

౧. చూచిన, ౨. నెత్తు, ౩. గతులు, ౪. తిలకొని, ౫. దెఱుఁగుము, ౬. యెఱుఁగునీ; యెఱుఁగుమ, ౭. యసుదును మా భక్తులానతి, ౮. గాఁగ, ౯. గానన, ౧౦. యాఁగాన, ౧౧. బంపిన, ౧౨. పాలి, ౧౩. నంపితి నటుగాన నీకు.

మతని కల్గినవారి [1]కలిగి దండింప
నేన చంపితి[2]నని యెక్కించుకొనిన
[3]దానఁ బ్రాప్తుండ నీదండన [4]కపుడు
ప్రకటిత[5]క్రోధాగ్ని [6]పరితాపదగ్ధ-
సుకృతుండు వెలనాటి-చోడ[7]డక్క పాపి
ధర "బ్రాహ్మణో నహం[8]తవ్య" యనంగఁ
గర మల్లి [9]తప్పెంత గల్గిననైన
నధమజాతులఁ బట్టు[10]నట్టి బ్రాహ్మణుల
వధియింపరాదు [11]భూపతి కట్లుఁగాక
శిక్షింపఁ[12]దలఁతు రేఁ జేయుదు[13]రోలి
నక్షిదండం బర్హ మట్లును[14]గూడ
దధికాపరాధకుఁ డైనద్విజన్ము
నధమాంత్యజుం డెవ్వఁ డైనను శైవుఁ
డధికుఁ డైనట్టి బ్రాహ్మ[15]ణువధియింప
వధకు ననర్హుండ వైదికన్యాయ
గతి [16]శివ సన్నిధి గారణంబునను

---

౧. కలుగ, ౨. నను వె, ౩. దానప్రాప్తుండ, ౪. కనుడు, ౫. కోపాగ్ని, ౬. పరిమిత, ౭. ండు వాపి, ౮. తవ్యో, ౯. తప్పింత, ౧౦. నట్ల, ౧౧. భూవరునట్లు; భూవరుకట్లు, ౧౨. దలఁచిరే, ౧౩. కోరి, ౧౪. దగదు, ౧౫. ణునివధించు, ౧౬. శైవ.

రతి వేదశాస్త్రపురాణసిద్ధాంత-
మతమునఁ జను వేదమార్గంబు [౧]విడిచి
గతబుద్ధి బౌద్ధేంద్రఘాతకుఁ డితఁడ
యని యతీ దండనం బాచరింపంగఁ
బనిచిన నృపతికిఁ బండితుం డనియె
దైవ మీశుఁడుగాఁడు ధరణిఁ; [౨]బుద్ధుండ
దైవంబు; బౌద్ధుల తగు [౩]నిత్యముక్తు;
లారంగ వాదంబునం దోడియున్న
వారము మేము; మీవరుఁడును ద్రోహి
గాఁడు; నిరపరాధిఁ గట్టల్కఁ జంపి
నాఁడ నే ననియ యున్నది నీ[౪]మతంబు,
[౫]శివుఁడ దైవంబు ప్రసిద్ధ మాటకును
శివభక్తి[౬]పరుల విశిష్టు[౭]లౌటకును
*[శివమహత్త్వముమీఁదఁ జెప్ప[౮]నేమిటికి
శివు ధిక్కరించిన [౯]శివగురుద్రోహి
[౧౦]బౌద్ధుడు నోరను [౧౧]బాపంబు [౧౨]వ్రచ్చి

౧. దుడిచి, ౨. బద్ధుండు; బౌద్ధుడె, ౩. ముక్తిచరులు; ముక్తివరులు, ౪. మనంబు, ౫. శివుఁడు, ౬. పరులు, ౭. లైయుంట, ౮. నేఁటికిని, ౯. శితగుని; శివగుని, ౧౦. బౌద్ధేంద్రు, ౧౧. బానంబు, ౧౨. ప్రచ్చి; బ్రచ్చి; వ్రచ్చి. * కుండలీకరణము చేయబడిన పంక్తులు పూర్వముద్రిత ప్రతియందు లేవు.

యద్ధర విలివిలి యని దొర్లుచున్న
ప్రాపుల ప్రోక యి బ్బని సాక్షి, యతని
చావు మూర్ఖ సాక్షి దూషకుఁడు నాటకును;]
నతఁడు శివద్రోహి యగుటకు మఱియు
ధృతిఁ బరదేశ[1] స్వదేశులు సాక్షి;
[2]యెల్లెడలకు వాద మే మోడమికిని
దొల్లి వాఱిన[3] వాదదూకులు సాక్షి
యైయుండ నీప్రత్య[4]యములెల్ల మఱచి
[5]యెయ్యెడ నిన్నునీ వెఱుఁగక క్రొవ్వి
దండించె[6]దవ యెట్లు ధరణీశ యేను
దండించుకొనన తథ్యం బున్నవాఁడ;
[7]నట్టునుఁగాక చోద్యం బింక వినుము
ధట్టుండవై మమ్ము దండించెదేని
యక్షి[8]దండమ చాలు నవల దింక,
నీక్షితీశ్వరుమాట [9]లిన్నియు నేల

---

౧. శుల్ స్వదేశులు; శ్యుల్ స్వదేశ్యులు; శ్యస్వదేశ్యులు, ౨. యెల్లెడలను, ౩. వాదదూషకుల్, ౪. యంబులు, ౫. యియ్యెడ, ౬. దవుయెట్లు, ౭. నట్టులు, ౮. దండము; దండమె; దండన, ౯. లెన్ని.

చూడు ముమ్మాటికి శూలిమహత్త్వ
మూడంబరముఁ బ్రత్యయాడంబరంబు
హరుఁడు రుద్రుండు విశ్వాధికుం డగుట.
ధర శ్రుతుల్ "దచ్ఛిరోధర్మ" నా [1]మ్రోయ
శిరము [2]ముమ్మాఱుగా ఛేదింపఁబంప
శిరములు [3]మొలవక చిక్కునేనియును,
[4]హరభక్తిపరులు శిష్టాచారు లగుట
నరుదొంద "దర్శనా" [5]త్తన దరిసించుఁ
గన్నులు ముమ్మాఱుగాఁ [6]దొలఁగింపఁ
గన్ను లెప్పటిక్రియఁ [7]గలుగవేనియును,
నార నిర్మాల్య[8]సౌఖ్యమ ముక్తి యగుట
"ధారయే" త్తనఁ బ్రసాద[9]మునకుఁ జాఁచు
కరములు [10]ముమ్మాఱుగాఁ [11]దునుమింపఁ
గరము [12]లంకురితము [13]లగాకుండెనేని,
మును శివార్చనపాశమోచనం[14]బగుటఁ

---

౧. మ్రోయు, ౨. ముమ్మాటుగ; ముమ్మాటికి, ౩. మొలువక, ౪. హరుభక్తవరులు, ౫. ంతరము; త్తనఁగదర్శించు, ౬. దొలఁగింప, ౭. గలుగకయున్న, ౮. సౌఖ్యముముక్తి; సౌఖ్యమ్ముక్తి, ౯. మునకచాఁచు; మునఁజేచాఁచు, ౧౦. ముమ్మాటు, ౧౧. దునిమింప, ౧౨. లెప్పటియట్ల ఘటియిల్లవేని, ౧౩. గాకుండె, ౧౪. బగుట.

[౧]దనరి "కాయో నచే" [౨]త్తనఁగా భజించు
కాయంబు [౩]ముమ్మాఱుగా [౪]నటికింపఁ
గాయ మెప్పటి[౫]యట్లు [౬]ఘటియిల్లదేని,
యెక్కుడి దేవర [౭]యెక్కుడి[౮]భక్తి
యెక్కుడి నిర్మాల్య [౯]మేఁటిపూజనము
బౌద్ధుల[౧౦]ఘనులఁ [౧౧]దత్ప్రథమ దర్శనము
[౧౨]బుద్ధుండ శైవంబు భువి నీవ పతివి
[౧౩]యదియ దృష్టప్రత్యయము[౧౪]సూడు"మనుచు
మది నుబ్బి పండిత మల్లికార్జునుఁడు
వనితలఁ [౧౫]బురుషులు వాడవాడలును
[౧౬]విని[౧౭]వెలుఁగులు[౧౮]వడి వీక్షింప నేఁగు
దెంచి, [౧౯]లింగోద్భవ దేవు గోపుర స-
మాచితాభ్రంకష హర్మ్యాంగణమునఁ
గొలువున్న భక్తులకును సమస్తాంగ-
ములు[౨౦]మోపి యందంద [౨౧]ముమ్మాఱు మ్రొక్కి

---

౧. దనరఁగా, ౨. త్తరనాభిజించు, ౩. ముమ్మాటు, ౪. నటికింప, ౫. క్రియ; యట్లు, ౬. ఘటియింప, ౭. యెక్కుడ, ౮. భక్తులె, ౯. మేది, ౧౦. మునులు, ౧౧. దత్ప్రదము, ౧౨. బుద్ధుండు, ౧౩. యదియె, ౧౪. చూడ, ౧౫. బుత్త్రులు, ౧౬. విను, ౧౭. వెలుంగులు, ౧౮. వడ, ౧౯. లింగోద్భవు, ౨౦. మోపి; మోడి, ౨౧. ముమ్మాటు.

చెలఁగుచుఁ బోయి వచ్చిన కార్యధార
నలి భక్తతతికి విన్నప మాచరించి,
యుద్యత్ప్రసక్తి లింగోద్భవదేవు
గద్యంబునా నొక్క గద్యంబు సెప్పి,
దేవదేవేశు నాదిమదివ్యలింగ-
దేవు లింగోద్భవదేవు నతక్షణమ
చోద్యతరంబుగా స్తోత్రంబు సేసి,
సద్యఃప్రసన్నభాస్వరశక్తి వడసి
మంగళలింగ నిర్మాల్యప్రసూన -
సంగతోత్తంసోత్తమాంగవిభ్రముఁడు,
సరస శశ్వద్భక్తి సామ్రాజ్యరాజ్య-
వరపట్టబద్ధభాస్వరఫాలతలుఁడు,
దరహాసచంద్రికాధామాభిరామ
వరకళాసంపూర్ణ వదనచంద్రుండు,
హారమహిమాంకనోద్యత్సుధాసార-
పరిపూర్ణకుంభనిభ శ్రోత్రయుగుఁడు,
నానందబాష్ప నిరంతరవర్ధ-

---

౧. శక్తి; సంగ, ౨. గద్యంబ, 3. నాక్షణమ, ౪. పట్టభద్ర; బద్ధపట్ట, ౫. స్వత్ఫాల, ౬. లీల, ౭. తిటుఁడు, ౮. దామాభి. ౯. వర; పర, ౧౦. యుగ్ముఁ- డా.

మానసనేత్రాబ్జ[1]యుగ్మవికస్వరుండు,
[2]సరళసంస్థితదృగంచల[3]సముద్భూత-
కరుణామృత[4]నిషిక్త గండ[5]స్థలుండు,
స్ఫురిత[6]ప్రసాద తాంబూల[7]రాగాంశు-
[8]పరికలితాధర భ్రాజమానుండు,
సముచితసల్లాప సమయ[9]ప్రకాశ-
విమలదంతప్రభా విభ్రాజితుండు,
మహితపంచాక్షరీ మణిగణనికర-
నిహిత[10]కరండసన్నిభ రసజ్ఞుండు,
సహజప్రసా[11]దాన్య సమ్మిశ్రగంధ-
రహిత[12]నాసావివర ప్రశస్తుండు,
సముచిత[13]పూర్వావసరధూప[14]ధూమ-
కమనీయసౌరభకలితాంబరుండు,
నసమభస్మోద్ధూళితాంగ త్రిపుండ్ర-
లసితరుద్రాక్షమాలావిభూషణుండు,

---

౧. యుగ్మలి, ౨. చిరతరసరళసంస్థిత, ౩. సముద్ధూత, ౪. నిమక్త, ౫. తలుండు, ౬. ప్రతాప, ౭. రాగాంత, ౮. పరికీలితా; పరికల్పితా, ౯. ప్రకార, ౧౦. కరుండు; కరజ్ఞ, ౧౧. దాస్య; ౧౨. సంసారవీర; నాసావిహార; నానావివర, ౧౩. సర్వా; శర్వా, ౧౪. ధూమ్ర.

నానత శిష్యగణాకీర్ణభాస-
మానాంఘ్రి[1]యుగనఖామలముకురుండు,
శరణా[2]ర్త హృద్భృంగ [3]సంశ్రితపాద-
సరసీరు[4]హుండునై సన్నుతి[5]కెక్కి-
క్రాలుచుండెడు మత్తగంధగజంబు
[6]సాళి నిల్చుండి యాసభ నిరీక్షించి
మొదలబ్రాహ్మణుఁడును [7]దుదినంత్యజుండు
మొదలుగాఁ దద్బుద్ధమునులు జైనులును
ధరణీశ్వరుండును దన్నియోగంబుఁ
[8]బురజనుల్ వరిజనుల్ [9]బుధులుఁ బండితులు
వాదు[10]లుఁ దార్కికుల్ వరకవుల్ వేద-
వాదులు యతులు విద్వాంసు లాదిగను
గంటిమిగాన మే[11]ముంటిమి [12]లేము
వింటిమి [13]వినమని [14]వెనుకనావలదు,
వినుఁడు నాదుప్రతిజ్ఞ వీరువారనక
జనులెల్లఁ జూడుఁడు చక్కరమ్మనుచుఁ

---

౧. యుగ్మఁడుమహనీయయశుఁడు; యుగళనమహితముకురుండు; యుగముఖనఖముకుటుండు, ౨. ణార్థిహృద్భృంగ, ౩. సంస్థిత; సంస్థితా, ౪. హుండయి, ౫. కెక్కి; కెక్కు, ౬. చాళె, ౭. మది, ౮. పురి, ౯. బంధు, ౧౦. లతార్కి, ౧౧. మంటిమి, ౧౨. నేము, ౧౩. వినమని; వినమునీ, ౧౪ వెనక.

గణ[౧]కంఠ[౨]సద్భక్త గణనాథులకును
మఱియుఁ దొల్లిఁటియట్ల మాహేఁజాఁగి మ్రొక్కి
ప్రమథ పురాతనభక్త దివ్యాంఘ్రి-
కమలముల్ నిజమస్తకంబునఁ[౩]జేర్చి
శ్రుతి "ఏకఏవరుద్రో"[౪]యన మఱియు
శ్రుతులు "విశ్వాధికో[౫]రుద్ర" యనంగ
[౬]హరుఁడు [౭]రుద్రుండు విశ్వాధికుండగుట
కరయంగ [౮]నిదియ ప్రత్యయము [౯]సూడుండు
భువి శ్రుతు[౧౦]లన "సర్వా[౧౧]పూతో" యనంగ
సవడి [౧౨]"నన్యాన శిష్టా ఇతి" యనఁగ
[౧౩]హరభక్తవరులు శిష్టా[౧౪]చాపులగుట
కరయంగ నిదియుఁ బ్రత్యయము సూడుండు,
అరయఁ "బితా తదశ్యామ" యనంగ
సరిఁ "బ్రసాదాన్ముక్తి సంభవో" యనఁగ
భవుప్రసాదము ముక్తిపదవికి హేతు
వవుటకు నిదియ ప్రత్యయము సూడుండు,

---

౧. కంఠు, ౨. సద్భక్తు, ౩. చేర్చి, ౪. యని, ౫. రుద్రో, ౬. హరుఁడ, ౭. రుద్రుండు, ౮. నిదియుఁబ్ర, ౯. చూడుండు, ౧౦. లను, ౧౧. భూతో, ౧౨. నన్యాంశిష్టానితి, ౧౩. హరు, ౧౪. చార్యు

ధరణీశ్వరుఁడు మమ్ము [1]దండించునపుడు
గరములు గాల్లునఁ [2]గన్నులు శిరముఁ
దునిమిన, నఱకినఁ, [3]దొలిచిన, [4]దఱగి-
నను, జాఁగుచును, [5]బెగ్గుచును, వచ్చుచును, మొ-
లచుచు నుండకయున్న లక్షింప [6]నాక-
రచరణనేత్ర శిరస్సమూహంబు-
లను [7]బొడ్రిచిన, వాచినను, రక్తముబ్బి-
నను, నరంబులువొఁగినను, [8]దదంగముల
గ్రక్కున వ్రణమైన, [9]గండియుండినను,
స్రుక్కిన, [10]ముడిఁగిన, [11]జొరగిన, [12]మొరగి-
నను [13]భజింపము వలగొనముఁ [14]గన్గొనము
మనసిజ [15]సంహరు మఱియట్లుఁగాక
[16]మ్రొక్కము ముక్కంటి [17]కొక్కయేమేల
[18]యిక్కడఁగొలువున్న [19]యీయాయసంఖ్యాత

---

౧. దండించి, ౨. గల్లును, ౩. దొలిగిన; దొరిగిన, ౪. దరగి, ౫. వచ్చుచును చెర్గుచును, ౬. ఁగాఁగ, ౭. బొదిర్చిన; బొడిచిన, ౮. దదంగములు, ౯. గంటులుం, ౧౦. నుడిగిన, ౧౧. జొగిలిన; సోలిన, ౧౨. నొరిగి; మొరిగి, ౧౩. భజింపుము; భవింపుము; భవింపము, ౧౪. గన్గొనుము, ౧౫. సంహర; సంహారు, ౧౬. మ్రొక్కుము, ౧౭. యొక్కయ; యొక్కయొ; యొక్కర, ౧౮. యక్కడ, ౧౯. యా.

మాహేశ్వరుల[1]కట్ల మాటలేలనుచు
మాహేశ్వరుల[2]కెల్ల మఱియును మ్రొక్కి,
'మండలాధిప! [3]యనుమాన మింకేల?
దండింపఁబంపు నా [4]తలవరిఁజూచి
మున్ను గన్నులు[5]వుచ్చ [6]ముష్మాటు[7]నట్లు
గన్నులు[8]వచ్చెనా [9]కడుమ [10]సూతండు
నొక్కఁ[11]మాత్రైన రా[12]కుండఁ నేనియును
నిక్కఁ[13]మేఁజూచెద నేత్ర[14]దండనము
మొదలఁ[15]జేయుఁ'డని సముద్ధతిఁ బలుక
బెదరుచు [16]జనులు విభీతులైచూడ
[17]గోరుగొండ్లను [18]యామికులు[19]కాని[20]చేర,
శూరుండు మల్లికార్జున పండితయ్య
పద్మాసనస్థుఁడై ప్రాణేశు[21]ప్రాణ-
పద్మంబునందుంచి పటుభక్తియుక్తి

---

౧ మును; మను, ౨. కట్లు, ౩. మునుమాటలింకేల; మును మాటలేలింక, ౪. తలవరు, ౫. వుచ్చి; వుచ్చు, ౬. నుష్మాటు, ౭. నట్ల, ౮. వుచ్చెనా, ౯. కడమ; ౧౦. చూతండు; చూడుండు; చూడండు, ౧౧. మాత్రైన, ౧౨. కుండ, ౧౩. మ చూ, ౧౪. దండమున, ౧౫. జేయుండనిమదమువ, ౧౬. జనుచు, ౧౭. గోరుగొండ్లును; గోరుగళ్లును; గోరుగొండ్లామిక, ౧౮. యామికుఁడు, ౧౯. వచ్చి, ౨౦. చెదర; పాఱ, ౨౧. హృదయ; బ్రాణ.

సంజలీకృత కరకంజుఁడై నేత్ర-
సంజనితానంద జలపూర మడర,
"శ్రీమల్లినాథాయ జితమన్మథాయ
సోమాంకజూటాయ శూలాయుధాయ
భస్మీకృతాఘాయ పరమేశ్వరాయ
తస్మై[1]నమోఽస్తు కుధరవల్లభాయ!
శ్రీవీరభద్రాయ సింహాజినాయ
దేవాదిదేవాయ తేజోమయాయ
విస్మేరదహ[2]నాక్షి విగతాధ్వరాయ
తస్మైనమశ్శ్రీకుధర[3]ఖేలనాయ!
శ్రీవృషభేంద్రాయ శివవాహనాయ
శైవాగమపురాణశాస్త్రాధిపాయ
నస్మేరవదనాబ్జశాంతోదయాయ
తస్మై[4]నమశ్శ్రీకుధర[5]మందిరాయ!
ప్రమథాయ రుద్రాయ [6]భక్తిప్రదాయ
విమలాయ నిత్యాయ విశ్వస్తుతాయ
భస్మాంగరాగాయ [7]పాపాపహాయ

---

౧. నమోస్తుశ్రీ, ౨. నాక్ష, ౩. వల్లభాయ; పాలనాయ, ౪. నమోస్తుశ్రీ, ౫. వందితాయ, ౬. భక్తప్రియాయ; భక్తవ్రజాయ, ౭. పాపహరాయ.

తస్మై [1]సమః శ్రీకుధరవల్లభాయ!
శ్రీదేశికేంద్రాయ శివసన్నిభాయ
వేదితాత్మీ[2]యార్థవీరవ్రతాయ
సస్మృతిశ్రుతిసదాచారాధిపాయ
తస్మై[3]నమ శ్రీకుధర[4]వందితాయ!"
యని హృదీశ ప్రమథాధీశ భక్త-
జన నిజదేశికేశ్వరులకు మ్రొక్కి,
యామికు చే[5]నున్న యా[6]గోరుగొంటి-
పై మూల[7]మంత్రోక్త భసితంబుఁజల్లి,
మఱి పుచ్చుకొని వేదమంత్రోక్తమైన
[8]కలకంతు లింగోదకంబులఁ గడిగి,
యనుపక్తి "యా యా క్రియా విధాతవ్యా"
యనుశ్రుతి[9]మతము[10]శాస్త్రార్పణ గాన
శ్రీమల్లికార్జున [11]చెన్నయ్యదేవ
స్వామి మీామహిమాభివర్ధనార్థముగఁ
గామించి [12]ముమ్మాటుఁ [13]గన్నులు[14]నీవ

---

౧. నమోస్తుశ్రీ, ౨. యాయ, ౩. నమోస్తుశ్రీ, ౪. లోలుపాయ, ౫. గొన్న, ౬. గొరుగంటి; గోరుగొంట్ల, ౭. మంత్రోక్తి, ౮. కలకంఠ, ౯. మతమ, ౧౦. శస్త్రార్పణ, ౧౧. చిన్నయ, ౧౨. ముమ్మాటు, ౧౩. గన్నుల, ౧౪. నీడ.

[1]చేమట్టి[2]పుచ్చవే శివుఁడ! యన్నట్లు
పెనసి [3]శివార్చిత చేతస్కుఁ డగుచు
నొనరఁ [4]జతుష్పీడనోద్యుక్తమతిని
వలపటికి [5]నెపఁబు వ్రాలి, కుంభకము
నెలకొల్పి, భుజములు నిట్రించి, కంఠ
[6]మోరగించి, చనుటయును వదనంబుఁ
బూరించి, యున్మేషముగ నేత్ర మొగ్గి,
యనువు[7]గాఁ దన వామహస్తాంగుళములఁ
గను[8]తెప్ప లొత్తి, స్రుక్కకయుండఁబట్టి,
[9]దండియై యామ్యహస్తంబున గోరు-
గొంటి[10]వల్పటికంటికొల్కి లో[11]నునిచి,
యల్లన కంటిగ్రుడ్డువియకయుండ
మెల్లన[12]చుట్టును [13]మెలకి[14]పెకల్చి
పుచ్చి, కొల్కుఁ[15]నరంబులు విడిపించి,
క్రచ్చలి [16]వామాంబకము నట్ల పుచ్చి,

---

౧. చేమట్ట, ౨. ఫుచ్చుమీ, ౩. శివార్చనా, ౪. జతుస్స్ఫోట; జతుశ్ఛేద, ౫. సెవంబు, ౬. మోరసించి, ౭. గావామ హస్తాంగుళంబులను; గావామహస్తాంబుజాతమున, ౮. లెత్తి, ౯. దండిగా, ౧౦. వల్పలి, ౧౧. నిల్పి, ౧౨. చట్టుచు, ౧౩. మెరికి; మెరిపి, ౧౪. పెకల్పి, ౧౫. రంధ్రములు, ౧౬. వామాంగకము.

మసల కంబుజరాగ [1]మణులు భక్తులకు
నెసగంగ నారతు లెత్తినయట్లు
పళ్లెరంబుల[2]నిడి భక్తరాజికిని
వాల్లభ్యమొనగ [3]నివాళింపఁ బంపి
జను లెల్లఁ జూడఁ [4]దచ్ఛతులు రెండు
మను జేశు[5]ముందఱ మఱి పెట్టఁ బనుప
*నగపడఁ బగ†దన కనుచు నేత్రములు
దగిలి చూచుచుఁ దిర్గఁ దాన త్రోచుచును
నెట్టణ[6]సోఁడందు నెత్తురు నుదుటఁ
[7]బొట్టిడుకొంచు విభుత్వంబు మెఱయ
నంతలోనన మల్లికార్జున[8]ప్రభున
కంత కౌంతకుని మహత్త్వాతిశయత
నుదయించె నేత్రంబు లొండొంటిఁ గడవఁ
గదిసెఁ[9]దొర్గినపుండ్లఁ [10]గండ్లు నక్షణమ
పుచ్చినకన్నుల [11]బ్రొందల మున్న

---

౧. మణుల, ౨. నిట్టి, ౩. నివాటింప, ౪. దాఁజతువుల్, ౫. ముందట, ౬. చోఁడడా, * 'నిర్యాతమ్' అని సంస్కృతము. † 'మే' అని సంస్కృతము. ౭. బొట్టిడి, ౮. ప్రభుని; విభున, ౯. దొలగిన, ౧౦. గంట్లు, ౧౧. బొందల.

వచ్చు కీలాల ప్రవాహంబు[1]నుడిగి
పండితమల్లు విభ్రాజితనేత్ర-
పుండరీకము లిట్లు పొలుపారె[2]నంత
సద్భుతాక్రాంతాత్ము లగుచు నా[3]సభను
దద్భక్తజనులు నుద్ధతిఁ బండితేంద్రు
పాదాబ్జములు సిక్కఁ బట్టి మ్రొక్కుచును
బాదరేణువుఁ దలపై[4]నుంచికొనుచు
[5]సన్నుతిఁ సేయుచుఁ జెన్నారఁ గ్రొత్త
కన్నులుసూచుచుఁ గడుఁజిత్ర[6]మనుచు
గారవించుచుఁ గేళికలు[7]సేసికొనుచుఁ
దారును గినియుచుఁ [8]దాళగించుచును
బాడుచు [9]నొనఁగులు వీడుచు, గములు
గూడుచు, నలిరేఁగి [10]యాడుచుఁ, జేరి
[11]చూతఁడు [12]రంపడంచుఁ జూడరోయంచుఁ
జేతులు వీఁచుచుఁ జెలఁగి[13]యార్చుచును

---

౧. ఉడిగి, ౨. నట్లయ్యె, ౩. సభయు, ౪. (జల్లు; (దుద్దు, ౫. సన్నమీసములును, ౬. (జేయుచు, ౭. మగుచు, ౮. నేయుఁడనుచు, ౯. దాళవించు; గారవించు, ౧౦. చెలగులు, ౧౧. యాదట, ౧౨. చూతము; చూతుఁడు; చూడుఁడు, ౧౩. పదంచు, ౧౪. యాడు.

బొబ్బలు[1]వోడుచుచుఁ బొంగుచుఁ జెలఁగి
యుబ్బుచు నందఱు [2]నుత్సహింపుచును
జొంగు [3]భళా! యంచు [4]శరణంచు నుతుల
[5]పింగుచు నృపు డాయ నేఁగుచు మందిఁ
[6]దోలఁగంగ నూఁకుచుఁ ద్రోపులాడుచును
దలలుఁ దూరుచుకొంచుఁ దఱియఁ [7]జొచ్చుచును
[8]నులివు వారించుచు నొయ్యన [9]చనుచు
బలువిడిఁ [10]దట్టుచుఁ బాయ[11]నూఁకుచును
గ్రందు [12]ఘనం బంచుఁ [13]గట్టలు గొనుచు
సందులు వెదకుచు [14]సంచరింపుచును
నలవాఁడె రాజంచు [15]నటు వోకుఁ డనుచుఁ
గెలఁకులఁ [16]దారుచుఁ [17]గ్రేఁకరింపుచును
బుచ్చిన కన్నులు వోలఁగన్గొనుచు
నచ్చెరువందుచు నల్లన ముట్టి -

---

౧. వేయుచు; జెలఁగంగ, ౨. నుత్సవింపు. ౩. జౌ, ౪. శరణంబులివ్వ; శరణంచువిజ్జు, ౫. సంగుచు (పూ. ము.), ౬. దొలదొలుతోఁద్రోపు ద్రోపు; దొలఁగనూకుచుఁ ద్రోపుద్రోపు ౭. జొచ్చుడును, ౮. ఉలువు; ఉలుపు, ౯. ఁజనుచు, ౧౦. దొట్టు; జొచ్చు, ౧౧. నెత్తు; నొత్తు; దట్టు; ౧౨. మనంబంచు, ౧౩. గట్టలక్కు, ౧౪. జప్ప, ౧౫. నట, ౧౬. బారుచు, ౧౭. గ్రేఁకడి; గ్రేకటి.

పుట్టి [1]చూచుచు [2]నట్ల మ్రొక్కుచుఁ బట్టి-
పట్టి [3]యెత్తుచు భయం [4]పడి తొలంగుచును
ద్రొక్కుడు ఘనమంచు దొలఁగి [5]నిల్చుచును
నిక్కిచూచుచు [6]మిట్టు లెక్కి చూచుచును
గలకలంబులకు డగ్గఱక యా [7]మేడు-
నిలువుల [8]మేడయు [9]నిక్కిచూచుచును,
నక్కడఁ [10]గాల్వట్ట కరుగు దెంచుచును
స్రుక్కుచుఁ [11]గన్నులు సూడ [12]నేఁగుచును
జిన్నవోయిన రాజుఁ జేర నోడుచును
నెన్నంగఁ బండితుం [13]డితరుండె యనుచుఁ
గన్నులు [14]వచ్చుటఁ [15]గానఁడే యనుచు
నెన్ని [16]మాత్రైనఁ దా నిట్లకా కనుచు
మన్నింపఁ దగు నంచు [17]మాన్పఁడే యనుచు
బన్న [18]సెర్పఁగనోపుఁ బ్రజ [19]నెల్ల ననుచు
నెంతగానోపునో [20]యిఁక మీఁద ననుచు

---

౧. చూచియు, ౨. నట్లు, ౩. నొక్కుచు, ౪. పడఁ దొల, ౫. చను, ౬. మేడ; మిట్టి, ౭. యెడను, ౮. మెడ లెత్తి, ౯. నిండి, ౧౦. గాల్పట్ట, ౧౧. గన్నులఁజూడ, ౧౨. నొదుగుచు, ౧౩. డితరుఁడే, ౧౪. వుచ్చుట; వుచ్చుచు; మచ్చుట, ౧౫. గానఁడా, ౧౬. మాత్రైన, ౧౭. మాన్పఁడా, ౧౮. శెర్పఁగ; జేర్పఁగ; పఱప, ౧౯. లెల్ల, ౨౦. యిట.

గంతు [1]సంహారుఁడెర్గుఁ గాకేమి యనుచు
[2]సందడింపుచునున్న జనులవీక్షించి
మందస్మితముఖారవిందుఁడై యంత
నందంద [3]తా హస్త నయన సంజ్ఞలను
మంది యు[4]ల్వాడఁచి సమాధానపఱచి
[5] యూర్జితపుణ్యుఁ [6]డావర్జితయశుఁడు,
దర్జితాఘుఁడు మల్లికార్జునస్వామి
యారూఢతద్గోపురాంచిత హర్మ్య-
చారుతరోన్నత ద్వారోపకంఠ-
[7]నిరవధికస్థాప్య నిజ [8]తను స్తంభ-
పరికల్పితాంబక పటుమణిద్వయుఁడు,
సార సద్గురు దృగంచల విసర్య ద్ద-
యారసపూరి తా [9]యత[10]జలజనిత-
వరవీరభక్తి [11]సద్వాసనాయుక్త-
సరస [12]స్వకీయలోచనపద్మయుగుఁడు,
మానితాసంఖ్యాత మాహేశ్వర ప్ర-

---

౧. హారుఁడయెర్గు; హారుండెర్గు, ౨. సందడించుచు, ౩. హస్తనయనసంజ్ఞలందు, ౪. వీడి, ౫. యార్జిత, ౬. దుపార్జిత; డ వర్జిత, ౭. నెరవడి, ౮. ధనుస్తంభ, ౯. యాతు, ౧౦. లస జ్జనిత, ౧౧. సద్భావనా; సద్వ్యాసాను, ౧౨. ద్వితీయ.

[1]త్రాన దివ్యశరీర [2]ధామ [3]సంపూర్ణ-
తర చంద్రికానిరంతర [4]పానసుహిత-
నర[5]నుత నిజ[6]లోచనచకోరయుగుఁడు,
సిరపూర్వకర్మసంచిత[7]భూరికర్మ-
పర[8]దైవసేవానుపాదితకర్మ-
విని[9]యుక్తభవకర్మ [10]వివశ[11]సమస్త-
జనచయాంతర్బహిస్సంగత ధ్వాంత-
నిరసనాత్మియ్య[12]వినిద్రితనేత్ర-
[13]పరిచితాఖండ దీపయుగుఁడు నగుచు,
స్ఫుట[14]భక్తియుక్తివిభూతి[15]విడియము
లటుగూడ భక్తుల [16]కర్పింపఁబంచి
జననాథుఁ[17]దత్సభాజన[18]సంకులంబుఁ
గనుఁగొని దరహాసకలి[19]తాస్యుఁ డగుచు
మహాని[20]య్యమగు శివమహిమాతిశయత
మహిఁ నొప్ప భక్తసమాజంబు ప్రతిభఁ

---

౧. థాన, ౨. దామ; ధాము, ౩. సుపూర్ణ, ౪. వామసహిత; వానసహిత; పానసుఖిత, ౫. హిత, ౬. లోకన, ౭. భూతికర్మి, ౮. శైవదైవానువాదిత, ౯. యుక్త, ౧౦. విశద; ౧౧. ప్రశస్త, ౧౨. వినిందిత, ౧౩. పరచితా; పరిమితా, ౧౪. భక్తయుక్త, ౧౫. వీడియము, ౧౬. కర్పించ, ౧౭. తత్సభా, ౧౮. సమాహంబు, ౧౯. తాత్మ, ౨౦. యోఁడగుశివు.

౧గంటిరి నేఁడు మీకన్నులారంగ,
౨వింటిరి ౩దొంటి౪మా ౫వీరోగ్రభావ,
మనుజేశ నీయనుమానంబు వాయ
జనులకు నెల్ల దృష్టప్రత్యయముగఁ
బుచ్చినకన్నులు భువి౬నవే దేవుఁ
డిచ్చినకన్నులు ౭నిట ౮నీవ చూడు,
మా బాస౯యింకొకమాటికిఁ జెల్లె,
నీబౌద్ధమునులును నీనియోగంబు
సభయును నీవు నీ౧౦సారి సూడుండు
నభినవం౧౧బాబాన ౧౨యది యెట్టు లనిన
నా కన్ను ౧౩వుచ్చుచు నీ కన్ను౧౪వుచ్చఁ
౧౫జేకొను౧౬లోనన యాకన్ను౧౭వచ్చి
యాకన్ను మును౧౮వుచ్చు నంత౧౯లోపలన
౨౦యియాకన్నునప్పుడ రాకుండెనేని

---

౧. గంటిరే, ౨. వింటిరే, ౩. నేఁడు, ౪. మీ, ౫. వీరోగ్ర, ౬. నవె; నాకు; పెర, ౭. నివె; నవె, ౮. నీవు; నీవె, ౯. యిందొకట; యింకొండు, ౧౦. సారె; సారియుఁజూడు-మభి, ౧౧. బగుభావ, ౧౨. యది యట్టు; యదియు నట్లనిన, ౧౩. (బుచ్చుచు, ౧౪. (బుచ్చ; పుచ్చ, ౧౫. జేకొని, ౧౬. తోనన, ౧౭. వుచ్చి, ౧౮. వచ్చియంత, ౧౯. లోపలను, ౨౦. యా.

౧యది ప్రతిజ్ఞాభంగ మందురు వినుఁడు,
కదిసి చూడుం౨డెర్గ రే శివుమహిమఁ
౩బోఁడిగా౪నేత్ర మం౫భోజనాభునకు
నాఁ డిచ్చినశివుండు నవి౬సెనే నేఁడు?
*[నదిగాక ౭శివనాగమయ్యకక్షులు
మొదల నిచ్చిన ౮స్వామి ముదిసెనే నేఁడుఁ?
గన్నప్పఁగారికిఁ గన్ను౯లక్షణమ
ము న్నిచ్చినశివుండు ముడిఁగెనే నేఁడుఁ?
గాళి౧౦దాసికిఁ దొల్లి గన్నులరాశి
లీల నిచ్చిన శూలి ౧౧లేఁడె నేయీఁడు?]
౧౨సఱకాలఁ గన్ను ము న్నక్షపాదునకు
నెఱయ నిచ్చినకర్త నిలిచెనే నేఁడు?
శ్రీ గిరీ౧౩శుండంట శ్రీగిరియంట
౧౪యోగమోక్తంబ ౧౫ప్రత్యక్షంబ౧౬చూడ
నయనాద్రియది మల్లినాథదేవుండు

---

౧. యదియుఁబ్రజ్ఞా, ౨ డెర్గఁ-డే; డెఱుం-గరె, ౩.పాఁడిగా, ౪ నేత్రంబు, ౫. పద్మనాభునకు, ౬. చేసె, ౭. శివు, ౮. శూలి, ౯. లాక్షణము, ౧౦. దాసునకు మున్ దాసుకుఁదొల్లి; దాసికినిమున్, ౧౧. లేదెయీనేఁడు; లెంతయొనెందు, ౧౨. నలు, ౧౩. శ్వరుఁడంట, ౧౪.యాగమోక్తంబు, ౧౫. ప్రత్యక్షంబు; ప్రత్యక్షించి, ౧౬.గూడ,
* కుండలములలో ఉన్న పంక్తులు పూర్వముద్రణమున లేవు.

నయనాద్రి¹నాథుండు నాసర్వజనులుఁ
దడయక నేత్రముల్ ద్రవ్యోతండములు
వడయుట యిచ్చుట ప్రఖ్యాతి గాదె
యిల గొల్లఁ డైన గొల్లఁ గాచి²కాచి
యలరుచుఁ ³జేతిదు డ్డటు వాటవైచి
యరిగి నేత్రము లిచ్చి యప్పుడ⁴పడసి
యరుగు గొల్లఁ⁵గావ నంతవాఁ డనిన
నితరు⁶లఁ జెప్పంగ నేల శ్రీశైల-
పతి-మహాదానసంపద ⁷యెట్లుసెప్ప
వే యేల⁸డాఁచినవిత్తు బీజంబుఁ
బాయనిరొంపుల ⁹బయలనుజల్లి
ఫలము లందుట జగత్ప్రఖ్యా¹⁰త మనిన
ఫలము దప్పనె¹¹ శివార్పణవిధులందు
మహి నట్లుఁగాక బ్రాహ్మణు లాదిగాఁగ
స్పృహఁ బరమేశ్వరప్రీత్యర్థ మనుచు
నితరసమయు లైన నీశు¹²గుఱించి
ధృతిఁ దిలాజ్యాక్షతాదిద్రవ్యవితతి

---

౧. దేవుండు, ౨. కాని, ౩. జేతద్రుడ్డటు, ౪. పెడసె-న, ౫. గాన, ౬. లు సెప్పంగ, ౭. యిట్లు; యట్లు, ౮. దాఁచిన; దాఁతీవ, ౯. బైల్లను; బయలులఁ, ౧౦. తియనిన, ౧౧. శివార్చన, ౧౨. గొల్చినను.

పడి౧సన నగ్నిలోఁ జల్లి౨సనైన
వడి జలంబులఁ౩జల్ల ౪వఋతిపాలైనఁ
బొందుఁ దత్తత్ఫలంబులు దప్ప కనిన
నెందు సాత్మాత్పర ౫మేశున కని ని-
౬వేదించు తత్క్రియా౭విఖ్యాతఫలము
౮లేదెనఁ౯దప్పనే ౧౦యిల నట్లుఁగాక
యెన్నంగ మెట్టున ౧౧కేసినకోల,
మిన్ను సూచినదృష్ట్లు మేదిని౧౨నూఁదు
౧౩చేయుఁ దప్పనె, ౧౪యట్ల శివునిగుఱించి
౧౫చేయుచేఁతలుఁ దప్పనే, యాది౧౬సూక్తిఁ
౧౭బొనరి "యత్యుత్కటైగి పుణ్యపాపైశ్చ"
యన "నిహైవఫలం"౧౮బు నన విన రెట్లు?
భువి నుత్కటం బగు పుణ్యపాపములు
శివుని నుద్దేశించు ౧౯చేఁతల కాన
తల లీశుఁ౨౦బూన్చిన ౨౧దశవదనుండు

---

౧. సిన; సన్న, ౨. నీరైన, ౩. జల్లి, ౪. వరద; వరతి, ౫. మేశ్వరుకనిని; మేశ్వరుకథని; మేశ్వరుకనిన, ౬. వేదించ, ౭. విఖ్యాతి, ౮. లేచన, ౯. దప్పనీ, ౧౦. యిలనునెట్లనిన; యిల నెట్టులనిన, ౧౧ కెగసిన, ౧౨. నేయు; నెనయు, ౧౩. చేయి; వేయు, ౧౪. యట్లు, ౧౫. నేయు, ౧౬. శక్తి. ౧౭. వొసర న, ౧౮. బులన; బనను, ౧౯. చేఁతలు, ౨౦. బూఁచిన, ౨౧. దళవహనుండు.

దలఁ[౧]గంటి నన్నట్టి తామరసజుఁడు
నంఘ్రిపద్మముఁ గన్న వ్యాఘ్రపాదుండు
నంఘ్రు లేఁ గనియెద ననిన విష్ణుండు
భవుఁ[౨]బ్రణుతించిన భట్టబాణుండు
భవుని నిందించిన పాపి దక్షుండు
[౩]హారుఁడ దైవం బన్న యక్షపాదుండు
హారుమీఁదఁ[౪]గలఁ డన్న యట్టి వ్యాసుండు
నభవుఁ దలంచిన యా శ్వేతమునియు
నభవుఁ[౫]దలంపని యద్వైతమునులుఁ
బరమేశుఁ గొలిచిన బాణాసురుండుఁ
బరమేశుఁ గొలువని బ్రహ్మసుతుండుఁ
[౬]దలఁప దృష్టమ తమతమ పుణ్యపాప-
ఫలములు వొందుట ప్రఖ్యాతి గాదె
దేహాంతరమునఁ[౭]బొందెడు [౮]తత్ఫలంబు
దేహంబుతోడ నంధిలు[౯]డర్ది గాదె
నద్యఃప్రసాదైక [౧౦]శక్తియ చాలఁ
జోద్య[౧౧]మంతకుఁ గడుఁ జోద్యంబు వాస

---

౧. గంటుగొన్నట్టి, ౨. విను, ౩. హారుఁడు, ౪. గల దన్న, ౫. దలంచ; దలఁపమి, ౬. దలఁపంగమిథ్యాలైతమతమ, ౭. బొందెడి, ౮. తద్బలంబు, ౯. టర్ది; టర్థి; టడ్డు, ౧౦. సక్తియుఁ జాల, ౧౧. మెంతయు; మింతయు.

*[వలికి[1]నట్టుల జగత్ప్రిత్యయ-[2]దృష్ట-
ఫలసిద్ధిఁ బొందించు [3]భక్తి గావునను
[4]బుచ్చిన నేత్రంబుఁ బుచ్చు నేత్రంబుఁ
బుచ్చు[5]నంతటన తా [6]వచ్చు నేత్రంబు
వచ్చులోనన [7]మఱి పుచ్చినకన్ను
[8]పుచ్చునాకన్నులు [9]వచ్చుటగాక]
తడసిన, గుండెలు దలఁకిన, బిగువు
సడలిన, జనులకు సంశయం బైన,
శంకించినను, [10]మెయి [11]గొంకిన, మది ద-
లంకిన, బింకంబు బొంకంబు సెడిన,
[12]జడ్డువడిన, వ్రేళ్లు సడలినఁ, [13]గంటి
గ్రుడ్డ[14]విసిన, గోరుగొండి [15]వ్రీఁగినను,
జేతులు వడఁకినఁ, జెమట[16]దోఁచినను,
ధాతువు[17]ల్ సెదరినఁ, దాపాశ్రుకణము

* కుండలులలోని పంక్తులు పూర్వముద్రణమున లేవు.
౧. నట్లన, ౨. దృష్టి, ౩. భజన, ౪. వచ్చిన, ౫. నంతటనె, ౬. వచ్చెనుమరియు; వచ్చు నేనదియు, ౭. మరి, ౮. వచ్చునా, ౯. పుచ్చుట, ౧౦. మేలు, ౧౧. గొందిన, ౧౨. జిట్టు, ౧౩. గంటు, ౧౪. వసిన, ౧౫. విర్గినను, ౧౬. వెట్టి, ౧౭. లడఁగిన; ల్దలఁకిన; ల్దొలఁగిన.

[౧]లువిసిన, నరములు [౨]బిగిసిన, సూర్పు
[౩]లెవసినఁ, గొలుకులఁ [౪]నెఱ్ఱ దోఁచినను,*
[౫]దప్పనాటిన, రక్త[౬]ధారల బెగడు
గప్పిన, తెప్ప[౭]లిల్కఱచిన, డెంద
ముదౌరిన, దలఁపులు బెదరినఁ, జిత్త
మదరిన, ముఖకాంతి సెదరినఁ,గన్ను
లిచ్చుట యదియేఁటి [౯]యిచ్చుట, [౧౦]యవియు
వచ్చుట[౧౧]యది యేఁటి వచ్చుట, మున్న
పుచ్చుట [౧౨]దాపునేఁటిచ్చుట, మీరు
మెచ్చుట యదియేఁటి మెచ్చుట, యనుచు
నాస్థాన మద్భుతం బంద నిష్ఠించి
సుస్థితి మల్లికార్జునపండితయ్య
ముందటియట్ల యందంద సద్భక్త-
సందోహపాదాభివందనుం డగుచుఁ

---

౧. లఁగిసిన; లురిగిన; లఁఅవిన, ౨. బిగిసిన; బెడమిన; బెడసిన; బెరసిన, ౩. లెగసిన; లెడసిన, ౪. నెఱసు, ౫. దప్పనాడిన, ౬. ధారలు బెడఁగు, ౭. లీల్కఱచిన; విల్గడచిన, ౮. టిన, ౯. మెచ్చుః, ౧౦. యదియు; యనుచు, ౧౧. మఱి యేటి, ౧౨. నేఁటి. * ఈపాదమునకు బదులుగా ఒక తా. ప్ర. లో "మసలకభీతియు మఱియుఁదోఁచినను" అని ఉన్నది.

ప్రమథపురాతన [1]భక్తదివ్యాంఘ్రి-
కమల స్వకీయహృత్కమలస్థుఁ డగుచు
నవిరళ నిరతిశయానంద జనిత-
శివపదధ్యానైక [3]చేతస్కుఁ డగుచు
నుద్ధత [4]తచ్ఛివయోగ సౌఖ్యాను-
బద్ధ సమాధిసంపన్నాత్ముఁ డగుచు
నతుల మహాద్భుతోద్యద్వీరభక్తి
యుతసమాహితమహిమోపేతుఁ డగుచుఁ
దచ్చతుస్[5]రత్నసంధానావ[6]ధాన
మచ్చెరువుగ. మున్ను వుచ్చినయట్లు
[7]వుచ్చెఁ గన్నులు రెండు [8]వుచ్చ[9]దోడ్తోన
వచ్చెఁ గన్నులు రెండు వచ్చుటఁ జూచి
వుచ్చఁబూనినకన్నుఁ బుచ్చి యాకన్ను
వుచ్చులోనన మున్ను వుచ్చినకన్ను
వచ్చెఁ గన్నిదె వచ్చె వచ్చెదా నదియు
వచ్చులోనన[10]మఱి వుచ్చినకన్ను
వచ్చెఁ గన్నిదె వచ్చె వచ్చెనా నట్లు
సెచ్చెరఁ దడవగుఁ జెప్పన కాని

---

౧. భక్తి, ౨. నవిరత, 3. చేతసుం, ౪. శ్రీశివ, ౫. శస్త్ర, ౬. దాన, ౭. వుచ్చ, ౮. వుచ్చె, ౯. దోడ్తేర, ౧౦. మను.

తమ వింత లేదు నేత్రంబులరాక
గడుఁ జిత్ర మంచు నొక్కట నరు ల్వొగడ
నంతఁ బండిత మల్లికార్జునస్వామి
యంత[౧]కంతకు భక్తు లందంద[౨]యలర
నూత్న[౩]తద్గణదయానుగతలోచనసు-
రత్నంబులను [౪]భక్త[౫]రత్నరత్నాద్రి
కడర నివా[౬]ళించునట్టి నేత్రములు
వడి భక్తతతికి నివాళింపఁ బంచి
మున్ను[౭]వుచ్చిన నేత్రములు, వెన్కఁ గ్రొత్త
కన్నులు[౮]రెట్టింపఁగాఁ [౯]జోడఁ డొత్తఁ
[౧౦]గలసివచ్చుచున్న కన్నులఁ జూచి
తొలుత నేత్రంబులుఁ దోడఁదోడఁ జూచు
మున్ను[౧౧]వుచ్చిన నేత్రములు, వెన్కఁ గ్రొత్త
కన్నులఁ[౧౨]గూడఁ దిర్గఁగ ద్రోచిచూచు
నప్పండి[౧౩]తుని నయనాబ్జము లూనాచుఁ
దప్పక నాల్గునేత్రంబులు సూచుఁ

---

౧. కాంతకు, ౨. యదర, ౩. గద్గద; తద్గత, ౪. భక్తి, ౫. రత్నాద్రిరాజి, ౬. ళించి, ౭. వచ్చిన, ౮. బెట్టించ, ౯. జూడ, ౧౦. కలమరగించుచు; కలవలించుచువెన్క, ౧౧. వచ్చిన, ౧౨. జూడ, ౧౩. తుల.

దనుఁజూచు మఱియు నేత్రంబులు సూచు
మనుజావలిని జూచు మఱి నేలఁజూచుఁ
ధరఁ దలవంపయ్యెఁ దన కని చూచుఁ
బారిగొన కీ[౧]యల్కు వోదనిచూచుఁ
బండితుఁ గ్రేఁగంటఁ బలుమాఱు సూచు
వెండియు[౨]నిట్ల తా వికలాత్ముఁ డగుచు
[౩]నింతంత సోద్యంబు నినుమడి లజ్జ
యంత[౪]కంతకు నల్మైడై కడలేని
కోపంబుఁ గార్శ్యప తాపంబు[౫]మనసుఁ
[౬]బాపంబు నది వజ్రలేపంబు గాఁగ,
ద్వేషంబుఁ దొలిమేనిదోషంబుఁ బూర్వ-
రోషంబుఁ దన క[౭]ది వేషంబు గాఁగఁ,
క్రోధంబు, నధికాపరాధంబు, గణవి-
రోధంబుఁ దనకుఁ బ్రబోధంబు గాఁగఁ,
క్రూరత, ఔద్ధోపకారత, [౮]మదవి-
కారత దన కపకారత గాఁగ,
[౯]న్యూనంబు, న్యాయవిహీనంబు, దురభి-

---

౧. యల్కు; యడ్కు, ౨. తొనట్ల, ౩. నింతింత, ౪. కునిదియున్న, ౫. నగుట, ౬. దాపంబు, ౭. విశే, ౮. షద, ౯. కేనంబు; నేనంబు.

మానంబుఁ దన కభిమానంబు గాఁగ,
వాదంబుఁ, గుసమయాహ్లాదంబు [1]నతివి-
షాదంబుఁ దన కపవాదంబు గాఁగఁ,
గర్మంబు, [2]హతపరమర్మంబు న య్యా-
ధర్మంబుఁ దన[4]కదె ధర్మంబు గాఁగఁ,
దన్నుఁ దా మఱచి మదగ్రస్తుఁ డగుచు
భిన్నమనస్కుఁడై పృథ్వీశ్వరుండు
గన్నులు[5]వుచ్చుడు గంటిఁ దెల్లమిగఁ
గన్నులు వచ్చుడుఁ గంటిఁ[6]దెల్లమిగ
నిటమీఁద నేత్రంబు లీ[7]నేర్చుటకును
నట[8]మీఁద రాకకు నది దృష్ట[9]మిదియు
[10]నిమ్మాఱు నేత్రంబు లిచ్చినయతఁడు
[11]ముమ్మాఱు[12]నీఁగికి[13]మోసమే[14]యనక
పుడమి నృపుఁడు బౌద్ధపుంగవు[15]నలిగి
[16]మడియించి[17]నాతని మడియింప[18]లేద

---

౧. గత, ౨. హృత; నతి, ౩. పరి, ౪. కావ్య; కాద్య, ౫. వుచ్చుట, ౬. నిక్కముగ; తెల్లముగ, ౭. నేరుచుటకు; నోరుచుటకు, ౮. మీఁదిరాకున్న, ౯. మిదియు, ౧౦. నిమ్మాటు, ౧౧. ముమ్మాటు, ౧౨. నీగిరి; నగరికి; నింగికి ౧౩. మోసమో, ౧౪. యనఁగ, ౧౫. డలిగి; కలిగి, ౧౬. మడయించు, ౧౭. నాతఁడ, ౧౮. లేక; లేదు; లేఁడు.

యడఁగింతు దండింతు ననుచుఁ బాపమున
కొడిగట్టు[1]కొనిన నట్లొడఁగూడ[2]దయ్యె
దండింపఁ బంచిన దండనం [3]బిడియు
మాఁడనం బయ్యె నా పండితయ్యకును
బండితయ్యను బట్టి దండింపఁ[4]బంచు
దండన నృప యశగి ఖండనం బయ్యె
[5]నను రిత్తసడి వచ్చె నవని[6]లో నాకు
వినఁజాల[7]మఱి మున్న వీక్షింపఁజాల
భంగింతు[8]బండితు [9]వంగింతు నిపుడ
[10]క్రుంగింతుఁ [11]దను నేన త్రుంగింతుఁ బోవ
నట గార్య[12]మైనట్టు లగుఁగాక యనుచుఁ
గుటిలచిత్తుఁడు యామికులదిక్కు సూచి
రండు పండితుఁ[13]బట్టి తెం డీక్షణంబ
రెండుగన్నులుఁ[14]గెలకుండ పుచ్చుండు
పఱపుండు[15] వలచినభంగి నిం కేల
మఱి[16]చూచి[17]కొనియెద మల్లికార్జునుని

---

౧. కొనుటయ్య, ౨. దయ్యె, ౩. బదియు, ౪. బంప, ౫. నని, ౬. లోపలను, ౭. మది, ౮. ఖండింతు, ౯. భంగింతు, ౧౦. ద్రుం గింతు, ౧౧. దన్నేన, ౧౨. మైనయట్లగు, ౧౩. దెండు, ౧౪. గెలు కుండు, ౧౫. వలసిన, ౧౬. చూచు, ౧౭. కొలియెద.

బత్తియు గిత్తియుఁ బండితుపాలి
మిత్తియుఁ గిత్తియు [౧]మీర కండనుచు
రప్పించి నేత్రము[౨]ల్ వుప్పించి చాల
నొప్పించి [౩]జిల్లపాల్ దెప్పించి నిండఁ
బోయించి చోడండు వోయె; నక్షణమ
పోయె నాతనిపాలి పుణ్యంబుఁ [౪]దొలఁగి;
కలఁగుచు నంత ని[౫]క్కడ సభాస్థలిని
గొలువున్న భక్తులు [౬]గుబ్బన[౭]లేచి
"శివశివ! [౮]యిటువలెఁ జేయ ధర్మంబె
శివశివ! యిటువలెఁ జెడునె చోడండు
దమనేత్రములు [౯]దామ తఱఁదఱఁ[౧౦]బుచ్చఁ
దమకించి [౧౧]మఱియేల దండింపఁబంచెఁ
గన్నులు[౧౨]వుచ్చుడు [౧౩]గానఁడే [౧౪]జడుఁడే?
గన్నులు[౧౫]వుచ్చుడు గానఁడే పడుచె?
బాలుండె మెఱుఁగఁడే భ్రమితుండె చూడఁ

---

౧. మీరకుండనుచు; మీఁదరండనుచు (సం. మహిమ. V.3౧ యాయంభవత...), ౨. లుప్పింప, 3. తిల్లపాల్; తిలపాలు, ౪. దొరఁగి, ౫. కక్కడనున్న సభయు; కక్కడిసభాసదులు, ౬. గొబ్బున; గుబ్బున, ౭. లేఁచి, ౮. శివయిటుసేయ, ౯. దార; దామె, ౧౦. బుచ్చె; బుచ్చి, ౧౧. మది, ౧౨. వుచ్చుట, ౧౩. గానసే, ౧౪. జడ్డుఁడు, ౧౫. వచ్చుట.

జాలమి గాక యసహ్యంబు గాక
కుటిలచిత్తుఁడు(ఁ)గాక [౧]కూళుండు(ఁ)గాక
యిటువంటికర్మంబు లెందునుఁ గలవె
యిచ్చమైఁబలుపంగ నితకు లేవారు
[౨]నొచ్చఁబోవునె [౩]వారి నొప్పింపఁ [౪]దగునె
[౫]చోడఁ డీదేశంబు [౬]సాదగొనఁ [౭]జొచ్చెఁ
జోడండు సెఱుపంగఁ [౮]జూచె నిప్పరము
దనకులంబునకు [౯]గుద్దలి [౧౦]దాన కొనియెఁ
[౧౧]దనకతాఁ [౧౨]ద్రుంగంగఁ దలఁచెఁ జోడండు
వెల[౧౩]నాఁటి వ్రేళ్లతోఁ [౧౪]బెకలింపఁదలఁచె
[౧౫]వెలనాఁటి [౧౬]శాపాగ్ని వేఁపంగఁ దలఁచెఁ
గటకటా! యింక నెక్కడిచోడనృపతి
కటకటా! యింకనెక్కడివెలనాఁడు
[౧౭]నక్కటా! చోడని కెక్కడిరాజ్య
మక్కటా! [౧౮]చోడని కెక్కడి[౧౯]బ్రదుకు

---

౧. కూళఁడు, ౨. నొచ్చలువునె; నొచ్చెబోవునె; నొచ్చఁబోయిన, ౩. వారు, ౪. గలదె, ౫. చోడనిపాపంబు, ౬. సాడగని; సాడగాని, ౭. వచ్చె, ౮. జొచ్చె, ౯. గ్రుద్దలి, ౧౦. దానె; దాను, ౧౧. దనకుఁదా; దనకుకాల్, ౧౨. క్రుంగంగ, ౧౩. నాఁడులెల్లర; నాటివేళ్లకు, ౧౪. భేదింప, ౧౫. వెలనాఁడు, ౧౬. కోపాగ్ని, ౭. నెక్కడి, ౧౮. వెలనాటి, ౧౯. బ్రతుకు.

నొకచోటఁ [౧]బూరించి యొకచోట [౨]మెఱచి
యొకచోట ఘూర్ణిల్లి యొకచోట [౩]నుఱిమి
యొకచోటఁ బడుపిడు నొకచోట[౪]ఁజూఁడి
యొకచోటఁ బడుక్రియ [౫]నొండొండ పుట్టె;
నెక్కడి[౬]సనదవో లెక్కడిబొద్ధుఁ
డెక్కడిప్రతివాద మెక్కడిచోడఁ
డెక్కడిపండితుం డెక్కడి క్రోధ
మెక్కడ[౭]నుండి తానెక్కడఁ బొడచె
రాజున[౮]కాభిచారము గాకతక్క
[౯]యోజింప నెంతగా [౧౦]నున్నదో యితని
పాలిదైవ[౧౧]మ మెఱ్గు భావింప నితఁడు
వాలించు[౧౨]భూమియుఁ బొడు గానోపు
రూపింపఁ బ్రత్యక్ష[౧౩]రుద్రుండ[౧౪]కాక
యీపండితయ్య దా నితరమర్త్యుండె
యననేల వేయుఁ [౧౫]బ్రత్యక్షుంబకాదె

---

౧. జరియించి, ౨. మెరసి, ౩. నులిమి, ౪. దూఱు; దూఱి, ౫. నొండొండఁబుట్టె, ౬. చనద; సనదు, ౭. నుండెఁదా, ౮. కభిచారములు, ౯. నోజింప; డోజెల్ల, ౧౦. నోపునో, ౧౧. మెఱుంగు, ౧౨. భూమియుపాడు, ౧౩. రుద్రుండు, ౧౪. గాన, ౧౫. బ్రత్యక్షంబు.

మనమెల్లఁ[1]జూడమే మాటలే లిపుడు
నిందలు [2]నెఱుఁగంగ [3]నినుమాఱు గన్న
లందందపడయఁడే [4]యాడినయట్లు"
లనుచుఁ బండితమల్లికార్జునదేవు
[5]వినుతింపుచుండిరి వినమితు లగుచు;
నంత నప్పుడు పండితయ్య దత్సభయుఁ
గంతుసంహారు భక్తగణములు వినఁగ
"ససమానమహిమ! మహాదేవదేవ!
వసుధ నీమహిమాభివర్ధనార్థముగఁ
దను[6]వొగ్గి[7]మేమయి దండించుకొనఁగ
మనుజేశ్వరుండు దుర్మతి వేగపడియెఁ;
బాపి యెఱుంగఁడు భక్తులమహిమఁ
గోపి గానఁడు లోకగురుఁడ! మీమహిమ
నిమ్మహిజను[8]లిప్పు డిందఱుఁ జూడ
[9]నిమ్మాఱువరుసల నీశ! మన్నేత్ర
కంజంబు [10]లొండొంటిఁ గడవ [11]మున్వొగడఁ
బింజ[12]వింజఁ[13]గఱవఁ బృథురయస్ఫూర్తిఁ

---

౧. జూచెమో, ౨. (జూడంగ, ౩. సరు, ౪. యండిన. ౫. వినుతించు, ౬. వొంగి, ౭. యే మేని; యేమయ్యు; యేమైన, ౮. లెల్ల నిప్పుడ, ౯. నిమ్మాటు, ౧౦. లొండొంట, ౧౧. మన్బొగడ, ౧౨. పింజ; బింజ, ౧౩. గరవ.

బుచ్చుట యిచ్చుట భువి నొప్పె నింక
నిచ్చుట [1]మీకు మహిష్ఠత [2]గాదు
పశుపతి! మీ భక్తిపరులు "శాపాద-
పి శరాదపి" యనంగఁ బెనుద్రోహిఁద్రుంచు
నంతకు నాతని నతనివంశంబు
నంతకుపురమున కనుచు నంతకును
శ్రీకంఠ! కన్ను లిచ్చితివేని [3]యుపుడ
నీకు భక్తులయాన నీయాన యట్ల
శ్రీకంఠ! యేను నాసించితి నేని
నాకు భక్తులయాన నాథ! నీయాన
యస్మదీశ్వర! యమరారామమునను
విస్మయం [4]బని బౌద్ధ వితతి గీర్తింపఁ
బుడమి [5]మర్త్యులు మహాద్భుతమని పొగడఁ
బడయుట మాకొప్పఁ బడయు నేత్రములు
నెడ [6]నిడుదై యుండ నిచ్చుట [7]నీకుఁ
గడు నొప్పు [8]నట్లుగాఁ గరుణింపు మింక
నొండేల యీ దురాత్ముం డేలు భూమి
నుండఁగూడదు భక్తియుక్తుల" కనుచు

౧. నీకు, ౨. మా; నీ, ౩. యిపుడు, ౪. బుగ, ౫. భక్తు, ౬. నిడుదలు గాఁగ, ౭. మా; మీ, ౮. వట్టులు.

సా పండితయ్య భక్తాజ్ఞాపనమున
శాపోదకము లెత్తి జనులెల్ల వినఁగఁ
గాలకోలాహల! కాలాగ్ని! రుద్ర!
౧కాలకాలాంతక! కాలాపహరణ!
రుద్రరౌద్రాంగ! విరూపాక్ష! వీర-
భద్రముఖ్యాఖిలప్రమథాధినాథ!
సవిమల సమయవిజ్ఞాపనాలాప
మవధరించుటకు మహాప్రసాదంబు;
మలహర! మీ ౨శాప ౩మాత్రమునన క-
౪మల సంభవుని ౫ పట్టు ౬మాసినయట్టు,
లాది దూర్వాసుశా౭పాద్భుతశక్తి
యాదవవంశక్షయం బైనయట్టు,
లక్షపాదుని మహోద్యచ్ఛాపశక్తి
దక్షాధ్వరంబు విధ్వంస మైనట్టు,
లానర దధీచిశాపోద్ధతి నచటి
మునులు దేవతలు నిర్మూలమైనట్లు
వరువడి వ్యాసుశాపమున విప్రులకు

౧. కాలాంతకాంతిక, ౨. కృపా, ౩. మాత్రంబుచేతఁ; మాత్రంబునకును, ౪. మలినసంభవు, ౫. పుట్టు; వంబు, ౬. మాన్పిన; మాలిన, ౭. పొద్భూత.

స్మరహర ! మీభక్తి మాలినయట్లు,
[1]దిరునీలనక్కని దృఢశక్తి ద్రవిళ-
ధరణి [3]జైనమును బౌద్ధముఁ [4]ద్రుంగినట్లుఁ,
బిల్లనైనారు శపింపంగ నట్లు
దొల్లి జైనులును బౌద్ధులుఁ [4]ద్రుంగినట్లు,
సరి నట్ల నమినంది శపియింప నూరి
సురభు లక్షణమ[5]ని స్తుత మైనయట్లు,
[6]భంగి నరియమ శాపమున మహేంద్ర-
మంగళాధిపుఁ[7]డని మడిసినయట్టు,
లంధుం[8]డిరిత్తాండి [9]యధిక [10]శాపాను-
సంధానమున జైను లంధు లైనట్లు,
నరయ నేకాంతరామయ్య శాపమున
సరి[11]నబ్బలూరి [12]వసది గూలినట్లు,
గుడ్డవ్వ శపియింపఁ గుష్ఠు [13]వహించి
దొడ్డభూసురు లెల్లఁ ద్రుంగినయట్లు,
ఘనుఁడు [14]హావినహాళ్ళి కల్లయ్య శాప-

---

౧. దిరునక్కరునుశాప; తిరునక్కరిశుశాప; తిరునావకరిశాప, ౨. భక్తి, ౩. జైనంబు, ౪. గ్రుంగి, ౫. నిస్తూవమైనట్లు, ౬. భాంగియర్యమ శాపమునను, ౭. డును, ౮. డిరిత్తాండుఁ డతుల, ౯. యతుల, ౧౦. శాపాగ్ని, ౧౧. నెబ్బ, ౧౨. వసదులుపడ్డట్లు, ౧౩. నశించి; వహించు, ౧౪. హావిళహాళ; హావినహాళ్ళ.

పునఁ బోముఁ లా[1]గ్రామమునఁ [2]జచ్చినట్లు,
వేయేల మన దండనాయక బసవ-
ధీయుత శాప ప్రతిజ్ఞా [3]ప్రశస్తి
నెల్లవారును జూడ [4]నీనేల గడవ
బల్లహుపీఠంబు వాడైనయట్లు,
లీయసంఖ్యాత మాహేశ్వ[5]రోత్థిత స-
మాయత [6]క్రోధోత్కటానల [7]పటల-
విరచితజ్వాలల వెలనాఁటిచోడ-
ధరణీ[8]తలేశ్వరాధమ పతంగంబు
భస్మమయ్యెడమ తద్బంధులు సుతులు
విస్మయంబుగ నిష్ఠ భస్మమైపోదు”
రని శాపమిచ్చుచు నాపండితయ్య
యొనరంగ మునువుచ్చియున్న నేత్రములు
దివిరి లింగోద్భవ దేవదేవునకుఁ
దవిలి యర్పింప నేత్రంబులు నాల్గు
ముక్కంటియును దన ముక్కన్నులందు
ముక్కన్నుధరియించి చిక్కినకన్ను

---

౧. గ్రహమున, ౨. బుచ్చు, ౩. ప్రశక్తి, ౪. నీసలకడయు ; నీనేలుకడయ ; నిసలకడాయ, ౫. రోద్ధత, ౬. క్రోధోద్ధతా, ౭. చటుల, ౮. తలాధమేశ్వర; ధరేశ్వరాధమ.

చమవామపాదార్పితం బైన [1]తొంటి
కమలాక్షుకంటికిఁ గవయుఁగా [2]యామ్య-
పాదంబు[3]నందు విభ్రమలీల దనర
నాదట [4]ధరియించునపుడు పండితుఁడు
నిరపరాధులఁ గాచు నిజదయాదృష్టి
వరభక్తి[5]మెఱయు నైశ్వర్యైకదృష్టి
గర మల్గి నృపుఁ జూచుఁ గడునుగ్రదృష్టి
సరణులఁ గనుఁగొను సద్భక్తదృష్టి
నానొప్పు [6]నీదృష్టులు నాల్గునీశ్వరుఁడు
పూని ధరించిన పోల్కి యెట్లనిన-
*[శశ్వద్దయాదృష్టిఁ [7]జంద్రాంబకమున
నైశ్వర్యదృష్టి సూర్యాంబకంబునను
జటులోగ్రతరదృష్టి జ్వలనాంబకమునఁ
బటుభక్తి దృష్టి [8]శ్రీపాదంబునందు
ముక్కంటి దాల్చెనా మునుదాల్చియున్న]
య క్కన్నుఁగవ లీశుఁ డవధరించుడును

1. తొండి, 2. వామ్య, 3. నంద, 4. ధరియించు, 5. మెఱయ, 6. దృష్టులు. 7. జండాంబకమున; జంద్రాంబకంబు. 8. నీ పాదంబులందు, 9. చుటకు. * ఈ పాదములకు సంస్కృతములో అనువాదము లేదు.

సనఘుండు గురుమల్లికార్జునుం డంతఁ
దన శిష్య పుత్ర మిత్ర కళత్ర సహిత
[1]మరిగె [2]శీఘ్రమ యమరారామమునకుఁ

పల్నాంటి చోళవంశక్షయకథనము

బరమ [3]మాహేశ్వర ప్రకరంబుఁ దాను;
నరుగంగ నరుగంగ నంత నిక్కడను
బురి మహోత్పాతముల్ వుట్టంగఁదొడఁగెఁ,
*[బాడు వాఱఁగఁజొచ్చెఁ బట్టణంబెల్లఁ
జొడందు దలలేని నీడఁ గన్గొనిరెఁ,
గాలునిఁ గలలోనఁ గనిరె, శ్వానములు
మొఱగింపఁగఁజొచ్చె రేలుఁ బగల్లు,
వీఁకఁ గావిరి వెల్లివిరిసె, గుబ్బముల
తోఁకల నిప్పులు [4]దొలుఁగంగఁ[*]జొచ్చె,]
నేల గాలఁగఁజొచ్చె నింగివడ్డట్టు
సాళి మేఘంబు[5]లాసన్నమై [6]పర్వెఁ,
బవలు సుక్కలు గానఁబడిరె, [7]ధూమంబు
గవిసె, నెల్లెడ వంటకంబులు వుచ్చె,

---

1. మరిగి, 2. శీఘ్రంబున, 3. మహేశ్వర, 4. దొరఁగంగ; దొరువంగ, 5. దొడఁగె, 6. లుసన్న, 7. పన్నె; పన్ని, 8. ధూమ్రంబు.

భూకంప[౧]రావ మద్భుతమయ్యె, [౨]రాత్రిఁ*
గాక కౌశికజంబుకము లర్వఁదొడఁగె,
గాలి[౩]ధూళియుఁబర్వెఁ గడు[౪]మోఱలెత్తి
తూలుచుఁ బశువులు [౫]దొరుగంగఁజొచ్చె,
నింద్రచాపములు ఖం[౬]డేందుచాపములుఁ
జంద్రార్కపరివేషజాలముల్ [౭]వొడిచె,
మనుజేశునకు నంత మంత్రివిరోధ-
మును బ్రధానవిరోధమును నాప్తభటవి-
రోధంబుఁ బుత్త్రవిరోధంబు నిరప-
రాధంబుఁ బుట్టె, నూరను [౯]మారిమసఁగె,
ధరణి వెండియు మహోత్పాతముల్ వుట్టెఁ,
[౧౦]బురిజనుల్ [౧౧]వచ్చెనా భూమికి నవధి
యది యేలఁతప్పెఁ [౧౨]దా హరగణక్షోభ,
మది యేల తప్పె నాయయ్యశాపంబు?
మొన్నఁ[౧౩]బండితుఁడు సమున్నతిఁబలికె,

---

౧. మధిక, ౨. ఁబవలు, * ఇచ్చట ఒక ప్రతిలో "నాకంప రావ మద్భుతమయ్యె రాత్రి" అని యతిదుష్టమయిన పాద మున్నది. ౩. దూళి, ౪. మొఱ, ౫. దొలఁగంగ; దొరులంగ; దొరలంగ, ౬. డేంద్ర, ౭. వొలిచె, ౮. పటలి, ౯. మారు, ౧౦. పుర, ౧౧. వుచ్చెనా; విచ్చెరి, ౧౨. నా, ౧౩. బండితులు.

<sup></sup>నిన్న నుత్పాతముల్ నెలకొనె, నేఁడుఁ
బుట్టె గోత్రకలహములుఁ దమలోన,
నెట్టుగానున్నదో యింకఁజోడనికి !
సిద్ధంబు భక్తవిరుద్ధంబు ఫలము
సిద్ధింపనోపుఁ జేసేత నంచెట్లుఁ
గలహంబు గానోపుఁ గ్రందు గానోపుఁ
బ్రళయంబుఁ గానోపుఁ బ్రజకెల్ల నింకఁ
బురి నున్కి యిటమీఁద బుద్ధి గా" దనుచుఁ
బొరుగూళ్లకును దమ పొందుఁ బట్లకును
వారివారికి నేఁగ వడి నొక్కనాఁడు
ధారుణీశ్వరుఁడు నిద్రాసమయమున
భసితావలిప్త కపాలాస్థి దామ-
లసిత శుంభజ్జటా లంబిత విపుల-
కటితట సన్నద్ధ ఘంటికానీక-
పటుతర ధ్వాన దిగ్భరిత విభ్రమము
విలసిల్లఁ గంకాళ వేషంబుఁ దాల్చి
కలుషోత్క టార్చులు గన్నులఁ గ్రమ్మఁ

౧. నిన్నియుత్పా, ౨. గృహ, ౩. భక్తి, ౪. చేసేత, ౫. ననట్లు, ౬. లెల్ల; లకు, ౭. నుండ నిటమీఁద; నునికీమీఁద, ౮. తవిలిప్త, ౯. ధామ, ౧౦. ఖండికా, ౧౧. నికర, ౧౨. తద్ధ్వాన భరిత, ౧౩. ల్లు కంకాళ.

దనఁబొమ్మఁ ద్రొక్కి యుద్యత్త్రిశూలాగ్ర-
మున నొక్క తపసి స[1]మున్నతిఁ బొడిచె
ననుచు వాపోవ నిజాంగన మేలు-
కని బిట్టులికి నలుగడలు వీక్షించి
[2]గగురువొడుచు మేను గంపింప, మనసు
[3]బెగడఁ [4]జిత్తమ్మున [5]భీతిల్లు సతికి
[6]నలఁగుచుఁ గలఁ[7]జెప్పె నంతలోపలను
గలయు నిక్కలమైన కరణి [8]వట్రిల్లె
మూఁడు గన్నులవాని ముమ్మొన యలుఁగుఁ
బోఁడి[9]గాఁ గలలోనఁ [10]బొలయు నంతటన
ముమ్మొనల్గాడె బొమ్మునఁ జిత్ర [11]మనఁగ
ముమ్మొన[12]పుండు బొమ్మునఁ [13]బుట్టె, నట్టి
పుండుఁ గన్గొనిన పాపుండు సజ్జన రి-
పుండు సోడనరాధిపుండు శంకింప
నరయంగ దుష్కీర్తి యను మహోదరికి
వరుసఁ [14]జన్నులుమూఁడు వట్రిల్లునట్టు

---

1. యుప్పొంగు, 2. గగుడుపొడ్చుచు, 3. బెగడు, 4. చిత్తంబును, 5. భీతిల్ల, 6. నలగుచు, 7. జెప్పి, 8. వట్రిల్ల, 9. మిగాలోన, 10. బొలయనంతటను, 11. మఁగను, 12. పుండ్లు, 13. బుట్టి, 14. గన్నులు.

లోనరఁ గోపగ్రంథియునుఁ మదగ్రంథి.
యును దురితగ్రంథియునుఁ జోడనృపతి
యుదరమునఁ బెరుగుచున్న చందమునఁ
బొదలుచు ముమ్మెన ¹పుం డక్కజముగ
బౌద్ధులు జైనులుఁ బండితుల్ మంత్ర-
సిద్ధులు వైద్యులు శిక్షింప వచ్చి
తమతమ మంత్రౌషధంబులవలన
శమియింపకున్నను ²జనుని రోగంబు
వైద్యులకును మంత్రవాదులకును న-
భేద్యం బసాధ్యంబు వెనుపగు వ్రణము
సిద్ధమం త్రౌషధ చ్ఛేదన దహన-
బద్ధక్రియలచేతఁ బాయ దీవ్రణము
జైన బౌద్ధ మహేంద్రజాల ³విద్యావి-
తానంబులనుఁ బోదు దథ్య మీవ్రణము
పూని ధన్వంతరిచే నైనఁ బుండు
మానదు పండిత మల్లికార్జునుని
కరుణగల్గిన మానుఁ గాక తక్కినను
హరునికైనను మాన్ప నరు దావ్రణమ్ము*

---

౧. పుండ్లు, ౨. జనని, ౩. దివ్యాది. *ఇక్కడ సంస్కృతాను వాదములో, "వైద్యాదీనామితిస్ఫుటం, నిశ్చిత్యాప్తతమా రాజ

భువి దుర్జనుని[1]తోడి పొత్తునకంటెఁ
దవిలి సజ్జనవిరోధంబు మే[2]లనుట
ధరణీ[3]శ్వరునకు భక్తవిరోధమునను
హరుమహత్త్వము దెల్ల మై కానఁ[4]బడుడు
వందుచు దుఃఖంబుఁ జెందుచు నాత్మఁ
గుందుచు మదమును గోపంబు నుడిగి
ధరణీశ్వరుఁడు దమ[5]తమ తరంబునను
హరునిభక్తుల కాని యన్యులు లేరు
గనియు వినియు నెఱుంగని బౌద్ధమతము
దనకుఁ బ్రాప్తం బయ్యె ధర్మేతరంబు

---

బాంధవాస్త మథాబ్రువన్, రాజన్ వ్రణోయం శివజామసాధ్యః ఇతినిశ్చితః," అని ఉన్నది. దీనికి మూలములో తగిన పంక్తులు కానరావు. ఇదిగాక "పడసి వచ్చిన మేలు - బ్రదికిన మేలు" అనే వరకున్న ఉన్న వాక్యములు రాజబాంధవు లన్నట్లు సంస్కృతములో ఉన్నది. ఈ శ్లోకములకు మూలములో పాతమున్నదనిన్ని, కన్నడ పద్యగ్రంథము నాధారము చేసుకొని సంస్కృతశ్లోకములను నూతనముగా చేర్చినామనిన్ని అచ్చుపడిన సంస్కృతగ్రంథము పుట అడుగున సూచన ఉన్నది. పై వాక్యములు రాజబాంధవులవిగా ఉండడమే ఉచితము. కాని, వ్రాతప్రతులలో ఎక్కడా సరియైన పాఠము దొరకలేదు.

౧. తోడ, ౨. లనుచు, ౩. శునకు భక్తతతి విరోధమున, ౪. బడదు, ౫. తర.

వేదబాహ్యము ముక్తివిముఖంబు శూన్య-
వాదం¹బునగు బౌద్ధవాదం²బు నన(గ(
బాపంబు దుర్బోధపాలైతి ³నిట్టు
లేపార(⁴దొలుమేన నెంతవారికిని
దొడ(⁵గిచేసిన శివద్రోహంబు గలదు
గడవదు ద్రుంచు నీ⁶గండాంతరంబు
నడర( బండితమల్లికార్జునకరుణ
వడసి⁷వచ్చినమేలు బ్రదికిన మేలు,
పండితారాధ్యుల పాదాబ్జములకు
మండలం బెల్ల సమర్పణ సేసి
వెండి శిష్యుండనై విహరింతు( దోడి
తెలిదు, మ్రొక్కుండు, బ్రార్థింపుండు, పోవు(
డనవుడు ⁸మంత్రులు నాప్తులు బుధులు
నని పండితయగారి చరణాబ్జములకు(
జక్క( జా(గిలిమ్రొక్కి "స్వామి! కృపాత్మ!
దిక్కు దెసయు నీవ దేవ! చో(డండు
గడు శివద్రోహి దుష్కర్మి పాతకు(డు
జడు(డు మదాంధుండు సర్వాపరాధి

---

౧. బులగు; బగున, ౨. బనంగ; బులన(గ, ౩. నింక నే, ౪. దొలి, ౫. గ(జేసిన, ౬. గండంబుగాన, ౭. చచ్చిన, ౮. బంధులు.

విఱుఁదుసొచ్చినఁ గాచు బిరుదు [1]నొచ్చినను
మఱవంగఁ బాడియే మహనియ్యకీర్తి!
దర్పం బడఁగి రాజు తనయేలు రాష్ట్ర
మర్పించి శిష్యుఁడై [2]యట్ల బ్రదుకఁగఁ-
గలవాఁడు మీ రట్ల కైకొని మమ్ముఁ
దలఁప[3]రే, కృపఁ బ్రాణ దానంబు సేయ-
[3]రే, కావ[3]రే, ప్రోవ[3]రే, కరుణింప-
[3]రే, కృపామతిఁ జూడ[3]రే, యయ్య" యనుచు
నఱగొఱలేక సాష్టాంగులై మ్రొక్క-
మఱియంతఁ బండితమల్లికార్జునుఁడు
"[4]సోడనిదూతలతోడ భాషింపఁ
గూడునే, యాలింపఁ గూడునే, యట్టి
యవనీశుఁ గూడునే యాత్మఁ దలంప
శివశివ! ప్రాణేశ! చెన్నయ్యదేవ!
[5]రాజిల్ల "రాజాధిరాజాయ" యనఁగ
రాజమహారాజ! రాజాధిరాజ!
రాజశేఖర! [6]దేవరాజ [7]వందితుఁడ!
రాజవు వేల్పవు రతి నీవ మైన

---

౧. సొచ్చియును, ౨. యటు బ్రదుకంగ, ౩. వే, ౪. చోడ దూతలతోడఁ గూడ, ౫. భాసిజిల్లు, ౬. రాజు, ౭. పండి.

రాజ ! నీవిచ్చిన రాజిచ్చుఁ గాక
రాజిచ్చు నన[1]రాదు [2]రాజ నీవీక,
జడుఁడై వడి దురాశా[3]సాగరమునఁ
బడునె మహాదాని భవదియ్యభటుఁడు,
గోయిల మతిదప్పి కూయునే [4]బ్రమసి,
రాయంచ [5]దృష[6]కోడి త్రావునే [7]వంతు,
ఖగపతి దెనసెడి కఱచునే [8]మెట్టు,
మృగపతి యాఁకొని మేయునే [9]పుల్లు,
మద[10]మఱి ధృతిమాలి మదగజేంద్ర[11]ంబు
గొద[12]సూకరంబు చన్గుడుచునే దేవ !
మదనారి ! [13]మఱియు నీ పద[14]భక్తియుక్తుఁ
డుదరార్థ[15]మొరులకు నొగ్గునే[16]చేయి,
వరుపంగఁ బాడియే హరహర !" యనుచు
నిరసించు [17]డున్న్యాయ్య నిష్ఠురో[18]క్తులకు
[19]నన్యాపదేశంబు లా[20]లించి దూత

---

౧. రాజు; రాజె, ౨. రాజునేవంక ; రాజనీవికయు ; రాజె నీవీక, 3. వాసు, ౪. భ్రమసి, ౫. తృషి, ౬. బొండి, ౭. వొండు; నీళ్లు, ౮. యరలు, ౯. సొల్లు, ౧౦. కరి, ౧౧. రిపు, ౧౨. మరి పంది; పెరపండ, ౧౩. యుని, ౧౪. పద్మభక్తి, ను..., ౧౫. మెంతయు నొరులకు, ౧౬. సిగ్గు; సెగ్గ; చెయ్య; సెగ్గె, ౧౭. డన్యాయ్య, ౧౮. క్తులును; క్తముల, ౧౯. నన్యోప, ౨౦. లించు.

లన్యాయవర్తుల కల్పభాగ్యులకు
భక్తులకృప యెట్లు వడయంగవచ్చు
వ్యక్తమిట్టిద[౧]యని వారేంగ నంత
నొదవుచు నొకనాఁటి కొకనాఁడు పుంఁను
[౨]బొదలుచు రంధ్రముల్ వోవుచుఁ[౩]జుట్లు
సెలయుచుఁ బ్రేవులు సెదరుచు, [౪]ములికి
[౫]వలచుచు, వాచుచు, వ్రయ్యుచుఁ, గూడఁ
గ్రుళ్లుచుఁ, [౬]గెరలుచుఁ, గూలుచు, నూర్పు
లొల్లనయూర్చుచు, [౭]నూరుచు, [౮]రసిక
[౯]సిలసిల నెత్తురుఁ జీముఁ [౧౦]గాఱుచును
విలివిలియనఁ[౧౧]బ్రుచ్చి [౧౨]విదిలి చూపఱకు
[౧౩]నేవంబు దోపంగ నిదియెంత వెద్ద
శైవాపరాధికి సర్వపాపునకు
ఘనశివద్రోహికి ఖలునకుఁ దనకు
ననుచు నంతకుపురి కరిగెఁ జొడంచు;
నంత రాజ్యార్థమై యనిఁ[౧౪]బోరి యతని

---

౧. యేని, ౨. బొదవుచు, ౩. జుట్లు; జొట్లు, ౪. ములికి, ౫. వలుచుచు, ౬. గద; గాడ, ౭. నొడుకుచు; నూడుచు, ౮. పసిగ, ౯. జిలజిల, ౧౦. బాఱుచును, ౧౧. జచ్చి, ౧౨. విడిలి, ౧౩. నేవంగదోవంగ, ౧౪. జేసి.

సంతాన మెల్ల నిస్సంతాన మయ్యెఁ;
బాడయ్యెఁ [1]దద్భూమి వండితవిభుని
యీడితశాప మహిమ్నతఁ జేసి;
యంత [2]నక్కడ మల్లికార్జునారాధ్యు
లెంతయు రయమున నేఁగుచు [3]మున్న
బౌద్ధుని [4]సమముగాఁ బ్రతిమైనతప్ప
బౌద్ధు[5]నిఁ జే[6]ముట్ట [7]పలుపనితప్ప
హారదూషణంబు సేయఁగ విన్నతప్ప
హారగణంబులఁ [8]బర్వ [9]నదివిన్నతప్ప
[10]నాపరసమయుల నణఁపనితప్పఁ
బాపి చోడనితోడఁ బలికినతప్ప
జగ[11]తీశ్వరునిజూడ [12]సైఁచినతప్ప
మొగి నదీక్షితులు దన్ముట్టినతప్పఁ
బాయదు వేఱొండు [13]భంగుల ననుచు
వేయు[14]భంగుల వింత వేడుక[15]దనర
సన్నుతగణనామసంకీర్తనంబుఁ

---

౧. భూమియుఁబండిత, ౨. నిక్కడ, ౩. మున్న; నుండి, ౪. సమయు, ౫. నాచే, ౬. ముట్టఁ; ముట్లు, ౭. పరిపిన; పలిపిన ; పలికిన, ౮. బాసి యు, ౯. నందున్న, ౧౦. నాపదసమయము, ౧౧. దీ, ౧౨. సంచిన; సరసిన, ౧౩. భంగిని; ౧౪. విధమ్ముల, ౧౫. పడుచు; నడర.

జెన్నార వాయారఁ జేయంగఁదలఁచి
యాద్యభక్తగణ సహస్రనామములు
హృద్యంబుగాఁ బఠియించు [౧]డెట్లనిన

గణమాలిక

శ్రీనంది శివకర శ్రీనందికేశ్వ
రానంద నందినాథాక్ష[౨]య విజయ
భద్ర వీరక [౩]వీరభద్ర భద్రాక్ష
భద్ర మహాకాళ పంచాక్షర త్రి-
యక్షర ద్వ్యక్ష రైకాక్ష [౪]రాక్షర ష-
డక్ష రోగ్రాక్ష ధూమ్రా క్షానలాక్ష
విక[౫]టాక్ష విమలాక్ష విశ్వవిశ్వాక్ష
వికటాంగ [౬]గగనాంగ విజయ జయాభ్ర-
వర్ణ మహాభైరవశ్రేష్ఠ సూర్య-
వర్ణ మ[౭]హోజ్వర జ్వర సోమవర్ణ
నిష్కంప నీరద నిస్స్వన నిత్య
నిష్క[౮]ళ పుష్క[౯]ల నిశ్శంక కాల-
రూప [౧౦]నీరూప విరూపాక్ష విశ్వ-

౧. జె; నె, ౨. ర, ౩. భద్ర, ౪. రోగ్రాక్ష రా..., ౫. లా, ౬. విమ, ౭. హోజ్జ్వలోజ్జ్వల, ౮. ల, ౯. ర, ౧౦. ని; వి.

రూప సుందర శాంతరూపోగ్రరూప
కోకిల [1]కింకిణీ కుంద[2]ీక కుముద
కాకపాదాపాద కటకాహి కటక
పింగ ళానక్షుర పిం[3]డక మధుప
పింగళాంబక మధుపింగ[4]ళాలోక
విజయ సద్యోజాత విష్టంభశిష్ట
నిజబల శ్రీకంఠ నీల సమస్త-
భూతజృంభణ సూర్యపాతన సోమ-
పాతన సురగిరిపాతన వింధ్య-
పాత నాంగారకభక్షణ సర్వ -
పాతన సర్వాకంపన సర్వదాహ
చండకీర్తీశాన [5]చండీశ చండ
దండపాణి కపాలధర[6] హరిహార మ-
హాకా[7]య నంది మహాకా[8]ళ పుండ-
రీక ఘుర్ఘుర భృంగిరిటి మృత్యుహారణ
సహానేశ దీర్ఘ హ్రస్వ స్థూల సూక్ష్మ
గుహారౌద్ర కూశ్మాండ గోపతి [10]జటిల
[11]భిండి రుండాభర ణాండాభరణ శి-

---

౧. కందకి, ౨. కి, ౩. గళ, ౪. శకటక, ౫. చండేశ,
౬. హరహరి, ౭. ళ, ౮. య, ౯. ష్టు, ౧౦. చటు, ౧౧. దండి.

[1]ఖుండి ముండధర నికర్షణీణ లంబ-
కర్ణ ఘంటాకర్ణ గజకర్ణ శంఖ-
కర్ణ ద్వికర్ణ త్రికర్ణ సహస్ర-
కర్ణ వికర్ణ గోకర్ణ వరాహ-
కర్ణ సంకర్షణో త్కర్షణ విపుల
పర్వతాభరణ దర్ప కఠోర[3]వచన
సర్వజ్ఞ సర్వాత్మ సర్వ[4]సంహరణ
కరిముఖ నరముఖ కపిము ఖాహిముఖ
శరభము ఖాము ఖోష్ట్రముఖ శార్దూల-
ముఖ సింహాముఖ మేషముఖ గోము ఖాశ్వ-
ముఖ పంచముఖ చతుర్ముఖ విము ఖాష్ట-
ముఖ నవముఖ దశముఖ షణ్ముఖ ద్వి-
ముఖ సహస్రముఖ త్రిముఖ వరాహాముఖ
దక్షభా[6]స్కర విషభక్షణ బ్రహ్మ-
భక్షణ శతసహస్రాక్ష పంచాక్ష
భద్రక ర్ణాశని భా[5]స్వర పూర్ణ-
భ[7]ద్రాస్ఖలిత మహాభద్ర గుహేశ్వ
రాంతకాంతక పుష్పదంతభు గ్వజ్ర-

౧. ఖండ, ౨. ణాలంబ, ౩. భరణ, ౪. సర్వజ్ఞ, ౫. స్వ, ౬. స్క, ౭. ద్ర.

భంత విరూపాక్ష సితగ్రీవ వృషభ
సాంబరచంద్ర గంగాంబుశేఖర ది-
గంబర డమరు[1]కహస్త సుహానేత్ర
దర్దుర రేణుక దారుక కాల-
మర్దనదక్ష విమర్దన త్ర్యంబ
కార్ధనారీశ్వర హాటకేశ్వర ఘ-
టార్ధదేహార్ధ వక్త్రార్ధ నాసార్ధ
ఫణిభూషణ క్షేత్రపాల కపాల
మణివిభూషణ విప్రమాలి కపాలి
శంకరోంకార వషట్కారకాల
కంకాళధర వజ్రకాయ సుషేణ
ధూమాంగ ధూమకేతు వ్యాఘ్రవక్త్ర
వామదేవాధోర్ధ్వవాహ వరాహ-
సంతానక ప్రపంచాంతక త్రిభువ-
నాంతక దైత్యాంత కాసితకాయ
శూలాయుధ సుమ[2]న స్సు[3]గతి సుపాణి
కోలాహలోత్తుంగ గురులఘు వజ్ర-
పాణి సుదర్శనపాణి పినాక-
పాణి మహాకేశ భర్గ సుకేశ

---

౧. గ, ౨. తృ, ౩. ణిసుగతి.

భవ మహావ్రత వృషబల మహాబాహు
శివ మేఘవాహన శ్వేతస౧ర్వాంగ
కామాంగదహనఝుంకార మహేంద్ర
భీమదమ౨న సురార్పిత నాగదంత
బభ్రు మృత్యుంజ యోభయశిరో నిర్మ
లాభ్రకా ౪మాతికా యాప్రతిమ ప్ర-
కంపనోన్నత భానుకంపన సోమ-
కంపన సంవర్తక శ్రీధర ప్ర-
౩చండ శతో౪దర చండోదర ప్ర
కుండ కుండోద రాఘోర కుంభోద
రాంభోదనాద౫వృషాంక కంటక ని-
కుంభ ౬మహోదర కులి౭శోద రేందు-
ఖేటక నక్షత్రకృంతన సూర్య-
ఖేటక ౮హరిజటా కేసర సూర్య-
పేషణ బ్రహ్మాండ పేషణ సోమ-
పేషణ సూత్రనిపీడ నాందో౯ళి-
కామేఘ లాలాసురాంతక శూలి
సోమదత్త స్వయంజ్యోతి రంగాట్ట-

౧. ర్వా, ౨. హ, ౩. కాండ, ౪. చల, ౫. వృ, ౬. మహీ
౭. శిథరేందు; శోధరేంద్ర, ౮. న, ౯. శి.

హాస భస్మేశ్వర హాలాహలాత్తి-
హాస గుహావాస హార మహామాయ
దిగ్వాహనాశన ద్వీపనిర్దళన
దిగ్వారణాహా[1]రి దిక్పాలకా[2]రి
సాగరాపోశన సంహారకాల
సాగరధ్వా నాప్తనాగాంగుళియ్య
శశిధర తత్పురుషస్థాణు రుద్ర
పశుపతి ఖట్వాంగపాణి కపర్ది
గరుడపక్షచ్ఛేద కాలాపహారణ
గిరికందుకాటన క్షితివియత్తాళ
విష్ణుకంకాళాంక విధిశిరశ్ఛత్ర
విష్ణునేత్రాదాన విధితిరస్కరణ
బడబాగ్నితిలకైక పాదపంచశిఖ
బడబానలానన ప్రళయాగ్నినేత్ర
కులగిరి[3]శాతన కూర్మాహినటన
విలయాగ్నిఖేలన విద్యుత్ప్రభావ
లింగాక్ష[4]భయద మాతంగమహార-
థాంగద కాలరుద్రాక్ష పాదో[5]ద్ధ

---

౧. ర, ౨. ది, ౩. శాసన; పాతన, ౪. భగవన్మ, ౫. గ్ర్వ, గా...

తాదివరాహ దంష్ట్రాంకితవదన
బాదరాయణభుజోత్పాటన సింహ-
చర్మవసన యజ్ఞచర్మాసనేభ-
చర్మచేల వ్యాఘ్రచర్మోత్తరీయ
హరిరథారూఢ చక్రాపహ క్షీర
శరనిధిపాన విష్వక్సేనహరణ
భీమకా యాకాయ పృథుభగదత్త
సోమదత్తాఖిల సుచరిత్ర మేఘ-
ముఖ పాదముఖ కుక్షిముఖ బాహుముఖ సు-
ముఖ జానుముఖ విశ్వముఖ మహాభీల-
బహువక్త్ర బహునేత్ర బహుతాలు జిహ్వా
బహు[1]వర్ణ బహు[2]కర్ణ బహు[4]ఘోణ[5]లోల
జంఘదు[6]ర్ధర మహాజంఘోరుతాళ
జం[7]ఘోర్ధ్వకేశ స్వచ్ఛందచారుతర
దంతాభతాళ తత్త్వామతి కుఠార
దంత మహోత్కపతాక ప్రచండ-
బలదీర్ఘదంష్ట్ర సుబాహుపాతాళ
తలవాసి హ్రస్వకంధర దీర్ఘలోచ

---

౧. భీ, ౨. క, ౩. వ, ౪. తాలు, ౫. లీల, ౬. ద్ధ, ౭. ఘు. ౧౧; ఘూదర, ౮. మత.

నోక్షువాహన సహస్రోదర వర్తు
లాక్ష[1] త్రియక్ష రక్తాక్ష వర్ణాక్ష
కాలకంఠ మయూరకం ఠోర్ధ్వబాహు
తిర్యలాక్ష లంబాక్ష నీలాంబరాగ్ని
కుండలక్రతుహరాజాండ బా[3]హుగ్ర-
కుండలానంగ సుఘోణాద్రి కుండ-
లాండ [4]ఘుర్ఘుర గగనానందనంద
పాండు[5]రాంగాసితాంబర కుండకర్ణ
లంబోష్ఠ దీర్ఘోష్ఠ లంబకర్ణ ప్ర-
లంబ లంబోదర [6]లంబాక్ష లంబ-
హను లంబజిహ్వా లంబానన లంబ-
తను లంబనాసి[2]క దశభుజ ద్విభుజ
సోమాక్ష రౌద్రాక్ష సూర్యాక్ష సోమ
భీమాంగ లలితాంగ రోమాంగ కర్ణ-
సేన దుష్కర మహాసేన శాశ్వత సు-
ఖానంద కాలకూటాగ్ని జిహ్వాగ్ని
కేశ ధూర్జటి మహాకేశ త్రిజట సు-
కేశోర్ధ్వకేశ నాకిపశిరోహార సు-

---

౧. కత్ర్యక్షు, ౨. లో, ౩. హో, ౪. గ, ౫. రాగ, ౬. లంబలంబాక్షు, ౭. కా, ౮. ట.

జిహ్వా ద్విజిహ్వా త్రిజిహ్వా సహస్ర-
జిహ్వా విద్యుజ్జిహ్వా జిహ్వోదరోరు-
జిహ్వా మహాజిహ్వా [1]సితకర్ణ వహ్ని-
జిహ్వా నికృంతన శ్రీధరారాధ్య
లంబకంధర సుహాలయ మహాదంష్ట్ర
[2]లంబోష్ఠ శంభు పీతాంబర స్థూల-
విగ్రహా ప్రబల కంబుగ్రీవ ధూ[3]మ-
విగ్రహా వికటసింహగ్రీవ దీర్ఘ-
బాహు ద్విబాహు త్రిబాహు సహస్ర-
బాహు మహాబాహు పాదబాహూరు
బాహూరు పాదోరుబాహు ముఖోర్ధ్వ-
*బాహు ప్రముఖ మహాప్రమథగణములు

రుద్రగణసంకీర్తనము

భువనేశ్వరాది విభూతి కపాలి
భవభూతి కరభూతి పాలనచక్ర

---

౧. జిత, ౨. బింబోష్ఠ, 3. మ్ర, * ఇక్కడ బ్రౌనువ్రాత ప్రతిలో ఈ క్రింది కన్నడపద్యమున్నది.

"యింతప్ప ప్రమథగణరా
ద్యంత నెరవెల్కి హరివిరించిగళలసె
లింతుర చిదమమ
సంతద పాల్కురికిసామ భక్తలలామా."

ధర మహాబల మహా¹దంష్ట్ర ప్రచండ
ధర దహనక్రూర ²దంష్ట్రోర్ధ్వ బాహు
వేదపారగ మేఘనాద త్రికలసు-
నాదకపర్ది ధనంజయ శ్వేత
భద్ర నీలాశన బలకాల కాల-
రుద్ర శాశ్వత నీలరుద్ర పినాకి
సర్వజ్ఞ దీర్ఘ హ్రస్వ స్థూలరుద్ర
సర్వేశ సుఖ³కర్త జ్వాలనాక్ష మేఘ
వాహన క్రో⁴ధేశ వటరుద్ర హారవి
వాహ ⁵లోహిత ధూమ్రవర్ణ విధీశ
కల ⁶వికరణ⁷రుద్ర కాలమహేశ
బలవికరణరుద్ర ప్రమథన జ్యేష్ఠ
సర్వభూత ద⁸మన చరమహాతేజ
సర్వమనోన్మన స్థాణు⁹సంహార
పూరకజ్యోతి రఘోర ¹⁰భర్గైక
వీరేశ్వరానేకవీర విద్వేషి
పింగేక్ష ణాంతరిక్షాంగ వి¹¹శ్వేశ

---

౧. దంత, ౨. దంష్ట్రార్ధదేహ, ౩. ఖర, ౪. ధీ, ౫. నాహిత; నాసిత, ౬. వికలన, ౭. కాల, ౮. హ, ౯. సంవాహ; శరీర, ౧౦. భర్గేశ; భద్రేశ, ౧౧. ద్వే.

పింగళానం[౧]త మాతంగ త్రిదంష్ట్ర
వృషభగణ ప్రియవిభు విరూపాక్ష
విషధరాక్షయరుద్ర విద్యాధరేశ
హారరత్న కర[౨]మారహరణ త్రిణేత్ర
హరిహర బభ్రుక్షయాంతక దుఃఖ
కర భయానక విచక్షణ[౩]కర శూల
ధర [౪]సదంబర జటాధర గణాధ్యక్ష
ధాతృత్రిదశవందిత ప్రమ[౫]ర్ద క వి-
ధాతృగ్రసన పరంధాత్మ పంచశిఖ
యామ్యసూ[౬]క్ష్మ శ్రీక్షణాతి భవేశ
సౌమ్యదేహోర్ధ్వకేశజ్వాలన ప్ర
కాశ [౭]భస్మాంకిత కాలలోహిత సు-
[౮]కేశ రుద్రాగ్ని హుతాశన [౯]శీఘ్ర
భీమ [౧౦]భీమోద్భవ క్షే[౧౧]మేశ బుద్ధి
వామదేవ ప్రభుస్వామి సర్వాత్మ
సహనేశ [౧౨]గగనేశ శంభు[౧౩]మహేశ
గుహ[౧౪]రుద్ర పర[౧౫]మాత్మ గోపతిప్రబల

---

౧. గ, ౨. దూర, ౩. కర్తృ, ౪. సుదుంబర, ౫. ధ; ర్ధ, ౬. క్షాస్థి, ౭. బస్తాంతక, ౮. శేశ, ౯. రుద్ర, ౧౦. భవో, ౧౧. మో, ౧౨. గౌరీశ, ౧౩. గిరీశ, ౧౪. రౌద్ర. ౧౫. మాత్ర.

వజ్రదం తావ్యయ[1] వాయువే గోగ్ర
వజ్రదం తాసితవర్ణ వియోక్త్ర-
బడ[2] బాముఖా[3]సాధ్య పావక[4]శ్రేష్ఠ
మృడ పరాపర కళామేయ నివృత్తి-
పాశహస్త లఘురూపధర మృత్యుంజ
యేశాన రుద్రఫణీంద్ర గణేంద్ర
బకరుద్ర[5]బాధక ప్రళయాగ్నిరుద్ర
వికరణార్చితవీర విటరుద్ర మృత్యు-
[6]హార హారరుద్ర విశ్వాధికరుద్ర
శరభరుద్ర మహావృషభరుద్ర శబర-
రుద్ర మహాకాళరుద్ర సంహార-
రుద్ర మహానాట్యరుద్ర కిరాత-
రుద్రార్ధనారీశరుద్ర మహోగ్ర-
రుద్ర మృత్యుంజయరుద్ర వీరాఖ్య-
రుద్ర సదాశివరుద్ర విజ్ఞాన-
రుద్ర విజయజయరుద్ర కర్మాఖ్య-
రుద్ర మహాశివరుద్రైకపాద-
రుద్రాదిరుద్రాది రుద్రగణములు—

---

౧. త, ౨. బ, ౩. నాద్య, ౪. పుష్ట, ౫. బోధక, ౬. హరి.

శ్రీమద్దమన వేద[౧]శిఖి జటామాలి
సోమ[౨]సర్వేశ్వర శూలి సహిష్ణు
ముండి[౩]జైగీషవ్య[౪]డిండి[౫]లాంగులి శి-
ఖండి[౬]సుధీవాహ కంకసుహోత్ర
దారుకో[౭]గ్రాత్రి సూ[౮]ధార లోకా[౯]క్షి
చారుహాస[౧౦]లకులీశ్వర గుహావాస
గోకర్ణ[౧౧]ముఖ యు[౧౨]వాలోక గౌతమ మ
హాకాయ[౧౩]వృషభ మహాకాయు లనఁగ

యోగాచార్యగణసంకీర్తనము

నసదృశమహిమ యోగాచార్యు[౧౪]లనఁగ
[౧౫]నెసగు [౧౬]నయ్యిరువది యెనమండ్రుగురు[౧౭]లు
నలరు ధర్మాచార్యు[౧౮]లన వారిశిష్యు
లెలమి[౧౯]మై నూటపన్నిద్దఱు భువిని:
తిరునీల[౨౦]కంఠండుఁ దిరునీల[౨౧]నక్క-

---

౧. శిఖ, ౨. శర్మేశ్వర; శర్మశ్వేత, ౩. జైగీమవ్య; జైమిని మవ్య, ౪. దండ, ౫. రాంగులి; శాంగుల, ౬. దధీవాహ; శరధి వాహు; యుదధివాహ, ౭. గ్రత్రి, ౮. తారు; దారు, ౯. క్షు, ౧౦. కపలీ, ౧౧. భృగు, ౧౨. గా, ౧౩. ఋ, ౧౪. లిట్లు, ౧౫. నెసఁగ, ౧౬. యిరవటూరె; నెయ్యిరువాద్లెనన (?), ౧౭. వు-లు, ౧౮. లను, ౧౯. పై, ౨౦. కంఠుండు, ౨౧. యక్క.

తిరు¹మూలదేవండుఁ దిరునాళ్ల²పోవ
పూ³నకంజారుండు మంగయక్కర³సి
యా⁴నాయనా ర్గొన్నయధరుండు వి⁵ట్టి
సంగరోహిణి పిళ్లనయనా రనంగ
సంగ⁶చండుండు పూసల⁷నయనారు
వరమా⁸నాచియును దీపదకళియారుఁ
గరిగణనాథుండుఁ గలికామదేవఁ
డమరనీతియిరువ దాండా⁹రి¹⁰మురుఘు
నమినంది యేణాధినాథుండు సాంఖ్య-
తొండభూపతి సిరు¹¹త్తొణ తిరుకురుపి
¹²తొండండు నంబిచిర్తొండం డనంగఁ
జీరాలదేవండుఁ జేదిరాజయ్య
గారుఁ గాళవ్వ యేకాసి¹³సోమాసి
మారండు వీరపేర్మాణ్డిదేవండు
వీరచోడఁడు జడమూరిరిత్తొండి
¹⁴యెల్పఘు ¹⁵చెలఁది వాగీశనైనారు

---

౧. నీల, ౨. ప్రోళ, ౩. ళి; సు, ౪. న, ౫. ట్ట; ళ్ల, ౬. భం, ౭. నా, ౮. నాచారు, ౯. రు. ౧౦. మూర్ఘు; మరఘు, ౧౧. త్తొణ్ణ తిరుక్కడి (డు) పి, ౧౨. తొం, ౧౩. రామయ్య, ౧౪. యెల్పర; యెల్పు; యేలప, ౧౫. చలి.

కోల్పులి యళియ దంగుళినయనారుఁ
జిఱుపులియార్కు లుచ్చిరినయనారు
మిఱుమిండ యారు నమిత్తాండియారుఁ
గళియంబ యరివాలుఁ గడుమలనంబి
గళియంబ గుగ్గులుకలినయనారుఁ
గన్నప్పతాపసి గరయూరిచోడ
చెన్నయ్య సోడండుఁ జేరమరాయఁ
డిడిగుడిమారయ్య యిడుమారదేవఁ
డడిభర్త యెాణమూర్తి యరవత్తుమువురు

షోడశగణ సంకీర్తనము

హొన్నయ్య వాండ్యనాయుండు గుడ్డవ్వ
గన్నెరబ్రహ్మయ్య గేతయ్యగారు
బీరయ్య హండయ్యలింగారు బిజ్జయ్య

౧. కొలుపులియళి (ల)యదం గుళినాయనారు; కొలుడయళి యనదం గుళియనైనారు, ౨. చిఱుపురియార్కుల బ్బ (చ్చి) రినయనారు; చిరువులియారుసచ్చిరినయనారు; చిరిపురియొరుఱ (గు) చ్చిరియయినారు(యారునారు), ౩. మిండి, ౪. నాట్యనిమిత్తాండి, ౫. కరి, ౬. ...ఘురిఫాలు; యరపాలు; యరహీలు, ౭. కడువల, ౮. లు, ౯. య్యనైనారు, ౧౦. ర, ౧౧. డు, ౧౨. జు; యుఁ, ౧౩. డిడు, ౧౪. మ్మార్త, ౧౫. యెాణు, ౧౬. గుండవ్వ, ౧౭. న్న, ౧౮. ప్ప, ౧౯. ద, ౨౦. దేవయ్యగారు.

గారు ఘనాగయ్యగారు నాగయ్య-
గారు [1]కాళవ ఫణిహారి సోమన్న
గారుఁ జిక్క[2]లిగ[3] నా[4]గయ సేనరాథ
దేవరబాచయ్య పూవులబాచి-
దే[5]వంటు బాచలదేవి షోడశులు

దశగణ సంకీర్తనము

వీర[6]ఘంటయ మయిలారి దేవయ్య-
గారు బొప్పలదేవి గామలదేవి-
గారుఁ జోడ[7]వ్వ సింగ[8]య్య బీచయ్య-
గారు మాదేవ[9]న్నగారన్న [10]బెరసి
దసగణసింగయ్య దశగణంబులును

త్రయోదశగణ సంకీర్తనము

బసవరాజయ్య ప్రభాతగణములు
[11]సింగిదేవఁడుఁ [12]బమ్మి[13]సెట్టి [14]సాతెక్క-
[15]సంగ[16]మైళిగ నిజసంగ[17]య్య దేవ-

---

౧. కాలవ, ౨. క్క, ౩. గ, ౪. గయ్యసేనాథు, ౫. వు, ౬. ఘంటామయిలారి; ఘంటయమైలిగారి, ౭. య్య, ౮. యయు, ౯. య్య, ౧౦. బ, ౧౧. శింగి, ౧౨. బ్రహ్మి, ౧౩. శెట్టి, ౧౪. సాత్వికి, ౧౫. సంగి, ౧౬. మైళిగనిజ; మైలిగరిజ, ౧౭. ప్ప,

రసుగారుఁ గన్నబ[౧]రసి ఫణిహారి
బసవయ్య[౨]పూసల బాచిదే[౩]వండు
[౪]దేవయ్య యోహిళ[౫]దేవండుఁ [౬]జొప్పి
దేవియుఁ గామలదేవి దేరసులు
శ్రీపతిపండితుల్ సింధు[౭]బల్లహుఁడు
ధూపదమాచయ్య ధూర్జటి కేశి
మడి[౮]వాలుమాచయ్య మాదిరాజయ్య
బడవరబ్రహ్మయ్య బాచిరాజయ్య
గి[౯]న్నరబ్రహ్మయ్య గేశిరాజయ్య
గన్నడబ్రహ్మయ్య గాచిరాజయ్య
మోళిగమారయ్య ముసుఁడిచౌఁడయ్య
శూలదబ్రహ్మయ్య సురియచౌఁడయ్య
[౧౦]గలకేతబ్రహ్మయ్య గక్కయ్యగారుఁ
[౧౧]దెలుఁగేసు [౧౨]మసణయ్య దెలుఁగుజొమ్మయ్య
యుత్తమాంగదకేశి హొన్నయ్య గండ
గత్తైర[౧౩]వాచయ్య గాలాగ్ని[౧౪]రుద్రుఁ

---

౧. రసు, ౨. పూవుల; యుప్పల, ౩. వు, ౪. దేవుండు; దేవండు, ౫. దేవియుఁ; దేవయ్య, ౬. జొప్ప; బొప్ప, ౭. బిల్ల, ౮. పాలు, ౯. న్నె, ౧౦. కల (లి) కేతు (త), ౧౧. తెలగేసు, ౧౨. మనసయ్య, ౧౩. సా, మా, ౧౪. ఉద్ర.

ఘుదరద రామయ్య హొన్నబ్రహ్మయ్య
గదిగెరేమయ మ[౧]హాకాళయ్య బి[౨]బ్బి-
బాచయ్య [౩]సవరదనాచయ్య వీర-
నాచయ్య యడపదరేచయ్య[౪]గారు
నల్లయ్య[౫]యును మధుపయ్య బల్లేశు-
మల్లయ్య గోడలమల్లయ్యగారు
నిజలింగచిక్కయ్య నిర్లజ్జశాంతి
నిజ[౬]భావుఁడును నిశ్య[౭]నేమద[౮]మైలి
దసరయ్య [౯]చేడరదాసి గజ్జేసు-
[౧౦]మసణయ్యగారు నమాత్య[౧౧]మల్లయ్య
[౧౨]జెట్టిమారయ గౌళభట్టారకుఁడుఁ
బిట్టవ్వ గోవిందభట్టారకుండు
శంకరదాసయ్య శ్వపచయ్య [౧౩]సుంకె-
బంకయ్య మొఱటద [౧౪]వంకిదేవయ్య
యముగిదేవుఁడుఁ జిక్క లముగిదేవండు
నమరగుండము మల్లికార్జునయ్యయును

---

౧. హో, ౨. బ్బ, ౩. సదసద, ౪. గార, లల్లయ్య..., ౫. మధుపయ్య-యల్ల..., ౬. భావనఁడు, ౭. నేమిద, ౮. మైరి, ౯. దేవర, ౧౦. మసనయ్య; మసపయ్య, ౧౧. మల్లేసు, ౧౨. యట్టి; రట్టి, ౧౩. సుంకి, ౧౪. వంకయ్యగారు.

దారయ్య భోగయ్య దాసకేసయ్య
మార[1]గౌళండును మలయరాజయ్య
పంచాగ్ని [2]సూర్యుఁ డుద్భటుఁడు సన్న్యాసి-
మంచయ్య మల్లబ్రహ్మయ వెల్లగొండ-
మహాదేవుఁ డుడు[3]తిడి [4]మహాదేవి బెజ్జ-
మహాదేవి శివ[5]నాగ[6]మయ్య బెల్దేవి-
వేమనారాధ్యులు [7]విజయాపురంబు-
సోమిదేవుఁడుఁ జిక్కసోమిదేవుండు
మాదరదూడయ్య మద్దయ్యగారు
కేదార[9]మాచయ్య కెం[10]భావిభోగి-
దేవండు [11]రేవణదేవండు [12]మూరు-
జావదేవర వీరచాఁకిదేవయ్య
సేటలవేమయ్య సిద్ధబుద్ధయలు
హాటకేశ్వరుని మల్లయ్యయు నమృత-
నాథని యప్పయ్య నాగయ్య యిడుమ-
నాథు తిప్పయ కల్లినాథు భీమయ్య
విరుపకల్లయ్య [13]నిర్వమద నాకయ్య

౧. గౌళుండును, ౨. సూరు(డ)ను, ౩. తిడ, ౪. మాదేవి, ౫. నాగి, ౬. మాన్యబెల్దేవి, ౭. విజయు, ౮. పు, ౯. బాచయ్య, ౧౦. బాగి, ౧౧. రేవణ, ౧౨. మూరు, ౧౩. ధ, నిర్వసద(థ).

యురులింగపెద్దయ్యయును గొంగుఁ[1]దొరతి-
యాఁకయ్య శివరాత్రి యప్పిదేవయ్య
సాఁకలదేవియు [2]సత్తెక్క సాఁకి-
[3]దేవయ్య రేమయ్య [4]దేవయ్య పోతి-
దే[5]వండుఁ బెద్దిగదే[5]వండు వీర-
కల్లయ్య వీరనాగయ్య [6]జూటూరి-
మల్లిదే[5]వఁడు వీరమాచయ్య [7]సకళి-
దేవయ్యయును శివదేవయ్య [8]రామ-
దే[5]వఁడుఁ జక్రవర్తియుఁ [9]బోంట్లచెఱువు-
వీర[10]చోడవదేవి వీరసంగయ్య
వీరబ్రహ్మ[11]య్య యావీరదేవయ్య
బా[12]వూరిబ్రహ్మయ్య భానుదే[5]వండుఁ
గో[12]వూరిబ్రహ్మయ్య గొడగూచి[13]యన్న
బ్రహ్మయ్య [14]గౌరెయూరి బ్రహ్మయ్య వుంద్ర-
బ్రహ్మయ్య [15]సగరదబ్రహ్మయ్య శూలి-
బ్రహ్మయ్య [16]రాజసబ్రహ్మయ్య [17]మోలె-

---

౧. దొరతి, ౨. సత్యక్క, ౩. దేవరదేవయు, ౪. దేవయల్ పోతి, ౫. వు, ౬. జవుటూరి, ౭. సకతి; సకల, ౮. రామి, ౯. పొట్ల, ౧౦. చోడని, ౧౧. య్యయు; యయును, ౧౨. వూ, ౧౩. చెన్న, ౧౪. కెర(ల); వూర(రి), ౧౫. సరగద, ౧౬. రాజః, ౧౭. వేంగి.

బ్రహ్మయ్య ర[1]క్కసబ్రహ్మయ్య [2]ముండి-
బ్రహ్మయ్యయును మిండబ్రహ్మయ్య బాల-
బ్రహ్మయ్య [3]సాహిత్యబ్రహ్మయ్యగారు
[4]నులుక[5]చందను [6]చిప్ప[7]నూతు లప్పయ్య
బలదేవుఁడు గుమారపాలఘూర్జరుఁడు
మేధావిరుద్రుండు మిండసంగయ్య
మైథునరామయ్య మగతిలకవ్వ
యంగ[9]రాయండు రాజార్ధ[10]రాయండు
శృంగి[11]బొప్పయగారు శివకుమారుండు
నోహిళయ్యయు హలాయుధుఁడును రామి-
సాహిణి[12]వర గుండచక్రవర్తియును
బల్లవరాయండుఁ బరమహంసండు
గొల్లవరాయండుఁ [13]గురిగుంటదేవఁ-
డల్లమదేవండు [14]హావినహళ్లి-
కల్లిదేవండు[15] భాస్కర[16]దేవఁ డిల్ల-

---

1. క్కి; క్క, 2. మంచి, 3. సాహితి, 4. నులక(కు), 5. చండయ, 6. చిప్ప, 7. లూడు, 8. వు, 9. రాయుండు, 10. రాయుండు; దేవ(వు)ండు; దేవుండు, 11. చొప్పయ, 12. శె(నె) డగొండ, 13. గురుగుండ(ట), 14. హాలినహళ(ల), 15. య్య, 16. దేవయ(డి)ళ్ల; దేవుళ్ల.

హోళ [౧]బ్రహ్మాయయు[౨]నైదక్కి [౩]మాదన్న
గాళమరసుగారు గణ[౪]దాసి వీర-
చూ[౫]దెయ్య [౬]వీరయ్య పాదాలయక్క-
జోదులమాయ[౭]ణ్ణ [౮]శూలాయుధయ్య
యురగర[౯]యందు సద్యోజాత దే[౧౦]వ
డరియమ రాజయ్య [౧౧]హంపయ్యగారు
వేంగిసంగయగారు వీర[౧౨]ప్రోలయ్య
సాంగుబొల్లయ్య ప్రసాది[౧౩]బంకయ్య
యేలేశు కేతయ్య [౧౪]యిండెసోమ[౧౫]య్య
సాళుక్యభీమయ్య సట్టయ్యగారు
గొట్టరుబాచయ్య [౧౬]గురువు భక్తయ్య
[౧౭]సెట్టాణిపెద్దయ్య శివముట్టుముంగు
సంగయ్య వనిపుర శంకర దే[౧౦]వ
డింగు[౧౮]ళ్లివై[౧౯]జవ్వ గంగాపురంబు-
బసవయ్య ఫణి[౨౦]ంహారి బసవయ్య చెన్న-
బసవయ్య యేవగళ బసవయ్య గంగ-

---

౧. బ్రహ్మయ్య, ౨. యే(యై) దంకె, ౩. మారన్న, ౪. దాసు, ౫. ద, ౬. చీ, ౭. న్న, ౮. సూళాయితయ్య, ౯. యు, ౧౦. వు, ౧౧. యంపయ్య, ౧౨. పోలయ్య, ౧౩. లంకయ్య, ౧౪. హిం, ౧౫. న్న, ౧౬. సురభక్తి(క్త)తండె; చేసుతయ్య, ౧౭. జె(శె)ట్టా(ట్టి)ణి, ౧౮. గ్లై, ౧౯. జువ్వ; జక్క, ౨౦. హరి.

మల్లయ్య శిఖరేశుమల్లయ్య వీర-
బల్లహుండును దాడిపర్తిబొల్లయ్య
శ్రీకోటి[1]పల్లయ్య సిద్ధరామయ్య
యేకాంతరామయ్య [2]యింపె శాంతయ్య
సర[3]పూరిబంకయ్య శంకరసెట్టి
బెరళదమారయ్య [4]బెట్టదదేవ-
రసు నిర్ధనయ్య [5]సిరాళదేవయ్య
హాసి[6]యమ స్తౌ[7]కద మా[8]చయ్య ప్రసాది-
దాసయ్య గెరపూ[9]రిదాసయ్య [10]యజ్జి-
దాసయ్య నింబాళదగణేశ్వరుండు
[11]యాణాది[12]చందయ్య యాత్మదే[13]వండు
ద్రోణేశుమల్లయ్య రుద్రియన్నయ్య
గొలిపాకమారయ్య [14]గొణిజమారయ్య
బలగర[15]మారయ్య [16]బైచలమాయి
దేవయ్యయును [17]జగద్దేవయ భాను-
[18]దేవయ్య [19]బహుబలదేవయ్యగారు

---

౧. పల్లెయ్య, ౨. హిం, ౩. పూ(ర)రి, ౪. బెట్టి, ౫. నిరాళ, ౬. తీ; ర, ౭. కుఃడు; కర, ౮. రయ్య, ౯. ర, ౧౦. యజ్జ, ౧౧. యాణాతి; యాణవ, ౧౨. చండయ్య; మంచయ్య, ౧౩. వు, ౧౪. గోణి, ౧౫. మాదయ్య, ౧౬. బైచయ్య, ౧౭. శివదేవుండు; జగదేవయ్య, ౧౮. దేవుండు, ౧౯. మహ.

గుడ్డయ్య మారయ్య గోయిదేవయ్య
[1]వెడ్డుసోమయ [2]నిలివేగి బైచయ్య
రాచమల్లయ [3]సిక్కరాచమల్లయ్య
మైచిదేవఁ డనిమిషయ్య వత్సేశు-
సోమయ్య బల్లేశుసోమయ్య [4]సుంకె-
సోమయ్య యాచారభీమయ్యగారు
ధవళయ్యగాను బొంతాదేవిగారు
ధవళేశునామయ్య [5]దండ్రి ప్రసన్న-
బసవయ్య [6]గంకాళబసవయ్య [7]సిక్కె-
లసదదేవయ [8]జట్టిలట్ట సోమన్న
శివ[9]లెంకమంచయ్య [10]సివురుచందయ్య
శివరాత్రి[11]సంగయ్య శ్రీ[12]సూరసాని
శివ్వయ్య [13]దరుమయ్య శ్వేతయ్య వైజ-
కవ్వ బొల్లవ్వ రెబ్బవ్వ రేకవ్వ
యమ్మవ్వ యరసవ్వ యా[14]దవ్వ వీర-
తెమ్మవ్వ గమలవ్వ నిమ్మవ్వ[15] గారు
నాదిగాఁగ గణసహస్రనామములు

---

౧. లెడ్డు, ౨. విరియోగి; విరివేంగి, ౩. బిక్క, ౪. మంకి, ౫. దండి, ౬. కంగళ, ౭. చిక్కె, ౮. జిత, ౯. లంక, ౧౦. చిగురు, ౧౧. సంకణ్ణ, ౧౨. శూర, ౧౩. ధర్మయ్య, ౧౪. దెవ్వ, ౧౫. గార- లా...

నాదరణీయంబు లై యొప్పు నిట్లు
నలిఁ[1]దద్గణసహస్రనామస్తవంబు
వెలయఁ బఠించిన వినిన వ్రాసినను
విరచించినను భక్తివిస్ఫూర్తి [2]యొసగు
దొర[3]కొను శుభములు దురితముల్ [4]దొలఁగు
హరు ప్రసిద్ధప్రసాదానంద మలరుఁ
జిరమనోరథములు సిద్ధించు మఱియు
దుస్స్వప్న దుష్కర్మ దుశ్శకునాదు
లస్వప్న సర్వగ్రహాదిదోషములు
జ్వాలనాపమృత్యు తస్కర వృశ్చి[5]కాహి
జల మృగ రోగ రాక్షస విష భూత
పవన మహో[6]ల్కాదిపక్ష దారిద్ర్య
పవిరాజ భవిముఖ్యబాధ లడంగు
నర్థార్థు లీస్తవం బర్థిఁ బఠింప
నర్థసామర్థ్య సమగ్రత దనరుఁ
బుత్త్రార్థు లీనామములు పఠియింపఁ
[7]బుత్త్రపౌత్త్రాది విభూతి [8]వర్ధిల్లు

---

౧. దద్గుణ, ౨. యొసగు; నొసగు, ౩. కను, ౪. దొలఁగు; దొరఁగు, ౫. కాది, ౬. ల్కావి, ౭. బుత్త్రాభి(ది)జనన, ౮. వహించు.

శత్రుత్రుఝయార్థు లీ స్తవముం బఠింప
శత్రుత్రుమైశ్వర్యశక్తి [1]వర్ధిల్లు
భుక్తీచ్ఛ నీనామములు పఠియింప
భుక్తియు నభిమతభోగము ల్గలుగు
ముక్తీచ్ఛ నీనామములు పఠియింప
ముక్తులు [2]నాల్గును [3]ముదమునం గలుగు
భక్తీచ్ఛ నీనామపఠనంబు సేయ
భక్తిసౌభాగ్యసంపద సమకూఱు.
నొందు దిగంతసంయుత [4]మహాత్కీర్తి
సెందు మంగళమహా[*]శ్రీ శ్రీ ప్రపూర్తి
యంచు నూతనసృష్టి [5]నభినవంబుగ స-
మంచిత [6]భక్తి గణావళిం [7]బాగడ
నవ్యగణ సహస్రనామ స్తవంబు
భవ్య పంచాక్షరీపఠనప్రయుక్తిం
బఠియించుచు జనని జఠరకఠోర-
పిఠరాపహరణకర్తృడు వండితుండు*

---

౧. వర్ధిల్లు; వహించు, ౨. వరుసను, ౩. మూండును, ౪. మహా, కీర్తి, ౫. శ్రీగురుస్ఫూర్తి, ౬. కభిమతంబుగ, ౭. భక్త, ౮. పొగడె.

* ఈ తరువాత బ్రౌనువ్రాత ప్రతిలో:
"చన్న పురాతన శరణులబంట

## పండితారాధ్యుల ఊర్ధ్వనేత్రలాభకథనము

నంత నీక్రియ సమరారామమునకు
సంతోషమున[1] సభక్తసహితుండై[2] యోగి
యాసక్తిమై నమరారామపుర ని-
వాసు శ్రీయమరేశు వాసవాధీశు
నమరేశ్వరాష్టకంబందుఁ[3] గీర్తింపఁ
గమనీయ తద్గర్భికా మధ్యమమున
గణకూటమున నసంఖ్యాత[4] సద్భక్త-
గణము[5]ల నొడ్డోలగంబుగా [6]నునిచి
నది దక్షిణార్ధ మానరపతిభూమి
నది యుత్తరార్ధ మీనరపతిభూమి *

ఉ(యు)న్న నూతనభక్త యాదంబుబంట
ఇటమీఁద శివు గొల్చి యీప్సితార్థములు
పటుతరంబుగ గాంచు భక్తులబంట
రు(రూ)ఢి నసంఖ్యాత రుద్రులబంట
పాదాన బాడిన ప్రమథులబంట
యీ చరణములు ౬ న్ను అన్వయ మసంగతముగా నున్నందున విడవబడి
నైనది" అని ఉన్నది.

౧. గ, ౨. క్తుండైయు, 3. గీర్తించి- క, ౪. తద్భక్త,
౫. లందొ, ౬. నిలిచి; య...,

* ఇక్కడ ఒక ప్రతిలో "కాదుగక మరికొన్ని దినములు సనగ"
అనే పాదము ఎక్కువగా ఉన్నది. దీనికి సంస్కృతగ్రంథములో
అనువాదము లేదు.

వెడలితి మటుగాన వెలనాఁటిసీమఁ
బడయుఁ[1]దు నింక నంబకము లీక్షణమ
యట్టిద కాదె మా యాదిప్రతిజ్ఞ
యట్టునుగాక వాఁ డంతకుఁ గూడు
నంతకుఁ బడయు మే మన్నార మట్ల
యంతకుఁ గూడువాఁ[2]డింతకు ననుచుఁ
బూరిఁబూరిఁగూడ విభూతి [3]వీడియము
లరుదొం[4]ద భక్తగణావలి కిచ్చు
నంతలో[5]నన ఫణిహారి యాద్రోహి
నంతకు[5]ప్రోలికి ననిపి యేతెంచి
నలిభక్తతతికి విన్నప[6]మాచరింప
నలరుచు నసమలోకారాధ్యమూర్తి
యతులశాపానుగ్రహ సమగ్ర[7]కీర్తి
[8]ప్రతిచక్రవర్తి [9]నిరస్తాఖిలార్తి
వండితేంద్రుండు శుంభన్మహాభక్త-
మండలి కంతంత మహిఁ జాఁగిమ్రొక్కి-
ప్రమథాది నూతనప్రాక్తనభక్త-

౧. దా మింక, ౨. డింతక య..., ౩. విడియము;వీడ్యము, ౪. ది, ౫. పాలికి, ౬. మాచరించి; య... ౭. మూర్తి, ౮. ప్రతి; యతి, ౯. నిగ్రతభక్తజార్తి, ౧౦. థాతి.

సముదయ శ్రీపాదజలజాత్మ్యుఁ డగుచు
విగతనేత్రద్వార వినిహి[1]తామృతము-
లగు ప్రసాదప్రసూనాంబరావళులు
[2]వుప్పించునంతన పురహరుకరుణ
నొప్పార నుదయించె నూర్ధ్వనేత్రములు
బండరు[3] వందుల పద్మరాగములు
వండరు [4]దెఱచుడు [5]భ్రాజిల్లునట్లు
దరుణతరద్యుతుల్ దళుకొత్త సూర్య-
కిరణవిస్ఫురణంబుఁ గీడ్వఱచుచును
బండితుకన్నులో పద్మరాగములో
పుండరీకంబులో పూర్ణేందుకళలో
ముక్తి[6]గోళకములో [7]మోదాంకురములో
[8]భక్తిదర్పణములో భాగ్యఫలములో
యమృతపిండములో దయాకరండములో
సుమహార్ఘణస్థాన సుకరదీపములో
యుదయార్కశకలంబులో మణిద్యుతులో
సదమలజ్ఞానబీజంబులో యనఁగ
[9]నొప్పె వెండియు భక్తియువతినేత్రముల

౧. తావృ, ౨ నుప్పించు;3. వందున్న, ౪. డెరు, ౫. భాసి, ౬. గోళదము, ౭. మోహాంకు, ౮. భక్త, ౯. నొప్పియుండియు.

యొప్పు లీకన్నులయొప్పు లనంగ
ధరవీర [౧]భక్తిచింతామణిరుచు[౨]లు
వారిఁబారి నీనేత్రములరుచు లనఁగ
దృష్ట [౩]సద్గురుదయా దీపితజ్ఞాన-
దృష్టులీకన్నుల దృష్టు లనంగ
సాంసా[౪]ర నిజహృదీశుని పదాబ్జము[౫]ల
[౬]కెంపు లీకన్నుల కెంపు లనంగ
నలిఁ బ్రాణలింగాంఘ్రి నఖదర్పణముల
తెలుపు లీకన్నుల తెలుపు లనంగ
నిద్దంబులై మహనియ్యంబు[౭]లై ల-
సద్దయాన్వితములై శాంతి[౮]పూరంబు-
లై కళాయుక్తంబులై సుధామయము-
లై కమనియ్యంబులై లసత్కాంతి-
మంతంబులై యనమానంబులై ని-
తాంతంబులై వినూతనములై [౯]విబుధ
సన్నుతములు నయ్యెఁ జనునెడ నిడుద
[౧౦]కన్నులు లోకవిఖ్యాతమై వెలుఁగ

---

౧. భక్త, ౨. లొ, పొ..., ౩. సద్గుణ దయాధిష్ఠిత(త)జ్ఞాన, ౪. రు, ౫. లు, ౬. కింపు, ౭. లుల్ల, ౮. రూపంబు, ౯. నిడుదకీ, ౧౦. కన్నులలోనవిఖ్యాతి.

హరమూర్తి గురుమూర్తి యగుపండి[1]తయ్యఁ
గర[2]మొప్ప [3]నిడుదలౌ కన్ను[4]లుసూచి
పురజనుల్ బుధులు సద్భూత[5]మని పొగడ
వర[6]భక్తదిగ్గజావలి మిన్న[7]వ్రాఁక
నారూఢమతి మల్లికార్జున పండి-
తారాధ్యు లంత నత్యంతనితాంత-
చారుతరోర్ధ్వలోచనములు వఱున-

విష్ణ్వాదిభక్తక్షేత్రలాభకథనము

[8]తో రుచిరన్వయంజ్యోతిరుద్దీప్త-
విదితాంగుఁడగు శంభు వికసితాంబక స-
ముదితంబు లగు [9]కన్నకోదమలో యనఁగఁ
బావనదివ్యతేజోవిరాజితము-
లై విలసి[10]ల్లు దిగంతదీధితు[11]లు
నెలకొ[12]ను తనయెడ నిడుదకన్దోయి
నలి విచ్చివిచ్చి గణప్రదర్శనముఁ
గావించుచును భక్తగణ కరుణా సు-

౧. తేంద్రు, ౨. మొప్ప, ౩. నెడ నిడు, ౪. లం జూచి, ౫. ముఁగఁ జూడ, ౬. భక్తి, ౭. బ్రాఁక; దాఁక, ౮. తోరులతర; దొరులతర, ౯. గొన్నకొడమలోయనిన, ౧౦. ల్లి, ౧౧. ల, ౧౨. వి.

భావార్థిఁ దేలంగఁ దనివోక మఱియు
నన్యోన్యసందర్శ నాన్యోన్యవంద-
నాన్యోన్యభాషణు లగుచుఁ దద్భక్త-
గణము లయ్యెడ [1]నిడుఁగన్నులు సూచి
గణుతింపఁ జిత్రంబు గాదె మున్నాది
[2]భవుచెంతఁ గన్నులు వడసినవారు
భువిలేరె యనిన నద్భుత మెట్టు లనిన
నాసరసిజనేత్రుఁ డాది జలంధ-
రాసురుపైఁ బోయి యనిసేయ నతఁడు
సంధిల్లి తన బలక్షయము గావించి
బంధించి తనువియ [3]త్ప్రాంతంబు వైవ
నెన్నఁ బదాఱువే లేండ్లు వాపోవు-
చున్న శ్రీవృషభేంద్రుఁ డుక్షవల్లభుఁడు
విని యట్లు శివునకు విన్నవించుడును
జని శూలి, "నాతోడ సమరంబుసేయఁ
జను జలంధర ! నీవు శస్త్రంబు [4]వుచ్చి
కొనుము" నావుడు, "ముదిగొరగ! నీతోడి
యనికి నాకేటికి నాయుధం బిడఁగ"

౧. నిడుదకన్నులు, ౨. భవునిచే; భవుచేత, ౩. త్ప్రాం
తాన, ౪. చ్చు.

ననుడు [1]నెక్కైన నిరాయుధుతోడ
ననిసేయు డన్యాయమనుచు మాధుర్య-
వనధిలో వామాంఘ్రివరనిజాంగుళము
నిడి త్రిప్ప నయ్యసురేంద్రుని జుట్టి
వడిఁదరిగొ[2]డి జలావ[3]ర్త పూరంబు
[4]దివికి భాస్కరకోటి ధిక్కారలీల
నవి[5]రళస్ఫూర్తిఁ జక్రాకార మగుడు
"దనుజ! కో! చక్రాయుధం [6]బదె" యనుడుఁ
దను బట్టఁదగు నాయుధం బయ్యె ననుచు
నురువడిఁ దను జుట్టియున్న చక్రంబుఁ
గరమునఁ [7]గంఠోపకంఠంబు గాఁగఁ
బూంచియెత్తెడు దైత్యపుంగవుశిరముఁ
ద్రెంచె [8]నచ్చక్రంబు, ద్రెంచుడు [9]నతఁడు
నంధకాసుర గం[10]ధసింధురాసుర జ-
లంధరాసుర నిర్దళను ముట్టఁ గొలిచి
"యాక్రమ్య దైత్యాపహారణార్థ" మనఁ ద్రి-
విక్రముఁ డంత నాచక్రంబుఁ [11]బడసి
బహుదైత్యతతిఁ జక్రబలమున [12]నోడిచి

---

౧. న, ౨. ను, ౩. ర్త, ౪. తివిరి, ౫. కల, ౬. బిద, ౭. గండోప, ౮. ఁడ, ౯. నంత, ౧౦. ధి, ౧౧. వడసె, ౧౨. నోడి.

మహిఁ జరించుచుఁ ¹ధ్రువు మతమునఁ జేసి
యేచి విష్ణుండు దధీచిపై నలిగి
వైచుచుఁ ²బడివిర్గె వరచక్ర మపు³డ
తుత్తు⁴ము రగుడు దైత్యులు విజృంభింపఁ
జిత్తజాంతకుని భజించి చక్రంబుఁ
బడయుదుఁ దొల్లింటి పగిదియ యనుచు
జడజాంబకుండు లసద్భక్తియుక్తిఁ
దప్పక వేయేసి తామరవిరుల
నెప్పుడుఁ గొనివచ్చి యేకాగ్ర బుద్ధి
నమితసద్భక్తి పడక్షరీభావ-
నమున రుద్రసహస్రనామ⁶ంబులందు
నొక్కొక్క-దివ్యనామోచ్చారణమున
నొక్కొక్క కమలంబు నుగ్రుఁ బూజింప
నరి "యదా స్యాత్తదసంభవం" బనఁగ
ధర శ్రుతుల్ "నేత్ర ముత్పాట్య" నా నంత
నొక్కనాఁ డొండందు దక్కువవడఁగఁ
గ్రక్కునఁ దన నేత్రకమల మర్పించి
చక్రంబుఁ గన్ను నీశ్వరు చేత⁸భక్తి-

---

౧ ధ్రువ్ర; ధ్రువు, ౨. బడి, ౩. డు, ౪. రు మగుడు; మురు గను, ౫. ంచి, ౬ ర, ౭. ము, ౮. పద్మంబు, ౯. నపుడు.

విక్రమం బేర్పడ విష్ణుండు వడయ
[1]హరియచే [2]పడయువా [3]డర్పించి కన్ను
[4]హరుఁడిచ్చువా [5]డచే [6]యదియెంతయరిది
వారక మున్మాఱు పరుసల పీర-
[7]ఘోరతపంబుఁ గైకొని యీశుఁ గొలిచి
శ్రుతి "సర్వతో౽క్షి శిరోముఖం" బనఁగ,
శ్రుతి "విశ్వత శ్చక్షు రుత" యన, లోచ-
నాంగీకరణసమస్తాంగుచే హరి దొ-
డంగి కన్నొకటి [8]నిట్ల పడయ నదియుఁ
గడపట నొడలెల్లఁ గన్నులుగాఁగఁ
[9]బడయుఁడో ముక్కన్ను [10]వడయుఁడో [11]యేటి
పడయుట యీశుండు ప్రత్యక్షమైనఁ
గడపట నది గాదు [12]కాదంచుఁ గాళి-
దాసి [13]గన్గవఁబూంచి తనరునేత్రముల
రాసులు వడసె నాక్రమ మెట్టులనిన
[14]భట్ట [15]భల్లట భాను భవభూతి రుద్ర-

---

౧. హరుఁడచే; హరుఁ డట్టె, ౨. పడయు, ౩. దర్పించి; దర్పించు, ౪. హరియిచ్చు, ౫. డడే, ౬. యం దెంత, ౭. గోర, ౮. వడయునది యట్టె, ౯. బడయఁడు; బడయుటో, ౧౦. వడయుటో; వడయండ, ౧౧. రొట్టి, ౧౨. కాదని, ౧౩. కనుంగవతనరు, ౧౪. బట్టు, ౧౫. బల్లహు; భల్లహు.

౧భట్ట గోపాలక౧భట్ట పుళింద
భారవి భాస్కర౧భట్ట ౨సుభోజ
వీ౩ర కర్పూరవిక్షీర విభిక్షు
భరత విద్యాధర పాణిని ౪క్షేమ
హరదత్త వరరుచి వరభట్ట మాఘ
జయకీర్తి కవిరాజ శాకటాయన వి-
జయదత్త కౌమార ౫శంకర త్ర్యక్షు
వల్లభాది కవీంద్ర వరకవితా స-
౬ముల్లసద్రచనా౭సమున్నతి మిగులఁ
బాలితశాబ్దికుల్ బాణ మయూర
కాళిదాసులుఁ దమ కవితావిశేష-
ములకు ౮మాత్సర్యముల్ ౯ముట్టుడు లోక-
౧౦ముల బుధుల్ విద్వత్తములుఁ౧౧జూడఁ దొలుతఁ
జని మయూరుఁడు సూర్యశతకంబుఁ జెప్ప
నినుఁడు ప్రత్యక్షమై "యిది ౧౨నీదుపూర్వ
కర్మంబు గుష్ఠరోగము, ౧౩శూలిదక్క

౧. భట్టు; భట్టి, ౨. సుభాజ; సు(నం)భోజ, ౩. ఠ, ౪. క్షమ్య; క్షేమ్య, ౫. శంకరో(సర్గళో)త్ప్రేక్షు, ౬. ముల్లాస; ముల్లస, ౭. మహోన్నతి, ౮. మత్సరములు, ౯. పుట్టుడు, ౧౦. ములు జూడ, ౧౧. మెచ్చదొల్త, ౧౨. నీకుఁ బూర్వ, ౧౩. చూచి.

నిష్ఫలముగఁ జేయనేర, రట్ల[1]య్యు
నొక్కింత నాదీప్తి [2]నొసగెద, నదియుఁ
[3]గ్రక్కున వెలికుష్ఠు [4]గప్పినట్లుగను
నంతస్థమగు కుష్ఠు హరు[5]నిచేఁగాని
యింతయుఁ జెడ[6]దట్టు లీశునుతింపు,
తడయ [7]కీరోగంబు దనక[8]య్యె [9]శ్రుతులు
నొడువ "మార్తాండభానోః కుష్ఠ" [10]యనుచు
[11]నంతఁ దద్రోగంబు హరుపాదభక్తి-
మంతుండనై కొల్వ మానె"నావుడును
రతి మయూరుఁడు మయూర స్తవంబనఁగ
క్షితి[12]ధరజాపతిఁ గీర్తన సేసి
ధర భానుచేఁ బోని తన[13]లోనికుష్ఠు
హరియింప నిది[14]యుఁ జోద్యంబనుచు భట్ట-
బాణుండు వెండియు భక్తిక్రియాధు-
రీణుఁ డప్పడు దన రెండు సేతులును
గడికండలుగఁ దన కట్టల్క దునిమి

---

౧. య్యె, ౨. నొసగుచు, ౩. గ్రుక్కున, ౪. గప్పిపోవంగ, ౫. చేతఁగాని, ౬. దెట్టు లీ; దట్ల యీ, ౭. క, ౮. య్యె, ౯. గృతులు, ౧౦. యనఁగ, ౧౧. నంతింత ద్రోహంబు; నంతఁ దద్ద్రోహంబు, ౧౨. ధరాత్మజపతి, ౧౩. మేని, ౧౪. చోద్య మనుచును; యుఁ జోద్యంబను.

ఫుడమిజనము లద్భుత మొంది చూడ
హారుఁ[౧]బూన్చి[౨]బాణగద్యావసానము[౩]నఁ
జిరభక్తి శివకర శివకర యనుచుఁ
బడసెఁ జేతులు రెండు వడయుట[౪]యెంత
గడిఁది దాననుచుఁ జక్కనఁ[౫]గాళిదా[౬]సి
గన్నులు రెండు నక్షణమ కెలంకి
పన్నగధరుపదాబ్జముల కర్పించి
ధరఁ గాళిదాసిగద్యం[౭]బు నాఁ జెప్పె
వరభక్తియుక్తి నీశ్వరుని గుఱించి
యిచ్చినకన్నుల [౮]నిచ్చుట గనుట
యచ్చెరువగు[౯]నే మహా[౧౦]దానియనుచు
నీశు[౧౧]చే నఖిలలోకేశుచేఁ గాళి-
దా[౬]సి నేత్రంబుల రాసులు వడ[౧౨]సి
యెన్ని దేశంబుల నెన్ని పురముల
నెన్నిగ్రామంబుల నెన్నంగఁ[౧౩]బడిన
నన్ని దేశంబుల నన్ని పురముల
నన్నిగ్రామముల జాత్యంధు లందఱును

---

౧. జూచి, ౨. గద్యప, ౩. ల, ౪. యంతె, ౫. దాళి, ౬. ను, ౭. బనా(దా) జె(ప్పె)ప్ప, ౮. నిచ్చుట, ౯. న, ౧౦. దాన, ౧౧. న, ౧౨. సె, ౧౩. బడియె.

గను[౧]గుర్పు లఱ్ఱోగస్థులై యున్న
జను[౨]లరండో యని చాటంగఁ [౩]జనుపఁ
దప్ప[౪]వోయినకన్నఁ దడికన్నఁ [౫]బొరయఁ
గప్పిన[౬]క న్గుడ్కుఁ [౭]గ న్నొడ్డుఁగన్న
[౮]గ్రుడ్డిక [౯]న్నొరిగన్న [౧౦]గోడ్రెప్పగన్న
[౧౧]బ్రొడ్డుకన్నను బువ్వ[౧౨]వోయినకన్న
[౧౩]పాలగట్టినకన్న బ్రంగుడుకన్న
[౧౪]గ్రాలుకన్నను నీరుగాఱెడుకన్న
[౧౫]బ్రొందకన్నను [౧౬]బొరిఁబొరి బ్రుస్సుకన్న
[౧౭]మ్రందగన్నను బెక్కు[౧౮]మ్రాదలకన్న
బోటుఁగన్నను [౧౯]బ్రొంగవోయినకన్న
[౨౦]దూటుగట్టినకన్న దూలగొన్కన్న
మయిలకన్నను మసుమసుక[౨౧]సికన్న
నయిరకన్నను బాయ క[౨౨]దరెడికన్న

---

౧. గురుపులఱు; గొరపులఱు, ౨. లు, ౩. బంది, ౪. వోటున, ౫. బ(బొ)ర(ఱు)యు, ౬. కన్నీరుక్రు; కనొ్కరుక్రు, ౭. గన్నొండు, ౮. గుడ్డి, ౯. న్నొల, ౧౦. కొడ్రెప, ౧౧. బొడ్డి, ౧౨. బో, ౧౩. పలుకుగట్టిన, ౧౪. కలఁకన్నునలినీరు, ౧౫. బొ, ౧౬. బొరిబ్రు(బు)స్సులకన్న, ౧౭. మ్రంగు, ౧౮. మాదల, ౧౯. బ్రొగ, ౨౦. దూఁట(ఁటి), ౨౧. సా, ౨౨. దీ.

[1]దోఁటు[2]వోయినకన్ను దో[3]లుఁగుడుఁగన్ను
[4]దీఁటకన్నును, మఱితిమిరంబు [5]రక్త
దోషంబు దుర్మాంసదోషంబు వాయు-
దోషంబుఁ బటలంబు దుర్దర్శి గృష్ణ-
[6]కాసయు సతి[7]రక్తకాసయు [8]శ్వేత-
[6]కాసయు [9]ననెడి [10]రోగంబుఁగన్నులును
నాదిగాఁగల సమస్తాధులు నడి.-
[11]రోదనస్థులుఁ [12]దనప్రోలి కేతేరఁ
జెన్నారఁ గాళిదాసియు శివుచేతఁ
గొన్న యా [13]ముయ్యేడుగన్నులలోనఁ
దా రెండుగన్ను లుద్ధతిధరియించి
వారివారికిఁ [14]గన్గవలు వుచ్చిపుచ్చి
యిచ్చుచు నంధుల [15]నెల్లను దనుప
నచ్చెరువంది లోకావలి వొగడ
గ్రక్కున దమతమ కన్నులరాక
[16]కక్కజంబంది పూర్వాంధులు మ్రొక్క-

---

౧. దూటు(టి), ౨. వోయెడి, ౩. ల, ౪. దే, ౫. కన్ను, ౬. కాళ, ౭. రిక్త, ౮. స్వేత; శ్వేత, ౯. ననిన; నైన, ౧౦. రోగంపుకన్నులును, ౧౧. రోగస్థులును, ౧౨. గూడి(డ)వేగ నే(మే)తేర, ౧౩. ముయ్యాడు, ౧౪. కనుగవలువిచ్చి, ౧౫. నెల్లరుఁ (ర), ౧౬. కక్కజులగుచు; కక్కజముగను.

దాసి[1] దాసనుమాత్రఁ దమనేత్రరుజలు
వాసిన యతగులు ప్రణమితు [2]లిగుచుఁ
బూని యాకన్నుల [3]ప్రోగులు సమయఁ
[4]దా నంధులకుఁ [5]గాళిదాసి దానంబు
క్షితి నంధులకునెల్లఁ గృపసేసి శివుని
నుతియించి పడసెఁ గన్నులు గాళిదాసి
యనఁగ నంధులలోన నతని[6]పాఁగెమునఁ
గనుఁగవల్ వడయుట గష్టంబుగాదె?
తక్కువయే[7]ము న్నతనివిద్యకంటె
నిక్కంబు[8]మద్భక్తినిష్ఠ గావునను
మతిభక్తి[9]రతియ ప్రమాణంబు[10]గాక
స్తుతియును నిందయు శూలికిఁగల[11]వె?
పడసెఁ గన్ను[12]లుశివుఁ బ్రార్థిం[13]చి దాసి
వడయుదు నేనొండు భంగి నెట్లనిన,
దేవండు మాబావ దేవి మాయక్క

---

౧. డాసిన, ౨. ల్గాను, ౩. ప్రోడ (క;గు) లు, ౪. రా(దా)నందు, ౫. దాసి దానంబునేయ, ౬. పొంగముగ; పొంగ్యమున (ఇచ్చట బ్రౌనుప్రతిలో "అన్నిగ్రంథములలోను 'పొంగ' మని యున్నందున యీశబ్దమునకు సామ్య మనే యర్థము తోచుచున్నది" అని ఉన్నది.) ౭. మున్నదనదివ్య, ౮. సద్భక్తి, ౯. తతి, ౧౦. గాగ, ౧౧. దె, ౧౨. ల. ౧౩. ంచె.

వావిఁదీర్పంగ౧-౨ఏశ్వరున కే మఱందిఁ
గర మనురక్తి ౩యకారణంబు౪నను
గి౫జేకుఁ *గేకటఁ గెమ్మటలాడి-
యును సరసము సేసియును గేలి సేసి-
యును నర్మములు సేసియును నగించియును
నాలంబు సేసియు నపహా౬సించియును
మేలంబు లాడియు ౭మెప్పించి యుపుష
సాంబు చేఁ బడతు నక్షుంబు ౮లే ననుచు
నంబికానామాంకుఁ౯డంబెన్న ౧౦సదురు
౧౧దొంగలింపఁగఁ౧౨గొట్టి దొన శంకరేశ-
లింగంబు ౧౩గుడిఁ వెన్క లీలఁ గూర్చుండి
మెచ్చులు దులుకాడ మేలు౧౪కబ్బములు
సెచ్చెర నొక౧౫వేయు సెప్పినంతటన
మెచ్చి శంకరుఁడు ౧౬సస్మితవక్త్రుఁ డగుచు
మచ్చిక "౧౭నాముద్దుమఱంది ౧౮యంబెన్న!

౧. దప్పంగ, ౨. నవ్వరున, ౩. య(న)క్కార; యేకార, ౪. గను, ౫. గేకటిగెమ్మాట ; గీకటకిమ్మట ; గేటుకకెమ్ముట; నీకట కెమ్మెట ; గేకటి కెమ్మాట, ౬. సి(రి)ంపుచును, ౭. మెచ్చించి, ౮. శేల, ౯. డమ్మెన్న, ౧౦. సదర; నగవు, ౧౧. తుంగ, ౧౨. గొట్టె; గొంటి, ౧౩. నడి, ౧౪. కంబ, ౧౫. వేయి చెప్పి, ౧౬. సంస్మిత, ౧౭. నో, ౧౮. యమ్మెన్న; యెంబెన్న; నంబెన్న.

గోరోరి ! వెడ[౧]యర్పు లుడిగి [౨]ముందటికి
రార యిచ్చెదను నేత్రములు నీ"కనుడు
"[౩]భావ ! దేవర ! చీకువట్టినకోల
యేవచ్చువిధ [౪]మెట్టు లింక [౨]ముందటికి,
[౫]సడ్డ లాడెదుగాక శంకర యేను
[౬]గ్రుడ్డినో మఱినీవు [౬]గ్రుడ్డివో చెపుమ!
కోల నిచ్చెడివాఁడు గుడికడ నుండఁ
జాలక ననుబెట్టి [౭]చనియె నింటికిని,
[౮]నంబే యనిన నొంటి నరుగుదే నేర,
నంబా యనిన నొంటి నరుగుదే నేర,
నాకు[౯]ముందరయ నున్నతలోక నీవ,
*నాకు వెనుకయు[౧౦]ను నతలోక నీవ,
యీదిక్కు నాదిక్కు నేదిక్కు నెఱుఁగ
[౧౧]నీదిక్కు కాక యీ నిఖిలంబునకును
[౧౨]నీదిక్కు యగు[౧౩]సర్వతోదిక్కు[౧౪]నాకు

---

౧. యప్పు; యుచు, ౨. ముందటికి, ౩. బావ, ౪. మింక నెట్లు, ౫. సడ్డ, ౬. గుడ్డి, ౭. జరిగె, ౮. యంబెన్న యనొట్టి యరుగు, ౯. ముందఱయయునునతలోక, ౧౦. నన్నత, * కాక దిక్కెవ్వరు గలరు లోకముల, ౧౧. నీదిక్కు దిక్కన, ౧౨. నీదిక్కునగు, ౧౩. విశ్వతోధిక(దయ); సర్వతోదిక్కు, ౧౪. నీకు; నీవు.

నేదిక్కు ముందఱ యేదిక్కు వెనుక
నటు[1]గాన వల[2]తేని [3]నక్కమగండ
యిటు[4]మొగంబై కన్నులిమ్ము" నావుడును
భావింప ముఖమంటపము పరివార-
దేవత[5]లును వాసుదేవ విరించి-
రవి గజాస్య గుహ భైరవ మాతృకాది-
దివిజగణంబు నందియు నట్లయుండ,
వెనుకముందఱయయ్యె వింతన[6]వ్వాలయం
దనయున్న గుడియును దాను శంకరుఁడు
వడి మృదుతో[7]డఁ[8]న వచ్చె నేత్రములు;
గుడి దిరుగఁగఁ గంటి గ్రుడ్డును దిరిగె
హరుఁ డభిముఖుఁ డగునంతలోపలను
గర మభిముఖములై కన్నులు దిరిగె
[9]నంబెన్న యీ క్రియ నతఁడు ల్వడసె
[10]నిమ్మహి జను లెల్ల నెఱుఁగంగ మఱియు,

ఇరిత్తాండార్యాభ క్తకథనము

వెండి యంధుం డిరిత్తాండి య న్గణము
దండియై మును గాళిదాం[11]ంసి నేత్రమ్ము

---

౧. గాక, ౨. దేని, ౩. యక్క, ౪. ముఖం, ౫. లగు, ౬. వ్వాలర; ౭. నే; ౮. నమ్మైన యఖిలజనంబులు నెఱుఁగ, ౯. నంబకంబులు గాంచె నదిగాక; ౧౦; ను.

లెడపక [1]యంధుల కిప్పించి కాని
పడయనొల్లండవై పటునేత్రయుగము
నే నటుగాక [2]నిక న్నేచినయట్టి
జైనులకన్ను [3]లీ క్షణములోఁ జెఱచి
మఱికాని పడయ నీమహిఁ గన్ను లనుచు
గఱకంఠునాజ్ఞ దుష్కరజైనవితతిఁ
గన్నులు వెడఁగ [4]వేగమ శపియించి
కన్నులు వడసెఁ జక్కన నిరిత్తాండి—
యదిగాక శివనాగమయ్య య న్గణము
వదపడి నిత్యంబుఁ బ్రాణేశ్వరునకు
మూఁడుసంధ్యల నేత్రములు సమర్పించి
ప్రోడిగాఁ బడయుచు భువిఁ [5]బ్రవర్తింప
హులిగెరసోమేశుఁ డుద్యద్దయాఢ్యుఁ
డలరుచు శివనాగమయ్యను జూచి
[6]కట్టఁగ నీపూన్పుఁ గనుదమ్మి[7]జోళ్లు
నెట్టును[8]మానవే నిది యాదిగాఁగఁ
గ్రమమొంద సోమవారము సోమవార
మమితసద్భక్తి నేత్రాబ్జము లూన్చి

౧. నం, ౨. న, ౩. ల, ౪. జక్కల(న), ౫. బ్రస్తుతింప, ౬. కట్టర(లక), ౭. జోడు లె; జోళ్లు ఎట్టు..., ౮. మాన్ప(వే) శే.

మనవుడు నట్లకా కని వారవార-
మును దప్ప[1]కుండ సము[2]ద్యత్ప్రసక్తి
భవునిఁ బూజి[3]ంపుచుఁ బడయుచునుండె
శివనాగమయ్య[4]సెచ్చెర నేత్రవితతి,
మఱియును గన్నప్ప మహిమ[5]నీశ్వరుఁడ
యెఱుఁగు నేత్రద్వయం బిచ్చుట గొనుట
యిచ్చెఁ గన్నప్ప మున్నీశ్వరార్థముగ
నచ్చుగా శివుఁడు[6]భక్త్యర్థమై యొసగె
నిచ్చుట శివున[7]కై యిచ్చుటగాని
యిచ్చుట [8]గొనెనని యిచ్చుట గాదు
వడయుటయు [9]శివేచ్ఛఁ బడయుటగాని
[10]పడయంగవలెనని పడయుటగాదు
గన్నప్పదేవఁ డొక్కఁడకదా యాదిఁ
గన్నులిచ్చినవాఁడు గౌరీశ్వరునకుఁ
గన్నులు గొనియెడు గణములకాని
కన్నులిచ్చినవారిఁ గాన ముగ్రునకుఁ
గావునఁ గన్నప్ప కన్నులయీగిఁ

---

౧. కనుక్రమమున దనభక్తి, ౨. ద్ధతశక్తి, ౩. ంచు, ౪. చె, ౫. నీశానుఁ డె, ౬. భృత్యార్థమై, ౭. కే, ౮. కొననని, ౯. శివునికై గడయుట, ౧౦. పడయుట.

దా వివరింప నెంతయు¹నొప్పు మఱియు
నుదయమజ్జనకాలఁ మిదిగదా యనక
మదియించి నిద్రించి మఱచినయట్టి
మిక్కిలి ద్రోహులు మీరకా కనుచు
గ్రక్కునఁ దస రెండు గన్నులుఁ గెలకి
సుప్రసిద్ధంబుగా శూలిఁ బూజించి
²యప్రవృత్తాత్తుంబు ³లక్షణంబునన
మహిఁ బడయ⁴ఁడెభ⁵క్తిమతి ⁶వెల్లగొండ-
మహాదేవశరణుండు మఱియట్లుఁ గాక
స్థిరకీర్తి-గంగళదేవయ్య నాఁగఁ
⁷బరుసతోఁదాను శ్రీపర్వతంబేఁగి
కన్నులువుచ్చి శ్రీకంఠుఁ బూజించి
కన్నులు వడసి యక్షణమ యేతేర
నింతవేగమున ⁸నె త్లితెంచెఁ, గన్ను
లింతవేగమ్మున నీశానుచేతఁ
దానెట్లువడసె నింతయుఁ గుటిలంబు
గానోపునని కూడి ఖలులు నిందింప

౧. ఁజెప్పు, ౨. యప్రమ, ౩. లాక్రమంబునను. (న); ౪. దె, ౫. క్త, ౬. యల్లకాడు, ౭. బరసతో, ౮. ని, ౯. ౦౨.

ధట్టుండు వారిచే తన¹యొక్కపిల్లిఁ
బట్టితెప్పించి సభామధ్య³మునను
ఖలులచే తనపిల్లికన్నులు రెండుఁ
దొలఁగించి సకలభక్తుల నాత్మఁ దలఁచి,
"కరుణాత్మ! యీపిల్లికన్ను లీకున్న
హర! యసంఖ్యాతులయాన నీ⁴కనుచుఁ
గడు నుబ్బి ⁵యాపిల్లికన్నులక్షణము
పడసె నాదేవణ్ణ ప్రతిజను ల్బూనఁ
నర్పించి పడయుట యరిదియే, కన్ను
లర్పింపక పడయు ⁶టవి యర్దికాక
యేల యిట్టివి వేయు నెన్న ముక్కంటి
కాళి⁷వెట్టి యానంగ గణనాథుఁ డొకఁడు
మిక్కుటంబుగఁ ⁸దొలిమేని పుణ్యము¹⁰న
ముక్కంటితోడన ¹¹మును జనియించి
మేదుర¹²కీర్తిమై మించి లో¹³కముల
నాదిసాత్త్వి త్రిణయనుఁ డని¹⁴నుడువఁ
గరికాలచోడఁడన్ గణనాయకుండు

---

౧. వ, ౨. క, ౩. మమున, ౪. కనుడు, ౫. యప్పిల్లి, ౬. టరిదియ; టదిగొప్ప, ౭. పెట్టి; వెడ్డ, ౮. టన్న, ౯. జాలు, ౧౦. గ, ౧౧. మున్ను జనించి, ౧౨. భక్త, ౧౩. ప, ౧౪. నడప(వ).

వరవీరభక్తిప్రవర్ధనశాలి
వాఁసీక[౧]భోజన పూజా[౨]ర్ఘ్యపాత్ర
యానలువాడిపించి యాదృతి[౩]"స్వర్ణ-
[౪]వర్షంవవర్ష"నా పారక కనక-
వర్షంబుఁ గురియించె వసుధపై నంత
నభ్రంకషస్ఫూర్తి నలరి పాఱంగ
విభ్రమలీలఁ[౫]గావేరిఁ గట్టుచును
ముట్టిన మహిమమై ముక్కంటి కా[౬]ళ్ళి-
వెట్టి[౭]నిగావేరి [౮]వెట్టికిఁ బిలువ
ముక్కంటివాఁ డేల [౯]మును వెట్టిసేయు
నిక్కంటివానికి నేఁ జేయ ననుఁడు
నిచ్చినవాఁ డెవ్వఁ డీనేత్ర మనుచు
నచ్చుగా [౧౦]ముక్కన్ను సతనిరూపమ్ము
ముంగల వ్రాయించి మొగి [౧౧]నెడ కాలి
[౧౨]యియుంగటంబున, [౧౩]నట్ల యొ[౧౪]త్తముక్క[౧౫]ంటి
కాళ్ళివెట్టి నొసలి [౧౬]క న్నటు వగులఁ

---

౧. భోజుని, ౨. ర్హా, ౩. కనక;స్వర్ణ; త్రుళ్లినక, ౪. వర్షంచ వర్షనా; వర్షంబు గురియునా, ౫. గావేలి, ౬. ళ్ళె, ౭. నా; కి, ౮. వ, ౯. మునువెట్టి; మొగివెట్టి; మునుపెట్టు, ౧౦. నేత్రంబు, ౧౧. ఁదన, ౧౨. యుంగు, ౧౩. నిట్ల; నట, ౧౪. త్రి, ౧౫. ంట, ౧౬. కన్నులు.

గాళివెట్టి[1]యు నహంకారం బ[2]డంగి
కరికాలచోడ విక్రమచక్రవర్తి
[3]హరునకు సాష్టాంగుఁడై ప్రణమిల్లి
కరికాలచోడని కరుణాతిశయతఁ
బర[4]గంగ ముక్కన్ను వడ[5]సెఁ గావునను
నాకాళివెట్టి మహత్త్వ[6]మెంతని ని-
రాకరిం[7]చుచు ననిరస్తప్రతాపి
వెండి యుద్యద్భక్తి విక్రమాన్వితుఁ డ-
ఖండితకీర్తి శంకర[8]దాసమయ్య
ముక్కంటి[9]చేతఁ దా ముక్కన్ను వడ[10]సి
తక్కక [11]నిఖిలా[12]న్య దర్శనస్థులను
గ్రొవ్వడఁగించుచుఁ గుటిలదర్శనుల
[13]ముట్వెట్టిగొనుచుండె మును మ[14]హోద్ధతిని
నన్య[15]దైవోద్దర్పహరణార్థముగను
ధన్యుఁ[16]డై [17]శంకరదాసిదేవయ్య

---

౧. నయహం, ౨. ణంగిఞ్ణంచి, ౩. కరయ(రుఖ)సాష్టాంగుఁడై (లై) యట, ౪. వంగ, ౫. ట్ట, ౬. మెంతేని, రా..., ౭. చుచును నిరస్త; చెఞనునస్తోక, ౮. దాసియనఁగ, ౯. చేత(దా)ను(న), ౧౦. సె, ౧౧. న, ౧౨. స్య, ౧౩. ముప్వెంటి, ౧౪. దో, ౧౫. దైవత దర్ప, ౧౬. ండు, ౧౭. దేవర.

ముక్కంటిచేఁ గొన్న ముక్కన్నులందు
నొక్కనేత్రముకాదె యూర్ధ్వనేత్రంబు
గఱకంఠుచే నిట్లు గన్నులు పడసి
మెఱసినభక్తుల మిక్కిలికరుణఁ
బండితస్తుతునకు [1]దండితాఘునకుఁ
బండితమల్ల దిగ్భ[2]ద్రేభమునకు
నూర్ధ్వ[3]నేత్రద్వయం బొప్పెఁ జోద్యముగ
నూర్ధ్వలోచనుని మహోన్నతకరుణ
[4]మఱియు నేత్రములు సమర్పణసేసి
వఱలంగఁ [5]బేర్చినవారి నెల్లెడల

సుందరనంబెన్న జన్మాదిచరిత్రకథనము

గందుము విందుము గాక లోకములఁ
గందుమే విందుమే కథలందు మఱియు
నాఁడెల్ల [6]నెఱుఁగంగ నంబెన్న [7]యంత
వాఁడును నేత్ర మీ[8]శ్వరునిచే మగుడఁ
బడయునప్పుడ నిజాంబక[9]ము కాకిట్లు
[10]వడినిడు కన్నుఁ దాఁ బడ[11]సినవాఁడె

---

౧. బం, ౨. ద్రగజమున, కూ... ౩. లోచనయుగంబ నేత్రత్రయం, ౪. ద్యు, ౫. నరయ, ౬. జే, ౭. యె, ౮. యెం, ౯. శ్వరుచేత, ౧౦. ముగా, ౧౧. యడ, ౧౨. సె. సేనాఁడే.

యానంబిమాహాత్మ్య మదియెట్టిదనినఁ
దా నీశ్వరునకైనఁ దలఁప నక్కజము—
గావేరియామ్యభాగంబున మఱియు
నావలూ రను నగ్రహారంబునకును
నిరువుఁరు జంగము లేతెంచి నంబి
యానంబిమాహాత్మ్య మది యెట్టి దని
దిరుపాట లర్థి సంధిల్లఁ బాడుచును
వరదానమున కేఁగ వనితాలలామ
విరియనంగె యనంగఁ బృథుభక్తినిరత
వరగుణ యొక్కశివద్విజురాలు
వరదాన మిడుటకు వచ్చి యాలించి
యీతిరుపాటలిం దెవ్వారికవిత?
యీతిరుపాటల కేమి యర్థంబు?
పాడిన వినిన నే ఫలము సిద్ధించు?
వేడుకఁ జెప్పుఁడా వినియెద ననిన
నీతిరుపాట లభీష్టార్థకరము
లీతిరుపాట లైహికసుఖప్రదము
లీతిరుపాట లహీనసౌఖ్యాభి -

౧. ర, ౨. జంగమంబే, ౩. క్త, ౪, మిడ నని;| మిడ వచ్చి, ౫. నిం, ౬. యీ, ౭. ప్రాప్తి (పి) ంచు,౮. దా, ౯. ము, ౧౦. సౌభాగ్య.

జాతంబులగు మోక్షసౌఖ్యహేతువులు
ప్రతిలేని యీతిరుపాటల శివుని
నుతియించిమించు ధన్యుని[1] మాడ్కి వినుమ
యంబికాధవుభక్తుం [2]డసమానుం డొడయ -
నంబి నా భక్తగణశ్రేష్ఠుం డతని
చారుచరిత్ర మాశ్చర్య మెట్లనిన,
గౌరీవివాహాభిగమన కాలమున
మృడుం డీశుండు శివుండు మేదురకీర్తి
గడుబెడంగడర శృంగారంబు సేసి
వినువీథిం దాంకి న[3]వీనవిస్ఫురణం
దన రారు నిలువుటద్దంబుం జూచు[4]డును
జలజాప్త కో[5]టి తేజము ధిక్కరించు
విలసిత నిజదేహ [6]విమల[7]విభ్రమము
నతులితో[8]ద్యద్దర్పణాభ్యంతరమునం
బ్రతిబింబమై కానంబడు[9]చుం దదియ్య
సౌందర్యమునకు నాశ్చర్యంబుం బొంది
సుందరుండేనని చూచి హర్షిం[10]ప

---

౧. ఖ్యాతింజూడు- మం, ౨. డసమాని యొడయు; డనదునిదొ డయు, ౩. వినయ, ౪. చు, ౫. ట్ల, ౬. వివిధ, ౭. విలాస-మ...., ౮. డు, ౯. రునే(నే); రవే (మే, నే); గివే, ౧౦. ంచి.

సుకర స్వకీయ్య భాసుర[1]దృక్సముదిత -
ముకురస్ఫురితమూర్తి మూర్తీభవించి
యరుదెంచి ధరణిపై సాష్టాంగ[2]మెఱఁగి
కర మర్థి లే[3]నెత్తి కౌఁగిటఁజేర్చి
మందస్మితముఖాంశు మంజరు లౌ[4]లయ
సుందరాత్మీయ్య విస్ఫూర్తి నీమూర్తి
యగుట సుందరుఁడ వీ వను పేరు మోపి
తగిలి శంభుండు సుందరగణాధ్యునకు
వరకృపామతి గణత్వము ప్రసాదించి
పరిణయోత్సవము శంభత్ప్రీతిఁ జలిపి
యగజయుఁ దాను నన్యోన్యసంప్రీతిఁ
దగిలి సుఖింపఁగ దా నొక్కనాఁడు
హరునకు సుందరుఁ డర్థిఁ బుష్పముల
కరిగి యుద్యానవనాంతరంబునను
మున్నద్రిజకుఁ బుష్పములకని వచ్చి -
యున్న కనకలతయును [5]గాంతిమతియు
ననుసతుల్దాను నన్యోన్యానురక్తి
మనసిజక్రీడల మసలి యేతేరఁ

---

౧. దృక్సమేత; దిక్సముదిత, ౨. మొఱగి, ౩. వె, ౪. ల్లీల, ౫. క్రాంతి.

గామసుఖాపేక్ష గలుగు మువ్వురను
గామాపహారియు గౌరియుఁ జూచి
భువి మువ్వురుచు [1]నిట్ల [2]పుట్టుఁ డీతనికి
నువిదలై [3]యుండుఁడీ యువిద లిద్దఱును
దనివోవ భువిని నతనుసుఖాంభోధి
ననయంబు నోలాడ నరుగుండు [4]పొందు,
నావుడు దండప్రణామముల్ సేసి
దేవదేవేశ్వరు దేవి వీడ్కొనుచు
నిల నొప్పు ద్రవిళమహీస్థలియందు
నలిఁ దిరువారూర [5]నంబి యన్ పేర
వడి సుందరుండు శివద్విజుం డైన
జడయూరి యను పుణ్య[6]శాలికిఁ బుట్టె
ధర నంద కనకలతయు నుదయించెఁ
బరమనాచి యనంగఁ [7]బంచములందు,
మంగలూరను గాంతిమతి[8]యును నంగ-
[9]సంగ నా మఱి శూద్రజాతి జనించె,

---

౧. నిల, ౨. (బుట్టుం డితనికి, ౩. పుట్టుండు, ౪. వొందు, ౫. నంబెయ్య, ౬. సాధ్వి, ౭. బణ్యాజాతమాన, ౮. యను నంగ; యు ననంగ, ౯. నంగనామణిశూద్ర (మాత్ర); సంగణ సచ్ఛూద్ర.

శంభుమూర్తిని నంబిజడయారి యంత
శాంభ[1]వదీక్షాభిజాతుఁ గావించి[2]
నానంబియును నంత ననుదినవర్ధ-
మానాం[3]గుఁడుగఁ గర్మమతి జడయారి
గపిముఖప్రియనిభు గర్భాష్టకమున
నుపనయనము సేయ నున్నయత్తఱిని
నారుద్రుఁ డపుడు "యాతే రుద్ర" యనఁగ
శ్రీరుద్రసూక్తసంచితభావ్యసరళి
ధరణి "జరద్విప్రతను" నాఁగ శ్రుతులఁ
బరగు జరాక్రాంతభావంబుఁ దాల్చి
కృతకంపు విప్రుఁ డుద్ధతి నేఁగుదెంచి
"యితఁడు మీసుతుఁడె మాయిలుఁ బుట్టుచిన్న
వడుగు సేయఁగ నెట్లు వచ్చు మాదాసి
[4]కొడు"కని యానంబి [5]కుడిరెట్టఁ[5]బట్టి
సరసపుణ్యాహవాచన మాచరించు
[6]వరవిప్రులును బంధువర్గంబు సూచి
యతిచోద్యమంద బ్రాహ్మణవృద్ధు ముదిసి
మతిఁదప్పినాఁడొ యున్మత్తుఁడో భ్రమసె-

౧. వీ, ౨. ంచె, ౩. కుఁడుగ; గుఁడగు, ౪. కొడ, ౫. పట్టి(ట్టు), ౬. ంపు, ౭. వరటివిప్రులు బంధు.

నో కృతకంపు వైత్యుఁడో తస్కరుండో
కాక, యిట్టివిరెందు గలుగునే యంచుఁ
జెచ్చెర నేతెంచి [3]చేనుల్చి [4]చాఁపి
పుచ్చుచు నటు ద్విజుఁ బొమ్మనిత్రోవ
సొడసొడలోవ్వుచు సోలుచుఁ బాటి-
పడి [6]పూజకుండలు వగులఁదన్నుచును
వడిలేచి మఱపట్ట వచ్చుడు ద్విజులు
వెడ కేలుగాఁబట్టి బిట్టుద్రోచుదును
వడఁకుచుఁ దిరుగుచు వచ్చి యాగడియ
కుడక[10]పైఁ బడి నీరు గూలఁద్రోయుచును
మఱివచ్చి పట్టుబ్రాహ్మణుని గోపించి
యఱిముఱి మెడఁబట్టి య[11]వుల నూఁకుడును
[12]బడిఁబడి మఱియంతఁ బందిరి[13]రాళ్ల
[14]నడుగులు పెనగొల్పి [15]యడుగున నూఁప
దందడి నగ్ని[16]హోత్రముమీఁదఁ[17]బడుదుఁ
బందిరి గుబ్బనఁ బడి మంట లెగయ

---

౧. యం, ౨. నో, ౩. చెయి, ౪. పాపి, ౫. యు, ౬. డి, ౭. ( బూజగుండలు, ౮. వచ్చిపట్టుచు, ౯. గ, ౧౦. లపైఁబడి కూల ద్రోచు, ౧౧. వ, ౧౨. బడిపడి; వడివడి, ౧౩. కాళ్ల, ౧౪. నడుము లు, ౧౫. యరుగుల; యరుగక యా, ౧౬. కుండ, ౧౭. వడుక.

ది[1]గ్గన లేచి నల్దెసల[2]ను గాల
నగ్గిలోనన పడి యరిగెడువారు
[3]యిండులపై [4]నెక్కి యట[5]యేఁగువారు
[6]గండులఁ [7]దూఱి వేగమ పాఱువారుఁ
జప్పరంబులు నూఁకి చనియెడువారు
[8]నెప్పాటఁ జనలేక యీల్గెడువారు
గోడలు వడఁ ద్రో[9]సికొని పాఱువారు
గూడముట్టిన[10]యగ్గిఁ గొని కాలువారుఁ
గనుకని యొండొ[11]ంటఁ గడవంగ విప్ర-
జను లివ్విధంబునఁ జక్కన నరుగ
మూఁకలోనచొచ్చి మునుముట్ట నంబిఁ
జాఁకిట నిడుకొని జ[12]డయారి యరుగఁ
దనబిడ్డఁ డనుచు మాదాసిబిడ్డని[13]ని
గొనిపోవుచున్నాఁడు గుటిలంపు ట[14]ఱువ
సూ[15]డుఁడీ పౌరు లంచును [16]బురి వాడ-
వాడల మొఱ[17]యుచు వడిఁ బాఱి పట్టఁ

---

౧. గ్గ, ౨. (బాఱుచున్, ౩. యి(ం)ళ్ల, ౪. నక్కియు నిట, ౫. నేఁగు; నుఱుక, ౬. గం(డ్ల), ౭. దూఱియును వేగమె, ౮. న, ౯. చు, ౧౦. నగ్ని, ౧౧. ండ; ంటి, ౧౨. డి. ౧౩. యు, ౧౪. ఱ, ౧౫. డండి, ౧౬. జని, ౧౭. లిడి.

గరమద్భుతం బని కరికాలచోడ-
నరపతి యయ్యుపనయన విఘ్నంబు
ముదుకవిప్రుఁడుగూడ మొఱ[1]వెట్టుటయును
గదిసి ముందఱ[2]జెయిరిడ్లు గాల్చి[3]వచ్చుడును
సభయును దానువిచారించి చూచి
యుభయవాదు[4]లను గొల్వుండి పిల్పి[5]ంచి
కొడుకుఁజాఁకిట నిడుకొనుచు నేద్చుచును
జడయారి యేతెంచి సభయెల్ల నడల
నొకకాలు గుంటుచు నొకకాలు సేత
నొకచేత నొకలేఖయును గొంచు శ్రుతిమ-
తఖ్యాపితోక్తి "ప్రదర్శితకపట-
లేఖ్య" యనఁగ ద్విజముఖ్యు లేతెంచి
జనులు సోఁడం డక్కజం బందనంతఁ
దనచేతిలేఖ [7]యాధరణీశు మ్రోలఁ
బెట్టి "నరేంద్ర! మాభృత్యుఁ డీపాపఁ,
డెట్టన్న, నంబి నా కెడరైనకొడుకు
విను మెనిమిదియేండ్ల [8]వీని న న్పాపి
కొనివచ్చె నీఁడఁ[9]పై కొడుక[10]ంపై తనకు

---

౧. లిడు, ౨. అనిం; టెయిం, ౩. చచ్చుటయా (డును), ౪. లఁ గొలువుండి, ౫. ంప, ౬. డఁడునక్క, ౭. యా, ౮. వినినను చాసి, ౯. దే, ౧౦. ట.

ధట్టుండ యూరూరఁ దప్పక వెదకి
మెట్టకేలకుఁ గంటి నిన్నియు నేల,
చదివింపు మీలేఖ సభయెల్ల వినఁగఁ
జదువుచో మీస్వహస్తములు లేకున్న
నిలఁగాఁడు మాభృత్యుఁ డితఁ[1]డనియున్న
వెలియగువాఁడ నీవిప్రుల[2]కెల్ల"
ననవుడు నట్లకా కనుచు నాసభయు
జననాథుఁడును లేఖఁ జదివించిచూచి
"ధర విప్రునకు నంబిదాసియన్ సాక్షి
వరగుఁ బంచాయూ[3]ధ పత్త్రంబునుం[4]డ,
హస్తామలకగతి నస్మదాదుల స్వ-
హస్త[5]విలిఖిత చేవాంకంబు లుండ,
నాజడయూరిస్వహస్తము[6]నుండ,
భూజనావలి చిత్తమున నట్ల యుండ,
నీవిషయంబు మా కేమనఁగలదు?
నీవ యొజ్జుదు ధరణీసురోత్తముఁడ;
చంపు [7]రక్షింపుము స్వామి యీశిశువు
నుంపుము పెంపు[8]మీ యొప్ప గో"మ్మనుచ

౧. డనకున్న, ౨. లోన, ౩. ఢి, ౪. డు, ౫. లిఖితదేవతాం, ౬. లు, ౭. మురక్షింపు స్వామి, ౮. నీ.

జడయూరి దనచంకఁ [1]దత్సుత్రునిచ్చి
యడలుచు విభ్రాంతుఁ డై పడయఱవ
హారమూర్తియును నంత నాదిశైవోక్తి
సరస "భృత్యత్వేన జగ్రాహ"యనఁగ
భృత్యుఁ[2]డా నంబెన్నఁ బ్రీతిఁ జేపట్టి
యత్యుద్ధతిని దిరువాలూరికడకుఁ
గొనివచ్చి" యేతండ్రి కొడుకవు నీవు
అనయంబు నీ తిరువాలూరి శివుని
వానంబు మనలకు వర్తింప నిజని-
వాన మే నింక నీ వాల్మీకదేవు
సదనాంతరంబున జపము సేయుచును
గదల[3]కుండెదఁ బని [4]గలిగె నేనియును
బిలువు'మయ్యా' యని [5]ప్రియమైనయపుడ,
ఫలము లభీష్టాన్నపానముల్ [6]గజ్జ-
ములు సుగంధద్రవ్యములు భూషణములు
వలువ లాదిగ శైశవక్రీడలకును
వలయుపదార్థము ల్వాంచింప కడుఁగు;
వలసిన వస్తువుల్ వారక యిత్తు,

---

౧. స, ౨. గా, ౩. కుండెదనని, ౪. గలిగదయేని, ౫. ప్రీతియై, ౬. కజ్జె; ఖజ్జ.

లింగార్పితము సేసి లీలఁ గైకొనుము,
జంగమవశుఁడవై చను [1]మెప్పటికిని;
బట్టుఁ[2]గుప్పసమును బట్టుఁ[3]గప్పడముఁ
బట్టుఁజిందియుఁ [4]జాఁప[5]పట్టుక[6]ట్లంబు
గంధమాల్యాదులుఁ గనకంబువాలు
బంధురషోడశాభరణము [7]ల్గొనుచు
నాడుము పాడు మీ వభిమతలీలఁ,
గ్రీడింపు"మని నంబికిని గృపసేయ
నంత నంబియును సమ[8]ధిగతసుఖ ని-
రంతరక్రీడ నోలాడుచుఁ జెలఁగి
యాడు, గుళ్లనుగట్టి హారుని[9]ల్పి మ్రోలఁ
బాడు నొప్పఁగఁ దిరుపాట[10]లు, భక్తి
వరులపాప[11]లకిచ్చు వలయు [12]కజ్జములు,
గరమర్థిఁజలుపు జంగమమనోరథము,
నేపదార్థం బెప్పు డిష్టమైయుండు
నాపదార్థం[13]బ 'యయ్యా' యని వేఁడి,
కొనివచ్చి సుఖియింపఁ గొన్నిదినముల

౧ మెచ్చు; మెప్పు, ౨. కుప్పస; కుబ్బస; కుప్పర, ౩. కప్పరము, ౪. బాఁప(వ), ౫. పట్టె, ౬. ట్ల, ౭. ల్గొనుము; ల్గొమ్ము, ౮. భి, ౯. ల్చి, ౧౦. ల, ౧౧. ఁడి, ౧౨. భ, ౧౩. బుల.

నన నంబిఁ జూచి యానద్ద్వ్యజుండైనఁ
దెల్లంబు వాల్మీకిదేవ¹ండ నిన్ను
వాల్లభ్యమున నేన వలచికైకొంటి
వేదు-²కల్ వొద³లంగ వినయమార్గములఁ
బాడుచు నను దిరుపాటల ననుచుఁ
దా నొప్పెనగు హేమతాళంబు లొసగి
గానవిద్యాప్రౌఢిఁ గరుణింప నంబి
గంబళాశ్వతరుల గంధర్వవరులఁ
దుంబురునారదాదుల మీఱి పాడి
హరుని మెప్పించుచు నభిమతార్థములు
⁴వరదుచేఁ బడయుచు వర్తించుచు⁵ండె
నంత యవ్వనదర్ప మానన్న మగుడు
⁶నంతఁ బుష్పాస్త్రుండు నంతంతఁ జేర
హరుని వాల్మీకేశు ⁷నినయంబు గొల్చు
వరవిలాసినులలో వర్తించు భామ
భావవిలాసవిభ్రమరూపకళల
భావింప నొప్పారు భావజతిలక

౧. ండు, ౨. క వొదలంగ; క లొదవంగ, ౩. వ నవీన, ౪. వరుఁడి, ౫. ండ, ౬. నంతఁబంచా; నంతంతఁ బంచా, ౭. నంతంత, ౮. పం, గొ, లీల.

పరుణీలలామ యుత్త[౧]మభక్తి నిరత
వరమనాచియుఁ దాను బ్రతివాసరంబు
హరుఁ గొల్చు[౨]పుణ్యాంగనావళిలోనఁ
బోరిఁబోరి వచ్చుచుఁ బోవుచునునికి
ధర వయోధర్మోచితక్రియ[౩]లందు
గరమర్థిఁ గూడి యొక్కట యాడి పాడి
పిన్ననాఁటనుఁగోలెఁ బెరుగ నిర్వురకు
సన్నుతానోన్యప్ర[౪]సక్తి పెంపునను
[౫]జిలివిలి వో[౬]వు మచ్చికలు విచ్చి[౭]ల్ల
బిలిబిలి[౮]లజ్జలు బిరుదు[౯]లాడంగఁ
బొందానపాటు చూపులు సుట్టుముట్టి
దంపడిఁగూర్ములు దగులంబు మిగులఁ
గర ముచితోక్తులు [౧౦]గలిగి పెంపెసగ
నరుదొంద హృదయంబు లనఁగి పెనంగ
దరహాసదీప్తులుఁ దట్టుము[౧౧]ట్టాడఁ
జెరలాడు చెయ్వులు సెంగ[౧౨]లిఁగొనఁగఁ
జెనయు ము[౧౩]త్పులకలుఁ జెమట జనింపఁ

౧. ర, ౨. ప, ౩ లెంచి, ౪. శస్తి; శక్తి, ౫. చి(సి)లివి(పి) లి, ౬. వ, ౭. ర్ల, ౮. లజ్జ (ంజ)లు(ల), ౯. ల, ౧౦. గరుణఁ గంపింప; మెరసి పెంపెసగ, ౧౧. ట్టడర, ౧౨. డి; లిం, ౧౩. త్పులకలు.

దనరునిట్టూర్పులఁ దనువెచ్చ దోఁపఁ
దటఁదటఁ [1]దనువుఁ జెమటలు [2]దొడర
వఱలుచు నధరముల్ [3]వఱువట్లు[4]వట్టఁ
దమకంబుఁ గమకంబుఁ దలఁపు లల్లాఁ[5]డ
నవ యవ్వనత్వంబు సన్నలు సేయ
మక్కువ పెక్కువ మతు[6]లు గరంగ
నెక్కుడు రతిచిహ్న లెదురుకొనంగ
స్ఫురియించు కళలకుఁ బ్రొద్దులు సొరఁగ
సురతసౌఖ్య[7]ంబు ప్రసూతి [8]డగ్గఱఁగ
మరున కిట్లుగపడి మఱియంత నంబి
హరుని[9]మెచ్చఁగఁబాడి, "యయ్య నాజియ్య
రమణీలలామఁ బరమనాచి[10]దనకు
రమణిగాఁజేయవే రమ[11]ణతో" నను[12]డుఁ
దన తొంటివిప్రావతారంబు దాల్చి
చని యాపరమనాచి జనకులఁ జూచి
'నంబి [13]యొప్పగువాఁడు నాబిడ్డఁ డతని
కింబుల[14]మీబిడ్డ [15]నిండు' నావుడును

---

౧. ద్రొడ, ౨. దోఁప, ౩. వర, ౪. వు; బ, ౫. ర్వ, ౬. ల, ౭. ంపు, ౮. ద, ౯. మెచ్చగనుయయ్యాయయ్య, ౧౦. నాకు, ౧౧. ణి, ౧౨. చు, ౧౩. యొప్పెడి (డు), ౧౪. నీ, ౧౫. నిమ్ము.

పు[1]లువక ముప్రొద్దు మలహరుఁ గొలుచు
చెలువలకును విలాసినులకు నొక్క-
మగని వరించుట మార్గమే, [2]మీకుఁ
దగునె? యట్లునుగాక ధరణిలో నంబి
కేతల్లి యేతోడు నేయిలు[3]వుట్టు
సీతనూభవుఁ డన్న నేరము గాక,
మెచ్చ దింద్రాదుల మెలుఁతయీనంబి,
మెచ్చునే [4]యెఱుఁగమే మీదాసికొలఁదిఁ
గాంత సాక్షా[5]ద్దేవగణిక సౌభాగ్య-
[6]వంత పద్మినిజాతి [7]వనితాలలామ
దరుణికిఁ బ్రతి[8]వోల్ప ధరణిలోఁ గల[9]రె
తరుణు? లత్తన్వికతంబునఁ జేసి
పదివేలుఁ బదికోట్లు బంధువర్గంబు
బ్రదికెదమని యాసపడి యున్నవార
మిట్టిద[10]యాబిడ్డ యిష్టమేనియును
జెట్టింతుగాక మీ బిడ్డని[11]చేతఁ,
బాయక [12]రోవెల పడఁతికి ని[13]చ్చ

౧. ల, ౨. మా, ౩. పట్టు, ౪. యరుగునే; యెఱుగునే; యెఱుగవే, ౫. ద్దీప; ద్దైవ, ౬. దంతి, ౭. తరుణీ, ౮. గొల్ప, ౯. దె, ౧౦. మా, ౧౧. చేయి, ౧౨. రోయిమా, ౧౩. చ్చి.

వేయేసిమాడలు[1] విప్రేంద్ర యనుడు
నట్టిద కాకంచు హరమూర్తి దనదు
పట్టికి విటరాజ[2]పట్టంబుఁ గట్టి
పాయక నంబికిఁ బడియుగా [3]నిచ్చ
వేయేసిమాడలు వెల[4]య నిచ్చుచును
గుంటెనవోవుచుఁ గొలిచి యాలంజ
యింటికి నంబెన్న యోఁగ [5]నేఁగుచును
ననయంబు [6]శంభుఁ డయ్యభిమతార్థములు
దని[7]పి నంబికి విటత్వంబు సెల్లింప
నిల విదూషకుక్రియ నిరువురవలపు
లలర నీశ్వరుఁడు నెయ్య[8]ంబు పుట్టింపఁ
గరమర్థిఁ దా ననాగ[9]రకు చందమున
సరసోచి[10]తాలాప సంపద [11]దనర
స్మరసంహరుఁడుఁ బీఠమర్దకులీలఁ
బరిచర్యలును బడి[12]పనులు సేయుచును
బాయక నిచ్చలుఁ బరమనాచికిని
వేయేసిమాడలు వెలయ నిచ్చుచును

౧. వెలయనిచ్చుచును, ౨. పట్న, ౩. దెచ్చి, ౪. యొసంగ, ౫. దానేఁగు చ, ౬. శంభుండు నభీ; శ్రీశంభుడభీ, ౭. వి, ౮. ములు, ౯. రి, ౧౦. తక్రియా, ౧౧. దనుపు (ప), ౧౨. పనులును జేయ; పనులుసేయంగ.

నంబియు సతియు మన్మథరతిసుఖసు-
ధాంబుధి నోలాడ [1]నం దొక్కనాఁడు
సురతకేళీలీలఁ జొక్కుచు నంబి
వరమనాచికుచంబుపైఁ జేయి వైవ
నొనర గాఢాలింగనోద్వృత్తి[2]మున్న
చనుమొన ల్లోఁ జను సమతలం[3]బులుగఁ
దిథియుతాష్టమకళా [4]దీప్తాంగ యగుటఁ
బృథుకుచకుంభముల్ బిగి[5]సి సొంపారఁ
దమకించి పెనఁగునుద్ధతి ఘర్మజలము
లమరి చన్నులపొంత [6]నార్ద్రవం బెసగ
సన్నుతస్రగ్విభూషణపతనమునఁ
జన్నుల మలయజచ్ఛవియుఁ దోపంగఁ
గూడుచో సమరతిఁ [7]గ్రమ్ముడి నొవము
వీడి చన్నులమీఁద విడిపూవు లమర
నలిఁదీటుకొను మజ్జనముసేసి గంధ-
మలఁది పుష్పము లిచ్చినట్టి లింగమును
సరిఁ [8]బరిసము సేయు సౌఖ్యంబు దోప

౧. నట్లొక్క, ౨. మున్నె, ౩. బుగను, ౪. దీప్తాంగుఁడగుటఁ; దీప్తాంగ మగుచు, ౫. సె, ౬. సార్ద్రీతవెలయ; సార్ద్రీం బెసంగ, ౭. గ్రుమ్మిడి ; గ్రుమ్మలు; క్రొమ్ముడి, ౮. ప, ౯. స్పర్శనము.

వరుఁ డాత్మలింగభావనఁ [1]జంటిమీఁది
హ_స్తంబుఁ దివియక హాలింగ యనుచుఁ
బ్రస్తుతింపఁగ నంబి పడఁతి వీక్షించి
లింగ నిరంతర లీలావధాన-
సంగతోద్ధతి[2]యొ సంస్మరణాభిరతి[3]యొ
యుచితక్రియార్పణోద్యు_క్తసంభ్రమమొ
రచియింపఁ గామగర్వప్ర[4]కారంబొ
చన్న లింగంబను శబ్ద మె[5]ట్లయ్యెఁ
జన్న లింగ[6]మయేనిఁ జనక యి[7]క్కడన
యడుగు[8]మా [9]నీకు నిత్య[10]ంబును బెట్టు
[11]పడి వేయుమాడలు భర్గుచే ననుఁదు
నాయతి నిట్టు 'లయ్యా' యని [12]నిత్య
వేయేసిమాడలు విభునిచేఁ గొనుచు
నతివయుఁ దాను నన్యోన్యానుప_క్త-
మతి సుఖించుచుఁ దా[13]న మతి[14]తని నసక
మంగ[15]లూరికిఁ బోయి మారారికరుణ
నంగసంగను వివాహంబయి తొంటి-

---

౧. జెంది; నాది, ౨. య, ౩. యు, ౪. తా(లా) పంబో, ౫. ట్లైనఁగ, ౬. ంబేని, ౭. చ్చటన, ౮. ము, ౯. మా, ౧౦. స్థితి, ౧౧. వడి, ౧౨. నిత్తె (చ్చ), ౧౩. ను, ౧౪. తమి; సర, ౧౫. ళూ.

యటులఁ గామసుఖామృ[1]తాంబుధిఁ దేల
విటులుఁ బణ్యాంగనావిసరంబు గొలువ
వ ర్తిం[2]పుచుం[3]డు నవారితరుద్ర-
మూ ర్తి నంబెన్న [4]సమున్నతలీల;
నానంబిమహిమ యే మని ప్రస్తుతింప
నానంబి పూర్వవేశ్యాంగన వరమ
నాచికేళిగృహాంగణమహత్త్వ మదియు
గోచరం [5]బెట్లన్న నాచోడనృపతి
పొలుఁతి వంచత్వంబుఁ బొందుడు శల్య-
ములు గయ కనుచు నప్పుడు సోడ[6]విభుని
యారాధ్యు లోరుముక్కా[7]ళ్వా రనంగ
మారారి సద్భక్తిమహి[8]మ నీక్షించి,
"మనుజేశ! విను గయామాహాత్మ్య, మొక్క-
దనుజుఁ డత్యుగ్రంపుఁదపమాచరిం[9]చి
త్ర్యక్షు నక్షుణమ ప్రత్య[10]క్షుఁ గావించి
యాక్షితి సాష్టాంగ మె[10]ఱఁగి [11]యిట్లనియె:
'యురుశిలా[12]రూపమై యుండంగఁ [13]గర్మ-

---

౧. తాబ్ధి నోలాడి, ౨. ంచు, ౩. డ, ౪. సంపూర్ణభోగముల, ౫. బెట్లున్న, ౬. నృపతి, ౭. మూఁడీ, ౮. ప, ౯. తుంబు చేసి, ౧౦. ర; తి, ౧౧. యేనిట్టు లురు, ౧౨. కార, ౧౩. ధర్మ.

హరమూర్తి నాపీపు నందు మీ[1]యామ్య-
పాదమచ్చొత్తి కపర్ది తద్రుద్ర-
పాదంబుమీఁద సద్భక్తి మానవులు
దారర్థిఁ [2]బిండప్రదాన[3]ముల్ సేయఁ
దార[4]చేసేతఁ బితాళ్లు [5]గ్రహింపఁ
గర[6]మొప్పఁ బితృలోకగతికి నేఁగంగఁ
గరుణింపు' మని వేఁడఁ గరుణించె [7]శివుఁడు;
నక్కజం[8]బొంతఁ గయాసురుమీఁద
ముక్కంటి[9]శ్రీపాద మొక్క[10]ండ కాదె
యన[11] ఘు[12]చెల్లత్తిరువాలూరనంబి-
వనిత వరమనాచి వాటికాభూమి
మృడుఁడు శంభుండు వాల్మీకేశుఁ డర్థి
నెడపక ముప్పదియేండ్లు నిచ్చలును
గొనకొని నంబికిఁ గుంటెనవోవు-
చును వచ్చుచును సముత్సుకతమై [13]నడచు
జాడలు శతకోటి సంఖ్య లుండంగఁ
గూడునే గయ కంప క్షోణీతలేశ"

---

౧. యాద్య, ౨. త, ౩. ంబునే, ౪. చేఁజేత, ౫. గ్రసింప (చి), ౬. మర్థి, ౭. శంభుఁ డ, ౮. ంబంద, ౯. పాదాబ్జ, ౧౦. ండె, ౧౧. ఘు, ౧౨. చెల్ల; చెల్వ, ౧౩. దనర; పడుచు.

యనుచు నుత్తుంగచోడావనీనాథుఁ
జననీక తోడ్తెచ్చి చక్కన నంబి
దరుణి వరమనాచి దద్గృహాంగణము
తిరువీథియందు విధిప్రయుక్తముగ
బిండముల్ దొడిఁదొడిఁ బెట్టంగఁబనుప
దండతండములు బితాళ్లు నొక్కొక్క-
తరములవార తత్క్షణమ యేతెంచి
కర మర్థిఁ జేసేతఁ గైకొని యపుడ
కనుఁగొన రుద్రలోకప్రాప్తులుగను
మును "గులకోటిం సముద్ధరే" త్తనఁగఁ
జనుసూక్తి నృపతికి [1]సహజమై తనర
జను లద్భుతం బంది సంస్తుతుల్ సేయ
నుత్తుంగచోడ మహోర్వీత లేశుఁ
డత్తఱి గురులకు సాష్టాంగ మెఱఁగి,
"జియ్య! సాతఁ తిరుచిట్టంబలేశ!
యయ్య! [2]త్వదీయమాహాత్మ్యంబుఁ దలఁప
నిది యెంత [3]యొకకుక్క యిలుసొచ్చిచొచ్చి
పదపడి నిచ్చలు భాండముల్ ముట్ట
వారింపఁజాలక శ్వానంబు నొసలఁ

---

౧. సత్యమే, ౨. త, ౩. దొక; కో.

జారుత్రిశూలలాంఛన మొత్తి విడువ
నింటిలోన నది యథేచ్ఛాప్రవృత్తిఁ
బంటింప[2]కునికి యాబ్రాహ్మణు లెఱిఁగి
కుక్క మెంగి[3]ల్లు గైకొను భక్తి గలదె?
యెక్కడ వినమని [4]యెంచి నిందింపఁ
గుక్కయే[5] యిది దీనిఁ గుక్క యన్త్రాటి-
కుక్కలు భువిఁ జెడ్డ కుక్కలుగాక:
మెఱుఁగరే శూలి సమీహిత మహిమ?
మఱి "యగ్నినా పచ్యమానా"త్తనియును
లావుమై నది "త్రిశూలనిహతస్య" యన
"ధావతి" యనఁగ వేదములు త్రిశూల-
ధారణత్వము మహత్త్వము మీఱ లను[6]చు
నారంగఁ దచ్ఛ్రుతు లందఱు వినఁగ
సారమేయము[7]చేతఁ జదివి[8]ంప రెట్లు:
వారక బ్రాహ్మణుల్ వడిఁ జూఁగ మ్రొక్క
ఘనుఁడు [9]హావినహాళ్లి కల్లిదేవయ్య
[10]శునకంబుఁ జదివించె శ్రుతిచతుష్టయము

౧. ష్ట, ౨. కుండయా; కునికియా, ౩. ఒల్లు, ౪. యోచి, ౫. యుది, ౬. డు, ౭. చేన; కల్ల, ౮. ంచ, ౯. హావిలినహాళ్ల (హాళ); హావిళమహా, ౧౦. శునికిచే.

గారవిం[1]పుచు మహాకాళయ్యగారు
సారమేయంబు[2]ను జదివించెఁ దొల్లి
గుక్కచే వేద[3]సూక్తులు లెస్స నేఁడు
గ్రక్కునఁ జదివింపఁగా మీకచె[4]ల్లె”
ననుచు మస్తన్యస్తహస్తులై భక్త-
లను గీర్తనలు సేయు నట్లును గాక
యత్యుగ్రుఁ డొకవిప్రుఁ డగణితబ్రహ్మ-
హత్యలు సేయ బ్రాహ్మణులు విధింపఁ
జాలక శ్రుతులు విచారించి చూడ
నేల విచారింప నిది కాదె సూక్తి
మహి శతరుద్రియ్య మధ్యగా యనఁగ
[5]మహానియ్యరుద్రియ్య మధ్యంబునందు
వేయునేల “నమ శ్శివాయచ శివత-
రాయచ” యనుచును శ్రావ్యత మ్రోయ
నొందంగ నారాయణోపనిషత్తు
నం “దోం నమశ్శివా[6]య” యనఁగ నట్లు
[7]సరి[8]విరజా[9]వేళ స్వాహాంతముగను

౧. చు, ౨. చే, ౩. సంకులములు, ౪. ల్లు, ౫. మహిత రుద్రాధ్యాయ, ౬. యైయనఁ; యనఁగఁదా, ౭. సర, ౮. వీ, ౯. వ్ల.

వరుస నందిద "నమ శ్శివాయేతి" యనఁగఁ
జన "ననేన సదృశం జప్యం" బనంగ
ననుపక్తి "నంత్యజో వాఽగ్రజో వాఽపి"
యనఁ "బతితో వాఽపి" యన "యే స్మరంతి"
యన "జపతో వ్యాప్నుయా చ్ఛివం" బనఁగ
నకుటిలమూలపంచాక్షరీమంత్ర
మొకమాఱు సాలదే యుచ్చరించినను
ధర బ్రహ్మహత్యార్బుదంబు లడంచు
నురుశక్తి [౨]మఱియొంటి కున్న[౧]దే యనుడు
సర్వకృచ్ఛ్రాదులుఁ జాంద్రాయణములు
సర్వ[౩]స్వ ధనదాన సత్క్రియల్ భూప్ర-
దక్షిణంబునుఁ దద్వ్రతప్రచర్యలును
భైక్షాన్నములు దర్భపాలధారణము
[౪]వెలయఁగా నేశ్రుతి విధియింప నేర్చు
నలఘు[౫]తర బ్రహ్మహ[౬]త్యాఘసమితి
నిదియ ప్రాయశ్చిత్త [౭]మిట్లయ్యె నేని
మొదలివేదాగమ ముఖ్యకృత్యములుఁ

౧. దు, ౨. యొండునఁగున్నదేయనుచు, ౩. ద్రవిణదాన; ౭. మే. ధర్మధురీణ, ౪. వెలియు, ౫. తీర, ౬. త్యార్బుదమున,

[1]జను భాట్టీకృత సహస్రన్యాయవిధులు;
జన విహితాష్టాదశ స్మృతిక్రియలు
ధరఁ గుదృష్టముల మిథ్యల యెట్టులైన
ధర నెన్ని బ్రహ్మహత్యలు సేయరాదు
నిల నింతటన పాయునే [3]యెన్ని [4]మాటు
లలరి "నమశ్శివాయ" యనంగరాదు
నెందైన నిటువంటి వెద్దీనె ననిన
గొందిఁ [5]గట్టుమనిన చందము ల్గలవె?
యెప్పాట వినఁబడ దిది గుదృష్టంబు
సెప్పకుఁడీ యప్రసిద్ధం[6]బు విధులు
విధిపూర్వకం బగు విధి గల్గెనేని
విధియిం[2]పుఁ [8]బొల్లు[7]రే వినుచుండు[9]డనుచుఁ
బర[10]ంగు దధీచి శాపంబుచేఁ జెడిన
చిరతరమోవృత[11]దుష్టచేతస్కులార!
మును గౌతముని శాప[12]మున భ్రష్టులైన
* [ఘనతమోపహతసంగతచిత్తులార!

---

౧. జన, ౨. యుత, ౩. యిన్ని, ౪. మాటు, ౫. గట్టెడి మను, ౬. ంపు, ౭. ంప, ౮. ఁడే, ౯. డనుఁడు; ననుచు, ౧౦. గ, ౧౧. దృష్టి, ౧౨. మునను భ్రష్టైన.

* కుండలులలోని పంక్తులు పూర్వముద్రణమున లేవు.

పలుమాఱు భృగునిశాపంబునఁ జెడియుఁ
బలుక జూడఁగరాని పాషండులార!
పరువడి వ్యాసుశాపంబునఁ [1]జెడిన
నరకాత్ము లగు సమున్నతచిత్తులార!
శ్రుతి "నయ మర్థో న రోచతే" యనఁగ
హిత మగు[3]నే [4]మీకు నీశానుమహిమ]
విధిలేక యాజగద్విభుఁడు [5]రాముండు
విధిపౌత్రు రావణు వధియించినట్టి
హత్యఁ [6]బాపికొనంగ హరుఁ బ్రతిష్ఠించి
సత్యపంచాక్షరీ జపములయందు
నరియమరాజు పంచాక్షరీసిద్ధి
హరుఁగూడఁడే బ్రహ్మహత్య[7]కుఁబాసి
సతతపంచాక్షరీ స్మరణఁ [8]జందుండు
ధృతిఁబొందెనే హత్య ద్విజు దండిఁ జంపి?
కాన పంచాక్షరీ కల్ప[10]నకంటెఁ
దా నున్న దే విధి ధర [11]నట్లుఁగాక
ధృతి "నేకమేవాఽద్వితీయం" బనంగఁ
దతి "నద్వితీయాయతన్థే" యనంగ

౧. జెడ్డ, ౨. పుత్ర, ౩. నో, ౪. నీ, ౫. రాఘవుఁడు, ౬. వా, ౭. లు, ౮. జండీను, ౯. రి, ౧౦. ంబు, ౧౧. సి.

గుఱి "న ద్వితీయోఽస్తి కుత్రచి" త్తనఁగ
నుఱక "ఏకోరుద్ర ఉచ్యతే" యనఁగ
మునులయనాల్లింగ మని పల్కుచుండ
జెనసి జగంబులు శివునంద యడఁగుఁ
బాయక మఱియట్ల "పంచాక్షరేస్థి-
తా" యన నాజగత్ప్రళయకాలమునఁ
దలఁప "వేదాశ్చ శాస్త్రాణి" యనంగ
నిల "నుపమంత్రై రనేకథా" యనఁగఁ
దఱిఁదఱి శ్రుతులు శాస్త్రములు మంత్రములు
నెఱిఁ*"బర స్తత్రైవ నిర్గతా" యనఁగఁ
బరఁగుచు సకల శబ్దప్రపంచంబు
వఱున నట్ల "యథా శివ స్తథా" యనఁగ
నడఁగు జనించుఁ బంచాక్షరియందు
నడరు తన్మహిమ యేమని ప్రస్తుతింప
నట్టిపంచాక్షరి యతులమహాత్త్వ
మిట్టిద యని మీర లెఱుఁగక భ్రమసి
మదియించి పలుకు దుర్మతములు గాక
యది గుదృష్టం బెట్టు లనవచ్చు? మఱియు

---

౧. రు, ౨. ర, ౩. యు నప్పం, ౪. గిన, ౫. గ, ౬. ర, ౭. తులకు. * జన స్తత్ర వినిర్గతో.

క్షితి "బ్రహ్మహత్యాం చ కృత్వా" యనంగ
[1]బ్రతి "ముచ్యతే సర్వపాపై" రనంగ
ఖ్యాతి [2]వేదాంతసంగతి "పాతకోఽప-
పాతకేభ్యో" యన "పూతో భవతి" య-
నను త్రిపుండ్రోద్ధూళనమునన చేసి
యనుపమంబగు బ్రహ్మహత్యలు వాయు,
నెన[3]యఁ బంచాక్షరి యింత యేమిటికి
నని[4]యొ యిది గుద్దృష్ట మనుట వెంశీయును
ధర శ్రుతు "లేనాంసి తరతి" యనంగ
వరుస "స రుద్రీభవతి" యన నిట్లు
దనరారు రుద్రాక్ష [5]ధారణంబునను
ననుపమం బగు బ్రహ్మహత్యలు వాయు,
నెన[6]యఁ బంచాక్షరి యింత యేమిటికి
ననియొ యిది గుద్దృష్ట మ[7]నుట వెండి[8]యును
నవికల్ప[9]మతిఁ బ్రాంతకావహం బనఁగ
భువి "బ్రహ్మహత్యాం వ్యపోహతి" యనఁగ
దనరారు నిర్మాల్యధారణంబునను
ననుపమం బగు బ్రహ్మహత్యలు వాయు,

---

౧. త, ౨. వేదోక్త, ౩. యు, ౪. యొ, ౫. ధారణ చేత, ౬. యుసు, ౭. గు, ౮. యిటు, ౯. ల్పగ, ౧౦. ప.

నెనయఁ బంచాక్షరి యింత యేమిటికి
ననియొ యిది గుదృష్ట మనుట వెండియును
వినఁ రేమి "పూతో భవే త్పశు" రనఁగఁ
జెనసి "మత్స్యాదాంబుసేవనం" బనఁగఁ
దనరు పాదోదకధారణంబునను
ననుపమం బగు బ్రహ్మహత్యలు వాయు,
నెనయఁ బంచాక్షరి యింత యేమిటికి
ననియొ యిది గుదృష్ట మనుట వెండియును
మేలుగా "వ్యంహో వ్య మీవేతి" యనఁగ
వ్రాలి "పూతా తే భవంతీతి" యనఁగఁ
దనరుప్రసాదైకధారణంబునను
ననుపమంబగు బ్రహ్మహత్యలు వాయు,
నెనయఁబంచాక్షరి యింత యేమిటికి
ననియొ యిది గుదృష్ట మనుట వెండియును
గర "మఘోరా పాపకాశినీ" యనఁగ
ధర "బ్రహ్మహత్యాయుతాని చ" యనఁగఁ
దనరారు శివభక్తదర్శనంబునను
ననుపమం బగు బ్రహ్మహత్యలు వాయు,

---

౧. దే, ౨. ద, ౩. నాత్త, ౪. చేత, ౫. యుపం, ౬. రును, ౭. నన.

నెనయఁ బంచాక్షరి యింత యేమిటికి
ననియెు యిది గుద్రుష్ట మనుట వెండియును
దండడి "బ్రహ్మహత్యాంచ" యనంగ
నంద "ఏతే ఘ్నంతి" యనఁగ నత్తుదిని
నత్రిఘ్నవర్ణంబునందు "సోమః ప-
విత్ర మత్యేతి"నా విశ్వైకజనిత-
మయిన యీశుఁడ "యుమయాసహావర్త-
త" యితి "సోమ" యనంగఁ దనరుఁ గావునను
బనుగొన సోమాంతిక పఠనంబునందు
ననుపమంబగు బ్రహ్మహత్యలు వాయు,
నెనయఁ బంచాక్షరి యింత యేమిటికి
ననియెు యిది గుద్రుష్ట మనుట వెండియును
బ్రతిభమై "యద్వ్యక్షరం నామ" యనఁగ
రతి "శివ ఇత్యక్షరద్వయం" బనఁగ
శ్రుతి "య శ్శివేతి స్మరే త్కశ్చి" దనఁగ
స్థితి "శివమేవానుచింతయే" త్తనఁగఁ
జని "య శ్శివేతి వాచం వదే" త్తనఁగఁ
దనరు నిత్యాదిసూక్తములు దలంపఁ
బాశుపతం బేల పక్షిక్షిఁ దొడుగ

---

౧. చు, ౨. ట, ౩. ద, ౪. బుగ, ౫. యా, ౬. ధ్రు

సి శివస్మరణ దా నేల హత్యలకు
[1]శివసమర్చనముఁ జేసినఁగాని పోని
శివనామ ముచ్చరించినఁగాని పోని
యంతపాతకము సేయఁగలేఁడు మనుజుఁ
డంతపాతకము నున్నదియు లేద[2]నఁగ
సిద్ధపంచాక్షరిచేఁ గాని పోని
బద్ధపాతకకోటి పంక్తు లున్నవియె
యొక్క విభూతియు నొక్క రుద్రాక్ష
యొక్కపాదోదక మొక్క నిర్మాల్య
మొకప్రసాదంబును నొకసోమ[3]శరన
మొకభక్తదర్శనం బొక్క[4]డొ[5]క్కండు
సకలభవంబులు సకలదుఃఖములు
సకల హత్య[6]లఁ బాపఁ జాలు నన్నట్టి
వచనంబు [7]లివిగావె "వచనాత్ప్రవృత్తి"
"వచనాన్నివృత్తి" రన్వచనం[8]బ కాన
నిఖిలధర్మాధర్మనిర్ణయోక్తములు
నిఖిలశివాధిక్యనిర్ణయోక్తములు
నవిరళాచార వర్ణాశ్రమంబులును

---

౧. శివు, ౨. నిన, ౩. స్మరణ, ౪. క, ౫. యు; ౬, ౭. లవె కావె, ౮. బుగావ (౯).

వివరింప నవియును వేద^1మూలములు
యవియు మీ^2కెట్లు దా మనుమతంబయ్యో
నివియు ^3మా కనుమతం బెట్టులు గావు
భువి నిదానీంతనంబులో ^4సమా^5శ్లేయ-
^6వితలో ^7ప్రక్షిప్త కలితవాక్యములో
కతిపయ స్వసమ^8య గతపాక్షికములో
^9స్తుతిఫలంబులో ఫలశ్రుతులో కా^10దేనిఁ
బూని శ్రౌతస్మార్త భూతసూత్రప్ర-
తానముల్ గావొ యెత్తఱి నిషేధములో
నెఱియు ^11ధర్మాధర్మనిర్ణయంబు^12లకు
మఱి లేదు వచనప్రమాణంబు గాన
నెఱియు శివాధిక్య నిర్ణయంబులకు
మఱి^13యొప్ప వచనప్రమాణంబు^14భక్తి-
మహిమఁ బ్రత్యక్షప్రమాణము లూ^15పి
మహితపంచాక్షరీమహిమ నిర్మింతు
జనులకునెల్ల దృష్టప్రత్యయముగ

---

౧. మోద, ౨. కెట్టుల నను, ౩. మీ, ౪. సమాశ్లేయ; గూరుషేయ, ౫. ప్రత్యక్ష, ౬. యుగతిపాక్షి; యాగతసాక్షి, ౭, శ్రుతి, ౮. వే, ౯. శివాధిక్య, ౧౦. న, ౧౧. లేదు, ౧౨. గాన, ౧౩. ప.

ననుచు ముందటి బ్రహ్మహత్యాత్ముచేత
నుపవాస౧ములు మున్న యునిచిన౨యట్టి
కపిలధేనువునకుఁ గసవు ౩వైపింప
మొదవు౪దా ముట్టక మూర్కొనకున్న
యదియ౫ట్ల పె౬ట్టు పాపాధిక నీవు
నలరి “నమశ్శివాయ” యనుచు శివుని
వలగొని ౭కస వింత వైచు నావుడును
వాయారఁగ “నమశ్శివాయ నమశ్శి-
వాయ” యనుచు౮వాఁడు వచ్చి వైచుడును
నెదురుగా నేతెంచి యెప్పటికసవు
మొద వందుకొని మేసె ముదము దలిర్ప
సకలభూసురులు మస్తకతటన్యస్త-
ముకుళితహస్తులై మ్రొక్కఁగ నంతఁ
బాటిగా నిజ్జగత్ప్రత్యయంబు౯గను
దేటపడఁగ శివాధిక్యము మఱియు
శ్రుతిమూలమగు మహాస్తోత్ర మన్ కృతిని
ప్రతి౧౦భ దలిర్ప సంపాదింపఁ ౧౧డెట్లు
కావున౧౨మీఁదు ౧౩ప్రఖ్యాపితమహిమ

---

౧. మట, ౨. మీఁద, ౩. వేఁయుంప, ౪. నా, ౫. ట్లువె, ౬. ట్టి, ౭. మఱి మేఁత, ౮. నట్ల, ౯. ననూ, ౧౦. దలిర్పంగ, ౧౧. శె, ౧౨. నేఁడు, ౧౩. వి.

మావశం బగునె సమాఖ్యా గావింప"
ననుచుఁ జోడనరేంద్రుఁ డంకించ నంత
ననఘుండు నోరుముక్కాళ్ళారునంబి
"వనిత వరమనాచి వాటికామహిమ
జనులకునెల్ల దృష్టము సూపెఁగాన
యదియ వారాణసి, యదియ శ్రీశైల,
మదియ తాఁ గేదార, మది గయ, యదియ
యవిముక్తభూమి దా ననుచు నంబెన్న
ప్రవితతమహిమయుఁ బరమనాచిగృహ-
వాటికాస్థలమహత్త్వము జంగమంబుఁ
బాటిగా వివరించి పరమార్థమిదియ"
యనవుడు హర్షించి యాశివద్విజుని
వనిత "పుత్త్రులు నాకు వట్టిరిలేని
నంబిపే రిడుదాన నలి నెంధటైన
నంబికాధవునాన" యనుడు జంగమము
మానంబి కరుణానముగ్రతఁ జేసి
పూని సత్పుత్త్రుండు పుట్టెడు ననుచు
లలి నాలలాము ఫాలమున విభూతిఁ
దిలకంబుగాఁ బెట్టి దీవించి చనుడు

---

౧. డ, ౨. నాఁగ, ౩. క్తి, ౪. ంప, ౫. లంబునభూతి.

మగువ[1]కంతన నెల మసలె గర్భంబు
మగువ యేరాలికి మసలె గర్భంబు
సతులకు నవమాస సంప్రాప్తిగాఁగ
సుతులుజనించి రుత్సుకత నిద్దఱకుఁ
[2]బెరియ [3]నంగయు నంబి పేరిడఁ దోడి-
తరుణి[4]యుఁ బతిఁగన్న తండ్రి పే రిడుడు
ననుదినవర్ధమానాంగు లై యింతఁ
దనయు లిద్దఱుఁ బెర్గఁ దరుణు లిద్దఱును
నొక్క[5]టఁ గావేరి యుదకంబులకును
జక్కనఁ దనయులఁ జంకలఁ బెట్టి
కొనిపోయి నదిదరిఁ గూర్చుండ డించి
తనుధర్మములకు న త్తరుణు లేఁగుడును
నంబియు ననుజుండు నలిఁ బ్రవాహోద-
కంబులఁ దరిఁ[6]జెర్లు గట్టియాడంగఁ
గసిమసఁగుచుఁ దీవ్రగతి నాబి నొక్క-
మొసలి యేతెంచి సముద్ధతిఁ బట్టి
కొనిపోవ దరినున్న కొడుకు వాపోవ
విని యుల్కిపడి బలువిడివచ్చి నంబి

---

౧. వి సంతిన, ౨. పి, ౩. నంబియా, ౪. యువతి, ౫. నా-డా, ౬. జరు(౯;౮).

నొకమొసలీడ్వంగ నువిద వీక్షించి
"యకటకటా!" యంచు "హా" యంచు గర్భ
మడఁచికొంచును "దేవుఁడా" యంచు నేలఁ
బడి పొరలుచు సుతుఁ బసవుచు వాయి
విడిచి యేడ్చుచును గావేరిలోఁ దాను
బడఁబోవుచును శోకపారవశ్యమునఁ
బొడిఁబొడిఁబొక్కుచుఁ బొగులుచున్నంతఁ
దొడరంగఁ బలియు బంధులు నేఁగుదెంచి
సంబరంబులు నేసి శైవోక్తవైది-
కంబుగా నాముష్మికక్రియల్ సలుపఁ
"గనుతెప్ప మాటైనఁ గనలేదు తల్లిఁ
దనయుండ! నిను బాసి తరియింపఁగలనె?
చంక డిగ్గిన జీవి సనిమెడు తల్లి
నింకిట నిను బాసి యేఁగంగఁ గలనె?
ప్రక్కఁ బాసిన భయపడియెడు తల్లి
నిక్కడ నిను బాసి యే నోర్వఁ గలనె?
వెన నిల్లు వెడలిన వెతఁబడు తల్లి
మొసలి కొప్పించి యిమ్మలఁ మనఁగలనె?
నెట్టణఁ జెమటయే నెత్తురన్ తల్లిఁ

---

౧. రః గ, ౨. నంత, ౩. క్తి, ౪. డు, ౫. రిధ, ౬. దె.

బట్టి నిన్బాసి యేఁ బ్రదుకంగఁ గలనె?
యన నేల వేయు నా[1] యన్న ! నేరంబు
నినుఁ బాసి నిలువంగ నేర్తునే?" యనుచు
నున్నపుత్త్రుని మన్కి యున్కియు రూపు-
సన్నపుత్త్రుఁడు నొక్క చందంబ కాన
యేశాలి సుతుమాట లెప్ప డాలిం[3]చుఁ
గూరిమి సుతుపలుకులు నప్డ తలఁచు,
నేరాలి సుతు నెప్డ డీక్షించు నపుడ
గారాబుసుతునియాకారంబుఁ దలఁచు,
నేరాలి సుతు నెప్డ డెత్తి ముద్దాడు
నారంగ సుతు ముద్దులాటఁ దలంచు
మడఁతి వైరియనంగ మఱి యాక్రమమున
నుడుగని పుత్త్రవియోగదుఃఖాగ్ని
వందుచుఁ గందుచు వనరుచు నాత్మఁ
గుందుచు డయ్యుచుఁ గ్రుయ్యుచు సుతుఁ ద-
లంచి తలంచి ప్రలాపించు నవిద
సంచలమతినట్ల చరియింపనంతఁ
గడఁగి మఱందిసుతు గర్భాష్టకమున
వడుగుసేయంగ నవ్వటుకుమారుండు

---

౧. యున్న, ౨. బుగా, ౩. ంచ.

సరసరఁ జని నమస్కారంబు[1] సేసి
పెరియనంగను స్వర్ణభిక్షంబు వేఁడ
భిక్షంబుదీవించి పెట్టు[2]చో సతిక-
టాక్షంబు[3]లందు దుఃఖాశ్రులు దొరఁగ
నెక్కొన్నఁ [4]బుడిఁబుడినీరు గన్నులను
గ్రుక్కికొంచును సమాకులతఁ బొందుచును
నిచ్చట సుతుఁ [5]దల్చి యేడ్చినఁ దిట్టు
వచ్చినంచును గడువయు నొక్క[6]చుమ్మ-
యును గొంచుఁ గావేరియుదకంబులకును
జనుక్రియఁ జని తొంటి చక్కనిసుతుని
బనవుచు నేడ్చుచుఁ బలవరించుచును
దనయుని బేర్కొని తఱిఁ[7]దఱి రాచి
"హానంబి! హానంబి! హానంబి! నంబి!
యోనంబి! యోనంబి! యోనంబి! నంబి!
నానంబి! నానంబి! నానంబి! నంబి!
యే నమ్మి యే నమ్మి యే నమ్మి చెడితి,"
ననుచు వాచఱవంగ నంతకుమున్న
యనఘుండు సంతతోద్యద్గుణస్ఫూర్తి

౧. ఁజే, ౨. దున, ౩. నం, ౪. జడినుడి, ౫. ద్రవ్వి, ౬. చట్టు, ౭. రాచిరాచి.

హృతభవజార్తి దిగంతైకకీర్తి
గతనతజన సముత్కర సంశ్రితార్తి
గమనియ్యా సకలజగద్ద్వీపవర్తి
ప్రమథేంద్రమూర్తి సేరమచక్రవర్తి
యొడయనంబిని సుమహోదాత్తయశుని
మృడ[౧]సమాహితదయామృత వార్ధిమగ్ను
సద్యఃప్రసాదభాస్వద్భక్తియుక్తు
హృద్యానవద్య మహిమ్మచరిత్రు
నతులదృష్టప్రత్యయారూఢమహిము
రతిపతిసన్నుత రతికళాదక్షుఁ
బ్రత్యక్షకలియుగప్రమథగణేశు
నిత్యశివానంద నిరవధిసౌఖ్యు
వినుతసాక్షాద్విటవేషితరుద్రు
ననుపమగానవిద్యాపండితేంద్రు
విత్తేశసఖుసఖు వీరసద్భక్త-
సత్తము సర్వప్రసాదసర్వాంగు
విస్మయాభిష్టుత విశ్రుతవ్రతుని
సస్మితముఖవికస్వరుని భాస్వరుని
శ్రీలింగపరికచు శివపదాచార్యుఁ

---

౧. సమన్వి(ర్చి)త.

బాలితస్వసమయ ప్రథిత ప్రతాపు
సందర్శనము సేయఁ జనుదేర భక్త-
బృందంబు సెలఁగ నంబియు నెదురేఁగి
యన్యోన్య సందర్శనాన్యోన్యవినమి -
తాన్యోన్య వాగ్బంధురాలింగనాది-
సముచిత సవినయ సత్కారపూర్వ-
కముగఁ జేరమరాయగణనాథుఁ దోడు-
కొనిపోయి భక్తసంకుల సహితముగఁ
జెనసి లింగార్చనల్ సేయించుతఱిని
శీలసంపన్నుండు సేరమవిభుఁడు
"వాలుమా లింగంబు పల్లెరంబునను
వడ్డింపనిమికి నొక్క వ్రతము"నావుడును
"వడ్డింపఁగారాని వ్రత మేమి" యనుచు
నంబెన్న లేచి విన్నప మాచరింపఁ
"బంబి యీశుఁడు వ్యాఘ్రపాదునిమ్రోలఁ
దాండవ మాడ నుదాత్తత వెలుఁగఁ
బొండురాంగుని యాప్య పాదదర్శనముఁ
గావించినప్పుడ కాని వడ్డింప
మీవిధంబున బాస యిది వ్రతం" బనుడు

౧. ంధనా, ౨. దగ దొక్క, ౩. వంబాడు, ౪. యర్పింప, ౫. బునన.

సట్టిద కాకంచు నప్పుడు నంబి
సిట్టితాళము వ్రేసి చేయెత్తి మ్రొక్కి
శిరుపాట నీశుఁ బ్రార్థించి [1]నుతించి
“యురుదయాంభోధి యిం[2]దొక్క మా ఛేల
చిక్కక నిచ్చలుఁ జేరమ ప్రోల
నొక్కొక్కమాఱు సెన్నొలయఁదాండవము
నటియించుచును శివనాథ మన్నాథ
పటుకాంతి వెలుఁగు నీపాదంబుఁ జూ[3]పి
రక్షింపవే” యని రా[4]యండుఁ దాను
నీక్షితి సాష్టాంగ మొఱఁగుడు శివుఁడు
నప్పుడు లింగపూజాంతంబునందు
నొప్పా[5]రు [6]నిజతాండవోద్ధతి నిలిచి
చేర[7]మ [8]మురజల ఝంకృతుల్ [9]సెలఁగ
నారూఢవాద్య [10]చూర్యాదులు మొఱయ
మ[11]లువక చిణిచిణి మణిఘుర్ఘురములు
సెలఁగ నాడుచుఁ దీర్పు చేఁ గాలుసూప
మఱినంబియును జేరమయు భక్తతతియుఁ

---

౧. వేడుకను, ౨. దొంక, ౩. ప, ౪. యుడు, ౫. ర, ౬. నరు, ౭. ము, ౮. యావుజి; యావజ, ౯. దనర, ౧౦. తూర్యా. ౧౧. లయక.

దళిందళిఁ బ్రొక్కుచుఁ దద్ద్రవ్యతోఁ బ్యాప -
నం బాచరించి గణములు నేరమయు
నంబియు లింగార్చ[1]నంబు సెల్లించి
కడుఁ బ్రీతి నిష్టలింగప్రసాదంబు
లడర భోగింపుచు నట్లహర్నిశము
శివభక్తితత్త్వగోష్ఠీ ప్రసంగమునఁ
దివురుచుండఁగఁ గొన్నిదినములు సనిమోఁ
జక్రవర్తియు నిజాస్థా[2]నంబు సన ను-
పక్రమించుడు నంబి వటుభక్తియుక్తి
వాహనవస్త్ర సువర్ణాభరణ స-
మూహా ద్యభీష్టార్థ ముఖ్యవస్తువు[3]ల
రాజితకీర్తిఁ జేరమచక్రవర్తిఁ
బూజి[4]ంచి తద్భ[5]క్త పుంగవు ల్దాను
ననుపంగ విచ్చే[6]సి యయ్యావలూరఁ
దనరారుఁ గావేరి దరి నొక్క శివగృ-
హోపకంఠమునఁ గొల్వుండఁగ[7] నవల
వాపోవుచున్న య వ్వనిత యార్తార-
వంబును [8]హాహారవంబు నాలించి

౧. నమును జె, ౨. నికిఁ జన, ౩. లు, ౪. ంప, ౫. ర్తి, ౬. సెన, ౭. నపుడు; నంత, ౮. నాహా.

"నంబి ! యిదేమిరా నంబెన్న! నంబి !
చెడితిరా" యని యేడిచెడి నొక్కవనిత
గడుఁజిత్ర మరయుఁడు "[1]గ్రమ్మన" ననుడు
దూతలు నని "యేల దుఃఖించె దిచట,
నాతి! యే[2]యూరిదానవు? నామ మేమి?
యెక్కడనుండి నీ వేతెంచి తివ్వ?
డిక్కడ నీ వేల యేడ్చెద?" వనుడుఁ
"బోదురుగాక మీ పోయెడి త్రోవ,
మా దిక్కరయ నేల? మాకును మీకుఁ
గారణం బేమేనిఁ గలదె? మే మాడు
వారము, బ్రాహ్మణవార, మ[3]ట్లయ్యు
నేకతం బొక్కతె యే నున్నమెడకు
మీకు వచ్చుదు ధర్మమే యేఁగుఁ" డనిన
"నోయమ్మ ! యేఁగక యుండెద మెట్లు?
వామెత్తి యేడ్చుచు వాచరచుచును
[4]బనవుచు నఱచుచుఁ బలవరించుచును
బనుఁగొన నెన్నుచుఁ బలుమాఱు నిట్లు
నంబి నంబెన యని నంబిఁ బేర్కొను వి-
ధంబేమి? యెక్కడితల్లివి? నంబి

---

౧. క్రమ్మర;క్రమమున, ౨. వూరి, ౩. ట్లయిన, ౪. బనుపుచు

మెక్కడిసుతుఁడు? [1]నిదేమియాశ్చర్య?
మిక్కితయున్నట్టు లెఱుఁగింపు' మనిన,
"హరు[3]ఁడు గుంటెనవుచ్చ నట వేయుమాడ
లకుదుగాఁ బడిగొను నటె యనుదినము
నంబి నా నొక్కగణం బంచు జంగ-
మంబు సెప్పఁగ విని మరులొంద నంబి
పేరు వెట్టితి నొక్కబిడ్డని, యట్టి
గారా[4]ముపట్టి యిక్కడఁ [5]జెర్లుగట్టి-
కొని యాడునట్టి [6]యెక్కుడు ముద్దుపట్టిఁ
గొనిపోయెఁ బుత్త్ర గ్రక్కునఁ [7]బట్టి మొసలి,
[8]నడపాడు ప్రాయమున వఱుతఁ గలసె,
నడరఁ బుత్త్రుఁడు సచ్చి నైదేఁడులయ్యెఁ,
గుంటెన[9]వుచ్చు మిక్కుటపు భక్తుండు
గుంటెన[10]వోవు మిక్కుటపుశంభుండుఁ
బడిఁ గొను నంబియుఁ బడివెట్టు శివుఁడుఁ
గడునర్థి నాసుతుఁ గావంగ లే[11]ర;
తన పే[12]రిన నంబెన్నఁ దాఁ గావవలదె?

---

౧. నీవెక్కడితల్లి (డనంబి), ౨. డ, ౩. ని, ౪. ప్రు, ౫. చరుల్; జర్లు, ౬. యిక్కువ, ౭. దిట్ట, ౮. నడచాటు (డు); నడుపాడు, ౯. బోవు, ౧౦. బుచ్చు, ౧౧. క, ౧౨. రు.

తననంబి నంబిగదా యని శివుఁడు
తననంబి నంబి మున్ దాఁ గావవలదె?
యన నేల నేయుఁ దా నది యట్లు లుండె,
వినుము నేఁ డే నేడ్చు విధముఁ జెప్పెదను:
నేఁడు నాయేరాలి నిజసుతు వడుగు
వాఁడు వాఁడును నొక్క వయసుగావునను
జెచ్చెర సుతుఁ డున్నఁ జేయనే నేఁడు
నచ్చుగా వడుగంచు నడలు పుట్టుడును
నచ్చోట నేడ్పుట యవినీతి గాన
యిచ్చోట నొక్కతె నేడ్చెద" నంచు
వృత్తాంత మంతయు విఁనుపింప దూత
లత్తఱి నంబెన్న కట్లు విజ్ఞాప-
నం బాచరింపుడు నంబి నవ్వుచు ర-
యంబున నప్పుడ యతివఁ దద్వరుని
వెసఁ బిలువఁగఁ బంచి ' "విప్రుఁడ నొసలి
పసుపు[1] నతఁతలును బరి[3]కి[4] గడ్డంబుఁ
బసుపు జన్నిదముల పసుపు ని దేమి?
మెస[4]గంగ నింట నేఁ డేమి శోభనము?

---

౧. ని, తా. టు, 3. గి, క. గంధంబు, ౨. గుట, ౬. మొ.

నందను లెందఱు ? నామంబు [1]లెవ్వి ?
వందుచు నేఁడేల వనిత యేడ్చెడిని ?"
ననవుడు "నేఁడు నా యనుజు ద్వితీయ-
తనయుని వడుగు, సంతానంబు లేక
పెద్దగాలంబు మా ప్రియభార్య యుండ
నిద్దఱు జంగము లేతెంచి నంబి
నంబి యనుచు నొక్క నరుని గీర్తించి
యిం[3]బున బత్తి మా [4]యింటిఁ బైకొలిపి
పుట్టెడుఁ దనయుండు పుట్టెడు [5]నతనిఁ
బెట్టుఁడు నంబెన్న పేరంచు నరుగఁ
బుట్టెఁ బేరిడుదునాఁ బుట్టెనో పుత్త్రుఁ
డట్టునుగాక దైవాధీనముగను
బుట్టెనో యెఱుఁగము పు[2]ట్టుడు నాతి
వెట్టె నా నంబెన్న పేరంత వాఁడుఁ
గావేరిలోఁ [9]జెర్లు గట్టియాడంగ
వావిరి మొసలి వే వచ్చి భక్షించె
మఱిలేరు పుత్త్రులు, మద్భార్య భ్రమసి
పెఱమనుష్యుని పేరు వెట్టిన నరుఁడు

---

౧. లేమి, ౨. మ, ౩. బనబి(గొ)ండి, ౪. యింటిపై, ౫. నంబి, ౬. డు, ౭. బై, ౮. రె, ౯. జ(జె)రుల్.

గావంగఁ బ్రోవంగఁ గలఁడె వాల్మీక-
దేవుని పేరేల ధృతిఁబెట్టఁడయ్యె?
హరుఁడుగుంటెనవోవు నటె, వేయుమాడ
లరుదుగాఁబడి వెట్టు నటె, నంబి కట్టు
నంబియు గింబి వినాకి గినాకి
నంబి పేరిడ్డ తనయుఁ గావలేరె?
గొడ్డువీఁగి కనినకొడుకు గారాము-
బిడ్డని మొసలి కొప్పించితిఁ గాక,
చెచ్చెరఁ గొడుకున్నఁ జేయనే నేఁడు
నచ్చుగా వడుగంచు నహరహంబునను
నది యాదిగా దుఃఖ మారద యింక;
నది యట్టు లుండె మా కరుగంగవలయు,
ధర శివద్విజుఁడ స్వాధ్యాయపరుండఁ
బరమపతివ్రత భార్య సద్భక్తి-
యుత, మిథునమునకు [1]యోగ్యుల మేము
రతి నుమామాహేశ్వర ప్రీతిగాఁగఁ
దగిలి పెట్టినయట్టి దాన మనంత
మగు "దాన మణ్వాపి చాక్షయం" బనఁగ
ననువు దీపింపఁ దా నర్థి నవ్విప్రుఁ

౧ ద, శి. క్త.

గనుఁగొని నంబెన్న గన్నుల నగుచు
"నీవు సెప్పినయట్ల భూవిబుధేంద్ర
భావింప నీకొండు పాన లేమిటికి?
నంబి నంబియ సీతనయు మన్నె నేని,
నంబి గింబియ సీతనయు మన్నఁ డేని,
నానంబి శివునంబి యయ్యెనేనియును
నానంబి[1] పతి శివుఁ డయ్యెనేనియును
హరుఁడు గుంటెన వోవు డది దథ్యమేని
హరుఁడును బడివెట్టు డది దథ్యమేనిఁ
బంబి నీ తనయుండు బ్రదికెడుఁ గాక!
నంబరపడ నేల? చర్చింప నేల?
నంబియుఁ గలిగి పినాకియుఁ గలిగి
సాంబసద్భక్తి మహత్త్వంబుఁ గలిగి
నీయగ్రసుతుని సన్నిధియుఁ గల్గినను
జేయుఁ దా వడుగుఁ జెచ్చెర నేఁడ" యనుడు
"వత్తురే చచ్చినవారిర లేనాఁట
నుత్తములకు నిట్లు యోగ్యమే బొంక
భవభక్తిపరుఁడవు భాగ్యవంతుఁడవుఁ
దవిలి మ మ్మడఁకింప ధర్మమే నీకుఁ

---

1. నంబినంబ, 2. ఱ నే.

బాలుపుగా నారిన పుండ్లఁ గోలలను
గోలఁకినక్రియఁ గెలఁకెదు సుతుచావు,
వలదు నీవడఁకింప వారక మమ్ముఁ,
బిలుపించి దానంబు వెట్టవేనదియు
దేనికి రప్పించితివి మహాపురుష!
దీనుఁమని యేము ధృతిమాలి చెదవు,
మును మహాదేవుని ముట్టంగఁగొలిచి
యనుభవించెద వైహికాదిభోగములు,
ఘనుఁడ మ మిట్లాడికాని యీవింక
ననుభవింపవె మీఁద నపవర్గసుఖము?
వేయేల నీయీఁగి వేయును వచ్చెఁ
బోయెద"మని తాను బాలఁతియుఁ బోవ,
"భూసురోత్తమ! యేల పోయెద వింక
నీసుతు పేరుగొనిన నంబి నేన,
హరునిగుంటెనవుచ్చు నానంబి నేన,
హరునిచేఁ బడిఁగొన్న యానంబి నేన
మొసలిమ్రింగినయట్టి మద్దుఁదనూజు
ననలార రక్షించు నానంబి నేన,

౧. ండు, ౨. లి, ౩. పుడి(ది), ౪. యా(యి)ది, ౫. వె, ౬. ని, ౭. సై, ౮. తము; పవు, ౯. యే.

మొసలి పుత్త్రుని దిన్న మును తేపునకును
మసలక పనుపు నీ మగువ నీక్షణము,
మీఁతనూభవు నాఁడు మ్రింగిన మొసలి
యేతెంచి సుతుఁ గ్రక్కి యేఁగెడు, నేఁడ
చేయుము వడు గభిజిత్కాలమున స-
మాశ్రయతంబుగ సుతు" నంచు నర్థంబు
గమియనిచ్చుడుఁ బులకలు మేనఁ దొడరఁ
బ్రమదాశ్రు లడర సంభ్రమలీలఁ గ్రాల
నలరుచు సాష్టాంగు లగుచు మ్రొక్కుచును
నలిఁ జెలంగుచు సమున్నతి మిన్ను ప్రాఁకి
యుపనయనోద్యుక్త యుక్తిమై విప్రుఁ
డపరిమిత ప్రీతి నరిగె నింటికిని;
సతియుఁ బుత్త్రోత్సవాసక్తి మై నరిగె
సుతుని మొసలి దిన్న చోటికి, నంత
నానంబియును ననసంఖ్యాత మాహేశ్వ-
రానీకమునకు సాష్టాంగుఁ డై సహజ-
శంభుండు నేరమచక్రవర్తుల ప-
దాంభోరుహోత్తంసుఁ డై తదీయాజ్ఞ
నాలింగమూర్తి నయ్యా! యని పిలిచి

---

౧. డు, ౨. యుతం బగు.

తాళము ల్వ్రేసి సప్తస్వరోదాత్త-
బంధురధ్వనిఁ దిరుపాటఁ గీర్తి[1]ంప
సంధించి శివునిఁ బ్రసన్నుఁ గావించి
"మొసలి యాహుతి గొన్న ముద్దుఁదనూజు
నొసగవే యసమసముద్యద్దయాబ్ధి"
యంచు విన్నప మాచరించుడు నయ్యు-
దంచద్దయాకరుం డంతకుఁ దలఁప
నంత నయ్యంతకుం డంతంత మ్రొ[2]క్క-
నంత కాంతకుం "ఓ శౌరి! యంతక! మొసలి
దినినతనూజుఁ డెద్దివి నున్నవాఁడొ
కొనిర[3]మ్ము" నాఁ జిత్ర[4]గుప్తుండు "నీదు
భృత్యుఁడు నంబెన్న పే రాటఁ[5]జేసి
నిత్యసాయుజ్యసాన్నిధ్యముఁ బడసి
యున్నాఁడుగాని వేఱొండులోకముల
నన్నందనుండు లేఁ" డని విన్నవింప
బ్రహ్మఁ దలంచుడుఁ బ్రణమితుఁ డగుచు
బ్రహ్మయు [6]రెండేండ్ల ప్రాయంబునందు
రయమున గ్రాహోదరంబున జీర్ణ

౧ ంచి, ౨. క్కి, ౩. మ్మ, ౪. గుప్త (ప్తు) కృతీ(త్వదీ)యు, ౫. యొరిగి, ౬. మూఁడే.

మయిన యుర్భకుని నధ్యయనవచస్క-
గర్భాష్టకప్రాప్తుఁ గావించి మొసలి
గర్భంబునం దిడెఁ గావేరిలోన
నుదకమధ్యంబున నున్న కాగ్మొసలి
యుదరంబునన పుత్త్రుఁ డుదయింపఁ గాలుఁ
డరిగి "నీయుదరంబునం దున్నయట్టి
వరపుత్త్రు రప్పింపు వారక" యనుడుఁ
గొనితెరక మొసలియు గొబ్బునఁ బాఁడచి
యసమనదీప్రవాహమున కెదుర్ప
'నదె వచ్చె [3]వచ్చె' నా నక్కమారుండు
వదనగహ్వరమున వ్యక్తి భజింపఁ
గడు నొప్ప గర్భాష్టకప్రాప్తుఁ డైన
కొడుకుఁ దత్తటమునఁ గొనివచ్చి దింప
నుద్ధతి నాయావలూరి యాబాల
వృద్ధాదు లటమున్న వీరు వారనక
కావేరితటమునఁ గట్టలు గట్టి
భావించి విస్మయపడఁగఁ దత్సతియు
నల్లంత సుతుఁ గాంచి హర్షించి మించి
యుల్లంబు దళుకొత్త నురువడి [5]నెయిది,

---

౧. ప, ౨. ల, ౩. (గ్ర)క్కన నాకు, ౪. ప, ౫. నెగిడి; నేగి.

"వచ్చితా నంబెన్న ! వరతనూభవుఁడ !
వచ్చితా నంబెన్న ! వడుగ ! నాయన్న !
నాఁకున్న ! నాపట్టి ! ననుఁ గన్నతండ్రి !
నాకుమారుండ ! రా నాకుట్టి !" యనుచుఁ
గూర్మి నెక్కొన నెత్తికొని కౌఁగిలించి
య ర్మిలి నందంద యప్పళింపుచును
జనుఁగవఁ దొరఁగు నా స్తన్యధారలను
గనుఁగవ హర్షాశ్రుకణపూరములను
జెన్నార సుతు నభిషిక్తుఁ గావించు -
చున్నయత్తఱిఁ బతియును నేఁగుదెంచి
సుతుని గౌఁగిటఁ జేర్చి సూరెలజనులు
నుతియింప సతియుఁ దానును దనూభవుఁడు-
నరుదొంద నంబి పదాంబుజంబులకు
వరుసఁ జేరమచక్రవర్తికి మ్రొక్కి-
యొనరారు సూక్తి "గ్రాహోదరజీర్ణ"
మనఁగ "నంతకముఖాదానీత వా" న-
నంగ మొసలికడుపునను జీర్ణమైన
-పింగలి నొకవిప్రు ప్రియపుత్త్రు నంబి
నొనర నంతకముఖంబునన రప్పించి

---

౧. కూన, ౨. వెంగలి.

కనియెఁ గేవలభక్తగణనిధి మఱియు
హరి గరుడారూఢుఁ డై సుదర్శనము
ధరియించి వైష్ణవోత్తమభటు ల్గొలువఁ
బంచి తత్సూక్తి "స్వార్చాంబుజగ్రాహి-
ణం" బని మ్రొయ స్వార్చాంబుజగ్రాహి
యవు గజేంద్రు మొసలియట్లు వట్టుటయుఁ
దవిలి విష్ణుండు యుద్ధం బాచరించి
కాని గజేంద్రుని గావంగ లేఁడ,
యీనంబిమహిమ మే మేమందు మనుచుఁ
గ్రచ్చఱ నట మున్న గ్రాహోదరంబు
సొచ్చినయప్పుడు వచ్చినజముని
[2]పుచ్చినఁ బ్రాణంబు వచ్చిన దనియుఁ
దెచ్చిన పుత్త్రుని వచ్చిన విప్రు
నెచ్చిన వనితకు నిచ్చిన నంబి
[3]నెచ్చినమహిమకు మెచ్చిన బుధుఁడు
విక్రమభక్తి నిర్వక్రక్రియా ప-
రాక్రమ[4]క్రముఁడు సేరమచక్రవర్తి
విశ్రుతాసంఖ్యాత వీరమాహేశ్వ-
రశ్రేణియును [5]నుబ్బి ప్రస్తుతింపఁగ స-

౧. హ, ౨. చ, ౩. వి, ౪. భుజుఁడు, ౫. నంబి.

మ స్తమానవులును మస్తకన్యస్త-
హస్తులై జయవెట్ట నంత నాద్విజుఁడు
"నంబి! నంబెన్న! యానందస్వరూప!
నంబి! నంబెన్న! యున్నతజగద్దీప!
కత లేల మీధర్మకవిలెల మేము
గతియును మఱియు నేడ్గడయు నీ వన్న
దాన మొక్కటి వేఁడఁ దనకు సత్పాత్ర-
దాన మిచ్చితి మహాదాని! మహాత్మ!
దేవ! భవన్నామధేయుని నంబిఁ
గావుము ప్రోవుము కరుణాబ్ధి!" యనుచుఁ
దివిరి ద్విజత్వంబు ద్విజుల కేలనఁగ
నవనీసురోత్తముఁ డాశ్చర్య మెసఁగ
నంబెన్నయాజ్ఞాపనంబునఁ జిన్న-
నంబి కప్పుడ యుపనయనంబు సేసె,
"స్త్రీయి నంబి మహిమ్మత మఱియుఁ
జిత్రంబు వేయును జెప్పనే" లనుచు
నఖిలభక్తాసేక మంకనల్ సేయ
సుఖలీల మల్లికార్జునవిభుఁ డంత

భవశేశ్వరచరిత్రకథనము

గణముల[1]కును దృష్టిగాఁ [2]బర్వ మపుడ
యొనరంగఁ జేయించి యుచితముల్ దనర
వరవస్త్రభూషణావళులఁ బూజించి
యరయంగ గంధపుష్పాదులఁ దనిపి
కర్పూరసహితంబుగా [3]వీడియంబు
లర్పించి భక్తిసమగ్రత [4]మెరసి
యానందగీతంబు లర్థిఁ బాడుచు శి-
వానందలీలల నలరి యాడుచును
శంకరగీతముల్ సర[5]సఁ బాడుచును
శంకరలీలల జ[6]తులకాడుచును
బరమశివానందభరి[7]తుఁ డై మఱియు
హరగ[8]ణంబుల యున్న యవసరంబునను
బటుభక్తిఁ గర్ణాటభాష యర్థించి
యటమున్న బసవదండాధీశుకడకుఁ
బుచ్చిన జంగమంబును భక్తవరులు
వచ్చి యా బసవన్న [9]వరమహత్త్వంబుఁ
బ్రస్తుతింపుచు సమర్పణ సే[10]య బసవ-

౧. క, ౨. స, ౩. వి, ౪. దనర, ౫. వి, ౬. జూ, ౭. తమై, ౮. ణాగ్రణులు, ౯. ప, ౧౦. యు.

హస్తానుగతభూతియందు నంతటను
గర్ణాటభాష సాంగముగఁ బ్రాణేశుఁ
గర్ణాటగీతసంగతులఁ బాడుచును
మఱియును బసవయ్య మహిమలు వినుచుఁ
దఱిదఱి బసవనిన్నఁ దలఁచి మ్రొక్కుచును
వినుకలిసుఖము సిల్వఁబోవునంత
గనుకలిరనాత్మ మ్ముంగలి దొరగలింపఁ
బాపక్షయాత్మయ్య బసవాక్షరత్ర-
యోపలాలన పరనోన్ముఖ మనుజ-
రక్షణాపేక్షుఁ బ్రత్యక్షత్రిచక్షుఁ
బ్రత్యక్షప్రసాదపంచాక్షు సాక్షాన్మ-
హోక్షు ఫాలాక్షప్రయుక్తఫాలాక్షు
శిక్షితప్రతిపక్షు శివభక్తిదక్షు
నక్షీణకరుణాకటాక్షవీక్షణ సు-
రక్షిత స్వసమయపక్షు సానత ము-
ముక్షు సంస్కృతపాశమోక్షు దుర్జనప-
రోక్షు సితగౌరరుద్రాక్షవిహిత-
పక్షుఁ గ్రామాక్షు దక్షమహాధ్వ-
రక్షయరక్షసదృక్షు జంగమస-

---

౧. స, ౨. య్యా, ౩. ని, ౪. కా, ౫. క్త.

మఱియు బసవగణాధ్యక్షు సత్క్షణము
వీక్షింతు ననువింత వేడ్కమై నంత
స్ఫటకీర్తి మల్లికార్జునుఁడు గల్యాణ-
కటకంబునకు నభి[1]గమనంబు సేయ
మారాదిసద్భక్తమండలి దాను
నూరూర సద్భక్తు లొగి నెదుర్కొనఁగ
ముదమున నిరుగుడుమ్ములకు నేతెంచి
సదమలాత్ముఁడు వీరచాకి[3]రాజయ్య
ప్రవ్యక్తభక్తి సారంగేశు నంద
నవ్య[4]సీమాలంఘనవ్రతాసక్తి
నతులత్రికాలలింగార్చనా[5]యుక్తి
సతతజంగమపరిచర్యానురక్తి
శివ[6]భక్తితత్త్వ గోష్ఠీసముద్యుక్తి
యవధూత పూర్వవర్ణాశ్ర[7]మవ్యక్తి
శ్రుతిచోదితాచార సుపథప్రయుక్తి
మతిఁ గొనియాడుచు మఱిపండితుల ని-
జాగ్రశిష్యుం డన నమరు [8]దోనయ్య
కగ్రజుండై వ్రతోద్యన్నిష్ఠ వెలయ

౧. గమ్యంబు, ౨. త్ములు, ౩. దేవయ్య, ౪. శివా, ౫. స, ౬. భక్త; తత్త్వ, ౭. వ, ౮. దోసమయ.

సావీరచాకి¹ రాజయ్యచే భక్తి-
భావనమైఁ బ్రణిపత్తిఁ గైకొనుచుఁ
గర మనురాగసంగతిఁ బానుగంటి
కరుగుదేరఁగ శిష్యుఁ డైన బాడరువు-
గోవిందప్రెగడయుఁ గోరి ²మాహేశ్వ-
రావలియును బురం బభిరమ్యముగను
నెల్లెడఁ జాళియం బిప్పించి రంగ-
వల్లులు వెట్టించి వాడవాడలను
ముకుళపల్లవమణి ముక్తాఫలాది-
మకరతోరణములు మార్గపార్శ్వముల
నుప్ప³ర⁴వట్టంబు లొగిఁ ⁵గప్పడములు
నుప్పరగుల్లు మహోత్కపతాక-
ములు వాతపూరణంబులు నాతపత్ర-
ములు నలంకారించి మొత్తము ల్గాఁ⁶గ
⁷నిద్ధవాద్యధ్వను లెల్ల ఘూర్ణిల్ల
శుద్ధ⁸సాళగగీత సూళాదు ⁹⁰లులియ
నంతంతఁ గోలాట లంతంత¹¹జోక
లంతంతఁ గేళిక లభినయింపంగ

---

౧. దేవయ్య, ౨. మ, ౩. న, ౪. వంటంబు, ౫. గల్ప, ౬. క, ౭. యి, ౮. తాళగ; సాగర, ౯. లా, ౧౦. లోలయు, ౧౧. బో.

జాంగుభళా! యంచు శబ్దముల్ మ్రోయ
వీంగుచుఁ బురజనుల్ విభ్రాంతులుగను
గోవిందఁ బ్రె గడయు గురుపాదసరసి-
జావలోకనవంద నానసానమునీన
నంత ననంతసాష్టాంగంబు లిడుచు
సంతతోత్సవలీల స్వర్ణపాత్రములు
భ్రాజిల్లు దివ్యాభరణసమూహములు
రాజిత కనకాంబరప్రతానములు
నానాఫలంబులు నానాప్రసవవి-
తానంబులును సుగంధద్రవ్యములును
గర్పూరసహితంబుగా విడియంబు
లర్పించి మఱియు సాష్టాంగుఁడై మ్రొక్కి
యానందజలముల నడుగులు గడిగి
పూని స్వకీయహృత్పుష్పంబుఁ బూన్చి
సతతసద్భక్తి వాసనధూప మిచ్చి
నుతసంస్తవనవాఙ్మణుల నివాళించి
తనుమనోగతనివేద్యంబు లర్పించి
వినుతానురాగ మహా నిర్వడియంబు నిచ్చి
నుతి నవరత్నసంగత హేమసల్ల-

గ. ప్రసి. పె, ౨. గ, ౩. దివ్యాంబ, ౪. సంస్మరణ, ౫. ధన.

లిత పుష్పపుష్పాంజలి త్రయం [1]బెత్తి,
క్రమమెుంద [2]గురుపదకంజంబు లి[3]ట్లు
సముద్ధితాత్మాంగ చేష్టలన భజించి;
యధిగతప్రాణ దేహార్థములల్ భక్తి-
విధ "సద్గురుభ్యో నివేదయా" త్తన ని-
వేదించుచును నట్లు వినమితుండగుచు
నాదట దర్శింప నలని యనోన్యా-
సందర్శనానోన్య [4]సంస్తవానోన్య-
వంద[5]నానోన్యవివశచిత్తు లగుచు,
నంతఁ బండిత మల్లికార్జునప్రభుని
గంతుసంహా[6]రభక్తగణసమూహంబుఁ
దోడ్తెరఁ బండితేంద్రుండు నప్పరికి
నేడ్తెరఁ దళుకొత్త నేతెంచునెడను
బుణ్యాంగనలుఁ బుణ్యపురుషులు నెరవి
గణ్యాసద్భక్తైకగణ్యు జగద్వ-
రేణ్యు సద్గుణమణిపుణ్యు వీరాగ్ర-
గణ్యు సన్నిహితకారుణ్యు సజ్జనశ-
రణ్యు విధూతకార్పణ్యు నగణ్యా-

---

౧. బొసగి, ౨. గుర్వంఘ్రి, 3 ట్ల, ౪. సన్నుతా, ౫. నానంద, ౬. విభు, ౭. ధు.

పుణ్యు నానత[1]కృతపుణ్యుఁ జూచుచును
మస్తకవిన్యస్త హస్తాబ్జు లగుచుఁ
బ్రస్తుతింపఁగ నరపతి విని మ్రొక్క-
న్వచ్చ సద్గురుభక్తి సంపద మెఱసి
"గచ్ఛతః పృష్ఠతో గచ్ఛే" త్తనంగ,
లలి "స్థితో[2]శ్ఛాయాం నలంఘయే" త్తనఁగ,
మలువక "గచ్ఛే న్నమస్కృత్య" యనఁగ,
ముంగల నిజ గురుమూర్తి యేఁగంగఁ
బింగ[3]లి గోవింద ప్రెగడ దచ్ఛాయఁ
ద్రొక్కక దాఁటక త్రొక్కినచోటఁ
ద్రొక్కక దాఁటక తొలఁగి మ్రొక్కుచును
నంతంత మఱియు సాష్టాంగంబు లిడుచు
నంత స్వకీయ గృహాంతరంబునకు
గురునాథుఁ బ్రీతిఁ దోడ్కొనిపోయి యచట
నురుతరసింహాసనోపేతుఁ జేసి
స్వామిశ్రీపాదమజ్జన మాచరించి
శ్రీమతి పాదాంబుసేవనుఁ డగుచు
ఖ్యాపితభక్తి నక్షతగంధపుష్ప-
ధూపదీపాదు లుద్యుక్తి నర్పించి

౧. శ్రు, ౨. రుచ్చా, ౩. ల; లి.

నలి "స్వగృహం స్వధనం చైవ" యనఁగఁ
గలయంగఁ దమయింటఁ గలయంతవట్టు
ధనము ధాన్యంబు గోధనము వాహనము
లనుపమ చీనిచీనాంబర ముఖ్య-
వివిధాంబరావళుల్ విశ్రుతానర్ఘ-
నవరత్న ఖచిత నానావిధాభరణ-
ములు సుగంధద్రవ్యములు నటుగూడ
నిలుసూఱగా భక్తి నెలమి నర్పించి
యంత గురుప్రసాదాబ్ధిఁ దేలుచు ని-
రంతర భజనానురక్తి నర్పింప
నిచ్చలు శివభక్త నివహాలయముల
నచ్చుగా దేవకార్యములు విభూతి-
వీడియంబులును వివిధదీక్షలును గ-
ణాడంబరములు మహాపురాతనుల
పండువుల్ వర్వముల్ వాటిజాతర ల-
ఖండితంబులుఁ గేళికలు నుత్సవములుఁ
జిలివిలివోవంగ శివతత్త్వగోష్ఠి
నలరుచుఁ బండితయ్యయు భక్తవరులు

౧. తముఖ్య, ౨. సు, ౩. నప్పుడు, ౪. వీరవివిధదీక్షలుగ, ౫. లు, ౬. గ; గుల్.

నసయంబు భక్తిసుధా[1]రసాపార-
వన[2]నిధి నోలాడుచు వర్తింపుచుండ
మహి ధవళేశు నామయ్యగా రంద
సహజైక లింగనిష్ఠావృత్తి న[3]డవఁ
దనతోడి లెంక[4]లుగని యసహ్యమునఁ
జని "యుదయావనీశ్వర ! నీదు పెద్ద-
లెంక నామన నిమ్ము లెక్కసేయండు,
గొ[5]ంకక పెట్టించుకొనియు మీతమ్మఁ
బాఱంగవైచుఁ డా భక్తుండ ననుచుఁ,
జీఱిన రాఁడు, నిన్జేరి కొల్వఁడు,
పండితేంద్రు[6]నియొద్ద భక్తులయొద్ద
నుండు నిన్నటఁగోలె నో[6]రంత ప్రొద్దు,
[7]నమ్మవేఁ జూడు భూనాథ ! నేఁ"డనుఁ[8]డు
నమ్మహీశుఁడు "నామ! ర"మ్మని పిలిచి
కొమ్మిచ్చటనె యంచుఁ దమ్మవెట్టుడును
[9]దమ్మభూమీశు నొద్దన పాఱవైచి
వరగురుధ్యాన పూర్వక భస్మలిప్త-

---

1. మృతా, 2. నిధిఁదేలుచు, 3. డు, 4. లెంకయునసహ్యము (మ)న; లుగలియసహ్యమున, 5. ల, 6. కె, 7. నమ్మలే (నే), 8. చు, 9. దమ్మి.

కరతలుం డగుచు స్రుక్కక పతిఁ జూచి
“తగవగు సేవకధర్మంబుఁ దలఁప
నొగిఁదమ్మకైనఁ జేయొగ్గనే కాక
తగునె కేవలభక్తి ధర్మంబుఁ దలఁప
మొగిఁ బ్రసాదేతరంబునకుఁ జేసాఁప?
నర్పింపఁగారాదు హరున కీతమ్మ,
నర్పితేతరవస్తు వది గొనరాదుఁ,
జోళవాళి[1]కకాక క్షోణీశ లేశ
వేళవాళికిఁ గర్తవే? యటు[2]లైన
స్వార్థజంగమపూజనార్థ మీయర్థ
మర్థసంఘటనార్థ మది నీదు సేవ
యరయఁ దత్సేవార్థ మంగవిక్రయము,
ధరణీశ! యటుగానఁ దనశరీరంబు
నమ్మినవాఁడఁ గా కాచార[3]నియతి
నమ్మినవాఁడనే” యనవుడు నృపతి
మదిఁ గోపమను చిచ్చు మదమను గాలిఁ
బొదలుచుఁ దరికొన్న భూమీశుఁ డంత
నుడుకుచు “[4]నేమేమి మోరోరి! నామ!
పడవైచితివి దమ్మ భక్తుండ వనియొ

౧. కిఁగా, ౨. లనిన, ౩. వితతి, ౪. సంతతంతిమో.

ధ్రువము నీకొలఁదిభక్తుల యిలాస్థలిని
నవనీశునకు బంటులైయున్నవారు,
దమ్మలుదినువారుఁ దమ్మిచ్చువారు
నమ్మినమంత్రులై నడచెడువారుఁ
బానలొండేల మీబసవరాజాది-
గా నడవరె సేవకప్రకారమున?
భువి వారికంటె నేపోల్కి నీవొక్క-
డవయుఁ గడపరానియట్టి భక్తుఁడవె?
లెంక!నామన!భక్తిబింకంబు విలుడుగు,
కొంకకు మీసారెకును దప్పవట్ట
నేచిరమైయెఱుఁగక యిలఁ దమ్మఁ బాలి-
వైచిన తప్పు మైపడి సహించితిని,
రా! యింద! కో! తమ్మ, రతినొల్లవేని
మాయొడల్ మాకిమ్ము మాటలే"లనుడుఁ
"గొలిచిన నెపమునఁ గొనరక నన్నుఁ
బలికిన భూమీశ! పలికితిగాక
యనఘుల నవిరతానన్య శరణ్యు-
లను భక్తగణనాథులను బల్కఁ జన్నె?

---

౧. డిచెడి; డిచిన, ౨. ర, ౩. లి, ౪. మెయ్యె, ౫. తన్ను; యున్న.

కొలుతురే భవుల భక్తులు, గొల్చిరేనిఁ
గొలిచిరిగాక లోకులయిండ్ల బంట్లై?
సద్గురులింగప్రసా[1]దము వాప-
తద్గత చిత్తుల తమ్మలు దిండ్రె?
యిష్టలింగప్రసాదేచ్ఛానుభవులు
గష్టమానవుల యుచ్ఛిష్టముల్ దిండ్రె?
సంగతలింగ ప్రసాదైకసుఖులు
లెంగి మనుష్యుల యెంగి[2]ళ్లు [3]దిండ్రె?
బసవయ్య గొలువఁడే భవు నని యెదవు,
బసవయ్యమహిమ యేర్పడ నెర్గ వీవు,
వసుధకు సద్భక్తివర్ధనార్థముగ
బసవని శంభుండు [4]వంచున త్తఱిని
స్ఫటితులాయష్టి సంపుటభూషణాదు
[5]లిటఁ[6]గల్లై లేక యెత్తెఱుఁగంగరాదు,
వరపూర్వ శుద్ధసు వ[7]ర్ణాంతరంబు
నొరగల్లు లేకున్న [8]నొగి నెర్గ రాదు,
శోణపాషాణవిస్ఫూర్తి ఘర్షించు
శాణంబు లేకున్నఁ జన దట్లుఁగాక,

---

౧. దముల్, ౨. ంట్లు, ౩. దినిరె, ౪. పనుచు, ౫. లె, ౬. ట్లు, ౭. ర్ణోత్త, ౮. నెఱుఁగంగ, ౯. కెఱుఁగ.

మెంకచే నీక, మయిలలచే మడుగుc,
జంఢిచే శూరుండు, జారచే సాధ్వి,
ఖలునిచే బుధుc డు, దుఃఖముచేత సుఖము,
నలుపుచే గౌరవర్ణముc, బ్రపంచంబు-
చేc బరమాత్మైకసిద్ధి, పాపంబు-
చేc బుణ్యసంప్రాప్తి, శైతిచేc దీపు,
సీతుచే నుష్ణంబుc, జీకటిచేత
జ్యోతి, యసత్యంబుచేత సత్యంబు,
భవిచేత భక్తుండుc బరువడి మెఱయు
పవిదిని బసవయ్య పటుమహత్త్వంబు
గుఱియైన బలుదూషకునిచేతcగాని
మెఱయదంచుc దలంచి మృడుc డక్షణంబ
కంటకాసురుcడనcగా నొక్క దివిజ-
కంటకుc బ్రతిపక్షుcగాc బంప, నసుర
పృథివిపై జనియించి బిజ్జలుc డనcగc
బ్రథితబల్లహపట్టభద్ధుcడై యంత
నెసగcc గప్పడి సంగమేశ్వరంబేcగి
బసవయ్యcదోడ్తెచ్చి బండరువిచ్చి

---

౧. శై, ౨. జెంజc జెందింపు (జేదేవు), ౩. వంగముటి,
౪. పటు.

యనము సకలనియోగాధ్యక్షుఁ జేయ
బసవయ్యయును లసద్భక్తిసంయుక్తి
*నరిఁ[1]బేర్చి జంగమార్చనలు సేయుచును
నరపతిరాజ్యంబు న[2]డపుచునుం[3]డుఁ,
బలియుఁ గదాయని పనియేమియనఁడు,
ధృతిఁదక్కఁ జేయఁడు దేవువిన్నపము,
మో[4]డ్వఁడు సేతులు, మ్రొక్కండు సాఁ[5]చి,
కీ[4]డ్వడి గద్దియక్రింద నుండండు,
శివభక్తిపరునయ్య జియ్య యన్మాడ్కి
నవసీశునంకింపఁ డట్లునుఁగాక
కదిసిన మిండజంగమమున కధిపు
నెదురను బండరు నిలుసూఱ[6]విడుచు
జంగమాంబునకు బిజ్జలు[7]సతి నిచ్చె
వంగక యతఁ డెక్కు వాహనం బిచ్చె
ధర నిట్టి సేవకధర్మము [1]గలవె
యరుదరుదని నను లద్భు[3]తం బంద

---

* ఇక్కడ మాద్రి ప్రతిలో “వ్యసనాదితనుసంవర్జితుం డగుచు” అని ఒక్కపాదమే ఉన్నది.

౧. జే, ౨. షు, ౩. డ, ౪. ప్ప, ౫. గి, ౬. విచ్చి; 'యిచ్చి (చ్చె), ౭. ర్థి.

వడిఁ[1]బూన్చి యారాజు వనిత బి[2]ట్టులుక
నటువొడ్చె నిబువొడ్చె[3]ననుచు రేచయ్య
గుటిలాత్ము వేఁగీశుఁగూలంగఁ బొడిచెఁ
గాన భక్తులు సేవకస్థితిఁగొల్చి
రేనిఁ గొల్చిరిగాక యిల సత్పథంబు
విడుతు[4]రే సద్భక్తి విధిఁ బ్రాణమైన
విడుతురు గావున వేయును నేల
భక్తులు గొలువరే భవిఁ దొల్లి యనుచు
భక్తు[5]లనడవల్లు వ్రతివోల్పఁదగునె?
భవిఁగొల్వఁడే తొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువా[6]రు బసవయ్యయట్ల
బంధురలీలఁ దత్ప్రాణపదంబు
సంధింపవలవదే జంగమం బంద ?
భవిఁగొల్వఁడే తొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
చేయంగవలవదే, చెచ్చెర వంగ-
కాయలు ప్రాణలింగంబులుగాఁగ ?
భవిఁ గొల్వఁడే తొల్లి బసవరా జనుచు

---

౧. జాచి; జూచి, ౨. ట్ట, ౩. ల్చె, ౪. రె, ౫. లా, ౬. ఁడు.

భవిఁ [1]గొలిచెడువారు బసవయ్యయట్ల
యసమాక్షుఁ డొకరూప మైవచ్చి వేఁడ
నొసలికన్నీ శున కొసఁగంగవలదె?
భవిఁ గొల్వఁడే తొల్లి బసవరా జనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
మిండయ్య వేఁడుడు మేలుత వస్త్రంబు
లొండొండ మొలవంగ నొలిచియీవలదె?
భవిఁ గొల్వఁడే తొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
[3]పడఁబోయి దవ్వుల బసవ[4]రో యనినఁ
బడకుండఁ గాళవ్వఁ బట్టంగవలదె ?
భవిఁ గొల్వఁడే తొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
[5]తఱలి దివ్యామృతధారలు వెల్లి
వఱుపంగవలవదే భక్తుని[6]మేన ?
భవిఁ గొల్వఁడేతొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
మిండ[7]జంగమునకు మేదినీశ్వరుని

౧. నిగ్గొల్చ్చి, ౨. ల, ౩. పడుచుండి, ౪. రాజ, ౫. తఱఁగి; తలరి, ౬. వలన, ౭. య్యాలకునిచ్చి, ౮. నకు(క్రీ).

బండరు¹వాసగి తాఁ బడయుంగవలదె ?
భవిఁగొల్వఁడేతొల్లి బసవరాజనుచు
భవిఁగొలిచెడువారు బసవయ్యయట్ల
భావజారికి సమర్పణసేసి విషము
ద్రావంగవలవదే ధర?—నట్లుఁగాక
చూడఁజూడఁ దెలి²నుఁగు జొ³మ్మయ్య వేఁట
లాడఁడేయని వేఁటలాడెడువారు
దనచేతఁజచ్చిన దండిమృగములఁ
దనువులతోన యుద్యద్విమానము³ల
నిచ్చలు⁴జొమ్మయ్య నిటలాక్షుపురికిఁ
⁵బుచ్చినభావనఁ బుచ్చంగవలదె ?
కావింపఁడే హింసఁ గన్నప్పఁ డనుచుఁ
గావలు ⁶లై హింసఁ గావించువారు
గన్నప్ప గన్నుఁ దక్కఁ⁷గ నిచ్చినట్లు
గన్నీశ్వరునకు⁸ఁ దక్కంగ నీవలదె?
వారలచరితలు వారికె చెల్లు
వారలమహిమలు వారికె చెల్లుఁ
గాక వారలప్రతిగట్టి వర్తింప

౧. వీఁచే, ౨. లు, ౩. లు, ౪. బొమ్మన్న, ౫. జొ, ౬. రై, ౭. నక్కడినీయ, ౮. కె.

మాకొల్లఁదియె యింక మాటలేమిటికి
నొప్పింతు నీకు నీ యొడలు భూనాథ
యొప్పఁగొమ్మనుచు నయ్యుదయావనీశు
చేనున్న సురియఁ జెచ్చెరఁ బుచ్చుకొనుచుఁ
దానెక్కి గోపురద్వారహర్మ్యమున
ప్రమథపురాతన [1]ప్రత్యగ్రభక్త-
సముదయశ్రీపాద జలజాత్ముఁ డగుచు
మును మునీంద్రునిశాప ముసలావశేష-
మున [3]న యాదవులు నిర్మూలమైనట్లు
దడయ కీ సురియచేతన వీనివంశ
మడరంగ నిర్మూల మయ్యెడమనుచు
నలుగు[4]పై మంత్రోక్తమగు భూతిఁ జల్లి
తలఁకక లింగార్పితము నేసియంత
నలుగుమోహ[5]ణమున హస్తంబు దొడిగి
[2]ఝుళిపించి నివిడి [6]పార్శ్వంబుల నివిడి
క్రు[7]మ్ముడి వామహస్తమ్మున నిడి ర-
యమ్మున యామ్యహస్తమ్మున నలుగు
గళమున సంధిం[8][9]పఁ గరతలంబంద

1. ప్రాక్తన, 2. ఘు, 3. ను, 4. దున, 5. న, 6. న, 7. జలి, 8. హస్త, 9. మ్మి, 10. ంచికర.

తలఁప్రేలుచుండె నెంతయు నద్భుతమ్ము
దళుకొత్త ధవళేశ ! ధవళేశ ! యనుచు
నల్లి రజతాద్రికి నాయయ్య యరిగె
ఘుణఘుణ యని చే[1]తి ఘంటలు [2]మ్రోయఁగఁ
బ్రణుతింప నోహిళప్రభుఁ డే[3]గినట్ల
యింతవృత్తాంతంబు నెఱిఁగి దూషకజ-
నాంతకమతి మల్లికార్జునారాధ్య-
సత్త్మోత్తముఁ డంత శాపోదకంబు
లెత్తి యశేష మాహేశ్వరకోప-
వహ్ని నామనగణ వ్రాతైకగోప-
వహ్ని ప్రపూరి తావారితోన్నతశి-
ఖావలిచే "నుదయాభిధానావ-
నీవల్లభశ్చ" నా నెఱి నుదయావ-
నీవల్లభుని సమన్వితమహాపాప-
దావమునను "సపుత్రకళత్రమిత్ర-
బాంధవో" యన సుతాప్తకళత్రమిత్ర-
బంధుప్రధానాగ్రభట కరితురగ-
బలచమూనాయక ప్రభృతులుఁ దాను

౧. త, ౨. యుమ్రోయ, ౩. గు, ౪. బోధను, ౫. శాపఁ దావ, ౬. తా, ౭. ప్త.

జెలులు "వినశ్యన్తి క్షిప్రం పరం వి-
దూషకో" యన నిష్ఠుర్రంగాఁడ"మనుచు
రోషించి మల్లికార్జున పండితయ్య
శాపోదకము లెత్తిచల్లె నతఁడు
చూపఱకును భీతి సొద్యంబుఁ బొడమఁ
గాదింక నీ పానుగంటనుండఁగ మ-
హాదేవు భక్తులకనుచుఁ గట్టలుక
మసలక పండిత మల్లికార్జునుఁడు
వెసఁదలిర్పఁగఁ బురివెడలంగ వెనుక
నక్కజంబుగఁ బూఁచె నంతఁగల్పొన్న,
గుక్కరొకుట్టని కూసెఁగల్కోడి,
పురి మహోత్పాతముల్ పుట్టె వెండియును
బురము వాడగునని బుధులు గలంగ
విదితశాపోద్ధతి విలయోగ్రవహ్ని
కుదయావనీశుఁ డాహుతియయ్యెఁ బుత్ర-
పౌత్రు లన్యోన్యకళత్రాభిగతిని

---

౧. డున, ౨. బులకుభీతి; రుల్ భీతియు, ౩. నం, ౪. న, ౫. జూచె; బూసె, ౬. నక్కలుపొన్న; నంతకల్పొన్న, ౭. కొక్కు, ౮. తొలోక్కుడు, ౯. పుట్టంగఁదొడఁగె, ౧౦. తి, ౧౧. రతిని; నిర(య)తి.

శత్రులై చీకటిచప్పరంబులను
దడయక కాసురిఁ జేసి తనపురిజనము
నరయంగ నిర్మూలమై రట్టుగూడ,
సంతానమెల్ల నిస్సంతానమయ్యె,

బసవేశ్వరునిగూర్చి పండితారాధ్యుని ప్రలాపకథనము

నంతనిక్కడఁ బండితారాధ్యవిభుఁ డ-
వారితపరవాది వనిపురంబునకు
భోరన నేఁగంగఁ బురహారమూర్తి
బుధపుంగవుఁడు వనిపురశంకరయ్య
యధిగత భక్తిమహత్త్వంబు దనరఁ
జయ్యన సద్భక్తి సహితుఁడై గణమ-
హియ్యత దోలుఁ కాడ నెదురేఁగుదెంచి
కడు[3]నర్థిఁ బౌరు లక్కజమంది పొగడఁ
దొడుకొనిపో[4]యి భక్తులుఁ దాను[5] హరుని
మంగళశివకథా [6]మహితసంగప్ర-
సంగతిఁ గొన్ని వాసరములు [7]సలిపి
కల్యాణమున కభిగమనంబు సేయఁ
గల్యాణమునభక్తి [8]గజిబిజి పుట్టె

---

1. రు, 2. క్తి, 3. భక్తిపొ, 4. వ, 5. వారు, 6. మహితప్రసంగ (సద్గోష్ఠి), 7. మసలి, 8. గజబిజ.

బల్లహు బిజ్జలు భంజించి రంతే
బల్లిదుల్ జగదేవ మొల్లె బొమ్మయలు
నేఁగి కప్పడి సంగమేశ్వరంబునకుఁ
దాఁగోరి బసవనదండనాయకుఁడు
నిచ్చమై నాసంగమేశుగర్భంబుఁ
జొచ్చె దేహముతోన చోద్య మొప్పార,
నిదియుఁ దా నేఁటికి నెనిమిది దినము
లది నిక్క మనుచు నొక్కయ్య సెప్పుడును
బండితేంద్రుం డుల్కిపడి శోకవహ్ని
నిండారి మనమున నెక్కొని పర్వ,
"బసవయ్య బసవేశ బసవకుమార
బసవలింగంబ నా [3]భండారి బసవ
సంగన బసవయ్య సంవిత్ప్రదీప
సంగన బసవన్న చరలింగరూప
సంగన బసవన్న సత్యప్రలాప
సంగన బసవన్న శమితేక్షుచాప
సంగన బసవన్న సన్నుతభూప
సంగన బసవన్న సంహృతపాప
సంగన బసవన్న శత్రుప్రతాప

---

౧. డంజో, ౨. రు, 3. వాలిదైవంబ, ౪. భూప, ౫. సత్య.

సంగన బసవన్న సరసకలాప
సంగన బసవన్న [1]జగదగ్రగణ్య
సంగన బసవన్న సకల[2]శరణ్య
సంగన బసవన్న శాశ్వతపుణ్య
సంగన బసవన్న సద్గుణ[3]పణ్య
సంగన బసవన్న సద్భక్తగణ్య
సంగన బసవన్న శరణవరేణ్య
సంగన బసవన్న సారనైపుణ్య
సంగన బసవన్న సహజకారుణ్య
సంగన బసవన్న సాంద్రప్రమోద
సంగన బసవన్న సంస్పృహానాద
సంగన బసవన్న శైవవినోద
సంగన బసవన్న సత్యప్రసాద
సంగన బసవన్న సంచితవేద
సంగన బసవన్న జంగమాహ్లాద
సంగన బసవన్న [4]శర్వావిభేద
సంగన బసవన్న శమితవిషాద
సంగన బసవన్న సంసారదూర
సంగన బసవన్న జగదేక[5]వీర

---

1. సకల్గా, 2. వరే, 3. పు, 4. సర్వాది, 5. శూ.

సంగన బసవన్న సంయమాధార
సంగన బసవన్న సౌమ్యశరీర
సంగన బసవన్న సముచితాచార
సంగన బసవన్న సదయాప్రచార
సంగన బసవన్న సద్భక్తిసార
సంగన బసవన్న శంభుకుమార
సంగన బసవన్న సత్కృపావరణ
సంగన బసవన్న సద్భక్తశరణ
సంగన బసవన్న శమదమాభరణ
సంగన బసవన్న జలజాతచరణ
సంగన బసవన్న జననప్రహరణ
సంగన బసవన్న శాంతివిహారణ
సంగన బసవన్న స్వసమయోద్ధరణ
సంగన బసవన్న శైవవిస్ఫురణ
సంగన బసవన్న సత్పథాచార్య
సంగన బసవన్న సంస్మితశౌర్య
సంగన బసవన్న సాత్త్వికస్థైర్య
సంగన బసవన్న సంగీతధుర్య
సంగన బసవన్న సముచితధైర్య

---

౧. య, ౨. క్తికి, ౩. యా, ౪. దా.

సంగన బసవన్న సహజగాంభీర్య
సంగన బసవన్న చరితార్థచర్య
సంగన బసవన్న శాంభవచర్య
సంగన బసవన్న సమ్యక్చరిత్ర
సంగన బసవన్న సద్ధర్మగాత్ర
సంగన బసవన్న షడ్వర్గజైత్ర
సంగన బసవన్న సత్కృపాపాత్ర
సంగన బసవన్న సాధితామిత్ర
సంగన బసవన్న నిజనిలతాదాత్ర
సంగన బసవన్న శశ్వత్పవిత్ర
సంగన బసవన్న జంగమక్షేత్ర
సంగన బసవన్న సద్వ్రత్తోత్తుంగ
సంగన బసవన్న సంతతాభంగ
సంగన బసవన్న శ్రౌశప్రసంగ
సంగన బసవన్న సంహృతానంగ
సంగన బసవన్న సాంబాంతరంగ
సంగన బసవన్న సాక్షాచ్ఛివాంగ
సంగన బసవన్న సద్గురులింగ

---

౧. దిశా; ధిషా, ౨. జనిలతాదాద్ర; సంస్తుతిపాత్ర; సంహృతానంగ.

సంగన బసవన్న షట్ స్థల్జ్ఞానంగ
బసవన్న బసవయ్య బసవకుమార
బసవ బసవరాజ బసవలింగంబ
నాయన్న నాతండ్రి నామనోహరుఁడ
నాయయ్య నాజియ్య నాప్రాణనాథ
నామోహపాశాశి నాయశోరాశి
నామాత నాభ్రాత ననుబెట్టి నీవు
గాయజసంహారు గర్భంబుఁ జొచ్చి-
తా"యంచు 'హా'యంచు "హరసంగమేశ
హరివిరించి సురాసురాద్య ప్రమాణ
చిరభక్తి రత్నఘర్షిత మహాశాణ
వ్యాపితోదాత్త సర్వకళాప్రవీణ
ఖ్యాపితాంబుజభవ కంకాళవీణ
నిజభక్తి విరచిత నిఖిలప్రమాణ
సుజనైకసన్నుత సురగిరిద్రోణ
వృషభాధిపవిషాణ వీక్షణప్రాణ
విషగళోద్యత్కాంతి విలసనాక్షీణ
యురుతరాజాండ సంయుత గర్భకోణ

---

౧. మనో, ౨. సా, ౩. త, ౪. క్త, ౫. మా, ౬. పురా.

నరనుత[౧]భోగగణ సహస్ర[౨]రియాణ
దత్తకరాంబుజద్వయ[౩]భట్టబాణ
వృత్త[౪]దయారసాన్వితని[౫]ర్వాణ
కృ[౬]త్త [౭]వాణీఘో[౮]ణ గేయ[౯]విశ్రాణ
[౧౦]దత్తచోడక్షితి ధవ[౧౧]సతీ[౧౨]ఘోణ
నిహత మరుజ్జననీ లసద్ఘ్రాణ
సహజకల్యాణ కృశానుకృపాణ
శర[౧౩]ణాగతత్రాణ సాన్నిధ్యబాణ
పరి[౧౪]హృతాసమబాణ బద్ధాక్షబాణ
కృతపూర్వగీర్వాణ గీర్వాణమకుట-
ధృత[౧౫]శోణపాషాణ తేజోధురీణ
చరణాంకనిర్వాణ సౌఖ్యపారీణ
పరమమాహేశ్వర [౧౬]ప్రాణమత్ప్రాణ
రాజితలింగతనూజు, [౧౭]నూర్జితమ-
నోజు, [౧౮]సుగుణకల్పభూజును, దత్త్వ-
బీజును, భక్తసమాజును, సుగుణ

౧. భాగ; భోజ, ౨. ఫీ, ౩. ప, ౪. ద్ధయాన, ౫. ర్వా, ౬. ంత; త్రి; ధ్రి, ౭. మణీ, ౮. ణి, ౯. నిర్వా; నిర్మా, ౧౦. దంత, ౧౧. ర, ౧౨. పాణ; శోణ, ౧౩. ణగణ, ౧౪. హ, ౧౫. శోణ; శోధి, ౧౬. స్త్రాళ, ౧౭. మా, ౧౮. గుణాకల్ప; సుకణకల్ప.

నైజును, గతభవవ్యాజును, బుణ్య-
భాజును, నుత కేశిరాజును, సుకృత-
భోజు, సదయాక్షి సరోజును, దివ్య-
తేజును, నిత్యవందిత చెన్నబసవ-
రాజు, మహితమాదిరాజు ధర్మాధి-
రాజును, బూర్వాగోరాజును, భక్తి-
రాజును, నతసురరాజును, బసవ-
రాజు, నారాజు, నిరస్తచాళుక్య
రాజును, రాజాధిరాజు, రాజాంక!
నీదుగర్భాంతర్వినిహితుఁ గావించి-
తే, దేవ! సంగయదేవ! దేవేశ!
బాదునఁబాడని ప్రమథావతారుఁ
గూడుకొంటివె లింగ! కూడలిసంగ!
* ప్రోడిసాక్షాన్మహారుద్రావతారుఁ
గూడుకొంటివె లింగ! కూడలిసంగ!
వేడుకఁ నీయాది వృషభాధినాథుఁ

౧. శి, ౨. గ, ౩. సుధర్మ, ౪. సు, ౫. శ్రీ, ౬. ంకి, ౭. పాదాన; బాడాన, ౮. డి, ౯. వి, ౧౦. నయ్యాది, ౧౧. భావతారు; భేంద్రమూర్తి.

* ఇక్కడ వ్రాతప్రతులలో పాదాలక్రమము అనేకరీతులుగా ఉన్నది. అది అంతా ఇచ్చట చూపలేదు.

గూడుకొంటివె లింగ! కూడలిసంగ!
పాడిదప్పని వీరభద్రావతారుఁ
గూడుకొంటివె లింగ! కూడలిసంగ!
జాడదప్పని మీప్రసాదావతారుఁ
గూడుకొంటివె లింగ! కూడలిసంగ!
యీడితభక్తిమహిమావతారుఁ
గూడుకొంటివె లింగ! కూడలిసంగ!
తప్పని నిజశివధర్మావతారు
నొప్పఁగొంటివె లింగ! కప్పడిసంగ!
త్రిప్పని వీరభక్తిస్థలాచారు
నొప్పఁగొంటివె లింగ! కప్పడిసంగ!
చొప్పారు [1]జంగమ సుపదప్రకారు
నొప్పఁగొంటివె లింగ! కప్పడిసంగ!
యొప్పగు సంతతాభ్యుదయప్రచారు
నొప్పఁగొంటివె లింగ! కప్పడిసంగ!
చెప్పఁ జిత్రంబగు శివప[2]థాచా[3]రు
నొప్పఁగొంటివె లింగ! కప్పడిసంగ!
వరలింగ సామ్రాజ్య పట్టబద్ధుండు
వరభక్తిపట్ట మె[4]వ్వారికిఁ గట్టితివి ?

౧. స, ౨. ధా, ౩. ర్యా, ౪. వ్వారికిఁగట్టితీవు.

యఖిలసద్భక్తిరాజ్యాన్వితమహితుఁ
డఖిలసద్భక్తిరాజాంకుఁ డెవ్వఁడు ?
నసమసద్భక్తదేహైక దేహుండు
నెనసిగ భక్తప్రాణి యింక నెవ్వఁడు ?
పురహర ! మిముఁబూన్చు పూజాఫలములు
వారిఁబోరి నొప్పించు పురుషుఁ డెవ్వఁడు ?
శంకర ! నీగణాస్థానంబుజ్యోతి
యింక నెవ్వఁడు దా నీ జగత్త్రయిని ?
సర్వాంక ! మీకూర్చు శరణులచేతి
దర్పణం బెవ్వఁ డీ త్రైలోక్యమునను ?
ప్రాణేశ ! మీమహాభక్తవర్గంబుఁ
బ్రాణమెవ్వఁడు జగద్భవనాంతరమున ?
నింక నీ వీరమాహేశ్వరాచార-
సంకులంబునకు దెసయు దిక్కునేది ?
యెవ్వఁడు వీరమాహేశ్వరసమయ
మివ్వసుంధర వెలయింపంగనోపు ?
నెవ్వండు వీరమాహేశ్వరశ్రేణి
ద్రెవ్వకుండంగఁ బ్రతిష్ఠింపనోపు ?

---

౧. త; మ, ౨. గు, ౩. చర, ౪. ణ, ౫. కు, ౬. నీ, ౭. ల, ౮. ర్య, ౯. నెద్ది, ౧౦. సర.

నెవ్వాండు వీరమాహేశ్వరమహిమ
నివ్వటిల్లఁగ భువి నిష్ఠింపనోపు ?
నెవ్వాండు వీరమాహేశ్వా[1]రాహితుల
క్రొవ్వడంగఁగఁ [2]గుంటఁగూ[3]ల్పంగనోపు ?
నెవ్వాండు వీరమాహేశ్వరకోట్ల
మవ్వంబు దళుకొత్త మన్నింపనోపు ?
నెవ్వాం డఖిలజంగమేచ్ఛానువర్తి ?
యెవ్వాండు జంగమాభీష్టప్రదాత ?
సాక్షాచ్ఛివుం డని జంగ[4]మప్రవరు
లీక్షిం[5]చు సద్భక్తివేత్త యెవ్వాండు ?
జంగమంబును బ్రాణలింగ మన్ భాన
భంగిగా వర్తించుభక్తుఁ డెవ్వాండు ?
నడుగకమును జంగమాభీష్టవితతిఁ
దడయకొసఁగు మహాదా[6]ని యెవ్వాండు ?
నిర్వంచకస్థితి నిఖిలభక్తుల[7]ను
సర్వార్థములఁ దన్పు స్వామి యెవ్వాండు ?
నెగడ నెల్లింటికి నేఁటి కెట్లనిన
వగ నెఱుంగని లింగవంతుఁ డెవ్వాండు ?

---

1. ర, 2. మది, 3. ర్చ, 4. మావళిని, 5. ంపు, 6. త, 7. కు, 8. లు.

ముట్టిన బయలైన మూర్తిఁ గావింప
నెట్ట[1]ణ చాలెడు నిపుణుఁ డెవ్వఁడు?
పట్టిన పదడైనఁ బసిఁడిఁగావింప
నెట్ట[1]ణఁ జాలెడు నిత్యుఁ డెవ్వఁడు?
తలఁచినభక్తవితానంబు దలఁచు
తలఁపులఁ దలకూర్చు దాత యెవ్వఁడు?
వంగకాయలు ప్రాణలింగముల్ గాఁగ
సంగతి దయఁజూచు శరణుఁ డెవ్వఁడు?
సజ్జనులకు లింగ జంగమభక్తి
నొజ్జ యై కఱపెడు నొడయఁ డెవ్వఁడు?
హరుప్రసాదంబుగా నత్యుగ్రవిషము
ధరియించి పడసిన ధన్యుఁ డెవ్వఁడు?
పేర్కొన్న సద్భ[2]క్త బృందంబు మతుల
కోర్కులు సెల్లించుఁ గుశలుఁ డెవ్వఁడు?
సత్యసద్భక్తి నిష్ఠను శివరాత్రి
నిత్యంబుఁ జెల్లించు నియతుఁ డెవ్వఁడు?
వెలుచ[3]జంగమజాతి భేదభావంబుఁ

---

౧. నఁజా; ణజేసెడు, ౨. క్తి, ౩. భక్తుల,

గలనైన నెఱుఁగని [1]గరువ యెవ్వాఁడు ?
శిరమటఁ బాసిన శివభక్తతతికి
శర [2]ణన్న మఱపని శరణుఁ డెవ్వాఁడు ?
పట్టినవ్రతములు ప్రాణంబుఁ బోవఁ
దట్టిన విడువని [3]దత్తుఁ డెవ్వాఁడు ?
నతనిసామర్థ్యంబు నతనిమహాత్త్వ
మతనిచరిత్రంబు లల్పుల కగునె ?
ప్రమథాధిపుల కెల్లఁ బ్రాణంబు [4]నీవు,
ప్రమథులప్రాణ[5]ంబు బసవలింగంబు,
సర్వేంద్రియములుఁ బ్రసాదేంద్రియములు,
సర్వాంగకళలుఁ బ్రసాదాంగకళలు,
గరణంబు లిష్టలింగము కరణములు,
సరణాబ్జములు ముక్తిసతి పుట్టినిండ్లు,
భరిత[6]సద్గుణములు భక్తిబీజములు,
సరిత[7]లు దేశికేశ్వరులకు గురులు,
వరుసవేదులు గరపల్లవాంగుళము,
లరయ నపాంగాంశు లమరధేనువులు,

---

౧. ఘనుఁడు నె. ౨. ణులు; ణని, 3. ధన్యు, ౪. మీరు, ౫. మా, ౬. గుణావళుల్, ౭. మల్ గురుచరే,

దలఁపులఁగొనలు సింతామణిగనులు,
వలుకులతీఁపులు వరతత్త్వలతికల,
లతనిలింగపసాయి తాఖ్యశస్త్రంబు
క్షితి ముత్తెములుగురిసిన దివ్యశుక్తి,
యతని లింగపసాయితాఖ్యశస్త్రంబు
క్షితిపతి యర్థ మిచ్చిన శైవలక్ష్మి,
యసమ లింగపసాయి తాఖ్యశస్త్రంబు
విస మమృతంబు గావించిన మందు,
నసమలింగపసాయి తాఖ్యశస్త్రంబు
నొసలిక న్నిశున కొసగినవేల్పు,
నలరు లింగపసాయితాఖ్యశస్త్రంబు
సెలువ కంబరము లిచ్చినపేటికంబు,
ధరణి లింగపసాయితంబను వాలు
హిరియనాగయకుఁ బా లిచ్చినసురభి,
సారంబు లింగపసాయితాయుధము
సోరులకును భక్తి సూపిన గురువు,
నడరు లింగపసాయితావ్వాయాయుధము
వడకుండఁ గాళవ్వఁ బట్టిన కరము;

---

౧. దొ, ౨. వు, ౩. లతిలు, ౪... ౫. తుల, ౬. యు, ౭. దు, ౮. తావ్వాయాయుధము,

సంగతి లింగపసాయితాయుధము
జంగమప్రాణాభిసంగతికీటు,
నలరు లింగపసాయితాహ్వయాయుధము
నెలమి బిజ్జలు శపియించిన జిహ్వ,
జననుత లింగపసాయితాయుధము
ఘనమగు తలంపుల కల్పభూరుహము,
బసవనిమూర్తి నెబ్బంగిఁ గీర్తింప ?
బసవని మహిమ నెబ్బంగి నుతింప?
బసవఁడె యెఱుఁగు నా బసవన్న చరిత;
వసమె యెవ్వరికైన వర్ణింపఁ నేయ ?
బసవాక్షరపఠన[3]ఫలము మాహాత్మ్య
మసమాన, మెట్లన్న నట్లాక్కమాఱు
'బ' యన్న లింగసంబంధసౌఖ్యంబు,
'స' యన్న సద్గురు సత్కృపోన్నతి[4]యు
'వ' యనినఁ బ్రసాదవహనంబుఁ బొందు,
వాయార నటు 'బసవా!' యనిరేని;
నసలారఁ ద్రిస్థలోద్యద్భక్తియుక్తి
బసవన్న గేవలభక్తుఁడే దేవ!

---

౧. త. ఱ. న సేయ, 3. ఫలమహత్త్వంబె (బు), ౪. కి,

విను " తవ పుత్త్రో భవిష్యామి " యనుచు
ము¹ను శిలాదుం డను మునివల్లభునకు
శంభ దుదాత్తవిస్ఫూర్తి ద్వితీయ్య
శంభుఁడనఁగఁగాడె జనియించి తీవు?
నసమాత్మభక్తిహితార్థమై నీవ
బసవఁ డన్ పేర సంభవ మైతి కాదె ?
యసమాన ! యటుగాన హరుఁడన్న నీవ
బసవండనఁగనీవ పానలొండేల ?
విశ్వేశ ! యయ్యాదివృషభేంద్రమూర్తి
విశ్వవందితకీర్తివిస్ఫూర్తి బసవ-
లింగంబు నీదివ్య లింగగర్భాబ్ధి-
సంగతాభంగురోత్తుంగతరంగ-
రంగసంగతమూర్తి యంగీకరించి
భంగిగా నం³ద వెలుంగె, ముల్లోక-
గురుఁడ ! యెట్టులు గూడుకొంటి సద్భ⁴క్త-
వరగణాధీశు ⁵లెవ్వరుఁ గానకుండ ?
మడివాలు మాచయ్య మ⁶఼ఱుగు వర్చితివొ
బడ²గర బ్రహ్మయ్యఁ బని⁸కిఁ బంచితివొ.

---

౧. ని. ౨. రూప, ౩. చె, ౪. క్తి, ౫. నె, ౬. దు, ౭. వ్వ. ౮. యు,

మాదిరాజయగారి మరులు గొల్పితివో
యాదయ్య మల్లయ్య సపులంబుచ్చితివో
కిన్నర బ్రహ్మయ్యం గ్రిక్కరించితివో
కన్నడ బ్రహ్మయ్యం గను మొఱంగితివో
శూలద బ్రహ్మయ్యం జూపు దప్పితివో
మోళిగ మారయ్య మోసపుచ్చితివో
తెలుంగు జొమ్మయగారిం దీలు పర్చితివో
కలకేత బ్రహ్మయ్యం గడవంబుచ్చితివో
కక్కయ్యం గల్లయ్యం దక్కువెట్టితివో
చిక్కయ్య లింగయ్యం జిక్కువర్చితివో
గజ్జెశు మసనయ్య బుజ్జగించితివో
యజ్జదాసయగారి నాగడించితివో
షోడ్డల బాచయ్య వెడ్డువెట్టితివో
వెడ్డునాగయగారి వెడ.. వర్చితివో
దసగణ సింగయ్య ...దప వెట్టితివో
ము..సుండి చౌండయగార ..ము న్నమర్చితివో

---

౧. దె, ౨ నల్ల, సకల, ౩. నలంత, ౪. గేక, ౫. డ, ౬.రి. ౭. దిక్కుమఱచితివో; దిక్కువచ్చితివో, ౮. గలంత, ౯. డి, ౧౦. దక్కు, ౧౧. సిడి (ది), ౧౨. ముండువెట్టితివో; మోసపరచి.

గురుభక్తదేవని గ్రుమ్మఱించితివో
సురగి చౌడయగారిఁ జొక్కఁబెట్టితివో
నాచిదేవయగారి నవ్వు సేసితివో
యాచెన్నబసవన్న నవులఁ బుచ్చితివో
యేకాంతరామయ్య నేమఱించితివో
కాక వారున్నను గన్నను విన్న
సంగదబసవన్న సద్భక్తతిలకు
మ్రింగనిత్తురె నిన్ను సంగమేశ్వరుఁడ!
నిచ్చ గుంచెఁడుపాలు నిన్నుఁ ద్రావింప
మెచ్చి యాగొడగూచి మ్రింగినయట్లు,
మ్రుచ్చిలి ఘటమధ్యమున నిన్నుఁ గొలువ
మెచ్చి బొల్లవ్వను మ్రింగినయట్లు,
లిచ్చ శివాధిక్య మిలఁ బ్రతిష్ఠింప
మెచ్చి బాచరసును మ్రింగినయట్లు,
లచ్చుగా జైనబౌద్ధాదులఁ ద్రుంప
మెచ్చి యొడ్డయపిళ్ల మ్రింగినయట్లు
మెచ్చక యితరనామోచ్చారుఁ ద్రుంప
మెచ్చి యుర్యమరాజు మ్రింగినయట్లు,

---

౧. క్తి, ౨. క.

నచ్చి నీ సందర్శనము సేయురతికి
మెచ్చి తిర్నాళ్ళోపల [1] మ్రింగినయట్లు,
మచ్చిక దృఢభక్తి సూనసంబునకు
మెచ్చి వాగీశ్వరు మ్రింగినయట్లు
సెచ్చెరఁ బాడంగ సిద్ధబుద్ధయల
మెచ్చి యందఱుఁ జూడ మ్రింగినయట్లు,
గ్రచ్చుల నిర్వంచకత్వంబునకును
మెచ్చి యాబసవన్న మ్రింగితే నేఁడు?
దాసయ్య, శంకర [2] దాసయ్య, దాస-
కేసయ్య, ధూర్జటి కేశిరాజయ్య,
దారయ్య, భోగయ్య, దసరయ్య, శివకు-
మారయ్య, దోరయ్య, మలయరాజయ్య,
మోహిళుఁ, డుద్భటుఁ, డుత్తుంగచోడఁ,
డాహుతి [3] మల్లిదేవయ్య, [4] మెల్లయ్య,
మధుపయ్య, జగదేవ మల్లబ్రహ్మయలు,
నిధనయ్య, ధవళయ్య, నేమద మైలి,
వీరశంకరుఁడు, నిర్విషదమల్లయ్య,

---

౧. ళ్లువో; ళోవ; శ్రావ; శ్వావ. ౨. దాసదాసయ్య? దాసయ్యదాస, ౩. దేవమల్లయ్య, ౪. ము.

వీరభద్రయ్య, గోవిందభట్టార-
కుండు, భల్లాణదే[1]వుండుఁ, గుమార-
[2]పాలఘూర్జరుఁడు, [3]బొప్పమహావామనయ్య,
గాలకంధరుఁడుఁ, జిక్కయదేవఁ డాది
ప్రచురపురాతన ప్రఖ్యాతభక్త-
నిచయంబు నీకుక్షిఁ నిండియున్నారు,
సాలదే బసవన్న శరణాగ్రగ[4]ణ్య
నేల మ్రింగితి చెప్పవే బసవేశ?
సిసువుఁ దినంగ నాసించినజిహ్వ
కసివోవకున్న[5]దే కంకాళమూర్తి ?
నాఁటిమృగావళి నమలిననోఁ[6]రి
తీఁటవోకున్న[7]దే దివ్యలింగాంగ ?
గోవత్సభక్షణ ! కుత్తుక[8]క్రొళ్లు
పోవకయున్న[7]దే భోగవత్సలుఁడ ?
వీక లోకములు సేవించినపండ్లు
ప్రాకు వోకున్న[7]దే ప్రళయాగ్నిరుద్ర !
మ్రింగనఁ[9]గొండివై మ్రింగితి బసవ-

౧. వు, ౨. ఘా, ౩. బొ (చొ)ప్పయ, ౪. ణ్య. ౫. దా; నా, ౬. టి, ౭. నా, ౮. కుళ్లు ; కసటు, ౯. గొండవై ; గొండిమై,

లింగకుమారుఁ బాలితశివాచారుఁ
గరుణాత్మలింగ జంగమభక్తియుక్తుఁ
బారిఁగొనఁ దలఁచితే? భూస్థలినింక
దివియయులేని మందిరము, విద్యాప్ర-
భవము లేనట్టి సభాసమూహంబు,
దానంబు లేని మాతంగంబుఁ, గంపు
లేని పుష్పంబు, సన్మానంబు లేని
దానధర్మము, లభిమానంబు లేని
మానిని, ప్రాణంబులేని దేహంబు,
శాంతి లేని యతి, భజనలేని తపముఁ,
గాంతి లేని మణి, నిక్కము లేనిపలుకు,
శశి లేని నిసి, [3]దివస్పతి లేని పగలుఁ,
*(బసులకాపరి లేని పశునివహంబు,
రసహీనమైన నిస్సారంపుఁగవిత,)
బసవన్న లేని సద్భక్తలోకంబు
నొప్పునే నీకు దివ్యోరులింగాంగ!

---

౧. వి, ౨. గ్గ. ౩. నివేశములేని యూరు; యహస్పతిలేని పగలు,

* ఈరెండు పాదములకున్ను సంస్కృత గ్రంథములో అనువాదము లేదు.

కప్పడిసంగ! సంగతోదయాపాంగ!
విగతాభిషంగ! నివీతభుజంగ!
[1]యగసుతార్ధాంగ! భక్తాత్మాబ్జ భృంగ!
పరిహృతానంగ! శుంభద్గుణోత్తుంగ!
యురుతరగంగాతరంగోత్తమాంగ!
విమలకీర్తిసురంగ! [2]వేదాంతశృంగ!
ప్రమథాంతరంగ! యుభంగ! యోలింగ!
చూపవే బసవన్న సుకృతావతారు
జూపవే బసవన్న సుజనమందారు
జూపవే బసవన్న సు[3]గుణ[4]విస్తారు
జూపవే బసవన్న సురుచిరాకారు
జూపవే బసవయ్య శ్రుతిమతాచారు
జూపవే బసవయ్య [5]సుపథప్రచారు
జూపవే బసవయ్య [6]సూనృతాధారు
జూపవే బసవయ్య [7]బాపాపహారు
ముంగల బసవన్న మూర్తిభక్తేష్ట-
లింగగర్భమున వెలుంగింపకున్న

1. యగజను (సు) స్సంగ, 2. వేదతురంగ, 3. జన, 4. నిః
5. శుభద, 6. సూనృతాచారు; సుకృతావతారు, 7. బాపసంహారు.

[౧]భ్రష్టయి కనుక[౨]న్నిం బాజు[౩]రే దేవ
[౪]దృష్ట ననర్పిత స్థైయాభి[౫]నిరతి ?
భక్తులజిహ్వాల బసవాక్షరములు
వ్యక్తంబుగాఁగ నీ వచ్చొత్తకున్న
జిహ్వాగములచేత [౬]జిరజిరగా వె
జిహ్వా లనర్పిత స్థైయాభిరతిని?
భక్తులమనముల బసవాక్షరము[౭]లు
వ్యక్తంబు గాఁగ నీ వచ్చొత్తకున్నఁ
[౮]బనుగొన విషయవిభ్రాంతిమైఁ జెడ[౯]రె
[౧౨]మనసు లనర్పి[౧౧]తోన్మత్తాభిరతిని ?
భక్తుల [౧౦]తలఁపుల బసవాక్షరములు
వ్యక్తంబుగాఁగ నీ వచ్చొత్తకున్నఁ
బలుద్రోవలను వృథా భ్రాంతిమైఁ జెడరె
తలఁపు లనర్పిత స్థైర్యాభిరతిని ?
భక్తులపలుకు[౧౩]ల బసవాక్షరములు
వ్యక్తంబుగాఁగ నీ వచ్చొత్తకున్న

---

౧. భ్రష్టులై, ౨. లి, ౩. వే, ౪. దృష్టుల, ౫. రతిని, ౬. పరపగా (క; రి) రా (గా) వె, ౭. ల, ౮. పలుత్రోవలనువృథా, ౯. వె. ౧౦. తలఁపు, ౧౧. తస్థైర్యా, ౧౨. మనసు, ౧౩. లు,

నిల దురాలాపవశేచ్ఛమై ౯ జెడ౧రె
పలుకు లనర్పిత బ్రమితాభిరతిని?
గావున బసవలింగ౨ము భవ్యదేహ-
భావ మచ్చొత్తవే భక్తేంద్రియముల"
నని ప్రలాపించుచు, వనరుచు, శోక-
వనధిఁ దేలుచు, భక్త-వర్గంబుఁ దాను
లింగార్చనములు సెల్లించుచుఁ జెలఁగి,
మంగళారతు లెత్తి మహిత తదియ్య-
లింగగర్భమున సల్లీల నొప్పా౩రు
భంగిగా బసవన్న భావంబు దోఁపఁ
గనుఁగవ హర్షాశ్రు కణములు దొరుఁగఁ
దనువున రోమాంచతతు౪లుఁ దలిర్పఁ
గంధర౫సీమ గద్గదిక నెక్కొనఁగ
బంధురానంద విభ్రాంతిఁ బండితుఁడు
గనువిచ్చి చూచుచుఁ, గరమర్థి మ్రొక్కు-
చును, భజింపుచు, నభిష్టుతులు సేయుచును,
"నీమూర్తి యస్మదియ్యేష్టలింగము మ-

---

౧. వె, ౨. మదయదేవ; ము దివ్యదేహ, ౩. ౪. ౪. లుల్ల
సిల్ల, ౫. మునను గద్గదము,

హేమూర్తి నైన వృషాధీశుమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశు దివ్యప్ర-
భామయం బగు వీరభద్రేశుమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశులీలాభి-
రామ[1]మై చను మహాప్రమథేంద్రమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశు నిజాంగ-
ధామమై చను ప్రసాదస్ఫూర్తిమూర్తి,
యీమూర్తి యస్మద్దియ్యేశుండు దాన
కామించి నైన జంగమలింగమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశు గర్భమున
నేమించి వెలుఁగెడు నిజలింగమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశు ననన్య-
సామాన్యమై చను సద్గురుమూర్తి
యీమూర్తి యస్మదియ్యేశుండు బసవ-
నామంబుఁ దాల్చిన నందీశమూర్తి,
యీమూర్తి భావించు నింతన భవభ-
యామయ దుఃఖాతురాదు లడంగు,
నీమూర్తిఁ గైకొను నింతన నైహి-

1. మై.

కాముష్మికాదిసౌఖ్యములు వ[1]ట్రిల్లు,
నీమూర్తి ను[2]తియించు నింతన భక్తి-
భామా[3]వలోకనపదవి సిద్ధించు"
ననుచు శ్రీబసవదండాధీశు మహిమఁ
గొనియాడుచును జగద్గురుఁడు వండితుఁడు
సద్భక్తవరులును శంకరయ్యయు మ-
హాద్భుతాక్రాంతాత్ములై యుండి రంత;
జంగమ శ్రీపాద జలజ[4]పరాగ,
జంగ[5]మరోహణాచలపద్మరాగ,
జంగమారాధనాక్రాంతానురాగ,
జంగమసంచిత [6]శ్లాఘా[7]నురాగ,
జంగమాభీష్ట పూజాబహిర్యాగ,
జంగమధ్యాన నిశ్చలితాత్మయోగ,
జంగమసౌఖ్యాభిసంతతోద్యోగ,
జంగమాజ్ఞాంకుశ చర మదనాగ,
జంగమలబ్ధ ప్రసాదోపభోగ,
జంగమాశీర్వాద శతమహాభాగ,

౧. ర్ధి, ౨. ద, ౩. న్యు, ౪. ప్రకార, ౫. మా, ౬. శ్లోకా,
౭. భిమో.

యఱలేనిసఖుఁడ ! సూరార్య ! నాసుద్దు-
మఱఁది ! వి న్మిది మహిమప్రకరణము.

గద్య

ఇది యసంఖ్యాత మాహేశ్వరదివ్య-
పదపద్మ సౌరభ భ్రమరాయమాణ-
జంగమలింగ ప్రసాదోపభోగ-
సంగత సుఖసుధా శరధినిమగ్న-
సుకృతాత్మ సాలకురికిసోమనాథ-
సుకవిప్రణీత భాసురతర దండ-
నాయక బసవాంకన. ఖ్యాతగుణ గ-
ణాయతకీర్తి దిగంత త్రిలోక-
గురు పండితారాధ్యచరితంబునందు
గరముఁ జతుర్థప్రకరణ మొప్పారు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

౧. మల్లికార్జున.

మల్లికార్జున

# పండితారాధ్యచరిత్ర

---

## పర్వత ప్రకరణము

---

పండితారాధ్యదేవుని శ్రీపర్వతదర్శన తన్మాహాత్మ్యస్తుతి కథనము

శ్రీకీర్తి సంశ్రితాంచిత వీరభక్తి
సాకారనియమి[1]తసత్య సూరార్య!
భూరియశుం[2]డు వనిపురశంకరయ్యం-
గారి [3]వీడ్కొని పండితారాధ్యవిభుండు
సనుదేరం జనుదేరం [4]జక్కం గట్టెదుర
వినువీథిం దాంకి న [5]వీనవిస్ఫురణ
శుంభదంబుధియు నీలాం[6]భోదములును

---

౧. తామాత్య; తోమాత్య, ౨. డవని; డువనీ, ౩. దోడ్కొని, ౪. జంకగట్టెదరు, ౫. విశద; వినవ, ౬. బుద (భోద) లతయు.

శంభుకుత్తుకఁ[౧]గప్ప[౨]సాఁగినయట్లు
నల్ల[౩]నై నిబిడమై సందితంబై స-
ముల్లాసహేతువై [౪]యొప్పె నెట్లనినఁ—
[౫]గడలేని నిర్మల[౬]గాఢమహత్త్వ-
జడతావిహార విస్తారోదకముల,
నంగీకృతాయతోత్తుంగ[౭]శృంగాఘ-
మంగళరంగత్తరంగ సంఘము[౮]లఁ,
బటుశైలమూ[౯]ర్డా విభాసి నీహార-
పటలప్రకార విస్ఫారఫేనముల,
శైలా[౧౦]గ్రవిహారణాసక్త ప్రమథ వి-
శాల[౧౧]దివ్యవిమానచయ వహిత్రముల,
నరనుత [౧౨]తద్వ్వమానధ్వజదండ-
గురువహిత్రోత్తాల[౧౩]కూప[౧౪]దండముల,
సంచితనానాదిశాస్థానచయ స-
మంచిత ద్వీపాంతరానీక[౧౫]ములను
స్థిరగిరిపార్శ్వనదీప్రవాహ[౧౬]ప్ర-

---

౧. కంపు; కప్పఁ, ౨. జాగిన; జాలిన, ౩. మై, ౪. యొప్పు, ౫. కడు, ౬. గాడమహాత్మ, ౭. రంగా, ౮. లు, ౯. డ, ౧౦. భ్ర, ౧౧. విద్య, ౧౨. ద్వీపమానధ్వజదండ; ద్వాపమానధ్వజదండ, ౧౩. కూటు; కూల, ౧౪. దండములు, ౧౫. ములును; మునను, ౧౬. త్ర-సర.

సర[1]తదియ్యా[2]ద్వీప [3]చారుమార్గముల,
బరమనైష్ఠిక శైవ పాశుపతాది-
చిరతపోధనమహాపురుషరత్నముల,
[4]మాయావిముఖ వీరమాహేశ్వరాది-
[4]నాయకాఘనర్ఘ్య నాయకమణుల,
నంత[5]ర్మహీస్థలానంత శైలౌఘ-
కాంత మైనాకాది ఘనతరగిరుల,
నంటినమనుజుల [6]నంటఁగఁబట్టు
[7]నంటు[8]ఱాలను నిజాయస్కాంతగిరుల,
నెలమిఁ ద్రింశద్యోజనేతరభూమిఁ
జెలియలి[9]కట్ట యన్ [10]సీమాస్థలమున
మానితంబై[11]యిట్లు శ్రీనగాంభోధి
గానంగనొప్పె ముంగల [12]నట్లు[13]గాక,—
[14]నివుడు [15]ప్రహర్షిత నీలకంఠములఁ,
[16]దవులు ముముక్షుచాతక[17]వితానముల,
హితమనోరథ సమాహితఫలేచ్ఛాను-

---

౧. తద్వితీయ, ౨. ద్వీప, ౩. చార, ౪. ఈ రెండు పంక్తు లున్న అచ్చుపుస్తకములో లేవు, ౫. ర్బహి, ౬. కంటంగ, ౭. నంటు; నంటి, ౮. రాయను, ౯. కట్టను, ౧౦. శీల, ౧౧. యట్లు, ౧౨. నట్టు, ౧౩. గాఁగ, ౧౪. నివుడ, ౧౫. బ్రహర్షించు, ౧౬. దవుల, ౧౭. విమాన.

గత[౧]పరిషత్కర్షక ప్రతానముల,
సురుచిర [౨]సత్పథ [౩]సోపాన [౪]కలిత-
పరిచితాభ్రంకష స్ఫురితవర్త[౫]నుల,
స్థిర వృక్ష కాష్ఠ నదీతృణ జ్యోతి-
రురుతర స్ఫురిత విద్యుల్లతాతతులఁ,
ప్రథితాద్రిచూడా నిపతితానవరత-
పృథుతర కరికర పీవరపుణ్య-
పూరిత నిర్ఝరధారాసమూహ-
సార [౬]ఝుంకార నివారిత[౭]ధ్వాన-
ఘనతర [౮]తద్గుహా గహ్వ[౯]రోద్భూత-
జననుత ప్రతిశబ్ద [౧౦]శబ్ద[౧౧]గర్జనల,
ననమ నిజాంగదృగంచలో[౧౨]ద్భూత-
విస్మృమర కారుణ్య రసపూరములను,
ననుపమ స్వర్గమోక్షాద్యభీష్టార్థ
వినుత ఫలా[౧౩]పార వృష్టిఁ బెంపా[౧౪]రి,
యసలా[౧౫]రు శ్రీనగం బను నీలమేఘ

---

౧. పరిష్కర్మకర్షక; పరిషట్కర్షక, ౨. తత్పథ; తత్పద, ౩. సోపాన, ౪. కరిత, ౫. నల, ౬. ఝుల్కార; ఝూత్కార, ౭. ధ్యాన, ౮. తద్గుహ్యా, ౯. రోద్ధూత; రోద్ఘాత, ౧౦. చక్ర; శక్ర, ౧౧. ఘర్జనల; ఘర్జనులు, ౧౨. ధ్రూ, ౧౩. హార; వార, ౧౪. ర, ౧౫. రి; ర.

మసమానమై యొప్పె; నట్లునుం గాక,—
పృథుతరంబై యొ¹ప్ప ²పృథ్వి పీఠముగఁ,
బ్రథితాం³బరము దివ్య భవ్యలింగముగఁ,
గ్రన్న ⁴దిక్చయము మేఖలయుఁగా, దిశ⁵లు
వ్రన్న⁶ని దివ్యాంబరంబులు గాఁగఁ,
బొలుపారు నక్షత్రములు పుష్పములుగ,
నల⁷రు సూర్యేందు లుద్య ద్దీపములుగ,
నెల⁸యఁ దత్త్వాతీత నిత్యచిన్మూర్తి
గొ⁹అలు జటాజూట కోటీరముగను,
నరుదగు సూక్ష్మతత్త్వాకారుఁ డైన
హరుగళంబున నున్న హాలాహలంబు
నీలి¹⁰మదోచిన ¹¹లీలఁ బర్వతుని
నీలవర్ణాకృతి నేత్రపర్వముగ
హర్షాశ్రుపూరితాపాంగమార్గుఁడు, ప్ర-
కర్షితస్మితవక్త్ర కమలభా¹²స్వరుఁడు,
స్ఫురితరోమాంచ కంచుకిత దేహుండు,
గర మవిచ్ఛిన్న గద్గదకంధరుండు,

---

౧. ప్పె, ౨. పృథివి, ౩. గగనము; బరమ, ౪. దిగ్వలయ, ౫. ల, ౬. న, ౭. రి, ౮. యు, ౯. కారమైన, ౧౦. మి, ౧౧. నీల పర్వతము, ౧౨. స్క.

నిత్య[1]భావ స్వర నేత్రాంగ విక్రి-
యాత్యంత పరవశుఁ డగుచు వెండియును,
గనుగొంచు మ్రొక్కుచుఁ గతిపయదినము-
లను [2]వెల్లటూరి కొయ్యన [3]యేఁగుదెంచి,
మఱియు నుద్యద్భక్తి ఘటిఁ బర్వతునకుఁ
దఱిఁదఱి మ్రొక్కుచుఁ దాఁ జూచిచూచి—
భంగించి కుంభసంభవుఁడు మున్ ద్రొక్కఁ
గ్రుంగిన వింధ్యాద్రి గురుత దానెంత?
యిందీవరాక్షుచే నెత్తంగఁబడిన
మందరనగము సమగ్రత యెంత?
తూలి రావణుని చేతుల [4]నూఁపఁబడిన
కైలాస[5]శైలంబు గాంభీర్య మెంత?
తనపర్వతత్వంబుఁ [6]దఱిగి మానంబు-
ధను వైన మేరుభూధర[7]శక్తి యెంత ?
మున్ను వజ్రికి నోడి [8]మున్నీట డాఁగి
యున్న మైనాకాద్రి యున్న[9]తియెంత ?

---

[1]. భాస్వత్స్వర; భాస్వత్స్వక; భాస్వత్పర, [2]. వెల్లలూరి; వేమలూరి, [3]. నే, [4]. నూఁచ, [5]. శిఖరంబు, [6]. ధర నుమాదేవు; ధరవిమానంపు, [7]. మది, [8]. మున్నీడ, [9]. ది.

[౧]యంతంత గంగా[౨]పయస్ఫూర్తిఁ జేవ-
యంతరించిన మాల్యవంత [౩]మొప్పెంత ?
కమలాప్తరుచుల[౪]కాఁకకు నశియించు
హిమవన్నగంబుమహి[౫]స్థతయెంత ?
తప్పక భాస్కరోదయవేళఁగాని
యెప్పని యుదయాద్రి యొప్ప దానెంత ?
కడుపు [౬]సొచ్చిన మి[౭]త్రు ఘనతరతేజ
మడఁగించు నస్తాద్రి యాధిక్య మెంత ?
తలఁపఁ జందనములు దక్కంగ నొందు
గలుగని మలయాద్రి గౌరవం బెంత ?
తా నీశు నొకనాఁడుఁ దాల్పంగలేని
మానసోత్తరగిరి మాహాత్మ్య మెంత ?
చంద్రాంకు దను బాసి చన[౮]నిల్చినట్టి
యింద్రకీ[౯]లాద్రి మహిష్ఠత యెంత ?
పటు శోణ పాషాణ బహువర్ణరీతి
నటియించు రోహణనగము [౧౦]పెం పెంత ?

---

౧. యంతట, ౨. చయ; వయ, ౩. ముప్పెంత; మోవెంత, ౪. కుగాకనశించు; కుగాఁకడగించు, ౫. ష్క, ౬. నొ; మె; యె, ౭. త్ర, ౮. నిచ్చి, ౯. లంబు, ౧౦. గుంపెంత; యొప్పెంత; గుప్పెంత.

జనపతి యగు రాము [1]చాపంబుచేతఁ
దునిసిన గంధమాదనము [2]చెంపెంత ?
[3]యోరంత ప్రౌద్ధు భూభారకత్వమునఁ
దారుండు కులపర్వతము[4]ల [5]పెంపెంత ?
మొదలఁ గ్రోతులుమ్రోవ ముఱిసి పడ్డట్టి
పదటికొండల [6]పిండు పాటి దా నెంత ?
నాఁడు [7]నేఁడన కెల్ల నాఁడు[8]నేనాఁడుఁ
బోఁడిగా భంగంబుఁ బొందనియట్టి
పొగ[9]డిత నెగడు శ్రీనగసార్వభౌముఁ
బొగడరే కృతమతుల్ పుణ్యైకరాశి ;
నొక్కొక్కగిరులయం దొక్కొక్కమహిమ
నెక్కొనుగాక యనిందితమహిమ
గలుగునే [10]నరులకుఁ గామ్యార్థసిద్ధి
గలుగునే [11]భోగమోక్ష సుఖాభివృద్ధి
గలుగుఁగా కిల శ్రీనగస్పర్శవేది-
వలన శ్రీశైలభాస్వరసుర[12]తరువు-

---

౧. శాపంబు, ౨. సొంపెంత, 3. వోరంత; వోరెంత, ౪. లు, ౫. గుప్పెంత; సొంపెంత, ౬. పెంపు, ౭. నాఁడునునెల్ల; నేఁడునునెల్ల, ౮. నెన్నాఁడు, ౯. డిక; డత, ౧౦. పరు, ౧౧. మోక్షభోగ; మోక్షసుఖాభివృద్ధియును, ౧౨. తనువు.

వలన, శ్రీపర్వత వరకామ[1]దుఘము-
వలన; నెట్లనిన,— నవారితభక్తి
భ్రాజిల్లు పర్వ[2]తు పటు[3]తపఃఫలము
దేజోమహత్త్వంబు దివ్యాంగ మనఁగ,
సురుచిరమల్లికార్జున సముత్తుంగ-
[4]వరమహాస్థానంబు [5]వదనాబ్జ మనఁగ,
ఘనతర ధర్మార్థ కామమోక్షము[6]లు
దనరు శ్రీపాదపద్మంబు లనంగఁ,
గన్నులు [7]నీప వృక్షంబు లనంగఁ,
జెన్నగు [8]శృంగముల్ శృంగంబు లనఁగ,
గుహలు నాసాపుట కుహరంబు లనఁగ,
మహితభూజములు రోమంబు లనంగ,
నొగి [9]గుహాంతరవాయు [10]వూరుపు లనఁగఁ,
పగు శ్రుతిస్మృతులు [11]శ్రోత్రంబు లనంగ,
వరచతుర్ద్వారనివాస లింగములు
సరసత నొప్పారు చన్ను లనంగ,
దొరఁగు పుణ్యంబు[12]లందుల దుగ్ధ మనఁగ,

---

౧. మఖము, ౨. త, ౩. తర, ౪. పరమమహాస్థాన, ౫. పదకా, ౬. ల, ౭. దీప, ౮. శృంగంబు శృంగం బనంగ, ౯. మహాంతర, ౧౦. వూరువు లనఁగ; వూరు లనంగ, ౧౧. శాస్త్రంబు, ౧౨. లుదుగ్ధంబు లనఁగ.

వరపరిషత్కో[౧]టి వత్సంబు లనఁగ,
నమ[౨]లిన నిజకీర్తి యది[౩]యు వాలముగఁ,
బ్రమథాధిపులు వరి[౪]పాలకు లనఁగ,
నందితం బైన శ్రీనగకామధేను
వందకా కెవ్వి యిష్టార్థముల్? మఱియుఁ,—
బరగు పర్వత తపగఫలదాత యైన
[౫]వరు ప్రసన్నత యాలవాలం[౬]బనంగఁ,
బొనరు పర్వతపూర్వపుణ్యదేహంబు
ఘనతరంబైన కూఁక[౭]ట [౮]వేరుగాఁగ,
వీఁగుఁబర్వతు నగాన్వితరూపతనువు
దాఁ గరిగొన్న మొదలిదుంప[౧౦]యనఁగఁ,
బొదలి నద్దైన సొంపు వొంపిరివోవఁ
గదిసిన కొండ[౧౧]లు గవ[౧౧]టలనంగ,
నశ్వమేధాద్రిముఖ్యాఖిలగిరులు
శాశ్వతశాఖోపశాఖ[౧౨]లనంగఁ,
గరమొ[౧౩]ప్పపాతాళగంగాదినదులు
వరుస వేల్లితబహువల్లరు[౧౪]లనఁగ,

---

౧. ట్లు, ౨. రి, ౩. య, ౪. వారకు, ౫. వర, ౬. ంబు గాఁగ, ౭. టి, ౮. షేరు, ౯. గాఁగ, ౧౦. లగములోయనంగ, ౧౧. టు, ౧౨. లుగాఁగ, ౧౩. ప్ప, ౧౪. ల్గాఁగ.

ఘనహానిర్య కాంతిమ న్మరకతశిలలు
బహుళంబు లగుహరిత్పత్త్రంబు లనఁగ,
నగణితరుచిప్రవా ళాబ్జరాగములు
[1]జిగిఁ[2]దులుకాడెడు చి[3]వురు లనంగఁ,
గమియు మౌక్తిక చంద్రకాంత వజ్రములు
[4]గొమరారు నెఱివిరిగుత్తు లనంగ,
[5]నమరంగఁ గామ్యార్థు లైనసాధకులు
[6]దమిఁ[7]గంపుఁ గొను తేఁటితండంబు లనఁగ,
శ్రీ స్వయంభూ[8]లింగ సిద్ధలింగములు
భాస్వర వరదివ్యఫలము లనంగఁ,
దలఁపోయ మునులును దాపసోత్తములు
ఫలము[9]లానెడు శుకప్రకరంబు లనఁగ,
నందితంబైన శ్రీనగకల్పతరువు
నంద కా కెవ్వి యిష్టార్థముల్ ? మఱియుఁ,—
దారాదిలోహ తత్తద్వర్ణసమితి
వారించి శుద్ధ సువర్ణంబు సేయ
విరచింప [10]నాస్పర్శవేదిక చెల్లు,
వరసూక్తి "స్వర్ణం భవతి" యనునట్లు

1. దొ, 2. డి, 3. సఖు; సురు, 4. ననయంబు, 5. తను, 6. గప్పు, 7. పద, 8. లనెడి, 9. దా, 10. చెల్లె; లెల్ల.

ద్విజముఖ్యజాతు లా[౧]దృతిఁ దన్ను ముట్ట
వృజినంబు లడఁచి పవిత్రులఁ జేయఁ
జిరసూక్తి "సంత్యజా స్స[౨]ప్రష్టా్వ" యనంగ
ధరఁ జెల్లు శ్రీపర్వతమున నిన కాక
తలపోయ శ్రీపర్వత స్పర్శవేది
వల[౩]నన కాకెవ్వి వాంఛితార్థములు ?
ధర నెన్నఁ దగు పర్వతంబులలోన
సిరిగిరి[౪]యును నొక్క గిరి యనఁ జనునె ?
లింగమూర్తుల[౫]ప్రోవు, లీలల[౬]లావు,
మంగళత్వము[౭]నెల్ల, [౮]మహిమల కెల్ల,
బరమార్థ[౯]ముల కాది, ప్రమథుల వేది,
సురతరువులగుంపు, సురభులసొంపు,
సింతామణుల[౧౦]పెల్లు, [౧౧]సిరిపుట్టినిల్లు,
సంతసంబులతీపు, సత్యంబు[౧౨]తీరూపు,
స్పర్శవేదులరాశి, ప్రత్యక్షకాశి,
దర్శనంబులముక్తి, ధన్యతశక్తి,

---

౧. వృతి, ౨. క, ౩. నకాకెవ్వియు, ౪. యన, ౫. ప్రోది, ౬. తావు; తావు, ౭. కెల్ల, ౮. మహిమలతెల్ల; మహితత లెల్ల; మహితాత్ము లెల్ల ('సారో మహిమ్నాం' అని సం.), ౯. ముక్త్యాది, ౧౦. యిల్లు, ౧౧. శ్రీ, ౧౨. రాపు.

దమితేంద్రియులసీమ, దా[౧]నులప్రేమ,
విమలతమురువు, దత్త్వము పొట్ట[౨]పొరువు,
జంగమోత్సవము, [౩]ప్రసాదంబు జవము,
సంగీతములగుత్తి, శరణులవృత్తి,
నిర్గతాఘులదృష్టి, నిత్యతపుష్టి,
స్వర్గంబు [౪]గరసు, మోక్షంబులవెరసు,
శివయోగుల [౫]యిరవు, సిద్ధుల[౬]వెరవు,
ధ్రువకీర్తిపెంపు, నిత్యులమతి యింపు,
నదు[౭]లచొచ్చినయిల్లు, నగముల[౮]పెల్లు;
సదమలాత్ములపేర్మి, శంకరుకూర్మి,
దపములమెల్లి, దీర్థంబులవెల్లి,
జపసమాధులప్రొద్దు, [౯]సమయులదుద్దు,
[౧౦]భక్తులచెలువు, విరక్తుల[౧౧]నెలవు,
ముక్తిమం[౧౧]తులత్రోవ, మోదంబు[౧౨]చేవ,
భవసాగరమునావ, [౧౩]వదవుల[౧౪]తావ,

---

౧. సు, ౨. పొర (రు) వు; జొరువు, ౩. ప్రసాదాంబుజవము; ప్రసాదంబు జలము (శిరము, జపము), ౪. గరుసు; గురుసు, ౫. వెరవు, ౬. నెరవు (పు); వెరపు, ౭. లు సొచ్చిన; ల బొల్చిన, ౮. గెల్లు, ౯. సరసుల; శవముల; జవముల, ౧౦. భుక్తుల, ౧౧. నెళవు; యిలివు; యలవు; యలువు, ౧౧. త్రు, ౧౨. చోవ, ౧౩. పనముల; పదముల; పరముల, ౧౪. తోవ.

శివభక్తి శిఖరంబు, శ్రీనగేంద్రంబు;
వరికింప నిట్టి శ్రీ పర్వతంబునకు
ధరణీధరములొండు దత్తుల్య మగునె?
యిందు[౧]ల సెలయేఱు లీశ్వరుపహాళి
యందున్నయట్టి గంగాంబుకణంబు,
లిందు[౧]ల [౨]గుబ్బలు [౩]నిమ్మహి నొప్పు
మందరకైలాస మహితశైలంబు,
లిందులగోబృంద మిష్టము ల్గురియు
బృందారకు[౪]ల సుర[౫]భిప్రకరంబు,
లిందుల[౬]లేఁబెయ్య లీశుకట్టెదుర
మంద[౭]లై యున్న గోమాతృసంఘంబు,
లిందుల[౮]బాలకు లెలమి నజాండ-
సందోహము[౯]లు దాల్చు శతరుద్రవిభువు,
లిందుల[౧౦]పిడిచెట్టు లిలఁ గాయసిద్ధ
[౧౧]లందంద కూర్చు దివ్యౌషధావళులు,
నిందుల[౧౨]చిడిపిటా లి[౧౩]నదీధితులన

౧. న్న, ౨. గుబ్బి (బ్బ) ళ్లు (ళ్ల), ౩. లి, ౪. లు, ౫. భీ, ౬. లోపెయ్య, ౭. ౖయై, ౮. మానవు; పసిబాల, ౯. లకొల్చు, ౧౦. పడు; వడు; ౧౧. లందఱు, ౧౨. సిలిపి, ౧౩. ను; నునిదీధితుల.

నిందితంబులు [1]శేషు నిజఫణామణులు,
నిందుల[2]క్రియ్యాట లీప్సితార్థంబు
లందించు రసరసాయనసుధా[3]ధార,
లిందుల [4]పెడవట్లు [5]నందనోద్యాన-
మందారముఖ్య సంక్రందనతరులు,
నెలకొన్న యిందుల నీరసత[6]రులు
మలయజ ఘనసార మహనియ్యతరులు,
గామింప నిందుల కడపటిశిలలు
భూమిఁ జింతామణుల్ పుట్టినగనులు,
విలసిల్లునిందుల వెడ[7]వ్రంత లాదిఁ
దెలుపా[8]రు భాగీరథీముఖ్యనదులు,
వరగ నిందులచోటి [9]పడియ లూహింప
నిరతంబు క్షీరాంబునిధి పుట్టి[10]నిండ్లు,
గలయంగ నిందుల గండశైలంబు
[11]లిల మోచికొనియున్న కులపర్వతంబు,
లరయ నిందుల శబరాలయభూమి

---

౧. నేయు నిజపుణ్యామతు (ణు) లు; నేయు నిజఘృణామణులు; శేషు నిజశిరో(ఘణా; ఫణా) మణులు, ౨. క్రై, ౩. వార్ధి; వారి, ౪. వదవట్లు; పెడలెట్లు, ౫. కందునన్యోన్య, ౬. తు, ౭. వృంత; వేత్ర, ౮. ర, ౯. పదియ; వడియ, ౧౦. నిల్లు; నిళ్లు, ౧౧. జల.

హరిముఖ్య సు[1]రలకు [2]నపవిముక్తభూమి,
దలపోయ నిందుల ధరణీరజమ్ము
లల మేటి చామీకరాద్రి[3]కిఁ దా[4]లము
[5]సరియించు నిందుల శ్వపచాధములును
ధరఁ జతుర్వేదుల కరయ నుత్తములు,
[6]వసరింప నిందుల ప[7]సులకాపరులు
[8]వసుమతి శుశ్రుత వ్యాఖ్యానపరులు
నీక్షింప నిందుల [9]మెల పాప[10]పిండ్లు
దక్షకానంతాది దర్వీకరములు,
భావింప నిందుల పూవు[11]ల వడుగు
లావజ్రి[12]కింద్రత్వ మందిచ్చినార,
[13]లాడఁబడ నిందుల [14]వడుక [15]భూసురులు
గడఁగి బ్రహ్మకు ముంజిఁ గట్టినవారు,
గత లేల యిం దొక్క కడయింటిగణము
[16]స్థితికర్తఁగా విష్ణుఁ జేసినవా[17]డు,

---

౧. రు, ౨. నది ముక్త; నది ముఖ్య; నపవర్గ, ౩. ని, ౪. శ, ౫. చరియింప, ౬. పరికింప, ౭. సల; సులు, ౮. వసుమతినాశ్రుతి (నీశుశ్రుత); శ్రుతిస్మృతి, ౯. యిలబాప; యీపాప, ౧౦. పిండు; బిడ్డ, ౧౧. బవడుగు, ౧౨. కినితత్వమదియిచ్చి, ౧౩. పొడఁబడ; వడిగల, ౧౪. వట (టు; డ), ౧౫. పారులును, ౧౬. క్షితి, ౧౭. రు.

నూహింప నిందుల యొకపిన్న తపసి
యాహారిపుత్త్రు నుక్క[1]డఁచినవాఁడు,
వీక్షింప నిందొక్క వీరగణంబు
దక్షునియజ్ఞంబు దహియించినాఁడు,
శీఘ్రంబ యిందొక్క చి[2]ట్టిగణంబు
వ్యాఘ్రాసురాదుల వ్రచ్చినవాఁడు,
రమణ నీశైలోత్తరద్వారవిభుఁడు
[3]ప్రమథులఁ [4]బంచి లోకము లేర్చినాఁడు,
[5]వ్రాలి యిగ్గిరితూర్పు వాకి[6]ట్టి ఱేఁడు
గ్రాలుచుఁ ద్రిపురముల్ గాల్చినవాఁడు,
నలి నిన్నగము దక్షిణద్వారవిభుఁడు
నిలఁ బరంజ్యోతి యై యెసగినవాఁడు,
[7]మసల కిగ్గిరి పశ్చిమద్వారవిభుఁడు
[8]వాసగ నీబ్రహ్మలఁ బుట్టించినాఁడు,
స్మర[9]వైరి యిందుల మల్లికార్జునుఁడు
వరలింగములచక్రవర్తి యైనాఁడు,
మిగుల నిందుల సారమేయమార్జాల-

---

౧. ణ, ౨. న్ని; న్న, ౩. ప్రమదుల, ౪. జించి, ౫. వాలి, ౬. ట, ౭. మరువకగిరి, ౮. పారిఁగాని; పాసఁగాని, ౯. మూర్తి.

ఖగ మృగ క్రిమి కీటక భుజంగ ము[1]ఖ్యు
లో[2]లిన శ్రీగిరి [3]నొండెఁ గా[4]దేనిఁ
కైలాసమున [3]నొండెఁ గా[5]ని వర్ణింప
[6]రనిన శ్రీగిరిమహిమా[7]వలంబనము
వనజజునకు నైన [7]వశమె వర్ణింప?
విన "న భూతా న భవిష్యంతి" యనఁగ
నెనమె శ్రీనగమున కితరశైలములు?
భువి [8]ధరించినయట్టి భూధరేంద్రములు
శివుఁ [8]ధరించినయట్టి [9]సిరిగిరి సరిమె?"
యంచుఁ [10]గీర్తించుచు హర్షించు గణస-
మంచితుం డగు పండితయ్య మూ[11]డ్కులకు
నంగద శ్రీశైల మంతయు [12]దివ్య-
లింగస్వరూప మై లీల వె[13]లుంగె;
[14]నకృతాత్ములకు శిలానికరమై తోఁచు
సుకృతాత్ములకు లింగనికరమై తోఁచు,
ననుపురాణోక్తి దా నది [15]యేల తప్పు?
వినుతింప సద్భ[16]క్తి విధి యట్లుగాక

---

౧. ఖ్యా-మో, ౨. ని, ౩. నుండె, ౪. దె, ౫. ద; వ, ౬. వి, ౭. వర్ణింప వశమె, ౮. ధరియించిన, ౯. శ్రీ, ౧౦. నుగీర్తించు, ౧౧. పు, ౧౨. గూడ, ౧౩. లి, ౧౪. ని, ౧౫. యట్లుగాక, ౧౬. క్త.

యనయంబుఁ బూజాఫలాపేక్షితులకుఁ
గనుఁగొన [౧]స్థూలలింగస్ఫూర్తి దోచు,
ననయంబు [౨]యోగసుఖాపేక్షితులకుఁ
గనుఁగొన సూక్ష్మలింగస్ఫూర్తి దోచు,
ననయంబు భక్తి సుఖాపేక్షితులకుఁ
గనుఁగొనఁ బరమలింగస్ఫూర్తి దోచు,
వరలింగ మె[౩]ట్లన్న [౪]వాయవియ్యమున
[౫]ధరఁ "దదియ్యం త్రివిధం రూప" మనఁగ,
రతి "నస్మదాద్యమరై ర్దృశ్య" మనఁగ,
యుతముగా "సూక్ష్మం చ యోగిభి" రనఁగఁ,
గర మనురక్తి "భక్తై ర్దృశ్య" మనఁగ,
ధర "దృశ్యతే నాన్యథా క్వచి" త్తనఁగ,
నటుగా[౬]న భ[౭]క్తిభావైక[౮]దృష్టులకు
స్ఫుటలింగమూర్తి దోచుఁ[౯]డు దథ్యగాదె ?
భంగిగా బసవయ్య [౧౦]భక్తి [౮]దృష్టులకు
జంగమం బటుగూడ లింగ మైనట్లు,
సిద్ధరామయ్యకు శ్రీగిరీశ్వరుఁడు
శుద్ధలింగాకృతి శోభి[౧౧]ల్లునట్లు,

---

౧. పరమ, ౨. భక్తి, ౩. ట్లు, ౪. పాయరియ్యమున, ౫. దరి, ౬. క, ౭. క్త, ౮. దృష్ట్లకును; దృష్టికిని, ౯. ట, ౧౦. భావ, ౧౧. ల్లి.

శ్రీపిల్లనాయనారికిని లింగస్వ-
రూపమై ప్రాణేశుఁ జేపారినట్లు,
స్ఫారలింగాకృతి బాచిరాజునకు
సౌరాష్ట్రవిభుఁడు ప్రసన్నుఁడైనట్లు
వెండియు సోమేశ్వరుండు గుడ్డవక-
ఖండితలింగప్రాకారుఁడైనట్లు,
శూలి దయా పోరండ్ల సూరసానికిని
దా లింగమూర్తియై తనరారినట్లు,
భంగురేతర వీరభద్రేశ్వరోత్త-
మాంగము లింగమై యలరారినట్లు;
శ్రీలింగమూర్తియై శివుఁడు పర్వతము వి-
శాల శిరస్సులి సంధిల్లునట్లు,
స్తుతియించు మల్లికార్జునునకు మెచ్చి
యతులసాక్షాత్కార మంగీకరించు
గతిఁ బర్వతంబు లింగస్ఫూర్తి వెలుఁగ
మతిఁ దలపోయు పండితున కక్షణమ
మును మజ్జనాంబువుల్ ముంచిన దృష్టట్లు
నినుపారఁర గంధంబు నివిరిన దృష్టట్లు

---

౧. సన్నిమై, ౨. కారమై, ౩. దా, ౪. రు; ౫. లింగము పెనుపారినయట్లు, ౬. పర్వత, ౭. ట్ల; ౮. నశుఁబేర్చి; నాత్మఁబేర్చి, ౯. వెలిఁగె, ౧౦. రి, ౧౧. నిబిరిన; నించిన.

వొనర లతాంతముల్ వ్రాచినదృష్టు
ఘనధూప ధూమంబు గప్పిన దృష్టు
వరగ నివాళులు వర్తిన దృష్టు
గరము నైవేద్యంబు గలిగిన దృష్టు
రమణ దాంబూలంబు రంజిల్లి దృష్టు,
నమర బుష్పాంజలు లమరారు దృష్టు-
గా నిట్లు పర్వత ఘన లింగమున కు
దా నిరీక్షణ సావధానంబునంద
చక్కన లింగావసరము సల్పించి
మక్కువ పెక్కువ మల్లికార్జునుఁడు
లెక్కింప శిలలెల్ల లింగరూపములల
నిక్క మన్వినుతి ఘనీభవించుటకు
నరయ "య ద్ధి మనసా ధ్యాయతి"యనియు
ధరణి "త ద్వాచా వదతి" యన మఱియు
జేకొని "త త్కర్మణా కరోతి" యని
యాకాంక్ష శ్రుతి జెప్ప నప్పురాణములు
సరి "మన స్యేకం వచ స్యేక" మనియు.

---

౧. ప్ర, ౨. ట్టి, ౩. నివే, ౪. సి, ౫. లసలారు; లమలారు, ౬. జంగ, ౭. చ; చె, ౮. పేర్మినమ్మల్లి, ౯. దిశ, ౧౦. లు, ౧౧. ంబు వినుతి; మ వినుతి, ౧౨. యు, ౧౩. యొ, నొ.

నరయ "కర్మ న్యేక" మనియు [1]మహత్త్వ-
చేష్టలు విరచించి చెప్ప నాద్యో[2]క్తి
దృష్టంబుగా శైవ [3]శిష్టపండితుఁడు
గలయ శ్రీనగము సాక్షాల్లింగ మనుచుఁ
[4]దలఁచి రూపించియుఁ, దలఁచినయ[5]ట్ల
పలికి నుతించియుఁ, బలికినయ[5]ట్ల
యల భజించియు, భజియించినయ[5]ట్ల
పదపడి సద్భక్తి దుదముట్టుటకును
ముదమున భక్తసమూహంబు వొగడ

### శ్రీ పర్వతోత్పత్తి సంకీర్తన కథనము

నద్భుతం బందుచు నంతఁ బండితుఁడు
సద్భక్తి మ్రొక్కుచు సంస్తుతింపుచును,
నభిరమ్యలీల నొ[6]ప్పా[7]రు శ్రీగిరికి
నభిముఖుండై కన్నులారఁ జూచుచును,
దూరీకృతాఘుండు దో[8]నమరాజుఁ
గారిఁ గృపావలోకనవార్ధిఁ దే[9]ల్చి
"[10]యరుగు శ్రీగిరిమల్లికార్జున దేవు

---

౧. మాహాత్మ్య, ౨. క్త, ౩. శిష్టు, ౪. వలచి, ౫. ట్లు, ౬. లు, ౭. ర, ౮. స, ౯. ల్పి, ౧౦. యరుదగు శ్రీమల్లి.

చరణాంబుజంబు లాసక్తి భజి[౧]ంపు,
భ[౨]వ్యభక్తకోటికిఁ బర్వము ల్సలుపు,
శివరాత్రి యప్పుడిఁ జెల్లి[౩]ంపు[౪]నియతి,
నిలఁ బ్రదక్షిణముగా నీ పర్వతంబు
వలగొ[౫]ని నీవు మా [౬]వ్రతసమాప్తంబు
గావింపు" మని శిష్యు గారవింపుడు మ-
హావినయంబున [౭]సాష్టాంగ మెఱఁగి
మస్తకవిన్యస్త మహిత[౮]స్వహస్త-
శస్తావతంసుఁడై "జగదభివినుత
సర్వజ్ఞ పండితాచార్య! తొల్లియును
బర్వత[౯]ంబును నొక్క ప్రమథుఁడో, ఋషియొ,
పర్వతాకార మెబ్భంగిఁ [౧౦]బాటిల్లెఁ ?
బర్వతస్థలి నెట్లు [౧౧]ప్రభవించె గంగ ?
యాది శ్రీపర్వతం బనునామ మెట్లు
లాదరణీయమై [౧౨]యలరె లోకముల ?
మహి శైలసార్వభౌమత్వ నిత్యత్వ-
మహిమ యేక్రియ నసమానమై పరగె ?

---

౧. ంచి; ంప, ౨. వ, ౩. ంచు, ౪. మఱియు, ౫. ను, ౬. ప్రతి, ౭. నష్టాంగ, ౮. ప్రహస్త, ౯. ంబను; ంబున; ంబో యొక్క, ౧౦. భ్రాజిల్లె, ౧౧. ప్రబలించె, ౧౨. యలదె.

సకలముముక్షుల కాది [1]శ్రీశైల
శిఖరదర్శనముక్తి సిద్ధి యె[2]ట్లొసఁగె?
మించి సదాశివమిళితరూపమునఁ
బంచవక్త్రము [3]లెట్లు భ్రాజిల్లె గిరికి?
నెల్లపర్వతముల [4]కెల్లతీర్థముల
కెల్లమై యెట్లు[5]ండె నెల్లగాలంబు?
సంహృతాంతకుఁడు [6]ప్రసన్నుఁడై యె[7]ట్లు
సింహాసనముగ వసించె [8]నీగిరిని?
[9]సురపర్వతాదిభూధరకోట్లు లుండ
[10]హరుగణంబులకుఁ గ్రీడాద్రి యెట్లయ్యె?
రసరసాయనసుధారససరోవరము
లెస[11]గ నిగ్గిరియంద యెట్లు వసించె?
సురమణి సురధేను సురమహీజాత-
సురసింధుతతుల కా[12]కర మెట్టు లయ్యె?
నాల్గుదిక్కులయందు నాల్గు వాకిళ్లు
నాల్గు[13]గోణముల నిర్నాలుగు[14]ద్రిడ్లు
సుకరమై యనుమడి [15]సోరనగండ్లు

---

౧. స, ౨. ట్లొ, ౩. లెల్ల, ౪. నెల్ల, ౫. ండు, ౬. ప్రసన్న మై, ౭. ట్టు, ౮. ని(న)గ్గిరిని(కి), ౯. ధర, ౧౦. హర, ౧౧. గంగ నగ్గిరి, ౧౨. కార మెట్లయ్యె, ౧౩. మూలల నిరునాలుగు, ౧౪. దిడ్లు, ౧౫. సూరన; సూరెన; సూరలీ; సూడెలింగల్లు.

మకుటతోరణము లి[1]మ్మడి వాని కనఁగ
నగములు బిలములు నదులు దీర్థం[2]బు
లగు కుండములును మహాస్థానములును
దివ్యలింగములు జ్యోతిర్లింగములును
భవ్యమై పరగు నెసం బేమి[3]మఱియు?
నరుల[4]కు దృశ్య[5]మానం బ[6]య్యుఁ, గాక
పర[7]గ నిగ్గిరిపీఠ పద్ధతి దనర
మణిలింగములు, రత్నమయలింగములును,
గణుతింప స్వర్ణలింగంబులు, రజత-
లింగంబులును, దామ్రలింగముల్, గాంస్య-
లింగంబులును, లోహ లింగముల్, సంద్ర-
కాంతలింగంబులుఁ, గరమొ[8]ప్ప సూర్య-
కాంతలింగము, లయస్కాంతలింగములు,
నమృతలింగములు, స్వయంభులింగములుఁ,
గొమరారుఁ గో[9]టానఁగోట్లు వెండియును
నర సు రాసుర మునీశ్వర సిద్ధ సాధ్య-
గరుడ గంధ ర్వోరగ[10]ప్రకరాదు

---

౧. న్మడి, ౨. ఘులు-నస్థ, ౩. యవియు; పరియు, ౪. క, ౫. యానం, ౬. య్యొ, ౭. ఁగ; ఁగి, ౮. ప్ప, ౯. ట, ౧౦. ప్రవ; ప్రకా.

లీలఁ బ్రతిష్ఠింప నభీప్సితమహిమ
గల ప్రతి[1]ష్ఠాలింగము లనంతకోట్లు
సాన్నిధ్యమెస[2]గ శ్రీశైలంబునం[3]ద
పన్నగా[4]నుండు సౌభాగ్యమె[5]ట్లొదవెఁ?
జక్రి చతుర్ముఖ శక్రసన్నుత ప-
రాక్రమునకు లింగ చక్రవర్తికిని
శూలికి మల్లికార్జుననామ మెట్లు
ఏలమ్యె మును స్వయంభూలింగమునకు?
నేనగం బే[6]దెస నేతీర్థ మెచట
నేనది యెక్కడ నేస్థాన[7]మెందు
నేలింగ మేపూజ యెంతెంతపుణ్య
మేలోక మేభోగ మేఫలప్రాప్తి
యేపదం బే[9]సౌఖ్య మే[8]మోక్ష మెట్టు
లాపర్వతంబు[10]మాహాత్మ్య మంతయును
నానతి యిండని యడుగుల కెఱఁగ,
నానతబుధుఁడు లోకారాధ్యమూర్తి
యానందభరితాత్ముఁడై కృపాదృష్టి

---

౧. ష్ఠింప లింగములనంతంబు, ౨. గి, ౩. దు, ౪. నుండ; నొసగు, ౫. ట్లొనర్చె, ౬. దెశ, ౭. మందు, ౮. మోక్ష, ౯. సౌఖ్య, ౧౦. మహత్త్వమెంతయును.

దోనమరాజయ్యఁ దొడిఁదొడిఁ జూచి
శ్రీగిరిమహిమఁ దా శేషునకైన
వాగీశ్వరునకైన [1]వాణికినైనఁ
[2]దన [3]రుచు శ్రుతు "లనంతావై"యనంగఁ
[2]జను వేదవేదాంత శాఖలకైన
సూతునకైన వ్యాసునకైనఁ జిత్ర ప్ర-
భా తనుం డట్టి శ్రీ పర్వతు [4]గన్న
* యాశిలాదునకుఁ దానై కీర్తిసేయఁ-
గా శక్యమే, నీలగళుఁ డెర్గఁ [5]గాక!
విని [6]యెఁ బార్వతి దన [7]విభుఁడట్లు సెప్పఁ
దన [8]కుమారున కంతఁ దా నానతిచ్చె,
నాతనిచే విని [9]రమరులు మునులు
భాతిఁ బురాణోక్తిఁ బర్వతుమహిమ

---

౧. వాసుకి కైన, ౨. ఈరెండుపాదములున్ను బ్రౌనుప్రతిలో లేవు, 3. రెను, ౪. మహిమ, ౫. గాదె, ౬. యు, ౭. విభునిచే గౌరి, ౮. కంత గుహునకు, ౯. న నమరులు.

* ఈ పాఠము నేను కల్పించినది. ప్రతులలో ఎక్కడాలేదు. "...మహిమ, నాశిలాదునకైన ననుగీర్తిసేయ" అనిన్ని "...మహిమ, నాశిలాదునకు నై- నను గీర్తిసేయ" అనిన్ని పాఠములున్నవి. అందులో అఖండయతి వస్తుంది. చి. నా.

యీ పురాణైకసా[1]రార్చ్బదాంశంబు
రూపింప నే సమర్థుండ[2]ను గాన;
నైనను వినుము గృతార్థతానియతి
నానేర్చుభంగి శ్రీనగ మహత్త్వంబు
వర్ణిం[3]తు సత్కవీశ్వరు లుత్సహింప;
నర్ణవావృతధాత్రి [4]నరు దదెట్లనిన,—
[5]నాది కనాది యుగాది శిలాదుఁ
డాదరికమున మహాతపోనియతి
ముక్కంటి మె[6]ప్పించి మువ్వు[7]రసుతులఁ
జక్కన పడయుచో సద్భక్తి బుద్ధి
నిద్ధభవద్భక్తిహీనుఁ డద్వైత-
బద్ధుఁ డందొకఁడైనఁ బ్రభవించెనేని
నెట్టణ [8]పొరిగొందు నీ వడ్డపడిన
[9]నిట్టైనఁ గొడుకుల నిమ్ము నాకను[10]ఁడు
నిత్యు నయోనిజు నిర్మలదేహు
సత్యకీర్తి ద్వితీయు శంభు సర్వజ్ఞు

---

౧. రార్జుదాకంబు; ర(రా)ంబుదాక (శం) భు (బు), ౨. న; నే, ౩. ప, ౪. నలరునెట్లనిన; నదియెట్టులనిన; నరుదెట్టులనిన, ౫. ఆదికి నాదియు; ఆదికనానయు, ౬. ట్టి, ౭. రు, ౮. బోరి, ౯. నిట్టైన, ౧౦. చు.

ధర్మావతారు [1]నాద్యస్తుత్యు శైవ-
ధర్మశాస్త్రాచార్య [2]తము వృషాధీశు
నందితప్రమథగణశ్రేష్ఠు [3]నజరు
నందికేశ్వరు నగ్రనందను [4]నొసఁగె;
నానంది[5]కేశ్వరుం డతి[6]వీరఘోర-
మానితవరతపోమహిమాతిశయత
శివుని [7]నిష్ఠించి భజించి మెప్పించి
భువిని ద్వితీయ్యశంభుం డను పే[8]ర
వాహనత్వంబు సర్వజ్ఞత్వమును స-
మాహిత మగు శ్రీవృషాధిపత్యంబు
శివధర్మశాస్త్ర విశేషరహస్య-
వివిధదివ్యాగమ విరచనత్వంబు
సహజలింగైక నిష్ఠాపరతంత్ర-
మహిత కేవలభక్తి [9]మతి[10]గురుత్వంబుఁ
బ్రమథేశ్వరత్వంబుఁ బడ[11]సె లోకములఁ
దమ మేది ధర్మావ[12]తారుఁడై పరఁగ
ఖ్యాపితలీల శిలాదుండు; మఱియు

---

౧. నిత్య, ౨. తను, ౩. ధీరు, ౪. బఱయ; (డనుచు, ౫. కేశుం డు నతి; కేశ్వరునతి, ౬. ఘోరవీర, ౭. గుఱించి, ౮. చ్చి, ౯. రు, ౧౦. మతి, ౧౧. సి, ౧౨. తారమై.

దీపితమహిమ ద్వితీయాత్మసూజుఁ
బుణ్యజనైకశరణ్యు నగణ్య-
పుణ్యుఁ జతుర్దశ భువనవరేణ్యు
నాశాంతకీర్తి నాయత కలియుగస-
దాశివమూర్తి గతప్రాణార్తి
మంగళచరితు నభంగు లింగోత్త-
మాంగు సంతతదయాపాంగు దివ్యాంగు
నాతతపంచమహాపాతకోప-
పాతకనిరసనప్రఖ్యాతచరితు
నాద్యు నాద్యస్తుత్యు నవికలవేద-
వేద్యు నభేద్యు నవిద్యావిదూరు
నక్షీణకరుణా కటాక్షవీక్షణ సు-
రక్షితసకలముముక్షు నక్షురుని
సర్వజ్ఞు సన్మునీశ్వరసార్వభౌముఁ
బర్వతు నిహతాఘపర్వతుఁ బడయఁ
బరమేశుకారుణ్యభావాతిశయత
హరపాదభక్తి సమగ్రత నందు
నురుతపశ్చరణ కుద్యుక్తుఁడై యంతొంటి

---

౧. నగణ్యుఁ-బుణ్యు, ౨. పుణ్యుచతుర్దశ, ౩. ణు, ౪. గ, ౫. రక్షుణ, ౬. మ-పర్వ, ౭. తు; ఘు, ౮. హరు, ౯. భక్త, ౧౦. తోడి.

వరమునీంద్రుల తపోవర్తనల్ దలఁచి
ధరణి నజాదిదుస్తరజీవరాసు
లరయఁ బర్ణాహా¹రమైకాదె బ్రదుకు?
జలచరాదులు వృక్షసస్య³భూతాదు
లలరి జలా⁴హార మై కాదె బ్రదుకు?
పారావతాదులు పక్షులు గొన్ని
యార శిలా⁴హార మైకాదె బ్రదుకు?
ఘనభుజంగమపురోగమజీవరాసు
లనిలంబ యాహార మైకాదె బ్రదుకు?
సరిఁ బిపీలికముఖ్య జంతుప్రతాన
మరయఁ గణాహార మైకాదె బ్రదుకు?"
ననుచుఁ బర్ణాదశిలా దానిలాద-
వినుత కణా దాది ⁵మును లాచరించు
నాతపోమహి⁶మల నాలంబు నేసి
యాతతోద్యు²క్తి నిరాహారయుక్తిఁ
బంచాగ్నిమధ్యాది పటుతపశ్శక్తి
నంచిత దేహేంద్రియాదివిరక్తి *

౧. నం బలరి, ౨. రులైకదే, 3. జలాదు, ౪. హారులై, ౫. విధు, ౬. మ దానాలంబు; మంబు లాలంబు, ౭. క్త.

* ఒకప్రతిలో, ఈ పాదముతరువాత, "కొంచక సేయుచు సురతరశక్తి" అనేపాఠము ఎక్కువగా ఉన్నది.

సతతవ్రతోగ్రప్రచారానుసక్తి
నతులలోకవ్యక్తి యగు¹ గురుభక్తి
నపరిమితం బైన యతివీరఘోర-
విపరీత విఖ్యాత తప మాచరింపఁ
బ్రమథాధిపతులు సిత్రము సిత్ర మనఁగ
నమరు లత్యాశ్చర్య మాశ్చర్య మనఁగ
దనుజు లెంతయును జోద్యము సోద్య మనఁగ
సనకాదు లనుపమం బనుపమం బనఁగ
వరమునీశ్వరు లిది యరు దరు దనఁగ
నరు లిట్టితపముఁ గానము గాన మనఁగ
³నిష్ఠురవరతపో ⁴నిర్ణయనియతి
నిష్ఠఁ బర్వతసన్మునిప్రవరుండు
మానితదివ్యవర్షానేకకోట్లు
దా నట్లు సరియింప ధరణి ⁵గంపింప
⁶జడనిధు ల్గలఁగఁ దజ్జలశాయి ⁷యలుఁగ
బడబాగ్ని మలఁగ దిక్పాలురు ⁸దొరఁగఁ
జుక్కలు రాల వాసుకితలల్ వ్రాల

---

౧. వచోగ్ర; ప్రతోగ్ర, ౨. మహో, ౩. నిష్ఠిత, ౪. నిర్ణీత, ౫. గణింప, ౬. జడధులు గలఁగఁ దజ్జ, ౭. గలఁగ, ౮. లకుల్, ౯. దొలఁగ.

చిక్కరీంద్రులు దూల దివి భువిఁ గూల
నమరులు వంద నజాండముల్ డిందఁ
గమలమిత్రుఁడు[1] గ్రుందఁ గమఠంబు[2] ప్రుందఁ
గులగిరు [3]లడఁగ దిక్కులు [4]వీడువడఁగ
నలువయు[5]క్కడఁగనాద్యులు మ్రొక్కఁ దొడఁగ
నంతఁ బర్వతుని [6]మహాతపోనియతి
కంతకాంతకుఁడు ప్రత్యక్షమై నిలిచి
"జాగ్రన్మహోగ్ర సమగ్రతపో వి-
నిగ్రహావిగ్రహా ! నీకనుగ్రహాము
గావింతుఁ గావింతుఁ [7]గావింతుఁ గరుణ,
భావింతు భావింతు భావింతు నిన్ను,
మెచ్చితి మెచ్చితి మెచ్చితి[8] వరము
లిచ్చెద నిచ్చెద నిచ్చెద, నింక
మాట లేమిటికి ముమ్మాటికి భక్తి-
[9]పాటవధారేయ! పర్వతవిభుఁడ!
వేఁడుము వేఁడుము వేఁడుమీ'' వనుఁడుఁ
బోఁడిగా సర్వాంగములు భువిఁబొందఁ.......

---

౧. గంద, ౨. పొంద, 3. లడర, ౪. విడువడఁగ; వీడి పడఁగ, ౫. గదురంగనాద్యులు మ్రొక్క, ౬. మహాత్తపో, ౭. గరుణ భావింతు, ౮. నిపుడు-నిచ్చెద, ౯. పాటన.

దొడిఁదొడిఁ జాఁగిలఁ ౧బడి మ్రొక్కిమ్రొక్కి
కడుభక్తి ముకుళితకరపద్మఁ డగుచు
హృత్పద్మగతు నీశు నెదుఱ౨నీక్షించి
ముత్పులుకలు మేన మోసులుసాఁగఁ,
గంఠసముద్గత గద్గదస్వర౩ము
గుంఠితంబుగ నుతుల్ గుత్తుకఁ౪జిక్క,
నానందబాష్పధారాసార౫వారి
నాననాంభోరుహం బటుదొప్పఁదోఁగ,
౬బెంపుసొంపారెడు కెంపుఁగన్నులను
౭సొంపువెంపారెడు ౮కంపంబు ౯దొడలు
దమలోనఁ బలుమఱు దర్శి౧౦ంచిమ్రొక్కఁ,
దమకించు మచ్చరికము౧౧దొంగలింప,
నాయంగవిక్రియ ల౧౨వియ భూషణము
లై యిట్లు వొల్పార నర్థి౧౩దుల్కాడ,
"భక్తవత్సల! విన్నపం బయ్య! జియ్య!
భక్తమనోంబుజ భ్రాజితశయ్య!

---

౧. బడిబడి, ౨. వీక్షించి (చ), ౩. మఁకుంఠి, ౪. నిక్క, ౫. ఫారి; ౬. నింపు, ౭. పెంపుపెంపారెడు (నొప్పారెడు), ౮. కంపంపు, ౯. నొడలు; దొడర, ౧౦. ంప, ౧౧. దొలంగింప, ౧౨. లి; ల, ౧౩. దొల్కాడ.

భర్గ! పరాపర! భవ! నిష్కలంక!
సర్గస్థితిలయ ప్రచరితగుణాంక!
వరద! మహేశ్వర! "[1]వజ్రి[2]సంత్రాణ!
పరమదయా[3]రస వరనేత్ర[4]కోణ!
యనవరత త్రిలోకైక[5]నమస్య!
వనజాసనాచ్యుతా ద్యనిమిషోపాస్య!
గణమనోరథ పరికల్పనవ్యసన!
ప్ర[6]ణత జనానీక పాతకగ్రసన!
శుభకర!యవికల! శ్రుత్యంత వేద్య!
యభవ! సంసార మహారోగవైద్య!
సర్వజ్ఞ! విశ్వరక్షణ కృపారంభ!
పర్వతకన్యకా [7]పరిపరిరంభ!
శరణాగ[8]తౌఘ దుస్తర[9]పాపదావ!
పురహర! చిత్తగింపుము దేవదేవ!"
యని యిట్లు [10]నినుఁ బర్వతాష్టకంబందు
వినుతింప నిష్టార్థ వితతులు సెందుఁ
గావున నిష్టఫలావాప్తి నీవ

---

౧. వజ్ర; వర్గ, ౨. సంతాణ (న), ౩. రసాస్పద;రసపద, ౪. కాణ, ౫. సమస్య, ౬. ణు, ౭. పర; వర, ౮. తాఘ, ౯. దావదాహ; దావదావ, ౧౦. విను.

కావింతు నాకని వైకొని దేవ!
వేఁడెద నిన్ను నే విజితాభిసంగ!
పోఁడిగా నవధరింపుము దయాపాంగ!
పర్వతుం డనుపేరఁ బరమార్థముగను
బర్వతాకారమై గుర్వుగాఁ దాల్చి
యుండెద, నీవు నాయుత్తమాంగమున
నుండవే నాథ! దివ్యోరులింగాంగ!
యాసక్తి హరివిరించ్యాదులు గొలువఁ-
గా సురగిరినుండు గతి యున్కి నొల్లఁ,
గైలాసమున మహాగణములు గొలువఁ-
గా లీల నీవుండు గతి యున్కి నొల్ల,
మందరగిరి సురబృందంబు గొలువ
నొందంగనుండు నీయున్కి నేనొల్ల,
శ్రుతులశిరంబున సూక్ష్మరూపమున
వితతమై నీయున్కి విధము నేనొల్లఁ,
గూడఁ ద్ర్యంబకముఖ్య కుధరసంఘముల
వేడుక నీయుండు విధము నేనొల్ల,
శివలోకముఖ్య విశేషలోకములఁ

౧. హి, ౨. రువర, ౩. మే, ౪. బరపు, ౫. దేవ, ౬. చాదులు, ౭. డ, ౮. యు, ౯. మై, ౧౦. వుండు; యందు.

దవిలి నీయుండు విధంబు నేనొల్లఁ,
బూని "యణోరణీయా" నన[1]బశువి-
తానంబునందుండు తలియు[2]నేనొల్ల,
సనకాదియోగుల సన్మనోగతుల
నొనర నుండెడునున్కి[3]నొల్ల, వెండియును
ననుపమ[4]శైవ నిష్ఠా[5]నూన[6]నియతిఁ
జను గౌతమాదుల సజ్జలయందు
దనరంగఁ బాశుపత వ్రతోద్యుక్తిఁ
జను నగస్త్యాదుల సజ్జలయందు,
శివయోగులైన వసిష్ఠాదిమును[7]ల
సవిశేషము[8]గఁ దాల్చు సజ్జలయందు,
నీసమయస్థులు వ్యాసాదిభూతి-
శాసనుల్ ధరియించు సజ్జలయందు,
నతిఫలాపేక్ష ని న్నర్చించుశౌరి
శతపత్రజాతుల సజ్జలయందు,
సుర పాగ్ని యమ దైత్య వరు ణాని[9]లోక్ష-
[10]చరసఁ ఖేశానుల సజ్జలయందు,
నీక్షితి మఱియు ముముక్షు[11]లతాల్చు

---

౧. జను, ౨. న్కియొల్ల, ౩. యొల్ల, ౪. వైర, ౫. రూప, ౬. విరతి, ౭. లు, ౮. లు, ౯. లాక్ష, ౧౦. సరస నీశానుల, ౧౧. లఁ దాల్చు.

కక్షల[1]గద్దెనఁ[2]గరుల మీఁ దర్థి
నుండెడు విధ[3]మును నొల్లఁ బ్రాణేశ!
యుండు మెప్పుడు మదీయోత్తమాంగమున:
దేవ! మన్మస్తక దివ్యపీఠమున
నీవు లింగాంగ సన్నిధిఁ[4]బేర్చి పూత-
భువ[5]నౌఘు శ్రీస్వయంభూలింగరూప
మవధరించుటకు మహాప్రసాదంబు,
ని న్నవినాభావ నిత్యసంబంధ-
సన్నిధి వేఁడితి స్వామి! విన్నపము,
ప్రతి "సర్వతః పాణి పాదం త"[6]మనఁగ
శ్రుతులు లింగాంగముల్ రూపించుఁగాన
ధర "యథా రాజా తథా ప్రజా" యనుట
యరుదగునే పర్వతాకారమ[7]య్యుఁ
దనువెల్ల శిరమ మై నినుఁ[8]ధరియింపఁ
దనువెల్లఁ గన్నులై నినుఁ గనుఁగొనఁగఁ
దనువెల్ల వీనులై నిను మును వినఁగఁ
దనువెల్ల జిహ్వలై నిను వినుతింపఁ
దనువెల్లఁ జేతులై నినుఁ[9]బూజసేయఁ

---

౧. సజ్జన (ల), ౨. గతుల, 3. మున, ౪. జేర్చి, ౫. నైక, ౬. మనుచు, ౭. య్యు, ౮. దలంపంగ, ౯. భజియింప.

దనువెల్ల మనసరై నినుఁదలంపంగ
నోడఁ[1]గూర్చి [2]దాసప్రయుక్తి నద్వైత-
జడధి [3]ముంపక, నాకు సద్భక్తియొస[4]గి
రక్షింపు భృత్యుగా శిక్షింపు, దయ ని-
రీక్షింపుమయ్య! మదీశ! వెండియును
కైలాస శుక్తిమ ద్గౌరీ తుషార-
నీల మైనాక మాణిక్య మహేంద్ర-
సైంధవ కల్యాణ సారంగ సహ్యా-
గంధమాదన కింశుక శ్వేత మాల్యా-
వ ద్విశాలోదయ వర్ధమాన హిమ-
వ ద్విద్యు[5]దస్త ప్రవాళ సువేల-
సోమ నై మేష కుసుమ చిత్రకూట-
హేమకూట క్రౌంచ నీ మేంద్రకీల-
హారిత. పూర్వ సంధ్యా ఋశ్యమూక
వైరోచన నిషధ వ జ్రా[6]మ్ర తామ్ర
మలయరోహణ[7]వింధ్య మానసోత్తర వ-
కుల రాష్య కేసర గోవర్ధన శత-
మేరు కుంజర వృష మేచక శృంగ-

---

౧. గూడ, ౨. దాసోహవృత్తి (యుక్తి), ౩. ముంపఁగ; ముంచిన, ౪. గు, ౫. వస్తు; పస్త, ౬. ప్లు, ౭. గిరి.

పారియాత్రాది శుంభద్గిరీంద్రములు;
గంగ భాగీరథిగంగ వాతాళ-
గంగ భీమరథి సౌగంధిక విరజ
కౌశికి గాంధారి గావేరి[1]యసి వి-
పాశ[2]వరుణ దుంగభద్ర ప్రయాగ-
నంద సరస్వతి నర్మద యమున
మందాకి[3]ని గయగోమతి దామ్రపర్ణి
[4]స్రోత వేత్రావతి సోమప్రభాస
వైతరణి [5]దమస [6]వంజర సరయు
వేగవతి [7]సురస విశ్రుత సంద్ర-
భాగ [8]మహాభాగ వాసవి సిత్ర
యమర[9] బంచ[9]నదిగాయత్రి యుత్సాహ
విమల[10] వేత్రవతియు [11]విమలాభ్ర కనక
శోణ [12]వేదవతియు శుక్లప్రభాస
వేణి వుష్కర గృష్ణవేణి [13]మలాప-

---

౧. యసిలి; యసకి; యశివి, ౨. వరణ, ౩. నీగయమతి, ౪. శ్రోత, ౫. తరస, ౬. వంజీరసరస, ౭. యుసుర; ఘుచర, ౮. విజయమహాభాగవిచిత్ర, ౯. నద, ౧౦. నేత్రవతియు; వేత్రావతి, ౧౧. విపులా, ౧౨. వేత్రావతి; వేదావతి, ౧౩. మలప్ర.

హారి[1]గోదావరి యాదిగా[2]నిఖిల-
ధారుణిఁ[3]గలుగు తీర్థంబులు నదులు
మూర్తిమంతంబులై [4]మొనసి నామీఁద
వర్తిం[5]పుచుండెడు వరమిమ్ము; మఱియు
సద్రతి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య-
శూద్రాదిసత్కులజులును దుష్కులజు
లెట్టిమానవులైన నీశ! మన్నగము
[6]మెట్టినంత[7]నచేసి మిక్కిలికూర్మి
వారి పురాకృత ఘోరకర్మములు
నారూఢ పాతకాద్యానీకకోట్లు
హరియించి [9]వారల కభిమతసిద్ధిఁ
గరుణింపు, కరుణింపు, వరములొండొల్ల'
ననుచు ముమ్మాటికి హరుచేతఁబడసి
యనఘుఁ డప్పుడు పర్వతాకారమగుడు
భంగిగా శివుఁడు [10]దత్పర్వతోత్తుంగ
శృంగోత్తమాంగ ప్రసిద్ధపీఠమునఁ
బొంగారు శ్రీస్వయంభూలింగమూర్తి
యంగీకరించె నుద్యన్మహామహిమఁ

---

౧. గంధవతియు, ౨. (గలుగు, ౩. బరగు, ౪. మాళి, ౫. చు, ౬. మెట్టు, ౭. నె, ౮. నే, ౯. వారికభీష్టద, ౧౦. నప్పర్వ.

[1]బ్రచరింప శ్రీశైల భర్మహర్మ్యాగ్ర-
ఖచితమాణిక్యోరు [2]శకలశ[3]విభూతి
నప్పర్వతాగ్ర శృంగైక మధ్యమున
నొప్పె నెంతయుఁ దద్దేవో దురలింగంబు;
శివదుందుభులు సముంచితలీల [4]మ్రోసె,
[5]దివిఁ బుష్ప[6]వర్షంబుఁ బ్రవి[7]తతఁ గురిసె,
నంతనంతంత న య్యంతకాంత[8]కుని
చెంత నెంతయు మూర్తి[9]మంతంబు లగుచుఁ
బుణ్యాయతనములుఁ బుణ్యతీర్థములుఁ
బుణ్యసరోవరంబులుఁ బుణ్యగిరులుఁ
బుణ్యమహాస్థానములుఁ బుణ్యనదులుఁ
బుణ్యలోకంబులుఁ బుణ్యమార్గములుఁ
బుణ్యవనంబులుఁ [10]బుణ్యౌషధులును
బుణ్యభూములుఁ బుణ్య [11]పురములు సర్వ-
పుణ్యంబులు నగణ్య పుణ్యాంగుఁడైన
పుణ్యుండు గిరిశిరంబున వసియింప;
నిదియ క్రీడాస్థాన [12]మింక మా కనుచు
ముదమునఁ బ్రమథసమూహంబు వొదలఁ,

---

౧. బచరింప, ౨. శిశిర, ౩. విభాతి, ౪. మ్రోయ, ౫. భువి, ౬. వృష్టియు, ౭. తతి, ౮. కుఁడు, ౯. పంతంబు, ౧౦. బుణ్యౌషధములు, ౧౧. పురుషులు, ౧౨. మిదియ.

# పర్వత ప్రకరణము

## గౌతమాదిముని కృత శ్రీగిరి ప్రశంస

గనుఁగొనఁ బ్రత్యక్ష కైలాస మిదియ
యనుచు శ్రీరుద్రగణాధిపు లలర,
నశ్రాంతమును హరాభ్యర్చనక్రియల
కాశ్రయం బిది మన కని సురల్ సెలఁగఁ,
దవిలి [1]బ్రాఁతిగఁ బర్వతా యని కొలువ,
భవుఁ గంటిమని హరిప్రభృతులు [2]నిక్క,
నాసురభక్తిమై హరుఁ [3]గొల్వ [4]నిది ని-
వాసమంచును దైత్యవాస ముప్పొంగఁ,
గంటిమి త్రిప[5]థగంగా[6]సంగమంబు
మంటి మేమని [7]మర్త్యమండలి వొగడ,
ననయంబు జపతపోధ్యాన సత్క్రియల
కనువిచ్చటని మును లాసక్తిఁ [8]బొంద,
సిద్ధించు నిచట నీప్సితసిద్ధు లనుచు
సిద్ధసాధ్యాదులు [10]నేరి నుతింప,
గరుడ గంధర్వ కిన్నర కింపురుష ని-
కర మిగ్గిరియ సుఖకరమని నిగుడ,

---

౧. పాడిగ, ౨. వొదల, 3. గెల్వ, ౪. నది, ౫. ద, ౬. సమూహంబు, ౭. సర్వమనుజులు, ౮. బొదల; నిక్క, ౯. సు, ౧౦. చెలగి. కొల్వంగ; చెరలు పొడువంగ.

నలి జలక్రీడా పవిత్రతలకును
గల నిదియని దేవగణికలు [1]నొలియ,
మన కగు దర్శనమాత్రన మోక్ష
మనుచు ముముక్షు లత్యర్థిఁ [2]గాపుంప,
నద్భుతాచలమిది యగపడె ననుచు
సద్భక్తనికర ముత్సవలీలఁ [3]దేల,
నా దధీచి భృగు కణాద గౌతమ శి-
లా దోపమన్యు కణ్వా[4]ది సన్మునులు
"దేవ! మహాదేవ! దేవాదిదేవ!
దేవ! యుమాదేవ! దివ్యలింగాంగ!
యిచ్చితి ప్రమథత్వ మీశ! ప్రమథుల,
కిచ్చితి రుద్రత్వ మీశ! రుద్రులకు,
నిచ్చితి [5]బ్రహ్మత్వ మీశ! బ్రహ్మలకు,
నిచ్చితి విష్ణుత్వ మిందిరాపతికి,
సుర పాగ్ని యమ దైత్య వరుణ సమీర
నరవాహ నేశాన వరదిగీశులకు,
ధర వెండియును సురాసుర సిద్ధ సాధ్య-
గరుడ గంధర్వోరగ [6]ప్రముఖులకు,

---

౧. నొలయ; పొలయ; పొదల, ౨. గీర్తింప, 3. గ్రాల, ౪. గస్త్యమునులు, ౫. బ్రహ్మకునీశబ్రహ్మత్వ-మి, ౬. ప్రమథులకు.

నీ విధంబున నిర్వ దెనిమిది గోట్లు
దేవాధికారముల్ దెల్ల మిచ్చితివి,
గాక, యుష్మత్కృపా కలిత[1]సమావ-
లోకనామృతవార్ధి నోలలార్చితివి,
భంగిగా శ్రీనగోత్తుంగ శృంగోత్త-
మాంగావిభేద సమగ్రపీఠమున
నిత్యసల్లింగ సాన్నిధ్యానురక్తిఁ
బ్రత్యక్షలింగ రూపముఁ దాల్చియుండు
[2]నిట్టివరంబు మీ రిచ్చినచోటు
నెట్టణకలుగునే నిటలాక్ష! [3]మున్న
భంగిగా వీరభ[4]క్తాంగంబు దివ్య-
లింగోత్తమాంగంబు లీలధరించి
భంగురేతర వీరభద్రేశమూర్తి
నంగీకరించుట యది గల[5]దొకొఁడు,
భంగిగా న వ్వీరభద్రోత్తమాంగ-
లింగసంబంధంబు లీలఁదలిర్ప
నుత్తమాంగము లింగ మున్నది దేహ
ను త్తటి వీరభద్రాధిక్య మెంత
యది వర్వతుని దేహ మది వర్వతాగ్ర

---

౧. సమీప, ౨. నిట్టు, 3. మఱియు, ౪. ద్రా, ౫. ఁడొ.

మది పీఠ మది లింగ మనుభేద మెద్ది?
పర్వతుతనువు[1] శ్రీపర్వతం, బట్టి
పర్వతు శృంగంబు [2]భద్రపీఠంబు
నురుపీఠమదియ యయోనిలింగంబు
భరితలింగము మోక్షఫలదాతయగుటఁ
బరమమునీంద్రుండు పర్వతవిభుఁ[3]డ,
వరతపోధనుఁడు పర్వతవల్లభుండ,
పర్వతోత్తముఁడు[4]ను బర్వతాధిపుఁ[3]డ,
సర్వేశుపీఠంబుఁ బర్వతవిభుఁ[3]డ,
కలిత[5]తదీయ లింగము బర్వతుం[3]డ,
తలఁప దర్శనముక్తిదాత పర్వతుఁ[3]డ,
మాహేశ్వరుండును మహిఁబర్వతుఁ[3]డ, స-
మాహిత ప్రమథనాయకుఁడుఁ బర్వతుఁ[3]డ,
భువనపావనమూర్తి భువిఁ బర్వతుం[3]డ,
శివభక్తిశిఖరంబు శ్రీపర్వతుం[3]డ,
కావున వరము [6]లీక్రమమునఁ దొల్లి
భావించి[7] పడసిన ప్రాజ్ఞులుఁ గలరె
భువినెన్నఁ బరగు నీ బుధులలోపలను?

---

౧. వు, ౨. భర్గు, ౩. ౘడు, ౪. సుపర్వతాధిపుఁడ, ౫. మదీయ, ౬. వి, ౭. ంపఁబడసిన.

దవిలి యట్లనుగాక తమతమకొలఁదిఁ
బూజించి పడయరే [1]పూజకుల్ దొల్లి,
యోజించి పడయరే యోగులు దొల్లి,
గామించి పడయరే [2]కాముకుల్ దొల్లి,
నేమించి పడయరే నిస్స్పృహుల్ దొల్లి,
గీర్తించి పడయరే కృతమతుల్ దొల్లి,
వర్తించి పడయరే వ్రతమతుల్ దొల్లి,
యర్చించి పడయరే యాద్యులు దొల్లి,
సర్చించి పడయరే సన్మనుల్ దొల్లి,
స్తుతియించి పడయరే సుకవులు దొల్లి,
మతియించి పడయరే [3]మనికులు దొల్లి,
భజియించి పడయరే భక్తులు దొల్లి,
సృజియించి పడయరే శీలురు దొల్లి,
భరియించి పడయరే ప్రమథులు దొల్లి,
సరియించి పడయరే శరణులు దొల్లి,
దమ్మిచ్చి పడయరే ధన్యులు దొల్లి,
సొమ్మిచ్చిపడయరే శుద్ధులు దొల్లి,
సేవించి పడయరే సిద్ధులు దొల్లి,
భావించి పడయరే భావకుల్ దొల్లి,

---

౧. పూజ్యులు, ౨. కాములు; కాంతలు, ౩. మనుజులు.

యిట్టక్రిందమీఁద నేఁ[1]డిం దెవ్వారైన
నిట్టువలెఁ బడసిరే యిల, నట్లు గాక,—
యసమాక్షుఁ దననేత్ర మర్పించి చక్ర
మసురులఁ[2]ద్రుంపఁ బద్మాక్షుండు వడసె,
హర! మీకు శిరమిచ్చి పరశురాముండు
పరశువు వడసె భూ[3]పతులఁ ద్రుంపంగ;
శిరములు మీకిచ్చి సురల రావణుఁడు
హరియింపఁగాఁ జంద్రహాసంబు వడసె,
మృడ! నిన్దపోనిష్ఠ మె[4]ప్పించి క్రీడి
వడసె బందులఁద్రుంపఁ బాశుపతంబుఁ,
దన్నిచ్చి లోకహితముగఁ బర్వతుఁడు
సన్నుతిఁ బడసె దర్శనముక్తిప[5]థము,
వరతపోనిష్ఠఁ బార్వతి[6]నిన్నుఁగొలిచి
హరుఁడ! నీ తనువున నర్ధంబువడసె,
వరతపోనిష్ఠఁ బర్వతుఁడు నిన్గొలిచి
హరుఁడ [7]నీలింగాంగ మంతయుఁ బడసె,
నలి నజసుతుఁడు సనత్కుమారుండు
గలఁగి, యద్వైత సంగతి నుత్తమమ్యోఁ,

---

౧. డే, ౨. జంప, ౩. పాలు, ౪. చ్చి, ౫. ద, ౬. మిమ్ము,
౭. మీ.

బర్వతుండు శిలాదు పట్టి సద్భక్తి-
పూర్వకంబుగ లింగపుంగవ ! నీకు
[1]నొనరంగ "భక్తకాయో మమకాయ"
యనఁగ [2]సలింగ సింహాసనంబయ్యెఁ,
గాన నీ కృపకల్మి గలిగినఁ బడయ-
రానిది గలదె ? పర్వతనాథ ! నాథ !
తపము లొల్లక యన్య దైవత [3]సేవఁ
జపలులై కొందఱు జడమతుల్ సెడఁగఁ,
దపములఁ గోరక తరుణులదృష్ట్ల
దపియించి కొందఱు ధార్మికుల్ సెడఁగఁ,
దపము[4]ల [5]నూఁకి యద్వైతసంగతుల
నపరాధులై కొంద ఱజ్ఞులు సెడఁగఁ,
దపములు సేసియుఁ దగ నిన్నుఁ గోర
కపవ్రతమతిఁ గొంద ఱధములు సెడఁగ,
సేవికల్పంబులు సే విఘ్నములును
సేవిషయంబులు సేదు రాశలును

---

౧. లో, ౨. సల్లింగ, ౩. సేవ-జపులునై,-సంస్కృతానువాదములో 'అన్యదేవ సేవాజపపరాయణాః' అని ఉన్నది. కాని దీనినిబట్టి యీ పాఠములను సవరించడానికి వీలైనదికాదు. ౪. లు, ౫. నూరి; నూత్తి.

నేయకార్యంబులు నేయహంకృతులు
నే[1]యపాయంబులు నేకోరికలును
దనకడ్డపడకుండఁ దాత్పర్యభక్తిఁ
బొనరుతపఃపరిపూర్తిఁ గావించి
సవిశేష నిర్దోష సంతోషయుక్తి
భవదియ్య మహనియ్య [2]పాదైకభక్తి
సృజియించి [3]నిష్ఠించి [4]శీలించి నిన్ను
భజియించి మె[5]ప్పించి పడసెఁ బర్వతుఁడు,
వున్నెంబు వర్వతుఁ బుత్త్రిగా [6]నిన్నుఁ
గన్న శిలాదుండు గాఁడె ధన్యుండు?
పుడమిఁ దా మాయయ్య వడసెరా కొడుకుఁ
బడసిన [7]నిట్లుండఁ బడయంగ వలదె?
కొడుకులఁ బడయ సిగ్గులు గానె యింక
వెడఁదపంబులు వన్ని వేఁడు వారలకుఁ?
[8]జక్రినేత్రార్చిత చరణు[9]ం భృగుండు
శుక్రుఁడన్కొడుకు నిష్ఠుర నిష్ఠఁబడసె,
మేఘరూపముఁదాల్చి మిముఁగొల్చి నిర్గ
తాఘు శార్ఙ్గవడసె సాంబుఁ డన్ కొడుకు,

---

౧. యు, ౨. పాథేయ, ౩. వీక్షించి, ౪. సేవించి, ౫. చ్చి, ౬. వెండియును, ౭. నిట్లు;నట్లు, ౮. య, ౯. చక్ర, ౧౦. యుసుండు.

గడునుగ్ర తప[౧]మూఁది మృడుఁడ నీచేతఁ
బడసె నధోక్షజుఁ గొడుకుఁగా నజుఁడు,
నమితతపశ్శక్తి హరి మున్నవడసెఁ
గమలాసనునిఁ బుత్త్రుఁగా మిమ్ముఁ గొలిచి,
యేమని తపము వహించిరి వీర,
లేమిగాఁ బడసిరి, యేమిగాఁ గనిరి,
యొక్కొక్క కోర్కులఁ జిక్కిరిగాక
ముక్కంటి నీకెకాఁ జిక్కి[౩]రే[౪]యిట్లు
భూమిభారము [౫]మాన్పఁ బుట్టినయట్లు
భూమిఁ బర్వతుఁడనఁ [౬]బుట్టెనో కాక
కాదేనిఁ బంచ [౭]వక్త్రంబులం దెట్లు
మేదుర[౮]కాంతిమై మీఱెఁ బర్వతుఁడు ?
మహి[౯]ని దర్శనముక్తి మహిమ దా[౧౦]నెట్లు
సహజమై పరగె శ్రీశైలాధిపతికి ?
హర! శిలాదుఁడు మిమ్ము నర్థి భ[౧౧]జించి
పరహిత ని[౧౨]హితు శ్రీపర్వతుఁబడసెఁ
గావున మూఁడు జగంబు[౧౩]లఁ [౧౪]బరమ-
పావనంబుగఁ జేయఁ బొల్పడితా[౧౫]న

---

౧. మొంది, ౨. నీవ, ౩. రి, ౪. యొ, ౫. వాఁపఁగామందె నిట్లు, ౬. బుట్టితో, ౭. వక్త్రము లొందినట్లు, ౮. కీర్తి, ౯. త, ౧౦. ని, ౧౧. ర్జి, ౧౨. ర, ౧౩. లు, ౧౪. మహిమ, ౧౫. ను.

యరుదగు తీర్థంబు లందెల్లఁ బుణ్యా-
తరమగు పుణ్యతీర్థం బిది యనఁగ,
నతులపుణ్యక్షేత్రతతులలో నిదియ
కృతులఁ జేర్కొన్న ముక్తిక్షేత్రమనఁగ,
విదిత మూలస్థాన వితతులం దెల్ల
మొదలిమూలస్థాన మిదియ తాననఁగ,
ముఖ్యపర్వతచయంబులలోన నిదియ
ప్రఖ్యాత[1]మగు రాజపర్వతంబనఁగ,
హరు పూర్వసింహాసనాదులం [2]దిదియ
యరుదగు దివ్యసింహాసనం బనఁగఁ,
బరగు పర్వతతపోభావాతిశయ[3]త
విరచింప శక్యమే [4]వేదవిస్ఫూర్తి
ధర స్వర్గమర్త్యపాతాళంబులందు
*[5]నరయంగ గతభవిష్యద్వర్తమాన-

౧. ముగ, ౨. దెల్ల, ౩. ము, ౪. వేదంబులకును, ౫. విరచింప భూత భవిష్యదేతత్త్రి; భువిని భవిష్యద్వర్తనాది; భువి భవిష్యద్వర్తమాన.

* ఈపాఠము నేను కల్పించినది. వ్రాఁతప్రతులలో లేదు. సంస్కృతానువాదములో "లోకత్రయే భూతభావివర్తమానేషుచ త్రిషు, కాలేషు" అని ఉన్నది. "భూత" అనేమాట ఒక ప్రతిలో ఉన్నది గాని, ఆ పాఠము ప్రకారము "వర్తమాన" అనేమాట పోతుంది. "భూత" అనే మాటకు "గత" అనే వ్రాఁతప్రతులలోలేని పాఠమును మాత్రమే నేను కల్పించినది. —చి. నా.

కాలంబులందు[1]ను గల[2]వె శ్రీనగముఁ
బోలంగ[3]ఁబర్వతంబులుఁ దీర్థములును ?
గేదారమున నతిక్లేశ[4]ంబొదవ హి-
మోదకం బానక యొనరదు ముక్తి,
సెచ్చెఱ వారణాసిని నిరాపేక్షఁ
గ్రచ్చఱఁజావక కలుగదు ముక్తి,
ద్రావంగవ[5]లనదు దా హిమోదకము;
సావంగ వలవ దా స్థాన మాసించి,
యఖిలమానవుల [6]కెల్లైన శ్రీశైల-
శిఖరదర్శనమాత్ర సిద్ధించు ముక్తి,
వారణాసిని లక్ష వరవిప్రతతికి
నార నన్నము వెట్టినట్టిఫలంబు,
గయలోన రెండులక్షలు భూసురులకుఁ
బ్రియ [7]మార నన్నము వెట్టిన ఫలము,
ననిచిన ద్విజు[8]ల కన్నంబు గేదార-
మున మూఁడులక్షలకును బెట్టుఫలము,
నున్నతీర్థంబుల నొక్కొక్కకోటి
కన్నంబు విప్రుల [9]కందించు [10]ఫలము,

---

౧. న, ౨. డె, ౩. నేనగం, ౪. మొదవ, ౫. లు, ౬. క, ౭. మాన; మున, ౮. న, ౯. కందిచ్చు, ౧౦. విధము.

నాకాంతు శ్రీగిరియం దొక్క జన్మి
యాకు పట్టెడునంత యన్న మొక్కనికి
దానంబుసేయు న[1]ద్యత్ఫలంబునకు
మానుగా నవి యసమానంబు [2]లనఁగఁ
బర్వతుమహిమ యేభంగిఁ గీర్తింప ?
సర్వ[3]జ్ఞ సద్యఃప్రసన్నైకమూర్తి
దవిలి "చకిత మభిధత్తే" యనంగ
భువి "నేన మేత న్నిబోధత" యనఁగ
సంగతి "నత్యతిష్ఠద్దశాంగుల"మ -
నంగఁ దా "స్మర్యతే న చ దృశ్యతే"య-
నంగ విరించి జనార్దనాదులకె-
ఱుంగ [4]వ్రేఁగగు దివ్యలింగ! నీ తనువు
గరతలామలకసంగతిఁ గానుపించెఁ
గర మొ[5]ప్పు పర్వతు కారణంబునను,
నప్రతిమోద్యద్దయాధామ ! నీదు
[6]ప్రప్రసన్నత పెంపు భవ్యంబటంచుఁ

---

౧. ద్యతతత్ఫలంబు; ద్యత్ఫలంబులును, ౨. లన్న(న్ని), ౩. జ్ఞు, ౪. వెఱవును; వ్రేఁగను, ౫. ప్ప (ప్పె)ఁ, ౬. అప్రసన్నత పెను పతిశయంబనుచు.

శ్రీగిరిదివ్యస్థానకథనము

దమ మునిబృంద మెంతయుఁ [1]గెడగూడి
క్రమమున రుద్రసూక్తము లాది యైన
విరచి[2]తాశీర్వాద వేదనాదముల
నరుదుగాఁ గీర్తింప హరుదక్షిణమునఁ
గుండతీర్థమనంగఁ గుంభినినొప్ప
దండిపాతకకోట్లఁ దా హరిం[3]పుచును,
నందు మందాకిని యాదిగా[4]ఁ గలుగు
నందితంబై మూఁడు నదు లాశ్రయించి
యదియ తల్లింగమూలావర[5]ణాంక
మొదవంగ నుదయించె నుత్తరంబునను,
మల్లికాకుండనామమున లోకములు
వల్లభత్వమునఁ బావనము సేయుచును
నందు భాగీరథి యాదిగానుండు
వందితంబై మూఁడు నదు లాశ్రయించి
యవిరళనిత్యమహాదేవ [6]శర్వ
భవ భీమ రుద్రోగ్ర పశుప తీశాన
కమనీయ తల్లింగ కలితనామాప్త-

---

౧. సుమి, ౨. తగీర్వాణ, ౩. చు, ౪. నుండు, ౫. ణాంగ, ౬. సర్వ.

౧కమున దివ్యాష్ట లింగస్వరూ౨పముల
నీక్షించు జనులకు మోక్షమిచ్చుచును
మోక్షేశ్వరం బన ముంద౩ఱ వెలసె,
నలరి సూక్ష్మస్థూల యాత్ర౪నాదేహ-
ములునాఁగఁ బురములు మూఁడు హరించు
ననుప౫మాద్య త్రిపురాంతకదేవుఁ
డనఁగఁ దచ్ఛిఖరేక్షణార్థమై యొప్పెఁ,
బాటి౭మై పాతకోత్పాటనమహిమ
హాటకేశ్వరమన నలరె యామ్యమునఁ,
బాపవినాశనప్రతిభ నొప్పారి
పాపవినాశనుం డేపారి యవుల
రమణ వరాహేశ్వరముఁ గిన్నరేశ్వ-
రమును సారంగేశ్వరమ్మును ఘంట-
సిద్ధేశ్వర౧౦౦ంబునాఁ జెలువారి జనుల
శుద్ధులఁ గావించుచును ౧౧బశ్చిమమున
నద్భుతలీల ౧౨నాయాస్థానముల స-
ముద్భవంబయ్యె లిం౧౩గోపకంఠమున,

---

౧. కము(మ)ల, ౨. పంబు, ౩. ట, ౪. న, ౫. మాద్యత్రి, ౬. శ్వరా, ౭. గాఁ బా, ౮. శెఁ బా, ౯. ర న, ౧౦. బనఁ, ౧౧. దాఁబ్రతీచి, ౧౨. నయ్యై, ౧౩. గోఱ.

నొలసి తదియ్య సద్యోజాతవదన
మలరె బ్రహ్మేశ్వరం బనఁ బశ్చిమమున,
వామదేవాంచిత వక్త్రంబు [1]దనరెఁ
దా మహేశ్వరమనఁ దగ నుత్తరమున,
గుఱి దక్షిణమున నఘోరవక్త్రంబు
వఱలె జ్యోతిస్సిద్ధ వటనాథుఁ డనఁగ,
రమణఁ దత్పురుషవక్త్రము మహామహిమ
నమరెఁ బూర్వనఁ ద్రిపురాంతకంబనఁగఁ,
దన[3]రె నీశానవక్త్రంబు [4]నూర్ధ్వంబు
నన మల్లికార్జున నామంబుఁ దాల్చి;
యామల్లికార్జునోదాత్త విఖ్యాత-
నామ [5]మెట్లయ్యెఁ బినాకి కంఠేని-
గృహఁ బెక్కుయుగముల క్రింద శ్రీపర్వ-
తపురాణమహిమ రుద్రాణికి రుద్రుఁ
డానతియిచ్చె[6]చో నటమున్న యయ్యెఁ
దా ననేకయుగార్బుదంబులనాఁడు
నలి మల్లికార్జుననామ మన్వాక్య
మలరుటఁగాఁ జేసి యయ్యుగంబునను

౧. పొదలె; పదగ, ౨. మున, ౩. రు, ౪. పూర్వ, ౫. మి, ౬. తో.

జంద్రగుప్తుం డనఁజను భక్తుఁ డొకఁడు
సంద్రవంశ్యుండు దజ్జనపతితనయ
సంద్రవతీకన్య సరసచైతన్య
సాంద్రతరాగణ్య సంచితపుణ్య
యనురక్తి శ్రీమల్లికార్జునుఁజూడఁ
జనుదెంచి తనతోడి సతులును దాను
బ్రతివాసరంబును భక్తిఁగొల్చుచును
సతి యొక్కనాఁడు హర్షము¹దులుకాడఁ
గిన్నరగంధర్వ గీతప్రకలిత-
సన్నుతనాదప్రసన్నత మీఱి
యతిమృదుమధుర సమంచితాలాప-
గతుల సప్తస్వరకలితమై శ్రుతులు
సాంగమై మ్రోయఁ దొడంగినరీతి
శృంగముల్ ³గూడియాడంగ దిక్కులు గ-
లంగ నాకసమద్రువంగ నందున్న
గంగ మనం బలరంగఁ బాతాళ
గంగ యంతంత కుత్తుంగతరంగ-
రంగముల్ నలిఁ గడువంగ, మీఁదటికిఁ
బొంగ, సురల్ నుతింపంగ, శిలలుఁ గ-

1. దలుకొత్త, 2. వ, 3. గూడఁ జెలంగి.

అంగఁ, గాత్రము లిగ్రువంగ, [1]మ్మృగములు
గ్రాల, రసంబులు [2]గ్రోలఁ, జిత్తములు
సోల, [3]గాయకతతుల్ [4]ప్రాలఁ, గిన్నరులు
దూల, నుమానాథు మ్రోల నానంద-
లీల దలిర్ప నబ్బాల సంప్రీతిఁ
బాడ, సుగతు లోలిఁగూడ, నాచంద్ర-
చూడ పార్వతియును బ్రోడమనంబుఁ
గూడ నాదాంబుధిఁ గ్రీడఁ దేలుచును
జూడ, మెచ్చులు దులుకాడ, [5]సోముండు
“మెచ్చితి నబ్జాస్య! మృగశాబనయన!
యిచ్చ నెయ్యది వేఁడు మిచ్చెద” [6]ననుడు
“శ్రీపర్వతోత్తుంగ [7]శృంగోత్తమాంగ-
దీపితఖ్యాపిత దివ్యలింగాంగ!
మీహూళియందు [8]సమేళనంబుగను
ప్రేమం బెలర్ప నర్పించినయట్టి
యీమల్లికాదామ మెల్లగాలంబు
మీహూళియందు సమ్మిళితమైయుండ
దయసేయుఁ [9]డనుచుఁ జంద్రవతి వేఁడుటయు

---

౧. మార్గములు, ౨. లోలల; వోల, 3. గానలతలు, ౪. ప్రాలః ప్రాల, ౫. సాంబుండు, ౬. ననిన, ౭. శిఖరో, ౮. న, ౯. మ.

రయమునఁ దేజోవిరాజితం బైన
మల్లికాదామ ముమానాథుఁ డునిచె
నల్లీల జాహ్నవీ చంద్రమధ్యమున
గంగాతరంగిణీ సంగతోత్తుంగ-
[1]రంగత్తరంగ పరంపరోద్ధూత-
పృథులకూలంకష ఫేనవిభాతిఁ
గథనియ్యమగు మల్లికాదామ మదియు
నర్జునకాంతిఁ జెల్వగుట శ్రీమల్లి
కార్జునుం డనునామ మయ్యె లోకములఁ,
దక్కినలింగ ప్రతతులకు నట్ల
యొక్కొక్క నామంబు లొనరి రొక్కొక్క
కారణంబునను నాఖ్యాతి దల్లింగ
చారుపూజాఫల సౌఖ్య మెట్లనిన,
నగణితంబైన లింగాకారమైన
నగసంస్మరణ దర్శన స్పర్శనముల
వలనను స్వర్గాపవర్గాదిసౌఖ్య
మలరారుచున్న 'దే మని ప్రస్తుతింప?
విను "పునర్జన్మ నవిద్యతే" యనుచు
ఘనపురాణాదు లొక్కట మ్రోయఁగాన

---

1. రంగాంతరంగ, ౨. ర, ౩. తు.

యనుచు వెండియు మల్లికార్జునగురుఁడు
[1]మనికుఁడై పర్వతు మహిమ నుతింప,
"వరగురునాథ ! నీవచనంబు[2]లేని
విరచింపఁబర్వతు వినుతియే[3]నియును
నున్నదే వీనుల కొక్కింతదనివి ?
విన్నపం,బ్దేఁ బనివినియెడ, నాకు
క్షిప్రంబ యీపని గృపసేయుటకును
సుప్రసన్నాత్మ ! మహాప్రసాదంబు,
వారక పర్వ[4]తు వర్ణన యనఁగ
మీ రానతిచ్చిన చారుసత్కృతిని
లెక్కింప శిలలెల్ల లింగరూపంబు
లక్కజంబుగ వాక్య మది [5]దథ్యముగను,
బాలీన కేతనా[6]పహమూర్తి లింగ -
పీఠప్రకారమై పృథివి శ్రీనగము
మీదివ్యదృష్టికి మించి వెలుంగు,
భేద [7]మెఱుంగ మీ[8]పాదముల్ గాని,
మీయాజ్ఞఁ దలమోచి పోయెద [9]నిష్ట

---

౧. ఘనుఁడైన శ్రీపర్వతుని వినుతింప, ౨. లేను, ౩. యనుచు, ౪. త, ౫. సాంగ, ౬. వహ, ౭. మే నెఱుఁగ, ౮. పదములే (ల), ౯. నిష్ఠ.

దాయక! మీప్రసాదము [1]దయసేసి
రక్షింపు[2]డని యనురక్తి దోనయ్య
యాక్షితి సాష్టాంగ మెఱఁగి శ్రీగిరికి

దోనమార్య మహేశ్వరాచలప్రాప్తికథనము

నరుగంగ నరుగంగ నన్నిదిక్కులను
ధరణి[3]యీనినభంగిఁ దండతండములు
[4]చెరసుల యడవుల [5]గరుసులఁద్రోవ
వెరసు[6]లఁ [7]గడవంగ [8]వెంగలమంది
సరసలఁ జనుదెం[9]చు [10]పరుసలఁ జూ[11]చి
పురుషులఁ గని హర్షపు[12]లకలు వొదల
వారు[13]వారును నేఁగుదేర, సంత[14]సము
గూర, మహేశ్వర ద్వారమార్గముల
దండడి వెన్కముం[15]దఱఁగూడ నడవ,
సందడింపకుఁ డంచుఁ [16]జిక్కరండనుచుఁ
వెనుకఁ జిక్కకుఁ డంచు వేగ [17]రండనుచుఁ

౧. (గృప, ౨. మని, ౩. బూనిన, ౪. సెరసుల, ౫. గసురులు, ౬. లు, ౭. గదు(డ) వ(ప)ంగ, ౮. వరసల; పరసల; పరసుల. ౯. చి, ౧౦. వ, ౧౧. చు, ౧౨. లు, ౧౩. దానును, ౧౪. త్వ, ౧౫. ముందట నడుమగూడ, ౧౬. జప్పరించుచును, ౧౭. మయనుచు; రమ్మనుచు.

జనుఁడు ముందఱ నంచుఁ జన కేమియనుచుఁ
దోలతోలఁ డనుచు నా త్రోవఁ బోండనుచుఁ
దలరకుండీ యంచు దవ్వెంత యనుచు
సిరిగిరి యిదె యంచుఁ జేరితిమంచుఁ
బురమున కెన్నడు వోదు[1]మో యనుచుఁ
బోదపోదఁ డిపు డేమి వోయె[2]మీకనుచుఁ
బదినాళ్ల కైనఁ బోయెద[3]మకా కనుచు
[4]గొడ్డ వెట్టకు[5]ఁ డంచుఁ గొఱఁ తేమి యనుచు
యడ్డమే మన కేమి యరుగు తెర్వనుచు
నీయూరి బగుతులిం డ్లెఱుఁగుదే యనుచు
నాయేఁడు [6]విడియమే యీయూర ననుచు
బారెండు నెట్లైనఁ [7]బాఱు[8] తెండనుచు
నారగింపక చాల నరుగుదే మనుచు
లింగావసరము సెల్లెడినె మీ కనుచు
జంగమోచిత మవశ్యము గదా యనుచుఁ
గావళ్ల వారిఁ జిక్కఁగనీకుఁ డనుచుఁ
గావళ్ల[9]వా రిఁకఁ గాని[10]వా. రనుచు

---

౧. డో; నో. ౨. మా, ౩. మొకో (ముకా) యనుచు, ౪. గుడ్డ, ౫. నుంచు, ౬. విడువమే(మా), ౭. డెట్టులనైన, ౮. బాజీ, ౯. పొండ, ౧౦. వారిని, ౧౧. కాదనుమ.

¹బాధపాద ప్రాద్గులు ²పుచ్చక యనుచుం,
³గదలె నీసాంతు నిక్కములకు ననుచుం
గ్రందులో⁴ జనంజొరంగా నేలయనుచుం
గ్రందులో జనికాని కదవలేమనుచు
నిదె కంటిరే శ్రీమహేశ్వరం బనుచు
నదె మీందట మహేశ్వరావాస మనుచుం
గడు నొప్పు బహుహేమకలశంబు లనుచు,
బడుగు దేవర యర్థపతి పంద్యుం డనుచు
జయవెట్టుం డిటుగూడ సాంతెల్ల ననుచు
జయజయ ఘే యుఘే జయజయ యనుచు
నుల్లాస మొందర నిట్లురుతరాన్యోన్య-
సల్లాపనంబుల సరసమై తనరెం
జనుదేర శ్రీమహేశ్వరభూధరేంద్ర-
మున విలసిల్లు తత్పుర మెట్టు లనిన,-
శ్రీకుధరోత్తుంగశిఖరంబులదియుం

---

౧. ప్రాదప్రాద; పాదలుచు, ౨. పుచ్చకుండనుచు, ౩. కదలి సేవత్తు, ౪. క్కలకుండా, ౫. జొరంజొర, ౬. లావునంగాని, ౭. కదలమే మనుచు; కడవలేదనుచు, ౮. నిది, ౯. బడుగు, ౧౦. ల, ౧౧. సల్లపనంబులు (నో. క్తులు), ౧౨. ౧౩. నప్పురము, ౧౪. రోత్తర, ౧౫. శృంగసంఘములె.

ప్రాకటంబగు[1]దేవభవనంబు[2]లదియుఁ
బరచితప్రత్యంతపర్వతా[3]కృతులఁ
గర మొప్పు హర్మ్యనికాయంబు[4]లదియు
నిలనుండి ముక్తికి [5]నిడ్డసోపాన-
ములయ[6]ట్లు సోపానములనొప్పు[7]నదియు
దివి ముక్తికాంతలు దివిరి శ్రీగిరికి
సవినయంబు[8]గ [9]వీఁచు చామరల[10]ట్లు
వినువీథిఁ దా[11]కు శ్రీవృషభాంక మ[12]గుచుఁ
దనరువిచిత్రపతాకంబు[13]లదియు
ఖ్యాతిగా వ్యాసహస్తాంకమై [14]పొలుచు
వాతపూరణముల వడి నొప్పు[15]నదియుఁ
బటువియత్కన్యకాభరణవిభాతి
నటియించుమణితోరణంబులయదియు
మహీజటారుద్రాక్ష [16]మకుట [17]సన్నిహిత-
మహితజంగమలింగమండలియదియుఁ
బ్రవిమల[18]ప్రమథపుష్పకవిమానముల

---

౧. హేమ, ౨. లనియు, ౩. వళులె, ౪. లవియు, ౫. నిదియ, ౬. ట్లు, ౭. మఱియు, ౮. న; ల, ౯. బెక్కు, ౧౦. ట్ల, ౧౧. క్ర, ౧౨. ను, ౧౩. న, ౧౪. పొల్చు; తోఁచు, ౧౫. మఱియు, ౧౬. మహిత, ౧౭. తోరణసు, ౧౮. ప్రథమ.

పవిది నొప్పగు గణభవనంబులదియు
నర్ణవ [1]ఘోషణంబ ట్లహర్నిశము
ఘూర్ణిల్లుబహువాద్యఘోషంబులదియు
నట్టిమాహేశ్వరోద్యత్పురవరము
చుట్టును మధుకరశుకపికనికర-
రవపరి[2]కలితవిరాజితం[3]బగుచు
నవకమై తనరు నానా[4]రవంబులను
ఘనరుద్రపాదోదకము వచ్చు పరుస-
కును గలశంబులఁ గొనివచ్చియున్న
చందంబు[5]నను జలసంపూర్ణ మగుచు
నంటితంబై యొప్పు నారికేళములు
నలి శైలసందర్శనఫలముల్ వరుస
నెలమినీఁజా[6]లుదు మే మన్నయట్లు
ఫలభరితంబులై [7]ఫలపార్శ్వములను
నలరారు కదళీ[8]ఫ లానీకములును
జూతము శ్రీగిరి చూత మన్వారిఁ
జూత మనెడు ఫలాన్విత [9]చూతములును,
ద్రివిరి దర్శనము లీఁ దెచ్చినయట్టి

---

౧. ఘోషంబుల ట్లహర్నిశము, ౨. కల్పితరా, ౩. బనఁగ, ౪. వనంబు, ౫. ల, ౬. లెద, ౭. పఘ, ౮. దళా, ౯. ఫలి.

పవిద్ధినొప్పుగుఫలభరితచూతములు,)
వినుఁడు మిన్నిన్నాయనాళ్లు వెడలిన వ్వాఁడ్ష
ఘ్నునభ్రక్తిమైఁ దప్పుగడచినా రింక
దమచింత లేల నొందం డనుకరణి
నమరి యంతంత నొప్పారుచింతలును,
జెలఁగి వసంతుండు శ్రీగిరిచుట్టుఁ
గలయ్య ఫలావళుల్ గట్టినమాడ్కి
నిల నొప్పు రుద్రాక్షుల సీడెల మాది-
ఫలముల నిమ్మల ఫలమంజరులను
నిల మల్లికార్జునుఁ డెసగు మాపేరఁ
బొలుపుగా ననివిచ్చు బొడ్డుమల్లియలుఁ
గుంధంగ నేల శ్రీగోత్రంబుఁ జెంది
కుందకుండని నవ్వు కుందగుచ్చములు
సేవమై నీశు భజింపనివారి
సేవ యేటికినను సేవంతివిరులు
గిరులలో భవనాగకేసరియనిన

౧. రెనం, ౨. చుట్టి-కలయ, ౩. రుద్రాక్ష, ౪. యీరేల, ౫. నిమ్మల, ౬. పూచు; పెచ్చు, ౭. కుండ, ౮. కుచ్చలును, ౯. వాని; వారు, ౧౦. నన, ౧౧. సేవంతు, ౧౨. గిరులలోపల (భవ), ౧౩. యనఁగ.

భక్తిప్రకరణము

గిరి[1] యదే యను నాగకేసరంబులును
నగము[2]లన్నియుఁ బెంటే నగము [3]లీనగము
పొగడఁ బున్నాగ మను పున్నాగములును
బొగడ నొప్పారు శ్రీ భూధరేంద్రంబుఁ
బొగడరే యనుచున్న పొగడపుష్పములు
గిరి నెవ్వ రెవ్వ రెక్కింతురో తమ్ము
వరదుచే [4]నెవ్వ రెవ్వరు గొండ్రొ వరము
[5]సూచెద మనుచున్న చూడ్కిఁ [6]నంతంత
పూచి [7]యెంతయు నొప్పు పుష్పవాటికలుఁ
గనుగొంచుఁ బొగడుచుఁ గ్రక్కున వచ్చి
తన రారు తత్పురాంతర్వీథులందు
గ్రందార నొక్కొక్క గములుగాఁ [8]గూడి
చిందులు వెట్టుచుఁ జిత్తంబు లలరఁ
జెలఁగుచు నలరుచుఁ జెరలు వొడ్చుచును
బొలయుచు మ[9]లయుచుఁ బొరి సంతసిలుచు
మూఁగుచు నేఁగుచు మూఁకలు గొనుచు

౧. యది, ౨. లిన్ని, ౩. లిన్న. ౪. గొండు రెవ్వరకో వరంబు; నెవ్వరెవ్వరు గొండ్రు పదను, ౫. మాచేతను చున్న మాడ్కి, ౬. యున్నంత; కందపద, ౭. వెండియు, ౮. జూచి, ౯. దు, ౧౦. రి.

వీఁగుచు [౧]నాఁగుచు విస్మితు లగుచు
నుక్కుచు [౨]నిక్కుచు నుల్లసిల్లుచును
సొక్కుచు [౩]దక్కుచు సుగతి నిల్చుచును
నాడుచుఁ బాడుచు నట్ల మ్రొక్కుచును
గూడుచుఁ జాటుచుఁ గో యని యార్చు-
చును, జప్పటులు వెట్టుచును, [౪]సరి[౫]పదము-
లను సంఘటింప నాళతులు సేయుచును,
[౬]సమ్మదంబున [౭]నిట్లు సనుదెంచు [౮]పరుస
యమ్మహేశ్వరనగం బఱిముఱి [౯]నెక్క-
భావింప నుత్తరభాగ మంతయును
ద్రోవలు [౧౦]గట్టె యద్భుతము వట్రిల్లఁ
జెట్టును గట్టు[౧౧]ను శిలలును సెలలు
[౧౨]మెట్టును [౧౩]బల్లము [౧౪]మీఁదును గ్రిందు
నటుగూడఁ బరుస[౧౫]గ్లై యల[౧౬]రె విచిత్ర-

---

౧. గ్రాఁగు, ౨. జిక్కుచు, ౩. నిక్కు, ౪. దుది; దరి, ౫. పథ, ౬. సమ్ము, ౭. నిట్లచను, ౮. పరస (ఇట్లే 'పరుస'కు బదులు పరస అని కొన్ని ప్రతులలో తక్కినచోట్లను కలదు. ఈ పాఠాంతరములను అన్నిచోట్లను చూపలేదు), ౯. నెక్కు, ౧౦. గట్ట న, ౧౧. చు, ౧౨. మెట్టయు, ౧౩. మెల్లముల్, ౧౪. మీఁదను గ్రింద, ౧౫. లై, ౧౬. రు; రి.

పట్టము తత్పర్వతపతిఁ గప్పినట్లు,
సురగిరిఁ దెగడెడు [1]వరగిరివైన
సిరిగిరి యంతయు నరగిరి యయ్యె,
నక్కజం[2]బనుచు ని ట్లెక్కు[3]చు, నెడలఁ
జిక్కుచు, నొండొరుఁ జే[4]యూఁదికొనుచు,
[5]ప్రక్కుచు, [6]నేచుచు మల్లడిగొనుచుఁ,
[7]ద్రొక్కుచు, నట ద్రోపుఁద్రోపు లాడుచును,
నంతంత జయజయాయత రావముల న-
గాంతరంబు[8]ల దిక్కు లద్రువ ఘూర్ణిల్లఁ
జక్కన తత్పరిషత్కోటి సుగతి
కిక్కయై చను నగం బెక్కి తత్క్షణమ
వర[9]నిజధారాప్రవాహ[10]ఝుత్కార-
విరచిత[11]ధ్వానంబు విన్నయంతటన
భూరిపాతకకోట్లఁ [12]బొలియించు రుద్ర-

---

౧. హార, ౨. బలర, ౩. చున్నెడల, ౪. యూఁదు, ౫. మక్కుచు (చే), ౬. నెక్కుచు, ౭. గ్రొక్కుచు, ౮. లు, ౯. నిజాధార; నిత్యధార; నిజతారా, ౧౦. ఝుల్కార, ౧౧. రావంబు, ౧౨. పొలి (రి) యించి.

[1]ధారాంబువులఁ [2]గృతస్నానులై [3]పరుస
యా మహేశ్వర దేవు నర్థి భజింపఁ
దా మున్న సమయోచిత క్రియల్ [4]సల్పి
పండితారాధ్యేంద్ర [5]మండిత పాద-
పుండరీకాంతరంగుండు దోనయ్య
శ్రీమహేశ్వర దేవు శివునుతి [6]సేంపుచును
గామించి [7]తద్భక్త [8]గణ [9]సంఘములకుఁ
బ్రవితత భక్తిమైఁ బర్వంబు సలిపి
యవిరళప్రీతి గుర్వర్పణ సేసి
ధర [10]గూడ సప్తపాతాళముల్ [11]గాఁడి
యురుతరంబై మీఁద [12]నుడువీథిఁ గడచి
పరగు శృంగంబులు [13]పఁ బన సాప్రముఖ్య-

---

1. సారాంబువుల ('స్నాన' శబ్దము తప్పను అభిప్రాయముతో ఈ పాఠమును తరువాతివారు కల్పించిఉంటారు. కాని, సంస్కృతానువాదములో 'రుద్రధారా' అని ఉండడముచేత యతిస్థానములో 'స్నాన' అనేపాఠమును గ్రహించినాను.— చి. నా), 2. జనులు, 3. సలుప, 4. పండిత, 5. ంచు, 6. సద్భక్త, 7. ఘన, 8. సమూహికిని, 9. నూడ (త; ద); నూత, 10. గూడి; గాడి; 11. నురువిధి, 12. భ్రమరాప్ర (మ్ల; మ); 13. (ప) లితాశ్ర.

తరు [1]గుల్మ దివ్యలతా [2]వితానములుఁ
గందువుల బహు [3]ఘర్కటావళిఁ [4]గెరలు *
సందు [5]గాక్కులు దక్క నలరు [6]పక్షులును
[7]రుద్ర ధారయు పెక్కు రూపంబులైన స-
ముద్ర [8]క్తి ద్వారంగు ననూన [9]ధారలును
శ్రీకుబేరేశ్వర సిద్ధేశ్వరాద్య-
నేకలింగములు [10]మాహేశ్వర బిలముఁ
గనుగొన [11]ంచు నద్భుతాక్రాంతాత్ముఁడగుచు
ఘనమగు తన్నగాగ్రము [12]శివపురము
మహిమయుఁ దద్ద్వారమహిమయుఁ దీర్ఘ-
మహిమ్నయు వినుచు ధీమణి దోనమయ్య
మనమున హర్షించి మల్లికార్జునము
సన నభిముఖుఁడుగా నాతునునలరి
సూరెల జయవెట్టుచును సంతసిలుచు
[13]భోరన నగమధ్యమున దిగ[14]జాఁగి

---

1. దివ్యసల్మ, 2. విమా, 3. శర్కటా, 4. చరులు; సెలలు, 5. గాసుల, 6. పతుములు, 7. రుద్రుతారయు, 8. సముద్రు (ద్వా) క్తి(త్రి), 9. ధారు, 10. మహేశబిలములు, 11. నియ, 12. శివు, 13. భోరున, 14. జారి.

* ఈ పాదమునకు సం. గ్రంథములో అనువాదము లేదు.

రతిఁ గల్పవృక్షంబుఁ బ్రాకెడు కల్ప-
లతయును [1]బోలెఁ [2]సల్లస కురవ్యఁ జేరి
యక్కజంబంద స్వర్గాపవర్గము[3]లు
నెక్కొని [4]నిల్చిన నిశ్శ్రేణులట్లు
నెక్కొన్న యారెండు నిచ్చెనల్ గడచి
[5]గ్రక్కన తన్నగాగ్రంబెక్కి చనఁగఁ-
జనఁగఁ దూర్పునను బంచక్రోశమాత్ర-
మున రమ్యమగుచు [6]ను మునుబశ్చిమమునఁ
గడునొప్పెస [7]గు బిల కల్పోక్తి నెన్నఁ
బడుశ్రీచతుర్ముఖ బసవేశ్వరుండు

చతుర్ముఖ బసవేశ్వరదర్శన కథనము

నా దేవదేవు మహత్త్వ మెట్లనిన,-
నాదిసర్గల కాది యగు వృషసర్గ
నభవుండు శివుఁడు లీలార్థమై సృష్టి
[8]కభిముఖుండై శ్రీవృషాధీశుఁ జూచి,
"చనుము గో[9][10]మాతృపంచకములో భద్ర-
యును నందయు సుశీలయును సుమనసయుఁ

౧. బోలు, ౨. నల్లవ, ౩. ల, ౪. నిల్పిన, ౫. గ్రక్కన, ౬. నావిని;నుమునిగి, ౭. గి, ౮. రంబు, ౯. నభి, ౧౦. మాత్ర(త్రు).

గొనుచుఁబా, మ్మమరులకు సురభి [1]నను పు,
[2]మెనర ధరిత్రిఁ బశూత్పత్తి [3]ఁ బడయు,
శ్రీకుధరోత్తర శృంగంబునను స-
దేకాంతమున వసియింపు"నావుడును
జనుదెంచి యిల సహస్రధనుః ప్రమాణ-
మునను గ్రిందట నొక్క పురముఁ [4]గల్పించి
భువినా వృషభపురముననను జతుర్ము-
ఖవృషభేశ్వరునిల్పి కాంక్షఁ గొల్చు[5]చును
నాల్గుముఖంబులై నాల్గు దిక్కులను
నాల్గుగోమాతల నలవరింపుచును
దొడరి గోమాతృచతుర్ముఖంబందు
వడసెదాఁ బశురాశిఁ బడసి [6]వానికిని
బ్రథితంబుగా [7]బిల్వ పర్వతంబందు
వృథివికి వెడలంగ బిలముఁగావింప
నవియును [10]వెడలెఁ గన్యాసిద్ధనాథు
భవ[11]నాంతరమునఁ [12]ద త్పశువులు వెడలఁ-
గా నంత మునికన్యకలువచ్చి హేమ

---

౧. నిలుపు, ౨. మొనరంగధరణి, ౩. వడయు, ౪. గావించి, ౫. డు, ౬. రాశి, ౭. బిల, ౮. బనఁగ, ౯. లింప, ౧౦. వెడలంగ నాసిద్ధ, ౧౧. నోత్తర, ౧౨. దత్పవిభువులు.

ధేనువు²లను గొన్ని ధ్వతిఁ గొనిపోవఁ
జిక్కిన పశురాశి సృష్టిపై నిలిచె,
నక్కజంబుగ నంత నఖిలలోకముల
వృషభేశుఁ ²డాసృష్టి విరచి³ంప నదియు
వృషసర్గ నా వేదవి⁴దిత⁵మై ⁶తనరె,
మూలమై యాచతుర్ముఖ ⁷వృషభేశు
నాలుగు ముఖము⁸లు నందితంబయ్యెఁ
గనుగొన ధర్మార్థ కామమోక్షముల-
కును గారణంబులై కూడు శ్రుత్యుక్తి,
నదిగారణము మునులందఱు నదియు
మొదలుగా శ్రీచతుర్ముఖ ⁹వృషభేశుఁ
బరమేశు వృషభేశుఁ బాతాళవృషభ-
పురవరాధీశు శ్రీ భూధరావాసు,
నర్చింతు రట్లు కన్యాసిద్ధనాథు
నర్చింతు ¹⁰రంధును నందు ముప్రొద్దుఁ,
గడు నర్థి మునికన్యకలు త్రికాలంబు
నెడపక యావృష-భే¹¹శు లింగంబు :

---

౧. లకు; లుత్త, ౨. డా, ౩. ంచివారియు, ౪. హి, ౫. మ్మై, ౬. చనియె, ౭. బసవేశు, ౮. ల, ౯. బసవేశు, ౧౦. రంధుల్న నందుల ప్రొద్దు, ౧౧. శ.

సత్రమునియూథుఁ గన్యాసిద్ధనాథు
బ్రతిరూప మెసఁగ నివాళింతు రర్థి,
నది ఘూదిగాఁగఁ గన్యాబిలం బయ్యె,
నది [1]గారణముగఁ గన్యాసిద్ధనాథుఁ
డన నొ[2]ప్పె నణిమాదు లష్టసిద్ధులకు
[3]నునికిపట్టై యంత జనులు గీర్తింప
నక్షీణతరకీర్తి యాలింగమూర్తి
దక్షిణంబున సముద్యన్మహామహిమ
సేకొని దిక్తటశ్లోకిని, పుణ్య-
పాకిని, హితచక్రవాకిని, [4]సితప-
తాకిని, నిర్ధూత [5]ఘాకిని, యమృత-
సేకిని, దివ్యమందాకిని యొప్పెఁ,
గావున మును బిలకల్పోక్తమైన
యావృషభేశ్వరం బలరారె మున్న
వెలయఁ జతుర్ముఖ వృషభేశు పేర
నిలఁ జతుర్ముఖ బసవేశ్వరుం డొ[6]ప్పెఁ
బసరింప నా వృషభ[7]పురంబు పేర
వసుధపైఁ బరగె నా బసవపురంబు;

---

౧. ఘూదిగాఁగఁ, ౨. ప్పె, ౩. మనికి, ౪. ష్మితటాకిని, ౫. ఘాకిని, ౬. మేసుఁడు నొప్పె, ౭. బిల్వంబు.

సీచతుర్ముఖబసవేశు భజింప
నాచతుర్ముఖవృషభాంకలింగంబు
భజియింప నభిమతఫలములువొందు,
నిజ[1]భక్తిముక్తులు నెక్కొనఁ[2]జెందు,
నట్టి శ్రీబసవేశ్వరాలయం బంతఁ
గట్టెదురను[3]గాంచి ఘనుఁడు దోనయ్యా
దడయక యిష్టార్థ దాత్ర[4]గా నెన్నఁ-
[5]బడిన చతుర్ముఖ బసవలింగంబు
నత్యర్థిసముచితాభ్యర్చితుఁ జేసి
నిత్యలింగార్చన నియమముల్ దీర్చి
పండితార్పణముగా భక్తమండలికిఁ
బండు[6]వు సేయ నా పరుసయు నల[7]రి
యందుండి సంప్రదాయములు గూడుచును
జిందులు వాడుచుఁ జెలఁగియాడుచును
జప్పట్లువెట్టుచు సఖులఁబట్టుచును
నుప్పొంగిపేర్చుచు నుబ్బియార్చుచును
[8]మనికులఁ బిలుచుచు మతులఁ[9]గలయుచు
వినుకులు సేయుచు [10]వివిమతుఁ బాయుచును

[1]. భక్తి, [2]. బొ (జి)ందు, [3]. గాంచె, [4]. నా, [5]. బడ యు, [6]. స, [7]. రె, [8]. మను, [9]. గలఁచుచు, [10]. విరతి.

బద్యముల్ సదువుచుఁ [1]బ్రభల నొదవుచు
వాద్యముల్ గూర్చుచు వడి[2]దనర్చుచును
దాళముల్ [3]వెట్టుచు దమము [4]దట్టుచును
సాళెముల్ సూపుచు జడత [5]వాపుచును
రమణ [6]నిక్కుచుఁ[7]బయనములు ద్రొక్కుచును
భ్రమరిఁ[8]బొల్చుచు సమభంగి నిల్చుచును
గతులఁ గ్రాలుచును నాళతుల [10]సోలుచును
శ్రుతుల [11]వ్రాలుచు భక్తిగతులఁ దేలుచును
నొసగులు సెప్పుచు యుక్తి [12]నొప్పుచును
బసవేశునకు సమర్పణ[13]ము సేయుచును
నోలిఁ బ్రమథుల నాద్యులఁ దలంచుచును
లీల నమ్మాడ్కిఁ గే[14]ళికలు సేయుచును
నేతెంచి శ్రీబసవేశుదర్శించి
భాతిగా నిష్టార్థఫలసిద్ధిఁబొంద
రసికత దోనమరాజయ్యఁగారు
బసవేశు మహిమ[15]ను బ్రస్తుతింపుచును

---

౧. బ్రబలి, ౨. నదర్చుచును, ౩. బట్టుచు, ౪. పట్టుచు, ౫. జొ(ద్రొ)క్కుచు, ౬. బయసములు, ౭. బోల్చుచు, ౮. లు, ౯. గ, ౧౦. నొలయుచును, ౧౧. దాలుచు, ౧౨. చెప్పచును, ౧౩. మయానసుచు, ౧౪. లి, ౧౫. యు; షే.

శోభిల్లు[1] మల్లికార్జునదేవు పురవ-
రాభిముఖుండయి యరుగ సంతంత

పరిసరవర్ణనలు

సంత[3]సంబునఁ బరిషత్కోటియును ని-
రంతర[4]గతిఁ [5]దొంటియట్ల యాడుచును
నాడుచు నటఁబెక్కు [6]పథములఁ బరుసఁ
గూడి[7]కొనుచు[8]వాద్య ఘోషణంబెసగ
బహు[9]నదీ సంగమ ప్రసరతఁ బేర్చు
బహుళభాగీరథీ భావన నరుగఁ
బరుస[10]పాదనిహతి ధరణి యుప్పొంగఁ
జరియించు పథములఁ [11]జలిమిరిదోఁపఁ
బవుల నెండిన పాదపము లంకురింపఁ
జివికిన కొలఁదులఁ [12]జివురులు దనర
వాడిన[13]తీవలు వడిఁ బల్లవింపఁ
గూడఁ దారినయట్టి గుల్మముల్ వొదలఁ
[14]జేబు(?)వ నుండిన శిలలు గఱంగ

౧. ల్ల, ౨. గుసంతటను, ౩. తంబును, ౪. ర (త) తి, ౫. దొంగి, ౬. పదములు వరుస, ౭. మెచ్చుచు, ౮. వార్థి, ౯. నద, ౧౦. పదాహతి, ౧౧. చిరి; జిరి; జల, ౧౨. జిను, ౧౩. తీవె (గె), ౧౪. జేరిన చెందిన; జేరి చెందినయట్టి.

[1]నాఱుపులను గిరి మూాడెడు వెరుఁగఁ
గవిసి[2]పైఁ బాఱు మేఘములు రంజిల్ల
నవకాశ[3]మగు[4]బయ[5]లార్ద్రత్వం బొంద
భంగిగా శ్రీగిరి పరుసరాకకును
బొంగి సర్వాంగముల్ [6]పులకించినట్లు
సనుదెంచు పరుస[7]లోఁ జనుదెంచు భక్త-
జనములు సనుదెంచు చాళియె ట్లనినఁ

### జంగమకోట్ల నడలు

బొడ[8]వగు [9]సంబువుల్ [10]బెడగగు పసిఁడి
గొం[11]డగులుఁ బావలుఁగూడ లోహం[12]బు-
పా[13]వలు, దంతంబుపా[13]వలు, రాగి-
పా[13]వలు, [14]వాగెలపాదరక్షలును
[15]దొాడికొని పదనఖద్యుతు[16]ల దర్పణము
లడ[17]ర శిష్యా[18]లికి నిడినట్లు వెలుఁగఁ
జందన[19]కావులు సరి[20]సాటికావు

---

౧. ఆరిన చిగురులు; ఆరించివసుగిరుల్; ఆరిచినను గిరుల్, ౨. మైవారు, ౩. మును, ౪. జయ, ౫. బాద్రవం; బాన్ద్రత్తం, ౬. జెంగించు, ౭. తో, ౮. గ, ౯. సంబ, ౧౦. పొదగగు, ౧౧. డు, ౧౨. పు, ౧౩. గ, ౧౪. వాగాల, ౧౫. దొడు, ౧౬. లు, ౧౭. రి, ౧౮. వళికిడి, ౧౯. కోవులు, ౨౦. వాటు.

లందంబు లగు కఱకంచుకావులును
[1]వలిపొత్తి[2]పచ్చడంబులును గాపీన-
ములు మీఁద[3]గూఁడకట్టులుఁ గానుపింప,
[4]వెలి[5]బేరెములు [6]గళుకులు గొంత[7]దోపఁ
[8]బలుచని జోడుకుప్పసములు పూని,
[9]పట్టుత్రాళ్లును బ్రాఁతపట్టువస్త్రములు
వట్టుతొంగల్లునుఁ బట్టువీణెలును
జందురుకావి పల్చ[10]ని వల్వడొల్లు *
[11]బొంద మీఁదికి నెత్తి క్రిందఁ గీలించి,
పరువడి దొడి[12]గి కుప్పసములు[13]మీఁదఁ
గరమొప్పఁగాఁ బటిక[14]ము సరంబు[15]లును
బాహుల [16]నుపవీత[17]భాతిఁ జేతుల స-
మాహితలీల రుద్రాక్షముల్ దాల్చి,
కావిపచ్చడములు గావిదుప్పట్లు

౧. బొలిగొత్తి; పలువొత్తి; వలనొప్పు, ౨. కప్పు, ౩. గుడ్డ; గుండ, ౪. బెలి, ౫. బేర; బేలె; బెన్న; జరణ, ౬. గలు, ౭. దోవ, ౮. బలుసనిజోడు; పలుకడిబలుసు, ౯. ప్రట్టు, ౧౦. టి, ౧౧. బొంద, ౧౨. న, ౧౩. మేద, ౧౪. పు, ౧౫. నను, ౧౬. నుత, ౧౭. భ్రాంతి.
* ఈపాదము తరువాత కొన్ని ప్రతులలో, "జిందెలుత్రివళు (విల)లు— జెంది (ద్రిక (ం); చంద్రిక;) డొల్లు (ద్రోళ్లు)" — అనే పాదము ఎక్కువగా కనబడుతున్నది.

[1]తావు[2]మంజిల్లు [3]ఖండంబు దోఁపులును
దనరారు[4]చల్లడాల్ దట్టి పచ్చడము-
లును, రత్నకంబళులును, వెలి[5]పొత్తి-
పచ్చడములు, [6]బూర[7]వడములుఁ, బట్టు
పచ్చడంబులు, వెలిపట్టు పైఁ[8]బెట్లు
మఱి[9]యు నుప్పరమునందుల [10]పటికంబు
వలయముల్ రుద్రాక్షవలయముల్ మీఁదఁ
గల[11]శముల్ మీఁదటఁ గంచుగుబ్బలును
గొంకులఁ జంద్రసూర్యులు గల్గు చీర-
మకుటముల్, గంబ[12]ళి మకుటముల్, [13]నంది-
మకుటముల్, వులితోలు మకుటముల్, [14]గంచు-
మకుటముల్, రుద్రాక్షమకుటముల్, రాగి-
మకుటముల్, [15]నవరత్న మకుటముల్, సోగ-
[16]తప్పరంబులు, [17]బోడ[16]తప్పరంబులును,
గొప్ప [18]తప్పరములుఁ [19]గొమరొప్పఁ దాల్చి,

---

౧. తావి, ౨. మాంజిష్ఠ, ౩. పవళంబు, ౪. బల్లడ, ౫. పొత్త, ౬. జార; జాడ, ౭. వదములు, ౮. బెట్టి, ౯. య, ౧౦. పటి కంపు; పట్టికంబు, ౧౧. క, ౧౨. ళి, ౧౩. సంది, ౧౪. గంసు, ౧౫. వర, ౧౬. తప్ప, ౧౭. బొడ, ౧౮. తొప్పరములు; తప్ప రములు, ౧౯. కొమరార(రుగా).

శుద్ధ సువర్ణసన్నద్ధ ప్రసిద్ధ-
శుద్ధస్ఫటిక [౧]పరిస్రుతకుండలములు,
మండిత రుద్రాక్ష మణి హేమ రజత-
కుండలంబులు, రాగికుండలంబులును,
నందికుండలములు, నాగకుండలము
లందమై కర్ణంబులందు [౨]సెల్వారఁ
బలు[౩]వన్నె బెత్తముల్, [౪]వలిబెత్తములును,
[౫]వలయంబుబెత్తముల్, [౬]మలకబెత్తములు,
[౭]గక్కుబెత్తములును, గౌరిబెత్తములుఁ,
[౮]జక్కనివెదురు పొంజాయబెత్తములు,
[౯]సైరణఁ గోలలు, సందనంబులును,
[౧౦]గైరంబు లాకులుఁ, [౧౧]గనుపదండములు,
[౧౨]నినసులకోలలు, [౧౨]నినసుల మొగడ,
[౧౩]లనసుల సందుల జను లాకులములు
జల[౧౪]పోసనముల [౧౫]మీఁదుల విలాసములుఁ
గలశముల్ వట్టుఁ గుచ్చులుఁ జిత్తరువులుఁ

---

౧. సరి, ౨. కల్వార, ౩. వెన్న, ౪. వలియబెత్తములు, ౫. వలియంపు, ౬. వలిక, ౭. క్రక్కు, ౮. జక్కనములు, ౯. సారణ కోలలు; సైరకోలలుమంను, ౧౦. గైరంపు బాకులు, ౧౧. కనప, ౧౨. నను, ౧౩. లను, ౧౪. పోశ, ౧౫. వెన్నెల; వన్నెల.

గఁణసాంగమగు వెలిగొడుగులుఁ [౧]బీలి-
గొడుగులు, ముత్యాలగొడుగులు, [౨]బిరుదు-
గొడుగులు, వెలి[౩]పట్టుగొడుగులు, [౪]మోడ్పు
గొడుగులు నిడు[౫]తోడ[౬]గుడ్డ [౭]లేతేరఁ,
గళుకులుఁ, జిత్రముల్, [౮]గమలముల్, బంధ-
ములు [౯]నందులునుగూడ జల[౧౦]పోసనములు
గర మొప్ప తేకుల గద్దైనంగరులు
సరిఁ గామసజ్జల సజ్జనగరు[౧౧]లు
సనువుగద్ద[౧౨]నగరు [౧౩]లంకుసొంకులును
[౧౪]ఘనకరతలముల గద్దైనఁగరులుఁ
జెలువారు పట్టుకుచ్చు[౧౫]లు, శివసూత్ర-
ములును, వెండిపసిండి గొలుసు[౧౬]లు నమర,
సుస్థిర[౧౭]నియతిఁ గరస్థలంబుల, ను-
రస్థలంబులను, [౧౮]గక్షస్థలంబులను,
నాభిస్థలములఁ, గంధర దేశముల, శి-

---

౧. బీరె, ౨. జీబు (బె; సు), ౩. వంక, ౪. మోడ్పు; మెట్టి, ౫. తొడ, ౬. గుడ్డు, ౭. లు, ౮. క్రములుగా, ౯. సందు, ౧౦. పోశ(వ), ౧౧. ల, ౧౨. స, ౧౩. లంగసొంకులును (మ్రోదులును), ౧౪. కనకతలముగద్దె గరులునునమర, ౧౫. ల, ౧౬. న, ౧౭. మతి దిగ్గర, ౧౮. వక్షు.

రోభాగముల, భక్తి శ్లాఘి దలిర్పఁ
బాయని లింగసంబంధ నిష్ఠాన-
పాయతత్త్వములు సంప్రాప్తిగాఁజేసి,
ప్రభుశక్తిఁ ద్రిభువనపావనోద్యుక్తి
శుభదైక[1]యుక్తి నిశ్రుతమహాభక్తిఁ
గని పరిషత్కోటి [3]గడుభక్తి మ్రొక్కఁ
జనుదెంచు మకుటవర్ధన జంగమంబు
రాగికుండలములు, రాగినందులును,
రాగినూలులు, దొడ్డ రాగి[4]కంటెలును,
రాగియుంగరములు, రాగిదండలును,
రాగిజన్నిదములు, రాగియుత్తెరలు,
[5]వలుద కొక్కెరలుఁ[6], బాలెలుఁ; దామ్రఘటన
నెలకొను [9]సరిపెణల్, నేవళంబులును
గిలుఁ[10]గొల్కులు, రాగి కీర్తిముఖము[11]లుఁ,
గ్రాలు[12]నందెలు[13], రాగి కటకముల్, రాగి-
పదకంబులును, దామ్ర బంధబంధుర స-

---

[1]. వృత్తి; [2]. యుక్తి, [3]. గని, [4]. కంటు, [5]. వలువ, [6]. ములు, [7]. బో, [8]. ని, [9]. సరిపణుల్; సురపణుల్; రస పణుల్; సరిపణిల్, [10]. కోర్కుల; కొక్కులు, [11]. ల, [12]. నందుల; సందుల, [13]. హస్త.

ముదితప్రభల నొప్పు నొడ్డియాణములుఁ
బటుతరామలినసంపద నొప్పు దొడ్డ-
కటిసూత్రము[1]లు [2]ధౌతకౌపీనములును
నలఁదిన గు[3]ల్ఫాంత మగు భూతిక్రింద
సలలితనిజకాంతిఁ జను [4]పదాబ్జములు
నఖనికరాంశులు నయనదీధితులు
ముఖ[5]విలాసములు సము[6]ద్ధతకళలు
విశ[7]దభస్మోద్ధూళితశరీర[8]రుచులు
దశనద్యుతులు దిశాతటముల [9]గప్పఁ
[10]బట్టుగుచ్ఛంబులు వెట్టిన [11]చిట్టి-
[12]చిట్టి[13]వెల్లెల్లలు[14]సితచామరములు
*నలసుల కలశము లమరులాతములుఁ
[15]బలితోలు కంబళముల గద్దియలును

౧. ల, ౨. నొప్పు(ప్పి), ౩. ల్భ (ల్మ), ౪. పరాబ్దములు, ౫. వికా, ౬. ద్ధి, ౭. వ, ౮. ములును, ౯. ముంప, ౧౦. ప(పు)ట్టు విలాసముల్; పుట్టువిలాసములును, ౧౧. చిట్టె(ట్టు), ౧౨. చిట్ట, ౧౩. వల్లెల్లులు; వెల్లెలుసిత, ౧౪. సేత, ౧౫. జలితోల్కంబళుల; బలితో లుకంబళములు.

* ఈపాదమునకు సరియైనపాఠము దొరకలేదు. "నన (ను) సుల (లు) గలశములమరునా (లా; లో) కులము (లును); ససులాళ (స) నళయు." అనే పాఠము లున్నవి.

ధరఁ జోద్యముగఁ గరస్థలములమీఁద
వరుసఁ[1]జుట్టిన బహు[2]వర్ణవస్త్రములు
[3]మెల్లనినడపులు మృదుభాషణములు
వల్లభత్వములుఁ [4]జిత్తోల్లాసము[5]లును
భక్తిశృంగారముల్ ప్రభుశక్తులును వి-
రక్తిభావములు నారాధ్యసంపదలు
జనమనోహరమగు శాసనమహిమఁ
బూనరారు లాంఛనంబులు నైజముగను
మానుగా నొక్కొక్కమండలి యనఁగఁ
బూని[6]యెంతయు జగత్పూజ్యత దనర
నభిరమ్యలీల దుల్కాడంగ నిట్టు
లుభయజంగమకోటు లొక్కట నడువఁ

### వృద్ధతపోధనుల నడకలు

జన లేక [7]కాల్లీడ్వ సగమ్మట్టు[8]లు విడి-
సినప్రాంత[9]లగు గూడ చెప్పటట్టులును
[10]గుట్టైనగుడ్డల [11]గోర్పడంబులును

---

౧. బు, ౨. వన్నె, ౩. మొల్లమితడుపులు; మెల్లనివస్త్రములు (నడపులు; నడుపులు), ౪. తేజో, ౫. మునను, ౬. యంతేయు, ౭. కాళ్లీడ్డ, ౮. విడిచి (సి), ౯. లను, ౧౦. కుంటైన, ౧౧. గొరుప.

[౧]గట్టిన [౨]యడిప్రాఁతకచ్ఛడంబులును
జింపి[౩]గొడుగులు గ్రుస్సినశరీరములుఁ
[౪]దెంపిజన్నిదము లు[౫]త్తెరలును, [౬]జాల
వంగినవీఁపులు [౭]వడఁకెడుతలలు
భంగురంబుగఁ బ్రాఁకు[౮]వట్టిన[౯]పండ్లు
[౧౦]సడరంగ వీఁపుల [౧౧]నంటుకొన్నట్టి
కడుపులుఁ బెడతలఁ బడిన కన్నులును
దెల్లగా నరసిన [౧౨]యుల్లి[౧౩]గడ్డములు
[౧౪]గ్రుల్లుఁగ్రుల్లున [౧౫]నుక్క[౧౬]సిల్లు దగ్గుటలు
స్రుక్కిళ్లుగొన్నట్టి పుక్కిళ్లు, వయసు-
వెక్కిళ్లు[౧౭],జవముల [౧౮]తక్కిళ్లు, ఘర్మ-
జలములఁ జెమ[౧౯]రుపూఁతలు గట్టినట్టు
లలఁదిన తొంటి సర్వాంగభూతులును,
నలరు తద్భూతి[౨౦]పై నన్ని[౨౧]గందువులఁ
బొలుపారు చారుత్రిపుండ్రరేఖలును,

---

౧. కట్టున, ౨. నది (డి), ౩. డ, ౪. దెంపు, ౫. తెరలును, ౬. జార; జూడ, ౭. వణకెడి, ౮. పట్టెడు, ౯. పళ్లు, ౧౦. అడియంగ, ౧౧. నంటి, ౧౨. యల్లి, ౧౩. గడ్డలును, ౧౪. క్రుళ్లి క్రుళ్లిన, ౧౫. నుక్కి, ౧౬. సిల్లుటల్జాల, ౧౭. జప(ర)ముల, ౧౮. తక్క (క్క)ళ్లు, ౧౯. లు, ౨౦. పై, ౨౧. గద్దువులు.

[1]ముడిలేక [2]సంపుల [3]ముడిచి వైచు[4]డును
దోడిఁ[5]దోడిఁ జేతుల మొదవ్రేలుజడలు,
భూతిపాత్రంబులు భుజనాగ[6]పతులు
ఖ్యాతి[7] మైనొప్పెడుఁ[8] కామపజ్జలును,
[9]నూఁతంతయనఁ[10]గాళ్లు [11]నొడళులుఁదూల
నూఁతలుగా[12]నిడ్డ యూఁతగోలలును,
గడుసాంగములు జగ[13]త్పావనార్థములు
నడర నిట్లుదయించి యతిథిరూపముల
మహిఁ "సర్వతీర్థై స్సమాగత" యనుట
సహజమై తనరు[14] శ్రీశైలంబుమీఁద
[15]సరసరఁ దీర్థముల్ సరియించునట్లు
వోరిఁబోరి వృద్ధతపోధనుల్ నడువ

మింపజంగముల నడకలు

మిక్కిలి[16]కట్నముల్ మేలిచందన[17] ము-
[18]చెక్కలు [19]నెలివత్తి చిక్కణంబులును

---

౧. వడివెన్క(క్క); ముడిరేక, ౨. సంబులు, ౩. ముదిచి, ౪. చు, ౫. వ్రేలు, ౬. తతులు, ౭. తమైరెయొ, ౮. గాయనజ్జలు, ౯. ఓతొ(తో)ంత, ౧౦. గాని, ౧౧. నొడయళ్లు, ౧౨. నిండ, ౧౩. త్కారణా, ౧౪. ర, ౧౫. సరినడ, ౧౬. కట్టముల్, ౧౭. పు, ౧౮. చెక్కలు, ౧౯. నలవత్తి; నెరివత్తి; నలతొత్తి;

గస్తూరి మొదలుగాఁ గలుగు సుగంధ-
వస్తువులనుగూడ వాసించినట్టి
కరమొప్పు బాగాల కై[౧]రగుళియల
[౨]కరటాలు సున్నంబు [౨]కరటాలు నిడిన
యడపతిత్తులు మూఁపులందు [౩]ధరించి
సడి[౪]సను[౫]సంబెళల్ [౬]సంకట నిజెకి
తోడఁదోడినాఁకులు [౭]మడచి యిచ్చుచును
విడువక [౮]గుడ్డలు వెనుక[౯]నేతేరఁ
గీలించి పసిఁడికొక్కెము[౧౦]లుఁ గుసుళ్లఁ
గ్రాలు రుద్రాక్షం[౧౧]బు కంఠమాలికలు
ధవళాంబరంబులుఁ దనువుల నమర
[౧౨]గవరని[౧౩]పసపులఁ గ్రాల్పులిగ్రోళ్లఁ,
జెప్పలు, నడపుల యొప్పులు, గీలుఁ-
గొప్పులు, మాటల [౧౪]మెప్పులు, నొ[౧౫]సలి
తిలకముల్, [౧౬]నోఁటిముత్తియములు, [౧౭]నూళ్లఁ

---

౧. కైరగుళిగల; కళియగుళియల; కైరావళులుల, ౨. కరటలు, ౩. వహించి(చు), ౪. సెను, ౫. సంబళుల్, ౬. సంకెల, ౭. తుడిచి, ౮. కుంచ, ౯. కొనితేర, ౧౦. లనుగూళ్ల, ౧౧. ంపు, ౧౨. కవరని; కవలయ్యు, ౧౩. పాసుపుల, ౧౪. నొప్పులు; కప్పులు, ౧౫. న, ౧౬. తొంటి, ౧౭. నులులు.

[1]గొలఁదిచౌకట్లు, ప్రోగులు, సుద్రసరులు,
వజలు నానా[3]సఖ వ్రణచుంబనములు,
నెఱిభక్తులకు [4]మాటు[5]వఱుపకుండుటలు,
[6]బగుతులచేత[7]దాఁపఁగ నిచ్చినట్లు
దగిలి ధట్టించి యర్థములు దెచ్చుటలు,
'రారోరి[9]బగుత తేరా [10]లంజ'కనుచు
[11]నారంగ వ్రయమున [12]కడిగి తెచ్చుటలు,
'బసవన్న కరుణ[13]రా, [14]బగుత!' [15]నీ'కనుచు
నసమిచ్చుచును ధనం బడిగి తెచ్చుటలుఁ,
'గలియుగబసవండ విల నీవ' యనుచు
నలరించి భక్తుల నడిగి తెచ్చుటలుఁ,
బ్రాకటంబుగవచ్చు పణ్యాంగనలను
గ్రేకంటఁ జూచుచుఁ గేలిసే[16]యుటలు,
సర[17]సతఁ బుష్పమంజరులు వైచుటలుఁ,
జెరలాడుటలు, నారిఁ జేరఁబిల్చుటలు,

---

౧. గ్రొలది, ౨. పడా(డ్డా)ల (ర), ౩. ము(స)ఖ, ౪. మాట, ౫. పఱ(ల)ప, ౬. బగ, ౭. బాపఁగ, ౮. ట్టు (ట్ల), ౯. భక్త; బగత, ౧౦. లంజె, ౧౧. నాలంజ, ౧౨. కరిగి. ౧౩. గా, ౧౪. బగత; బసుతు, ౧౫. మీరనుచు, ౧౬. యుచును, ౧౭. సర.

వేలంబు లడు[౧]గుచు [౨]వెనుక నేఁగుటలు,
నాలోలమతి వీడియంబు లిచ్చుటలు,
[౩]మిండాటముల [౪]నిట్లు మెఱయఁ [౫]దోమాల-
[౬]దండలుఁ, [౭]గురువేరుదండలు [౮]నమర,
దరహాసరుచు[౯]లను దండలుఁ, దగిన
వరభూషణావళుల్ [౧౦]వాలిక[౧౧]గ్రోల్లు
వివిధవిచిత్ర నవీనవస్త్రము[౧౨]ల
నవధరించిన లింగనివహంబు[౧౩]పాయలు
[౧౪]దులుకాడు దృగ్ధీధితులు దంత[౧౫]ధామ-
ములు నిజదేహద్యుతులు సాంగముగను
బ్రతిలేని దేశాధిపతుల భాన[౧౬]మున
ధృతిపేర్మి నితరుల ధిక్కరింపుచును,
సంధిల్లి[౧౭]విటశ్లేష సహజమదాంధ-
గంధసింధురములగతి మలయుచును,
[౧౮]భామగో[౧౯]నాదుల పొలుపున నెదిరి

---

౧. కుచు, ౨. వెనక, ౩. మెండాల(ట) ముల(లు), ౪. యట్లు; నట్లు(ల్లు), ౫. జోసాల, ౬. దండముల్, ౭. సరివేలి, ౮. నలరు, ౯. లునుద్దండముల్, ౧౦. వాడి(రి)క, ౧౧. జోల్లు; గోల్లు, ౧౨. లు, ౧౩. ంప్రు, ౧౪. దొలు, ౧౫. ధావనలు, ౧౬. నము; ముల, ౧౭. నిట, ౧౮. భూవి, ౧౯. నాథుల.

కాముకులను గని కాలుద్రవ్వుచును,
బొనరుకస్తురిమృగంబుల క్రమంబుననుఁ[1]
జనులకు దేహవాసనలొసగుచును,
దేవదేవేశు భోగావతారముల
భావనభక్తుల ప్రాణేశు లనఁగఁ,
విదనుమనోధనము లాదటవహారింపుచును
ననుపక్తలింగ నిరంతర సావ-
ధానతత్పరతమైఁ దత్ప్రసాద ప్ర-
లీనభోగోపభోగానంద సౌఖ్య-
మండిత సకల సమగ్రత మెఱసి
మిండజంగమ[3]కోట్లు మెల్ల[4]న నడువఁ,

శీలవంతుల నడలు

[5]బలుక[6]వాగులు [7]నేత[8]పట్టెలు [9]గూర్చి
పొలుఫారు పాదరక్షలు భాతిమెట్టి
[10]ముసుఁగిడి వస్త్రంబు ముందఱ జనుల
[11]కెసగ [12]మాటిడి త్రోవ కెంతయుఁ దొలఁగి

---

౧. పొలుపు, ౨. తన, ౩. కోటి, ౪. నే, ౫. పలక, ౬. వాగులు; నావలు; పావల, ౭. నంత, ౮. పట్టులు, ౯. మార్చి, ౧౦. ముసి, ౧౧. కెసలఁగు, ౧౨. మాడెడి.

భావించి ముందఱ భక్తులు సనఁగఁ
దా వెన్కవారిపాదములు సూచునను,
నలి "నభక్తాలోకనా చ్చైవ" యనఁగ
వలెఁ "బదార్థాని వివర్జయే" త్తనఁగఁ
బొలుచు రేఖలు లేని [1]బోనపుభాండ-
ములు[2]సిన్న చట్టువంబులు [3]నిడి మీఁదఁ
జుట్టును గాసెనల్ [4]సుట్టిన[5]బోన-
పుట్టికల్ సంధించినట్టి కావళ్లఁ
[6]బలుకలు [7]నెరయ నేర్పడిన పదార్థ-
ములఁ జెంచులును [8]మొకరెల యిన్పమొలలు
[10]వడివెట్టువస్త్రముల్ వంశపాత్రములఁ
దడియొత్తువస్త్రముల్ దగినగుగ్గు[11]ము-
[12]చంచులును, విభూతి[12]చంచులు, ముగ్గు-
చంచు, [13]లారతిజోళ్ల[12]చంచులు, నూదుఁ-
గ్రోళ్లును, దింగ[14]కుదుళ్లఁ, బదములు

---

౧. పొలుపున, ౨. చిన్న; ఛిన్న, ౩. నిని, ౪. చుట్లును, ౫. బోమ, ౬. పలకల, ౭. నెలయు; నేర, ౮. లచెంచులును, ౯. మొకరిలు; మోర్లుగల, ౧౦. పడిబె(౯)ట్టు, ౧౧. పు, ౧౨. సంచు, ౧౩. లారతిజోళ్ల (సింపి), ౧౪. నదుళ్లు.

[౧]గ్రోళ్లను వుప్పించుకొను గోరుగండ్లుఁ,
గలయంగ మేల్కట్టు గట్టెడువస్త్ర-
ములుఁ, దెరగట్టుచీరలు నాదిగాఁగ
నతిసువిధానంబు లగు నుపకరణ-
తతులు గంట్లపు [౨]బెడ్లు దమతోడ [౩]నడువ
ననసులు [౪]వెట్టిన [౫]యలఁతి లాకులము
లొనరంగఁదాల్చి వ్రతోద్యుక్తి [౬]దనరు
వేషముల్ భక్తి సుభాష[౭]లు [౮]నిత్య-
[౯]భూషణ వినయవిభూషణములుగఁ
గాంతురు ప్రాణేశుఁ గానరు జగముఁ,
జింతింతు రాత్మేశుఁ జింతింప రొండు,
మఱియుఁ బంచాక్షరీమంత్రంబుఁ గాని
[౧౦]మఱచియుఁ దలఁపరు మంత్రంబు లొండు,
దలఁ[౧౧]తురు ప్రాణేశుఁ దలఁప రన్యంబు,
వలతురు భక్తికి [౧౨]వలవ రొంటికిని,

---

౧. గోళ్లను వుప్పించు గోరుగండులును; గోళ్లయుప్పించులు ములుగోరుగ (గొ) ండ్లు, ౨. డె, ౩. నడవ, ౪. చెట్టున; వెట్టిన, ౫. యానులికా (యా, లో) కులము, ౬. నమరు, ౭. ల, ౮. స, ౯. భాషలునవియవి; భాషలునవినయ, ౧౦. మఱియును ౧౧. పశు, ౧౨. వలువ.

బలుకుదు రున్నట్లు వలుకరు బొంకు,
లలుకుదు రొడయల కలుక రన్యులకు, *
నడుతు రాచారంబు నడువ రనీతి,
విడుతురు దైన్యంబు విడువరు చలముఁ,
గొందురు ప్రసాదంబుఁ గొన రనర్పితము,
విందురు భక్తులకీర్తి విన రొండుకీర్తి,
నిప్పాట సజ్జను లెల్ల నుతింపఁ
దప్పక సద్భ[1]క్త దాస[2]తానియతి
సన్ను[3]త శ్రుతిమతాచారసంపత్తి
సెన్నారఁ జనుదెంచు శీలవంతులును

విరక్తుల నడకలు

బరమశాంతత్వంబు భసితంబు[4]నెనయఁ
బొరిఁబొరి సర్వాంగములఁ బూసికొనుచు,
శమి[5]తశబ్దాదివిషయములకచ్ఛ-
డములను వీడకుండఁగఁ గట్టికొనుచుఁ,
బంచాక్షరంబులుఁ బరహితాలాప-
సంచితాక్షరములు జపముసేయుచును,

---

* ఈ పాదముతరువాత, "నడుసదురొడయల–నడుగరు భవుల" అని ఒకప్రతిలో అధికపాఠ మున్నది.

౧. క్తి, ౨. డా, 3 తి, ౪. లెనయ; నలయ, ౫. తేంద్రియాది.

నమర లాకులము[1]ల [2]నంతర్ముఖేంద్రి-
యముల నేప్రొద్దుఁ బాయక ధరించుచును,
నయమొంద నిత్యమనస్సమాధాన-
నియతి[3]యన్ యోగపట్టి[4]య ధరించుచును,
[5]దులుకాడు పరమసంతుష్ట [6]చారిత్ర-
ములు మొలచుట్టును మొగిఁ జుట్టుకొనుచుఁ,
దప్పని స్వసమయోత్సాహంబు గంథ-
[7]కుప్పసంబులు గెడగూడఁ దాల్చుచును,
నిరశనభి[8]క్షులు నిష్క్రియామృతముఁ
దరి నీశ్వరున కర్పితము సేసికొనుచు,
యమనియమాది వ్రతారూఢు లగుచు
శమదమాన్విత [9]సదాచారవర్త[10]నల
నచలితపరమపరానందలీలఁ
బచరించుబుధులు విభ్రాంతులై [11]పొదలఁ,
దనుధర్మములు ద్రుంపఁ దపములు వెంప,
మనసు[12]లు మర్దింప మదము[12]లు [13]డింపఁ,
గోపం[14]బు లడఁగింపఁ గోర్కులు [13]ద్రెంపఁ,

౧. లు, ౨. కం, ౩. యమోగ, ౪. యు, ౫. తో, ౬. చ, ౭. కుప్పసంబున, ౮. క్షులు, ౯. వ్రత, ౧౦. నులు, ౧౧. పొగడ, ౧౨. ల, ౧౩. డింప, ౧౪. బడంగింప.

బాపముల్ హరియింప భక్తిమై [౧]నింప,
మును జగంబులలోన ముక్తు [౨]లీఁబూన
ఘనతరంబుగ దానకారణం బైన
యవిరళలింగార్చనానుషక్తియును
సవిశేషజంగమాసక్తి యుక్తియును
సతతలింగాసమర్పితవిరక్తియును
ధృతి నొప్ప [౩]భవవిరక్తియుఁ బ్రాణమైన
తము గాంచి సద్భ[౪]క్తతతి గొనియాడ
రమణ నేతెంచు విరక్తజంగములు

శివయోగుల నడకలు

బాహుతలంబుల ఫాలంబులను స-
మాహిత హల తోరణాంబుజ మత్స్య-
కలశ దంభోళి శంఖ చ్ఛత్ర ముఖ్య-
విలసితపుణ్యరేఖలు వొలుపార
నయనాబ్జరుచులు నున్నతనాసికములుఁ
బ్రియ[౫]మితాలాపముల్ [౬]పృథుజఘనములుఁ
జానుభుజములు విశాలవక్షములు
సారసంస్మితముఖాబ్జములు[౭] గొదర్లు (?)

---

౧. సుంప, ౨. లు (ల) బూన్ప, ౩. భవ, ౪. క్తిఁదము, ౫. మ, ౬. పీనవక్షు, ౭. గో(గా)దర్లు; గొందరటి.

సర[1]సాంగ[2]కళలు నాజానుబాహు[3]వులుఁ
గరమొప్ప శ్రీకారకలిత[4]కర్ణములుఁ
గృతులకు [5]దేశాధిపతులకు భక్తి-
మతులకు శివయోగ[6]రతులకు నొప్ప
వినమితాఖిలశుభాన్వితలక్షణాంక-
వినుతావయవరాజి వెండియు నమర,
మలినదర్పణములమాడ్కి జీమూత-
ములలోని చంద్రుని [7]పొలుపున మెఱయఁ
గాలియు దూపడంగని [8]త్రాళ్లపగిది
నోలి దేహములు లోకాలికిఁ జూడఁ
గలిగియు సహజసంగా[9]తగుణావళులు
గలుగని సిరసాంగములు వహించి
యతిశయఖండంబు లగు[10]కథ లుడిగి
ప్రతి నఖండితదిగంబరధరు లగుచుఁ
గామితపరదేశికత్వంబు లుడిగి
గ్రామైకవాససంగతచర్య లగుచు
యాచితభిక్షంబు లనుభవింపక య-
యాచితాకామకృతాహారు లగుచు

---

౧. పాంగ, ౨. గళలు, ౩. లును, ౪. వర్ణ, ౫. దేవా, ౬. సతు, ౭. సొలుపున, ౮. త్రి, ౯. వళియు, ౧౦. ఖండ.

బహుజనోపాస్యప్రపంచంబు లుడిగి
సహాగణోపాస్య ప్రసంగతు లగుచు
లోకాంతగోష్ఠీవిలోలత లుడిగి
యేకాంతగోష్ఠీ మహిష్ఠితు లగుచు
వరసుఖార్థశిరోజ వ్యసనంబు లుడిగి
సరి ముక్తకేశమస్తకధరు లగుచు
నారసనకామ కామ్యాదులు లేమి
వైరాగ్య సంసార వర్జితు లగుచుఁ
దరమిడి విధినిషేధ క్రియల్ లేమిఁ
బరిచితోభయకర్మపరిహారు లగుచు
ఫలితదృష్టాదృష్టఫలకాంక్ష లేమి
నలరి స్వర్గాది లోకాతీతు లగుచు
*హఠయోగ రాజయోగాది విభ్రాంతిఁ
బటువగు పశుయోగబంధంబు లేమి
నవిరత నిరతిశయానంద హేతు-
వవు నిత్యశివయోగవివశాత్ము లగుచుఁ
దానును నెదురు, నిందయును సంస్తుతియు,
మానావమానముల్, మఱి యూరు నడవి,

---

౧. జగు హో, ౨. వి, ౩. వస, ౪. స.
* ట, ఠ, ప్రాసము.

సలియు నుష్ణంబు, విష మ్మమృతంబు,
వలపు నొల్లమి, యెల్ల వనితలు దల్లి,
[1]సుట్టాలు వగతులు, సుఖము దుఃఖంబుఁ,
బట్టెమంచము నేల, వసిఁడియుఁ బెంచు,
సమముగా నిర్ద్వంద్వ శమితసంసార-
సముదితశివయోగ సౌఖ్యాంబుకతన
నంగంబులును లింగ మై యంగలింగ-
సంగతిఁ బ్రాణంబు సరిఁ బ్రాణలింగ-
సంగతి మనసు భాస్వన్మనోమార్గ-
సంగతి దృష్టులా లింగైకదృష్టి
నడఁగ సమస్తేంద్రి[3]యములను మనసు
నడఁగు "సర్వేంద్రియాణాం నయనం ప్ర-
ధానం" బనఁగ నంత దను ధర్మముల వి-
లీనంబులగు ప్రాణలింగంబునందుఁ
గాన తల్లింగసంగతదృష్టు భువిఁ బ్ర-
[4]ధానంబు లత్తనుధర్మంబు లడఁపఁ
దను ధర్మహీనతఁ దనరు సద్భక్తి
ఘనభక్తి శివుకృపఁ గలుగుఁ గావునను

౧. చుట్టలు; చుట్టముల్, ౨. మగ్నతల, ౩. యంబుల, ౪. దానంబుతను ధర్మహీనతదనరు.

దివియక వీక్షించు దృష్టికు హేతు-
[1]వవు కరస్థలమ సింహాసనంబుగను
రమణం దదీయకరస్థలలింగ-
సమనిరీక్షణనిత్య సంగతి నిట్లు
వెలిమాంసదృష్టులు వీక్షించు జగము
దలఁప దృష్టులుః సూచుఁ దన్నును మఱచి-
యున్న నిక్కపుశివయోగులఁ దవులఁ
[2]గన్నయంతట మ్రొక్కు ఘనతరాసక్తి
శివునిలోఁ గాయంబు శివు నాత్మలోన
శివునిలోఁ బ్రాణంబు శివు మదిలోన
శివునిలో నింద్రియవివిధవర్తన[3]లు
శివుని జిత్తములోన శివులోన దృష్టి
యుక్తంబుగా "యుజి ర్యోగే" యనఁగఁ బ్ర-
యుక్తిఁ గూర్చుట శివయోగంబు గాన
శివశాసనస్థులు శివయోగరతులు
శివమంత్రసిద్ధులు శివయోగరతులు
శివపరిజ్ఞానులు శివయోగరతులు
శివతత్త్వవేత్తలు శివయోగరతులు

---

౧. డవు, ౨. గన్నంతటన, ౩. ల; ము.

శివధర్మతత్పరుల్ శివయోగరతులు
శివపదధ్యానులు శివయోగరతులు
శివపదారాధకుల్ శివయోగరతులు
శివభక్తి[1]యుక్తులు శివయోగరతులు
శివశరణాగతుల్ శివయోగరతులు
శివప్రసాదాప్తులు శివయోగరతులు
గాక యద్వైతసంగతి నది దానఁ
గాకేమి యనువెల్ల గాకు గాకునికి
జీవుండు శివుఁ డండ్రె శివయోగరతులు
సేవావిహీనులే శివయోగరతులు
దైవనాస్తికులె యుత్తమయోగరతులు
భావశూన్యులె పరాపరయోగరతులు
నద్వైత[2]బుద్ధులే హరయోగ[3]రతులు
సద్విధిభ్రష్టే యీశ్వరయోగ[3]రతులుఁ
బశుయోగులే పశుపతియోగ[3]రతులు
సశివేతరులె మహేశ్వరయోగ[3]రతులు
నొనర వియోగసంయోగంబు[4]లనఁగఁ
జనుమాట లైనను జర్చించి చూడ
నొగి[5]రెంటి[6]కూటంబు యోగమో, రెండు

---

౧. ము, ౨. సి, ౩. మ, ౪. లెసఁగ, ౫. రెండు, ౬. కూటము.

నొగి 'నాస్తి' యను[1]డిది యోగమో, రెండు
నొగి నొక్కఁడై యున్కి యోగమో, కాక
యొగి నం దొకఁడు లేమి యోగమో, తలఁప
సిద్ధాంతపక్షసంచితశివయోగ-
సిద్ధి యన్యుల కేల సిద్ధించుఁ దలఁప?
శివయోగి నే యని చెప్పెడుఁ గాన
శివుఁడు దా నేఁగుదెం[2]చెనో కాకయనఁగ
ననిమిషయ్యయ యున్కి యంగము ల్దాల్చి
చెనసి శ్రీగిరికి వచ్చెనో కాక యనఁగఁ
బ్రభువు దేవర యున్కి భావముల్ దాల్చి
యభిమతి శ్రీగిరి కని వచ్చె[3]ననఁగ
నజ[4]గమదేవుఁ డీ యవతారమునను
భజియింప వచ్చెనో పర్వతనాథు
రమణీయ[5]ముగ సిద్ధరాముఁ [6]డీ గిరికి
సముదిత గతి నిట్లు సనుదెంచె నొక్కొ!
భృంగీశ్వరుం డిట్లు వెక్కురూపముల
సంగద శ్రీగిరి కని వచ్చెనొక్కొ!
యుపమన్యు [7]రురు వసిష్ఠ పవిత్రపాణి-
కపిల భృగు కణాద గౌతమాగస్త్య-

౧. టి, ౨. చెనుగాక, ౩. నొక్కొ, ౪. గణ, ౫. మగు, ౬. శ్రీ గుడికి; డిగ్గిరికి, ౭. సురు.

శుకవామదేవశౌనకపురోగ[1]మ ము-
నికదంబ మీమూర్తి [2]నికరంబుఁ దాల్చి
కరమర్థి మర్త్యలోకం[3]బు భక్తులను
సిరిగిరిఁ జూడఁ జెచ్చెర [4]నచ్చెనొక్కొ!
భువిఁ జోద్య మంచు నద్భుతము దలిర్ప
శివయోగు[5]లను బుధశ్రేణి గీర్తింప
నొగి "దర్శనా చ్ఛివయోగినో" యనఁగఁ
దగిలి తన్ దర్శించు ధన్యోత్తములకు
ననుషక్తి "సర్వతీర్థాభిషేకేభ్య"
యనఁ దమతో మాటలాడు పుణ్యులకు
మొదల గంగాస్నాన ముఖ్యసమస్త-
విదిత తీర్థస్నాన [7]విపులఫలాదు
లొసగుచు నసమస ముల్లాసమహిమ
లెసగుచు శివయోగు లెలమి నేతేర—

అభ్యాసయోగసల నడకలు

మల[8]కల వ్రాలు దా మడమల నొత్తి
తెలి[9]గాలి[10]బాస వా[11]తెఱఁ బూరడించి

౧. ముని-నికరంబు, ౨. నికరముల్, ౩. పు, ౪. వచ్చి రొక్కొ, ౫. లు, ౬. కీర్తి, ౭. వివిధ, ౮. కగ, ౯. గారి; గాధి, ౧౦. పాంప; బాంప, ౧౧. తెరలఁ బూజించి; తెలబూరవింప.

[౧]తనుదమ్మిదొంతులఁ దలఁపంపు [౨]లుసీపి
[౩]నునుబవడం[౪]బుపూ గొన[౫]లు ముప్రొంచి
[౬]జంట వెన్గులు మా[౭]న్చి కుంకెనల్ సిక్క
[౮]వింటివెంట[౯]న మింటి [౧౦]చంటికి నెయిది
వెన్నెల నవివన్నె వెన్నెలల్ [౧౧]సూపి
[౧౨]మిన్నెఱిదాఁపల మీఁది [౧౩]యుల్వారసి
[౧౪]నడిపోవ [౧౫]నిడితల వాకి [౧౬]టనొక్క
వడి నిరంతరవరాభ్యాస పక్షము[౧౭]ల
నలరునాకుంచనా యతవాయుప్రాప్తిఁ
[౧౮]జులుకనై దేహముల్ సాక్క[౧౯]కు [౨౦]లట్టు
లొక్కింత [౨౧]యిలు మోచియును మోవకునికిఁ
ద్రొక్కనయరజలు దోఁకుడుటలు
[౨౨]భంగిగా దీపప్రభాపటలములు
సంగతిఁజిక్క [౨౩]పతంగంబు ల[౨౪]ట్లు
నడరు చతుర్గోళకాభ్యంతరమున

---

౧. తనతమ్మి, ౨. లుశిని, (సీ), ౩. సనః సున, ౪. పుఁబూ, ౫. ల, ౬. చంటు, ౭. న్పి, ౮. మింటి, ౯. ను, ౧౦. జంట (టి), ౧౧. చూచి, ౧౨. మిన్నేది; మిన్నెక్క, ౧౩. యుద్దరసి; యుల్వాతసి, ౧౪. వడ, ౧౫. నిది, ౧౬. లిసెక్క, ౧౭. ను, ౧౮. ములకనై (మై), ౧౯. డు, ౨౦. లట్లు-యొ, ౨౧. యును, ౨౨. భంగిదివ్య ప్రభాపటల భారములు; భంగిగాదివ్య ప్రభాపటలములు, ౨౩. ప్రసం, ౨౪. ట్ల.

ముడివ[1]డి యంతన ముదితవిజ్ఞాన-
కలితదీపప్రభాగారంబు సొచ్చి
వెలుపల గానని వీక్షణంబులును
నగపడి నిజ[2]భుక్తి [3]యాసమై వలలఁ
దగిలిన మత్స్యవితానంబు ల[4]ట్ల
ముంచిన ఖేచరీముద్రానుగత స-
మంచితామృత భుక్తి నడ[5]రు జిహ్వలును
నాలోలవృత్తి నాదామృతం బాని
యోలిఁ దమ్మెఱుఁగని యురగంబులట్ల
విరచితానాహతవివిధనాదముల
మరిగి యొండెఱుఁగని మహితకర్ణములు
[6]వ్రసరించు చంపక ప్రసవసౌరభము
సస కేఁగి మడిసిన భ్రమరంబులట్లు
వ్యాపితాంతర్యోగవాసనానియతి
వ్యాపించుచున్నట్టి వరనాసికములు
గరణిసుసంయోగ కలితసౌఖ్యము[7]ల
ధరఁ[8]గట్టువడినమాతంగసంఘములుఁ
[9]జాలిఁ బ్రాణా[10]ంపానసంయోగసుఖవి-

---

౧. డనంతస, ౨. భక్తి, ౩. యాశ (స), ౪. ట్లు, ౫. గు. ౬. పస, ౭. స, ౮. గట్టిపడిన, ౯. జాలి, ౧౦. హీన.

శాలతఁ జనిన యాసర్వేంద్రియము[1]లు
భంగిమాతంగభుజంగపతంగ-
భృంగమత్స్యాదు[2]లిబ్భంగి నొక్కొక్క-
విషయంబులై చెడ విజయు[3]లైయిట్లు
విషయపంచకసుఖవిభ్రాంతు లుడిగి
శివపదధ్యాననిశ్చేష్టితావస్థ
నవికలవిషయేంద్రియంబుల[4]నొలసి
హరుని నంతర్బహిర్యాగ సత్క్రియల
[5]నరుదుగాఁ బడసియు [6]సర్వతాసిద్ధి
క్షితిఁ "త్రిలోకే యాని చిహ్నాని" యనఁగ
ధృతిఁ"దాని చిహ్నాని దేహతో"యనఁగ
నండస్థ[7]లగుచిహ్న[8]లతిసూక్ష్మభాతిఁ
బిండస్థమై సమభిజ్ఞానదృష్టి
నుర్వీ[9]వ(జ)లాగ్ని వాయు[10]వ్యోమ[11]భూత-
సర్వపర్వతనదీసాగరద్వీప
భువనతారాగ్రహ నివహాదు లాత్మ
భవనంబు[12]లును గాఁ[13]బడు నందులోనఁ

౧. ల, ౨. లీభంగి, ౩. (డై, ౪. నరసి, ౫. వరదు, ౬. పర్వతా, ౭. మగు, ౮. లవి, ౯. జ్వాలాగ్ని, ౧౦. ర్వ్యోవ ౧౧. వితతి, ౧౨. లును బూన్ప; లనకాన, ౧౩. జడ.

శ్వాసలక్షణము

జంద్రుఁ డిడానాడి సవ్యభా[1]గమున
సాంద్ర షోడశకలాసహి[2]తుఁడై యుండు
నాదిఁ బింగళనాడి నాదిత్యుఁ డుండు
ద్వాదశకళల[3]తోఁ దత్క్షణంబునను
లీల [4]సూర్యేందు [5]నాడీ [6]ప్రచర్యాను-
[7]పాలనం బై యుండుఁ బంచభూతములు
నందు దూర్పున [8]మీఁద ననలతత్త్వంబు
గ్రిందు దా జలతత్త్వ [9]మొందఁ బశ్చిమము
నర[10]య లోఁ గ్రమ్మి యుత్తరమది వృథివి
యిరు[11]వాటముల వాయు విల దక్షి[12]ణంబు
నడుమాకసం[13]బిట్లు [14]నాడి[15]యుగమున
నెడపక భూతంబు లేను వర్తింప
వరుసన యఱువది శ్వాసముల్ ప్రాణ
మరయఁ దత్ప్రాణంబు లా అొక్కగడియ
యొక్కొక్కగడియ కొక్కొక[16]భూత వేళఁ
జక్కన సూర్యుండుఁ జంద్రుఁడు నడవ

---

౧. వ, ౨. తమై, ౩. ౘదా, ౪. సూర్యేందు, ౫. నాడి (లి), ౬. ప్రచార్యాను, పునర్యాన, ౭. వా, ౮. మీఁదు, ౯. మొందు, ౧౦. యులో (త్రో) గమ్మి, ౧౧. పోటముల, ౧౨. ణమున, ౧౩. బట్లు, ౧౪. నాది, ౧౫. యుగంబు, ౧౬. భూత.

[1]నడర నొక్కొక నాడియం దైదు నేసి
గడియలై చను నైదు గడియలుగూడ
నదియుం దా నొకలగ్న మట్టిలగ్నంబు
లాదవంగఁ బంద్రెండు నొకదినం బందు
వెరసి యిర్వదియొక్క వేయు నార్నూఱు
స్వరము లా స్వరము[3]ల సంవత్సరంబు
గడియలై చనునట్టి గడియ లర్వది[4]ట
వడిఁ[5]బాలుగొనఁగను వచ్చు[6]లబ్ధములు
దినము, లా దినములు దివుటఁ బంద్రెం[7]ట
మన సిడి పాల్గొన్న మాసంబు లగును
సడిసనునట్టి మాసధ్రువప్రోక్తి
నడచు నా దిన వార నక్షత్ర యోగ-
[8]కరణముల్ గ్రహపురోగమ కాలచక్ర-
[9]సరణియు స్వరచక్ర [9]సరణి నేకముగ
నినశశిపక్షంబు [10]లినశశితిథులు
నినశశిప్రహరంబు లినశశిఘటిక
లినశశిగ్రహములు హితమైన[11]నాళ్లు

---

౧. నడరు, ౨. య తా, ౩. లు, ౪. య, ౫. చాలు, ౬. లబ్ధంబు, ౭. డు, ౮. కరణగ్రహాణ, ౯. క, ౧౦. దిన, ౧౧. నాడ్లు.

సను విషామృతసమస్వరసంగమము[1]లు
హానివృద్ధులును రుజారుజాదులును
మానావమానముల్ న్యూనాధికములు
నతులజయా[2]పజయాలాభలాభ-
గతులు గా[3]లజ్ఞానకాలవంచనలు
కలితహృత్పద్మో[4]పకంఠ దీప్తాష్ట-
దళ[5]జీవ హింస[6]సంధానఫలములు
ననయంబు నాత్మోదయంబంద కాంచు
ననుభవసిద్ధియు నాత్మసిద్ధియును
వర[7]వలీపలితవివర్జితాంగములు
సురుచిరాకారముల్ సుకుమార[8]తలును
యమ నియమాదులు నణిమాది సిద్ధు
లమరు [9]దశప్రత్యయములు సాంగముగఁ
జరి[10]జలుఁ జిందులుఁ [11]జ్ఞాపదల్ యోగ-
పరిభాష లల్లనఁ బాడుచు మంది
చెంతల కేఁగ కేకాంతపక్షముల
నంతంత నడచు నభ్యాసయోగులును

---

౧. లు, ౨. లాప, ౩. లా, ౪. పా; ప్తో, ౫. జన, ౬. సదానస్థలములు, ౭. ఫలితచ్ఛవి, ౮. తనులు; ములును, ౯. రస, ౧౦. జి; త, ౧౧. నా (నో) మహుల్; ఛీపదల్.

### పుణ్యాంగనల నడకలు

గుఱు[౧]వేరి [౨]కట్నముల్ [౩]గొంగులక్రిందఁ
జెఱఁగులు నొడిచుట్లు [౪]సిక్కు [౫]నిండించి
చెలువగు [౬]పైనంబు చెప్పులు మెట్టి
[౭]పలుచని [౮]తొల్లుకుప్పసములు వ్రాని
పదఁపడి [౯]యలఁతిదుప్ప[౧౦]ట్లు గొంగ[౧౧]డలు
వదలకుండఁగ మీఁద వల్లరుల్ [౧౨]సుట్టి
తొడవులు నిజతనుద్యుతులకు మాటు-
వడునని యాత్మలో [౧౩]భావించి తొడక
మొదలిమంగళసూత్రము[౧౪]లు దా[౧౫]ల్చునట్లు
వొదలు మంగళసూత్రములు ధరియించి
యలసియు నలయనియట్ల నా[౧౬]థులకు
బిలిబిలి [౧౭]లావుల బిగువు సూపుచును
గొమరుదలిర్ప నె[౧౮]క్కుల్ల డిగ్గుల్లఁ
దమతమ పతులహస్తము లూఁదికొనుచుఁ

---

౧. వేరి, ౨. కటక; కట్లముల్ (ముం), ౩. గొంకు (౦డు) ల, ౪. చక్కు, ౫. విరించి, ౬. బైనంపు, ౭. పల, ౮. డొల్లు, ౯. యలది, ౧౦. ట్ల, ౧౧. ద, ౧౨. సాటి, ౧౩. బంధించి, ౧౪. ల (న), ౧౫. ల్చి, ౧౬. పల్కుకు, ౧౭. తోపుల, ౧౮. స్గడ్ల.

గరముప్పతి[1]లు నా[2]లికంబుల చెమటఁ
గరతలాంగుళములఁ గమిచివై చుచును
జందనాదిక్ష్మాజ[3]చలనసంభూత-
మందానిలంబు[4]చే మతు[5]లఁ దేలుచును
గ్రాలు తుమ్మెదల తెక్కల[6]వీఁకఁ దాఁ[7]కి
రాలుపుప్పొడికి శిరంబు లొగ్గుచును
జూతవటాదుల జొంపముల్[8]గన్న
శీతలచ్ఛాయలఁ జిక్కఁగోరుచును
బ్రసృమరబహువిధ ప్రసవసౌరభ్య-
లసితవాసనల నుల్లముల[9]సోలుచును
బింబాధరంబుల బీఁట లడంగఁ
దాంబూలసారామృతములఁ దద్పుచును
వదనపద్మంబులు వాడకుండంగఁ
బొదలి తలిర్చు లేఁబొద లడ్డ మిడుచుఁ
గరతలంబులను రక్తము[10]లూరకుండఁ
గరతలంబులు రొండ్ల గదియించుకొనుచు
బిగిసి పెందొడలు వొంపిరి రాయకుండ
నొగి రాజహంసల ల్లొయ్యనఁ జనుచు

౧. లి, ౨. వి, ౩. చలిత, ౪. ల, ౫. లు, ౬. లు, ౭. ఁకె, ౮. గమ్మ, ౯. ఁజొన్పుచును, ౧౦. లూష.

నుల్లంబులను గమనోపతాపము[1]ల
మల్లడిగొనకుండ 'మల్లయా'యనుచుఁ
బటు[2]తరాధర సము[3]ద్భటనిదాఘాగ్ని
సిటులుగొనకయుండ 'సిరిగిరి'యనుచుఁ
బొరిఁబొరి నీక్రియఁ బురుషులుఁ దారు
[4]నెరలిపుణ్యాంగనా[5]నికర మేతేరఁ

జోసల నడకలు

[6]జుక్కలుబొట్లును జుక్కి[7]వెండ్రుకలుఁ
జక్కని[8]పాపటల్ జంగాళములును
నినుపనేవళములు నిత్తడిసరి[9]గె-
లును, వెండ్రుకలదండలును, దగరం[10]బు-
పిల్లాండ్లు మట్టెలుఁ, బెక్కువన్నియల
[11]తొల్లుకుప్పసములు, నల్లగాజులును,
గలయంగఁ జెవుల[12]సంకంబుపూసలును,
బలుపూసపేరుల బన్నసరములుఁ,
[13]గుటిలం[14]బు[15]చూపులుఁగొయ్యాకా[16]టుకలుఁ,

౧. లు, ౨. తర, ౩. త్కట, ౪. నెరవి, ౫. నివహ, ౬. చుక్కబొట్లును జిక్కిచిక్కి, ౭. వెంట్రు, ౮. పాపెటల్; పాటలు, ౯. కె, ౧౦. ంపు, ౧౧. డొల్లు, ౧౨. సక్కంపు; సంకంపు, ౧౩. కుటుబ(ల)ంపు, ౧౪. ంపు, ౧౫. కన్నులు; మనసులు, ౧౬. కాటికలు.

[౧]బటికరంబు ముక్కాలిల్ భారమై తనరఁ,
జిలుకల, దుప్పుల, సెలుకల, [౨]నేదు-
కలఁ [౩]గ్రోతులను, [౪]బిచ్చుకల, [౫]గౌరవకల,
నక్కల, నుడుతల, నమిళులఁ, బంది-
కొక్కులఁ, [౬]గోళ్లను, గుక్కకూనలను,
సింగి [౭]రిక్కల, [౮]లేళ్ల, ముంగిసలను, ని-
జాంగనల్ [౯]గొనివెన్క నరుగు [౧౦]దేరంగఁ
[౧౧]బలువన్నె కోక బొంతల, నట్ట[౧౨]నడిమి
తొలుల కుప్పసము[౧౩]ల దూర్చిన మెడలు,
[౧౪]విసురూపముల జాలు వెండ్రుకల్ [౧౫]వెడఁద
నొసలి [౧౬]యిట్టుక బొట్టు పసపులుఁ గన్న-
గవకాటు [౧౭]కలు దరకాయకప్పెరలుఁ
జెవుల[౧౮]పోఁకెలు మొల[౧౯]చెడి[౨౦]బోర[౨౧]ముండ్లుఁ
జాఁకిట తిత్తులుఁ జక్రముల్ నిడుద-

---

౧. ఘటుకెంపు, ౨. నేడు, ౩. గ్రొంతు, ౪. చిచ్చు, ౫. గౌరనంక; గౌరంకలను, ౬. గొందును, ౭. లి, ౮. వేండ్ల, ౯. గని, ౧౦. ధేరఁగను. ౧౧. నలు, ౧౨. నదిమి, ౧౩. లు, ౧౪. విస్తరూపములు చూపు; విసపురూపులబూజు, ౧౫. వెసద, ౧౬. యిట్టిక, ౧౭. లేపద, ౧౮. పింక;బీక, ౧౯. వడి, ౨౦. బోద; చోర, ౨౧. ముడ్డు.

తోఁక కచ్చడములు వాఁకొపొట్టలును
నొడ్డుబొమ్ములు దొడ్డమూరులు బిగ్గువు
నొడ్డాణములు నిన్నయుంగరంబులును
గడియముల్ ఘుమువులుఁ గట్టుచేతులును
గొడుగులు [3]గుదియలుఁ గోకజల్లెడలు
నద్దుమొగంబులు [4]నలిపంబు జముక-
బద్దెలఁ గూర్చిన పచ్చడంబులును
మురిపెంబు [6]నడపులు [7]ముూఁపు తిత్తులును
విరసంబు మాటలు భిక్కృత వేషములుఁ
బల్లమీసంబులుఁ బరికి [9]గడ్డములు
నల్లమేనులు గుబ్బ నారసంబులును
నలిముటితనముల [10]హాంకవైచుటలుఁ
గలకొ[11]త్రాళ్లుల నెంద్రుకలు సొంగముగను
బనుగొనఁ దముఁ జూచి భవులు భవులన
బెనుశీలవంతులు నెట్టు సత్రముల
నొక్కొక్క లింగంబు నొగిఁ జూడకున్న

---

౧. బొట్టు, ౨. చేరు, ౩. గుడి, ౪. వలిపెంపు బెముక, ౫. ంపు, ౬. నడు, ౭. ముద్ర, ౮. క్వ.. ౯. గె, ౧౦. హాంక, ౧౧. త్రాళ్లలవెంట్రుకలు; త్రాళ్లు వలెయొట్టుగడ్డు.

[1]సక్కట ! చౌరగనీ రళ్లల యనుచు
గళముల[2]గద్దైనగరు[3]లు దోపంగ
నలరుచు [4]భుక్త్యర్థ మై ధరియించి
జోగి[5]నుల్ దారును జోగివేషముల
జోగులు గొలువంగ జోగు లేతేర.

పిచ్చుకుంటుల నడకలు

వ్రేళ్లు[6]ను లేనట్టి కాళ్లును, బిల్ల-
వ్రేళ్లఁ[7]బెక్కఁగు నట్టి కాళ్లును, [8]మట్టి-
కాళ్లును, [9]రాటమ్రోఁ కాళ్లును, దోలు-
కాళ్లును, నెండిన కాళ్లును, మలక-
కా, ళ్లీచపోయిన కాళ్లును, [10]గుజ్జు-
కాళ్లును, నా[11]దొడ్డి కాళ్లును, [12]మడఁగు
[13]పిఱుఁదులు, నెండిన [13]పిఱుఁదులు, [14]నొదురు*.

---

౧. సక్కడఁజాగనీ, ౨. గట్టిన, ౩. లునుదోఁప, ౪. భ, ౫. జీలునుదారు, ౬. వ్రేళ్లసులేనరి, ౭. పెక్కొనరి, ౮. పిల్ల, ౯. మోట, ౧౦. గుజ్జ, ౧౧. నైయొంటి; నొండొంటి, ౧౨. మణు(ణ)ఁగు; మడఁకు, ౧౩. పిఱుదులు; పెరగులు, ౧౪. నొడక.

* ఈ రెండుపాదములకునుబదులుగా ఒక ప్రతిలో, "పెడుగులు చెడ్డిన పెరుగులు నెరుపి, బెరుగులు బల్లచేతులు లేవంక" అనే ఒక అసంస్కృతపాఠ మున్నది.

[౧]పిఱుఁదులు, [౨]నొండొంటి [౧]పిఱుఁదులుఁ, [౩]బిల్ల-
చేతులు, లోవంక చేతులుఁ, దోలు
చేతులు, నొండొంటి చేతులుఁ, జాలఁ-
గుఱుచ చేతులు, ఱొమ్ము [౪]పొఱఁడులు, వీఁపుఁ-
బొఱఁడులు, విఱిగిన భుజములు, [౫]నంటు-
[౬]మెడలును, బొండుగు పొడవైనమ్రక్కి-
మెడలును, గడుఁగడు నిడుదమూఁపులును,
[౭]ముడుఁగు మోములు, ముఱు[౮]మొండెముల్, బండి-
[౯]బెడఁగు రూపంబులుఁ, బెడఁగు[౧౦]లు, సొట్ట
లటు గ్రిందు దప్ప [౧౧]మోఁ దంతయు[౧౨] నొప్పి
పటురూపసౌందర్యభావాతిశయతఁ
బరగు దేహంబులు వాటి[౧౩]ల్లినట్లు
దరుణులు నాప్తులుఁ దముఁ[౧౪]జూపి బ్రదుక
గళముల లింగం[౧౫]బు గద్దె నంగరులు
[౧౬]నలఁతి విభూతిరుద్రాక్షలుఁ వలుఁద-

---

౧. పిఱుఁదులు; పెరసులు, ౨. నొంటొంటి, ౩. బల్ల, ౪. కొరడులు, ౫. సందు; నట్టి, ౬. వెడసు (లు) బొండుగు (గ) లును, ౭. మొడఁగి, ౮. మెండెముల్, ౯. వెడగు, ౧౦. లునుండి; లో, సొట్ట, ౧౧. మోమం, ౧౨. నొప్పు, ౧౩. ల్ల, ౧౪. జూచి, ౧౫. ంపు, ౧౬. పొలయురుద్రాక్షలు భూతియు.

మకుటముల్,[1] గాహళల్, మఱి[2] ప్రేలుజడలుఁ
బ్రకటితంబుగ[3] దాల్చి బడి[4] దీనవృత్తిఁ
గనుఁగొన నిన్ప[5]చిడ్గలఁ గట్టియున్న
యెనుఁబోతు[6]లను గజ్జు[7]పెడ్లను నెక్కి
తమి జగత్పావనత్వము నివ్వటిల్ల
నమరుదృష్టిను గరుణా[8]రసం బొదవఁ
బదపడి యాక్రియఁ [9]బగ లెల్లఁ[10]గడచి
వెదకుచు[11] మాపట వేలముల్ సేరి
చనఁజన ముందఱ వెనుకను దోడి
"జను లెల్లఁ [12]దార మొసంగరా"[13]యనుచు
"నేలయా [14]యిందులో నెవ్వ రేఁ గరుణ
నాలించి యక్కటా యనుచు మాయట్టి
దీనుల మఱి[15]యొక్క దేశంబులకును
బోనీక వృత్తులు భూములుఁ [16]గన్నె-
దానములు, హిరణ్యదానముల్, వస్త్ర-

---

౧. గోహళుల్, ౨. యేక, ౩. దాల్పు, ౪. నడి, ౫. చిప్పలు; చీదుల; చిగ్గుల, ౬. లును, ౭. పెగ్గుల, ౮. వృత్తియొద(దు)వ, ౯. బల్లవుల్, ౧౦. నడచి, ౧౧. మాపటి, ౧౨. దాన, ౧౩. యనఁగ, ౧౪. యెవ్వరినిందులో, ౧౫. యొక్క, ౧౬. గన్య; గోవు.

దానములఁ, మఱి[1]యన్నదానంబు లెక్కఁ
బోతుల[2]నెడ్లను [3]బోలుగ నిచ్చు
దాత మాబసవనదండనాయకుని
భూమిలోఁ బో[4]లెరెడుస్వామి[5]భక్తుండుఁ
దా మఱి యొక్కఁడు లేఁ[6]డే మల్లినాథ!
తా[7]ర మొసంగ[8]రే ధర్మాత్ములార!
"రా[9]రో! [10]యనుచు మమ్ముఁ జేరంగఁ బిలిచి
యేలయూ[11]యింధులో [12]నెవ్వరేఁ గరుణ
నాలించి యక్కటా! యనుచు మాయట్టి
దీనులకును గృహదానంబు, భూమి
దానంబు, లభిమతదానంబు లిచ్చు
సిరియాల సెట్టి[13]ని, గరికాలచోడు,
నరియమరాజు, [14]నేణా[15]ధినాథయ్యఁ,
జేరమ[16]ర్యాయని, సింధుబల్లహు[17]ని,
[18]వీరచోడని, గరయూరిచోడనిని,
శివలింగ[19]దేవుని, సిద్ధ[20]రామయ్య,

---

౧. యిన్ని, ౨. హయముల; నెడ్లయు, ౩. బోలగ; బోగళ్ల; భోగడగ, ౪. డి, ౫. బసతుంను, ౬. డా; హా, ౭. రా, ౮. యెడ్ల; యిండ్ల, ౯. నివ్వనే, ౧౦. నీ, ౧౧. దిగాము, ౧౨. రాజయ్య; రాజును, ౧౩. ను, ౧౪. వేర, ౧౫. దేవర, ౧౬. రామునిని; రామునికి.

సవ[౧]రదనాచయ్యా, సామవేదులను
భూమిలోఁ బోలెడు స్వామిభక్తుండుఁ
దా మఱియొకఁడు లేఁ[౨]డే మల్లినాథ !
తార మొసంగ[౩]రే ధర్మాత్ములార !
రారో ! యనుచు మమ్ముఁ జేరంగఁబిలిచి
యేలయా యిందులో నెవ్వరేఁ గరుణ
నాలించి యక్కటా ! యనరయ్యా, మాకు
వీవంగఁ జేతులు లేవయ్యా, [౪]నడచి
పోవంగఁ గాళ్లును లేవయ్యా, యంధ-
కులమయ్యా, పిచ్చుకగుంటులమయ్యా,
తల[౫]పోయ నభ్యాగతులముసుం డయ్యా,
యగ[౬]పడ్డ[౭]వెడఁగుల మగు మమ్ముఁ బ్రోవఁ
దగవగుఁ[౮]జుండయ్యా, దయగల్గుఁడయ్యా,
పరమమహేశుండు బసవయ్యకరుణ
సిరిగిరినా[౯]థుని కరుణ[౧౦]యా ! [౧౧]మీకు
సుంకర[౧౨]బంకయ్య సురియ[౧౩]చౌఁడయ్య
శంకరదాసయ్య లెంకమంచయ్య

---

౧. దర, ౨. డా, ౩. రా, ౪. మనికి, ౫. పంగ, ౬. డిడ్డ; పడు, ౭. వెద(ణ); బెదవు, ౮. జూఁడయ్యా, ౯. థమీ, ౧౦. యా, ౧౧. మా, ౧౨. బింకయ్యా, ౧౩. చమడయ్యా.

నోఁగి నెట్లు వోమెదమో[1]యంచు నుండ
నోఁగి వచ్చితిమి గులం బుద్ధరించితిమి,
మంటిమి, సిరిగిరిమల్లయ్యఁ జూడఁ-
గంటిమి, [2]గండముల్ గడచితి, మింకఁ
బుట్టు[3]వుల్ సఫలతఁ బొందెఁ, గర్మము[4]లఁ
జెట్టుల నటమున్న కొ[5]ట్టి వచ్చితిమి,
[6]వెల్లిడఁ గంటిమి బిడ్డలఁ, దొల్లి
యూళ్ల మ్రొక్కిన మ్రొక్కు లొగిఁ బూరగిం[7]చె,
మదిలోన శివ యని మము మే మె[2]ఱుంగి-
నదియాది [8]గాఁగఁ బోమెదము వోమెదము
సిరిగిరి కనుచుండ సిద్ధించె [9]నిపుడు
ధర నెట్టకేలకుఁ దమభాగ్యమహిమ,
నగునగు నట్టి పుణ్యక్షేత్ర[10]మింక
దిగవిడ్చి [11]పోదుమే మగుడి[12]యూళ్లకును ?
*నేటి[13]కిన్నియు ? లింగ మెఱుఁగుఁ బోయింక,
*నేటికి సంసార ? మేం[14]ల జీవనము ?

---

౧. యనుచుండె (ండి) ౨. పట్టముల్, ౩. కల్, ౪. లు, ౫. ట్ట, ౬. పెల్లీ(ల్లీ)ఁ, ౭. రిం, ౮. గాక, ౯. న. ౧౦. మహిమ, ౧౧. పోవనా, ౧౨. డనూ, ౧౩. క, ౧౪. టి.

* నేటికి ?

[౧]నియ్య సూ భక్తివిహీను[౨]ల బ్రదుకు,
గొయ్యఁ [౩]బొడ్వన దానిఁ గొనిపోయి కా[౪]ల్వఁ
దల్లులుఁ దండ్రులుఁ దరుణు లాత్మజులు
మొల్లమ్ము ధనములు మును[౫]మిడి భూము
లూళ్లు వృత్తులును [౬]నియోగసౌఖ్యములుఁ
బేళ్లును బెంపులుఁ బెద్దఱికములు
బలపరా[౭]క్రమములుఁ బ్రాయముల్ రాజ్య-
ములు సంపదలు వంశములు నటుగూడ
జలబుద్బుదంబులు, శారదా[౮]భ్రములు,
జలతరంగము, లింద్రచాపముల్, [౯]నిట్ట-
పాటలు, బయ[౧౦]లిదీపము[౧౧]లు, బాలకుల-
మాటల్, పిపీలికామార్గంబు, లెండ [ఱుఁగుఁ-
మావు[౧౨]లు, [౧౩]మొయిలుల[౧౧]మహిమలు, మె
దీవెల్, గతాగతద్విరదకర్ణ[౧౧]ములు,
వానవఱ్ఱులు, [౧౪]నీట వ్రాఁతలు [౧౫]గాక,
తానిత్యములె? మాయఁ దగులు[౧౬]నే జ్ఞాని?

---

౧. యెయ్య, ౨. లీ. ౩, బోవన; బొడుసె, ౪. ల్ప, ౫. మును, ౬. వి, ౭. క్రాంతముల్, ౮. భ్రమము, ౯. నిట్ట, ౧౦. వి, ౧౧. ల, ౧౨. ల, ౧౩. జలముల, మెరయల, ౧౪. నీరి (ంటి; టి), ౧౫. గాగ, ౧౬. నె.

యనుచుఁ దత్‌క్షేత్రసమగ్రమహత్త్వ-
మునఁ జేసి వైరాగ్యమున[1]మది[2]వొదల
వచ్చువారును, జొచ్చువారును,[3] వెనుక
వచ్చువారును, జూచువారునైయుండ,
నారూఢ[4]మతి మల్లికార్జునపండి-
తారాధ్య[5]సుతుఁడు దోనయ్య సంప్రీతి
నాగమోక్తముగ భక్తాళియుఁ దాను
జాగరణోద్యుక్త[6]సంగతబుద్ధి

దోనయ్య శివరాత్రిజాగరణము

మానితప్రాసాదమండపగోపు-
రానీక దీపప్రభాభ్యంతరమున
విలసిత వివిధనవీనాంబరప్ర -
కలిత మండప మొప్పఁ గావించి, యందు
వరిచిత క్రముక రంభాస్తంభముకుర-
భరి[11]తో[త్త]రంగ[12]శుం భద్ద్వారతతులు
సంచితనీలదృషత్కుట్టిమములు
నంచితోత్పలసమాయతతోరణములుఁ

౧. మయి; మొటు; మేరు, ౨. వదల. ౩. నుద్ధలిని, ౪. గలి, ౫. గురు; నుతు, ౬. వలిదాను, ౭. సంగ్రహ; సంగతి, ౮. వస్త్ర, ౯. [illegible], ౧౦. [illegible]త్తి, ౧౧. [illegible], ౧౨. [illegible]

గంబుకట్లును మేలుకట్లు[1]ను జుంబి-
తంబులై యొప్పు నూతనఫలావళులు
[2]నుపఫలావళులుఁ బుష్పోప[3]హారములు
[4]నుపపద్మముకురము లుపరత్నములును
మానితబహువర్ణమహితో[5]పవార్ధి-
ఫేన[6]పుంజంబులుఁ బృథుతరంగములుఁ
గమనీయ నిజరత్న కందుకావళులు
నమితసువర్ణలతాంతమంజరులుఁ
బరిమితద్రాక్షాది ఫలగుచ్ఛములును
గురుతర విద్రుమాంకురలతా[7]తతులు
భర్మాంబు[8]రంజిత పటచిత్ర వస్త్ర-
నిర్మితబహుపక్షి నివహాతి[9]శయముఁ
బక్వాన్నవలయముల్ వక్వఫలములుఁ
బక్వాన్నపూరముల్ వటుపతాకలును
నరుణాబ్జకర్ణికా రాశోకరక్త-
కరవీరచంపక కైరవాద్యఖిల-
సురుచిర ప్రసవనిష్ఠ్యూతమాలాప్ర-

---

[1] నచుంబి, ౨. పొలుపొందుచున్నట్టి పుష్పమాలికలు, ౩. మాలికలు, ౪. సలలితపద్మముల్ సరసరత్నములు, ౫. పూజ్యం, ౬. [illegible], ౭. రాజిత్, ౮. చ, ౯. బలు.

కరబంధతత్సృష్ట ఘంటికావళులు
నింతయు నింపు వహింపఁ[1]గల్గింప
నంతఁ[2]దద్భక్తమహత్త్వంబుఁ జూచి
యిల "దివా హంతి బహిస్తమో" యనఁగ
వెలిసీఁకటియు నహోవేళనకాని
చెడదు సూర్యార్చులచేత శ్రీగిరి[3]ని
సడిసను భక్తదర్శనమాత్ర[4]మునను
వడి "బహిరంతర్దివానిశం" బనఁగఁ
బడియును రాత్రింటి పగలింటిలోన
వెలిదమం[5]బంతయు వేగంబ క్రాఁగు
నిలమీఁదఁ దనబ్రదు కేఁటికి ననుచుఁ
గడుఁగడు [6]లజ్జచేఁ [7]గడఁగి వారాశిఁ
బడినభావంబున భానుండు గ్రుంకె,
మానుగా సూర్యాస్తమానంబుఁ జెప్పి
జానొంద నారాత్రి [8]సన్నుతిసేఁత
దా నవశ్యము గవితాధర్మమునకు
నే నింక నీరాత్రి [9]నె ట్లువ[10]ర్ణింతుఁ ?
బృథుల కాహళశంఖ భేరీరవంబుఁ

౧. గంపింప, ౨. సద్భక్త, ౩. కి, ౪. వేగ, ౫. బె, ౬. లజ్జిం చి, ౭. గణక, ౮. సంస్తు, ౯. య్యె, ౧౦. ర్తి.

ప్రథిత మృదంగాది [1]బహుఘోషణంబుఁ
గాంస్యతాళానేకఘంటికాతీవ్ర -
[2]శంఖోక్తరావంబు జయజయధ్వనులు-
నలరు సంధ్యావేళలం దండమేని
నిల వాద్యరవ[3]మతా నెప్రొద్దుఁగూడ
గర్జిల్లు నప్పు[4]రి ఘనఘనాటోప-
గర్జ[5]నంబున గిరుల్ [6]గర్జిల్లు చుండ
వారక *చీకటి వర్ణింతమంద-
మారాదు దద్దీపమాలికాతతులు
ప్రాసాదగోపుర బహుహేమకలశ-
భాసుర ద్యుతులు శుంభద్ధ్వజదండ-
ఖచిత భాస్వద్రత్న కలితదీధితులుఁ
బ్రచురప్రభలపేర్మి రాత్రుల్ వగ[7]ల్ల
తెలుఁగున వెలుఁగారఁ దిమిర మప్పురిని
నెఱి నెన్నడును[8]లేదు, నేఁ డేల చెప్ప?
సరి[9] జారచోరులఁ జర్చింత మేనిఁ
జరితార్థవంతు[10]లు శైలాగ్రచరులు,
నుడు[11]పంక్తి వర్ణింప నూహిం[12]త మేని

౧. పటు, ౨. శంఖోత్తరారవ, ౩. మ్మె, ౪. డు, ౫. నగరి, ౬. ఘు, ౭. ళ్లు, ౮. వేరు. * చీంకటి. ౯. జాడ, ౧౦. లై, ౧౧. పతి, ౧౨. తు.

నుడుతిపంక్తిఁ [౧]గనఁబడ దానభోవీథిఁ,
బటుతర పురసముద్భవ ధూపధూ[౩]మ-
పటలంబు నీలాభ్రపటలమైయునికి
జలజోత్పలావికస్వరవికస్వరత
[౪]లలవడ వర్ణింత మందమేనియును
భాసురాభ్రంకష పర్వతోన్నతిని
నాసూర్యచంద్రోదయాస్తమానములు
గొలఁకులఁ గలువలకును దామరలకు
నలి నహర్నిశము గానంగరాకునికి
నప్పాట వర్ణించు [౭]డవివేక [౮]మెట్లుఁ
జెప్పఁ జిత్రంబగు శివరాత్రి మహిమ,-

### మృగవ్యాధుని కథ

యొక్కమృగవ్యాధుఁ డురుకాననమున
గ్రక్కన[౯]యొక్క మృగంబు వీక్షించి
శరమరిఁబోసి భాస్వద్దృష్టిముష్టి
సరససంధానకౌశలము వట్రిల్లఁ
[౧౦]ందాడిఁగి యేయుడుఁ గోల దోడన మిట్టి-
పడినమృగము నుచ్చిపాఱె తచ్ఛరము

---

౧. గనగదాంగుడుసభా వీథి, ౨. ట, ౩. మ్ర, ౪. కలవదవర్ణిం
ర్చంద, ౫. రు, ౬. త్రి, ౭. ట, ౮. మ, ౯. నొ, ౧౦. తొడగి (రి).

సక్క[1]న [2]నిమ్న భూస్థలి [3]నతి[4]నిద్ర
నెక్కొన్న కోల్పులి నెత్తిపైఁ బడుడు
బిట్టుల్కిపడి పరిస్ఫీతోగ్రవృత్తిఁ
[5]గట్టలుగట్టి వ్యాఘ్రంబు శీఘ్రంబ
పైపడ నతిభయభ్రాంతి[6]నయ్యొఱుకు
వే వాఱి యొకబిల్వవృక్ష మెక్క[7]డును
దలచుట్టుఁ బెనురక్తధారలు[8]గ్రమ్మఁ
బులి[9]నొచ్చివచ్చి యా భూరుహాగ్రహమున
నున్న [10]లుబ్ధకుఁ గని యురుకోపవహ్ని
గన్నులఁ గ్రమ్మ నుత్కటధూమలతలు
ముక్కున వెడల సముద్ధతి వృక్ష
మెక్కఁజూచుచు శాఖ లిడఁగమించుచును,
నఱిముఱి [11]నూఁచుచు, [12]నఱచుచుఁ, గఱచి
కఱచివైచుచు, నౌడు గఱచుచుఁ. జుట్టి
చుట్టివచ్చుచును, మూల్గుచును, బోరసఱచి
బిట్టప్పళించుచు, బిల్వవృక్షంబు-
తో వాల మడఁచుచుఁ, దొట్రుకొల్పుచును,

---

౧. ని, ౨. నిమ్న, ౩. నలి, ౪. నింద్ర, ౫. గట్టిలు, (ఔ) ౬. మైయె, ౭. టయు, ౮. పర్వ, ౯. సూ, ౧౦. వానిని, ౧౧. మొరయుచు, ౧౨. నగచుచు.

[౧]బోవక యిమ్మాడ్కిఁ బులియున్కి గలిగి.
తా నెక్కవచ్చునే ధర నెట్లుఁ బులికి
నైన వృక్షాగ్రంబు ననక వ్యాధుండు
ప్రాణభయంబున బ్రమసి యాత్మీయ-
ప్రాణి[౨]పాతోపతాపమున [౩]వ్యాఘ్రంబు
నెట్టును బోనేర, [౪]దెగురు, మ్రా[౫]నెక్కుఁ,
బట్టుఁ, జంపును, దన్ను భంగించు, నొంచు
నంచుఁ దదీయబిల్వావనీరుహ స-
మంచిత స్కంధంబ హరమూర్తి గాఁగఁ
బులికిఁ జిక్కితి నని [౬]పొగులుఁ, దచ్ఛోక-
జలబిందుతతులు మజ్జనజలంబులుగ
[౭]ములు వైన [౮]లేఁతపత్తిరిఁ ద్రుంచివైవఁ
దఱిఁదఱి నది నిరంతరపూజ[౯]గాఁగ
భువిఁ జుట్టుముట్టెడుపులి యట్ల తిరుగ
నవియు సవ్యాపసవ్యములుగా మీఁద
నాహార[౧౦]మారీతి నందు లేకునికి
నూహింప నదియ తా నుపవాసముగను

---

౧. మో. ౨. తాపోప, ౩. మృగంబు, ౪. ది, ౫. కె. ౬. పొగలు, ౭. మఱడైన; వఱలైన, ౮. పత్తిరిమహి, ౯. నముగ, ౧౦. తిథియందు.

బనుగొన మృగముఁ దప్పక చూచిచూచి
కనుమూయకునికి నిక్క[1]ము జాగరముగఁ
బులి యేను జంపకపో నని యుండఁ
బులి కోడి యాతండుఁ [2]బోవరాకునికిఁ
దవిలి యకామకృతమునఁ [3]జెంచునకు
శివరాత్రి యది య[4]ట్లు సెల్లె జాగరము,
గంధర్వహరుఁ డిట్లు గైకొ[5]నె, నెఱుకు
[6]బొందితోడ[7]న కొనిపోయెఁ; గావునను,
నెల్లరాత్రులయట్ల యీశివరాత్రిఁ
జెల్లునే కవితావిశేషతఁ బొగడ
శివరాత్రిమహిమ [8] యా శివుఁ డెఱుఁగుఁగాక
తవిలి యిట్లొ[9]ప్ప సంధ్యాకాలమునను
నత్యర్థిఁ బ్రణుతసంయముఁడు దోనయ్య
నిత్యలింగార్చనానియమముల్ దీర్చి
శ్రీలింగచక్రవర్తికి భక్తసత్కృ-
యాలోలు శ్రీమల్లికార్జునదేవు
సంధ్యాయతాంభోదసద్వర్ణజూటు
సంధ్యోచితార్చనాసంతుష్టుఁ జేసి

౧. పు, ౨. బోవకయునికి; బోవరాకుండ, ౩. జం, ౪. ట్లుచె,
౫. నియె, ౬. బొంద, ౭. నె, ౮. యీ, ౯. ట.

యంతఁ దదీయనితాంతోపమండ-
పాంతరంబునఁ బురాభ్యంతరంబునఁ[1] బు-
రాంతర దేవాలయాంతరంబునఁ బు-
రాంతికోద్యానవనాంతరంబులను,
భాస్వర సద్భక్తభవనంబులను, స-
రస్వతీవాహినీప్రాంత దేశముల,
సుఖతర గోపుర చూడాగ్రగృహముల,
శిఖరశృంగా[2]టక సిద్ధశృంగముల,
రమణ సారంగేశ్వరము, [3]హాటకేశ్వ-
రమును, బాపవినాశనముఁ, గిన్నరేశ్వ-
రమును, వారాహేశ్వరమును, సిద్ధేశ్వ-
రము, నాదియగు నీశ్వరస్థానములను
సల్లలితం[4]బుగా సమయ మిప్పించి,
పెల్లుగా మ్రుగ్గులు వెట్టంగఁ బనిచి,
విదితలింగార్చ[5]నావేదికాస్థలులఁ
బదపడి బిందియల్, వడిగంబు, లర్ఘ్య-

---

౧. దురంతరాదేవాలయాంతరంబుల(న)ను, ౨. వ, ౩. దిప్ర, ౪. గుహేశ్వరము, సిద్ధేశ్వరము సుప్రసిద్ధమై భువిని, ౫. కీర్తులు మీరు నివియాదిగాఁగ, రహివహించిన యీశ్వర....., ఇద్ధములుగా, ౬. న.

పాత్రలు, నూతనభాండముల్, ¹వంశ-
పాత్రలు, ఘంటలు, బహువిధూపదీప-
పాత్రలు, బహు³హోమపాత్రలు రజత-
పాత్ర⁴లు, విడెములు, ఫలములుఁ,గజ్జ-
ములు, సుగంధద్రవ్యములు, సితపుష్ప-
ములు, మాలికా⁵సికము, లఖండబిల్వ
పత్త్రిరి, ⁶వుష్పాలుఁ, బంచామృతములు,
నుత్తమాక్షతలు, దివ్యోదనావళులు,
నతిసుగంధం⁸బు, దశాంగ,⁹మానంద-
వతి, సురభియును, నావర్తిధూపంబు,
మలయానిలంబును, మహిసాక్షి, ⁹మద్ది,
గలహంసధూపంబుఁ, గామికామోద-
మును మనోహరధూపమును, దివ్య¹⁰ధూప-
మును, జనవల్లభామోదదీపంబు
లాదిగా ధూపంబు లానందవర్తి *
యాదివత్తు¹¹లును గృహాంగవస్త్రాది-
వాసస్సులునుగూడ వరభక్తతతి కు-
పాసనామతి సమర్పణనేసి, మఱియు

---

౧. పంచ, ౨. దీపధూప, ౩. హేమ, ౪. ముల్, ౫. నికర, ౬. ను, ౭. పు, ౮. ంబుగంధ...౯. మడ్డి, ౧౦. ధూప, ౧౧. ర్తు.

నేవస్తువులు ప్రియం బెప్పుడువలయు
నా[2]వేళ వారికి నభిమతార్థములు
సేయుచు నిబ్భంగి శివరాత్రిపర్వ
మాయతమతిఁ జొ[1]ల్ల నంత భక్తులకుఁ
గలపంబుఁ బన్నీరుఁ గస్తూరి సాందు
నలిఁ గూర్చి సమ్మార్జనము సేయువారుఁ
గిగళికలు, వస్త్రముల్, గమలముల్, బంధ-
ములు, ముకుళంబులు, ముత్తియంబులును,
నిగ్గారుఁబంచవన్నియలతోఁ గూర్చి
ముగ్గు లత్యాశ్చర్యముగఁ బెట్టువారుఁ,
దల[3]కొని సంతతధారాసహస్ర
కలశాభిషేకముల్ గావించువారు,
శిష్టాగమో[4]క్త విశిష్టత[5]దనర
నష్ట[6]విధార్చనం బలరించువారు,
నలి నుబ్బి భక్తగణప్రకరంబుఁ
దలఁచుచు ధూపా[7]ర్పితము సేయువారు,
మంగళంబగు భక్తమండలి కనుచు
రంగత్కరముల నారతు లెత్తువారు,

---

౧. ల్లై. ౨. కళ, ౩. కాని, ౪. శైవ, ౫. నలరి, ౬. పుష్పా. ౭. త్రి, ౮. ...

నంచితభ[1]క్తహితార్థకల్పనలఁ
పంచభక్ష్యాదు లర్పణసేయువారుఁ,
గర్పూరసహితంబుగా విడియంబు
లర్పించువారు, సాంపారంగ నిట్లు
[2]నాల్గవసరముల నలి శివరాత్రి
[3]నాల్గుజాములును సన్నుతిఁ జేయువారుఁ,
బ్రేమతో నాపగల్ రేయును జాము-
జామున కర్చనల్ [4]సరిసేయువారు,
ఘటిక లర్వాదియును గలయఁ జెన్నొలయ
ఘటికావసరములు గల్పించువారు,
సముచితాష్టోత్తరశతసంఖ్య నవస-
రములు సంకల్పించి రతిఁజేయువారు,
నష్టోత్తరసహస్ర మవసరం[5]బులు వి-
శిష్టతమై నట్లు సెల్లించువారుఁ,
దక్షిఁ[6]బూన్చుపూజయుఁ [7]దనరుపూజయును
వఱలఁ బూన్పఁగ నలవఱుచుపూజయును-
గా నిరంతరఘరికల్పితార్చనలు

1. క్తి, 2. నాల్గుయామములు సన్నుతిసేయువారు; నాల్గు(లుగు) విధముల నానార్చనంబు, 3. నాల్గుజాలకు దేవును (నొ)తియించువారు, 4. సలిపెడి. 5. తతి, 6. ట్లచేయించు, 7. జూచు, 8. బ, 9. న్ప.

నానందలీలఁ బాయక చేయువారు,
రతి షోడశోపచారక్రియార్చనలు
[1]సతతంబు నతిభక్తిఁ జలిపెడువారు,
నాది ఋగ్వేదాద్ది నలరారుసూక్తు
లాదిగా బ్రాహ్మణాద్యంతసూక్తములఁ
దుదిగాఁగ రుద్రసంస్తోత్రసూక్తములఁ
జదువుచుఁ బాదలి [3]ప్రశంసించువారు,
రుద్రవిధాననిరూపిత న్యాస-
భద్రాత్మసంజ్ఞలు వదునొకంటికిని
గ్రమ మొందఁ జమకసూత్రంబు లేకాద-
శములు నొండొంటికి శాంతులుగాఁగఁ
దివిరి ఛందోఋషి దేవతా శక్తు
లవి గూర్చి బీజాక్షరాన్వితంశబులుగ
నద్రతి శ్రీశత రుద్రంబుఁ గూర్చి
[?]రుద్రంబునంద పురుషసూక్తములును
నా యజుర్వేద వేదాంతసూక్తములఁ
బాయకచదువుచుఁ బ్రణుతించువారు,
సామంబు దా వేద సామరహస్య

---

౧. నతిభక్తి నేయుదు నలరెడువారు, ౨. లు, ౩. లః వి, ౪. గను, ౫. రుద్రుని బాగడు.

సామాదులగు [1]నవ[2]సామాదులందు
ననునీశ్వర ప్రశంసా[3]పరసూక్తు
లనురక్తిఁ జదువుచు నర్గించువారుఁ,
బ్రవిమలాథర్వశిరశ్శిఖాదులను
[4]దవిలి శ్రీపాశుపతవ్రతి వరదు
శ్రీరుద్రమహిమయుఁ జెప్పుసూక్తములు
వారక చదువుచు వర్ణించువారు,
నంచితబాణ గ, ద్యాక్షరగద్య,
పంచగద్యాదులుఁ బటుగణాడంబ-
రంబు, వర్ణాడంబరంబు, వ్యాసాష్ట-
కంబును, శ్రీనీలకంఠస్తవంబు,
శ్రీరుద్రకవచంబు, శారభంబును, మ
యూరస్తవము, హలాయుధ, మనామయము,
మలహణంబును, మహిమ్నం బను స్తవము,
మలయరాజీయంబు, పహానిదండకము,
స్తుతిమూలమగు మహాస్తోత్రసూత్రముల
శతకంబు, శివతత్త్వసారంబు, [5]దీప-
కళిక, మహానాటకము, నుదాహరణ

---

౧. సవ, ౨. నామా, ౩. వర, ౪. తివిరిరుద్రపశుపతి...
౫. దేవ.

నులు, రుద్రమహిమయు, ముక్తకావళులు,
గీతసూక్తములు, భృంగీస్తవంబులుఁ, బు-
రాతన మునిముఖ్య రచితాష్టకములు,
హరలీల, రుద్ర సహస్రనామాదు,
లరుదొందఁ జదువుచు నంకించువారు,
నరుదగు దాసయ్య [1]నఱువత్తుమూఁడు
సరితంబులును, శ్రీబసవ పురాణంబు
నేలలు వెట్టంగ నింపుసొంపారు
[2]శైలిచేఁగ్రాలుచుఁ జదివెడువారుఁ,
జాతుర్యమెసగఁ బసవ దండనాథు
గీతంబు లాదిగా గీతా[3]దు లైన
సకలపురాతనచారుగీతములుఁ
బ్రకటించి ప్రకటించి పాడెడువారుఁ,
జదువులఁ బాటల సంగతిలేమిఁ
బొదలి మాటలయంద పొగడెడువారు, *
నామాటలకు మనం బంద[4]మి మల్ల-
య్యా! మల్లయా! మల్లయా! యనువారు,

---

1. నరవత్తుమునుఠి, 2. శైలంబు ఘూర్ణిల్ల, 3. ధ్యు; ధ్యు, 4. గా, * ఈ పాదము తరువాత ఒకప్రతిలో, "హరలీలఁ బాడుచు నట్లునుగాక[illegible] అని అధికపాఠ మొకటి ఉన్నది.

"జయ! జయ! యుఘె! జయ! జయ! జయ!" యనుచు
జయవెట్టి మ్రొక్కుచు సరిఁ బేర్చువారు,
నలరుచుఁ బడిపోరులట్ల యందఱును
లలి నుబ్బి చాంగు భళా యనువారుఁ,
దనరుశబ్దము గద్గదంబున వెడల
కునికిఁ దప్పక చూచు చుండెడువారుఁ,
జూపులు శివసుఖాశ్రులవెల్లి ముంప
నాపోవ కెగయుచు నాడెడువారు,
నెగయంగ నెగయంగ నెంతయుఁ గాళ్లు
నెగయక యన్నెక్కి యుల ప్రాలువారు,
నాటలా త్మీయసర్వాంగవిస్ఫురణఁ
బాటిఁ దప్పినఁ జొక్కి పడియెడువారుఁ
జప్పట్లు వెట్టంగఁ జక్కన లేచి
యప్పాట వెడయాట లాడెడువారు,
వేడుకతోఁ జిందు వాడంగ నుబ్బి
కోడంగియాటలఁ గునిసెడువారుఁ,

౧. ట్టు, ౨. ఫణిహారు, ౩. ర, ర, లు, ౪. ల, ౫. నొగ, ౬. స్మ, ౭. దప్పకట్లొ, ౮. టల్, ౧౦. లంగనా, ౧౧. లా, ౧౨. లు.

ప్రసన్నని నిజదేశభాషల జా౧తుల
కన్ని౨కోడంగ్రాట లాడెడువారు,
భ్రమ౩రముల్ ౪సాళెముల్ బయక౫ముల్ మెఱసి
రమణఁ బంచాం౬సి పేరణి యాడువారు,
ప్రమథ పురాతన పటుచరిత్రములఁ
గ్రమ మొంద బహునాటకము లాడువారు,
లలితాంగ రసకళాలంకార౭రేఖ
లలవడ బహురూప మాడెడువారు,
౮గరణముల్ ౯మెరవణుల్ గతు౧౦లుఁజిత్రము౧౧లు
నరుదుగ ౧౨వెడ్డంగ మాడెడువారు,
నమరాంగనలు దివి౧౩ నాడెడు౧౪మాడ్కి
నమరంగ గడలపై నాడెడువారు,
నా వియద్గతిఁ బఱు లాడ౧౫దునట్టి
భావన౧౬మ్రొక్కులపై నాడువారు,
భారతాదికథ౧౭లఁ ౧౮జీరమఱుఁగుల
నారంగ బొమ్మల నాడించువారు,
గడు నద్భుతం౧౯బుగ్గఁ గంబసూత్రంబు

---

౧. త, ౨. బో, ౩. రులు, ౪. జా, ౫. న్న, ౬. లే, ౭. కరముల్లు, ౮. మెర(ధ)ములు, ౯. ల, ౧౦. వేదాంగ; సిద్ధాంగ; వెండాంగ, లెడ్డంగ, ౧౧. గియా, ౧౨. పసుది. ౧౩. డియ, ౧౪. మ్రొక్కు, ౧౫. ధను, ౧౬. చరితలమరుప్ప, ౧౭. లచెను.

బడరంగ బొమ్మల నాడించువారు,
నాదట గంధర్వయక్ష విద్యాధ-
రాదులై పాడెడు నాడెడువారు,
విధమునఁ బ్రచ్ఛన్నవేషముల్ దాల్చి
యధికోత్సవము [1]దులు కాడ నట్లాడు

ఆటపాటలు

శిరమున నురమునఁ జెవులఁ గంఠమునఁ
గరములఁ గూఁకటిఁ గాళ్లఁ జెల్వారఁ
గవదండలును గనుఁగవ [3]గరణికలు
[4]సవరంబులును గలశంబు[5]దండలును
భసితంబుపూఁతపైఁ బరగు [6]బచ్చెనలు
నసలారు [7]చిఱుగజ్జియలు నందియలును
సరి రత్నపంక్తుల జలపోసనములుఁ
గరమొప్పు తొంగల్లుగల చల్లడములుఁ
బొల్పుదంతావళుల్ పుష్పమాలికలుఁ
దాల్చి యత్యద్భుతోత్సవలీల దనర
జనులు హర్షింప నాస్థానముల్ సొచ్చి
యనుకూలవివిధ[10]వాద్యసమేళనమున

---

౧. ద్రో, ౨. లు(ల), ౩. కరు, ౪. జవ, ౫. దండంబు, ౬. ంపు, ౭. పచ్చ, ౮. కిరు, ౯. ంబు, ౧౦. విద్యామేళ.

నార్భటం బిచ్చి యొయ్యన జవనికల
గర్భంబు పెడలి యక్కజము వట్రిల్లి
నాడకముందరి నభినయం బొలయ
జూడకముందఱ జోద్యంబుదనర
నిక్కుచును ద్రిభంగి నిలుచుచు నట్ల
చొక్కుచు సభఁ జూచి యొక్కింత నగుచు
నలి నంగసంచలనము నంద గతులు
లలి గొని భ్రూలతలన నర్తనంబు
మొనయుచిత్తోల్లాసమునను రంజకత
దనరఁ గటాక్షంబు లనను గుశలంబు
లలరి శిరఃకంప మాచరించుచును
నలి నంగుళిస్ఫోటనంబు సేయుచును
లాగు, వంజళము, ఢాళము, ంవళి, దిరువు,
బాగు, ంవాహిణి, సాళి, బయగతి, సుగతి,
బహుగతి, గతియు నాఁ బరిపాటి దనర

భరతశాస్త్రలక్షణము

సహజమై తనుగతి స్వరవంచనములుఁ
బటురసాలంకారభావముల్ దనర

---

౧. రు, ౨. లవ, ౩. ట, ౪. వం, ౫. న; స, ౬. ననకల శంబు; ననుకుశలమ్ము, ౭. ంపు. ౮. పంజ, ౯. ఢాళం, పళి; వడి, ౧౦. వహిణి, (ణ), ౧౧. పయ, ౧౨. యనా, ౧౩. పంచక.

స్ఫుటవాద్యతాళసంఘటన ఘటిల్లఁ
[1]దనుపాదఘట్టన దనరనుద్ఘటన-
లను[2]నయించుచు నందియల్ గదల్చుచును
'నోహో!' యనుచు గతు [3]లొడ్డవిం[4]చుచును
'నాహో!' యనుచు లాస్య మనునయిం[4]చుచును
జతులు[5]వాడుచుఁ దాళగతుల[6]కాడుచును
శ్రుతులఁ గూడుచు నేలఁ ద్రొ[7]క్క నోడుచును
వీఁగుచుఁ గరణికల్ విస్తరించుచును
లో[8]ఁగుచు దంతావళుల్ నటిం[8]పుచును
బొబ్బలు[9]వొడుచుచుఁ బొంగి యార్చుచును
[10]గుబ్బన లేచుచుఁ గునిసియాడుచును
జాఱు[11]చు జంగ[12]లు సాఁపుచు, మంది
నూఱించుచును, మొగం[13]బోఱవుచ్చుచును
జంకఁ జూపుచు బయల్ స్పరించుచును
జంక ల[14]డిచికొనుచు శంకరుఁ బాడు
చును, నుఱుకుచుఁ, గ్రేళ్లుసూపుచుఁ, బన్ని-
కొనుచు, గంతులువైచుచును, మణికట్లు

---

౧. తన, ౨. నటిం, ౩. లొడ, ౪. పు, ౫. బా, ౬. నా, ౭. క్కి-క్కా, ౮. ంపు, ౯. వడ, ౧౦. గుబ్బ, ౧౧. లు, ౧౨. లే, ౧౩. బొరవచ్చు, ౧౪. దనుకాంచు.

[1]వెడనుఱటించుచు, వ్రేళ్లు విడికిలించుచును,
నొడలడంచుచు, నురం భొగ్గుచు, వీఁపు
విఱిచికొనుచుఁ బరివిచ్చుచు, మోము,
బొఱఁడువుచ్చుచు, భుజంబులు[2] బవియుచును,
మ్రోఁకాళ్లుఁ దొడలును ముడీవ[3]ఱుచుచును,
గూఁకటిఁ గిఱపుచుఁ, గోకళటించుచును,
మూఁతులు[4]నలుపుచు [5]ముఱుకటింపుచును
మ్రోఁతకు నుబ్బుచు మురియుచుఁ జనుచు
మిన్నక చూఁచుచు మెడవిర్చికొనుచుఁ
గన్నుఁ లార్చుచుఁ జెవుల్ గత్తరించుచును
[6]వెవ్వెటలాడుచు [7]వెక్కిరించుచును
[8]గవ్వదండల[9]యందు గతులు వుచ్చుచును
బూమ లెత్తివైచుచు బుగ్గరించుచును
దమకించి దాఁటుచు దండ [10]ఱిచ్చుచును
గొంకుచు వడఁకుచుఁ గొసరుచు, మూఁడు
వంకలఁ బోవుచు శంకించుకొనుచుఁ

---

౧. బెడ, ౨. బర్శి ౩. వడికొనుచు, ౪. రిం, ౫. నుఱువుచు; ౬. ముర (రు) కడింపుచును, ౭. వెప్పర, ౮. లాటుచు; నాడుచు, ౯. వెక్క (క్క), ౧౦. గప్పున తమతమ, ౧౧. యంద, ౧౨. యి.

బరులఁ జే[1]ప్రేయుచుఁ బకపక నగుచుఁ
గరముబ్బుచును జొల్లు గాఱిచికొనుచు
సరసంబు లాడుచుఁ జప్పట లిడుచు
విరసంబు లాడుచు విఱ్ఱవీఁగుచును
నొడ్డోలగంబులో నొఱసి తిర్గుచును
నష్టంబు [2]ద్రికటంబు నన్ని [3]వాడుచును
మరగాళ్ల[4] నడచుచు మట్టిగా[5]ళ్లగుచు
[6]నొరుగాళ్ళ[7]నడచుచు ధర[8]గొంతుగొనుచు
మ్రోఁకాళ్ల నడచుచు మొగి[9]నేలఁ గాళ్లు
దాఁకుచుండ నెగసి తటు[10]కన చనుచుఁ
గూర్చుండి నడచుచుఁ [11]గుప్పించి యచట
నార్చుచు[12]మెఱము లందంద వైచుచును
నురమున నడచుచు [13]నొదికిలఁ జనుచు
ధరఁ బొరలుచు సముద్ధతి లేచి [14] చనుచు
నుర్విఁ ద్రిప్పటమున [15]నొకవ్రేల యిడి య-
గుర్వగాఁ దిరుగుచు [16]గుర్వించు[17]కొనుచు

---

౧. వే, ౨. విగ, ౩. వాఱు, ౪. గాల, ౫. లగుచు, ౬. నొరి, ౭. గొత్తు, ౮. కాళ్ల నేల, ౯. కునఁజనుచు, ౧౦. గుంఫించి, ౧౧. మొ, ౧౨. నోడకుండనుచు; నొదికిలి (నొతికల) జనుచు, ౧౩. నగుచు, ౧౪. ట్లొక, ౧౫. సర్పి (ప్పి) ంచు, ౧౬. చనుచు.

గరతలం బాని శీఘ్రము సారియట్లు
ధరఁ దిరుగుచు దెసల్ దన్ని నిల్చుచును
ధర బొమ్మరమునట్లు దలక్రిందు సేసి
తిరుగుచు [3]వెలిదన్ని తివుట[4]నిల్చుచును
[5]నమిలియుఁబోలె నున్నతి నటించుచును
భ్రమరంబుక్రియ[6]న్నుద్దాఁ బరిఘటించుచును
జిలుకయుఁబోలెఁ జెన్నొలయఁ బల్కుచును
జలచరంబులుబోలె జనుల కుల్కుచును
గలహంసయునుబోలె గతుల[7]నేర్చుచును
నిల మృగములట్లిరిమిరిమి చూచుచును
గండుఁగోయిలబోలెఁ గడఁగి కూయుచును
వెండి క్రోతియుఁబోలె వికృతిసేయుచును
నాలతేఁడునుబోలె నటయిటసనుచు
[9]గోలికాఁడునుబోలె [10]గోశ్మనఁ గొనుచు
మదగజంబునుబోలె మాఱుమలయుచుఁ
బొదలి వ్యాఘ్రంబట్ల పోటి [11]నులియుచును
గేసరిబోలె [12]లంఘించి పట్టుచును

౧. రి, ౨. లేచి, ౩. దవి; దివి, ౪. నిచ్చు, ౫. నమ, ౬. రాగ, ౭. నెంచు, ౮. ట్లరిమిరివి, ౯. ఖాలి, ౧౦. ఘాశ్మి (శ్మే)ని, (న); ఖాగోల, ౧౧. నొ, ౧౨. జం.

మాసటీఁడునుబోలె [1]మడ్డి[2]వెట్టుచును
మహి భుజంగముఁబోలె మలకలుగొనుచు
విహగంబుక్రియ నభో[3]వీథిని జనుచు
సరి విలాసినిఁబోలె [4]సభ మురియుచును
[5]వరవిటునట్లు భావము లరయుచును
గవియట్ల నవరసగ్రాహకుం డగుచు
శివయోగియట్టు[6]లు సిఱునవ్వు నగుచుఁ
బగలేనినృపు[7]నట్లు వరిణమించుచును
బొగలేని[8]వహ్నియుఁబోలె మించుచును
[9]బాయలేని వెలుంగుఁ బాళిఁ గప్పుచును
మాయలేని[10]పురారి [11]మాడ్కి నొప్పుచును
బురములు[12]గాల్చినపోల్కి యాడుచును
మరుఁ[13]జిఱువుచ్చినమాడ్కి నాడుచును
సతి కర్ధ మిచ్చిన చంద మాడుచును
యతులు గొల్వఁగ నున్నయంద మాడుచును
నంధకాసురుమదం బడచు టాడుచును
గంధగజాసురుఁ గడపు టాడుచును
జన్నంబుఁ[14]బ్రుంచిన చా[15]ళ్కి నాడుచును

---

౧. ఘండ, ౨. లె, ౩. వీథుల, ౪. సభలజేయుచును, ౫. వరలినయట్లు, ౬. లచి, ౭. సట్లుప, ౮. యగ్ని, ౯. చాయ, ౧౦. శివుని, ౧౧. మాయ, ౧౨. గొ. ౧౩. జూర; జుఱ్ఱు, ౧౪. స్రం, ౧౫. లియ్యా.

[1]వెన్నుండు గన్నిచ్చువేళ నాడుచును
గరళంబు దాల్చినకరణి యాడుచును
సరి నజుతలఁ గొన్న [2]సరణి యాడుచును
వెండియు భవు బహువిధ[3]చరిత్రము ల-
ఖండిత[4]గతి నాటకంబు లాడుచును
భృంగియు నభిమతప్రీతి[5]మర్త్యంబు
[6]భృంగుల[7]లోఁ దాను భృంగియై[8]యాడ
వీణోత్తమ[9]ము, బ్రహ్మవీణ, కైలాస-
[10]వీణయు, సారంగవీణయుఁ, గూర్మ-
వీణయు, [11]నాకాశవీణ, [12]పినాక-
వీణయు, రావణవీణయు, గౌరి-
వీణయు, [13]గాంధర్వవీ[14]ణయు, [15]బాణ-
వీణయుఁ, గాశ్యపవీణ, స్వయంభు-
వీణయును, భుజంగవీణయు, భోజ-
వీణయుఁ, గిన్నరవీణయుఁ, [16]ద్రిసరి-
వీణ, సరస్వతివీణయు, [17]మొల్లి-

---

౧. వెన్నునికి, ౨. చరితమా, ౩. విచిత్రము, ౪. మతి, ౫. నత్యంత, ౬. శృం, ౭. లోనదా, ౮. యాడు, ౯. యు, ౧౦. వీణె (ఇట్లే ఈక్రిందను), ౧౧. నుపినాకవీణయునాక, ౧౨. యు మార్గ. ౧౩. ౧౦, ౧౪. యానంద, ౧౫. జా, ౧౬. ద్రిపరి, ౧౭. బొల్లి; మొల్లి.

వీణ, మనోర*వీణయు, సరథి-
గణనాథవీణయుఁ, కౌమార[౧]వీణ,
యణివాణి, రావణహస్తంబుఁ, [౨]దిపిరి,
[౩]సకనెయు, వళి, విచిత్రక, నట, [౪]సాగ-
[౫]రికయుఁ, [౬]గుంఢిక, విపం[౭]చిక, [౮]సరవీణ,
[౯]సరనాదివీణ, మల్ల[౧౦]రియుఁ, గోలాప్తి,
[౧౧]స్వరమండలంబు, ఘోషావతి యను వి-
ధంబు, [౧౨]సౌదుంబరి, [౧౩]దంత్రిసాగరము,
నంబుజవీణయు, నాదిగా మఱియు
సమరంగ గీతానుగము, నుభయాను-
గము, [౧౪]ముఖవీణానుగము, [౧౫]ద్రుతానుగము
[౧౬]లన లక్షణోక్తము లనుచుఁ బ్రమాణ-
వినియోగ మనుతంత్రులును, [౧౭]గరణికలుఁ,
జెలువారు దండియుఁ జిత్రంబు, మృదువు,
లలియు, మాధుర్య, [౧౮]ముల్లసనంబు నోల[౧౯]య
సయతాణమును, మొగచాళంబు, సుకళ,

---

౧. రి, ౨. దివిరి; ద్వారి, ౩. చకనేయు; సకటేయు, ౪. నాగ, ౫. తి, ౬. నంచిక; సుంచిక, ౭. ంచ, ౮. సర(త్ర), ౯. పరి, ౧౦. యకులాప్త; యకోలాప్తి; యసల్లాప్తి, ౧౧. సర, ౧౨. కాదుంబర(రి). ౧౩. తంత్ర, ౧౪. మణి, ౧౫. ప్ర, ౧౬. లను. ౧౭. కణికలును, ౧౮. ల, ౧౯. యు.

హాయతాణమును, దశహారము, సారణమును,
బొట్టవణిగ, దిరుగువును, శివర్తి, దాళ
పట్టె, కర్తరియు నేర్పడ, జన్యజనక
విరచనల్ దళుకొత్తు వీణాఢ్యులైన
నరులలోఁ గలసి కిన్నరులువాయింప
నచ్చుగా మును శవణాంగముల్ మెఱసి
మెచ్చులు వడయుచు మృదుమ్రోల మఱియు
ముదమున సమహస్త మునుక, పైరణంబుఁ,
బదము, నంతరమును, బారణ, నిదోర్త,
గలితంబు, జతియు, ద్రుక్కారముఁ గచ్ఛంబు,
మలపంబు, ముఖవాద్య, మిలఁ జల్లణంబు,
బొల్లావణియు, మలపును, విలంబర్ణణము,
నుల్లంఘి, యనుఘాత యుత్తాళ, విషమ -
వాణియు, నర్ధార్ధవాణియు, నర్ధ -
వాణియు, దళుకుంభవాణియు, దండ -
హస్త, జోవాణి, సమగ్రత, బింబండ -
హస్త, చంద్రాణియు, విసజనతి, పంచ -

౧. పు. ౨. ప. (సు) త్రి, ౩. పట్టు, ౪. చైరన, (స; వ) ంబు; భైరవంబు, ౫. వో, ౬. ద్వ; ౭, ౭. రచ్చ; కచ్ఛ, ౮. మల దంబు; వలపంబు, ౯. డ, ౧౦. మ, ౧౧. బంకి, (ంకి), ౧౨. నప జతి; నవతిజ;

హస్త, [1]శిరో[2]వధి, యంత్ర[3]రావృత, వి-
హస్త, [4]పయశ్ఛేది, యాస్థానగర్భ,
జతి, [5]పాజ, జలపాణి, సమపాణి, [7]భేద-
గతి, వరి[8]శ్రమమును, గర్భనిర్ణయము,
లను బంధములును బుష్పాంజలి మొదల్
జను ప్రబంధము, ఖండజతియు, రేగువణి,
దుడుకు, ఘీంకారంబుల, దుదిం జమత్కార
మడరంగ వాద్యచూడాదు[10]లు మెఱసి,
నరులట్ల భరతుండు నందికేశ్వరుఁడు
ధర మద్దెలలతోడఁ దారు[11]వాయింప
స్ఫుటతరంబుగఁ జంచుపుటయును, [12]గచ్ఛ-
పుటయు, [13]షడ్గీత, యుత్పుటయును, మోచి-
తయు, సమతాళ,సత్రచ్ఛేద, యనఁగఁ
బయిపయి నీయేడు ప్రథమతాళములు;
నోడఁబడ మఱి[14]మొగయును, బొంబడయును,
నెడ,[15]వాడయును,[16]గారు, హడకయు, బంధ-

---

౧. దదీయాంతరావృత విపలి, ౨. శిరోదధి; శిమో; వలి, ౩. రవుపరి, ౪. రయంభేరి; వయంచ్ఛేరి, ౫. బోజ, బొజ్జ, ౬. హాణి, ౭. భేదు, ౮. శ్రమ. ౯. లులా, ౧౦. ల, ౧౧. హా, ౧౨. జాచ; ఔర, ౧౩. సుగ్గతితయుద్భురిత; షడ్గతియునుత్పుటిత, ౧౪. యగ, ౧౫. హడ; పాడ, ౧౬. గామహాడకును.

## ప ర్వ త ప్ర క ర ణ ము

కరణ, [౧]బాడకరణ, క్రౌంచపదంబు,
సరకరణయును, నాస్థానమండపము,
ఫల, చక్రవా[౨]ళంబుఁ, గలహంస, యార్యా,
లలితయు, [౩]సరళ, విరళ, యుమామంది-
రయు, మత్తమాతంగ, [౪]రథ్యా, మత్తె, ముద
[౫]వయు, [౬]బంధమత్తెంబు, వరరూపకంబు,
నలగు నేకతాళ, [౭]మఠెతాళ, మనఁగ
నిల శుద్ధతాళంబు లిరువదియేడు;
[౮]ఖండితతర, యవఖండ, గంకాళ,
ఖండిత, చండ[౯]కీ, ఖండవర్ణ, యవి
ఘూర్ణితయుఁ, [౧౦]గుటిల, ఘూర్ణిత, [౧౧]గోష్ఠి,
యార్ణ, [౧౨]కచ్ఛణ, యాణ, [౧౩]యాదిమాతృక, త-
రక్షణపుత్రి, యు[౧౪]ద్వీక్ష, ణోచ్ఛవటి
యక్షో[౧౫]ళిక, చటిక, యష్టిక, పూర్వా-
[౧౬]కంకాళ, మణిమిశ్రకంకాళ, ఖండ-

---

౧. ఛాద, ౨. కం, ౩. సరరవళ; సరళ(రత) వళ, ౪. రచ్ఛమత్తెముద; రచమరెవలచు; రచమధ్యముద్రు, ౫. రయు, ౬. బింధ, ౭. మఠ, ౮. ఖ (భ)ండా(ం)తె(ర), ౯. కి. ౧౦. కుటువేరి. ఘూణిత; కుటిలశేఘూ (ఖా)ణి (ర్ణి)త, ౧౧. గొడ్డ(ట్టి), ౧౨. ర(క) చ్ఛిణ; రచ్ఛర; వకచ్ఛణ, ౧౩. యానియత్యంత; యణయాదియా (మా) త్రు. ౧౪. ద్వీక్షణచచటి; దీక్షణోచ్ఛచటి, ౧౫. యక్షా (క్ష) రిచ్ఛ (క్చ), దికం.

[౧]కంకాళ, కావ్యకంకాళ, [౨]పంచాళ,
[౩]భిన్నక, కోకిలప్రియ, నిరవద్య,
రన్న, కుంజర, ఫణిరాజ, చతుశ్ర-
ధార, కృత్తి, [౪]చ్ఛవిద్యాధర, రక్త-
[౫]ధార, యుత్తమమేరు, తాంబూ[౬]లియాణ,
మలపు, నుత్ఫు[౭]ల్లిక, మాతంగ, యర్ధ-
కళిక, సరస్వతి, గంటాభరణయు,
మిశ్రతాళయును, సంమిశ్ర[౮]వాద్యయును,
మిశ్ర[౯]కళాస్ఫూర్తి, మిశ్రవర్ణములు,
సింహవిక్రీడిత, సింహనాదయును,
సింహానందకయు, లక్ష్మీస్తన, ముక్త
తాళ, పంచబ్రహ్మ, దశ[౧౦]వృద్ధ, పంచ-
తాళ, చాయ[౧౧]ణ, పరితాళ, ప్ర[౧౨]సక్త,
[౧౩]ఖుర, విసరఖుర, యుత్తర, పంచ[౧౪]వాణ,
హరిణ, [౧౫]మాయాఖణ, [౧౬]యాదికం[౧౭]ఖాణ,

---

౧. కంకణ; కంకాణ, ౨. పంచాళి(ణి), ౩. భిన్నక (౦) కా (కో) కిల, ౪. చ, ౫ దార, ౬. ల (లి), యరణ, ౭. ల్లి. ౮. వాద. ౯. నత్త (ర్త) రియును. ౧౦. రుద్ధ, ౧౧. న, ౧౨. శక్తి, ౧౩. ఖురు విపసుఖుర, ౧౪. వాణ్య; బాణ, ౧౫. మణేయాకణ; మాఖాణియాణ, ౧౬. మా, ౧౭. కా.

౧ఖంజర, చతురశ్ర ౧ఖంజర, కృష్ణ -
౧ఖంజర, యసమాన ౧ఖంజర, తాళ,
లక్షీ౨నతియు, ధ్రువ, ౩లయ, తనుభద్ర,
లక్షణీ౪యాణ, వి౫లంబిత, ౬యాది,
మత్తె, వళీ, ౭ధ్రువమత్తెయు, జంపె-
మత్తెయు, మునుతెగ మానం౮బు మత్తె,
యని యిట్లు ప్రథమశుద్ధాది విభంగ -
వినుత భంగాభంగ వివిధతాళములు
సన్నుతాష్టోత్తరశతసంఖ్యఁ జనఁ బ్ర -
సన్నతాళము దూర్య సంగతిఁ జెలఁగ
భాసురం బగు ౯ జాతి వాస, ౯విజాతి-
వాసయును, గుమారవాసయుఁ, బతు-
వాసయును, భువనవాసయు, శ్వేత-
వాస, భాస్కరవాస, వరరుద్రవాస,
హరివాస, నిధివాస, యష్టదిగ్వాస,
గరమొప్పు ఋషివాస, గార్తికవాస,
జనను౧౦తాఘోరవాసయు, బ్రహ్మవాస,
సెనసి త్రిపురవాస, శివ౧౧భక్తివాస,

---

౧. కం, ౨. స, ౩. శాయసుభద్ర, ౪. య, ౫. శం, ౬. దా, ౭. ధృతి, ౮. ంపు, ౯. జో్యి, ౧౦. త, ౧౧. శ.

[౧]వాలితభువనా[౨]ధిపతివాస, యనఁగ
వ్రాలి యష్టాదశ [౩]వాస[౪]నాసములు;
[౫]ఆలాప, హేలనా, వ్యాప్తి, బెడంగు,
[౬]ఛాలన, [౭]సుళికెయుఁ, జర, మింపు, [౮]సొంపు,
[౯]నణువు, [౧౦]దిరువు, జయ, యనుజయ, [౧౧]కొంకు,
[౧౨]వుణవ్రాణ, వళి, [౧౩]భజ[౧౪]వణ, [౧౫]పాంపు, [౧౬]సెవణ,
[౧౭]వహాణి, స[౧౮]వ్యాంగుళవహా[౧౭]ణియు, [౧౯]నధర
[౧౭]వహాణియు, నా నిఱువది రెండుగతులు,
స రి గ మ ప ధ ని స సప్తాక్షరములు;
నరయంగ నారోహి, యవరోహి, సక్ర-
వాళ, సంపదలఁ, బ్రవ్య[౨౦]క్త, సువ్య[౨౦]క్త,
[౨౧]లాలిత, నొప్ప సప్తాలాపనములుఁ;
దెలియ నల్వదితొమ్మిది విధంబు లందు
దళుకొత్తు[౨౨]హంసనాదంబు లింపారఁ
జనఁగ షడ్జమును బుషభయు గాంధారి

---

౧. వ్రాలిన, ౨. ది, ౩. వాస; వాంస, (శ), ౪. చాపములు, ౫. హాళాప; ఆపాప, ౬. నా; బా, ౭. సురిక, ౮. నుం, ౯. అణుకు (పు), ౧౦. తిరుపు, ౧౧. కొంక, ౧౨. పుణపూణ, బణయూణ, ౧౩. భన్నె, ౧౪. వణి, ౧౫. యింపు, ౧౬. సెవణ, ౧౭. పహణ, ౧౮. ర్వా, ౧౯. ని, సదర, ౨౦. క్త, ౨౧. నాలీల, ౨౨. వంశే.

యును మఱి మధ్యమంబును బంచమంబు
ధైవతమ్మును నిషాదము[1] నాఁగ నిట్లు
భావింపఁ బరగు సప్తగ్రామ జనిత -
ములు, [2]నుదితస్వరంబులు [3]పుట్టుకాల
ములు, దిథి, నక్షత్రములు, యోగములును,
జాతిభేదములు, స్వజాతిస్వరములు,
జాతులుఁ దనర నాస్వరములలోన
సకళయు, గూఢ, నిష్కళయు, సంహృతయుఁ,
బ్రకటింప షడ్జసంభవములు నాల్గు;
నావళి, మధుర, యేకాక్షరి నాఁగ
భావింప ఋషభసంభవములు మూఁడు;
భృంగిజాతియును [4]బరేంగిత యనఁగ
సంగతి గాంధారజనితముల్ [5]మూఁడు;
సనఁ బూర్వ[6]వాసరంజ[7]క యలంకారి
ణిని, నాఁగ మధ్యమజనితముల్ మూఁడు;
వర రేణుకయుఁ బ్రస్తవాసియు లలిత,
స్వరవాసి, వంచమజనితముల్ నాల్గు;
దనరుభాషాగ్ని, నర్తకియు, నాపూర్ణ

౧. మనానిట్లు, ౨. నందతా, ౩. పుట్టి, ౩. బ(బు)రాంగతి,
౫. రెండు ? ౬. రాశి, ౭. ల, ౮. నాద.

యును, నాఁగ ధైవతజనితముల్ మూఁడు;
నరుసఁ బ్రచ్ఛన్న సర్వవ్యాపు లనఁగఁ
బరగు నిషాదసంభవములు రెండు;
దలఁప సప్తస్వరాత్మకములై యిట్టు
లిల నొప్పు శ్రుతులు¹ దా మిఱువదిరెండు;
దీర్ఘ, లాలితయును, దీర్ఘి, కాదీర్ఘ,
దీర్ఘోల్లసితమును, దీర్ఘకంపితము,
నుల్లసితంబు, సమోల్లసితంబు,
నుల్లాసితంబును, నుచ్చరితంబు,
స్ఫురితమూర్ధ్వి²క్షిప్తమును, గోమలంబు,
³వరున నక్షిప్తంబు, ⁴భ్రమిత మాహతము,
లలితోత్తమంబును లలిత, ప్రస్తుతము,
నలరుగుంఫితము, సూక్ష్మాంతంబుఁ, గుంచి -
తము, గరస్థితము, నాఁదత్కృతిసంభ
వము లిఱువదిరెండు గమకముల్; మఱియు
ధరఁ గంపితము, స్ఫురితము, లీన, మనఁగ
సరిఁ ద్రిభిన్నోత్తర సప్తధా యనఁగ
నలరునాందోళితాహతమును, సూక్త

---

౧. ష్ఠ, ౨. ఢా, (నా) నిరు, ౩. క్షి, ౪. పరగు, ౫. భ్రమ రహాహతము, ౬. దచ్ఛాతి.

కలనముల్ ప్రత్యేకగమకము లేదు;
సురుచిర తత్స్వర శ్రుతి గమక ప్ర-
కరగీతజాత రాగప్రభేదములు,
శ్రీరాగ, మాందోళి, సిత్రాంగి, లలిత,
సౌరరాగము, గౌళి, శంకరాభరణ,
గాంధారి, మధ్యమగాంధారి, రక్త -
గాంధారి, వంచమగాంధారి, దేవ -
గుప్త, శ్రీకాంశికగుప్త, గాంధారి -
గుప్త, సాధారణగుప్త, గన్నడీక,
దేశి, గుంభకము, ధన్నాసి, గాంభోది,
దేశాక్షి, మధుకరి, దివి మేఘరంజి,
రంగవరాళి, దరంగిణి, బహుళి,
బంగాళ, మాహురి, బ్రహ్మాణి, శుద్ధ -
వాహిని, బృహతి, దేవప్రియ, రూప,
సోహరి, సైంధవి, శుద్ధవరాళి,
సౌరాష్ట్రసైంధవి, వౌరాణి, భిన్న -
వౌరాణి, యుత్పలి, వదపంజరంబు,

---

౧. లిత, ౨. క్షి, ౩. మో, ౪. దిమి, ౫. ళి, ౬. బ్రాహ్మణి, ౭. ణి, ౮. వ, ౯. దే(రే)వక్రియా, ౧౦. సోహహ, ౧౧. వి, ౧౨. ళి, ల.

నాగవరాళి, గర్ణాటవరాళి,
నాగ[౧]దివికురంజి, నాట, త్రినేత్రి,
మాళవగౌళ, రామక్రియ, సాయ
గౌళ, ద్రావిళగౌళ, గర్ణాటగౌళ,
సౌరాష్ట్రగౌళ, [౨]దేసాళగౌళంబు,
భైరవి, సారంగభైరవి, నంద -
యంతి, నాదో[౩]త్తరి, యస్యాసైంధ[౪]వి, వ-
సంత, మే[౫]ఘచ్ఛవి, సౌందరి, [౬]శక్క-
రాగంబు, [౭]ఫైహరి, రక్కసి, సోమ-
రాగ, మసారవరాళి, [౮]భల్లాత -
కాళింది, [౯]ధైవతి, ఘంటారవంబు,
[౧౦]వ్యాళింది, దే[౧౧]శాళి, యభ్రపంచ[౧౨]మము,
గంధికామోది, శ్రీకంఠ, కాంభోజి,
సింధు[౧౩]వరాళి, గౌ[౧౪]శికి, పూర్ణ, నాట,
గుజ్జరి, సౌరాష్ట్రగుజ్జరి, ద్రవిళ-
గుజ్జరి, మలహరి, [౧౫]గోలాహలంబు,
మాళవి, [౧౬]గౌళిక, మధ్య, విభిన్న,

---

౧. ధి, ౨. రే, ౩. వ, ౪. వ, ౫. ఢ, ఘ; క, ౬. డ, ౭. కా, ౮. ప, ౯. దైవత, ౧౦. న్యా, ౧౧. పా; వా, ౧౨. క, ౧౩. వి, ౧౪. క, ౧౫. కోహళంబునను, ౧౬. కౌశిక.

[1]సాళంగనాట, భూపాళంబు, సాయ,
దోడి, సౌవీర, హిందోళంబుఁ, దురక -
తోడి, దివ్యావతి [2]దుండక్రియ, నట -
నారాయణి, ఋషభి, నర్తకి, శుద్ధ -
[3]కీహార, కైతరకి, వ్యభిచారి, గర్మారి,
వేళా[4]వుళియుఁ, జిత్ర వేళా[5]వుళియును,
మాళవ, శ్రీమధుమావతి, నాఁగ
సాంగ రాగాంగ భాషాంగ క్రియాంగ -
సంగతోపాంగ సంజనిత రాగములు
మొదలి షడ్జగ్రామ ముఖ్యతద్గ్రామ -
విదిత సంభవరాగ వితతులలోన
నిల నెన్నఁబడు నూటయెనిమిది రాగ -
ములయందు స్త్రీపున్నపుంసకరాగ -
ముల షాడవౌడవంబుల విభేదములు,
నలిగొన [6]బంబళనాటాట, మిశ్ర,
[7]కావుళ, ధ్వనిచతుష్క శ్రేష్ఠలీలఁ
గావించునాటాట కావుళధ్వనులు
పూరితంబుగను శారీర చతుష్క

---

౧. పా, ౨. సంత, టి. (ంద) ౩. వార, ౪. క, ౬. పు.
౭. బంభర, ౮. వ.

సారమా౧హేశ్వర శారీర మొలయ
సరి౨వాచకంబులు జయయయు నుజ్జయయయు;
నరుదగు ౩నందును హాయి, ౪సుహాయి;
గాణాయి, గూఢాయి, గాఢాయి, ౫వాయి,
దేణాయి, బహుళాయి, ధృతి ౬బడియాయి,
ఘననిబిడాయి, చోత్తూయి, దిత్తూయి,
యనఁగ నీ పండ్రెండు ౭ననువాచకములుఁ;
బరగ షట్స్వాదు సప్తస్వాదు నాఁగ
నురుతరాష్టావళియును నవస్వాదు
సరస మాయాయి నా ౮జయపంచకంబుఁ
బరగు జేహావళి, వటు ౯మదావళియు,
నొనరు కంఠావళియును నాఁగ నిట్టు
లను జయత్రయము నింపారంగ, నంద
ఘనవిజయస్థానకంబును, వళిగ ౧౦-
యును, నంతరంబును, నుప్పరవట్ట
యును, ౧౧సుందరణ, వాళయును, సర్వగతయుఁ
దనరు భంగాస్థానమును, గమ౧౨శిళాయి,

---

౧. పాంచాల, ౨. వాగ, ౩. నందురు, ౪. సు. ౫. దా, ౬. బతి. ౭. నీవాచ, ౮. దోయాయి; మాయాలు, ౯. జయి (న), ౧౦. మదా. ౯. ౧౧. మండ, ౧౨. లా.

రతి నాభిగతి, యుదరగతి, కంఠగతి
ప్రతతు లా౧తిరువులు నండ్రెండు వెల౨యు;
౩యుత దేహనాభి కక్షోదరకంఠ
౪విత్రతపంచస్థా౫న విహితజాతములు
౬పరిహా౭రి౮సక్కట౯సరివాగ వహణి
వరకంఠికాపాళి వహణి, యున్కట౯ము
ధర౧౦ముదువయును ౧౧సైతంబును, నా౧౧గ
౧౨వరుస బదనకొండు వహణిభేదములు;
లలిత, గాఢయు, గాఢలలితయు, బొచ్చ -
లలితయు, నేవళయు, లవులంగితము,
గహాగు౧౩హాకము, బొచ్చగాఢ, వివరణ,
మహిమ దొక్కటియు, గమకము దొక్కటియుఁ,
గంపితంబు, వివశ, గాణాయిలంబు,
నింపు, గోష్ఠాగోష్ఠి, నుంపును, దీన-
కాకు, వెల్లాపెల్లి, ౧౪కల్లి, స్వభావ-
కాకును, గొంకును, గంపితం, బణుకు,

---

౧. పరు, ౨. య, ౩. యుద, ౪. విదిత, ౫. త, ౬. సరినా, (హె) రి; ౭. చకగాట, ౮. సర్వా(ర్వ), గహణి, ౯. యు, ౧౦. ముదుప, ౧౧. సయి, ౧౨. పరుసన పదకొండు, ౧౩. హి, ౧౪. ఘు.

దరహారంబును, [1]ననుతాయియు, నోజి,
సరిది, పేరాపేరి, సరి[2]బరసంబు,
[3]మోట్టాయితము, నాఁగ ముప్పదిరెండు
నట్టివిశుద్ధరాయంబు లొప్పార
మొదలను[4]నెవణ నా నదియుఁ [5]దానంబుఁ
బొదలెడు[6]సుత్తి నాఁ [7]బూరణ నాఁగ
రంగు నా నదిసో[8]మరక్త నా జిగియు
సంగతి[9]గమళ నాఁ జనుకంపితంబు
నాలాప మనఁగఁ దా నా[10]నైక [11]మనఁగఁ
బోలం[12]గ సమ[13]ణ నాఁ బొనరు[14]ఘోట్టాయి
[15]వరువడి గవణ నాఁ బరగు[16]నావాళ
యరుదగు[17]వ్యక్తి నా [18]నలిఁ బ్రబంధంబు
నలరారు క్షేత్రాంగ మది[19]యలంకూళి
సెలఁగు షడక్షరి [20]సెప్పనవజ్ఞ
యొదవంగ నిహతంబు నుభయకాళాస

---

౧. వను, ౨. బసరంబు, ౩. ముట్టాయిల (తె) ము, ౪. సేవ
ణానదియతానంబు, ౫. తాపంపు, ౬. సత్తే, ౭. బూరణలియు;
బూరణాయదియు, ౮. స; హ, ౯. మగళ, ౧౦. కై, ౧౧. మది
యు; మదీయు, ౧౨. ంప, ౧౩. న, ౧౪. గొరాయి, ౧౫. పర,
౧౬. వాతాళ, ౧౭. న్య, ౧౮. నది(వి), ౧౯. యయహూ(కా)
ళి, ౨౦. చెప్పినవచ్చం(జ్ఞి).

మదియుఁ దాహుత్తర యది భజవణియుఁ
జెలువగుభజనచే సిగనిలు¹పట్టు
లలిఁ బదియేను సాళగతాళగతులుఁ;
బ్రియమంది²నాగావతియును, ³నందావ -
తియు, వరభ⁴ద్రావతియు, ⁵వినయావ -
తియుఁ, జరభోగావతియును, నింద్రావ -
తియు, నాఁగ నాఁఋను దీప్తమై మించి,
యాళ⁶తులవి నిబద్ధానిబద్ధోక్తి
గౌళి వైదర్భి పాంచాలిరీతులను
మానంబులగు మంద్ర మధ్యతారములఁ
⁷దానాంగ తత్త్వాంగ తనులు దుల్కాడ
దేసియు మార్గంబుఁ దీటుకొనంగ
భాసురంబుగ దశప్రాణాదు⁸లులియ
⁹లలి రసవర్ణనాలంకారభావ -
ములు మృదుమధురసముచితోక్తు లలర,
¹⁰మున్నట ¹¹హార వేషములలో¹²నఁ బేరు -
గొన్న ¹³గాణలలోనఁ గుపితవేషమునఁ

---

౧. పట్టు, ౨. సౌగా, ౩. సందా, ౪. భద్ర, ౫. విస, ౬. తే, ౭. తానొంద, ౮. లోలయ; లవియ, ౯. లలితసౌవర్ణణ, ౧౦. మున్నను, ౧౧. నావేశ; హారవేశ, ౧౨. నువేరు, ౧౩. బాణల.

గంబళాశ్వతరాది గాణాధిపతులు
దుంబురు నారదాదులు ప్రీతిఁ బాడ,
నంగరాగంబు [1]గీతాంగరేఖయును
రంగశోభయు ముఖరాగంబుఁ దతము
వితతంబు [2]నిలయంబు విగతియు [3]నంస-
గతియు నావర్తన [4]గ్రహగతి లవణి
[5]దేసికారత[6]సభా ధీరధియును గ-
[7]ళాసంబు[8]సొక్కి సళానళి[9]భ్రమరి
యవధానమును సంధి[10]యను నొకవిధము
వ్యవసాయమును నిజవణియు [11]లంఘితముఁ
దాళ మభినయోపతాపనయును సు-
తాళంబును బ్రసన్నతయు వివర్తన[12]ముఁ
బయవాటము లలిత[13]నసయుఁ [14]గనిష్ఠ-
కయును[15]నప్పణము [16]బళయును గోమళక,
యుల్లాసమును, లలియును, మనోహరము,
డిల్లాయి, [17]దుత్తూణి, శేవణి, జంకె,

---

౧. గ, ౨. నిప, ౩. నంశ; సంశ, ౪. సంగ్రహగతి, ౫. దేశ, ౬. సుఖాదిరద (వ) యుసుసు (సుఘ) క, ౭. లాశంబు, ౮. బొక్కి, ౯. తి, ౧౦. యనియొక, ౧౧. లగ్గి, ౧౨. యు, ౧౩. క్రియను, ౧౪. గరిష్ఠ, ౧౫. నర్పణ, ౧౬. బల, ౧౭. తుకా, (ఖి) ణిశే (ఛే)వయు; దుఖాయి జేపయి; తూఖణి ఛ్రేపయు.

[౧]డాలంబు, [౨]శివళి, సౌష్ఠ[౩]వము, విభ్రమమ్ము[౬]
జాళి, యొయ్యారంబు, సరసంబు దనర
వరుసఁ జతుర్విధవక్త్రవిభ్రమముఁ
బారి సప్తవిధనిజభ్రూలతా[౪]టనము
షడ్వింశతిక్రమచక్షు[౫]రంకితము
షడ్విధనాసాలసత్కుంచితంబు
ఘనయుక్తి దశవిధకర్ణావధాన -
మును నవవిధగళముఖోల్లసనము
సురుచిర త్రివిధవక్షోవిలాసంబు
ధరఁ జెప్పనొప్పు పాదద్వయపంచ -
కంబు నూరుద్వయకలితపంచకముఁ
బంబి సుగతి, సమభంగి, త్రిభంగి,
యరుదగు వింశతి యంగహారములు
ధర నిఱువదిరెండు దానకంబులును
ఛత్తీసుదృష్టులఁ జౌషష్టిహస్తములు
*బత్తీసుచారులు భ్రమరులు నేడు

౧. శాళంబు, ౨. కరగి, ౩. ద, ౪. నటన, ౫. రిం, ౬. గ.

* 'బత్తీసు' అంటే ౩౨. కాని, సం. అనువాదములో "ద్వావింశతిమితచారిభిః" అని ఉన్నది. ౨౨ కు 'బాఇస్' అని ఉండవలెను; అట్లుంటే ప్రాస చెడుతుంది. సం. అనువాదము ప్రమాదమూ.

నొగిఁ గరణంబు లష్టోత్తరశతము
మొగి నూఱలంకారములు శిరోభేద -
ములు [1]పదుమూఁడును ముప్పదిరెండు
వొలువారు [2]దండనంబులు [3]నొప్ప హంస -
గతియును [4]మాతంగగతియును వృషభ -
గతియును మర్కటగతియును మేష -
గతియును మాయూరగతియును భోగి -
గతియును నాఁ బెక్కు గతులు వొల్పార
రంభ యాదిగ నప్సరస్సమూహంబుఁ
గుంభినీసతులలోఁ గూడి యాడంగ,
నాదట సుభ[5]యామరాచార్యలీల
నా[6]దధీచ్యుపమన్యు లాదిగాఁ గొలువఁ,
దక్కిన తాపసోత్తములలోఁ[7]గలిసి
మ్రొక్కుచు భృగుముఖ్యమునులు భజింపఁ,
బ్రమథు లప్పరి వీరభక్తసంఘంబు

---

లక మేమో! ఈపాదమునకు బదులుగా ఒక ప్రతిలో "చిత్తవిక్రియలు వచింప ముప్పదియు" అని ఒక అధికపాఠ మున్నది. దీనికి సం.లో అనువాదము లేదు.

[1]. పద, [2]. దం(డ; ద), [3]. నొప్పు, [4]. వాయస, [5]. యమతా, [6]. దధీచియుపమన్యులాదిగా; దధీచోపమన్యాదులు, [7]. దలఁచి.

రమణ నుబ్బుచు శివార్చనములు సేయ,
నాజనార్దనుఁడుఁ బయోజ[1]సంభవుఁడుఁ
బూజారితపసులపోల్కిఁ బూజింపఁ,
బ్రభుతరంబుగ[2]దానపతులలోఁ గలిసి
యిభముఖషణ్ముఖు లిఱుదెసఁ గొలువఁ,
జండాంశుసితకరజ్వలనతారక[3]ల-
ఖండదీపములలోఁ గలిసి వెలుంగ,
నారంగ నంది మహాకాళవిభులు
ద్వారపాలకులలోఁ దారును గొలువఁ,
గమనీయముగ మహాకర్తికచ్ఛత్రధరుల
రమణ నింద్రుండు ఛత్రముఁ బట్టి కొలువఁ,
బానరుచు బానసంబులవారిలోన
ననలుండు శాకపాకాదు లొనర్పఁ,
వాలాదుఁ బరితలవరులలోఁ గలిసి
చాలు[4]బళా యంచు జముఁడును గొలువఁ,
బరిచర్య లొనరించు[5]పడిహారు[6]లట్లు
గరమర్థి బడిపనుల్ నిబ్బృతి[7]యుఁ జేయ,
సమ్మార్జనము సేయు జనులలో వరుణుఁ

---

౧. నాభుండు; గర్భుండు, ౨. దాస, ౩. లు, గండ, ౪ చాలా, ౫. పణి, ౬. వట్ల, ౭. సేయంగ.

డిమ్ముల సమ్మార్జనమ్ము సేయంగఁ,
గసవులు దుడుచుచుఁ గింకరులలోఁ గలిసి
శ్వసనుండు సటమున్న కసవులు నూఁక,
భువిని మ్రుగ్గులు వెట్టుపుణ్యులలోన
నవరత్నముల మ్రుగ్గు నరవాహుఁ డిడఁగఁ,
దవిలి తాండవ మాడుతపసులలోనఁ
దవిలి యీశానుండుఁ దాండవం బాడ,
బాణాసురాది శుంభద్దైత్య వితతి
క్షోణీశ్వరులలోనఁ గూడి భజింపఁ,
బండితసత్కవిప్రవరులఁ గలిసి
చండకీర్త్యాదులు సంస్తుతుల్ సేయ,
[3]నరయఁ దక్కిన దానవామరముఖ్య -
గరుడ గంధర్వ కిన్నర సాధ్య సిద్ధ -
వరగణావళి[4]దొంటి [5]వరుసలవారి
[6]వరుసనఁ బనిసేయ భావనంబునకు
సురగిరిముఖ్యభా సురత[7]రగిరులు
[8]పురవరగిరి[9]శృంగముల క్రియఁ గొలువ,
సురతరుముఖ్యభా సురత[10]ర తరులుఁ

౧. మాడ, ౨. తినేయ, ౩. అరుదందనా, ౪. నొంటి, ౫. వరసల, ౬. పరుసల(న), ౭. గిరితతులు, ౮. పుర, ౯. సంఘ, ౧౦. వర.

## పర్వత ప్రకరణము

బురితరువరచయంబులలోనఁ గొలువ,
సురధేనుముఖ్యభాసురధేనుతతులుఁ
బురిధేనువులలోన [1]బెరసి కొల్వంగ,
సురమణిముఖ్యభాసురమణితతులుఁ
బురమణితోరణంబులలోనఁ గొలువ,
ఖ్యాతి భాగీరథీ గంగాదినదులుఁ
బాతాళగంగాను[2] బంధమై కొలువ,
నేడువార్ధులలోని యేడుద్వీపములు
వేడుకఁ బురివీథివీథులఁ గొలువ,
నాకాంక్ష ముప్పదియాఱుదత్త్వములుఁ
బ్రాకారహర్మ్యరూపంబులై కొలువ,
ముల్లోకముల[3]నాథు మల్లికార్జునుని
ముల్లోకములలో సమున్నతికెక్కు-
సచరాచరములు శ్రీశైలంబుమీఁది
సచరాచరాదుల చాడ్పునఁ గొలువ,
సుస్థి[4]తి మల్లికార్జునదేవదేవు
నాస్థాన మిట్లు[5]సెన్నారంగఁ బరుస
సంతసంబున ను[6]ఘే జయజయ యనఁగ
నంత సూర్యోదయం బయ్యె నెట్లనిన,-

౧. పొరిఁబొరిఁగొలువ, ౨. బద్ధ, 3. నాడు(దు), ౪. త, ౫. బెంపొ, ౬. ఘో.

సూర్యోదయ వర్ణనము

మందరకందరసుందరనియాత-
సుందరుం డగు సుకేశుని ననహ్యాముని
నొప్పమి సేసిన ¹తప్పున కలిగి
యెప్పాడి యిది యంచు నప్పురవైరి
నిప్పులు గన్నుల నుప్పతిల్లంగఁ
దప్పక చూచిన నప్పుడు ³ధరణిఁ
దాళఫలములు వాతూలచేఁ బడిన
చాళి ద్రొప్పన పడి జలజమిత్రుండు
వడి ఁడొల్లి ⁴డొల్లి శ్రీ వారణాసికిని
గడుఁ జిత్రమని నదుల్ గమిగట్టి చూడ
నప్పుడ పోయి యుద్యద్భక్తియుక్తిఁ
దప్పక శివునాజ్ఞఁ దలమోచి యచట
నవ్యయు నభవు బాలార్కేశనామ-
దివ్యలింగంబుఁ బ్రతిష్ఠఁ గావించి
చిరతపోనిష్ఠ భజించి మెప్పించి
⁵హరునిచేఁ దొంటిసూర్యత్వంబుఁ బడసి
భాతిగాఁ ద్రొల్లింటిపగిడిన భానుఁ
డేతెంచి యుదయాద్రి నెక్కినమాడ్కి

౧. తీ, ౨. నొడలికిన ౩. తరణి, ౪. తొల్లి, ౫. హరుచేత.

నంత సూర్యోదయంబగుడును బరుస
యెంతయుఁ బ్రీతితో నిట్లహర్నిశము
నవిరళమతి మల్లికార్జునుమ్రోల
శివరాత్రిపర్వంబు సెల్లుటఁజేసి
భావింపఁ దమతమభవరాత్రు లెల్ల
వేవిన క్రియఁ బ్రొద్దు వేవె లెండనుచుఁ
బాతాళగంగాడఁ బాటెడువారు
ప్రాతిగా శిఖరేశ్వరంబేఁగువారుఁ
బారణ సేయ నొప్పఁగఁ బోవువారు
నూరక తమతమ యూళ్లేఁగువారుఁ
దలఁపుల శ్రీపర్వత ప్రదక్షిణము
నెలమి సంకల్పించి యేఁగెడువారు
నలువసంతోత్సవము నొయ్యఁ జూచి
మఱికాని పోమని మసలెడువారుఁ
దప్పక పంచరాత్రంబున్కి సాలు
నొప్ప శ్రీగిరి కంచు నుండెడువారు
దండివిరక్తిమైఁ దత్పురంబునను
నుండెడువారునై యుండంగ నంతఁ

౧. తి, ౨. వేగ, ౩. శేగభజియించువారు, ౪. కల్పించుక, ౫. నేర్పు, ౬. కంచు.

బండితదోనయ్య వంచరాత్రంబు
లుండంగఁ దలఁచి సూర్యోదయవేళ
నలిఁ దీఁటుకొన మల్లినాథుసహస్ర
కలశాభిషిక్తునిగాఁ జేసి మఱియుఁ
డడయక పంచామృతస్నపనంబు
నెడ[1]నెడ ధారగా నెత్తి మ్రొక్కుచును
గ్రమమున నుష్ణోదకముల [2]గంధోద -
కములను మఱి జలకంబు గావించి,
సంధి[3]ల్లిఁ దడియొత్తు శంభున కిచ్చి
బంధురాంబరమహాభరణముల్ వాస్చి
ఖ్యాపితభక్తి నక్షత గంధ పుష్ప -
ధూపదీపాదు లుత్సుకత నొనర్చి
యంచితప్రీతి మహానివేద్యముగఁ
బంచభక్ష్యాదు లేర్పడ సమర్పించి *
శిష్ట సద్భక్తరాజికి[4]గండు[5]మీఱు
నిష్టాన్నపానాదు లెలమి[6]సంధించి

---

౧. ధూపదీపాదులెత్తి, ౨. గంగోద, ౩. ల్లితడి, ౪. గూడఁ; ప్రేమ, ౫. నట్లు, ౬. నర్పించి.

* ఈ పాదముతరువాత "మంచిగంగులపాలు మరలనర్పించి" అని ఒకప్రతిలో అధికపాఠ మున్నది. దీనికి సంస్కృతానువాదము లేదు.

కర్పూరసహితంబుగా విడియంబు
లర్పించి [1]నవ్య పుష్పాంజలు లిచ్చి
వరుస వేవేమాళ్లు వలగొనివచ్చి
హరుఁ బెక్కుభంగుల నభినుతింపుచును

దోసమరాజయ్యకు మల్లికార్జునుఁడు ప్రత్యక్షమగుట

గనుమూయునంతన కలయనుబోలెఁ
దన చేయు భక్తితత్పరతకు మెచ్చి
మదనసంహారుఁడు శ్రీమల్లికార్జునుఁడు
వొదలుచు వృద్ధతపోధనులీల
యరుగుదేరఁగ శరణార్థి సేయుచును
గురుమూర్తి దనయొద్దఁ గూర్చున్నఁ జూచి,
"యెటనుండి[3]వచ్చితి [4]రేయూరు మీర
లిట యేఁగుదెంచితి రెంతగాలంబు"
నావుడుఁ దపసి "దోనయ[5]గారే మీరు
శైవలోకమున[6]కాచార్యుఁడు వండి-
తారాధ్యవిభుఁడు [8]లెస్సైయున్న వాఁడె
వారును మేముఁ బూర్వస్నేహితులము
నా పండితుండు [7]మేలై కూర్చు మాకు

1. సవ్య, 2. టగల, 3. వచ్చెద, 4. మఱెంత, 5. గారు మీరె, 6. నా, 7. మేలై, 8. లెసైన.

మా పేరు సర్వజ్ఞమల్లికార్జునుఁడు
ననయంబు [1]సిరిగిరియందటు గూడ
వనముల గిరుల [2]దుర్ద్వారకాంతార -
ఘన [3]బిలాంతరమహా గహ్వరంబులను
నునికి యీ శివరాత్రి యొప్పఁ జూడంగ
నరుగుదెంచినవార" మనుడు దోనయ్య
గరపద్మములు మోడ్చి "ఘనుఁడ! సర్వజ్ఞ!
చూచిన మునువిన్న చోద్యముల్ గలుగు -
నా చెప్పఁ జూడ శ్రీనగమున" ననుడు
రమ్మని దోనమరాజుఁ దోడ్కొనుచుఁ
గ్రమ్మర బిల్వవనమ్ము[4]మధ్యమున
సరసత నందొక్క శైలశృంగమున
విరచింపఁజను దీపవృక్ష మెక్కించి
శిరమునఁ జేయిడి శ్రీగిరిఁ [5]జూడ
*గరతలామలకమై కానవచ్చుచును

---

౧. శ్రీ, ౨. దద్వార, ౩. గుహాం, ౪. మధ్య, ౫. గూడ.
* "హస్తస్థబిల్వవత్" అని సంస్కృతానువాదము.
(ఈ పాఠమువల్ల అఖండయతి తొలగిపోతుందిగాని, 'చూడ' అనేపదము రెండుసార్లు నిరర్థకముగా వస్తుంది. ఒక 'చూడ'ను పరిహరించడానికి పాఠాంతరము చిక్కలేదు. అఖండయతి సోమనాథునికిష్టమైనట్లు ఇతరస్థలములలోఁ గూడా ప్రయోగము లున్నవి.)

సమ్భృతాక్రాంతాత్ముఁ డగుచు దోనయ్య
సద్భక్తిఁ దపసికి శరణార్థి [౧]నేసి
“నెడనెడ నేఁగంగ నేఁటికిఁ జూడఁ
బడసితిఁ [౨]బర్వతం బంతయు నేఁడు”
ననుడుఁ దపోధనుం “డద్దేవుపురము
ఘనతరంబగు హేమకలశముల్ గుల్లఁ
గోటలుఁ గొమ్మలు గోపురంబులును
[3]నాటకూటమ్ములు నామల్లికేశు
ప్రాసాదమును మంటపంబును క్షేత్ర-
వాసులై చనుభక్తవర్గంబుఁ జూడు,
హాటకేశ్వర మదే యందు సద్భక్తిఁ
బాటికెక్కిన వీరభక్తవర్గంబు
వీరశంకరుఁడును వీరభద్రయ్య
వీరభోగయ్యయు వీరదేవయ్య
మలహార[౪]సద్భక్తి మతి గల్గినట్టి
ఫాలతి [౫]చాకలదేవి [౬]పారిఁ బ్రభాతయ్య
మఱియు వీరాదిగా మహితసద్భక్తి
నెఱిఁ బ్రతిష్ఠించిన నిష్ఠులఁ జూడు,

౧. యగుచు, ౨. జూడ శ్రీపర్వతం బెల్ల. 3. మాటకూటంబులు మల్లికార్జునుని. ౪. రు, ౫. షాడ్డల, ౬. భోగదేవయ్య.

శిఖరేశ్వరముఁ జూడు శ్రీనగేంద్రంబు
శిఖరంబునను ముక్తిశిఖరమై వెలుఁగు
నిష్టకామేశ్వర మిల్లిదే చూడు,
మష్టసిద్ధులకు నిజావాస మిదియు
నేడుదినంబు లయ్యీశు భజింప
వేడుకఁ గామ్యార్థవిభవంబు లొసగు

కర్మహరి మహిమ

నిదె చూడు కర్మహరేశ్వరం బనఁగ
మదనాంతకుండ[1] తన్మహిమ యెఱుంగు
నచ్చారుశృంగంబునం దొక్క పాము
చచ్చి తద్దేహంబు పుచ్చియున్నెడను
నఱిముఱి నొక గ్రద్ద య[2]పాము[3]శవము
గఱచికొంచును దీవ్ర[4]గతి మీఁది కెగయ
వాతోపహతి నందు వడి రెండుపువ్వ
లేతెంచి కర్మహరేశ్వరంబందు
వడి జలంబులలోనఁ బ్రాణముల్[5] విడిచి
పుడమి బల్లహువంశమునఁ బ్రభవించి
యాపుణ్యఫలమున నతివయుఁ బతియు

1. మదనాంతమహిమ; గుండు దన్మహిమ, 2. య, 3. పాపశ(స)బము, 4. సుతీవ్ర, 5. విడువ.

నై పూర్వ¹జన్మంబు ననిలోపహాతిని
గర్మహారేశ్వరోద్గతసరసీవి -
నిర్మలవారి మునింగి చచ్చుటయుఁ
బ్రవిమలతత్పుణ్యపటుఫలప్రాప్తి
భువి బల్లహునివంశమునఁ²బుట్టుటయును
జాతిస్మరత్వానుసంధిగాఁ జేసి
యీ తెఱంగంతయు ³నిద్దఱు నెఱుఁగి
వేగంబ సకలనియోగంబుఁ గొలువ
శ్రీగిరి కేతెంచి చెలువయుఁ దాను
బల్లహుఁ డత్యంతభక్తిసంయుక్తి
మల్లికార్జున మహామహుని దర్శించి
భాసురదివ్యప్రభా⁴భాసురముగఁ
బ్రాసాదమును మండపంబు బౌనసము
మఠముఁ దదంతికమఠముగా నొక్క-
మఠముఁ⁵గల్పించి యీ మఠము నిండంగ
మరకతముక్తికమణిపుష్యరాగ -
వరవజ్ర విద్రుమ వైడూర్యముఖ్య-
భూరిరత్నావళుల్ ప్రోకలు వోసి

---

౧. జని యంత, ౨. ప్రభవించి, ౩. నిరువురు, ౪. భాసితముగ, ౫. గట్టించి.

చారుషోడశవర్ణసంపూర్ణ మైన
ప్రతిలేని తనయింట బండరుధనము
శతసహస్రార్బుదసంఖ్యను నిలిపి
వివిధా¹భరణములు వివి²ధాంబరములు
వివిధవస్తువులును వివిధమాల్యములుఁ
గనకచామరములుఁ గనకకుంభములుఁ
దనరారు నా సుగంధద్రవ్యములును
స్వర్ణోపకరణముల్ స్వర్ణపుష్పములు
స్వర్ణభాండమ్ములు సకలవాద్యములుఁ
గనక³చామరహార్తికచ్ఛత్రవితతు
లును సర్వసంపదలును నివేదించి
యతిశయకరితురగాందోళరథవి-
తతులు గోమహిషీప్రతతులు నొప్పించి
మంత్రులు విబుధు లమాత్యులు నీశు
మంత్రులు విబుధు లమాత్యులు గాఁగ
భృత్యులుఁగరణముల్ ⁴ప్రెగడలు నీశు-
భృత్యులుఁగరణముల్ ⁵ప్రెగడలు గాఁగ
బండరు⁶గొట్టరుబానిస లీశు
బండరు⁶గొట్టరుబాని⁷సల్గాఁగఁ

౧. ంబరంబులు, ౨. భవస్తువులు, ౩. ధ్వజములు ముక్తావితా
నంబు, ౪. ప్రెగ్గడ లీశ, ౫. ప్రెగ్గడల్, ౬. గొత్తరు, ౭. సల్.

గలవర్లు లెంకల్ ప్రధానులు నీశు-
గలవర్లు లెంకల్ ప్రధానులు గాఁగ
హితులు నాప్తులుఁ బురోహితులును నీశు-
హితులు నాప్తులుఁ బురోహితులును గాఁగ
గాయకుల్ నర్తకుల్ గవివరు లీశు-
గాయకుల్ నర్తకుల్ గవివరు ల్గాఁగఁ
బండితుల్ దార్కికుల్ వాకకు లీశు-
పండితుల్ దార్కికుల్ వాకకు ల్గాఁగ
దాసులు బంట్లు విలాసిను లీశు-
దాసులు బంట్లు విలాసినుల్ గాఁగ
దండనాయకులును [1]దంత్రులు నీశు-
దండనాయకులును [2]దంత్రులుఁ గాఁగఁ
బౌరాణికులు శివపౌరాణికులుగ
ద్వారపాలురు శివద్వారపాలురుగ
ఘనకీర్తి వెండియుఁ గలుగుబాహ్య -
రిని యోగమును నతిప్రీతి నర్పించి
ఘనభక్తు లక్కజం బని యెన్న వేయ
నన నేల తానును నతివయుఁ దక్క-
నట్టు గూడఁ [3]దనదేశ మంతయు నపుడ

---

౧. తంత్రంబులీ(నీ), ౨. తంత్రంబు, ౩. గాదేశ.

పటుభక్తి నీశ్వరార్పణము గావించి
తరుణి నీక్షింపఁ [1]దత్సతియును నట్ల
[2]యరసి మతంబున [3]న [4]క్క మతము
వెండి కట్టించి యన్విభుఁ [5]నకుఁ దనదు
బండరు నఖిలసంపద్వస్తుసమితి
యఖిలరత్నావళు లఖిలాంబరములు
నఖిలాభరణములు నందు వెట్టించి
ముక్కంటి శరణంచు ముగుదయుఁ దాను
నొక్కచీరయుఁ [5]గట్టి యొగి బల్లహుండు
"ఘోర దుర్వార సంసార వారాశి
పారమొందింపు మో [7]పర్వతనాథ!
పాయనిదుష్కర్మ[8]పాశబంధములు
గోయవే దేవ శ్రీ కుధరాధివాస!
యెల్లగాలము నిట్టు లిరువు[10]రపనులు[11]
సెల్లించుకొనవయ్య! [12]సిరిగిరినాథ!
[13]వలింగ[14]వీరు నా వా[15]రని[16]మమ్ము

---

౧. నత్తరుణియు నట్ల, ౨. యరుసు, ౩. నం దొక్క, ౪. నట్టి. ౫. గట్టనొగి, ౬. మేధింపకే, ౭. పార్వతీ, ౮. పాప, ౯. నాశ, ౧౦. రు, ౧౧. ల, ౧౨. శ్రీ, ౧౩. మరువకు మిమ్ము మామ దిలోన మమ్ము, ౧౪. వీను, ౧౫. డు, ౧౬. నన్ను.

మఱవకుమయ్య శ్రీ మల్లినాథయ్య!
యిల వేయు నెన్నంగ నేల నాయిచ్చ
సలుపు మోజియ్య! శ్రీ శైలవల్లభుఁడ !"
యనుచు దేవియుఁ దాను "సాష్టాంగ మెరఁగి
చనుదెంచి యెక్కినచౌదంతితోన
యెసపక కర్మహాశేశ్వరంబందు
బడియు గౌరీశుగర్భము సిందు సొచ్చి,
బల్లహుండు శివుని భజియించునపుడు
నల్లలితాంగియు శంభుని దలఁచు
[3]భవు భర్గు నీశుని బార్వతీపతిని
శివు నభిషేకంబు నేసినయన్ని
పాలీప్రదంబులోపల నూట వెడలఁ
బాలూట్ల యన భువిఁ బరగెఁ దా మఱియు
బడి కామితార్థముల్ వడసినవార
లడర ననంతంబు లట్లును గాక
యమ్మోఁడుశృంగంబులందును భూరు -
హమ్ములు మూఁడున్న వవి యవె చూడు,
నరుఁ డెవ్వఁడే దర్శనం బాచరింప[4]

---

౧. న, ౨. ందచొ, 3. భవహరుండైన శ్రీ పార్వతీరమణు,
౪. చు.

నరిదియాకారత్రయంబు సిద్ధించు,
నొకచెట్టుమొదల నం దొకచెట్టునడుమ
నొకచెట్టు తుదియు నుద్వృత్తి నుట్టినను
ధర స్వర్గమర్త్య పాతాళలోకముల
చరితంబు లెల్ల నిశ్చయము గాన్పించు,
నొకచెట్టుమూలంబు నొకచెట్టుపత్ర
మొకచెట్టుపుష్పంబు నొగి ధరియింప
హూఢి[1]బ్రహ్మోపేంద్ర రుద్రు[2]లిమ్మోల
వేడుక నేప్రొద్దు విహరింపుచుండు,
నొకచెట్టుకాయయు నొకచెట్టుపండు
నొకచెట్టుబీజంబు నొక్కట నమలఁ
దివుట నుత్పత్తి స్థితి లయముల్ దక్క
శివపురంబున నుండు శివగణలీలఁ
గామించి యెవ్వఁడేఁ గాలత్రయంబు
నామూఁడుదరువుల నాహార ముడిగి
నలి మూఁడు నేసిదినము లాగమోక్త
కలితోపచారసంగతి భజియింప
సాహూప్యసామీప్య సాలోక్యమహిమ
లారంగ సిద్ధించు నదె [3]శివమహిమ

---

౧. బ్రహ్మవిష్ణు, ౨. లోన, ౩. వారి.

దా నెట్లు గాన్పించె దఱువు లంటేన్ని
మానక ఫాలూ౧ట్ల మల్లికార్జునుని
నిత్యంబుఁ బా౨లను నేతఁ బెర్గువనము
ప్రత్యేక మవి౨యు ముష్పందుము నందు
సెలువార జలకంబు సేసి, సహస్ర
కలశాభిషేకంబుఁ గావించి³,గో౪గుఁ
బూ౫వులుఁ దామరపూవులుఁ గలువ-
పూవులు వేయేసి పూవులు, గుగ్గు-
లమును మూఁడేసి౬ఫలంబు లర్పించి
ప్రమితి వేయేసి హారతు లర్థి నెత్తి
పాయసంబులుఁ బంచభక్ష్యముల్ షడ్ర-
సాయతాన్నములు సమర్పణ సేసి
యాసక్తిమూలపంచాక్షరి మూఁడు
సేసి ౬వేలుజపంబు సేయంగమూఁడు
దినముల కీశుండు దివ్యదృష్టియును
ఘనతరజ్ఞానంబుఁ గరుణించునపుడు
గానంగవచ్చు వృక్షత్రయం బందు
దా ననేకములు సోద్యములు వెండియును

---

౧. ట, ౨. య, 3. శాంగు, ౪. శ, ౫. మ, ౬. జపంబులు.

ననుపమబిల్వవనాంతరంబిదియు
విను పంచయోజనవిస్తీర్ణమందు
త్రేలెంట నొక్కొక్క వృక్షంబు గలదు
గ్రాలు దివ్యౌషధాకారంబు లవియు,
నల్లెంట నొక్కొక్క నవలత గలదు
సెల్లుసాధకనిజనసేవ్యంబు లవియుఁ,
జుట్టెంట నొక్కొక్క చోద్యంబు గలదు
నెట్టన్నవారికి నెఱుఁగంగరాదు,
జేనెంట నొక్కొక్క శివమూర్తి గలదు
దా నభిమతఫలదత్తంబులవియు,
మూరెంట నొక్కొక్క మునిపల్లె గలదు
భూరిశ్రుతిస్మృతి స్ఫురితంబు లవియు,
జేతెంట నొక్కొక్క సెలయేఱు గలదు
ఖ్యాతదివ్యాంగనాకలితంబు లవియు,
బారెంట నొక్కొక్క పర్వత ముండు
నారూఢి దివ్యరత్నాంగంబు లవియుఁ,
గూరెంట నొక్కొక్క కూటంబు గలదు
యోగీంద్రసిద్ధినియుక్తంబు లవియు,
నంతంత నొక్కొక్క హర్మ్యంబు గలదు

---

౧. బ, ౨. ఘన, ౩,౪. నొక్కొక్క.

సంతత ప్రమథ ప్రచారంబు లవియు,
బాటెంట నొక్కొక్క భవనంబు గలదు,
మేటివిరక్తుల కూటంబు లవియు,
నామట నొక్కొక్క [1]యధ్వంబు గలదు
గామితలోకసంకలితంబు లవియు,
నదియునుగాక ఛాయాచ్ఛత్రమనఁగ
మొదఁ[3]లు ప్రాఁకున లేదు, [4]మొగులును లేదు
నదపడి యా నీడపై బాళునరుల
కొదవంగఁ గలవు నిష్టోపభోగములు,
దరు లిదే చూడు మిత్తఱి నీడ లేదు
ధర నదృశ్యకరణి దానిమూలంబు
మోహినీగజ మదె ముందఱి దెస స-
మాహితపృథులశి[?]లాకారగజము,
సాధకుఁ డెవ్వఁడే సాధించి యెక్కఁ
గ్రోధిల్లఁ జను నెట్టుకొను రభాళి నేయుఁ
గుప్పించు నుఱుకుమై నొప్పించు ననువుఁ
దప్పింపఁ దల వంచు నుప్పరం బెగయుఁ
బ్రల్లన యల్లంతఁ బడుఁ జిఱ్ఱదిరుగు

---

1. యాద్య, 2. వృక్ష, 3. లు తుదయును; లమ్రాపలు, 4. మొగుడును; మొదలును; మోసలును, 5. డు, 6. టి. 7. వా.

నల్లార్చు ఘిల్లుఘిల్లను 1బాఱుదాఱు,
నిట్టు విజృంభించి యీటయాట నడఁగ
బిట్టోడి 2యలుఁగక బెగడక చనక
3తలఁగక 4తలరక తల్లడపడక
5యలుగక లెక్క-సేయక డిల్లపడక
వ్రాలక కొంకక వడఁకకయున్నఁ
గ్రాలుచు మోహినీగజ మంత మెచ్చి
సర్వసిద్ధులు నిచ్చు సాధకులకును,
గుర్వీగా మటిమెల్ల గుధరంబు లీవు
నీవనమధ్య మహీధరాగ్రమున
భావించి చూడు బిల్వావనీరుహము
నామహీజముక్రింద నదె బిల్వవన శి-
రోమణి బిల్వేశ్వరుని శివాలయము
సాధకుం డద్దేవు సప్తరాత్రము ల-
బాధితనిష్ఠమైఁ బాయక కొల్చి
భవుదీపతైలసం7భావితాంజనముఁ
దిగిరి తాల్పఁగ దివ్యదృష్టి వాల్పారుఁ
గామారినగరోపకంఠ దేశమునఁ

౧. బాఱుదాఱు; తారుదారు, ౨. యలకక; యులు, (డు)కక,
౩. తరగగ, ౪. తలకక; తరలక, ౫. ఱెఱు, ౬. ల్వ, ౭. పాది.

దామఱి యొక్క దద్దడ[1]ముండు నందు-
లో నొక్క క్షేత్రపాలుని[2]స్వరూపంబు
గానంగ మఱిదానిలోన భైరవుఁడు
నెడనెడ సాధకుం జేతేరఁ దాను
గుడియుఁ బెర్గుచు నుప క్రోధోత్కటాగ్ని
ముక్కునఁ బొగలు సముద్ధతి వెడల
నెక్కొన్న మొగమున నిప్పులు రాలఁ
గర ముబ్బి మంటలుఁ గన్నుల గ్రమ్మఁ
జెరలుచు దేహంబుఁ దెకతెక నుడుక
మూవలగంటల మ్రోఁత నొక్కట ది-
శావలి యద్రువఁ జా[3]చా యని చప్ప-
రించుచు నొరలుచు రేఁగుచుఁ [4]దత్త-
రించుచు రాకురా కంచును గహక-
హాట్టహాసధ్వను లద్రులఁ జెలఁగఁ
గట్టురువడి భీతి [5]పుట్టింపనిలువ
కా భైరవుని భీకరాకారమునకుఁ
దా భయంపడక సాధకుఁడు నవ్వుచును
నుబ్బుచు నార్చుచు [6]నురువడించుచును

---

౧. మున(ను)నంము, ౨. శరీరంబు, ౩. ఝూంఝూ, ౪. దప్ప, ౫. పు, ౬. నుర.

బొబ్బలు వోడుచుచుఁ బొంగుచు మాఱు
గబ్బ[1]రించుచుఁ గలఁగకు గల్గ కనుచు
నిబ్బరం బాడుచు నిక్కుచు [2]సంత
గ్రబ్బేల యనుచును [3]గచ్చించుకొనుచు
నబ్బితి నా కంచు నట ని[4]ల్వు మనుచుఁ
బఱతెంచి యెగసి యా ప్రతిమశిరంబు
నెఱ పింతయును లేక విఱుఁగఁదన్నుడును
ధర ఖిట్టిపడి యంత శిరము నవ్వుచును
బిరుదులబిరు దన పృథు[5]శౌర్యమునకు
సత్వంబునకు సాహసమునకు నిర్భ-
యత్వంబునకు నుదారత్వంబునకును
మెచ్చితిఁ దల[6]కీలు వృచ్చితి మార్గ
మిచ్చితి బిల మిప్డు[7] సొచ్చితి [8]గాన
యిక్కడ నన్ను జయించినపిదప
నెక్కడి దెక్కడి యెదు రింక నీకు
వారక నాగళద్వారంబ బిలము
ద్వారంబుఁ జొఱుచొఱు దడయకయుండు
నల్లన బిలములోఁ [9]తరసెద ననక

---

౧. లిం, ౨. నిం; ౩. కచ్చించు, ౪. లు, ౫. కా, ౬. కిలు, ౭. ప్డచో, ౮. గాక, ౯. న.

యెల్లన ధరఁ జేతు లూ[1]నెద[2]నక
మెల్లన తా[3]పలు మెట్టెడ[4]ననక
ప్రల్లన [5]యుగుక కపాయ పూ ననక
తల[6]లేని భైరవు దండిరుండంబు
గళగహ్వారం బాదిగా లోఁతు నూఱు
మఁగనిల్వువెడలుపు మఱి తత్సమాన
మగుబిలముఖమునం దఱిముఱి నుఱికి
యంత దక్షిణముఖంబై యేఁగనేఁగ
నంతకంతకుఁ జాల నన్నువమైన
బిలమున కడ్డంబు వెట్టినయట్టి
తలుపుభావమున నంతకు మున్న వచ్చి
కుపితవేషంబునఁ గుటిలభైరవుఁడు
దపసియైయున్న సాధకుని వీక్షించి
యిటనుండి పొదపొద [7]యిట్లు గాదేని
యిటయొండె రమ్ము దె ర్వెమ్ము లెమ్మనుడు
'నేల[8]నా [9]కొడుక నీ కింత దల్లడము
సాలిమిఁ జూడు నీ సాధకత్వంబు
నిటుగాని నీబిరు దెఱుఁగంగ [10]రాదె

---

౧. డె, ౨. మ, ౩. వు, ౪. మ, ౫. నులుక, ౬. లని, ౭. మట్లురాలేని; యెట్లుపోలేని, ౮. యా, ౯. కొడక, ౧౦. రాదొ.

కటకటా! శరణార్థి గలచె జిహ్వాకును
గరములు వంగవే శిరము¹చక్కటికిఁ
బరమదారిద్ర్యమే భక్తి సిమ³త్రికిఁ
దపసుల మేము పెద్దలము వెక్కేఁడు
లుపవాసము⁴లు వాయ కున్నార మిచట
మము లేబరము సేసి మఱిపోయి పడయు
నమరత్వమైన నీ కది మంచియదియె
యింతన పడసి⁴తే యిష్టార్థసిద్ధి
యంతరం బెఱుఁగ⁶వె యది యేల వేయుఁ
జెప్పెద నామాటఁ జెవియొగ్గి వినుము
నిప్పటియట్లకా దిటమీఁద మనసు
నదె పులిముందఱ నడ్డమున్నది²యు
యిదె నూఱుమగనిల్వు లీయున్న బిలము
మున్నువెనుక⁸గోట్టు ముందఱ నూయి
నున్నచందమునఁ గా⁹హ్యం బున్నయదియు
దిగనుర్కవచ్చుఁబో డిగ్గుదు గాన
మెగయ నూర్మగనిల్వు ¹⁰లె ల్లెక్కబిలము
దరులు ముందఱ లేవు దాపలు లేవు

---

౧. కరుసె, ౨. చంగ, ౩. ది, ౪. లఁబా, ౫. తో, ౬. వ, ౭. యె; యొ, ౮. ద(గఁసు)రు, ౯. ట్లను; ట్లున్న.

నరయ లోఁ తెంత దా నంత వెడల్పు
వోరాదు వెన్కకుఁ బోక ముంద[1]ఱికిఁ
బోరాదు బిలములఁ బోయెద మనినఁ
బూని నీ వీప్రొద్దు పూజించులింగ
మీని[2]వి యీబిలం బీనోపునయ్య
పృథివి సద్భక్తు లేబిలములు సొచ్చి
ప్రథితదృష్టాదృష్టఫలసిద్ధిఁ గనిరి
పర్వత[3]కల్పంబుఁబట్టియే యింక
గర్వించి తలక్రిందుగాఁ బడియెదవు
గుడిచె[4]డు కట్టె[4]డు కొమరుఁబ్రాయమునఁ
గొడుకొ[5]యిచ్చట నేమి గుడువ వచ్చితివి
సలమున వచ్చితి సావన[6]కాక
యిల నిష్టసిద్ధుల[7]కిదియె శ్రీగిరికి
బిలము సతుర్ద్వార బిలమును వృషభ-
బిలమును ఖేచరబిలమును బాప
బిలము నాదిగ గిరిఁ బేర్కొన్నబిలము
లెలమి నిర్వది[8]వేలు నేణ్ణూఱు[9]గోట్లు
భుక్తిప్రదస్థానములు నూఱుగోట్లు

౧. టి, ౨. జి. ౩. త, ౪. డి, ౫. య, ౬. గగాక, ౭. ని, ౮. కోట్లు, ౯. నందు.

ముక్తిప్రదస్థానములు [1]వేయుగోట్లు
నలరి యేకైకకార్యప్రదస్థాన-
ము లనంతకోటులు గల వందులోన
విను కొన్ని బిలములు విస్తరించెదను
జనువాఁడ వెట్లును జనియెదుగాక
యనవుడు [2]మూర్ఖత నరుగంగ నేల
ననుచు నాకర్ణింప నభిముఖుం డగుచుఁ
దపసి సెప్పఁదొడంగెఁ దా నొక్కనాఁడు
విపినాంతరంబున విహరింప నంత
నొలసి తదీయవనోపకంఠమునఁ
బాలుపారుకొలనిలో బుగ్గన పొడిచి
దివ్యాంగదీధితుల్ దివ్యాంబరములు
దివ్యాభరణములు దివ్యచిహ్నములు
నుల్లసితంబుగా నురమున నొ[3]ప్ప
మల్లెపూవుల పెక్కుమాలిక లమర
మసలక పసిఁడిదామర లిఱుగేల
నసలార నిడి మల్లికార్జునదేవు
పురముది క్కేఁగ నేఁ బోయి, యాయయ్య
చరణాబ్జముల[4]మీఁదఁ జాఁగిలి మ్రొక్కి

---

౧. నూఱు, ౨. మూర్ఖపన; మూర్ఖునైయ, ౩. ప్పు, ౪. మోవ.

[1]వరవనాంతరసరోవరమధ్యమమ్మునఁ
గర ముద్భాసించినకారణం బేమి?
నరుఁడవో నీవు కిన్నరుఁడవో భక్తి-
పరుఁడవో ప్రచ్ఛన్నహరుఁడవో ప్రమథ-
వరుఁడవో పాతాళచరుఁడవో యమృత-
కరుఁడవో తరుణభాస్కరుఁడవో తొంటి-
మరుఁడవో దానవేశ్వరుఁడవో వజ్ర-
ధరుఁడవో యొక్క నిర్జరుఁడవో చెపుమ,
యేలోకముననుండి యేఁగుదెంచితివి
యేలోకమున కింక నేఁగెద వనుఁడు
వినుము తపోమూర్తి విస్మయం [3]బొకఁడు
వినవయ్య నాపోవువిధ[4]ముఁ జెప్పెద[5]ను

కరవీరునికథ

కరవీరుఁ డనఁగ రాక్షసవిభుం డొక్కఁ
డరుదరు దనఁగ నీ యచలంబునందు
రతిఁ గరవీరేశ్వరం బనఁ బ్రమథ-
పతిఁ బ్రతిష్ఠించి తపంబాచరింప
హరుఁడు ప్రత్యక్షమై యడుగుఁడు మనిన
వరదాని వేఁడొండు వరము నేనొల్ల

౧. పర, ౨. గు, ౩. బొందు, ౪. మెట్టులనిన, ౫. ము, ఁ.ద..

భువిని నీసర్వాంగములును ధాతువులు
వివిధసూక్ష్మస్థూలవృతరూపములు
గావించి తత్సముద్గతపుష్పవితతి
నీ వెప్పుడును బ్రియాన్వితుండవై తాల్పు,
మందు గించిద్దళంబైన నిన్నుబూన్ప -
[1]నొంద దేవేంద్రత్వ మొసగు మర్త్యులకు,
నటుగాక యీపుష్ప మంతయు నొకఁడు
పటుభక్తి మీపదాబ్జములపైఁ బూన్ప
మఱి పూర్వజన్మసమాధులు లేని
నెఱిముక్తిఁ గలిగింపు, నిజ మట్లుగాక
యొకపూవు నినుబూన్ప నొరునైనఁ బనుప
[3]సకలతురంగకుంజరసహస్రములు
ధర వాజపేయశతంబు[4]ల శ్రుతుల
నరుదగుకోటికన్యామహాదాన
ములఫలంబులఁ బొంద ముక్కంటి యొసగు,
బిలిబిలివరములు బ్రియము గా వనుడు
నసమాక్షుఁ డొసగె న ట్లది యాదిగాఁగ
వసుధ నీ కరవీర[5]పన మొప్పె మఱియు

౧. నొందు, ౨. బ్జంబులఁబూన్ప 3. సకలేశమత్తకుంజర, ౪. లు, ౫. వరముప్పినదియు.

నావిర్భవంబయ్యె నఖిలలోకము[1]లఁ
గావింపఁ జను బహుకరవీరజాతి
యకృతాత్ములకుఁ గాన నరిది యివ్వనము
సుకృతాత్ములకుఁ గాన సులభ మివ్వనము
వ్వాని నీప్రాప్తసపుణ్యఫలమునఁ
గానంగనయ్యె నీ కరవీరవనము,
నట్టునుగాక దివ్యాంజన[2]లతిక
మెట్టినవాఁడ [3]వీ మేదినిమీఁద
నెట్టిపుణ్యుఁడవో నీ విచ్చోట నుండఁ
గట్టెదురను మున్ను గానంగఁబడియెఁ
గడలకు మీ వింకఁ గదలితివేనిఁ
[4]గదిసి చూచిన [5]మమ్ముఁ గానంగరాదు,
నది గరవీరమహత్త్వ మీకొలని
విదితప్రభావంబు విను తపోధనుఁడ,
యరుదగు సురదీర్ఘికాంశ మీకొలను
వరగ భాగీరథిపాయ యీకొలను
నివుదు [6]భోగావతినిట్ట యీకొలను
ధ్రువము గోదావరిత్రోవ యీకొలను

---

౧. లు, ౨. తిలక, ౩. వే, ౪. కదలి; కదిసి, ౫. మము, ౬. భోగవతిని.

వరకుండతీర్థాలవాల మీకొలను
సరి మల్లికాకుండసరసి యీకొలను
పెనుపారు జలదుని బీజ మీకొలను
ఘనకీర్తి శివపూళిగంగ యీకొలను,
యిందుల పద్మంబు లీశుఁ బూజించి
సుందరి దేవకి సుతుఁ గృష్ణుఁ బడసె,
యీతామరల శౌరి యీశానుఁ బూన్చి
ఖ్యాతిఁ జక్రంబును గన్నను బడసె,
సరసిజగర్భుఁ డీ సరసిలో నొక్క
సరసిజంబునఁగాదె సంభవంబయ్యెఁ,
గరపద్మములఁ ద్రోడి నీకలువలు గారి
సరిఁ దాల్చు లీలాంబుజము లివి గావె ?
తరణి యీపద్మమిత్రతఁజేసి కాదె
స్ఫురితతేజోవృద్ధిఁ బొదలె లోకముల ?
నీపద్మములఁగాదె యింతి యాగొంతి
వాపారిఁ బూజించి పడసెఁ బాండవులఁ ?
జెంది యీపద్మముల్ శివుఁ బూన్చికాదె
సుందరి భృగుపత్ని శుక్రునిఁ బడసె ?
నదిగాక యీవిరుల్ హరుఁ బూన్చికాదె

౧. కోటి, ౨. కవలుగా, 3. కుంతి, ౪. పూలు, ౫. స్వర్గా.

సుదతి కౌసల్య¹ సత్సుతు రాముఁ బడసె ?
హరు నిందు భ్రమరాన్వితాబ్జంబుఁగాఁచె
ధరఁ బూన్చి శశి సత్రి దనయుగాఁ బడసె ?
భామలు శుభవేళఁ బాడెడునట్టి
తామరవిరులు సీతామరల్గావె ?
వసుధఁ బుణ్యులకు సువర్ణ³ పద్మములు,
వసుధఁ గర్ములకుఁ గేవల మంబుజములు,
ధృతిఁ బుణ్యులకు నివి దివ్యతీర్థములు,
క్షితిఁ ⁴గర్ములకు నివి కేవలోదకము,
సన్నుతి నిందుల జలచరావళులు.
నెన్నిచూడఁగ⁵ వేత్ర హేతువు⁶లవియె
హరివేరి మత్స్యకూర్మాదు లీకొలను
చరజీవులకు మన్మ సంతతి యగుట
మహి నిట్టి పసిఁడితామర⁷ల యీకొలని-
మహిమఁ జొప్పితి నింక మత్ప్రక్రియ వినుము,
పుట్టితి శాంకరీపురవరంబునను
నట్టినామము వురి కగు⁸డేమి యనిన
నొలసి బాలక్రీడ లోలి నాడంగఁ

౧. యసుతు, ౨. దామముల్, ౩. పుష్పములు, ౪. ధ, ౫. వేళ, ౬. న్నది, ౭. యాకు, ౮. ప్పెడి, ౯. టే.

దలఁచి పార్వతి దోడి తరుణులఁ జూచి
రాజకీరాలాపరంజితవాణి
రాజకీరమ్ముల రమణి తెమ్మమ్మ
కోకిలకలనాద కోమలి నీవు
గోకిలానీకంబుఁ గొంచు రమ్మమ్మ
వరహంసగామిని వనితాలలామ
వరహంసనిచయంబు వరుసఁ దెమ్మమ్మ
బర్హిణ బర్హనిర్భర కేశభార
బర్హిణానీకంబుఁ బరగఁ దెమ్మమ్మ
[1]తరుణి పుత్త్రికల రత్నంబుపుత్త్రికలఁ
గర మొప్పమణిపుత్త్రికలను ముత్తెంబు-
బొమ్మల దంతంబుబొమ్మలఁ బసిఁడి-
బొమ్మల గురుగులఁ [2]బొలఁతి [3]తెమ్మనుచు
సురకన్యకలును హేమ[4]గిరికన్యకలును
వరరుద్రకన్యలు నురగకన్యలును
ప్రమథకన్యలు దను బలసి కొల్వంగ
హిమగిరికన్య పూర్ణేందునిభాస్య
గిరిజ మున్ శైశవక్రీడాభిరతిని
నరుగుచు నరుగుచు నర్థి దుల్కాడఁ

---

౧. తరుపుత్త్రికలను, ౨. పొసఁగ, 3. జెమ్మమ్మ, ౪. కర.

దివిరి భాగీరథీతీర దేశమున
భువి బొమ్మరిండ్లుగా పురముఁ గల్పించి
తన్మధ్యమున గౌరి తాన చేమట్టి
సన్మతి నొక్క ప్రాసాద మొప్పారఁ
గావించి యొక్కలింగముఁ బ్రతిష్ఠించి
సేవా[1]రతిని దోడి [2]చెలువలుఁ దాను
శివుఁ గొల్చి మఱియు విశేషవినోద
వివిధోత్సవంబుల వేడ్కఁ జల్పుచును
గొండొకప్రొద్దుండి కోమలి యరిగె
నుం[3]డ సైకతపురం బుర్విపై నట్ల
యంత నగ్గౌరి మహాతపోనియతిఁ
గంతుమర్దనుఁ బతిగాఁ బ్రీతిఁ బడసి
హరుఁడును దాను నన్యోన్యానురక్తి
సరి నవినాభావసంబంధ మమర
నానందలీల నోలాడుచు నంతఁ
దా నప్పురం బద్రితనయఁ దలంపఁ
దలఁచినతలఁపుఁ దత్పతి మెర్గి నీవు
దలఁచిన యొకసికతాపురం బదియు
నిక్కంబు పుర మయ్యె నివ్వటిల్లంగ

౧. భరతితోడి, ౨. చెలియలుగాను, ౩. ండె.

నిక్కంబునకుఁ గరుణించితి ననుడు
శంకరవల్లభి శాంకరీ దబలు
శాంకరీపుర మనఁ జనియె లోకముల
నాశాంకరీపురంబంద నాయునికి
శ్రీశైలమునకు వచ్చితి, వచ్చి యంత
నిర్జితపాపు ననిర్జితమహిము
నూర్జితయశు మల్లికార్జున దేవు
నత్యర్థిమై సమభ్యర్చితుఁ జేసి
నిత్యంబు సత్క్రియానిష్ఠ ముప్పొద్దు
సంధిల్ల నానాసుగంధప్రసూన
బంధురీపూజానుబంధప్రబంధ-
పటు[3]రభసోద్యుక్తిఁ బరమప్రశస్తి
స్ఫుటభక్తియుక్తి సంపూజ్యుఁ గావించి
తనపేరు లిలఁ బుప్పదంతుఁ డనంగ
ననయంబు వర్తింప నట్లొక్కనాఁడు
పూవులవడుగు లీ పుష్పవాటికలఁ
ద్రోవఁ జూపుడు వచ్చి తుదిశాఖ నున్న
కరవీరపుష్పముల్ గమియంగఁగోయ
నిరవుఁ జూపుచు శాఖ లే నెక్కునెడను

౧. రి, ౨. మ, ౩. తరసా, ౪. శ, ౫. ంప, ౬. తనుజారు.

గీతవాద్యము జనాకీర్ణఘోషణము
నాతతపంచమహా[1]వాద్యరవము
చప్పుడు దిక్కులఁ గప్పుడు భ్రమసి
యప్పుడు గతికీలు దప్పుడుఁ గ్రింది
కొలనిలో వడఁకుచు గుబ్బ[3]న పడుచు
నల[4]రి నాగాంగన లర్థిఁ దన్ బట్టి
పూర్వజన్మమున నీ భోగనాథున క-
పూర్వపూజాబంధములు విరచింపఁ-
గా నొక్కపద్మంబులో నొక్క తేఁటి
దా నొక్కఁ డున్నఁ గూ తప్పనఁ జేసి
భూవలయంబునఁ బుట్టతి దొల్లి
పూవులవడుగవ కావున నట్ల
శివుడుఁ గారుణ్యంబు [5]సేసె రమ్మనుచు
నువిదలు గొనిపోవ నురగిలోకము[6]నఁ
గలితభోగావతీగంగాప్రవాహ
పులినతలంబునఁ [7]బొడమఁ దత్ క్షణమ
దివ్యతేజము[8]న జాతిస్మరత్వము[8]న

---

౧. శబ్ద, ౨. ం న, ౩. బ్బు, ౪. రు, ౫. జేసి, ౬. ల, ౭. బొరలనక్షణము, ౮. గ.

ఈ పాదమునకు వెనుక "పావకాంబకు భోగవతి శాపమునను" అని ఒక ప్రతిలో అధికపాఠ మున్నది. దీనికి సం. అనువాదము లేదు.

దివ్యాంగనలపల్కు దృఢముగా [1]నెఱిఁగి
శ్రీభోగిశాట్సమర్చితపాదపద్మ
నాభోగనాథు సద్భక్తి భజించి
తరుణతరారుణతరణివిస్తరణ-
కిరణాపహరణవిస్ఫు[3]రణమాణిక్య-
కలశ విభ్రాజి తాగణితార్చుదప్ర-
భలఁ [4]జెంది లోకసప్తకమును వెలుఁగ
ద్వారాష్టకముల భవంతి పంక్తులను
జారుమండపముల సహజవేదికల
భూరి[5]వప్రముల గోపురముల దివ్య-
తోరణంబుల సర్వతోభద్ర మనఁగ
భ్రాజిల్లు దివ్య విస్ఫార తేజో వి-
రాజితమగుచుఁ దత్ప్రాసాద[6]మమర
నష్టదిక్పతులు మూర్త్యష్టకంబును ని-
జాష్టమహాహి సహస్రముల్ గొలువ
హరివిరించ్యాది సురాసురప్రముఖ-
గరుడగంధర్వసంఘంబులుఁ గొలువ
శుంభత్ప్రమథగణ స్తోమంబు గొలువ

1. నెరిగి; దెలసి, 2. ర్చి. 3. రిత, 4. గిండె, 5. భద్ర, 6. మఁలర.

రంభయాదిగ నప్సరఃస్త్రీలుఁ గొలువ
శ్వేత దధీచి వసిష్ఠోపమన్యు-
గౌతమాత్రులుఁ గొల్వఁగాఁ దదభీష్ట-
పుణ్యప్రదుండగు భోగనాథుం డ-
గణ్య పుణ్యుఁడు నాకుఁ గరుణింప నట్టు
లందు భజింతుఁ బాయక భోగనాథు
నిం దెప్పుడును శ్రీగిరీశు భజింతు
ననుచుఁ [1]బురంబున కేఁగె నాయయ్య,
విను మట్లు గాక యవ్విపినాంతరమున
కేఁ బత్తిరికిఁ బ్రీతి నేఁగంగ నొక్క-
యాఁబోతు దివ్యసమగ్రతఁ బేర్చి
భవుఁ డెక్క- తనవృషభంబున కదియుఁ
గన[3]యుఁగా సృజియించెఁ గాక యన్నట్లు
స్ఫుటతరసౌందర్య భువనైకవినుత-
పటుదేహకాంతి విభ్రాంతి దలిర్ప
నొక్కభక్తుండు సమున్నతప్రీతి
మ్రొక్కి- ప్రదక్షిణంబులు వచ్చివచ్చి
మ్రొక్కుచు మ్రొక్కుచు [4]నక్కడ మగుడఁ
జక్కన వృషభంబుఁ జని యాబిలంబుఁ

---

౧. బ, ౨. కవేష్క-, ౩. గాఁగ, ౪. ని.

జొచ్చుడు నిది యేమి సోద్యమో యనుచు
నచ్చటి కేఁగి యా యయ్యకు మ్రొక్కి,
"యెక్కడ నుండుదు రెవ్వారు మీరు
నెక్కడికియోఁబోతు మ్రొక్కెడ రేల ?
యెక్కడ కేఁగెద రిందేమిసిద్ధి
నిక్కంబు సెప్పుమా నీయాన" యనుఁడు
"వినవయ్య యిది యాదివృషభంబు గర్మ-
జనులకు వేఱొండుసందమై తోచు,
జగములో రెండవు శంభుం డనంగఁ
బొగడంగ నెగడు శ్రీ భూధరాగ్రజుఁడు
ధర్మావతారుండు[1]దాంతుఁ [2]డుదుగ్ఘాత-
కర్ముండు నాల్గుయుగంబులయందు
ధర్మంబు నాల్గువా[3]దంబుల నడుచు
ధర్మ మన్నియు యుగాంతరముల నెఱిఁగి
తద్ధర్మ మీమూర్తి ధరియిం[4]చి యిజ్జ-
గద్ధితార్థం[5]బిజ్జగంబున నుండు
జను లెవ్వరేనియు సప్తరాత్రంబు
లనశనవిధి సవైకాగ్రచిత్తమున

1. ఘుదాన్తు, 2. దుదుగ్ఘాత, 3. దములుగా, 4. ంచనజ్జ.
5. ంబుజా.

నాబిలద్వారంబునం దుండఁగా ద-
య్యాబుద్ధి నా వృషభాంశుఁ డేతేరఁ
దొలఁగ కా వృషభంబు తోఁకఁ బట్టుడును
బిలములోపలికి సంప్రీతిఁ గొంపోవ
నల మనోవేగంబునను గొనిపోయి
పొలుపారు వృషభేంద్రపురసమీపమున
నావృష[1]భాంశుండు న ట్లదృశ్యముగ
భావించి యావృషభపురంబు [2]నడిమి
వృషభతీర్థంబాడి వేడ్కఁ దత్కృతులు
వృషభేశు నర్చించి [3]వినమితు [4]లగుచు
నావృషభే[5]శుండు నంత బ్రత్యక్ష-
మై వారి కొసగు దృష్టాదృష్టసిద్ధి
వారిలో మోక్షాభివాంఛితు లైన
[6]వారల నందికేశ్వరపురంబునకు
ననుచుఁ దదీయమోక్షా[7]వాససుఖము
ననుభవింపఁగఁ బండె నట్లను[8]గాక
మణిగణానీకముల్ మంత్రముల్ దేవ-
గణి[9]కోపభోగముల్ గామరూపములుఁ

---

౧. భాంశుండు; భేశుండు, ౨. నడుమ, 3. విన, ౪. లగను, ౫. భేశ్వరుండంత, ౬. వారక (జ), ౭. దాన, ౮. గాఁగ, ౯. కావిభా.

గామదుఘుంబులుఁ గల్పవృక్షములుఁ
గామితాలోకలోకప్రవర్తనలు
సంజీవ సంధాన శల్యాదికరణు
లంజన రస రసాయన ధాతుకళలు
మృగచోర రాక్షస మృత్యు విషాహి -
ఖగమహోల్కాశని ఖడ్గసేనాగ్ని -
పవన[1]జలాతప ప్రతిపక్ష[2]రోగ -
పవి నృపస్తంభన పరిచితకళలు
గారుడాదులుఁ బరకాయప్రవేశ -
భూరిదివ్యౌషధంబులు మొదలైన
దృష్టసిద్ధులు గోరుదృష్టా[3]ర్థులకును
దృష్టసిద్ధుల నిచ్చు దేవుఁ[4] డిచ్చుటను
దమనిజావాసముల్ దలఁపంగ నపుడ
విమలాత్మరుచిఁ బొల్చు నృప[5]భేంద్రమూర్తి
వచ్చుఁ దొల్లిఁటియట్ల వాలంబుఁ బట్టి
దెచ్చు బిలము [6]వెడలఁజొచ్చు నబ్బిలము
నట్ల[7]కా నెఱిఁగి యిష్టార్థముల్ వడసి
యిట్లు వచ్చితి నంచు నేఁగె వెండియును

౧. బాళ్లా, ౨. రాగ, ౩. త్మ; ౪. డెప్పుడును; డిచ్చుడును, ౫. భైక, ౬. లెల్ల, ౭. యేనేగి.

"జని "నిర్జన ప్రదేశంబున నొక్క
వనమధ్యమున ఫలావళులు నేఁ గోయ
భువినుండి యొకతాడి దివిదాఁకఁ బెఱిఁగి
దివినుండి యట్లే క్రిందికి దిగఁబడఁగఁ
గదల కేఁ దాళవృక్షముఁ జూడఁ బ్రొద్దు
గదియఁ దత్తాళవృక్షముతుట్టతుదిని
శతరుద్రుఁ డొకఁడు శ్రీశైలేంద్రుఁ జూడ
నతులవృత్తాంతాఢ్యుఁ డై వచ్చె ననఁగఁ
బాలార్కరుచిఁదనుప్రభలు వెల్వార
దాళాగ్రమున నొక్కతపసియుఁ దోచెఁ
దపనుండుఁ గ్రుంకఁ దత్తాళంబుఁ గ్రుంకెఁ
దపసియు ధరఁ జిక్కెఁ దా నంతఁ గదిసి
"ంతా వెట్లు దివి కేఁగె? ధర నెట్లడంగె?
"నోడ కెట్టులు మీఁద నుండితి వీవు?
నందు నెవ్వారిఁ గంటి? వగుసిద్ధి యేమి?"
వెండు వెట్లయ్యె నీ భూజంబు నీకు?
ననవుడు శ్రీగిరియంద యేప్రొద్దు

---

౧. చన, ౨. నిర్ఝర, ౩. ల, ౪. త్రాడు, ౫. ల్ల, ౬. నాఁగ, ౭. వన, ౮. గ్రుంకుడు దానును, ౯. జిక్కె, ౧౦. తానెట్లు, ౧౧. నూనె.

వనములు నడవుల పర్తింతు నేఁను
ననఘు యీ ప్రాంత మేకాంతంబు గాన
చనుదెంచి యుదయమజ్జనకాలమునను
జర్చింప లింగవశమున నిచ్చటన
కూర్చుండి యేను లింగార్చన సేయఁ
దుదల నర్కాంశులు దోప నీతాడి
తుదలయాఁకులు తుట్టతుదిలను దోఁచె,
నుదయాద్రిరుచులు దళ్కొత్త నీప్రాన
నుదయాద్రిరుచులును దుదలఁ దళ్కొత్తె,
మొదలియాకిరణముల్ మొలవ నక్కజము
మొదలియాకుల మొట్టమొదళులు మొలచెఁ,
గదిసి యాద్యుతులు సాఁగంగ నీద్రుమము
గదిసిన మీఁదటికొమ్మలు సాఁగెఁ,
బోదలుచు రవియును బోడమ నిత్తరువుఁ
బోదలుచు నినుఁ జూడఁ బోడమెను మునుగఁ
జక్కన్న లింగావసరవేళ గాన
యక్కడిక్కడ నూడ కట్ల యుండిలిని,
గ్రాలు నంబునుమధ్యజిర్ణికభాతిఁ

౧. కు, ౨. లు, ౩. తుసీతాడి, ౪. లు, ౫. లనా, ౬. వ, ౭. నను, ౮. గూడ, ౯. మి.

దాళాగ్రపత్రమధ్యమున నే నుండ
గవిరథం బేఁగు తీవ్రమున నీతరువు
దివిదాఁకఁ బెరుగుడు రవియు మధ్యాహ్న-
వేళ నీచను తాళవృక్షంబుఁ గదిసి
నాలాంఛనంబును నన్నును జూఁచి
సముచితసత్కారసంతుష్టుఁ జేసి
యమలాత్మ యీప్సితం బడుగు నావుడును
ఫలితపర్వతసార్వభౌమాతిశయత
నొలయుఁ శ్రీగిరియు నా కున్కిపట్టైని,
నజ హరి [౧]యుష్మదాద్యమరార్చితుండు
త్రిజగన్నుతుండు ముక్తిప్రదాయకుఁడు
సుమహాదపారభాసురదయాంభోధి
ప్రమథనాయకుఁడు శ్రీపర్వత[౨]ప్రాణ-
వల్లభుఁడైన శ్రీ మల్లికార్జునుఁ[౩]డ
తెల్లంబు నా ప్రాణవల్లభుఁ డేనిఁ,
బన్నగాంకుని వల కనైన్న నిన్ను
గన్నులారఁగఁ జూడఁగాఁ గంటి నేని,
వేఁడ నింతటిమీఁద వేఱొండు[౪]వరముఁ
బోఁడిగా నున్న దే భువనలోచనుఁడ

---

౧. విబుధపా, ౨. ఘ, ౩. డు, ౪. విధము.

షేమియు నే నొల్ల నీతాళవృక్ష
మీామహి నుదయింప నేమిగారణము?
సనఁజనఁ గొనసాఁగుశక్తి యీావృక్ష
మున కెట్టు లెసగెను మోచు ²డేమిటికి?
యెప్పటిభువిఁ గ్రుంకు ²డేమి ³విధంబు?
సెప్ప మిం⁴తియ చాలు శివనేత్ర” యనుడు
“శ్రీగిరి దనమూాళి సృజియించెఁ బుణ్య
భాగుం⁵డ మర్త్యుల బ్రదికింపఁ దలఁచి
సూర్యవనంబును సూర్యనగంబు
సూర్యకుండంబును సూర్యేశ్వరంబుఁ
దా వెండియును సూర్యతాళము ననఁగఁ
గావిం⁶చె నిహపరకాంక్షాపరులకు
సూర్యకుండం బాడి సూర్యేశుఁ గొలువ
సూర్యపదం బగు సూర్యాత్మకరుణ
ద్వాదశాదిత్యులుఁ దమతమపదవు
లాదిని సూర్యేశు నర్చించి కనిరి,
దా నుదయింప నీ⁷తాడియుఁ బొడ్చుచుఁ,
దా నస్తమింప నీతాడియుఁ గ్రుంకుఁ;

---

౧. షే, ౨. టిదియేమి, ౩. కారణము, ౪. ౧తే. ౫. ల,
౬.. ంచనప్పుడు, ౭. తాడును.

బురహారుకృపఁ దాళభూరుహం బెక్కి
యరుగు దెంచినవారి కభిమతం బిత్తుఁ,
దన[1]ర సీగిరిఁ జంద్ర తాళంబుఁ గలదు,
జను[2]లిట్లు సను దేరఁ జంద్రుండు నిచ్చు
లీల నక్షత్ర తాళీసమూహములు.
శైలంబు[3]నం దిట్లు సరియింపుచుండుఁ
గావున చోద్యముల్ గల[4]విట్టు లొండు
నీవు గామింపవేనియును దప్పేమి*?
మానితాంబుజ రాగమణు లివే కొనుము,
పూని శ్రీగిరినాథుఁ బూజింపఁ బొమ్ము"
ననుచు నంతట సూర్యుఁ[5]డరుగ నీతరువు
సను దెంచి యట్ల యీజగతిలో నడఁగె
నని చంద్రసూర్యతా[6]ళాది వృక్షముల
ఘనమహాత్త్వముఁ జెప్పఁగా వింటి మఱియు
పెండియు నొకనాఁడు విపినాంతరమున
నుండంగఁ దనమ్రోల [7]నొండొండ భీతు

---

౧. పశ్రీ, ౨. లి, ౩. సంధిల్ల, ౪. విట్లునొండు; విట్ల యొండు, ౫. డరిగ, ౬. రా, ౭. నొక్కరుండు.

* ఈపాదము తరువాత "యేనిత్తునడుగు నీకేదియునైన" అని ఒకప్రతిలో అధికపాఠ మున్నది. దీనికి సం. అనువాదము లేదు.

గొని [1]యురంబున నంటుకొని యొక్క యర్భ-
కునిశవం బుండంగ గుబ్బన పడుడుఁ
జక్కన నేఁ జేరఁ జని "విభీతాత్మ!
యెక్కడనుండి నీ వేతెంచి పడితి?
పడఁగ గర్భంబులో[2]పలి పాపనీనుఁ
గుడుగక యురమున నునికి యె ట్లను[3]డుఁ
"ఒరముననుండి యేఁ [4]బుష్పంబులకును
గర మురుపడిఁ బాఱఁ గడుపు గలంగ
జలతీరమునఁ జేతిసజ్జయుఁ [5]బెట్టి
యి[6]నొక్క కొంతదవ్వేఁగి కూర్చు[7]ండి
మ్రావర[8]వాటిక మఱిశంక లేక
నోవెట్టి కూర్చుండు[9] డుచితమే యనుడుఁ
దిగ్గన లేచి [10]నల్దెస[11]లును జూచి
బగ్గించి పలు[12]కుశబ్దం బెట్లు దోఁచె
నిక్కడ నూరు లేదిల్లు లేదనుచు
నక్కడ నొక[13]తాళి [14]నిక్కగాఁ బెట్టి
చక్కన యొక్కింత సని కూరుచుం[15]డ

౧. ఫు, ౨. పల, ౩. నిన, ౪. పుష్పకంబులకు, ౫. చేటి, ౬. నొక, ౭. ండ, ౮. ఋవాక్కి, ౯. డెను, ౧౦. నాల్, ౧౧. లను, ౧౨. క్క, ౧౩. తాయి, ౧౪. నింక, ౧౫. ండి.

నక్కడ నిట్టుల యట్లిక్క బెట్టి
యక్కడకక్కడ కరిగి కూర్చుండ
నక్కడకక్కడ కట్ల వారింప
నిక్కలు బెట్టుచు నిల దూర మేగి
చక్కన మఱి బహిశ్చరణంబు సేసి
శౌచాచమన బహిస్స్నాన క్రియాను
లాచరించి మదీశ్వరార్చన సలిపి
ఘనతరంబుగ దొప్ప కరము నంబట్టి
యనుపత్తి నేగి యన్యైయొక్క లున్న
కందువలందు "భిక్షాం దేహి" యనగ
సుందరుల్ దమయొడల్ సూపక వచ్చి
యందఱు నతులదివ్యాన్నాదులన్ని-
గందువలందు భిక్షములు వెట్టుదును
బరమున కారగింపంగ బెట్టి కుడువ
సరసదివ్యాన్న భోజనమహత్త్వమున
నప్పుడు గర్మక్షయంబు నా కగుడు
నప్పురవరము సయ్యున కానవచ్చె
నందు దద్దివ్యకన్యారత్న మొక్క-

---

౧. దీర్చి, ౨. హుస్నా, ౩. ల, ౪. యం, ౫. యనిన, ౬. లగ, ౭. స. ల. లిచ్చి.

సుందరి సర్వాంగసుందరి వచ్చి
తనగృహంబునకు నుదాత్తసంప్రీతి
నను గొనిపోయి యున్నతహర్మ్యమునను
నునిచి యభ్యంగక్రియోపేతుఁ జేసి
యనుపమదివ్యాంబరావలు లిచ్చి
బంధురషోడశాభరణసంధాన-
గంధమాల్యాదిశృంగారంబుఁ జేసి
యియలరు దివ్యాన్నపానాదులఁ దనిపి
యియలరు తాంబూలాదు లర్పించి యంత
వరియించి న న్ననవరతసంభోగ
సురతసుఖాంబుధిఁ జొక్కించుచుండ
ననుపమదివ్యవర్షానేకకోట్లు
సనఁగఁ దద్గర్భంబు సతి కైనఁ జూచి
చిక్కె నా కీ సతి దక్కెఁ బొమ్మనుచు
నొక్కింత దలఁపన య్యుగ్మలి మెఱుఁగ
చెచ్చెర గర్భంబు వ్రచ్చి యర్భకుని
బుచ్చి నాపై నటు వొమ్మంచు వైవ
నెప్పుడో వచ్చితా దొప్పన పడితి
నిప్పాట" నని చెప్ప నిది వింటి మఱియు

నరిగితి నటవినోదార్థమై దూర
మరుగ నరుగ నొక్క గిరికందరమ్మున
నొక్కయ్యె బిలములోనుండి యేతేర
నెక్కడనుండి మీ రేఁగెద రనుడు
నిది పాపబిల మందు రీద్వారమునను
గదలక దినసప్తకం బుండ నొక్క-
యువిద యబ్బిలములోనుండి యేతెంచి
సవినయంబుగఁ దన చాఁకిటిపాప
నిటు పట్టు మన చేతి కిచ్చుచుఁ బోవఁ
గటకట నేడ్చుచుఁ గఱచుచు వ్రచ్చి-
కొనుచు గోళ్ళల దుస్సికొనుచుఁ దొల్లొలిచి-
కొనుచుఁ గండలుఁ గొర్కికొనుచు సాధకుని
తనువుమాంసం బెల్ల దరిమిడి కూడఁ
దినఁగ నెమ్ములు దక్క ధృతిపేర్మి నతఁడు
గలఁగక పం డ్లిలగఱవక చనక
కయలుగక యులువక హాయన కచోటు
గదలక మెదలక కర మడ్డ మిడక
యదరక బెదరక యుఱఁగలిగొనక

---

౧. నటు, ౨. యు బిలములో, ౩. న, ౪. నల, ౫. ట, ౬. యక్కటా. యనక.

వెక్కుక నుసలక వీఁగక మసల
కొక్కింతయును గొంకకున్నను మెచ్చి
జనని యప్పుడ వచ్చి తనకూఁతుఁ బుచ్చి-
కొని దివ్యదేహ మెక్కుడుకూర్మి నిచ్చి
యావాము వెండియు నభిమతసిద్ధి
గావించు నని బిలకల్పోక్తి నట్ల
తలరక తను వొగ్గి తనమనోరథముఁ
బొలఁతిచేఁ బడసిరయేఁ బోయెద ననుచు
యోగవాగలు మెట్ట నుద్యుక్తుఁ డగుచు
వాగలు గిరులపైఁ బదిలమే యనుడు
వాగ లూరక రావు వడసిరతి యోగ -
వాగ లెట్లన్న నీపర్వతాగ్రమునఁ
గరమర్థి శ్రీపాదుకాసిద్ధనాథుఁ
బరగుశూలంబుల వాగలు వెట్టి
యెలమితో వేయును నెనిమిదిమార్లు
వలగొని మ్రొక్కుచు వచ్చి కల్పోక్తిఁ
బథమిడిపోవుచోఁ బర్వతాకృతిని
బ్రథితమై యొక్కసర్పంబున్న దాని
వదనంబు బిలమని వడివడిఁజొచ్చి

౧. కే, ౨ డు, ౩. కావు ౪. న, ౫. సిద్ధి.

యది వామకడుపులో నాటమెఱుంగి
సర్వజ్ఞభోజునిఁ జంపంగవచ్చు
గర్వనాగంబు నుక్కడంచినసూక్తి
నిల "నన్యథా శరణం నాస్తి" యనఁగ
నిల "రక్ష రక్ష మాహేశ్వర" యనఁగ
మహితమంత్రంబు సన్మతి ననుష్ఠింప
సహిపతి ప్రక్కలై యఱచుచుఁ ద్రెళ్లె,
నిని యొక్కసర్పముద్వృత్తిఁ దత్క్షణమ
చనుదెంచి తొలఁగి యేఁ జనఁగఁ దచ్ఛవముఁ
జక్కాల్పి యారెండుప్రక్కలుఁ గూర్చి
ప్రక్కన సంధానకరణి ముట్టించి
యురగంబుఁ గొనిపోయె నుమిసె సంధాన-
కరణియు నంత నేఁ గని పుచ్చుకొనుచు
నరుగుచు మఱియొక్క సరసిజాకరము
దరిఁద్రొక్కి జలములుద్రావు నపేక్ష
ముట్టుడు నుదకముల్ ముట్టినచేయి
ముట్టినంతన ప్రేగి ముందఱఁబడుఁ
జట్టనతునుకలు సంధానకరణి
ముట్టింపఁ గరమొప్పె ముట్టకే నట్టె

---

౧. ణ, ౨. పింప, ౩. వు, ౪. నె, ౫. ప్ప.

యుదకముల్ [1]గుళిగలో నొకకొన్ని గొనుచు
గదలి [2]కర్తరిపాణిగా [3]నంత యెఱింగి
యరుగంగ నెదుర మదాంధగజ[4]ములు
వరిగొని తనమీఁదఁ బఱతేరఁ గాంచి
కర్తరిపాణి యా కరులపైఁ జల్ల
మత్తేభములు దున్ని మగుడిపాఱంగ
నంటుజా లంటిన నటు గొన్ని సిక్క
నంటుజాలకుఁ [5]జన కం దొక్కగజము
దనతుండమున శి[6]లోదక మప్డు దెచ్చి
చననీని యంత్రాల సందు[7]లఁ జల్లఁ
బాసి యేనుఁగు లే[8]గఁ బట్టిరి [9]మెల్ల
నాశి[6]లోదకము లే నంత ముంద[10]టికి
నరుగంగ నరుగంగ నంటుజా లంటఁ
దరమిడి తచ్ఛి[6]లోదకములు సల్ల
విడుచుడు నంటుల వేనవేల్ [11]దాఁటి
పుడమియు దిశలు నభోవీథిఁ గ[12]ప్పి
యోజనోత్సేదంబు యోజనాయతము

---

౧. గలిగిలో; గళగళ; గరిగలో, ౨. కర్తరివాణి, 3. నం
౪. ంబు, ౫. బోకయుం, ౬. రో, ౭. ల, ౮. గ, ౯. గోళ్ల; గాళ్ల,
౧౦. టి, ౧౧. దాట; నాట, ౧౨. ప్ప.

యోజనవిస్తీర్ణ మొకవృక్ష మున్నఁ
గనుఁగొని [1]యిదియ మార్గం బని యెక్కఁ
ద[2]నకాండ నొకకోఁతితనువు వాటిల్ల
న[3]మ్మోయి విడువక నామ్రానికొమ్మ
కొమ్మ దప్పక యుఱుకుచుఁ బోవఁబోవ
నాఁకలి పుట్టుడు నం దొక్కఫలము
వీఁకతో నమలంగ వేగం[4]బ తనకుఁ
జిలుకశరీరంబు సిద్ధింప నంతఁ
జిలుక[5]నై యామ్రానఁ జిక్కక యఱుగ
శ్రమము దోఁచుడుఁ బుష్పశా[6]ఖపైఁ బుష్ప
సమితియ శయ్యగా శయనించియుండఁ
దన కంతఁ దుమ్మెదతనువు సిద్ధింప
ఘనపుష్పపరిమళకాంక్షఁ జిక్కకయుఁ
గడఁకఁ దద్వృక్షశాఖాతతిఁ గడచి
యుడువీథిఁ జన నొక్క యుర్వీధరంబు
పడఁకువ నొక్కతాపసి యున్న వారి
యడుగులఁ బడుడు భృంగాకార[7]మెడలి
తనకు దివ్యాంగ మా తాపసి యొసగఁ

౧. య, ౨. కండ; శండ, ౩. మ్మేను, ౪. ంబె, ౫. యై, ౬. ఖిపై; ఖవై, ౭. ముడిచి.

బెనుపారి ఖేచరీబల మిదే యిందు
మండుమంటలమాడ్కి నెల్లెడల
నుండు మండుచు నవి యోడక త్రొక్క
వనుపడు నవి. యోగవాగ్నిలై నీకు
ననుడు నే న ట్లేఁగి యచ్చోట రెండు-
మంటలు దత్కృపామహిమ మెట్టుదును
బట్టింప కవి యోగవాగ్నులై తనరెఁ
బడసితి నీయోగవాగ ³లీక్రియను
బడసి సహస్రాబ్దపరిమితం బయ్యెఁ
బర్వతాధీశుశుంభత్కృపఁ జేసి
సర్వసిద్ధులును సుసాధ్యంబు లయ్యెఁ
గడఁ⁴క నీయోగవాగలు మెట్టఁదలఁపఁ
దడయక ఖేచరత్వంబు సంధిల్ల
నేలోకములకు నా కేఁగంగవలయు
నాలోకములకుఁ జయ్యన కొనిపోవ
భోగవతికి నేఁగి పుణ్యోదకములు
నాగలోకస్వర్ణనళినముల్ దెత్తు
భాగీరథికి నేఁగి భవ్యోదకములు
బాగొందు తత్తటప్రసవముల్ దెత్తు

---

౧. ర, ౨. లే, ౩. లే, ౪. గ, ౫. న.

మందాకినికి నేఁగి మహితోదకములు
గెందామరలుఁ దెత్తుఁ బ్రియ దులుకాఁజ
మానితభక్తి శ్రీమల్లికార్జును స-
దానందుఁ బూజింతు ననుచు నాయయ్య
సనియె నెచ్చటి[1] కేనిఁ జనుడు సాధకుఁడు
విని యత్తపోధనుఁ గనుఁగొని నగుచు
శ్రీగిరిమీఁది విశేషంబు లెన్న
వాగీశ్వరునకైన వశమిట్లు[3] గాదుఁ
నెన్ని యగ్గిరిదరు లన్నిసోద్యమ్ము
లెన్ని యగ్గిరిగిరు లన్నిసోద్యములు
సనఁ జూడ వినఁ జెప్ప సాధింపఁ బడయ
ననఁ గీర్తిసేయ శక్యమె? యింత సాలుఁ
జాలుఁ, బోయెద, నీవుఁ జాలుదే రమ్ము,
చాలవేఁ జిక్కుము, చనఁ ద్రోవనిమ్ము
జడుఁడనై యొజ్జశిష్యన్యాయమునకు
నొడఁబడ నింక నీ యుక్తులు మాను
మెట్టుదుఁ బులినైనఁ దట్టుదు భీతి
ముట్టుదుఁ దుదిఁ జలపట్టుదుఁగాని
తక్క నాగమనంబుఁ జిక్క నేమిటను

---

౧. కని, ౨. మెట్లు, ३. గాక.

స్రుక్క నొంటికి, వెన్క ద్రొక్క, నెట్టైనఁ
జొత్తు బిలముఁ, ద్రోచి పుత్తు విఘ్నంబు,
లుత్తు నెంతైనను, [1]వత్తుజయించి,
పొదలు నీలాంఛనంబులు నిన్నుఁ జూచి
ముదలించినను బోక ము[2]న్నంటిఁ గా[3]క
న న్నాఁగ శ్రీగిరినాథుఁడుఁ జాలఁ
డన్న శక్యమె నీకు? నిన్నియు నేల?
పొమ్ము, బిలము సూఱఁ గొమ్ము, జయించి
రమ్ము, [4]మేమును నీవశ మ్మని నమ్ము,
దీవించి పంపు, మింతియ తక్కఁగాని
పోవక నిలువఁ దపోధ[5]న పోవ
నానతి యీమల్లికార్జున దేవు
నాన నీ కింక నొం డాడిన ననుడు
మలకలఁ బడఁడ, నా మాయలఁ బడఁడ,
మలఁకువఁ బడఁడ, నా మాటలఁ బడఁడ,
తక్కులఁ బడఁడ, నా దబ్బులఁ బడఁడ,
చొక్కులఁ బడఁడ, నా చూపులఁ బడఁడ,
మఱుఁగులఁ బడఁడ, నా మతములఁ బడఁడ,

---

౧. న, ౨. న్ని, ౩. ని, ౪. మే మెల్ల నీసొమ్మని నన్ను సొమ్ము నీమమ్ము; మెల్లని గన్నురావించి యపుడు, ౫. నప్రోవ.

నఱతలఁ బడఁడ, నా వార్తలఁ బడఁడ,
జంకెలఁ బడఁడ, నా [1]సటములఁ బడఁడ,
యింకఁ జిక్కింప రా దిక్కడ ననుచుఁ
దపసి యున్నానికిన తా నదృశ్యముగఁ
దపసిని గుటిలంబుతపసిగా నెఱిఁగి
తెరు విడి చూతఁ దుద్వృత్తి వర్తిల్ల
నరుగంగ నరుగంగ నంతకు మున్న
సరకుసేయక [3]మీఱి సాధకోత్తముఁడు
నరుదుగా కంచును నాభైరవుండు
బిలమువాఁకిటియందు వృథుతరార్గళము
పొలుపున నొక్క [4]బెబ్బులిరూపుఁ దాల్చి
తగ్గుచుఁ బొదలుచు బుగ్గలించుచును
మ్రొగ్గుచు మూల్గుచు ముఱకటించుచును
ముక్కువిర్చుచు బొమల్ ముడివెట్టుకొనుచు
[5]మ్రక్కుచు, ముందఱ నిక్కుచు, నావు-
లించుచు, జివ్హా సారించుచు, [6]మ్రోల-
[7]గించుచు, నోసలు స్రుక్కించుచు, [8]నెదురు
దారుచు, [9]మూరుచు, ధర ము[10]నిగాల్లు

---

౧. శర, ౨. ము, ౩. మా, ౪. పెంబులి, ౫. వ్రక్కుచు, ౬. నేల, ౭. నించుచు, ౮. నెమరు; మ్రోల, ౮. కు, ౯. మీ, ౧౦. ను.

నూ¹రుచు, ²సీఁగలఁనొడియుచు, ³నడఁగి
నడ⁴చుచు, మ్రూఁతులు నాకుచు, వాల
మడఁచుచు, నేలతో నప్పళింపుచును,
నొడలు గిర్పుచు, విూస ఁ³గరగింపుచును,
గడ⁶పలించుచుఁ, జెవుల్ గత్తరించుచును, *
గనలుచుఁ, బొన⁷లుచుఁ, గఱవ నుం⁸కించు
⁹చును, గ్రుడ్లు మిడికించుచును, జూచుచుండఁ
గ్రమ మొందఁ గృష్ణ¹⁰ రక్త శ్వేత వర్ణ
సముదితశిఖిశిఖాశకలసంఘములు
వొడిగాఁ బెనుప్రోవు వోసినయట్లు
మూఁడువన్నెలు మేన ముడివ¹¹డి కూడఁ
గరులమదంబుఁ గేసరులకోపంబు
ధర నాగవృశ్చికోత్కరములవిషము
ననలంబువేడిమి యసురులక్రౌర్య
మనిలునితీవ్రత యటు గూడ బెరసి
యాపోవ కొకరూపమై యున్నయట్టి

---

౧. కు, ౨. నింగిలి, ౩. నలగి. ౪. డ, ౫. బడిం, * ఈపా దము తరువాత ఒకప్రతిలో, "పెడమర్లడిరుగుచు బిట్టరుచుచును" అని ఒక అధికపాఠమున్నది. దీనికి సం. అనువాదములేదు, ౬. రు, ౭. నూగించు, ౮. చును, ౯. వర్ణ, ౧౦. డ.

యాపులి సాధకుం[1]డత్తటి డాసి
పులిరక్కసునిచావు బొంకు గానోపు
జ్వలనాక్షుచే నాఁడు సచ్చె నేనియును
నిట బిలాంతరమున నెట్లున్నవాఁడు ?
నిటలాక్షునకుఁ గాక యె ట్లోడివచ్చె ?
[2]నొం డేల యిల డాగి [3]యుండెనో కాక
వెండి యావ్యాఘ్రాసురుండు దానసఁగఁ
దపసి సెప్పినపులి దాన కానోపుఁ
దపసిచందము గాక దండిమై నిలువఁ
గలదె నా యెదుర వ్యాఘ్రంబు శీఘ్రంబ
తొలఁగకయున్నను ద్రోవ యీకున్నఁ
జిక్కెఁగా కింక నా చేత[4]ని ట్లున్న
నెక్కడ సొచ్చిన నేల పోనిత్తు,
దండింతుఁ దలఁకింతు ధట్టింతు నలఁతు
ఖండింతు[5]మలయింతు గతము సేయుదును
గాక[6]సైరింతునే గర్వించి తనదు
భీకరాకారంబు నాకుఁ జూపెడినె ?
యనుచు డగ్గఱుడుఁ దా నంతలోపలను

౧. డంతట, ౨. నొండెప, ౩. యున్నాడొకొర (ని). ౪ నెట్లున్న, ౫. మండింతు; మడియింతు, ౬. సేవింతు.

దనరా[1]రఁగాఁ బర్వతము పడ్డయట్లు
మండుచు నుల్క-ంబు మహిఁ బడ్డయట్లు
దండిమృత్యువు మహోద్ధతిఁ బడ్డయట్లు
ఘనఘనాగర్జనల్ గకుబంతములుగఁ
జనుదెంచి యమ్మహాశని వడ్డయట్లు
సంగతిఁ బ్రళయాగ్నిశకలముల్ వడ్డ-
భంగి నప్పులి బిట్టు వడుడు సాధకుఁడు
బెదరక బెగడక పిమ్మిడిగొనక
యదరక [3]నలఁగక యట యిట సనక
యులుకక యోడక యుత్తలపడక
యలుగక యలయక యఱఁగలిగొనక
తలఁగక తరలక ధైర్యంబు సెడక
తొలఁగక [4]కలఁగక [5]త్రొట్రువుగొనక
యొకచేతఁ బులిమీస లొడిసి మున్వట్టి
యొకచేతఁ బులిదాడ లోడక [6]చొనిపి
చరణముల్ సరణముల్ వురిగొనఁ బెన[7]చి
ధర వెల్లకిల నూఁకి తాటించి యార్వఁ
బులియు నదృశ్యమైపోవ సాధకుఁడు

---

౧. రు తత్పర్వ, ౨. టి, 3. నలయక, ౪. మె, ౫. తొట్టరు, ౬. చ, ౭. సి.

గలఁ గని మేల్కన్న గతిఁ జోద్య మంది
యంత వెర్వున దొంటి[౧]యట్టుల [౨]యరుగ
నంతకంతెను మున్న యాభైరవుండు
మూర్తి గైకొని తాన ముందఱ నెన్ని
వర్తనలను గెలువంగరా దనుచు
నంతకంతకు [౩]బిలం బన్నువ సేసి
యంతంబునను వహ్నియై మండుచుండఁ
దఱిఁదఱిఁ జొచ్చుసాధకునకుఁ జొరఁగ
నిఱుకటమై యున్న [౪]నిల వంగివంగి
పోవంగఁబోవంగఁ బోవరాకున్న
దా వెండి కూర్చుండి ధరఁ బోవఁబోవ
నెలమిఁ గూర్చుండియు నేఁగరాకున్న
నిల [౫]డొంగిడొంగి యొక్కింత సనంగఁ
బొరిఁ[౬]-బొరి డొంగియుఁ బోవరాకున్న
సరసర ధరఁ జక్క సాఁగిలి తాఱి
యంత గట్టెదుర దావానలార్చు[౭]లును
నంతరింపని ప్రళయానిలశిఖలుఁ
గఱకంఠు చిచ్చుఱకంటిమంట[౮]లును

---

౧. యట్లన, ౨. న, ౩. బలం, ౪. ట, ౫. డొఁ (డొ) దొ (దొ), ౬. దానుదొం, ౭. ల, ౮. ల.

యొఱపగు జాత్రిత్రి పట్టినయట్లు
దనరుచుఁ దద్బిలాం[1]తర్వీథినుండి
కనలుచుఁ [2]బొనలుచుఁ గల్లు గట్టుచును
బొగులుచు భుగభుగభుగభుగభుగులు
భుగు లంచుఁ బెనుమంట లెగయుచుఁ జిట్లు-
చును నాలుకలు గ్రో[3]యుచును బ్రస్ఫురించు
చును[4]సెగ[5]లెదురెక్కు-చును[6]సుళ్లు గొనుచు
నెడపక వారాసు[7]లెల్ల ఘూర్ణిల్లు
వడువున మ్రోయుచు వరలుఘోరాగ్నిఁ
బొడగని పిఱిఁదికిఁ బోక సాధకుఁడు
వడిఁబడి దాన యా వహ్నిలోఁ బడుడు
నయ్యగ్ని మును దాన నైన భైరవుఁడు
సయ్యాన నంతఁ బ్రసన్నుఁడై[9], "మెచ్చు
వచ్చె, నీకిప్పుడ వాంఛితార్థంబు
లిచ్చెద" ననుఁడు "నీ విచ్చెడి దేమి?
యేఁ గొనియెడి దేమి? యెలమి నీతోడి
పాఁగెము నాపాలఁ బరమేశుఁ డుండ
నడపు నీసారూప్య[10]మడుగుదు నేనిఁ

---

౧. తరముననుండి, ౨. బొనరుచు; జొనలుచు, ౩. లు, ౪. శిఖ, ౫. కె, ౬. ము, ౭. శేదు, ౮. కిచ్చెద, ౯. చు, బ్రత్యక్షమైనిలువ, ౧౦. మడిగితి.

గడు వికృతంబు భీకరము నీరూపు
సామీప్యమేనియుఁ జను, రక్త శవ సు-
రా మాంసముల కనారతము నాలయము,
సాలోక్యమేనిఁ బిశాచభేతాళ-
కాలభూతాదిసంకరము లోకంబు
నది గారణమున నీ యం దేమిగుడువఁ
గదిసి నీయం దేమి [1]గంటి దృష్టముగఁ,
దప్పి[2]ని యభిమతదాత వంటేనిఁ
[3]జెప్పనఁ [4]జెఱపనఁ జేటవుగాక
నటములు[5]సాలు, నన్ సాఁగిపోనిమ్ము,
గుటిలమ్ము దక్కుదక్కుము "[6]సిక్కు" మనుచు
భైరవుమాయలఁ [7]బడక సాధకుఁడు
వారక తొంటితీవ్రమునన్[8]యరుగ
నర్ణవసప్తకం బది యొక్కవేళ
ఘూర్ణిల్లుక్రియ మహాఘోషణ దనర
రంగత్తరంగ లుప్పొంగఁ బాతాళ-
గంగ ము న్వచ్చిన కనుమయో యనఁగ
బిలమున కెదురెక్కు పృథులప్రవాహ-

---

౧. గట్టె(ట్ట), ౨. క, 3. చెప్పిన(లి), ౪. జెరిపినన్, ౫. మానను, ౬. నిక్క, ౭. బడును; బడదు, ౮. యేగ.

జలము ముందఱఁ గాంచి సాధకోత్తముఁడు
నుబ్బుచుఁ దత్ప్రవాహోర్మిస్థలమున
గుబ్బన పడి సాధకుఁడు మున్గి లేచు
నంతన దివ్యాంగ మడుగుతద్దేహ-
కాంతి దిగంతవి¹శ్రాంతమై వెలుఁగఁ
దను దాన చూచి సాధకుఁడు హర్షించి
చనఁజన నెదుర భాస్వద్రత్నఖచిత-
మైన సువర్ణ దేవాలయోపాంత-
మానిత రమ్యహర్మ్యస్థలంబునను
గాంచనాంచితకాంతిఁ ²గడు నొప్పు భేరిఁ
గాంచి తద్దివ్యలింగము³ భజియించి
తవిలి యా భేరి సాధకుఁడు వాయింప
దివిజాంగనలు సముద్వృత్తి నేతెంచి
యతని నైరావతేంద్రారూఢుఁ జేసి
సతులు ⁴దోఁకొనిపోయి స్వర్గలోకమున
నదె కల్పభూరుహం బదె కామధేను
వదె యూర్వశీప్రముఖాంగనానీక
మదె యమృతం బదె యజరామరత్వ

౧. క్రాం. ౨. కరమొప్పు, ౩. గంబు భజించి, ౪. చేకొని.

మదె యణిమా [1]మహిమా ద్యష్టసిద్ధి
సదమలదేవేంద్రసామ్రాజ్యలక్ష్మి
యదె యిందులోన నీ [2]కభిమతం బెద్ది
యది వరియింపు మీ" వనుచుఁ బ్రార్థింప
ముదము [3]మనంబున ముప్పిరిగొనఁగ
సాధకుం డభిమతైశ్వర్యభోగముల
బాధిత సౌఖ్యసంపదఁ దొప్పఁదేలి
యవికల దివ్యవర్షానేకకోట్లు
వివిధదేవేంద్రాదివిపులభోగములుఁ
జెంది యంతట [4]మీఁది శివలోకసుఖము
లందు నిట్టివి దా మనంత బిలంబు
లెందు శ్రీనగముపెం పేమని చెప్ప?
నిందుమాళియ మెర్గు నిట సూడు మింక
నురుతర శ్రీపర్వతోత్తరద్వార-
వరమహత్త్వంబుఁ దద్ద్వారవాస్తవ్యుఁ
డైన మహేశ్వరోద్యల్లింగమూర్తి
మానితం బగు[5]గుప్త మాహేశ్వరంబుఁ
జరు[6]కేశ్వరంబును సంధ్యాసమాధి

---

1. దికమగునష్ట, 2. కను, 3. మదంబున, 4. మీద; లోన.
5. స, 6. దే.

గరుడేశ్వరంబును గాలప్రాదేశ్వ -
రంబుఁ బాపవినాశనంబు గణేశ్వ -
[1]రంబు దేవప్రాదేశ్వరంబు సిద్ధేశ్వ-
రంబును నీలప్రాదంబును నాఁగఁ
బంచి యేకాదశభవ్యతీర్థములు
మొదలను శ్రీచతుర్ముఖబసవేశ -
పదపద్మములు [2]భజింపక భజించినను
గరము నిష్ఫలము లేకాదశతీర్థ -
వరలింగదర్శనవందనార్చన[3]ము
లెట్టన్న శ్రీనందికేశుండు లేని
యట్టిలింగోపాస్తి యట్టిద కాన
యూసక్తి నట్ల కన్యాసిద్ధనాథు
ప్రాసాద[4]పూర్వదిగ్భరితమై యొప్పు
భూవరేణ్యుఁడు స్వయంభూలింగదేవ -
దేవు నయ్యమరావతీపురిఁ జూడు
తివిరి మందాకినీతీరోత్తరమున
దివిజవంద్యునిఁ జూడు దేవు నింద్రేశు
దర్పితపాపారిఁ దల్లింగ[5]మూర్తి

---

౧. రంబును దేవప్రాదంబు, ౨. భక్తి భజియించి మఱియు,
౩. లు, ౪. మదిమె, ౫. మునకు.

దూర్పునఁ జూడు సంస్తుత్యమై గుప్త-
మాహేశ్వరం బొప్పు, మహితతల్లింగ-
మాహాత్మ్య మది యవాఙ్మనసాత్మకమ్ము,
నవుల నేలేశ్వరం బనఁగఁ దూర్పునను
భువి[1]లింగములుఁ గుండములు నగంబులును
* ([2]విహిత [3]రత్నచ్ఛాయ వెలుఁగులింగములు
మహి నొప్పుతీర్థముల్ మఱియును గలవు,)
+ గామితస్వర్గమో క్షప్ర[4]దోత్తములు
[5]రామేశ్వరంబు[6]నుమామహేశ్వరము
సంగమేశ్వరమును జర మేశ్వరంబు
సాంగమూలస్థాన [7]మచలేశ్వరము ది-
లేశ్వర[8]సిద్ధముక్తీశ్వర గౌత-
మేశ్వరాదులఁ జూచు మిల శిలాచయము
వేదపర్వతమును శ్వేతాద్రి నీల-
మేదినీధర మశ్వమేధశిలోచ్చ-

---

౧. నగంబులు లింగములు గుండములును, ౨. విమల, ౩. రత్నపుచాయ, ౪. దత్త, ౫. మాహేశ్వరంబను రామేశ్వరంబు, ౬. వరాహేశ్వరంబు, ౭. జమరే; జబలే, ౮. సిద్ధి.

* ఈ రెండుపాదములకును సంస్కృతానువాదములేదు. + ఈ పాదమునకు సంస్కృతానువాదములో "అభీప్సితస్వర్గమోక్షదాన దక్షాణిచ క్షేత్రా" అని ఉన్నది. దీనికి సరియైనపాఠము కనబడలేదు.

యంబును లింగశృంగంబుఁ గన్యాన-
గంబు నుమాగిరి గనకనగంబు
గుండశిఖరి రామకుండంబు భీమ-
కుండంబును బ్రయాగకుండంబు వేద-
కుండంబునుం దిలకుండంబు నీల-
కుండంబును బిశాచకుండంబు గౌరి-
కుండంబు మఱి రసకుండంబులును న-
ఖండితలీల నొ[1]క్కటఁ జూడు మింక
నొలయ గంగాప్రవాహోభయపార్శ్వ-
ములును దొ[2]మ్మిదిసేసి పుణ్యతీర్థములు
దాని తూర్పునను మాతంగేశ్వరంబు
నానొప్పు సకలజనస్తుత్య మగుచు.
శతకోటి యను మహాస్థానంబుఁ జూడు
శతమఖు[3]దెసఁ బుణ్యజనితమై యొప్పఁ
దత్తీర్థరాజికి దక్షిణంబున ను-
దాత్త మహిమఁద్రిపురాంతక మొప్పు,
నాక్షేత్రమహిమ దా నది యెట్టి దనిన,—
నీక్షితి నంత్యజు లిరువురు గూడి
యఱిముఱిఁ బశుకర్మ మాచరింపంగ

౧. క్కటి, ౨. బేసి, ౩. దేశంబు జనితమై.

నెఱిఁగి కుమారగిరీంద్రంబుచుట్టు
దొడుగులఁ [1]బఱువఁ దోడ్తోన ప్రాణంబు
విడిచి యాబల్లహుకడుపునఁ [2]బుట్టి
జాతిస్మరత్వంబు సంధిల్ల నప్వ
డే తెంచి వృత్తాంత మెఱిఁగించి తమ్ముఁ
బట్టవచ్చినఁ బాఱిపాఱి మున్ దాచి-
నట్టికత్తుల నూఁపి యచ్చెరువుగను
నాసకలముఁ జూడ [3]నంతంత క్షేత్ర -
వాసులై రాజ్యసన్న్యాసంబుఁ జేసి
జగదభినుత జజ్జు జగదేవు లనఁగ
నెగడి యకల్పితనిజపూర్వకర్మ -
లలితకుమారశైలప్రదక్షిణ వి -
పులఫలమహిమశంభునిఁ గూడి రట్టి
పృథులకుమారభూభృత్సార్వభౌము
ప్రథితమాహాత్మ్య మెబ్భంగి వర్ణింప ?
ధరఁ"బురారిధ్వజదర్శనం" బనఁగఁ
ద్వారితాగతధ్వజదర్శనఫలము
నంకింప నరు దన్న నాకుమారాచ -
లాంకిత శ్రీత్రిపురాంతకదర్శ -

---

1. బరవ; బరువ, 2. బుట్టె, 3. నంతతక్షేత్ర; నందతిక్షేత్ర.

సస్పర్శనాభ్యర్చనంబులమహిమ
విస్పష్టముగఁ[1]జెప్ప విధికైనఁదరమె
యందుల భజనమాహాత్మ్యంబునకును
గుండెలు నెలుకయు గుడి సాక్షిగాఁగ
గంధవతీని[3]దీర్ఘికా[4]తీరవాస -
బంధురాభీష్టద ప్రఖ్యాతమహిమ
భువి నొప్పు శ్రీస్వయంభూలింగమూర్తు
లవియ మూలస్థాన మగుత్రిపురాంత -
కంబును [5]గారేశ్వరంబు సోమేశ్వ-
రంబుఁ గేదారేశ్వరంబు ఖడ్గేశ్వ-
రంబుఁ బాపవినాశనంబు గారీశ్వ-
రంబును గపిలేశ్వరం బుత్తరేశ్వ-
రము [6]నావిము[7]క్తేశ్వరము మల్లికార్జు-
నమును గన్యాసిద్ధనాథలింగంబు
ననఁగ ద్వాదశసముద్యన్మహాస్థాన-
ఘనలింగమహిమ యక్కజ మదె చూడు,
తత్త్రిపురాంతక స్థానంబునకు వి-
చిత్రమై యొప్పు దక్షిణమున మఱియు

---

౧. నట్లు విరచింప మరియు, ౨. కి, ౩. దూర్పుగాదలివాన, ౪. దరి. ౫. నాగే; కాశే, ౬. ను, ౭. క్తి.

సిద్ధవటాధ్వప్రసిద్ధపార్శ్వముల
నృద్ధగిరియు రససిద్ధేశ్వరంబు
గోశృంగమును రుద్ర¹కోటియుఁ బశ్చి-
మాశాముఖంబును నమృతేశ్వరముఁ బ్ర-
థమమల్లికార్జునోదాత్తలింగంబు
భ్రమరేశ్వరంబును బాపవినాశ-
నంబును సుఖీశ్వరంబు ముక్తీశ్వ-
రంబును ధర్మేశ్వరంబు నింద్రేశ్వ-
రంబును బ్రహ్మేశ్వరంబుఁ ²గాళేశ్వ-
రంబును భీమేశ్వరంబును బటహ-
కర్ణేశ్వరంబు నేకశిలయుఁ గుంభ-
కర్ణేశ్వరము గనకగిరియు జాను-
సర్వలింగము భూతిపర్వత లింగ-
పర్వత రుద్రాక్షపర్వతానలులు
ఘనతరంబగు కర్ణికారవనంబు
నను ఘటికాసిద్ధనాథలింగంబుఁ
గమలేశ్వరంబు శ్రీ స్కాందసోమేశ్వ-
రమును సాలంకేశ్వరమ్మును మత్స్య-
కుండ విభీషణకుండ కుమార-

1. కోశంబు, 2. గౌరీశ్వ.

కుండ రావణకుండ గుప్తకుండములు
భీమేశ్వరమును విభీషణేశ్వరము
రామేశ్వరమ్మును రావణేశ్వరము
సాలంకమత్స్యకేశ్వరమును జూడు
మోలి నయ్యామ్యోదయోర్వీధరమునిన
సురుచిర సముదిత జ్యోతిర్మయాంగ-
ధరుని దచ్ఛినగ దక్షిణద్వార-
వరుని జ్యోతిస్సిద్ధవటనాథు భక్త-
వరదుఁ బెన్నానదీవరతటావాసు
శాశ్వతపుణ్యు దర్శనముక్తి నలరు
విశ్వైకనుతు దైవవేశ్యాభుజంగు
దేవశిఖామణి దేవదేవేశు
భావించి చూడు మేర్పడ వటేశ్వరుని
నందిత వటమూలమందిరుఁ జూడు
మంద మూలస్థాన మైనసిద్ధేశ్వ-
రంబును వరుణేశ్వరంబు యమేశ్వ -

---

౧. యా, ౨. ల, ౩. ంగ, ౪. ధరణి, ౫. సిద్ధనాథ, ౬. నుత, ౭. రమే. ౮. వరణే, ౯. రమునుదయేశ్వ.

రంబు నాయుదయేశ్వరంబు సిద్ధేశ్వ -
రం బిష్టసిద్ధేశ్వరంబు బ్రహ్మేశ్వ -
రం బిష్టకామేశ్వరంబును జూచు,
[1]చంద్రప్రభావుఁ బుష్పగిరివాస్తవ్యు
[2]ఇంద్రేశ్వరునిఁ జూడు మింద్రపూజితుని
వందితసురనర వ్రాతు రామేశు
నంద చూడుము త్రిపురాంతక దేవుఁ
బరశురామేశ్వరు బాలకర్ణేశు
హరుని శంకరు మల్లికార్జునుఁ జూడు,
కుండీప్రభునిఁ జూడు కుక్కుటేశ్వరుని
వెండి బ్రహ్మేశ్వర విమలేశ్వరముల
సగము నరుండును సగము మృగంబు
నగు నృసింహుఁడు హిరణ్యాక్షు వధింపఁ
గా వెండి[4]శ్రీనీలగళుఁ బ్రతిష్ఠించి
యా[3]వాహనము నేయు నది యాదిగాఁగఁ
బూని సంతతమును బూజించునట్టి
యానరసింహేశ్వరాదిసిద్ధేశ -
దాన వేశాదులఁ దఱిఁదఱిఁ జూడు,
దానిపశ్చిమమునఁ దా నొప్పుఁ బ్రమథ-

---

౧. చంద్రానుభావు, ౨. యా, ౩. వ, ౪. ష.

నందియు నాకాశనందియుఁ గృష్ణ -
నందియు నాబ్రహ్మానందియు సోమ -
నందియు శ్రీమహానందియు గరుడ -
నందియు భగవతీనందియు భీమ -
నందియునుఁ బినాక నందియు నాగ -
నందియు నా శివనందియు శ్వేత -
నందియు భైరవనందియు గ్రామ -
నందియు మఱి యేకనందియు గౌరి -
నందియు మఱి ముక్తినందియు నింద్ర -
నందియు నా భువనత్రయంబునను
సన్నుతా[1]భీష్టార్థసౌఖ్యకారణము
ల న్నందిమండలం [2]బదె దానిఁ జూడు,
మువ్విఁ కొప్పగుదాని [3]యుత్తరంబునను
దూర్వాసతీర్థ ముత్సుకతమైఁ జూడు,
తరమిడిదానియుత్తరమునఁ జూడు,
మరుదగు నింద్రేశ్వరాదితీర్థములు
వంచి[4]యంతట బలభద్రరామేశ్వ -
రంబు లాంగూలతీర్థంబును జూడు,
తెల్లంబు గూర్మప్రతిష్ఠితుఁ గూర్మ -

౧. భీష్టద, ౨. బంపదేచూడు, ౩. కు, ౪. యత్తరి.

మల్లికార్జును పశ్చిమంబునఁ జూడు,
మాశ్చర్యకర మఘహార మీనగంబు
పశ్చిమద్వార ప్రభావంబుఁ జూడు;
తుంగభద్రాంకి[౧]తో[౨] త్తుంగ భద్రా త -
రంగిణిచారుతీరమున మోక్షప్ర -
దంబు దేవద్రోణి తత్పశ్చిమమునఁ
బంబి శ్రీశివాశాహ బ్రహ్మేశ్వరములు
వేదనాదావ[౩]తీ వృత్తమధ్యప్ర-
[౪]వాదితత్స్థానవిభ్రమపంక్తి[౫]లోన
నమరుతీర్థాదిఛాయామల్లికార్జు-
నము గణికాసిద్ధనాథమోక్షేశ్వ-
రము[౬]ను భుజంగేశ్వరము నారదేశ్వ-
రమును బ్రహ్మేశ్వర రాజరాజేశ్వ-
[౭]రంబు నగ్నీశ్వర రమ్య[౮]భోగీశ్వ-
రంబును సోమేశ్వరంబును గల[౯]క-
లేశ్వరంబును నాఁగ నెన్నంగఁ జనఁ న-
నశ్వరైకాదశనవ్యతీర్థంబు
లాది శ్రీరుద్రపాదాదితీర్థముల

---

౧. తతుంగ, ౨. భారత. ౩. తీ, ౪. పా, ౫. తో, ౬. లు,
౭. రంబును నగ్నేశ్వరమును భోగేశ్వ, ౮. విశ్వేశ్వ, ౯. ఖు; గ.

కాదిమూలస్థాన మైనబ్రహ్మేశ్వ-
రము బలభద్రేశ్వరముఁ గపులేశ్వ-
రమును బాపవినాశనమును యోగేశ్వ-
రమును నగస్త్యేశ్వరమును నాగేశ్వ-
రము సప్తకోటీశ్వరముఁ గుక్కుటేశ్వ-
రము నశ్వమేధేశ్వరము లకులేశ్వ-
రమును శ్రీరామేశ్వరము లక్ష్మణేశ్వ-
రంబును ధవళేశ్వరంబు ధర్మేశ్వ-
రంబును విమలేశ్వరంబు నింద్రేశ్వ-
రంబును గర్ణేశ్వరంబు వ్యాసేశ్వ-
రంబును వరుణేశ్వరంబు మలకు -
యేశ్వరంబును నుత్తరేశ్వరము నన -
లేశ్వర మేలేశ్వ రేశ్వరపంచ -
లింగావలులు సప్తలింగము లుభయ -
సంగమేశ్వరములు సకలేశ్వరంబుఁ
గనకేశ్వరంబు స్వర్గద్వారసీమఁ
దనరుబ్రహ్మేశ సీతాత్రిపురాంత -
కాదులు నిజమల్లికార్జునంబును ని -
పాదితభస్మేశ పరశురామేశ్వ -
రంబులు హోమకుండంబు సిద్ధేశ్వ -

రంబు మలక్షుయరసకుండయుగము
ఖ్యాపితలీల నొక్కొట (జూచు, మిట్లు
సూపంగవలె నని చూపితిఁ గాని
యాపురిలింగసహస్రార్బుదములఁ
జూపఁ జెప్పంగ శేషునకు నక్కజము
లిన్నిగోట్లిన్నిగో ట్లిన్నిలింగంబు
లన్నను బ్రత్యవాయంబు సిద్ధించు
నెన్నియుగంబుల నెందఱు విష్ణు
లెన్నియుగంబుల నెందఱు బ్రహ్మ
లెన్నియుగంబుల నెందఱు జిష్ణు
లెన్నియుగంబుల నెందఱు మాను
లెన్నియుగంబుల నెందఱు దివిజు
లన్నియుగంబుల నంద అందఱును
నిలఁ దమతమ పేళ్ల నీద్వారములను
గలయ నొక్కొక్కలింగంబును నిల్పి
పరిచితాభీష్టముల్ వడయంగ భువిని
బరగు లింగంబుల పాటిబండరువు
లది లింగపర్వతం బది లింగనగర
మది లింగమందిరం బది లింగవార్ధి

---

౧. గను. ౨. న.

యది లింగమంజరి యది లింగరాశి
యదిలింగసురభూజ మదిలింగసురభి
గూడ నిట్లొప్ప శ్రీకుధరపశ్చిమము
నీడిత ద్వారమహిష్ఠతీర్థ ప్ర-
కరము దూర్పున జగత్ ఖ్యాపితలీల
సరినొప్పఁ గూడలి సంగమేశ్వరము
దనరారు తుంగభద్రయుఁ గృష్ణవేణి-
యును¹గూడఁ గూడలి యన నొప్పఁ జూడ
దానితూర్పున సముద్యన్మహామహిమఁ
దా నొప్ప దివ్యతీర్థంబు నివృత్తి
మంగళతరతీర్థమహితవాస్తవ్య
సంగమేశ్వరుఁ జూడు జనతాపహరణు
నిట దూర్పువలన యజ్ఞేశ్వరుఁ²జూడు,
పటుదక్షయజ్ఞప్రభంజనస్థలిని
నమరేశు³నప్పర్వతాగ్రదేశమున
నమితేశు శ్రీసిద్ధనాథునిఁ జూడు,
మురుతరతత్ప్రవాహోత్తరాశావి-
హారణు నక్కడఁ జూడు మయ్యాగస్త్యేశు
నయ్యాగస్త్యేశున కమరేంద్రు⁴దెస మ-

---

౧. జూడ, ౨. జాపతి, ౩. సత్పర్వ. ౪. స్త్రీ.

హేయ్యసంప్రీతి సోమేశ్వరుఁ జూడు,
తలపోయ నయ్యుమాధరణీధరంబు
సెలువారు నదె సోమశిలఁ జూడు" మనుచు
నంత నాసోమశిలాదిమహేశ్వ -
రాంతతీర్థావలు లట్ల చూపుచుఁ బ్ర -
శ_స్తమై యొప్ప త్రింశద్యోజనముల
వి_స్తీర్ణమై భువి నెలయు లోకముల
సకలతీర్థములును సకలలింగములు
నొకమాత్రలోఁ జూపియును జూపిచూపి
"శ్రీపర్వతప్రదక్షిణమార్గగిరిని
రూపితలింగమూర్తులను దీర్థముల
శ్రీపర్వతంబుఁ జూచితిగదే కలయ
మీపండితయ్య కర్మిలి నట్ల చెప్ప,
కన్నారఁ జూడంగఁ గంటి గావునను
జెన్నార గిరిప్రదక్షిణము సిద్ధించె
శ్రీపర్వతప్రదక్షిణాశికోట్లఫలము
శ్రీపార్వతీశుఁ డర్మిలి దయసేసె
నని చెప్ప మీమల్లికార్జునపండి-
తున" కంచుఁ నప్పు డద్భుతము వహింప

---

౧. ౦. ప, ౨. కోటి, ౩. పర్వ, ౪. నపుడయ.

మానుగా సర్వజ్ఞమల్లికార్జునుఁడు
దా నదృశ్యం బయ్యెఁ దదనంతరంబ
చక్కన హర్షాశ్రుజలకణజాల
మక్కునఁ దొరుఁగ దోనయ్య సర్వజ్ఞ
మల్లికార్జునుఁ[1]డ శ్రీమల్లికార్జునుఁ[2]డ
తెల్లంబుగా నుపదేశించె ననుచు
మల్లికార్జును మహామహిము శ్రీశైల-
వల్లభు వాయూర వర్ణన సేసి
మద్గురుదేవు సమ్యక్కరుణాస-
ముద్గతమహిమామహోద్ధతిఁ జేసి
కంటిమీ శ్రీపాదకమలయుగంబు
మంటి ధన్యుఁడ నైతి మఱి యట్లుఁ గాక
దిగ్ద్వారనికర విదిగ్ద్వారచయ వి-
దిగ్ద్వారమధ్యప్ర దిగ్ద్వారమార్గ-
మార్గతత్త్వద్వారమధ్యాంతరాళ-
[3]దుర్గాతి[4]దుర్గంబు దుర్గదేశముల
నటుగూడ శ్రీపర్వతాగ్రాధివాస-
పటులింగకోట్లు నేర్పడఁజూడఁ గంటిఁ
గలయు నిక్కలయగాఁ గంటి శ్రీనగము

---

౧. డు, ౨. మి, ౩. దుర్గాది, ౪. దుర్గంపు.

వలగొను శ్రీఫలావాప్తులుఁ గంటి
నిలఁ జరితార్థుండ నేనకా యనుచు
నలరుచు వెండియు నష్టాంగ మెఱఁగి
పలుమాఱు గలగన్న భావంబు నాత్మఁ
దలపోసి తలపోసి తద్గిరి డిగ్గి
వెలిపుటూరికి నేతెంచి వింతసంతసము
దళుకొత్త గురుదేవు దర్శించి యతని
చరణాబ్జముల కిలఁ జాఁగిలి మ్రొక్కి
సరసాంతరంగుఁడై సంస్తుతి సేసి
వలగొని తన పోయివచ్చినవిధము
నలువలరార విన్నప మాచరించి
యలరి పండిత మల్లికార్జునారాధ్యుఁ
డిలఁ జరితార్థుండ నేనపో యనుచుఁ
దలఁచెఁగదా పర్వతస్వామి నన్నుఁ
జెలువొంద నీయట్టిశిష్యునికలిమి
నంచుఁ బ్రసాదకటాక్షనిరీక్ష -
ణాంచితామృతవార్ధి నతని నోలార్చి
శివలింగమయ మగు శ్రీగిరి మెచ్చు

---

౧. ల. ౨. లూ, ౩. డివ్య, ౪. వెల, ౫. యట్లు, ౬. మమ్ము, ౭. వంద, ౮. కె.

డవినీతి యగ్గిరియందు¹నొందమియు
నవినీతినెక్కిన సంస్థులు సోకు
నవయవంబులతోడ నందు వోరాదు
నవయవరహితమై యరుగంగరాదు
శివశివ యిదియెట్లు సిద్ధించెఁ దనువు
ప్రాణంబు మనసుఁ బర్వతనాథులోఁ బ్ర-
మాణింపరాని సమ్మదమునఁగూర్చి
మెనసియుండెడివిధం బెట్లకో యనుచు
మనమున నూహించి మఱి నిశ్చయించి²చి
తనువు సపర్యావిధంబున సమ³సె
మనసు సద్భావనామగ్నతఁ బొందెఁ
బ్రాణంబునకు నుండఁ బట్టొండు గలదె
ప్రాణేశ నీపదాబ్జంబుల కాక ?
యూర్జితప్రమథాత్మ యొండేమి మల్లి-
కార్జునపండితుఁ డనఁగ నిచ్చోట
నుండుటకంటె నెన్నండకో ప్రమథ -
మండలిలో భవన్మహదాజ్ఞఁ జేసి
యుండంగఁ గాంతు⁴నకో యని కోరు
చుండురు నన్నట్టు లును⁵పఁగదయ్యా!

౧. నొండేమి, ౨. ంప, ౩. సి, ౪. నొ, ౫. చ.

# పండితారాధ్యచరిత్ర

## సంజ్ఞావాచకపదముల పట్టిక

(ఈ క్రిందివాటిలో కుండలీకరణము చేయబడిన అంకెలు సంపుటమునకును, తక్కినవి పుటలకును చెందునవి)

చౌ



ఛ



జ

పూ



పె



పొ



పో



పౌ

బా

భ

## రాగములు: 108

అన్యసైంధవి, అభ్రపంచమము, ఆందోళి, ఉత్పలి, ఋషభి, కన్నడిక, కర్ణాట, కర్ణాటవరాళి, కర్తారి, కాంభోజి, కాంభోది, కుంభక, కైతకి, కోలాహల, కౌశికి, గంధి కామోది, గాంధారి, గాంధారిగుప్త, గుజ్జరి, గౌళ, గౌళి, గౌళిక, ఘంటారవము, చిత్రవేళావుళి, చిత్రాంగి, చౌహారి, ఠక్క, తరంగిణి, తుండక్రియ, తురకతోడి, తోడి, త్రినేత్రి, దివిమేఘరంజి, దివ్యావతి, దేవగుప్త, దేవప్రియ, దేశాక్షి, దేశాళి, దేశి, దేసాళీగౌళ, ద్రవిళగుజ్జరి, ద్రావిళగౌళ, ధన్నాసి, ధైవతి, నందయంతి, నటనారాయణి, నర్తకి, నాగధ్వనిరంజి, నాగవరాళి, నాట, నాదోత్తరి, పంచమ గాంధారి, పదపంజర, పూర్ణనాట, పౌరాణి, బంగాళ, బహుళి, బృహతి, బ్రహ్మణి, భల్లాతకాళింది, భిన్నపౌరాణి, భూపాళ, భైరవి, మధుకరి, మధుమావతి, మధ్య, మధ్యమగాంధారి, మలహరి, మసారవరాళి, మాహురి, మాళవ, మాళవగౌళ, మాళవి, మేఘచ్ఛవి, రంగవరాళి, రక్కసి, రక్తగాంధారి, రామక్రియ, రూప, లలిత, వసంత, విభిన్న, వేళావుళి, వ్యభిచారి, వ్యాళి, శంకరాభరణ, శుద్ధవరాళి, శుద్ధవాహిని, శుద్ధహార, శ్రీ, శ్రీకంఠ, శ్రీ కౌశికసుప్త, సాధారణసుప్త, సామ, సామగౌళ, సారంగభైరవి, సాళగనాట, సింధువరాళి, సోమరాగ, సైంధవి, సోహణి, సౌందరి, సౌగ, సౌరాష్ట్రి, సౌరాష్ట్రిగుజ్జరి, సౌరాష్ట్రిగౌళ, సౌవీరహిందోళ.

### రా

రు



రూ



రె



రే

వీ

వు



వృ

# పండితారాధ్య చరిత్ర

## ఆచ్ఛికపదముల పట్టిక

(ఈ క్రిందివాటిలో కుండలీకరణము చేయబడిన అంకెలు సంపుటమునకును, తక్కినవి పుటలకును చెందుతవి)

ఇ

ఊ

ఓ.

60 శ్వాసములు = 1 ప్రాణము
6 ప్రాణములు = 1 గడియ
5 గడియలు = 1 లగ్నము
12 లగ్నములు = 1 దినము

జ

## ద

ధ



న

భ

మ

---

# శ్రీ పండితారాధ్యచరిత్ర

---

## ద్వితీయసంపుటము—శుద్ధపత్రము

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౦ | ౬ | దరియంగ | దఱియంగ |
| ౧౪ | ౪ | దచ్చివా | దచ్ఛినా |
| ౧౬ | ౧ | వయి | పయి |
| ౨౫ | ౧౮ | రమ్మనుచు | రండనుచు |
| ౫౭ | ౪ | పల్నాఁటి | వెల్నాఁటి |
| ౯౪ | ౭ | యరవత్తు | యఱువత్తు |
| ౯౮ | ౧౧ | గన్నడె | గన్నద |
| ౧౮౩ | ౭ | మేమాడు | మేమాఁడు |
| ౨౧౯ | ౧౩ | క్రాపరి | క్రాఁపరి |
| ౧౬౩ | ౬ | దొరఁగు | దొఱఁగు |
| ౨౩౮ | ౧౦ | వీఁగుఁబర్వత్తు | వీఁగుపర్వత్తు |
| ౨౮౦ | ౪ | ముత్పులుకలు | ముత్పులకలు |
| ౨౭౫ | ౧౦ | బొగడుచుఁ | బొగడుచు |
| ౩౦౦ | ౨ | నల్లస | నల్లన |
| ౩౦౬ | ౭ | బెడగగు | బెడఁగగు |
| ౩౧౦ | ౧౪ | సంధుల జను | సందులఁ జను |
| ౩౧౧ | ౯ | సజ్జనగరులు | సజ్జనఁగరులు |
| ,, | ౭ | గద్దెనగరులు | గద్దెనఁగరులు |
| ౩౧౬ | ౮ | సంకటు | సంకిట |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౩౨౩ | ౬ | ఒండుకీర్తి | ఒండుగీర్తి |
| ౩౩౩ | ౨ | పూగొనలు | పూఁగొనలు |
| ౩౩౪ | ౧౧ | మరిగి | మరఁగి |
| ౩౪౨ | ౧౧ | కన్ను | కన్నుఁ |
| ౩౪౫ | ౯ | చౌరగ | చౌరఁగ |
| ,, | ౨ | గద్దెనగరులు | గద్దెనఁగరులు |
| ౩౪౬ | ౧౦ | దారమొసంగరాయనుచు | దారమొసగరాయటంచు |
| ౩౪౭ | ౬ | తారమొసంగరే | తారమునొసగరే |
| ౩౪౮ | ౪ | ,, | ,, |
| ౩౫౧ | ౧౧ | సూత్రములుఁ | సూత్రములు |
| ౩౬౦ | ౩ | గూటువల్ | గూఁటువల్ |
| ,, | ౫ | గూఁడని | గూడని |
| ౩౬౨ | ౪ | నొదికిలుఁ కాళ్ల | నొదికిలఁగాళ్ల |
| ,, | ౧౦ | పాఱుచు | వాఱుచు |
| ౩౬౪ | ౫ | చెల్వఁ | చెల్వ |
| ౩౭౨ | ౧ | జముతల | జముతలఁ |
| ,, | ౧౨ | బాఱుచుఁ | బాఱుచు |
| ౩౭౩ | ౧ | విలుచుచుఁ | విలుచుచు |
| ,, | ౭ | నాహ్మ | నాత్మ |
| ౩౯౫ | ౪ | లేగుదు | లెసుగు |
| ౪౦౨ | ౧ | వారి | వాటి |
| ౪౦౮ | ౧౩ | బసుపులు | బసపులు |
| ౪౧౨ | ౩ | సుఖుకుఁబుణ్యాల | సుఖుకపుణ్యాలు |
| ౪౧౭ | ౧౫, ౧౬ | నేటికి | నేఁటికి |
| ౪౨౪ | ౫ | [illegible] | పైఁబడ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౪౨౪ | ౬ | వేవాజీ | వేఁబారి |
| ౪౨౭ | ౧౪ | దీపంబు | ధూపంబు |
| ౪౩౭ | ౧౩ | బోఱ | బోర |
| ౪౩౯ | ౩ | మోమ | మోముఁ |
| ,, | ౬ | గూఁకటిఁ | గూఁకటి |
| ,, | ౮ | మురుకటింపుచును | ముఱుకటింపుచును |
| ౪౪౭ | ౪ | కృత్తి,చ్ఛ | కృత్త్యిచ్ఛ |
| ౪౫౫ | ౧౮ | గాసించు | గాలించు |
| ౪౬౩ | ౫ | ఇఱుదెస | ఇరుదెస |
| ౪౬౪ | ౨ | దుడుచుఁగిం | దుడుమకిం |
| ౪౬౯ | ౧౦ | యరుసు | నరుసు |
| ౪౭౨ | ౫ | డిల్లపడక | డిల్లవడక |
| ౪౭౪ | ౨ | గల్గ | కల్గ |
| ౪౭౫ | ౧౮ | సాలిమి | సాలమి |
| ౪౯౯ | ౧౧ | యాఁబోతు | యాఁబోఁతు |
| ౫౦౪ | ౧౭ | నంబునమధ్యజి | నంబుజమధ్యక |
| ౫౧౫ | ౪ | నామ్రాని | యామ్రాని |
| ౫౧౬ | ౧౮ | న్వర్ణ | స్వర్ణ |
| ౫౧౯ | ౧ | వఱతలన్ | వఱుతలన్ |
| ౫౨౫ | ౧౧ | దక్కుదక్కుము | దక్కుతక్కుము |
| ౫౩౧ | ౨ | బఱువ | బఱవ |
| ౫౪౪ | ౧౯ | చుండురు | చుండుదు |
| ౫౫౦ | ౧ | తనూజు | తనూజుఁ |

